## 182వ అధ్యాయం

## ١٨٢ ـ بَابُ اسْتِحْبَابِ تَحْسِينِ الصَّوْتِ بِالْقُرْآنِ وَطَلَبِ الْقِرَاءَةِ مِنْ حَسَنِ الصَّوْتِ وَالإِسْتِمَاعِ لَهَا

## ఖుర్ఆన్‌ను మధురాతి మధురంగా పారాయణం చేయటం అభిలషణీయం, మధురంగా పారాయణం చేసే వారిచేత ఖుర్ఆన్ చదివించుకొని మరీ వినటం, దాన్ని శ్రద్ధగా ఆలకించటం....

١٠٠٤ ـ عَنْ أَبي هُرَيْرَةَ رضيَ اللهُ عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقولُ: «مَا أَذِنَ اللهُ لِشَيْءٍ مَا أَذِنَ لِنَبِيٍّ حَسَنِ الصَّوْتِ يَتَغَنَّى بِالْقُرْآنِ يَجْهَرُ بِهِ» متفقٌ عليه. مَعْنى «أَذِنَ اللهُ» أي: اسْتَمَعَ، وَهُوَ إِشَارَةٌ إِلى الرِّضَا وَالْقَبُولِ.

1004. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: సుమధుర స్వరంతో గొంతెత్తి ఖుర్ఆన్ పారాయణం చేసే దైవప్రవక్త కంఠ స్వరాన్ని శ్రద్ధగా ఆలకించినట్లుగా దేవుడు మరే స్వరాన్నీ ఆలకించడు. (బుఖారీ-ముస్లిం)

'అజినల్లాహు' అంటే చెవులొగ్గి వినడం అని అర్థం. ఇక్కడ దాని భావం సుమధుర స్వరంతో ఖుర్ఆన్ పారాయణం చేసేవాని పట్ల దేవుడు ప్రసన్నుడయి అతని ఆచరణను అంగీకరిస్తాడని.

*(సహీహ్ బుఖారీలోని ఖుర్ఆన్ మహత్యాల ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١٠٠٥ ـ وعن أَبي موسى الأَشْعَرِيِّ رضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ قالَ لهُ: «لَقَدْ

1005. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)

أُوتِيتَ مِزْمَاراً مِنْ مَزَامِيرِ آلِ دَاوُدَ» متفقٌ عليه. وفي رواية لمسلم: أنَّ رسولَ الله ﷺ قالَ لَهُ: «لَوْ رَأَيْتَنِي وَأَنَا أَسْتَمِعُ لِقِرَاءَتِكَ الْبَارِحَةَ».

తనతో ఇలా అన్నారు: నీకు హజ్రత్ దావూద్ (అలైహి) గారి స్వర మాధుర్యంలో ఒక భాగం ప్రసాదించబడింది. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తనతో ఇలా కూడా అన్నారు: నిన్న రాత్రి నువ్వు ఖుర్‌ఆన్ పారాయణం చేస్తుండగా నేను విన్నాను. అప్పుడు నువ్వు, నన్ను చూసి నట్లయితే (చాలా సంతోషించేవాడివి).

*(సహీహ్ బుఖారీలోని ఖుర్‌ఆన్ మహత్యాల ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మధురమైన కంఠం, ఇంపైన స్వరం నిజంగానే ఎంతో అమూల్యమైన దైవానుగ్రహాలు. దైవం తాను కోరినవారికి వాటిని ప్రసాదిస్తాడు. అలాంటి మహదనుగ్రహాలకు నోచుకున్న వారు చాలా అదృష్టవంతులు. ఆ అనుగ్రహానికి కృతజ్ఞతగా వారు ప్రజల ముందు ఖుర్‌ఆన్ పారాయణం చేసి వారిని ధర్మం వైపునకు పిలవటానికి ప్రయత్నించాలి. అంతేగాని ధనం కూడబెట్టుకునే ఉద్దేశ్యంతో, అశ్లీల ప్రచారానికి పూనుకొని అలాంటి మహత్తరమైన అనుగ్రహాన్ని దుర్వినియోగం చేసుకోకూడదు.

١٠٠٦ ـ وعن الْبَرَاءِ بنِ عَازِبٍ رضيَ الله عنهمَا قالَ: سَمِعْتُ النبيَّ ﷺ قَرَأَ في الْعِشَاءِ بِالتِّينِ والزَّيْتُونِ، فَمَا سَمِعْتُ أَحَداً أَحْسَنَ صَوْتاً مِنْهُ. متفقٌ عليه.

1006. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం: నేనొకసారి దైవప్రవక్త (సల్లం) ఇషా నమాజ్‌లో 'వత్తీన్ వజ్జైతూన్...." సూరా పఠిస్తుండగా విన్నాను. ఆయనంతటి మధురస్వరంతో ఖుర్‌ఆన్ పారాయణం చేసినవారిని నేనెన్నడూ చూడలేదు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం)కు మొత్తం ఖుర్ఆన్ కంఠస్తం కావటంతోపాటు, ఆయన దాన్ని మధురాతి మధురంగా పారాయణం కూడా చేసేవారనడానికి ఈ హదీసు ఒక మచ్చుతునక. దేవుడు ఆయనకు ఎంతో ఇంపైన స్వరాన్ని అనుగ్రహించాడు. దాన్ని ఆయన ధర్మసందేశ ప్రచారం కోసం, ప్రజలకు ఖుర్ఆన్ సందేశం అందజేయటం కోసం వినియోగించేవారు.

١٠٠٧ ـ وعنْ أبي لُبَابَةَ بَشِيرِ بن عبدِ المُنْذر رضيَ اللهُ عنهُ، أنَّ النبيَّ ﷺ قال: «مَنْ لَمْ يَتَغَنَّ بِالْقُرْآنِ فَلَيْسَ مِنَّا» رواه أبو داود بإسنادٍ جيد. ومَعنى «يَتَغَنَّى»: يُحَسِّنُ صَوْتَهُ بِالْقُرْآنِ.

1007. హజ్రత్ అబూ లుబాబా బషీర్ బిన్ అబ్దుల్ ముంజిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఖుర్ఆన్‌ను ఇంపుగా పారాయణం చేయనివాడు మాలోని వాడుకాడు (అతను మా పద్ధతిని అనుసరించట్లేదు). (అబూదావూద్ దీన్ని ఉత్తమ ఆధారాలతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

١٠٠٨ ـ وعنِ ابنِ مسعودٍ رضيَ اللهُ عنهُ قالَ: قالَ لي النَّبيُّ ﷺ: «اقرأْ عَلَيَّ القُرْآنَ»، فَقُلْتُ: يا رَسُولَ اللهِ! أَقْرَأُ عَلَيْكَ وَعَلَيْكَ أُنْزِلَ؟! قالَ: «إنِّي أُحِبُّ أَنْ أَسْمَعَهُ مِنْ غَيْرِي» فَقَرَأْتُ عَلَيْهِ سُورَةَ النِّسَاءِ حَتَّى جِئْتُ إلى هذه الآيةِ: ﴿ فَكَيْفَ إِذَا جِئْنَا مِن كُلِّ أُمَّةٍ بِشَهِيدٍ وَجِئْنَا بِكَ عَلَىٰ هَٰٓؤُلَآءِ شَهِيدًا ﴾ قال: «حَسْبُكَ الآنَ» فَالْتَفَتُّ إلَيْهِ، فَإذا عَيْنَاهُ تَذْرِفَانِ. متفقٌ عليه.

1008. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) నాతో మాట్లాడుతూ, "(ఇబ్నె మస్ఊద్!) నాకు ఖుర్ఆన్ చదివి వినిపించు" అని కోరారు. దానికి నేను, "దైవప్రవక్తా! ఖుర్ఆన్ అవతరించింది మీపైనే కదా! అలాంటప్పుడు మీకు నేను ఖుర్ఆన్ చదివి వినిపించటమేంటి?'' అని ఆశ్చర్యపోతూ అడిగాను. "(ఎందుకో!) నాకు ఇతరుల ద్వారా ఖుర్ఆన్ పారాయణం వినాలనిపిస్తోంది" అని అన్నారాయన. అప్పుడు నేను, 'నిసా' సూరా పారాయణం చేయటం

మొదలెట్టాను. అలా నేను పారాయణం చేస్తూ, "మేము ప్రతి అనుచర సమాజం నుండి ఒక సాక్షిని తెచ్చి, నిన్ను (అంటే ముహమ్మద్ ప్రవక్తను) వారందరికీ సాక్షిగా నిలబెట్టినప్పుడు వీరి పరిస్థితి ఏమవుతుంది?" అనే సూక్తి దగ్గరికి చేరుకోగానే "ఇక చాలు ఆపెయ్యి" అన్నారాయన. నేను తలపైకెత్తి చూస్తే ఆయన కళ్ళ వెంబడి కన్నీటి ధారలు ప్రవహిస్తున్నాయి. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*



183వ అధ్యాయం

# ١٨٣ - بَابٌ فِي الْحَثِّ عَلَى سُوَرٍ وَآيَاتٍ مَخْصُوصَةٍ

# కొన్ని ముఖ్యమైన సూరాలు, ఆయతులు పఠించమని ప్రోత్సహించటం గురించి...

١٠٠٩ - عن أبي سعيدٍ رافع بنِ المُعَلَّى رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ لِي رسولُ اللهِ ﷺ: «ألا أُعَلِّمُكَ أعظَمَ سُورَةٍ فِي القُرْآنِ قَبْلَ أَنْ تَخْرُجَ مِنَ المَسْجِدِ؟» فَأَخَذَ بِيَدِي، فَلَمَّا أَرَدْنَا أَنْ نَخْرُجَ قُلْتُ: يا رَسُولَ اللهِ! إنَّكَ قُلْتَ: لأُعَلِّمَنَّكَ أَعْظَمَ سُورَةٍ فِي القُرْآنِ؟ قال: «الحَمْدُ للهِ رَبِّ العَالَمِينَ هِيَ السَّبْعُ المَثَانِي وَالقُرْآنُ العَظِيمُ الَّذِي أُوتِيتُهُ» رواه البخاري.

1009. హజ్రత్ అబూ సయీద్ రాఫె బిన్ ముఅల్లా (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) నాకు హితోపదేశం చేస్తూ, "నువ్వు మస్జిద్ నుండి బయటికి పోకముందే నేను నీకు ఖుర్ఆన్‌లోని అత్యంత గొప్ప సూరా నేర్పించనా?" అని చెప్పి నా చెయ్యి పట్టుకున్నారు. తర్వాత కాసేపటికి మేము మస్జిద్ నుండి బయలుదేరి వెళ్ళబోతున్నప్పుడు "దైవప్రవక్తా! ఇందాక మీరు నాకు ఖుర్ఆన్‌లోని అత్యంత గొప్ప సూరా నేర్పిస్తానన్నారు కదా?" అని అడిగాను. అందుకాయన, "అవును, **అల్‌హమ్దు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్** (సూరా). ఇవి మాటిమాటికీ పఠించబడే ఏడు ఆయతులు - నాకు ఇవ్వబడిన మహోన్నతమైన ఖుర్ఆన్" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఖుర్ఆన్ మహాత్మ్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దివ్యఖుర్ఆన్‌లో "ఓ ప్రవక్తా! మేము నీకు 'సబయె మసానీ' - అనగా మాటిమాటికీ పఠించదగిన ఏడు సూక్తులను, ఇంకా మహత్తరమైన ఖుర్ఆన్‌ను ప్రసాదించాము" అనే ఆయతు ఉంది. పైన పేర్కొనబడిన హదీసు ఈ ఆయతుకు వ్యాఖ్యానం లాంటిది. దైవప్రవక్త

(సల్లం) 'సబయె మసానీ' అంటే సూరె ఫాతిహా అని చెప్పారు. ఎందుకంటే సూరె ఫాతిహాలోని ఏడు ఆయతులు ప్రతి నమాజులోని ప్రతి రకాత్‌లో పఠించబడతాయి. ఈ ఆయతులు నమాజ్‌లోని ప్రతి రకాత్‌లోనూ పఠించబడటానికి కారణం లేకపోలేదు. దైవప్రవక్త (సల్లం) నమాజ్‌లో ఫాతిహా సూరా పఠించకపోతే నమాజ్ నెరవేరదని చెప్పారు. అంతేకాదు, ఖుర్‌ఆన్‌లోని ఇతర సూరాల్లో విపులంగా వివరించబడిన విషయాలన్నీ ఈ సూరాలో సంక్షిప్తంగా పొందుపరచబడ్డాయి. ఈ చిన్న సూరాలోనే ఎన్నో విషయాలు బోధించబడ్డాయి. ఏకదైవతా సిద్ధాంతం (తౌహీద్) పేర్కొనబడింది. ఒకే దేవుణ్ణి ఆరాధించమనీ, సహాయం కోసం ఆయన్నే అర్థించమని చెప్పబడింది. ప్రళయ దినం గురించి, ఆ రోజున జరిగే తీర్పుల గురించి చూచాయగా చెప్పబడింది. మానవులు గత సమాజాల చరిత్ర నుంచి గుణపాఠం నేర్చుకోవాలని చెప్పబడింది. అందుకే అబూదావూద్, తిర్మిజీ గ్రంథాల్లోని వేరొక ఉల్లేఖనంలో ఈ సూరాను "ఖుర్‌ఆన్ మాతృక" అని కూడా చెప్పటం జరిగింది.

١٠١٠ - وعن أَبي سعيدٍ الخُدْرِيِّ رضيَ اللهُ عنهُ أَنَّ رسولَ اللهِ ﷺ قالَ في قُلْ هُوَ اللهُ أَحَدٌ: «وَالَّذي نَفْسي بِيَدِهِ! إِنَّهَا لَتَعْدِلُ ثُلُثَ القُرْآنِ». وفي روايةٍ: أَنَّ رسولَ اللهِ ﷺ قالَ لأَصْحَابِهِ: «أَيَعْجِزُ أَحَدُكُمْ أَنْ يَقْرَأَ بِثُلُثِ القُرْآنِ في لَيْلَةٍ» فَشَقَّ ذلكَ عَلَيْهِمْ، وَقَالُوا: أَيُّنَا يُطِيقُ ذلكَ يا رسولَ اللهِ؟ فقالَ: «قُلْ هُوَ اللهُ أَحَدٌ، اللهُ الصَّمَدُ: ثُلُثُ القُرْآنِ» رواه البخاري

1010. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) **'ఖుల్‌హువల్లాహు అహద్'** సూరా గురించి వ్యాఖ్యానిస్తూ, "ఎవరి చేతుల్లో నయితే నా ప్రాణముందో ఆ దేవుని సాక్షిగా చెబుతున్నాను. "ఈ సూరా మూడోవంతు ఖుర్‌ఆన్‌కు సమానం" అన్నారు.

వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) సహచరుల్ని ఉద్దేశ్యించి, "మీలో ఎవరయినా ఒకే రాత్రిలో మూడోవంతు ఖుర్‌ఆన్ పఠించలేక పోతున్నారా?" అని అడిగారు. "అంత శక్తి మాకెక్కడిది దైవప్రవక్తా!" అని అన్నారు సహచరులు. అప్పుడాయన, **"ఖుల్‌హు వల్లాహు అహద్, అల్లాహుస్స మద్"** అనే సూరా మూడోవంతు ఖుర్‌ఆన్‌కు సమానం" అని చెప్పారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఖుర్‌ఆన్ మహత్యాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు:**

అంటే సూరె ఇఖ్లాస్‌ను ఒకసారి పఠించటం, పుణ్యం రీత్యా మూడోవంతు ఖుర్‌ఆన్ పఠనానికి సమానమన్నమాట. ఈ సూరాలో ఒకే దేవుణ్ణి ఆరాధించాలని చెప్పబడింది. ఆయనకు సహవర్తులుగా వేరొకర్ని నిలబెట్టడాన్ని ఖండించటం జరిగింది. దీనిద్వారా మానవులు కేవలం తనను మాత్రమే ఆరాధించటాన్ని, దేవుడు ఎంతగా ఇష్టపడతాడో అర్థమవుతోంది. అదే విధంగా బహుదైవారాధనను ఆయన ఎంతగా అసహ్యించుకుంటాడో కూడా బోధపడుతోంది. అందుకే బహుదైవారాధనను ఆయన ఎన్నటికీ క్షమార్హంకాని పాపంగా నిర్ణయించాడు.

١٠١١ ـ وعَنْهُ أَنَّ رَجُلاً سَمِعَ رَجُلاً يَقْرَأُ قُلْ هُوَ اللهُ أَحَدٌ يُرَدِّدُهَا فَلَمَّا أَصْبَحَ جَاءَ إِلَىٰ رسولِ الله ﷺ، فَذَكَرَ ذلكَ لَهُ وَكَانَ الرَّجُلُ يَتَقَالُّها فَقَالَ رسولُ الله ﷺ: «وَالَّذِي نَفْسِي بِيَدِهِ إِنَّهَا لَتَعْدِلُ ثُلُثَ القُرْآنِ» رواه البخاري.

1011. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి)గారే చేసిన కథనం: ఒకాయన మాటిమాటికీ ఖుల్‌హువల్లాహు అహద్ సూరా పఠిస్తుండగా ఒకతను విన్నాడు. తెల్లవారిన తర్వాత ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఆయనకు ఆ మనిషి గురించి చెప్పాడు. (అంతేకాదు) ఆ విధంగా చదవటానికి ఏమంత ప్రాధాన్యత లేనట్లు మాట్లాడాడు. అందుకు దైవప్రవక్త (సల్లం) అతన్ని ఉద్దేశ్యించి, "ఎవరి చేతుల్లోనయితే నా ప్రాణముందో ఆ దేవుని సాక్షిగా చెబుతున్నాను, నిస్సందేహంగా ఆ సూరా మూడోవంతు ఖుర్‌ఆన్‌కు సమానం" అని చెప్పారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీ, ఖుర్‌ఆన్ మహత్యాల ప్రకరణం)*

١٠١٢ ـ وعن أبي هريرةَ رضيَ اللهُ عنه أَنَّ رسولَ اللهِ ﷺ قال في قُلْ هُوَ اللهُ أَحَدٌ: «إِنَّهَا تَعْدِلُ ثُلُثَ القُرْآنِ» رواه مسلم.

1012. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "ఖుల్‌హువల్లాహు అహద్" సూరా గురించి వ్యాఖ్యానిస్తూ, "ఇది మూడో వంతు ఖుర్‌ఆన్‌కు సమానం" అని అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

1013. హజ్రత్ అనస్ (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! నేను ఈ **ఖుల్‌హువల్లాహు అహద్** సూరాను ప్రేమిస్తున్నాను" అన్నాడు. అది విని దైవప్రవక్త (సల్లం) అతనితో, "దానిపట్ల గల నీ ప్రేమ నిన్ను స్వర్గానికి తీసుకెళ్తుంది" అని చెప్పారు.

(తిర్మిజీ-హసన్, బుఖారీ దీనిని పరం పరతో నిమిత్తం లేకుండా పేర్కొన్నారు.)

١٠١٣ ـ وعنْ أَنسٍ رضي الله عنهُ أَنَّ رَجُلاً قال: يا رسولَ اللهِ! إني أُحِبُّ هذهِ السُّورَةَ: قُلْ هُوَ اللهُ أَحَدٌ، قالَ: «إنَّ حُبَّها أَدْخَلَكَ الجنَّةَ» رواه الترمذي وقال: حديثٌ حسن. ورواه البخاري في صحيحهِ تعليقاً.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సుననె తిర్మిజీలోని 'ఖుర్ఆన్ పుణ్యం' అధ్యాయం)*

**ముఖ్యాంశాలు:**

కొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం ఈ సూరాకు ఇంతటి మహత్యం లభించటానికి కారణం ఏమిటంటే- ఖుర్ఆన్ యొక్క జ్ఞానసంపదను మూడు భాగాలుగా వర్గీకరించవచ్చు. ఒకటి: తౌహీద్ (ఒకే దేవుణ్ణి ఆరాధించమని బోధించే) ఆజ్ఞలు, రెండు: షరీఅత్ నిబంధనలు, మూడు: నైతిక నియమాలు. ఈ మూడింటిలో మొదటి భాగమైన తౌహీద్, ఈ సూరాలో సమగ్రంగా, సంపూర్ణంగా పేర్కొనబడింది. అందుకే ఈ సూరాకు అంత ప్రాశస్త్యం లభించింది (నుజ్‌హతుల్ ముత్తఖీన్). దీని మహత్యానికి ఇంకా ఎన్నో కారణాలు చెప్పారు పండితులు. కాని ఇమామ్ ఇబ్నె అబ్దుల్ బర్ర్ మాత్రం అలా కారణాలు వెతుక్కోకుండా ఉండడమే మంచిదని అభిప్రాయపడ్డారు.

1014. హజ్రత్ ఉఖ్‌బా బిన్ ఆమిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఈ విషయం మీకు తెలుసా? నిన్న రాత్రి కొన్ని ఆయతులు అవతరించాయి. అలాంటి ఆయతులు ఇంతకు ముందెన్నడూ అవతరించలేదు. (అవే) **ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్**

١٠١٤ ـ وعن عُقْبَةَ بنِ عامرٍ رَضيَ اللهُ عنهُ أَنَّ رسولَ اللهِ ﷺ قال: «أَلَمْ تَرَ آياتٍ أُنْزِلَتْ هذهِ اللَّيْلَةَ لَمْ يُرَ مِثْلُهُنَّ قَطُّ؟ قُلْ أَعُوذُ بِرَبِّ الفَلَقِ، وَقُلْ أَعُوذُ بِرَبِّ النَّاسِ» رواه مسلم.

మరియు ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్."
(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

అలాంటి ఆయతులు ఇంతకు ముందెన్నడూ అవతరించలేదంటే, ఆసాంతం శరణు వేడుకునే ప్రార్థనా వచనాలతో కూడిన సూరాలు అంతకు ముందెన్నడూ అవతరించలేదని భావం. ఈ ప్రత్యేకత ఈ రెండు సూరాల్లో మాత్రమే కనబడుతుంది. అందుకే వీటిని 'ముఅవ్వజతైన్' (శరణువేడుకునే రెండు ప్రార్థనలు) అంటారు.

١٠١٥ - وعن أَبي سَعيدِ الخُدْرِيِّ رَضيَ اللهُ عنهُ قال: كانَ رسولُ الله ﷺ يَتَعَوَّذُ مِنَ الجَانِّ وَعَيْنِ الإنْسَانِ، حَتَّى نَزَلَتِ المُعَوِّذَتَانِ، فَلَمَّا نَزَلَتَا، أَخَذَ بِهِما وَتَرَكَ مَا سِوَاهُمَا.
رواه الترمذي وقال: حديث حسن.

1015. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం: (ముఅవ్వజతైన్ సూరాలు అవతరించక మునుపు దైవప్రవక్త (స) తన సొంత మాటల్లోనే) జిన్నాతుల (కీడు)నుండి, మానవుల దిష్టి నుండి శరణు వేడుకునేవారు. కొంతకాలానికి 'ముఅవ్వజతైన్' సూరాలు అవతరించాయి. ఇక అప్పట్నుంచి దైవప్రవక్త (సల్లం) ఇతర వాక్యాలన్నిటినీ వదలి పెట్టి, వాటి ద్వారానే శరణు వేడుకోవటం మొదలు పెట్టారు. (తిర్మిజీ, హసన్)

(సుననె తిర్మిజీలోని వైద్య ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మనుషుల మాదిరిగానే జిన్నాతుల్లో కూడా మంచివారు, చెడ్డవారు ఉంటారు. వారు మనుషులకు కీడు చేసినా చేస్తారు. దేవుడు వారికి ఆ శక్తినిచ్చాడు. అంతేకాదు, కొన్ని సందర్భాల్లో వారు మనుషుల్ని అనేక ఇబ్బందులకు గురిచేస్తారు. మనుషులకు నష్టం కలిగించటానికి కూడా వారు వెనుకాడరు. అదే విధంగా దిష్టి తగలడమనేది కూడా వాస్తవమే. ఒకరు మరొకర్ని కోపంతో లేక అసూయతో చూసినప్పుడు ఎదుటివ్యక్తి ఆ చూపులోని దుష్ప్రభావానికి లోనవుతాడు. దానివల్ల ఆ వ్యక్తికి హాని కలగవచ్చు. లేదా ఏదయినా ప్రమాదానికి గాని,

ఇబ్బందికిగాని గురికావచ్చు. అందుకే దైవప్రవక్త (సల్లం) తొలుత ఆ రెండింటి నుండి, తన మాటల్లోనే దైవాన్ని శరణు వేడుకునేవారు. కొంతకాలానికి **ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్, ఖుల్ అవూజు** బిరబ్బిన్నాస్ సూరాలు అవతరించిన తర్వాత వాటి ద్వారానే శరణు వేడుకోవటం ప్రారంభించారు. ఎందుకంటే ఈ రెండు సూరాలు, మనుషులు శరణు వేడుకోవటానికే అవతరించాయి. ఆ ఉద్దేశ్యంతోనే వీటిని 'ముఅవ్వజతైన్' అని అనటం జరిగింది.

١٠١٦ - وعن أبي هريرة رضيَ اللهُ عنهُ أنَّ رسولَ الله ﷺ قالَ: «مِنَ القُرْآنِ سُورَةٌ ثَلاثُونَ آيَةً شَفَعَتْ لِرَجُلٍ حَتَّى غُفِرَ لَهُ، وَهِيَ تَبَارَكَ الذي بِيَدِهِ المُلْكُ». رواه أبو داود والترمذي وقال: حديث حسن.
وفي رواية أبي داود: «تَشْفَعُ».

1016. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఖుర్ఆన్‌లో ముప్ఫై వాక్యాలు గల, ఒక సూరా ఉంది. అది (దైవ సన్నిధిలో) ఒక వ్యక్తి గురించి సిఫారసు చేసి ఆఖరికి అతనికి క్షమాభిక్ష లభించేలా చేసింది. అదే 'తబారకల్లజీ బియదిహిల్ ముల్కు' సూరా. (అబూదావూద్, తిర్మిజీ, హసన్)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం- సుననె తిర్మిజీలోని 'ఖుర్ఆన్ పుణ్యం' అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఈ సూరా తనను పఠించేవారి గురించి దైవసన్నిధిలో సిఫారసు చేసి ఎట్టకేలకు వారు మన్నించబడేలా చేస్తుందని సదరు హదీసు భావం. హదీసులోని విషయం భూతక్రియ ద్వారా వివరించబడింది. అంటే భూతకాలంలో జరిగిపోయిన సంఘటన ఎంత నమ్మదగిన విషయమో, ఆ సూరా తనను పఠించినవారి గురించి సిఫారసు చేయటం కూడా అంతే నమ్మదగిన విషయమన్నమాట!

١٠١٧ - وعن أبي مسعودٍ البَدْرِيِّ رضيَ اللهُ عنهُ عنِ النبيِّ ﷺ قال: «مَنْ قَرَأَ بالآيَتَيْنِ مِنْ آخِرِ سُورَةِ البَقَرَةِ في لَيْلَةٍ كَفَتَاهُ» متفقٌ عليه. قِيلَ: كَفَتَاهُ المَكْرُوهَ تِلْكَ اللَّيْلَةَ، وَقِيلَ: كَفَتَاهُ مِنْ قِيَامِ اللَّيْلِ.

1017. హజ్రత్ అబూ మస్‌వూద్ బద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "ఎవరయినా రాత్రిపూట సూరె బఖరాలోని చివరి రెండు ఆయతులు పఠిస్తే వారికి ఆ రాత్రంతా ఆ రెండు ఆయతులే చాలు!" (బుఖారీ-ముస్లిం)

"చాలు" అంటే ఆ రాత్రి జరగబోయే అవాంఛనీయ సంఘటనల నుండి రక్షణ పొందటానికి ఆ రెండు ఆయతులు చాలు అని అర్థం" అని కొంత మంది అన్నారు. మరికొంత మంది, "ఆ రాత్రంతా నమాజ్ చేసినంత పుణ్యం లభించటానికి ఆ రెండు ఆయతులు పఠిస్తే చాలు" అని అభిప్రాయ పడ్డారు.

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బఖరా సూరాలోని ఆఖరి రెండు ఆయతులు పఠిస్తే మనిషి తలబిరుసులయిన షైతానుల ఆగడాల నుండి సురక్షితంగా ఉంటాడని పై హదీసు ఉద్దేశ్యం. గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) పేర్కొన్నట్లు ఈ హదీసుకు భావం- "ఆ రెండు ఆయతులను పఠిస్తే తహజ్జుద్ నమాజ్ చేసినంత పుణ్యం లభిస్తుంది" అని కూడా కావచ్చు. బఖరా సూరా ఆఖరి రెండు ఆయతులంటే, "ఆమనర్రసూలు బిమా ఉంజిల ఇలైహి......దగ్గర్నుంచి సూరా చివరి వరకన్నమాట!

١٠١٨ - وعن أبي هريرة رضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ قال: «لَا تَجْعَلُوا بُيُوتَكُمْ مَقَابِرَ إنَّ الشَّيْطَانَ يَنْفِرُ مِنَ الْبَيْتِ الَّذي تُقْرَأُ فِيهِ سُورَةُ الْبَقَرَةِ» رواه مسلم.

1018. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు మీ ఇండ్లను శ్మశానాలుగా మార్చుకోకండి. నిస్సందేహంగా సూరె బఖరా పఠించబడే ఇంట్లో నుంచి షైతాన్ పారిపోతాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

శ్మశానంలో మృతులు సమాధి చేయబడి ఉంటారు. వారికి ఎలాంటి సదాచరణ చేసే సామర్థ్యం ఉండదు. అదే విధంగా మీరు మీ ఇండ్లల్లో నఫిల్ నమాజులు, ఖుర్ఆన్

పారాయణం లాంటి ఆరాధనలు చేయకపోతే మీ ఇళ్ళు కూడా శ్మశానాల మాదిరిగా పాడుబడిపోతాయనీ, మీలో సదాచరణ చేసే సద్బుద్ధి నశిస్తుందని, మీ ఇండ్లల్లో షైతానులు తిష్ఠవేస్తాయని ఈ హదీసు భావం. ఇందులో ముఖ్యంగా సూరె బఖరా పారాయణం ద్వారా ఇండ్ల నుండి షైతానులను తరమవచ్చని చెప్పబడింది.

١٠١٩ - وعن أُبَيِّ بنِ كَعْبٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «يَا أَبَا المُنْذِرِ! أَتَدْرِي أَيُّ آيَةٍ مِنْ كِتَابِ اللهِ مَعَكَ أَعْظَمُ؟» قُلْتُ: اللهُ لا إِلٰهَ إِلَّا هُوَ الحَيُّ القَيُّومُ، فَضَرَبَ في صَدْرِي وَقَالَ: «لِيَهْنِكَ العِلْمُ أَبَا المُنْذِرِ» رواه مسلم.

1019. హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తనను "ఓ అబుల్ ముంజిర్! నీ దగ్గరున్న దైవగ్రంథ ఆయతుల్లో అన్నిటికన్నా గొప్పదేదో నీకు తెలుసా?" అని అడిగారు. 'అల్లాహు లా ఇలాహ ఇల్లాహువల్ హయ్యుల్ ఖయ్యూమ్' అనే ఆయతు (కావచ్చు) ' అని అన్నాను నేను. అప్పుడాయన నా రొమ్ము తట్టి, 'అబుల్ ముంజిర్! నీకు జ్ఞానం వల్ల శుభం కల్గుగాక!' అని అభినందించారు. (ముస్లిం)

(అంటే 'ఖుర్ఆన్ జ్ఞానశుభంతోనే నీకు అన్నిటికన్నా గొప్ప ఆయతు ఏదో తెలిసింది' అని చెప్పటమే దైవప్రవక్త ప్రవచన ఉద్దేశ్యం.)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"అల్లాహు లా ఇలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూమ్" 'ఆయతుల్ కుర్సీ'కు సంబంధించిన వచనం. ఇక్కడ దీనిభావం, మొత్తం ఆయతుల్ కుర్సీ అని అర్థం చేసుకోవాలి. ఈ ఆయతులో మహోన్నతమైన దేవుని గుణగణాలు, మహోజ్వలమైన ఆయన అధికారాలు ప్రస్తావించబడ్డాయి. అందుకే ఈ ఆయతు ఎంతో మహత్యంతో కూడుకున్నది.

"నీకు జ్ఞానం వల్ల శుభం కల్గుగాక!" అంటే నీకు ప్రయోజనకరమైన, గౌరవప్రదమైన, సాఫల్యాన్ని తెచ్చిపెట్టే జ్ఞానం అబ్బాలని భావం. ఇక్కడ జ్ఞానమంటే ఖుర్ఆన్ హదీసుల జ్ఞానం. ఇహపరాల్లో మనిషికి సాఫల్యాన్ని తెచ్చిపెట్టే జ్ఞానం అదే!

1020. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త(సల్లం) నన్ను రమజాన్ మాసపు జకాత్ (అంటే ఫిత్రా) సొమ్ముకు కాపలా ఉంచారు. (ఓరోజు రాత్రి) ఎవరో ఒకతను వచ్చి దోసిళ్ళతో ఆ ధాన్యాన్ని దొంగిలించసాగాడు. వెంటనే నేనతన్ని పట్టుకొని, "(ఎవర్నువ్వు?) పద దైవప్రవక్త (సల్లం) దగ్గరికి" అని గద్దించాను. అందుక తను, (భయపడిపోతూ) "అవసరాల్లో ఉన్నానయ్యా! భార్యా బిడ్డలు గలోణ్ణి, ఇప్పుడు నాకు విపరీతమైన అవసరం వచ్చిపడింది" అన్నాడు. నేనతన్ని (దయతలచి) వదలిపెట్టాను. మరునాడు ఉదయం (నేను దైవప్రవక్త సన్నిధికి వెళ్ళాను). దైవప్రవక్త నన్ను పిలిచి "అబూహురైరా! నిన్న రాత్రి నువ్వు పట్టుకున్న వ్యక్తిని ఏం చేశావ్?" అని అడిగారు. దానికి నేను, "దైవ ప్రవక్తా! అతను తన అవసరం గురించి, తన మీద ఆధారపడి వున్నవారి గురించి మొరపెట్టుకున్నాడు. అందు కని నేనతని మీద దయతలచి అతన్ని వదలి పెట్టాను" అని చెప్పాను. దానికి దైవప్రవక్త (సల్లం), "అతను నీతో అబద్ధం చెప్పాడు. అతను మళ్ళీ వస్తాడు. చూస్తూ ఉండు" అన్నారు. దైవప్రవక్త (సల్లం) చెప్పారు కాబట్టి అతను మళ్ళీ తప్పకుండా వస్తాడని

١٠٢٠ ـ وعن أَبي هريرةَ رضيَ اللهُ عنهُ قال: وَكَّلَني رسولُ الله ﷺ بحِفظ زَكَاةِ رَمَضَانَ، فأَتَاني آتٍ، فَجَعَلَ يَحْثُو مِنَ الطَّعَامِ، فَأَخَذْتُهُ فقُلْتُ: لَأَرْفَعَنَّكَ إِلَى رَسُولِ اللهِ ﷺ، قَالَ: إِنِّي مُحْتَاجٌ، وَعَلَيَّ عِيَالٌ، وَبِي حَاجَةٌ شَدِيدَةٌ، فَخَلَّيْتُ عَنْهُ، فَأَصْبَحْتُ، فَقَالَ رَسُولُ اللهِ صلى الله عَلَيْهِ وآلهِ وسَلَّمَ: «يَا أَبَا هُرَيرَةَ! مَا فَعَلَ أَسِيرُكَ البَارِحَةَ؟» قُلْتُ: يَا رَسُولَ اللهِ! شَكَا حَاجَةً وَعِيَالاً، فَرَحِمْتُهُ، فَخَلَّيْتُ سَبِيلَهُ. فَقَالَ: «أَمَا إِنَّهُ قَدْ كَذَبَكَ وَسَيَعُودُ» فَعَرَفْتُ أَنَّهُ سَيَعُودُ لِقَوْلِ رَسُولِ اللهِ ﷺ فَرَصَدْتُهُ، فَجَاءَ يَحْثُو مِنَ الطَّعَامِ، فَقُلْتُ: لَأَرْفَعَنَّكَ

إلىٰ رَسُولِ اللهِ ﷺ، قَالَ: دَعْني فَإِنِّي مُحْتَاجٌ، وَعَلَيَّ عِيَالٌ لا أَعُودُ، فَرَحِمْتُهُ فَخَلَّيْتُ سَبِيلَهُ، فَأَصْبَحْتُ فَقَالَ لي رَسُولُ اللهِ ﷺ: «يَا أَبَا هُرَيْرَةَ! ما فَعَلَ أَسِيرُكَ الْبَارِحَةَ؟» قُلْتُ: يَا رَسُولَ اللهِ! شَكَا حَاجَةً وَعِيَالاً فَرَحِمْتُهُ، فَخَلَّيْتُ سَبِيلَهُ، فَقَالَ: «إِنَّهُ قَدْ كَذَبَكَ وَسَيَعُودُ» فَرَصَدْتُهُ الثَّالِثَةَ، فَجَاءَ يَحْثُو مِنَ الطَّعَامِ، فَأَخَذْتُهُ، فقلتُ: لأَرْفَعَنَّكَ إلى رَسُولِ اللهِ ﷺ، وَهذا آخِرُ ثَلاثِ مَرَّاتٍ أَنَّكَ تَزْعُمُ أَنَّكَ لا تَعُودُ، ثُمَّ تَعُودُ! فقال: دَعْني فَإِنِّي أُعَلِّمُكَ كَلِمَاتٍ يَنْفَعُكَ اللهُ بِهَا، قلتُ:

నమ్మి అతనికోసం మాటేసి ఉన్నాను. అతను వచ్చి దోసిళ్ళతో ధాన్యాన్ని నింపుకోసాగాడు. (నేను మెల్లిగా వెళ్ళి అతన్ని పట్టుకొని), "ఇప్పుడు మాత్రం నేను నిన్ను తప్పకుండా దైవప్రవక్త దగ్గరికి తీసుకువెళ్తాను" అన్నాను. అందుకతను, "నన్ను వదలిపెట్టండి, అవసరాల్లో ఉన్నాను. భార్యాబిడ్డలు గలోణ్ణి. ఇంకెప్పుడూ రాను. (ఈ ఒక్క సారికి వదలిపెట్టండి)" అని బ్రతిమా లాడు. నాకు అతని మీద జాలేసింది. అందుకని అతన్ని వదలి పెట్టేశాను.

మరునాడు ఉదయం (నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాను.) దైవప్రవక్త (సల్లం) నన్ను పిలిచి, "అబూహురైరా! నిన్న రాత్రి నువ్వు పట్టుకున్న వ్యక్తిని ఏం చేశావ్?" అని అడిగారు. "దైవ ప్రవక్తా! అతను తన అవసరం గురించి, తనమీద ఆధారపడి వున్నవారి గురించి మొరపెట్టుకున్నాడు. అందుకని నేనతని మీద దయతలచి అతన్ని వదలిపెట్టేశాను" అని చెప్పాను. అది విని దైవప్రవక్త(సల్లం), "అతను నీతో అబద్ధం చెప్పాడు. అతను మళ్ళీ వస్తాడు" అని చెప్పారు. మూడోసారి కూడా నేనతనికోసం మాటేసి కూర్చు న్నాను. అతను వచ్చి దోసిళ్లతో ధాన్యం నింపుకోసాగాడు. నేనతన్ని పట్టుకొని "ఇప్పుడు నేను నిన్ను తప్పకుండా

مَا هُنَّ؟ قال: إذا أَوَيْتَ إلى فِرَاشِكَ فَاقْرَأْ آيَةَ الْكُرسِيِّ فَإِنَّهُ لَنْ يَزَالَ عَلَيْكَ مِنَ اللهِ حَافِظٌ، وَلا يَقْرَبُكَ شَيْطَانٌ حَتَّى تُصْبِحَ، فَخَلَّيْتُ سَبِيلَهُ فَأَصْبَحْتُ، فَقَالَ لِي رَسُولُ اللهِ ﷺ: «مَا فَعَلَ أَسِيرُكَ الْبَارِحَةَ؟» قُلْتُ: يَا رَسُولَ اللهِ! زَعَمَ أَنَّهُ يُعَلِّمُنِي كَلِمَاتٍ يَنْفَعُنِي اللهُ بِهَا فَخَلَّيْتُ سَبِيلَهُ. قَالَ: «مَا هِيَ؟» قلتُ: قَالَ لِي: إذا أَوَيْتَ إلى فِرَاشِكَ فَاقْرَأْ آيَةَ الْكُرْسِيِّ مِنْ أَوَّلِهَا حَتَّى تَخْتِمَ

దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకు వెళ్తాను. నువ్వు ఇలా రావటం ఇది మూడోసారి. ప్రతిసారీ నువ్వు ఇంకెప్పుడూ రానని వాగ్దానం చేసి మళ్ళీ వస్తున్నావు'' అని గద్దిస్తూ అన్నాను. దానికతను, "నన్ను వదలి పెట్టండి. నేను మీకు కొన్ని వచనాలు నేర్పిస్తాను. వాటి మూలంగా దేవుడు మీకు ప్రయోజనం చేకూరుస్తాడు" అని అన్నాడు. నేను, "ఏమిటా వచనాలు?" అని అడిగాను. అందుకతను, "మీరు (నిద్రపోవటానికి) పడక మీదకు వెళ్ళి నప్పుడు అయతుల్ కుర్సీ పఠించండి. అలా చేస్తే తెల్లవారే వరకు, మీ కొరకు అల్లాహ్ తరఫు నుండి ఒక పర్యవేక్ష కుడు నియమించబడతాడు. షైతాన్ మీ దరిదాపులకు కూడా రాడు'' అని చెప్పాడు. అప్పుడు కూడా నేనతన్ని వదిలేశాను. తెల్లవారిన తర్వాత దైవప్రవక్త (సల్లం) నాతో మాట్లాడుతూ, "రాత్రి నువ్వు పట్టుకున్న వాణ్ణి ఏం చేశావ్?'' అని అడిగారు. "దైవప్రవక్తా! అతను నాకు కొన్ని వచనాలు నేర్పిస్తా నని వాగ్దానం చేశాడు. ఆ వచనాల మూలంగా దేవుడు నాకు ప్రయోజనం చేకూరుస్తాడట. అందుకని నేనతన్ని వదలిపెట్టేశాను'' అని చెప్పాను. "ఏమిటా వచనాలు?'' అడిగారు దైవప్రవక్త (సల్లం). అప్పుడు నేను, ఆ

الآيَةَ: ﴿ ٱللَّهُ لَآ إِلَٰهَ إِلَّا هُوَ ٱلۡحَيُّ ٱلۡقَيُّومُ ﴾ وقالَ لِي: لا يَزَالُ عَلَيْكَ مِنَ اللهِ حَافِظٌ، وَلَنْ يَقْرَبَكَ شَيْطَانٌ حَتَّى تُصْبِحَ. فقالَ النبيُّ ﷺ: «أَمَا إِنَّهُ قَدْ صَدَقَكَ وَهُوَ كَذُوبٌ، تَعْلَمُ مَنْ تُخَاطِبُ مُنْذُ ثَلاثٍ يَا أَبَا هُرَيْرَةَ؟» قلتُ: لا، قال: «ذَاكَ شَيْطَانٌ» رواه البخاري.

వచ్చిన వ్యక్తి నాతో "మీరు (నిద్రపోవటానికి) పడక మీదకు వెళ్ళినప్పుడు మొదటి నుంచి చివరి వరకు ఆయతుల్ కుర్సీ పఠించండి" అని అన్నాడని చెప్పాను. "అలాచేస్తే మీ కొరకు అల్లాహ్ తరఫు నుండి ఒక పర్యవేక్షకుడు నియమించబడతాడు. తెల్లవారే వరకు షైతాన్ మీ దరిదాపులకు కూడా రాడు" అని కూడా అన్నాడని చెప్పాను.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) నాతో, "విను, అతను పెద్ద అబద్ధాలకోరు. అయినప్పటికీ అతను నీతో నిజం చెప్పాడు. అబూహురైరా! మూడు రాత్రుల నుంచి నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?" అన్నారు. నేను 'తెలీద'న్నాను. "అతను షైతాన్" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం).

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వకాలా ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా ఆయతుల్ కుర్సీ యొక్క ఘనత వెల్లడౌతోంది. రాత్రిపూట నిద్రకు ఉపక్రమించే ముందు ఆ వచనాలను పఠించి నిద్రపోవాలని ఇందులో బోధించబడింది.

١٠٢١ ـ وعن أبي الدَّرْدَاءِ رَضيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قال: «مَنْ حَفِظَ عَشْرَ آيَاتٍ مِنْ أَوَّلِ سُورَةِ الْكَهْفِ، عُصِمَ مِنَ الدَّجَّالِ». وفي رواية: «مِنْ آخِرِ سُورَةِ

1021. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కహఫ్ సూరాలోని మొదటి పది వాక్యాలను కంఠస్థం

الكهف» رواهما مسلم.

చేసుకున్నవాడు దజ్జాల్ (ఉపద్రవం) నుండి సురక్షితంగా ఉంటాడు.

వేరొక ఉల్లేఖనంలో 'కహఫ్' సూరాలోని చివరి పది వాక్యాలు అని ఉంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయ సమీప కాలంలో 'దజ్జాల్' అనే ఓ ఉపద్రవాగ్రేసరుడు అవతరిస్తాడు. అతని దగ్గర మహిమల్ని సృష్టించే శక్తి ఉంటుంది. ఆ శక్తి కూడా దేవుడు ఇచ్చినదే అయి ఉంటుంది. ఆ మహిమల్ని చూసి చాలా మంది బలహీన విశ్వాసులు అతని మహత్యాన్ని ఒప్పుకుంటారు. కనుక ఈ ఉపద్రవం చాలా కఠినమైనది. విశ్వాసుల సహనాన్ని పరీక్షించే ఉపద్రవం ఇది! అందుకే ప్రతి దైవప్రవక్త తమ అనుచర సమాజాన్ని ఈ ఉపద్రవం గురించి భయపెట్టారు. మన ప్రవక్త ముహమ్మద్ (సల్లం) కూడా తమ అనుచర సమూజాన్ని ఈ ఉపద్రవం పట్ల అప్రమత్తంగా ఉండమని ఆదేశించారు. దాన్నుండి తమల్ని తాము కాపాడుకోమని, అల్లాహ్ శరణు వేడుకుంటూ ఉండమని తాకీదు చేశారు.

సదరు హదీసులో దజ్జాల్ పన్నే కుటిల పన్నాగాల నుండి సురక్షితంగా ఉండే మార్గాన్ని సూచించటం జరిగింది. కనుక కహఫ్ సూరాలోని మొదటి పది వాక్యాలు, చివరి పది వాక్యాలు కంఠస్థం చేసుకొని ఉదయం, సాయంత్రం వాటిని పారాయణం చేస్తూ ఉంటే దాని వల్ల చాలా ప్రయోజనం ఉంటుంది.

١٠٢٢ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ رضِيَ الله عَنْهُما قَالَ: بَيْنَمَا جِبْرِيلُ عليهِ السَّلامُ قاعِدٌ عِندَ النَّبِيِّ ﷺ سَمِعَ نَقِيضاً مِنْ فَوْقِهِ، فَرَفَعَ رَأْسَه فَقَالَ: «هذا بَابٌ مِنَ السَّمَاءِ فُتِحَ اليَوْمَ، وَلَمْ يُفْتَحْ قَطُّ إلَّا اليَوْمَ، فَنَزَلَ منه

1022. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఒకరోజు జిబ్రయీల్ దూత దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉండగా పైనుంచి ఒక శబ్దం వినిపించింది. జిబ్రయీల్ (అలైహి) తలపైకెత్తి, "ఆకాశంలోని ఒక ద్వారం తెరువబడింది. దాని శబ్దమే ఇది. నేటికి ముందు ఆ ద్వారం ఎన్నడూ తెరువబడలేదు. ఆ ద్వారం గుండా ఒక దైవదూత దిగాడు" అని అన్నారు.

مَلَكٌ فقالَ: هذا مَلَكٌ نَزَلَ إلى الأرْضِ لَمْ يَنزِلْ قَطُّ إلَّا اليَوْمَ، فَسَلَّمَ وقال: أَبْشِرْ بنورَين أُوتِيتَهما، لَمْ يُؤتَهُمَا نَبِيٌّ قَبلَكَ: فَاتِحَةِ الكِتَابِ، وخَوَاتِيمِ سُورَةِ البَقَرةِ، لَن تَقـرَأَ بحَـرْفٍ منهـا إلَّا أُعطِيتَـه». رواه مسلم. «النَّقِيض»: الصَّوت.

ఆ దైవదూతను చూపిస్తూ, "భూమి మీదకు దిగిన ఈ దైవదూత, నేటికి ముందు ఎన్నడూ దిగలేదు" అని చెప్పారు.

ఆ దైవదూత దైవప్రవక్త (సల్లం)కు సలాం చేసి "మీకు రెండు వెలుగులు ఇవ్వబడ్డాయనే శుభవార్తను అందజేస్తు న్నాను. మీకు పూర్వం ఆ వెలుగులు ఎవరికీ ఇవ్వబడలేదు. అవి (ఒకటి) ఫాతిహా సూరా, (రెండోది) బఖరా సూరా లోని చివరి వాక్యాలు. మీరు వీటిలోని ఏ అక్షరాన్ని పఠించినా అది మీకు ఇవ్వబడుతుంది" అని చెప్పాడు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా ఫాతిహా సూరా, బఖరా సూరాలోని చివరి వాక్యాల (ఆమనర్రసూలు నుండి చివరి వరకు గల వాక్యాల) ప్రాశస్త్యం వెల్లడౌతోంది. చిత్తశుద్ధితో, దృఢసంకల్పంతో ఆ వాక్యాలను పఠిస్తే దేవుడు వాటిలో పేర్కొన్న అదృష్టాన్ని, సౌభాగ్యాన్ని తప్పకుండా ప్రసాదిస్తాడు.

**184వ అధ్యాయం**

## ١٨٤ - بَابُ اسْتِحْبَابِ الاجْتِمَاعِ عَلَى القِرَاءَةِ

## అందరూ ఒకచోట చేరి ఖుర్‌ఆన్ పారాయణం చేయటం అభిలషణీయం

١٠٢٣ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْه قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «ومَا اجْتَمَعَ قَوْمٌ فِي بَيْتٍ مِن بُيُوتِ اللهِ يَتْلُونَ كِتَابَ اللهِ، ويَتَدَارَسُونَه بَيْنَهُمْ، إلَّا نَزَلَتْ عَلَيْهِم السَّكِينَةُ، وغَشِيَتْهُمُ الرَّحْمَةُ، وَحَفَّتْهُم المَلائِكَةُ وذَكَرَهُم اللهُ فِيمَنْ عِندَه» رواه مسلم.

1023. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుని గృహాల లోని ఏదయినా ఒక గృహంలో కొంత మంది గుమిగూడి దైవగ్రంథాన్ని పారాయణం చేస్తూ, దాని గురించి పరస్పరం చర్చించుకుంటూ ఉంటే (దేవుని తరఫు నుండి) వారి మీద ప్రశాంతత ఆవరిస్తుంది. దైవకారుణ్యం వారిని కమ్ముకుంటుంది. దైవదూతలు వారిని చుట్టుముడుతారు. ఇంకా వారిని గురించి దేవుడు తన ఆస్థానం లోని వారికి పరిచయం చేస్తాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని దైవధ్యాన ప్రకరణం)

**185వ అధ్యాయం**

# ١٨٥ ـ بَابُ فَضْلِ الْوُضُوءِ
# వుజూ ఘనత

قَالَ الله تَعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا قُمْتُمْ إِلَى ٱلصَّلَوٰةِ فَٱغْسِلُواْ وُجُوهَكُمْ﴾ إلى قوله تعالى: ﴿مَا يُرِيدُ ٱللَّهُ لِيَجْعَلَ عَلَيْكُم مِّنْ حَرَجٍ وَلَٰكِن يُرِيدُ لِيُطَهِّرَكُمْ وَلِيُتِمَّ نِعْمَتَهُۥ عَلَيْكُمْ لَعَلَّكُمْ تَشْكُرُونَ﴾ [المائدة: ٦].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వసించిన ప్రజలారా! మీరు నమాజ్ కొరకు లేచినప్పుడు మీ ముఖాలను, మోచేతుల సమేతంగా మీ చేతులను ప్రక్షాళనం చేసుకోండి; తలపై చేతులతో రాయండి, కాళ్ళను చీలమండ వరకు కడుక్కోండి. మీరు అపరిశుద్ధులుగా ఉంటే, స్నానం చేసి పరిశుద్ధులు అవ్వండి. మీరు గనక అస్వస్థులయితే లేక ప్రయాణ స్థితిలో ఉంటే లేక మీలో ఎవరయినా కాల కృత్యాలు తీర్చుకొని వస్తే లేక మీరు స్త్రీలను ముట్టుకుంటే, అప్పుడు నీరు లభించని పక్షంలో పరిశుభ్రమైన మట్టితో విధిని నిర్వహించండి; దానిపై చేతులతో కొట్టి మీ ముఖాలపై, చేతులపై రాయండి. మీకు జీవితాన్ని కష్టతరం చేయటం అల్లాహ్ అభిమతం కాదు. కాని ఆయన మిమ్మల్ని పరిశుద్ధం చేయ గోరుతున్నాడు. మీపై తన అనుగ్రహాన్ని పూర్తి చేయగోరు తున్నాడు మీరు కృతజ్ఞులవుతారేమో అని." *(అల్‌మాయిదా-6)*

١٠٢٤ - وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْه قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِنَّ أُمَّتِي يُدْعَوْنَ يَوْمَ القِيامَةِ غُرًّا محجَّلِينَ مِنْ آثَارِ الوضوءِ فَمَنِ اسْتَطَاعَ مِنْكُم أَنْ يُطِيلَ غُرَّتَه، فَلْيَفْعَلْ» متفقٌ عليه.

1024. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: ప్రళయ దినాన నా అనుచర సమాజాన్ని పిలవబడినప్పుడు వారి ముఖాలు, కాళ్ళు, చేతులు వుజూ చిహ్నాలతో తెల్లగా, మహోజ్వలంగా ఉంటాయి. మీలో ఎవరికయినా తమ తేజస్సును పెంచుకునే వీలుకలిగితే వారు (వుజూ అవయవాలను నిర్ణీత భాగంకన్నా అధిక పరిమాణంలో కడిగి) తప్పకుండా పెంచుకోవాలి.

(బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'గుర్ర్' అనే పదం వాడబడింది. ఇది 'అగర్రు' అనే పదానికి బహువచనం. అగర్రు అంటే తెలుపు లేక తేజస్సు గలవాడని అర్థం. నుదురు తెలుపుగా ఉండే గుర్రాలు మొదలగు జంతువుల కోసం ఈ పదాన్ని వాడతారు. ప్రళయ దినాన ముహమ్మదీయ అనుచర సమాజంలోని విశ్వాసుల ముఖాలు, కాళ్ళు, చేతులు వుజూ ప్రభావంతో మెరుస్తూ ఉంటాయి. నుదురు మరియు కాళ్ళు తెలుపుగా ఉండే గుర్రం ఎన్ని గుర్రాల మధ్య ఉన్నప్పటికీ తేలికగా గుర్తించబడినట్లు ప్రళయ దినాన హష్ర్ మైదానంలో ముహమ్మదీయ అనుచర సమాజంలోని విశ్వాసులు ఇతర సమాజాల వారి మధ్య ఎంతో విశిష్టంగా కనిపిస్తారు. దానిక్కారణం వారు వుజూ చేసుకునే అవయవాలు తెల్లగా, మహోజ్వలంగా మెరుస్తూ ఉంటాయి.

రెండో విషయం ఏమిటంటే, ఈ హదీసులో వుజూ అవయవాలను నిర్ణీత భాగాల కన్నా అధిక పరిమాణంలో కడగాలని బోధించటం జరిగింది. ఉదా: చేతుల్ని మోచేతుల వరకు కడిగే బదులు భుజాల వరకు కడగాలి. కాళ్ళను చీలమండల వరకు కడిగేబదులు సగం పిక్కల వరకు లేదా మోకాళ్ళ వరకు కడగాలి. సహాబాలు, తాబయీన్లలో కొందరు, ఇంకా అత్యధికమంది షాఫయీ, హనఫీ ఫికహ్‌వేత్తలు ఈ పద్ధతిని అభిలషణీయమైనదిగా తలపోశారు (ఫత్‌హుల్‌బారీ).

1025. తన ప్రాణమిత్రులయిన దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) గారే తెలియజేశారు: విశ్వాసి శరీరంలో వుజూ నీళ్ళు ఎక్కడి వరకయితే చేరుకుంటాయో (స్వర్గంలో) అతనికి అక్కడి వరకు ఆభరణాలు తొడిగించటం జరుగుతుంది. (ముస్లిం)

١٠٢٥ ـ وعنه قال: سَمِعْتُ خَلِيلي ﷺ يقولُ: «تَبْلُغُ الحِلْيَةُ مِنَ المؤمِن حَيْثُ يَبْلُغُ الوُضوءُ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

1026. హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా ఉత్తమ పద్ధతిలో వుజూ చేస్తే అతని శరీరం నుండి పాపాలు తొలగిపోతాయి. చివరికి అతని గోళ్ళ క్రింద నుండి కూడా పాపాలు తొలగిపోతాయి. (ముస్లిం)

١٠٢٦ ـ وعن عثمانَ بنِ عفَّانَ رضيَ الله عنهُ قالَ: قالَ رسولُ الله ﷺ: «مَنْ تَوَضَّأَ فَأَحْسَنَ الوُضوءَ، خرجَتْ خَطَايَاهُ مِنْ جسَدِهِ حَتى تَخْرُجَ مِنْ تَحْتِ أظفارِهِ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఉత్తమ పద్ధతిలో వుజూ చేయటమంటే సున్నత్ విధానానికి అనుగుణంగా వుజూ చేయటం అని అర్థం. పాపాలు తొలగిపోవటమంటే, పాపాలు క్షమించబడతాయని భావం. ఇక్కడ 'పాపాలు' అంటే చిన్నచిన్న పాపాలని అర్థం. ఎందుకంటే పెద్ద పాపాలు వాటి గురించి పశ్చాత్తాపం చెందనంతవరకు (తౌబా చేసుకోనంతవరకూ) క్షమించబడవు.

1027. హజ్రత్ ఉస్మాన్ (రజి) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) నేను వుజూ చేసినట్లుగానే వుజూ చేస్తుండగా నేను (కళ్ళారా) చూశాను. ఆ తర్వాత ఆయన ఇలా అన్నారు: ఎవరయితే ఈ విధంగా వుజూ చేస్తారో వారి వెనకటి

١٠٢٧ ـ وعنهُ قال: رَأَيْتُ رَسُولَ الله ﷺ تَوَضَّأَ مثلَ وُضوئي هذا ثمَّ قال: «مَنْ تَوَضَّأَ هكذا، غُفِرَ لَهُ مَا تقَدَّمَ مِنْ ذَنبِهِ، وَكانَتْ صَلاتُهُ وَمَشْيُهُ إلى المَسْجِدِ نَافِلَةً» رواه مسلم.

పాపాలన్నీ మన్నించబడతాయి. ఇక ఆ తర్వాత వారు నమాజ్ చేసినందుకు గాను, మస్జిద్‌కు నడచి వెళ్లినందుకు గాను లభించే పుణ్యం అదనం.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వుజూ చేయటం వల్ల చిన్నచిన్న పాపాలన్నీ మన్నించబడతాయి. అయితే ఆ పాపాలు తోటి మానవుల హక్కులకు సంబంధించినవై ఉండకూడదు. ఎందుకంటే అలాంటి పాపాలు కూడా తౌబా చేయనంత వరకు లేదా హక్కుల్ని నెరవేర్చనంతవరకు క్షమార్హం కావు. మొత్తానికి మస్జిద్‌కు వెళ్ళాలనుకున్నప్పుడు ఇంటి దగ్గరే వుజూ చేసుకొని వెళ్ళటం గొప్ప సత్కార్యం. అలా చేస్తే పూర్వం తమ వల్ల జరిగిన చిన్నచిన్న పాపాలన్నీ క్షమించబడతాయి. ఇక ఆ తర్వాత మస్జిద్‌కు నడచి వెళ్ళినందుకు, అక్కడ నమాజ్ చేసినందుకు అదనంగా పుణ్యం లభిస్తుంది. పరలోకపు అంతస్తులు పెరుగుతాయి.

1028. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ముస్లిం లేక విశ్వాసి అయిన దాసుడు వుజూ చేస్తూ ముఖం కడుక్కున్నప్పుడు, ఆ నీళ్ళతో పాటు లేక ఆ నీటి చివరి బొట్టుతో పాటు తను కళ్ళతో చేసిన పాపాలన్నీ కొట్టుకుపోతాయి. తరువాత చేతులు కడుక్కున్నప్పుడు ఆ నీళ్ళతోపాటు లేక నీటి చివరి బొట్టుతోపాటు తన చేతులు చేసిన పాపాలన్నీ కొట్టుకుపోతాయి. ఇంకా అతను కాళ్ళు కడుక్కున్నప్పుడు నీళ్ళతోపాటు లేక నీటి ఆఖరి బొట్టుతో పాటు తన కాళ్ళతో నడిచి చేసిన పాపాలన్నీ కొట్టుకుపోతాయి. ఆ విధంగా

١٠٢٨ ـ وعن أَبي هريرةَ رَضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ قال: «إذا تَوَضَّأَ العَبْدُ المُسْلِمُ ـ أوِ المُؤْمِنُ ـ فَغَسَلَ وَجهَهُ، خَرَجَ مِنْ وَجهِهِ كلُّ خَطِيئةٍ نَظَرَ إليْها بِعَيْنَيْهِ مَعَ الماءِ، أَوْ معَ آخِرِ قَطْرِ الماءِ، فإذا غَسَلَ يَدَيْهِ، خَرَجَ مِنْ يَدَيهِ كُلُّ خَطيئةٍ كانَ بَطَشَتْها يَدَاهُ مَعَ الماءِ، أَوْ مَعَ آخِرِ قَطْرِ الماءِ، فإذا غَسَلَ رِجلَيْهِ، خَرَجَتْ كُلُّ خَطِيئةٍ مَشَتْها رِجلاه مَعَ الماءِ، أَوْ مَعَ آخِرِ قَطْرِ الماءِ، حَتى يَخرُجَ نَقِياً مِنَ الذُّنُوبِ» رواه مسلم.

అతను పాపాల నుండి పూర్తిగా పరిశుద్ధుడైపోతాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

1029. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) శ్మశానానికి వెళ్ళి, "మోమిన్ ఇంటి వారలారా! మీకు శాంతి కల్గుగాక! దైవం తలిస్తే మేము కూడా మిమ్మల్ని కలుసుకుంటాం. నాకు మా సోదరుల్ని చూడాలని ఉంది" అని అన్నారు.

అదివిని సహచరులు ఆశ్చర్యపోతూ, "దైవప్రవక్తా! మేము తమరి సోదరులం కామా?" అని అడిగారు. అందు కాయన "మీరు నా సహచరులు. సోదరులంటే ఇప్పటి వరకు పుట్టని వారని అర్థం" అని అన్నారు. "దైవప్రవక్తా! మీ అనుచర సమాజంలో ఇంకా పుట్టనివారిని తమరు ఎలా గుర్తుపట్టగలరు?" అని అడిగారు సహచరులు. అందుకు దైవప్రవక్త, "ఒక వ్యక్తి దగ్గర నుదురు, కాళ్ళు తెలుపు రంగులో ఉండే గుర్రాలుండి, అవి ముదురు నలుపురంగు గుర్రాల్లో కలిసిపోతే అతను తన గుర్రాల్ని గుర్తు పట్టలేడా చెప్పండి?" అన్నారు. దానికి సహచరులు, "గుర్తుపట్టగలడు" అని సమాధానమిచ్చారు. అప్పుడు దైవ ప్రవక్త ఇలా అన్నారు: (నా తదనంతరం

١٠٢٩ ـ وعَنْهُ أنَّ رَسُولَ اللهِ ﷺ أتَى المقبُرَةَ فَقالَ: «السَّلامُ عَلَيْكُمْ دَارَ قَوْمٍ مُؤْمِنِينَ، وَإنَّا إنْ شَاءَ اللهُ بِكُمْ لاحِقُونَ وَدِدْتُ أنَّا قَدْ رَأيْنَا إخْوَانَنَا» قالُوا: أوَ لَسْنَا إخْوانَكَ يَا رَسُولَ اللهِ؟ قَالَ: «أنْتُمْ أصْحَابِي، وَإخْوانُنا: الَّذِينَ لَمْ يَأتُوا بَعْدُ» قَالُوا: كَيْفَ تَعْرِفُ مَنْ لَمْ يَأْتِ بَعْدُ مِنْ أُمَّتِكَ يَا رَسُولَ اللهِ؟ فَقالَ: «أرَأيْتَ لَوْ أنَّ رَجُلاً لَهُ خَيْلٌ غُرٌّ مُحَجَّلَةٌ بَيْنَ ظَهْرَيْ خَيْلٍ دُهْمٍ بُهْمٍ، ألا يَعْرِفُ خَيْلَهُ؟» قَالُوا: بَلَى يا رَسُولَ اللهِ! قَالَ: «فَإنَّهُمْ يَأْتُونَ غُرًّا مُحَجَّلِينَ مِنَ الوُضُوءِ، وَأنَا فَرَطُهُمْ عَلَى الحَوْضِ» رواه مسلم.

వచ్చే నా అనుచరుల సంగతి కూడా అంతే). ప్రళయ దినాన వారు (హష్ర్ మైదానానికి) వచ్చినప్పుడు వారి ముఖాలు, కాళ్ళు, చేతులు వుజూ ప్రభావం మూలంగా మెరుస్తూ ఉంటాయి. నేను వారందరికంటే ముందు (కౌసర్) సరస్సు దగ్గర ఉంటాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"ఇన్నమల్ మూమినూన ఇఖ్వహ్" అన్న దివ్యఖుర్ఆన్ సూక్తి ప్రాతిపదికగా దైవప్రవక్త (సల్లం) తన తదనంతరం పుట్టబోయే వారినందరినీ తన సోదరులుగా పేర్కొన్నారు. ఈ విషయంలో ఆయన హయాంలో జీవించివున్న అనుచరులకు ఒకింత అధిక ప్రాధాన్యత లభిస్తుంది. ఎందుకంటే వారు దైవప్రవక్త సోదరులే కాదు; ఆయన సహచరులు కూడా.

ప్రళయ దినాన దైవప్రవక్త (సల్లం) కు ప్రసాదించబడే సరస్సు గురించి కూడా ఈ హదీసులో ప్రస్తావించటం జరిగింది. ఆయన తన అనుచర సమాజానికి ఆ సరస్సు నీళ్ళు త్రాపిస్తారు. ఒకసారి ఆ నీళ్ళు త్రాగిన తర్వాత ఇక వారికి దాహమే వేయదు. అయితే ధర్మంలో కొత్తపోకడల్ని లేవనెత్తేవారు మాత్రం ఆ భాగ్యానికి నోచుకోలేరని ఇతర హదీసులు ఉద్ఘాటిస్తున్నాయి. ఈ హదీసులో 'ఫర్తు' అనే పదం వాడబడింది. ఫర్తు అంటే ముందుగా గమ్యానికి చేరుకొని తన వెనుక వస్తున్న ప్రయాణ బృందానికి అవసరమైన ఏర్పాట్లు చేసే వాడని అర్థం. ముహమ్మదీయ అనుచర సమాజానికి ఫర్తు, స్వయంగా వారి ప్రవక్త కావటం నిజంగా వారి అదృష్టం!

١٠٣٠ ـ وعَنْـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ قَالَ: «أَلا أَدُلُّكُمْ عَلى ما يَمْحُو اللهُ بِهِ الخَطَايَا، وَيَرْفَعُ بِهِ الدَّرَجَاتِ؟» قَالُوا: بَلى يا رَسُولَ اللهِ! قَالَ: «إِسْبَاغُ الوُضوءِ عَلى

1030. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన సహచరులనుద్దేశ్యించి, "దైవం (మానవుల) పాపాలను ప్రక్షాళనం చేసి, (వారి) అంతస్తులను పెంచేందుకు దోహదపడే విషయాలు ఏమిటో నేను మీకు చెప్పనా?" అని

الْمَكَارِهِ، وَكَثْرَةُ الْخُطَا إِلَى الْمَسَاجِدِ، وَانْتِظَارُ الصَّلاةِ بَعْدَ الصَّلاةِ؛ فَذٰلِكُمُ الرِّبَاطُ فَذٰلِكُمُ الرِّبَاطُ» رواه مسلم.

అడగ్గా, దానికి ఆయన సహచరులు, "తప్పకుండా చెప్పండి దైవప్రవక్తా" అని విన్నవించుకున్నారు. అప్పుడాయన ఇలా చెప్పారు: "కష్టమనిపించినప్పటికీ బాగా వుజూ చేయటం, మస్జిద్‌ల వైపు ఎక్కువ అడుగులు వేయటం (అంటే దూరం నుంచి రావటం), ఒక నమాజు ముగిసిన పిదప తరువాతి నమాజు కోసం ఎదురు చూడటం. ఇదే రిబాతు! ఇదే రిబాతు!!" (ముస్లిం)

(ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

'రిబాతు' అంటే సరిహద్దుపై కాపలా కాయటం, శత్రువు లోపలికి జొరబడకుండా రేయింబవళ్లు ఒకేచోట కూర్చొని పర్యవేక్షిస్తూ ఉండటం అని అర్థం. నమాజ్ చేసే వ్యక్తి ఎడతెరిపిలేకుండా తన మనసును దైవధ్యానం, దైవారాధన యందే లగ్నం చేసుకొని షైతాన్ దాన్ని లోబరచుకోకుండా కాపాడుకుంటాడు. కనుక ఒక నమాజ్ తర్వాత రెండో నమాజ్ కోసం నిరీక్షించటం రిబాత్ (సరిహద్దుపై కాపలా కాయటం) లాంటిదని చెప్పబడింది. ఈ హదీసు ఇంతకు ముందు కూడా వచ్చింది.

١٠٣١ - وعَنْ أَبِي مَالِكٍ الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «الطُّهُورُ شَطْرُ الإِيمَانِ» رواه مسلم.

1031. హజ్రత్ అబూ మాలిక్ అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పరిశుభ్రత సగం విశ్వాసం (ఈమాన్)కు సమానం. (ముస్లిం)

وقد سبقَ بطولِهِ في بابِ الصبرِ.

ఈ హదీసు ఇంతకు ముందు 'సహనం' అధ్యాయంలో సుదీర్ఘంగా వచ్చింది.

وفي الباب حديثُ عمرِو بْنِ عَبَسَةَ رَضِيَ اللهُ عَنْهُ السَّابِقُ في آخِرِ بَابِ الرَّجاءِ

ఇంతకు ముందు 'ఆశాభావం' అధ్యాయం చివర్లో వచ్చిన అమ్ర్ బిన్ అబసా(రజి) హదీసు ఈ అధ్యాయానికి

وَهُوَ حَدِيثٌ عظيمٌ مُشْتَمِلٌ عَلى جُمَلٍ من الخيرات.

కూడా వర్తిస్తుంది. అది చాలా ముఖ్యమైన హదీసు. అందులో ఎన్నో సత్కార్యాలను ప్రస్తావించటం జరిగింది.

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

'తుహూర్' అంటే పరిశుభ్రత అని భావం. నమాజ్ నెరవేరటానికి పరిశుభ్రత చాలా అవసరం. అశుద్ధావస్థలో నమాజ్ చేయటానికి కనీసం అనుమతి కూడా లేదు. పరిశుభ్రతే సగం విశ్వాసం (ఈమాన్) తో సమానమని చెప్పటం ద్వారా పరిశుభ్రత యొక్క ప్రాధాన్యత వెల్లడౌతోంది.

١٠٣٢ - وَعَنْ عُمَرَ بْنِ الخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَا مِنْكُمْ مِنْ أَحَدٍ يَتَوَضَّأُ فَيُبْلِغُ - أَوْ فَيُسْبِغُ الوُضُوءَ - ثُمَّ قَالَ: أَشْهَدُ أَنْ لا إلهَ إلَّا الله وَحْدَه لا شَرِيكَ لهُ، وَأَشْهَدُ أَنَّ مُحَمَّداً عَبْدُهُ وَرَسُولُه؛ إلَّا فُتِحَتْ لَهُ أَبْوابُ الجَنَّةِ الثَّمَانِيَةُ يَدْخُلُ مِنْ أَيِّها شاء» رواه مسلم.

1032. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా బాగా వుజూ చేసి, ఆ తర్వాత **అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లాషరీక లహూ, వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహూ"** (అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. ఆయన ఒక్కడే. ఆయనకు భాగస్వాములు మరెవరూ లేరు. ముహమ్మద్ (సల్లం) అల్లాహ్ దాసుడు మరియు అల్లాహ్ యొక్క ప్రవక్త అని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను) అని పలికితే అతని కోసం ఎనిమిది స్వర్గద్వారాలూ తెరువబడతాయి. అతను తాను కోరిన ద్వారం గుండా లోనికి వెళ్ళవచ్చు. (ముస్లిం)

وَزَادَ التِّرمِذِي: «اللَّهُمَّ اجْعَلْنِي مِنَ التَّوَّابِينَ وَاجْعَلْني مِنَ المُتَطَهِّرِينَ».

తిర్మిజీలో ఈ వాక్యాలు అదనంగా ఉన్నాయి: **అల్లాహుమ్మజ్ అల్నీ మినత్తవ్వాబీన వజ్అల్నీ మినల్ ముతతహ్హిరీన్** (ఓ అల్లాహ్! నన్ను ఎక్కువగా

పశ్చాత్తాపపడేవానిగా చెయ్యి. ఇంకా
నన్ను ఎక్కువగా పరిశుద్ధతను పాటించే
వానిగా చెయ్యి).

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం- సుననె తిర్మిజీలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'తవ్వాబ్' అంటే అతి ఎక్కువగా పశ్చాత్తాపపడేవారని, దైవం వైపునకు మరలేవారని అర్థం. అదే విధంగా అతి ఎక్కువగా పరిశుభ్రతను పాటించేవారంటే పాపాలకు, అవిధేయతలకు దూరంగా ఉండి ఆధ్యాత్మిక పరిశుభ్రతను పొందేవారని భావం.



**186వ అధ్యాయం**

## ١٨٦ ـ بَابُ فَضْلِ الأَذَانِ
## అజాన్ ఘనత

١٠٣٣ ـ عَنْ أَبي هُرَيْرَةَ رَضيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَوْ يَعْلَمُ النَّاسُ ما في النِّدَاءِ والصَّفِّ الأَوَّلِ، ثُمَّ لَمْ يَجِدُوا إلَّا أَنْ يَسْتَهِموا عَلَيْهِ لاسْتَهَمُوا عَلَيْهِ، وَلَوْ يَعْلَمُونَ ما في التَّهْجِيرِ لَاسْتَبَقُوا إلَيْهِ، وَلَوْ يَعْلَمُونَ ما في العَتَمَةِ والصُّبْحِ لَأَتَوْهُمَا وَلَوْ حَبْواً» متفقٌ عليه. «الاسْتِهَامُ»: الاقْتِراعُ، وَ«التَّهْجِيرُ»: التَّبْكِيرُ إلى الصَّلاةِ.

1033. హ|జత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ చెప్ప టానికి, తొలి పంక్తిలో చేరటానికి ఎంతటి ఘనత ఉందో ప్రజలకు గనక తెలిస్తే, ఆ ఘనతను పొందటానికి పరస్పరం లాటరీ వేసుకోవటం తప్ప గత్యంతరం లేదని తెలిస్తే, వారు తప్ప కుండా లాటరీ వేసుకుంటారు. అలాగే నమాజ్‌కు వేళకాగానే తొలి సమ యంలో (మస్జిదుకు) రావటానికి ఎంతటి ఘనత ఉందో తెలిస్తే, వారు పరుగెత్తుకుంటూ మరీ వస్తారు. అదే విధంగా ఇషా, ఫజ్ర్ (సామూహిక) నమాజులకు ఎంతటి ఘనత ఉందో తెలిస్తే, వాటి కోసం కాళ్ళీడ్చుకుంటూ రావలసి వచ్చినా సరే వారు తప్పకుండా (మస్జిద్‌కు) వస్తారు. (బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

١٠٣٤ ـ وَعَنْ مُعَاوِيَةَ رَضيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «المُؤَذِّنُونَ أَطْوَلُ النَّاسِ أَعْنَاقاً يَوْمَ القِيامَةِ» رواه مسلم.

1034. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హ|జత్ ముఆవియా (రజి) తెలియజేశారు: అజాన్ చెప్పేవారి మెడలు ప్రళయ

దినాన అందరికంటే పొడుగ్గా ఉంటాయి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)

**ముఖ్యాంశాలు:**

ఈ హదీసు ద్వారా అజాన్ యొక్క ప్రాముఖ్యత వెల్లడౌతోంది. దైవారాధన వైపునకు, సాఫల్య మార్గం వైపునకు ఆహ్వానించే కొన్ని పలుకుల సముదాయాన్ని 'అజాన్' అంటారు. అజాన్ చెప్పేవానిని 'ముఅజ్జిన్' అంటారు. అలాంటి ముఅజ్జిన్ యొక్క అజాన్ విని ఎంత మంది అయితే, నమాజ్ కోసం వస్తారో వారందరి నమాజుల పుణ్యం ముఅజ్జిన్‌కు కూడా లభిస్తుంది. ఎందుకంటే దైవప్రవక్త (సల్లం) '**మన్ దల్ల అలా ఖైరిన్ ఫలహూ మిస్‌లు అజ్రి ఫాయిలిహీ**' అన్నారు. అంటే మంచిపని వైపునకు మార్గదర్శకత్వం వహించేవారికి కూడా దాన్ని ఆచరించేవారికి సమానంగా పుణ్యం లభిస్తుందని భావం. అజాన్ చెప్పేవారు హష్ర్ మైదానంలో మానవులందరిలో విశిష్టమైనవారుగా కనిపిస్తుంటారు.

١٠٣٥ ـ وَعَنْ عَبْدِ اللهِ بْنِ عَبْدِ الرَّحْمٰنِ بْنِ أَبِي صَعْصَعَةَ أَنَّ أَبَا سَعِيدٍ الْخُدْرِيَّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ لَهُ: إِنِّي أَرَاكَ تُحِبُّ الْغَنَمَ وَالْبَادِيَةَ فَإِذا كُنْتَ فِي غَنَمِكَ أَوْ بَادِيَتِكَ فَأَذَّنْتَ لِلصَّلاةِ، فَارْفَعْ صَوْتَكَ بِالنِّدَاءِ، فَإِنَّهُ «لا يَسْمَعُ مَدَى صَوْتِ الْمُؤَذِّنِ جِنٌّ، وَلا إِنْسٌ، وَلاشَيْءٌ إِلَّا شَهِدَ لَهُ يَوْمَ الْقِيَامَةِ» قال أبو سعيد: سَمِعْتُهُ مِنْ رَسُولِ اللهِ ﷺ. رواه البخاري.

1035. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) తనతో ఇలా అన్నారని అబ్దుల్లాహ్ బిన్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూ సాసఅ చెప్పారు: నీకు మేకలు, పొలాలంటే యిష్టమనుకుంటాను. ఏది ఏమైనా నువ్వు మేకల మధ్యగాని, పొలాల్లోగాని ఉన్నప్పుడు నమాజ్ కోసం అజాన్ చెప్పదలిస్తే బిగ్గరగా చెప్పు. ఎందుకంటే ముఅజ్జిన్ గొంతు ఎక్కడివరకయితే వినిపిస్తుందో దాని పరిధిలోని జిన్నాతులు, మానవులు, ఇంకా ఇతర వస్తువులన్నీ ప్రళయదినాన అతనికి అనుకూలంగా సాక్ష్యం పలుకుతాయి.

తను ఈ విషయం దైవప్రవక్త (సల్లం) ద్వారా విన్నానని హజ్రత్ అబూ సయీద్ (రజి) చెప్పారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇతర వస్తువులన్నీ అంటే జంతువులు, వృక్షాలు మొదలగునవి అని అర్థం. ప్రళయ దినాన దేవుడు వాటికి కూడా మాట్లాడే శక్తిని ప్రసాదిస్తాడు. దాని మూలంగా అవి మానవుల, జిన్నాతుల మాదిరిగా ముఅజ్జిన్‌కు అనుకూలంగా సాక్ష్యం చెబుతాయి. ఈ హదీసు ద్వారా కూడా అజాన్ మరియు ముఅజ్జిన్‌ల ఘనతా విశిష్టతలు వెల్లడౌతున్నాయి.

١٠٣٦ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذَا نُودِيَ بِالصَّلَاةِ، أَدْبَرَ الشَّيْطَانُ، لَهُ ضُرَاطٌ حَتَّى لَا يَسْمَعَ التَّأْذِينَ، فَإِذَا قُضِيَ النِّدَاءُ أَقْبَلَ، حَتَّى إِذَا ثُوِّبَ لِلصَّلَاةِ أَدْبَرَ، حَتَّى إِذَا قُضِيَ التَّثْوِيبُ أَقْبَلَ، حَتَّى يَخْطِرَ بَيْنَ الْمَرْءِ وَنَفْسِهِ يَقُولُ: اذْكُرْ كَذَا، وَاذْكُرْ كَذَا ـ لِمَا لَمْ يَذْكُرْ مِنْ قَبْلُ ـ حَتَّى يَظَلَّ الرَّجُلُ مَا يَدْرِي كَمْ صَلَّى» متفقٌ عليه.

«التَّثْوِيبُ»: الإِقَامَةُ.

1036. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ చెప్ప బడినప్పుడు షైతాన్ ఆ శబ్దం వినకూడదని తలచి, వెనక్కి తిరిగి పలాయనం చిత్తగిస్తాడు. ఆ సమయంలో (భయంతో) వాడికి అపానవాయువు కూడా వెలువడుతుంది. అయితే అజాన్ చెప్పటం అయిపోగానే వాడు మళ్ళీ తిరిగొస్తాడు. ఆ తర్వాత ఇఖామత్ చెప్పటం ప్రారంభించగానే తిరిగి వెన్నుచూపి పారిపోతాడు. ఇఖామత్ చెప్పటం అయిపోగానే తిరిగొచ్చి మనిషి మనసులో దురాలోచనలు రేకెత్తిస్తాడు. మనిషికి అంతకు ముందు గుర్తులేని విషయాలను (నమాజ్‌లో ఉండగా) గుర్తు చేస్తూ, "ఇది జ్ఞాపకం తెచ్చుకో, అది జ్ఞాపకం తెచ్చుకో" అంటాడు. (ఆ దురాలోచనల మూలంగా) మనిషికి తాను ఎన్ని రకాతులు చేశానన్న సంగతి కూడా గుర్తుకు రాదు. (బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

١٠٣٧ ـ وَعَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرِو بْنِ العَـاصِ رَضِـيَ اللهُ عَنْهُمـا أنـه سَمِـعَ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إذَا سَمِعْتُمُ النِّدَاءَ فَقُولُوا مِثْلَ مَا يَقُولُ، ثُمَّ صَلُّوا عَلَيَّ، فَإنَّهُ مَنْ صَلَّى عَلَيَّ صَلاةً صَلَّى اللهُ عَلَيْهِ بِهَا عَشْراً،

1037. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తెలియజేశారు: మీరు అజాన్ విన్నప్పుడు, ముఅజ్జిన్ ఏ విధంగా పలుకుతాడో ఆ విధంగా మీరు కూడా పలకండి. ఆ తర్వాత నా కొరకు దరూద్ పఠించండి. ఎవరయినా నా కొరకు ఒకసారి దరూద్ పఠిస్తే, దేవుడు వారి మీద పదిసార్లు కారుణ్యవర్షం కురిపిస్తాడు.

ثُمَّ سَلُوا اللهَ لِي الوَسِيلَةَ، فَإنَّهَا مَنْزِلَةٌ في الجَنَّةِ لا تَنْبَغِي إلَّا لِعَبْدٍ مِنْ عِبَادِ اللهِ وَأَرْجُو أنْ أَكُونَ أنَا هُوَ، فَمَنْ سَأَلَ لِيَ الْوَسِيلَةَ حَلَّتْ لَهُ الشَّفَاعَةُ» رواه مسلم.

దరూద్ పఠించిన తర్వాత నాకు 'వసీలా' లభించాలని దైవాన్ని అర్థించండి. నిస్సందేహంగా 'వసీలా' అనేది స్వర్గంలో ఒక ఉన్నత స్థానం. దేవుని దాసుల్లో ఒకే ఒక్కడు మాత్రమే దానికి యోగ్యుడు-ఆ ఒక్కణ్ణి నేనే అవుతానని ఆశిస్తున్నాను. కనుక ఎవరయితే నాకు వసీలా లభించాలని కోరుకుంటారో వారికి తప్పకుండా నా సిఫారసు సమ్మతించబడుతుంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుడు, ప్రవక్తపై దరూద్ పంపిస్తాడంటే ఆయనపై తన కారుణ్యాన్ని కురిపిస్తాడని అర్థం. అదే దైవదూతలు దరూద్ పంపుతారంటే మన్నింపుకోసం వేడుకుంటారని భావం. మానవులు దరూద్ పంపిస్తారంటే శ్రేయస్సు కోసం ప్రార్థిస్తారని భావం. నిఘంటువు ప్రకారం వసీలా అంటే సామీప్యం అని అర్థం. లక్ష్యసాధనలో ఉపయోగపడే సాధనాన్ని 'వసీలా' అని చెప్పవచ్చు. కాని ఇక్కడ వసీలా అంటే స్వర్గంలో ఒక మహోన్నత స్థానం. అది దైవప్రవక్త (సల్లం)కు మాత్రమే ప్రసాదించబడుతుంది.

సిఫారసు అంటే ఒకరి తప్పుల్ని, పొరపాట్లను మన్నించమనీ లేదా వారికి మంచి చేయమని మరొకర్ని అర్థించటం. హదీసు పరిభాషలో సిఫారసు అంటే దైవప్రవక్త (సల్లం)కు

లభించనున్న ఒక హక్కు. దాని ఆధారంగా ఆయన దేవుడు తలచిన వారి మన్నింపు కొరకు ప్రార్థిస్తారు.

అజాన్ వినేవారు దానికి జవాబుగా ముఅజ్జిన్ పలికే పలుకుల్నే ఉచ్చరించాలి. అయితే హయ్యి అలస్సలాహ్ మరియు హయ్యఅలల్ ఫలాహ్‌కు జవాబుగా మాత్రం "లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్" అని పలకాలి. అజాన్ పూర్తయిన తర్వాత దైవప్రవక్త(సల్లం) కొరకు దరూద్ పఠించాలి. ఆయనకు 'వసీలా' స్థానం లభించాలని ప్రార్థించాలి. అలా చేసేవారి కొరకు ప్రళయదినాన దైవప్రవక్త (సల్లం) సిఫారసు అనివార్యమవుతుంది. అయితే వారు ఏకదైవారాధకులుగా తనువు చాలించినవారై ఉండాలి. అధముల ప్రార్థనల మూలంగా ఉత్తములకు ప్రయోజనం కలుగుతుందని కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

١٠٣٨ - وَعَنْ أَبِي سَعِيدٍ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِذَا سَمِعْتُمُ النِّدَاءَ، فَقُولُوا كَمَا يَقُولُ المُؤَذِّنُ» متفقٌ عليه.

1038. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ విన్నప్పుడు ముఅజ్జిన్ పలికే పలుకుల్నే మీరూ పలకండి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

١٠٣٩ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ قَالَ حِينَ يَسْمَعُ النِّدَاءَ: اللَّهُمَّ! رَبَّ هٰذِهِ الدَّعْوَةِ التَّامَّةِ، وَالصَّلاةِ القَائِمَةِ، آتِ مُحَمَّداً الوَسِيلَةَ، وَالفَضِيلَةَ وَابْعَثْهُ مَقَاماً مَحْمُوداً الَّذِي وَعَدْتَهُ، حَلَّتْ لَهُ شَفَاعَتِي يَوْمَ القِيَامَةِ». رواه البخاري.

1039. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ విన్న తర్వాత ఈ విధంగా పఠించేవారి కొరకు నా సిఫారసు అనివార్యమవుతుంది. **(అల్లాహుమ్మ రబ్బహాజిహిద్దా వతిత్తామ్మా.....)** అనువాదం: ఓ అల్లాహ్! ఈ పరిపూర్ణ ఆహ్వానానికి, జరగబోయే నమాజ్‌కు అధిపతీ! ముహమ్మద్ (సల్లం)కు 'వసీలా' మరియు ఘనతను ప్రసాదించు. నీవు ఆయనకు చేసిన వాగ్దానం ప్రకారం ఆయన్ని 'మహ్మూద్' స్థానంపై ప్రతిష్ఠింపజెయ్యి. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'ఆహ్వానం' అంటే అజాన్ పలుకులని అర్థం. 'పరిపూర్ణమైనది' అంటే ప్రళయం

వరకు ఎలాంటి మార్పులకు, చేర్పులకు ఆస్కారం లేనిదనీ లేక దోషాలకు అతీతమైనదని భావం. అజాన్ అనేది ఇస్లామీయ విశ్వాసాల సమగ్ర రూపం. జరగబోయే నమాజ్ అంటే- ప్రస్తుతం చెప్పబడిన అజాన్ తర్వాత జరగబోయే నమాజ్ కావచ్చు. లేదా ఈ నమాజ్ ప్రళయం వరకు నిలిచి ఉంటుందనే భావమైనా కావచ్చు. ఇందులో వసీలా ప్రార్థన యొక్క ఘనత ప్రస్తావించబడింది. అయితే వసీలా ప్రార్థనను అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ హదీసులో వివరించబడినట్లుగా ప్రార్థించాలి. అంటే ముందుగా అజాన్ పలుకులకు సమాధానం చెప్పాలి. తర్వాత దరూద్ పఠించాలి. ఆ తర్వాత వసీలా ప్రార్థన చేయాలి.

١٠٤٠ ـ وَعَنْ سَعْدِ بْنِ أَبي وَقَّاص رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبيِّ ﷺ أَنَّهُ قَالَ: «مَنْ قَالَ حِينَ يَسْمَعُ المُؤَذِّنَ: أَشْهَدُ أَنْ لا إِلٰهَ إِلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، وَأَنَّ مُحَمَّداً عَبْدُهُ وَرَسُولُهُ، رَضِيتُ باللهِ رَبًّا، وَبِمُحَمَّدٍ رَسُولًا، وَبِالإِسْلامِ دِيناً، غُفِرَ لَهُ ذَنْبُهُ». رواه مسلم.

1040. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ విన్న తర్వాత ఈ విధంగా పలికేవారి పాపాలు మన్నించబడతాయి: (**అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ....**) అనువాదం: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. ఆయన ఒక్కడే. ఆయనకు సహవర్తులు ఎవరూ లేరు. ఇంకా ముహమ్మద్ (సల్లం) ఆయన దాసులనీ, ప్రవక్త అని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను. అల్లాహ్‌ను ప్రభువుగా, ముహమ్మద్‌ను ప్రవక్తగా, ఇస్లాంను ధర్మంగా సంతోషంతో అంగీకరిస్తున్నాను. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

١٠٤١ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «الدُّعَاءُ لا يُرَدُّ بَيْنَ الأَذَانِ وَالإِقَامَةِ». رواه أبو داود، والترمذي وقال: حديث حسن.

1041. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ మరియు ఇఖామత్‌ల మధ్య చేయబడే ప్రార్థన త్రోసిపుచ్చబడదు.

*(అబూదావూద్, తిర్మిజీ- హసన్)*

*(సునన్ అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం-సునన్ తిర్మిజీలోని నమాజ్ అధ్యాయం)*

**187వ అధ్యాయం**

## ١٨٧ ـ بَابُ فَضْلِ الصَّلَوَاتِ

## నమాజుల ఘనత

قَالَ اللهُ تَعالى: ﴿إِنَّ الصَّلَوٰةَ تَنْهَىٰ عَنِ الْفَحْشَآءِ وَالْمُنكَرِ﴾[العنكبوت: ٤٥].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"నిశ్చయంగా నమాజు అశ్లీల కార్యాల నుండి, చెడు పనుల నుండి నిరోధిస్తుంది."

*(అల్ అన్‌కబూత్: 45)*

### వివరణ

నమాజును తగురీతిలో, దైవప్రవక్త విధానానికి అనుగుణంగా అత్యంత భక్తిశ్రద్ధలతో నెరవేర్చేవారికి మాత్రమే ఆ ప్రయోజనం లభిస్తుంది. అలాగాకుండా కాకి పొడుపులు పొడిచినట్లు, ఏదో మొక్కుబడిగా చేసే నమాజు అసలు నమాజే కాదు. దాని వల్ల మనిషిలో ఎలాంటి మార్పూ రాదు. అందుకే నమాజ్‌ను పూర్తి భక్తిశ్రద్ధలతో నెరవేర్చాలి.

١٠٤٢ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «أَرَأَيْتُمْ لَوْ أَنَّ نَهْراً بِبَابِ أَحَدِكم يَغْتَسِلُ منه كُلَّ يَوْمٍ خَمْسَ مَرَّاتٍ، هَلْ يَبْقَى مِنْ دَرَنِهِ شَيْءٌ؟» قَالُوا: لا يَبْقَى مِنْ دَرَنِهِ شَيْءٌ؛ قَالَ: «فَذٰلِكَ مَثَلُ الصَّلَوَاتِ الخَمْسِ، يَمْحُو اللهُ بِهِنَّ الخَطَايَا» متفقٌ عليه.

1042. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: మీలో ఎవరి ఇంటి ముందైనా ఒక సెలయేరు ఉండి, అందులో అతను ప్రతి రోజూ ఐదుసార్లు స్నానం చేస్తూ ఉంటే అతని ఒంటిపై మురికి, మాలిన్యాలు మిగిలి ఉంటాయా చెప్పండి?" అని అడిగారు దైవప్రవక్త (సల్లం). దానికి సహచరులు, "ఎలాంటి మురికి, మాలిన్యాలు మిగిలి ఉండవండీ?" అని సమాధానమిచ్చారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "ఐదుపూటల నమాజు సంగతి కూడా

అంతే. అల్లాహ్ వాటి మూలంగా పాపా
లను మన్నిస్తాడు." (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనాస్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఐదుపూటల నమాజ్ ఘనత, వాటిని నెరవేర్చటం వల్ల కలిగే ప్రయోజనాలు వివరించబడ్డాయి. ప్రతి రోజూ ఐదుపూటల నమాజ్ చేస్తే మనిషి వల్ల జరిగే చిన్నచిన్న పాపాలన్నీ మన్నించబడతాయి. అయితే నియమనిబద్ధంగా, భక్తిశ్రద్ధలతో చేసే నమాజ్ వల్లే ఇలా జరుగుతుందన్న విషయాన్ని మర్చిపోకూడదు. తమకు నచ్చిన విధంగా, తమకిష్టం వచ్చినట్లు చేసే నమాజు వల్ల ఏ పాపం మన్నించబడదు.

١٠٤٣ ـ وَعَنْ جَابِرٍ رَضِيَ الله عَنْه قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَثَلُ الصَّلَوَاتِ الخَمْسِ كَمَثَلِ نَهْرٍ جَارٍ غَمْرٍ على بَابِ أَحَدِكُمْ يَغْتَسِلُ مِنْهُ كُلَّ يَوْمٍ خَمْسَ مَرَّاتٍ» رواه مسلم. «الغَمْرُ» بفتحِ الغينِ المعجمةِ: الكثيرُ.

1043. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఐదుపూటలా నమాజ్ చేయటం మీలో ఒకరి ఇంటిముందు నిండుగా ప్రవహిస్తున్న సెలయేటిలో, రోజూ ఐదుపూటల స్నానం చేయటం లాంటిది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

١٠٤٤ ـ وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَجُلاً أَصَابَ مِنِ امْرَأَةٍ قُبْلَةً، فَأَتَى النَّبِيَّ ﷺ فَأَخْبَرَهُ فَأَنْزَلَ اللهُ تعالى: ﴿وَأَقِمِ ٱلصَّلَوٰةَ طَرَفَيِ ٱلنَّهَارِ وَزُلَفًا مِّنَ ٱلَّيْلِ إِنَّ ٱلْحَسَنَٰتِ يُذْهِبْنَ ٱلسَّيِّـَٔاتِ﴾ فقالَ الرَّجُلُ: أَلِيَ هذا؟ قال: «لِجَمِيعِ أُمَّتِي كلِّهِمْ» متفقٌ عليه.

1044. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం: ఒకతను ఓ స్త్రీని ముద్దాడాడు. ఆ తర్వాత అతను (పాపభీతితో) దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి తను చేసిన తప్పుని గురించి చెప్పుకున్నాడు. అప్పుడు "నమాజును స్థాపించు, పగటి యొక్క రెండు సరిహద్దు సమయాల లోనూ, కొంత రాత్రి గడచిన తరువాతనూ. నిస్సందేహంగా సత్కార్యాలు దుష్కార్యాలను దూరం చేస్తాయి" అనే ఆయతు అవతరించింది. ఆ తర్వాత

అతను "ఈ ఆయతులోని ఆదేశం నా కొక్కడికేనా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "నా అనుచర సమాజంలోని వారందరికీ" అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

పగటి యొక్క రెండు సరిహద్దు సమయాలలో నమాజ్ స్థాపించటమంటే, ఫజ్ర్ మరియు మగ్రిబ్ నమాజులు కావచ్చు. కొంతమంది దానిభావం కేవలం ఇషా నమాజు అనీ, మరికొంతమంది మగ్రిబ్ మరియు ఇషా నమాజులని, "కొంతరాత్రి గడచిన తర్వాత" అంటే తహజ్జుద్ అనీ అభిప్రాయపడ్డారు. బహుశా ఈ ఆయతు మేరాజ్ సంఘటనకు ముందు అవతరించి ఉంటుందని ఇమామ్ ఇబ్నె కసీర్ (రహ్మలై) తన అభిప్రాయం వ్యక్తం చేశారు. ఎందుకంటే మేరాజ్ సంఘటన జరిగినప్పుడే ఐదు నమాజులు విధించబడ్డాయి. అంతకు ముందు రెండు నమాజులే విధిగా ఉండేవి. ఒకటి- సూర్యోదయానికి ముందు, మరొకటి- సూర్యాస్తమయానికి ముందు. ఆ తర్వాత రాత్రి చివరి వేళల్లో తహజ్జుద్ నమాజ్ ఉండేది.

ఏది ఏమైనా ఇక్కడ ఈ ఆయతు ద్వారా, నమాజ్ అనేది చాలా గొప్ప సత్కార్యమన్న విషయం బోధపడుతోంది. నమాజ్ చేస్తే గతంలో జరిగిన పాపాలు సమసిపోతాయి. అయితే దానివల్ల చిన్నచిన్న పాపాలు మాత్రమే క్షమించబడతాయి. పెద్దపాపాలు క్షమించబడటానికి స్వచ్ఛమైన పశ్చాత్తాపం అవసరం.

1045. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఘోరపాపాలకు పాల్పడకుండా ఉంటే ఐదు పూటల నమాజులు, ఒక జుమా నుండి మరో జుమా వరకు గల కాలం, వాటి మధ్య జరిగే (చిన్నచిన్న) పాపాలకు పరిహారాలు. (ముస్లిం)

١٠٤٥ ـ وعن أبي هُريرةَ رضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ قال: «الصَّلَواتُ الخَمْسُ، وَالجُمُعَةُ إلى الجُمُعَةِ، كفَّارَةٌ لِمَا بَيْنَهُنَّ، مَا لَمْ تُغشَ الكَبَائِرُ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఐదుపూటల నమాజుల విరామ సమయంలో, ఒక జుమా నుండి మరో జుమాకు గల మధ్యకాలంలో జరిగే పాపాలన్నీ మన్నించబడతాయని పై హదీసు ద్వారా బోధపడుతోంది.

అయితే ఘోరపాపాలకు పాల్పడి ఉండకూడదు. ఎందుకంటే ఘోరపాపాలు మనస్ఫూర్తిగా పశ్చాత్తాపం చెందనంతవరకు క్షమించబడవు. బహుదైవారాధన, తల్లిదండ్రుల పట్ల అవిధేయత, అబద్ధ ప్రమాణాలు, అబద్ధపు సాక్ష్యాలు, అనాధుల సొమ్ము తినటం, శీలవతుల మీద నిందలు మోపటం మొదలగునవన్నీ ఘోరపాపాలు. ఇవి కేవలం నమాజ్ చేసినంత మాత్రాన క్షమార్హం కావు.

1046. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి) తెలియజేశారు: ఏ ముస్లిం అయినా ఫర్జ్ నమాజ్ వేళ కాగానే చక్కగా వుజూ చేసి, ఎంతో భక్తితో, ఉత్తమ పద్ధతిలో రుకూ చేస్తే, అది అతని వెనుకటి పాపాలకు పరిహారం అవుతుంది. అయితే అతను ఘోరపాపానికి ఒడిగట్టి ఉండకూడదు. ఈ పరంపర నిత్యం కొనసాగుతూనే ఉంటుంది. (ముస్లిం)

١٠٤٦ - وعن عثمانَ بنِ عفانَ رضيَ اللهُ عنهُ قالَ: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقولُ: «مَا مِن امرِىءٍ مُسْلِمٍ تَحْضُرُهُ صَلاةٌ مَكْتُوبَةٌ فَيُحْسِنُ وُضوءَهَا، وَخُشُوعَهَا، وَرُكوعَهَا، إلَّا كانت كَفَّارَةً لِمَا قَبْلَهَا مِنَ الذُّنُوبِ ما لَمْ تُؤْتَ كَبِيرَةٌ، وَذلكَ الدَّهْرَ كُلَّهُ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నమాజును - దాని నియమాలను, విధులను పాటిస్తూ నెరవేర్చాలని ఈ హదీసులో బోధించబడింది. అలాంటి నమాజే పాపాలకు పరిహారం కాగలుగుతుంది. లేకపోతే దానివల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు.

188వ అధ్యాయం

## ١٨٨ ـ بَابُ صَلاَةِ الصُّبْحِ وَالْعَصْرِ

## ఫజ్ర్, అస్ర్ నమాజుల ఘనత

١٠٤٧ ـ عن أبي موسى رضيَ اللهُ عنهُ أَنَّ رسولَ اللهِ ﷺ قالَ: «مَنْ صَلَّى البَرْدَيْنِ دَخَلَ الجَنَّةَ» متفقٌ عليه.
«البَرْدَانِ»: الصُّبْحُ وَالعَصْرُ.

1047. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రెండు శీతల నమాజులను చేసేవాడు స్వర్గానికి వెళ్తాడు." (బుఖారీ-ముస్లిం)

రెండు శీతల నమాజులంటే ఫజ్ర్ మరియు అస్ర్.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ వ్యవధుల ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ముస్లిం అయిన వ్యక్తి ప్రతి నమాజునూ క్రమం తప్పకుండా చేయటం విధి అన్న విషయంలో ఎలాంటి సందేహానికీ తావులేదు. కాని కొన్ని నమాజుల్ని క్రమం తప్పకుండా పాటించాలంటే ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాల్సి ఉంటుంది. అందుకే ముస్లింలు ఆయా నమాజుల విషయంలో సోమరితనానికి లోనుగాకుండా ఉండేందుకు వాటి ఘనతావిశిష్ఠతల గురించి మరింత విపులంగా వివరించటమైనది. అలాంటి నమాజుల్లో ఒకటి ఫజ్ర్ నమాజ్. ముంచుకొచ్చే నిద్రమత్తును బలవంతంగా అదుపులో పెట్టుకొని, చన్నీటితో వుజూచేసి నమాజ్ చేయటం మనసుకు చాలా కష్టంగా తోస్తుంది. అదే విధంగా అస్ర్ నమాజ్ చేయటం కూడా ఒకింత కష్టంతో కూడుకున్న పనే. ఎందుకంటే సాధారణంగా మనిషి ఆ సమయంలో వ్యాపార, వాణిజ్య కార్యకలాపాల్లో తలమునకలై ఉంటాడు. వాటన్నిటినీ విడిచిపెట్టి నమాజ్‌కు బయలుదేరాలంటే మనసుకు కష్టంగా ఉంటుంది. అందుకే హదీసులో ప్రత్యేకంగా ఈ రెండు నమాజుల ఘనతను గురించి వివరించటం జరిగింది.

١٠٤٨ ـ وعن أبي زهيرٍ عُمارَةَ بنِ رُوَيبةَ رضيَ اللهُ عنهُ قالَ: سَمِعتُ

1048. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ జహీర్ ఉమారా బిన్ రువైబా

رسولَ الله ﷺ يقولُ: «لَنْ يَلِجَ النَّارَ أَحَدٌ صَلَّى قَبْلَ طُلُوعِ الشَّمْسِ وَقَبْلَ غُرُوبِهَا» يَعْني الفَجْرَ وَالعَصْرَ. رواه مسلم.

(రజి) తెలియజేశారు: "సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయానికి ముందు నమాజ్ చేసిన వాడెవడూ నరకానికి వెళ్ళడు." (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మనిషి కేవలం ఆ రెండు నమాజులు పాటిస్తే నరకం నుండి సురక్షితంగా ఉంటాడని అనుకుంటే పప్పులో కాలేసినట్లే. వాస్తవానికి ఐదుపూటల నమాజులు క్రమం తప్పకుండా పాటించేవాడే నరకం నుండి సురక్షితంగా ఉండగలడు. పై హదీసులో ఫజ్ర్ మరియు అస్ర్ నమాజుల ప్రాముఖ్యతను దృష్టిలో పెట్టుకొని అలా అనబడింది. ఈ రెండు నమాజుల్ని క్రమం తప్పకుండా పాటించే వ్యక్తి ఇతర నమాజుల విషయంలో కూడా నిర్లక్ష్యం వహించడని ఆశించవచ్చు. అలాంటి వ్యక్తి ఇతర విధుల్ని, అవసరమైన పనుల్ని కూడా నిర్వర్తిస్తాడు. పరలోకంలో సాఫల్యాన్ని పొందాలంటే ఇహలోకంలో వీలైనంతవరకు విధుల్ని, దైవప్రవక్త ఆచారాలను పాటించటం అవసరం.

١٠٤٩ - وعن جُنْدُبِ بنِ سُفيَانَ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ صَلَّى الصُّبحَ فَهُوَ فِي ذِمَّةِ اللهِ فَانْظُرْ يَـا ابْـنَ آدَمَ! لا يَطْلُبَنَّـكَ اللهُ مِـنْ ذِمَّتِـهِ بِشَيءٍ» رواه مسلم.

1049. హజ్రత్ జుందుబ్ బిన్ సుఫ్యాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఉదయం పూట (ఫజ్ర్) నమాజ్ చేసే వ్యక్తి దేవుని రక్షణలో ఉంటాడు. కనుక ఓ మనిషీ! తాను ఇచ్చిన రక్షణ గురించి దేవుడు నిన్ను ప్రశ్నించకుండా జాగ్రత్తపడు! (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసుకు భావం ఇది: ఓ మనిషీ! నువ్వు ఫజ్ర్ నమాజ్ విషయంలో ఏమరుపాటుకు లోనుకాకు. దేవుని పట్టుకు భయపడు- లేదా దీని భావం ఇది కూడా కావచ్చు- మనిషీ! నువ్వు దేవుని రక్షణలో ఉన్న నమాజీల జోలికి పోమాకు. వారిని ఏ విధంగానూ బాధించకు. ఒకవేళ నువ్వు వారిని బాధిస్తే దేవుడు ప్రళయదినాన నిన్ను ఈ విషయమై నిలదీసి అడుగుతాడు.

మొత్తానికి ఈ హదీసులో ఫజ్ర్ నమాజును క్రమం తప్పకుండా నెరవేర్చమని, ఆ అలవాటును కొనసాగించమని, ఆ నమాజును నెరవేర్చేవారిని కష్టపెట్టకుండా ఉండమని తాకీదు చేయబడింది.

١٠٥٠ ـ وعن أَبي هُريرةَ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «يَتَعَاقَبُونَ فِيكُمْ مَلائِكَةٌ بِاللَّيْلِ، وَمَلائِكَةٌ بِالنَّهَارِ، وَيَجْتَمِعُونَ فِي صَلاةِ الصُّبْحِ وَصَلاةِ العَصْرِ، ثُمَّ يَعْرُجُ الَّذِينَ بَاتُوا فِيكُمْ، فَيَسْأَلُهُمُ اللهُ ـ وَهُوَ أَعْلَمُ بِهِمْ ـ: كَيْفَ تَرَكْتُمْ عِبَادِي؟ فَيَقُولُونَ: تَرَكْنَاهُمْ وَهُمْ يُصَلُّونَ، وَأَتَيْنَاهُمْ وَهُمْ يُصَلُّونَ» متفقٌ عليه.

1050. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవదూతలు రేయింబవళ్ళు వంతులవారీగా మీ దగ్గరికి వస్తూపోతూ ఉంటారు. ఫజ్ర్ మరియు అస్ర్ నమాజుల్లో వారందరూ కలుసుకుంటారు. ఆ తర్వాత రాత్రంతా మీతోపాటు గడిపిన దైవదూతలు తిరిగి ఆకాశం వైపు వెళ్ళినప్పుడు దేవుడు వారిని ఉద్దేశ్యించి అడుగు తాడు- "మీరు వచ్చినప్పుడు నా దాసులు ఏం చేస్తున్నారు" అని. వాస్తవానికి దేవునికి అంతా తెలిసే ఉంటుంది- దానికి దైవదూతలు, "మేము బయలు దేరినప్పుడు వారు నమాజ్ చేస్తున్నారు. అంతకు ముందు మేము వారి దగ్గరికి చేరుకున్నప్పుడు కూడా వారు నమాజ్ స్థితిలోనే ఉన్నారు" అని చెబుతారు.
(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ వ్యవధుల ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మానవుల కర్మలను వ్రాసిపెట్టే దైవదూతలు ఒకరి వెనుక మరొకరు వస్తూపోతూ ఉంటారు. రాత్రిపూట పనిచేసే దైవదూతలు అస్ర్ నమాజ్ వేళ దిగివస్తారు. అప్పుడు పగటిపూట పనిచేసే దైవదూతలు కూడా ఉంటారు. ఆ సమయంలో ఇరు బృందాలూ

కలుసుకుంటాయి. ఫజ్ర్ నమాజ్ వేళ పగటిపూట దైవదూతలు రాగానే రాత్రంతా పనిచేసిన దూతలు వెళ్ళిపోతారు. ఆ విధంగా దైవదూతలు పరస్పరం కలుసుకున్నప్పుడు మరియు వారిలోని ఒక బృందం ఇహలోకపు సమాచారం తీసుకొని దేవుని దగ్గరికి బయలుదేరు తున్నప్పుడు అదృష్టవంతులైన ముస్లింలు దైవారాధనలో, ఫజ్ర్ లేక అస్ర్ నమాజుల్లో నిమగ్నులై ఉంటారు. లోకంలో జరిగే ప్రతిదీ అల్లాహ్‌కు తెలుసు. అయితే దూతల నోటితో, తన ప్రియదాసుల ఔన్నత్యాన్ని చెప్పించాలన్న ఉద్దేశ్యంతోనే దేవుడు వారిని మానవుల గురించి అడుగుతాడు.

١٠٥١ - وعن جَرِيرِ بنِ عبدِ اللهِ البَجَليِّ رضيَ اللهُ عنهُ قالَ: كنا عِندَ النبيِّ ﷺ، فَنَظَرَ إلى القَمَرِ لَيْلَةَ البَدْرِ فقال: «إنَّكُمْ سَتَرَوْنَ رَبَّكُمْ كما تَرَوْنَ هذا القَمَرَ، لا تُضَامُونَ في رُؤْيَتِهِ، فَإنِ اسْتَطَعْتُمْ أنْ لا تُغْلَبُوا عَلى صَلاةٍ قَبْلَ طُلُوعِ الشَّمْسِ، وَقَبْلَ غُرُوبِهَا فَافْعَلُوا» متفقٌ عليه. وفي روايةٍ: «فَنَظَرَ إلى القَمَرِ لَيْلَةَ أرْبَعَ عَشْرَةَ».

1051. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ బజలీ (రజి) కథనం: ఒకసారి మేము దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉన్నాం. అది నిండు పున్నమి రాత్రి. ఆయన చంద్రుని వంక చూసి ఇలా అన్నారు: మీరు ఏ విధంగానయితే ఈ చంద్రుణ్ణి చూస్తున్నారో అదేవిధంగా (పరలోకంలో) మీరు మీ ప్రభువుని చూస్తారు. ఆయన్ని చూడటంలో మీకెలాంటి ఇబ్బందీ ఉండదు. కనుక మీరు సూర్యోదయానికి ముందు చేయవలసిన (ఫజ్ర్) నమాజును, సూర్యాస్తమయానికి ముందు చేయవలసిన (అస్ర్) నమాజును నెరవేర్చటంలో అలసత్వానికి లోనుకాకుండా ఉండగలిగితే తప్పకుండా నెరవేర్చండి. (బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో "ఆయన పద్నాలుగో తేదీ రాత్రిన చంద్రుని వంక చూశారు" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ వ్యవధుల ప్రకరణం- సహీహ్ ముస్లింలోని తౌహీద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పధ్నాలుగో తేదీ రాత్రి ఉదయించే పున్నమి చంద్రుణ్ణి 'బద్ర్' అని అంటారు. 'బద్ర్' అసలు 'ముబాదరత్' అనే పదం నుండి వచ్చింది. ముబాదరత్ అంటే త్వరపడటం, వేగిర పడటం అని అర్థం. పున్నమి చంద్రుడు చాలా తొందరగా ఉదయిస్తాడు. అందుకే దానికాపేరు పడింది. పదిహేనో తేదీ నుండి చంద్రోదయం కాస్తంత జాప్యంగా జరుగుతూ ఉంటుంది.

ఈ హదీసు ద్వారా బోధపడే ముఖ్యవిషయం ఏమిటంటే-ఇహలోకంలో ఎవరూ దేవుణ్ణి దర్శించలేకపోయినా పరలోకంలో మాత్రం విశ్వాసులు ఆ భాగ్యానికి నోచుకుంటారు. ఈ హదీసు కూడా ఫజ్ర్ మరియు అస్ర్ నమాజుల్ని క్రమం తప్పకుండా నెరవేర్చాలని తాకీదు చేస్తోంది. ఆ నమాజుల ఘనతను చాటిచెబుతోంది.

١٠٥٢ ـ وعن بُرَيْدَةَ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ تَرَكَ صَلاةَ العَصْرِ فَقَدْ حَبِطَ عَمَلُهُ» رواه البخاري.

1052. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే అస్ర్ నమాజును వదలిపెడతారో నిశ్చయంగా వారి సత్కర్మలన్నీ వ్యర్థమయి పోతాయి. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ వ్యవధుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఉద్దేశ్యపూర్వకంగా ఏ ఒక్క నమాజును వదలిపెట్టడమైనా ఘోరపాపమే. మరికొందరి అభిప్రాయం ప్రకారం అది కుఫ్ర్ (దైవతిరస్కారం)తో సమానం. కాని ముఖ్యంగా అస్ర్ నమాజును వదలిపెడితే మాత్రం అది ఘోరాతి ఘోర పాపమవుతుంది. దానివల్ల మనిషి చేసుకున్న సత్కర్మలన్నీ నాశనమయిపోతాయి. అంచేత అస్ర్ నమాజును పరిరక్షించుకోవటం చాలా అవసరం.



**189వ అధ్యాయం**

## ١٨٩ ـ بَابُ فَضْلِ الْمَشْيِ إِلَى الْمَسَاجِدِ

## మస్జిద్‌లకు కాలి నడకన వెళ్ళటం

١٠٥٣ ـ عن أبي هريرة رضيَ اللهُ عنهُ أنَّ النبيَّ ﷺ قال: «مَنْ غَدَا إلَى المَسْجِدِ أَوْ رَاحَ، أَعَدَّ اللهُ لَهُ فِي الجَنَّةِ نُزُلًا كُلَّمَا غَدَا أَوْ رَاحَ» متفقٌ عليه.

1053. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: ఉదయం, సాయంత్రం మస్జిద్‌కు వెళ్ళే వ్యక్తి కోసం, అతను ఉదయం పూట గాని, సాయంత్రం వేళగాని ఎప్పుడు మస్జిద్‌కు వెళ్ళినా దేవుడు స్వర్గంలో అతని ఆతిథ్యానికి ఏర్పాట్లు చేస్తాడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

١٠٥٤ ـ وعنهُ أنَّ النَّبِيَّ ﷺ قالَ: «مَنْ تَطَهَّرَ فِي بَيْتِهِ، ثُمَّ مَضَى إِلَى بَيْتٍ مِنْ بُيُوتِ اللهِ، لِيَقْضِيَ فَرِيضَةً مِنْ فَرَائِضِ اللهِ، كَانَتْ خُطُوَاتُهُ، إِحْدَاهَا تَحُطُّ خَطِيئَةً، وَالأُخْرَى تَرْفَعُ دَرَجَةً» رواه مسلم.

1054. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే తమ ఇంటి దగ్గర చక్కగా పరిశుద్ధతనొంది (వుజూ లేదా గుసుల్ చేసి) దేవుడు విధించిన విధుల్లో ఏదో ఒకదాన్ని నిర్వర్తించే ఉద్దేశ్యంతో, దేవుని గృహాల్లో ఏదయినా ఒక గృహానికి వెళ్తారో, వారు వేసే అడుగుల్లో ఒక అడుగు, వారి వల్ల జరిగిన ఒక పాపాన్ని తుడిచిపెడ్తే, మరొక అడుగు ఒక అంతస్తును పెంచుతూ ఉంటుంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో మస్జిద్‌కు వెళ్ళి సామూహికంగా నమాజ్ చేయమని పురికొల్పటం జరిగింది. దాని ఘనత కూడా వివరించబడింది. మస్జిద్‌కు కాలినడకన వెళితే అడుగడుగునా పుణ్యం లభిస్తుంది. పరలోకపు అంతస్తులు పెరుగుతాయి.

١٠٥٥ - وعن أُبَيِّ بن كَعْبٍ رضيَ اللهُ عنه قالَ: كانَ رَجُلٌ مِنَ الأَنْصارِ لا أَعْلَمُ أَحَداً أَبْعَدَ مِنَ المَسْجِدِ مِنْهُ، وَكَانَتْ لا تُخْطِئُهُ صَلاةٌ! فَقِيلَ لَهُ: لَوِ اشْتَرَيْتَ حِمَاراً تَرْكَبُهُ في الظَّلْمَاءِ وَفي الرَّمْضَاءِ، قالَ: مَا يَسُرُّنِي أَنَّ مَنْزِلي إلى جَنْبِ المَسْجِدِ، إنِّي أُرِيدُ أَنْ يُكْتَبَ لِي مَمْشَايَ إلى المَسْجِدِ، وَرُجُوعِي إذا رَجَعْتُ إلى أَهْلِي. فقالَ رسولُ اللهِ ﷺ: «قَدْ جَمَعَ اللهُ لَكَ ذلكَ كُلَّه» رواه مسلم.

1055. హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) కథనం: ఒక వ్యక్తి ఉండేవాడు. నాకు తెలిసినంతవరకు మస్జిద్ నుండి అతని ఇంటికన్నా దూరంగా ఎవరి ఇల్లూ లేదు. అయినా అతను ఒక్క నమాజును కూడా వదలిపెట్టేవాడు కాదు. అతనితో ఎవరో అన్నారు, బహుశా నేనే అన్నానేమో, "ఒక గాడిదను కొనుక్కొని చీకటి పడినప్పుడు, ఎండ తీవ్రంగా ఉన్నప్పుడు దానిపై ఎక్కి రావచ్చుగదా!?" అని. దానికతను "నా ఇల్లు మస్జిద్ చెంత నుండటం నాకిష్టం లేదండీ! నేను (దూరం నుండి) మస్జిద్‌కు నడిచి రావటం, తిరిగి మస్జిద్ నుండి ఇంటికి వెళ్ళటం నా కర్మల జాబితాలో లిఖించబడాలని నేను కోరు కుంటున్నాను" అన్నాడు. (అతని మాటలు విని) దైవప్రవక్త (సల్లం) "నువ్వు కోరుకున్నదంతా అల్లాహ్ (నీ ఖాతాలో) జమ చేశాడు" అని అన్నారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇల్లు మస్జిద్‌కు దూరంగా ఉంటే నమాజ్ కోసం వస్తూ పోతూ ఉన్నప్పుడు ఎక్కువ అడుగులు వేయవలసి వస్తుంది. దానివల్ల పుణ్యం కూడా ఎక్కువగా లభిస్తుంది. అదే

విధంగా ఎన్నో పాపాలు కూడా క్షమించబడతాయి. మనిషి సంకల్పం నిష్కల్మషంగా ఉంటే ఎన్నో గొప్పగొప్ప స్థానాలు పొందగలడు మరి!

١٠٥٦ - وعن جابرٍ رضيَ اللهُ عنهُ قال: خَلَتِ البِقَاعُ حَوْلَ المَسْجِدِ، فَأَرَادَ بَنُو سَلِمَةَ أَنْ يَنْتَقِلُوا قُرْبَ المَسْجِد، فَبَلَغَ ذلكَ النبيَّ ﷺ فقال لهم: «بَلَغَني أَنَّكُمْ تُرِيدُونَ أَن تَنتَقِلُوا قُرْبَ المَسْجِد؟!» قالوا: نعم يا رسولَ الله! قَدْ أَرَدْنَا ذلكَ، فقالَ: «بَنِي سَلِمَةَ دِيَارَكُمْ تُكْتَبْ آثَارُكُمْ، دِيارَكُمْ تُكْتَبْ آثَارُكُمْ» فقالوا: مَا يَسُرُّنَا أَنَّا كُنَّا تَحَوَّلْنَا. رواه مسلم، وروى البخاري معناه من رواية أنس.

1056. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: మస్జిదె నబవీ చుట్టు ప్రక్కల్లో కొంత స్థలం ఖాళీ అయింది. అప్పుడు బనూ సలిమా తెగవారు మస్జిద్ సమీప ప్రాంతానికి తరలి వెళదామని నిశ్చయించుకున్నారు. ఈ విషయం దైవప్రవక్త (సల్లం)కు తెలిసింది. ఆయన వారిని, "మీరందరూ మస్జిద్ సమీప ప్రాంతానికి తరలి వెళదామనుకుంటున్నారట.. ఏమిటీ?" అని అడిగారు. దానికి వారు, 'ఔను, దైవప్రవక్తా! మేము నిజంగానే వెళదామనుకుంటున్నాం' అని చెప్పారు.

అప్పుడు ఆయన, "బనూ సలిమా తెగవారలారా! మీరు మీ ఇండ్లల్లోనే ఉండండి. మీ అడుగుల ముద్రలు లిఖించబడతాయి. మీరు మీ ఇండ్లల్లోనే ఉండండి. మీ అడుగుల ముద్రలు లిఖించబడతాయి" అని వారికి ఉపదేశించారు.

దాంతో వారు, "అయితే అక్కడికి తరలి వెళ్ళటం మా కిష్టం లేదు" అని చెప్పారు. (ముస్లిం)

ఇమామ్ బుఖారీ కూడా ఈ హదీసుని పోలిన హదీసునొకదాన్ని హజ్రత్ అనస్ (రజి) ఆధారంగా వెలికితీశారు.

(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా మస్జిద్‌కు దూరంగా నివసించవలసిన ప్రాముఖ్యతను గురించి వివరించటం జరిగింది. అయితే ఈ ఆదేశం నిష్ఠాగరిష్ఠులకు మాత్రమే పరిమితం. మస్జిద్‌కు దూరం నుంచి రావటంలోని ఘనతను ప్రతి ఒక్కరూ గుర్తించగలరని చెప్పలేం. అందుకని దైవారాధన పట్ల, నమాజుల్ని నెరవేర్చటం పట్ల తక్కువ అభిరుచి కనబరచేవారు మస్జిద్‌కు సమీపంలో నివసించటమే ఉత్తమం. దానివల్ల వారు కనీసం ఫర్జ్ నమాజులన్నా సక్రమంగా నెరవేర్చగల్గుతారు. ఎందుకంటే నఫిల్ నమాజుల కన్నా ఫర్జ్ నమాజులు చాలా ముఖ్యమైనవి. వాటిని పాటించటం విధి.

1057. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నమాజు కోసం అందరికంటే ఎక్కువ దూరం నడిచి వచ్చే వ్యక్తికి అందరికన్నా ఎక్కువ పుణ్యం లభిస్తుంది. అతని తర్వాత దానికంటే తక్కువ దూరం నడిచి వచ్చే వ్యక్తికి ఎక్కువ పుణ్యం లభిస్తుంది. అదే విధంగా (సామూహిక నమాజ్ కోసం ఎదురు చూడకుండా) తొందరగా నమాజ్ చేసి పడుకునే వ్యక్తి కంటే, ఇమామ్‌తోపాటు సామూహికంగా నమాజ్ చేసేంతవరకు నిరీక్షించే వ్యక్తికి ఎక్కువ పుణ్యం లభిస్తుంది.

(బుఖారీ-ముస్లిం)

١٠٥٧ ـ وعنْ أَبي موسى رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إنَّ أَعْظَمَ النَّاسِ أَجراً في الصَّلاةِ أَبْعَدُهُمْ إلَيْها مَمْشَى، فَأَبْعَدُهُمْ. وَالَّذي يَنْتَظِرُ الصَّلاةَ حَتَّى يُصلِّيَها مَعَ الإمامِ أَعظَمُ أَجْراً مِنَ الَّذي يُصَلِّي ثُمَّ يَنامُ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

1058. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: చీకట్లలో మస్జిదులకు

١٠٥٨ ـ وعن بُرَيدَةَ رضيَ اللهُ عنهُ عنِ النبيِّ ﷺ قال: «بَشِّروا المَشَّائِينَ في الظُّلَمِ إلى المَساجِدِ بالنُّورِ التامِّ يَوْمَ

القِيامةِ». رواه أبو داود، والترمذي.

నడిచి వెళ్ళేవారికి ప్రళయ దినాన సంపూర్ణ వెలుగు లభిస్తుందనే శుభ వార్తను అందించండి.

(అబూదావూద్, తిర్మిజీ)

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం- సుననె తిర్మిజీలోని నమాజ్ అధ్యాయాలు)

**ముఖ్యాంశాలు**

చీకట్లలో మస్జిదులకు వెళ్ళటమంటే ఫజ్ర్ మరియు ఇషాకు సంబంధించిన సామూహిక నమాజులకు హాజరుకావటం అని భావం. నేటి ఆధునిక యుగంలో నగరవీధులు కాంతిమంతమైన విద్యుద్దీపాలతో ఎంతగా వెలిగిపోయినా, చీకటివల్ల కలిగే భయాందోళనలను ఎవరూ తొలగించలేరని గ్రహించాలి. అందుకే ఫజ్ర్ మరియు ఇషా నమాజులు నేటికీ చీకట్లో చేయబడే నమాజులుగానే పరిగణించబడతాయి. వాటిని నెరవేర్చే అదృష్టవంతులకు ప్రళయదినాన దేవుని తరపు నుండి పరిపూర్ణమైన వెలుగు లభిస్తుందనే శుభవార్త ఇవ్వబడింది.

١٠٥٩ - وعن أَبي هُريرةَ رضي الله عنهُ أَنَّ رسولَ اللهِ ﷺ قالَ: «أَلا أَدُلُّكُمْ عَلى مَا يَمْحُو اللهُ بِهِ الخَطَايَا، وَيَرْفَعُ بِهِ الدَّرَجَاتِ؟» قَالُوا: بَلى يا رسولَ الله! قـالَ: «إِسْبـاغُ الـوُضـوءِ عَلى المَكـارِهِ، وَكَثْـرَةُ الخُطَا إِلـى المَسَـاجِـدِ، وَانْتِظَـارُ الصَّلاةِ بَعْدَ الصَّلاةِ؛ فَذلِكُمُ الرِّباطُ، فَذلِكُمُ الرِّباطُ» رواه مسلم.

1059. హజ్రత్ అబూహురైరా (రజి)గారు చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన సహచరులనుద్దేశ్యించి, "దైవం (మానవుల) పాపాలను ప్రక్షాళనం చేసి, (వారి) అంతస్తులను పెంచేందుకు దోహదపడే విషయాలు ఏమిటో నేను మీకు చెప్పనా?" అని అడిగారు. దానికి ఆయన సహచరులు "తప్పకుండా చెప్పండి దైవప్రవక్తా!" అన్నారు. అప్పుడాయన ఇలా చెప్పారు: కష్టమనిపించినా చక్కగా వుజూ చేయటం, మస్జిద్‌ల వైపు ఎక్కువ అడుగులు వేయటం (అంటే దూరం నుంచి రావటం) ఒక నమాజు ముగిసిన పిదప తర్వాతి నమాజ్ కోసం ఎదురు

చూడటం. ఇదే రిబాతు! ఇదే రిబాతు!!' (ముస్లిం)

(ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు 'వుజూ ఘనత' అధ్యాయంలో వచ్చింది.

١٠٦٠ - وعن أبي سعيدٍ الخُدْريِّ رضيَ اللهُ عنهُ عنِ النبيِّ ﷺ قال: «إذا رَأَيْتُمُ الرَّجُلَ يَعْتَادُ المَسَاجِدَ فَاشْهَدُوا لَهُ بالإِيمَانِ، قالَ اللهُ عَزَّ وَجَلَّ: ﴿إِنَّمَا يَعْمُرُ مَسَٰجِدَ ٱللَّهِ مَنْ ءَامَنَ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْآخِرِ﴾» الآيـة. رواه الترمذي وقال: حديث حسن.

1060. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు ఒక వ్యక్తిని మస్జిదులకు వస్తూపోతుండగా చూస్తే మీరతని విశ్వాసానికి సంబంధించి సాక్ష్యం పలకండి. అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ విశ్వసించి, నమాజును స్థాపించే వారు, జకాత్ ఇచ్చేవారు, అల్లాహ్‌కు తప్ప మరెవరికీ భయపడనివారు మాత్రమే అల్లాహ్ మస్జిదులకు సంరక్షకులూ, సేవకులూ కాగలుగుతారు." (తిర్మిజీ, హసన్)

(సుననె తిర్మిజీలోని వ్యాఖ్యానాల అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'య-తాదు' అనే పదం వాడబడింది. ఇది 'ఔద్' లేక 'ఆదత్' అనే పదాల నుండి వచ్చింది. 'ఆదత్' అంటే 'తిరిగి వెళ్ళటం' అని అర్థం. మాటిమాటికీ మస్జిద్‌కు వెళ్ళి సామూహికంగా నమాజ్ చేయటమని దాని భావం. ఒక ముస్లిం బాహ్యస్థితిని చూసి అతని గురించి సాక్ష్యం ఇవ్వవచ్చని ఈ హదీసు తెలుపుతోంది. ఇంకా మస్జిదులతో సంఘటితమై ఉండటం, మస్జిదుల్లో దైవారాధన చేయటం, వాటిని సంరక్షించటం, వాటికి సేవచేయటం మొదలగు సత్కార్యాలు కూడా ఇందులో పొందుపరచబడ్డాయి. ఈ హదీసు ఆధారాల రీత్యా బలహీనమైనది.

**190వ అధ్యాయం**

## ١٩٠ ـ باب فضل انتظار الصَّلاة

## నమాజ్‌కై నిరీక్షించటం

١٠٦١ ـ عن أبي هريرة رضيَ الله عنهُ أنَّ رسولَ الله ﷺ قال: «لا يَزَالُ أَحَدُكُمْ في صَلاةٍ مَا دَامَتِ الصَّلاةُ تَحْبِسُهُ، لا يَمْنَعُهُ أنْ يَنْقَلِبَ إلى أَهْلِهِ إلَّا الصَّلاةُ» متفقٌ عليه.

1061. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఒకణ్ణి నమాజ్ ఆపి వుంచినంతవరకు అతను నమాజ్‌లోనే ఉన్నట్లుగా పరిగణించ బడతాడు. అతన్ని ఇంటికి వెళ్ళకుండా, ఒక్క నమాజ్ తప్ప మరే విషయమూ నిరోధించి ఉండకూడదు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

### ముఖ్యాంశాలు

ఈ హదీసులో నమాజ్ కోసం నిరీక్షించటం వల్ల లభించే పుణ్యం గురించి చెప్ప బడింది. దాసుడు నమాజ్ కోసం నిరీక్షిస్తూ మస్జిద్‌లో కూర్చొని ఉన్నంతసేపు, పుణ్యం రీత్యా, అతను నమాజ్‌లో ఉన్నట్లుగానే పరిగణించబడతాడని చెప్పబడింది.

١٠٦٢ ـ وعنه أنَّ رسولَ الله ﷺ قال: «المَلائِكَةُ تُصَلِّي عَلى أَحَدِكُمْ مَا دَامَ في مُصَلَّاهُ الَّذي صَلَّى فِيهِ، مَا لَمْ يُحْدِثْ، تَقُولُ: اللَّهُمَّ اغفِرْ لَهُ، اللَّهُمَّ ارْحَمْهُ» رواه البخاري.

1062. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఒకరు తాను నమాజ్ చేసిన స్థలంలోనే కూర్చొని ఉన్నంతసేపూ దైవ దూతలు అతని కోసం "అల్లాహ్! ఇతన్ని మన్నించు, అల్లాహ్! ఇతని మీద దయ జూపు" అని ప్రార్థిస్తూ ఉంటారు.

అతని వుజూ భంగం కానంతవరకు ఈ పరంపర కొనసాగుతూనే ఉంటుంది.

(బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)

١٠٦٣ - وعن أنسٍ رضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ أَخَّرَ لَيْلَةً صَلاةَ الْعِشَاءِ إلى شَطْرِ اللَّيْلِ ثُمَّ أَقْبَلَ عَلَيْنَا بِوَجْهِهِ بَعْدَ مَا صَلَّى فقال: «صَلَّى النَّاسُ وَرَقَدُوا وَلَمْ تَزَالُوا في صَلاةٍ مُنْذُ انْتَظَرْتُمُوهَا». رواه البخاري.

1063. హజ్రత్ అనస్ (రజి) కథనం: ఓ రోజు రాత్రి దైవప్రవక్త (సల్లం) ఇషా నమాజు చేయించటంలో అర్ధరాత్రి వరకు ఆలస్యం చేశారు. నమాజ్ ముగిసిన తర్వాత మా వైపునకు తిరిగి ఇలా అన్నారు: ఇతర ప్రజలు నమాజ్ చేసుకొని నిద్రపోయారు. కాని మీరు మాత్రం నమాజ్ కోసం ఎదురు చూస్తున్నప్పటి నుంచి నమాజ్ స్థితిలోనే ఉన్నారు.

(బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇమామ్ రాకకోసం, సామూహిక నమాజ్ కోసం నిరీక్షించటం కూడా పుణ్యప్రదమేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఆ విధంగా నమాజ్ కోసం నిరీక్షించేవారు నమాజ్‌లో ఉన్నట్లుగానే పరిగణించబడతారు.

**191వ అధ్యాయం**

# ١٩١ ـ بَابُ فَضْلِ صَلاَةِ الْجَمَاعَةِ

# సామూహిక నమాజ్ ఘనత

١٠٦٤ ـ عن ابنِ عُمرَ رضيَ اللهُ عنهمَا أنَّ رسولَ اللهِ ﷺ قال: «صَلاةُ الجَمَاعَةِ أفضلُ مِنْ صَلاةِ الفَذِّ بِسَبْعٍ وَعِشْرِينَ دَرَجَةً». متفقٌ عليه.

1064. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: సామూహికంగా చేసే నమాజ్ ఒంటరిగా చేసే నమాజ్ కంటే ఇరవై ఏడు రెట్లు శ్రేష్ఠమైనది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

١٠٦٥ ـ وعن أبي هريرة رضيَ اللهُ عنهُ قال: قالَ رسولُ اللهِ ﷺ: «صَلاةُ الرَّجُلِ في جَمَاعَةٍ تُضَعَّفُ على صَلاتِه في بَيْتِهِ وَفي سُوقِهِ خَمْساً وَعِشْرِينَ ضِعْفاً، وَذلكَ أنَّهُ إذَا تَوَضَّأ فَأحْسَنَ الوُضُوءَ، ثُمَّ خَرَجَ إلى المَسْجِدِ، لا يُخْرِجُهُ إلَّا

1065. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి తన ఇంట్లో లేక వీధిలో చేసే నమాజ్ కన్నా సామూహికంగా చేసే నమాజుకు పాతిక రెట్లు ఎక్కువ పుణ్యం లభిస్తుంది. ఈ విధంగా ఎక్కువ రెట్లు పుణ్యం లభించ టానికి కారణమేమిటంటే, మనిషి చక్కగా వుజూ చేసుకొని కేవలం నమాజు చేసే ఉద్దేశ్యంతో వెళ్తుంటే, ఆ సమయంలో అతను వేసే ప్రతి అడుగుకు దేవుడు ఒక్కొక్కటి చొప్పున అతని అంతస్తులను పెంచుతాడు. అంతేకాదు, అతని వల్ల జరిగిన పాపా లను కూడా ఒక్కొక్కటిగా తుడిచిపెట్టే స్తాడు. అతను నమాజ్ చేస్తూ వుజూతో

الصَّلاةُ، لَمْ يَخْطُ خَطْوَةً إلَّا رُفِعَتْ له بهَا دَرَجَةٌ، وَحُطَّتْ عَنْهُ بهَا خَطِيئَةٌ، فَإذَا صَلَّى لَمْ تَزَلِ المَلائِكَةُ تُصَلِّي عَلَيْهِ مَا دَامَ في مُصَلَّاهُ، مَا لَمْ يُحْدِثْ، تَقُولُ: اللَّهُمَّ صَلِّ عَلَيْهِ، اللَّهُمَّ ارْحَمْهُ. وَلا يَزَالُ في صَلاةٍ مَا انْتَظَرَ الصَّلاةَ» متفقٌ عليه. وهذا لفظ البخاري.

ఉన్నంతవరకూ దైవదూతలు అతని మీద శాంతి కురవాలని ప్రార్థిస్తూ, "అల్లాహ్! ఇతనిపై శాంతి కురిపించు. అల్లాహ్! ఇతణ్ణి కనికరించు" అని అంటూ ఉంటారు. మస్జిద్‌లో ప్రవేశించిన తర్వాత సామూహిక నమాజ్ కోసం అతను ఎంతసేపు నిరీక్షిస్తాడో అంత సేపూ అతను నమాజ్‌లో ఉన్నట్లుగానే పరిగణించబడతాడు. (అంటే అతనికి అంత పుణ్యం లభిస్తుందన్నమాట).
(బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన రెండు హదీసుల్లోనూ ఒంటరిగా చేసే నమాజ్ కన్నా సామూహికంగా చేసే నమాజ్ ఎంతో శ్రేష్ఠమైనదనే విషయం బోధించబడింది. అయితే ఎన్ని రెట్లు శ్రేష్ఠమైనదనే విషయంలో రెండింటి మధ్య కాస్తంత వైరుధ్యం కనిపిస్తుంది. మొదటి హదీసులో ఇరవై ఏడు రెట్లు శ్రేష్ఠమైనదని పేర్కొనబడితే, రెండవ హదీసులో ఇరవై ఐదు రెట్లు శ్రేష్ఠమైనదని చెప్పబడింది.

పై రెండు హదీసులను సమన్వయపరుస్తూ కొంతమంది పండితులు, మొదట్లో దైవప్రవక్త (సల్లం)కు వహీ ద్వారా ఇరవై ఐదు రెట్ల శ్రేష్ఠత మాత్రమే తెలుపబడిందని, ఆ తర్వాత కాలక్రమంలో దాని శ్రేష్ఠత ఇరవై ఏడు రెట్లకు పెంచబడిందని, అయితే ఆయన తన సహచరులకు వహీ ద్వారా అందిన సమాచారం ప్రకారం బోధించటం చేత ఉల్లేఖకుల ఉల్లేఖనాల్లో ఈ వైవిధ్యం చోటుచేసుకున్నదని అభిప్రాయపడ్డారు. నమాజ్‌ను ఎంత ఎక్కువ భక్తిశ్రద్ధలతో నెరవేరిస్తే అన్ని ఎక్కువ రెట్లు శ్రేష్ఠత లభిస్తుందని మరికొంతమంది పండితులు అభిప్రాయపడ్డారు.

అయితే ఇన్ని రెట్ల శ్రేష్ఠత ఏ విధమైన సామూహిక నమాజ్‌కు లభిస్తుంది? ఇంట్లో, వీధిలో, మైదానంలో ఎక్కడ సామూహికంగా నమాజ్ చేసినా లభిస్తుందా? లేక ఈ అజ్ఞ మస్జిదుల్లో చేసే సామూహిక నమాజ్‌కు మాత్రమే పరిమితమా? అనే ప్రశ్నలు ఈ సందర్భంగా జనించటం సహజమే. ఈ విషయమై కొందరు పండితులు మొదటి అభిప్రాయాన్ని ఎన్నుకుంటే మరికొందరు రెండో అభిప్రాయాన్ని సమర్థించారు. ఇమామ్ ఇబ్నె హజర్ (రహ్మలై) రెండో అభిప్రాయాన్నే సమర్థించారు.

అదీగాక హదీసులోని "ఎక్కువ రెట్లు పుణ్యం లభించటానికి కారణమేమిటంటే" అనే వాక్యాలు కూడా ఈ విషయాన్నే సమర్థిస్తున్నాయి.

1066. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం: ఒక అంధుడు దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! నన్ను మస్జిద్‌దాకా తీసుకొని వచ్చేవారెవరూ లేరు" అని విన్నవించుకుంటూ తనకు ఇంట్లో నమాజ్ చేసుకునేందుకు రాయితీ కల్పించమని కోరాడు. దైవ ప్రవక్త (సల్లం) అతనికి ఆ మేరకు రాయితీనిచ్చారు. ఆ తర్వాత అతను తిరిగి వెళ్ళిపోతుండగా అతన్ని మళ్ళీ పిలిచి, 'నీకు నమాజ్ కోసం చేయబడే ప్రకటన (అజాన్) వినపడుతుందా?' అని అడిగారు. అతను 'వినపడుతుంద'న్నాడు. అప్పుడాయన 'అయితే దానికి హాజరు పలుకు (అంటే మస్జిద్‌కు వచ్చి నమాజ్ చెయ్యి)" అని ఆదేశించారు. (ముస్లిం)

١٠٦٦ - وعنهُ قالَ: أَتَى النَّبِيَّ ﷺ رَجُلٌ أَعمى، فقال: يا رسولَ اللهِ! لَيْسَ لي قَائِدٌ يَقُودُنِي إلى المَسْجِدِ، فَسَأَلَ رسولَ اللهِ ﷺ أنْ يُرَخِّصَ لَهُ فَيُصَلِّي في بَيْتِهِ؛ فَرَخَّصَ لَهُ، فَلَمَّا وَلَّى دَعَاهُ فقالَ لَهُ: «هَلْ تَسْمَعُ النِّدَاءَ بِالصَّلاةِ؟» قال: نَعَمْ، قال: «فَأَجِبْ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

1067. హజ్రత్ అబ్దుల్లాహ్ - కొంత మంది అభిప్రాయం ప్రకారం - అమ్ర్ బిన్ ఖైస్ ఉరఫ్ ముఅజ్జిన్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (రజి) ఒకసారి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి, "దైవప్రవక్తా! మదీనాలో పురుగులు (పాములు, తేళ్ళు) క్రూర మృగాలు చాలా ఎక్కువగా ఉన్నాయి. (కనుక మీరు నాకు ఇంట్లో నమాజ్ చేసుకోవటానికి అనుమతినివ్వండి)" అని మనవి

١٠٦٧ - وعن عبدِ اللهِ - وَقِيلَ: عَمْرِو بْنِ قَيْسٍ المَعْرُوفِ بابْنِ أُمِّ مَكْتُومٍ المُؤَذِّنِ رضيَ اللهُ عنهُ أنَّهُ قال: يا رسولَ اللهِ! إنَّ المَدِينَةَ كَثِيرَةُ الهَوَامِّ وَالسِّبَاعِ. فقالَ رسولُ اللهِ ﷺ: «تَسْمَعُ

حَيَّ عَلَى الصَّلاةِ، حَيَّ عَلَى الفَلاحِ، فَحَيَّهلاً». رواه أبو داود بإسناد حسنٍ.
ومعنى «حَيَّهلاً»: تعال.

చేసుకున్నారు. దానికి దైవప్రవక్త (సల్లం), "నీకు హయ్య అలస్సలాహ్ మరియు హయ్య అలల్ ఫలాహ్ అనే పలుకులు వినిపిస్తాయా? ఒకవేళ వినిపిస్తే మస్జిద్‌కు రా" అని అన్నారు.
(అబూదావూద్- హసన్)

## ముఖ్యాంశాలు

పై రెండు హదీసుల్లో పేర్కొనబడిన సంఘటన హజ్రత్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్(రజి)కు సంబంధించినదే. అయితే ఈయన అసలు పేరు విషయంలో భిన్నాభిప్రాయా లున్నాయి. కొంతమంది ఈయన పేరు అబ్దుల్లాహ్ అని అంటే, మరికొందరు అమ్ర్ బిన్ ఖైస్ అని అంటున్నారు. రెండోపేరు బహుళ ప్రచారంలో ఉంది. అత్యధిక మంది పండితులు కూడా ఈయన అసలు పేరు అదేనని భావిస్తున్నారు. ఏది ఏమైనా పై హదీసుల్లో ఇబ్నె ఉమ్మె మక్తూమ్‌గారు అంధులైనప్పటికీ దైవప్రవక్త (సల్లం), సామూహిక నమాజ్ విషయమై ఆయనకు ఎలాంటి రాయితీ కల్పించలేదు. దీని ద్వారా ఇస్లాంలో సామూహిక నమాజ్‌కు ఎంతటి ప్రాముఖ్యం ఉందో బోధపడుతోంది.

١٠٦٨ ـ وعن أبي هريرة رضيَ اللهُ عنهُ أَنَّ رسولَ اللهِ ﷺ قالَ: «وَالَّذي نَفْسي بِيَدِهِ، لَقَدْ هَمَمْتُ أَنْ آمُرَ بِحَطَبٍ فَيُحْتَطَبَ، ثُمَّ آمُرَ بِالصَّلاةِ فَيُؤَذَّنَ لَهَا، ثُمَّ آمُرَ رَجُلاً فَيَؤُمَّ النَّاسَ، ثُمَّ أُخَالِفَ إلى رِجالٍ فَأُحَرِّقَ عَلَيْهِمْ بيوتَهمْ» متفقٌ عليه.

1068. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరి చేతిలో నయితే నా ప్రాణముందో ఆ ప్రభువు సాక్షి! కట్టెలు సమీకరించమని, నమాజు కోసం అజాన్ ఇవ్వమని ఆజ్ఞాపించి, ప్రజలకు నమాజ్ చేయించటం కోసం (నా స్థానంలో) మరెవరినైనా నిలబెట్టి (సామూహిక నమాజులో పాల్గొనని) వారి దగ్గరకు నేను స్వయంగా వెళ్ళి వారిని వారి ఇండ్ల సమేతంగా తగల బెడదామని నేను ఎన్నోసార్లు అనుకున్నాను. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్థానికులు, ఆరోగ్యవంతులయినవారు మస్జిద్‌కు వెళ్ళి సామూహిక నమాజ్‌లో పాల్గొనటం విధి. అలాంటివారు ఒంటరిగా నమాజ్ చేసుకున్న పక్షంలో నమాజ్ నెరవేరి నప్పటికీ ఒక విధిని విడిచి పెట్టినందుకు వారు పాపాత్ములుగా పరిగణించబడతారని పండితులు అభిప్రాయపడుతున్నారు. అందుకు ఈ హదీసుని, ఇంతకు ముందు వచ్చిన ఇబ్నె ఉమ్మె మక్తూమ్ హదీసుని నిదర్శనంగా చూపెడుతున్నారు. సామూహిక నమాజు ఫర్జ్ అయినందునే దానిగురించి అంతగా తాకీదు చేయబడింది, సామూహికంగా చేసే నమాజు ఒంటరిగా చేసే నమాజు కన్నా ఇరవై ఏడు రెట్లు శ్రేష్ఠమైనదని చెప్పబడింది. ఈ హదీసు ద్వారా బోధపడే ఇంకొక విషయం ఏమిటంటే, ఇండ్లల్లో దాక్కున్న వారిని అత్యవసర పరిస్థితుల్లో ఏ విధంగానయినా బయటికి తీయవచ్చు. అదే విధంగా నిందితుల్ని, నేరస్తుల్ని ఏమరుపాటులో ఉన్న స్థితిలో హఠాత్తుగా అరెస్టు చేయవచ్చు.

١٠٦٩ ـ وعن ابن مَسْعُودٍ رضيَ اللهُ عنهُ قال: مَنْ سَرَّهُ أَنْ يَلْقَى اللهَ تعالى غداً مُسْلِماً، فَلْيُحَافِظْ عَلى هٰؤُلاءِ الصَّلَواتِ، حَيْثُ يُنَادَى بِهِنَّ، فَإِنَّ اللهَ شَرَعَ لِنَبِيِّكُمْ ﷺ سُنَنَ الهُدَى، وَإِنَّهُنَّ مِنْ سُنَنِ الهُدَى، وَلَوْ أَنَّكُمْ صَلَّيْتُمْ فِي بُيُوتِكُمْ كَمَا يُصَلِّي هٰذَا المُتَخَلِّفُ فِي بَيْتِهِ لَتَرَكْتُمْ سُنَّةَ نَبِيِّكُمْ، وَلَوْ

1069. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: రేపు (ప్రళయ దినాన) తానొక ముస్లింగా దేవుణ్ణి కలవాలనుకునే వ్యక్తి ఈ నమాజుల కొరకు అజాన్ (ప్రకటన) ఇవ్వబడినప్పుడల్లా వాటిని పరిరక్షించుకోవాలి, (అంటే వాటిని తప్పకుండా నెరవేర్చాలి.) ఎందుకంటే దేవుడు మీ ప్రవక్త కొరకు మార్గదర్శక పద్ధతుల్ని నిర్ణయించాడు. నమాజులు కూడా ఆ మార్గదర్శక పద్ధతుల్లోనివే. ఒకవేళ మీరు కూడా ఈ వెనక ఉండేవాని మాదిరిగా ఇంట్లో నమాజ్ చేసుకుంటే మీరు మీ ప్రవక్త విధానాన్ని వదలి పెట్టినవారవుతారు. మీరు గనక మీ ప్రవక్త విధానాన్ని విడిచి పెట్టినట్లయితే తప్పకుండా భ్రష్టత్వానికి లోనవుతారు.

మా కాలంలో నేను గమనించేవాణ్ణి-

تَرَكْتُمْ سُنَّةَ نَبِيِّكُمْ لَضَلَلْتُمْ، وَلَقَدْ رَأَيْتُنَا وما يَتَخَلَّفُ عَنها إلَّا مُنَافِقٌ مَعْلومُ النِّفَاقِ، وَلَقَدْ كَانَ الرَّجُلُ يُؤتَى بِهِ، يُهَادَى بَيْنَ الرَّجُلَيْنِ حَتَّى يُقَامَ فِي الصَّفِّ. رواه مسلم. وفـي روايـةٍ لـه قـال: إنَّ رسولَ اللهِ ﷺ عَلَّمَنَا سُنَنَ الهُدَى، وَإنَّ مِنْ سُنَنِ الهُدَى الصَّلاةَ فِي المَسْجِدِ الَّذي يُؤَذَّنُ فيه.

పేరెన్నికగన్న కపటులు మాత్రమే (సామూహిక నమాజ్‌లో పాల్గొనకుండా) వెనక ఉండిపోయేవారు. (వ్యాధి మొదలగు కారణాల చేత) నడవలేక పోతున్నవారిని ఇద్దరు మనుషుల సాయంతో తీసుకొని వచ్చి పంక్తిలో నిలబెట్టడం జరిగేది. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) మాకు మార్గ దర్శక పద్ధతులు నేర్పించారు. ఆ మార్గ దర్శక పద్ధతుల్లో అజాన్ ఇవ్వబడే మస్జిద్‌లో నమాజ్ చేయటం కూడా ఒకటి.

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో మొదటగా సామూహిక నమాజు గురించి తాకీదు చేయబడింది. తర్వాత దైవప్రవక్త సహచరులకు నమాజ్ పట్ల ఉండిన శ్రద్ధాసక్తులు వివరించబడ్డాయి. సామూహిక నమాజ్ పట్ల నిర్లక్ష్యం వహించటం కపటుల వైఖరి అని చెప్పబడింది. చివరగా దైవప్రవక్త విధానాన్ని అనుసరించమని పురికొల్పటం జరిగింది.

١٠٧٠ ـ وعن أبي الدرداءِ رضيَ اللهُ عنهُ قال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقول: «ما مِن ثَلاثَةٍ فِي قَرْيَةٍ ولا بَدْوٍ لا تُقَامُ فِيهِمُ الصَّلاةُ إلَّا قَدِ اسْتَحْوَذَ

1070. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ దర్దా (రజి) తెలియజేశారు: ఏ నగరంలోనయినా లేక అడవి ప్రాంతంలోనైనా ముగ్గురు వ్యక్తులుండి అక్కడ (సామూహిక) నమాజు నెలకొల్ప బడకపోతే ఖచ్చితంగా వారిని షైతాన్ లోబరుచుకుంటాడు. కనుక మీరు

عَلَيْهِمُ الشَّيْطَانُ. فَعَلَيْكُمْ بِالْجَمَاعَةِ؛ فَإِنَّمَا يَأْكُلُ الذِّئْبُ مِنَ الْغَنَمِ الْقَاصِيَةَ» رواه أبو داود بإسناد حسن.

సంఘటితులై ఉండండి. తోడేలు మంద నుండి దూరంగా ఉండే మేకనే తినగలుగుతుంది సుమా!

(అబూదావూద్)

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)

**ముఖ్యాంశాలు:**

ఈ హదీసులో కూడా సామూహిక నమాజు ప్రాముఖ్యత గురించి నొక్కి చెప్పబడింది. సామూహిక నమాజు చేయకపోవటం వల్ల కలిగే నష్టాల గురించి వివరించటం జరిగింది. జమాఅత్‌కు (సంఘానికి) దూరంగా ఉండే వ్యక్తి, మందలో నుంచి బయటికివెళ్ళి తోడేలుకు చిక్కే మేక వంటివాడనీ, అతన్ని కూడా షైతాన్ ఇలాగే తన కుశంకలు, దురనుమానాలతో చాలా సులభంగా వల్లో వేసుకుంటాడని ఇందులో చెప్పబడింది.



## 192వ అధ్యాయం

## ١٩٢ ـ بَابُ الْحَثِّ عَلَى حُضُورِ الْجَمَاعَةِ فِي الصُّبْحِ وَالْعِشَاءِ

## ఫజ్ర్ మరియు ఇషా సామూహిక నమాజుల్లో పాల్గొనమని పురికొల్పటం గురించి

١٠٧١ ـ عَنْ عثمانَ بن عفانَ رضيَ اللهُ عنهُ قالَ: سَمعتُ رسولَ اللهِ ﷺ يقولُ: «مَنْ صَلَّى العِشَاءَ في جَمَاعَةٍ، فَكَأَنَّمَا قَامَ نِصْفَ اللَّيْلِ، وَمَنْ صَلَّى الصُّبْحَ في جَمَاعَةٍ، فَكَأَنَّمَا صَلَّى اللَّيْلَ كُلَّهُ» رواه مسلم. وفي روايةِ الترمذيِّ: عنْ عثمانَ بنِ عفانَ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ شَهِدَ العِشَاءَ في جَمَاعَةٍ كَانَ لَهُ قِيَامُ نِصْفِ لَيْلَةٍ، وَمَنْ صَلَّى العِشَاءَ وَالفَجْرَ في جَمَاعَةٍ، كَانَ لَهُ كَقِيَامِ لَيْلَةٍ» قال التِّرمذيّ: حديثٌ حسنٌ صحيحٌ.

1071. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉస్మాన్ బిన్ అప్ఫాన్ (రజి) తెలియజేశారు: ఎవరయినా ఇషా నమాజును సామూహికంగా నెరవేరిస్తే వారు అర్ధ రాత్రి వరకు దైవారాధనలో గడిపినట్లే. మరెవరయితే ఫజ్ర్ నమాజును సామూహికంగా నెరవేరుస్తారో వారు రాత్రంతా నమాజ్ చేసినట్లే. (ముస్లిం)

తిర్మిజీలోని ఉస్మాన్ బిన్ అప్ఫాన్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఇషాకు సంబంధించిన సామూహిక నమాజులో పాల్గొన్నవారికి అర్ధరాత్రి వరకు నమాజ్ చేసినంత పుణ్యం లభిస్తుంది. ఇషా మరియు ఫజ్ర్‌లకు సంబంధించిన సామూహిక నమాజుల్లో పాల్గొనేవారికి ఒక రాత్రంతా నమాజ్ చేసినంత పుణ్యం లభిస్తుంది.

(ఇమామ్ తిర్మిజీ ఈ హదీసును 'హసన్' 'సహీహ్'గా పేర్కొన్నారు.)

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం- సుననె తిర్మిజీలోని నమాజ్ అధ్యాయాలు)

١٠٧٢ ـ وعن أبي هُريرةَ رضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ قال: «وَلَوْ يَعْلَمُونَ مَا في العَتَمَةِ وَالصُّبْحِ لَأَتَوْهُما وَلَوْ حَبْواً» متفق عليه. وقد سبق بطوله.

1072. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం, దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఇషా మరియు ఫజ్ర్ నమాజుల్ని (సామూహికంగా) చేయటంలో ఎంత పుణ్యం ఉందో ప్రజలకు తెలిస్తే, వాటి కోసం మోకాళ్ళు ఈడ్చుకుంటూ నడవవలసివచ్చినా సరే వారు తప్పకుండా వస్తారు.

*(బుఖారీ-ముస్లిం)*

ఈ హదీసు ఇంతకు ముందే వివరంగా వచ్చింది.

١٠٧٣ ـ وعنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «لَيْسَ صَلاةٌ أَثْقَلَ عَلَى المُنَافِقِينَ مِنْ صَلاةِ الفَجْرِ وَالعِشَاءِ وَلَوْ يَعْلَمُونَ مَا فِيهِمَا لَأَتَوْهُما وَلَوْ حَبْواً». متفقٌ عليه.

1073. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కపట విశ్వాసులకు ఫజ్ర్ మరియు ఇషా నమాజులకన్నా బరువైన నమాజ్ మరొకటి లేదు. ఆ రెండింటిని నెరవేర్చటంలో ఎంతపుణ్యం ఉందో వారికి తెలిస్తే, వాటి కోసం మోకాళ్ళు ఈడ్చుకుంటూ నడవవలసి వచ్చినా సరే వారు తప్పకుండా, పోటీపడి మరీ వస్తారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

కపట విశ్వాసులు ఇతరులకు చూపించే ఉద్దేశ్యంతో నమాజ్ చేస్తారు. కనుక ఫజ్ర్ మరియు ఇషా నమాజుల్లో తాము పాల్గొన్నా, చీకటి మూలంగా ఎవరూ తమల్ని గుర్తుపట్టరు. ఆ విధంగా వారి అభిప్రాయం ప్రకారం ఆ నమాజుల వల్ల పెద్దగా ఒరిగే ప్రయోజనం ఏమీ ఉండదు. అందుకే ఆ నమాజుల్లో పాల్గొనటం, వారి మనసులకు పెద్ద బరువుగా తోస్తుంది.

**193వ అధ్యాయం**

# ١٩٣ - بَابُ الأَمْرِ بِالْمُحَافَظَةِ عَلَى الصَّلَوَاتِ الْمَكْتُوبَاتِ وَالنَّهْيِ الأَكِيدِ وَالْوَعِيدِ الشَّدِيدِ فِي تَرْكِهِنَّ

# ఫర్జ్ నమాజుల పరిరక్షణ విషయమై ఆజ్ఞలు, వాటిని త్యజించటంపై కఠినమైన వారింపులు, తీవ్రమైన హెచ్చరికల గురించి

قَالَ اللهُ تَعَالَى: ﴿حَافِظُوا عَلَى الصَّلَوَاتِ وَالصَّلَاةِ الْوُسْطَى﴾ [البقرة: ٢٣٨] وقال تعالى: ﴿فَإِن تَابُوا وَأَقَامُوا الصَّلَاةَ وَآتَوُا الزَّكَاةَ فَخَلُّوا سَبِيلَهُمْ﴾ [التوبة: ٥].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మీరు మీ నమాజులను కాపాడుకోండి-ముఖ్యంగా మధ్య నమాజును."

*(అల్ బఖర-238)*

"ఒకవేళ వారు పశ్చాత్తాపపడితే, నమాజును స్థాపిస్తే, జకాత్ ఇస్తే వారిని విడిచిపెట్టండి."

*(తౌబా-5)*

**వివరణ**

'మధ్యనమాజు' అంటే అస్ర్ నమాజు అని అర్థం. 'విడిచిపెట్టండి' అంటే వారి ధన ప్రాణాలకు హాని తలపెట్టకండి అని భావం. ఇస్లామీయ విధుల్ని నిర్వర్తించే వారెవరైనా ముస్లింగానే పరిగణించబడతారు. కనుక వారికి హానితలపెట్టకూడదు. అంటే నమాజ్, జకాత్‌లాంటి ఇస్లామీయ విధుల్ని నియమనిబద్ధంగా పాటించేవారు ముస్లింలుగా పిలువబడటానికి అర్హులేనన్నమాట!

١٠٧٤ - وعن ابنِ مسعودٍ رضيَ اللهُ عنهُ قالَ: سألتُ رسولَ اللهِ ﷺ: أَيُّ الأَعْمَالِ أَفْضَلُ؟ قالَ: «الصَّلاةُ عَلَى وَقْتِهَا» قلتُ: ثُمَّ أَيٌّ؟ قال: «برُّ الوَالِدَيْنِ» قلتُ: ثُمَّ أَيٌّ؟ قالَ: «الجِهَادُ فِي سَبِيلِ اللهِ» متفقٌ عليه.

1074. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను "దైవానికి అత్యంత ప్రీతికరమైన ఆచరణ ఏది?" అనడిగాను. దానికాయన "వేళకు నమాజ్ చేయటం" అని సమాధానమిచ్చారు. "ఆ తర్వాత ఏది?" అనడిగాను. "తల్లిదండ్రుల

పట్ల మంచిగా మెలగటం" అని అన్నారాయన. నేను మళ్ళీ, "ఆ తర్వాత ఏది?" అనడిగాను. అప్పుడాయన "దైవమార్గంలో పోరాడటం" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

నమాజ్‌ను దాని నిర్ణీత వేళలోనే పాటించాలి. ఆలస్యంగా నమాజ్ చేయటం మంచిది కాదు. నమాజ్ విషయంలో ఆలస్యం చేస్తూపోతే, క్రమంగా మనిషి సోమరి అయిపోతాడు. నమాజ్‌ను నిర్లక్ష్యం చేసే అలవాటు పడిపోతుంది. ఇది మనిషి విశ్వాసానికే గొడ్డలిపెట్టు.

సమయం మించిపోయేదాకా నమాజ్ చేయకుండా ఉండే సోమరులకు మరణ దండన విధించాలని ఇమామ్ షాఫయీ (రహ్మాలై) అభిప్రాయపడ్డారు. ఏది ఏమైనా నమాజ్ పట్ల అశ్రద్ధ వహించటం, ఆలస్యంగా వేళ తప్పించి నమాజ్ చేయటం, అనవసరంగా ఏకకాలంలో రెండు ఫర్జ్ నమాజుల్ని చేయటం, సామూహిక నమాజులకు నిత్యం ఆలస్యంగా హాజరుకావటం మొదలగునవన్నీ ఘోరమైన నేరాలు. ఇవన్నీ నమాజ్‌ను నిర్లక్ష్యం చేయటం క్రిందికే వస్తాయి.

١٠٧٥ - وعن ابنِ عمرَ رضيَ اللهُ عنهما قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «بُنِيَ الإِسْلامُ عَلى خَمْسٍ: شَهَادَةِ أَنْ لا إِلٰهَ إِلاَّ اللهُ، وَأَنَّ مُحَمَّداً رسولُ اللهِ، وَإِقامِ الصَّلاةِ، وَإِيْتَاءِ الزَّكَاةِ، وَحَجِّ البَيْتِ، وَصَوْمِ رَمَضَانَ» متفقٌ عليه.

1075. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఇస్లాం ధర్మం ఐదు పునాదులపై ఆధారపడి ఉంది. 1) అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ (సల్లం) దైవప్రవక్త అని సాక్ష్యం పలకటం, 2) నమాజ్ స్థాపించటం, 3) జకాత్ చెల్లించటం, 4) దైవగృహ యాత్ర చేయటం, 5) రమజాన్ నెలలో ఉపవాసాలు పాటించటం. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని విశ్వాస ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఇస్లాం ధర్మాన్ని ఐదు పునాదులతో కూడిన ఓ గొప్ప కట్టడంతో పోల్చటం జరిగింది. ఏ విధంగానయితే పునాదులు లేకుండా కట్టడం గట్టిగా నిలబడజాలదో

అదే విధంగా పైన పేర్కొనబడిన ముఖ్యాంశాలు లేకుండా ఇస్లాం ధర్మం మనజాలదు. కనుక ఎవరైనా ఆ ఐదు విధుల్లో ఏ ఒక్క విధిని తిరస్కరించినా వారు, 'కాఫిర్' (ధర్మతిరస్కారులు)గా పరిగణించబడతారు. ఒకవేళ సోమరితనంతోనో, ఏమరుపాటుతోనో వాటిని నిర్లక్ష్యం చేస్తే 'ఫాసిఖ్' (పాపాత్ములు)గా పరిగణించబడతారు.

١٠٧٦ ـ وعنـه قـال: قـال رسولُ الله ﷺ: «أُمِرْتُ أَنْ أُقَاتِلَ النَّاسَ حَتَّى يَشْهَدُوا أَنْ لا إِلٰهَ إِلَّا اللهُ وَأَنَّ مُحَمَّدًا رسـولُ اللهِ، وَيُقِيمُـوا الصَّـلاةَ، وَيُـؤتُـوا الزَّكَاةَ، فَإِذَا فَعَلُوا ذلكَ، عَصَمُوا مِنِّي دِمَاءَهُمْ وَأَمْوَالَهُمْ إِلَّا بِحَقِّ الإِسْلامِ، وَحِسَابُهُمْ عَلَى اللهِ» متفقٌ عليه.

1076. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ (స) దేవుని ప్రవక్త అనీ ప్రజలు సాక్ష్యం ఇవ్వనంతవరకూ, (ఆ తర్వాత) నమాజ్ స్థాపించి, జకాత్ దానం చెల్లించనంతవరకూ వారితో యుద్ధం చేస్తూ ఉండాలని నాకు ఆదేశమయింది. వారు గనక ఈ విధుల్ని నెరవేరిస్తే, ఇస్లామీయ చట్టాలకు అనుగుణంగా వారి ధన ప్రాణాలకు నా నుండి రక్షణ ఉంటుంది. (ఇస్లామీయ చట్టాలకు అనుగుణంగా అంటే వారు ఎవరినయినా అన్యాయంగా హత్య చేస్తే దానికి ప్రతిగా వారికి కూడా మరణ దండన ఉంటుంది). ఆ తర్వాత వారి (అంతరంగిక వ్యవహారాల) లెక్కను దేవుడు చూసుకుంటాడు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణాలు)

ఈ హదీసు ఇంతకుముందు 49వ అధ్యాయంలో కూడా వచ్చింది.

١٠٧٧ ـ وعن معاذٍ رضيَ اللهُ عنهُ قَالَ: بعَثني رسولُ اللهِ ﷺ إلى اليَمَن

1077. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నన్ను (యమన్

فقال: «إنَّكَ تَأتِي قَوماً مِنْ أَهْلِ الكِتَابِ، فَادْعُهُمْ إلى شَهَادَةِ أَنْ لا إِلٰهَ إلاَّ الله، وَأَنِّي رسولُ اللهِ، فَإِنْ أَطَاعُوا لِذلكَ، فَأَعْلِمْهُمْ أَنَّ اللهَ تعالى افْتَرَضَ عَلَيْهِمْ خَمْسَ صَلَوَاتٍ فِي كُلِّ يَوْمٍ وَلَيْلَةٍ، فَإِنْ هُمْ أَطَاعُوا لذلكَ، فَأَعْلِمْهُمْ أَنَّ اللهَ تَعَالى افْتَرَضَ عَلَيْهِمْ صَدَقَةً تُؤْخَذُ مِنْ أَغْنِيَائِهِمْ فَتُرَدُّ عَلى فُقَرَائِهِمْ، فَإِنْ هُمْ أَطَاعُوا لِذلكَ، فَإِيَّاكَ وَكَرَائِمَ أَمْوَالِهِمْ وَاتَّقِ دَعْوَةَ المَظْلُومِ، فَإِنَّهُ لَيْسَ بَيْنَهَا وَبَيْنَ اللهِ حِجَابٌ» متفقٌ عليه.

వైపుకు) పంపినప్పుడు, ఇలా హితబోధ చేశారు: (ఓ ముఆజ్!) నువ్వు గ్రంథ వహులైన ప్రజల దగ్గరికి వెళుతున్నావు. (కనుక ముందుగా) నువ్వు వారిని, అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు, ముహమ్మద్ దైవప్రవక్త అని సాక్ష్యం పలకమని ఆహ్వానించు. వారు గనక నీ మాట వింటే అప్పుడు, దేవుడు రేయింబవళ్ళలో వారిపై ఐదుపూటల నమాజులు విధిగా చేశాడని వారికి చెప్పు. దానికీ వారు ఒప్పుకుంటే, దేవుడు వారిపై జకాత్ దానాన్ని విధిగా చేశాడని, అది వారి ధనవంతుల నుండి వసూలు చేయబడి వారిలోని బీదవారికి పంచ బడతుందని తెలియజెయ్యి. దానికి కూడా వారు అంగీకరిస్తే (జకాత్ వసూలు చేసినప్పుడు) నీవు (స్వయంగా) వారి సంపదలోని నాణ్య మైన వస్తువుల్ని తీసుకోకుండా జాగ్రత్త పడు. (అలా చేస్తే వారిని పీడించినట్లవు తుంది కనుక) పీడితుని ఆర్తనాదానికి భయపడు. ఎందుకంటే పీడితుని ఆర్తనాదానికి- దేవునికి మధ్య ఎలాంటి అడ్డుతెర లేదు. (అతని శాపానికి దేవుడు తప్పకుండా ఆమోద ముద్ర వేస్తాడు.) (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

1078. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ జాబిర్ (రజి) తెలియజేశారు: మనిషికీ, దైవతిరస్కారానికి మధ్య విచక్షణారేఖ నమాజ్‌ను వదలిపెట్టడమే. (ముస్లిం)

١٠٧٨ ـ وعن جابرٍ رضيَ اللهُ عنهُ قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقولُ: «إنَّ بَيْنَ الرَّجُلِ وَبَيْنَ الشِّرْكِ وَالكُفْرِ تَرْكَ الصَّلاةِ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

నమాజు, దైవంపై విశ్వాసానికి - దైవతిరస్కారానికి మధ్య అడ్డుగోడ లాంటిది. ఇస్లాం ధర్మాన్ని అవలంబించి నమాజ్ ఆచరించే వ్యక్తి తనకూ - దైవ తిరస్కారానికి మధ్య ఒక అడ్డుగోడను నిర్మించుకుంటాడు. దానివల్ల దైవతిరస్కార, బహుదైవత్వ భావాలు అతన్ని ఏమాత్రం అంటుకొనజాలవు. ఎవరయినా ఇస్లాం స్వీకరించినప్పటికీ నమాజ్ చేయకపోతే, అతనికి - దైవతిరస్కారానికి మధ్య ఎలాంటి అడ్డుగోడ ఉండదు. ఒక విధంగా అతనింకా అవిశ్వాసే! నమాజు, మనిషిని అవిశ్వాస భావాల నుండి నిరోధిస్తుంది. నమాజ్ చేయని వ్యక్తి తనకూ - దైవతిరస్కారానికి మధ్యనున్న అడ్డుగోడను కూల్చేసినట్లే! (ఇబ్నె అల్లాన్).

దీని ద్వారా నమాజును వదలిపెట్టడం దేవుణ్ణి తిరస్కరించటంతో సమానమని బోధపడుతోంది. చాలా మంది పండితులు ఈ ఆదేశం తిరస్కార భావంతో నమాజును వదలిపెట్టేవారికి మాత్రమే పరిమితమనీ, సోమరితనంతో, ఏమరుపాటుతో నమాజును వదలి పెట్టేవారికి ఈ ఆదేశం వర్తించదని అభిప్రాయపడుతున్నారు. తిరిగి పశ్చాత్తాపం చెంది నమాజ్ చేయటం ప్రారంభించకపోతే వారికి కూడా మరణదండన విధించాలని మరికొంతమంది పండితులు అంటున్నారు. ఇంకొంతమంది పండితులు తిరిగి నమాజ్ చేయటం మొదలు పెట్టేవరకు వారిని బాగా దేహశుద్ధి చేయాలని చెబుతున్నారు. మొత్తానికి ఈ హదీసు ద్వారా ఇస్లాంలో నమాజుకు ఎంతటి ప్రాముఖ్యత ఉందో బోధపడుతోంది. నమాజ్ చేయనివారు అసలు ముస్లింలే కారని తెలుస్తోంది.

1079. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మాకు-వారికి మధ్య గీటురాయి నమాజు. దాన్ని వదలి పెట్టినవాడు దైవాన్ని తిరస్కరించినట్లే. (తిర్మిజీ-హసన్, సహీహ్)

١٠٧٩ ـ وعن بُرَيْدَةَ رضيَ اللهُ عنهُ عَنِ النبيِّ ﷺ قال: «العَهْدُ الَّذي بَيْنَنَا وَبَيْنَهُمُ الصَّلاةُ، فَمَنْ تَرَكَهَا فَقَدْ كَفَرَ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

۱۰۸۰ ـ وعن شَقِيقِ بنِ عبدِ الله التَّابعيِّ المُتَّفَقِ عَلى جَلالَتِهِ رَحِمَهُ الله قال: كانَ أَصْحَابُ مُحَمَّدٍ ﷺ لا يَرَوْنَ شَيْئاً مِنَ الأَعْمَالِ تَرْكُهُ كُفْرٌ غَيْرَ الصَّلاةِ. رواه الترمذي في كتابِ الإيمانِ بإسنادٍ صحيحٍ.

1080. హజ్రత్ షఖీఖ్ బిన్ అబ్దుల్లాహ్ తాబయీ (రహ్మాలై) కథనం (ఈయన మంచితనం విషయంలో పండితుల మధ్య ఏకాభిప్రాయం ఉంది): ముహమ్మద్ (సల్లం) సహచరులు ఆచరణల్లో దేనిని విడిచిపెట్టినా 'కుఫ్ర్'గా తలపోసే వారు కాదు, ఒక్క నమాజును తప్ప. (తిర్మిజీ దీనిని విశ్వాస ప్రకరణంలో ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు.)

## ముఖ్యాంశాలు

ఇంతకు ముందు పేర్కొనబడిన హదీసుల్ని దృష్టిలో పెట్టుకునే దైవప్రవక్త (సల్లం) సహచరులు ఆ విధంగా భావించేవారు. కనుక నమాజును వదలిపెట్టడాన్ని 'కుఫ్ర్'గా ఖరారు చేసే హదీసుల్ని దైవప్రవక్త సహచరులు కేవలం మందలింపులుగా భావించేవారు కాదనీ, నమాజు విషయంలో సోమరితనంతో, ఏమరుపాటుతో వ్యవహరించేవారిని కూడా వారు కాఫిర్లు, మతభ్రష్టులుగానే తలపోసేవారని చెప్పటానికి ఈ హదీసు ప్రబల నిదర్శనం.

۱۰۸۱ ـ وعن أَبي هُرَيْرَةَ رضيَ الله عنهُ قالَ: قالَ رسولُ الله ﷺ: «إنَّ أَوَّلَ ما يُحَاسَبُ بِهِ العَبْدُ يَوْمَ القِيَامَةِ مِنْ عَمَلِهِ صَلاتُهُ، فَإِنْ صَلَحَتْ، فَقَدْ أَفْلَحَ وَأَنْجَحَ، وَإِنْ فَسَدَتْ، فَقَدْ خَابَ وَخَسِرَ، فَإِنِ انْتَقَصَ مِنْ فَرِيضَتِهِ شَيْئٌ، قالَ الرَّبُّ عَزَّ وَجَلَّ: انْظُرُوا هَلْ لِعَبْدِي مِنْ تَطَوُّعٍ، فَيُكَمَّلُ مِنها

1081. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నిశ్చయంగా ప్రళయదినాన దాసుని ఆచరణల్లో మొట్టమొదటగా విచారణ జరిగేది నమాజ్ గురించే. అది గనక సక్రమంగా ఉంటే అతను కృతకృత్యుడు, కృతార్థుడు అవుతాడు. అది చెడుగా ఉంటే అతను విఫలుడౌతాడు. వినాశానికి గురౌతాడు. ఒకవేళ అతని ఫర్జ్ నమాజుల్లో ఏదయినా వెలితి ఉంటే, అప్పుడు దేవుడు, "నా దాసుని కర్మపత్రంలో నఫిల్ నమాజులేవైనా

ما انْتَقَصَ مِنَ الفَرِيضَةِ؟ ثُمَّ يَكُونُ سَائِرُ أعمَالِهِ عَلَى هذا» رواه الترمذي وقال: حديث حسن.

ఉన్నాయేమో చూడండి. వాటి ద్వారా ఫర్జ్ నమాజుల వెలితిని పూరించవచ్చు" అని అంటాడు. తర్వాత అతని ఆచరణలన్నిటిని అలాగే విచారించటం జరుగుతుంది. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'ఆచరణలు' అంటే, దైవారాధనలు లేక దేవుని హక్కులు అని భావం. వాటన్నిటిలో ముందుగా నమాజ్ గురించి లెక్క తీసుకోవటం జరుగుతుంది. ఒకవేళ దాసుల హక్కుల విచారణ మొదలైతే వాటిలో ముందుగా రక్తపాతాల గురించి లెక్క తీసుకోబడుతుంది. మొత్తానికి ఈ హదీసు విధుల్ని నెరవేర్చాలనీ, అది కూడా సక్రమంగా నెరవేర్చాలనీ వాటితో పాటు స్వచ్ఛంద సత్కార్యాలు కూడా చేస్తూ ఉండాలని తాకీదు చేస్తోంది. విధుల్లో ఏమయినా వెలితి ఉంటే దానిని స్వచ్ఛంద సత్కార్యాల ద్వారా పూరించటం జరుగుతుందని చెబుతోంది.



**194వ అధ్యాయం**

## ١٩٤ ـ بَابُ فَضْلِ الصَّفِّ الأَوَّلِ وَالأَمْرِ بِإتْمَامِ الصُّفُوفِ الأُوَلِ، وتَسْوِيَتِهَا، وَالتَّرَاصِّ فِيهَا

## మొదటి పంక్తి ఘనత గురించి, తొలి పంక్తుల్ని భర్తీ చేయాలి, పంక్తుల్ని తిన్నగా ఉంచాలి, మధ్యలో ఖాళీ స్థలం వదలకుండా కలిసి నించోవాలి అనే ఆజ్ఞల గురించి

١٠٨٢ ـ عَنْ جَابِرِ بْنِ سَمُرَةَ رَضِيَ اللهُ عَنْهُمَا، قَالَ: خَرَجَ عَلَيْنَا رَسُولُ اللهِ ﷺ فَقَالَ: «أَلا تَصُفُّونَ كَمَا تَصُفُّ المَلائِكَةُ عِنْدَ رَبِّهَا؟» فَقُلْنَا: يَا رَسُولَ اللهِ! وَكَيْفَ تَصُفُّ المَلائِكَةُ عِنْدَ رَبِّهَا؟ قَالَ: «يُتِمُّونَ الصُّفُوفَ الأُوَلَ، وَيَتَرَاصُّونَ فِي الصَّفِّ» رواه مسلم.

1082. హజ్రత్ జాబిర్ బిన్ సమురహ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మా దగ్గరికి వచ్చి, "దైవదూతలు తమ ప్రభువు దగ్గర ఏ విధంగా బారులు తీరి నిలబడతారో ఆ విధంగా మీరూ నిలబడరా?"అని అన్నారు. అందుకు మేము, "దైవప్రవక్తా! దైవదూతలు తమ ప్రభువు దగ్గర ఎలా బారులు తీరి నిలబడతారు?" అని అడిగాం. దానికాయన, "వారు ముందుగా తొలి పంక్తుల్ని భర్తీ చేస్తారు. పోతపోసిన సీసపు గోడలాగా బాగా కలిసి నించుంటారు" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

గోడలో పేర్చబడిన ఇటుకలు ఒకదానికొకటి అతుక్కొని ఉంటాయి. వాటి మధ్య ఖాళీ స్థలం ఉండదు. అదే విధంగా నమాజ్ చేసే వ్యక్తులు కూడా బారులు తీరి నిలబడి నప్పుడు తమ మధ్య ఎలాంటి ఖాళీ స్థలం వదలకుండా పాదానికి పాదం, భుజానికి భుజం ఆనించి నించోవాలి. పంక్తులు ఒంకరటింకరగా లేకుండా, పోతపోసిన దృఢమైన సీసపు గోడలాగా తిన్నగా నిలబడాలి. అదే విధంగా పంక్తుల్లో నిలబడినప్పుడు ముందుగా తొలి

పంక్తుల్ని పూర్తిచేయాలి. తొలి పంక్తుల్లో ఖాళీ స్థలముంచుకొని వెనక పంక్తుల్లో నించోవటం భావ్యం కాదు.

١٠٨٣ ـ وعن أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَوْ يَعْلَمُ النَّاسُ مَا في النِّدَاءِ وَالصَّفِّ الأَوَّلِ، ثُمَّ لَمْ يَجِدُوا إِلَّا أَنْ يَسْتَهِمُوا عَلَيْهِ لَاسْتَهَمُوا» متفقٌ عليه.

1083. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అజాన్ చెప్పటానికి, తొలి పంక్తిలో చేరటానికి ఎంతటి ఘనత ఉందో ప్రజలకు తెలిస్తే, దానిని పొందటానికి పరస్పరం లాటరీ వేసుకోవటం తప్ప గత్యంతరం లేదని తెలిస్తే, వారు తప్పకుండా లాటరీ వేసుకుంటారు. (బుఖారీ-ముస్లిం)

١٠٨٤ ـ وعنه قال: قال رَسُولُ اللهِ ﷺ: «خَيْرُ صُفُوفِ الرِّجَالِ أَوَّلُهَا، وَشَرُّهَا آخِرُهَا، وَخَيْرُ صُفُوفِ النِّسَاءِ آخِرُهَا، وَشَرُّهَا أَوَّلُهَا» رواه مسلم.

1084. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పురుషుల పంక్తుల్లో అత్యంత శ్రేష్ఠమైనది మొదటి పంక్తి. అత్యంత హీనమైనది చివరి పంక్తి. స్త్రీల పంక్తుల్లో అత్యంత శ్రేష్ఠమైనది చివరి పంక్తి. అత్యంత హీనమైనది మొదటి పంక్తి. (ముస్లిం)
(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పరపురుషుల, పర స్త్రీల కలయికను ఇస్లాం ధర్మం తీవ్రంగా గర్హిస్తుంది. అలాంటి స్త్రీ పురుషులు పరస్పరం దూరాన్ని పాటించాలని, పరదా చేయాలని ఆదేశిస్తోంది. పంక్తుల యొక్క ఉత్కృష్టత, నికృష్టతల గురించి వివరిస్తున్న ఈ హదీసు కూడా, ఆ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పబడిందే!

దైవప్రవక్త (సల్లం) కాలంలో మస్జిదె నబవీలో పురుషులతో పాటు స్త్రీలు కూడా సామూహిక నమాజుల్లో పాల్గొనేవారు. పురుషుల పంక్తుల వెనకే స్త్రీలు కూడా బారులు తీరి నమాజు చేసేవారు. ఆ రోజుల్లో స్త్రీల కోసం గ్యాలెరీలుగాని, ప్రత్యేక ఏర్పాట్లుగాని ఉండేవి కావు. ఆ స్థితిలో పురుషుల తొలిపంక్తి స్త్రీలకు చాలా దూరంగా ఉంటుంది. కనుకనే దాన్ని శ్రేష్ఠమైన పంక్తిగా పేర్కొనటం జరిగింది. అదే విధంగా స్త్రీల చివరి పంక్తి కూడా పురుషులకు

దూరంగా ఉంటుంది, కనుక దాన్ని కూడా శ్రేష్ఠమైన పంక్తి అని అనటం జరిగింది. దీనికి భిన్నంగా పురుషుల చివరి పంక్తి మరియు స్త్రీల మొదటి పంక్తికి మధ్య ఆట్టే ఎక్కువ దూరం ఉండదు. కాబట్టి ఆ రెంటినీ నికృష్టమైన పంక్తులుగా పేర్కొనటం జరిగింది. అయితే ఈ ఉత్కృష్ట నికృష్టతలు పుణ్యం రీత్యా నిర్ణయించబడినవేకాని స్వతహాగా ఏ పంక్తీ నికృష్టమైనది కాదు. నమాజు కోసం నిలబడిన పంక్తులన్నీ ఉత్కృష్టమైనవే. కాకపోతే పైన పేర్కొనబడిన కారణం వల్ల పురుషుల తొలిపంక్తిలో, స్త్రీల చివరి పంక్తిలో నించున్నవారికి ఎక్కువ పుణ్యం లభిస్తుంది. దీనికి భిన్నంగా పురుషుల చివరి పంక్తిలో, స్త్రీల మొదటి పంక్తిలో నించున్నవారికి తక్కువ పుణ్యం లభిస్తుంది.

١٠٨٥ ـ وعن أَبي سَعِيدٍ الخُدْرِيِّ رضيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ رَأَى في أَصْحَابِهِ تَأَخُّراً، فَقَالَ لَهُمْ: «تَقَدَّمُوا فَأْتَمُّوا بِي. وَلْيَأْتَمَّ بِكُمْ مَنْ بَعْدَكُمْ، لا يَزالُ قَوْمٌ يَتَأَخَّرُونَ حَتَّى يُؤَخِّرَهُمُ اللهُ» رواه مسلم.

1085. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం: తన సహచరులు వెనుక (పంక్తుల్లో) ఉండిపోవటం చూసి దైవప్రవక్త (సల్లం) వారిని మందలిస్తూ, "ముందుకు రండి, మీరు నన్ను అనుసరించండి. మీ తర్వాత వచ్చిన వారు మిమ్మల్ని అనుసరిస్తారు. (జాగ్రత్త!) ప్రజలు గనక ఎప్పుడూ వెనకే ఉంటే దేవుడు కూడా వారిని వెనక బాటు తనానికి గురిచేస్తాడు" అని అన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నమాజ్ విషయంలో వెనుకంజ వేయటాన్ని, వెనక పంక్తుల్లో నమాజ్ చేయటాన్ని దైవప్రవక్త (సల్లం) అసహ్యించుకునేవారు. తనకు దగ్గరగా, తొలిపంక్తుల్లో నమాజ్ చేయమని సహచరులకు తాకీదు చేసేవారు. ఆ సందర్భంగా ఆయన, ఎల్లప్పుడూ వెనుక ఉండేవారిని దేవుడు కూడా వెనుకబాటుతనానికి గురిచేస్తాడని హెచ్చరించేవారు. ఆయన చేసిన ఆ హెచ్చరిక ఒక్క నమాజ్‌కే కాదు, ఇతర సత్కార్యాలన్నిటికీ వర్తిస్తుంది. జీవితపు ఏ రంగంలో నయినా పైకి ఎదగాలంటే మనిషిలో దూసుకుపోయే తత్త్వం ఉండాలి. గౌరవ ప్రతిష్ఠలు, విద్యా, ఆచరణ మొదలగు రంగాల్లో బిడియ పడకుండా, వెనుకంజ వేయకుండా సాధన చేసినప్పుడే వ్యక్తిత్వాలు ఇనుమడిస్తాయి. తమకంటూ ఓ శ్రేష్ఠమైన స్థానాన్ని సంపాదించు కోవాలనుకునేవారు దానికి తగ్గట్టు కృషి చేయాలి. ఆ విధంగా కృషిచేస్తే దేవుడు కూడా వారి కొరకు మార్గాలను సుగమం చేస్తాడు.

1086. హజ్రత్ అబూ మస్వూద్ (రజి) కథనం: (మేము నమాజు కోసం నించున్నప్పుడు) దైవప్రవక్త (సల్లం) మా భుజాలను తాకుతూ "తిన్నగా నిలబడండి. మీరు పరస్పరం విభేదించుకోకండి. లేకపోతే (విభేదించుకుంటే) మీ హృదయాలు కూడా విభేదించుకుంటాయి. నేను నమాజు చేయిస్తున్నప్పుడు మీలోని బుద్ధిమంతులు, తెలివిగలవారు నాకు దగ్గరగా నిలబడాలి. వారి వెనుక, వారికన్నా తక్కువ ప్రతిభావంతులు నిలబడాలి. ఆ తర్వాత వారికన్నా తక్కువ ప్రతిభావంతులు నిలబడాలి" అని ఉపదేశించేవారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)

١٠٨٦ ـ وعن أَبي مسعودٍ رضيَ اللهُ عَنْهُ، قال: كانَ رسولُ اللهِ ﷺ يَمْسَحُ مَنَاكِبَنا في الصَّلاةِ، وَيقُولُ: «اسْتَوُوا وَلا تَخْتَلِفُوا فَتَخْتَلِفَ قُلُوبُكُمْ، لِيَلِنِي مِنْكُمْ أُولُو الأَحْلامِ وَالنُّهَى، ثُمَّ الَّذِينَ يَلُونَهُمْ، ثُمَّ الَّذِينَ يَلُونَهُمْ» رواه مسلم.

## ముఖ్యాంశాలు

బాహ్య స్థితిగతుల ప్రభావం అంతరంగాలపై పడుతుందనటానికి ఈ హదీసు ప్రబల నిదర్శనం. హదీసులోని "విభేదించుకోకండి..." అనే వాక్యం ఈ విషయాన్నే సూచిస్తోంది. నమాజ్ చేసేటప్పుడు పంక్తులు ఒంకరటింకరగా ఉంటే హృదయాల్లో కూడా వక్రత చోటు చేసుకుంటుంది. దానివల్ల ఉపద్రవాలు తలెత్తుతాయి. భేదాభిప్రాయాలు జనిస్తాయి. ముస్లింల ఐకమత్యం ఛిన్నాభిన్నమైపోతుంది. శత్రువు వారి మీద ఆధిక్యతను సాధిస్తాడు. కనుక ఇమామ్ నమాజ్ మొదలుపెట్టే ముందు పంక్తుల్ని తిన్నగా ఉంచుకోమని ప్రకటించాలి. అప్పటికీ పంక్తులు తిన్నగా అవకపోతే తన చేతుల్తో ప్రజల్ని సరిగ్గా నిలబెట్టాలి. దైవప్రవక్త (సల్లం) స్వయంగా అలా చేసేవారు. ఇమామ్‌కు దగ్గర్లో తెలివి, సమయస్ఫూర్తి గలవారు నించోవాలి. దీనిద్వారా ఇస్లాంలో ప్రతిభావంతులకు, బుద్ధిజీవులకు ఎంతటి ప్రాముఖ్యం ఉందో బోధపడుతోంది. దైవప్రవక్త (సల్లం) నమాజు సమయంలో కూడా, అలాంటివారు తన చెంతనుండాలని కోరుకునేవారు.

1087. హజ్రత్ అనస్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీ పంక్తుల్ని తిన్నగా

١٠٨٧ ـ وعن أنسٍ رضيَ اللهُ عَنْهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «سَوُّوا صُفُوفَكُمْ؛ فَإِنَّ تَسْوِيَةَ الصَّفِّ مِنْ تَمَامِ

الصَّلاةِ» متفقٌ عليه. وفي رواية البخاري: «فإنَّ تَسْوِيَةَ الصُّفُوفِ مِنْ إقَامَةِ الصَّلاةِ».

ఉంచుకోండి. నిశ్చయంగా పంక్తుల్ని తిన్నగా ఉంచుకోవటం నమాజు పరిపూర్ణతలో అంతర్భాగం.
(బుఖారీ-ముస్లిం)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో 'పంక్తుల్ని తిన్నగా ఉంచటం నమాజు స్థాపనలో అంతర్భాగం' అని చెప్పబడింది.

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా నమాజు చేసేటప్పుడు పంక్తుల్ని తిన్నగా ఉంచుకోమని తాకీదు చేయబడింది. పైగా అది నమాజు వ్యవస్థ పరిపూర్ణతలో, నమాజు స్థాపనలో అంతర్భాగమని చెప్పబడింది. కనుక పంక్తులు తిన్నగా లేకుండా నమాజ్ చేస్తే, ఆ నమాజు పూర్తిగా నెరవేరినట్లు కాదు. ఈ విధంగా నమాజ్‌కు సంబంధించి కూడా శిక్షణ ఇవ్వబడుతున్నదంటే దీనిద్వారా మన ధర్మంలో క్రమశిక్షణకు ఎంత ప్రాముఖ్యత ఉందో బోధపడుతోంది.

١٠٨٨ ـ وَعَنْهُ قَالَ: أُقِيمَتِ الصَّلاةُ، فَأَقْبَلَ عَلَيْنَا رَسُولُ اللهِ ﷺ بِوَجْهِهِ فَقَالَ: «أَقِيمُوا صُفُوفَكُمْ وَتَرَاصُّوا، فَإِنِّي أَرَاكُمْ مِنْ وَرَاءِ ظَهْرِي» رَوَاهُ البُخَارِي بِلَفْظِهِ، وَمُسْلِمٌ بِمَعْنَاهُ. وفي رِوَايَةٍ لِلْبُخَارِي: وَكَانَ أَحَدُنَا يُلْزِقُ مَنْكِبَهُ بِمَنْكِبِ صَاحِبِهِ وَقَدَمَهُ بِقَدَمِهِ.

1088. హజ్రత్ అనస్ (రజి)గారే చేసిన కథనం: ఓ రోజు నమాజు కోసం ఇఖామతు చెప్పబడింది. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) మా వైపుకు తిరిగి "పంక్తుల్ని తిన్నగా ఉంచుకోండి. పోత పోసిన సీసపు గోడ మాదిరిగా కలిసి నిలబడండి. నేను వెనుకవైపు నుండి మీ చర్యల్ని గమనిస్తూ ఉంటాను" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

పై వాక్యాలు బుఖారీలోనివి. ఇలాంటి ఒక ఉల్లేఖనం ముస్లింలో కూడా ఉంది. బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో 'మాలోని ప్రతి ఒక్కరూ తన ప్రక్కనున్నవారి భుజానికి భుజం,

పాదానికి పాదం ఆనించి నించునే
వారు" అని ఉంది.

(సహీహ్ బుఖారీ లోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం)గారి మహిమ ఒకటి వివరించబడింది. సామూహిక నమాజులో ఉన్నప్పుడు వెనుక పంక్తుల్లో నమాజ్ చేస్తున్న తన సహచరుల రుకూ, సజ్దాలను కూడా ఆయన గమనించగలిగేవారు. అయితే చాలామంది అనుకుంటున్నట్లు, ఆయన తాను తలచినప్పుడల్లా ఆ విధంగా చూడగలిగేవారు కాదు. సామూహిక నమాజుల్లో, అది కూడా దైవాభీష్టం మేరకే ఆ మహిమ జరిగేది. ఎందుకంటే మహిమలనేవి దేవుడు తలచినప్పుడే ఉనికిలోకి వస్తాయి. దైవప్రవక్తలు ఈ విషయంలో నిమిత్త మాత్రులే. కనుక వారు తాము కోరినప్పుడల్లా మహిమల్ని ప్రదర్శించలేరు. దైవప్రవక్తలకే గనక ఆ శక్తి ఉండివున్నట్లయితే తాము తలచినప్పుడల్లా, ప్రజలు కోరినప్పుడల్లా వారు మహిమల్ని చూపించి ఉండేవారు. కాని దైవప్రవక్తల్లో అంతటి శక్తిమంతులెవరూ లేరు. ఆఖరికి ముహమ్మద్ (సల్లం)కు కూడా ఆ శక్తి ప్రసాదించబడలేదు. ఈ హదీసు ద్వారా బోధపడే రెండో విషయం ఏమిటంటే- నమాజు కోసం బారులుతీరి నిలబడినప్పుడు ప్రజలు పరస్పరం భుజానికి భుజం, పాదానికి పాదం ఆనించి తిన్నగా నించోవాలి. ఏ విధంగానయితే పోతపోసిన గోడ దృఢంగా తిన్నగా ఉంటుందో, నమాజ్ చేసే వారు కూడా అదేవిధంగా దృఢంగా, తిన్నగా బారులు తీరి నిలబడాలని ప్రబోధించటం జరిగింది.

١٠٨٩ - وَعَنِ النُّعْمَانِ بنِ بَشِيرٍ رضِيَ اللهُ عنهما، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقولُ: «لَتُسَوُّنَّ صُفُوفَكُمْ، أَوْ لَيُخَالِفَنَّ اللهُ بَيْنَ وُجُوهِكُمْ» مُتَّفَقٌ عَلَيْهِ.

1089. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) తెలియజేశారు: 'మీరు మీ పంక్తుల్ని తిన్నగా ఉంచుకోవాలి. లేకపోతే అల్లాహ్ మీ ముఖాలను పరస్పరం వ్యతిరేకంగా మార్చివేస్తాడు.' (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) బాణాలను పంక్తులతో తిన్నగా చేసినట్లు మా పంక్తుల్ని సరిచేసేవారు. ఆ విధంగా తన ప్రవర్తన ద్వారా మేము దీని

وفي روايةٍ لمسلِمٍ: أَنَّ رسولَ اللهِ ﷺ كَانَ يُسَوِّي صُفُوفَنَا، حَتَّى كَأَنَّمَا يُسَوِّي بِهَا القِدَاحَ، حَتَّى رَأَى أَنَّا قَدْ عَقَلْنَا عَنْهُ. ثُمَّ خَرَجَ يَوْماً فَقَامَ حَتَّى كَادَ يُكَبِّرُ، فَرَأَى رَجُلاً بَادِياً صَدْرُهُ مِنَ الصَّفِّ، فقالَ: «عِبَادَ اللهِ، لَتُسَوُّنَّ صُفُوفَكُمْ، أَوْ لَيُخَالِفَنَّ اللهُ بَيْنَ وُجُوهِكُمْ».

ప్రాముఖ్యతను అర్థం చేసుకున్నామని గ్రహించాకే ఆయన (అల్లాహు అక్బర్ అంటూ నమాజ్ మొదలెట్టేవారు.) ఒకరోజు ఆయన (నమాజ్ చేయించటం కోసం ఇంటి నుండి) బయటికి వచ్చారు. నమాజు కోసం నిలబడి అల్లాహు అక్బర్ అనబోయేంతలో (వెనుక నించున్న) ఒక వ్యక్తి రొమ్ము భాగం, (పంక్తి నుండి) బయటికి వచ్చి నట్లు ఆయనకు కనిపించింది. వెంటనే ఆయన "దేవుని దాసులారా! (నమాజుకు ఉపక్రమించి నప్పుడు) మీరు మీ పంక్తుల్ని తప్పకుండా తిన్నగా ఉంచుకోవాలి. లేకపోతే అల్లాహ్ మీ ముఖాల్ని పరస్పరం వ్యతిరేకంగా మార్చివేస్తాడు" అని హెచ్చరించారు.

*(సహీహ్ బుఖారి, కితాబుల్ అజాన్ - సహీహ్ ముస్లిం, కితాబుస్సలాత్)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు కూడా వచ్చింది. ఇది, ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది. కనుక గ్రంథకర్త దీనిని మళ్ళీ ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించారు. ఈ హదీసులో 'దేవుడు మీ ముఖాలను పరస్పరం వ్యతిరేకంగా మార్చివేస్తాడు' అని చెప్పబడింది. అంటే మీ మధ్య విద్వేషాన్ని, వైషమ్యాన్ని సృష్టిస్తాడని భావం. దానివల్ల మీలో ఐకమత్యం నశించి అనైక్యత, అలజడులు చోటుచేసుకుంటాయి. మీ శక్తిసామర్థ్యాలు సన్నగిల్లుతాయి. మీ మధ్య శాంతీ సౌమనస్యాలు అంతరించిపోయి, అశాంతి అలజడులు చెలరేగుతాయి. ఇస్లాం మరియు ముస్లింల ప్రాబల్యం నశించి శత్రువు ఆధిపత్యం మీ మీద తిష్ఠ వేస్తుంది.

లేక ముఖాలను పరస్పరం వ్యతిరేకంగా మార్చివేయటమంటే శాబ్దిక అర్థమైనా కావచ్చు. అంటే పంక్తుల్ని తిన్నగా ఉంచకపోతే దానికి శిక్షగా దేవుడు మీ ముఖాలను మెడల వైపునకు త్రిప్పుతాడని భావం. ఆ రెండు రకాల శిక్షల నుండి దేవుడు మనందరిని రక్షించుగాక!

1090. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) పంక్తుల మధ్య ఆ చివర నుండి ఈ చివర వరకు తిరిగేవారు. మా రొమ్ముల్ని, భుజాల్ని పట్టుకొని (పంక్తుల్ని సరిచేస్తూ) 'ఒంకర టింకరగా నించోకండి. లేదా మీ హృదయాలు కూడా ఒంకరటింకరగా అయిపోతాయి' అనేవారు. ఇంకా ఇలా అనేవారు: 'నిస్సందేహంగా దేవుడు, దైవదూతలు తొలి పంక్తుల్లో ఉండేవారిపై కారుణ్యాన్ని కురిపిస్తారు." (అబూదావూద్-దీని ఆధారాలు హసన్ కోవకు చెందినవి.)

١٠٩٠ - وَعَنِ البَرَاءِ بنِ عازِبٍ رضيَ اللهُ عنهما قالَ: كانَ رسولُ الله ﷺ يَتَخَلَّلُ الصَّفَّ مِنْ نَاحِيَةٍ إلى نَاحِيَةٍ، يَمْسَحُ صُدُورَنَا، وَمَنَاكِبَنَا، ويقولُ: «لا تَخْتَلِفُوا فَتَخْتَلِفَ قُلُوبُكُمْ» وَكَانَ يَقُولُ: «إنَّ اللهَ وَمَلائِكَتَهُ يُصَلُّونَ على الصُّفُوفِ الأُوَلِ».

رواه أبو داود بإسنادٍ حَسَنٍ.

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో కూడా పంక్తుల్ని తిన్నగా ఉంచాలని తాకీదు చేయబడింది. బాహ్యపరమైన విభేదాల వల్ల అంతరంగాల్లో కూడా విభేదాలు చోటు చేసుకుంటాయని చెప్పబడింది. నమాజు చేస్తున్నప్పుడు పంక్తుల్లో ముందుకి లేక వెనక్కి జరిగి నించోవటం ఒక విధంగా బాహ్యపరమైన విభేదం లాంటిది. దాని చెడు ప్రభావం నమాజీల మనసుల మీద కూడా పడుతుంది. ఫలితంగా వారిలో వ్యతిరేక భావాలు జనిస్తాయి.

రెండో విషయం ఏమిటంటే-'సలాత్' అనే పదానికి కారుణ్యం కురిపించటం అనీ, మన్నింపు కోసం వేడుకోవటం అని అర్థం. అంటే దైవదూతలు తొలి పంక్తుల్లోని వారి మన్నింపు కోసం ప్రార్థిస్తారనీ, అల్లాహ్ వారి మీద కారుణ్య వర్షాన్ని కురిపిస్తాడని దాని భావం.

1091. హజ్రత్ ఉబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పంక్తుల్ని తిన్నగా ఉంచండి, భుజాలు పరస్పరం సమానంగా ఉండేలా సరిచేసుకోండి.

١٠٩١ - وعَنِ ابنِ عُمَرَ رضيَ اللهُ عنهما، أنَّ رسولَ الله ﷺ قالَ: «أَقِيمُوا الصُّفُوفَ، وَحَاذُوا بَيْنَ المَنَاكِبِ، وَسُدُّوا

الخَلَلَ، وَلِينوا بِأَيْدِي إِخْوَانِكُمْ، وَلا تَذَرُوا فُرُجَاتٍ لِلشَّيْطَانِ، وَمَنْ وَصَلَ صَفًّا وَصَلَهُ اللهُ، وَمَنْ قَطَعَ صَفًّا قَطَعَهُ اللهُ». رواه أبو داود بإسنادٍ صحيحٍ.

పంక్తుల మధ్య ఖాళీని పూరించండి. మీ సోదరుల చేతుల్లో మెత్తగా మారిపోండి. షైతాన్ కోసం (పంక్తుల మధ్య) ఖాళీ స్థలాన్ని వదలి పెట్టకండి. ఎవరయితే పంక్తుల్ని కలుపుతారో వారిని దేవుడు కలుపుతాడు. మరెవరయితే పంక్తుల్ని త్రెంచుతారో దేవుడు కూడా వారిని త్రెంచుతాడు. (అబూ దావూద్- దీని ఆధారాలు దృఢమైనవి)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"మీ సోదరుల చేతులకు మెత్తగా ఉండండి" అంటే పంక్తుల్ని సరిచేయటానికి ప్రయత్నించేవారితో సహకరించండి, వారిని విసుక్కోకుండా, వారిచ్చే ఆజ్ఞల్ని సహృదయంతో అంగీకరించి పంక్తుల్ని తిన్నగా చేసుకోండి అని భావం. ఈ హదీసులో కూడా పంక్తుల్ని తిన్నగా ఉంచుకోమని ఆజ్ఞాపించబడింది. పంక్తుల మధ్య ఖాళీ స్థలం వదలటం పైశాచిక శక్తులకు చోటు కల్పించటంతో సమానమని చెప్పబడింది.

పంక్తుల్ని కలపటమంటే పంక్తుల మధ్య ఖాళీ వదలకుండా, తొలి పంక్తి పూర్తయిన తర్వాత వెనక పంక్తిలో నించోవటం అని అర్థం. అదే విధంగా పంక్తుల్ని త్రెంచటమంటే పంక్తుల మధ్య ఖాళీ స్థలం వదలిపెట్టి నించోవటం, మొదటి పంక్తిలో స్థలం ఉండగా వెనక పంక్తిలో నించోవటం అని అర్థం. హదీసులో వచ్చిన చివరి వాక్యాలను "పంక్తుల్ని కలిపేవారిని దేవుడు కలుపుగాక! పంక్తుల్ని త్రెంచేవారిని దేవుడు త్రెంచుగాక!" అని ప్రార్థనా ధోరణిలో కూడా చెప్పవచ్చు. ఆ విధంగా చెప్పినట్లయితే దైవప్రవక్త (సల్లం), ఆ వాక్యాల ద్వారా పంక్తుల్ని కలిపేవారిని ఆశీర్వదించారనీ, వాటిని త్రెంచేవారిని శపించారని అర్థం చేసుకోవాలి.

١٠٩٢ - وَعَنْ أنسٍ رضيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ قالَ: «رُصُّوا صُفُوفَكُمْ، وَقَارِبُوا بَيْنَهَا، وَحَاذُوا بِالأَعْنَاقِ فَوَالَّذِي نَفْسِي بِيَدِهِ إِنِّي لأَرَى الشَّيْطَانَ يَدْخُلُ مِنْ خَلَلِ الصَّفِّ، كَأَنَّهَا الحَذَفُ» حديث

1092. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: పంక్తుల్లో పోతపోసిన గోడమాదిరిగా నించోండి. పంక్తులు పరస్పరం దగ్గరగా ఉండేటట్లు నిలబడండి. మెడలను సమానంగా

صحيح رواه أبو داود بإسنادٍ على شرط مسلم. «الحـذَفُ» بحـاءٍ مهملـةٍ وذالٍ معجمةٍ مفتوحتين ثم فاءٍ، وهي: غَنَمٌ سُودٌ صغارٌ تَكُونُ بِالْيَمَنِ.

ఉంచండి. ఎవరిచేతిలోనయితే నా ప్రాణముందో ఆయన సాక్షి! నిస్సందేహంగా నేను చూస్తున్నాను. షైతాన్ మేకపిల్లలాగా పంక్తుల్లో ఉండే ఖాళీ స్థలం గుండా దూరిపోతున్నాడు. (ఈ హదీసు దృఢమైనది. అబూ దావూద్ దీనిని ముస్లిం గారి ఆధార షరతులకు అనుగుణంగా వెలికితీశారు.)

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పంక్తుల్ని పోతపోసిన గోడలమాదిరిగా, దృఢంగా ఉంచాలనే ఆజ్ఞతోపాటు, వాటిని పరస్పరం దగ్గరగా ఉంచాలని కూడా ఈ హదీసులో బోధించబడింది. కనుక నమాజ్ చేస్తున్నప్పుడు పంక్తుల మధ్య మరీ అంత ఎక్కువ యెడం ఉండకూడదు. మెడలను సమానంగా ఉంచటమంటే వాస్తవానికి భుజాలను సమానంగా ఉంచటమని భావం. దీని గురించి ఇంతకుముందు కూడా వివరించటం జరిగింది. ఇక షైతాన్ పంక్తుల గుండా దూరిపోయే విషయానికొస్తే, బహుశా దైవప్రవక్త (సల్లం) నిజంగానే తన కళ్లారా ఆ దృశ్యాన్ని తిలకించి ఉండవచ్చు. అంటే దేవుడు ఒక మహిమ రూపంలో ఆ దృశ్యాన్ని చూపించి ఉండవచ్చు. లేదా 'వహీ' ద్వారా ఆయనకు ఈ విషయం తెలిసి ఉంటుంది.

١٠٩٣ ـ وعنـهُ، أَنَّ رسـولَ الله ﷺ قال: «أَتِمُّوا الصَّفَّ المُقَدَّمَ، ثُمَّ الَّذي يَلِيهِ، فَمَا كَانَ مِنْ نَقْصٍ فَلْيَكُنْ في الصَّفِّ المُؤَخَّرِ» رواه أبو داود بإسنادٍ حسن.

1093. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ముందుగా తొలి పంక్తిని భర్తీ చేయండి. తర్వాత దాని వెనక పంక్తిని భర్తీ చేయండి. ఏమైనా వెలితి ఉంటే అది వెనక పంక్తిలోనే ఉండాలి. (అబూదావూద్-ఆధారాలు ప్రామాణికమైనవి)

## ముఖ్యాంశాలు

పంక్తుల్ని భర్తీ చేయటం చాలా అవసరం. కనుక తొలిపంక్తులు నిండిన తర్వాతే వెనక పంక్తుల్లో నించోవాలి. ముందు పంక్తులు నిండకముందే వెనకపంక్తుల్లో నించుంటే ముందు పంక్తులు వెలితిగా ఉంటాయి. ఆ విధంగా నించోవటం భావ్యం కాదు. వెలితి ఏమైనా ఉంటే వెనక పంక్తిలో ఉండాలిగాని ముందు పంక్తుల్లో ఉండకూడదు.

١٠٩٤ ـ وعن عائشةَ رضيَ الله عنها قــالــتْ: قــالَ رســولُ اللهِ ﷺ: «إنَّ اللهَ وَمَلائِكَتَهُ يُصَلُّونَ عَلى مَيَامِنِ الصُّفُوفِ» رواه أبو داود بإسنادٍ عَلى شَرْطِ مُسْلِمٍ، وفيه رجلٌ مُخْتَلَفٌ في تَوْثِيقِهِ.

1094. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నిస్సందేహంగా దేవుడు మరియు దైవదూతలు పంక్తుల్లో కుడివైపున ఉండేవారి మీద కారుణ్యాన్ని కురిపిస్తారు. (ఈ హదీసును అబూదావూద్ ముస్లిం ఆధార షరతులను అనుసరించి వెలికి తీశారు. దీని ఆధారాల్లో ఒక ఉల్లేఖకుడు ఉన్నాడు. అతని విశ్వసనీయత విషయమై హదీసువేత్తల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

"ఆ ఉల్లేఖకుడు ఉసామా బిన్ జైద్ లైసీ. ఈయన విషయంలో హదీసు పరిశోధకులు, నిపుణులు ఎట్టకేలకు ఒక నిర్ణయానికి వచ్చారు. దాని ప్రకారం ఒకవేళ ఈయన వివరించిన హదీసు ఇతర ఉల్లేఖకుల హదీసులకు విరుద్ధంగా లేకపోతే, అది ప్రామాణికమైనదే" అని షేఖ్ అల్‌బానీ తెలిపారు. ఈ హదీసు గురించి 'తాలీఖాతె మిష్కాత్'లో అల్‌బానీగారు ఇలా అంటున్నారు: 'దీని ఆధారాలు ప్రామాణికమైనవే. కాని దీని ఉల్లేఖకులలో కొందరు హదీసు మూలాన్ని వివరించటంలో పొరపడ్డారు. వీరు హదీసుని 'పంక్తుల్లో కుడివైపున ఉండేవారి మీద' అని ఉల్లేఖించారు. విశ్వసనీయులైన ఉల్లేఖకులు మరికొందరు దీంతో విభేదిస్తున్నారు. వారు 'పంక్తుల్ని కలిపేవారి మీద' అని ఉల్లేఖించారు. ఇదే సరైనది. ఇమామ్ బైహఖీ కూడా ఈ విషయాన్నే సమర్థించారు (ఇబ్నె అల్లాన్).

١٠٩٥ ـ وعَنِ البَرَاءِ رضيَ اللهُ عَنْهُ قالَ: كُنَّا إذا صَلَّيْنَا خَلْفَ رسولِ اللهِ ﷺ، أحْبَبْنا أنْ نَكُونَ عَنْ يَمِينِهِ؛ يُقْبِلُ عَلَيْنَا بوَجْهِهِ، فَسَمِعْتُهُ يقول: «رَبِّ قِنِي عَذَابَكَ يَـوْمَ تَبْعَـثُ ـ أوْ تَجْمَـعُ ـ عِبَـادَكَ» رواه مسلم.

1095. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం: మేము దైవప్రవక్త (సల్లం) వెనక నమాజ్ చేసినప్పుడు ఆయన ముఖం మా వైపునకు ఉండాలని మేము ఆయనకు కుడివైపు నించోవటానికి యిష్టపడేవాళ్ళం. (ఒకరోజు) ఆయన ఈ విధంగా ప్రార్థిస్తుండగా

నేను విన్నాను: ప్రభూ! నువ్వు నీ దాసుల్ని తిరిగి బ్రతికించే రోజున, నన్ను నీ శిక్ష నుండి కాపాడు. (లేక ఆయన ఇలా అని ఉంటారు:) "నువ్వు నీ దాసుల్ని లెక్క తీసుకునేందుకు సమీకరించే రోజున, నన్ను నీ శిక్ష నుండి కాపాడు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో నమాజ్ చేసేటప్పుడు ఇమామ్‌కు కుడివైపున నించోవటం అభిలషణీయమని చెప్పబడటంతోపాటు, నమాజ్ ముగిసిన తర్వాత ఇమామ్ కాసేపు ముక్తదీల వైపు తిరిగి కూర్చోవటం సంప్రదాయమని కూడా బోధించబడింది. చాలా మస్జిదుల్లో ఈ సంప్రదాయాన్ని ఆచరించకపోవటం శోచనీయం! నమాజ్ ముగిసిన తర్వాత ముక్తదీలు తమతమ చోట్లలో కాసేపు కూర్చొని ఉండాలని కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

1096. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఇమామ్‌ను మధ్యలో ఉంచండి. పంక్తుల మధ్య ఖాళీని పూరించండి. (అబూదావూద్)

١٠٩٦ ـ وعَنْ أَبِي هُرِيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «وَسِّطُوا الإِمَامَ، وَسُدُّوا الخَلَلَ» رواه أبو داود.

*(సుననె అబూదావూద్‌లో నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

షేఖ్ అల్‌బానీ ఇలా అంటున్నారు: ఈ హదీసు ఆధారాల్లోని ఇద్దరు ఉల్లేఖకుల గురించి పూర్తి వివరాలు తెలియటం లేదు. అయినప్పటికీ ఈ హదీసులోని 'పంక్తుల మధ్య ఖాళీని పూరించండి" అనే మాట ఇతర సాక్ష్యాధారాల మూలంగా సమర్థనీయమే. ఇంతకు ముందు ఈ అధ్యాయంలోనే గడచిన ఇబ్నె ఉమర్‌గారి హదీసు దానికి సాక్షిగా నిలుస్తోంది. (అల్‌బానీగారి చేత పరిశోధించబడిన రియాజుస్సాలిహీన్ గ్రంథం చూడండి.)

**195 వ అధ్యాయం**

## ١٩٥ - بَابُ فَضْلِ السنَنِ الرَّاتِبَةِ مَعَ الفَرَائِضِ وَبَيَانِ أَقَلِّهَا وأَكْمَلِهَا وَما بينهما

## ఫర్జ్ నమాజులతోపాటు సున్నతె ముఅక్కద ఘనత...

١٠٩٧ - عَنْ أُمِّ المُؤْمِنِينَ أُمِّ حَبِيبَةَ رَمْلَةَ بِنْتِ أَبِي سُفيانَ رضيَ اللهُ عنهما قَالَتْ: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقولُ: «مَا مِنْ عَبْدٍ مُسْلِمٍ يُصَلِّي للهِ تَعَالى كُلَّ يَوْمٍ ثِنْتَيْ عَشْرَةَ رَكْعَةً تَطَوُّعاً غَيْرَ الفَرِيضَةِ، إلَّا بَنَى اللهُ لَهُ بَيْتاً في الجَنَّةِ! أَوْ: إلَّا بُنِيَ لَهُ بَيْتٌ في الجَنَّةِ» رواه مسلم.

1097. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె హబీబా రమ్లా బిన్తె అబూ సుఫ్యాన్ తెలియజేశారు: ఏ ముస్లిం దాసు డయినా అల్లాహ్ కోసం ప్రతిరోజూ ఫర్జ్ నమాజులు కాక (అదనంగా) పన్నెండు రకాతుల నఫిల్ నమాజ్ చేస్తాడో, అల్లాహ్ అతనికోసం స్వర్గంలో ఒక గృహాన్ని నిర్మిస్తాడు (లేక) అతనికోసం స్వర్గంలో ఒక గృహం నిర్మించబడు తుంది (అని అన్నారు). (ముస్లిం)

*(సునన్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఫర్జ్ (విధిగా చేయవలసిన) నమాజులుగాక అదనంగా, స్వచ్ఛందంగా చేసే నమాజులను 'నవాఫిల్' అంటారు. నవాఫిల్ అనేది నఫిల్‌కు బహువచనం. నఫిల్ నమాజులను పాటించటాన్ని అరబీలో 'తతవ్వూ' అని అంటారు. సాధారణంగా ఫర్జ్, వాజిబ్ నమాజులు మినహా, సున్నతె ముఅక్కదా, సున్నతె గైర్ ముఅక్కదా మొదలగు వాటినన్నిటిని నవాఫిల్‌గానే వ్యవహరిస్తారు. మొత్తానికి ఈ హదీసులో నఫిల్ నమాజుల ఘనత వివరించ బడింది. నఫిల్ నమాజులు చేసే అలవాటు స్వర్గానికి గొనిపోతుందని చెప్పబడింది.

١٠٩٨ ـ وعَن ابن عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: صَلَّيْتُ مَعَ رَسُولِ اللهِ ﷺ رَكْعَتَيْنِ قَبْلَ الظُّهْرِ، وَرَكْعَتَيْنِ بَعْدَهَا، وَرَكْعَتَيْنِ بَعْدَ الجُمُعَةِ، وَرَكْعَتَيْنِ بَعْدَ المَغْرِبِ، وَرَكْعَتَيْنِ بَعْدَ العِشَاءِ. متفقٌ عليه.

1098. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) వెంట జుహ్ర్ నమాజ్‌కు ముందు రెండు రకాతులు, జుహ్ర్ నమాజ్ తర్వాత రెండు రకాతులు, జుమా తర్వాత రెండు రకాతులు, మగ్రిబ్ తర్వాత రెండు రకాతులు, ఇషా తర్వాత రెండు రకాతుల నమాజ్ చేశాను.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రతి ఫర్జ్ నమాజుకు ముందు లేక తర్వాత అదనంగా చేసే నఫిల్ నమాజులను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. వాటిలో మొదటి రకం: దైవప్రవక్త (సల్లం) క్రమం తప్పకుండా పాటించిన నమాజులు. వీటిని 'సుననె ముఅక్కదా' లేక 'సుననె రవాతిబ్' అని అంటారు. దైవప్రవక్త(సల్లం) ఈ నమాజులను తను స్వయంగా క్రమం తప్పకుండా చేయటం తోపాటు వాటిని నెరవేర్చమని తన అనుచర సమాజానికి కూడా తాకీదు చేశారు. పై హదీసులో ఈ రకమైన సున్నతుల గరిష్ఠ సంఖ్య పది రకాతులు అని చెప్పబడింది. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా వాటి గరిష్ఠ సంఖ్య పన్నెండు లేక పధ్నాలుగు రకాతులని బోధపడుతోంది.

ఇకపోతే దైవప్రవక్త (సల్లం) నిత్యం కాకుండా అప్పుడప్పుడూ చేసిన నమాజులను 'నవాఫిల్' లేక 'సుననె గైర్ ముఅక్కదా' అని అంటారు. అయితే దేవునితో ప్రత్యేక సంబంధాన్ని ఏర్పరచుకోవటంలో ఈ నఫిల్ నమాజులు ప్రముఖ పాత్ర వహిస్తాయి. కనుక విశ్వాసులు వీటిని నిర్వర్తించటంలో ప్రత్యేక ఆసక్తి కనబరుస్తారు. షరీఅత్ పరంగా చూస్తే నఫిల్ నమాజుల్ని పాటించటం వల్ల పుణ్యం లభిస్తుంది. ఒకవేళ పాటించకపోతే ఏ పాపం లేదు. మరొక విషయమేమిటంటే 'సున్నతె ముఅక్కదా' నమాజులను ఇంట్లో చేసుకోవటం ఉత్తమం. దైవప్రవక్త (సల్లం) స్వయంగా అలా చేసేవారు. పైగా తన సహచరుల్ని కూడా అలాగే చేయమని ప్రోత్సహించేవారు.

١٠٩٩ ـ وعنْ عبدِ اللهِ بنِ مُغفلٍ رَضِيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «بَيْنَ كلِّ

1099. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం)ఈ విధంగా ప్రవచిం

أَذَانَيْنِ صَلاةٌ، بَيْنَ كلِّ أَذَانَيْنِ صَلاةٌ، بَيْنَ كلِّ أَذَانَيْنِ صَلاةٌ» قالَ في الثَّالِثَةِ: «لِمَنْ شاءَ» متفقٌ عليه. المُرَادُ بالأَذَانَيْنِ: الأَذَانُ وَالإِقَامَةُ.

చారు: ప్రతి రెండు అజానుల మధ్య ఒక నమాజు ఉంది. ప్రతి రెండు అజానుల మధ్య ఒక నమాజు ఉంది. ప్రతి రెండు అజానుల మధ్య ఒక నమాజు ఉంది.

మూడోసారి ఆ మాట అన్నప్పుడాయన 'చేయదలచుకున్న వారికి' అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

రెండు అజానులంటే అర్థం అజాన్ మరియు ఇఖామత్.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రతి అజాన్‌కు మరియు ఇఖామత్‌కు మధ్య ఉండే విరామ సమయంలో రెండు రకాతుల నమాజ్ చేయటం అభిలషణీయం (ముస్తహబ్). ఈ నమాజుని గైర్ రాతిబా లేక గైర్ ముఅక్కదాగా వ్యవహరిస్తారు. ఐదు ఫర్జ్ నమాజు వేళల్లోనూ (అజాన్ తర్వాత ఇఖామత్‌కు ముందు) ఈ నఫిల్ నమాజు చేయవచ్చు. అయితే ఫజ్ర్ తర్వాత గైర్ ముఅక్కదా, నఫిల్ నమాజులు చేసే విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఎందుకంటే దైవప్రవక్త (సల్లం)గాని ఆయన సహచరులుగాని ఆ సమయంలో నఫిల్ నమాజులు చేసిన దాఖలాలు లేవు. వాస్తవం దేవునికే తెలుసు.



**196వ అధ్యాయం**

## ١٩٦ - بابُ تأكيدِ رَكعَتَيْ سُنَّةِ الصُّبْحِ

## ఉదయపు నమాజులో రెండు రకాతుల సున్నత్ విషయమై తాకీదు

١١٠٠ - عن عائشةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ النَّبيَّ ﷺ كانَ لا يَدَعُ أَرْبَعاً قَبْلَ الظُّهْرِ، وَرَكْعَتَيْنِ قَبْلَ الغَداةِ. رواه البخاري.

1100. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) జుహ్రాకు ముందు నాలుగు రకాతులను, ఉదయానికి (ఫజ్ర్‌కు) ముందు రెండు రకాతులను ఎన్నడూ వదలిపెట్టేవారు కాదు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

దైవప్రవక్త (సల్లం) జుహర్‌కు ముందు నాలుగు రకాతుల సున్నత్ నమాజును, ఫజ్ర్‌కు ముందు రెండు రకాతుల సున్నత్ నమాజును క్రమం తప్పకుండా పాటించేవారని ఈ హదీసులో చెప్పబడింది. ఇలాంటి నమాజులనే **'సునన్ రవాతిబ్'** లేక **'సునన్ ముఅక్కదా'** అని పిలుస్తారు.

١١٠١ - وَعَنْهَا قَالَتْ: لَمْ يكنِ النَّبيُّ ﷺ علَى شَيءٍ مِنَ النَّوافِلِ أَشَدَّ تَعاهُداً مِنْهُ عَلى رَكعَتي الفَجرِ. مُتَّفَقٌ عليهِ.

1101. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ వేళ చేసే రెండు రకాతుల (సున్నత్) నమాజ్ విషయంలో చాలా జాగ్రత్త వహించేవారు. ఆ విధంగా మరే నఫిల్ నమాజ్ విషయంలోనూ ఆయన అంత జాగ్రత్త కనబరిచేవారు కాదు. (బుఖరీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٠٢ ـ وَعَنْهَا عَنِ النبيِّ ﷺ قالَ: «رَكْعَتا الفجرِ خيرٌ مِنَ الدُّنْيَا وَمَا فِيها» رواه مسلم. وفي روايةٍ: «لَهُمَا أَحَبُّ إِلَيَّ مِنَ الدُّنْيَا جَميعاً».

1102. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఫజ్ర్ వేళ చేసే రెండు రకాతుల (సున్నత్) నమాజు - ప్రపంచం మరియు అందులో ఉన్న వస్తువులన్నిటికంటే శ్రేష్ఠమైనది. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఆ రెండు రకాతులు నాకు ప్రపంచమంతటి కన్నా ప్రియమైనవి.

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٠٣ ـ وعَنْ أبي عبدِ الله بلالِ بن رَبَاحٍ رضيَ اللهُ عَنهُ، مُؤَذِّنِ رسولِ الله ﷺ أَنَّهُ أَتَى رَسُولَ الله ﷺ، لِيُؤذِنَهُ بصَلاةِ الغَدَاةِ، فَشَغَلَتْ عَائشَةُ بلالًا بأمرٍ سَأَلَتْهُ عَنْهُ، حتى أَصْبَحَ جدًّا، فقَامَ بلالٌ فآذنَهُ بالصَّلاةِ، وَتَابَعَ أَذَانَهُ، فلَمْ يَخْرُجْ رَسُولُ الله ﷺ، فلَمَّا خرَجَ صَلَّى بالنَّاسِ، فَأَخْبَرَهُ أنَّ عَائِشَةَ شَغَلَتْهُ بِأَمْرٍ سَأَلَتْهُ عَنْهُ

1103. దైవప్రవక్త (సల్లం) గారి ముఅజ్జిన్ అయిన హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ బిలాల్ బిన్ రబాహ్ (రజి) కథనం ప్రకారం ఓ రోజు తను దైవప్రవక్త (సల్లం)కు ఉదయం నమాజు గురించి తెలియజేద్దామని ఆయన వద్దకు వెళ్ళారు. అప్పుడే హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) బిలాల్ (రజి)ని ఏదో విషయం అడిగారు. ఆయన ఆమె (ప్రశ్నకు జవాబు చెప్పే) పనిలో నిమగ్నులై ఉన్నంతలోనే బాగా తెల్లవారింది. ఇక అప్పుడు బిలాల్ (రజి) తేరుకొని దైవప్రవక్తకు నమాజ్ వేళ అయిందని తెలియజేశారు. ఎన్నోసార్లు తెలియజేశారు. అయినా ఆయన మాత్రం బయటికి రాలేదు.

మరికాసేపటికి బయటికి వచ్చి ప్రజలకు నమాజ్ చేయించారు. అప్పుడు

حَتَّى أَصْبَحَ جِدًّا، وَأَنَّهُ أَبْطَأَ عَلَيْهِ بِالخُرُوجِ، فَقَالَ - يَعْنِي النَّبِيَّ ﷺ -: «إِنِّي كُنْتُ رَكَعْتُ رَكْعَتَي الفَجْرِ» فقالَ: يارسولَ اللهِ! إِنَّكَ أَصْبَحْتَ جِدًّا! قَالَ: «لَوْ أَصْبَحْتُ أَكْثَرَ مِمَّا أَصْبَحْتُ، لَرَكَعْتُهُمَا، وَأَحْسَنْتُهُمَا، وَأَجْمَلْتُهُمَا» رواه أبو داود بإسناد حسن.

బిలాల్ (రజి) తనను ఆయిషా (రజి.అన్హా) ఒక విషయం అడిగారని, ఆమెకు జవాబు చెప్పే పనిలో నిమ గ్నుణ్ణయి ఉండగా బాగా తెల్లారి పోయిందని దైవప్రవక్త (సల్లం)కు సంజాయిషీ చెప్పుకున్నారు. ఆ తర్వాత ఆయన ఆలస్యంగా బయటికి రావటానికి కారణమేమిటో అడిగారు. అందుకు దైవప్రవక్త (సల్లం) "ఆ సమయంలో నేను ఫజ్ర్‌కు సంబం ధించిన రెండు రకాతుల (సున్నత్) నమాజ్ చేస్తూ ఉన్నాను" అని చెప్పారు. అందుకు బిలాల్ (రజి) 'ఏమైనప్పటికీ తమరు బాగా తెల్లారిన తర్వాతగాని బయటికి రాలేదు' అని అన్నారు. అప్పుడు ఆయన 'దీనికన్నా ఎక్కువ తెల్లారినప్పటికీ నేను ఆ రెండు రకాతుల సున్నత్ నమాజ్‌ను సక్రమంగా, అత్యుత్తమరీతిలో నెరవేరుస్తాను' అని చెప్పారు. (అబూదావూద్, ఆధారాలు హసన్ కోవకు చెందినవి)

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఫజ్ర్ వేళ చేయవలసిన రెండు రకాతుల సున్నత్ నమాజు ఘనత ఏమిటో దీని ద్వారా బోధపడుతోంది. అంతేకాదు, వాటిని అత్యుత్తమ రీతిలో, అత్యంత భక్తిశ్రద్ధలతో ఆచరించాలని కూడా తెలుస్తోంది. మొత్తానికి ఇంతవరకు పేర్కొనబడిన హదీసులన్నీ రుజువు చేసేదేమిటంటే ఫజ్ర్ వేళ చేసే రెండు రకాతుల సున్నతుకు ఎంతో విశిష్టత ఉంది. కనుక ఆ నమాజ్ చేయాలి. అలసత్వం, సోమరితనంతో దాన్ని నిర్లక్ష్యం చేయరాదు.

## 197వ అధ్యాయం

## ١٩٧ - بَابُ تَخْفِيفِ رَكْعَتَي الْفَجْرِ وَبَيَانِ مَا يُقْرَأُ فِيهِمَا، وَبَيَانِ وَقْتِهِمَا

## ఫజ్ర్ వేళ సున్నత్ నమాజును తేలికగా, సంక్షిప్తంగా చేయాలి, ఇంకా ఆయా రకాతుల్లో ఏ సూరాలు పఠించాలి, ఏ వేళప్పుడు ఆ నమాజు చేయాలి అనే విషయాల గురించి....

١١٠٤ - عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْها أَنَّ النَّبِيَّ ﷺ كَانَ يُصَلِّي رَكْعَتَيْنِ خَفِيفَتَيْنِ بَيْنَ النِّدَاءِ وَالإِقَامَةِ مِنْ صَلاةِ الصُّبْحِ. متفقٌ عليه. وفي روايةٍ لَهُمَا: يُصَلِّي رَكْعَتَي الفَجْرِ، إذا سَمِعَ الأَذانَ فَيُخَفِّفُهُمَا حَتَّى أَقُولَ: هَلْ قَرَأَ فِيهِمَا بِأُمِّ القُرآنِ! وَفِي رِوَايَة لمسلم: كَانَ يُصَلِّي رَكْعَتَي الفَجْرِ إِذَا سَمِعَ الأَذانَ ويُخَفِّفُهُمَا. وفي روايةٍ: إِذَا طَلَعَ الفَجْرُ.

1104. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) ఉదయపు నమాజ్‌వేళ అజాన్‌కు- ఇఖామత్‌కు మధ్య సంక్షిప్తంగా రెండు రకాతుల నమాజ్ చేసేవారు. (బుఖారీ-ముస్లిం)

బుఖారీ - ముస్లింలలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ వేళ రెండు రకాతుల (సున్నత్) నమాజ్ చేసేవారు. అజాన్ వినగానే వాటిని చాలా సంక్షిప్తంగా చేసే వారు. ఆ నమాజు చూస్తుంటే నాకు, అసలు ఆయన ఆ రకాతుల్లో ఫాతిహా సూరా పఠించారా లేదా అనిపించేది.

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: అజాన్ వినగానే ఆయన తేలికగా రెండు రకాతుల నమాజ్ చేసే వారు. ఇంకొక ఉల్లేఖనంలో ఉషో దయం అయినప్పుడు అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"తేలికగా" అంటే ఫజ్ర్‌వేళ చేసే సున్నత్ నమాజులోని ఖియామ్, ఖిరాత్, రుకూ, సజ్దా మొదలగు విధుల్ని సుదీర్ఘంగా కాకుండా సంక్షిప్తంగా నెరవేర్చేవారన్నమాట. ఎందుకంటే ఆ తర్వాత ప్రజలకు ఫర్జ్ నమాజ్ చేయిస్తారు. అందులో ఎలాగూ సుదీర్ఘ ఖుర్ఆన్ పారాయణం చేయవలసి ఉంటుంది. కనుక ఆయన సున్నత్ నమాజును సంక్షిప్తంగా చేసి ఫర్జ్ నమాజుకు సన్నద్ధులయ్యేవారు. ఫజ్ర్ వేళ అజాన్ ఇవ్వగానే దైవప్రవక్త (సల్లం) సున్నత్ నమాజ్‌కు ఉపక్రమించేవారంటే, ఆ నమాజు పట్ల ఆయనకు ఎంతటి శ్రద్ధాసక్తులు ఉండేవో అర్థమవుతోంది.

١١٠٥ ـ وعَنْ حَفْصَةَ رَضِيَ اللهُ عَنْها أَنَّ رسولَ اللهِ ﷺ، كَانَ إذا أَذَّنَ المُؤَذِّنُ للصُّبْحِ، وَبَدَا الصُّبْحُ، صَلَّى رَكْعَتَيْنِ خَفِيفَتَيْنِ. متفقٌ عليه. وفي روايةٍ لمسلم: كانَ رسولُ اللهِ ﷺ، إذا طَلَعَ الْفَجْرُ لا يُصَلِّي إلَّا رَكْعَتَيْنِ خَفِيفَتَيْنِ.

1105. హజ్రత్ హఫ్సా (రజి.అన్‌హా) కథనం: ముఅజ్జిన్ ఉదయపు నమాజ్ కోసం అజాన్ ఇస్తాడు, ఉదయం వేళ ప్రారంభమవుతుంది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) సంక్షిప్తంగా రెండు రకాతుల నమాజు చేసేవారు.

(బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) ఉషోదయం అయినప్పుడు తేలికపాటి రెండు రకాతులు తప్ప మరే ఇతర నమాజు చేసేవారు కాదు.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా బోధపడేదేమిటంటే, ఫజ్ర్ యొక్క సున్నత్ నమాజును ఉషోదయం అయిన తర్వాతే చేయాలి. ఉషోదయానికి ముందు చేయకూడదు. ఇంకా ఆ నమాజును సంక్షిప్తంగా, తేలికగా చేసుకోవాలి. ఆ నమాజును తేలికగా చేసుకుంటే, ఆ తర్వాత ఫజ్ర్ నమాజును నూతనోత్సాహంతో, అత్యంత భక్తిశ్రద్ధలతో చేసుకోవచ్చు.

١١٠٦ - وعَن ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنهُمَا قالَ: كَانَ رَسولُ اللهِ ﷺ يُصَلّي مِنَ اللَّيْلِ مَثْنَى مَثْنَى، وَيُوتِرُ بِرَكْعَةٍ مِنْ آخِرِ اللَّيْلِ، وَيُصَلِّي الرَّكْعَتَيْنِ قَبْلَ صَلاةِ الغَدَاةِ، وَكَأَنَّ الأذَانَ بِأُذُنَيْهِ. متفقٌ عليه.

1106. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) రాత్రి (తహజ్జుద్) నమాజు రెండేసి రకాతుల చొప్పున చేసేవారు. చివరి జామున వితర్ నమాజు ఒక రకాత్ చేసేవారు. (ఆ తర్వాత) ఉదయపు నమాజ్‌కు ముందు రెండు రకాతుల (సున్నత్) నమాజ్ చేసేవారు. (దాన్ని ఎంత త్వరగా చేసేవారంటే) ఆయన చెవులకు ఇఖామత్ వినపడుతుందేమోననిపించేది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విత్ర్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ వేళ రెండు రకాతుల సున్నత్ నమాజును చాలా త్వరగా చేసేవారు. ఏ విధంగానయితే ఇఖామత్ పలుకులు వినపడుతూ ఉండి, ఫర్జ్ నమాజును తొలివేళలో చేసే అవకాశం చేజారిపోతుందేమోనన్న భయంతో, నఫిల్ నమాజుల్ని వడివడిగా చేస్తారో ఉదయపు రెండు రకాతుల సున్నత్ నమాజును కూడా అదే విధంగా చేసేవారాయన.

ఈ హదీసు ద్వారా బోధపడే విషయాలు ఏవంటే; రాత్రిపూట నఫిల్ నమాజులు రెండేసి రకాతుల చొప్పున చేయాలి. వితర్ నమాజు ఒక రకాత్ అయినా చేయవచ్చు. ఫజ్ర్ వేళ అజాన్ ఇవ్వగానే సున్నత్ నమాజ్ చేసుకోవాలి. అందులోని రకాతుల్ని సంక్షిప్తంగా నెరవేర్చాలి.

١١٠٧ - وعَنِ ابنِ عباسٍ رَضِيَ اللهُ عَنهُمَا أنَّ رَسُولَ اللهِ ﷺ، كَانَ يَقْرَأُ في رَكْعَتَي الْفَجْرِ في الأُولَى مِنْهُمَا: ﴿قُولُوا ءَامَنَّا بِاللَّهِ وَمَا أُنزِلَ إِلَيْنَا﴾ الآيَةَ الَّتي في البَقَرَةِ، وفي الآخِرَةِ مِنْهُمَا: ﴿ءَامَنَّا بِاللَّهِ وَاشْهَدْ بِأَنَّا مُسْلِمُونَ﴾. وفي روايةٍ:

1107. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ వేళ రెండు రకాతుల్లోని మొదటి రకాతులో అల్‌బఖరా సూరాకు సంబంధించిన 'ఖూలూ ఆమన్నా బిల్లాహి వమా ఉన్‌జిల ఇలైనా' అనే ఆయతును

فِي الآخرةِ التي فِي آلِ عِمرانَ: ﴿ تَعَالَوْا إِلَىٰ كَلِمَةٍ سَوَاءٍ بَيْنَنَا وَبَيْنَكُمْ ﴾ رواهما مسلم.

చివరి వరకు పఠించేవారు. రెండో రకాత్‌లో 'ఆమన్నా బిల్లాహి వష్‌హద్ బిఅన్నా ముస్లిమూన్' (అంటే 'ఫలమ్మా అహస్స ఈసా మిన్‌హుముల్ కుఫ్ర ఖాల మన్ అన్‌సారీ ఇలల్లాహ్- ఆలి ఇమ్రాన్-52) ఆయతును చివరి వరకు పఠించేవారు.

వేరొక ఉల్లేఖనం ప్రకారం రెండో రకాత్‌లో ఆలి ఇమ్రాన్ సూరాలోని 'తఆలౌ ఇలా కలిమతిన్ సవాయిన్ బైననా వ బైనకుమ్' అనే ఆయతును పఠించేవారు. (పై రెండు ఉల్లేఖనాలూ ముస్లింలోనివే)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٠٨ ـ وَعَنْ أَبِي هُرِيرةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رسولَ اللهِ ﷺ قَرَأَ فِي رَكْعَتَي الْفَجْرِ: ﴿ قُلْ يَا أَيُّهَا الْكَافِرُونَ ﴾ و ﴿ قُلْ هُوَ اللَّهُ أَحَدٌ ﴾ رواه مسلم.

1108. హజ్రత్ అబూహురైరా (రజి) చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ (వేళ చేసే) సున్నత్ (నమాజులోని) రెండు రకాతుల్లో 'ఖుల్‌యా అయ్యుహల్ కాఫిరూన్' మరియు 'ఖుల్‌హు వల్లాహు అహద్' సూరాలు పఠించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٠٩ ـ وَعَنِ ابنِ عمرَ رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: رَمَقْتُ النَّبِيَّ ﷺ شَهْراً وكان يَقْرَأُ فِي الرَّكْعَتَيْنِ قَبْلَ الْفَجْرِ: ﴿ قُلْ يَا أَيُّهَا

1109. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను నెలరోజులపాటు పరిశీలనగా చూశాను: ఆయన ఉదయపు నమాజుకు

ٱلْكَٰفِرُونَ ﴾ وَ: ﴿قُلْ هُوَ ٱللَّهُ أَحَدٌ﴾. رَوَاهُ الترمذي وقالَ : حديثٌ حَسَنٌ.

ముందు రెండు రకాతుల్లో 'ఖుల్ యా అయ్యుహల్ కాఫిరూన్' మరియు 'ఖుల్ హువల్లాహు అహద్' సూరాలు పఠించే వారు. (తిర్మిజీ-హసన్)

*(సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఫజ్ర్ వేళ చేయబడే సున్నత్ నమాజులో ఏ సూరానయినా పఠించవచ్చు. కాని పైన పేర్కొనబడిన ఆయతులను లేక, సూరాలను పఠిస్తే, దైవప్రవక్త సంప్రదాయాన్ని అనుసరించి నట్లవుతుంది. ప్రతి ముస్లిం దైవప్రవక్త సంప్రదాయాన్ని అనుసరించటానికి, దానివల్ల లభించే పుణ్యాన్ని పొందటానికి కృషి చేయాలి. ఈ హదీసు ద్వారా నమాజులో ఒకే సూరాని చాలాకాలం పాటు పఠిస్తూ ఉండవచ్చని కూడా బోధపడుతోంది.



## 198వ అధ్యాయం

## ١٩٨ ـ بَابُ اسْتِحْبَابِ الاضْطِجَاعِ بَعْدَ رَكْعَتَي الْفَجْرِ عَلَى جَنْبِهِ الأَيْمَنِ، وَالْحَثِّ عَلَيْهِ سَوَاءٌ كَانَ تَهَجَّدَ بِاللَّيْلِ أَمْ لاَ

## ఫజ్ర్‌వేళ రెండు రకాతుల సున్నత్ తర్వాత కాసేపు కుడివైపుకు తిరిగి పడుకోవటం అభిలషణీయం, ఇంకా తహజ్జుద్ నమాజ్ చేసినా చేయకపోయినా ప్రజల్ని దానికోసం పురికొల్పటం గురించి...

١١١٠ ـ عَنْ عائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كانَ النَّبِيُّ ﷺ إذَا صَلَّى رَكْعَتَي الْفَجْرِ، اضْطَجَعَ عَلى شِقِّهِ الأَيْمَنِ. رواه البخاري.

1110. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ వేళ రెండు రకాతుల (సున్నత్) నమాజ్ చేసుకున్న తర్వాత కుడి వైపునకు తిరిగి పడుకునేవారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం)

١١١١ ـ وَعَنْهَا قَالَتْ: كَانَ النَّبِيُّ ﷺ يُصَلِّي فيمَا بَيْنَ أَنْ يَفْرُغَ مِنْ صَلاةِ العِشَاءِ إلى الْفَجْرِ إحْدَى عَشْرَةَ رَكْعَةً، يُسَلِّمُ بَيْنَ كُلِّ رَكْعَتَيْنِ، وَيُوتِرُ بِوَاحِدَةٍ، فَإذَا سَكَتَ المُؤَذِّنُ مِنْ صَلاةِ الْفَجْرِ، وَتَبَيَّنَ لَهُ الْفَجْرُ، وَجَاءَهُ المُؤَذِّنُ،

1111. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) ఇషా నమాజు ముగించుకున్నప్పటి నుంచి ఫజ్ర్ వరకు మధ్యకాలంలో పదకొండు రకాతులు చేసేవారు. ప్రతి రెండు రకాతుల మధ్య సలాం చేసే వారు. ఒక రకాత్ విత్ర్ నమాజు చేసే వారు.

(ఫజ్ర్ వేళ) ముఅజ్జిన్ అజాన్ చెప్పి ఊరుకుంటాడు. ఉదయం ప్రస్ఫుట

قَامَ فَرَكَعَ رَكْعَتَيْنِ خَفِيفَتَيْنِ، ثُمَّ اضْطَجَعَ عَلَى شِقِّهِ الأَيْمَنِ، هكذا حَتَّى يَأْتِيَهُ الْمُؤَذِّنُ لِلإِقَامَةِ. رَوَاهُ مُسْلِمٌ. قَوْلُهَا: «يُسَلِّمُ بَيْنَ كُلِّ رَكْعَتَيْنِ» هكذا هو في مسلمٍ ومعناه: بَعْدَ كُلِّ رَكْعَتَيْنِ.

మవుతుంది. ముఅజ్జిన్ (నమాజ్ వేళ అయిందని చెప్పటానికి) ఆయన దగ్గరికి వచ్చినప్పుడు ఆయన సంక్షిప్తంగా రెండు రకాతులు చేసేవారు. ఆ తర్వాత ముఅజ్జిన్ నమాజ్ మొదలు పెట్టటం కోసం వచ్చేవరకు కుడివైపునకు తిరిగి పడుకునేవారు. (ముస్లిం)

"ప్రతి రెండు రకాతుల మధ్య సలాం చేసేవారు" - ముస్లింలోని వాక్యాలు ఇలాగే ఉన్నాయి. ఆయన ప్రతి రెండు రకాతులు అయిపోయిన తర్వాత సలాం చేసేవారని దీనిభావం.

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట తహజ్జుద్ నమాజు పదకొండు రకాతులు చేసేవారు. రెండేసి రకాతుల చొప్పున పది రకాతులు చేసేవారు. ఆ తర్వాత ఒక రకాతు విత్ర్ నమాజు చేసేవారు. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా ఎనిమిది రకాతుల తర్వాత మూడు రకాతులు విత్ర్ చేసేవారని తెలుస్తోంది. పై రెండు పద్ధతులూ సరైనవే. ఒక రకాతు విత్ర్ నమాజ్ చేయవచ్చని కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

తహజ్జుద్ మరియు విత్ర్ నమాజుల్ని ఇషా నమాజు ముగిసినప్పటి నుంచి ఉషోదయానికి ముందు వరకు మధ్యలో ఎప్పుడైనా చేయవచ్చు. కాని రాత్రి చివరిజామున చేయటం ఉత్తమం. ఆ విధంగా చేస్తే తహజ్జుద్ అయిపోగానే ఫజ్ర్ నమాజు కూడా సామూహికంగా నెరవేర్చవచ్చు. రమజాన్ మాసంలో చేసే తరావీహ్ నమాజు కూడా తహజ్జుద్ నమాజే. సౌలభ్యం కోసం, సామూహిక నమాజు పుణ్యం కోసం రమజాన్ మాసంలో దాన్ని తొలివేళలోనే, అంటే ఇషా నమాజ్ ముగిసిన వెంటనే చేస్తారు. కనుక తరావీహ్ నమాజ్ కూడా ఎనిమిది రకాతులే. దైవప్రవక్త (సల్లం) రమజాన్‌లోగాని, రమజానేతర మాసాల్లోగాని ఎన్నడూ ఎనిమిది రకాతులు, ఆ తర్వాత మూడు రకాతుల విత్ర్ కంటే ఎక్కువ చేయలేదు. సహీహ్ బుఖారీలోని హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) హదీసు ఈ విషయాన్ని స్పష్టం చేస్తోంది. హదీసుల్లో రాత్రిపూట చేసే నమాజును 'ఖియాముల్లైల్'గా అభివర్ణించటం జరిగింది. దాన్నే

ఖుర్‌ఆన్ మరియు హదీసులు తహజ్జుద్‌గా పేర్కొన్నాయి. కాని దానికోసం తరావీహ్ అనే పదం ఏ హదీసులోనూ వాడబడలేదు. రమజాన్‌కు సంబంధించిన ఖియాముల్లైల్‌కు తరావీహ్ అనే పేరు దైవప్రవక్త, ఆయన సహచరుల కాలం తర్వాత మొదలయింది. కనుక తరావీహ్ నమాజును దైవప్రవక్త (సల్లం) ద్వారా రుజువైనన్ని రకాతులు చేయటమే ఉత్తమం. ప్రామాణిక హదీసుల ద్వారా తరావీహ్ నమాజు ఎనిమిది రకాతులేనని తెలుస్తోంది.

١١١٢ - وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذا صَلَّى أَحَدُكُمْ رَكْعَتَي الفَجْرِ، فَلْيَضْطَجِعْ عَلَى يَمِينِهِ». رَوَاه أبو داود، والترمذي بأسانِيدَ صحيحةٍ. قَالَ الترمِذي: حديثٌ حَسَنٌ صَحِيحٌ.

1112. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరైనా ఫజ్ర్ వేళ రెండు రకాతుల (సున్నత్) నమాజ్ చేసుకుంటే ఆ తర్వాత కుడి వైపునకు తిరిగి పడుకోవాలి. (అబూ దావూద్ మరియు తిర్మిజీలు ఈ హదీసుని ప్రామాణికమైన ఆధారాలతో వెలికితీశారు. ఇమామ్ తిర్మిజీ దీనిని 'హసన్' మరియు 'సహీహ్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు.)

*(సుననె అబూదావూద్, సుననె తిర్మిజీలోని నమాజ్ అధ్యాయాలు)*

**ముఖ్యాంశాలు**

ఇంతకు ముందు వచ్చిన హదీసుల్లో దైవప్రవక్త (సల్లం) గారి ఆచరణ వివరించబడింది. ఈ హదీసులోనేమో ఆయన ఆదేశం పొందుపరచబడింది. మొత్తానికి ఫజ్ర్ యొక్క సున్నత్ నమాజ్ తర్వాత కాసేపు కుడివైపునకు తిరిగి పడుకోవటమనేది దైవప్రవక్త (సల్లం) ఆచరణ మరియు ఆదేశం- రెండింటి ద్వారా రుజువయిందని బోధపడుతోంది. ఇది దైవప్రవక్త సంప్రదాయం అనటంలో ఎలాంటి సందేహం లేదు.



**199వ అధ్యాయం**

## ١٩٩ - بَابُ سُنَّةِ الظُّهْرِ

## జుహ్రాకు సంబంధించిన సున్నత్‌లు

١١١٣ - عَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: صَلَّيْتُ مَعَ رسولِ اللهِ ﷺ رَكْعَتَيْنِ قَبْلَ الظُّهْرِ، وَرَكْعَتَيْنِ بَعْدَهَا. متفقٌ عليه.

1113. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) వెంట జుహ్రా (వేళ, ఫర్జ్ నమాజు) కు ముందు రెండు రకాతులు, దాని తర్వాత రెండు రకాతులు నమాజ్ చేశాను.
(బుఖారీ-ముస్లిం)

١١١٤ - وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنهَا، أَنَّ النَّبيَّ ﷺ كانَ لا يَدَعُ أَرْبعاً قَبْلَ الظُّهْرِ. رَوَاه البخاريُّ.

1114. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) జుహ్రాకు ముందు నాలుగు రకాతులను ఎన్నడూ వదలిపెట్టేవారు కారు.
(బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

కొన్ని ఉల్లేఖనాల్లో జుహ్రాకు ముందు రెండు రకాతులు దాని తర్వాత రెండు రకాతులు చేయాలని చెప్పబడింది. ఈ హదీసులోనేమో జుహ్రాకు ముందు నాలుగు రకాతులున్నాయని వివరించబడింది. ఈ రెండు సంఖ్యలూ సరైనవే. పరిస్థితుల కనుగుణంగా రెండింట్లో ఏ హదీసునయినా ఆచరించవచ్చు.

١١١٥ - وَعَنْهَا قَالَتْ: كَانَ النبيُّ ﷺ يُصَلِّي في بَيْتي قَبْلَ الظُّهْرِ أَرْبَعاً، ثُمَّ يَخرُجُ، فيُصَلِّي بالنَّاسِ، ثُمَّ يَدْخُلُ فَيُصَلِّي رَكْعَتَيْنِ، وَكانَ يُصَلِّي بالنَّاسِ المَغْرِبَ، ثُمَّ يَدْخُلُ فَيُصَلِّي رَكْعَتَيْنِ،

1115. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) జుహ్రా వేళ ఫర్జ్ నమాజుకు ముందు నా ఇంట్లో నాలుగు రకాతులు చేసేవారు. తర్వాత బయటికి వెళ్ళి ప్రజలకు నమాజ్ చేయించేవారు. ఆ

وَيُصَلِّي بِالنَّاسِ العِشَاءَ، وَيَدْخُلُ بَيْتِي، فَيُصَلِّي رَكْعَتَيْنِ. رواه مسلم.

తర్వాత ఇంటికి వచ్చి రెండు రకాతులు చేసేవారు. అదే విధంగా ప్రజలకు మగ్రిబ్ నమాజు చేయించేవారు. తర్వాత ఇంటికి వచ్చి రెండు రకాతులు చేసేవారు. అలాగే ప్రజలకు ఇషా నమాజు చేయించి, ఇంటికి తిరిగొచ్చిన తర్వాత రెండు రకాతులు చేసేవారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١١٦ - وعن أُمِّ حَبِيبَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ حَافَظَ عَلَى أَرْبَعِ رَكَعَاتٍ قَبْلَ الظُّهْرِ، وَأَرْبَعٍ بَعْدَهَا، حَرَّمَهُ اللهُ عَلَى النَّارِ». رواه أبو داود، والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

1116. హజ్రత్ ఉమ్మె హబీబా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: జుహ్రాకు ముందు నాలుగు రకాతుల్ని, దాని తర్వాత నాలుగు రకాతుల్ని క్రమం తప్పకుండా చేసేవారి కొరకు దేవుడు నరకాగ్నిని నిషిద్ధం చేస్తాడు. (అబూ దావూద్, తిర్మిజీలు దీనిని ఉల్లేఖించారు: తిర్మిజీ దీనిని హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు)

*(సుననె అబూదావూద్, సుననె తిర్మిజీలలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నరకాగ్నిని నిషిద్ధం చేయటమంటే ఇస్లాం స్థితిలోనే వారికి మరణం సంభవిస్తుందని భావం. కనుక అలాంటివారు అవిశ్వాసుల మాదిరిగా శాశ్వతంగా నరకంలో ఉండాల్సిన అవసరం లేదు. అదే విధంగా కొన్ని హదీసుల్లో నరకాగ్ని వారిని అంటుకొనజాలదు అని వస్తుంది. దాని భావం కూడా అదే. అంటే శాశ్వత నరకం వారిని అంటుకొనజాలదన్నమాట!

ఒకవేళ ముస్లిం వ్యక్తి గనక పాపాత్ముడయి, శిక్షార్హుడయి ఉంటే అతను కూడా కొంతకాలంపాటు నరకంలో శిక్షననుభవించాల్సిందే! ఆ విధంగా ముస్లింల నరక ప్రవేశం సదరు హదీసులాంటి హదీసుల భావాలకు విరుద్ధమూ కాదు. ఎందుకంటే ముస్లింలు అంతిమంగా నరకం నుండి బయటికి తీయబడి స్వర్గానికి పంపబడతారు. ముస్లింలు

నరకంలో ఎల్లకాలం ఉండరు. అయితే ముస్లింలు ఏం చేసినా అసలు వారికి నరక శిక్షే ఉండదని భావించటం కూడా తగదు. దేవుడు గనక వారిని ప్రారంభంలో క్షమించకపోతే, ఆయన తలచినంత కాలం నరకంలో మాడిచావాల్సిందే. ఆ తర్వాతే వారికి స్వర్గభాగ్యం లభిస్తుంది.

١١١٧ - وَعَنْ عبدِ اللهِ بنِ السائبِ رَضِيَ اللهُ عَنهُ، أَنَّ رسولَ اللهِ ﷺ كانَ يُصَلِّي أَرْبَعاً بَعْدَ أَنْ تَزولَ الشَّمْسُ قَبْلَ الظُّهرِ، وقالَ: «إِنَّهَا سَاعَةٌ تُفْتَحُ فِيهَا أَبوابُ السَّمَاءِ، فَأُحِبُّ أَنْ يَصْعَدَ لِي فِيهَا عَمَلٌ صَالِحٌ» رواه الترمذي وَقَالَ: حديثٌ حسنٌ.

1117. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ సాయిబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) సూర్యుడు నడినెత్తి నుండి క్రిందికి వాలిన తర్వాత జుహ్ర్ నమాజుకు ముందు నాలుగు రకాతులు చేసే వారు. ఇంకా ఇలా అనేవారు: "ఇది ఎలాంటి సమయమంటే ఇందులో ఆకాశ ద్వారాలు తెరుచుకుంటాయి. కనుక ఈ ఘడియలో నా సదాచరణలు పైకి వెళ్ళటాన్ని నేను యిష్టపడతాను." (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని నమాజ్ అధ్యాయం)

## ముఖ్యాంశాలు

సూర్యుడు నడినెత్తి నుండి వాలగానే జుహ్ర్ నమాజ్ వేళ ప్రారంభమవుతుంది. దీని ద్వారా దైవప్రవక్త (సల్లం) జుహ్రకు సంబంధించిన నాలుగు రకాతుల సున్నత్ నమాజును తొలివేళలో చేసేవారని అర్థమవుతోంది. అదీగాక దైవప్రవక్త (సల్లం) ఒక్క ఇషా నమాజు మినహా మిగతా నమాజులన్నిటిని తొలివేళలోనే నెరవేర్చేవారు. ఆకాశ ద్వారాలు తెరుచుకుంటా యంటే ఆ సమయంలో మానవుల ఆచరణలు దైవసన్నిధికి గొనిపోబడతాయని భావం.

١١١٨ - وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنهَا، أَنَّ النَّبِيَّ ﷺ كَانَ إذا لَمْ يُصَلِّ أَرْبَعاً قَبْلَ الظُّهرِ، صَلاَّهُنَّ بَعْدَهَا. رَوَاهُ الترمذي وَقَالَ: حديثٌ حَسَنٌ.

1118. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) ఎప్పుడైనా జుహ్రకు ముందు నాలుగు రకాతులు చేయలేకపోతే జుహ్ర్ తర్వాత వాటిని నెరవేర్చేవారు. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణం)

**200వ అధ్యాయం**

## ٢٠٠ ـ بَابُ سُنَّةِ الْعَصْرِ

## అస్ర్‌కు సంబంధించిన సున్నత్‌లు

١١١٩ ـ عَنْ عَليٍّ بنِ أبي طَالِبٍ رضيَ اللهُ عَنْهُ قالَ: كانَ النَّبيُّ ﷺ يُصَلِّي قَبْلَ العَصْرِ أَرْبَعَ رَكَعَاتٍ، يَفْصِلُ بَيْنَهُنَّ بِالتَّسْلِيمِ عَلى المَلائِكَةِ المُقَرَّبِينَ، وَمَنْ تَبِعَهُمْ مِنَ المُسْلِمِينَ وَالمُؤْمِنِينَ. رواه الترمذي وَقالَ: حديثٌ حَسَنٌ.

1119. హజ్రత్ అలీ బిన్ అబూతాలిబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) అస్ర్ నమాజుకు ముందు నాలుగు రకాతులు చేసేవారు. సన్నిహితంగా ఉండే దైవదూతలు, వారిని అనుసరించే ముస్లింలు, విశ్వాసులకు సలాం చేసి వాటిని వేరుపరిచేవారు.

*(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

వాటిని సలాంతో వేరుపరచేవారంటే రెండేసి రకాతుల చొప్పున నాలుగు రకాతులు చేసేవారని భావం. దైవదూతల మాదిరిగా విశ్వాసులు కూడా దేవుని ఏకత్వాన్ని, ఆయన గొప్పదనాన్ని విశ్వసిస్తారు కనుక వారిని దైవదూతల్ని అనుసరించేవారని చెప్పబడింది.

١١٢٠ ـ وَعَن ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبيِّ ﷺ قالَ: «رَحِمَ اللهُ امْرَأً صلَّى قَبْلَ العَصْرِ أَرْبعاً». رَوَاهُ أَبو داود، والترمذي وقالَ: حديثٌ حَسَنٌ.

1120. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "అస్ర్‌కు ముందు నాలుగు రకాతులు చేసేవారిని దేవుడు కరుణించుగాక!"అని దీవించారు. (అబూదావూద్, తిర్మిజీ- హసన్)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇంతకు ముందు హదీసులో వివరించబడిన దైవప్రవక్త ఆచరణకు అనుగుణంగా ఆ నాలుగు రకాతులను రెండేసి రకాతుల చొప్పున చేయవచ్చు. వీలైతే నాలుగు రకాతుల్ని

ఒకే సలాంతో కూడా నెరవేర్చవచ్చు. రెండు పద్ధతులూ సరైనవే. అయినప్పటికీ కొంతమంది తొలిపద్ధతి ప్రకారం చేయటమే ఉత్తమమని భావిస్తున్నారు. అస్రకు ముందు చేసే సున్నత్ నమాజును పండితులు 'గైర్ ముఅక్కదా'గా పేర్కొన్నారు. ఏది ఏమైనా ఆ నమాజు చేసినవారిని దైవప్రవక్త ఆశీర్వదించటం దాని ప్రాముఖ్యతను తెలియజేస్తోంది.

١١٢١ - وعنْ عليٍّ بنِ أَبي طالب رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبيَّ ﷺ كانَ يُصلِّي قَبْلَ العَصْرِ رَكْعَتَيْنِ. رَوَاهُ أَبو داود بإسنادٍ صحيحٍ.

1121. హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) అస్రకు ముందు రెండు రకాతులు చేసేవారు.

(అబూదావూద్, ఆధారాలు దృఢమైనవి)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దీని ద్వారా అస్రకు ముందు సున్నత్ నమాజు రెండు రకాతులు కూడా చేయవచ్చని బోధపడుతోంది. కాని షేఖ్ అల్‌బానీ గారు ఈ హదీసులోని 'రెండు రకాతులు' అనే పదం అరుదైనదనీ (షాజ్ అనీ), ఇది నాలుగు రకాతుల ప్రస్తావన ఉన్న విశ్వసనీయమైన హదీసులతో విభేదిస్తోందని అంటున్నారు. కనుక అస్రకు ముందు సున్నత్ నాలుగు రకాతులు చేయటం ఎందుకైనా మంచిది.



**201 వ అధ్యాయం**

## ٢٠١ - بَابُ سُنَّةِ الْمَغْرِبِ بَعْدَهَا وَقَبْلَهَا

## మగ్రిబ్‌కు ముందు, దాని తర్వాత చేయబడే సున్నత్‌లు

تَقدَّمَ في هذه الأبوابِ حديثُ ابنِ عُمَرَ، وَحديثُ عائشةَ، وَهما صَحيحانِ أنَّ النبيَّ ﷺ كانَ يُصلّي بَعْدَ المغرِبِ رَكعتَيْنِ.

క్రితం అధ్యాయాల్లో హజ్రత్ ఇబ్నె ఉమర్ మరియు ఆయిషా (రజి)లు వివరించిన ప్రామాణిక హదీసుల ద్వారా దైవప్రవక్త (సల్లం) మగ్రిబ్ తర్వాత రెండు రకాతులు చేసేవారని తెలుస్తోంది.

١١٢٢ - وَعَنْ عَبْدِ اللهِ بنِ مُغفَّلٍ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبيِّ ﷺ قالَ: «صَلُّوا قَبْلَ المَغرِبِ» قَالَ في الثَّالثَة: «لِمَنْ شَاءَ» رواه البخاري.

1122. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) "మగ్రిబ్‌కు ముందు నమాజ్ చేయండి" అని (మూడుసార్లు) అన్నారు. మూడోసారి 'చేయదలచిన వారు' అని అన్నారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మగ్రిబ్ అజాన్ తర్వాత ఫర్జ్ నమాజ్‌కు ముందు రెండు రకాతుల సున్నత్ నమాజ్ చేయటం అభిలషణీయం. ఎన్నో ఇతర హదీసులు కూడా ఈ విషయాన్ని సమర్థిస్తున్నాయి. వాస్తవానికి ఈ నమాజు గైర్ ముఅక్కదా అయినప్పటికీ దైవప్రవక్త (సల్లం) దాన్ని నెరవేర్చమని మూడుసార్లు తాకీదు చేయటం ద్వారా దాని ప్రాముఖ్యత వెల్లడౌతోంది. మొత్తానికి ఈ నమాజు చేయటం అభిలషణీయం అన్న విషయంలో మాత్రం ఎలాంటి సందేహం లేదు. రాబోయే హదీసులు ఈ విషయాన్ని మరింతగా నొక్కి వక్కాణిస్తున్నాయి.

١١٢٣ - وعن أَنسٍ رَضِيَ اللهُ عَنْهُ قالَ: لَقدْ رَأَيتُ كِبَارَ أَصحابِ رسولِ

1123. హజ్రత్ అనస్ (రజి) కథనం: నేను దైవప్రవక్త సహచరుల్లో గొప్ప గొప్ప వారిని చూశాను. వారు మగ్రిబ్

اللهِ ﷺ يَبْتَدِرُونَ السَّوَارِيَ عندَ المغربِ. رواه البخاري.

వేళ మస్జిద్ స్తంభాల దగ్గరికి వెళ్ళటానికి తొందరపడేవారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త సహచరులు మగ్రిబ్ వేళ ఫర్జ్‌కు ముందు మస్జిద్ నిట్టాడులను 'సుత్రా'గా చేసుకొని రెండు రకాతుల నమాజ్ చేసేవారు. అయితే మస్జిద్‌లో సహచరులందరికీ చాలినన్ని నిట్టాడులు ఉండేవికావు. అందుకని వారు నిట్టాడుల కోసం పరస్పరం పోటీ పడేవారు. ఈ హదీసు ద్వారా బోధపడే రెండో విషయం ఏమిటంటే, మస్జిద్‌లో నఫిల్ లేక సున్నత్ నమాజులు చేసేటప్పుడు ఎదురుగా ఏదయినా వస్తువు అడ్డం 'సుత్రా' పెట్టుకోవటం అవసరం. సుత్రా లేకుండా సాధారణంగా జనం నడిచే దారిలో నమాజుకు ఉపక్రమించకూడదు. ప్రజలు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని మసలుకోవాలి.

١١٢٤ ـ وَعَنْهُ قَالَ: كُنَّا نُصَلِّي عَلَى عَهدِ رسولِ اللهِ ﷺ رَكعَتَيْنِ بَعْدَ غُروبِ الشَّمسِ قَبلَ المَغرِبِ، فَقِيلَ: أَكَانَ رسولُ اللهِ ﷺ صَلاَّهُمَا؟ قالَ: كانَ يَرانَا نُصَلِّيهِمَا فَلَمْ يَأْمُرْنَا وَلَمْ يَنْهَنَا. رَوَاهُ مُسْلِمٌ.

1124. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) కాలంలో మేము సూర్యాస్తమయం తర్వాత మగ్రిబ్ ఫర్జ్‌కు ముందు రెండు రకాతులు చేసే వారము.

అనస్ (రజి) ఈ హదీసును వివరిస్తున్నప్పుడు ఎవరో ఆయన్ని "మరి దైవప్రవక్త (సల్లం) కూడా చేసేవారా?" అని అడగ్గా, 'మేము ఆ రెండు రకాతులు చేస్తుండగా ఆయన మమ్మల్ని చూసే వారు. అయితే ఆయన మమ్మల్ని చేయమని ఆజ్ఞాపించేవారు కాదు. వద్దని వారించేవారు కూడా కాదు" అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త సహచరులు మగ్రిబ్ ఫర్జ్‌కు ముందు రెండు రకాతులు,

అది కూడా దైవప్రవక్త సమక్షంలోనే చేసేవారని తెలుస్తోంది. అయితే హజ్రత్ అనస్ (రజి) ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) ఈ విషయంలో తటస్థ వైఖరిని అవలంబించారనీ, దీని గురించి ఆయన ఆజ్ఞాపించేవారు కాదనీ, దాన్ని వారించేవారు కూడా కాదనీ అభిప్రాయపడ్డారు. ఇది ఆయన అభిప్రాయం మాత్రమే. ఎందుకంటే ఇంతకు ముందు వచ్చిన హదీసుల్లో దైవప్రవక్త (సల్లం) మగ్రిబ్‌కు ముందు నమాజు చేయమని మూడుసార్లు తాకీదు చేసి మరీ ఆదేశించారని చెప్పబడింది. బహుశా హజ్రత్ అనస్ (రజి) గారికి ఈ హదీసు గురించి తెలిసి ఉండకపోవచ్చు. అందుకే ఆయన ఆ విధంగా అభిప్రాయపడ్డారు.

١١٢٥ ـ وعنه قَالَ: كُنَّا بِالمَدِينَةِ فَإِذَا أَذَّنَ المُؤَذِّنُ لِصَلاةِ المَغرِبِ، ابْتَدَرُوا السَّوَارِيَ، فَرَكَعُوا رَكْعَتَيْنِ، حَتَّى إنَّ الرَّجُلَ الغَرِيبَ لَيَدْخُلُ المَسْجِدَ فَيَحْسَبُ أَنَّ الصَّلاةَ قَدْ صُلِّيَتْ مِنْ كَثْرَةِ مَنْ يُصَلِّيهِمَا. رَوَاهُ مُسْلِمٌ.

1125. హజ్రత్ అనస్(రజి) కథనం: మేము మదీనాలో ఉన్నప్పుడు ముఅజ్జిన్ మగ్రిబ్ నమాజ్ కోసం అజాన్ ఇవ్వగానే ప్రజలు (మస్జిద్) నిట్టాడుల కోసం పోటీపడేవారు. ఆ తర్వాత రెండు రకాతుల నమాజ్ చేసే వారు. వారు ఆ నమాజ్ ఎంత ఎక్కువగా చేసేవారంటే, క్రొత్త వ్యక్తి ఎవరయినా మస్జిద్‌కు వస్తే వారి వాలకం చూసి ఫర్జ్ నమాజ్ అయిపోయిందేమో (ప్రజలు ఆ తర్వాతి సున్నత్ నమాజులు చేసుకుంటున్నారేమో) ననుకుంటాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు:**

మొత్తానికి పై హదీసుల ద్వారా బోధపడేదేమిటంటే దైవప్రవక్త సహచరులు మస్జిదె నబవీలో మగ్రిబ్ వేళ ఫర్జ్ నమాజ్‌కు ముందు రెండు రకాతుల నఫిల్ నమాజును అనవాయితీగా చేసేవారు. అయినప్పటికీ ఆ నమాజు సున్నతె గైర్ ముఅక్కదాగానే పరిగణించబడుతుంది. ఫర్జ్ తర్వాత చేసే రెండు రకాతులు మాత్రం 'సున్నతె ముఅక్కదా'గా పరిగణించబడతాయి.



**202 వ అధ్యాయం**

## ٢٠٢ ـ بَابُ سُنَّةِ الْعِشَاءِ بَعْدَهَا وَقَبْلَهَا

## ఇషాకు ముందు, ఆ తర్వాత చేయబడే సున్నత్ నమాజుల వివరణ

فِيهِ حديثُ ابنِ عُمَرَ السَّابِقُ: صَلَّيْتُ مَعَ النَّبِيِّ ﷺ رَكعَتَيْنِ بَعْدَ العِشَاءِ، وَحديثُ عبدِ اللهِ بنِ مُغَفَّلٍ: «بَيْنَ كُلِّ أَذَانَيْنِ صَلاةٌ» مُتَّفَقٌ عَلَيهِ. كما سَبَقَ.

ఇంతకు ముందు ఇబ్నె ఉమర్ (రజి) వివరించిన, 'నేను దైవప్రవక్త (సల్లం) వెంట ఇషా తర్వాత రెండు రకాతులు చేశానన్న హదీసు, అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) గారి, "ప్రతి రెండు అజాన్‌ల మధ్య ఒక నమాజు ఉంది" అన్న (బుఖారీ, ముస్లిం) హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది.

### ముఖ్యాంశాలు

ఇషా నమాజ్ వేళ దైవప్రవక్త (సల్లం) చేసినది, ఆయన ప్రియ సహచరులు యావత్తు ముహమ్మదీయ సమాజానికి తెలిపినది నాలుగు రకాతుల ఫర్జ్ మరియు ఆ తర్వాత రెండు రకాతుల సున్నత్ మాత్రమే. ఇక్కడ విత్ర్ నమాజ్ గురించి వివరించబడలేదు. దానిక్కారణం దైవప్రవక్త (సల్లం) సాధారణంగా తహజ్జుద్‌తోపాటు విత్ర్ నమాజ్ చేసేవారు. ఆ మూడు రకాతుల విత్ర్ కలుపుకున్నా ఇషా వేళ మొత్తం తొమ్మిది రకాతులే అవుతాయి. కాని తెలిసో తెలియకో ప్రజలు ఇషావేళ పదిహేడు రకాతులు సృష్టించుకున్నారు. అది విని సామాన్య జనం, అసలు నమాజ్ చేయటానికే జంకుతున్నారు. ప్రజలకు గనక దైవప్రవక్త విధానాన్ని అనుసరించి ఇషా నమాజు మొత్తం తొమ్మిది రకాతులేనని చెబితే వారు నమాజ్ గురించి, ముఖ్యంగా ఇషా నమాజ్ గురించి ఎన్నటికీ భయపడరేమో!

203 వ అధ్యాయం

## ٢٠٣ - بَابُ سُنَّةِ الْجُمُعَةِ

## జుమా నమాజ్ వేళ చేయబడే సున్నత్‌లు

١١٢٦ - فيهِ حديثُ ابنِ عُمَرَ السَّابِقُ أَنَّهُ صَلَّى مَعَ النَّبِيِّ ﷺ رَكعَتَيْنِ بَعْدَ الجُمُعَةِ. متفقٌ عليه.

1126. ఇంతకు ముందు ఇబ్నె ఉమర్ (రజి) వివరించిన "దైవప్రవక్త (సల్లం) వెంట నేను జుమా తర్వాత రెండు రకాతుల నమాజ్ చేశానన్న" (బుఖారీ-ముస్లిం) హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది.

### ముఖ్యాంశాలు

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ అధ్యాయంలో జుమా తర్వాత ఎన్ని రకాతుల నమాజ్ చేయాలనే విషయం గురించి వివరిస్తున్నారు. రాబోవు రెండు హదీసుల్లో దానిగురించి ఇంకా వివరంగా విశదీకరిస్తారు. ఇకపోతే జుమాకు ముందు ఎన్ని రకాతులు చేయాలి? అనే విషయమై హదీసుల ద్వారా బోధపడేదేమిటంటే, జుమా నమాజ్ కోసం మస్జిద్‌కు వచ్చే వ్యక్తి రెండు రకాతులు చేసిన తర్వాతగాని కూర్చోకూడదు. ఆఖరికి ఖుత్బా (ప్రసంగం) సమయంలో వచ్చినాసరే, సంక్షిప్తంగానయినా రెండు రకాతులు చేసుకోవాలని దైవప్రవక్త (సల్లం) ఆదేశించారు. అయితే ప్రసంగానికి ముందు రెండు రకాతుల తహియ్యతుల్ మస్జిద్ నమాజ్ తర్వాత రెండేసి రకాతుల చొప్పున నఫిల్ నమాజు ఎన్ని రకాతులైనా చేసుకోవచ్చు.

١١٢٧ - وعَنْ أَبي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «إذا صَلَّى أَحَدُكُمُ الجُمُعَةَ، فَلْيُصَلِّ بَعْدَهَا أَرْبَعاً» رواه مسلم.

1127. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా జుమా తర్వాత నాలుగు రకాతుల నమాజ్ చేసుకోవాలి.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)

١١٢٨ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ كانَ لا يُصَلِّي بَعْدَ الجُمُعَةِ حَتَّى يَنْصَرِفَ، فَيُصَلِّي رَكْعَتَيْنِ فِي بَيْتِهِ، رواه مسلم.

1128. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) జుమా తర్వాత (మస్జిద్‌లో) ఎలాంటి నమాజ్ చేసేవారు కాదు. మస్జిద్ నుండి తిరిగి వెళ్ళిన తర్వాతే ఇంట్లో రెండు రకాతులు చేసేవారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక హదీసులో జుమా తర్వాత నాలుగు రకాతులు చేయాలనీ, మరో హదీసులో రెండు రకాతులు చేయాలని చెప్పబడింది. దీనిద్వారా రెండు పద్ధతులూ సరైనవేనని బోధపడుతోంది. కొంతమంది పండితులు ఈ రెండు హదీసుల్ని సమన్వయ పరచటానికి ప్రయత్నించారు. జుమా తర్వాత మస్జిద్‌లోనే నమాజ్ చేయదలచుకునేవారు నాలుగు రకాతులు చేయాలనీ, ఇంట్లో చేసేవారు రెండు రకాతులు చేసుకుంటే సరిపోతుందని అభిప్రాయపడ్డారు.

ఇకపోతే నాలుగు రకాతుల నమాజును ఏ విధంగా చేయాలి? ఈ విషయంలో కూడా రెండు అభిప్రాయాలున్నాయి. ఒక విధానం నాలుగు రకాతులు ఒకే సలాంతో చేయాలనీ, మరొక విధానం రెండేసి రకాతుల చొప్పున చేయాలని. రెండు పద్ధతులూ సమ్మతమైనవే. అయితే రెండేసి రకాతుల చొప్పున చేసుకోవటమే ఉత్తమం. ఎందుకంటే ఒక ప్రామాణిక హదీసులో రాత్రి మరియు పగటిపూట నఫిల్ నమాజులు రెండేసి రకాతులు చేయాలని చెప్పబడింది. ఇమామ్ బుఖారీ (రహ్మలై) కూడా తన గ్రంథంలో "రాత్రి మరియు పగటి పూట (నఫిల్) నమాజులు రెండేసి రకాతులే" అనే శీర్షికతో ఒక అధ్యాయాన్ని ఏర్పరచారు.



**204 వ అధ్యాయం**

## ٢٠٤ - بَابُ اسْتِحْبَابِ جَعْلِ النَّوَافِلِ فِي الْبَيْتِ سَوَاءٌ الرَّاتِبَةُ وَغَيْرُهَا، وَالأَمْرِ بِالتَّحَوُّلِ لِلنَّافِلَةِ مِنْ مَوْضِعِ الفَرِيضَةِ أَوِ الْفَصْلِ بَيْنَهُمَا بِكَلَامٍ

## ముఅక్కదాలైనా, గైర్ ముఅక్కదాలైనా నఫిల్ నమాజులను ఇంట్లో చేయడమే అభిలషణీయమైన పద్ధతి, ఫర్జ్ తర్వాత నఫిల్ కోసం స్థలం మార్చాలి, లేదా కనీసం మాటలతోనయినా వాటి మధ్య కాస్త వ్యవధినివ్వాలి

١١٢٩ - عَنْ زيدِ بن ثابتٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «صَلُّوا أَيُّهَا النَّاسُ فِي بُيُوتِكُمْ؛ فَإِنَّ أَفْضَلَ الصَّلاةِ صَلاةُ المَرْءِ فِي بَيْتِهِ إِلَّا المَكْتُوبَةَ» متفقٌ عليه.

1129. హ్రజత్ జైద్ బిన్ సాబిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రజలారా! మీరు మీ ఇండ్లల్లో (కూడా) నమాజ్ చేస్తూ ఉండండి. పురుషుని నమాజుల్లో ఇంట్లో చేసుకునే నమాజే అత్యుత్తమమైనది- ఒక్క ఫర్జ్ నమాజ్ తప్ప!

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఫర్జ్ నమాజును మస్జిద్‌లో సామూహికంగా నెరవేర్చవలసి ఉంటుంది. ఇకపోతే మిగిలిన సున్నత్, నఫిల్ నమాజులను ఇంట్లో, మస్జిద్‌లో ఎక్కడైనా చేసుకోవచ్చు. అయితే వాటిని ఇంట్లో చేసుకోవటమే ఉత్తమం. పై హదీసులో సున్నత్, నఫిల్ నమాజులను ఇంట్లో చేసుకోవాలని ఆదేశించబడింది. నఫిల్ నమాజులను ఇంట్లో చేసే వ్యక్తి ప్రదర్శనా బుద్ధితోగాక చిత్తశుద్ధితో చేస్తాడు. అంతేకాదు, దానివల్ల ఇంట్లో శుభం కూడా అవతరిస్తుంది.

١١٣٠ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنهُمَا عَنِ النَّبيِّ ﷺ قالَ: «اجعَلُوا مِنْ صَلاتِكُمْ في بُيُوتِكُمْ، وَلا تَتَّخِذُوهَا قُبُوراً» متفقٌ عليه.

1130. హ(జత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీ నమాజుల్లో కొన్నింటిని మీ ఇండ్ల కొరకు ప్రత్యేకించుకోండి. వాటిని (అనగా మీ ఇండ్లను) శ్మశానాలుగా చేసుకోకండి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు:**

'కొన్నింటిని' అంటే నఫిల్ మరియు సున్నత్ నమాజులని భావం. ఇంట్లో నమాజ్ చేయకపోతే ఆ ఇల్లు శ్మశానంలా తయారవుతుంది. శ్మశానాల్లో ఆచరణ, ఆరాధనలు జరగవు. అలాగే ఇండ్లల్లో నమాజ్ చేయకపోతే ఆ ఇంటి మనుషుల్లో కూడా ఆచరణ, ఆరాధనా భావాలు సమసిపోతాయని ఈ హదీసు చూచాయగా హెచ్చరిస్తోంది.

١١٣١ - وَعَنْ جابِرٍ رَضِيَ اللهُ عَنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إذا قَضَى أَحَدُكُم صَلاتَهُ في مَسْجِدِهِ؛ فَلْيَجعَلْ لِبَيتِهِ نَصِيباً مِنْ صَلاتِهِ؛ فَإِنَّ اللهَ جَاعِلٌ في بَيتِهِ مِنْ صَلاتِهِ خَيْراً» رواه مسلم.

1131. హ(జత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా మస్జిద్‌లో నమాజ్ చేసుకుంటే అందులో కొంతభాగాన్ని తమ ఇంటి కొరకు కూడా ఉంచుకోవాలి. నిస్సందేహంగా అతని నమాజు మూలంగా దేవుడు అతని ఇంట్లో శుభాన్ని అవతరింపజేస్తాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٣٢ - وَعَنْ عُمَرَ بنِ عَطَاءٍ أَنَّ نَافعَ بنَ جُبَيرٍ أَرْسَلَهُ إلى السَّائِبِ ابنِ أُختِ نمرٍ يَسْأَلُهُ عَنْ شَيْءٍ رَآهُ مِنْهُ مُعَاوِيَةُ في الصَّلاةِ فَقَالَ: نَعَمْ صَلَّيْتُ مَعَهُ الجُمُعَةَ في

1132. హ(జత్ ఉమర్ బిన్ అతా కథనం: నాఫే బిన్ జుబైర్ గారు తన నమాజులో హ(జత్ ముఆవియా (రజి) గారు చూసి (తనను మందలించి)న విషయం గురించి సాయిబ్ బిన్ ఉఖ్తె నమర్ (రజి)ని అడిగిరమ్మని నన్ను

الْمَقْصُورَةِ، فَلَمَّا سَلَّمَ الإِمَامُ، قُمْتُ فِي مَقَامِي، فَصَلَّيْتُ، فَلَمَّا دَخَلَ أَرْسَلَ إِلَيَّ فقال: لا تَعُدْ لِمَا فَعَلْتَ: إذا صَلَّيْتَ الْجُمُعَةَ، فَلا تَصِلْهَا بِصَلاةٍ حَتَّى تَتَكَلَّمَ أَوْ تَخْرُجَ؛ فَإِنَّ رسولَ اللهِ ﷺ أَمَرَنَا بذلك، أَنْ لا نُوصِلَ صَلاةً بِصَلاةٍ حَتَّى نَتَكَلَّمَ أَوْ نَخْرُجَ. رواه مسلم.

పంపించారు. ఆ సందర్భంగా ఆయన ఇలా అన్నారు:

"ఔను..నేను ముఆవియాతో పాటు మక్సూరాలో నమాజ్ చేశాను. ఇమామ్ సలాం చేసి నమాజ్ ముగించిన తర్వాత నేను ఫర్జ్ చేసిన స్థలంలోనే నిలబడి (సున్నత్) నమాజ్ చేశాను. ఇంటికెళ్ళిన తర్వాత ముఆవియా గారు నన్ను తన వద్దకు పిలిపించి, 'నువ్వు ఈ రోజు చేసినట్లు ఇంకెప్పుడూ చేయకు. జుమా నమాజ్ చేసిన తర్వాత ఎవరితోనయినా మాట్లాడనంత వరకు, అక్కడి నుండి కదలనంత వరకు (అంటే స్థలం మార్చుకోనంత వరకు) ఏ ఇతర నమాజూ చేయకు. ఎందుకంటే మనం ఒక నమాజు చేసిన తర్వాత మాట్లాడనంత వరకు లేదా అక్కడి నుండి వెడలనంతవరకు వేరొక నమాజును దాంతో కలపకూడదని దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞాపించారు' అని చెప్పారు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

**'మక్సూరహ్'** అంటే మస్జిద్ మూలలో తయారు చేయబడిన ఓ చిన్న కుటీరం లాంటిది. ఆ రోజుల్లో రాజులు, అధికారులు తమ రక్షణ నిమిత్తం అలాంటి కుటీరాలు నిర్మించుకునేవారు. వాటిలోనుంచే ప్రజలతోపాటు సామూహికంగా నమాజ్ చేసేవారు. హదీసులో పేర్కొనబడిన సంఘటన జుమా నమాజుకు సంబంధించినది కాబట్టి ముఆవియా (రజి)గారు ప్రత్యేకంగా జుమా గురించే ప్రస్తావించారు. వాస్తవానికి ప్రతి ఫర్జ్ నమాజు అనంతరం అదే పద్ధతిని అవలంబించాలి. మాట్లాడటం ద్వారాగాని, స్థలం మార్చిగాని, మస్జిద్ నుండి బయటికి లేక ఇంటికి వెళ్ళటం ద్వారాగాని ఫర్జ్ నఫిల్ నమాజుల మధ్య వ్యవధినివ్వాలి.

## 205 వ అధ్యాయం

## ٢٠٥ - بَابُ الْحَثِّ عَلَى صَلَاةِ الْوِتْرِ وَبَيَانِ أَنَّهُ سُنَّةٌ مُتَأَكِّدَةٌ وَبَيَانِ وَقْتِهِ

## విత్ర్ నమాజ్ చేయమని ప్రోత్సాహం, ఇంకా అది సున్నతె ముఅక్కదా అనే విషయం గురించి, దాని వ్యవధి గురించి

١١٣٣ - عَنْ عَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: الوِتْرُ لَيْسَ بِحَتْمٍ كَصَلَاةِ المَكْتُوبَةِ، وَلَكِنْ سَنَّ رسولُ اللهِ ﷺ قَالَ: «إِنَّ اللهَ وِتْرٌ يُحِبُّ الوِتْرَ، فَأَوْتِرُوا يَا أَهْلَ القُرْآنِ». رواه أبو داود والترمذي وقَالَ: حديثٌ حسنٌ.

1133. హజ్రత్ అలీ (రజి) కథనం: విత్ర్ నమాజు ఫర్జ్ నమాజు మాదిరిగా తప్పని సరిగా పాటించవలసింది కాదు. వాస్తవానికి దైవప్రవక్త (సల్లం) దీనికి శ్రీకారం చుట్టారు. (అంటే ఇది సున్నత్). ఆయన ఈ విధంగా ప్రవచించారు: నిస్సందేహంగా దేవుడు బేసి సంఖ్యలో ఉన్నాడు. బేసిని ప్రేమిస్తాడు. కనుక ఖుర్ఆన్ (గ్రంథంగల) ప్రజలారా! బేసి సంఖ్యలో నమాజ్ చేయండి.

*(అబూదావూద్, తిర్మిజీ-హసన్)*

*(సుననె అబూదావూద్, సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

'విత్ర్' అంటే బేసి అని అర్థం. అల్లాహ్ బేసిసంఖ్యలో ఉన్నాడంటే తన అస్తిత్వం, గుణగణాల రీత్యా దేవుడు ఒక్కడేనని భావం. ఆయన అస్తిత్వంలో ద్వైత్వాన్ని ఊహించటం కూడా సమ్మతం కాదు. అదే విధంగా విత్ర్ నమాజులో ఒకటి లేక మూడు లేక ఐదు లేక ఏడు మొదలగు రకాతులు చేయబడతాయి. కనుక ఆ నమాజుకు విత్ర్ (బేసి) నమాజ్ అని పిలుస్తారు. ఈ నమాజును రెండు, నాలుగు, ఆరు రకాతుల్లో చేయడం ధర్మసమ్మతం కాదు. ఈ హదీసు ద్వారా విత్ర్ నమాజు-ఫర్జ్, వాజిబ్ నమాజుల్లాంటి నమాజ్ కాదనీ, అది కేవలం సున్నతె ముఅక్కదా మాత్రమేనని బోధపడుతోంది. అయినప్పటికీ ఈ నమాజు పట్ల అశ్రద్ధ వహించటం, నిర్లక్ష్యం చేయటం ఎంతమాత్రం సమంజసం కాదు. దైవప్రవక్త సంప్రదాయాన్ని నిర్లక్ష్యం చేయటం ఒక విశ్వాసికి ఎంత మాత్రం శోభించదు.

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) తన సహచరుల్ని ఖుర్ఆన్ ప్రజలారా! (అహ్లె ఖుర్ఆన్!) అని సంబోధించారు. అహ్లె ఖుర్ఆన్ అంటే, వారు హదీసుల్ని నమ్మేవారు కారని అర్థం ఎంతమాత్రం కాదు. వారు ఇస్లామీయ షరీఅత్‌ను అనుసరించేవారని భావం. ఖుర్ఆన్ హదీసుల సమాహారమే ఇస్లామీయ షరీఅతు. ఖుర్ఆన్ ఒక్కటే పరిపూర్ణ ఇస్లామీయ షరీఅత్ కాజాలదు. ఆధునిక యుగంలో ఒక వర్గం వారు తమల్ని తాము ఖుర్ఆన్ ప్రజలుగా చెప్పుకుంటున్నారు. వారు హదీసులను తిరస్కరిస్తారు. అలాంటి వారు వాస్తవానికి ఖుర్ఆన్‌ని కూడా తిరస్కరిస్తున్నారని తెలుసుకోవాలి. ఎందుకంటే ఖుర్ఆన్ హదీసుల మధ్య అవినాభావ సంబంధ ముంది. హదీసులేని ఖుర్ఆన్ ఫల రహితం. ఖుర్ఆన్‌లేని హదీసు మూల రహితం.

١١٣٤ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: مِنْ كُلِّ اللَّيْلِ قَدْ أَوْتَرَ رسولُ اللهِ ﷺ، مِنْ أَوَّلِ اللَّيْلِ، وَمِنْ أَوْسَطِهِ، وَمِنْ آخِرِهِ. وَانْتَهَى وِتْرُهُ إِلَى السَّحَرِ. متفقٌ عليه.

1134. హజ్రత్ ఆయిషా (రజి. అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) రాత్రి తొలి భాగంలో, మధ్య భాగంలో, చివరి భాగంలో ప్రతి భాగంలోనూ నమాజు చేసేవారు. ఆఖరి రోజుల్లో ఆయన చేసే విత్ర్ నమాజు ఉషోదయం వరకు చేరుకునేది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విత్ర్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పై హదీసులో విత్ర్ నమాజ్ యొక్క సమయం గురించి వివరించబడింది. దాని సమయం ఇషా నమాజ్ అయిపోయిన తర్వాత నుంచి ఉషోదయం వరకు ఉంటుంది. ఈ మధ్యలో విత్ర్ నమాజ్ ఎప్పుడైనా చేసుకోవచ్చు.

١١٣٥ ـ وعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «اجْعَلُوا آخِرَ صَلَاتِكُمْ بِاللَّيْلِ وِتْراً» متفقٌ عليه.

1135. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీరు విత్ర్ నమాజును రాత్రిపూట చివరి నమాజ్‌గా చేసుకోండి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విత్ర్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

'విత్ర్ నమాజును రాత్రిపూట చివరి నమాజ్‌గా చేసుకోండి' అన్న దైవప్రవక్త వారి ఈ

ప్రవచనాన్ని దృష్టిలో పెట్టుకొని కొంతమంది పండితులు విత్ర్ నమాజ్ తర్వాత నఫిల్ నమాజ్ చేయటం సమ్మతం కాదని అభిప్రాయపడ్డారు. అయితే ఇమామ్ నవవీ, మరికొందరు విద్వాంసులు మాత్రం పై హదీసులోని ఆదేశం అనివార్యమేమీ కాదుగాని, అలా చేయటం ఉత్తమ పద్ధతి అని వివరించారు. ఎందుకంటే స్వయంగా దైవప్రవక్త (సల్లం) విత్ర్ నమాజ్ అనంతరం రెండు రకాతుల నఫిల్ నమాజు చేశారని ప్రామాణికమైన హదీసుల ద్వారా బోధపడుతోంది. అందుకని పై హదీసు దృష్ట్యా ఎవరైనా విత్ర్ నమాజును తమ ఆఖరి నమాజుగా చేసుకుంటే చాలా మంచిది. ఒకవేళ ఎవరైనా విత్ర్ తర్వాత రెండు రకాతుల నఫిల్ నమాజు చేసుకున్నా అందులో ఎలాంటి తప్పులేదు (మిర్అతుల్ మఫాతీహ్).

షేఖ్ అల్‌బానీ ఇబ్నె ఖుజైమాగారి ఒక ఉల్లేఖనాన్ని నకలు చేశారు. అందులో దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారని ఉంది- 'మీలో ఎవరైనా విత్ర్ నమాజు తర్వాత రెండు రకాతుల నఫిల్ నమాజు చేసుకుంటే వారు ఖియాముల్లైల్ (తహజ్జుద్) చేసినట్లే'. ఈ హదీసుని నకలు చేసిన తర్వాత అల్‌బానీగారు ఇలా రాశారు: విత్ర్ తర్వాత రెండు రకాతుల నమాజ్ చేసే విషయమై నేను చాలా కాలం నుండి తటస్థవైఖరిని అవలంబిస్తూ వచ్చాను. అయితే ఈ హదీసును చూసినప్పటి నుంచి నేను కూడా దాన్ని ఆచరించటం ప్రారంభించాను. అంతేకాదు, 'విత్ర్ నమాజును రాత్రిపూట మీ చివరి నమాజ్‌గా చేసుకోండి' అన్న ప్రవచనంలోని ఆదేశం అనివార్యమైనది (వాజిబ్) కాదనీ, అది కేవలం ముస్తహబ్ (ఉత్తమ పద్ధతి) మాత్రమేనని కూడా అర్థం చేసుకోగలిగాను (అల్‌బానీగారి రిసాలయె ఖియామె రమజాన్). ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే విత్ర్ నమాజును రాత్రిపూట ఆఖరి సమయంలో చేయటం ఉత్తమం. అయితే ప్రతిరోజూ అలవాటుగా నిద్రలేచి తహజ్జుద్ నమాజ్ చేసేవారికే ఈ ఆదేశం వర్తిస్తుంది. సామాన్య ప్రజలు ఇషా నమాజ్‌తో పాటే విత్ర్ చేసుకోవటం మంచిది. లేకపోతే గాఢ నిద్ర మూలంగా అసలు నమాజ్ తప్పిపోయే ప్రమాదముంది.

1136. హజ్రత్ అబూసయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తెల్లవారక ముందే విత్ర్ నమాజు చేసుకోండి. (ముస్లిం)

١١٣٦ ـ وَعَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «أَوْتِرُوا قَبْلَ أَنْ تُصْبِحُوا». رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

1137. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) రాత్రి (తహజ్జుద్) నమాజు చేసుకునేటప్పుడు, తను ఆయన ముందు పడుకొని ఉండేది. ఆఖరికి విత్ర్ నమాజ్ మిగిలి ఉందనగా ఆయన తనని నిద్రలేపేవారు. అప్పుడు తను

١١٣٧ ـ وعن عائشةَ رضيَ اللهُ عنها، أَنَّ النَّبِيَّ ﷺ كانَ يُصَلِّي صَلاتَهُ بِاللَّيْلِ، وَهِيَ مُعْتَرِضَةٌ بَيْنَ يَدَيْهِ، فَإذا بَقِيَ الوِتْرُ، أَيْقَظَهَا فَأَوْتَرَتْ. رواه مسلم. وفي

رواية له: فَإِذا بَقِيَ الوترُ قالَ: «قُومِي فَأَوْتِرِي يَاعَائِشَةُ».

కూడా విత్ర్ నమాజ్ చేసేది. (ముస్లిం) ముస్లింలోని వేరొక ఉల్లేఖనం ప్రకారం విత్ర్ నమాజ్ మిగిలి ఉందనగా ఆయన తనను ఉద్దేశ్యించి, "ఆయిషా! లే, లేచి విత్ర్ చేసుకో" అని చెప్పేవారు.

*(సహీహ్ బుఖారీలోని విత్ర్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1) నమాజ్ చేస్తున్న వారి ముందు ఎవరైనా పడుకొని ఉన్నా దానివల్ల వారి నమాజ్‌కు ఎలాంటి హాని జరగదు. 2) రాత్రిపూట నఫిల్ మొదలగు నమాజులు చేయటం కోసం ఇంట్లోవారిని నిద్రలేపటం అభిలషణీయం. 3) రాత్రి చివరిభాగంలో నిద్రలేచి కేవలం విత్ర్ నమాజ్ అయినా చేసుకోవచ్చు.

١١٣٨ - وعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ قالَ: «بَادِرُوا الصُّبْحَ بالوِتْرِ». رَوَاهُ أبو داود والترمذي وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

1138. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తెల్లవారక ముందే విత్ర్ నమాజ్ చేయటం కోసం తొందరపడండి. (అబూదావూద్, తిర్మిజీ-హసన్, సహీహ్)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం- సుననె తిర్మిజీలోని నమాజ్ అధ్యాయం)*

١١٣٩ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ، قالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «مَنْ خَافَ أَنْ لا يَقُومَ مِنْ آخِرِ اللَّيْلِ؛ فَلْيُوتِرْ أَوَّلَهُ، وَمَنْ طَمِعَ أَنْ يَقُومَ آخِرَهُ، فَلْيُوتِرْ آخِرَ اللَّيْلِ، فَإِنَّ صَلاةَ آخِرِ اللَّيْلِ مَشْهُودَةٌ، وَذٰلِكَ أَفْضَلُ». رواه مسلم.

1139. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రాత్రి చివరివేళలో నిద్ర లేవలేమని భయమున్నవారు తొలివేళ లోనే విత్ర్ నమాజ్ చేసుకోవాలి. రాత్రి చివరివేళలో నిద్రలేవగలమని నమ్మక మున్న వారు చివరివేళలోనే విత్ర్ చేసుకోవాలి. ఎందుకంటే రాత్రి చివరి వేళ చేసే నమాజ్‌కు దైవదూతలు హాజరవుతారు. కనుక అలా చేయటం ఉత్తమం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## 206 వ అధ్యాయం

## ٢٠٦ ـ بَابُ فَضْلِ صَلاَةِ الضُّحَى وَبَيَانِ أَقلِّهَا وَأَكْثَرِهَا وَأَوْسَطِهَا، وَالْحَثُّ عَلَى الْمُحَافَظَةِ عَلَيْهَا

## చాష్త్ నమాజ్ ఘనత, దాని రకాతుల కనిష్ట, గరిష్ట, మధ్యమ సంఖ్య, దాన్ని క్రమం తప్పకుండా చేస్తూ ఉండమని ప్రోత్సహించటం గురించి

١١٤٠ ـ عَنْ أَبي هُرَيرَةَ رَضيَ اللهُ عَنْهُ قالَ: أَوْصَانِي خَلِيلِي ﷺ بصِيَام ثَلاثَةِ أَيَّام من كُلِّ شَهْرٍ، وَرَكْعَتَي الضُّحَى، وَأَنْ أُوتِرَ قَبْلَ أَنْ أَرْقُدَ» متفقٌ عليه. والإِيتَارُ قَبْلَ النَّومِ إِنَّمَا يُسْتَحَبُّ لِمَنْ لا يَثِقُ بالاسْتِيقَاظِ آخِرَ اللَّيْلِ، فَإِنْ وَثِقَ، فَآخِرُ اللَّيْلِ أَفْضَلُ.

1140. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: నా మిత్రులు (ముహమ్మద్ (సల్లం) నాకు హితోపదేశం చేశారు- ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసం పాటించమనీ, చాష్త్ వేళ రెండు రకాతుల నమాజ్ చేయమనీ, నిద్ర పోకముందే విత్ర్ నమాజ్ చేసుకోమ నీను. (బుఖారీ, ముస్లిం)

నిద్రపోకముందే విత్ర్ నమాజ్ చేయుట మనేది రాత్రి చివరి వేళలో నిద్రలేవగల మని నమ్మకం లేనివారికి మాత్రమే అభిలషణీయమైన పద్ధతి. ఒకవేళ నమ్మకముంటే రాత్రి చివరి వేళలో విత్ర్ చేసుకోవటమే ఉత్తమం.

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇక్కడ 'హితోపదేశం చేశార'ంటే అర్థం తాకీదు చేశారని. ఎందుకంటే ఫర్జ్ నమాజుల

తోపాటు నఫిల్ నమాజులను కూడా ఆచరించటం దైవసామీప్యాన్ని పొందటానికి అత్యుత్తమమైన మార్గం.

పైన హదీసులో ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసం పాటించాలని ఆదేశించబడింది. దానిప్రకారం నెలలో ఎప్పుడైనా మూడ్రోజులు ఉపవాసం ఉండవచ్చు. అయితే పున్నమి దినాల్లో (అంటే చాంద్రమాసంలోని 13,14,15 తారీకుల్లో) ఉపవాస ముండటం ఉత్తమం. ఎందుకంటే దైవప్రవక్త (సల్లం) కూడా ఆయా దినాల్లో ఉపవాసం పాటించేవారని హదీసుల ద్వారా బోధపడుతోంది.

١١٤١ ـ وعَنْ أبي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبيِّ ﷺ قالَ: «يُصْبِحُ على كُلِّ سُلامَى مِنْ أَحَدِكُمْ صَدَقَةٌ: فَكُلُّ تَسْبِيحَةٍ صَدَقَةٌ، وكُلُّ تحميدَةٍ صدقةٌ، وكُلُّ تهليلةٍ صدقةٌ، وكُلُّ تكبيرَةٍ صدقةٌ، وأَمْرٌ بالمَعْرُوفِ صَدَقَةٌ، وَنَهْيٌ عَنِ المُنْكَرِ صَدَقَةٌ، وَيُجْزِىءُ مِنْ ذلكَ رَكْعَتَانِ يَرْكَعُهُما مِنَ الضُّحَى». رواه مسلم.

1141. హజ్రత్ అబూజర్ర్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలోని ప్రతి ఒక్కరూ ప్రతిరోజూ ఉదయం తన ఒక్కొక్క కీలుకు బదులుగా సదఖా (దానం) ఇచ్చుకోవలసి ఉంటుంది. (అయితే) ప్రతిసారి **'సుబ్‌హానల్లాహ్'** అని పలకటం సదఖాగా పరిగణించబడుతుంది. ప్రతిసారి **'అల్‌హమ్దు లిల్లాహ్'** అని అనటం కూడా సదఖాయే. ప్రతిసారి **'లా ఇలాహ ఇల్లల్లాహ్'** అని అనటమూ సదఖాయే. ప్రతిసారి 'అల్లాహు అక్బర్' అని అనటం కూడా సదఖాయే. మంచిని గురించి ఆదేశించటం, చెడు నుండి ఆపటం కూడా సదఖాయే. ఎవరైనా వీటన్నిటికీ బదులుగా చాష్త్ వేళ రెండు రకాతుల నమాజ్ చేసినా సరిపోతుంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తెల్లవారుజామున మనిషి నిద్రలేచిన తర్వాత తన కీళ్ళన్నీ సురక్షితంగా ఉన్నందుకుగాను అతను దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. దానికి అతి సులువైన మార్గం ఏమిటంటే అనునిత్యం

దైవాన్ని స్తుతిస్తూ, ఆయన పవిత్రతను, గొప్పదనాన్ని కొనియాడుతూ ఉండాలి. హదీసులో పేర్కొనబడిన వచనాలను పలుకుతూ ఉంటే, అవి ఒక్కొక్కటి ఒక్కొక్క సదఖాగా (దానంగా) పరిగణించబడుతుంది. మానవుని దేహంలో మొత్తం 360 కీళ్ళుంటాయి. కనుక ప్రతి మనిషి అన్నిసార్లు తప్పకుండా దైవాన్ని స్తుతించాలి.

పై హదీసులో మనిషి తన దేహంలోని ప్రతి కీలుకు బదులుగా సదఖా (దానం) చెల్లించ వలసి ఉంటుంది అని చెప్పబడింది. వాస్తవానికి సదఖా అంటే అర్థం దానం అని మాత్రమే కాదు. ఈ పదానికి చాలా విస్తృతమైన అర్థం ఉంది. ప్రతి మంచి పని, ప్రతి పుణ్యకార్యం సదఖాగానే పరిగణించబడుతుంది. ఆ విధంగా చూస్తే సుబ్‌హానల్లాహ్, అల్‌హమ్దులిల్లాహ్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహ్ అంటూ దైవధ్యానంలో నిమగ్నులై ఉండటం కూడా దానంగానే పరిగణించబడుతుంది. ప్రజలకు మంచిని గురించి ఆజ్ఞాపించటం, వారిని చెడుల నుండి వారించటం కూడా సదఖాగానే పరిగణించబడుతుంది. అయితే వీటన్నిటికి బదులుగా చాష్త్ వేళ రెండు రకాతుల నమాజ్ చేసుకుంటే అదికూడా దేహంలోని కీళ్ళన్నిటి తరఫున సదఖాగా భావింపబడుతుంది. ప్రధానంగా ఈ విషయాన్ని బోధించటానికే ఈ హదీసును సదరు అధ్యాయం క్రింద పొందుపరచటం జరిగింది. దీనిద్వారా చాష్త్‌వేళ చేయబడే రెండు రకాతుల నఫిల్ నమాజు యొక్క ప్రాముఖ్యత వెల్లడౌతున్నది.

1142. హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) కథనం: దైవప్రవక్త (సల్లం) చాష్త్‌వేళ నాలుగు రకాతులు చేసేవారు. దైవం తలిస్తే అంతకన్నా ఎక్కువగా కూడా చేసేవారు. (ముస్లిం)

١١٤٢ ـ وعَنْ عَائشَةَ رَضِيَ اللهُ عَنْهَا قالتْ: كانَ رسولُ اللهِ ﷺ يُصَلِّي الضُّحَى أَرْبَعاً، وَيَزِيدُ مَا شَاءَ اللهُ. رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

సాధారణంగా దైవప్రవక్త (సల్లం) చాష్త్ వేళ నాలుగు రకాతులు చేసేవారు. అయితే అప్పుడప్పుడూ ఎక్కువ రకాతులు కూడా చేసేవారు. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా ఆయన ఎనిమిది రకాతుల వరకు చేసేవారని తెలుస్తోంది. కనుక మనం ఆ సమయంలో, మనకు వీలైన విధంగా రెండు, నాలుగు, ఎనిమిది రకాతుల వరకు చేసుకోవచ్చు.

1143. హజ్రత్ ఉమ్మె హానీ ఫాఖితా బిన్తె అబూ తాలిబ్ (రజి.అన్‌హా) కథనం: మక్కా విజయం వరించిన సంవత్సరం నేను దైవప్రవక్త (సల్లం)

١١٤٣ ـ وعنْ أُمِّ هَانِىءٍ فَاخِتَةَ بنتِ أَبِي طالبٍ رَضِيَ اللهُ عَنْهَا قَالتْ: ذَهَبْتُ إلى رسولِ اللهِ ﷺ عَـامَ الفَتْحِ فَوَجَدْتُهُ

يَغْتَسِلُ، فَلَمَّا فَرَغَ مِنْ غُسْلِهِ، صَلَّى ثَمَانِيَ رَكَعَاتٍ، وَذٰلِكَ ضُحىً. متفقٌ عليه.
وهذا مختصر لفظِ إحدى روايات مسلم.

దగ్గరికి వెళ్ళాను. అప్పుడాయన స్నానం చేస్తున్నారు. స్నానం ముగించుకున్న తర్వాత ఆయన ఎనిమిది రకాతులు చేశారు. అప్పుడది చాష్త్ సమయం. (బుఖారీ-ముస్లిం)

ఈ వాక్యాలు ముస్లింలోని ఓ సంక్షిప్త ఉల్లేఖనం లోనివి.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఎనిమిది రకాతుల ప్రస్తావన ఉంది. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా ఆయన రెండేసి రకాతుల చొప్పున చేసేవారని తెలుస్తోంది. అయితే చాష్త్ సమయం ఎప్పటి నుంచి ఎప్పటి వరకు ఉంటుంది? చాష్త్ మరియు ఇష్రాఖ్ రెండూ ఒకటేనా లేక రెండు వేర్వేరు నమాజులా? అనే విషయాల్లో పండితుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరి అభిప్రాయం ప్రకారం చాష్త్ మరియు ఇష్రాఖ్ నమాజులు రెండూ ఒక్కటే. సూర్యోదయం అయిన వెంటనే ఇది నెరవేర్చబడుతుంది. మరికొంతమంది అభిప్రాయం ప్రకారం అసలిది జుహా నమాజు. దీని సమయం సూర్యోదయం తర్వాత నుంచి మొదలయి, సూర్యుడు నెత్తి నుండి వాలకముందు వరకు ఉంటుంది. ఈ మధ్యకాలంలో తొలివేళలో చేయబడే నమాజును ఇష్రాఖ్ గానూ, చివరివేళలో చేయబడే నమాజును చాష్త్‌గానూ పరిగణిస్తారు.

ఇంకొందరు పండితుల అభిప్రాయం ప్రకారం సూర్యుడు ఒక ఈటెంత పైకి ఎక్కిన తర్వాత చేయబడే రెండు రకాతుల నమాజును 'ఇష్రాఖ్ నమాజ్' అంటారు. ఆ తర్వాత సూర్యకిరణాలు విరజిమ్మి నాలుగోవంతు ఆకాశం వెలుగుతో నిండిపోయినప్పుడు నాలుగు రకాతులు చేయాలి. దీనిని 'చాష్త్ నమాజ్' అంటారు (మిర్‌ఆతుల్ మఫాతీహ్). ఏది ఏమైనా మొత్తానికి ఈ నమాజు చేయటం అభిలషణీయం (ముస్తహబ్) అని అత్యధికమంది విద్వాంసులు అంటున్నారు.



**207 వ అధ్యాయం**

## ٢٠٧ ـ بَابُ تَجُوزُ صَلاَةُ الضُّحَى مِن ارْتِفَاعِ الشَّمْسِ إِلَى زَوَالِهَا وَالأَفْضَلُ أَنْ تُصَلَّى عِنْدَ اشْتِدَادِ الْحَرِّ وَارْتِفَاعِ الضُّحَى

## సూర్యుడు ఆకాశంపైకెక్కి నప్పటినుంచి నడినెత్తి నుండి వాలేవరకు మధ్యలో ఎప్పుడైనా చాష్త్ నమాజ్ చేసుకోవచ్చు, అయితే బాగా పొద్దెక్కిన తర్వాత ఎండ కాస్తున్నప్పుడు చేయటం ఉత్తమం

١١٤٤ ـ عن زيدِ بن أَرْقَمَ رَضيَ اللهُ عَنْهُ، أَنَّهُ رَأَى قَوْماً يُصَلُّونَ مِنَ الضُّحَى، فقالَ: أَمَا لَقَدْ عَلِمُوا أَنَّ الصَّلاةَ في غَيْرِ هذِهِ السَّاعةِ أَفْضَلُ. إنَّ رسولَ اللهِ ﷺ قالَ: «صَلاةُ الأَوَّابِينَ حِينَ تَرْمَضُ الفِصَالُ». رواه مسلم. «تَرْمَضُ» بفتح التاء والميم وبالضاد المعجمة، يعني: شدة الحرّ. «وَالفِصَالُ» جَمْعُ فَصِيلٍ وَهُوَ: الصَّغِيرُ مِنَ الإِبِلِ.

1144. హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం ప్రకారం కొంతమంది చాష్త్ నమాజ్ చేస్తుండగా చూసి తను ఇలా అన్నారు: జాగ్రత్త! ఈ నమాజును ఇప్పుడు కాకుండా వేరే సమయంలో చేయటం ఉత్తమం అన్న సంగతి వీరికి బాగా తెలుసు. నిస్సందేహంగా దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: (పాపాల నుండి) మరలేవారి (అవ్వాబీన్‌ల) నమాజు, ఎండతీవ్రతకు గున్న ఒంటెల కాళ్ళు కాలినప్పుడు చేయబడుతుంది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

చాష్త్ మరియు ఇష్రాఖ్ రెండూ వేర్వేరు నమాజులని చెప్పేవారు ఈ హదీసునే నిదర్శనంగా చూపిస్తారు. సూర్యుడు ఆకాశాన ఒక ఈటెంత పైకెక్కిన తర్వాత ఇష్రాఖ్ నమాజు చేసుకోవాలనీ, ఆ తర్వాత ఎండ తీవ్రమై పశువుల కాళ్ళు కాలే సమయంలో చాష్త్ నమాజు చేసుకోవాలని వీరు అభిప్రాయపడతారు. మరో విషయం ఏమిటంటే చాలామంది జనం 'సలాతుల్ అవ్వాబీన్' విషయంలో అపార్థానికి లోనై ఉన్నారు. సాధారణంగా ప్రజలు మగ్రిబ్ తర్వాత ఆరు రకాతుల నఫిల్ నమాజు చేయటాన్ని సలాతుల్ అవ్వాబీన్‌గా తలపోస్తారు. ఓ బలహీన (జయీఫ్) హదీసు ఆధారంగా ఈ ఆచరణ ప్రచారంలోకి వచ్చిందన్న విషయం గమనార్హం. మరి చూడబోతే సదరు ప్రామాణిక హదీసులో చాష్త్ నమాజునే అవ్వాబీన్ నమాజ్‌గా పేర్కొనటం జరిగింది. దీనిద్వారా బోధపడేదేమిటంటే సలాతుల్ అవ్వాబీన్ అనే పేరుతో ప్రత్యేక నమాజు ఏమీ లేదు. చాష్త్ నమాజుకు మరో పేరే సలాతుల్ అవ్వాబీన్.

## 208 వ అధ్యాయం

٢٠٨ ـ بَابُ الْحَثِّ عَلَى صَلاَةِ تَحِيَّةِ الْمَسْجِدِ بِرَكْعَتَيْنِ وَكَرَاهِيَةِ الْجُلُوسِ قَبْلَ أَنْ يُصَلِّيَ رَكْعَتَيْنِ فِي أَيِّ وَقْتٍ دَخَلَ وَسَوَاءٌ صَلَّى رَكْعَتَيْنِ بِنِيَّةِ التَّحِيَّةِ أَوْ صَلاَةَ فَرِيضَةٍ أَوْ سُنَّةً رَاتِبَةً أَوْ غَيْرَهَا

**రెండు రకాతులు 'తహియ్యతుల్ మస్జిద్' నమాజు చేయాలి, ఏ వేళప్పుడు మస్జిద్‌లోకి వెళ్ళినా రెండు రకాతులు చేయకుండా కూర్చోవటం అవాంఛనీయం, ఆ రెండు రకాతులు తహియ్యతుల్ మస్జిద్ సంకల్పంతో లేక ఫర్జ్ సంకల్పంతో లేక సున్నతె రాతిబా సంకల్పంతో మరే నమాజు సంకల్పంతోనయినా చేయవచ్చు**

١١٤٥ ـ عن أبي قتادة رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إذا دَخَلَ أَحَدُكُمُ المَسْجِدَ، فَلا يَجْلِسْ حَتَّى يُصَلِّيَ رَكْعَتَيْنِ» متفقٌ عليه.

1145. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: మీలో ఎవరయినా మస్జిద్‌లోకి ప్రవేశిస్తే రెండు రకాతుల నమాజ్ చేసేంతవరకు కూర్చోకూడదు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

١١٤٦ ـ وعن جابرٍ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: أَتَيْتُ النَّبِيَّ ﷺ وهوَ في المَسْجِدِ، فَقَالَ: «صَلِّ رَكْعَتَيْنِ» متفقٌ عليه.

1146. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో ఉండగా నేనాయన దగ్గరికి వెళ్ళాను. అప్పుడాయన నాతో "రెండు రకాతులు

నమాజ్ చెయ్యి" అని అన్నారు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై రెండు హదీసుల్లోనూ 'తహియ్యతుల్ మస్జిద్ నమాజు' రెండు రకాతులు చేయమని ఆదేశించటం జరిగింది. ఇది కనిష్ఠ సంఖ్య. వాస్తవానికి తహియ్యతుల్ మస్జిద్ నమాజులో మనిషి రెండేసి రకాతుల చొప్పున ఎన్ని రకాతులయినా చేసుకోగలడు. అసలు ఏమీ చేయకుండా మస్జిద్‌లోకి వెళ్ళి కూర్చోవటం అయిష్టకరమైన చర్యగా పరిగణించబడుతుంది. మస్జిద్‌లోకి ప్రవేశించే వ్యక్తి ఫర్జ్, సున్నతె ముఅక్కదా మొదలగు ఏ నమాజు చేసినా అతను తహియ్యతుల్ మస్జిద్ నమాజు పాటించినట్లుగానే భావింపబడుతుందని ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయం. ఆయన ఈ అధ్యాయానికి పెట్టిన శీర్షిక ద్వారా కూడా ఈ విషయం బోధపడుతున్నది.

కొంతమంది పండితులు పై హదీసులోని ఆజ్ఞను అనివార్యమైనదిగా భావిస్తున్నారు. అలాంటివారి దృష్టిలో 'తహియ్యతుల్ మస్జిద్' నమాజును తప్పనిసరిగా పాటించవలసి ఉంటుంది. మరికొంతమంది విద్వాంసులు పై ఆజ్ఞ ఉపదేశపూర్వకమైనదేగాని అనివార్యమైనది కాదని తలపోశారు. వీరి అభిప్రాయంలో 'తహియ్యతుల్ మస్జిద్' నమాజ్ పాటించటం అభిలషణీయం (ముస్తహబ్).



## 209 వ అధ్యాయం

## ٢٠٩ - بَابُ اسْتِحْبَابِ رَكْعَتَيْنِ بَعْدَ الْوُضُوءِ

## వుజూ తర్వాత రెండు రకాతులు చేయుటం అభిలషణీయం

١١٤٧ - عن أبي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ قـالَ لِبِـلالٍ: «يَابِلالُ! حَدِّثْنِي بِأَرْجَى عَمَلٍ عَمِلْتَهُ فِي الإِسْلَامِ، فَإِنِّي سَمِعْتُ دَفَّ نَعْلَيْكَ بَيْنَ يَدَيَّ فِي الجَنَّةِ»، قالَ: مَا عَمِلْتُ عَمَلاً أَرْجَى عِنْدِي مِنْ أَنِّي لَم أَتَطَهَّرْ طُهُوراً فِي سَاعَةٍ مِنْ لَيْلٍ أَوْ نَهارٍ إلَّا صَلَّيْتُ بِذلكَ الطُّهُـورِ ما كُتِبَ لِـي أَنْ أُصَلِّيَ. متفقٌ عليـه. وهـذا لفـظ البخـاري. «الـدَّفُّ» بـالفـاءِ: صَـوْتُ النَّعْلِ وَحَـرَكَتُـهُ عَلـى الأرضِ، والله أعلم.

1147. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం ఒకసారి దైవప్రవక్త (సల్లం) బిలాల్‌ను ఉద్దేశ్యించి "బిలాల్! నేను స్వర్గంలో నా ముందర నీ చెప్పుల సవ్వడి విన్నాను. (ఏమిటి విశేషం?) ఇస్లాం స్వీకరించిన తర్వాత నువ్వు చేసిన అత్యంత ఆశావహ ఆచరణ ఏమిటో కాస్త నాక్కూడా చెబుతావా?" అని అడిగారు.

దానికి సమాధానమిస్తూ హజ్రత్ బిలాల్ (రజి), "(దైవప్రవక్తా!) నేను రేయింబవళ్ళలో, ఎప్పుడు వుజూ (లేక గుసుల్) చేసినా ఆ తర్వాత (వెంటనే) నా అదృష్టంలో వ్రాసి ఉన్నన్ని రకాతుల నమాజ్ తప్పకుండా చేస్తాను. ఇంత కన్నా గొప్ప ఆశావహ ఆచరణ ఏదీ నా దృష్టిలో లేదు" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం, వాక్యాలు మాత్రం బుఖారీలోనివి.)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

హదీసు మూలంలో **'తుహూర్'** అనే పదం వాడబడింది. తుహూర్ అంటే శుద్ధి అని

అర్థం. వుజూ, గుసుల్, తయమ్ముమ్-ఈ మూడింటి ద్వారా షరీఅత్ ఆశించే శుద్ధి ప్రాప్తిస్తుంది. కనుక ఈ మూడింటిని తుహూర్‌గానే పరిగణించటం జరుగుతుంది. మొత్తానికి హజ్రత్ బిలాల్ రేయింబవళ్ళలో ఎప్పుడు వుజూ లేక గుసుల్ చేసినా ఆ తర్వాత వెంటనే కొన్ని రకాతులు నఫిల్ నమాజు తప్పకుండా చేసేవారు. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా ఆయన రెండు రకాతులు చేసేవారని తెలుస్తున్నది. ఆయన చేసిన పనిని దేవుడు మెచ్చుకొని ఆయనకు ఇంతటి ఔన్నత్యాన్ని ప్రసాదించాడు. ఆయన గొప్పదనాన్ని దైవప్రవక్త (సల్లం) కూడా తమ కళ్ళారా వీక్షించారు.

దైవప్రవక్త (సల్లం)కు ఈ దర్శనం మేరాజ్ (గగన యాత్ర) సందర్భంలో కలిగి ఉండవచ్చు లేదా తనపై మగత ఆవరించినప్పుడు ఆయన ఈ విషయాన్ని తిలకించి ఉండవచ్చు. ఏది ఏమైనా దీని ద్వారా తహియ్యతుల్ వుజూ (వుజూ తర్వాత చేసే) నమాజు ప్రాముఖ్యత వెల్లడౌతోంది. కొంతమంది పండితులు ఈ హదీసు విస్తృత భావాన్ని దృష్టిలో పెట్టుకొని తహియ్యతుల్ వుజూ, తహియ్యతుల్ మస్జిద్ నమాజులు, 'అవ్‌ఖాతె మక్రూహ' (నమాజు అయిష్టకరమైన వేళ)ల్లో కూడా చేయవచ్చని అభిప్రాయపడుతున్నారు. మరోవైపు దైవప్రవక్త(సల్లం) ఫజ్ర్ మరియు అస్ర్ తర్వాత నఫిల్ నమాజులు చేయకూడదని వారించినట్లు తెలుపుతున్న హదీసుల్ని దృష్టిలో పెట్టుకొని మరికొంతమంది పండితులు, ఈ నమాజు 'అవ్‌ఖాతె మక్రూహ'లో చేయకూడదని తలపోస్తున్నారు. ఆధారాల దృష్ట్యా ఇరువురి అభిప్రాయాలూ సరైనవే. కనుక ఎవరయినా నమాజు అయిష్టకరమయ్యే వేళ మస్జిద్‌లోకి ప్రవేశించి రెండు రకాతుల తహియ్యతుల్ మస్జిద్ లేక తహియ్యతుల్ వుజూ నమాజు చేసుకుంటే అతన్ని తప్పుపట్టడంలో అర్థం లేదు.



## 210 వ అధ్యాయం

## ٢١٠ - بَابُ فَضْلِ يَوْمِ الْجُمُعَةِ وَوُجُوبِهَا وَالاغْتِسَالِ لَهَا، وَالطِّيبِ وَالتَّبْكِيرِ إِلَيْهَا وَالدُّعَاءِ يَوْمَ الْجُمُعَةِ، وَالصَّلاَةِ عَلَى النَّبِيِّ ﷺ، وَفِيهِ بَيَانُ سَاعَةِ الإِجَابَةِ وَاسْتِحْبَابِ إِكْثَارِ ذِكْرِ اللهِ تَعَالَى بَعْدَ الْجُمُعَةِ

**జుమా దినపు ఘనత, జుమా నమాజు పాటించటం అనివార్యం, ఆ రోజున తలంటు పోసుకోవటం, పరిమళాలు పూసుకోవటం, జుమా నమాజుకు త్వరగా వెళ్ళటం, ఆ రోజు ప్రార్థనలు చేయటం, దైవప్రవక్త (సల్లం)పై దరూద్ పంపటం, జుమా నాడు ఒకానొక ఘడియలో ప్రార్థనలు స్వీకరించబడతాయనీ, అంచేత జుమా తర్వాత అత్యధికంగా దైవధ్యానం చేయాలనే విషయాల గురించి**

قَالَ اللهُ تعالى: ﴿فَإِذَا قُضِيَتِ الصَّلَوٰةُ فَانتَشِرُوا فِي الْأَرْضِ وَابْتَغُوا مِن فَضْلِ اللَّهِ وَاذْكُرُوا اللَّهَ كَثِيرًا لَّعَلَّكُمْ تُفْلِحُونَ﴾ [الجمعة: ١٠].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "విశ్వాసులారా! శుక్రవారం నాడు నమాజుకై పిలిచినప్పుడు, అల్లాహ్ సంస్మరణ వైపుకు పరుగెత్తండి; క్రయ విక్రయాలను వదలి పెట్టండి. మీరు గ్రహించగలిగితే ఇదే మీకు అత్యంత శ్రేయస్కరమైనది." *(అల్ జుముఅహ్: 10)*

### వివరణ

జుమా నమాజు తర్వాత బ్రతుకు తెరువు కోసం, జీవన అవసరాలు తీర్చుకోవటం కోసం ప్రజలు భూమిలో సంచరించి జీవనోపాధిని, అల్లాహ్ అనుగ్రహాన్ని సంపాదించుకోవటానికి ప్రయత్నించాలని పై ఆయతులో ఆదేశించటం జరిగింది. దీనిద్వారా తెలిసేదేమంటే శుక్రవారం నాడు ప్రజలు తమ వ్యాపార కార్యకలాపాలను పూర్తిగా వదలిపెట్టాలని ఇస్లాం ధర్మం ఆదేశించటం లేదు. పైగా జుమా నమాజుకు ముందు, దాని తర్వాత కూడా ప్రజలు ప్రాపంచిక వ్యవహారాల్లో నిమగ్నులై ఉండటానికి అన్నివిధాలా అనుమతిస్తున్నది. అంచేత ముస్లింలు కేవలం నమాజు మరియు ఖుత్బా సమయంలో తాత్కాలికంగా తమ వ్యాపారాన్ని, ఉద్యోగ కార్యకలాపాలను ఆపుకుంటే చాలు. ఆ రోజంతా వాటికి శెలవు పెట్టాల్సిన అవసరం లేదు.

١١٤٨ ـ وعَنْ أبي هُريرَةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «خَيْرُ يَوْمٍ طَلَعَتْ عَلَيْهِ الشَّمْسُ يَوْمُ الجُمُعَةِ: فِيهِ خُلِقَ آدمُ، وَفيه أُدْخِلَ الجَنَّةَ، وَفِيه أُخْرِجَ مِنْهَا» رواه مسلم.

1148. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: సూర్యుడు ఉదయించే దినాల్లో అన్నిటికంటే శ్రేష్ఠమైనది జుమా రోజు. ఆ రోజున ఆదం పుట్టించబడ్డారు. ఆ రోజునే స్వర్గంలోకి గొనిపోబడ్డారు. తిరిగి అదే రోజున అక్కడి నుండి తొలగించబడ్డారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)

١١٤٩ ـ وَعَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ تَوَضَّأَ فَأَحْسَنَ الوُضُوءَ ثُمَّ أَتَى الجُمُعَةَ، فَاسْتَمَعَ وَأَنْصَتَ، غُفِرَ لَهُ ما بَيْنَهُ وَبَيْنَ الجُمُعَةِ وَزِيَادَة ثَلاثَةِ أَيَّام وَمَنْ مَسَّ الحَصَى، فَقَدْ لَغَا» رواه مسلم.

1149. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే చక్కగా వుజూ చేసి, ఆ తర్వాత జుమా నమాజుకు వచ్చి, శ్రద్ధగా(ఖుత్బా) విని, (ఖుత్బా జరుగుతున్నంతసేపు) నిశ్శబ్దంగా ఉంటాడో, ఆ జుమా నుండి ఇంకో జుమా - ఆ తర్వాత మూడ్రోజుల వరకు అతని వల్ల జరగబోయే పాపాలు మన్నించబడతాయి. మరెవరైతే కంకర్రాళ్ళు ముట్టుకున్నాడో అతను వ్యర్థమైన పని చేశాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

వుజూ చక్కగా చేయటమంటే దైవప్రవక్త విధానాన్ని అనుసరించి చేయటమని అర్థం. వుజూ చేయటంలో దైవప్రవక్త విధానాన్ని ఉల్లంఘించటంగాని, అవసరానికి మించి నీళ్ళు ఉపయోగించటంగాని చేయకూడదు. ప్రతి అవయవాన్ని మూడుసార్లే కడగాలి. అంతకన్నా ఎక్కువసార్లు కడగకూడదు. నీళ్లు దుబారాగా ఖర్చు చేయకూడదు. ఎక్కడా వెంట్రుకవాసి

ఖాళీ స్థలమైనా వదలకుండా వుజూ అవయవాలన్నిటినీ బాగా తోముకొని కడుక్కోవాలి. ఇంట్లో వుజూ చేసుకొని మస్జిద్‌కు వెళ్ళటం ఉత్తమ పద్ధతి. దానివల్ల ఎక్కువ పుణ్యం లభిస్తుందని పై హదీసు ద్వారా బోధపడుతున్నది.

ఒక జుమా నుండి మరో జుమా వరకు, ఆ తర్వాత ఇంకో మూడు రోజులు మొత్తం కలిపి పది రోజులవుతాయి. ఒక సత్కార్యానికి పదిరెట్ల పుణ్యం లభిస్తుంది. అదే విధంగా పూర్తి నిబద్ధతతో ఒక జుమా నమాజు ఆచరిస్తే పదిరోజుల పాపాలు మన్నించబడతాయి. ఇక్కడ పాపాలంటే చిన్నచిన్న పాపాలని అర్థం. ఘోర పాపాలు, పశ్చాత్తాపపడనంతవరకు క్షమించబడవని ఇంతకుముందే తెలుసుకున్నాం.

శుక్రవారం నాడు మస్జిద్‌కు వెళ్ళిన తర్వాత ఖతీబ్ ఇచ్చే ఉపన్యాసాన్ని (ఖుత్బాను) అత్యంత శ్రద్ధాసక్తులతో వినాలి. ఖుత్బా సమయంలో కంకర్రాళ్ళతో ఆడుకోవటం, వ్రేళ్ళతో నేలమీద కెలకటం లాంటి వ్యర్థమైన పనులు చేయకూడదు. వాటివల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. పైగా అవి అసభ్యకరమైన పనులు కావటంచేత పాపాలుగా పరిగణించబడతాయి.

١١٥٠ ـ وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «الصَّلَوَاتُ الخَمْسُ وَالجُمُعَةُ إِلَى الجُمُعَةِ، وَرَمَضَانُ إِلَى رَمَضَانَ، مُكَفِّرَاتٌ مَا بَيْنَهُنَّ إِذَا اجْتُنِبَتِ الكَبَائِرُ» رواه مسلم.

1150. హజ్రత్ అబూహురైరా గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఘోర పాపాలకు దూరంగా ఉన్నంత వరకు ఐదుపూటల నమాజులు, ఒక శుక్ర వారం నుండి మరొక శుక్రవారం వరకు, ఒక రమజాన్ నుండి మరొక రమజాన్ వరకు వాటి మధ్య గల పాపాలను తుడిచిపెట్టేస్తాయి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మనిషి ఘోరపాపాలకు దూరంగా మసలుకుంటే హదీసులో పేర్కొనబడిన సదాచరణలు అతని పాపాల మన్నింపుకు దోహదపడతాయి. తుడిచిపెట్టబడేవి చిన్నాచితకా పాపాలే కాని ఘోరపాపాలు కావు. చిత్తశుద్ధితో పశ్చాత్తాపం చెందనంత వరకు ఘోరపాపాలు క్షమార్హం కాజాలవు.

١١٥١ ـ وَعَنْهُ وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمْ، أَنَّهما سَمِعَا رسولَ اللهِ ﷺ،

1151. హజ్రత్ అబూహురైరా మరియు ఇబ్నె ఉమర్ (రజి) గార్ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన వేదిక మెట్లపై నిలబడి ఈ విధంగా ప్రవచి

يقولُ عَلى أَعْوادِ مِنْبَرِه: «لَيَنْتَهِيَنَّ أَقْوَامٌ عَنْ وَدْعِهِمُ الجُمُعَاتِ، أَوْ لَيَخْتِمَنَّ اللهُ على قُلُوبِهِمْ، ثُمَّ لَيَكُونُنَّ مِنَ الغَافِلِينَ» رواه مسلمٌ.

స్తుండగా తామిద్దరూ విన్నారు: ప్రజలు జుమా నమాజుకు ఎగనామం పెట్టడాన్ని మానుకోవాలి. లేకపోతే దేవుడు వారి హృదయాలకు సీలు వేసేస్తాడు. ఫలితంగా వారు తప్పకుండా నిర్లక్ష్యం వహించేవారిలో చేరిపోతారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

'నిర్లక్ష్యం వహించే వారిలో చేరిపోతార'ంటే పోనుపోను వారు దైవధ్యానం పట్ల, దైవాజ్ఞల పట్ల పూర్తిగా అశ్రద్ధ వహిస్తారని భావం. సాధారణంగా దైవధిక్కారులు, వంచకులు మాత్రమే అలాంటి నిర్లక్ష్యానికి ఒడిగట్టగలరు. పరలోకంలో నరకమే వారి నివాస స్థలం. వరుసగా జుమా నమాజులను ఎగవేస్తూ పోవటం మహాపాతకం. అలాంటి పాపానికి ఒడిగట్టేవారి హృదయాలకు దేవుడు సీలు వేసేస్తాడు. ఫలితంగా వారు ధర్మాధర్మాల విచక్షణా జ్ఞానాన్ని, సన్మార్గాన్ని, పరలోక సాఫల్యభాగ్యాన్ని కోల్పోతారు.

١١٥٢ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ رَسولَ اللهِ ﷺ، قالَ: «إذا جَاءَ أَحَدُكُمُ الجمُعَةَ، فَلْيَغْتَسِلْ» متفقٌ عليه.

1152. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో జుమా నమాజుకు వచ్చేవారు గుసుల్ (తలంటు స్నానం) చేసి రావాలి. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం- సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

١١٥٣ - وعن أَبي سعيدِ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ، قالَ: «غُسْلُ يَوْمِ الجُمُعَةِ وَاجِبٌ عَلى كُلِّ مُحْتَلِمٍ» متفقٌ عليه. المُراد بالمُحْتَلِمِ:

1153. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: జుమానాడు గుసుల్ (తలంటు స్నానం) చేయటం ప్రతి వయోజనుడికి తప్పనిసరి (వాజిబ్). *(బుఖారీ-ముస్లిం)*

ఇక్కడ తప్పనిసరి (వాజిబ్) అన్న పదం

البَالِغُ. وَالمُرَادُ بِالوُجُوبِ: وُجُوبُ اختِيَارٍ، كقَوْلِ الرَّجُلِ لِصَاحِبِهِ حَقُّكَ وَاجِبٌ عَلَيَّ. والله أعلم.

"అనివార్యం" అనే అర్థంలో వాడబడ లేదు. 'అలా చేయటం ఉత్తమం' అనే అర్థంలో వాడబడింది. ఉదాహరణకు ఎవరయినా తోటి వ్యక్తితో 'నీ హక్కు చెల్లించటం నా బాధ్యత' అని అంటే (నిజంగా ఆ వ్యక్తి బాధ్యతను తన మీద విధించుకున్నట్లు కాదు. విష యాన్ని నొక్కి చెప్పటమే దాని ఉద్దేశ్యం.)

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం- సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు మూలాన్ని ఆధారంగా చేసుకొని, కొంతమంది పండితులు జుమానాడు గుసుల్ చేయటాన్ని తప్పనిసరి (వాజిబ్)గా పేర్కొన్నారు. అదే సమయంలో జుమారోజు తప్పనిసరిగా గుసుల్ చేయవల్సిన అవసరం లేదని భావించిన మరికొంతమంది పండితులు, ఇమామ్ నవవీ (రహ్మాలై) మాదిరిగానే పై హదీసు ఉద్దేశ్యాన్ని విడమరిచి చెప్పారు. ఏది ఏమైనా ఒకవేళ స్త్రీలు గనక ఆ రోజు మస్జిద్‌కు వెళ్ళదలచుకుంటే ఈ ఆదేశం వారికి కూడా వర్తిస్తుంది.

١١٥٤ - وَعَنْ سَمُرَةَ رَضِيَ الله عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ تَوَضَّأَ يَوْمَ الجُمُعَةِ، فبِهَا وَنِعْمَتْ وَمَنِ اغْتَسَلَ فَالغُسْلُ أَفْضَلُ» رواهُ أبو داود، والترمذي وقالَ: حديثٌ حسنٌ.

1154. హజ్రత్ సమురా (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:ఎవరయినా జుమారోజు, వుజూ (మాత్రమే) చేస్తే అతను సౌలభ్యాన్ని ఉపయోగించుకున్నట్లు. ఇది మంచి పద్ధతి. మరెవరయినా గుసుల్ చేస్తే, గుసుల్ ఇంకా మంచి పద్ధతి. (అబూదావూద్-తిర్మిజీ, హసన్)

*(సుననె అబూదావూద్‌లోని శుచీశుభ్రతల ప్రకరణం- సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

శుక్రవారం నాడు గుసుల్ తప్పనిసరిగా చేయవలసిన అవసరం లేదని భావించేవారు ఈ హదీసును నిదర్శనంగా చూపెడుతున్నారు. ఇందులో జుమా రోజు కేవలం వుజూ

చేసుకునేందుకు అనుమతించబడటంతోపాటు దాన్ని మంచి పద్ధతిగా పేర్కొనటం జరిగింది. అయితే గుసుల్ చేయటం ఉత్తమ పద్ధతి అని చెప్పబడింది. అంటే గుసుల్ చేయకపోయినా ఫర్వాలేదన్నట్లే కదా! ఏది ఏమైనా జుమా రోజు గుసుల్ చేయటం పుణ్యప్రదం, దైవప్రవక్త విధానం అన్న విషయంలో మాత్రం ఎలాంటి భేదాభిప్రాయానికి తావులేదు. గుసుల్ సమయం సూర్యోదయం నుండి జుమా ఖుత్బా (ఉపన్యాసం) మొదలుకాక ముందు వరకు ఉంటుంది.

١١٥٥ - وَعَنْ سَلْمَانَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا يَغْتَسِلُ رَجُلٌ يَوْمَ الْجُمُعَةِ، وَيَتَطَهَّرُ ما اسْتَطَاعَ مِنْ طُهْرٍ، وَيَدَّهِنُ مِنْ دُهْنِهِ، أَوْ يَمَسُّ مِن طِيبِ بَيْتِهِ، ثُمَّ يَخْرُجُ فَلا يُفَرِّقُ بَيْنَ اثْنَيْنِ، ثُمَّ يُصَلِّي مَا كُتِبَ لَهُ، ثُمَّ يُنصِتُ إذا تَكَلَّمَ الإِمَامُ، إلَّا غُفِرَ لَهُ ما بَيْنَهُ وَبَيْنَ الْجُمُعَةِ الأُخْرَى». رواه البخاري.

1155. హజ్రత్ సల్మాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి శుక్రవారం నాడు తలంటు పోసుకొని, వీలైనంతవరకు పరిశుద్ధతను పాటించి, నూనె రాసుకొని లేక తన ఇంట్లోవున్న పరిమళాన్ని పూసుకొని, ఆ తర్వాత (మస్జిద్‌కు) బయలుదేరి వెళ్ళి (అక్కడ) ఏ ఇద్దరి మధ్య నుంచి కూడా తోసుకొని వెళ్ళకుండా (ఎక్కడో ఒక చోట) తన అదృష్టంలో వ్రాసివున్న నమాజు చేసుకొని ఆ తర్వాత ఇమామ్ ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చినప్పుడు నిశ్శబ్దంగా కూర్చుంటే ఆ శుక్రవారం నుండి మరొక శుక్రవారం వరకు అతని వల్ల జరిగే పాపాలు మన్నించబడతాయి.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో శుక్రవారం రోజు పాటించవలసిన నియమాలు వివరించబడ్డాయి. శుక్రవారం నాడు వీలైనంత ఎక్కువగా పరిశుద్ధతను పాటించాలి. నూనె రాసుకోవాలి. ఏవైనా సుగంధ ద్రవ్యాలు, పరిమళాలు ఉంటే అవి కూడా పూసుకోవాలి. దానివల్ల చెమట వాసన మూలంగా ఇతరులకు ఇబ్బంది కలగకుండా ఉంటుంది. మస్జిద్‌కు ఆలస్యంగా వెళితే వెనుక పంక్తుల్లో ఉన్నవారిని తోసుకుంటూ ముందుకు వెళ్ళవలసి వస్తుంది. అంచేత వీలైనంత త్వరగా మస్జిద్‌కు వెళ్ళటానికి ప్రయత్నించాలి. ఒకవేళ ఏదయినా కారణం చేత ఆలస్యంగా వెళ్ళవలసివస్తే, సభామర్యాదలను పాటిస్తూ ఎక్కడ ఖాళీ చోటు దొరికితే అక్కడ కూర్చోవాలి.

ఇతరుల మీద నుంచి గెంతుకుంటూ ముందు పంక్తుల్లోకి వెళ్ళవలసిన అవసరం లేదు. మస్జిద్‌లో కూర్చునే ముందు కనీసం రెండు రకాతులయినా నమాజ్ చేసుకోవాలి. జుమా ఉపన్యాసం జరుగుతున్నప్పుడు నిశ్శబ్దంగా ఉండాలి. ఇమామ్ చెప్పే విషయాలను శ్రద్ధగా వినాలి. ఈ నియమాలన్నీ పాటించి జుమా నమాజ్ చేసేవారు పై హదీసులో పేర్కొనబడిన సత్కారానికి అర్హులౌతారు.

1156. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే శుక్రవారం రోజు లైంగిక అశుద్ధావస్థ నుండి పరిశుద్ధత పొందటానికి చేస్తున్నంత చక్కగా 'గుస్ల్' (స్నానం)చేసి జుమా నమాజ్ చేయటానికి త్వరగా వెళతాడో అతను ఒక ఒంటెను బలి ఇచ్చినట్లుగా పరిగణించబడతాడు. అతని తర్వాత రెండవ వేళలో (అ విధంగా స్నానం చేసి) వెళ్ళే వ్యక్తి ఒక ఆవును బలి ఇచ్చినట్లుగా భావింపబడతాడు. ఆ తర్వాత మూడో వేళలో వెళ్ళే వాడికి కొమ్ములు తిరిగిన పొట్టేలును బలి ఇచ్చినంత పుణ్యం లభిస్తుంది. ఇక నాల్గవ వేళలో వెళ్ళేవాడు ఒక కోడిని బలిచ్చినట్లుగా, ఐదవ వేళలో వెళ్ళేవాడు ఒక గ్రుడ్డును దానం చేసినట్లుగా పరిగణించబడతాడు. ఆ తర్వాత ఇమామ్ (ఖుత్బా ఇవ్వడానికి) బయలుదేరి రాగానే దైవదూతలు (హాజరు వేయటం ఆపి) ఖుత్బా వినటానికి మస్జిద్‌లోకి వచ్చేస్తారు.

(బుఖారీ-ముస్లిం)

١١٥٦ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنهُ، أَنَّ رسولَ اللهِ ﷺ قالَ: «مَنِ اغْتَسَلَ يَوْمَ الجُمُعَةِ غُسْلَ الجَنَابَةِ، ثُمَّ رَاحَ في السَّاعَةِ الأُولى، فَكأَنَّما قَرَّبَ بَدَنَةً، ومَنْ رَاحَ في السَّاعةِ الثَّانِيَةِ، فَكأَنَّما قَرَّبَ بَقَرَةً، ومَنْ رَاحَ في السَّاعَةِ الثَّالِثَةِ؛ فَكَأَنَّمَا قَرَّبَ كَبْشاً أقرَنَ، وَمَنْ رَاحَ في السَّاعَةِ الرَّابِعَةِ، فَكَأَنَّما قَرَّبَ دَجَاجَةً، ومَنْ رَاحَ في السَّاعَةِ الخَامِسَةِ، فَكَأَنَّمَا قَرَّبَ بَيْضَةً، فَإذا خَرَجَ الإمامُ، حَضَرَتِ المَلائِكَةُ يَسْتَمِعُونَ الذِّكرَ» متفقٌ عليه. قوله: «غُسلَ الجَنَابَةِ»؛ أَي: غُسلاً كَغُسلِ الجَنَابَةِ في الصِّفَةِ.

(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం-సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) ఈ హదీసులో కూడా జుమా నమాజు కోసం వీలైనంత త్వరగా వెళ్ళాలని పురికొల్పటం జరిగింది. ఎవరు ఎంత త్వరగా మస్జిద్‌కు వెళతారో వారికి అంతే ఎక్కువగా పుణ్యం లభిస్తుందని, ఎంత ఆలస్యంగా వెళతారో అంత తక్కువ పుణ్యం లభిస్తుందని చెప్పబడింది. ఆఖరికి ఇమామ్ ఖుత్బా మొదలుపెట్టిన తర్వాత దైవదూతలు నమాజీల హాజరుపట్టిక మూసివేస్తారు. కనుక ఆ తర్వాత వచ్చేవారికి ఎలాంటి పుణ్యం, ఘనత లభించవని కూడా ఇందులో వివరించటం జరిగింది.

2) జుమా నమాజుకు దైవదూతలు కూడా హాజరవుతారు. దీని ద్వారా జుమా ఉపన్యాసం, నమాజుల ప్రాముఖ్యత బోధపడుతున్నది.

3) లైంగిక అశుద్ధావస్థ నుండి పరిశుద్ధత నొందటానికి ఎంత శ్రద్ధగా, జాగ్రత్తగా స్నానం చేస్తామో శుక్రవారం నాడు కూడా అంత జాగ్రత్తగా స్నానం చేయాలి. అంటే పూర్తిస్థాయి 'గుస్ల్' చేయాలన్నమాట!

١١٥٧ - وعَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ، ذَكَرَ يَوْمَ الجُمُعَةِ، فَقَالَ : «فِيها سَاعَةٌ لا يُوَافِقها عَبْدٌ مُسلِمٌ، وَهُوَ قَائِمٌ يُصَلِّي يَسأَلُ اللهَ شَيئاً، إِلَّا أَعْطَاهُ إِيَّاه» وَأَشَارَ بِيَدِهِ يُقَلِّلُهَا، متفقٌ عليه.

1157. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకసారి జుమా గురించి చెబుతూ ఇలా అన్నారు: ఆ రోజులో ఒక ఘడియ ఉంది. ఏ ముస్లిం దాసుడయినా ఆ ఘడియను పొంది, ఆ సమయంలో అతను నిలబడి నమాజు చేస్తూ దేవుణ్ణి ఏదయినా అడిగితే దేవుడు తప్పకుండా ఇస్తాడు.

ఆ సమయం చాలా తక్కువగా ఉంటుందని ఆయన తన చేత్తో సంజ్ఞ చేసి చూపించారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

శుక్రవారం రోజుకి సంబంధించిన మరొక మహాత్యాన్ని ఈ హదీసులో పొందుపరచటం జరిగింది. ఆ రోజులో ఒక మహత్తరమైన ఘడియ ఉంది. ఆ ఘడియలో భక్తులు చేసుకునే విన్నపాలను అల్లాహ్ తప్పకుండా మన్నిస్తాడు. ఆ ఘడియ చాలా తక్కువగా ఉంటుంది.

అదీగాక ఆ ఘడియ ఎప్పుడు వస్తుందో కూడా తెలియదు. అందుకని ఆ మహాభాగ్యాన్ని పొందాలంటే ఆ రోజు మొత్తం అత్యధికంగా దేవుణ్ణి ధ్యానిస్తూ, ప్రార్థనలు, విన్నపాల్లో నిమగ్నులై ఉండాల్సిందే.

١١٥٨ ـ وَعَنْ أبي بُرْدَةَ بنِ أبي مُوسَى الأشعَرِيِّ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ عَبْدُ اللهِ بنُ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا: أَسَمِعْتَ أَبَاكَ يُحَدِّثُ عَن رَسُولِ اللهِ ﷺ، في شَأنِ سَاعَةِ الجُمُعَةِ؟ قَالَ: قلتُ: نعمْ، سَمِعْتُهُ يَقُولُ: سمِعْتُ رَسُولَ اللهِ ﷺ، يَقُولُ: «هي مَا بَيْنَ أنْ يَجلِسَ الإمامُ إلى أنْ تُقضَى الصَّلاةُ» رواه مسلم.

1158. హజ్రత్ అబూ బుర్దా బిన్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం: ఒకసారి అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) నాతో మాట్లాడుతూ "శుక్రవారం నాటి ఘడియ గురించి మీ నాన్న ఏదయినా దైవప్రవక్త హదీసు చెప్పినప్పుడు నువ్వు విన్నావా?" అని అడిగారు. దానికి నేను సమాధానమిస్తూ, "విన్నాను, ఆ ఘడియ ఇమామ్ వేదికపై కూర్చున్నప్పటి నుంచి నమాజ్ ముగిసేవరకు మధ్య కాలంలో ఉంటుందని దైవ ప్రవక్త (సల్లం) ప్రబోధిస్తుండగా తాను విన్నానని మా నాన్నగారు చెప్పారు" అని అన్నాను. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

శుక్రవారం రోజు ఆ ఘడియ ఎప్పుడొస్తుందనే విషయమై పండితుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. కొంతమంది పండితులు పై హదీసును నిదర్శనంగా చేసుకొని ప్రార్థనలు స్వీకరించబడే ఆ శుభఘడియ శుక్రవారం రోజు ఇమామ్ ఖుత్బా కొరకు వేదికపై కూర్చున్నప్పటి నుంచి నమాజు ముగిసేవరకు మధ్యకాలంలో ఉంటుందనీ, అన్నింటికన్నా బలమైన అభిప్రాయం ఇదేనని అన్నారు. అయితే షేఖ్ అల్‌బానీ తదితర హదీసువేత్తలు అబూ మూసా (రజి) వివరించిన ఈ హదీసుని 'మౌఖూఫ్'గా పేర్కొన్నారు. అంటే ఈ హదీసుని తాను నేరుగా దైవప్రవక్త (సల్లం) నుంచి విన్నారో లేదో ఆయన అనుచరుడు తెలుపలేదని దాని భావం. (వివరాల కోసం షేఖ్ అల్‌బానీ చేత పరిశోధించబడిన 'రియాజుస్సాలిహీన్' గ్రంథం చూడండి). అందుకే మరికొంతమంది పండితులు అబూదావూద్ మరియు నసాయి గ్రంథాల్లోని వేరొక హదీసుని ప్రాతిపదికగా చేసుకొని ఆ శుభఘడియ అస్ర్ మరియు మగ్రిబ్ నమాజుల మధ్యకాలంలో ఉంటుందని తలపోశారు. ఆ హదీసులో శుక్రవారం రోజు ఆ శుభఘడియను అస్ర్ నమాజ్ తర్వాత చివరివేళలో అన్వేషించమని ఆదేశించటం జరిగింది. మొత్తానికి ఆ

ఘడియ నిర్ణయం అస్పష్టంగానే మిగిలిపోయింది కనుక ఆ రోజు సాంతం అత్యధికంగా దైవధ్యానంలో నిమగ్నులై ఉండటానికి ప్రయత్నించటం అన్ని విధాలా శ్రేయస్కరం.

١١٥٩ - وَعَنْ أَوسِ بنِ أَوسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ مِنْ أَفضَلِ أَيَّامِكُمْ يَوْمَ الجمُعَةِ؛ فأَكثِرُوا عَلَيَّ مِنَ الصَّلاةِ فِيهِ؛ فَإِنَّ صَلاتَكُم مَعْروضَةٌ عَلَيَّ». رواه أبو داود بإسنادٍ صحيحٍ.

1159. హజ్రత్ ఔస్ బిన్ ఔస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీ రోజులలో అత్యంత శ్రేష్ఠమైన రోజు శుక్రవారం. కనుక మీరు ఆ రోజు అత్యధికంగా నాపై దరూద్ పంపండి. నిస్సందేహంగా మీరు పంపే దరూద్ నాకు చేరవేయ బడుతుంది. (అబూదావూద్- దీని ఆధారాలు దృఢమైనవి)

*(సుననె అబూదావూద్‌లోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) స్థలం, కాలాలకు ఉండే విశిష్టత మూలంగా ఆయా సందర్భాల్లో, ఆచరించబడే ఆచరణల విశిష్టత కూడా పెరిగిపోతోంది. ఉదాహరణకు పై హదీసులో దైవప్రవక్త (సల్లం) శుక్రవారం విశిష్టత దృష్ట్యా ఆ రోజు అత్యధికంగా దరూద్ పఠించమని ఆదేశించారు.

2) ప్రజలు పఠించే దరూద్‌ను దైవప్రవక్త (సల్లం), దగ్గరి నుంచిగాని దూరం నుంచిగాని వినలేరు. దైవదూతలు ఆయనకు దరూద్‌లు చేరవేస్తారు. ప్రజలు పఠించే దరూద్‌ను దైవప్రవక్త (సల్లం), చాలా దగ్గరికొచ్చి వింటారని ఒక హదీసు జనసామాన్యంలో ప్రచారంలో ఉంది. కాని ఆ హదీసు ప్రామాణికమైనది కాదు. ఆయనకు దరూద్ చేరవేయబడుతుంది అంటే అర్థం, ఆయన నేరుగా వినలేరనే కదా!

3) ఇకపోతే దరూద్ వచనాల విషయానికొస్తే, 'దరూదె ఇబ్రాహీమి'లోని వాక్యాలు అత్యంత శ్రేష్ఠమైనవి, ప్రామాణికమైనవీను. అదీగాక దైవప్రవక్త (సల్లం) తన సహచరులకు నేర్పించినది కూడా ఈ దరూద్ వచనాలే.

**211 వ అధ్యాయం**

## ٢١١ - بَابُ اسْتِحْبَابِ سُجُودِ الشُّكْرِ عِنْدَ حُصُولِ نِعْمَةٍ ظَاهِرَةٍ أَوِ انْدِفَاعِ بَلِيَّةٍ ظَاهِرَةٍ

## భౌతిక వరమేదయినా ప్రాప్తించినప్పుడు లేదా బాహ్యాపరమైన ఆపదలేవయినా తొలగిపోయినప్పుడు కృతజ్ఞతాపూర్వకంగా దైవసన్నిధిలో మోకరిల్లటం అభిలషణీయం

١١٦٠ - عَنْ سَعْدِ بْنِ أَبِي وَقَّاصٍ رَضِيَ اللهُ عَنْهُ، قَالَ: خَرَجْنَا مَعَ رَسُولِ اللهِ ﷺ، مِنْ مَكَّةَ نُرِيدُ المَدِينَةَ، فَلَمَّا كُنَّا قَرِيباً مِنْ عَزْوَرَاءَ نَزَلَ ثُمَّ رَفَعَ يَدَيْهِ، فَدَعَا اللهَ سَاعَةً، ثُمَّ خَرَّ سَاجِداً، فَمَكَثَ طَوِيلاً، ثُمَّ قَامَ فَرَفَعَ يَدَيْهِ سَاعَةً، ثُمَّ خَرَّ سَاجِداً - فَعَلَهُ ثَلاثاً - وَقَالَ: «إِنِّي

1160. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం: మేమొకసారి దైవప్రవక్త (సల్లం) వెంట మదీనా వెళ్ళాలనే ఉద్దేశ్యంతో మక్కా నుండి బయలు దేరాం. ఆ విధంగా ప్రయాణం చేస్తూ మేము 'అజ్వరా' అనే ప్రాంతం దరిదాపులకు చేరుకున్నాక, ఆయన తన వాహనం మీది నుంచి క్రిందికి దిగి చేతులు రెండూ పైకెత్తి కాసేపు దేవుణ్ణి ప్రార్థించారు. తర్వాత సజ్దా చేశారు. చాలా సేపటి వరకు అదే స్థితిలో ఉన్నారు. ఆ తర్వాత లేచి నిలబడి కాసేపు చేతులెత్తి ప్రార్థించారు. ఆ తర్వాత మళ్ళీ (దైవసన్నిధిలో) మోకరిల్లారు. ఆయన మూడుసార్లు ఈ విధంగా చేసిన తర్వాత ఇలా అన్నారు:

"నేను నా ప్రభువుని అర్థించాను. నా అనుచర సమాజం గురించి సిఫారసు చేశాను. దానికి దేవుడు నా అనుచర సమాజంలోని మూడోవంతు ప్రజల (గురించి సిఫారసు చేయటానికి నాకు అనుమతి)నిచ్చాడు. అప్పుడు నేను కృతజ్ఞతా పూర్వకంగా నా ప్రభువు సన్నిధిలో సాష్టాంగపడ్డాను. తర్వాత

سَأَلْتُ رَبِّي، وَشَفَعْتُ لِأُمَّتِي، فَأَعْطَانِي ثُلُثَ أُمَّتِي فَخَرَرْتُ ساجداً لِرَبِّي شُكراً، ثُمَّ رَفَعْتُ رَأْسِي، فَسَأَلْتُ رَبِّي لِأُمَّتِي، فَأَعْطَانِي ثُلُثَ أُمَّتِي، فَخَرَرْتُ سَاجداً لِرَبِّي شُكراً، ثُمَّ رَفَعْتُ رَأْسِي، فَسَأَلْتُ رَبِّي لِأُمَّتِي، فَأَعْطَانِي الثُّلُثَ الآخِرَ، فَخَرَرْتُ ساجِداً لِرَبِّي» رَواه أَبو داود.

తలపైకెత్తి అనుచర సమాజ శ్రేయస్సు కోసం నా ప్రభువుని ప్రార్థించాను. దానికాయన మరో మూడోవంతు ప్రజల (గురించి సిఫారసు చేయటానికి అనుమతి)నిచ్చాడు. అందుకు నేను కృతజ్ఞతా పూర్వకంగా నా ప్రభువు సన్నిధిలో మోకరిల్లాను. ఆ తర్వాత తల పైకెత్తి మళ్ళీ నా అనుచర సమాజ శ్రేయస్సు కోసం నా ప్రభువును ప్రార్థించాను. దానికాయన ఇంకో మూడో వంతు ప్రజల (గురించి సిఫారసు చేయటానికి నాకు అనుమతి) నిచ్చాడు. అప్పుడు నేను కృతజ్ఞతా పూర్వకంగా నా ప్రభువు సన్నిధిలో మోకరిల్లాను. *(అబూదావూద్)*

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్థూలంగా ఈ హదీసు భావం ఏమిటంటే, ముహమ్మదీయ అనుచర సమాజంలోని వారందరూ అంతిమంగా స్వర్గానికే వెళతారు. ముస్లింలలో ఎవరూ కూడా నరకంలో శాశ్వత శిక్షను అనుభవించరు. కొందరు నరకంలో కొంతకాలం శిక్షననుభవించి స్వర్గానికి వెళ్తే, మరికొందరు దైవప్రవక్త సిఫారసు మూలంగా స్వర్గానికి వెళ్తారు. ఇంకొందరు ప్రత్యేక దైవానుగ్రహం చేత స్వర్గంలోకి ప్రవేశిస్తారు. ఈ విషయం ముమ్మాటికీ సరయినదే. ఇతర ఎన్నో హదీసులు కూడా ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. కాని సదరు అధ్యాయం క్రింద పేర్కొనబడిన హదీసు మాత్రం ప్రామాణికమైనది కాదు. షేఖ్ అల్‌బానీ (రహ్మాలై) ఈ హదీసుని బలహీనమైనదిగా ఖరారు చేశారు. ఇకపోతే కృతజ్ఞతాపూర్వకంగా దైవసన్నిధిలో మోకరిల్లే విషయాన్ని తెలియపరచటం కోసం గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ హదీసును సదరు అధ్యాయం క్రింద పొందుపరచారు. ఈ హదీసు బలహీనమైనదయినప్పటికీనీ ఇతర ఎన్నో ప్రామాణికమైన హదీసులు ఈ హదీసులోని భావాన్ని సమర్థిస్తున్నాయి. కనుక సంతోష సమయాల్లో, ఆపదలు తొలగి పోయినప్పుడు కృతజ్ఞతాభావంతో దైవసన్నిధిలో మోకరిల్లటం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ తన పశ్చాత్తాపం ఆమోదించబడిందన్న శుభవార్త విన్నప్పుడు, దైవం పట్ల కృతజ్ఞతా భావంతో మోకరిల్లారని సహీహ్ బుఖారీ గ్రంథంలో ఉంది. ఆ వృత్తాంతం ఈ గ్రంథంలో కూడా ఎంతో విపులంగా వివరించబడింది. (మొదటి భాగంలోని 21వ హదీసు చూడండి).

212 వ అధ్యాయం

## ٢١٢ ـ بَابُ فَضْلِ قِيَامِ اللَّيْلِ

# రాత్రిపూట చేసే నమాజు ఘనత

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَمِنَ ٱلَّيْلِ فَتَهَجَّدْ بِهِۦ نَافِلَةً لَّكَ عَسَىٰٓ أَن يَبْعَثَكَ رَبُّكَ مَقَامًا مَّحْمُودًا ﴾ [الإسراء: ٧٩]. وقَالَ تَعَالَى: ﴿ تَتَجَافَىٰ جُنُوبُهُمْ عَنِ ٱلْمَضَاجِعِ ﴾ [السجدة: ١٦]. وقَالَ تَعَالَى: ﴿ كَانُوا۟ قَلِيلًا مِّنَ ٱلَّيْلِ مَا يَهْجَعُونَ ﴾ [الذاريات: ١٧]

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"రాత్రిపూట తహజ్జుద్ నమాజు చెయ్యి. ఇది నీకు అదనపు నమాజు. నీ ప్రభువు నిన్ను ప్రశంసనీయమైన ఉన్నతస్థానంలో ప్రతిష్ఠింప జేయటం అసంభవం ఏమీ కాదు."

*(బనీ ఇస్రాయీల్-79)*

"వారి (విశ్వాసుల)వీపులు పడకలకు ఎడంగా ఉంటాయి." *(అస్ సజ్దహ్:16)*

"(విశ్వాసులు ప్రపంచంలో) రాత్రివేళల్లో చాలా తక్కువ నిదురపోయేవారుగా ఉంటారు."

*(అజ్ జారియాత్-17)*

### వివరణ

"ఇది నీకు అదనపు నమాజు" అనే వాక్యంలో రెండు భావాలు స్ఫురిస్తున్నాయి: ఒకటి; ఓ ముహమ్మద్! ఈ నమాజు నీపై ఓ అదనపు విధి. అయితే నీ అనుచర సమాజంలోని ఇతరులెవ్వరిపైనా విధించబడలేదు" అనే భావం. రెండోది; ఈ నమాజు నీ అంతస్తులను, గొప్పదనాన్ని ఇనుమడింపజేస్తుంది అనే భావం. మొత్తానికి దివ్యఖుర్ఆన్‌లో పలుచోట్ల రాత్రి ఆరాధనను విశ్వాసుల ప్రధాన లక్షణంగా పేర్కొనటం జరిగింది. దీనిద్వారా 'తహజ్జుద్' (రాత్రిపూట చేసే అదనపు నమాజు) ఘనత వెల్లడౌతోంది.

١١٦١ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ النَّبِيُّ ﷺ، يَقُومُ مِنَ اللَّيْلِ حَتَّى تَتَفَطَّرَ قَدَمَاهُ، فَقُلْتُ لَهُ: لِمَ تَصْنَعُ

1161. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట నిలబడి (సుదీర్ఘంగా) నమాజులు చేసేవారు. దాని మూలంగా ఆయన పాదాలపై వాపు కూడా వచ్చేది. అది చూసి నేను, 'దైవప్రవక్తా! మీకు ఇంత శ్రమ దేనికీ? అల్లాహ్ మీ వల్ల గతంలో

هذا، يَا رَسُولَ اللهِ! وَقَد غُفِرَ لَكَ ما تَقَدَّمَ مِن ذَنْبِكَ وَمَا تَأَخَّرَ؟ قَالَ: «أفَلا أكُونُ عَبْداً شَكُوراً!». متفقٌ عليه. وعَنِ المغيرَةِ بنِ شُعبةَ نحوهُ، متفقٌ عليه.

జరిగిన పాపాలను, జరగబోయే పాపాలను కూడా మన్నించేశాడు కదా?' అని అనేదాన్ని. దానికాయన, 'నేను దైవానికి కృతజ్ఞుడైన దాసుణ్ణి కాకూడదా?' అని అనేవారు. (బుఖారీ - ముస్లిం. ఉభయుల గ్రంథాల్లో ఇలాంటిదే ముగీరా బిన్ షోబా (రజి) ఉల్లేఖనం కూడా ఒకటి ఉంది.)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఈ గ్రంథంలో ఇంతకుముందు కూడా వచ్చింది. రాత్రిపూట ఆరాధనలకు సంబంధించి దైవప్రవక్త (సల్లం)గారి ఆదర్శప్రాయమైన విధానాన్ని వివరించే ఉద్దేశ్యంతో ఈ హదీసుని తిరిగి ఇక్కడ కూడా పొందుపరచటం జరిగింది. దీనిద్వారా బోధపడేదేమిటంటే రాత్రిపూట నఫిల్ నమాజులను ప్రశాంతంగా అత్యంత భక్తిశ్రద్ధలతో చేయాలి. దైవం తరపు నుండి ఎక్కువ వరాలు, అనుగ్రహాలు పొందినవారు వీలైనంత ఎక్కువగా ఆయన్ని ఆరాధించాలి. ఆయన సన్నిధిలో తమ దీనావస్థను వెలిబుచ్చటానికి, తమ అవసరాలను నివేదించుకోవటానికి అత్యంత అనువైన సమయం రాత్రి చివరి ఘడియలు!

١١٦٢ ـ وَعَنْ عَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ، طَرَقَهُ وَفَاطِمَةَ لَيْلاً؛ فَقَالَ: «ألا تُصَلِّيَانِ؟» متفقٌ عليه. «طَرَقَه»: أتاهُ لَيْلاً

1162. హజ్రత్ అలీ (రజి) కథనం ప్రకారం ఓ రోజు రాత్రి దైవప్రవక్త (సల్లం), తన దగ్గరికి మరియు ఫాతిమా దగ్గరికి వచ్చి 'మీరు (తహజ్జుద్) నమాజ్ చేయటం లేదా?' అని అడిగారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٦٣ ـ وَعَنْ سالمِ بنِ عبدِ الله بنِ عُمَرَ بنِ الخَطَّاب رَضِيَ اللهُ عَنهُمْ، عَن أبِيهِ: أنَّ رسولَ اللهِ ﷺ قَالَ: «نِعْمَ الرَّجلُ

1163. హజ్రత్ సాలిమ్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) తన తండ్రి నుండి చేసిన కథనం ప్రకారం ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "అబ్దుల్లా చాలా మంచివాడు.

عَبْدُ اللهِ لَو كَانَ يُصَلِّي مِنَ اللَّيْلِ» قَالَ سالِمٌ: فَكَانَ عَبْدُ اللهِ بعْدَ ذلكَ لا يَنَامُ مِنَ اللَّيْلِ إلَّا قَليلاً. متفقٌ عليه.

అతను గనక రాత్రిపూట తహజ్జుద్ నమాజ్ చేస్తూ ఉంటే ఎంత బాగుండు."

దైవప్రవక్త (సల్లం) నోట ఆ మాట విన్నప్పటి నుంచి అబ్దుల్లాహ్ రాత్రిపూట (నమాజు చేస్తూ,) చాలా తక్కువగా నిద్రపోయేవారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని దైవప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

١١٦٤ ـ وَعَن عبدِ اللهِ بنِ عَمْرِو بنِ العـاص، رَضِـيَ اللهُ عَنْهُمَـا قـالَ: قـالَ رسُولُ اللهِ ﷺ: «يَا عَبْدَ اللهِ! لا تكن مِثْلَ فُلانٍ: كانَ يَقُومُ اللَّيْلَ فَتَرَكَ قِيَامَ اللَّيْلِ» متفقٌ عليه.

1164. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తనను ఉద్దేశ్యించి ఇలా అన్నారు: ఓ అబ్దుల్లాహ్! ఫలానా వ్యక్తి మాదిరిగా అయిపోమాకు. అతను రాత్రిపూట ఆరాధన చేసేవాడు. ఆ తర్వాత ఆరాధన కోసం నిద్రలేవటమే మానుకున్నాడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ఉపవాస ప్రకరణం)*

١١٦٥ ـ وعنِ ابنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: ذُكِرَ عِنْدَ النَّبِيِّ ﷺ رَجُلٌ نَامَ لَيْلَةً حَتى أَصبَحَ! قالَ: «ذاكَ رَجُلٌ بَالَ الشَّيْطَانُ في أُذُنَيْهِ ـ أو قال: في أُذنِهِ ـ» متفقٌ عليه.

1165. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: రాత్రి (నమాజు చేయకుండా) తెల్లవారేదాకా పడుకున్న వ్యక్తి గురించి, దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించగా "అలాంటి వ్యక్తి చెవిలో (లేక) చెవుల్లో షైతాన్ మూత్రం పోస్తాడు" అని అన్నారాయన. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి చెవుల్లో షైతాన్ మూత్రం పోయటం అనేది మన కళ్ళకు కనబడకపోయినా వాస్తవంలో అలా జరగవచ్చు. ఎందుకంటే, షైతాన్ నుండి దేవుని శరణువేడుకోని పక్షంలో వాడు మనిషి కార్యకలాపాల్లో హాజరవుతాడని ఇతర ఎన్నో హదీసులు ఉద్ఘాటిస్తున్నాయి. అంచేత షైతాన్ మనిషి చెవుల్లో మూత్రం పోయటమనేది సంభవమేనని తెలుస్తోంది. కాని కొంతమంది వాస్తవంలో అలా జరగదనీ, మనిషి నమాజు చేయకుండా నిద్రపోతే షైతాన్ అతని దైవధ్యానంలో ఆటంకాలు ఏర్పరుస్తాడని మాత్రమే దీని భావమని అభిప్రాయ పడుతున్నారు. అలాంటి మనుషుల్ని షైతాన్ చులకనగా చూస్తాడని ఈ హదీసు భావం కావచ్చునని మరికొంతమంది పండితులు ఊహిస్తున్నారు. ఏది ఏమైనా రాత్రిపూట తహజ్జుద్ నమాజు చేయకుండా నిద్రపోవటం మంచిది కాదని ఈ హదీసు ద్వారా బోధపడుతున్నది. దాని మూలంగా షైతాన్‌కు మనిషిని లోబరుచుకునే అవకాశం లభిస్తుంది. ఫలితంగా వాడు మనిషిని దైవధ్యానం నుండి, దైవారాధన నుండి, దైవవిధేయత నుండి ఆపటంలో విజయాన్ని సాధిస్తాడు.

١١٦٦ - وعَن أَبي هُريرَةَ رَضِيَ اللهُ عَنْـهُ، أَنَّ رَسُـولَ اللهِ ﷺ، قَـالَ: «يَعْقِـدُ الشَّيْطَانُ عَلى قافِيَةِ رَأْسِ أَحَدِكُم، إذا هُوَ نَامَ، ثَلاثَ عُقَدٍ، يضربُ عَلى كلِّ عُقْدَةٍ: عَلَيْكَ لَيْلٌ طَويلٌ فَارقُد، فإنِ اسْتَيقَظَ، فَذَكَرَ اللهَ تَعَالى انحَلَّت عُقْدَةٌ، فإن تَوضَّأَ، انحَلَّت عُقْدَةٌ، فَإن صَلَّى، انحَلَّت عُقَدُهُ، فأَصبَحَ نَشيطاً طَيِّبَ النَّفسِ، وَإلَّا أَصبَحَ خَبيثَ النَّفْسِ كَسْلَانَ» متفقٌ عليه. قَافِيَةُ الرَّأْسِ: آخِرُهُ.

1166. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా పడుకొని ఉన్నప్పుడు షైతాన్ అతని ముచ్చిలిగుంటపై మూడు ముళ్ళు వేస్తాడు. ప్రతి ముడిమీద, "ఇంకా చాలా రాత్రి ఉంది. హాయిగా నిద్రపో" అంటూ మంత్రించి ఊదుతాడు. అలాంటప్పుడు మనిషి గనక నిద్రలేచి దైవాన్ని స్మరిస్తే (ఆ ముడులలో) ఒక ముడి ఊడి పోతుంది. ఆ తర్వాత అతను వుజూ కూడా చేస్తే రెండో ముడి ఊడి పోతుంది. ఆ తర్వాత అతను నమాజు చేసుకుంటే ముళ్ళన్నీ ఊడిపోతాయి. దాంతో తెల్లవారు జామున నిద్రలేచే టప్పుడు అతను ఎంతో హుషారుగా,

నూతనోత్సాహంతో లేస్తాడు. లేకపోతే నిర్వేద మనసుతో, బద్ధకంగా లేస్తాడు.
(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٦٧ - وَعَن عبدِ اللهِ بنِ سلام رَضِيَ اللهُ عَنهُ، أَنَّ النَّبِيَّ ﷺ قالَ: «أَيُّهَا النَّاسُ أَفْشُوا السَّلامَ، وَأَطْعِمُوا الطَّعَامَ، وَصَلُّوا بِاللَّيْلِ وَالنَّاسُ نِيامٌ، تَدخُلُوا الجَنَّةَ بِسَلامٍ». رواهُ الترمذيُّ وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

1167. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ సలామ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ప్రజలారా! సలాంను వ్యాపింప జేయండి. (ప్రజలకు) అన్నం తినిపించండి. ప్రజలు రాత్రి నిద్రలో ఉండే సమయంలో నమాజు చేయండి. అలాచేస్తే మీరు ప్రశాంతంగా స్వర్గంలోకి ప్రవేశించగలరు. *(తిర్మిజీ, హసన్; సహీహ్)*

*(సునని తిర్మిజీలోని ప్రళయ వర్ణనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన సత్కార్యాల్ని ఆచరించేవారు ప్రళయదినాన ప్రశాంతంగా స్వర్గంలోకి ప్రవేశిస్తారని ఇందులో చెప్పబడింది. ప్రశాంతంగా అంటే నరక శిక్ష అనుభవించకుండా ప్రత్యేక దైవానుగ్రహంతో స్వర్గంలోకి ప్రవేశిస్తారన్నమాట.

١١٦٨ - وَعَنْ أَبي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَفْضَلُ الصِّيَامِ بَعْدَ رَمَضَانَ شَهْرُ اللهِ المُحَرَّمُ، وَأَفْضَلُ الصَّلاةِ بَعْدَ الفَرِيضَةِ صَلاةُ اللَّيْلِ» رواه مُسلِمٌ.

1168. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రమజాన్ మాసం తర్వాత అత్యంత శ్రేష్ఠమైన ఉపవాసం దేవుని మాసమైన ముహర్రమ్ ఉపవాసం. అలాగే ఫర్జ్ నమాజ్ తర్వాత అత్యంత శ్రేష్ఠమైన నమాజు రాత్రిపూట చేయబడే నమాజు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ముహర్రమ్ మాసాన్ని దేవుని మాసంగా పేర్కొనటం జరిగింది. దీని ద్వారా ఆ మాసపు విశిష్ఠత వెల్లడౌతోంది. మొత్తానికి ఇందులో చెప్పదలచుకున్నదేమిటంటే ఏ విధంగానయితే నఫిల్ ఉపవాసాల్లో ముహర్రమ్ మాసపు ఉపవాసాలు శ్రేష్ఠమైనవిగా భావింపబడతాయో అదే విధంగా నఫిల్ నమాజుల్లో రాత్రిపూట చేయబడే నమాజులు అత్యుత్తమమైనవిగా పరిగణించబడతాయి.

١١٦٩ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ، قَالَ: «صَلاةُ اللَّيْلِ مَثْنَى مَثْنَى، فَإِذا خِفْتَ الصُّبْحَ فَأَوْتِرْ بِوَاحِدَةٍ» متفقٌ عليه.

1169. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: (ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను తహజ్జుద్ నమాజు గురించి అడిగాడు) దానికాయన, "రాత్రిపూట నమాజు, రెండేసి రకాతుల చొప్పున చేయాలి. (ఆ విధంగా చేస్తూ) ఇక ఉషోదయం కావస్తోందని అనుకున్నప్పుడు ఒక రకాత్ చేసి (నమాజులన్నిటినీ) విత్ర్ (బేసి)గా మార్చుకో" అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٧٠ - وَعَنْهُ قَالَ: كَانَ النَّبِيُّ ﷺ، يُصَلِّي مِنَ اللَّيْلِ مَثْنَى مَثْنَى، وَيُوتِرُ بِرَكْعَةٍ متفقٌ عليه.

1170. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట నమాజు రెండేసి రకాతుల చొప్పున చేసేవారు. (చివర్లో) ఒక రకాత్ విత్ర్ చేసేవారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విత్ర్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై రెండు హదీసుల్లోనూ రాత్రిపూట నఫిల్ నమాజు రెండేసి రకాతుల చొప్పున చేయాలని, చివర్లో ఒక రకాతు విత్ర్ చేయాలని చెప్పబడింది. దీని ద్వారా విత్ర్ నమాజు ఒక రకాతు కూడా

చేయవచ్చునని బోధపడుతోంది. పైగా ఇదే శ్రేష్ఠమైన పద్ధతి అని తెలుస్తోంది. ఒకవేళ ఎవరయినా విత్ర్ మూడు రకాతులు చేయదలిచినా దాన్ని నెరవేర్చే అత్యుత్తమ పద్ధతి ఏమిటంటే- రెండు రకాతుల చివర్లో సలాం చేసి నమాజ్ ముగించి ఆ తర్వాత సరిక్రొత్తగా ఇంకో రకాత్ చేయాలి. దైవప్రవక్త (సల్లం) స్వయంగా ఇలా చేశారని తెలుస్తోంది.

١١٧١ - وَعَنْ أَنَسٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ، يُفطِرُ مِنَ الشَّهْرِ حَتَّى نَظُنَّ أَنْ لا يَصومَ مِنْهُ، وَيَصُومُ حَتَّى نَظُنَّ أَن لا يُفْطِرَ مِنْهُ شَيْئاً؛ وكانَ لا تَشَاءُ أَنْ تَرَاهُ مِنَ اللَّيْلِ مُصَلِّياً إلا رَأَيْتَهُ، وَلَا نَائماً إلا رَأَيْتَهُ. رواهُ البخاريُّ.

1171. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవ ప్రవక్త (సల్లం) ఒక్కో నెలలో ఉపవాస వ్రతాన్ని ఎలా వదలిపెట్టే వారంటే దాన్ని చూసి మేము అసలీయన ఈ నెలలో ఉపవాసాలే ఉండరేమో అనుకునే వాళ్ళం. ఒక్కో నెలలో ఆయన ఎలా ఉపవాసాలుండే వారంటే దాన్ని చూసి మేము అసలీయన ఈ నెలలో ఉపవాస వ్రతాన్ని విరమించరేమో అనుకునే వాళ్ళం. మీరాయన్ను రాత్రిపూట నమాజ్ చేస్తుండగా చూడ కూడదని ఎంత తలచుకున్నా ఆ దృశ్యం మీ కంట పడనే పడుతుంది. అదే విధంగా ఆయన్ని రాత్రిపూట పడుకొని ఉన్నప్పుడు చూడకూడదని మీరెంత తలచుకున్నా ఆ దృశ్యం కూడా మీకంట పడనే పడుతుంది.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు భావమేమిటంటే దైవప్రవక్త (సల్లం) నఫిల్ ఉపవాసాలను గాని, రాత్రిపూట చేయబడే నఫిల్ నమాజులనుగాని ఎల్లప్పుడూ ఒకే సమయంలో చేసేవారు కాదు. ఒక్కో నెలలో ఆయన అసలు ఉపవాసాలే పాటించేవారుకాదు. అది చూసి సహచరులు ఈ నెలలో ఆయన ఉపవాసాలు పాటించరేమో అనుకునేవాళ్ళు. అయితే నెల పూర్తి కావస్తున్నప్పుడు ఆయన తన సహచరుల అంచనాల్ని తారుమారు చేస్తూ తిరిగి ఉపవాస వ్రతాన్ని మొదలు

పెట్టేవారు. ఒక్కోనెలలో ఎడతెగకుండా ఉపవాసాలు పాటిస్తూ, ఒకేసారి వ్రతాన్ని విరమించేవారు. తహజ్జుద్ నమాజ్ విషయంలో కూడా ఆయన అలాగే చేసేవారు. ఆ నమాజును ఆయన కొన్నిసార్లు రాత్రి తొలివేళల్లో చేసేవారు. మరికొన్ని సార్లు అర్ధరాత్రిపూట చేసేవారు. ఇంకొన్ని సందర్భాల్లో రాత్రి చివరి వేళల్లో ఆ నమాజు చేసేవారు. ఆ విధంగా ఆయన రాత్రి అన్ని భాగాల్లోనూ నమాజు చేసేవారు. నిద్ర కూడా పోయేవారు.

١١٧٢ - وَعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنْهَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ، كَانَ يُصَلِّي إِحْدَى عَشْرَةَ رَكْعَةً - تَعْنِي فِي اللَّيْلِ - يَسْجُدُ السَّجْدَةَ مِنْ ذَلِكَ قَدْرَ مَا يَقْرَأُ أَحَدُكُمْ خَمْسِينَ آيَةً قَبْلَ أَنْ يَرْفَعَ رَأْسَهُ، وَيَرْكَعُ رَكْعَتَيْنِ قَبْلَ صَلَاةِ الْفَجْرِ، ثُمَّ يَضْطَجِعُ عَلَى شِقِّهِ الأَيْمَنِ حَتَّى يَأْتِيَهُ الْمُنَادِي لِلصَّلَاةِ، رواه البخاري.

1172. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) పదకొండు రకాతులు చేసేవారు. (రాత్రిపూట చేసే వారన్నది ఆమె ఉద్దేశ్యం). అందులో ఆయన ఎంత సుదీర్ఘంగా సజ్దా చేసే వారంటే ఆయన తలపైకెత్తక ముందే మీలోని ఒకడు (సులభంగా) యాభై ఆయతులు పఠించగలడు.

ఇంకా ఆయన ఫజ్ర్ నమాజుకు ముందు రెండు రకాతులు చేసేవారు. ఆ తర్వాత, నమాజు గురించి ప్రకటించే మనిషి, తన దగ్గరకు వచ్చేంతవరకు కుడిప్రక్కకు తిరిగి పడుకునేవారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సజ్దా స్థితిలో మనిషి దైవానికి సన్నిహితుడౌతాడు. ఆ స్థితిలో దాసుడు అత్యంత భక్తిప్రపత్తుల్ని, అణకువ భావాన్ని ప్రదర్శిస్తాడు. దేవుడు దాన్ని ఎంతగానో ఇష్టపడతాడు. అంతేకాదు సజ్దా స్థితిలో ప్రార్థనలు స్వీకృతిని పొందటానికి చాలా ఎక్కువ ఆస్కారముంటుంది. కనుక నమాజులో ముఖ్యంగా తహజ్జుద్ నమాజులో సుదీర్ఘమైన సజ్దాలు చేయటం అత్యంత లాభదాయకం.

١١٧٣ - وَعَنْهَا قَالَتْ: مَا كَانَ رَسُولُ اللهِ ﷺ، يَزِيدُ - فِي رَمَضَانَ وَلَا فِي غَيْرِهِ - عَلَى إِحْدَى عَشْرَةَ رَكْعَةً: يُصَلِّي

1173. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) రమజాన్‌లోగాని, రమజానేతర మాసం

أَرْبعاً فلا تَسْأَلْ عَنْ حُسْنِهِنَّ وَطولهنَّ! ثُمَّ يُصَلِّي أَرْبَعاً فَلا تَسْأَلْ عَنْ حُسْنِهِنَّ وَطولِهنَّ! ثُمَّ يُصَلِّي ثَلاثاً. فَقُلْتُ: يا رسُولَ اللهِ! أَتَنامُ قَبْلَ أَنْ تُوتِرَا؟ فقال: «يَا عائشَةُ! إنَّ عَيْنَيَّ تَناماِن وَلَا يَنامُ قَلْبي» متفقٌ عليه.

లోగాని (తహజ్జుద్ నమాజు) పదకొండు రకాతుల కంటే ఎక్కువ చేసేవారు కాదు. ముందు నాలుగు రకాతులు చేసేవారు. ఈ నాలుగు రకాతులు ఎంత చక్కగా, ఎంత సుదీర్ఘంగా ఉంటాయంటే దాన్ని నేను మాటల్లో వర్ణించలేను. ఆ తర్వాత మరో నాలుగు రకాతులు చేస్తారు. ఇవి కూడా ఎంతో చక్కగా సుదీర్ఘంగా వర్ణనాతీతంగా ఉంటాయి. ఆ తర్వాత మరో మూడు రకాతులు చేస్తారు. నేనోసారి ఆయన్ని "దైవప్రవక్తా! మీరు విత్ర్ చేయటానికి ముందు పడుకుంటారా?" అని అడిగాను. అందుకాయన, "ఆయిషా! నా కళ్ళు నిద్రిస్తాయి. కాని నా హృదయం మాత్రం మేల్కొనే ఉంటుంది" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) నిద్రపోయినప్పుడు కేవలం ఆయన కళ్ళు మాత్రమే నిద్రిస్తాయి. ఆ సమయంలో ఆయన హృదయం మేల్కొనే ఉంటుంది. అందుకే ఆయన నిద్రపోయినప్పటికీ ఆయన వుజూ భంగం కాదని హదీసుల ద్వారా బోధపడుతోంది. ఇది ఆయన ప్రత్యేకతల్లో ఒకటి.

ఈ హదీసు బోధించే మరో విషయమేమిటంటే, నమాజును దాని నియమనిబంధనల్ని అనుసరించి, అత్యంత భక్తిశ్రద్ధలతో నెరవేర్చాలి. రాత్రి చివరి వేళలో నిద్రలేవగలమనే నమ్మకమున్నవారు ఇషా తర్వాత విత్ర్ నమాజ్ చేయకుండా, తహజ్జుద్ నమాజ్‌తోపాటు దాన్ని నెరవేర్చాలి. నిద్రలేవలేమన్న భయముంటే ఇషా నమాజ్ అయిన వెంటనే కూడా దాన్ని చేసుకోవచ్చు.

١١٧٤ ـ وَعَنْهَا أَنَّ النَّبِيَّ ﷺ، كانَ يَنامُ أَوَّلَ اللَّيْلِ، وَيَقومُ آخِرَهُ فَيُصلِّي. متفقٌ عليه.

1174. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) రాత్రి తొలిభాగంలో నిద్రపోయి ఆఖరిజామున మేల్కొని నమాజు చేసేవారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) అత్యధిక సందర్భాల్లో ఇలాగే చేసేవారు. అంటే తహజ్జుద్ నమాజుకు అత్యంత అనువైన, శ్రేష్ఠమైన సమయం రాత్రి చివరిజాము. కనుక ఆయన ఎక్కువగా ఆ సమయంలోనే తహజ్జుద్ నమాజు చేసేవారు. అయితే అర్ధరాత్రిపూట, రాత్రి తొలిభాగంలో కూడా ఆయన తహజ్జుద్ నమాజ్ చేశారని ఇతర హదీసుల ద్వారా బోధపడుతోంది. ఈ విషయం ఇంతకు ముందు కూడా వివరించబడింది.

١١٧٥ ـ وَعَنِ ابنِ مَسْعُودٍ، رَضِيَ اللهُ عَنْهُ! قالَ: صَلَّيْتُ مَعَ النَّبِيِّ ﷺ لَيْلَةً، فَلَمْ يَزَلْ قائماً حَتَّى هَمَمْتُ بِأَمْرِ سُوءٍ. قِيلَ: مَا هَمَمْتَ؟ قالَ: هَمَمْتُ أَنْ أَجْلِسَ وَأَدَعَهُ. متفقٌ عليه.

1175. హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) కథనం: ఓ రోజు రాత్రి నేను దైవప్రవక్త (సల్లం) వెంట నమాజ్ చేశాను. నమాజులో ఆయన చాలాసేపు నిల బడ్డారు. దాంతో నేను (విసుగెత్తి పోయి) ఒక చెడు పని చేద్దామనుకున్నాను.

(ఈ హదీసుని వివరిస్తున్నప్పుడు ఒకాయన) 'మీరు ఏం చేయదలచు కున్నారేమిటి?' అని అడిగాడు. అందుకు అబ్దుల్లా బిన్ మస్వూద్, 'ఆయన్ని వదలిపెట్టి కూర్చుందా మనిపించింది నాకు' అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) రాత్రిపూట తహజ్జుద్ నమాజు బాగా సుదీర్ఘంగా ఉండాలని, ఖిరాత్,రుకూ, ఖౌమా, సజ్దా మొదలగు విధుల్ని ప్రశాంతంగా నెరవేర్చాలని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. 2) నఫిల్ నమాజును సామూహికంగా కూడా చేయవచ్చు. 3) ఇమామ్ మరీ అంత సుదీర్ఘంగా నమాజ్ చేయిస్తే అతని వెనక నమాజ్ చేసే ముక్తదీలు నమాజ్ వదలి వెళ్ళవచ్చని కొంతమంది పండితులు తలపోస్తున్నారు. కాని హదీసులో హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) ఆ పనిని చెడుపనిగా పేర్కొన్నారు. కనుక ఆ అనుమతి చర్చనీయాంశం అయింది. ఏది ఏమైనా అనేక ఇతర హదీసుల్లో ఇమాములు తమ వెనక నమాజు చేసేవారిని దృష్టిలో పెట్టుకొని నమాజు చేయించాలని తాకీదు చేయటం జరిగింది. ఆ తాకీదును బట్టి చూస్తే, ఆ విధమైన అనుమతి అసమంజసమేమీ కాదనిపిస్తోంది.

1176. హజ్రత్ హుజైఫా (రజి) కథనం: ఒకరాత్రి నేను దైవప్రవక్త (సల్లం) వెంట నమాజు చేశాను. నమాజులో ఆయన బఖరా సూరా పారాయణం మొదలెట్టారు. నూరు వాక్యాల తర్వాత ఆయన రుకూ చేస్తారని నేను (మనసులో) అనుకున్నాను. కాని (నూరు వాక్యాలు అయిపోయిన తర్వాత కూడా) ఆయన పారాయణాన్ని కొనసాగించారు. రెండు రకాతుల్లో ఈ సూరాను పూర్తిగా చదివి ఆపుతారేమో ననుకున్నాను. కాని ఆ తర్వాత కూడా ఆయన ఇంకా చదువుతూనే పోయారు. నేను (మనసులో), బహుశా ఈ సూరా పూర్తవగానే రుకూ చేస్తారేమో అనుకున్నాను. కాని ఆయన (బఖర సూరా పూర్తవగానే) నిసా సూరా పారాయణం మొదలెట్టారు. అది కూడా పూర్తిగా చదివి ఆలి ఇమ్రాన్ సూరా చదవటం ప్రారంభించారు. అదీ

١١٧٦ - وَعَنْ حُذَيْفَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: صَلَّيْتُ مَعَ النَّبِيِّ ﷺ، ذَاتَ لَيْلَةٍ فَافْتَتَحَ البَقَرَةَ، فقلتُ: يَرْكَعُ عِنْدَ المِائَةِ، ثُمَّ مَضَى، فقلتُ: يُصَلِّي بها في رَكْعَةٍ، فَمَضَى، فَقُلْتُ: يَرْكَعُ بها، ثُمَّ افْتَتَحَ النِّسَاءَ فَقَرَأَهَا، ثُمَّ افْتَتَحَ آلَ عِمْرَانَ، فَقَرَأَهَا، يَقْرَأُ مُتَرَسِّلاً. إذَا مَرَّ بِآيَةٍ فِيها تَسْبِيحٌ، سَبَّحَ، وَإذا مَرَّ بِسُؤَالٍ، سَأَلَ، وَإذا مَرَّ بِتَعَوُّذٍ تَعَوَّذَ، ثُمَّ رَكَعَ، فَجَعَلَ يَقُولُ: سُبْحَانَ رَبِّيَ العَظِيمِ، فَكَانَ رُكُوعُهُ نَحْواً مِنْ قِيَامِهِ، ثُمَّ قَالَ: «سَمِعَ اللهُ لِمَنْ حَمِدَهُ، رَبَّنَا لَكَ الحَمْدُ»، ثُمَّ قَامَ طَوِيلاً

قَرِيباً مِمَّا رَكَعَ، ثُمَّ سَجَدَ فَقَالَ: «سُبْحَانَ رَبِّيَ الأَعْلَى»، فَكَانَ سُجُودُهُ قَرِيباً مِنْ قِيَامِهِ. رواه مسلم.

పూర్తిగా పఠించారు. నిదానంగా పారాయణం చేస్తూ ఏదయినా వాక్యంలో దేవుని పవిత్రతను గురించిన ప్రస్తావన వస్తే అక్కడ దేవుని పవిత్రతను కొనియాడేవారు. దైవాన్ని అర్థించమనే వాక్యాలు వచ్చినప్పుడు అక్కడ కాస్త ఆగి దైవాన్ని అర్థించేవారు. దేవుని శరణు వేడే ప్రస్తావన వస్తే దైవాన్ని శరణు వేడుకునేవారు. (ఈ విధంగా ఆలి ఇమ్రాన్ సూరా పూర్తయిన తర్వాత) ఆయన రుకూ చేశారు. రుకూలో 'సుబ్‌హాన రబ్బియల్ అజీమ్' అని పలికారు. ఆయన చేసిన రుకూ దాదాపు ఆయన ఖియామ్‌లో నిలబడినంతసేపు పట్టింది. తర్వాత ఆయన 'సమిఅల్లాహు లిమన్ హమిదహ్' అంటూ రుకూ నుంచి పైకి లేచారు. అప్పుడు కూడా దాదాపు రుకూ చేసినంత సేపు నిలబడ్డారు. ఆ తర్వాత సజ్దా చేశారు. సజ్దాలో 'సుబ్‌హాన రబ్బియల్ ఆలా' అని పఠించారు. ఆయన చేసిన సజ్దా కూడా దాదాపు ఆయన (ఖియామ్‌లో) నిలబడినంత సేపు పట్టింది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٧٧ - وَعَنْ جَابِرٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سُئِلَ رَسُولُ اللهِ ﷺ: أَيُّ الصَّلاةِ أَفْضَلُ؟ قَالَ: «طُولُ القُنُوتِ»

1177. హజ్రత్ జాబిర్ (రజి)కథనం: "నమాజులన్నిటిలో అత్యంత శ్రేష్ఠమైన నమాజు ఏది?" అని దైవప్రవక్త (సల్లం)ను అడగటం జరిగింది.

رواه مسلم. المرادُ بالقُنوتِ: القِيَامُ.

అందుకాయన 'సుదీర్ఘంగా నిలబడి చేసే నమాజు (అత్యంత శ్రేష్ఠమైనది)' అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఖియామ్, రుకూ, సజ్దా మొదలగు నమాజు విధుల్లో సుదీర్ఘమైన ఖియామ్‌తో కూడిన నమాజు అత్యంత శ్రేష్ఠమైనదని పై హదీసు ద్వారా బోధపడుతున్నది. నమాజ్‌లో ఎంతసేపు నిలబడితే (ఖియామ్ చేస్తే) అంత ఎక్కువగా ఖుర్ఆన్ పారాయణం చేయటానికి వీలవుతుంది. అదీగాక ఖుర్ఆన్ పారాయణం అత్యంత గొప్ప ఆరాధనగా పరిగణించ బడుతుంది. అంచేత ఎక్కువ మోతాదులో ఖుర్ఆన్ పారాయణం చేయటానికి వీలుగా, సుదీర్ఘమైన ఖియామ్‌తో చేసే నమాజ్ అత్యంత శ్రేష్ఠమైనదన్న విషయంలో సందేహం లేదు.

١١٧٨ - وَعَنْ عبدِ اللهِ بنِ عَمْرِو بنِ العَاصِ، رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ، قالَ: «أَحَبُّ الصَّلاةِ إلى اللهِ صَلاةُ دَاوُدَ، وَأَحَبُّ الصيام إلى الله صِيَامُ دَاوُدَ، كانَ يَنَامُ نِصْفَ اللَّيْلِ وَيَقُومُ ثُلُثَهُ وَيَنَامُ سُدُسَهُ وَيَصومُ يوماً وَيُفْطِرُ يوماً» متفقٌ عليه.

1178. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవునికి అత్యంత ప్రీతిపాత్రమైన నమాజు దావూద్ (అలైహి) నమాజు. అత్యంత ప్రీతిపాత్రమైన ఉపవాసం దావూద్ (అలైహి) ఉపవాసం. ఆయన అర్ధరాత్రి వరకు నిద్రపోయేవారు. తర్వాత మూడింట ఒక వంతు రాత్రి భాగంలో దేవుణ్ణి ఆరాధించేవారు. ఆ తర్వాత ఆరోవంతు భాగంలో (మళ్ళీ) నిద్రపోయేవారు. ఒకరోజు ఉపవాసముంటే మరోరోజు ఉపవాసం మానుకునేవారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మనిషి తన స్వయం మీద శక్తికి మించిన భారాన్ని మోపుకోవటాన్ని, ఆరాధనలో

అతివాదానికి పాల్పడటాన్ని ఈ హదీసులో వారించటం జరిగింది. అందుకే నిత్యం రాత్రిళ్లు జాగారం చేసి ఆరాధన చేయటాన్ని, ఎల్లకాలం ఉపవాసాలు పాటించటాన్ని ఇస్లాం ధర్మం తీవ్రంగా గర్హిస్తుంది. స్వయంగా దైవప్రవక్త (సల్లం)గారి ఆదర్శజీవితం కూడా మధ్యేమార్గాన్ని అనుసరించమని బోధిస్తోంది. హజ్రత్ దావూద్, ఆరాధనా విధానంలో మధ్యేమార్గాన్ని అనుసరించేవారు. అందుకే ఆయన నమాజులు, ఆయన ఉపవాసాలు దైవానికి అత్యంత ప్రీతిపాత్రమైనవని పేర్కొనటం జరిగింది. ఆరాధనల్లో మధ్యేమార్గాన్ని అనుసరించాలని ఇస్లాం ధర్మం కూడా నొక్కి వక్కాణిస్తోంది.

١١٧٩ ـ وَعَنْ جَابِرٍ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ، يَقُولُ: «إِنَّ فِي اللَّيْلِ لَسَاعَةً، لا يُوافِقُهَا رَجُلٌ مُسلِمٌ يَسْأَلُ اللهَ تعالى خَيْراً من أَمْرِ الدُّنيا وَالآخِرَةِ، إِلَّا أَعْطَاهُ إِيَّاهُ، وَذٰلِكَ كُلَّ لَيْلَةٍ» رواه مسلم.

1179. దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ జాబిర్ (రజి) తెలియజేశారు: నిశ్చయంగా రాత్రిపూట ఒక ఘడియ వస్తుంది. ముస్లిం వ్యక్తి ఎవరైనా ఆ ఘడియను పొంది, ఆ సమయంలో దేవుణ్ణి, ఇహపరాల వ్యవహారాలకు సంబంధించి ఏదయినా మంచిని కోరుకుంటే దేవుడు తప్పకుండా ప్రసాదిస్తాడు. ఆ ఘడియ ప్రతి రాత్రీ వస్తుంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఇంతకు ముందు పుటల్లో చర్చించబడిన జుమానాటి ఘడియ అనిర్ణీతంగా ఉన్నట్లే ఈ ఘడియ కూడా అనిర్ణీతంగానే ఉంది. అయితే రాత్రిపూట ఆరాధనకు అత్యంత శ్రేష్ఠమైన సమయం ఆఖరి వేళలు గనుక బహుశా ఈ ఘడియ కూడా అప్పుడే వస్తుందని మనం అర్ధ నమ్మకంగానయినా చెప్పగలం. రమజాన్ మాసంలోని 'లైలతుల్ ఖద్ర్' (ఘనమైన రేయి) మాదిరిగానే ఈ ఘడియ కూడా అస్పష్టంగా ఉంచబడింది. వాస్తవానికి మనిషి ఆ శుభఘడియల్ని అన్వేషిస్తూ వీలైనంత ఎక్కువగా దైవాన్ని ఆరాధించాలనీ, ఆయన ధ్యానంలో, ప్రార్థనల్లో నిమగ్నుడై ఉండాలన్నదే దాని ఉద్దేశ్యం. "ముస్లిం వ్యక్తి" అనే పదం స్త్రీ పురుషులిరువురికీ వర్తిస్తుంది.

١١٨٠ ـ وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ، قَالَ: «إذا قَامَ أَحَدُكُمْ

1180. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా రాత్రిపూట ఆరాధన నిమిత్తం

مِنَ اللَّيْلِ فَلْيَفْتَتِحِ الصَّلاةَ بِرَكعَتَيْنِ خَفِيفَتَيْنِ» رواهُ مُسْلِمٌ.

నిమిత్తం నిలబడినప్పుడు రెండు సంక్షిప్త రకాతులతో నమాజును మొదలెట్టాలి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

١١٨١ - وَعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كانَ رَسُولُ اللهِ ﷺ، إذا قامَ مِنَ اللَّيلِ افتَتَحَ صَلاتَهُ بِرَكعَتَيْنِ خفيفتَيْنِ، رواه مسلم.

1181. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట నమాజు కోసం నిలబడినప్పుడు రెండు సంక్షిప్త రకాతులతో (తహజ్జుద్) నమాజు మొదలెట్టేవారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

١١٨٢ - وَعَنْهَا، رَضِيَ اللهُ عَنْها، قَالَتْ: كانَ رَسولُ اللهِ ﷺ، إذا فَاتَتْهُ الصَّلاةُ من اللَّيْلِ مِنْ وَجَعٍ أَوْ غَيْرِهِ، صَلَّى مِنَ النَّهارِ ثِنْتَي عَشْرَةَ رَكعَةً. رواه مسلم.

1182. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) ఏదయినా నొప్పివల్లగాని లేదా ఇతర కారణం వల్ల గాని రాత్రిపూట నమాజ్ చేయలేకపోతే మరునాడు పగలు ఆయన పన్నెండు రకాతులు చేసేవారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

١١٨٣ - وَعَن عُمَرَ بنِ الخَطَّابِ، رضيَ اللهُ عَنْهُ، قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ نَامَ عَنْ حِزْبِهِ، أَوْ عَنْ شَيْءٍ مِنْهُ، فَقَرَأَهُ فِيما بَيْنَ صَلاةِ الفَجْرِ وَصَلاةِ الظُّهْرِ، كُتِبَ لَهُ كَأَنَّمَا قَرَأَهُ مِنَ اللَّيْلِ» رواهُ مُسْلِمٌ.

1183. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఏ వ్యక్తి అయినా తాను రోజూ రాత్రిపూట ఆనవాయితీగా చేసే ఆరాధననుగాని లేదా అందులో కొంతభాగం గాని చేయకుండా నిద్రపోయి (మరునాడు తెల్లవారాక) ఫజ్ర్ నమాజు నుంచి జుహ్ర్ నమాజు వరకూ - ఈ మధ్య

కాలంలో - ఎప్పుడు నెరవేర్చినా అతను దాన్ని రాత్రిపూట నెరవేర్చి నట్లుగానే వ్రాసుకోబడుతుంది.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు సత్కార్యాలను 'నిర్విరామంగా పాటిస్తూ ఉండాలి" అనే అధ్యాయం క్రింద కూడా వచ్చింది (154వ హదీసు చూడండి). దీని ముఖ్యాంశాలు అక్కడ పొందుపరచబడ్డాయి.

١١٨٤ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «رَحِمَ اللهُ رَجُلًا قَامَ مِنَ اللَّيلِ، فَصَلَّى وَأَيقَظَ امرَأَتَهُ، فَإنْ أَبَتْ نَضَحَ فِي وَجهِهَا المَاءَ، رَحِمَ اللهُ امرَأَةً قَامَتْ مِنَ اللَّيلِ فَصَلَّتْ، وَأَيقَظَتْ زَوجَهَا فَإنْ أَبَى نَضَحَتْ فِي وَجهِهِ المَاءَ» رواه أبو داود بإسنادٍ صحيحٍ.

1184. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రాత్రిపూట ఆరాధన నిమిత్తం నిద్రలేచే పురుషుణ్ణి దేవుడు కరుణించుగాక! అతను లేచి నమాజ్ చేస్తాడు. తన భార్యను కూడా (నమాజ్ కోసం) మేల్కొలుపుతాడు. ఒకవేళ ఆమె లేవకపోతే ముఖం మీద నీళ్ళుచల్లి లేపటానికి ప్రయత్నిస్తాడు. అలాగే రాత్రిపూట ఆరాధన నిమిత్తం నిద్రలేచే స్త్రీని దేవుడు కరుణించుగాక! ఆమె లేచి నమాజ్ చేస్తుంది. తన భర్తను కూడా (నమాజ్ కోసం) నిద్ర లేపుతుంది. ఒకవేళ అతను లేవకపోతే ముఖం మీద నీళ్ళ చల్లి మరీ లేప టానికి ప్రయత్నిస్తుంది. (అబూదావూద్, దీని ఆధారాలు దృఢమైనవి)

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)

١١٨٥ - وَعَنْهُ وَعَنْ أبي سَعيدٍ، رَضِيَ اللهُ عَنْهُمَا قَالا: قالَ رسولُ اللهِ ﷺ: «إذا أَيقَظَ الرَّجُلُ أَهْلَهُ مِنَ اللَّيْلِ فَصَلَّيَا - أَوْ صَلَّى - رَكعَتَيْنِ جَميعاً، كُتِبَا في الذَّاكرينَ وَالذَّاكِرَاتِ» رواهُ أَبو داود بإسنادٍ صحيحٍ.

1185. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పురుషుడు రాత్రిపూట నిద్రలేచి తన భార్యను కూడా నిద్రలేపి ఆ తర్వాత ఇద్దరూ నమాజ్ చేస్తే (లేక) ఇద్దరూ (వేర్వేరుగా) రెండు రకాతులు కలిపి చేస్తే వారిరువురూ దేవుణ్ణి (అత్యధి కంగా) స్మరించేవారిగా వ్రాసుకోబడ తారు. (అబూదావూద్, దీని ఆధారాలు దృఢమైనవి)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

హదీసు మూలంలో "జమీఅన్" అనే పదం వాడబడింది. దాన్ని ఆధారంగా చేసుకొని కొంతమంది "భార్యాభర్తలిరువురూ కలిసి సామూహికంగా నమాజ్ చేస్తే" అని తర్జుమా చేశారు. వాస్తవానికి దానర్థం అది కాదు. ఇద్దరూ ఒకే సమయంలో నఫిల్ నమాజు చేస్తారని మాత్రమే దాని భావం. ఇద్దరూ కలిసి నమాజ్ చేస్తారన్న మాత్రాన సామూహికంగా నమాజ్ చేస్తారన్న భావం కానక్కరలేదు.

١١٨٦ - وعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنْهـا، أنَّ النَّبـيَّ ﷺ، قَـالَ: «إذا نَعَسَ أَحَدُكُمْ في الصَّلاة، فَلْيَرْقُدْ حتى يَذهَبَ عَنْهُ النَّومُ، فَإنَّ أَحدَكُمْ إذا صَلَّى وَهو نَاعِسٌ، لَعَلَّهُ يَذهَبُ يَسْتَغفِرُ فَيَسُبَّ نَفسَهُ» متفقٌ عليهِ.

1186. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరి కయినా నమాజులో కునికిపాటు వస్తే, నిద్ర దూరమైపోయేదాకా పడుకోవటం మంచిది. ఎందుకంటే మీలో ఎవ రయినా కునికిపాట్ల మధ్య నమాజ్‌చేస్తే అతను (దైవాన్ని) క్షమాపణలు వేడు కునే బదులు తన్ను తాను తిట్టుకునే ప్రమాదముంది." *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٨٧ - وَعَنْ أَبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إذا قَامَ أَحَدُكُمْ، مِنَ اللَّيْلِ فَاسْتَعْجَمَ الْقُرآنُ على لِسَانِهِ، فَلَم يَدرِ ما يقُولُ، فَلْيَضْطَجِعْ» رَواهُ مُسْلِمٌ.

1187. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా రాత్రిపూట నమాజు కోసం నిలబడినప్పుడు ఖుర్‌ఆన్ పారాయణం తన నోటికి కష్టంగా అనిపిస్తే, (నిద్ర మత్తు వల్ల) అసలు తనేం అంటున్నాడో తనకే అర్థం కాకపోతే (ఇంకాసేపు) పడుకోవటం మంచిది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నమాజ్ చేయటానికి ఏకాగ్రత, నమ్రతా అణకువ భావాలు చాలా అవసరం. కనుక అలసట, మందతనం అనేవి లేకుండా మనసు ఉత్సాహంగా ఉన్నప్పుడే మనిషి నమాజ్ చేయాలి. అందుకే పై హదీసులో నిద్రమత్తులో ఉన్నప్పుడు నమాజ్ చేయటాన్ని వారించటం జరిగింది. నమ్రతా అణకువ భావాలు నమాజ్‌కు ఊపిరి వంటివి. నిద్రమత్తులో ఉన్నప్పుడు మనిషి అలాంటి భావాలను వ్యక్తం చేయలేడు. అంచేత అలాంటి స్థితిలో ఉన్నప్పుడు ముందు కాసేపు పడుకొని నిద్రను దూరం చేసుకోవాలి. ఆ తర్వాత ఖుర్‌ఆన్ పారాయణం, ప్రార్థనలు చేస్తే అందులో మధురానుభూతుల్ని పొందవచ్చు.

213 వ అధ్యాయం

## ٢١٣ ـ بَابُ اسْتِحْبَابِ قِيَامِ رَمَضَانَ وَهُوَ التَّرَاوِيحُ

## రమజాన్‌లో ఖియామ్ (అంటే తరావీహ్ నమాజు చేయటం) అభిలషణీయం

١١٨٨ ـ عَنْ أَبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ قَامَ رَمَضَانَ إيماناً واحتِساباً غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ» متفقٌ عليهِ.

1188. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో రమజాన్ నెలలో నిలబడతాడో (రాత్రి పూట నమాజ్ చేస్తాడో) అతని వెనుకటి పాపాలన్నీ మన్నించబడతాయి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తరావీహ్ నమాజు ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١١٨٩ ـ وَعَنْهُ، رَضِيَ اللهُ عَنْهُ، قَالَ: كانَ رَسُولُ اللهِ ﷺ، يُرَغِّبُ في قِيَامِ رَمَضَانَ مِنْ غَيْرِ أَنْ يَأْمُرَهُمْ فِيهِ بِعَزِيمَةٍ؛ فيقولُ: «مَنْ قَامَ رَمَضَانَ إيمَاناً وَاحْتِسَاباً غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ» رَوَاهُ مُسْلِمٌ.

1189. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) రమజాన్ నెలలో (రాత్రిపూట) నమాజు తప్పనిసరిగా చేయవలసిందేనని చెప్పకుండా (తన సహచరుల్ని) దాని విషయంలో పురికొల్పుతూ ఉండేవారు. ఇలా అనేవారు: "ఎవరయితే రమజాన్ నెలలో విశ్వాసంతో, పుణ్యం సంపాదించాలనే ఉద్దేశ్యంతో నమాజ్ చేస్తాడో అతని పూర్వపు పాపాలన్నీ మన్నించబడతాయి." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) పై హదీసుల ద్వారా బోధపడేదేమిటంటే; నిశ్చయంగా రమజాన్ నెలలోని తరావీహ్ నమాజు, పుణ్యం రీత్యా ఎంతో ఘనమైన నమాజు. దాన్ని నెరవేర్చమని హదీసుల్లో పదేపదే తాకీదు చేయబడింది. అయినప్పటికీ అది నఫిల్ నమాజు మాత్రమే, వాజిబ్ కాదు.

2) రమజాన్ నెలలోని ఈ నమాజును స్వయంగా దైవప్రవక్త (సల్లం) కూడా ఆచరించారని తెలుస్తోంది. దాని వివరాల్లోకి వెళితే.... ఒక యేడు రమజాన్‌లో మూడు రాత్రులు ఆయన తన సహచరుల్ని వెంటబెట్టుకొని సామూహికంగా ఈ నమాజు చేశారు. ఆ తర్వాత నాల్గో రోజు రాత్రి కూడా యధాప్రకారం సహచరులు సామూహికంగా నమాజ్ చేయటానికి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చారు. కాని ఆయన దానికి నిరాకరిస్తూ, 'మీ శ్రద్ధాసక్తుల్ని చూసి దేవుడు ఈ నమాజును మీపై విధిగా చేసేస్తాడేమోనని నాకు భయంగా ఉంది' అన్నారు. సహచరులు ఎంత కోరినప్పటికీ ఆయన ఆ రోజు నమాజు చేయించలేదు. అయితే ఈ మూడు రాత్రుల్లో ఆయన ఎన్ని రకాతులు చేయించారు? అని అడిగితే హదీసుల ద్వారా ఆయన ఎనిమిది రకాతులు, ఆ తర్వాత మూడు రకాతులు విత్ర్ చేయించారని తెలుస్తోంది. కనుక రమజాన్ నెలలోని రాత్రిపూట నమాజు సంప్రదాయబద్ధంగా ఎనిమిది రకాతులు మరియు మూడు రకాతుల విత్ర్- మొత్తం కలిపి పదకొండు రకాతులేనన్న విషయాన్ని గ్రహించాలి.

3) హదీసుల్లో ఈ నఫిల్ నమాజును రమజాన్ నమాజుగా పేర్కొనటం జరిగింది. అయితే ఈ తర్వాతి కాలంలో ఇది 'తరావీహ్' నమాజుగా నామాంతరం చెందింది. తరావీహ్ అనేది 'తర్‌వీహా' అనే పదానికి బహువచనం. 'తర్‌వీహా' అంటే విశ్రాంతి, విరామం అని అర్థం. సహాబాలు, తాబయీన్లు దైవప్రవక్త సంప్రదాయానుసారం చాలాసేపు నిలబడి నమాజ్ చేసేవారు. ఆ విధంగా నాలుగురకాతుల తర్వాత కాసేపు విశ్రాంతి తీసుకునే వారు. నాలుగు రకాతుల్ని 'తర్‌వీహా' అని పిలిచేవారు. ఆ విధంగా క్రమంగా ఆ నమాజుకు అదే పేరు పడిపోయింది.

4) వాస్తవానికి తరావీహ్ నమాజు కూడా తహజ్జుద్ నమాజే. తహజ్జుద్ నమాజ్ వేళ ఇషా నమాజ్ తర్వాత నుండి మొదలయి ఉషోదయం ముందు వరకు ఉంటుంది. రమజాన్ మాసంలో ప్రజల సౌలభ్యం కోసం, ఆ పవిత్ర నెలలో ప్రతి ఒక్కరూ తహజ్జుద్ పుణ్యాన్ని పొందగలగాలన్న ఉద్దేశ్యంతో దాన్ని ఇషా నమాజ్ తర్వాత తొలివేళలోనే నెరవేర్చటం జరుగుతుంది.

5) తరావీహ్ నమాజును సామూహికంగా నెరవేర్చటం స్వయంగా దైవప్రవక్త (సల్లం) ఆచరణ ద్వారానే రుజువయింది. ఆయన 23వ, 25వ, 27వ రోజు రాత్రుల్లో తరావీహ్ నమాజు

చేయించారు. ఆ తర్వాత హజ్రత్ ఉమర్ (రజి) తన ఖిలాఫత్ కాలంలో దాన్ని సామూహికంగా నెరవేర్చే పద్ధతిని పునరుద్ధరించారు. అంతేకాదు, ప్రజలకు విత్ర్ సమేతంగా పదకొండు రకాతులు తరావీహ్ నమాజు చేయించటం కోసం హజ్రత్ కాబ్ మరియు హజ్రత్ తమీమ్ దారీ (రజి)లను ఇమాములుగా నియమించారు (ముఅత్తా). ఆ కాలం నుంచి ఈ సంప్రదాయం నేటికీ కొనసాగుతూనే వస్తోంది.

6) కొంతమంది తరావీహ్ నమాజును సామూహికంగా నెరవేర్చటాన్ని ధర్మంలో ఓ కొత్త పోకడ (బిద్అత్)గా తలపోస్తున్నారు. ఈ ఆచారం హజ్రత్ ఉమర్ (రజి) కాలం నుంచి ప్రారంభమయింది, అంతకు ముందు దైవప్రవక్త జీవిత కాలంలో ఇది అమల్లో లేదన్నది వారి వాదన. కాని వారి ఈ వాదన సరయినది కాదు. ఎందుకంటే స్వయంగా దైవప్రవక్త (సల్లం) ఈ నమాజును సామూహికంగా చేయించినట్లు దాఖలాలున్నాయి. మరి అలాంటప్పుడు ఇది బిద్అత్ ఎలా అవుతుంది? దైవప్రవక్త (సల్లం) చేత ప్రతిపాదించబడిన ఓ గొప్ప పుణ్యకార్యం మధ్యలో కొంతకాలం సహేతుకమైన కారణాల వల్ల ఆచరణలో లేకపోయినంత మాత్రాన అది క్రొత్తపోకడగా పరిగణించబడుతుందా? అదీగాక దైవప్రవక్త (సల్లం), అది విధిగా నిర్ణయించబడు తుందేమోనన్న భయంకొద్దీ దాన్ని కొనసాగించలేకపోయారు. అంటే ఆయన దాన్ని కొనసాగించాలన్న ఉద్దేశ్యంతో ఉన్నారనే కదా దానర్థం! అయితే ఆయన అనంతరం వహీ (దైవవాణి అవతరణ) నిలిచిపోయింది. ఇక తరావీహ్ నమాజు ఫర్జ్‌గా నిర్ణయించబడే అవకాశమే లేదు. కనుక హజ్రత్ ఉమర్ (రజి) తిరిగి దానికి సామూహికత రూపమిచ్చి దైవప్రవక్త (సల్లం) ఉద్దేశ్యాన్ని నెరవేర్చారు. ఆయన ఆచరణను కొనసాగించారు. అయినప్పటికీ, నేడు ఎవరయినా రాత్రి చివరి వేళలో వ్యక్తిగతంగా ఆ నమాజు చేయదలిస్తే అతను నిస్సం కోచంగా చేసుకోవచ్చు. కాని సామాన్య ప్రజానీకానికి మాత్రం అది సాధ్యం కాని పని. రాత్రి చివరివేళలో స్వయంప్రేరణతో నిద్రలేచి వ్యక్తిగతంగా ఆ నమాజును చేయాలంటే సామాన్య ప్రజలకు సాధ్యంకాదు. ఈ కారణాల దృష్ట్యా హజ్రత్ ఉమర్ (రజి) నిర్ణయం ముమ్మాటికీ సరయినది, సమంజసమైనది. అలా చేయకపోతే సమాజంలోని అతికొద్దిమంది తప్ప మిగతా వారంతా తహజ్జుద్ పుణ్యాన్ని కోల్పోతారు. అది సమాజానికి పెద్ద దురదృష్టం కాదూ?!

7) తరావీహ్ నమాజు ఇరవై రకాతులు చేయాలన్న ఆదేశం ఏ ప్రామాణిక హదీసులోనూ లేదు. హజ్రత్ ఉమర్ (రజి) ఇరవై రకాతులు చేయించారన్న మాట కూడా ఏమంత ప్రామాణికమైనది కాదు. ఒక బలహీనమైన హదీసుని ఆధారంగా చేసుకొని ఈ అభిప్రాయాన్ని బలపర్చటం జరుగుతోంది. వాస్తవం ఏమిటంటే ఆ హదీసు ఉల్లేఖకుల పరంపరలో ఒక చోట లింకు తెగివుంది. అంచేత ఆ హదీసును ఇరవై రకాతుల ఆదేశానికి ఆధారంగా చూపెట్టడం ఏవిధంగానూ సరికాదు. అయితే మరి కొన్ని

ఉల్లేఖనాల ద్వారా హజ్రత్ ఉమర్ (రజి) కాలంలో ప్రజలు 20,36,40 ఇలా వివిధ సంఖ్యల్లో తరావీహ్ నమాజు చేసేవారని మాత్రం తెలుస్తోంది. దీన్ని ఆధారంగా చేసుకొని తరావీహ్ నమాజును ఎనిమిది రకాతుల తర్వాత నఫిల్ సంకల్పంతో ఎన్ని రకాతులయినా చేసుకోవచ్చని మాత్రం చెప్పగలం. మొత్తానికి అర్థమయ్యేదేమిటంటే దైవప్రవక్త విధానం ప్రకారం తరావీహ్ నమాజు ఎనిమిది రకాతులే. దానికంటే ఎక్కువ లేక తక్కువ రకాతులు దైవప్రవక్త విధానం క్రిందికి రావు. మరిన్ని వివరాల కోసం మౌలానా నజీర్ అహ్మద్ రహ్మానీ గారి 'అన్‌వారుల్ మసాబీహ్' గ్రంథం చూడండి.

8) తరావీహ్ నమాజులో సుదీర్ఘమైన ఖియాం, అంటే చాలాసేపు నిలబడి ఉండటం సంప్రదాయం (మస్నూన్). అదే విధంగా దివ్యఖుర్‌ఆన్ మెల్లగా నిబద్ధతతో ఆగిఆగి పఠించటం కూడా చాలా అవసరం. చాలా మంది ఖారీలు (పారాయణకులు) ఖుర్‌ఆన్‌ను తుఫాను వేగంతో పారాయణం చేస్తారు. వారు చదివేదాంట్లో ఒక్క ముక్క కూడా అర్థం కాదు. ఆ విధంగా ఖుర్‌ఆన్ చదివితే పుణ్యానికి బదులు పాపాన్ని కొనితెచ్చు కున్నట్లు అవుతుంది. ఈ మధ్య ఓ క్రొత్త పోకడ మొదలయ్యింది. కొద్ది రోజుల్లోనే పూర్తి ఖుర్‌అన్ పారాయణాన్ని ముగించేసు కుంటున్నారు. దానికోసం తరావీహ్ నమాజుల్లో ప్రతిరోజూ 8-10 పారాలు అత్యంత వేగంగా పఠించి వినిపించటం జరుగుతోంది. లక్షలాది మంది జనం ఆ నమాజులకు హాజరవుతున్నారు. వారిలో అత్యధికమంది వ్యాపారులే అయివుంటారు. వారు ఈ విధంగా కొన్నిరోజులపాటు ఖుర్‌అన్ విని తాము ఖుర్‌అన్ పారాయణం మొత్తం విన్నామని ఊరట చెందుతారు. ఇక మిగతా రమజాన్ మొత్తం నిశ్చింతగా వ్యాపారం చేసుకోవచ్చనీ, పండగ సీజన్‌ను పూర్తిగా వినియోగించుకోవచ్చనీ తలపోస్తుంటారు. ఖుర్‌అన్ పఠిస్తున్నవాడు సరిగ్గా పఠిస్తున్నాడా? అసలు ఆ విధంగా వాయువేగంతో ఖుర్‌అన్ పఠనం చేయటం ధర్మసమ్మతమేనా? అన్న విషయాలను వారు అస్సలు పట్టించుకోరు. ఈ రోగం నేడు అన్ని ప్రాంతాల్లోనూ వ్యాపిస్తోంది. నిజానికి ఇదొక అనాచారం. ముస్లింలందరూ కలిసికట్టుగా దీన్ని ఖండించాలి. రమజాన్ నెలలో, ఇతర మాసాల్లో ఎల్లప్పుడూ కూడా దివ్యఖుర్‌అన్‌ను దైవప్రవక్త (సఅసం) సూచించిన పద్ధతిలోనే పఠించాలి.



**214 వ అధ్యాయం**

## ٢١٤ - بَابُ فَضْلِ قِيَامِ لَيْلَةِ الْقَدْرِ وَبَيَانِ أَرْجَى لَيَالِيهَا

## లైలతుల్ ఖద్ర్‌లో చేయబడే నమాజు ప్రాశస్త్యం, ఆ రాత్రుల్లో ఏ రాత్రి అత్యంత ఆశావహమైనదనే విషయం గురించి...

قَالَ اللهُ تَعَالَى: ﴿ إِنَّا أَنزَلْنَاهُ فِي لَيْلَةِ الْقَدْرِ ﴾ [القدر: ١] إلى آخر السورة.
وقال تعالى: ﴿ إِنَّا أَنزَلْنَاهُ فِي لَيْلَةٍ مُّبَارَكَةٍ ﴾. الآيات [الدخان: ٣]

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మేము దీన్ని ఘనతగల మహారాత్రిన అవతరింపజేశాం. ఘనతగల ఆ రాత్రి ఏమిటో నీకేం తెలుసు? ఆ మహారాత్రి వేయి నెలల కన్నా ఎంతో శ్రేష్ఠమైనది. ఆ రాత్రి పరిశుద్ధాత్మ, దైవ దూతలు తమ ప్రభువు అనుమతితో ప్రతి వ్యవహారానికి సంబంధించిన ఆజ్ఞలు తీసుకొని అవతరిస్తారు. ఆ రాత్రి అంతా తెల్లవారే వరకు పూర్తిగా శాంతిశ్రేయాలే అవతరిస్తూ ఉంటాయి.' *(అల్‌ఖద్ర్: 1-5)*

"హా.మీమ్. స్పష్టమైన ఈ గ్రంథం సాక్షిగా! మేము దీనిని ఎంతో మేలైన, అత్యంత శుభవంతమైన రాత్రిన అవతరింపజేశాము." *(అద్‌దుఖాన్:1-3)*

### వివరణ

ఘనమైన రాత్రి అన్నా, శుభవంతమైన రాత్రి అన్నా రెండూ ఒక్కటే. లైలతుల్ ఖద్ర్ అని దాని భావం. ఇది రమజాన్ మాసంలో చివరి దశకంలోని బేసి రాత్రుల్లో ఏదో ఒకటి అయి వుంటుంది. ఆ ఘనమైన రేయిలోనే ఖుర్‌ఆన్ అవతరణ ప్రారంభమయింది లేదా సురక్షిత ఫలకం (లౌహె మహ్‌ఫూజ్) నుండి మొదటి ఆకాశంపైనున్న 'బైతుల్‌ఇజ్జత్' పైకి దించబడి ఉంటుంది. ఆ తర్వాత అక్కణ్ణుంచి అవసరాన్నిబట్టి, దైవాభీష్టానికి అనుగుణంగా కొంచెం కొంచెం అవతరిస్తూ ఉండింది. ఖుర్‌ఆన్ అవతరించిన కారణంగానే ఆ రాత్రికి అంతటి ఘనతావిశిష్టతలు లభించాయి.

١١٩٠ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ قَامَ لَيْلَةَ

1190. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే

الْقَدْرِ إيماناً وَاحْتِسَاباً، غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ». مُتفقٌ عليه.

విశ్వాసంతో, పుణ్యం లభించాలన్న ఉద్దేశ్యంతో ఘనమైన రేయిలో నమాజుచేస్తూ నిలబడ్డారో (అంటే దైవా రాధన చేశారో) వారి వెనుకటి పాపా లన్నీ మన్నించబడతాయి.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తరావీహ్ నమాజు ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'ఖామ లైలతన్' అన్న పదం వాడబడింది. ఖామ అనేది 'ఖియామ్' అనే పదం నుండి వచ్చింది. రాత్రిపూట శక్తి మేరకు జాగారం చేసి దైవారాధనలో గడపటం, నఫిల్ నమాజులు చేయటం, గతంలో తమవల్ల జరిగిన పాపాలపై పశ్చాత్తాపభావంతో కుమిలిపోవటం, మన్నింపు ప్రార్థనలు చేసుకోవటం, ముఖ్యంగా ఇషా మరియు ఫజ్ర్ నమాజులను సామూహికంగా నెరవేర్చటం ఇవన్నీ **ఖియాముల్లైల్** క్రిందికే వస్తాయి.

١١٩١ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رِجَالاً مِنْ أَصْحَابِ النَّبِيِّ ﷺ، أُرُوا لَيْلَةَ القَدْرِ فِي المَنَامِ فِي السَّبْعِ الأَوَاخِرِ، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَرَى رُؤْيَاكُمْ قَدْ تَوَاطَأَتْ فِي السَّبْعِ الأَوَاخِرِ، فَمَنْ كَانَ مُتَحَرِّيهَا، فَلْيَتَحَرَّهَا فِي السَّبْعِ الأَوَاخِرِ» مُتفقٌ عليه.

1191. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త సహచరుల్లో కొందరికి కలలో, ఘనమైన రేయి చివరి ఏడు రాత్రుల్లో(ఉన్నట్లు) చూపిం చబడింది. (ఈ విషయం తెలుసుకొని) దైవప్రవక్త (సల్లం) తన సహచరుల్ని ఉద్దేశ్యించి, "చివరి ఏడు రాత్రుల విషయంలో మీ అందరికీ ఒకే రకమైన కల వచ్చినట్లుంది. కనుక మీలో ఘనమైన రేయిని అన్వేషించదలచు కున్నవారు చివరి ఏడు రాత్రుల్లో దాన్ని అన్వేషించాలి"అని అన్నారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని లైలతుల్ ఖద్ర్ ప్రాశస్త్య ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మూలంలో 'తవాతఅ' అనే పదం వాడబడింది. తవాతఅ అనే పదానికి త్రొక్కటం, తన మిత్రుడు కాలు పెట్టిన చోట తను కాలుపెట్టడం అనే అర్థాలున్నాయి. ఇక్కడ ఇది 'ఒకదానినొకటి పోలి ఉన్నాయి' అనే అర్థంలో ఉపయోగించబడింది. సహచరులందరూ ఒకే రకమైన కల చూశారన్నది దాని భావం. వారందరికీ ఘనమైన రేయి, మాసపు చివరి ఏడు రాత్రుల్లో ఉన్నట్లు కనిపించింది. అందుకే దైవప్రవక్త (సల్లం) తన సహచరుల కలలను బట్టి ఆ ఘనమైన రేయిని ఆ మాసపు చివరి ఏడురాత్రుల్లోనే అన్వేషించమని ఆదేశించారు. ప్రజలు వీలైనంత ఎక్కువగా రాత్రుల్లో దైవారాధన చేస్తారన్న ఉద్దేశ్యంతోనే ఆ రాత్రిని అస్పష్టంగా ఉంచటం జరిగింది.

١١٩٢ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كانَ رَسُولُ اللهِ ﷺ يُجَاوِرُ فِي العَشْرِ الأَوَاخِرِ مِنَ رَمَضَانِ، وَيَقُول: «تَحَرَّوْا لَيْلَةَ القَدْرِ فِي العَشْرِ الأَوَاخِرِ مِنْ رَمَضَانَ» مُتفقٌ عليهِ.

1192. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) రమజాన్ మాసపు చివరి దశకంలో ఏతెకాఫ్ కోసం కూర్చునేవారు. (దీని గురించి చెబుతూ) ఆయన, "ఘనమైన రేయిని మీరు రమజాన్ మాసపు చివరి దశకంలో అన్వేషించండి" అని ఉపదేశించేవారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని లైలతుల్ ఖద్ర్ ప్రాశస్త్య ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

١١٩٣ ـ وَعَنْهَا، رَضِيَ اللهُ عَنْهَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ، قَالَ: «تَحَرَّوْا لَيْلَةَ القَدْرِ فِي الوِتْرِ مِنَ العَشْرِ الأَوَاخِرِ مِنْ رَمَضَانَ» رواهُ البخاريُّ.

1193. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉపదేశించారు: ఘనమైన రేయిని మీరు రమజాన్ మాసపు చివరి దశకంలోని బేసి రాత్రుల్లో అన్వేషించండి. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని లైలతుల్ ఖద్ర్ ప్రాశస్త్య ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

రమజాన్ మాసపు చివరి దశకంలోని ఐదు బేసి తేదీలైన 21,23,25,27,29వ రాత్రుల్లో ఏదో ఒకటి ఘనమైన రేయి కావచ్చని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ప్రజలు రాత్రిళ్ళు వీలైనంత ఎక్కువగా దైవారాధనలో గడపాలన్న ఉద్దేశ్యంతో ఆ తేదీని అస్పష్టంగానే ఉంచటం

జరిగింది. ఒకవేళ అది గనక నిర్ణయించబడినట్లయితే ప్రజలు ఆ ఒక్కరోజు ఆరాధనతోనే సరిపెట్టుకునేవారు. అయినప్పటికీ కొంతమంది పండితులు ఆ రాత్రి నిర్ణీతంగా 27వ తేదీ రాత్రి కావచ్చునని అభిప్రాయపడుతున్నారు. కాని ఈ అభిప్రాయం సరయినది కాదు. ఆ విధంగా ప్రత్యేకంగా ఒక రాత్రిని నిర్ణయించడాన్ని హదీసులు సమర్ధించటం లేదు.

١١٩٤ - وَعَنْهَا، رَضِيَ اللهُ عَنْهَا، قَالَتْ: كَانَ رَسُولُ اللهِ ﷺ إذا دَخَلَ العَشْرُ الأَوَاخِرُ مِنْ رَمَضَانَ، أَحْيا اللَّيْلَ، وَأَيقَظَ أَهْلَهُ، وَجَدَّ وَشَدَّ المِئزرَ. مُتفقٌ عليهِ.

1194. హజ్రత్ అయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: రమజాన్ మాసపు చివరి దశకం రాగానే దైవప్రవక్త (సల్లం) రాత్రిళ్లు జాగారం చేసేవారు. తమ ఇంటివారిని కూడా మేల్కొలిపేవారు. నడుం బిగించి బాగా, ముమ్మరంగా ఆరాధన చేసేవారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని లైలతుల్ ఖద్ర్ ప్రాశస్త్య ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఏతెకాఫ్ ప్రకరణం)*

١١٩٥ - وَعَنْهَا قَالَتْ: كَانَ رَسُولُ اللهِ ﷺ، يَجتَهِدُ في رَمضانَ مَا لا يَجْتَهِدُ في غَيْرِهِ، وفي العَشْرِ الأَوَاخِرِ منه، مَا لا يَجتَهِدُ في غَيْرِهِ. رواهُ مُسلمٌ.

1195. ఆవిడగారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) దైవారాధనల్లో రమజాన్ మాసంలో శ్రమించినంతగా మరే ఇతర మాసంలోనూ శ్రమించేవారు కారు. అలాగే రమజాన్ మాసపు చివరి దశకంలో శ్రమించినంతగా ఇతర దినాల్లో శ్రమించేవారు కారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఏతెకాఫ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇతర మాసాలన్నిటికన్నా రమజాన్ మాసంలో, అందులోనూ రమజాన్ మాసంలోని తొలి రెండు దశకాల కన్నా చివరి దశకంలో వీలైనంత ఎక్కువ దైవారాధనలో, దైవాజ్ఞాపాలనలో నిమగ్నులై ఉండాలి. ఘనమైన రేయిని పొందటానికి చివరి దశకపు రాత్రుల్లో జాగారం చేసి ప్రార్థనల్లో, ఆరాధనల్లో గడపాలి. తమ ఇంటివారిని కూడా మేల్కొలిపి దైవారాధన చేయమని ప్రబోధించాలి. చివరి దశకంలో ఏతెకాఫ్ పాటిస్తే ఇంకా మంచిది. ఇంతకు ముందు హదీసులో 'దైవప్రవక్త (సల్లం) ఆరాధన కోసం నడుం బిగించేవారు' అని చెప్పబడింది. కొంతమంది

పండితులు దానికి ఆయన సమధికోత్సాహంతో ఆరాధనలు చేసేవారని వ్యాఖ్యానించారు. మరికొంతమంది ఆయా రోజుల్లో భార్యలతో సంభోగ సంబంధాలకు దూరంగా ఉండేవారని వివరించారు.

١١٩٦ ـ وَعَنْهَا قَالَتْ: قُلْتُ: يا رَسُولَ اللهِ! أَرَأَيْتَ إِنْ عَلِمْتُ أيُّ لَيْلَةٍ لَيْلَةُ القَدْرِ مَا أَقُولُ فيها؟ قَالَ: «قُولي: اللَّهُمَّ إِنَّكَ عَفُوٌّ تُحِبُّ العَفْوَ فاعْفُ عَنِّي» رواهُ التِّرْمِذِيُّ وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

1196. ఆవిడగారే చేసిన ఇంకొక కథనం: నేనాయన్ని "దైవప్రవక్తా! నేనొక వేళ ఘనమైన రేయి ఏదో కనుగొంటే ఆ రాత్రి నేను ఏమని ప్రార్థించాలో కాస్త చెబుతారా?" అని అడిగాను. అందుకాయన ఈ విధంగా ప్రార్థించమని ఉపదేశించారు: "**అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్వ ఫాఫు అన్నీ** (అల్లాహ్! నీవు అమితంగా మన్నించేవాడవు. మన్నింపును ఇష్టపడతావు. కనుక నన్ను మన్నించు)."

(తిర్మిజీ- హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని ప్రార్థనలు, దైవధ్యాన ప్రకరణం)

## ముఖ్యాంశాలు

లైలతుల్ ఖద్ర్ (ఘనమైన రేయి)కి సంబంధించి స్పష్టమైన చిహ్నాలేవీ హదీసుల్లో పేర్కొనబడలేదు. అయితే పూర్వీకుల్లోని కొంతమంది పండితులు తమ అనుభవాలను పురస్కరించుకొని ఇలా వివరించారు: ఆ రోజు రాత్రి అత్యధిక సంఖ్యలో దైవదూతలు భువిపైకి దిగిరావటం మూలంగా ఆ రాత్రి ఓ ప్రత్యేకమైన ప్రశాంత వాతావరణం నెలకొంటుంది. హృదయాలు నెమ్మదిస్తాయి. ఆ రాత్రి మరీ అంత చల్లగా గాకుండా, మరీ ఉక్కపోయ కుండా మధ్యస్థంగా ఉంటుంది. మరుసటి దినం ఎండలో తీవ్రత ఉండదు. ఏది ఏమైనా ఆ రాత్రిని పొందినవారు దేవుని క్షమాగుణాన్ని ఆధారంగా చేసుకొని ప్రార్థిస్తే, ఆయన తప్పకుండా క్షమిస్తాడు.



215వ అధ్యాయం

## ٢١٥ - بَابُ فَضْلِ السِّوَاكِ وَخِصَالِ الْفِطْرَةِ

## మిస్వాక్ ఘనత, మానవ సహజమైన ఆచరణల గురించి

١١٩٧ - عَنْ أبي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَوْلا أَنْ أَشُقَّ عَلَى أُمَّتِي - أَوْ عَلَى النَّاسِ - لأَمَرْتُهُم بِالسِّوَاكِ مَعَ كُلِّ صَلاةٍ» مُتفقٌ عليه.

1197. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నా అనుచర సమాజం (లేక) ప్రజలు ఇబ్బందికి లోనవుతారనే భయం గనక నాకు లేకపోయినట్లయితే నేను వారిని ప్రతి నమాజు సమయంలోనూ మిస్వాక్ చేయాలని ఆదేశించి ఉండేవాణ్ణి.
(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ప్రతి నమాజు వేళ మిస్వాక్ చేసుకోవటాన్ని దైవప్రవక్త (సల్లం) ఎంతగానో యిష్టపడేవారు. అయినప్పటికీ ఆయన తన అనుచర సమాజం ఇబ్బందిలో పడిపోతుందేమోనన్న భయంతో దాన్ని అనివార్యం (వాజిబ్)గా ఖరారు చేయలేదు. దీనిద్వారా తెలిసేదేమంటే మిస్వాక్ చేయటం (పల్లు తోముకోవటం) ఎంతో అభిలషణీయమైన కార్యం. అంచేత ప్రతి ముస్లిం ఎక్కువగా మిస్వాక్ చేయటాన్ని అలవరచుకోవాలి. వీలైతే ప్రతి నమాజుకు ముందు తప్పకుండా మిస్వాక్ చేయాలి.

١١٩٨ - وَعَنْ حُذَيفَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ، إذا قَامَ مِنَ النَّومِ يَشُوصُ فَاهُ بالسِّوَاكِ. متفقٌ عليه.
«الشَّوْصُ»: الدَّلْكُ.

1198. హజ్రత్ హుజైఫా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నిద్ర నుండి మేల్కొన్నప్పుడు పనుదోముపుల్లతో నోటిని బాగా తోమి శుభ్రం చేసుకునే వారు. (బుఖారీ-ముస్లిం)

1199. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: మేము దైవప్రవక్త (సల్లం) కోసం పనుదోము పుల్ల, వుజూ నీళ్ళు సిద్ధపరచి ఉంచేవాళ్ళం. దేవుడు ఆయన్ని నిద్ర లేపదలచినప్పుడు ఆయన నిద్రలేచి పల్లుతోముకొని, వుజూ చేసి నమాజ్ ఆచరించేవారు. (ముస్లిం)

١١٩٩ ـ وَعَنْ عَائشةَ رَضيَ اللهُ عَنْهَا قَالَتْ: كنَّا نُعِدُّ لِرَسُولِ اللهِ ﷺ، سِوَاكَهُ وَطَهُورَهُ، فَيَبْعَثُه اللهُ ما شَاءَ أن يَبْعَثَهُ مِنَ اللَّيْلِ، فَيتَسَوَّكُ، وَيَتَوَضَّأُ وَيُصَلِّي. رَوَاهُ مُسلمٌ.

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

1200. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నేను మీకు మిస్వాక్ చేయమని (పల్లుతోము కోమని) చాలా తాకీదు చేశాను. (బుఖారీ)

١٢٠٠ ـ وعَنْ أنسٍ، رَضيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أكثَرْتُ عليكم في السِّوَاكِ» رواهُ البُخاريُّ.

(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం)

1201. హజ్రత్ షురైహ్ బిన్ హానీ (రజి) కథనం: నేను హజ్రత్ ఆయిషా (రజిఅన్హా) ను అడిగాను, "దైవప్రవక్త (సల్లం) ఇంటికి వస్తే ముందుగా ఏ పని చేస్తారు?" అని. అందుకామె "పల్లు తోముకుంటారు" అని చెప్పారు. (ముస్లిం)

١٢٠١ ـ وَعَنْ شُرَيح بن هانِيءٍ قالَ: قُلْتُ لِعَائِشَةَ، رَضيَ اللهُ عَنْهَا: بِأَيِّ شيءٍ كانَ يَبْدَأُ النَّبيُّ ﷺ إذا دَخلَ بَيْتَهُ؟ قَالَتْ: بِالسِّوَاكِ، رَوَاهُ مُسْلِمٌ.

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

1202. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళినప్పుడు చూశాను. ఆ సమయంలో ఆయన పనుదోముపుల్ల

١٢٠٢ ـ وَعَنْ أَبي مُوسَى الأَشعَرِيِّ، رَضيَ اللهُ عَنْهُ قَالَ: دَخلتُ

عَلى النَّبِيِّ ﷺ، وَطَرفُ السِّوَاكِ على لِسانِهِ. مُتَّفَقٌ عليه، وهذا لَفْظُ مُسلِم.

కొన, ఆయన నాలుక మీద ఉంది. (బుఖారీ-ముస్లిం, వాక్యాలు ముస్లిం లోనివి)

(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

١٢٠٣ - وَعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنها، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «السِّوَاكُ مَطهَرَةٌ للفَمِ مَرْضاةٌ للرَّبِّ» رَوَاهُ النَّسائِيُّ، وابنُ خُزيمَةَ في صَحيحِهِ بأسانيدَ صحيحةٍ.

1203. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మిస్వాక్ ద్వారా నోరు శుభ్రమవుతుంది. దైవప్రసన్నత లభిస్తుంది. (నసాయి, ఇబ్నె ఖుజైమా దీనిని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు)

(సుననె నసాయిలోని శుచీశుభ్రతల ప్రకరణం - సహీహ్ ఇబ్నె ఖుజైమా, సహీహ్ బుఖారీలోని - ఉపవాస ప్రకరణం)

١٢٠٤ - وَعَنْ أبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «الفِطرَةُ خَمسٌ - أَوْ: خَمسٌ مِنَ الفِطرَةِ -: الخِتان، وَالاستِحْدَادُ، وتَقليمُ الأظفَارِ، وَنَتفُ الإبطِ، وَقَصُّ الشَّارِبِ» مُتفقٌ عليهِ. الاستِحدَادُ: حَلْقُ العَانَةِ، وَهُوَ حَلقُ الشعرِ الذي حَوْلَ الفرجِ.

1204. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: (మానవ) సహజమైన విషయాలు ఐదున్నాయి లేక ఐదు విషయాలు (మానవ) సహజమైనవి. 1) ఖత్నా (వడుగు) చేయించుకోవడం, 2) నాభి క్రింద వెంట్రుకలు తీసివేయటం, 3) గోళ్లు కత్తిరించుకోవటం 4) చంకలోని వెంట్రుకలు తొలగించుకోవటం, 5) మీసాలు కత్తిరించుకోవటం.

(బుఖారీ, ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పై హదీసు మూలంలో **'ఫిత్‌రత్'** అనే పదం ఉపయోగించబడింది. నిఘంటువులో **'ఫిత్‌రత్'** అనే పదానికి నవీన, కల్పన, అంతకు ముందు లేని వస్తువును వినూత్నంగా పుట్టించటం అనే అర్థాలున్నాయి. అయితే ఇక్కడ ఈ పదం మనిషికి పుట్టుకతో అబ్బే అలవాటును, స్వభావాన్ని సూచిస్తోంది. కొంతమంది పండితులు దీని గురించి వ్యాఖ్యానిస్తూ, "దైవప్రవక్తలందరూ ఆదరించిన, పురాతన షరీఅత్‌లన్నిటిలోనూ ఉమ్మడిగా ఉన్న విధానాన్ని ఫిత్‌రత్ అంటార"ని చెప్పారు. ఫిత్‌రత్ విధానం అనేది మానవునికి సహజంగానే అబ్బుతుంది. అంచేత పైన పేర్కొన బడిన ఐదు విషయాలను మనిషి తన సహజమైన అలవాట్ల మాదిరిగా ఆచరించాలన్నదే ఈ హదీసు ముఖ్యోద్దేశం.

١٢٠٥ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «عَشْرٌ مِنَ الفِطرَةِ: قَصُّ الشَّارِبِ، وَإِعْفَاءُ اللِّحْيَةِ، وَالسِّوَاكُ، وَاسْتِنْشَاقُ المَاءِ، وَقَصُّ الأَظْفَارِ، وغَسْلُ البَرَاجِمِ، وَنَتْفُ الإِبطِ، وَحَلْقُ العَانَةِ، وانتِقَاصُ المَاءِ» قَالَ الرَّاوِي: وَنَسِيتُ العَاشِرَةَ إِلَّا أَن تَكُونَ المَضمَضَةَ؛ قَالَ وَكِيعٌ ـ وَهُوَ أَحَدُ رُوَاتِهِ ـ: انتِقَاصُ المَاءِ؛ يَعْنِي: الاسْتِنْجَاءَ. رَوَاهُ مُسلِمٌ. «البَرَاجِمُ» بالباءِ الموحدةِ والجيمِ، وهِيَ: عُقَدُ الأَصَابِعِ، وَ«إِعْفَاءُ اللِّحْيَةِ» مَعْنَاهُ: لا يَقُصُّ مِنْهَا شَيئاً.

1205. హజ్రత్ ఆయిషా (రజిఅన్‌హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పది విషయాలు మానవ సహజమైనవి. 1) మీసాలు కత్తిరించటం, 2) గడ్డం పెంచటం, 3) పల్లు తోముకోవటం 4) ముక్కుని నీటితో శుభ్రం చేసుకోవటం 5) గోళ్లు కత్తిరించుకోవటం 6) వ్రేళ్ళ మధ్య భాగాన్ని కడుక్కోవటం 7) చంక లోని వెంట్రుకల్ని తొలగించటం, 8) నాభి క్రింద వెంట్రుకల్ని తీసి వేయటం, 9) మూత్రశుద్ధి చేసుకోవటం - ఆ తర్వాత ఉల్లేఖకుడు ఇలా అంటున్నాడు- 'పదో విషయం నేను మర్చిపోయాను. బహుశా అది పుక్కిలించటం కావచ్చని నా అభిప్రాయం'.

ఈ హదీసు ఉల్లేఖకుల్లో ఒకరైన హజ్రత్ వకీ (రహ్మాలై) దీనిని వివరిస్తూ, 'ఇన్‌తిఖాసుల్-మాయి' అంటే మూత్ర శుద్ధి అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఈ హదీసులో పది మానవ సహజమైన కార్యాలు పేర్కొనబడ్డాయి. అయితే పదవ విషయమేదో ఇతమిత్థంగా తెలియలేదు. కొంతమంది విద్వాంసులు పదవ విషయం ఖత్నా (వడుగు) చేయించుకోవటం అని అభిప్రాయపడ్డారు. ఏది ఏమైనా ఈ హదీసు ద్వారా ఆ పది విషయాల ప్రాముఖ్యత వెల్లడౌతోంది. వాటిని మానవులు తప్పకుండా నెరవేర్చాలని ఇందులో తాకీదు చేయబడింది. వాటిలో మొదటిది, మీసాలు కత్తిరించుకోవటం. మీసాల్ని పెదవులపైకి పెరగనీయకుండా కత్తిరించుకోవటం సంప్రదాయం. పెద్దపెద్ద మీసాలుంచుకోవటం ఇస్లాంలో అవాంఛనీయంగా పరిగణించ బడుతుంది.

2) ఇక గడ్డం విషయానికొస్తే, మనిషి తప్పనిసరిగా గడ్డం ఉంచాలన్నది అత్యధికమంది పండితుల అభిప్రాయం. ఎంత పెంచాలన్న విషయంలో నిర్ణీత హద్దంటూ ఏమీ లేదు. కొంతమంది పండితులు హజ్రత్ ఉమర్ (రజి) సంఘటనను నిదర్శనంగా తీసుకొని కనీసం ఓ పిడికెడంత గడ్డాన్ని పెంచాలనీ, అంతకంటే ఎక్కువ పరిమాణంలో ఉండే వెంట్రుకల్ని కత్తిరించుకోవచ్చని తలపోస్తున్నారు. అలాగే ఇంకో బలహీనమైన హదీసు ఉంది. దాన్ని ఆధారంగా చేసుకొని గడ్డాన్ని క్రింది నుంచి, ప్రక్కల నుంచి కత్తిరించుకొని సరిచేసుకోవచ్చని అంటున్నారు. కాని ప్రామాణికమైన హదీసుల దృష్ట్యా ఈ విధానం సరియైనది కాదు. బుఖారీ-ముస్లింలోని హదీసుల ప్రకారం దైవప్రవక్త (సల్లం) దీనికోసం ఐదు పదాలు ఉపయోగించారు. **ఈఫూ, ఔఫూ, అర్ఖూ, ఉర్జూ, వఫ్ఫిరూ**. ఈ ఐదు పదాలు గడ్డాన్ని దాని స్థితికి వదిలేయాలనే అర్థాన్ని సూచిస్తున్నాయి. కనుక గత్యంతరం లేని సందర్భాల్లో తప్ప మిగతా పరిస్థితుల్లో ప్రతి ఒక్కరూ గడ్డాన్ని పూర్తిగా పెంచాలి.

3) శుచీశుభ్రతల దృష్ట్యా గోళ్లను కత్తిరించుకోవటం కూడా చాలా అవసరం. లేకపోతే గోళ్ల సందుల్లో పేరుకుపోయి ఉండే మట్టి మనం తినే ఆహారం ద్వారా కడుపులోకి పోయే ప్రమాదముంది. ఈ రోజుల్లో స్త్రీలు ఫ్యాషన్ పేరిట పెద్దపెద్ద గోళ్లు పెంచుతున్నారు. ఈ విషయంలో పురుషులు కూడా, తాము మాత్రం తక్కువ తిన్నామా అన్నట్లు వ్యవహ రిస్తున్నారు. అయితే వాస్తవానికది సహజత్వానికి విరుద్ధమైన చేష్ట. అత్యంత హేయమైన పాశవిక చర్య. ఈ విషయాన్ని అందరూ గ్రహించాలి.

4) చంకల్లో, నాభి క్రింద ఉండే వెంట్రుకల్ని తరచూ తొలగిస్తూ ఉండాలి. ఈ విషయంలో అలసత్వం చేయటం మంచిది కాదు. ఒక హదీసు ప్రకారం నలభై రోజులకన్నా ఎక్కువ అలసత్వం చేయటం అత్యంత అయిష్టకరంగా పరిగణించబడుతుంది.

5) పరిశుద్ధతను పొందటానికి మూత్రశుద్ధి చేసుకోవటం చాలా అవసరం. అదీగాక పరిశుద్ధత

లేనిదే నమాజ్‌లాంటి ఆరాధనలు ఆమోదించబడవు. మూత్రశుద్ధి మట్టి పెళ్లలతో కూడా చేసుకోవచ్చు. అయితే దానికోసం 3, 5, 7- ఈ విధంగా బేసి సంఖ్యలో మట్టి పెళ్లలు ఉపయోగించి ఆ తర్వాత నీళ్ళతో శుభ్రం చేసుకుంటే చాలా మంచిది. అలా కాకుండా కేవలం నీళ్లతో శుభ్రం చేసుకున్నా సరిపోతుంది.

6) ఖత్నా (వడుగు) చేయించటం కూడా ఓ ప్రాచీన సంప్రదాయం. అత్యధిక మంది విద్వాంసుల దృష్టిలో ఖత్నా (వడుగు) చేయించటం తప్పనిసరి. కొంతమంది పండితులు పిల్లవాడు పుట్టిన ఏడోరోజున ఖత్నా చేయించటం ఉత్తమమని అభిప్రాయపడుతున్నారు. అయితే ఏడోరోజున వీలుకాకపోతే ఆ తర్వాత కూడా చేయించవచ్చు.

١٢٠٦ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ، قَالَ: «أَحْفُوا الشَّوارِبَ وأَعْفوا اللِّحَى» مُتفقٌ عليه.

1206. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీసాలు కత్తిరించండి. గడ్డం పెంచండి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*



## 216 వ అధ్యాయం

## ٢١٦ - بَابُ تَأْكِيدِ وُجُوبِ الزَّكَاةِ وَبَيَانِ فَضْلِهَا وَمَا يَتَعَلَّقُ بِهَا

## జకాత్ విధింపు విషయమై తాకీదు, జకాత్ ఘనత ఇంకా దానికి సంబంధించిన ఇతర విషయాలు

قَالَ اللهُ تَعَالَى: ﴿وَأَقِيمُوا الصَّلَوٰةَ وَءَاتُوا الزَّكَوٰةَ﴾ [البقرة: ٤٣]. وقَالَ تَعَالَى: ﴿وَمَا أُمِرُوا إِلَّا لِيَعْبُدُوا اللَّهَ مُخْلِصِينَ لَهُ الدِّينَ حُنَفَاءَ وَيُقِيمُوا الصَّلَوٰةَ وَيُؤْتُوا الزَّكَوٰةَ وَذَٰلِكَ دِينُ الْقَيِّمَةِ﴾ [البينة: ٥]. وقَالَ تَعَالَى: ﴿خُذْ مِنْ أَمْوَٰلِهِمْ صَدَقَةً تُطَهِّرُهُمْ وَتُزَكِّيهِم بِهَا﴾ [التوبة: ١٠٣].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

నమాజును స్థాపించండి. జకాత్ ఇవ్వండి.
*(అల్‌బఖర: 43)*

అల్లాహ్‌కు దాస్యం చేయాలనీ, పూర్తి ఏకాగ్రతతో తమ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలనీ, నమాజును స్థాపించాలనీ జకాత్ ఇస్తూ ఉండాలని మాత్రమే వారికి ఆదేశించటం జరిగింది. ఇదే తిన్నని ధర్మం.
*(అల్ బయ్యినహ్: 5)*

(ప్రవక్తా!) వారి సంపద నుండి దానం స్వీకరించి తద్వారా వారిని పరిశుద్ధ పరచు. వారిని తీర్చి దిద్దు. *(తౌబా : 103)*

### ముఖ్యాంశాలు

జకాత్‌కు- నమాజ్‌కు మధ్య అవినాభావ సంబంధముంది. అందుకే దివ్యఖుర్ఆన్‌లో చాలా చోట్ల ఈ రెండు విషయాలనూ కలిపి ప్రస్తావించటం జరిగింది. రెండో విషయం ఏమిటంటే జకాత్ మనిషి సంపదను, అతని నీతి నడవడికల్ని పునీతం చేస్తుంది.

١٢٠٧ ـ وَعَنِ ابنِ عُمَرَ، رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ رَسُولَ اللهِ، ﷺ قَالَ: «بُنِيَ الإِسلامُ عَلَى خَمْسٍ: شَهَادَةِ أَنْ لا إلهَ إلَّا اللهُ، وَأَنَّ مُحَمَّداً عَبْدُهُ وَرَسُولُهُ، وَإِقَام

1207. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఇస్లాం ధర్మం ఐదు విషయాలపై ఆధారపడి ఉంది. 1) అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు

الصَّلَاةِ، وَإِيتَاءِ الزَّكَاةِ، وَحَجِّ الْبَيْتِ، وَصَوْمِ رَمَضَانَ» متفقٌ عليه.

లేడనీ, ముహమ్మద్ (సల్లం) దేవుని దాసుడు మరియు ఆయన సందేశ హరులన్న విషయాన్ని ధృవీకరించటం, 2) నమాజ్‌ను స్థాపించటం, 3) జకాత్ (విధిదానం) చెల్లించటం, 4) (స్తోమత ఉంటే) దైవగృహ (కాబా) యాత్ర చేయటం, 5)రమజాన్ ఉపవాసాలు పాటించటం. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు 'ఫర్జ్ నమాజుల్ని క్రమం తప్పకుండా పాటించాలి' అన్న అధ్యాయంలో కూడా వచ్చింది. ఇస్లామీయ ప్రధాన విధుల్లో జకాత్ కూడా ఒకటన్న విషయాన్ని బోధపరచటానికి ఈ హదీసును తిరిగి ఇక్కడ కూడా ప్రస్తావించటం జరిగింది. ఎవరి దగ్గరయినా తమ అవసరాలకు మించి యాభై రెండున్నర తులాల వెండిగాని లేదా దానికి సమానమైన డబ్బుగాని ఉండి దాని మీద ఒక సంవత్సర కాలం గడిస్తే అందులో నుంచి బీదలకు జకాత్ చెల్లించటం విధి. అదే విధంగా ఎవరిదగ్గరయినా ఏడున్నర తులాల బంగారం గాని లేదా దానికి సమానమైన నగదుగాని ఉంటే వారు కూడా జకాత్ చెల్లించాలి. మొత్తం సంపదలో రెండున్నర శాతం జకాత్ చెల్లించవలసి ఉంటుంది.

١٢٠٨ ـ وَعَنْ طَلْحَةَ بنِ عُبَيْدِ الله، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: جَاءَ رَجُلٌ إلى رَسُولِ اللهِ ﷺ، مِنْ أَهْلِ نَجْدٍ ثَائِرُ الرَّأسِ

1208. హజ్రత్ తల్హా బిన్ ఉబైదుల్లాహ్ (రజి)కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి నజ్ద్ ప్రాంతానికి చెందిన ఒక వ్యక్తి వచ్చాడు. అతని తల వెంట్రుకలు చిందరవొందరగా ఉన్నాయి. ముందుగా మాకు అతని మాటలు అర్థంకాలేదు. అతని మాటల తాలూకు శబ్దం మాత్రం మాకు వినపడసాగింది. దగ్గరికొచ్చిన తర్వాత అర్థమయింది అతను దైవప్రవక్త (సల్లం)ను ఇస్లాం ధర్మం గురించి అడుగుతున్నాడని.

نَسْمَعُ دَوِيَّ صَوْتِهِ، وَلَا نَفْقَهُ ما يَقُول، حَتى دَنَا مِنْ رَسُولِ اللهِ ﷺ، فإذا هُوَ يَسْأَلُ عَنِ الإِسْلام، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «خَمْسُ صَلَوَاتٍ في الْيَوم وَاللَّيْلَةِ» قالَ: هَلْ عَلَيَّ غَيْرُهُنَّ؟ قَالَ: «لا، إلَّا أنْ تَطَوَّعَ» فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «وَصِيَامُ شَهرِ رَمَضَانَ» قَالَ: هَلْ عَلَيَّ غيره؟ قَالَ: «لَا، إِلَّا أَنْ تَطَوَّع». قَالَ: وَذَكَرَ لَهُ رَسُولُ اللهِ ﷺ الزَّكَاةَ فَقَالَ: هَلْ عَلَيَّ غَيْرُهَا؟ قَالَ: «لا ، إلَّا أنْ تَطَوَّعَ» فَأَدْبَرَ الرَّجل وَهُوَ يَقُولُ: وَاللهِ لاأَزِيدُ على هٰذا وَلَاأَنْقُصُ مِنْهُ؛ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَفْلَحَ إنْ صَدَقَ» مُتفقٌ عليهِ.

దైవప్రవక్త (సల్లం) అతని ప్రశ్నకు, సమాధానమిస్తూ, "(ఇస్లాం ప్రకారం) రేయింబవళ్లలో ఐదు నమాజులు చేయాలి" అని అన్నారు. "అవిగాక ఇతర నమాజులేవయినా నేను చేయ వలసి ఉంటుందా?" అని అడిగాడా వ్యక్తి. "(విధిగా చేయనవసరం) లేదు. ఒకవేళ నువ్వు స్వచ్ఛందంగా చేయ దలచుకుంటే (ఎన్ని నమాజులయినా చేసుకోవచ్చు). పోతే రమజాన్ మాసంలో (విధిగా) ఉపవాసం పాటిం చవలసి ఉంటుంది" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). "రమజాన్ ఉప వాసాలు గాక ఇతర ఉపవాసా లేవయినా నేను పాటించ వలసి ఉంటుందా?" అని ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు. "(విధిగా అయితే పాటించ నవసరం) లేదు. ఒకవేళ స్వచ్ఛందంగా పాటించదలచుకుంటే అది నీ యిష్టం" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం).

అదే విధంగా ఆయన ఆ వ్యక్తికి జకాత్ గురించి కూడా వివరించారు. అప్పుడు కూడా అతను "అదనంగా మరే మయినా చెల్లించవలసి ఉంటుందా?" అని అడిగాడు. దానికీ సమాధానమిస్తూ ఆయన "(విధిగానయితే చెల్లించన వసరం) లేదు. ఒకవేళ స్వచ్ఛందంగా ఏదయినా దానం చేస్తే అది వేరే విషయం" అని విశదీకరించారు.

ఆ తర్వాత ఆ వ్యక్తి, "దైవసాక్షి! ఇక ఇందులో నేను ఏ విషయాన్నీ చేర్చను. ఇందులో దేన్నీ తగ్గించను కూడా" అనుకుంటూ తిరిగి వెళ్ళిపోసాగాడు. అతని మాటలు విని దైవప్రవక్త (సల్లం), "ఇతను గనక నిజంగా తన మాటల్ని ఆచరణలో పెడితే తప్ప కుండా సాఫల్యం పొందుతాడు" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ-సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణాలు)

١٢٠٩ - وَعَنِ ابْنِ عَبَّاسٍ، رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ النَّبِيَّ ﷺ بَعَثَ مُعَاذًا رَضِيَ اللهُ عَنْهُ، إلى اليَمَنِ فَقَالَ: «ادْعُهُمْ إلى شَهَادَةِ أَنْ لا إلهَ إلَّا اللهُ وَأَنِّي رَسُولُ اللهِ، فإنْ هُمْ أطَاعُوا لِذلكَ فَأَعلِمْهُم أَنَّ اللهَ تَعَالَى افتَرَضَ عَليهِمْ خَمسَ صَلواتٍ في كُلِّ يَوْمٍ وَلَيلَةٍ، فَإنْ هُمْ أطَاعُوا لِذلكَ فَأَعْلِمْهُمْ أَنَّ اللهَ افتَرَضَ عَلَيهِم صَدَقَةً تُؤخَذُ مِنْ أَغْنِيَائِهِمْ، وَتُرَدُّ عَلى فُقَرائهِم» مُتَّفَقٌ عليهِ.

1209. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ముఆజ్ (రజి)ని యమన్ వైపుకు పంపిస్తూ ఆయనకు ఈ విధంగా హితోపదేశం చేశారు: (ఓ ముఆజ్!) (ముందుగా) నువ్వు వారిని అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు, నేను (ముహమ్మద్-సల్లం) దైవప్రవక్త అని సాక్ష్యం పలికేందుకు ఆహ్వానించు. వారు గనక నీ మాట వింటే, అప్పుడు దేవుడు రేయింబవళ్లలో వారిపై ఐదుపూటల నమాజులు విధిగా చేశాడని వారికి చెప్పు. దానికీ వారు ఒప్పుకుంటే దేవుడు వారిపై జకాత్ దానాన్ని విధిగా చేశాడనీ, అది వారి ధనవంతుల నుండి వసూలు చేయబడి వారిలోని బీదవారికి పంచ బడుతుందని తెలియజెయ్యి. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు "ఫర్జ్ నమాజులను తప్పకుండా పాటించాలి" అన్న అధ్యాయం క్రింద వచ్చింది. ఇక్కడ జకాత్ ప్రాముఖ్యతను వివరించటానికి తిరిగి దీనిని ఈ అధ్యాయం క్రింద కూడా పొందుపరచటం జరిగింది. ఈ హదీసు ద్వారా బోధపడేదేమంటే, జకాత్ ఒక ప్రదేశంలోని ధనవంతుల నుండి వసూలు చేయబడి తిరిగి అదే ప్రదేశంలోని నిరుపేదలు, అభాగ్యుల మధ్య పంపిణీ చేయబడుతుంది. ఒకవేళ ఆ ప్రదేశంలోని నిరుపేదల మధ్య పంపిణీ జరిగిన తర్వాత కూడా ధనం మిగిలిపోతే దాన్ని ఇతర ప్రదేశాల్లోని నిరుపేదల కొరకు పంపవచ్చు. మరొక విషయం ఏమిటంటే, జకాత్ సొమ్మును కేవలం ముస్లిం పేద ప్రజల కోసమే ఖర్చుపెట్టాలి. ఈ సొమ్ముతో ఇతర మతాల ప్రజల అవసరాలను తీర్చటం భావ్యం కాదు. ఎందుకంటే ఈ పద్దు ముస్లిం సమాజ ప్రగతీ వికాసాల కోసం ఉద్దేశించబడినది. ఇది వారి హక్కు. కనుక ఒకరి హక్కును కాలరాసి మరొకర్ని ఉద్ధరించటానికి ప్రయత్నించటం ఏవిధంగానూ ధర్మసమ్మతం కాదు. అయితే జకాత్ కాక ఇతర దానధర్మాల సొమ్మును ముస్లింతో పాటు ముస్లిమేతరుల శ్రేయస్సు కోసం కూడా ఖర్చుపెట్టవచ్చు. దీన్ని అనుభవించటానికి ముస్లిమేతరులు కూడా అర్హులుగానే పరిగణించబడతారు.

١٢١٠ ـ وَعَنِ ابنِ عُمَرَ، رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أُمِرْتُ أَنْ أُقَاتِلَ النَّاسَ حتى يَشْهَدُوا أَنْ لا إِلهَ إِلَّا اللهُ وَأَنَّ مُحَمَّداً رَسُولُ اللهِ، وَيُقِيمُوا الصَّلاةَ، وَيُؤْتُوا الزَّكَاةَ، فإذا فعلوا ذلك، عَصَمُوا مِنِّي دِمَاءَهمْ وأَمْوَالَهُم إلَّا بحَقِّ الإِسْلامِ، وَحِسَابُهُمْ عَلى اللهِ» مُتفقٌ عَلَيهِ.

1210. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ (సల్లం) దేవుని ప్రవక్త అనీ ప్రజలు సాక్ష్యం ఇవ్వనంతవరకూ, (ఆ తర్వాత) నమాజ్ స్థాపించి, జకాత్ దానం చెల్లించనంతవరకూ వారితో యుద్ధం చేస్తూ ఉండాలని నాకు ఆదేశమయింది. వారు గనక ఈ విధుల్ని నెరవేరిస్తే ఇస్లామీయ చట్టాలకు అనుగుణంగా వారు తమ ధన ప్రాణాలను నా నుండి కాపాడుకుంటారు. (ఇస్లామీయ చట్టాలకు అనుగుణంగా అంటే, వారు ఎవరినయినా అన్యాయంగా హత్య చేస్తే

దానికి ప్రతిగా వారికి కూడా మరణ దండన ఉంటుంది మొదలగునవి). ఆ తర్వాత వారి (అంతరంగిక వ్యవహారాల) లెక్కను దేవుడు చూసుకుంటాడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం- సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

١٢١١ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: لَمَّا تُوُفِّيَ رَسُولُ اللهِ ﷺ، وَكَانَ أَبُو بَكْرٍ، رَضِيَ اللهُ عَنْهُ، وَكَفَرَ مَنْ كَفَرَ مِنَ العَرَبِ، فَقَالَ عُمَرُ رَضِيَ اللهُ عَنْهُ: كَيفَ تُقَاتِلُ النَّاسَ وَقَدْ قَالَ رَسُولُ اللهِ ﷺ: «أُمِرتُ أَنْ أُقاتِلَ النَّاسَ حَتَّى يَقُولُوا لا إلهَ إلَّا اللهُ، فَمَنْ قالَها، فَقَدْ

1211. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మరణానంతరం హజ్రత్ అబూబక్ర్ (రజి) ఖలీఫా అయ్యారు. ఆయన పరిపాలనా కాలంలో కొన్ని అరబ్బు తెగలు (జకాత్ ఇవ్వటానికి నిరాకరించి) ధర్మ తిరస్కారానికి పాల్పడ్డాయి. (ఆ సమయంలో అబూబక్ర్ (రజి) ఆ అరబ్బు తెగలతో యుద్ధం చేయటానికి పూనుకున్నారు). ఆ సందర్భంగా హజ్రత్ ఉమర్ (రజి) ఆయన ముందు దైవప్రవక్త హదీసును ఉటంకిస్తూ ఇలా అన్నారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడనీ, ప్రజలు ధృవీకరించనంతవరకు వారితో యుద్ధం చేయమని నాకు ఆదేశమయింది. కనుక ఎవరయితే ఆ విధంగా ధృవీకరిస్తారో వారు తమ ధనప్రాణాలను నా నుండి కాపాడుకుంటారు. కాకపోతే (వారు ఏదయినా శిక్షార్హమైన తప్పుచేస్తే) ధర్మహక్కు ప్రకారం (శిక్ష అనుభవించ వలసి ఉంటుంది). వారి (అంత రంగిక) వ్యవహారాన్ని దేవుడు చూసు

عَصَمَ مِنِّي مَالَهُ وَنَفْسَهُ إِلَّا بِحَقِّهِ، وَحِسَابُهُ عَلَى اللهِ»؟! فَقَالَ أَبُو بَكْرٍ: واللهِ! لَأُقَاتِلَنَّ مَنْ فَرَّقَ بَيْنَ الصَّلاةِ والزَّكَاةِ، فإنَّ الزَّكَاةَ حَقُّ المَالِ. واللهِ! لَو مَنَعُونِي عِقَالًا كَانُوا يُؤَدُّونَهُ إِلى رَسُولِ اللهِ ﷺ لَقَاتَلْتُهُمْ عَلى مَنْعِهِ. قَالَ عُمَرُ، رَضِيَ اللهُ عَنْهُ: فَوَاللهِ! مَا هُوَ إِلَّا أَنْ رَأَيْتُ اللهَ قَدْ شَرَحَ صَدْرَ أَبِي بَكْرٍ لِلقِتَالِ، فَعَرَفْتُ أَنَّهُ الحَقُّ، مُتفقٌ عليهِ.

కుంటాడు - అని దైవప్రవక్త (సల్లం) ప్రకటించారు కదా! అలాంటప్పుడు మీరు ఆ తెగలతో యుద్ధం చేయటం భావ్యమేనా?"

దానికి హజ్రత్ అబూబక్ర్(రజి) ఇలా అన్నారు: దైవసాక్షిగా చెబుతున్నాను. "నమాజ్-జకాత్‌ల మధ్య భేదం చూపే వారెవరితోనయినా నేను యుద్ధం చేస్తాను. ఎందుకంటే జకాత్ వాస్తవానికి సంపదలో నుండి తీయవలసిన (పేదల) హక్కు. దైవసాక్షి! ఒకవేళ వారు గనక దైవప్రవక్త (సల్లం) కాలంలో ఇస్తూ వచ్చిన ఒక ఒంటె త్రాడునయినా సరే, ఇవ్వటానికి నిరాకరిస్తే నేను వారితో తప్పకుండా పోరాడతాను."

ఆ తర్వాత హజ్రత్ ఉమర్(రజి) ఈ సంఘటన గురించి మాట్లాడుతూ, "దైవసాక్షి! తన మార్గంలో పోరాడటం కోసం దేవుడు అబూబక్ర్ (రజి) హృదయ కవాటాలను తెరిచాడని నేను గ్రహించాను. అప్పుడు అబూబక్ర్(రజి) అభిప్రాయమే సరైనదని నాకర్థ మయింది" అని అన్నారు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాంలో ఏ ఒక్క విధిని తిరస్కరించినా మొత్తం ధర్మాన్నే తిరస్కరించినట్లుగా పరిగణించ బడుతుంది. అందుకే హజ్రత్ అబూబక్ర్ (రజి) జకాత్ విధిని తిరస్కరించిన వారితో యుద్ధం చేయటానికి పూనుకున్నారు. మొదట్లో ఆయన నిర్ణయం పట్ల కొంతమంది సహచరులు

అభ్యంతరం వెలిబుచ్చారు. అయితే ఆఖరికి ఆయన అభిప్రాయమే సరయినదనీ, ఇస్లామీయ ఆదేశాలకు అనుగుణమైనదనీ అందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు.

١٢١٢ - وَعَنْ أَبِي أَيوبَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَجُلاً قَالَ لِلنَّبِيِّ ﷺ: أَخْبِرْنِي بِعَمَلٍ يُدْخِلُنِي الجَنَّةَ، قَالَ: «تَعْبُدُ اللهَ لا تُشْرِكُ بِهِ شَيْئاً، وَتُقِيمُ الصَّلاةَ، وَتُؤْتِي الزَّكَاةَ، وَتَصِلُ الرَّحِمَ» مُتَّفَقٌ عليهِ.

1212. హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) (దగ్గరికి వచ్చి) "నన్ను స్వర్గానికి గొని పోయే సత్కార్యం గురించి తెలియ జేయండి" అని కోరాడు. అందు కాయన అతనికి, 'ఒకే దేవుణ్ణి ఆరాధించు, ఆయనకు సరిసమాను లుగా మరెవరినీ నిలబెట్టకు. నమాజును స్థాపించు. జకాత్ (విధి దానం) చెల్లించు. బంధువులతో సత్సం బంధాలు పెట్టుకో" అని ఉపదేశిం చారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

١٢١٣ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ أَعْرَابِياً أَتَى النَّبِيَّ ﷺ فَقَالَ: يَا رَسُولَ اللهِ! دُلَّنِي عَلَى عَمَلٍ إذا عَمِلْتُهُ، دَخَلْتُ الجَنَّةَ. قَالَ: «تَعْبُدُ اللهَ لا تُشْرِكُ بِهِ شَيْئاً، وَتُقِيمُ الصَّلاةَ، وَتُؤْتِي الزَّكَاةَ المَفْرُوضَةَ، وَتَصُومُ رَمَضَانَ» قَالَ: وَالَّذِي

1213. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఒక పల్లెవాసి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి, "దైవప్రవక్తా! నన్ను స్వర్గానికి గొనిపోగల సత్కర్మ ఏమిటో తెలియజేయండి" అని అడిగాడు. అందుకాయన "ఒక్క దేవుణ్ణి మాత్రమే ఆరాధించు. ఆయనకు సహవర్తులుగా మరెవరినీ నిలబెట్టకు. నమాజును స్థాపించు. విధి (దానమైన) జకాత్‌ను చెల్లించు. రమజాన్ నెలలో ఉప వాసాలు పాటించు" అని ఉపదేశిం చారు. అంతా విన్న తర్వాత ఆ పల్లెవాసి, "ఎవరిచేతిలోనయితే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబు

نَفْسِي بِيَدِهِ، لا أَزِيدُ عَلَى هذا. فَلَمَّا وَلَّى، قَالَ النَّبِيُّ ﷺ: «مَنْ سَرَّهُ أَنْ يَنْظُرَ إِلَى رَجُلٍ مِنْ أَهْلِ الجَنَّةِ فَلْيَنْظُرْ إِلَى هذا» مُتفقٌ عليهِ.

తున్నాను. నేనిందులో (అదనంగా) ఏ విషయాన్నీ చేర్చను" అంటూ వెనక్కి తిరిగి వెళ్ళిపోసాగాడు. అప్పుడు దైవ ప్రవక్త (సల్లం) (అతని వంక చూపిస్తూ), "మీలో స్వర్గవాసిని చూడగోరేవారు ఈ వ్యక్తిని చూడవచ్చు" అన్నారు.
(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) హదీసులో పేర్కొనబడిన పల్లెవాసి క్రొత్తగా ఇస్లాం స్వీకరించి, ఇస్లాం గురించి సమాచారం తెలుసుకుందామనే ఉద్దేశ్యంతో దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చాడు. అందుకే, అతనికి ఎక్కువ కష్టం కలిగించకూడదనే ఉద్దేశంతో దైవప్రవక్త (సల్లం) అతనికి అవసరమైన విషయాల మటుకే తెలియజేశారు.

2) ఎంత ఎక్కువగా ఆచరణ చేస్తే అంత ఎక్కువగా పుణ్యం లభిస్తుందని భావించకూడదు. దైవాజ్ఞల్ని, దైవప్రవక్త ఆదేశాలను అతిక్రమించి ప్రవర్తిస్తే పుణ్యానికి బదులు పాపాన్ని కొనితెచ్చుకున్నట్లు అవుతుంది. ధర్మాదేశాలకు శిరసావహించి వాటిని యధాతథంగా అమలుజరపటమే అసలు ఇస్లాం అంటే. అలాంటి విధేయతా భావాన్ని ప్రదర్శించి నందుకు గాను దైవప్రవక్త (సల్లం) ఆ పల్లెవాసిని స్వర్గవాసిగా పేర్కొన్నారు.

3) 'అషరయె ముబష్షరహ్' (ఇహలోకంలోనే స్వర్గశుభవార్తను పొందిన పది మంది సహచరులు) గాక దైవప్రవక్త (సల్లం) నోటి ద్వారా ప్రపంచంలో అలాంటి శుభవార్తను పొందిన సహచరులు చాలా మంది ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) మనుమళ్ళయిన హసన్ మరియు హుసైన్ (రజి)లు స్వర్గయువతకు నాయకులౌతారని హదీసుల్లో చెప్పబడింది. అలాగే దైవప్రవక్త (సల్లం) సతీమణులు కూడా ఇహలోకంలోనే స్వర్గశుభవార్తను పొందారు. హదీసులో పేర్కొనబడిన పల్లెవాసి కూడా అలాంటి అదృష్ట వంతుల కోవకు చెందినవాడే.

١٢١٤ - وَعَنْ جَرِيرِ بنِ عبدِ اللهِ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: بَايَعتُ النَّبِيَّ ﷺ، عَلَى إِقَامِ الصَّلاةِ، وَإِيتَاءِ الزَّكاةِ، والنُّصْحِ لِكُلِّ مُسْلِمٍ. مُتَّفَقٌ عَلَيهِ.

1214. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) (చేతిలో చెయ్యేసి) నమాజును స్థాపిస్తాననీ, జకాత్ చెల్లిస్తాననీ, ముస్లింలందరి

శ్రేయాన్ని కోరుకుంటానని ప్రమాణం చేశాను. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు 'శ్రేయోభిలాష ' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. ఇందులో జకాత్ ప్రస్తావన ఉంది. కనుక దీనిని ఈ అధ్యాయంలో కూడా పొందుపరచటం జరిగింది. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) తాను ఇస్లాం స్వీకరించినప్పుడు పైన పేర్కొనబడిన విధుల్ని తప్పకుండా పాటిస్తానని దైవప్రవక్త (సల్లం) చేతిలో చెయ్యేసి ప్రమాణం చేశారు. దీనిద్వారా ఇస్లాంలో ఆ విధులు ఎంతటి ప్రముఖమైనవో అర్థమవుతుంది. నమాజ్, జకాత్ వ్యవస్థలేని ఇస్లాం ధర్మాన్ని మనం ఊహించలేము.

ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే దైవప్రవక్త (సల్లం) పలు సందర్భాల్లో తన సహచరులచేత ప్రమాణం చేయించుకునేవారు. ఉదాహరణకు పై హదీసులో ఆయన జరీర్ బిన్ అబ్దుల్లాహ్ ఇస్లాం స్వీకరించినప్పుడు ఆయన చేత ప్రమాణం చేయించారు. అదే విధంగా ఆయన యుద్ధ సమయం ఆసన్నమైనప్పుడు, జిహాద్ గురించి కూడా ప్రమాణం చేయించుకునేవారు. ఇక మూడోది ఖిలాఫత్ ప్రమాణం. దైవప్రవక్త (సల్లం) తదనంతరం విశ్వాసులకు నాయకత్వం వహించే ఖలీఫాలు ప్రజల చేత ప్రమాణం తీసుకునేవారు. దైవప్రవక్త, ఆయన సహచరుల ద్వారా రుజువయినవి ఈ మూడు రకాల ప్రమాణాలే. ఇకపోతే ప్రస్తుత కాలంలో సూఫీల, పీర్ల సంఘాల్లో చెలామణిలో ఉన్న ప్రమాణ పరంపరలన్నీ ఆ తర్వాతి కాలంలో వెలుగులోకి వచ్చినవే. ధర్మంలో వీటికి ఎలాంటి ప్రాముఖ్యత లేదు.

١٢١٥ - وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «مَا مِنْ صَاحِبِ ذَهَبٍ، ولا فِضَّةٍ، لا يُؤَدِّي مِنْهَا حَقَّهَا إلَّا إذا كَانَ يَوْمُ القِيَامَةِ صُفِّحَتْ لَهُ

1215. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: వెండి బంగారాలకు యజమాని అయినవాడు వాటి (జకాత్) హక్కును చెల్లించకపోతే ప్రళయదినాన (ఆ వెండి బంగారాల తోనే) అతని శిక్ష కోసం అగ్ని పలకలు తయారు చేయబడతాయి. తర్వాత వాటిని నరకాగ్నిలో బాగా కాల్చి వాటితో వారి ప్రక్కల మీద, ఫాలభాగాల మీద, వీపుల మీద వాతలు వేయబడతాయి. ఆ పలకలు చల్లబడిపోగానే

صَفائِحُ مِنْ نَارٍ، فَأُحْمِيَ عَلَيْهَا فِي نَارِ جَهَنَّمَ، فَيُكْوَى بِهَا جَنْبُهُ، وَجَبِينُهُ، وَظَهْرُهُ، كُلَّمَا بَرَدَتْ أُعِيدَتْ لَهُ فِي يَوْمٍ كَانَ مِقْدَارُهُ خَمْسِينَ أَلْفَ سَنَةٍ، حَتَّى يُقْضَى بَيْنَ العِبَادِ فَيُرَى سَبِيلُهُ، إِمَّا إِلى الجَنَّةِ، وَإِمَّا إِلَى النَّارِ» قِيلَ: يا رَسُولَ اللهِ! فَالإِبِلُ؟ قَالَ: «وَلا صاحِبِ إِبِلٍ لا يُؤَدِّي مِنْهَا حَقَّهَا، وَمِنْ حَقِّهَا حَلْبُهَا

వాటిని మళ్ళీ అగ్నిలో కాల్చి (తిరిగి వాతలు పెట్టడం జరుగుతుంది.) మానవుల లెక్కతేల్చబడే ఆ రోజున ఈ పరంపర ఇలాగే కొనసాగుతూ ఉంటుంది. ఆ ఒక్క రోజు (ప్రపంచంలోని) యాభై వేల సంవత్సరాలకు సమానంగా ఉంటుంది. ఆఖరికి మానవుల లెక్క తేల్చటం జరుగుతుంది. అప్పుడు వారు తమ మార్గం స్వర్గం వైపునో లేక నరకం వైపునో చూసుకుంటారు.

"దైవప్రవక్తా! మరి ఒంటెల విషయంలో ఏం జరుగుతుంది?" అని సహచరులు అడగ్గా, అందుకాయన ఈ విధంగా వివరించారు: ఒంటెల యజమాని, వాటికి సంబంధించిన హక్కును నెరవేర్చకపోతే ప్రళయ దినాన అతణ్ణి ఓ సమతల మైదానంలో ఆ ఒంటెల కాళ్ళ దగ్గర వెల్లకిలా లేక బోర్లా పడేయటం జరుగుతుంది. అసలు ఆ ఒంటెలకు సంబంధించిన హక్కు ఏమిటంటే వాటికి నీళ్లు త్రాపేరోజున వాటి పాలను పితికి (పేదలకు ఇవ్వాలి. ఈ హక్కును నెరవేర్చకపోయినా ఒంటెల యజమానులకు శిక్షపడుతుంది). ఆ ఒంటెలన్నీ, అవి ప్రపంచంలో ఉన్నప్పుడు వాటిలో అత్యంత లావుగా ఉండిన ఒంటె మాదిరిగా అయిపోతాయి. ఆ ఒంటెల మందలో ఒక గున్న ఒంటె కూడా తప్పిపోయి

يَوْمَ وِرْدِها، إلَّا إذا كانَ يَوْمُ القِيامَةَ بُطِحَ
لَهَا بِقاعٍ قَرْقَرٍ أَوْفَرَ ما كَانَتْ، لا يَفْقِدُ مِنْهَا
فَصِيلاً وَاحِداً، تَطَؤُهُ بِأَخْفافِهَا، وَتَعَضُّهُ
بِأَفْوَاهِها، كُلَّمَا مَرَّ عَلَيْهِ أُولاها، رُدَّ عَلَيْهِ
أُخْرَاها، في يَوم كانَ مِقْدَارُهُ خَمْسِينَ أَلْفَ
سَنَةٍ، حَتَّى يُقضَى بَيْنَ العِبَاد، فَيُرَى سَبِيلُهُ،
إمَّا إلى الجَنَّةِ وإمَّا إلى النَّارِ». قِيلَ:
يَا رَسولَ الله! فَالْبَقَرُ وَالغَنَمُ؟ قالَ:
«وَلا صَاحِبِ بَقَرٍ وَلا غَنَمٍ لا يُؤَدِّي مِنْها
حَقَّهَا، إلَّا إذا كانَ يَوْمُ القِيامَةِ، بُطِحَ لَهَا بِقَاعٍ
قَرقَرٍ، لا يَفْقِدُ مِنْهَا شَيْئاً، لَيْسَ فيها عَقْصَاءُ،
وَلا جَلْحَاءُ، وَلا عَضبَاءُ، تَنْطَحُهُ بِقُرُونِهَا،
وَتَطَؤُهُ بِأَظْلافِها، كُلَّمَا مَرَّ عَلَيْهِ أُولاها، رُدَّ
عَلَيْهِ أُخْرَاها، في يَوم كان مِقْدَارُهُ خَمْسِينَ
أَلْفَ سَنَةٍ حَتَّى يُقضَى بَيْنَ العِبَادِ، فَيُرَى سَبِيلَهُ

ఉండదు సుమా! అవన్నీ అతణ్ణి తమ గిట్టెలతో త్రొక్కుతాయి. నోళ్లతో కొరికి పెడతాయి. తొక్కిన ప్రతి ఒంటె తిరి గొచ్చి మళ్ళీ వరుసలో నించుంటుంది. మానవుల లెక్క తేల్చబడే ఆ రోజున ఈ పరంపర ఇలాగే కొనసాగుతూ ఉంటుంది. ఆ ఒక్క రోజే యాభై వేల సంవత్సరాలకు సమానంగా ఉంటుంది. ఆఖరికి మానవుల మధ్య పరిష్కారం జరిగిన తర్వాత అతను తన మార్గం స్వర్గం వైపో లేక నరకం వైపో చూసుకుంటాడు.

ఆ తర్వాత "దైవప్రవక్తా! మరి ఆవుల, మేకల విషయంలో ఏం జరుగు తుంది?" అని ప్రశ్నించబడగా, దానికి సమాధానమిస్తూ ఆయన ఈ విధంగా వివరించారు: ఆవుల మేకల యజ మాని వాటి (జకాత్) హక్కును నెరవేర్చకపోతే ప్రళయ దినాన అతణ్ణి వాటి మూలంగా ఓ సమతల మైదా నంలో వెల్లకిలా లేక బోర్లా పడేయటం జరుగుతుంది. ఆ రోజు అతని పశువుల మందలో ఒక్కటి కూడా తప్పిపోయి ఉండదు. అదే విధంగా వాటిలో కొమ్ములు ఒంకర పోయిన లేక కొమ్ములు లేని లేక విరిగిన కొమ్ములు గల ఆవులుగాని మేకలుగాని అసలు ఉండవు. (అలాంటి పశువుల దెబ్బ అంత తీవ్రంగా ఉండదు). ఆ తర్వాత

إمّا إلى الجنّة وإمّا إلى النّار». قيلَ: يارَسولَ اللهِ! فَالخَيْلُ؟ قالَ: «الخَيْلُ ثَلاثَةٌ هِيَ لِرَجلٍ وِزرٌ، وَهِيَ لِرجُلٍ سِترٌ، وَهِيَ لِرجُلٍ أَجْرٌ، فَأَمّا التي هِيَ لهُ وِزرٌ فَرَجُلٌ رَبَطَهَا رِياءً وَفَخراً وَنِواءً عَلى أَهْلِ الإسْلام، فَهِيَ لَهُ وِزرٌ، وَأَمّا الَّتِي هِيَ لَهُ سِترٌ، فَرَجُلٌ رَبَطَهَا في سَبِيلِ اللهِ، ثُمَّ لَمْ يَنْسَ حَقَّ اللهِ في ظُهُورِها، وَلا رِقابِها؛ فَهِيَ لَهُ سِترٌ، وَأَمّا الَّتِي هِيَ لَهُ أَجْرٌ، فَرَجُلٌ رَبَطَهَا في سَبِيلِ اللهِ لأَهْلِ الإسلام في مَرْجٍ، أَو رَوضَةٍ، فَمَا أَكَلَت مِن ذلكَ المَرجِ أَوِ الرَّوضَةِ مِن شَيءٍ إلّا كُتِبَ لَهُ عَدَدَ مَا أَكَلَت حَسَنَاتٌ، وَكُتِبَ لَهُ عَدَدَ أَرْوَاثِهَا وَأَبْوالِهَا حَسَنَاتٌ، وَلَا تَقطَعُ طِوَلَهَا فَاستَنَّت شَرَفاً أَو شَرَفَيْنِ

ఆ పశువులన్నీ కలిసి అతణ్ణి కొమ్ములతో పొడుస్తాయి. గిట్టెలతో తొక్కిపడేస్తాయి. ప్రతి ఆవు లేక మేక ఒకసారి తొక్కిన తర్వాత మళ్ళీ వరుసలో కొచ్చి నిలబడుతుంది. మానవుల లెక్క తేల్చబడే ఆ రోజున ఈ పరంపర ఇలాగే కొనసాగుతూ ఉంటుంది. ఆ ఒక్కరోజు యాభైవేల సంవత్సరాలకు సమానంగా ఉంటుంది. ఆఖరికి మానవుల మధ్య తీర్పు జరిగిన తర్వాత అతను తన మార్గం స్వర్గం వైపో లేక నరకం వైపో చూసుకుంటాడు.

"దైవప్రవక్తా! మరి గుర్రాలు కలిగి వున్నవారి పర్యవసానం ఎలా ఉంటుంది?" అని అడగ్గా, అందుకాయన, ఇలా అన్నారు: "గుర్రాలు మూడు రకాలుగా ఉంటాయి. కొన్ని గుర్రాలు తమ యజమానుల పాలిట (పాప) భారంగా పరిణమిస్తాయి. మరి కొన్ని గుర్రాలు తమ యజమానులను (అంటే వారి దారిద్ర్యాన్ని) కప్పిపుచ్చుతాయి. ఇంకొన్ని గుర్రాలు పుణ్యఫలాలను తెచ్చిపెడతాయి. ఎవరయినా ప్రదర్శనాబుద్ధితో, తమ కీర్తి ఇనుమడించాలన్న ఉద్దేశ్యంతో, ఇంకా ఇస్లాం ధర్మానికి వ్యతిరేకంగా పోరాడే ఉద్దేశ్యంతో గుర్రాన్ని కట్టి ఉంచితే వారి పాలిట ఆ గుర్రం పాపానికి కారణభూతమవుతుంది. మరెవరయితే (తమ

లేమిని మరుగుపరచటం కోసం) దైవ మార్గంలో ఉపయోగపడటం కోసం గుర్రాన్ని కట్టివుంచి దాని స్వారీ విషయంలో దేవుని హక్కును మరిచి పోకుండా ఉంటారో (అంటే అవస రాల్లో ఉన్న వారికి తమ వాహనాన్ని ఉచితంగా ఇస్తారో) వారి పాలిట ఆ గుర్రం లోపాలను కప్పిపుచ్చేదయి ఉంటుంది. ఇంకా ఎవరయినా దైవ మార్గంలో పోరాడే ఉద్దేశ్యంతో ముస్లిముల కోసం దాన్ని ఏదయినా పచ్చిక బైలులోగాని లేదా తోటలోగాని కట్టి వుంచితే, ఆ గుర్రం ఆ పచ్చికబైలు లేక తోటలో మేసిన గడ్డి, ఆకులు, అలములకు సమానంగా పుణ్యాలు అతని కర్మల జాబితాలో నమోదుచేయ బడతాయి. దాని లద్ది, దాని మూత్రా నికి సమానమైన పుణ్యాలు కూడా అతని కర్మల జాబితాలో వ్రాయబడ తాయి. ఆఖరికి ఆ గుర్రం త్రాడు తెంచుకొని ఒకటి రెండు గుట్టలు దూకి వస్తే, ఆ సమయంలో అది ఎంత దూరం నడిచిందో, ఎంత లద్ది, మూత్రాన్ని విసర్జించిందో అన్ని పుణ్యాలు కూడా అతని కర్మల జాబితాలో నమోదుచేయబడతాయి. అంతేకాదు, యజమాని తన గుర్రాన్ని తీసుకొని, ఏదయినా నదిఒడ్డు దగ్గరి నుంచి వెళ్ళినప్పుడు, తనకు నీళ్ల

إلَّا كتب الله لَهُ عَدَدَ آثَارِهَا، وَأَرْوَاثِهَا حَسَنَاتٍ، وَلَا تَمُرُّ بِهَا صَاحِبُهَا عَلَى نَهْرٍ، فَشَرِبَتْ مِنْهُ، وَلَا يُرِيدُ أَنْ يَسْقِيَهَا إلَّا كَتَبَ اللهُ لَهُ عَدَدَ مَا شَرِبَتْ حَسَنَاتٍ». قِيلَ: يارسولَ الله! فالحُمُرُ؟ قالَ: «مَا أُنْزِلَ عَلَيَّ فِي الحُمُرِ شَيْءٌ إلَّا هذِهِ الآيَةُ الفَاذَّةُ الجَامِعَةُ: ﴿فَمَن يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا يَرَهُ ۝ وَمَن يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ شَرًّا يَرَهُ ۝﴾ [الزلزلة:٧،٨]. مُتَّفَقٌ عَلَيْهِ. وهذا لفظ مُسْلِمٍ.

త్రాపించే ఉద్దేశ్యం లేకపోయినా గుర్రం దానంతట అదే అక్కడికి వెళ్ళి నీళ్లు త్రాగితే, అప్పుడు కూడా అది ఎన్ని గుక్కెళ్లు నీళ్లు త్రాగుతుందో అన్ని పుణ్యాలు అతని కర్మల జాబితాలో వ్రాయబడతాయి.

(అంతా విన్న తర్వాత సహచరులు చివర్లో), "దైవప్రవక్తా! మరి గాడిదల గురించి ఏమిటి?" అని అడిగారు. అందుకాయన ఇలా అన్నారు: "ప్రత్యేక మైన, ఎంతో సమగ్రమైన ఈ ఆయతు తప్ప గాడిదల విషయంలో నాపై ఎలాంటి ఆయతూ అవతరించ లేదు."

"ఎవడైనా రవ్వంత సత్కార్యం చేసి ఉన్నాసరే దాన్ని అతను చూసు కుంటాడు. అలాగే ఎవడైనా రవ్వంత దుష్కార్యం చేసివున్నాసరే దాన్నీ అతను చూసుకుంటాడు."

*(అల్ జిల్‌జాల్: 7-8)*

(బుఖారీ-ముస్లిం-వాక్యాలు ముస్లిం లోనివి)

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఒంటెలకు సంబంధించిన హక్కుని గురించి వివరిస్తూ, వాటికి నీళ్లు త్రాపించే రోజున వాటి పాలను ఏ నిరుపేదకయినా దానంగా ఇవ్వాలని చెప్పబడింది. వాస్తవానికి ఒంటెల సంపద ఉన్నవారు తీయవలసిన జకాత్ హక్కు అదికాదు. ఒంటెలు కలిగివున్నవారు వాటిలో ఎన్ని ఒంటెలు జకాత్‌గా తీసి నిరుపేదలకు ఇవ్వాలనే లెక్క వేరుగానే ఉంది. కనుక ఈ హదీసులో పేర్కొనబడిన, 'పాలదానం' ప్రాముఖ్యతను, దాని వాస్తవికతను నిర్ణయించవలసి వచ్చింది. దాన్ని వివరించటానికి హదీసువేత్తలు ఈ హదీసుకు వివిధ రకాలుగా భాష్యం చెప్పారు.

జకాత్ ఆజ్ఞలు అవతరించకమునుపు ఒంటెలకు సంబంధించిన జకాత్ హక్కు ఈ విధంగా నెరవేర్చబడేదనీ, ఆ విషయాన్నే ఇక్కడ ప్రస్తావించడం జరిగిందనీ కొంతమంది పండితులు అభిప్రాయపడ్డారు. మరికొందరి అభిప్రాయం ప్రకారం ఇది జకాత్‌కాక అదనంగా నెరవేర్చవలసిన మరో హక్కు. మనిషి సంపదలో పేదలకు జకాత్‌తోపాటు ఇతర హక్కులు కూడా ఉంటాయనీ, వాటిని నెరవేర్చకపోతే దేవుడు శిక్షిస్తాడన్నది వారి అభిమతం. ఇంకొంతమంది పండితులు దీనికి ఈ విధంగా భాష్యం చెప్పారు: "బాగా ఆకలిగొని ప్రాణాపాయ స్థితిలో ఉన్నవారెవరయినా తారసిల్లితే వారికి తమ దగ్గరున్న ఒంటెల పాలు పితికి ఇవ్వటం విధి. పోతే సామాన్య పరిస్థితుల్లో మాత్రం ఇలా పాలు దానం చేయటం నైతికంగా మంచి పద్ధతి అనిపించుకుంటుంది."

పైన పేర్కొనబడిన వివరణలన్నింటిలో మూడోవివరణ కాస్త సమంజసమైనదిగా తోస్తోంది (మిర్అత్ 3వ సంపుటి).

హదీసులో పలుచోట్ల "ఆ రోజున అతను తన మార్గం స్వర్గానికి గొనిపోయేదో లేక నరకానికి గొనిపోయేదో చూసుకుంటాడు" అని చెప్పబడింది. ఇది మానవులందరూ సమీక రించబడే రోజున, హష్ర్ మైదానంలో జరిగే సంఘటన అని ఈ వాక్యాన్ని చూస్తేనే స్పష్టంగా బోధపడుతోంది. దీనిభావం ఏమిటంటే జకాత్ చెల్లించటంలో నిర్లక్ష్యం వహించేవారికి స్వర్గం లేక నరకంలో ప్రవేశించకముందే పైన హదీసులో వివరించబడినట్లు శిక్ష పడుతుంది. ఆ తర్వాత దేవుడు ఏ విశ్వాసులకయితే ఈ శిక్ష చాలనుకుంటాడో వారిని స్వర్గానికి పంపిస్తాడు. లేకపోతే వారు మరికొంతకాలం నరకంలో శిక్ష అనుభవించవలసి ఉంటుంది. ఆ తర్వాత విశ్వాసులు ఎట్టకేలకు స్వర్గానికి చేరుకుంటారు. కాని అవిశ్వాసులు మాత్రం శాశ్వతంగా నరకాగ్ని కీలల మధ్య కాలుతూనే ఉంటారు.

మొత్తానికి ఈ హదీసులో తమ సొమ్ములో నుండి నిరుపేదల జకాత్ హక్కుని చెల్లించని ధనవంతులకు పరలోకంలో శిక్ష విధించబడుతుందనీ, వారు ఏ ధనం విషయంలో పిసినారితనం వహించారో ఆ ధనంతోనే వారిని శిక్షించటం జరుగుతుందని చెప్పబడింది. దైవం మనల్ని అలాంటి శిక్షల నుండి రక్షించుగాక!



**217 వ అధ్యాయం**

## ٢١٧ ـ بَابُ وُجُوبِ صَوْمِ رَمَضَانَ وَبَيَانِ فَضْلِ الصِّيَامِ وَمَا يَتَعَلَّقُ بِهِ

## రమజాన్ ఉపవాసాల విధింపు, వాటి ఘనత, ఇంకా వాటికి సంబంధించిన ఇతర విషయాలు

قَالَ اللهُ تَعَالَى: ﴿ يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ كُتِبَ عَلَيْكُمُ ٱلصِّيَامُ كَمَا كُتِبَ عَلَى ٱلَّذِينَ مِن قَبْلِكُمْ ﴾ إلى قولِهِ تَعَالَى: ﴿ شَهْرُ رَمَضَانَ ٱلَّذِىٓ أُنزِلَ فِيهِ ٱلْقُرْءَانُ هُدًى لِّلنَّاسِ وَبَيِّنَـٰتٍ مِّنَ ٱلْهُدَىٰ وَٱلْفُرْقَانِ ۚ فَمَن شَهِدَ مِنكُمُ ٱلشَّهْرَ فَلْيَصُمْهُ ۖ وَمَن كَانَ مَرِيضًا أَوْ عَلَىٰ سَفَرٍ فَعِدَّةٌ مِّنْ أَيَّامٍ أُخَرَ ﴾ الآيــة [البقـرة: ١٨٣]. وأمَّا الأحاديثُ فقد تقدمت في الباب الذي قبلَهُ.

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వసించిన ప్రజలారా! ఉపవాసం మీకు విధిగా నిర్ణయించబడింది: ఏ విధంగా మీకు పూర్వం ప్రవక్తలను అనుసరించేవారికి కూడా విధించబడిందో. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది...........

పవిత్ర ఖుర్‌ఆన్ అవతరించిన నెల రమజాను నెల. మానవులందరికీ (ఆ గ్రంథం) మార్గ దర్శకం. రుజుమార్గం చూపే, సత్యా సత్యాలను వేరుపరచే స్పష్టమైన ఉపదేశాలు అందులో ఉన్నాయి. కనుక ఇక నుండి రమజాను నెలను పొందే వ్యక్తి ఆ నెల అంతా విధిగా ఉపవాసం ఉండాలి. కాని వ్యాధిగ్రస్తులైనవారు, లేదా ప్రయాణంలో ఉన్నవారు ఆ ఉపవాస దినాలను వేరే దినాలలో పూర్తిచేయాలి."

*(అల్‌బఖర: 183-185)*

### ముఖ్యాంశాలు

ఒక పనిని తొలిసారిగా చేయటానికి సహజంగా ఎవరయినా వెనుకంజ వేస్తారు. దాని కష్టనష్టాలను బేరీజు వేసుకుంటారు. కాని అదే పనిని తనకంటే ముందు ఎంతోమంది చేసి ఉన్నారని తెలిస్తే, దాన్ని నిర్వర్తించటానికి ఎవరయినా ముందుకు వస్తారు. అదే విధంగా పైన పేర్కొనబడిన ఆయతులో ముహమ్మదీయ అనుచర సమాజం ఉపవాస వ్రతాన్ని పాటించటంలో ఇబ్బందిని ఊహించుకోకూడదన్న ఉద్దేశ్యంతో, వారిమీద దానిని విధించేటప్పుడు వారికి పూర్వం గతించిన జాతుల, సమాజాల ఉదాహరణను ఉటంకించటం జరిగింది. గత సమాజాల్లో కూడా ఈ ఉపవాస వ్రతం ఉండేదని చెప్పబడింది. అయితే వారు కూడా మనలాగే రమజాన్ మాసంలో

ముప్పై లేక ఇరవై తొమ్మిది రోజులు ఉపవాసం పాటించేవారని దీని అర్థం ఎంతమాత్రం కాదు. ఈ ఉపమానం కేవలం ఉపవాస వ్రతానికి సంబంధించినది మాత్రమే. ఇకపోతే ఉపవాసాల దినాలు, వాటి సంఖ్య మొదలగు విషయాల్లో వారి మధ్య వ్యత్యాసాలుండవచ్చు.

'దివ్యఖుర్ఆన్ రమజాన్ మాసంలో అవతరించింది' అనే ఆయతుకు రెండు భావాలు ఉండవచ్చు. ఒకటి; బహుశా ఈ ఖుర్ఆన్ అవతరణ రమజాన్ మాసంలో ప్రారంభమైందని కావచ్చు. రెండు; మొత్తం ఖుర్ఆన్ ఒకేసారి 'లౌహె మహ్ఫూజ్' (సురక్షిత ఫలకం) నుండి మొదటి ఆకాశానికి దించబడి, అక్కణ్ణుంచి సందర్భానుసారం కొద్దికొద్దిగా అవతరించిందని కూడా కావచ్చు.

١٢١٦ - وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «قَالَ اللهُ عَزَّ وَجَلَّ: كُلُّ عَمَلِ ابنِ آدمَ لَهُ إلَّا الصِّيَامَ، فَإِنَّهُ لِي وَأَنَا أَجْزِي بِهِ. وَالصِّيَامُ جُنَّةٌ؛ فَإذا كَانَ يَوْمُ صَوْمِ أَحَدِكُمْ فَلا يَرْفُثْ وَلا يَصْخَبْ، فَإنْ سَابَّهُ أَحَدٌ أَوْقَاتَلَهُ، فَلْيَقُلْ: إِنِّي صَائِمٌ. وَالَّذِي نَفْسُ مُحَمَّدٍ بِيَدِهِ لَخُلُوفُ فَمِ الصَّائِمِ أَطْيَبُ عِنْدَ اللهِ مِنْ رِيحِ المِسْكِ. لِلصَّائِمِ فَرْحَتَانِ يَفْرَحُهُمَا: إِذا أَفْطَرَ فَرِحَ بِفِطْرِهِ،

1216. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దేవుడు ఇలా అంటున్నాడని దైవప్రవక్త (సల్లం) ప్రవచించారు: మనిషి, సత్కార్యాలన్నీ తన కోసమే చేసుకుంటాడు. కాని ఉపవాసం సంగతి అలాకాదు. అది ప్రత్యేకంగా నా కోసం పాటించబడుతుంది. కనుక దానికి ప్రతిఫలం కూడా స్వయంగా నేనే ఇస్తాను.

ఉపవాసం డాలు వంటిది. కనుక మీలో ఎవరయినా ఉపవాసం పాటిస్తే ఆ రోజునవారు వ్యర్థమైన మాటలు మాట్లాడరాదు. నోరు పారేసుకోరాదు. ఒకవేళ తమ మీద ఎవరయినా దుర్భాషకు దిగితే లేక కయ్యానికి కాలు దువ్వితే వారితో, "నేను ఉపవాసమున్నానండీ!" అని (మర్యాదగా) చెప్పేయాలి.

ఎవరి చేతిలో ముహమ్మద్ ప్రాణముందో ఆయన సాక్షి! ఉపవాసి నోటి నుండి వెలువడే వాసన దేవుని దృష్టిలో కస్తూరి సువాసన కన్నా ఎంతో మేలైనది

وَإِذا لَقِيَ رَبَّهُ فَرِحَ بِصَوْمِهِ» متفقٌ عليه. وهذا لفظ روايةِ البُخاري. وفي روايةٍ له: «يَتْرُكُ طعَامَهُ، وَشَرَابَهُ، وَشَهْوَتَهُ، مِنْ أَجْلِي، الصِّيَامُ لي وَأَنَا أَجْزِي به، وَالحَسَنَةُ بِعَشْرِ أَمْثَالِهَا». وفي روايةٍ لمسلم: «كُلُّ عَمَلِ ابنِ آدمَ يُضَاعَفُ: الحَسَنَةُ بِعَشْرِ أَمْثَالِهَا إلى سَبْعِمائة ضِعْفٍ. قال الله تعالى: إلَّا الصَّوْمَ فَإِنَّهُ لي وَأَنَا أَجْزِي بِهِ: يَدَعُ شَهْوَتَهُ وَطَعَامَهُ مِنْ أَجْلِي. لِلصَّائم فَرْحَتَانِ: فَرْحَةٌ عِنْدَ فِطْرِهِ، وَفَرْحَةٌ عِنْدَ لِقَاءِ رَبِّهِ. ولَخُلُوفُ فيهِ أَطْيَبُ عِنْدَ اللهِ مِنْ ريحِ المِسْكِ».

(పవిత్రమైనది). ఉపవాసి రెండు సందర్భాల్లో అమితానందాన్ని అనుభవిస్తాడు. ఒకటి; ఇఫ్తార్ సమయంలో. ఉపవాసం విరమించగానే సంతోషిస్తాడు. రెండు; ప్రభువును కలుసుకున్నప్పుడు తన ఉపవాస ప్రతిఫలాన్ని చూసి సంతోషిస్తాడు. (బుఖారీ-ముస్లిం)

పైన పేర్కొనబడిన వాక్యాలు బుఖారీవి. బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఉపవాసి నా కోసం అన్నపానీయాలను, లైంగిక కోర్కెలను త్యజిస్తున్నాడు. ఉపవాసం ప్రత్యేకంగా నా కోసం పాటించబడుతుంది. కనుక నేను దానికి ప్రతిఫలం (ఎంతయినా) ప్రసాదిస్తాను. అయితే (ఇతర) సత్కార్యాలకు పదిరెట్లు పుణ్యం మాత్రమే లభిస్తుంది.

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ప్రతి మనిషికి అతను చేసే సత్కార్యానికిగాను, పది నుండి ఏడొందల రెట్ల పుణ్యం ప్రసాదించబడుతుంది. దేవుడు ఇలా అంటున్నాడు: కాని ఉపవాసం వీటన్నింటికీ భిన్నమైనది. ఉపవాసం ప్రత్యేకంగా నా కోసం పాటించబడుతుంది. అందువల్ల నేను స్వయంగా దానికి ప్రతిఫలం ప్రసాదిస్తాను. ఉప వాసికి రెండు సందర్భాల్లో అమితా నందం లభిస్తుంది. ఒకటి; ఉపవాసాన్ని

విరమించేటప్పుడు. రెండోది; తన ప్రభువును కలుసుకున్నప్పుడు. నిశ్చయంగా అతని నోటి నుండి వెలువడే వాసన దేవుని దృష్టిలో కస్తూరి వాసన కన్నా మేలైనది.

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఉపవాసం ఘనత, దాని ఉద్దేశ్యం బోధింపబడింది. ఉపవాసం అంటే కేవలం అన్నపానీయాలకు, లైంగిక వాంఛలకు దూరంగా ఉండటం ఒక్కటే కాదు, ఉపవాసం పాటించేవారు అన్ని రకాల చెడు పనులకు, వ్యర్థచేష్టలకు దూరంగా ఉండాలి. దాంతోపాటు మంచి పనులు చేయటం కూడా చాలా అవసరం. అప్పుడే ఉపవాస వ్రతానికి సార్ధకత చేకూరుతుంది.

١٢١٧ ـ وعنـهُ أنَّ رسـولَ الله ﷺ قَالَ: «مَنْ أَنْفَقَ زَوْجَيْنِ في سَبِيلِ اللهِ نُودِيَ مِنْ أَبْوابِ الجَنَّةِ: يَا عَبْدَ اللهِ! هذا خَيْرٌ، فَمَنْ كانَ مِنْ أَهْلِ الصَّلاةِ دُعِيَ مِنْ بَابِ الصَّلاةِ، وَمَنْ كانَ مِنْ أَهْلِ الجهَادِ دُعِيَ مِنْ بَابِ الجهَادِ، وَمَنْ كَانَ مِنْ أَهْلِ الصِّيَامِ دُعِيَ مِنْ بَابِ الرَّيَّانِ، وَمَنْ كَانَ مِنْ أَهْلِ الصَّدَقَةِ دُعِيَ مِنْ بَابِ الصَّدَقَةِ» قال أبو بكرٍ، رَضِيَ اللهُ عَنْهُ: بِأَبِي أَنتَ وَأُمِّي

1217. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవమార్గంలో రెండేసి వస్తువుల్ని దానం చేసిన వారికి (మరణానంతరం) స్వర్గ ద్వారాల వైపు నుండి ఆహ్వానం వస్తుంది. "ఓ దైవదాసుడా! (ఇటు వచ్చేయి.) ఈ ద్వారం బాగుంది" అని అనటం జరుగుతుంది. నమాజ్ చేసే వ్యక్తిని నమాజు ద్వారం నుండి ఆహ్వానించటం జరుగుతుంది. ధర్మ యోధుణ్ణి ధర్మపోరాటపు ద్వారం నుండి పిలవటం జరుగుతుంది. ఉపవాసిని రయ్యాన్ ద్వారం నుండి పిలవటం జరుగుతుంది. దానధర్మాలు చేసిన వాడిని దానద్వారం నుండి పిలవటం జరుగుతుంది.

يا رسولَ اللهِ! ما عَلى مَنْ دُعِيَ مِنْ تِلكَ الأَبْوابِ مِنْ ضَرُورَةٍ، فهلْ يُدعَى أَحَدٌ مِنْ تِلكَ الأَبْوابِ كلِّهَا؟ قال: «نَعَم وَأَرْجُو أَنْ تَكونَ مِنهم» متفقٌ عليه.

ఈ మాటలు విని హజ్రత్ అబూబకర్ (రజి) "దైవప్రవక్తా! నా తల్లిదండ్రుల్ని మీకు అర్పింతు! (అసలు కావలసింది స్వర్గ ప్రవేశం కనుక) ఏ ద్వారం నుండి పిలవబడినా నష్టం లేదు. కాని (నాకు తెలియక అడుగుతున్నాను) అన్ని ద్వారాల నుండి పిలవబడేవారు ఎవరైనా ఉంటారా?" అని అడిగారు. దానికాయన "ఆఁ, ఉంటారు. బహుశా మీరు అలాంటివారి కోవకు చెందినవారేనని నా నమ్మకం" అని చెప్పారు. *(బుఖారీ, ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

١٢١٨ - وعنْ سهلِ بنِ سعدٍ رَضيَ اللهُ عنهُ عنِ النَّبيِّ ﷺ قالَ: «إنَّ في الجَنَّةِ بَاباً يُقَالُ لَهُ: الرَّيَّانُ، يَدْخُلُ مِنْهُ الصَّائمُونَ يَوْمَ القِيامَةِ، لا يدخُلُ مِنْهُ أَحَدٌ غَيرُهم، يقالُ: أَينَ الصَّائمُونَ؟ فَيَقومونَ لا يدخُلُ مِنهُ أَحَدٌ غيرُهم، فَإِذا دَخَلوا أُغلِقَ فَلَم يَدْخُلْ مِنهُ أَحَدٌ» متفقٌ عليه.

1218. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: స్వర్గంలో ఒక ద్వారం ఉంది. దాన్ని 'రయ్యాన్' అని పిలుస్తారు. ప్రళయదినాన దానిగుండా ఉపవాసులు స్వర్గప్రవేశం చేస్తారు. వారు తప్ప ఇతరులెవరూ దానిగుండా ప్రవేశించలేరు. ఆ రోజున "ఉపవాసు లేరీ?" అని ఆరాతీయటం జరుగుతుంది. ఆ మాట వినగానే ఉపవాసులందరూ (స్వర్గప్రవేశానికి) బయలుదేరుతారు. వారు లోనికి ప్రవేశించగానే, ఇతరులెవరూ లోనికి రాకుండా, ఆ ద్వారం మూయ బడుతుంది.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ ఉపవాసులంటే రమజాన్ ఉపవాసాలతోపాటు ఇతర నఫిల్ ఉపవాసాలను కూడా అత్యధికంగా పాటించేవారని భావం. కేవలం రమజాన్ ఉపవాసాలనయితే ముస్లింలందరూ విధిగా పాటిస్తారు. (రమజాన్‌లోని) ఫర్జ్ ఉపవాసాలతోపాటు నఫిల్ ఉపవాసాలను కూడా పాటిస్తే మరింత మంచిది. అలాగని ఫర్జ్ ఉపవాసాలను నిర్లక్ష్యం చేసి నఫిల్ ఉపవాసాలకు ప్రాముఖ్యత ఇవ్వటం కూడా సమంజసం కాదు.

١٢١٩ ـ وَعنْ أبي سَعيدِ الخُدْرِيِّ، رضيَ اللهُ عَنْهُ قَالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَا مِنْ عَبْدٍ يصُومُ يَوماً في سَبيلِ اللهِ إلَّا بَاعَدَ اللهُ بذلكَ اليَوم وَجهَهُ عَنِ النَّارِ سَبعِينَ خَرِيفاً» متفقٌ عليه.

1219. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే దైవమార్గంలో ఒకరోజు ఉపవాస ముంటారో వారి ముఖాలను దేవుడు ఆ ఒక్కరోజు మూలంగా నరకం నుండి డెబ్భై యేండ్ల (ప్రయాణం) మేరకు దూరంగా ఉంచుతాడు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

"దైవమార్గంలో" అంటే దైవమార్గంలో పోరాడుతూ ఉపవాసం పాటించటం కావచ్చు లేదా దైవప్రసన్నత కోసం ఉపవాసం పాటించటమని భావం కావచ్చు. ఏమయినప్పటికీ ఈ హదీసు ద్వారా ఉపవాస ఘనత వెల్లడౌతోంది.

١٢٢٠ ـ وَعَنْ أَبي هُرَيْرَةَ، رضيَ اللهُ عَنْهُ عَنِ النَّبيِّ ﷺ قالَ: «مَنْ صَامَ رَمَضانَ إيمَاناً واحْتِساباً، غُفِرَ لهُ ما تَقَدَّمَ مِنْ ذَنْبِهِ» متفقٌ عليه.

1220. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా రమజాన్ మాసంలో విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో ఉపవాసం పాటిస్తే, గతంలో వారివల్ల జరిగిన పాపాలన్నీ మన్నించబడతాయి. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

١٢٢١ ـ وعنهُ، رضيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ، قالَ: «إذا جَاءَ رَمَضَانُ فُتِّحتْ أَبْوَابُ الجنَّةِ، وَغُلِّقَت أَبْوَابُ النَّارِ، وصُفِّدَتِ الشَّيَاطِينُ» متفقٌ عليه.

1221. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రమజాన్ మాసం రాగానే స్వర్గ ద్వారాలు తెరువబడతాయి. నరక ద్వారాలు మూయబడతాయి. షైతాను లను బంధించటం జరుగుతుంది.
(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

١٢٢٢ ـ وعنهُ أنَّ رسولَ اللهِ ﷺ قالَ: «صُومُوا لِرُؤْيَتِهِ، وَأَفطِرُوا لِرؤيَتِهِ، فإنْ غَبِيَ عَليكم، فأكمِلُوا عِدَّةَ شَعْبَانَ ثَلاثينَ» متفقٌ عليه وهذا لفظ البخاري. وفي رواية مسلم: «فإن غُمَّ عَليكم فَصُومُوا ثَلاثِينَ يَوْماً».

1222. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రమజాన్ నెలవంకను చూసి ఉపవాస దీక్ష ప్రారంభించండి. తిరిగి (షవ్వాల్) నెలవంక చూసిన తర్వాత ఉప వాసాన్ని విరమించండి. ఒకవేళ ఆకాశం మేఘావృతమై ఉండి (నెల వంక కనిపించకపోతే) షాబాన్ మాసపు ముప్ఫై దినాలు నిండ నివ్వండి. (బుఖారీ - ముస్లిం - వాక్యాలు బుఖారీలోనివి)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "ఒకవేళ ఆకాశం మేఘావృతమై ఉండి (చంద్రుడు కనిపించకపోతే) ముప్ఫై రోజుల ఉపవాసాలు పూర్తిచేయండి" అని ఉంది.

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

218వ అధ్యాయం

## ٢١٨ ـ بَابُ الْجُودِ وَفِعْلِ الْمَعْرُوفِ وَالإِكْثَارِ مِنَ الْخَيْرِ فِي شَهْرِ رَمَضَانَ، وَالزِّيَادَةِ مِنْ ذٰلِكَ فِي الْعَشْرِ الأَوَاخِرِ مِنْهُ

## రమజాన్ మాసంలో దానధర్మాలు, సత్కార్యాలు అత్యధికంగా చేయాలి, చివరి దశకంలోనయితే ఇంకా ఎక్కువగా పుణ్యకార్యాలు చేయాలి

١٢٢٣ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ، رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ، أَجْوَدَ النَّاسِ، وَكَانَ أَجْوَدُ مَا يَكُونُ فِي رَمضانَ حِينَ يَلْقَاهُ جبريلُ، وَكَانَ جبريلُ يَلْقَاهُ فِي كُلِّ لَيلَةٍ مِنْ رَمَضَانَ فَيُدَارِسُهُ القرْآنَ، فَلَرسُولُ اللهِ ﷺ، حِينَ يلقَاهُ جبريلُ أَجْوَدُ بِالخَيْرِ مِنَ الرِّيحِ المُرْسَلَةِ. متفقٌ عليه.

1223. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ప్రజలందరి కన్నా ఎక్కువ దానశీలురు. రమజాన్ మాసంలో జిబ్రయీల్ దూత తనను కలుసుకున్నప్పుడయితే ఆయన ఇంకా ఎక్కువగా దానాలు చేసేవారు. రమజాన్ మాసంలో ప్రతిరోజూ రాత్రి జిబ్రయీల్ దూత ఆయన్ని కలుస్తుండే వారు. అప్పుడు వారిద్దరూ కలిసి ఖుర్ఆన్ పారాయణం చేసేవారు. నిజం చెప్పాలంటే జిబ్రయీల్ తనను కలిసినప్పుడు ఆయన ప్రభంజనం కన్నా వేగంగా దానధర్మాలు చేసేవారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని దైవవాణి అవతరణ ప్రారంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

రమజాన్ మాసంలో రెండు పనులు వీలైనంత ఎక్కువగా చేస్తూ ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. ఒకటి; దానధర్మాలు. రెండు; ఖుర్ఆన్ పారాయణం. రమజాన్ మాసం శుభాల

సరోవరం. ఇదొక వరాల వసంతం. ఈ నెలలో చేయబడే ఒక సత్కార్యానికి దేవుడు అనేక రెట్లు పుణ్యఫలం ప్రసాదిస్తాడు. కనుక ఈ నెలలో ప్రజలందరూ వీలైనంత ఎక్కువగా దైవారాధనలో గడపాలి. అయితే ఆ విధంగా దైవారాధన చేయటంలో పేదవారికి ఆర్థికపరమైన సమస్యలుండవచ్చు. అందుకే ఈ మాసంలో వీలైనంత ఎక్కువగా దానధర్మాలు చేయాలని ప్రబోధించటం జరిగింది. ధనవంతులు దాన ధర్మాలు చేసి నిరుపేదల ఆర్థిక ఇబ్బందుల్ని తొలగిస్తే వారు కూడా నిశ్చింతగా దైవారాధన చేసుకోగల్గుతారు.

ఇకపోతే రమజాన్ మాసంలో ఖుర్‌ఆన్ పారాయణం కూడా అత్యంత పుణ్యప్రదమైన సత్కార్యం. రమజాన్ మాసానికి, ఖుర్‌ఆన్‌కు మధ్య అవినాభావ సంబంధముంది. కనుక ఆ సంబంధాన్ని పురస్కరించుకుని రమజాన్ మాసంలో వీలైనంత ఎక్కువగా ఖుర్‌ఆన్ పారాయణం చేయటం అభిలషణీయం.

١٢٢٤ ـ وَعَنْ عائشة رضيَ اللهُ عنها قـالَـتْ: كَـانَ رَسُـولُ اللهِ ﷺ، إذا دَخَـلَ العَشْرُ أَحيَا اللَّيْلَ، وَأَيقَظَ أَهْلَهُ، وَشَدَّ المِئزَرَ. متفقٌ عليه.

1224. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: (రమజాన్ మాసంలోని) చివరి దశకం రాగానే దైవప్రవక్త (సల్లం) రాత్రిళ్లు జాగారం చేసేవారు. తమ ఇంటివారిని కూడా మేల్కొలిపేవారు. (ఆ రాత్రుల్లో ఆరాధన కోసం) నడుం బిగించేవారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని లైలతుల్ ఖద్ర్ ప్రాశస్త్య ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఏతెకాఫ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వాస్తవానికి సత్కార్యాల కోసం, దైవారాధన కోసం రమజాన్ నెల మొత్తం వసంత కాలమే. అయితే ముఖ్యంగా చివరి దశకంలో మాత్రం ఈ వసంతం మరింతగా విర బూస్తుంది. కనుక మనం కూడా, దైవప్రవక్త (సల్లం) విధానాన్ని అనుసరిస్తూ, ముఖ్యంగా ఆ చివరి దశకంలోని రాత్రుల్లో వీలైనంత ఎక్కువగా శ్రమించి దైవారాధన చేయాలి. దైవప్రసన్నతను బడయటానికి, లైలతుల్ ఖద్ర్ ప్రాశస్త్యాన్ని పొందటానికి కృషి చేయాలి. వీలైతే ఆ దినాల్లో ఏతెకాఫ్ పాటించాలి. దైవప్రవక్త (సల్లం) రమజాన్ మాసంలోని చివరి దశకంలో ఆరాధన కోసం అనుకూల వాతావరణాన్ని సృష్టించుకునే ఉద్దేశ్యంతో ఏతెకాఫ్ వ్రతాన్ని పాటించేవారు.

**219 వ అధ్యాయం**

## ٢١٩ - بَابُ النَّهْيِ عَنْ تَقَدُّمِ رَمَضَانَ بِصَوْمٍ بَعْدَ نِصْفِ شَعْبَانَ إِلاَّ لِمَنْ وَصَلَهُ بِمَا قَبْلَهُ، أَوْ وَافَقَ عَـادَةً بِأَنْ كَانَ عَادَتُهُ صَوْمَ الاِثْنَيْنِ وَالْخَمِيسِ فَوَافَقَهُ

## సగం షాబాన్ మాసం తర్వాత రమజాన్‌కు ముందు ఉపవాసం పాటించకూడదు, ఒకవేళ ముందు నుంచి పాటిస్తూ వస్తే లేక తన ఆనవాయితీ ప్రకారం సోమ, గురువారాల్లో ఉపవాసం పాటించవలసి వస్తే అది వేరే విషయం

١٢٢٥ - عن أبي هُريرةَ رضيَ اللهُ عَنْهُ عَنِ النَّبيِّ ﷺ قال: «لَا يَتَقَدَّمَنَّ أَحَدُكُم رَمَضانَ بِصَوْمِ يَوْمٍ أَوْ يَوْمَيْنِ، إِلَّا أَنْ يَكُونَ رَجُلٌ كَانَ يَصُومُ صَوْمَهُ، فَلْيَصُمْ ذٰلكَ اليَوْمَ» متَّفقٌ عليه.

1225. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరూ కూడా రమజాన్ మాసానికి ఒకటి రెండు రోజుల ముందుగా ఉపవాసం పాటించరాదు. ఒకవేళ ఎవరయినా ఆ రోజుల్లో ఆనవాయితీగా ఉపవాసం పాటిస్తూ ఉంటే, వారు పాటించవచ్చు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

కొంతమంది ప్రజలు నిర్ణీత తేదీల్లో లేక నిర్ణీత వారాల్లో ఆనవాయితీగా ఉపవాసం పాటిస్తూ ఉంటారు. కొందరు సోమ గురువారాల ఉపవాసాన్ని ఆనవాయితీగా పెట్టుకుంటారు. మరికొందరు ఒక రోజు వదిలిపెట్టి మరో రోజు ఉపవాసం పాటించటాన్ని ఆనవాయితీగా

పెట్టుకుంటారు. ఇలాంటి వారు రమజాన్ మాసానికి ఒకటి రెండు రోజులు ముందుగానయినా ఉపవాసం పాటించవచ్చు. ఎందుకంటే ఇక్కడ కావాలని రమజాన్‌కు ముందు ఉపవాసం ఉండటం లేదు, ఆనవాయితీ ఆ విధంగా వచ్చింది కనుక, ఆ రోజుల్లో ఉపవాసం పాటించవలసిన అవసరం ఏర్పడింది.

1226. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: రమజాన్ మాసానికి ముందు ఉపవాసం పాటించకండి. నెలవంకను చూసి ఉపవాసవ్రతం మొదలెట్టండి. ఆ తర్వాత నెలవంకను చూసిన తర్వాతే ఉపవాసవ్రతాన్ని విరమించండి. ఒకవేళ దానిమీద మేఘాలు ఆవరించి ఉంటే (తత్కారణంగా అది కనిపించకపోతే) ముప్పై రోజులు పూర్తి చేసుకోండి.

(తిర్మిజీ-హసన్, సహీహ్)

١٢٢٦ ـ وعن ابنِ عباس رضيَ اللهُ عنهما قال: قالَ رسولُ اللهِ ﷺ: «لا تَصُومُوا قَبْلَ رَمَضَانَ، صُومُوا لِرُؤْيَتِهِ، وَأَفْطِرُوا لِرُؤْيَتِهِ، فَإِنْ حَالَتْ دُونَهُ غَيَايَةٌ فَأَكْمِلُوا ثَلاثِينَ يَوماً» رواه الترمذي وقال: حديث حسنٌ صحيحٌ. «الغَيَايَة» بالغين المعجمة وبالياءِ المثناة من تحت المكررة، وهِيَ: السَّحابَةُ.

(సునన్ తిర్మిజీలోని ఉపవాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

'రమజాన్ మాసానికి ముందు' అంటే షాబాన్ మాసం పదిహేనవ తేదీ తర్వాత నఫిల్ ఉపవాసాలు పాటించకూడదు. దానివల్ల మనిషి నీరసించిపోతాడు. ఫలితంగా, అతి త్వరలోనే ప్రారంభం కానున్న ఫర్జ్ ఉపవాసాలను అతను ఉత్సాహంగా పాటించలేడు. కనుక రమజాన్ మాసపు ఉపవాసాల ప్రాధాన్యత దృష్ట్యా షాబాన్ నెలలో నఫిల్ ఉపవాసాలు పాటించకుండా, శక్తిని ఆదా చేసుకోవాలి.

రమజాన్ ఉపవాసాలను చాంద్రమానం ప్రకారం పాటించాలి. చాంద్రమానంలో నెల 29 రోజులదీ కావచ్చు లేక 30 రోజులది కూడా కావచ్చు. కనుక షాబాన్ మాసపు 29వ తేదీ సాయంత్రం నెలవంక కనిపిస్తే ఆ మరునాటి నుంచి రమజాన్ ఉపవాసాలు పాటించాలి. ఒకవేళ ఆకాశం మేఘావృతమై ఉన్న కారణంగా చంద్రుడు కనిపించకపోతే ఆ మాసంలో 30వ రోజును కూడా లెక్కించుకోవాలి. అదే విధంగా రమజాన్ మాసంలోని 29వ తేదీ సాయంత్రం నెలవంక కనిపించకపోతే ముప్పై ఉపవాసాలు పూర్తి చేసుకొని ఆ మర్నాడు పండగ చేసుకోవాలి.

١٢٢٧ ـ وعنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إذا بَقِيَ نِصْفٌ مِنْ شَعْبَانَ فَلا تَصُومُوا» رواه الترمذي وقال: حديثٌ حَسَنٌ صَحِيحٌ.

1227. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఇంకా సగం షాబాన్ మాసం మిగిలి ఉందనగా మీరు ఉపవాసం పాటించటం మానుకోండి. *(తిర్మిజీ-హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని ఉపవాస ప్రకరణం)*

١٢٢٨ ـ وَعَنْ أَبِي اليَقظانِ عمَّارِ بنِ يَاسِرٍ رضيَ اللهُ عَنْهما قالَ: مَنْ صَامَ اليَوْمَ الَّذِي يُشَكُّ فِيهِ فَقَدْ عَصَى أَبَا القَاسِمِ ﷺ. رواه أبو داود، والترمذي وقالَ: حديثٌ حَسَنٌ صَحِيحٌ.

1228. హజ్రత్ అబుల్ యఖ్జాన్ అమ్మార్ బిన్ యాసిర్ (రజి) ఇలా అంటున్నారు: అనుమానంతో కూడిన రోజున ఉపవాసం పాటించినవాడు అబుల్ ఖాశిం (ముహమ్మద్ -సల్లం)కు అవిధేయత చూపినట్లే. *(అబూదావూద్, తిర్మిజీ-హసన్, సహీహ్)*

## ముఖ్యాంశాలు

అనుమానంతో కూడిన రోజంటే షాబాన్ మాసపు 30వ తేదీ. ఆకాశం మేఘావృతమై ఉన్న కారణంగా షాబాన్ మాసపు 29వ తేదీన చంద్రుడు కనిపించనప్పటికీ కేవలం ఊహతో, మబ్బుల వెనక చంద్రుడు ఉండి ఉంటాడన్న అనుమానంతో మరునాడు రమజాన్ మాసపు ఒకటోతేదీ అని భావించి ఆ రోజున ఉపవాసం పాటించకూడదు. చంద్రుడు కనిపించాడా లేదా అన్న సందేహం ఏర్పడినప్పుడు ఆ నెలలో ముప్పై రోజులు పూర్తి చేసుకోవాలి. సందేహాస్పద దినాల్లో ఉపవాసం పాటించనవసరం లేదు.



## 220 వ అధ్యాయం

## ٢٢٠ - بَابُ مَا يُقَالُ عِنْدَ رُؤْيَةِ الْهِلَالِ

## నెలవంకను చూసినప్పుడు పఠించవలసిన దుఆ

١٢٢٩ - عَنْ طَلْحَةَ بنِ عُبَيْدِ اللهِ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ كانَ إذا رَأى الهِلالَ قَالَ: «اللَّهُمَّ أَهِلَّهُ عَلَيْنَا بِالأَمنِ وَالإِيمَانِ، وَالسَّلامَةِ وَالإِسْلام، رَبِّي وَرَبُّكَ اللهُ، هِلالُ رُشْدٍ وَخَيْرٍ» رواه الترمذي: وقالَ حديثٌ حَسَنٌ.

1229. హజ్రత్ తల్హా బిన్ ఉబైదుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) నెలవంకను చూసినప్పుడు ఈ విధంగా ప్రార్థించేవారు:

"అల్లాహుమ్మ అహిల్లహూ అలైనా బిల్ అమ్ని వల్ ఈమాని వస్సలామతి వల్ ఇస్లామి రబ్బీ వ రబ్బు కల్లాహు, హిలాలు రుష్దిన్ వ ఖైరిన్."

(అనువాదం: ఓ అల్లాహ్! ఈ చంద్రో దయాన్ని మా కొరకు సురక్షితమైనదిగా, విశ్వాసంతో కూడుకున్నదిగా ప్రశాంతమైనదిగా, ఇస్లాంతో కూడుకున్నదిగా చేయి. ఓ చంద్రమా! నా ప్రభువూ నీ ప్రభువు కూడా అల్లాహ్‌యే (ఓ అల్లాహ్!) ఈ నెలవంకను మార్గదర్శినిగా, మేలైనదిగా చేయి).

**221వ అధ్యాయం**

## ٢٢١ - باب فَضْلِ السُّحور وتأخيره ما لم يَخْشَ طُلُوعُ الفَجْرِ

## సహ్రీ భుజించటం, ఉషోదయం కానంతవరకు అందులో ఆలస్యం చేయటం పుణ్యప్రదం

١٢٣٠ - عَنْ أنسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «تَسَحَّرُوا؛ فَإِنَّ في السُّحورِ بَرَكَةً» متفقٌ عليه.

1230. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: సహ్రీ భోజనంలో శుభం ఉంది. అంచేత మీరు (తప్పకుండా) సహ్రీ భుజించండి.

(బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఉపవాస దినాల్లో ఉషోదయానికి ముందు నిద్రలేచి సహ్రీ భుజించటం అభిలషణీయం. సాధారణంగా ఆ వేళప్పుడు మనిషికి అసలు అన్నం తినబుద్ధి కాదు. అయినప్పటికీ ఓపిగ్గా కొంచెం ఆహారమయినా తీసుకోవటం మంచిది. సహ్రీ భోజనంలో శుభం ఉంటుందనీ, అందువల్ల ఉపవాసం పాటించదలచుకున్నవారు సహ్రీ భుజించాలని దైవప్రవక్త (సల్లం) పదేపదే తాకీదు చేసేవారు. సహ్రీ భుజించకపోతే ఉపవాసి చాలా తొందరగా నీరసించిపోతాడు. దానివల్ల అతను పూర్తి ఏకాగ్రతతో దైవారాధనలో లీనం కాలేడు. ఉపవాసం అంటే శరీరాన్ని కృశింపజేసుకోవటం కాదు. దేవుడు ఎల్లప్పుడూ తన దాసుల సౌలభ్యాన్ని మాత్రమే కోరుకుంటాడు. దాసుల్ని ఇబ్బందులకు లోను చేయటం దేవుని అభిమతం ఎంతమాత్రం కాదు. కొంతమంది సహ్రీ వేళ నిద్రలేవటం కష్టంగా ఉంటుందని రాత్రిపూట పడుకునే ముందు పీకల దాకా మెక్కి నిద్రపోతారు. అలా చేయటం వల్ల సహ్రీ శుభాన్ని కోల్పోవటం తప్ప ఇతర ప్రయోజనం ఏమీ ఉండదు. పైగా మరునాడు మధ్యాహ్నాని కల్లా వారు మళ్ళీ ఆకలితో అన్నం కోసం విలవిల్లాడిపోతారు. అంచేత సహజమైన, శుభకరమైన పద్ధతిలో దైవప్రవక్త ఆదేశానికి అనుగుణంగా ఉషోదయానికి కాసేపు ముందు నిద్రలేచి కొంచెమయినా సహ్రీ భుజిస్తే సాయంత్రం వరకు నిక్షేపంగా ఆరాధనలో కాలం గడపవచ్చు.

1231. హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి) కథనం: ఓ రోజు మేము దైవప్రవక్త (సల్లం) వెంట సహ్రీ భుజించి ఆ తర్వాత నమాజ్ కోసం బయలుదేరాం. "మీ సహ్రీ ముగింపుకూ- నమాజ్‌కు మధ్య ఎంత వ్యవధి ఉండిందని" ఎవరో అడగ్గా, అందుకాయన సమాధానమిస్తూ, "యాభై ఆయతులు పఠించగల వ్యవధి ఉండింది" అని చెప్పారు. (బుఖారీ, ముస్లిం)

١٢٣١ - وعن زيد بن ثابت رَضِيَ اللهُ عَنهُ قال: تَسَحَّرْنَا مَعَ رسولِ اللهِ ﷺ ثُمَّ قُمْنَا إلى الصَّلاةِ. قيلَ: كَمْ كَانَ بَيْنَهُمَا؟ قالَ: قَدْرُ خَمْسِينَ آيَةً. متفقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

### ముఖ్యాంశాలు

సహ్రీ భుజించటంలో ఆలస్యం చేయాలి. ఎప్పుడో అర్ధరాత్రి పూట నిద్రలేచి గబాగబా నాలుగు ముద్దలు తిని పడుకోవటం మంచి పద్ధతి కాదు. ఉషోదయం వరకు ఆలస్యం చేయాలి. అయితే ఉషోదయానికి ముందే సహ్రీ ముగించుకోవాలి సుమా! సహ్రీ ముగింపుకూ, ఉషోదయానికి మధ్య యాభై ఆయతులు పఠించగలిగేంత వ్యవధి ఉండేటట్లు చూసుకోవటం మంచిది.

1232. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) దగ్గర ఇద్దరు ముఅజ్జిన్‌లు (అజాన్ ఇచ్చేవారు) ఉండేవారు. ఒకరు బిలాల్. రెండో వారు, ఇబ్నె ఉమ్మె మక్తూమ్. ఒకసారి దైవప్రవక్త (సల్లం) (సహ్రీ భోజనం గురించి చెబుతూ) "బిలాల్ రాత్రివేళ ఉండగానే అజాన్ ఇస్తారు. కనుక మీరు (తొందర పడకుండా) ఇబ్నె ఉమ్మె మక్తూమ్ అజాన్ ఇచ్చేవరకు నిస్సంకోచంగా తినండి, త్రాగండి" అని ఉపదేశించారు.

١٢٣٢ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: كانَ لِرسولِ اللهِ ﷺ مُؤَذِّنَانِ: بِلالٌ، وَابْنُ أُمِّ مَكْتُومٍ. فَقَالَ رَسولُ اللهِ ﷺ: «إنَّ بِلالًا يُؤَذِّنُ بِلَيْلٍ؛ فَكُلُوا وَاشْرَبُوا حَتَّى يُؤَذِّنَ ابْنُ أُمِّ مَكْتُومٍ» قَالَ: وَلَمْ يَكُنْ بَيْنَهُمَا إلَّا أَنْ يَنْزِلَ هذا وَيَرْقَى هذا، متفقٌ عليه.

ఇబ్నె ఉమర్(రజి) ఉవాచ: వారిద్దరి అజాన్‌ల మధ్య ఏమంత ఎక్కువ వ్యవధి ఉండేది కాదు. బిలాల్ అజాన్ ఇచ్చి క్రిందికి దిగగానే ఈయన (అంటే ఇబ్నె ఉమ్మె మక్తూమ్) అజాన్ ఇవ్వటానికి పైకెక్కేవారు.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

పై హదీసు ద్వారా బోధపడేదేమిటంటే, దైవప్రవక్త (సల్లం) కాలంలో ఇద్దరు ముఅజ్జిన్‌లు ఉండేవారు. ఉదయం వేళ ఆ ఇద్దరూ రెండుసార్లు అజాన్ ఇచ్చేవారు. మొదటి అజాన్ అవగానే సహ్‌రీ భుజిస్తున్న ప్రజలు సహ్‌రీ సమయం అయిపోవస్తుందని, కనుక త్వరగా సహ్‌రీ ముగించి నమాజ్ సన్నాహాలు మొదలెట్టాలని అర్థం చేసుకునేవారు. ఇకపోతే రెండో అజాన్ అన్నపానీయాలు ఆపేసి నమాజ్‌కు బయలుదేరండి అనే ప్రకటన అన్నమాట. ఈ పరంపర ఒక్క రమజాన్ మాసంలోనేగాక సంవత్సరం మొత్తం ఇలాగే జరిగేదని హదీసు వాక్యాలు తెలుపుతున్నాయి. ఈ విధానం సౌదీ అరేబియాలోని కాబా, మస్జిదె నబవీలలో నేటికీ అమల్లో ఉంది. మనం కూడా ఈ విధానాన్ని పాటించాలి.

ఇకపోతే రెండు అజాన్‌ల మధ్య ఎంత సమయం ఉండేదన్న విషయమై పండితులు ఏమన్నారంటే, హజ్రత్ బిలాల్ (రజి) ఉషోదయానికి పూర్వం రాత్రి ఉండగానే అజాన్ ఇచ్చి కాసేపు ప్రార్థనల్లో నిమగ్నులై ఉండి ఉషోదయం కోసం ఎదురు చూస్తూ ఉండేవారు. ఉషోదయం అవబోతుందని అనిపించగానే ఆయన క్రిందికి దిగి అంధులయిన హజ్రత్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్‌కు ఆ విషయం తెలియపరచేవారు. అప్పుడు ఇబ్నె ఉమ్మె మక్తూమ్ వుజూ చేసుకొని పైకెక్కి ఉషోదయం మొదలుకాగానే అజాన్ ఇచ్చేవారు. (ఇబ్నె అల్లాన్)

١٢٣٣ ـ وَعَنْ عَمْرِو بنِ العاص رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رسولَ اللهِ ﷺ قال: «فَصْلُ ما بَيْنَ صِيَامِنَا وَصِيَامِ أَهْلِ الكِتَابِ أَكْلَةُ السَّحَرِ» رواه مسلم.

1233. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మన ఉపవాసానికి, గ్రంథవహుల ఉపవాసానికి మధ్య భేదం సహ్‌రీ భుజించటం.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

సహ్‌రీ భుజించటమనేది ముహమ్మదీయ అనుచర సమాజానికి దేవుడు ప్రసాదించిన ఒక ప్రత్యేకత. కనుక వారు అల్లాహ్ తమకు ఇచ్చిన ప్రత్యేకతను కాపాడుకోవాలి.

## 222వ అధ్యాయం

# ٢٢٢ - بَابُ فَضْلِ تَعْجِيلِ الْفِطْرِ وَمَا يُفْطَرُ عَلَيْهِ وَمَا يَقُولُهُ بَعْدَ الإِفْطَارِ

# ఇఫ్తార్ (ఉపవాస విరమణ)లో త్వరపడటం వల్ల లభించే పుణ్యం, ఇఫ్తార్ కోసం ఉపయోగించ వలసిన ఆహార పదార్థం, ఇఫ్తార్ తర్వాత పఠించవలసిన దుఆ

١٢٣٤ - عَنْ سَهْلِ بنِ سَعْدٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لا يَزَالُ النَّاسُ بِخَيْرٍ مَا عَجَّلوا الفِطْرَ» متفقٌ عليه.

1234. హ్రజత్ సహ్లొ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఉపవాస విరమణ విషయం (ఇఫ్తార్)లో త్వరపడినంతకాలం ప్రజలు శ్రేయోమార్గంపై ఉంటారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇఫ్తార్ విషయంలో త్వరపడటమంటే సూర్యాస్తమయానికి ముందే ఉపవాసాన్ని విరమించుకోవటమని అర్థం ఎంతమాత్రం కాదు. సూర్యాస్తమయం అయిన తర్వాత ఇక ఉపవాసాన్ని విరమించుకోవటంలో అనవసరంగా ఆలస్యం చేయకూడదని భావం. ఆ విధంగా తొందరపడేవారు ఇహపరాల్లోనూ శ్రేయోసాఫల్యాలను పొందుతారు. ఉపవాసమంటే ఆకలి దాహాలతో శరీరాన్ని బాధపెట్టడం, కృశింపజేసుకోవటం కాదు. సాధారణంగా అతివాదులైన సూఫీలు ధర్మావలంబనలో ఇలాంటి అతివాద చేష్టలకు పాల్పడుతుంటారు. వాస్తవానికి ఇలాంటి అతివాద చేష్టల వల్ల శుభం ఒనగూడదు. శుభం అనేది క్రమశిక్షణ వల్ల, దేవుడు నిర్ణయించిన హద్దులకు లోబడి జీవితం గడపటం వల్లనే లభిస్తుంది. కనుక ముస్లింలు ఇఫ్తార్ విషయంలో త్వరపడినప్పుడే ఇహపరాల సాఫల్యాన్ని తమ స్వంతం చేసుకోగల్గుతారు.

١٢٣٥ - وَعَنْ أَبي عَطِيَّةَ قَالَ: دَخَلْتُ أَنَا ومَسْرُوقٌ على عائشةَ رَضِيَ اللهُ عَنْهَا، فَقَالَ لَهَا

1235. హ్రజత్ అబూ అతియ్యా (రజి) కథనం: ఓ రోజు నేను, మస్రూఖ్ (రజి)- ఇద్దరం కలిసి హ్రజత్ ఆయిషా

مَسْرُوقٌ: رَجُلانِ مِنْ أَصْحَابِ مُحَمَّدٍ ﷺ، كِلاهُمَا لا يَأْلُو عَنِ الخَيْرِ: أَحَدُهُمَا يُعَجِّلُ المَغْرِبَ وَالإِفْطَارَ، وَالآخَرُ يُؤَخِّرُ المَغْرِبَ وَالإِفْطَارَ؟ فَقَالَتْ: مَنْ يُعَجِّلُ المَغْرِبَ وَالإِفْطَارَ؟ قَالَ: عَبْدُ اللهِ - يعني ابنَ مَسْعودٍ - فَقَالَتْ: هكَذَا كَانَ رَسُولُ اللهِ ﷺ يَصْنَعُ. رواه مسلم. قوله: «لا يَأْلُو» أَيْ لا يُقَصِّرُ فِي الخَيْرِ.

(రజి.అన్‌హా) దగ్గరికి వెళ్ళాం. అప్పుడు మస్‌రూఖ్ (రజి) ఆయిషా (రజి. అన్‌హా)తో మాట్లాడుతూ, "దైవప్రవక్త (సల్లం) సహచరుల్లో ఇద్దరు వ్యక్తు లున్నారు. వారిద్దరూ మంచి పనుల్లో ఏమాత్రం అశ్రద్ధ వహించరు. వారిలో ఒకడు మగ్రిబ్ నమాజు మరియు ఇఫ్తార్ విషయంలో త్వరపడతాడు. వేరొకడు మగ్రిబ్ మరియు ఇఫ్తార్ ఆలస్యంగా చేస్తాడు. (మరి వీరిద్దరిలో ఎవరి విధానం దైవప్రవక్త విధానానికి అనుగుణంగా ఉంది?)" అని అడిగారు. దానికి ఆమె, "మగ్రిబ్ మరియు ఇఫ్తార్ విషయంలో తొందర పడే వ్యక్తి ఎవరు?" అని ప్రశ్నించారు. "అబ్దుల్లాహ్ బిన్ మస్‌వూద్ " అని మస్‌రూఖ్ (రజి) తెలుపగా, దానికామె "(ఆయన విధానమే సరయినది) దైవప్రవక్త (సల్లం) అలాగే చేసేవారు" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

١٢٣٦ - وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «قَالَ اللهُ عَزَّ وَجَلَّ: أَحَبُّ عِبَادِي إِلَيَّ أَعْجَلُهُمْ فِطْراً» رواه الترمذي وقال: حَدِيثٌ حَسَنٌ.

1236. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దేవుడు ఇలా సెల విచ్చాడని దైవప్రవక్త (సల్లం) తెలియ జేశారు: నా దాసుల్లో త్వరగా ఇఫ్తార్ చేసేవారు నాకు అత్యంత ప్రియత ములు. (తిర్మిజీ- హసన్)

*(సుననె తిర్మిజీలోని ఉపవాస ప్రకరణం)*

1237. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఇటు (తూరుపు దిక్కు) నుంచి రేజీకటి కమ్ముకోవటం ప్రారంభించి, పగటి వెలుగు, అటు పశ్చిమ దిక్కుకు) వెడలి పోయి సూర్యుడు అస్తమిస్తే ఉపవాసి తన ఉపవాసాన్ని విరమించుకున్నట్లే; (బుఖారీ, ముస్లిం)

١٢٣٧ - وَعَنْ عُمَرَ بن الخَطَّاب رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «إذا أَقْبَلَ اللَّيْلُ مِنْ هٰهُنَا وَأَدْبَرَ النَّهَارُ مِنْ هٰهُنَا، وَغَرَبَتِ الشَّمْسُ، فَقَدْ أَفْطَرَ الصَّائِمُ» متفقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

సూర్యుడు పశ్చిమ దిక్కున అస్తమించగానే ఉపవాస సమయం ముగిసిపోతుంది. కనుక సూర్యాస్తమయం తర్వాత ఉపవాసి ఏమీ తినకపోయినా త్రాగకపోయినా అతని ఉపవాసం మాత్రం ముగిసిపోయినట్లుగానే పరిగణించబడుతుంది. ఈ హదీసు ఉపవాస వ్యవధిని నిర్ణయిస్తోంది. ఉషోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఉపవాస సమయం ఉంటుంది. అంతకన్నా ఎక్కువ సమయం ఉపవాసం పాటించటం వృథా ప్రయాస మాత్రమే. దానివల్ల దేవుడు ప్రసన్నుడు కాడు, అప్రసన్నుడౌతాడు.

1238. హజ్రత్ అబూ ఇబ్రాహీమ్ అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) కథనం: మేమొకసారి దైవప్రవక్త (సల్లం) వెంట ప్రయాణంలో ఉన్నాం. ఆ రోజు ఆయన ఉపవాసంలో ఉన్నారు. సాయంత్రం సూర్యాస్తమయం కాగానే ఆయన తోటి ప్రయాణీకుల్లోని ఒకతన్ని సంబోధిస్తూ, "దిగు, దిగి నా కోసం సత్తుపిండి కరగబెట్టు" అన్నారు. ఆ మాట విని అతను, "ఇంకాసేపు ఆగితే బాగుంటుంది"

١٢٣٨ - وَعَـنْ أَبِـي إِبْـراهِيـمَ عبدِ اللهِ بنِ أَبي أَوْفى رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: سِرْنَا مَعَ رسولِ اللهِ ﷺ وَهُوَ صَائِمٌ، فَلَمَّا غَرَبَتِ الشَّمْسُ، قالَ لِبَعْضِ القَوْمِ: «يَا فُلانُ! انْزِلْ فَاجْدَحْ لَنَا»، فَقَالَ: يَا رَسُولَ اللهِ! لَوْ أَمْسَيْتَ؟ قالَ: «انْزِل

فَاجْدَحْ لَنَا» قال: إنَّ عَلَيْكَ نَهَاراً، قال: «انْزِلْ فَاجْدَحْ لَنَا» قَالَ: فَنَزَلَ فَجَدَحَ لَهُمْ فَشَرِبَ رَسُولُ اللهِ ﷺ، ثُمَّ قالَ: «إذا رَأَيْتُمُ اللَّيْلَ قَدْ أَقْبَلَ مِنْ هٰهُنَا، فَقَدْ أَفْطَرَ الصَّائِمُ» وَأَشَارَ بِيَدِهِ قِبَلَ المَشْرِقِ. متفقٌ عليهِ.

قوله: «اجْدَحْ» بجيم ثُمَّ دالٍ ثُمَّ حَاءٍ مهملتين؛ أي: اخْلِطِ السَّوِيقَ بِالمَاءِ.

అన్నాడు, "దిగు, దిగి నా కోసం సత్తు పిండి కరగబెట్టు" అని దైవప్రవక్త (సల్లం) మళ్ళీ ఆదేశించారు. కాని అతను "సూర్యరశ్మి ఇంకా మిగిలి ఉంది, కాసేపు ఆగండి" అన్నాడు మళ్ళీ. కాని దైవప్రవక్త (సల్లం) (మాత్రం అతని మాటలేవీ పట్టించుకోకుండా), "దిగు, దిగి నా కోసం సత్తుపిండి కరగ బెట్టు" అని అన్నారు.

హదీసు ఉల్లేఖకులయిన అబ్దుల్లాహ్ (రజి) ఇలా అంటున్నారు: అప్పుడు ఆ వ్యక్తి వాహనం దిగి దైవప్రవక్త (సల్లం)కు సత్తు కరగబెట్టి ఇచ్చాడు. ఆయన దాన్ని సేవించి తన చేతిని తూర్పు వైపు సూచిస్తూ మీరు ఇటు నుంచి రేజీకటి కమ్ముకున్నట్లు చూడ గానే ఉపవాసి తన ఉపవాసాన్ని విరమించుకున్నాడని భావించండి" అని ఉపదేశించారు.

(బుఖారీ- ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

١٢٣٩ ـ وَعَنْ سَلْمَانَ بنِ عَامِرٍ الضَّبِّيِّ الصَّحَابِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قال: «إذا أَفْطَرَ أَحَدُكُمْ، فَلْيُفْطِرْ عَلى تَمْرٍ، فَإِنْ لَمْ يَجِدْ، فَلْيُفْطِرْ عَلَى مَاءٍ فَإِنَّهُ طَهُورٌ». رَوَاهُ أَبو دَاودَ، والترمذي وقالَ: حديثٌ حَسَنٌ صَحِيحٌ.

1239. హజ్రత్ సల్మాన్ బిన్ ఆమిర్ జబ్బీ సహాబీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా ఉపవాసం విరమించదలచుకున్న ప్పుడు (ఇఫ్తార్ చేయదలచుకున్న

ప్పుడు) ఖర్జూరపండుతో ఉపవాసం విరమించాలి. అది లభించకపోతే నీళ్ళతో విరమించాలి. ఎందుకంటే నీరు చాలా పరిశుద్ధమైన పదార్థం.

*(అబూదావూద్, తిర్మిజీ- హసన్, సహీహ్)*

*(సుననె అబూదావూద్‌లోని ఉపవాసాల ప్రకరణం - సుననె తిర్మిజీలోని ఉపవాస అధ్యాయాలు)*

١٢٤٠ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ يُفْطِرُ قَبْلَ أَنْ يُصَلِّيَ عَلَى رُطَبَاتٍ، فَإِنْ لَمْ تَكُنْ رُطَبَاتٌ فَتُمَيْرَاتٌ؛ فَإِنْ لَمْ تَكُنْ تُمَيْرَاتٌ حَسَا حَسَوَاتٍ مِنْ مَاءٍ. رَوَاهُ أَبُو داوُدَ، والترمذي وقال: حديثٌ حَسَنٌ.

1240. హజ్రత్ అనస్(రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నమాజుకు ముందు కొన్ని ఖర్జూర పండ్లతో ఉపవాసం విరమించేవారు. ఒకవేళ ఖర్జూర పండ్లు లభించకపోతే ఎండు ఖర్జూరాలతో నయినా విరమించేవారు. అవీ లభించని పక్షంలో కొన్ని గుటకల నీళ్ళతో ఉపవాసాన్ని విరమించేవారు.

*(అబూదావూద్, తిర్మిజీ- తిర్మిజీ దీనిని 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు)*

*(సుననె అబూదావూద్‌లోని ఉపవాసాల ప్రకరణం - సుననె తిర్మిజీలోని ఉపవాస అధ్యాయాలు)*

**223వ అధ్యాయం**

## ٢٢٣ ـ بَابُ أَمْرِ الصَّائِمِ بِحِفْظِ لِسَانِهِ وَجَوَارِحِهِ عَنِ الْمُخَالَفَاتِ وَالْمُشَاتَمَةِ وَنَحْوِهَا

## ఉపవాసి తన నాలుకను, ఇతర అవయవాలను అధర్మమైన పనుల నుండి, తిట్లు శాపనార్ధాల వంటి చెడు చేష్టల నుండి కాపాడుకోవాలి

١٢٤١ ـ عنْ أبي هُريرةَ رَضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إذا كَانَ يَوْمُ صَوْمِ أَحَدِكُمْ، فَلا يَرْفُثْ وَلَا يَصْخَبْ، فَإِنْ سَابَّهُ أَحَدٌ، أَوْ قَاتَلَهُ، فَلْيَقُلْ: إنِّي صَائِمٌ» متفقٌ عليه.

1241. హ[జత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరయినా ఉపవాసం పాటిస్తే, ఆ రోజున వారు వ్యర్థమైన మాటలు మాట్లాడరాదు. గలాటా చేయరాదు. ఒకవేళ ఎవరయినా తమల్ని దూషిస్తే లేక కయ్యానికి కాలుదువ్వితే వారితో- 'నేను ఉపవాసమున్నానండీ' అని (మర్యాదగా) చెప్పేయాలి.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు 217వ అధ్యాయంలో కూడా వచ్చింది. అందులోని అంశం ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది. కనుక దానిని ఇక్కడ కూడా ప్రస్తావించటం జరిగింది. ఇందులో బోధింపబడిన విషయమేమిటంటే ఒక ఉపవాసి తన ఉపవాస స్థితిలో ఆహారపానీయాలకు, సంభోగ సంబంధాలకు దూరంగా ఉన్నట్లే తన నాలుకను, ఇతర శరీరావయవాలను కూడా అధర్మ కార్యకలాపాల నుండి కాపాడుకోవాలి. ఒకవేళ ఎవరయినా ఉడికించటానికి,

కవ్వించటానికి ప్రయత్నించినా అనవసరంగా దాని రొంపిలో దిగబడకుండా తెలివిగా తప్పించుకోవాలి. ఎల్లప్పుడూ దైవధ్యానంలో, ఖుర్‌ఆన్ పారాయణంలో నిమగ్నులై ఉండాలి.

١٢٤٢ ـ وعنهُ قالَ: قالَ النَّبِيُّ ﷺ: «مَنْ لَمْ يَدَعْ قَوْلَ الزُّورِ وَالعَمَلَ بِهِ فَلَيْسَ للهِ حَاجَةٌ فِي أَنْ يَدَعَ طَعَامَهُ وَشَرَابَهُ» رواه البخاري.

1242. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా (ఉపవాసం ఉండి కూడా) అబద్ధాలు చెప్పటం, వాటిని అమలు చేయటం వదలుకోకపోతే ఆ వ్యక్తి అన్నపానీయాల్ని వదలిపెట్టడం పట్ల దేవునికి ఎలాంటి ఆసక్తి ఉండదు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఉపవాస వ్రతాన్ని పాటించేవారు దాని ఆశయాలను కూడా నెరవేర్చాలని ఈ హదీసు నొక్కి వక్కాణిస్తోంది. ఉపవాసి ఒకవైపు దైవప్రసన్నత కోసం కృషి చేస్తూ, మరో వైపు దైవాగ్రహానికి దారితీసే అధర్మ కార్యకలాపాలకు కూడా దూరంగా ఉండాలి. లేనిపక్షంలో అలాంటి ఉపవాసులకు ఎలాంటి పుణ్యం లభించదు. పైగా ఉపవాసస్థితిలో ఉండి కూడా ధర్మవిరుద్ధమయిన చేష్టలకు పాల్పడినందుకు పాపాన్ని కొనితెచ్చుకోవలసి ఉంటుంది. (వారి నిరాహార దీక్ష పట్ల దేవునికి ఎలాంటి ఆసక్తి లేదు) అంటే వారు ఉపవాసాన్ని మానేసి తినటం త్రాగటం మొదలుపెట్టాలని అర్థం ఎంతమాత్రం కాదు. ఇదొక హెచ్చరిక. వారు తమలో దైవభీతిని పెంపొందించుకొని చెడులకు దూరంగా ఉండాలన్నదే దాని ఉద్దేశ్యం.

## 224వ అధ్యాయం

## ٢٢٤ ـ بَابٌ فِي مَسَائِلَ مِنَ الصَّوْم

## ఉపవాసానికి సంబంధించి కొన్ని ఆదేశాలు

١٢٤٣ ـ عَنْ أَبي هريرةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النبيِّ ﷺ قالَ: «إذا نَسِيَ أَحَدُكُمْ، فَأَكَلَ، أَوْ شَرِبَ، فَلْيُتِمَّ صَوْمَهُ؛ فَإِنَّمَا أَطْعَمَهُ اللهُ وَسَقَاهُ» متفقٌ عليه.

1243. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరయినా ఉపవాస స్థితిలో మరిచిపోయి ఏదన్నా తిన్నా లేక త్రాగినా (వారి ఉపవాసం భంగం కాదు. ఆ తర్వాత మరేమీ తినకుండా) వారు తమ ఉపవాసాన్ని పూర్తిచేసుకోవాలి. ఎందుకంటే వాస్తవానికి వారికి దేవుడు తినిపించాడు, త్రాపించాడు.(బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఉపవాస స్థితిలో మరిచిపోయి ఏదయినా తిన్నా త్రాగినా దానివల్ల ఉపవాసానికి ఎలాంటి భంగం కలగదు. గుర్తొచ్చిన వెంటనే ఆ పనిని వదలిపెట్టి ఉపవాసాన్ని కొనసాగించాలి. ఆ ఉపవాసాన్ని మళ్ళీ పాటించనవసరం లేదు. అదే విధంగా దానికి ఎలాంటి పరిహారాన్ని కూడా చెల్లించుకోవాల్సిన అవసరం లేదు.

١٢٤٤ ـ وعن لَقِيطِ بنِ صَبِرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ: يا رسولَ اللهِ! أَخْبِرْني عَنِ الوُضوءِ؟ قالَ: «أَسْبِغ

1244. హజ్రత్ లఖీత్ బిన్ సబిరా (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) ను అడిగాను, "దైవప్రవక్తా! నాకు వుజూ గురించి తెలియజేయండి" అని. అందుకాయన నాకు ఈ విధంగా ఉపదేశించారు: సంపూర్ణరీతిలో వుజూ

الْوُضوءَ، وَخَلِّلْ بَيْنَ الأَصَابِعِ، وَبَالِغْ في الاسْتِنْشَاقِ، إلَّا أَنْ تَكونَ صَائِماً» رواه أبو داود، والترمذي وقال: حديثٌ حَسَنٌ صَحيحٌ.

చేసుకో, వ్రేళ్ళ మధ్య భాగాన్ని కూడా తడుపుకో. (సువాసనను గట్టిగా పీల్చి నట్టు) ముక్కులోనికి బాగా నీళ్ళు ఎక్కించి శుభ్రం చేసుకో. అయితే ఉపవాస స్థితిలో మాత్రం అలా చేయ నవసరం లేదు.

(అబూదావూద్, తిర్మిజీ - హసన్)

(సుననె అబూదావూద్‌లోని ఉపవాసాల ప్రకరణం - సుననె తిర్మిజీలోని ఉపవాసానికి సంబంధించిన అధ్యాయాలు)

### ముఖ్యాంశాలు

సాధారణ పరిస్థితుల్లో బాగా వుజూ చేయాలనుకున్నప్పుడు ముక్కులోనికి నీళ్ళు ఎక్కించి ముక్కును పూర్తిగా శుభ్రం చేసుకోవటం, నోటిలోనికి నీళ్లు తీసుకుని పుక్కిలిస్తూ 'గరారా' కూడా చేయటం అవసరం. అయితే ఉపవాసంలో ఉన్నప్పుడు ఆ విధంగా చేయకపోవటమే మంచిది. లేనిపక్షంలో ముక్కు లేక గొంతు ద్వారా నీళ్లు లోనికి వెళ్లిపోయి ఉపవాసం భంగం అయ్యే ప్రమాదముంది.

١٢٤٥ ـ وعنْ عائشةَ رَضيَ اللهُ عَنْها قالَتْ: كانَ رَسولُ اللهِ ﷺ يُدْرِكُهُ الفَجْرُ وَهُوَ جُنُبٌ مِنْ أَهْلِهِ، ثُمَّ يَغْتَسِلُ وَيَصُومُ. متفقٌ عليه.

1245. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: ఒక్కోసారి దైవప్రవక్త (సల్లం) ఉషోదయం వేళ (నిద్ర లేచేటప్పుడు ఆ రాత్రి) తమ భార్యతో కలిసి ఉండటం చేత లైంగిక అశుద్ధావస్థలో ఉండేవారు. ఆ తర్వాత (ఉషోదయం వేళ) స్నానం చేసి ఉపవాసం ఉండే వారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

١٢٤٦ ـ وعنْ عائشةَ وَأُمِّ سَلَمَةَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَتَا: كانَ رسولُ اللهِ ﷺ

1246. హజ్రత్ ఆయిషా (రజి) మరియు ఉమ్మె సలమా (రజి. అన్హా)లు చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒక్కోసారి తెల్లవారు

يُصْبِحُ جُنُبًا مِنْ غَيْرِ حُلْمٍ، ثُمَّ يَصُومُ. متفقٌ عليه.

(నిద్ర) లేచేటప్పుడు లైంగిక అశుద్ధావస్థలో ఉండేవారు. అయితే అది స్వప్నావస్థలో జరిగిన వీర్యస్ఖలనం కాదు. ఆ తర్వాత ఆయన అదే స్థితిలో ఉపవాసం ప్రారంభించేవారు.

(బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై రెండు హదీసుల భావం ఒక్కటే. దైవప్రవక్త (సల్లం) కొన్నికొన్నిసార్లు నిద్రలేచేటప్పుడు లైంగిక అశుద్ధావస్థలో ఉండేవారు. అయినప్పటికీ ఆయన అదే స్థితిలో సహ్రీ భుజించి ఉపవాసం మొదలుపెట్టేవారు. ఆ తర్వాత తలంటు పోసుకొని నమాజ్ చేసేవారు. నమాజ్ చేయటానికి పరిశుభ్రత అవసరంగాని, ఉపవాసం ప్రారంభించటానికి పరిశుద్ధావస్థ అవసరం లేదు. అంచేత లైంగిక అశుద్ధస్థితిలో ఉపవాసం ప్రారంభించినా దానివల్ల ఉపవాసానికి ఎలాంటి భంగం కలగదు.

మరో విషయం ఏమిటంటే దైవప్రవక్త (సల్లం)కు కలిగే అశుద్ధావస్థ భార్యతో సంభోగించినందువల్ల కలిగేదే గాని స్వప్నావస్థలో వీర్యస్ఖలనం వల్ల కలిగేది కాదు. ఎందుకంటే ప్రముఖుల అభిప్రాయం ప్రకారం స్వప్నావస్థలో వీర్యస్ఖలనం అనేది పైశాచిక దుష్ట ప్రేరేపణల వల్ల జరుగుతుంది. దైవప్రవక్తలు అలాంటివాటి నుండి సురక్షితంగా ఉంటారు.



**225వ అధ్యాయం**

# ٢٢٥ ـ بَابُ بَيَانِ فَضْلِ صَوْمِ الْمُحَرَّمِ وَشَعْبَانَ وَالأَشْهُرِ الْحُرُمِ

# ముహర్రమ్, షాబాన్ మరియు గౌరవప్రదమైన మాసాల్లో పాటించే ఉపవాసాల ఘనత

١٢٤٧ ـ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَفْضَلُ الصِّيَامِ بَعْدَ رَمَضَانَ: شَهْرُ اللهِ الْمُحَرَّمُ، وَأَفْضَلُ الصَّلاةِ بَعْدَ الفَرِيضَةِ: صَلاةُ اللَّيْلِ» رواه مسلمٌ.

1247. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రమజాన్ తర్వాత దేవుని మాసమయిన ముహర్రమ్ నెలలో పాటించబడే ఉపవాసాలు అత్యంత శ్రేష్ఠమైనవి. అదే విధంగా ఫర్జ్ (విధి) నమాజుల తర్వాత పాటించబడే (నఫిల్) నమాజుల్లో తహజ్జుద్ నమాజు అత్యంత శ్రేష్ఠమైనది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముహర్రమ్ మాసపు ఘనతను వెల్లడించటానికి దాన్ని "దేవుని మాసం" అని అనటం జరిగింది. ఉదాహరణకు మనం దైవగృహం, దేవుని ఒంటె అని చెబుతుంటాం. అలా చెప్పినంత మాత్రాన అవి దేవుడు వాడుకునే వస్తువులు కానక్కర్లేదు. వాటి విశిష్ఠతను వివరించటమే దాని ఉద్దేశ్యం. నాలుగు గౌరవప్రదమైన మాసాల్లో ముహర్రమ్ కూడా ఒకటి. ఇస్లామీయ క్యాలెండరు ఈ మాసంతోనే ప్రారంభమవుతుంది. మిగతా మూడు మాసాలు జుల్‌ఖాదా, జుల్‌హిజ్జా, రజ్జబ్. వీటిలో ముహర్రమ్ మాసపు ప్రత్యేకత ఏమిటంటే ఈ నెలలో పాటించబడే ఉపవాసాలు ఒక్క రమజాన్ నెలను మినహాయించి చూస్తే మిగతా నెలలన్నిటి ఉపవాసాల కన్నా ఎంతో శ్రేష్ఠమైనవి.

١٢٤٨ ـ وعَنْ عائشةَ رَضِيَ اللهُ عَنْهَا

1248. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) షాబాన్

قَالَتْ: لَمْ يَكُنِ النَّبِيُّ ﷺ يَصُوم مِنْ شَهْرٍ أَكْثَرَ مِنْ شَعْبَانَ، فَإِنَّهُ كَانَ يَصُوم شَعْبَانَ كلَّه. وفي روايةٍ: كَانَ يَصُومُ شَعبانَ إلَّا قَلِيلاً. متفقٌ عليه.

నెలలో (నఫిల్) ఉపవాసాలు పాటించినంతగా మరే ఇతర నెలలోనూ పాటించేవారు కాదు. నిశ్చయంగా ఆయన షాబాన్ నెలసాంతం ఉపవాసం పాటించేవారు.

వేరొక ఉల్లేఖనం ప్రకారం షాబాన్ నెలలోని కొన్ని రోజులు మినహాయించి మిగతా రోజులన్నీ ఆయన ఉపవాసం పాటించేవారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) షాబాన్ మాసంలో అత్యధికంగా ఉపవాసాలు పాటించటానికి గల కారణాన్ని వేరొక హదీసు ఈ విధంగా వివరించింది: దాసుల కర్మలు షాబాన్ మాసంలో దైవసన్నిధిలో ప్రవేశపెట్టబడతాయి. అందుకని దైవప్రవక్త (సల్లం) తాను ఉపవాసంలో ఉన్న స్థితిలోనే తన కర్మలు దైవసన్నిధిలో ప్రవేశపెట్టబడాలన్న ఉద్దేశ్యంతో ఆ మాసంలో వీలైనంత ఎక్కువగా ఉపవాసాలు పాటించేవారు (నసాయి).

అయితే సామాన్య ముస్లింలు మాత్రం షాబాన్ మాసపు పదిహేనవ తేదీ వరకు ఉపవాసాలు పాటించి, ఆ తర్వాత నఫిల్ ఉపవాసాలు పాటించటం మానుకోవాలి. లేకపోతే ఒళ్ళు నీరసించి, శక్తిసామర్థ్యాలు క్షీణించి రమజాన్ మాసంలో విధిగా పాటించవలసిన ఉపవాసాల మీద దాని ప్రభావం పడవచ్చు. అది వాంఛనీయం కాదు. ఇకపోతే దైవప్రవక్త (సల్లం) సంగతి వేరు. ఆయనకు దేవుని తరఫు నుండి ఎంతో ఆధ్యాత్మిక శక్తి లభిస్తూ ఉండేది. అందువల్ల ఆయన ఎన్ని ఉపవాసాలు పాటించినా నీరసించిపోయేవారు కాదు. బహుశా అందుకేనేమో తాను స్వయంగా 'సౌమె విసాల్' (నిరంతర ఉపవాసాలు) పాటించినప్పటికీ ఆయన తన అనుచర సమాజాన్ని మాత్రం ఆ విధంగా నిరంతరంగా ఉపవాసాలు పాటించకుండా వారించారు.

١٢٤٩ ـ وعن مجيبةَ البَاهِلِيَّةِ عَنْ أَبِيهَا أَوْ عَمِّهَا، أَنَّهُ أَتَى رَسُولَ اللهِ ﷺ، ثُمَّ انْطَلَقَ فَأَتَاهُ بَعْدَ سَنَةٍ، وَقَدْ تَغَيَّرَتْ حَالُهُ

1249. హజ్రత్ ముజీబా బాహిలియా తన తండ్రి లేక పెదనాన్న నుండి చేసిన కథనం ప్రకారం ఆయన ఒకసారి దైవప్రవక్త (సల్లం) ను సందర్శించుకొని

وَهَيْئَتَهُ، فَقَالَ: يا رَسُولَ اللهِ! أَمَا تَعْرِفُنِي؟ قَالَ: «وَمَنْ أَنتَ؟» قالَ: أَنَا البَاهِلِيُّ الَّذِي جِئْتُكَ عامَ الأَوَّلِ. قَالَ: «فَمَا غَيَّرَكَ، وَقَدْ كُنْتَ حَسَنَ الهَيْئَةِ؟» قالَ: مَا أَكَلْتُ طَعَاماً مُنْذُ فَارَقْتُكَ إِلَّا بِلَيْلٍ. فَقَالَ رَسولُ اللهِ ﷺ: «عَذَّبْتَ نَفْسَكَ!» ثُمَّ قَالَ: «صُمْ شَهْرَ

తిరిగి వెళ్ళిపోయారు. ఆ తర్వాత ఒక సంవత్సరానికి తిరిగొచ్చారు. అప్పటికి ఆయన చాలా మారిపోయి ఉన్నారు. ఆయన వాలకంలో చాలా మార్పులొచ్చాయి. (దైవప్రవక్త - సల్లం- తన వంక ఆశ్చర్యంగా చూస్తుంటే) "ఏమిటి దైవప్రవక్తా! నేనెవర్నో గుర్తురావటం లేదా?" అన్నారు. "అదే, ఎవర్నువ్వు?" అని అడిగారు దైవప్రవక్త(సల్లం). "నేను దైవప్రవక్తా! బాహిలీని..... క్రితం సంవత్సరం మీ దగ్గరికి వచ్చాను చూడండి....." అన్నారాయన. ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) ఆశ్చర్యపోతూ,"(నువ్వా!) ఏమిటి మనిషి అలా మారిపోయావ్. ఇంతకు ముందు చాలా బావుండే వాడివే!" అన్నారు. అందుకాయన "(మరేంలేదు దైవప్రవక్తా!) నిరుడు మిమ్మల్ని కలుసుకొని వెళ్ళినప్పటి నుంచి (పగలల్లా ఉపవాసం పాటించి) కేవలం రాత్రి భోజనం మాత్రమే చేస్తున్నాను" అని చెప్పారు. అది విని దైవప్రవక్త (సల్లం) ఆయన్ని మందలిస్తూ, "ఆత్మ శిక్షకు పాల్పడ్డావా? (ఇక నుంచి) సహన మాసం (రమజాన్)లో ఉపవాసాలు పాటించి ఆ తర్వాత ప్రతి నెలా ఒక రోజు మాత్రమే ఉపవాసం ఉండు" అని హితోపదేశం చేశారు. "నా దగ్గర చాలా బలముంది. కనుక ఉపవాసాల

الصَّبْرِ، وَيَوْماً مِنْ كُلِّ شَهْرٍ» قالَ: زِدْنِي؛ فَإِنَّ بِي قُوَّةً، قالَ: «صُمْ يَوْمَيْنِ» قالَ: زِدْنِي، قالَ: «صُمْ ثَلاثَةَ أَيامٍ» قالَ: زِدْنِي، قالَ: «صُمْ مِنَ الحُرُمِ وَاتْرُكْ، صُمْ مِنَ الحُرُمِ وَاتْرُكْ، صُمْ مِنَ الحُرُمِ وَاتْرُكْ» وقالَ بِأَصَابِعِهِ الثَّلاثِ فَضَمَّهَا، ثُمَّ أَرْسَلَهَا. رواه أبو داود. و «شهرُ الصَّبرِ» رَمَضَانُ.

సంఖ్యను మరికాస్త పెంచండి" అని కోరారాయన. "అయితే రెండు రోజులు ఉపవాసం ఉండు" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). ఆయన మళ్ళీ, "ఇంకాస్త పెంచండి"అని కోరారు. "మూడ్రోజులు ఉపవాసం ఉండు చాలు" అని అన్నారు దైవప్రవక్త (సల్లం).

ఆయన మళ్ళీ "నా కోసం ఇంకా పెంచండి" అని కోరారు. అప్పుడు దైవ ప్రవక్త (సల్లం) "(అవసరం లేదు) గౌరవ ప్రదమైన మాసాల్లో (మూడ్రోజులు) ఉపవాసం పాటించి ఆ తర్వాత వదలి పెట్టు. గౌరవప్రదమైన (నిషిద్ధ) మాసాల్లో ఉపవాసం పాటించి ఆ తర్వాత వదలిపెట్టు. గౌరవప్రదమైన (నిషిద్ధ) మాసాల్లో మూడ్రోజులు ఉపవాసం పాటించి ఆ తర్వాత వదలి పెట్టు" అని (మూడుసార్లు) బోధించారు.

ఆ సమయంలో ఆయన తన మూడు వ్రేళ్ళను కలుపుతూ, వదిలేస్తూ సైగ చేసి చూపించారు. (అబూదావూద్)

*(సుననె అబూదావూద్‌లోని ఉపవాసాల ప్రకరణం)*

షేఖ్ అల్‌బానీగారు "అత్తాలీఖుర్రగీబు అలత్తర్‌గీబి వత్తర్‌హీబ్" అనే గ్రంథంలో ఈ హదీసు ఆధారాలను బలహీనమైనవిగా ఖరారు చేశారు.

## ముఖ్యాంశాలు

ముజీబా బాహిలియా తండ్రి పేరు అబ్దుల్లాహ్ బిన్ హారిస్ బాహిలీ. ఒకవేళ ఈ హదీసుని వివరించినది ఆమె పెదనాన్న అయితే ఆయన పేరు తెలియదు. దానిక్కారణం ఆయన గారి అసలు పేరు ఖ్యాతిగాంచలేదు. ఏమయినప్పటికీ ఆయన ఒక సంవత్సరం మొత్తం పగలల్లా ఉపవాసం ఉండి కేవలం రాత్రి భోజనం మాత్రమే చేసేవారు. దానివల్ల ఆయన ఆరోగ్యం చాలా దెబ్బతిన్నది. అది చూసి దైవప్రవక్త (సల్లం) ఆయన్ని మందలించి ఎల్లప్పుడూ ఉపవాసం పాటించవద్దని వారించారు. దానికి బదులు ప్రతి నెలా ముఖ్యంగా నిషిద్ధ (అంటే గౌరవ ప్రదమైన) మాసాల్లో మూడ్రోజులు ఉపవాసముండి ఆ తర్వాత వదిలేయమని తాకీదు చేశారు. ఒక సత్కార్యానికి పదిరెట్ల పుణ్యం లభిస్తుంది. కనుక మూడ్రోజులు ఉపవాసముంటే ముప్పై రోజులు ఉపవాసం పాటించినట్లే. ఆ విధంగా ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసముంటే నిత్యం ఉపవాసం పాటించినట్లే అవుతుంది కదా!

ఒకవేళ ఎవరయినా మరీ ఎక్కువ ఓపిక ఉన్నవారయితే వారు దావూదీ ఉపవాస వ్రతాన్ని అనుసరించాలి. అంటే ఒకరోజు ఉపవాసం పాటిస్తే, మరోరోజు ఉపవాసం వదిలేయాలి. దావూద్ (అలైహిస్సలామ్) ఇలాగే చేసేవారు. మరో విషయం ఏమిటంటే మనిషి ఉపవాసానికి అలవాటు పడిపోకూడదు. అలవాటు పడిపోతే ఉపవాసంలో ఆకలి, బాధ అనిపించదు. కనుక ఒకరోజు విడిచిపెట్టి మరో రోజు ఉపవాసం పాటించాలి. దానివల్ల సరిక్రొత్తగా ఉపవాసం ప్రారంభించినప్పుడల్లా ఆకలి బాధలు కల్గుతాయి. అవి పుణ్యఫలాలకు కారణభూతమవుతాయి.



**226వ అధ్యాయం**

## ٢٢٦ - بَابُ فَضْلِ الصَّوْمِ وَغَيْرِهِ فِي الْعَشْرِ الأَوَّلِ مِنْ ذِي الْحِجَّةِ

## జిల్‌హిజ్జా మాసపు తొలి దశకంలో ఉపవాసం మరియు ఇతర సత్కార్యాల ఘనత

١٢٥٠ - عن ابن عبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَا مِنْ أيام العَمَلُ الصَّالحُ فِيهَا أَحَبُّ إلَى اللهِ مِنْ هذِهِ الأيَّام» يعني: أيامَ العشرِ، قالوا: يا رسولَ اللهِ! وَلا الجهادُ في سبيلِ اللهِ؟ قالَ: «وَلا الجهادُ في سبيلِ اللهِ، إلَّا رَجُلٌ خَرَجَ بِنَفْسِهِ، وَمَالِهِ، فَلَم يَرجِعْ مِنْ ذلكَ بِشَيءٍ» رواه البخاريُّ.

1250. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం, దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రమజాన్ మాసపు తొలి పదిరోజుల్లో చేయబడిన సత్కార్యాల కన్నా ఇతర దినాల్లో చేసిన సత్కార్యాలేవీ దేవుని దృష్టిలో అత్యంత ప్రియమైనవి కావు.

అది విని సహచరులు సందేహ పడుతూ, "దైవప్రవక్తా! అల్లాహ్ మార్గంలో చేయబడే పోరాటం కూడా (దాని కన్నా ప్రియమైనది) కాదా?" అని అడిగారు. దానికి సమాధానమిస్తూ, "అల్లాహ్ మార్గంలో చేయబడిన పోరాటం కూడా (ప్రియమైనది) కాదు. ఒకవేళ ఎవరయినా ధన ప్రాణాలు సమేతంగా బయలుదేరి వాటిలో ఏదీ తిరిగిరాకపోతే (అంటే దైవమార్గంలో వీరమరణం పొందితే మాత్రం నిశ్చయంగా అతను శ్రేష్ఠుడే)" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని పండుగల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

జిల్‌హిజ్జా మాసపు మొదటి పదిరోజుల్లో హజ్ యాత్రికులు ప్రత్యేక ఆరాధనా కార్య కలాపాలు నిర్వర్తిస్తారు. కాని హజ్ చేయలేకపోతున్నవారు ఆ పుణ్యానికి నోచుకోలేరు. అందుకని అలాంటివారు తమ స్వంత ప్రదేశాల్లోనే ఉండి నఫిల్ ఉపవాసాలు ఇతర ఆరాధనా కార్యకలాపాలు చేసుకొని వీలైనంత ఎక్కువగా పుణ్యాన్ని సంపాదించుకోగలగాలన్న ఉద్దేశ్యంతో జిల్‌హిజ్జా మాసపు తొలి పది రోజుల్లో చేయబడే సత్కార్యాలు దేవునికి అత్యంత ప్రియమైనవని ప్రకటించడం జరిగింది. ఇస్లాంలో 'జిహాద్'కు చాలా ప్రాముఖ్యత ఉందన్న విషయం కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతున్నది.



**227వ అధ్యాయం**

# ٢٢٧ - بَابُ فَضْلِ صَوْمِ يَوْمِ عَرَفَةَ وَعَاشُورَاءَ وَتَاسُوعَاءَ

# అరఫా రోజు మరియు ముహర్రమ్ మాసపు తొమ్మిదో, పదో తేదీల్లో పాటించబడే ఉపవాసాల ఘనత

١٢٥١ - عنْ أبي قَتَادَةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: سُئِلَ رسولُ اللهِ ﷺ عَنْ صَوْمِ يَوْمِ عَرَفَةَ؛ قالَ: «يكفِّرُ السَّنَةَ المَاضِيَةَ وَالبَاقِيَةَ» رواه مسلمٌ.

1251. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)ను అరఫా నాటి ఉపవాసం గురించి విచారించటం జరిగింది. అందుకాయన సమాధానమిస్తూ, "అది క్రితం యేడు మరియు వచ్చేయేటి పాపాలన్నిటినీ తుడిచిపెట్టేస్తుంది" అని వివరించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

జుల్హిజ్జా మాసపు తొమ్మిదో తేదీని 'అరఫా రోజు' అని పిలుస్తారు. ఆ రోజు హజ్ యాత్రికులందరూ అరఫాత్ మైదానంలో ఆగుతారు, కనుక ఆ రోజును 'అరఫాత్ రోజు'గా వ్యవహరిస్తారు. ఆ విధంగా అరఫాత్ మైదానంలో ఆగటమనేది హజ్ విధులన్నిటిలోనూ అత్యంత ప్రధానమైనది. దాన్ని నిర్వర్తించకపోతే హజే నెరవేరదు. హజ్ యాత్రికులు ఆ రోజున ప్రార్థనలు, సంకీర్తనల్లో నిమగ్నులై ఉంటారు. ఆనాడు వారికి అదే గొప్ప ఆరాధనగా పరిగణించబడుతుంది. కనుక వారు ఆ రోజు ఉపవాసం పాటించటం అభిలషణీయం కాదు. కాని హజ్ యాత్రలో పాల్గొనని వారికి మాత్రం ఆ రోజు ఉపవాసం పాటిస్తే గొప్ప ప్రతిఫలం లభిస్తుంది. ఆ ఒక్క ఉపవాసం రెండేళ్ల పాపాలను తుడిచిపెట్టేస్తుంది.

١٢٥٢ - وعَنِ ابنِ عباسٍ رضيَ اللهُ عَنهمـا، أَنَّ رسـولَ اللهِ ﷺ صَـامَ يَـوْمَ عَاشورَاءَ، وَأَمَرَ بِصِيَامِهِ. متفقٌ عليه.

1252. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఆషూరా రోజు (అంటే ముహర్రమ్ నెల

పదో తేదీన) స్వయంగా ఉపవాసం ఉన్నారు. ఆ రోజు ఉపవాసం పాటించమని (తన సహచరుల్ని) ఆదేశించారు కూడా. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం -సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ముహర్రమ్ పదో తేదీని 'ఆషూరా' అని పిలుస్తారు. ఇతర హదీసుల ద్వారా తెలిసేదేమంటే, దైవప్రవక్త (సల్లం) మక్కా నుండి మదీనాకు వలసవచ్చినప్పుడు మదీనాలోని యూదులు ముహర్రమ్ మాసపు పదో తేదీన ఉపవాసం పాటించటాన్ని ఆయన గమనించారు. వారిని ఉద్దేశ్యించి, "మీరు ఈ రోజు ఉపవాసం ఎందుకు పాటిస్తారు?" అని అడిగారు. దానికి యూదులు, "దేవుడు ఈ రోజు మూసా ప్రవక్తకు ఫిరౌన్ ఆగడాల నుండి విముక్తినొసగాడు. ఆ సంతోషఘడియల్ని పురస్కరించుకుని మేము ఈ రోజు ఉపవాసం పాటిస్తాం" అని చెప్పారు. అది విని దైవప్రవక్త (సల్లం) "మూసా ప్రవక్త సంతోషంలో పాలుపంచుకోవటానికి మీకంటే మేము ఎక్కువ హక్కుదారులం" అంటూ ఆయన కూడా ఆ రోజు ఉపవాసం పాటించారు. అంతేకాదు, వచ్చే ఏడాది గనక బ్రతికుంటే యూదులకు వ్యతిరేకంగా తాను పదో తేదీతోపాటు తొమ్మిదో తేదీన కూడా ఉపవాసం పాటిస్తానని ప్రకటించారు. వేరొక ఉల్లేఖనం ప్రకారం ఆయన తన సహచరులకు 'మీరు ఆషూరా రోజుతోపాటు తొమ్మిదో తేదీ లేక పదకొండో తేదీన కూడా ఉపవాసం పాటించండి. ఆ విధంగా రెండు రోజులు ఉపవాసం పాటించి యూదుల పట్ల వ్యతిరేకతను ప్రదర్శించండి' అని బోధించారు. కనుక ముహర్రమ్ మాసపు 9, 10, 11 తేదీల్లో ఉపవాసం పాటించటం మస్నూన్ (సంప్రదాయం). కాని శోచనీయమైన విషయం ఏమిటంటే నేడు ముస్లింలు ఈ సంప్రదాయాన్నయితే ఆచరించరు; పైగా దాని స్థానంలో అనేక దురాచారాలను నిర్వహిస్తారు. లేదంటే షియాలు జరిపే ప్రత్యేక సంతాప ఊరేగింపుల్లో పాల్గొంటారు. నిజం చెప్పాలంటే అలాంటి ఊరేగింపుల్లో పాల్గొనటం మహాపాపం.

١٢٥٣ - وعنْ أَبِي قَتَادَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ سُئِلَ عَنْ صِيَامِ يَوْمِ عَاشُورَاءَ، فَقَالَ: «يُكَفِّرُ السَّنَةَ المَاضِيَةَ». رواهُ مُسْلِمٌ.

1253. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)ను ఆషూరా నాటి ఉపవాసం గురించి విచారించటం జరిగింది. అందుకాయన సమాధాన మిస్తూ, "అది గత సంవత్సరపు పాపాలన్నిటినీ తుడిచిపెట్టేస్తుంది" అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

١٢٥٤ - وعَنِ ابنِ عَبَّاس رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَئِنْ بَقِيتُ إلى قابِلٍ لأَصُومَنَّ التَّاسِعَ» رواهُ مُسْلِمٌ.

1254. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒకవేళ నేను వచ్చే సంవత్సరం వరకు బ్రతికుంటే ముహర్రమ్ మాసపు (పదో తేదీతో పాటు) తొమ్మిదో తేదీన కూడా ఉపవాసం పాటిస్తాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొంతమంది ఈ హదీసును "నేను కేవలం తొమ్మిదో తేదీన మాత్రమే ఉపవాసం పాటిస్తాను" అనే అర్థంలో వివరించారు. కాని ఈ వివరణ సరయినది కాదు. ఇతర హదీసులు ఈ వివరణను త్రోసిపుచ్చుతున్నాయి. దైవప్రవక్త (సల్లం) యూదుల పట్ల వ్యతిరేకతను ప్రదర్శించాలనే ఉద్దేశ్యంతో ముహర్రమ్ మాసపు పదో తేదీతోపాటు తొమ్మిదో తేదీన కూడా ఉపవాసం పాటిస్తానని నిశ్చయించుకున్నారు. అంతేకాదు, తన సహచరుల్ని కూడా అలా చేయమని ఆదేశించారు. ముస్నదె అహ్మద్ గ్రంథంలో దీని ప్రస్తావన ఉంది. ఈ విషయాన్ని మేము ఇంతకు ముందు ముఖ్యాంశాల్లో కూడా వివరించాం. అందుకే హదీసు మూలాన్ని కూడా ఆ భావానికి అనుగుణంగా అనువదించాం.

## 228వ అధ్యాయం

# ٢٢٨ - بَابُ اسْتِحْبَابِ صَوْمِ سِتَّةِ أَيَّامٍ مِنْ شَوَّالٍ

# షవ్వాల్ మాసంలో ఆరు రోజులు ఉపవాసం పాటించటం అభిలషణీయం

١٢٥٥ - عَنْ أَبِي أَيوبَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ قَالَ: «مَنْ صَامَ رَمَضَانَ، ثُمَّ أَتْبَعَهُ سِتًّا مِنْ شَوَّالٍ، كانَ كصِيَامِ الدَّهْرِ» رواهُ مُسْلِمٌ.

1255. హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఎవరయినా రమజాన్ నెలసాంతం ఉపవాసాలు పాటించి ఆ తర్వాత షవ్వాల్ మాసపు ఆరు రోజులు ఉపవాసం పాటిస్తే వారు కాలమంతా ఉపవాసం పాటించినట్లే. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

"ఒక సత్కార్యానికి పదింతల పుణ్యం లభిస్తుంది" అన్న దివ్యఖుర్‌ఆన్ సూక్తి ఆధారంగా ఒక రమజాన్ నెల ఉపవాసం పాటిస్తే పది నెలలు ఉపవాసం పాటించినట్లుగా పరిగణించ బడుతుంది. ఆ తర్వాత షవ్వాల్ మాసంలో పాటించబడే ఆర్రోజుల ఉపవాసం రెండు నెలల ఉపవాసంగా భావింపబడుతుంది. అవన్నీ కలిసి మొత్తం పన్నెండు నెలలు అంటే ఒక సంవత్సరమన్నమాట. ఆ విధంగా ఎవరయినా ప్రతి యేడు రమజాన్‌తోపాటు షవ్వాల్ మాసంలో ఆరు రోజులు నఫిల్ ఉపవాసాలు పాటిస్తూ ఉంటే వారు జీవితమంతా ఉపవాసం పాటించినట్లుగా భావించటం జరుగుతుంది. కనుక షవ్వాల్ మాసపు ఆరు రోజుల ఉపవాసాలు నఫిల్ అయినప్పటికీ వాటికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. ఆ ఉపవాసాలను నిరంతరాయంగా నయినా పాటించవచ్చు లేదా అప్పుడప్పుడయినా పాటించవచ్చు. అయితే ఆరు ఉపవాసాలనూ షవ్వాల్ నెలలోనే పాటించాలన్నది నియమం. ఇకపోతే వ్యాధి, ప్రయాణం తదితర కారణాలచేత రమజాన్ మాసపు ఉపవాసాలన్నీ పాటించలేక పోయినవారు ముందుగా వాటిని పూర్తి (ఖజా) చేసుకొని ఆ తర్వాతే షవ్వాల్ మాసపు నఫిల్ ఉపవాసాలు పాటించాలి.

**229వ అధ్యాయం**

## ٢٢٩ - بَابُ اسْتِحْبَابِ صَوْمِ الاِثْنَيْنِ وَالْخَمِيسِ

## సోమ, గురువారాల్లో ఉపవాసం ఉండటం పుణ్యప్రదం

١٢٥٦ - عن أَبي قَتَادَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ سُئِلَ عَنْ صَوْمِ يَوْمِ الاثْنَيْنِ فَقَالَ: «ذلكَ يَوْمٌ وُلِدْتُ فِيهِ، وَيَوْمٌ بُعِثْتُ، أَوْ أُنْزِلَ عَلَيَّ فِيهِ» رواه مسلم.

1256. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)ను సోమ వారం నాటి ఉపవాసం గురించి విచారించటం జరిగింది. అందు కాయన సమాధానమిస్తూ, "అది నా పుట్టిన రోజు, నేను దైవప్రవక్తగా నియమించ బడిన రోజు (లేక) నాపై వహీ అవతరణ ప్రారంభమైన రోజు" అని వివరించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

సోమవారం తన పుట్టిన రోజు, తను దైవప్రవక్తగా నియమించబడిన రోజు అయినందున ఆ సంతోషదినాన తాను ఉపవాసం పాటిస్తానన్నదే దైవప్రవక్త (సల్లం) ప్రవచన ఉద్దేశ్యం. ఈ సందర్భంగా చెప్పుకోవలసిన ముఖ్య విషయమేమిటంటే దైవప్రవక్త (సల్లం) తన జీవితంలో ఎన్నడునూ "పుట్టిన రోజు పండుగ" (Birth day) జరుపుకోలేదు. కాకపోతే ప్రతి సోమవారం ఉపవాసముండేవారు, అంతే! కాని నేడు ఒక వర్గం వారు ఏడాదికోసారి ఎంతో ఆర్భాటంగా దైవప్రవక్త వారి పుట్టినరోజు పండుగ జరుపుతున్నారు. అలాంటి వారికి ఈ హదీసు కనువిప్పు కావాలి. ఆ రోజున దైవప్రవక్త (సల్లం) కు అత్యంత ప్రియమైన ఆచరణ ఉపవాసం పాటించటం. ఆయన స్వయంగా ఆ రోజున ఉపవాసం పాటించేవారు. అలాగాకుండా "మీలాదున్నబీ" పేరుతో ఊరేగింపులు నిర్వహించటం, దీపాలు వెలిగించటం, మసీదుల్ని, వీధులను అలంక రించటం కోసం లక్షలు, కోట్లు ఖర్చుపెట్టడం - ఇవన్నీ సహవాస దోషం వల్ల ముస్లింలకు అబ్బిన దురాచారాలు మాత్రమే. వీటికి ఇస్లాం ధర్మంతో ఎలాంటి సంబంధం లేదు. ఇస్లామీయ విధుల్ని, ధర్మసూత్రాలను తుంగలో తొక్కి కేవలం ఆర్భాటంతో 'మీలాదున్నబీ' పండుగ జరుపుకుంటే దైవప్రవక్త (సల్లం) పట్ల కపట ప్రేమను ప్రదర్శించినట్లే అవుతుంది.

١٢٥٧ ـ وعَنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عنه عَنْ رسولِ اللهِ ﷺ قالَ: «تُعْرَضُ الأعْمَالُ يَوْمَ الاثْنَيْنِ وَالخَمِيسِ، فَأُحِبُّ أَنْ يُعْرَضَ عَمَلِي وَأَنَا صَائِمٌ» رَوَاهُ التِّرْمِذِيُّ وقالَ: حديثٌ حَسَنٌ، ورواهُ مُسلمٌ بغيرِ ذِكرِ الصَّوْمِ.

1257. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: సోమ మరియు గురువారాల్లో (దేవుని సన్నిధిలో దాసుల) ఆచరణలు ప్రవేశపెట్టబడతాయి. అందుకని నేను ఉపవాసిగా ఉన్న స్థితిలో నా ఆచరణ ప్రవేశపెట్టబడటాన్ని నేనిష్టపడతాను. *(తిర్మిజీ)*

తిర్మిజీ దీనిని 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు. ఇమామ్ ముస్లిం కూడా ఈ హదీసుని వెలికి తీశారు. అయితే అందులో ఉపవాస ప్రస్తావన లేదు.

*(సుననె తిర్మిజీలోని ఉపవాస అధ్యాయాలు - సుననె ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

/ సహీహ్ ముస్లింకు చెందిన హదీసు మున్ముందు అధ్యాయాల్లో రాబోతోంది. 1570వ హదీసు చూడండి.

١٢٥٨ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْها قَالَتْ: كانَ رسولُ اللهِ ﷺ يَتَحَرَّى صَوْمَ الاثْنَيْنِ وَالخَمِيسِ. رواه الترمذيُّ وقال: حديثٌ حسنٌ.

1258. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) సోమ గురువారాల్లో ఎంతో శ్రద్ధాసక్తులతో ఉపవాసం పాటించేవారు. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని ఉపవాస అధ్యాయాలు)*

## 230వ అధ్యాయం

## ٢٣٠ ـ بَابُ اسْتِحْبَابِ صَوْمِ ثَلاثَةِ أَيَّامٍ مِنْ كُلِّ شَهْرٍ

## ప్రతి నెలా మూడ్రోజులు ఉపవాసం పాటించటం అభిలషణీయం

والأفضلُ صومُهَا في الأيام البيضِ، وَهِيَ: الثَّالِثَ عَشَرَ، والرَّابِعَ عَشَرَ، والخامِسَ عَشَرَ. وقِيلَ: الثَّانِيَ عشرَ، وَالثَّالِثَ عَشَرَ، وَالرَّابِعَ عَشَرَ، وَالصحيحُ المَشْهُورُ هُوَ الأَوَّلُ.

ప్రతి నెలా మూడు పున్నమి దినాల్లో ఉపవాసం ఉండటం శ్రేష్ఠమైన పద్ధతి. పున్నమి దినాలంటే చాంద్రమానం ప్రకారం నెలలోని 13, 14, 15 తారీకులు. మరికొందరి అభిప్రాయం ప్రకారం 12,13,14 తారీకులు. అయితే తొలి మాటే సరయినది, ప్రసిద్ధి చెందినదీను.

*(ఈ పలుకులు మాత్రం ఇమామ్ నవవీ -రహ్మాలై- గారివి. -అనువాదకుడు)*

١٢٥٩ ـ وعن أبي هُريرةَ رَضيَ اللهُ عَنْهُ قالَ: أَوْصاني خليلي ﷺ بثلاثٍ: صيامِ ثلاثةِ أيَّامٍ مِن كلِّ شهرٍ، وَرَكعَتَي الضُّحى، وَأَنْ أُوتِرَ قَبْلَ أَنْ أَنامَ. مُتفقٌ عليهِ.

1259. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: నా మిత్రులు (అంటే దైవప్రవక్త -సల్లం) నాకు మూడు విషయాల గురించి హితోపదేశం చేసి వెళ్ళారు. 1) ప్రతి నెలా మూడురోజులు ఉపవాసం పాటించటం, 2) చాష్త్ వేళ రెండు రకాతుల నమాజు చేయుటం, 3) రాత్రి నేను నిద్రపోయే ముందే విత్ర్ నమాజు చేసుకోవటం. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١٢٦٠ ـ وعَنْ أَبي الدَّرْدَاءِ رَضيَ اللهُ عَنْهُ قالَ: أَوْصَانِي حَبِيبِي ﷺ بِثَلاثٍ لَنْ

1260. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం: నా ప్రియుడు (దైవప్రవక్త -సల్లం) నాకు మూడు విషయాల గురించి హితోపదేశం చేసి వెళ్ళారు. నేను వాటిని ఎన్నటికీ నిర్లక్ష్యం చేయను. అవి: 1) ప్రతి నెలా మూడు

أَدَعُهُنَّ مَا عِشْتُ: بِصِيَامِ ثَلاثَةِ أَيَّامٍ مِنْ كُلِّ شَهْرٍ، وَصَلاةِ الضُّحَى، وَبِأَنْ لا أَنَامَ حَتَّى أُوتِرَ. رواهُ مُسْلِمٌ.

రోజులు ఉపవాసం పాటించటం, 2) చాష్త్ వేళ నమాజ్ చేయటం, 3) నిద్ర పోకముందే విత్ర్ నమాజు చేసుకోవటం. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

١٢٦١ - وَعَنْ عبدِ الله بنِ عَمْرِو بنِ العاصِ رَضِيَ اللهُ عنهُما قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «صَوْمُ ثَلاثَةِ أَيَّامٍ مِنْ كُلِّ شَهْرٍ صَوْمُ الدَّهْرِ كُلِّهِ» مُتَّفَقٌ عليهِ.

1261. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసం ఉండటం సంవత్సరమంతా (లేక ఎల్లకాలం) ఉపవాసం ఉండటంతో సమానం. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

١٢٦٢ - وعنْ مُعاذَةَ العَدَوِيَّةِ أَنَّها سَأَلَتْ عائشةَ رَضِيَ اللهُ عَنْها: أَكانَ رَسُولُ اللهِ ﷺ يصومُ مِنْ كُلِّ شَهْرٍ ثلاثةَ أَيَّامٍ قالَتْ: نَعَمْ. فَقُلْتُ: مِنْ أَيِّ الشَّهْرِ كَانَ يَصُومُ؟ قالَتْ: لَمْ يَكُنْ يُبَالِي مِنْ أَيِّ الشَّهْرِ يَصُومُ. رواهُ مسلمٌ.

1262. హజ్రత్ ముఆజా అదవియ్యా, "దైవప్రవక్త (సల్లం) ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసం ఉండేవారా?" అని హజ్రత్ ఆయిషా (రజి.అన్హా)ని అడిగారు. అందుకామె 'అవున'న్నారు. తర్వాత అదవియ్యా మళ్ళీ, "అయితే ఆయన నెలలోని ఏ రోజుల్లో ఉపవాసం ఉండేవారు?" అని అడిగారు. అందుకు ఆయిషా (రజి.అన్హా) "నెలలోని ఏ రోజులన్న విషయాన్ని పట్టించుకోకుండా ఆయన ఉపవాసం ఉండేవారు" అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా బోధపడేదేమిటంటే నెలలోని ఏ తేదీల్లోనయినా ఉపవాసం పాటించవచ్చు. ప్రత్యేకంగా ఫలానా తేదీల్లోనే నెలవారి నఫిల్ ఉపవాసాలు పాటించాలన్న నియమమేమీ లేదు. కాకపోతే 13,14,15 తేదీల్లో ఉపవాసం పాటించటం శ్రేష్ఠమైన పద్ధతి.

దానిక్కారణం దైవప్రవక్త (సల్లం) ఆ తేదీల్లో ఉపవాసం పాటించమని ఆదేశించారు. చాలా సందర్భాల్లో స్వయంగా ఆయన కూడా ఆ తేదీల్లో ఉపవాసం పాటించటాన్ని ఇష్టపడేవారు. రాబోయే హదీసులు ఈ విషయాన్ని వివరిస్తున్నాయి.

١٢٦٣ ـ وعَنْ أَبي ذَرٍّ رَضيَ اللهُ عنهُ قَالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إذَا صُمْتَ مِنَ الشَّهرِ ثَلاثاً، فَصُمْ ثَلاثَ عَشْرَةَ، وَأَرْبَعَ عَشْرَةَ، وَخَمْسَ عَشْرَةَ» رواهُ الترمِذيُّ وقالَ: حديثٌ حسنٌ.

1263. హజ్రత్ అబూజర్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: నువ్వు నెలలో మూడు రోజులు ఉపవాసం ఉండదలచు కుంటే, 13, 14, 15వ తేదీల్లో ఉపవాస ముండు. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని ఉపవాస ప్రకరణం)*

١٢٦٤ ـ وعنْ قتادَةَ بنِ مِلحَانَ، رَضيَ اللهُ عَنهُ قَالَ: كانَ رَسولُ اللهِ ﷺ يَأْمُرُنَا بِصِيَامِ أَيَّامِ البِيضِ: ثَلاثَ عَشْرَةَ، وَأَرْبَعَ عَشْرَةَ، وَخَمْسَ عَشْرَةَ. رواهُ أَبو داودَ.

1264. హజ్రత్ ఖతాదా బిన్ మిల్హాన్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని పున్నమి దినాల్లో అంటే 13, 14,15 తేదీల్లో ఉపవాసం పాటించమని ఆజ్ఞాపించేవారు. *(అబూదావూద్)*

*(సుననె అబూదావూద్‌లోని ఉపవాసాల ప్రకరణం)*

١٢٦٥ ـ وعنِ ابنِ عَبَّاسٍ رَضيَ اللهُ عَنهُمَا قالَ: كانَ رسولُ اللهِ ﷺ لا يُفْطِرُ أَيَّامَ البِيضِ في حَضَرٍ وَلا سَفَرٍ. رواهُ النَسَائي بإسنادٍ حَسَنٍ.

1265. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) స్వస్థలంలో వున్నా, ప్రయాణంలో వున్నా సరే; పున్నమి దినాల ఉపవాసాన్ని మాత్రం విడిచిపెట్టేవారు కారు. *(నసాయి-హసన్)*

*(సుననె నసాయిలోని ఉపవాసాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

చాంద్రమాన నెలల్లోని 13,14,15వ తారీకులను పున్నమి దినాలని అంటారు. ఆయా రాత్రుల్లో చంద్రుని పరిమాణం క్రమంగా తగ్గుతూపోతుంది. మొత్తానికి ఆ రోజుల్లో ఉపవాసం పాటించటం శ్రేష్ఠమైన పద్ధతి. ఒకవేళ ఇతర దినాల్లో పాటించినా తప్పులేదు.

## 231వ అధ్యాయం

## ٢٣١ - بَابُ فَضْلِ مَنْ فَطَّرَ صَائِماً، وَفَضْلِ الصَّائِمِ الَّذِي يُؤْكَلُ عِنْدَهُ، وَدُعَاءِ الآكِلِ لِلْمَأْكُولِ عِنْدَهُ

## ఉపవాస విరమణ (ఇఫ్తార్) చేయించేవారి ఘనత, అతిథి ఆతిథ్యకర్తను దీవించే పద్ధతి

١٢٦٦ - عَنْ زَيْدِ بنِ خَالِدِ الجُهَنِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قالَ: «مَنْ فَطَّرَ صَائماً، كَانَ لَهُ مِثْلُ أَجْرِهِ، غَيْرَ أَنَّهُ لا يَنْقُصُ مِنْ أَجْرِ الصَّائِمِ شيءٌ». رواهُ الترمذيُّ وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

1266. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ జుహనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా ఒక ఉపవాసి ఉపవాసాన్ని విరమింపజేస్తే (అంటే ఇఫ్తార్ చేయిస్తే) ఉపవాసికి లభించినంత పుణ్యం అతనికీ లభిస్తుంది. అలా అని ఆ ఉపవాసి పుణ్యంలోనూ ఎలాంటి కోత విధించబడదు.

*(తిర్మిజీ-హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని ఉపవాసాల ప్రకరణం)*

١٢٦٧ - وعَنْ أُمِّ عُمَارَةَ الأنصاريَّةِ رَضِيَ اللهُ عَنْهَا، أَنَّ النبيَّ ﷺ دَخَلَ عَلَيْهَا، فَقَدَّمَتْ إلَيْهِ طَعَاماً، فقَالَ: «كُلِي» فَقَالَتْ: إنِّي صَائِمَةٌ، فقالَ رسولُ اللهِ ﷺ: «إنَّ الصَّائمَ تُصَلِّي عَلَيْهِ المَلائِكَةُ إذَا أُكِلَ عِنْدَهُ حَتَّى يَفْرُغُوا» وَرُبَّمَا قَالَ: «حَتَّى

1267. హజ్రత్ ఉమ్మె ఉమారహ్ అల్ అన్సారియా (రజి.అన్హా) కథనం ప్రకారం ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఆమె ఇంటికి వెళ్ళారు. అప్పుడామె దైవప్రవక్త (సల్లం)కు అన్నం వడ్డిం చారు. ఆమెను ఉద్దేశ్యించి ఆయన "నువ్వు కూడా తిను" అన్నారు. అందు కామె తాను ఉపవాసమున్నానని చెప్పారు. ఆ సందర్భంగా ఆయన ఇలా అన్నారు: ఉపవాసి దగ్గర భోజనం చేస్తే

يَشْبَعُوا» رواهُ الترمذيُّ وقال: حديثٌ حسنٌ.

భోజనం ముగిసేవరకు దైవదూతలు ఆ ఉపవాసి కొరకు దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటారు.

కొన్ని సందర్భాల్లో ఆయన "కడుపు నిండేవరకు అతని కోసం దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటారు" అని చెప్పేవారు.

(తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని ఉపవాస అధ్యాయాలు)

١٢٦٨ ـ وعَنْ أَنس رَضِيَ اللهُ عنهُ، أَنَّ النبيَّ ﷺ جَاءَ إِلى سَعْدِ بْنِ عُبادَةَ رَضِيَ اللهُ عَنْهُ، فَجَاءَ بِخُبْزٍ وَزَيْتٍ، فَأَكَلَ، ثُمَّ قَالَ النبيُّ ﷺ: «أَفْطَرَ عِنْدَكُمُ الصَّائمونَ، وَأَكَلَ طَعَامَكُمُ الأَبرَارُ وَصَلَّتْ عَلَيْكُمُ المَلائِكَةُ». رواهُ أبو داود بإسنادٍ صحيحٍ.

1268. హజ్రత్ అనస్ (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) సాద్ బిన్ ఉబాదా (రజి) ఇంటికి వెళ్ళారు. అప్పుడాయన దైవప్రవక్త (సల్లం)కు రొట్టె మరియు జైతూన్ నూనె సమర్పించుకున్నారు. దైవప్రవక్త (సల్లం) వాటిని ఆరగించి ఆ తర్వాత (సాద్ బిన్ ఉబాదాను) ఈ విధంగా దీవించారు: **అఫ్తర ఇందకుముస్సాయిమూన....** (అనువాదం: ఉపవాసకులు మీ ఇంట్లో ఇఫ్తార్ చేశారు. సజ్జనులు మీ అన్నం తిన్నారు. దైవదూతలు మీ మన్నింపుకోసం ప్రార్థించారు.)

(అబూదావూద్-హసన్)

(సుననె అబూదావూద్‌లోని భోజనాల ప్రకరణం)

# ٩ - كتاب الإعتكاف
# ఏతెకాఫ్ ప్రకరణం

232వ అధ్యాయం

## ٢٣٢- باب فضل الاعتكاف
## ఏతెకాఫ్ ప్రాశస్త్యం

١٢٦٩ - عن ابن عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: كانَ رسولُ اللهِ ﷺ يَعْتَكِفُ العَشْرَ الأَوَاخِرَ مِنْ رَمَضَانَ. مُتفقٌ عليهِ.

1269. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) రమజాన్ మాసంలోని చివరి దశకంలో ఏతెకాఫ్ పాటించేవారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ-సహీహ్ ముస్లింలోని ఏతెకాఫ్ ప్రకరణం)

١٢٧٠ - وعنْ عائشةَ رَضِيَ اللهُ عَنْها، أَنَّ النَّبِيَّ ﷺ كانَ يَعْتَكِفُ العَشْرَ الأَوَاخِرَ مِنْ رَمَضَانَ، حَتَّى تَوَفَّاهُ اللهُ تعالى، ثُمَّ اعْتَكَفَ أَزْوَاجُهُ مِنْ بَعْدِهِ. متفقٌ عليهِ.

1270. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) జీవితాంతం రమజాన్ మాసంలోని చివరి దశకంలో ఏతెకాఫ్ పాటించారు. ఆయన తర్వాత ఆయన సతీమణులు (కూడా) ఏతెకాఫ్ పాటించారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ - సహీహ్ ముస్లింలోని ఏతెకాఫ్ ప్రకరణం)

١٢٧١ - وعَنْ أَبي هُريرةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: كانَ النبيُّ ﷺ يَعْتَكِفُ في كُلِّ رَمَضَانَ عَشَرَةَ أَيَّامٍ، فَلَمَّا كَانَ العَامُ الَّذِي قُبِضَ فِيهِ اعْتَكَفَ عِشْرِينَ يَوْماً. رواه البخاريُّ.

1271. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ప్రతి రమజాన్ నెలలో పదిరోజులు ఏతెకాఫ్ పాటించే వారు. తను చనిపోయిన సంవత్సరమైతే ఆయన ఇరవై రోజులు ఏతెకాఫ్ పాటించారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని ఏతెకాఫ్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

రమజాన్ మాసంలోని చివరి దశకంలో ఏతెకాఫ్ పాటించటం దైవప్రవక్త సంప్రదాయం. స్త్రీలు కూడా ఏతెకాఫ్‌లో కూర్చోవచ్చు. అయితే ఏతెకాఫ్ ఇంట్లో కాదు, మస్జిద్‌లోనే పాటించాలి. అందుకని ఒకవేళ మస్జిద్‌లో స్త్రీల కొరకు పురుషుల నుండి వేరుగా ప్రత్యేకంగా, పూర్తి కట్టుబాట్లతో ఏతెకాఫ్ పాటించటానికి అవకాశముంటే అలాంటి చోట్ల స్త్రీలు ఏతెకాఫ్ పాటించవచ్చు. లేకపోతే వారు ఏతెకాఫ్ పాటించకపోవటమే మంచిది.

# ١٠ ـ كِتَابُ الْحَجِّ

## 233వ అధ్యాయం హజ్ ప్రకరణం

## بَابُ وُجُوبِ الْحَجِّ وَفَضْلِهِ

## హజ్ విధింపు, ఘనత

قَالَ اللهُ تَعَالَى: ﴿وَلِلَّهِ عَلَى النَّاسِ حِجُّ الْبَيْتِ مَنِ اسْتَطَاعَ إِلَيْهِ سَبِيلًا وَمَن كَفَرَ فَإِنَّ اللَّهَ غَنِيٌّ عَنِ الْعَالَمِينَ﴾[آل عمران: ٩٧].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "ప్రజలపై అల్లాహ్‌కు ఉన్న హక్కు ఏమిటంటే, ఈ గృహానికి వెళ్ళే శక్తిగలవారు దాని హజ్‌ను విధిగా చేయాలి. ఈ ఆజ్ఞను పాలించటానికి తిరస్కరించేవాడు అల్లాహ్‌కు ప్రపంచ ప్రజల అవసరం ఎంతమాత్రం లేదు అని స్పష్టంగా తెలుసుకోవాలి." *(ఆలి ఇమ్రాన్: 97)*

**వివరణ**

దైవగృహమైన కాబా దగ్గరికి వెళ్ళిరావటానికి అయ్యే ఖర్చులు, తాము ప్రయాణంలో ఉన్న కాలంలో తమ ఇంటివారి అవసరాలకు అయ్యే ఖర్చులకు సరిపడా ధనాన్ని కల్గివున్నవారు జీవితంలో ఒక్కసారయినా విధిగా హజ్‌యాత్ర చేయాలి. స్తోమత కలిగివున్నప్పటికీ హజ్ చేయకపోవటాన్ని దివ్యఖుర్ఆన్ 'కుఫ్ర్' (ధర్మతిరస్కారం)గా పేర్కొన్నది. దీనిద్వారా స్తోమత కలిగివుండి కూడా హజ్ చేయకుండా ఉండటం ఎంతటి ఘోరమైన పాపమో అర్థమవుతోంది. హదీసుల్లో కూడా ఈ విషయాన్ని తీవ్రంగా గర్హించటం జరిగింది.

١٢٧٢ ـ وَعَنِ ابْنِ عُمَرَ، رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ، قَالَ: «بُنِيَ الإِسْلَامُ عَلَى خَمْسٍ: شَهَادَةِ أَنْ لَا إِلَهَ إِلَّا اللهُ وَأَنَّ مُحَمَّدًا رَسُولُ اللهِ، وَإِقَامِ الصَّلَاةِ وَإِيتَاءِ الزَّكَاةِ، وَحَجِّ الْبَيْتِ، وَصَوْمِ رَمَضَانَ» متفق عليه

1272. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఇస్లాం ధర్మం ఐదు విషయాలపై ఆధారపడి ఉంది. 1) అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడని, ముహమ్మద్ (సల్లం) దైవప్రవక్త అని సాక్ష్యం పలకటం, 2) నమాజును స్థాపించటం, 3) జకాత్ చెల్లించటం, 4) హజ్ చేయటం, 5) రమజాన్ నెలలో ఉపవాసం పాటించటం.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం-సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు నమాజు, జకాత్, ఉపవాస ప్రకరణాల్లో కూడా వచ్చింది. ఇక్కడ దీనిని ఇస్లామీయ ప్రధాన విధుల్లో నాల్గవది అయిన హజ్ విధింపును తెలియపరిచే ఉద్దేశ్యంతో పొందుపరచటం జరిగింది. అయితే ఇంతకు ముందు చెప్పబడినట్లు ఈ హజ్ అనేది స్తోమత కలిగినవారిపై మాత్రమే విధిగా చేయబడింది.

١٢٧٣ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ، قَالَ: خَطَبَنَا رَسُولُ اللهِ ﷺ فَقَالَ: «يَا أَيُّهَا النَّاسُ قَدْ فَرَضَ اللهُ عَلَيْكُمُ الْحَجَّ فَحُجُّوا» فَقَالَ رَجُلٌ: أَكُلَّ عَامٍ يَارَسُولَ اللهِ؟ فَسَكَتَ، حَتَّى قَالَهَا ثَلَاثًا. فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «لَوْ قُلْتُ: نَعَمْ لَوَجَبَتْ، وَلَمَا اسْتَطَعْتُمْ» ثُمَّ قَالَ: «ذَرُونِي مَا تَرَكْتُكُمْ، فَإِنَّمَا هَلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ بِكَثْرَةِ سُؤَالِهِمْ، وَاخْتِلَافِهِمْ عَلَى أَنْبِيَائِهِمْ، فَإِذَا أَمَرْتُكُمْ بِشَيْءٍ فَأْتُوا مِنْهُ مَا اسْتَطَعْتُمْ، وَإِذَا نَهَيْتُكُمْ عَنْ شَيْءٍ فَدَعُوهُ» رواه مسلم.

1273. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఓ రోజు దైవప్రవక్త (సల్లం) మాకు ఉపన్యాసం ఇస్తూ, "ప్రజలారా! దేవుడు మీపై హజ్‌యాత్రను విధిగా చేశాడు. కనుక మీరు హజ్ చేయండి" అన్నారు. అంతలో ఒక వ్యక్తి 'ప్రతి సంవత్సరం చేయాలా దైవప్రవక్తా?' అని అడిగారు. అందుకు దైవప్రవక్త (సల్లం) మౌనం వహించారు. ఆ వ్యక్తి అదే ప్రశ్న మూడుసార్లు అడిగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నేను గనక 'ఔను' అనంటే దాన్ని మీరు తప్పని సరిగా పాటించవలసి వస్తుంది. కాని మీలో ఆ శక్తి లేదు" అని అన్నారు.

ఆయన ఇంకా ఇలా బోధించారు: ఏ విషయాలనయితే నేను మీకు చెప్ప కుండా వదిలేస్తున్నానో వాటిని గురించి మీరు నన్ను అడక్కండి. నిశ్చయంగా మీకు పూర్వం గతించిన జాతులు ఈ విధంగా అనవసర ప్రశ్నలు వేయటం మూలంగా, తమ ప్రవక్తలతో విభేదించటం మూలంగానే నాశనమయి పోయాయి. కనుక నేను మీకు దేని

గురించయినా ఆదేశించినప్పుడు మీరు మీ శక్తిమేరకు దాన్ని ఆచరించండి. ఒకవేళ ఏదయినా చేయకూడదని వారిస్తే (వెంటనే) దానిని వదిలేయండి. (అందులోనే మీకు శ్రేయం ఉంది). (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

1274. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం)ను "ఆచరణలన్నిటిలోకెల్లా శ్రేష్ఠమైనది ఏది?" అని విచారించటం జరిగింది. అందుకాయన సమాధానమిస్తూ "దేవుణ్ణి, దైవప్రవక్తను విశ్వసించటం" అని అన్నారు. "ఆ తర్వాత ఏది?" అని అడిగితే "దైవమార్గంలో పోరాడటం" అని చెప్పారు. "ఆ తర్వాత ఏది?" అని అడిగితే, 'హజ్జె మబ్రూర్' అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). (బుఖారీ-ముస్లిం)

١٢٧٤ ـ وَعَنْهُ قَالَ: سُئِلَ النَّبِيُّ ﷺ أَيُّ العَمَلِ أَفْضَلُ؟ قَالَ: «إِيمَانٌ بِاللهِ وَرَسُولِهِ» قِيلَ: ثُمَّ مَاذَا؟ قَالَ: «الجِهَادُ فِي سَبِيلِ اللهِ» قِيلَ: ثُمَّ مَاذَا؟ قَالَ: «حَجٌّ مَبْرُورٌ» متفقٌ عليهِ. «المَبْرُورُ» هُوَ الَّذي لا يَرتَكِبُ صَاحِبُهُ فِيهِ مَعْصِيَةً.

హజ్ యాత్రికుడు తన యాత్రా కాలంలో ఎలాంటి అవిధేయతకు ఒడిగట్టకుండా జాగ్రత్తపడితే అలాంటి హజ్‌ను 'హజ్జె మబ్రూర్' అని అంటారు.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

హజ్ యాత్ర అత్యంత శ్రేష్ఠమైన ఆచరణల్లో ఒకటని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అయితే ఆ హజ్‌ను చిత్తశుద్ధితో, ఎలాంటి అవిధేయతా కార్యాలకు ఒడిగట్టకుండా నెరవేర్చ

ఉండాలి. కొంతమంది 'హజ్జె మబ్రూర్' అనే పదాన్ని 'స్వీకృతి పొందిన హజ్' అని తర్జుమా చేశారు. అయితే మనిషి చేసే హజ్ దైవసన్నిధిలో స్వీకృతికి నోచుకున్నదా లేదా అన్న విషయం మనకు ఎలా తెలియాలి? అనే ప్రశ్న ఈ సందర్భంగా తలెత్తటం సహజమే. దానికి, అలాంటి మనిషి మునుపటి కన్నా ఎక్కువ దైవారాధకుడుగా మారిపోతాడనీ, అతని నడవడికలో చాలా మార్పు వస్తుందనీ, అతని సత్ప్రవర్తనే ఈ విషయాన్ని సూచిస్తుందనీ వారు సమాధానమిచ్చారు.

١٢٧٥ ـ وَعَنْهُ قَالَ: سَمِعْتُ رسُولَ اللهِ ﷺ يقولُ: «مَنْ حَجَّ، فَلَمْ يَرْفُثْ، وَلَمْ يَفْسُقْ، رَجَعَ كَيَوْمِ وَلَدَتْهُ أُمُّهُ» متفقٌ عليه.

1275. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) గారే తెలియజేశారు: ఎవడయితే ఎలాంటి అపసవ్యమైన చేష్టలకు, వ్యర్థవిషయాలకు పాల్పడకుండా, దైవ అవిధేయతకు ఒడిగట్టకుండా జాగ్రత్తపడుతూ హజ్ చేస్తాడో అతను ఆ రోజే తల్లి గర్భం నుంచి పుట్టినవానిలా (పరమ పవిత్రుడై) తిరిగి వస్తాడు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'రఫస్' అనే పదం వచ్చింది. అసలు నిఘంటువులో 'రఫస్' అన్న పదానికి అశ్లీలపు మాటలు మాట్లాడటం, పోకిరి పలుకులు పలకటం, భార్య ముందు లైంగిక వాంఛల్ని వెలిబుచ్చటం అనే అర్థాలున్నాయి. హజ్ యాత్రా కాలంలో భార్యతో సంభోగించటం నిషిద్ధం. కనుక హజ్‌యాత్రకు సంబంధించి దీక్షబూనిన తర్వాత దాని గురించి మాట్లాడటం, భార్యాభర్తలు పరస్పరం లైంగిక వాంఛల్ని వెలిబుచ్చుకోవటం కూడా అధర్మకార్యాలుగా పరిగణించబడతాయి. దైవ అవిధేయతకు పాల్పడటమంటే ప్రజలతో జగడాలు పెట్టుకోవటం, కొట్లాటకు దిగటం అని భావం. హజ్ దినాల్లో ముఖ్యంగా వీటికి కూడా దూరంగా ఉండాలి. పై నియమ నిబంధనలన్నిటినీ నిక్కచ్చిగా పాటించి హజ్ నెరవేరిస్తే, పాపాలన్నీ మన్నించబడతాయి. అయితే ఒక విషయం గమనార్హం. ఇక్కడ మన్నించబడేవి కేవలం చిన్నచిన్న పాపాలే. ఘోరపాపాలు మన్నించబడటానికి 'పశ్చాత్తాపం' అవసరం.

1276. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక ఉమ్రా తర్వాత మరొక ఉమ్రా చేయటం వాటి మధ్య జరిగిన పాపాలన్నిటికీ పరిహారం అవుతుంది. మబ్రూర్ (ఆమోద ముద్రపడిన) హజ్‌కు ప్రతిఫలం స్వర్గం తప్ప మరేమీ లేదు. (బుఖారీ-ముస్లిం)

١٢٧٦ - وَعَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «العُمْرَةُ إِلى العُمْرَةِ كَفَّارَةٌ لِمَا بَيْنَهُمَا، والحَجُّ المَبرُورُ لَيْسَ لَهُ جَزَاءٌ إِلَّا الجَنَّةَ» متفقٌ عليهِ.

*(సహీహ్ బుఖారీలోని ఉమ్రా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసు భావం కూడా పై హదీసు లాంటిదే. ఉమ్రా చేయటం మూలంగా కేవలం చిన్నచిన్న పాపాలు మాత్రమే మన్నించబడతాయి. ఉమ్రా చేసే పద్ధతి ఏమిటంటే ముందుగా దానికోసం దీక్షబూని కాబా గృహం చుట్టూ ప్రదక్షిణాలు చేయాలి. ఆ తర్వాత సఫా, మర్వా కొండల మధ్య సయీ చేసి (అంటే పరుగెత్తి) శిరోముండనం చేయించుకోవాలి లేదా వెంట్రుకలు కత్తిరించుకోవాలి.

ఇకపోతే ఉమ్రా కూడా హజ్ మాదిరిగా విధిగా చేయవలసిందేనా కాదా? అన్న విషయంలో పండితుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు ఉమ్రా చేయటం విధి (ఫర్జ్) అని అంటే మరికొందరు సున్నతె ముఅక్కదా అని అంటున్నారు. ఇంకొందరయితే దాన్ని నఫిల్‌గా భావిస్తున్నారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) అభిప్రాయం మాత్రం మొదటి విషయం వైపుకే మొగ్గుచూపుతున్నది. కొంతమంది దైవప్రవక్త సహచరుల మాటలు కూడా దీనిని సమర్థిస్తున్నాయి. అలాకాని పరిస్థితుల్లో ఉమ్రా చేయటం విధి కాదన్న అభిప్రాయమే సరయినది.

1277. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: నేనొకసారి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! మేము దైవమార్గంలో పోరాడటాన్ని శ్రేష్ఠమైన ఆచరణగా భావిస్తాం. అందుకని మాకూ దైవమార్గంలో పోరాడాలని ఉంది" అని అన్నాను. అందుకాయన,

١٢٧٧ - وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قُلْتُ يَا رَسُولَ اللهِ! نَرَى الجِهَادَ أَفْضَلَ العَمَلِ، أَفَلا نُجَاهِدُ؟ فَقَالَ: «لٰكِنْ أَفْضَلُ الجِهَادِ حَجٌّ مَبرُورٌ» رواهُ البخاريُّ.

"ఉండవచ్చు, కాని (మీ కొరకు) శ్రేష్ఠమైన పోరాటం 'హజ్జె మబ్రూర్' చేయటానికి ప్రయత్నించటం" అని చెప్పారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సాధారణ పరిస్థితుల్లో స్త్రీల కొరకు హజ్‌యాత్ర చేయటమే శ్రేష్ఠమైన జిహాదు. ఎందుకంటే ఇస్లాంలో రాజకీయాలు, రాజ్య నిర్వహణ, ఆర్థిక వాణిజ్య సంబంధాలు, యుద్ధం సంధి మొదలగు బయటి వ్యవహారాలన్నిటికీ పురుషులే బాధ్యులు. స్త్రీలకు ఈ బాధ్యతలేవీ వర్తించవు. అయితే కొన్ని ముఖ్య యుద్ధ సందర్భాల్లో క్షతగాత్ర సైనికులకు కట్లుకట్టడం కోసం, అన్నపానీయాలు అందించటం కోసం ఒకవేళ అవసరమయితే స్త్రీలను కూడా (పరదా నియమ నిబంధనలకు కట్టుబడి) యుద్ధభూమికి తీసుకెళ్ళవచ్చు. అంతేగాని మహిళలకు ప్రత్యేకంగా సైనిక శిక్షణనిచ్చి పురుషుల మాదిరిగా వారిని కూడా శత్రువులతో పోరాడే నిమిత్తం యుద్ధ భూమికి పంపటం అన్యాయం. ఇలా చేస్తున్నవారు పాశ్చాత్య దేశాలను గ్రుడ్డిగా అనుకరిస్తున్నారని గ్రహించాలి. ఇస్లామీయ బోధనల్లో దీనికి ఎలాంటి స్థానం లేదు. పైన పేర్కొనబడిన దైవప్రవక్త ప్రవచనం కూడా ఈ విషయాన్ని సమర్థిస్తోంది.

1278. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుడు తన దాసులకు అరఫా రోజు (అంటే జుల్‌హిజ్జా మాసపు తొమ్మిదో తేదీన) నరకాగ్ని నుండి విముక్తిని ప్రసాదించి నంతగా మరే రోజులోనూ ప్రసాదించడు. (ముస్లిం)

١٢٧٨ ـ وَعَنْهَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَا مِنْ يَوْمٍ أَكْثَرَ مِنْ أَنْ يَعْتِقَ اللهُ فِيهِ عَبْداً مِنَ النَّارِ مِنْ يَوْمِ عَرَفَةَ» رواهُ مسلمٌ.

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

జుల్‌హిజ్జా మాసపు తొమ్మిదో తేదీన (అరఫా రోజున) దేవుడు చాలా ఎక్కువ సంఖ్యలో మానవులకు నరకాగ్ని నుండి విముక్తినొసగుతాడు. వాస్తవం ఏమిటంటే హజ్‌యాత్ర చేసే

ఎన్నో లక్షలమంది హాజీలు కాబా గృహాన్ని సందర్శించినప్పుడు దైవసన్నిధిలో చిత్తశుద్ధితో నిష్కల్మష హృదయంతో పశ్చాత్తాపం చెంది ఆయన ప్రసన్నతను చూరగొంటారు. ఫలితంగా హజ్ యాత్రికులందరూ అరఫాత్ మైదానంలో సమావేశమై ఉన్నప్పుడు తన ప్రత్యేక కారుణ్యంతో వారినందరినీ మన్నించి నరకం నుండి వారిని విముక్తుల్ని చేస్తాడు. దేవుడు మనల్ని కూడా అలాంటి అదృష్టవంతుల్లో చేర్చుగాక! (ఆమీన్)

١٢٧٩ - وعن ابن عباس رَضِيَ اللهُ عنهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ قالَ: «عُمْرَةٌ في رَمَضَانَ تَعدِلُ حَجَّةً - أَوْ حَجَّةً مَعِي». متفقٌ عليه.

1279. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) 'రమజాన్ మాసంలో చేసే ఉమ్రా, హజ్‌యాత్రకు లేదా నాతోపాటు చేయబడిన హజ్‌కు సమానం' అని ప్రవచించారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఉమ్రా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్‌కు సమానమంటే దానివల్ల హజ్ బాధ్యత తీరిపోతుందనీ, ఇక హజ్ చేయవలసిన అవసరం ఉండదని అర్థం ఎంతమాత్రం కాదు. ఆ నెలలో ఉమ్రా చేస్తే, జుల్ హిజ్జా మాసంలో హజ్ చేసినంత పుణ్యం లభిస్తుందని మాత్రమే దాని భావం. రమజాన్ నెలలో ఉమ్రా చేస్తే ఏకకాలంలో రెండు ఆరాధనలు చేసినట్లవుతుంది. బహుశా అందుకే దానికంత పుణ్యం లభించి ఉండవచ్చు.

١٢٨٠ - وَعَنْهُ أَنَّ امرَأَةً قَالَتْ: يا رَسُولَ اللهِ! إنَّ فَرِيضَةَ اللهِ عَلى عِبَادِهِ في الحَجِّ أَدْرَكَتْ أَبي شَيْخاً كَبِيراً، لا يَثْبُتُ عَلى الرَّاحِلَةِ، أَفَأَحُجُّ عَنْهُ؟ قالَ: «نَعَمْ». متفقٌ عليه.

1280. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారే చేసిన కథనం: ఒక స్త్రీ (దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి) "దైవప్రవక్తా! దేవుడు తన దాసులపై విధిగా చేసిన హజ్ మా నాన్నగారికి అనివార్యమయి నప్పటికీ ఆయన ముసలివారయి పోయారు. వాహనం మీద సరిగా కూర్చోలేని పరిస్థితిలో ఉన్నారాయన. **మరి ఆయన తరపున నేను హజ్ చేయ** వచ్చునా?" అని అడిగింది. అందు

కాయన "చేయవచ్చ"ని సమాధాన మిచ్చారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

హదీసులో పేర్కొనబడిన మహిళ తండ్రి ముసలితనంలో హజ్ చేయగలిగే ఆర్థిక స్తోమతగలవారయ్యాడు. కాని విపరీతమైన వృద్ధాప్యం మూలంగా అతనిలో ప్రయాణం చేయగలిగే శక్తిలేకపోయింది. కనుక దైవప్రవక్త (సల్లం) అతని కూతురికి అతని తరపున హజ్ చేసేందుకు అనుమతినిచ్చారు. అయితే ఈ విధంగా ఇతరుల తరపున హజ్ యాత్ర చేసే ప్రత్యామ్నాయ వ్యక్తులు ముందుగా స్వయంగా తమ హజ్ బాధ్యతను నెరవేర్చి ఉండాలని ఇతర హదీసులు ఉద్ఘాటిస్తున్నాయి. ఈ సందర్భంగా గమనించదగిన మరొక విషయం ఏమిటంటే, ఆర్థిక స్తోమత కలిగివుండిన తల్లిదండ్రులు హజ్ చేయకుండా చనిపోతే వారి తరపున వారి వారసులు హజ్ చేయడం చాలా అవసరం. లేకపోతే ఆ తల్లిదండ్రుల మీద ఆ బాధ్యతారుణం అలాగే ఉండిపోతుంది. ప్రళయదినాన దాన్ని గురించి వారిని నిలదీయటం జరుగుతుంది. పేదవారిపై హజ్ ఫర్జ్ కాదు గనుక ఒకవేళ వారు అదే స్థితిలో చనిపోతే వారి తరపున హజ్ చేయవలసిన అవసరం ఉండదు. ఎవరయినా పుణ్యఫలాపేక్షతో చేస్తే అది వేరే విషయం. దానికిగాను వారికి నఫిల్ హజ్ చేసిన పుణ్యం తప్పకుండా లభిస్తుంది.

1281. హజ్రత్ లఖీత్ బిన్ ఆమిర్(రజి) కథనం ప్రకారం తను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి, "(దైవప్రవక్తా!) మా నాన్న చాలా ముసలివారు. ఆయన హజ్, ఉమ్రా చేయలేరు. ఆయనలో ప్రయాణం చేసే శక్తి కూడా లేదు" అని విన్నవించుకున్నారు. అందుకాయన "మరయితే నీ నాన్న తరపున నువ్వే హజ్, ఉమ్రా (బాధ్యతలు) నిర్వర్తించు" అని ఆదేశించారు. (అబూదావూద్, తిర్మిజీ-హసన్ సహీహ్)

١٢٨١ - وعن لَقِيطِ بنِ عامِرٍ رَضِيَ اللهُ عنهُ، أَنَّهُ أَتى النَّبيَّ ﷺ، فقالَ: إنَّ أبي شيخٌ كبيرٌ لا يَسْتَطِيعُ الحَجَّ، وَلا العُمْرَةَ، وَلا الظَّعنَ؟ قالَ: «حُجَّ عَنْ أَبِيكَ وَاعْتَمِرْ». رواهُ أبو داوُد، والترمذيُّ وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

(సుననె అబూదావూద్‌లోని హజ్ విధుల ప్రకరణం - సుననె తిర్మిజీలోని హజ్ అధ్యాయాలు)

١٢٨٢ ـ وعَنِ السائب بنِ يزيدَ رَضِيَ اللهُ عنهُ قالَ: حُجَّ بي مَعَ رسولِ اللهِ ﷺ، في حَجةِ الوَدَاعِ، وَأنَا ابنُ سَبعِ سِنِينَ. رواه البخاريُّ.

1282. హజ్రత్ సాయిబ్ బిన్ యజీద్ (రజి) కథనం: (నా బాల్యంలో) వీడ్కోలు హజ్ యాత్ర సందర్భంగా దైవప్రవక్త (సల్లం) వెంట (మా ఇంటి వారు) నన్ను కూడా హజ్ చేయించారు. అప్పటికి నా వయసు ఏడేండ్లు.

(బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని హజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

చిన్నపిల్లలు కూడా హజ్‌యాత్ర చేయవచ్చు. వారిని హజ్ చేయించే పెద్దలకు దానిపుణ్యం లభిస్తుంది. ఆ విధంగా బాల్యంలో హజ్ చేసిన పిల్లలు పెరిగి పెద్దయిన తర్వాత ఆర్థిక స్తోమత కలిగిన వారయితే వారు తిరిగి హజ్ చేయవలసి ఉంటుంది. బాల్యంలో హజ్ చేసినంత మాత్రాన ఆ బాధ్యత నెరవేరినట్లు కాదు.

١٢٨٣ ـ وَعَنِ ابنِ عبَّاس رَضيَ اللهُ عَنهُمَا، أنَّ النَّبيَّ ﷺ لَقِيَ رَكباً بِالرَّوْحَاءِ، فَقَالَ: «مَنِ القَومُ؟» قَالُوا: المسلِمُونَ. قَالُوا: مَنْ أَنتَ؟ قَالَ: «رَسُولُ الله» فَرَفَعَت امْرَأةٌ صَبِيّاً فَقَالَتْ: أَلِهٰذا حَجٌّ؟ قَالَ: «نَعَمْ وَلَكِ أَجْرٌ» رواهُ مُسلمٌ.

1283. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) రౌహా ప్రాంతంలో ఒక ప్రయాణీకుల బృందాన్ని కలిశారు. ఆయన వారిని ఉద్దేశ్యించి, "ఎవరు మీరు?" అని అడిగారు. దానికి వారు సమాధాన మిస్తూ, "మేము ముస్లింలం. మీరెవరూ?" అని అడిగారు. "నేను దైవ ప్రవక్తను" అని బదులిచ్చారాయన. అంతలో ఒక మహిళ ఒక అబ్బాయిని ఎత్తిచూపుతూ, 'ఇతను హజ్ చేయవచ్చా?' అని అడిగింది. అందుకాయన, "చేయవచ్చు. దాని పుణ్యం నీకు లభిస్తుంది" అని చెప్పారు.

(ముస్లిం)

(సహీహ్ బుఖారి, హజ్ ప్రకరణం)

1284. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఒక అంబారీ మీద (కూర్చొని) హజ్ చేశారు. (ఆ సందర్భంగా) ఆయన ప్రయాణ సామగ్రి కూడా దాని మీదే ఉండేది. *(బుఖారీ)*

١٢٨٤ ـ وَعَنْ أَنسٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ حَجَّ عَلى رَحْلٍ، وَكانَتْ زامِلَتَهُ. رواهُ البخاريُّ.

*(సహీహ్ బుఖారీలోని హజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

హదీసులో 'జామిలహ్' అనే పదం వచ్చింది. ప్రయాణసామగ్రి మోపబడిన ఒంటె, కంచర గాడిద తదితర వాహన జంతువుల్ని జామిలహ్ అంటారు. అంతిమ హజ్ యాత్ర సందర్భంగా దైవప్రవక్త (సల్లం) తాను స్వారీ చేస్తున్న ఒంటె మీదే ప్రయాణ సామగ్రిని ఉంచుకున్నారు. ఆ విధంగా ఆయన వాహనం జామిలహ్ (ప్రయాణ సామగ్రిని మోసే జంతువు) అయిందన్న మాట.

1285. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఉకాజ్, మిజన్నహ్, జుల్ మజాజ్ అనేవి అంధయుగపు సంతలు. (తిరునాళ్లు, జాతరల సమయంలో ఇక్కడ కొనుగోళ్ళు, అమ్మకాలు జరిగేవి.) అయితే (ఇస్లాం వచ్చిన తర్వాత) దైవప్రవక్త సహచరులు హజ్ మాసాలలో వ్యాపారం చేయటాన్ని పాపంగా తలపోసేవారు. అప్పుడు ఈ ఆయతు అవతరించింది. "(హజ్ దినాలలో) మీరు దేవుని అనుగ్రహాన్ని (అంటే ఉపాధిని) అన్వేషించదలచుకుంటే నిరభ్యంతరంగా అన్వేషించవచ్చు. అందులో ఎలాంటి తప్పు లేదు." (అల్‌బఖర:198)

*(బుఖారీ)*

١٢٨٥ ـ وَعَن ابنِ عبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: كَانَتْ عُكَاظُ وَمجَنَّةُ، وَذو المَجَازِ أَسْوَاقاً في الجَاهِلِيَّةِ، فَتَأَثَّمُوا أَنْ يَتَّجِرُوا في المَواسِمِ، فَنَزَلَتْ: ﴿لَيْسَ عَلَيْكُمْ جُنَاحٌ أَن تَبْتَغُوا فَضْلًا مِّن رَّبِّكُمْ﴾ [البقرة: ١٩٨] في مَوَاسِمِ الحَجِّ. رواهُ البخاريُّ.

*(సహీహ్ బుఖారీలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్‌యాత్రా కాలం రెండు నుంచి మూడు నెలల వరకు ఉంటుంది. ఈ పవిత్ర దినాల్లో వ్యాపార కార్యకలాపాలు నిర్వహించటం ధర్మసమ్మతమా కాదా అనే సందేహం కొద్దీ, వ్యాపారం చేస్తే అంధయుగపు చర్యలకు పాల్పడినట్లు అవుతుందేమోనన్న భయంతో దైవప్రవక్త సహచరులు ఆ కాలంలో వ్యాపారం చేయటాన్ని పాపకార్యంగా తలపోశారు. అప్పుడు విశ్వప్రభువు వారి అపోహల్ని, అపార్థాల్ని దూరం చేస్తూ పైన పేర్కొనబడిన దివ్యఖుర్‌ఆన్ ఆయతును అవతరింపజేశాడు. హజ్‌యాత్రా కాలంలో వ్యాపార కార్యకలాపాలు నిర్వహించటం అధర్మమేమీ కాదనీ, దానివల్ల హజ్, ఉమ్రాలకు ఎలాంటి విఘాతం కలగదని ఆ వాక్యం స్పష్టం చేసింది. అయితే ఇది కేవలం అనుమతి మాత్రమే. హజ్ యాత్రా దినాల్లో తప్పకుండా వ్యాపారం చేయాల్సిందేనని ఈ ఆయతు బోధించదు. కనుక ఆయా దినాల్లో వీలైనంత ఎక్కువగా దైవారాధన చేసి పరలోక పుణ్యాన్ని ఆర్జించుకోవాలనుకునేవారు వ్యాపార వ్యవహారాలన్నిటినీ త్యజించి పూర్తి ఏకాగ్రతతో దైవారాధనలో లీనమయిపోవాలి.



# ١١ - كتَابُ الْجِهَاد

# 11. జిహాద్ ప్రకరణం

**234వ అధ్యాయం**

## ٢٣٤ - باب فضل الجهاد

## జిహాద్ ఘనత

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَقَاتِلُوا الْمُشْرِكِينَ كَافَّةً كَمَا يُقَاتِلُونَكُمْ كَافَّةً وَاعْلَمُوا أَنَّ اللَّهَ مَعَ الْمُتَّقِينَ ﴾ [التوبة: ٣٦] وَقَالَ تَعَالَى: ﴿ كُتِبَ عَلَيْكُمُ الْقِتَالُ وَهُوَ كُرْهٌ لَكُمْ وَعَسَى أَنْ تَكْرَهُوا شَيْئًا وَهُوَ خَيْرٌ لَكُمْ وَعَسَى أَنْ تُحِبُّوا شَيْئًا وَهُوَ شَرٌّ لَكُمْ وَاللَّهُ يَعْلَمُ وَأَنْتُمْ لَا تَعْلَمُونَ ﴾ [البقرة: ٢١٦] وقَالَ تَعَالَى: ﴿ انْفِرُوا خِفَافًا وَثِقَالًا وَجَاهِدُوا بِأَمْوَالِكُمْ وَأَنْفُسِكُمْ فِي سَبِيلِ اللَّهِ ﴾ [التوبة: ٤١] وقَالَ تَعَالَى: ﴿ إِنَّ اللَّهَ اشْتَرَى مِنَ الْمُؤْمِنِينَ أَنْفُسَهُمْ وَأَمْوَالَهُمْ بِأَنَّ لَهُمُ الْجَنَّةَ يُقَاتِلُونَ فِي سَبِيلِ اللَّهِ فَيَقْتُلُونَ وَيُقْتَلُونَ وَعْدًا عَلَيْهِ حَقًّا فِي التَّوْرَاةِ وَالْإِنْجِيلِ وَالْقُرْآنِ وَمَنْ أَوْفَى بِعَهْدِهِ مِنَ اللَّهِ فَاسْتَبْشِرُوا بِبَيْعِكُمُ الَّذِي بَايَعْتُمْ بِهِ وَذَلِكَ هُوَ الْفَوْزُ الْعَظِيمُ ﴾ [التوبة: ١١١] وقَالَ اللهُ تَعَالَى: ﴿ لَا يَسْتَوِي الْقَاعِدُونَ مِنَ الْمُؤْمِنِينَ

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "బహుదైవారాధకులు కలసికట్టుగా మీతో ఎలా పోరాడుతున్నారో అలాగే మీరు కూడా సమైక్యమయి సంఘటితంగా వారిని ఎదుర్కోండి. అల్లాహ్ భయభక్తులు కలవారితోనే ఉంటాడని తెలుసుకోవాలి." *(తౌబా: 36)*

"మీరు విధిగా యుద్ధం చేయాలని ఆజ్ఞ అయింది. కాని అది మీకు రుచించటం లేదు. ఒక విషయం మీకు నచ్చకపోవచ్చు. కాని అందులోనే మీ శ్రేయస్సు ఉండవచ్చు. అలాగే ఒక విషయం మీకు నచ్చవచ్చు. కాని అందులోనే మీకు హాని ఉండవచ్చు. (మంచీ చెడులు) దేవునికే బాగా తెలుసు. మీకు తెలియదు." *(అల్ బఖర: 216)*

"బయలుదేరండి తేలికగానైనా, భారంగానైనా సరే; దైవమార్గంలో ధనప్రాణాలొడ్డి పోరాడండి. మీరు విషయం గ్రహిస్తే అందులోనే మీ శ్రేయస్సు ఉంది." *(అత్ తౌబా: 41)*

"దేవుడు విశ్వాసుల నుండి ధన ప్రాణాలను కొనుగోలు చేశాడు. వాటికి బదులుగా వారికోసం స్వర్గం సిద్ధపరచి ఉంచాడు. వారు దైవమార్గంలో పోరాడుతూ హతమవుతారు. లేక హతమార్చబడతారు. (వారికి స్వర్గప్రాప్తి కలుగుతుందని) తౌరాత్‌లో, ఇన్జీల్‌లో, ఖుర్‌ఆన్‌లో వాగ్దానం

ఉంది. దాన్ని నెరవేర్చే బాధ్యత దేవునిపై ఉంది. వాగ్దానం నెరవేర్చటంలో దేవుడ్ని మించిన వారెవరుంటారు? కనుక దేవునితో మీరు చేసుకున్న ఈ వ్యాపార ఒప్పందం పట్ల ఆనందోత్సవాలు జరుపుకోండి. ఇదే ఘనవిజయం, గొప్ప సాఫల్యం." *(అత్ తౌబా: 111)*

"విశ్వాసుల్లో ఎలాంటి బలమైన కారణం లేకుండా ఇంట్లో ఉండిపోయేవారు, దైవ మార్గంలో ధనప్రాణాలు త్యజించి పోరాడేవారు - ఉభయులూ సమానులు కాలేరు. ఇంట్లో ఉండిపోయేవారికన్నా ధనప్రాణాలతో పోరాడే వారికి దేవుడు గొప్ప హోదా, ఔన్నత్యాలు ప్రసాదిస్తాడు. శ్రేయోశుభాలకు సంబంధించిన దైవవాగ్దానం మటుకు అందరికీ వర్తిస్తుంది. కాని ప్రతిఫలం రీత్యా ఇంట్లో ఉండిపోయేవారి కన్నా దైవమార్గంలో పోరాడేవారికి దేవుడు ఎక్కువ ఔన్నత్యభాగ్యం ప్రసాదిస్తాడు. (అంటే) దేవుని దగ్గర అంతస్థులలో, మన్నింపులో, (దైవ) కారుణ్యంలో ఔన్నత్యం లభిస్తుందన్నమాట. దేవుడు గొప్ప క్షమాశీలి, అమిత దయా మయుడు." *(అన్నిసా: 95-96)*

"విశ్వాసులారా! మిమ్మల్ని దుర్భరమైన (నరక) యాతనల నుండి కాపాడగలిగే వ్యాపార పద్ధతిని గురించి మీకు తెలుపమంటారా? మీరు మనస్ఫూర్తిగా దేవుడ్ని, ఆయన ప్రవక్తను విశ్వసించి ధనప్రాణాలొడ్డి దైవమార్గంలో పోరాడండి. మీరు విషయం గ్రహించగలిగితే అందులోనే మీ శ్రేయస్సు ఉంది. (ఈ ఆదేశాన్ని గనక పాటిస్తే) దేవుడు మీ తప్పుల్ని క్షమించి మిమ్మల్ని సెలయేరులు ప్రవహించే స్వర్గ వనాలలో ప్రవేశింపజేస్తాడు. ఆ శాశ్వత స్వర్గవనాలలో మీకు అద్భుతమైన నివాస గృహాలను ప్రసాదిస్తాడు. ఇదే గొప్ప విజయం.

غَيْرُ أُولِي الضَّرَرِ وَالْمُجَاهِدُونَ فِي سَبِيلِ اللَّهِ بِأَمْوَالِهِمْ وَأَنفُسِهِمْ ۚ فَضَّلَ اللَّهُ الْمُجَاهِدِينَ بِأَمْوَالِهِمْ وَأَنفُسِهِمْ عَلَى الْقَاعِدِينَ دَرَجَةً ۚ وَكُلًّا وَعَدَ اللَّهُ الْحُسْنَىٰ ۚ وَفَضَّلَ اللَّهُ الْمُجَاهِدِينَ عَلَى الْقَاعِدِينَ أَجْرًا عَظِيمًا ﴿٩٥﴾ دَرَجَاتٍ مِّنْهُ وَمَغْفِرَةً وَرَحْمَةً ۚ وَكَانَ اللَّهُ غَفُورًا رَّحِيمًا ﴾ [النساء: ٩٥، ٩٦] وقال تعالى: ﴿ يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا هَلْ أَدُلُّكُمْ عَلَىٰ تِجَارَةٍ تُنجِيكُم مِّنْ عَذَابٍ أَلِيمٍ ﴿١٠﴾ تُؤْمِنُونَ بِاللَّهِ وَرَسُولِهِ وَتُجَاهِدُونَ فِي سَبِيلِ اللَّهِ بِأَمْوَالِكُمْ وَأَنفُسِكُمْ ۚ ذَٰلِكُمْ خَيْرٌ لَّكُمْ إِن كُنتُمْ تَعْلَمُونَ ﴿١١﴾ يَغْفِرْ لَكُمْ ذُنُوبَكُمْ وَيُدْخِلْكُمْ جَنَّاتٍ تَجْرِي مِن تَحْتِهَا الْأَنْهَارُ وَمَسَاكِنَ طَيِّبَةً فِي جَنَّاتِ عَدْنٍ ۚ ذَٰلِكَ الْفَوْزُ الْعَظِيمُ ﴿١٢﴾ وَأُخْرَىٰ تُحِبُّونَهَا ۖ نَصْرٌ مِّنَ اللَّهِ وَفَتْحٌ قَرِيبٌ ۗ وَبَشِّرِ الْمُؤْمِنِينَ ﴾ [الصف: ١٠-١٣]

والآياتُ في الباب كثيرةٌ مَشْهُورَةٌ.

**అదీగాక మీరు కోరుతున్న ఇతర వస్తువులు కూడా ఆయన మీకు అనుగ్రహిస్తాడు. అదే దేవుని సహాయం. త్వరలోనే లభించనున్న విజయం. ప్రవక్తా! విశ్వాసులకు ఈ శుభవార్త అందజెయ్యి.”** ***(అస్సఫ్: 10-13)***

**ఈ అధ్యాయానికి సంబంధించిన సుప్రసిద్ధ సూక్తులు ఇంకా చాలా ఉన్నాయి.**

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన ఆయతులన్నీ జిహాద్‌కు సంబంధించినవి. వీటి ద్వారా విశ్వాసుల్ని జిహాద్ కోసం పురికొల్పటం జరిగింది. జిహాద్ వల్ల ఇహలోకంలో, పరలోకంలోనూ ఎలాంటి ప్రయోజనాలు కల్గుతాయో కూడా వివరించటం జరిగింది. అంచేత ఎప్పుడయినా, ఎక్కడయినా దైవవిరోధులతో యుద్ధం చేయవలసిన పరిస్థితులు ఆసన్నమయితే ముస్లింలు వెనుకంజ వేయరాదు. ఇస్లాం ఔన్నత్యం, ముస్లింల గౌరవప్రతిష్ఠలు జిహాద్‌లోనే ఉమిడి ఉన్నాయన్న సంగతిని వారు గ్రహించాలి. ముస్లింలు ధర్మయుద్ధ పతాకాన్ని ఎగురవేసినన్నాళ్ళూ ప్రపంచంలో నలువైపులా వారి కీర్తిప్రతిష్ఠలు ఇనుమడించాయి. వారి సంస్కృతీ నాగరికతలు ప్రపంచమంతటా చెలామణి అయ్యాయి. కాని ఎప్పుడయితే ముస్లింలు అత్యంత ప్రధానమైన జిహాద్ విధిని విస్మరించారో అప్పట్నుంచే వారికి అవమానాలు మొదలయ్యాయి. నిరుపమాన ముస్లిం సంస్కృతిని ప్రపంచ ప్రజలు ఎంతో చులకనభావంతో చూడటం మొదలుపెట్టారు.

నేడు ప్రపంచంలో ముస్లింలు ఢక్కామొక్కీలు తింటూ బ్రతుకుతున్నారు. ఒకప్పుడు ప్రపంచాన్ని ఏలిన తమ సంస్కృతిని తాము స్వయంగా నిర్లక్ష్యం చేసుకుంటున్నారు. దాన్ని అదనుగా చేసుకొని వైరిజాతులు ముస్లిం సంస్కృతిని సమూలంగా తుడిచి పెట్టాలని చూస్తున్నాయి. నేడు యావత్తు ముస్లిం సమాజం అవమానాలు, పరాభవాల వెల్లువలో కొట్టుకు పోతోంది. అయినప్పటికీ ముస్లింలు అందులో నుండి బయటపడటానికిగాని, తమ పూర్వపు వైభవాన్ని తిరిగి సంపాదించుకోవటానికిగాని ఎలాంటి ప్రయత్నాలూ చేయటం లేదు. దానికి కారణాలు కూడా లేకపోలేదు. దానికోసం ఎంతో శ్రమపడాల్సి వస్తుంది. వ్యయప్రయాస లకు ఓర్చుకోవలసి వస్తుంది. ఎండనకా, వాననకా ఎల్లప్పుడూ ధర్మంకోసం పాటుపడవలసి వస్తుంది. అవసరమైతే తమ ధనప్రాణాలను సయితం ధర్మోన్నతి కోసం ధారపోయవలసి ఉంటుంది. కాని సౌలభ్యాలకు అలవాటుపడి, విలాసాల వలలో చిక్కుకున్న నేటి ముస్లిం సమాజం ఈ పనులు చేయటానికి సిద్ధంగా లేదు. అలాగే ముస్లిం దేశాల ప్రభుత్వాలు కూడా ఎలాంటి పౌరుషం లేకుండా వెధవాయి పాత్రను పోషిస్తున్నాయి. ఇంకా చెప్పాలంటే స్వయంగా ముస్లిం దేశాలే ఇస్లాం పట్ల శత్రుత్వాన్ని పెంచుకుంటున్నాయి. అందుకే దైవవిరోధుల ఆగడాలకు అడ్డూ ఆపూ లేకుండా పోతోంది. వారు ముస్లింల జీవితాలను దుర్భరం చేస్తున్నారు. వాళ్ళ నోళ్ళను నొక్కిపెడుతున్నారు. ఇంత జరుగుతున్నా కూడా నేడు ముస్లిం సమాజం నిమ్మకు

నీరెత్తినట్లు చూస్తూ ఊరుకుంటున్నదేకాని కనీసం ఆత్మరక్షణ కోసం కూడా ఎలాంటి ప్రయత్నాలు చేయటం లేదు. ఒకవైపు జియోనిస్టు లాబీలు, క్రైస్తవ శక్తులు తమ కుయుక్తులతో, కుటిల పన్నాగాలతో ఇస్లాం పునాదుల్ని పెకిలించటానికి ప్రయత్నిస్తుంటే మరో వైపు ముస్లిం దేశాల అధినేతలు భోగమేరా జీవితమంటూ జల్సాలు చేసుకుంటున్నారు. అంతేకాదు, యూదక్రైస్తవ శక్తులకు దాసోహమంటూ తమ దేశాల్లో మిగిలివున్న ఇస్లామీయ చిహ్నాలను కూడా రూపుమాపటానికి ప్రయత్నిస్తున్నారు.

ఇలాంటి ఉపద్రవభరితమైన పరిస్థితుల్లో మొత్తం ప్రపంచంలో వ్రేళ్ళపై లెక్కించగల కొన్ని సంస్థలు, సంఘాలు మాత్రమే ఇస్లాం ధర్మ ఔన్నత్యం కోసం విడివిడిగా ప్రయత్నాలు జరుపుతున్నాయి. కాని అంతర్జాతీయ దైవవిరోధులందరూ జట్టుకట్టి తమ శక్తియుక్తులన్నిటినీ కూడగట్టుకొని రంగంలోకి దిగినప్పుడు వారిని ఎదుర్కోవటానికి ఈ కొన్ని సంస్థలు ఏం చేయగలవు? అయితే "దేవుడు తలచుకుంటే ఈ కొన్నిసంస్థలే ధర్మవిరోధ శక్తుల పీచమణచ గలవు. ఆయన చిన్నచిన్న అబాబీల్ పక్షులతో ఏనుగుల సైన్యాలను సయితం మట్టికరిపించ గలడు. ముస్లింలు తమ కండబలంతో కొండల్ని కూడా పిండిచేయగలరు" అని మీారనవచ్చు. కాని అవన్నీ దేవుని మహిమలు. దేవుడు తాను తలచినప్పుడే వాటిని ఉనికిలోకి తెస్తాడు. ఆ మహిమల కోసం-నిర్లిప్తంగా- ఎదురు చూస్తూ, గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవట మయితే, సమంజసం కాదుకదా! ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూసి మోసపోయే బదులు ముస్లింలు తమంతట తాము వ్యక్తిగతంగా, సామూహికంగా ధర్మోన్నతి కోసం పాటుపడాలి.

وأمّا الأحاديثُ في فضلِ الجهادِ فأكثرُ من أنْ تُحصَرَ، فمِنْ ذٰلكَ:

జిహాద్ గొప్పదనానికి సంబంధించిన హదీసులు కూడా లెక్కలేనన్నివి ఉన్నాయి. వాటిలో కొన్నిటిని క్రింద పేర్కొనటం జరుగుతోంది.

١٢٨٦ ـ عَنْ أبي هُريرَةَ رَضِيَ اللهُ عَنْـهُ قـالَ: سُئِـلَ رسـولُ الله ﷺ: أيُّ الأعمـالِ أفضَـلُ؟ قـالَ: «إيمـانٌ بـالله ورَسولِهِ» قِيلَ: ثمَّ ماذَا؟ قَالَ: «الجِهادُ في سبيلِ الله» قِيلَ: ثمَّ ماذا؟ قالَ: «حجٌّ مَبرُورٌ» متفقٌ عليهِ.

1286. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)ను అత్యంత శ్రేష్ఠమైన ఆచరణ ఏదని అడగటం జరిగింది. అందుకాయన దేవుణ్ణి, దైవప్రవక్తను విశ్వసించటం అని చెప్పారు. ఆ తర్వాత ఏది అని అడిగితే, 'దైవమార్గంలో జిహాద్ చేయటం' అని చెప్పారు. ఆ తర్వాత ఏదని అడిగితే, అప్పుడాయన, 'హజ్జె మబ్రూర్ (స్వీకృతికి నోచుకున్న హజ్‌యాత్ర)' అని సమాధానమిచ్చారు.

(బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

1) ఈ హదీసు ఇంతకుముందు మూడో అధ్యాయంలో కూడా వచ్చింది. ఈ సందర్భంగా మనం గమనించవలసిన విషయమేమిటంటే వివిధ హదీసుల్లో వివిధ రకాల కర్మల్ని, ఆచరణల్ని శ్రేష్ఠమైనవిగా పేర్కొనటం జరిగింది. ఒక హదీసులో దేవుణ్ణి, దైవప్రవక్తను విశ్వసించటం శ్రేష్ఠమైన ఆచరణగా పేర్కొనబడితే మరో హదీసులో బీదసాదలకు అన్నం పెట్టడం శ్రేష్టమైన ఆచరణగా పరిగణించబడింది. ఇంకో హదీసులో తోటి ముస్లింలను బాధించకుండా ఉండటం అత్యంత శ్రేష్ఠమైన ఆచరణగా చెప్పబడింది. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఒకే ప్రశ్నకు వేర్వేరు సమాధానాలివ్వటానికి అనేక కారణాలున్నాయి. ఆయన పరిస్థితి, సందర్భాన్నిబట్టి ఆదేశాలిచ్చేవారు. ఒక్కోసారి ఎదుటి వ్యక్తి మనస్తత్వాన్ని, నైతిక స్థితిని దృష్టిలో పెట్టుకొని కూడా ఆయన సమాధానాలిచ్చేవారు.

2) నిఘంటువు పరంగా 'హజ్' అంటే ఎక్కడికయినా వెళ్ళటానికి నిశ్చయించుకోవటం అని అర్థం. షరీఅత్‌లో హజ్‌యాత్రా విధులను నిర్వర్తించే ఉద్దేశ్యంతో దైవగృహమైన కాబా దగ్గరకు వెళ్ళటానికి నిశ్చయించుకోవటాన్ని 'హజ్' అంటారు. 'మబ్రూర్' అనే పదం బిర్ర్ అనే మూలపదం నుండి వచ్చింది. బిర్ర్ అంటే విధేయత చూపటం అని అర్థం. ఎలాంటి అవిధేయతకు, పాపకార్యానికీ పాల్పకుండా చిత్తశుద్ధితో చేయబడిన హజ్‌యాత్ర అని ఇక్కడ దానిభావం.

١٢٨٧ ـ وَعَنِ ابنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ: يَا رسُولَ اللهِ! أَيُّ العَمَلِ أَحَبُّ إِلى اللهِ تَعَالَى؟ قَالَ: «الصَّلاةُ عَلى وَقْتِهَا» قُلْتُ: ثُمَّ أَيٌّ؟ قَالَ: «بِرُّ الوَالدَيْنِ» قُلْتُ: ثُمَّ أَيٌّ؟ قَالَ: «الجِهَادُ فِي سَبِيلِ اللهِ» متفقٌ عليهِ.

1287. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: ఓసారి నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను- "దేవునికి అత్యంత ప్రియమైన ఆచరణ ఏది?" అని. అందుకాయన 'వేళకు నమాజ్ చేయటం' అని చెప్పారు. నేను "ఆ తర్వాత ఏది?" అని అడిగాను 'తల్లిదండ్రుల పట్ల ఉత్తమంగా వ్యవహరించటం' అని చెప్పారు. నేను మళ్ళీ, 'ఆ తర్వాత ఏది?' అని అడిగాను. అందుకాయన 'దైవమార్గంలో జిహాద్ చేయటం' అని సమాధానమిచ్చారు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు గురించి ఇమామ్ ఖుర్తుబీ (రహ్మలై) ఇలా వ్యాఖ్యానిస్తున్నారు: నమాజ్ ఏమంత కష్టమైన పనికాదు. పైగా నమాజ్ చేస్తే చాలా పుణ్యం లభిస్తుంది. ఈ విషయం తెలిసి కూడా ఎవరయినా ఏ కారణమూ లేకుండా వేళకు నమాజ్ చేయకుండా ఎగవేస్తే, అలాంటి మనిషి ఇతర మంచిపనులయినా చేస్తాడని మనం ఆశించలేము. అదే విధంగా తల్లిదండ్రులకు తన మీద అందరికంటే ఎక్కువ హక్కు ఉంటుందని తెలిసికూడా వారిపట్ల మంచిగా మెలగనివాడు ఇతరులపట్ల మంచిగా మెలుగుతాడన్న నమ్మకం ఏముంటుంది? అలాగే ధర్మవిరోధులు ఇస్లాం పట్ల శత్రుత్వానికి పూనుకున్నప్పుడు వారితో యుద్ధం చేయటానికి వెనుకంజ వేసినవాడు సమాజంలో జరిగే పాపకార్యాలకు, అకృత్యాలకు వ్యతిరేకంగా పోరాడుతాడన్న నమ్మకం ఏమిటి? (ఇబ్నె అల్లాన్).

١٢٨٨ ـ وَعَنْ أَبِي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ يَا رَسُولَ اللهِ! أَيُّ العَمَلِ أَفضَلُ؟ قَالَ: «الإِيمَانُ بِاللهِ، وَالجِهَادُ فِي سَبِيلِهِ» مُتفقٌ عليهِ.

1288. హజ్రత్ అబూ జర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను, '(కర్మల్లో) ఏ కర్మ గొప్పది?' అని అడిగాను. అందుకాయన సమాధాన మిస్తూ, 'అల్లాహ్‌ను విశ్వసించటం, ఆయన మార్గంలో జిహాద్ చేయటం' అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని బానిస విమోచన ప్రకరణం- సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

١٢٨٩ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَغَدْوَةٌ فِي سَبِيلِ اللهِ، أَوْ رَوْحَةٌ، خَيْرٌ مِن الدُّنْيَا وَمَا فِيهَا» متفقٌ عليهِ.

1289. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక ఉదయం పూట గాని లేదా ఓ సాయంత్రం వేళగాని దైవమార్గంలో నడిస్తే (అందుకు లభించే పుణ్యం) మొత్తం ప్రపంచం, ఇంకా అందులో ఉన్న వాటన్నిటికంటే ఎంతో శ్రేష్ఠమైనది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'గద్వతున్' మరియు 'రౌహతున్' అనే పదాలు ఉపయోగించబడ్డాయి. ఉదయం పూటగాని, సాయంత్రం పూటగాని నడవటం అని ఆ పదాలకు అర్థం. ఇక్కడ అవి దైవమార్గంలో పోరాటం చేసే ఉద్దేశ్యంతో నడవటం అనే అర్థంలో వాడబడ్డాయి. ఈ ప్రపంచం, ఇందులో ఉన్న సకల ఐశ్వర్యాలు, సిరిసంపదలన్నీ కూడా ఏదో ఒకనాడు నశించి పోయేవే. కాని దైవమార్గంలో చేయబడిన ఆ సత్కర్మ మాత్రం ఎన్నటికీ నశించిపోకుండా ఉంటుంది. అందుకే ఆ కర్మ యావత్ప్రపంచం, ప్రపంచంలో ఉన్న వస్తువులన్నింటి కంటే శ్రేష్ఠమైనదని చెప్పటం జరిగింది.

١٢٩٠ ـ وَعَنْ أَبي سَعِيدٍ الخُدْرِيِّ رَضِـيَ اللهُ عَنْـهُ قَـالَ: أَتـى رَجُـلٌ رَسُولَ اللهِ ﷺ، فَقَالَ: أَيُّ النَّاسِ أَفْضَلُ؟ قَالَ: «مُؤْمِنٌ يُجَاهِدُ بِنَفْسِهِ وَمَالِهِ في سَبِيلِ اللهِ» قال: ثُمَّ مَنْ؟ قَالَ: «مُؤْمِنٌ في شِعْـبٍ مِنَ الشِّعَابِ يَعْبُدُ اللهَ، وَيَدَعُ النَّاسَ مِنْ شَرِّهِ» متفقٌ عليهِ.

1290. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ఆయన్ని, 'ప్రజలందరిలోకెల్లా ఉత్తముడెవడు?' అని అడిగాడు. అందుకాయన సమాధానమిస్తూ, 'దైవమార్గంలో తన ధనప్రాణాలతో సహా పోరాడే విశ్వాసి' అని చెప్పారు. ఆ వ్యక్తి మళ్ళీ, 'ఆ తర్వాత ఉత్తముడు ఎవడు?' అని అడిగాడు. అందుకాయన, 'ఏదయినా పర్వత కనుమల్లోకెళ్ళి దేవుణ్ణి ఆరాధించుకుంటూ ప్రజలకు తనవల్ల కీడు కలగకుండా జాగ్రత్తపడే వ్యక్తి' అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'బాబుల్ అజ్‌లా'లో కూడా వచ్చింది. దీని ద్వారా బోధపడేదేమిటంటే జనవాసాల్లో కల్లోల భరితమైన వాతావరణం నెలకొని ఉండి, ధర్మాన్ని ఆచరించటమే కష్టమైపోయినప్పుడు ప్రజలు తమ ధర్మాన్ని, విశ్వాసాలను కాపాడుకోవటం కోసం, ధర్మాదేశాలను నెరవేర్చటం కోసం జనవాసాలకు దూరంగా కొండల్లో, అడవుల్లోకెళ్ళి నివసించటం మంచిది. కల్లోల పరిస్థితుల్లో అది కూడా గొప్ప కర్మగానే పరిగణించబడుతుంది.

١٢٩١ ـ وَعَنْ سَهْلِ بْنِ سَعْدٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «رِبَاطُ يَوْمٍ فِي سَبِيلِ اللهِ خَيْرٌ مِنَ الدُّنْيَا وَمَا عَلَيْهَا، وَمَوْضِعُ سَوْطِ أَحَدِكُمْ مِنَ الْجَنَّةِ خَيْرٌ مِنَ الدُّنْيَا وَمَا عَلَيْهَا، وَالرَّوْحَةُ يَرُوحُهَا الْعَبْدُ فِي سَبِيلِ اللهِ تَعَالَى، أَوِ الْغَدْوَةُ، خَيْرٌ مِنَ الدُّنْيَا وَمَا عَلَيْهَا» متفقٌ عليه.

1291. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుని మార్గం లో (ఇస్లామీయ రాజ్య) సరిహద్దు మీద ఒకరోజు కాపలా కాయటం (వల్ల లభించే పుణ్యం) మొత్తం ప్రపంచం, ప్రపంచంలో ఉన్న వస్తువులన్నిటికంటే ఎంతో శ్రేష్ఠమైనది. మీలో ఎవరి కయినా స్వర్గంలో ఒక కొరడా (పొడ వంత) స్థలం లభించటం (కూడా చాలా గొప్ప విషయమే. ఎందుకంటే అది) మొత్తం ప్రపంచం, ప్రపంచంలో ఉన్న వస్తువులన్నిటికంటే ఎంతో శ్రేష్ఠ మైనది. అదే విధంగా ఒక ఉద యమో లేక ఒక సాయంత్రమో దాసుడు దైవమార్గంలో (జిహాద్ నిమిత్తం) నడవటం కూడా మొత్తం ప్రపంచం ఇంకా అందులో ఉన్న వస్తువులన్నిటికంటే ఎంతో శ్రేష్ఠమైనది.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

١٢٩٢ ـ وَعَنْ سَلْمَانَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «رِبَاطُ يَوْمٍ وَلَيْلَةٍ خَيْرٌ مِنْ صِيَامِ شَهْرٍ وَقِيَامِهِ، وَإِنْ مَاتَ فِيهِ جَرَى عَلَيْهِ عَمَلُهُ الَّذِي كَانَ يَعْمَلُ، وَأُجْرِيَ عَلَيْهِ رِزْقُهُ، وَأَمِنَ الْفَتَّانَ» رواهُ مُسلمٌ.

1292. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ సల్మాన్ (రజి) తెలియజేశారు: సరిహద్దు మీద ఒక పగలు ఒక రేయి కాపలా కాయటం, ఒక నెలపాటు ఉపవాసాలు పాటించటం మరియు రాత్రిళ్ళు జాగారం చేసి నమాజులు

చేయడం కన్నా గొప్ప పని. ఒకవేళ ఆ విధంగా కాపలా కాసేవాడు గనక ఆ సమయంలో మరణిస్తే, అంతవరకూ అతను చేస్తూ ఉండిన సత్కార్యం, ఆపై కూడా కొనసాగుతూనే ఉంటుంది. (అంటే అతనికి దాని పుణ్యం చేరుతూ ఉంటుంది). అతనికి తన (స్వర్గ) ఉపాధి కూడా లభించటం మొదలవుతుంది. (అంతేకాదు) అతను పరీక్షకు గురిచేసేవారి నుండి కూడా సురక్షితంగా ఉంటాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఏ ధర్మ యోధుడయినా ఇస్లామీయ రాజ్యసరిహద్దు మీద కాపలా కాస్తూ మరణిస్తే, అతను సహజ మరణానికి గురైనా లేక శత్రువుల చేత చంపబడినా సరే; తన జీవితంలో చేసుకున్న సత్కర్మల మూలంగా ప్రళయం వరకూ అతని కర్మల జాబితాలో పుణ్యాలు వ్రాయబడుతూనే ఉంటాయి. అంతేకాదు ఇతర అమరవీరుల (షహీదుల)కు మాదిరిగా ఇతనికి కూడా స్వర్గం నుండి ఆహారం లభిస్తూ ఉంటుంది.

ఇకపోతే పరీక్షకు గురిచేసేవారంటే సమాధిలో మృతుణ్ణి ప్రశ్నలడిగే దైవదూతలన్నమాట. నిజానికి దైవదూతలు అడిగే ప్రశ్నలకు జవాబు చెప్పటం కూడా ఓ పెద్ద పరీక్షే. మరణించిన ప్రతి మనిషీ ఆ పరీక్షకు గురికావలసి ఉంటుంది. అయితే విశ్వాసులు మాత్రం ఆ దశను చాలా సులభంగా దాటుకొని వెళ్లిపోతారు. దైవకృపతో వారు ఆ దైవదూతలకు సరైన సమాధానం చెప్పగలుగుతారు.

1293. హజ్రత్ ఫజాలా బిన్ ఉబైద్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: మరణించిన ప్రతి మనిషి ఆచరణల పరంపర అతని మరణంతోనే ముగిసిపోతుంది. కాని దైవమార్గంలో సరిహద్దు మీద

١٢٩٣ ـ وعَنْ فَضَالَةَ بنِ عُبَيْدٍ رَضِيَ اللهُ عَنْهُ، أنَّ رَسُولَ الله ﷺ قَالَ: «كُلُّ مَيِّتٍ يُخْتَمُ عَلى عَمَلِهِ إلَّا المُرَابِطَ في سَبيلِ اللهِ؛ فَإنَّهُ يَنْمِي لهُ عَمَلُهُ إلى يَوْمِ القِيَامَةِ، وَيُؤَمَّنُ من فِتْنَةِ القَبْرِ» رواهُ أبو

داود، والترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ صحيحٌ.

కాపలా కాసే యోధుని ఆచరణలు మాత్రం ప్రళయం వరకూ కొనసాగుతాయి (అప్పటివరకూ అతనికి వాటి పుణ్యం లభిస్తునే ఉంటుంది). ఇంకా అతను సమాధి పరీక్షల నుండి కూడా సురక్షితంగా ఉంటాడు.

(అబూదావూద్, తిర్మిజీ-హసన్, సహీహ్)

(సునవె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం - సునవె తిర్మిజీలోని జిహాద్ ఘనత అధ్యాయాలు)

١٢٩٤ ـ وَعَنْ عُثْمَانَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «رِباطُ يَوْمٍ فِي سَبِيلِ اللهِ خَيْرٌ مِنْ أَلْفِ يَوْمٍ فِيما سِوَاهُ مِنَ المَنَازِلِ» رواهُ الترمذيُّ وقالَ: حديثٌ حَسَنٌ صَحيحٌ.

1294. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉస్మాన్ (రజి) తెలియజేశారు: దైవ మార్గంలో సరిహద్దు మీద ఒకరోజు కాపలా కాయటం ఇతరచోట్ల వెయ్యి రోజులు కాపలా కాయటం కంటే చాలా గొప్ప పని.

(తిర్మిజీ-హసన్-సహీహ్)

(సునవె తిర్మిజీలోని జిహాద్ ఘనత అధ్యాయం)

١٢٩٥ ـ وَعَنْ أَبِي هُرَيرةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «تَضَمَّنَ اللهُ لِمَنْ خَرَجَ فِي سَبِيلِه، لا يُخْرِجُهُ إلَّا جِهَادٌ فِي سَبِيلي، وَإِيمانٌ بي وَتَصْدِيقٌ بِرُسُلِي؛ فَهوَ ضَامِنٌ عَلَيَّ أن أُدْخِلَهُ

1295. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తన మార్గంలో (యుద్ధం చేసే ఉద్దేశ్యంతో) బయలు దేరే వ్యక్తి బాధ్యతను (స్వయంగా) దేవుడే తీసుకుంటున్నాడు. ఆయన ఇలా అంటున్నాడు: “ఈ దాసుడు నా మార్గంలో జిహాద్ చేయాలన్న ఉద్దేశ్యంతో నా మీద విశ్వాసంతో,

الجَنَّةَ، أَوْ أُرْجِعَهُ إِلى مَنْزِلِهِ الَّذي خَرَجَ مِنْهُ بما نَالَ مِنْ أَجْرٍ، أَوْ غَنِيمَةٍ. وَالَّذي نَفْسُ مُحَمَّدٍ بِيَدِهِ ما مِنْ كَلْمٍ يُكْلَمُ في سَبيلِ اللهِ إلَّا جاءَ يَوْمَ القِيَامَةِ كَهَيْئَتِهِ يَوْمَ كُلِمَ: لَوْنُهُ لَوْنُ دَمٍ، وَرِيحُهُ رِيحُ مِسْكٍ. وَالَّذي نَفْسُ مُحَمَّدٍ بِيَدِهِ لَوْلَا أَنْ أَشُقَّ عَلى المُسْلِمِينَ مَا قَعَدْتُ خِلافَ سَرِيَّةٍ تَغْزُو في سَبيلِ اللهِ أَبداً، وَلكِنْ لا أَجِدُ سَعَةً فَأَحْمِلَهُمْ وَلا يَجِدُونَ سَعَةً، وَيَشُقُّ عَلَيْهِمْ أَنْ يَتَخَلَّفُوا عَنِّي. وَالَّذي نَفْسُ مُحَمَّدٍ بِيَدِهِ، لَوَدِدْتُ أَنْ أَغْزُوَ في سَبيلِ اللهِ، فَأُقْتَلَ، ثُمَّ أَغْزُوَ، فَأُقتلَ، ثُمَّ أَغزُوَ فَأُقتلَ» رواهُ مُسلمٌ وروى البخاريُّ بَعْضَهُ. «الكَلْمُ»: الجرحُ.

ఇంకా నా ప్రవక్తల్ని ధృవీకరించి నందువల్లనే (యుద్ధం కోసం) బయలుదేరాడు. కనుక ఇతని పూచీ నాది. ఇతణ్ణి నేను స్వర్గానికయినా పంపిస్తాను, లేదా అతను సంపాదించు కున్న పుణ్యంతోపాటు లేక విజయ ప్రాప్తితోపాటు అతణ్ణి అతని ఇంటికి చేరుస్తాను."

ఎవరి గుప్పెట్లోనయితే ఈ ముహమ్మద్ ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను: దైవమార్గంలో క్షత గాత్రుడైన వ్యక్తి ప్రళయదినాన (దేవుని సన్నిధికి) వచ్చినప్పుడు అతనికి ఆ రోజే గాయాలైనట్లు (శరీరం నుండి నెత్తు రోడుతూ ఉంటుంది). దాని రంగు రక్తపు రంగులాగానే ఉంటుంది. కాని వాసన మాత్రం కస్తూరి సువాసనలా పరిమళాలు వెదజల్లుతూ ఉంటుంది.

ఎవరి గుప్పెట్లోనయితే ఈ ముహమ్మద్ ప్రాణముందో ఆయన సాక్షిగా నేనీమాట చెబుతున్నాను: ముస్లింలు ఇబ్బందులు ఎదుర్కొంటారనే భయమే గనక నాకు లేకుంటే నేను దైవమార్గంలో యుద్ధం కోసం బయలు దేరే ఏ సైనిక దళాన్నీ విడిచిపెట్టి వెనుక ఉండిపోయేవాణ్ణికాను. అన్నిటిలో పాల్గొనేవాణ్ణి. కాని ప్రజలందరికీ వాహనాలు సమకూర్చే స్తోమత నాకు లేదు.

ఆఖరికి వారికి కూడా ఆ స్తోమత లేదు. అదీగాక యుద్ధంలో నేను ముందుండి తాము వెనుక ఉండిపోవటాన్ని కూడా వారు భరించలేరు.

ఎవరి గుప్పెట్లోనయితే ఈ ముహమ్మద్ ప్రాణముందో ఆయన్ని సాక్షిగా ఉంచి నేనీ మాట చెబుతున్నాను: నేను జిహాద్ చేస్తూ చంపబడాలనీ తిరిగి బ్రతికి జిహాద్ చేస్తూ చంపబడాలనీ మళ్ళీ బ్రతికి మళ్ళీ జిహాద్ చేస్తూ చంపబడాలని ఎంతో కుతూహలంగా ఉంది నాకు.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఇహలోకంలో శత్రువులతో పోరాడుతూ క్షతగాత్రులైన ధర్మయోధులు ప్రళయ దినాన తిరిగి అదే స్థితిలో లేపబడతారు. వారికి ఆ రోజే గాయాలయినట్లు వారి శరీరం నెత్తురోడుతూ ఉంటుంది. అందులోనుంచి కస్తూరి పరిమళాలు గుభాళిస్తూ ఉంటాయి. దాంతో హష్ర్ మైదానంలో ఉండేవారందరి ముందు వారి ఘనతా విశిష్ఠతలు ఇనుమడిస్తాయి.

١٢٩٦ ـ وَعَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «ما مِنْ مَكلوم يُكْلَمُ في سَبيلِ اللهِ إلَّا جَاءَ يَوْمَ القِيَامَةِ، وَكَلْمُهُ يَدْمَى: اللَّوْنُ لونُ دَمٍ، وَالرِّيحُ رِيحُ مِسْكٍ» متفقٌ عليهِ.

1296. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవమార్గంలో క్షతగాత్రుడైన వ్యక్తి ప్రళయదినాన వచ్చినప్పుడు అతని గాయాల నుండి నెత్తురోడుతూ ఉంటుంది. దాని రంగు రక్తపు రంగులోనే ఉంటుంది. అయితే దాని వాసన మాత్రం కస్తూరి వాసన లాగుంటుంది. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జబాయెహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

1297. హజ్రత్ ముఆజ్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే దైవ మార్గంలో ఒంటె పాలు రెండోసారి పితకటానికి పట్టేంతసేపు యుద్ధం చేస్తారో వారికి తప్పకుండా స్వర్గం లభిస్తుంది. దైవమార్గంలో పోరాడే వ్యక్తికి ఏదయినా గాయమయితే లేదా గీసుకుపోతే ప్రళయ దినాన ఆ గాయం లేక గీత చాలా పెద్దదయిపోతుంది. దాని రంగు కాషాయపురంగులో ఉంటుంది. దాని వాసన కస్తూరి వాసనలా ఉంటుంది. (అబూదావూద్, తిర్మిజీ-హసన్)

١٢٩٧ ـ وَعَنْ مُعَاذٍ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ قَاتَلَ فِي سَبِيلِ اللهِ مِن رَجلٍ مُسلِمٍ فُوَاقَ نَاقَةٍ وَجَبَتْ له الجَنَّةُ، وَمَنْ جُرِحَ جُرْحاً فِي سَبِيلِ اللهِ أَوْ نُكِبَ نَكبَةً؛ فَإِنَّهَا تجيءُ يَوْمَ القِيَامَةِ كَأَغزَرِ مَا كَانَتْ: لَوْنُهَا الزَّعْفَرَانُ، وَرِيحُهَا كالمِسْكِ». رواهُ أبو داوُدَ، والترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ صحيحٌ.

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'ఫువాఖ్' అనే పదం వచ్చింది. ఒకసారి ఒంటె పాలుపితికిన తర్వాత నుంచి రెండోసారి పాలు పితకటానికి మధ్య కాలాన్ని ఫువాఖ్ అని అంటారు. సాధారణంగా ఆ వ్యవధి చాలా తక్కువగా ఉంటుంది. అందుకే దైవమార్గంలో కొంతసేపు యుద్ధం చేయటం కూడా చాలా గొప్పకార్యమని తెలియజేయటానికి ఆ వ్యవధిని ఇక్కడ పేర్కొనటం జరిగింది. ఆ కాసేపు జిహాద్ చేసినా స్వర్గం లభిస్తుందని చెప్పబడింది. అయితే దానికి ధర్మయోధునిలో చిత్తశుద్ధి ఉండాలి. అంతేకాకుండా అతను ఘోరపాపాలకు పాల్పడనివాడయి, తోటి మానవుల హక్కుల్ని కొల్లగొట్టనివాడయి ఉండాలి. అప్పుడే అతనికి ఈ హదీసు సార్థకత వహిస్తుంది.

1298. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త సహచరుల్లో ఒకాయన ఒక కనుమ గుండా వెళుతూ అక్కడవున్న ఓ చిన్న మంచినీళ్ళ కొలను చూసి ముగ్ధుడై, "ఆహా! నేను జన వాసానికి దూరంగా ఇక్కడ నివాసం ఏర్పరచుకుంటే ఎంత బాగుంటుంది!

١٢٩٨ ـ وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: مَرَّ رَجُلٌ مِنْ أَصْحَابِ رَسُولِ اللهِ ﷺ، بِشِعْبٍ فِيهِ عُيَيْنَةٌ مِن مَاءٍ عَذْبَةٍ؛ فَأَعْجَبَتْهُ، فقَالَ: لو اعتزَلتُ النَّاسَ فَأَقَمْتُ

فِي هذا الشِّعْبِ، ولَنْ أَفعَلَ حَتى أَسْتَأذِنَ رَسُـــولَ الله ﷺ، فــذكـــرَ ذلـــكَ لِرسُولِ الله ﷺ: فقَالَ: «لا تفعلْ، فإنَّ مُقامَ أَحدِكُمْ في سَبِيلِ الله أَفضَلُ مِنْ صَلاتِهِ في بَيتِهِ سَبْعِينَ عاماً، ألا تُحِبُّونَ أنْ يَغفِرَ اللهُ لَكُمْ وَيُدْخِلَكُمُ الجَنَّةَ؟ اغزُوا في سبيلِ اللهِ، مَنْ قَاتَلَ في سَبيلِ الله فُوَاقَ نَاقَةٍ وَجَبَتْ له الجَنَّةُ» رواهُ الترمذيُّ وَقَالَ: حـديـثٌ حَسَـنٌ. «والفُـوَاقُ»: مَـا بَيْـنَ الحَلْبَتَيْنِ.

ఏమయినప్పటికీ దైవప్రవక్త (సల్లం) అనుమతి లేకుండా నేను ఆ పని చేయకూడదు" అని అనుకున్నారు.

ఎట్టకేలకు దైవప్రవక్త (సల్లం) ముందు ఆ విషయం ప్రస్తావించబడింది. అప్పుడాయన దాన్నుండి వారిస్తూ, "అలా చేయకు, ఎందుకంటే దైవ మార్గంలో (జిహాద్ చేస్తూ) ఉండటం ఇంట్లో డెబ్భై సంవత్సరాలపాటు నమాజ్ చేయటం కంటే ఎంతో శ్రేష్ఠమైన పని. దేవుడు నిన్ను మన్నించి స్వర్గానికి పంపాలని నీవు కోరుకోవటం లేదా? (అందువల్ల) దైవమార్గంలో యుద్ధం చేస్తూ బ్రతుకు. ఎవరయితే దైవమార్గంలో ఒంటె పాలు రెండోసారి పితకటానికి పట్టేంతసేపు యుద్ధం చేస్తారో వారికి తప్పకుండా స్వర్గం లభిస్తుంది" అని ఉపదేశించారు.

*(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని జిహాద్ ఘనత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఈ హదీసు దైవమార్గంలో యుద్ధం చేయటం యేళ్ళ తరబడి నఫిల్ నమాజులు చేయటం కన్నా ఎంతో గొప్ప పుణ్యకార్యమని చెబుతోంది. నిజమే! నమాజ్ చేయటం వల్ల దాని ప్రయోజనం నమాజ్ చేసే వ్యక్తికే పరిమితమయి ఉంటుంది. కాని జిహాద్ వల్ల ధర్మోన్నత్యం ఇనుమడిస్తుంది. శత్రువుల్ని ఇస్లామీయ రాజ్యసరిహద్దుల నుండి పారద్రోలటం జరుగుతుంది. దానివల్ల దేశప్రజలందరూ ప్రయోజనం పొందగలుగుతారు.

2) దైవప్రవక్త సహచరులు తమ నాయకుడయిన ప్రవక్త అనుమతి లేకుండా ఏ పనీ చేసేవారు కాదు.

١٢٩٩ ـ وَعَنْــهُ قَــالَ: قِيــلَ: يا رَسُولَ اللهِ! ما يَعْدِلُ الجِهَادَ في سَبيلِ اللهِ؟ قَالَ: «لا تَسْتَطِيعُونَهُ» فَأَعادُوا عليهِ مَـرَّتَيْـنِ أو ثَـلاثـاً كُـلُّ ذلـكَ يقـول: «لا تَستَطِيعُونَه!» ثُمَّ قالَ: «مَثَلُ المُجَاهِدِ في سَبيلِ اللهِ كَمَثَلِ الصَّائِمِ القَائِمِ القَانِتِ بآياتِ اللهِ لا يَفْتُرُ مِنْ صَلاةٍ، ولا صِيامٍ، حَتى يَرجِعَ المجَاهِدُ في سَبيلِ اللهِ» متفقٌ عليه. وهـذا لفـظُ مسلِمٍ. وفي روايةِ البخاريِّ، أَنَّ رَجلاً قَالَ: يا رَسُولَ اللهِ! دُلَّنِي عَلى عَمَلٍ يَعْدِلُ الجِهَادَ؟ قَالَ: «لا أَجِدُهُ» ثمَّ قال: «هَلْ تَستَطِيعُ إذا خَرَجَ المُجَاهِدُ أن تَدخُلَ مَسجِدَكَ فَتَقُومَ وَلا تَفتُرَ، وَتَصُومَ ولا تُفطِرَ؟» فَقَالَ: وَمَنْ يستطِيعُ ذٰلكَ؟!

1299. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం)ను "దైవమార్గంలో యుద్ధం చేయటానికి సమానమైన ఆచరణ ఏదయినా ఉందా?" అని అడగటం జరిగింది. దానికాయన "(ఉంది) కాని దాన్ని మీరు ఆచరించలేరు" అని అన్నారు. సహచరులు రెండు మూడు సార్లు అడిగారు, "అసలు అలాంటి ఆచరణ ఉందా?" అని. ప్రతిసారీ ఆయన "దాన్ని మీరు ఆచరించలేరు" అనే సమాధానం ఇస్తూపోయారు. చివరగా ఆయన ఇలా అన్నారు:

దైవమార్గంలో పోరాడే యోధుని ఉపమానం అలుపెరగకుండా ఉపవాసాలు పాటించే ఉపవాసి, రాత్రిళ్లు జాగారం చేసి నిర్విరామంగా నమాజులు చేస్తూ, దేవుని సూక్తుల్ని పాటించేవాడి లాంటిది. దైవమార్గంలో యుద్ధం చేయటానికి వెళ్ళిన యోధుడు ఇంటికి తిరిగొచ్చేవరకు అతను ఆ వ్రతాన్ని కొనసాగిస్తూనే ఉంటాడు. (బుఖారీ-ముస్లిం, వాక్యాలు ముస్లింవి.)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను "దైవప్రవక్తా! దైవమార్గంలో యుద్ధానికి (జిహాద్‌కు) సమానమైన ఆచరణ గురించి తెలుపగలరా?" అని

అడిగాడు. అందుకాయన, "నాకయితే అలాంటి ఆచరణ ఏదీ తోచటం లేదు" అని అన్నారు. తర్వాత ఆయనే, "ధర్మ యోధుడు యుద్ధం కోసం బయలు దేరగానే నువ్వు మస్జిద్‌లోకి ప్రవేశించి (అతను ఇంటికి తిరిగొచ్చేంతవరకూ) నిర్విరామంగా నమాజులు చేస్తూ, నిరంతరాయంగా ఉపవాసాలు పాటిస్తూ ఉండగలవా?" అని అడిగారు. దానికా వ్యక్తి "అంత శక్తి ఎవరికుంటుంది?" అని అన్నాడు.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక యోధుడు తాను ధర్మయుద్ధంలో పోరాడుతూ ఉన్నంతకాలం పగలు ఉపవాసాలు పాటిస్తూ, రాత్రిళ్లు జాగారం చేసి దైవారాధనలో గడుపుతూ ఉన్నట్లుగా పరిగణించబడతాడు. ఒక ధర్మయోధునికి సమానంగా పుణ్యాన్ని సంపాదించాలంటే ఆ విధంగా రేయింబవళ్లు పరిశ్రమించి దైవారాధన చేయవలసి ఉంటుంది మరి! కాని అది అంత సులభమైన పని కాదు. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే విధుల నిర్వహణ తర్వాత, అత్యవసర సందర్భాల్లో, దైవమార్గంలో యుద్ధం చేయటమనేది అత్యంత గొప్ప ఆచరణ. ఒక ధర్మయోధుడు యుద్ధమైదానంలో సంపాదించగలిగేంత పుణ్యం దైవారాధకుడు కూడా సంపాదించలేడు.

١٣٠٠ ـ وَعَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مِنْ خَيرِ مَعَاشِ النَّاسِ لَهُم رجُلٌ مُمسكٌ بِعِنَانِ فَرَسِهِ في سَبِيلِ اللهِ، يَطِيرُ عَلى مَتْنِهِ كُلَّمَا سَمِعَ هَيعةً، أَوْ فَزعَةً طَارَ عَلى مَتنِهِ، يَبْتَغِي القَتلَ أو المَوتَ مَظَانَّهُ،

1300. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ప్రజలందరిలోకెల్లా అత్యుత్తమ జీవితం ఎవరిదంటే అతను దైవమార్గంలో తన గుర్రపు కళ్ళెం చేతబట్టుకొని దానిపై స్వారీ చేసి మెరుపువేగంతో (అటూ ఇటూ) వెళుతుంటాడు. ఎక్కడినుంచ

أَو رَجُلٌ فـي غُنَيْمَـةٍ أَو شَعَفَـةٍ مِـن هـذا الشُّعَفِ أَو بَطنِ وادٍ من هذِهِ الأَودِيَةِ يُقيمُ الصَّلاةَ، وَيُؤتي الزَّكَاةَ، وَيَعْبُدُ رَبَّهُ حَتَّى يَأْتِيَهُ اليَقِينُ لَيسَ منَ النَّاسِ إلَّا في خَيرٍ» رواهُ مسلمٌ.

యినా ప్రేలుళ్లు, అందోళన కలిగించే శబ్దాలేవయినా వినపడితే మెరుపులా అక్కడికి చేరుకుంటాడు. ఆ విధంగా అతను తాను హతమయ్యే, మరణాన్ని పొందగలిగే స్థలాల్ని వెతుక్కుంటూ ఉంటాడు.

లేక (అత్యుత్తమ జీవితం ఎవరిదంటే) అతను ఏదయినా పర్వత శిఖరంపైకి గాని లేదా ఏదయినా లోయకుగాని కొన్ని మేకల్ని తోలుకొని వెళ్ళి స్థిరపడి పోతాడు. అక్కడే నమాజును స్థాపిస్తాడు. (బీదలకు) జకాత్ ధనం చెల్లిస్తాడు. తన ప్రభువును ఆరాధించు కుంటూ ఉంటాడు. మరణం వరకూ అతను తన జీవితాన్ని అలాగే కొనసాగి స్తాడు. ఆఖరికి మరణ సమయంలో అతను ప్రజలతో మంచి సంబంధా లను కలిగి ఉంటాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు "ఉపద్రవకాలంలో ఏకాంతాన్ని ఆశ్రయించటం" అనే అధ్యాయంలో కూడా వచ్చింది. ఇందులో ధర్మయోధుని గొప్పదనం గురించి చెప్పబడింది. అంతేకాకుండా ఉపద్రవకాలంలో జనవాసాల నుండి వేరుగా ఏకాంత జీవితాన్ని ఆశ్రయించే వ్యక్తి విశిష్ఠతను కూడా వివరించటం జరిగింది. లోకమంతా కల్లోలం వ్యాపించి ధర్మాన్ని ఆచరించటమే దుర్లభమయిపోయినప్పుడు ఏదో ఒక కనుమలోనో, పర్వత శిఖరంపైనో నివాసమేర్పరచుకోవటం లేదా కొన్ని మేకల్ని, గొర్రెల్ని తోలుకొని ఏదో ఒక అడవిలోకి వెళ్ళి ఇస్లామీయ విధుల్ని నిర్వర్తిస్తూ, దైవారాధన చేస్తూ జీవితం గడిపితే కనీసం తమ ధర్మాన్నయినా రక్షించుకున్నవారవుతారు. అదీగాకుండా తమ వల్ల తోటి మానవులకు ఎలాంటి నష్టం కలగకుండా ఉంటుంది.

١٣٠١ ـ وَعَنْهُ، أَنَّ رسولَ اللهِ ﷺ قالَ: «إنَّ في الجَنَّةِ مائَةَ دَرَجَةٍ أَعَدَّهَا اللهُ لِلمُجَاهِدِينَ في سَبيلِ اللهِ ما بَيْنَ الدَّرَجَتَيْنِ كَمَا بَيْنَ السَّمَاءِ وَالأَرْضِ» رواهُ البخاريُّ.

1301. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: స్వర్గంలో వంద అంతస్తులున్నాయి. దేవుడు వాటిని దైవమార్గంలో యుద్ధం చేసేవారి కోసం తయారుచేసి ఉంచాడు. వాటిలోని ఒక్కో అంతస్తు భూమీ ఆకాశమంత విశాలంగా ఉంటుంది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీ-జిహాద్ ప్రకరణం)*

١٣٠٢ ـ وعَن أَبي سَعيدِ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ رَضِيَ بِاللهِ رَبًّا، وَبالإِسْلام دِيناً، وَبِمُحَمَّدٍ رَسُولًا، وَجَبَتْ لَهُ الجَنَّةُ» فَعَجِبَ لَهَا أبو سَعيدٍ، فَقَالَ أَعِدْها عَلَيَّ يا رَسولَ اللهِ! فَأَعَادَهَا عَلَيْهِ، ثُمَّ قَالَ: «وَأُخرَى يَرْفَعُ اللهُ بها العَبْدَ مائَةَ دَرَجَةٍ في الجَنَّةِ، ما بَيْنَ كُلِّ دَرَجَتَيْنِ كَمَا بَيْنَ السَّمَاءِ وَالأَرْضِ» قالَ: وما هِيَ يا رسولَ اللهِ؟

1302. హజ్రత్ అబూసయీద్ ఖుద్రీ (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) (మాకు హితోపదేశం చేస్తూ) "ఎవరయితే అల్లాహ్‌ను తమ ప్రభువుగా, ఇస్లాంను తమ ధర్మంగా, ముహమ్మద్‌ను తమ ప్రవక్తగా అంగీకరిస్తారో వారికి తప్పకుండా స్వర్గం లభిస్తుంది" అని అన్నారు.

ఆ మాట నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తింది. "దైవప్రవక్తా! ఆ మాట ఇంకో సారి చెప్పండి" అని నేను విన్నవించుకున్నాను. ఆయన అదే మాట మళ్ళీ ప్రస్తావించిన తర్వాత ఇలా అన్నారు: "ఇంకో సత్కార్యం ఉంది. దాన్ని ఆచరించే వారికొరకు దేవుడు స్వర్గంలో వంద అంతస్తుల్ని పెంచుతాడు. వాటిలో ఒక్కో అంతస్తు భూమీ ఆకాశమంత ఉంటుంది."

قال: «الجهادُ في سَبيلِ اللهِ، الجهادُ في سَبيلِ اللهِ» رواهُ مُسلمٌ.

అది విని నేను "దైవప్రవక్తా! ఆ సత్కార్యం ఏది?" అని అడిగాను. అందుకాయన, "దైవమార్గంలో యుద్ధం చేయుటం, దైవమార్గంలో యుద్ధం చేయుటం" అని (రెండుసార్లు) అన్నారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లిం, పదవుల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ప్రపంచంలో మానవులు చేసే సత్కార్యాలకు అనుగుణంగానే స్వర్గంలో వారికి కేటాయించబడే స్థానాలు, తరగతులు నిర్ణయించబడతాయి. స్వర్గంలో అంతులేనన్ని అంతస్తులుంటాయి. వాటిలో వంద అంతస్తులు దైవమార్గంలో పోరాడే యోధునికి లభిస్తాయని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

١٣٠٣ - وَعَنْ أَبي بَكْرِ بنِ أَبي مُوسى الأَشْعَرِيِّ قَالَ: سَمِعْتُ أَبي رضِيَ اللهُ عَنْه، وَهُو بحَضْرَةِ العَدُوِّ، يقول: قَالَ رَسُول اللهِ ﷺ: «إنَّ أَبْوَابَ الجَنَّةِ تَحْتَ ظِلالِ السُّيُوفِ» فَقَامَ رَجُلٌ رَثُّ الهَيْئَةِ فقَالَ: يَا أَبَا مُوسَى! أَأَنْتَ سمِعْتَ رسولَ اللهِ ﷺ يقولُ هذا؟ قالَ: نَعَمْ؟ فَرَجَعَ إلى أَصْحَابِهِ؛ فَقَالَ: «أَقْرَأُ عَلَيْكُمُ السَّلامَ» ثُمَّ كَسَرَ جَفْنَ سَيْفِهِ فَأَلْقَاه، ثُمَّ مَشَى بسَيْفِهِ إلى العَدُوِّ فَضَرَبَ بِهِ حَتَّى قُتِلَ» رواه مسلمٌ.

1303. అబూబక్ర్ బిన్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం మా నాన్నగారు శత్రువు సమీపంలో నిలబడి, "స్వర్గ ద్వారాలు ఖడ్గఛాయల క్రింద ఉంటా యని దైవప్రవక్త (సల్లం) ప్రవచించారు" అని చెప్పారు. ఆయన్నుంచి నేను ఈ మాట (నా చెవులారా) విన్నాను. ఆ మాట వినగానే ఒక వ్యక్తి లేచాడు. అతని బాహ్యస్థితి ఏమీ బాగాలేదు. అతను మా నాన్నను ఉద్దేశ్యించి, "అబూ మూసా! దైవప్రవక్త (సల్లం) ఈ మాట చెబుతుండగా నువ్వు విన్నావా?" అని అడిగాడు. నాన్న గారు, "ఔను విన్నాన'న్నారు. అంతే ఆ వ్యక్తి అక్కణ్ణుంచి తన సహచరుల దగ్గరకు వెళ్ళి వారికి (వీడ్కోలు)

సలాం చెప్పి ఖడ్గ ఒరను త్రుంచి పడే శాడు. తర్వాత ఖడ్గం తీసుకొని శత్రువు వైపు పరుగెత్తి దాంతో అతని మీద దాడి చేశాడు. అతనితో పోరాడుతూ అమరగతి నొందాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా జిహాద్ గొప్పదనంతోపాటు పూర్వపు తరాల ముస్లింలకు జిహాద్ పట్ల, దైవవాక్కుల పట్ల ఎంతటి దృఢ నమ్మకం ఉండేదో బోధపడుతోంది. ఆ నమ్మకమే వారిని ఇహలోక సుఖసౌఖ్యాలకు బదులు పరలోక సాఫల్యానికి పెద్దపీట వేసేందుకు పురికొల్పింది.

1304. హజ్రత్ అబూ అబ్స్ అబ్దుర్రహ్మాన్ బిన్ జబ్ర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవమార్గంలో దుమ్ము కొట్టుకున్న దాసుని కాళ్ళకు నరకాగ్ని అంటుకోవడం అసంభవం. (బుఖారీ)

١٣٠٤ - وَعَنْ أَبِي عَبْسٍ عبدِ الرَّحمٰنِ بنِ جَبْرٍ رَضِيَ اللهُ عنهُ قالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «ما اغْبَرَّتْ قَدَمَا عَبْدٍ في سَبِيلِ اللهِ فَتَمَسَّهُ النَّارُ» رواهُ البخاريُّ.

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

కాళ్ళకు దుమ్ముకొట్టుకోవటమంటే జిహాద్‌లో పాల్గొనటమని భావం. ధర్మయుద్ధంలో పాల్గొన్న వ్యక్తి నరకాగ్నికి ఆహుతి అవటమనేది జరగదు. ఎందుకంటే జిహాద్ మనిషివల్ల జరిగిన పాపాల మన్నింపుకు దోహదపడుతుంది. ధర్మయోధుడు గతంలోగాని, ఆ తర్వాతగాని ఘోరపాపాలకు పాల్పడకుండా ఉన్నట్లయితే ఇక అతను నూటికి నూరుపాళ్లు స్వర్గప్రవేశానికి అర్హత పొందినట్లే.

1305. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పితికిన పాలు తిరిగి పొదుగులోకి పోతాయేమో గాని

١٣٠٥ - وَعَنْ أَبِي هُرَيرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا يَلِجُ النَّارَ رَجُلٌ بَكَى مِنْ خَشْيَةِ اللهِ حَتَّى يَعُودَ

اللَّبَنُ في الضَّرْعِ، وَلا يَجْتَمِعُ عَلَى عَبْدٍ غُبَارٌ في سَبِيلِ اللهِ وَدُخَانُ جَهَنَّمَ» رواه الترمذيُّ وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

దైవభీతితో కంటతడిపెట్టిన మనిషి మాత్రం నరకానికి పోడు. అదే విధంగా ఒకదాసుడు దైవమార్గంలో లేపిన దుమ్ము, (అతన్ని) నరకంలో వేయటం వల్ల వచ్చే పొగ- రెండూ ఒకచోట చేరలేవు. (తిర్మిజీ-హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని జిహాద్ ఔన్నత్య అధ్యాయం)

١٣٠٦ ـ وَعَنِ ابنِ عبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «عَيْنَانِ لا تَمَسُّهُمَا النَّارُ: عَيْنٌ بَكَتْ مِنْ خَشْيَةِ اللهِ، وَعَيْنٌ بَاتَتْ تَحْرُسُ في سَبِيلِ اللهِ» رَواه الترمذيُّ وقالَ: حديثٌ حسنٌ.

1306. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు: రెండు రకాల కళ్లు అగ్ని సెగలకు గురికావు. ఒకటి: దైవభీతితో కన్నీరు కార్చిన కళ్లు. రెండు: కాపలా కాస్తూ జాగారం చేసిన కళ్ళు. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని జిహాద్ ఔన్నత్య అధ్యాయం)

١٣٠٧ ـ وعن زَيدِ بنِ خَالِدٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَن جَهَّزَ غَازِياً في سَبِيلِ اللهِ فَقَدْ غَزَا، وَمَنْ خَلَفَ غَازِياً في أَهْلِهِ بِخَيْرٍ فَقَدْ غَزَا» متفقٌ عليه.

1307. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవమార్గంలో యుద్ధం చేసేవారిని యుద్ధానికి సమాయత్తపరచినవారు కూడా యుద్ధం చేసినట్లే. అలాగే దైవ మార్గంలో పోరాడే యోధుడి ఇంట్లో అతనికి ప్రతినిధిగా ఉత్తమరీతిలో ఉండేవారు కూడా దైవమార్గంలో పోరాడినట్లుగానే పరిగణించబడతారు. (తిర్మిజీ-హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని జిహాద్ గొప్పదనం అధ్యాయం)

## ముఖ్యాంశాలు

ముస్లింలు పరస్పరం సానుభూతి సహకారభావాలతో కలిసిమెలిసి పనిచేయాలనీ, ఒకరి అవసరాల్లో మరొకరు తోడ్పడుతూ ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. సమాజంలో అలాంటి సహాయసహకారాలు అవసరమయ్యే చోట్లలో అత్యంత ప్రధానమైన చోట్లు రెండు ఇక్కడ ప్రస్తావించబడ్డాయి. ఒకటి: దైవమార్గంలో యుద్ధం చేసేవారిని యుద్ధానికి సమాయత్తపరచటం. అది ఏ రూపంలోనయినా కానివ్వండి. వారికి యుద్ధసామగ్రిని సమకూర్చటం ద్వారానయినా లేక తమ ధనప్రాణాలతో వారికి మద్దతు పలికయినా ఆఖరికి వారిని యుద్ధానికి పురికొల్పటం ద్వారానయినా సరే; ఏదో విధంగా వారిని యుద్ధానికి సమాయత్తపరచాలి. అలా చేస్తే తమకు కూడా యోధులకు లభించినంత పుణ్యం లభిస్తుంది.

ఇకపోతే సమాజ సహాయసహకారాలు అవశ్యమైన రెండవ ప్రధాన చోటు దైవమార్గంలో పోరాడే యోధుల ఇండ్లు. యుద్ధానికి వెళ్ళే యోధులు తమ ఇండ్లు, కుటుంబాల విషయంలో నిశ్చింతగా ఉన్నప్పుడే యుద్ధంలో వారు పూర్తి ఏకాగ్రతతో, దృఢచిత్తులై దైవమార్గంలో ప్రాణాలొడ్డి పోరాడగలుగుతారు. అలా జరగాలంటే సమాజంలోని ఇతర ముస్లింలు యోధుల కుటుంబాలను ఆదుకోవాలి. వారి ఇండ్లను కనిపెట్టుకొని ఉండాలి. వారి అవసరాలను తీర్చాలి. ఆ విధంగా సహాయసహకారాలు అందించేవారు ఇహలోకంలో ఇస్లామీయ రాజ్యంలో సుఖమయమైన, శాంతియుతమైన జీవితాన్ని ఎటూ పొందుతారు. దాంతోపాటు పరలోకంలో వారికి ఆ ధర్మయోధులకు లభించినంత పుణ్యం కూడా లభిస్తుంది.

١٣٠٨ - وَعَنْ أَبِي أُمَامَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَفْضَلُ الصَّدَقَاتِ ظِلُّ فُسْطَاطٍ فِي سَبِيلِ اللهِ وَمَنِيحَةُ خَادِمٍ فِي سَبِيلِ اللهِ، أَوْ طَرُوقَةُ فَحْلٍ فِي سبيلِ اللهِ» رواه الترمذي وقال: حديثٌ حَسَنٌ صَحِيحٌ.

1308. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:

"దానాలలోకెల్లా గొప్ప దానం దైవ మార్గంలో (ధర్మయోధులు సేద దీరేందుకు అనువైన) నీడగల గుడారును నిలపటం లేదా దైవమార్గంలో (ధర్మ యోధుడు తన సేవకై నియుక్తం చేసుకోగల) సేవకుణ్ణి కానుకగా ఇవ్వటం లేదా (ధర్మయోధుడు లబ్ది పొందగలిగే) పడుచు (ఆడ) ఒంటెను దైవ మార్గంలో సమర్పించుకోవటం"

(తిర్మిజీ-హసన్, సహీహ్)

(సునసె తిర్మిజీలోని జిహాద్ గొప్పదనం అధ్యాయాలు)

١٣٠٩ - وَعَن أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ فَتًى مِن أَسْلَمَ قَالَ: يا رسولَ اللهِ! إنِّي أُريدُ الغَزْوَ وَلَيْسَ مَعِي ما أَتَجَهَّزُ بِهِ، قَالَ: «ائتِ فُلاناً، فإنَّه كانَ قَدْ تَجَهَّزَ فَمَرِضَ» فَأَتاه فقَالَ: إنَّ رَسُولَ اللهِ ﷺ يُقرِئُكَ السَّلامَ ويقولُ: أَعْطِني الذي تجَهَّزتَ بِهِ. قَالَ: يا فُلانَةُ! أَعْطِيهِ الذي كُنْتُ تَجَهَّزْتُ بِهِ، وَلا تَحْبِسِي عَنْهُ شَيْئاً، فَوَاللهِ! لا تَحْبِسِي مِنْهُ شَيْئاً فَيُبَارَكَ لَكِ فِيهِ. رَواه مسلمٌ.

1309. హజ్రత్ అనస్ (రజి) కథనం: అస్లం తెగకు చెందిన ఒక యువకుడు (దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి) "దైవ ప్రవక్తా! నేను ధర్మయుద్ధంలో పాల్గొనా లనుకుంటున్నాను. కాని యుద్ధానికి తయారై వెళ్ళటానికి నా దగ్గర సామాను ఏమీ లేదు" అని విన్నవించుకున్నాడు. దానికాయన "ఫలానా వ్యక్తి దగ్గరికి వెళ్ళు. అతను యుద్ధ సన్నాహాలు చేసుకొని (అకస్మాత్తుగా) జబ్బుపడ్డాడు. (నువ్వెళ్ళి అతని దగ్గరి నుంచి యుద్ధ సామగ్రి తీసుకోవచ్చు)" అని చెప్పారు. ఆ యువకుడు దైవప్రవక్త (సల్లం) చెప్పిన వ్యక్తి దగ్గరికి వెళ్ళి, "దైవప్రవక్త (సల్లం) మీకు సలాం చెప్పారు. మీరు యుద్ధం కోసం సమకూర్చుకున్న సామగ్రిని నాకివ్వమంటున్నారు" అని అన్నాడు. అది విని ఆ వ్యక్తి (తన భార్యను పిలుస్తూ), "ఏమే! నేను యుద్ధం కోసం సమకూర్చుకున్న సామాను తెచ్చి ఇతనికివ్వు. అందులో ఏమీ మిగిల్చి ఉంచమాకు. దైవం సాక్షి! నువ్వు ఏమీ (దాచి) పెట్టుకో కుండా అంతా ఇచ్చేస్తే అందులో నీకు శుభం కలుగుతుంది" అని అన్నాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మనిషి ఏదయినా కారణంచేత ధర్మయుద్ధంలో పాల్గొనలేకపోతే కనీసం యుద్ధంలో పాల్గొనే ఇతర యోధులకయినా యుద్ధసామగ్రిని సమకూర్చిపెట్టాలి. దానివల్ల తనకు కూడా

యుద్ధంలో పాల్గొన్నంత పుణ్యం లభిస్తుంది. అంతేకాకుండా, ఇహపరాల్లోనూ అనేక శుభాలు కల్గుతాయి. ఈ హదీసుని ఆధారంగా చేసుకొని పండితులు మనిషి ఒక పుణ్యకార్యం కోసం ధనాన్ని ఖర్చుపెట్టాలని సంకల్పించుకున్న తర్వాత ఏదయినా కారణం చేత దాన్ని పూర్తిచేయలేకపోతే ఆ ధనాన్ని ఇతర పుణ్యకార్యాల కోసం ఖర్చుపెట్టవచ్చని అంటున్నారు. (నవవీ-ముస్లిం వ్యాఖ్యానం).

١٣١٠ - وَعَن أَبي سَعِيدِ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ بَعَثَ إلى بَني لَحْيَانَ، فَقَالَ: «لِيَنْبَعِثْ مِنْ كُلِّ رَجُلَيْنِ أَحَدُهُمَا، وَالأَجْرُ بَيْنَهُمَا» رَواهُ مسلمٌ. وفي روايةٍ لهُ: «لِيَخْرُجْ مِنْ كُلِّ رَجُلَيْنِ رَجُلٌ» ثُمَّ قالَ لِلقاعِدِ: «أَيُّكُمْ خَلَفَ الخارِجَ في أَهْلِهِ وَمَالِهِ بخَيْرٍ كانَ لهُ مِثْلُ نِصْفِ أَجرِ الخارِجِ».

1310. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) బనూ లిహ్యాన్ తెగ (వారు ధర్మవిరోధానికి ఒడిగట్టిన కాలంలో వారి) వైపునకు ఒక సైనిక దళాన్ని పంపినప్పుడు ప్రజల్లో ఈ విధంగా ప్రకటించారు: ప్రతి ఇద్దరు వ్యక్తుల్లో ఒకడు యుద్ధానికి వెళ్ళాలి. (రెండో వ్యక్తి అతని ఇంటి బాగోగుల్ని పట్టించుకుంటే) జిహాద్ పుణ్యం వారిద్దరి మధ్య పంచబడుతుంది. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది. దైవప్రవక్త (సల్లం) "ప్రతి ఇద్దరు వ్యక్తుల్లో ఒకడు యుద్ధానికి వెళ్ళాలి" అని ఆదేశించారు. ఆ తర్వాత ఇండ్లల్లో ఉండిపోయే వారిని ఉద్దేశ్యించి, "మీలో ఎవరయినా జిహాద్‌కు వెళ్ళి వున్నవారి ఇండ్ల విషయంలో, వారి సంపద విషయంలో ఉత్తమ రీతిలో ప్రాతినిధ్య బాధ్యతలు వహిస్తే వారికి జిహాద్‌కు వెళ్ళిన వారి పుణ్యంలో సగం పుణ్యం లభిస్తుంది" అని చెప్పారు.

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సహీహ్ ముస్లింలోని కొన్ని హదీసుల్లో ధర్మయోధునికి యుద్ధసామగ్రిని సమకూర్చిన

వ్యక్తికి, అతని ఇంటివారి బాగోగుల్ని పట్టించుకున్న వ్యక్తికి కూడా జిహాద్ వల్ల యోధునికి లభించినంత పుణ్యం లభిస్తుందని చెప్పబడింది. ఈ పుస్తకంలో ఇంతకుముందు వచ్చిన హదీసుల్లో కూడా ఈ విషయం ప్రస్తావించబడింది. మరి ఈ హదీసులోనేమో ధర్మయోధుని ప్రతినిధికి అతని పుణ్యంలో సగం పుణ్యం మాత్రమే లభిస్తుందని చెప్పబడింది. పైకి ఈ రెండురకాల హదీసుల మధ్య వైరుధ్యం ఉన్నట్లు కనబడుతోంది. బహుశా ఆ కారణంగానేమో కొంతమంది పండితులు ఈ హదీసులోని 'సగం' అనే పదం దైవప్రవక్త చెప్పింది కాదనీ, ఈ హదీసుని వివరించిన ఉల్లేఖకుల్లో ఎవరో ఒకరు ఆ పదాన్ని కల్పించి చెప్పి ఉంటారని తలపోశారు.

కాని ప్రముఖ హదీసు విద్వాంసులు హాఫిజ్ ఇబ్నె హజర్ (రహ్మాలై)గారు వారి తలంపును ఖండిస్తూ, ఒక హదీసు సాక్ష్యాధారాలన్నీ విశ్వసనీయమైనవని తేలిపోయిన తర్వాత అందులోని కొన్ని పదాలు ఉల్లేఖకుల కల్పనలని ఆరోపించటం భావ్యం కాదని చెప్పారు. పై రెండు హదీసుల మధ్యవున్న భావసారూప్యతను ఆయన ఈ విధంగా అన్వయించారు: యోధునికి, మరియు అతనికి సహాయం చేసేవానికి లభించే మొత్తం పుణ్యాన్ని గనక రెండు భాగాలుగా విభజించి వారిద్దరికీ పంచితే వారిలో ప్రతి ఒక్కరికీ తోటి వానికి సమానంగా పుణ్యం లభిస్తుంది. అంతేకాకుండా ఇద్దరికీ పరిపూర్ణ పుణ్యం లభించినట్లవుతుంది. ఈ కోణం నుంచి చూస్తే పై రెండు హదీసుల మధ్య ఎలాంటి వైరుధ్యం కనిపించదు (ఫత్‌హుల్ బారీ).

సాధారణ పరిస్థితుల్లో జిహాద్‌లో పాల్గొనటం వైయక్తిక విధి (ఫర్జైన్) ఏమీ కాదు. సదరు హదీసు కూడా ఈ విషయాన్ని స్పష్టం చేస్తోంది. ప్రతి ఇద్దరు వ్యక్తుల్లో ఒకరు జిహాద్‌లో పాల్గొన్నా సరిపోతుంది. అయితే సమాజంలోని వారందరూ ఏదో ఒక విధంగా ధర్మయుద్ధంలో పాల్గొనటానికి ప్రయత్నించాలి. ధనవంతులు తమధనం ఖర్చుపెట్టి యోధులకు ఆయుధాలను, యుద్ధసామగ్రిని సమకూర్చాలి. అదే విధంగా కొందరు యోధుల ఇండ్లను, వారి కుటుంబాలను కనిపెట్టుకొని ఉండాలి. యుద్ధభూమిలో అమరగతినొందే యోధుల కుటుంబాలకు ఆర్థికంగా చేయూతనివ్వాలి. వారి సమస్యలు తీరటానికి తగిన విధంగా ఏర్పాట్లు చేయాలి. ఈ విధంగా సమాజంలోని అన్ని రంగాలవారు ఏదో ఒక రకంగా జిహాద్‌లో పాల్గొనటానికి ప్రయత్నించాలి.

١٣١١ - وَعَنِ الْبَرَاءِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: أَتَى النَّبِيَّ ﷺ، رَجلٌ مُقَنَّعٌ بِالحَدِيدِ، فَقَالَ: يا رَسُولَ اللهِ! أُقَاتِلُ أَوْ أُسْلِمُ؟ قَالَ: «أَسْلِمْ، ثُمَّ قَاتِلْ» فَأَسْلَمَ، ثُمَّ قَاتَلَ فَقُتِلَ. فَقَالَ رسولُ اللهِ ﷺ: «عمِلَ قَلِيلاً وَأُجِرَ كَثِيراً». متفقٌ عليهِ، وهذا لفظ البخاريِّ.

1311. హజ్రత్ బరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) దగ్గరికి ఒక వ్యక్తి వచ్చాడు. అతని ఒళ్ళంతా ఇనుప ఆయుధాలు నిండి ఉన్నాయి. అతనొచ్చి "దైవప్రవక్తా! ముందుగా నేను ధర్మయుద్ధంలో పాల్గొనాలా లేక ఇస్లాం స్వీకరించాలా?" అని అడిగాడు. అందుకాయన, "నువ్వు ముందు

ఇస్లాం స్వీకరించు. ఆ తర్వాతే యుద్ధం చెయ్యి" అని అన్నారు. దాని ప్రకారం అతను ముందుగా ఇస్లాం స్వీకరించి యుద్ధంలో పోరాడుతూ చివరికి అమర గతినొందాడు.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) (అతన్ని మెచ్చుకుంటూ), "ఇతను తక్కువ ఆచరణ చేసి చాలా ఎక్కువ పుణ్యాన్ని పొందాడు" అని అన్నారు. *(బుఖారీ-ముస్లిం. వాక్యాలు బుఖారీవి)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

కొన్ని సందర్భాల్లో చిన్న సత్కార్యానికే దేవుని కృపతో లెక్కలేనంత పుణ్యం లభిస్తుంది. అందుకు మనం ఈ హదీసును నిదర్శనంగా తీసుకోవచ్చు. అయితే మనసులో విశ్వాసం (ఈమాన్) ఉన్నప్పుడు మాత్రమే సత్కార్యానికి పుణ్యం లభిస్తుంది సుమా! విశ్వాసం లేకపోతే దేవుని దృష్టిలో ఏ ఆచరణా ఆమోదయోగ్యం కాదు.

١٣١٢ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «مَا أَحَدٌ يَدْخُلُ الجَنَّةَ يُحِبُّ أَنْ يَرْجِعَ إِلى الدُّنْيَا وَلَه ما عَلى الأَرْضِ مِنْ شَيْءٍ إِلَّا الشَّهِيد، يَتَمَنَّى أَنْ يَرْجِعَ إِلى الدُّنْيَا، فَيُقْتَلَ عَشْرَ مَرَّاتٍ؛ لِما يَرَى مِنَ الكَرَامَةِ». وفي روايةٍ: «لِمَا يَرَى مِنْ فَضْلِ الشَّهادَةِ» مُتفقٌ عليه.

1312. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: స్వర్గంలో ప్రవేశించే వారెవరూ తమకు భూమి మీద ఉన్న వస్తువులన్నీ ఇస్తామన్నా కూడా తిరిగి ప్రపంచంలోకి వెళ్ళటానికి ఇష్టపడరు. ఒక్క షహీద్ (అమరగతుడు) తప్ప. ఎందుకంటే అతను అమరగతి వల్ల లభించే గౌరవోన్నతుల్ని చూసి ఉంటాడు. అందుకే అతను మళ్ళీ ప్రపంచంలోకి వెళ్ళి పదిసార్లు అమర గతి నొందాలని కోరుకుంటాడు.

వేరొక ఉల్లేఖనంలో 'అమరగతి గొప్ప

దనాన్ని చూసి ఉంటాడు గనుక' అని ఉంది. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

١٣١٣ ـ وَعَنْ عَبدِ اللهِ بنِ عَمرِو بنِ العاص رَضِيَ اللهُ عَنهُمَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «يَغفِرُ اللهُ لِلشَّهِيدِ كُلَّ ذَنبٍ إِلَّا الدَّينَ» رواه مسلمٌ. وفي روايةٍ له: «القَتلُ في سَبِيلِ اللهِ يُكَفِّرُ كُلَّ شَيءٍ إِلَّا الدَّينَ».

1313. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుడు అమరగతుని పాపాలన్నింటినీ క్షమిస్తాడు. కాని (అతను ప్రజలకు) అప్పు ఉంటే మాత్రం దాన్ని క్షమించడు. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవమార్గంలో అమరగతి నొందటం పాపాలన్నింటికీ పరిహార మవుతుంది. కాని అప్పుకి మాత్రం అది పరిహారం కాజాలదు.

(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

తోటి మానవుల హక్కుల్ని అపహరించిన వ్యక్తి దైవమార్గంలో పోరాడుతూ అమరగతి నొందినా కూడా అతని నుంచి ఆ పాపం తొలగిపోదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అదే విధంగా చిత్తశుద్ధితో పశ్చాత్తాపం చెందనంతవరకూ ఇతర ఘోరపాపాలు కూడా క్షమార్హం కావు.

١٣١٤ ـ وَعَنْ أَبِي قَتَادَةَ رَضِيَ اللهُ عَنهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَامَ فِيهِم فَذَكَرَ أَنَّ الجِهَادَ فِي سَبِيلِ اللهِ، وَالإِيمَانَ بِاللهِ، أَفضَلُ الأَعمَالِ، فَقَامَ رَجُلٌ، فَقَالَ: يَا رَسُولَ اللهِ! أَرَأَيتَ إِن قُتِلتُ فِي سَبِيلِ اللهِ أَتُكَفَّرُ عَنِّي خَطَايَايَ؟ فَقَالَ لَهُ

1314. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ప్రజల ముందు నిలబడి ప్రసంగిస్తూ, "దైవమార్గంలో యుద్ధం చేయటం, అల్లాహ్‌ను విశ్వసించటం అత్యంత శ్రేష్ఠమైన ఆచరణలు" అని అన్నారు. (మధ్యలో) ఒక వ్యక్తి లేచి సందేహ పడుతూ, "దైవప్రవక్తా! అంటే ఒకవేళ నేను దైవమార్గంలో హత్య చేయబడితే

رَسُولُ اللهِ ﷺ: «نَعَمْ إنْ قُتِلْتَ فِي سَبِيلِ اللهِ وَأَنْتَ صَابِرٌ مُحْتَسِبٌ، مُقبِلٌ غيرُ مُدْبِرٍ» ثُمَّ قَالَ رَسُولُ اللهِ ﷺ: «كَيْفَ قُلْتَ؟» قَالَ: أَرَأَيْتَ إنْ قُتِلْتُ فِي سَبِيلِ اللهِ أَتُكَفَّرُ عَنِّي خَطَايَايَ؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «نَعَمْ وَأَنْتَ صَابِرٌ مُحْتَسِبٌ، مُقْبِلٌ غَيْرُ مُدْبِرٍ، إلَّا الدَّيْنَ، فَإِنَّ جِبْرِيلَ عليهِ السَّلامُ قالَ لِي ذلكَ» رواهُ مسلمٌ.

నా పాపాలన్నీ సమసిపోతా యంటారా?" అని అడిగాడు. అందుకాయన, "అవును, నువ్వు గనక పుణ్యాన్ని ఆశించి స్థిరచిత్తంతో (యుద్ధ భూమిలో) వెన్ను చూపకుండా ముందుకుపోయి పోరాడితే తప్ప కుండా నీ పాపాలన్నీ సమసిపోతాయి" అని అన్నారు. ఆ తర్వాత (ఏదో సందేహమొచ్చి) "నువ్వు అడిగిందే మిటీ?" అని అన్నారు. ఆ వ్యక్తి తన ప్రశ్నను మళ్ళీ ప్రస్తావిస్తూ, "ఒకవేళ నేను దైవమార్గంలో హత్యచేయబడితే నా పాపాలన్నీ సమసిపోతాయా?" అని అడిగాడు.

అప్పుడాయన, "అం, తప్పకుండా. నువ్వు గనక పుణ్యాన్ని ఆశించి స్థిర చిత్తంతో శత్రువుకు వెన్ను చూప కుండా ముందుకుపోయి పోరాడితే నీ పాపా లన్నీ సమసిపోతాయి. కాని (నువ్వు ప్రజల దగ్గర చేసిన) అప్పు మాత్రం సమసిపోదు. జిబ్రయీల్ నాకు ఈ విషయం తెలియజేశారు" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) దైవమార్గంలో పోరాడుతూ అమరగతినొందటం వల్ల ఎంత పుణ్యం లభిస్తుందో ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. దాని మూలంగా జీవితంలో తమ వల్ల జరిగిన పాపాలన్నీ మన్నించబడతాయని తెలుస్తోంది. అయితే అదే సమయంలో దానికి నాలుగు నియమాలు కూడా ఉన్నాయి. ఆ నియమాలన్నీ హదీసులో వివరించబడ్డాయి. ఆ నియమాలను పాటించకపోతే దైవమార్గంలో ప్రాణాలు అర్పించినా దానికి ఎలాంటి విలువ ఉండదు.

2) మనిషి ఎంత గొప్ప సత్కార్యం చేసినా అతను ప్రపంచంలో తోటి మానవుల హక్కుల్ని కొల్లగొట్టి ఉంటే ఆ పాపం క్షమార్హం కాదు. ఆ హక్కుల్ని తిరిగి చెల్లించనంతవరకు లేదా హక్కుదారులు అతనికి క్షమాభిక్ష పెట్టనంతవరకు అతను పాపాత్ముడిగానే పరిగణించబడతాడు. దానికిగాను పరలోకంలో అతను శిక్షననుభవించవలసి ఉంటుంది. ఉదాహరణకు తోటి వారి దగ్గర అప్పు తీసుకొని ఆ అప్పు చెల్లించకుండా ఉండటం కూడా దాసుల హక్కుల్ని కాజేయటం క్రిందికే వస్తుంది. అలాంటి పాపాత్ములు ఎవరైనా దైవమార్గంలో అమరగతినొందినా దేవుడు వారి త్యాగాన్ని ఆమోదించడు. అయితే కొంతమంది పండితులు ఈ హదీసుకు భాష్యం చెబుతూ, స్తోమత ఉన్నప్పటికీ అప్పు చెల్లించని పిసినారి పుంగవులకు మాత్రమే ఈ హెచ్చరిక వర్తిస్తుందనీ, అలాగాకుండా స్తోమత లేని కారణంగా అప్పు చెల్లించడంలో జాప్యం జరిగి, అదే కాలంలో మృత్యువాతన పడ్డవారిని దేవుడు తన కరుణాకటాక్షాలతో క్షమించే అవకాశాలున్నాయనీ, ఆయన తలచుకుంటే దానికోసం అతని ప్రత్యర్థిని కూడా సంతుష్టపరచగలడనీ అంటున్నారు. కొన్ని హదీసులు కూడా ఈ విషయాన్ని సమర్థిస్తున్నాయి.

١٣١٥ ـ وعَنْ جابرٍ رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَجُلٌ: أينَ أنَا يا رَسُولَ اللهِ! إنْ قُتِلتُ؟ قالَ: «في الجَنَّةِ» فَألْقَى تَمَرَاتٍ كُنَّ في يَدِهِ، ثُمَّ قَاتَلَ حَتَّى قُتِلَ، رَواهُ مسلم.

1315. హజ్రత్ జాబిర్(రజి) కథనం: ఒక వ్యక్తి (సావకాశంగా కూర్చొని ఖర్జూర పండ్లు తింటూ) "దైవప్రవక్తా! ఒకవేళ నేను (దైవమార్గంలో) హత్య చేయబడితే ఎక్కడుంటాను?" అని అడిగాడు. "స్వర్గంలో ఉంటావ్" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). ఆ మాట వినగానే ఆ వ్యక్తి తన చేతిలో ఉన్న ఖర్జూర పండ్లు విసరిపడేశాడు. తర్వాత (వెంటనే యుద్ధ మైదానానికి) వెళ్ళి శత్రువులతో పోరాడుతూ చివరికి ప్రాణాలు విడిచాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

١٣١٦ ـ وعَنْ أنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قالَ: انطَلَقَ رَسُولُ اللهِ ﷺ وَأصْحَابُهُ حَتَّى سَبَقُوا المشركِينَ إلى بَدرٍ، وَجاءَ المُشرِكونَ، فقالَ رسُولُ الله ﷺ:

1316. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మరియు ఆయన సహచరులు బయలుదేరి బహుదైవారాధకుల కన్నా ముందే బద్ర్ ప్రాంతానికి చేరుకున్నారు. ఆ తర్వాత బహుదైవారాధకులు కూడా అక్కడికొచ్చారు.

«لا يَقْدُمَنَّ أَحَدٌ مِنْكُمْ إلى شَيْءٍ حَتَّى أكُونَ أَنَا دُونَهُ» فَدَنَا المُشرِكُونَ، فَقَالَ رسُولُ اللهِ ﷺ: «قُومُوا إلى جَنَّةٍ عَرْضُهَا السَّمٰوَاتُ وَالأرْضُ» قال: يَقولُ عُمَيْرُ بنُ الحُمَامِ الأنْصَارِيُّ رضيَ اللهُ عَنْهُ: يا رسولَ اللهِ! جَنَّةٌ عَرْضُهَا السَّمٰواتُ والأرضُ؟ قالَ: «نَعَمْ» قالَ: بَخٍ بَخٍ! فقالَ رَسُولُ اللهِ ﷺ: «ما يَحمِلُكَ على قَوْلِكَ بَخٍ بَخٍ؟» قالَ: لا وَاللهِ! يا رَسُولَ اللهِ! إلَّا رَجَاءَ أَنْ أَكُونَ مِنْ أَهْلِها، قال: «فَإنَّكَ مِنْ أَهْلِهَا» فَأَخْرَجَ تَمَرَاتٍ مِنْ قَرَنِهِ، فَجَعَلَ يَأْكُلُ مِنْهُنَّ، ثُمَّ قَالَ: لَئِنْ أَنَا حَيِيتُ حتى آكُلَ تَمَرَاتِي هذِهِ إنَّهَا لحَيَاةٌ طَوِيلَةٌ! فَرَمَى بِمَا كَانَ مَعَهُ مِنَ التَّمْرِ، ثم قَاتَلَهُمْ حتَّى قُتِلَ. رواهُ مسلمٌ. «القَرَنَ» بفتح القاف والراء: هو جَعْبَةُ النُّشَّابِ.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) (తన సహచరులకు హితోపదేశం చేస్తూ), "నేను స్వయంగా దేని గురించయినా ఆదేశించనంతవరకు లేదా నేను స్వయంగా దాన్ని ఆచరించనంతవరకు మీలో ఎవరూ తొందరపడి ఏమీ చేయకండి" అని అన్నారు. కాసేపటికి బహుదైవారాధకులు (ముస్లింల మీద దాడి చేయటానికి) ముందుకు వచ్చారు. అప్పుడు ఆయన తన సహచరుల్ని (ప్రతిఘటన కోసం ప్రేరేపిస్తూ) "భూమ్యాకాశాల అంత విశాలమైన స్వర్గం కోసం లేచి నుంచోండి" అని ఆదేశించారు.

అప్పుడు (ఆయన సహచరుల్లో ఒకరైన), ఉమర్ బిన్ హుమామ్ అన్సారీ ఆశ్చర్యపోతూ, "దైవప్రవక్తా! (ఈ యుద్ధంలో పాల్గొంటే) భూమ్యా కాశాల అంత విశాలమైన స్వర్గం లభి స్తుందా?" అని అడిగారు. "అవును" అని బదులిచ్చారు దైవప్రవక్త (సల్లం). ఆ మాట విని ఆయన "ఓహో, ఓహో" అని అనసాగారు. అందుకు దైవప్రవక్త (సల్లం), "ఓహో, ఓహో అని అంటున్నా రెందుకు?" అని ప్రశ్నించారు. దానికాయన, "దైవప్రవక్తా! నాకు స్వర్గ వాసి అవ్వాలని ఆశగా ఉంది. అంతే తప్ప అందులో మరే దురుద్దేశమూ

లేదు" అని చెప్పారు. "అయితే నువ్వు కూడా స్వర్గవాసుల్లో చేరుతావు" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం).

దైవప్రవక్త (సల్లం) నోట ఆ శుభవార్త వినగానే ఆయన (పులకించిపోయి) అంబులపొదిలో నుంచి కొన్ని ఖర్జూర పండ్లు బయటికి తీసుకొని తింటూ కూర్చున్నారు. అంతలోనే మళ్ళీ మనసులో 'నేను ఈ ఖర్జూర పండ్లు తినేవరకూ బ్రతికున్నా అప్పటికి చాలా ఆలస్యమైపోతుందేమో' అనుకొని తన దగ్గరున్న ఖర్జూర పండ్లన్నీ క్రిందపడేసి శత్రువులతో పోరాడుతూ చివరికి అమరగతినొందారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా మనకు స్థూలంగా మూడు విషయాలు బోధపడుతున్నాయి.

ఒకటి: యుద్ధంలో సైనికులు తమ నాయకుని ఆదేశాలను, సూచనలను తు.చ. తప్పకుండా పాటించాలి. ఏ విషయంలోనయినా సరే తమ సేనాపతి సంకేతం కోసం వేచి ఉండాలి. అతని అనుమతి, అనుజ్ఞ లేకుండా తమంతట తాముగా శత్రువుల మీద విరుచుకుపడకూడదు.

రెండు: సైనికుల్లో యుద్ధపిపాసను రగుల్గొల్పటానికి వారి ముందు స్వర్గసుఖాల గురించి బోధించాలి. స్వర్గాన్ని పొందాలన్న ఆతురతతో ముస్లింలు రెట్టింపు ఉత్సాహంతో, నూతనోత్తేజంతో యుద్ధం చేస్తారు.

మూడు: దైవప్రవక్త సహచరుల్లో నిత్యం పరలోకభావన పొంగిపొరలుతూ ఉండేది. దాని మూలంగానే వారు ప్రాపంచిక సుఖసౌఖ్యాలకు అంతగా ప్రాముఖ్యత నివ్వలేదు. ఆ ఐహిక అనాసక్తతా భావమే, ఆ పరలోక చింతనే వారిని ఇహపర లోకాల్లో విజేతలుగా నిలబెట్టింది.

١٣١٧ ـ وعنه قال: جَاءَ نَاسٌ إِلى
النَّبِيِّ ﷺ أَنِ ابْعَث مَعَنَا رِجَالًا يُعَلِّمُونَا
القُرآنَ وَالسُّنَّةَ، فَبَعَثَ إليهم سَبعِينَ رَجُلًا
مِنَ الأَنْصَارِ يُقَالُ لَهُمْ: القُرَّاءُ، فِيهِم خَالي
حَرَامٌ، يَقرَؤُونَ القُرآنَ، وَيَتَدَارَسُونَ

1317. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన కథనం: కొంతమంది దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి, "(దైవప్రవక్తా!) మాకు ఖుర్ఆన్ మరియు ఇస్లాం విధానం నేర్పించటానికి మాతోపాటు (మీ శిష్యుల్ని) ఎవరినైనా పంపించండి" అని కోరారు. దైవప్రవక్త (సల్లం) వారి కోరికను మన్నించి అన్సార్ తెగకు చెందిన డెబ్భైమందిని వారి వెంట పంపించారు. వారిని ఖారీలు (ఖుర్ఆన్ పారాయణకులు) అని పిలిచేవారు. వారిలో మా మామయ్య హరామ్ కూడా ఉన్నారు. వీరందరూ రాత్రిపూట ఖుర్ఆన్ పారాయణం చేసేవారు. ఖుర్ఆన్ ఇతరులకు నేర్పించటం, స్వయంగా నేర్చుకోవటం మొదలగు పనుల్లో నిమగ్నులై ఉండేవారు. పగటి పూటేమో మస్జిద్‌కోసం నీళ్లు మోసుకు రావటం, కట్టెలు ఏరుకొచ్చి అమ్ముకోవటం, వచ్చిన డబ్బుతో సుఫ్ఫావారి కోసం, ఇతర పేదప్రజల కోసం ఆహార పదార్థాలు కొనితీసుకు రావటం లాంటి పనులు చేస్తుండేవారు.

దైవప్రవక్త (సల్లం) అలాంటివాళ్ళను (డెబ్భైమందిని) వారివెంట పంపారు. కాని మార్గమధ్యంలో వారు దైవప్రవక్త సహచరుల్ని చంపటానికి కుట్రపన్నారు. గమ్యానికి చేరుకోక ముందే వారిని హతమార్చారు. శత్రువుల చేతుల్లో

بِاللَّيْلِ يَتَعَلَّمُونَ، وكانُوا بِالنَّهَارِ يَجِيئُونَ بِالمَاءِ، فَيَضَعُونَه في المَسجِدِ، وَيَحْتَطِبُونَ فَيَبِيعُونَه، ويَشْتَرُونَ بِهِ الطَّعَامَ لأَهلِ الصُّفَّةِ، ولِلفُقَرَاءِ، فَبَعَثَهم النَّبيُّ ﷺ، فَعَرَضُوا لهم فَقَتَلُوهُمْ قبلَ أَنْ يَبلغُوا المَكَانَ، فَقَالُوا: اللَّهُمَّ! بَلِّغ عَنَّا نَبِيَّنَا أَنَّا قَد لَقِينَاكَ فَرَضِينَا عَنْكَ وَرَضِيتَ عَنَّا، وَأَتى رجُلٌ حَرَاماً خَالَ أَنَسٍ مِنْ خَلفِهِ، فَطَعَنَهُ بِرُمْحٍ حتى أَنْفَذَهُ، فَقَالَ حَرَامٌ: فُزتُ وَرَبِّ الكَعْبَةِ، فقالَ رسولُ اللهِ ﷺ: «إنَّ إِخْوَانكم قَد قُتِلُوا وإنَّهم قَالُوا: اللَّهُمَّ! بَلِّغ عَنَّا نَبِيَّنَا أَنَّا قَد لَقِينَاكَ فَرَضِينَا عَنكَ وَرَضِيتَ عَنَّا». متفقٌ عليه، وهذا لفظ مسلم.

హతమార్చబడుతున్నప్పుడు దైవప్రవక్త సహచరులు ఈ విధంగా ప్రార్థించారు: "ఓ అల్లాహ్! మేము నిన్ను కలుసుకున్నామని, మేము నీ పట్ల సంతుష్టులయ్యామని, నీవు కూడా మా పట్ల ప్రసన్నుడవయ్యావని మా ప్రవక్తకు తెలియజెయ్యి."

(ఆ శత్రువుల్లో) ఒకడు వెనుక నుంచి వచ్చి అనస్ గారి మామయ్య హరామ్‌ను ఈటెతో పొడిచాడు. అది శరీరాన్ని చీల్చుకుంటూ అవతలి వైపుకు వచ్చేసింది. ఆయన (ఆ స్థితిలోనే) "కాబా ప్రభువు సాక్షి! నేను విజయం సాధించాను" అని అన్నారు.

అటు (మదీనాలో దైవప్రవక్త -సల్లం) తన సహచరులకు ఈ విషయం తెలియజేస్తూ, "మీ సోదరులు వధించబడ్డారు. ఆ సమయంలో వారు, 'ఓ అల్లాహ్! మేము నిన్ను కలుసుకున్నామనీ, మేము నీ పట్ల సంతుష్టులయ్యామనీ, నీవు కూడా మా పట్ల ప్రసన్నుడవయ్యావనీ మా ప్రవక్తకు తెలియజెయ్యి' అని ప్రార్థించారు" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం, వాక్యాలు మాత్రం ముస్లింవి)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

కొంతమంది దైవవిరోధులు ఒక పథకం ప్రకారం సాగించిన కుట్ర ఇది. తమకు విద్య నేర్పించేందుకు గురువులు కావాలని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ఆయన సహచరుల్లో

డెబ్భైమంది ఖుర్‌ఆన్ స్మర్తల్ని (హాఫిజ్‌లను) తమ వెంట తీసుకెళ్ళారు. ఆ తర్వాత మార్గమధ్యంలోనే వారిని మోసగించి అతి కిరాతకంగా నరికి చంపేశారు. తమకు ఆ దైవవిరోధుల చేతుల్లో చావు ఖాయమని తెలుసుకోగానే దైవప్రవక్త సహచరులు ఈ విషయం దైవప్రవక్త (సల్లం)కు తెలియపరచమని దైవాన్ని వేడుకున్నారు. దేవుడు వారి మొరను ఆలకించి వహీ ద్వారా దైవప్రవక్త (సల్లం)కు ఈ విషయం తెలియపరచగా ఆయన మదీనాలో ఉన్న సహచరులకు దీని గురించి చెప్పారు. ఈ హదీసు ద్వారా బోధపడే ఒక ముఖ్య విషయం ఏమిటంటే దైవప్రవక్త (సల్లం)కు అగోచర జ్ఞానం లేదు. ఒకవేళ ఆయనకు అగోచర జ్ఞానం ఉండి వుంటే అసలాయన తన సహచరుల్ని దైవవిరోధుల వెంట పంపి ఉండేవారే కాదు.

2) మస్జిదె నబవీ ప్రాంగణంలో ఉన్న అరుగు మీద ఖుర్‌ఆన్ విద్య నేర్చుకునేవారు నివసించేవారు. వారిని 'సుఫ్ఫా మనుషులు' (అస్‌హాబె సుఫ్ఫా) అని పిలిచేవారు. అసలు సుఫ్ఫా అంటే అరుగు అని అర్థం. డెబ్బై ఎనభై మంది సహచరులు ఎల్లప్పుడూ ఆ అరుగుమీదనే నివసిస్తూ, దైవప్రవక్త (సల్లం) దగ్గర ధర్మజ్ఞానాన్ని నేర్చుకుంటూ ఉండేవారు. వారి బ్రతుకు తెరువుకు ఒక నిర్ణీత మార్గమంటూ ఏమి ఉండేదికాదు. కేవలం దైవం మీద నమ్మకంతోనే బ్రతికేవారు. ఎప్పుడయినా ఏవయినా ఆహార పదార్థాలు కానుకగాగాని లేక దానం రూపంలోగాని వస్తే వాటిని అందరూ పంచుకొని తినేవారు. వాళ్ళలోనే కొంతమంది అడవికెళ్ళి కట్టెలు తెచ్చి అమ్మటం చేస్తుండేవారు. ఆ వచ్చిన డబ్బుతో తోటి సహచరుల కోసం భోజన ఏర్పాట్లు చేసుకునేవారు.

3) ఈ హదీసు ద్వారా బోధపడే మూడో ముఖ్యమైన విషయం ఏమిటంటే ధర్మప్రచార కార్యం ఎంతో కష్టమైన పని. ఆ పని చేసేవారిని లోకం నానా మాటలు అంటుంది. కొన్ని సందర్భాల్లో వారి ప్రాణాలకే ముప్పు ఏర్పడవచ్చు. అయినప్పటికీ ధర్మపండితులు దైవప్రవక్తలు వదలివెళ్ళిన కర్తవ్యంగా భావించి కష్టాలను భరించి వ్యయప్రయాసలకు ఓర్చుకొని ఆ పనిని ముందుకు నడిపించాలి.

1318. హజ్రత్ అనస్ (రజి) కథనం: మా బాబాయి అనస్ బిన్ నజర్ (రజి) బద్ర్ యుద్ధంలో పాల్గొనలేదు (అందు కాయన ఎంతగానో చింతించారు). ఒకసారి ఆయన దైవప్రవక్త (సల్లం) తో ఇలా అన్నారు: "దైవప్రవక్తా! మీరు బహు దైవారాధకులతో చేసిన తొలి యుద్ధంలో నేను గైర్హాజరు అయ్యాను. ఒకవేళ దేవుడు భవిష్యత్తులో నాకు

١٣١٨ ـ وَعَنْهُ قَالَ: غَابَ عَمِّي أَنَسُ بنُ النَّضْرِ رَضِيَ اللهُ عَنْهُ عن قِتَالِ بَدرٍ، فقال: يا رسولَ اللهِ! غِبتُ عن أَوَّلِ قِتَالٍ قَاتَلتَ المُشرِكِينَ، لَئِن اللهُ أَشْهَدَنِي قِتَالَ المُشرِكِينَ لَيُرِيَنَّ اللهُ ما أَصنَعُ. فَلَمَّا

كانَ يومُ أُحُدٍ انكَشَفَ المُسْلِمُونَ، فقالَ: اللَّهُمَّ! إنِّي أَعتَذِرُ إلَيْكَ مِمَّا صَنَعَ هٰؤُلاءِ - يَعْني أَصْحابَهُ - وَأَبْرأُ إليكَ مِمَّا صَنَعَ هٰـؤُلاءِ - يعـني المُشـرِكيـنَ - ثُـمَّ تَقـدَّمَ فَاستَقبَلَهُ سَعدُ بنُ مُعَاذٍ فقال: يَا سَعدَ بنَ مُعَاذٍ! الجَنَّةَ وَرَبِّ النَّضْرِ، إنِّي أَجِدُ رِيحَهَا مِنْ دُونِ أُحُدٍ! قالَ سعدٌ: فَمَا اسْتَطَعْتُ يارسُولَ اللهِ! ماصَنَعَ! قَالَ أَنَسٌ: فَوَجدْنَا بِهِ بِضعاً وَثَمَانِينَ ضَربَةً بالسَّيْفِ، أَوْ طَعنةً بِرُمْحٍ أَوْ رَميَةً بِسَهمٍ، وَوَجَدْنَاهُ قد قُتِلَ وَمَثَّلَ بِهِ المُشْرِكونَ، فَمَا عَرَفَهُ أَحَدٌ إلَّا أُختُهُ بِبَنَانِهِ. قال أَنَسٌ: كُنَّا نُرَى - أَوْ نَظُـنُّ - أَنَّ هـذِهِ الآيـةَ نَـزَلَـتْ فِيـهِ وَفِـي أَشْبَاهِهِ: ﴿مِّنَ ٱلْمُؤْمِنِينَ رِجَالٌ صَدَقُوا۟ مَا عَٰهَدُوا۟ ٱللَّهَ عَلَيْهِ ۖ فَمِنْهُم مَّن قَضَىٰ نَحْبَهُۥ﴾ إلى آخرها [الأحزاب: ٢٣] متفقٌ عليه، وقد سَبَقَ في بابِ المُجَاهَدَةِ.

బహుదైవారాధకులతో యుద్ధం చేసే అవకాశం కల్పించినట్లయితే అప్పుడు నేనేం చేస్తానో అల్లాహ్ చూస్తాడు.”

(కొంతకాలానికి ఉహుద్ యుద్ధం వచ్చింది.) ఉహుద్ యుద్ధం నాడు ముస్లింలు చెల్లాచెదరైపోయారు. అప్పుడు మా బాబాయి, “ఓ అల్లాహ్! వీరు (అంటే నా మిత్రులు) చేసిన దానికి నేను క్షమాపణలు కోరుకుంటు న్నాను. అలాగే ఇంకా ఈ బహుదైవారా ధకులు చేసిన దానితో కూడా నాకెలాంటి సంబంధం లేదు” అంటూ ముందుకు వెళ్ళారు. అక్కడ ఆయనకు సాద్ బిన్ ముఆజ్ (రజి) ఎదురయ్యారు. సాద్‌ను ఉద్దేశించి ఆయన “సాద్ బిన్ ముఆజ్! నజర్ ప్రభువు తోడు! ఉహుద్ కొండల కన్నా చాలా దగ్గర్లో నుంచే నాకు స్వర్గ సువాసన వస్తోంది” అంటూ (శత్రువుల పంక్తుల్లోకి చొచ్చుకుపోయి వీరోచి తంగా పోరాడుతూ అమరగతి నొందారు). అప్పుడు హజ్రత్ సాద్ (రజి) “దైవప్రవక్తా! ఆయన చేసినది నావల్ల కాలేకపోయింది” అంటూ విచారం వ్యక్తం చేశారు.

హజ్రత్ అనస్ (రజి) ఇలా అంటు న్నారు: మేము ఆయన శరీరంపై ఎనభైకు మించి కత్తిపోటులు, బాకు పోడుపులు మరియు బాణాల గాయాలు చూశాము. మేము చూసి

నప్పటికి ఆయన హత్య చేయబడి ఉన్నారు. బహుదైవారాధకులు ఆయన్ని చిత్రవధ చేశారు. అంచేత ఎవరూ ఆయన్ని గుర్తుపట్టలేక పోయారు. చివరికి ఆయనగారి చెల్లెలు ఆయన్ని వ్రేళ్ళ చిగుళ్ళ ఆధారంగా గుర్తుపట్టగలిగింది. బహుశా ఈ (క్రింది) సూక్తి ఈయన మరియు ఈయన లాంటివారి గురించే అవతరించి ఉంటుందని మేమనుకునేవాళ్ళం- "విశ్వాసులలో కొందరు అల్లాహ్‌కు చేసిన వాగ్దానాన్ని నిజంచేసి చూపిన వారు ఉన్నారు..." (పూర్తి ఆయతు) (అహ్‌జాబ్: 23)

(బుఖారీ-ముస్లిం. ఈ హదీసు ఇంతకు ముందు పోరాటపటిమ అధ్యాయంలో కూడా వచ్చింది.)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో అనస్‌గారి బాబాయి యుద్ధభూమిలో నిలబడి తాను అత్యంత ధైర్యసాహసాలతో వీరోచితంగా శత్రువులతో పోరాడతానని ప్రకటించారు. అంతేగాని ఉబుసుపోని శపథాలు చేయలేదు. దీనిద్వారా బోధపడే విషయం ఏమిటంటే మనిషికి ఏదయినా సత్కార్యం చేయాలన్న ఆలోచన ఉంటే, 'నేను అది చేయగలను ఇది చేయగలను' అని చెప్పుకోవటం కంటే సమయం వచ్చినప్పుడు తన నిశ్చయానికి అనుగుణంగా తన పూర్తి శక్తిసామర్థ్యాలు ఒడ్డి ఆ పని పూర్తి చేయాలి. అలా చేస్తే స్వయంగా దేవుడే ఆ పనికి నలుగురిలో గుర్తింపు లభించేలా చేస్తాడు. అలాగాకుండా ప్రారంభంలోనే పేరు ప్రఖ్యాతుల కోసం ఏదయినా మంచిపని చేస్తే చిత్తశుద్ధి లోపించే కారణంగా ఆ పనంతా బూడిదలో పోసిన పన్నీరయిపోతుంది.

1319. హ్రజత్ సమురా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నాకు రాత్రి (కలలో)

١٣١٩ ـ وعَنْ سَمُرَةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «رَأَيْتُ اللَّيْلَةَ

رَجُلَيْنِ أَتَيَانِي، فَصَعِدَا بِي الشَّجَرَةَ، فَأَدْخَلانِي دَاراً هِيَ أَحْسَنُ وَأَفْضَل، لَمْ أَرَ قَطُّ أَحْسَنَ مِنها، قالا: أَمَّا هذِهِ الدَّار فَدَارُ الشُّهَدَاءِ» رواه البخاري وهو بعضٌ من حديثٍ طويلٍ فيه أنواع العلم سيأتي في بابِ تحريمِ الكذبِ إنْ شاءَ الله تعالَى.

ఇద్దరు వ్యక్తులు నా దగ్గరకు వచ్చినట్లు కనిపించింది. వారు నన్ను ఓ చెట్టు మీదకు ఎక్కించుకొని తీసుకెళ్ళారు. అక్కణ్ణుంచి నన్ను వైభవోపేతమైన అత్యంత సుందరమైన ఓ భవనంలోకి తీసుకెళ్ళారు. దానికంటే అందమైన భవనం నేనెన్నడూ చూడలేదు. అక్కడికి తీసుకెళ్ళిన తర్వాత ఆ ఇద్దరు వ్యక్తులు నాతో "ఈ ఇల్లు అమరగతులది(అనగా షహీదులది)" అని చెప్పారు. *(బుఖారీ)*

ఇది ఓ సుదీర్ఘ హదీసులోని భాగం. ఈ హదీసులో ఎన్నో రకాల విద్యలను గురించి ప్రస్తావించటం జరిగింది. దైవం తలిస్తే ఈ హదీసు మళ్ళీ, 'అబద్ధం చెప్పటం నిషిద్ధం' అన్న అధ్యాయంలో మళ్ళీ రాబోతోంది.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం)కు స్వప్నావస్థలో అమరగతులకు స్వర్గంలో లభించనున్న భోగభాగ్యాలను చూపెట్టటం జరిగిందని ఈ హదీసు మనకు తెలియజెబుతోంది. ఈ సందర్భంగా మనం దైవప్రవక్తలకు వచ్చే కలలు నిజంగా జరిగి తీరుతాయన్న విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. పోతే దైవప్రవక్త (సల్లం)కు కలలో కనిపించిన ఇద్దరు వ్యక్తులు, జిబ్రయీల్ మరియు మీకాయీల్ దూతలు. దేవుడు తలచినప్పుడు దైవదూతలు మానవరూపంలో రాగలరని చెప్పటానికి ఈ హదీసు ప్రబల నిదర్శనం.

١٣٢٠ ـ وعنْ أنسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ أُمَّ الرُّبَيِّعِ بِنْتَ البَرَاءِ وَهِيَ أُمُّ حارِثَةَ بنِ سُرَاقَةَ، أَتَتِ النَّبِيَّ ﷺ فَقَالَتْ:

1320. హజ్రత్ అనస్ (రజి) కథనం: హారిసా బిన్ సురాఖా తల్లిగారైన ఉమ్మె రుబ్బీ బిన్తె బరా (రజి.అన్హా) దైవప్రవక్త సన్నిధికి వెళ్ళి, బద్ర్ యుద్ధంలో అమరగతినొందిన హారిసా గురించి

يَا رَسُولَ اللهِ! أَلا تُحَدِّثُنِي عَنْ حارِثَةَ - وَكَانَ قُتِلَ يَوْمَ بَدْرٍ - فَإِنْ كانَ فِي الجَنَّةِ صَبَرْتُ، وَإِنْ كانَ غَيْرَ ذلكَ اجْتَهَدْتُ عَلَيْهِ فِي البُكَاءِ، فقال: «يا أُمَّ حارِثَةَ! إِنَّهَا جِنانٌ فِي الجَنَّةِ، وَإِنَّ ابْنَكِ أَصابَ الفِرْدَوْسَ الأَعْلى». رواه البخاري.

అడుగుతూ "దైవప్రవక్తా! నాకు హారిసా గురించి తెలియజేయరా? ఒకవేళ అతను స్వర్గంలో ఉంటే నేను సహనం వహిస్తాను. అలా కాని పక్షంలో నేను అతనికోసం తనివితీరా ఏడుస్తాను" అని మొరపెట్టుకుంది. అందుకాయన ఆమెను ఓదార్చుతూ, 'ఉమ్మె హారిసా! స్వర్గంలో ఎన్నో అంతస్తులున్నాయి. వాటిలో నీ కొడుకు అత్యంత ఉన్నత స్థానంలో ఉన్నాడు" అని చెప్పారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

స్వర్గంలోని అత్యున్నత స్థానాన్ని 'ఫిర్‌దౌస్' అని అంటారు. తన మార్గంలో ప్రాణాలర్పించిన యోధుల పట్ల ప్రసన్నుడై దేవుడు వారిని స్వర్గంలోని అత్యున్నత స్థానమైన 'ఫిర్‌దౌస్'లో ఉంచుతాడు. మీరు దేవుణ్ణి స్వర్గం ప్రసాదించమని కోరినప్పుడు ఫిర్‌దౌస్ స్వర్గాన్ని ప్రసాదించమని అడగండి అని హదీసుల్లో బోధించటం జరిగింది.

١٣٢١ - وعَنْ جابِرِ بنِ عبدِ اللهِ رضيَ اللهُ عَنْهُمَا قالَ: جِيءَ بِأَبِي إلى النَّبِيِّ ﷺ قَدْ مُثِّلَ بِهِ، فَوُضِعَ بَيْنَ يَدَيْهِ، فَذَهَبْتُ أَكْشِفُ عَنْ وَجْهِهِ فَنَهانِي قَوْمٌ فقالَ النَّبِيُّ ﷺ: «مَا زَالَتِ المَلائِكَةُ تُظِلُّهُ بِأَجْنِحَتِها» متفقٌ عليه.

1321. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం: (ఉహుద్ యుద్ధంలో) మా నాన్నగారు చిత్రవధకు గురయ్యారు. ఆయన (భౌతిక) కాయాన్ని తీసుకొచ్చి దైవప్రవక్త (సల్లం) ముందుంచటం జరిగింది. నేను ఆయన ముఖం మీది వస్త్రాన్ని తొలగించి చూద్దామని ప్రయత్నించినప్పుడు కొంత మంది నన్ను వారించారు. ఆ సందర్భంగా దైవప్రవక్త (సల్లం) నాతో "దైవదూతలు తమ రెక్కలతో మీ నాన్నకు నీడ

కల్పిస్తూ ఉన్నారు" అని చెప్పారు.
(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మనిషిని హత్యచేయుటమే కాకుండా అతని ముక్కు, చెవులు మొదలగు అవయవాలు కోసి, కళ్లు పీకి శరీరాకృతుల్ని మార్చివేయటాన్ని 'ముస్లా' (చిత్రవధ) అని అంటారు. ఎంతోమంది దైవప్రవక్త సహచరులు యుద్ధాల్లో అవిశ్వాసులు, బహుదైవారాధకుల చేతుల్లో ఈ విధమైన చిత్రవధకు గురయ్యారు. కాని ఇస్లాం ధర్మం మాత్రం శత్రువులనైనా చిత్రవధ చేయరాదని ముస్లింలకు తాకీదు చేసింది.

١٣٢٢ ـ وعَنْ سهل بن حُنَيْفٍ رَضِيَ اللهُ عَنْـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ قَـالَ : «مَـنْ سَـأَلَ اللهَ تَعَالَى الشَّهَادَةَ بِصِدْقٍ بَلَّغَهُ اللهُ مَنَازِلَ الشُّهَدَاءِ وَإِن مَاتَ عَلَى فِرَاشِهِ» رواه مسلم.

1322. హజ్రత్ సహ్ల్ బిన్ హునైఫ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే మనస్ఫూర్తిగా తనకు అమరగతినొందే భాగ్యాన్ని ప్రసాదించమని దేవుణ్ణి వేడుకుంటారో- అలాంటివారు తమ పడకల మీద మరణించినా సరే దేవుడు వారిని అమరగతుల (షహీదుల) స్థాయికి చేరుస్తాడు.
(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

١٣٢٣ ـ وعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ طَلَبَ الشَّهَادَةَ صَادِقاً أُعطِيَهَا وَلو لم تُصِبْهُ» رواه مسلم.

1323. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనస్ఫూర్తిగా అమర గతిని ఆశించేవారికి తప్పకుండా ఆ స్థానం ప్రసాదించబడుతుంది. (నిజ జీవితంలో) వారు అమరగతులు కాకపోయినా సరే. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో చిత్తశుద్ధి ప్రాముఖ్యత, దాని వల్ల కలిగే ప్రయోజనం వివరించబడ్డాయి. మనిషి ఎల్లప్పుడూ మంచి సంకల్పంతో, ఇంకా చెప్పాలంటే సత్కార్యాలు చేయాలన్న ఆశతో ఉండాలి. అలాంటప్పుడు సత్కార్యాలు చేసే అవకాశం లభించకపోయినా లేక చేయలేకపోయినా దేవుడు అతని మంచి సంకల్పానికి తప్పకుండా ప్రతిఫలం ప్రసాదిస్తాడు. అదే విధంగా ప్రతి ముస్లిం దైవమార్గంలో ప్రాణాలర్పించే ఆశతో జీవితం గడిపితే అలాంటి అవకాశం లభించక పోయినా దేవుడు అతన్ని అమరగతుల స్థాయికి చేరుస్తాడని మనం ఆశించవచ్చు.

١٣٢٤ ـ وعَنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «مَا يَجِدُ الشَّهِيدُ مِنْ مَسِّ القَتْلِ إلَّا كَما يَجِدُ أَحَدُكُمْ مِنْ مَسِّ القَرصَةِ» رواه الترمذي وقال: حديثٌ حَسنٌ صحيحٌ.

1324. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అమరగతుడు హత్య చేయబడినప్పుడు అతనికి చీమ కుట్టినంత నొప్పి మాత్రమే కలుగుతుంది. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని జిహాద్ విశిష్టత అధ్యాయం)

١٣٢٥ ـ وعن عبْدِ اللهِ بنِ أَبي أَوْفَى رضيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ في بَعضِ أَيَّامِهِ الَّتي لَقِيَ فِيهَا العَدُوَّ انْتَظَرَ حتى مَالَتِ الشَّمْسُ، ثُمَّ قامَ في النَّاسِ فقال: «أَيُّهَا النَّاسُ! لا تَتَمَنَّوا لِقَاءَ العَدُوِّ، وَسَلُوا اللهَ العَافِيَةَ، فإذا لَقِيتُمُوهُم فَاصْبِرُوا، وَاعلَمُوا أَنَّ الجَنَّةَ تَحْتَ ظِلالِ السُّيوفِ» ثم قال: «اللَّهُمَّ! مُنزِلَ الكتَابِ وَمُجْرِيَ السَّحَابِ، وَهَازِمَ الأَحْزَابِ اهْزِمهُم وَانصُرنَا عَلَيهِم» متفقٌ عليه.

1325. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) కథనం: శత్రువులతో తలపడాల్సి వచ్చిన రోజుల్లో దైవప్రవక్త (సల్లం) (యుద్ధం విషయంలో తొందర పడకుండా) కాసేపు వేచి ఉన్నారు. సూర్యుడు నడినెత్తి నుండి క్రిందికి వాలిన తర్వాత జనం మధ్య నిలబడి ఆయన ఈ విధంగా ప్రసంగించారు: ప్రజలారా! మీరు ఎన్నడూ శత్రువుతో పోరాడాల్సిన పరిస్థితి ఎదురుకావాలని కోరుకోకండి. నిత్యం శాంతిని కోరుకుంటూ అల్లాహ్‌ను ప్రార్థించండి. అయితే శత్రువులతో యుద్ధం చేయవలసిన పరిస్థితి గనక ఎదురైతే మాత్రం

సహనస్థయిర్యాలతో పోరాడండి. స్వర్గం ఖడ్గచ్ఛాయల క్రింద ఉందన్న సంగతిని తెలుసుకోండి.

తర్వాత ఆయన ఇలా ప్రార్థించారు: ఓ అల్లాహ్! దివ్య గ్రంథాన్ని అవతరింపజేసినవాడా! మేఘాలను నడిపించే వాడా! శత్రుసేనల్ని ఓడించినవాడా! ఈ శత్రుసేనల్ని కూడా ఓటమికి గురిచేసి వీరికి వ్యతిరేకంగా మాకు సహాయపడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

శత్రువులతో యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు మధ్యాహ్నం సూర్యుడు నడినెత్తి నుండి వాలిన తర్వాత యుద్ధం మొదలెట్టటం మంచిది. దైవప్రవక్త (సల్లం) ఇలాగే చేసేవారు. ఈ హదీసుకు సంబంధించిన మరిన్ని ముఖ్యాంశాల కోసం మొదటి సంపుటిలోని 53వ హదీసు క్రింది ముఖ్యాంశాలు చూడండి.

١٣٢٦ ـ وعن سَهْلِ بنِ سعدٍ رَضيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «ثِنْتَانِ لا تُرَدَّانِ، أَوْ قَلَّمَا تُرَدَّانِ: الدُّعَاءُ عِنْدَ النِّدَاءِ وَعِنْدَ البَأْسِ حِينَ يُلْحِمُ بَعْضُهُم بَعضاً». رواه أبو داود بإسناد صحيح.

1326. హజ్రత్ సహ్లా బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "రెండు ప్రార్థనలు త్రోసిపుచ్చబడవు (లేక) అవి త్రోసిపుచ్చబడటం అనేది చాలా అరుదు" అని అన్నారు. వాటిలో ఒకటి: అజాన్ సమయంలో చేయబడే ప్రార్థన. రెండవది: ఇరుపక్షాలు తలపడి యుద్ధం చేసుకున్నప్పుడు చేయబడే ప్రార్థన. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

1327. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) యుద్ధం చేసినప్పుడు ఈ విధంగా ప్రార్థించేవారు: "ఓ అల్లాహ్! నీవే నా శక్తివి, సహాయకుడివి. నీ సహాయంతోనే నేను అటూ ఇటూ తిరుగుతూ (ఆత్మరక్షణ చేసుకోగల్గుతున్నాను.) నీ సాయంతోనే శత్రువు మీద దాడిచేసి అతనితో పోరాడగల్గుతున్నాను." (అబూదావూద్, తిర్మిజీ-హసన్)

١٣٢٧ ـ وعَنْ أَنسٍ رَضِيَ اللهُ عَنْهُ قالَ: كانَ رَسُولُ اللهِ ﷺ إذا غزَا قال: «اللَّهُمَّ! أَنتَ عَضُدِي وَنَصِيرِي، بِكَ أَحُوْلُ، وَبِكَ أَصُوْلُ، وَبِكَ أُقاتِلُ» رواهُ أبو داودَ، والترمذيُّ وقالَ: حَدِيثٌ حَسَنٌ.

(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయం)

## ముఖ్యాంశాలు

శత్రువుతో యుద్ధం చేయటానికి సైనిక బలగాలను, భౌతిక సాధన సంపత్తిని సమకూర్చుకోవటంతోనే సరిపోదు. యుద్ధంలో, విజయం, సహాయం కోసం దేవుణ్ణి కూడా ప్రార్థిస్తూ ఉండాలి. యుద్ధ సమయంలో కూడా దేవుణ్ణి స్మరిస్తూ, ఆయన్ని సహాయం కోసం వేడుకుంటూ ఉండే విశ్వాసులకు ఆయన తరఫు నుండి గొప్ప సహాయం లభిస్తుంది.

1328. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) శత్రుజనం నుండి బెడద ఉందని తలిస్తే ఈ విధంగా ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! మేము నిన్ను వారి ముందుంచుతున్నాం. వారి దౌష్ట్యాల నుండి నీ శరణు వేడుకుంటున్నాం.

(అబూదావూద్. దీని ఆధారాలు దృఢమైనవి)

١٣٢٨ ـ وعَنْ أبي مُوسَى رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ كانَ إذا خافَ قَوماً قال: «اللَّهُمَّ! إنَّا نَجعَلُكَ في نُحُورِهِم، ونَعُوذُ بِكَ مِنْ شُرورِهِم» رواه أبو داودَ بإسنادٍ صحيحٍ.

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)

١٣٢٩ ـ وعَن ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنهُمَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «الخَيْلُ مَعقُودٌ في نَوَاصِيهَا الخَيرُ إلى يَوْمِ القِيَامَةِ» متفقٌ عليه.

1329. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: గుర్రాల నుదుట ప్రళయం వరకూ శ్రేయో శుభాలు ఉంచబడ్డాయి.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

జిహాద్ కోసం ఉపయోగించబడే గుర్రాల్లోనే ఈ శ్రేయోశుభాలు ఉంటాయన్న విషయం గమనార్హం. అసలు శ్రేయోశుభాలంటే జిహాద్‌లో పాల్గొనటం వల్ల లభించే పుణ్యఫలం అని అర్థం. అయితే యుద్ధంలో విజయం సాధించినప్పుడు లభించే యుద్ధసొత్తు కూడా ఒక విధంగా శ్రేయస్కరమైనదే. కనుక దైవమార్గంలో యుద్ధం కోసం గుర్రాలను పెంచటం వల్ల పుణ్యఫలంతో పాటు యుద్ధంలో గెలిచినప్పుడు విజయప్రాప్తి కూడా లభిస్తుందన్నది ఈ హదీసు సారాంశం. పూర్వకాలపు యుద్ధాల్లో గుర్రాల పాత్ర ఎటువంటిదో, శత్రువులతో పోరాడటానికి గుర్రాలు ఎంతగా అవసరమయ్యేవో వేరుగా చెప్పనక్కర్లేదు. నేడు కాలం మారింది. యుద్ధ తంత్రాల్లో పెనుమార్పులు వచ్చాయి. శత్రువుల లక్ష్యాలను ఛేదించటం కోసం అత్యంత అధునాతనమైన యుద్ధసామగ్రిని ఉపయోగించటం జరుగుతోంది. అయినప్పటికీ నేటి యుద్ధాల్లో కూడా గుర్రాల పాత్రను, ప్రాముఖ్యతను మనం తీసిపారేయలేం. అలాంటప్పుడు ప్రళయం వరకూ గుర్రాల నుదుట శ్రేయోశుభాలు రాసివున్నాయనటంలో సందేహమేముంది?

١٣٣٠ ـ وعَنْ عُروَةَ البَارِقيِّ رَضِيَ اللهُ عَنهُ، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «الخَيْلُ مَعقُودٌ في نَوَاصِيهَا الخَيرُ إلى يَوْمِ القِيَامَةِ: الأَجرُ، وَالمَغنَمُ» متفقٌ عليه.

1330. హజ్రత్ ఉర్వా బారిఖీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: గుర్రాల నుదుట ప్రళయం వరకూ శ్రేయో శుభాలు ఉంచబడ్డాయి. శ్రేయోశుభా లంటే పుణ్యఫలం మరియు యుద్ధ ప్రాప్తి. (బుఖారీ, ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

١٣٣١ ـ وعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنِ احتَبَسَ

1331. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవం మీద

فَرَساً في سَبيلِ اللهِ، إيمَاناً باللهِ، وَتَصديقاً بِوَعْدِهِ، فإنَّ شِبَعَهُ، وَرِيَّهُ وَرَوْثَهُ، وَبَوْلَهُ في مِيزَانِهِ يَوْمَ القِيَامَةِ» رواه البخاريُّ.

విశ్వాసంతో ఆయన వాగ్దానం నిజమైన దని భావిస్తూ, ఆయన మార్గంలో (యుద్ధం చేయటం కోసం) గుర్రాన్ని పెంచితే దానికి పెట్టబడే మేత, నీళ్లు ఇంకా అది విసర్జించే మలమూత్రాలు అన్నీ ప్రళయదినాన (మనిషి కర్మలతో పాటు) త్రాసులో తూయబడతాయి. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

١٣٣٢ ـ وعَنْ أَبي مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قالَ: جَاءَ رَجُلٌ إلى النَّبيِّ ﷺ بِنَاقَةٍ مَخْطُومَةٍ فقالَ: هذِهِ في سَبيلِ اللهِ، فقالَ رسُولُ اللهِ ﷺ: «لَكَ بِهَا يَوْمَ القِيَامَةِ سَبْعُمِائَةِ نَاقَةٍ كُلُّهَا مَخْطُومَةٌ» رواهُ مسلم.

1332. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి కళ్లెం బిగించిన ఒక ఒంటెను తీసుకొచ్చి, "దైవప్రవక్తా! దీనిని దైవ మార్గంలో అర్పిస్తున్నాను" అని అన్నాడు. అది విని ఆయన "అందుకు గాను నీకు పరలోకంలో ఏడొందల ఒంటెలు లభిస్తాయి. వాటన్నింటికీ కళ్లాలు బిగించబడి ఉంటాయి" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

١٣٣٣ ـ وعن أبي حَمَّادٍ ـ ويُقال: أبو سُعادٍ، ويُقالُ: أبو أَسَدٍ، ويقال: أبو

1333. హజ్రత్ అబూ హమ్మాద్ ఉఖ్‌బా బిన్ ఆమిర్ జుహనీ (రజి) కథనం (కొంతమంది ఈయన మారుపేరు అబూ సుఆద్ లేక అబూ అసద్ లేక అబూ ఆమిర్ లేక అబూ అమ్ర్ లేక అబుల్ అస్వద్ లేక అబూ అబస్ అయిఉంటుందని అభిప్రాయ పడ్డారు.) దైవప్రవక్త (సల్లం) వేదికపై

عامِرٍ، ويقالُ: أبو عَمْرٍو، ويقالُ: أَبُو الأَسْوَدِ، ويقالُ: أبو عَبْسٍ - عُقْبَةَ بن عامِرٍ الجُهَنِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ وَهُوَ عَلى المِنْبَرِ يقولُ: «وَأَعِدُّوا لَهُم ما استَطَعْتُم من قُوَّةٍ، أَلا إنَّ القُوَّةَ الرَّميُ، أَلا إنَّ القُوَّةَ الرَّميُ، أَلا إنَّ القُوَّةَ الرَّميُ» رواه مسلم.

నించొని ఈ సూక్తి పఠిస్తుండగా తాను విన్నానని ఆయన తెలియజేశారు: "మీరు దైవ విరోధుల్ని ఎదుర్కోవటా నికి మీ శక్తి మేరకు అత్యధిక బలాన్ని సమ కూర్చుకోండి."

ఆ తర్వాత ఆయన తన సహచరుల్ని ఉద్దేశ్యించి, "వినండి! బలమంటే విలువిద్య, బలమంటే విలువిద్య, బలమంటే విలువిద్య" అని (మూడు సార్లు) అన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన దివ్యఖుర్ఆన్ ఆయతులో శత్రువులను ఎదిరించటానికి వీలైనంత ఎక్కువగా శక్తిసామర్థ్యాలను సమకూర్చుకోమని అల్లాహ్ ముస్లింలను ఆజ్ఞాపిస్తున్నాడు. ఆనాటి యుద్ధ విధానం, సమకాలీన పరిస్థితుల దృష్ట్యా దైవప్రవక్త (సల్లం) 'బలం' అంటే 'విలువిద్యే'నని వివరించారు. పైగా ఒకటికి మూడు సార్లు ఆ విషయాన్ని నొక్కిచెప్పి దాని ప్రాముఖ్యతను వెల్లడించారు. ఆ కాలపు యుద్ధ విధానాల్లో విలువిద్యకు అత్యంత కీలకమైన స్థానం ఉండేది. కాని నేడు యుద్ధ విధానం పూర్తిగా మారిపోయింది. బాణాల స్థానే ఈ రోజు ట్యాంకులు, క్షిపణులు, ఆటంబాంబులు మొదలగు వినూత్న యుద్ధ పరికరాలెన్నో ఆవిష్కరించబడ్డాయి. అదే విధంగా వైమానిక దళం, నౌకాదళాలు కూడా నేటి యుద్ధ విధానంలో ప్రధాన భూమికను నిర్వహిస్తున్నాయి. కనుక ఈ యుగంలో దివ్యఖుర్ఆన్‌లోని "మీ శక్తి మేరకు అత్యధిక బలాన్ని సమకూర్చుకోండి" అన్న ఆయతుకు పైన పేర్కొనబడిన అత్యాధునిక యుద్ధ పరికరాలను సమకూర్చుకోవటం, వినూత్న యుద్ధ విధానాలను అవలంబించి దైవ విరోధులను ఎదుర్కో వటానికి సిద్ధంగా ఉండటం అనే భావమే వస్తుంది. ఇస్లామీయ రాజ్యం ఈ విభాగంలో ఎటు వంటి నిర్లక్ష్యం చేయకుండా దివ్యఖుర్ఆన్ ఆయతును తు.చ. తప్పకుండా పాటించటానికి కృషి చేయాలి.

١٣٣٤ ـ وَعَنْهُ قَالَ: سمِعْتُ رَسُولَ اللهِ ﷺ، يقولُ: «سَتُفْتَحُ عَلَيْكُم أَرَضُونَ، وَيَكفِيكمُ اللهُ، فَلا يَعْجِزْ أَحَدُكُمْ أَن يَلْهُوَ بِأَسْهُمِهِ» رواه مسلم.

1334. ఉఖబా బిన్ ఆమిర్ జుహనీ (రజి)గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా నేను విన్నాను: త్వరలోనే ఎన్నో

భూభాగాల (రాజ్యాల) విజయ ద్వారాలు మీకోసం తెరువబడనున్నాయి. అప్పుడు (శత్రువులతో పోరాడటానికి) మీకు దేవుని తరపు నుండి చాలినంత బలం లభిస్తుంది. అయితే మీరు మీ (తీరిక సమయంలో) బాణాలతో అభ్యాసం చేయటంలో మాత్రం ఏ లోటూ రానీయకూడదు సుమా! (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

రాబోవు కాలంలో ముస్లింలు ఎన్నో ప్రాంతాల మీద విజయకేతనం ఎగురవేస్తారనీ, ఆ కాలంలో దేవుడు వారికి పూర్తి మద్దతునిస్తాడనీ, ఫలితంగా శత్రువులు ముస్లింలకు ఏమాత్రం నష్టం కలిగించలేరని ఈ హదీసు చెబుతోంది. అయితే దానితోపాటు భౌతిక సాధన సంపత్తిని సమకూర్చుకునే విషయంలోనూ ఎలాంటి ఏమరుపాటుకు లోనుకారాదనీ, అదే విధంగా యుద్ధంలో శత్రువులతో తలపడే విధానాన్ని అభ్యసించటంలోనూ ఎలాంటి లోటూ రానీయకూడదని ఈ హదీసు హెచ్చరిస్తోంది. ఆ విధంగా చూస్తే నేటి కాలంలో ధర్మయోధులు అధునాతన యుద్ధ పరికరాలను ఉపయోగించటం కోసం శిక్షణ పొందటం చాలా అవసరం.

١٣٣٥ ـ وعَنْـهُ أنَّـهُ قـالَ: قـالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ عُلِّمَ الرَّمْيَ، ثُمَّ تَرَكَهُ، فَلَيْسَ مِنَّا، أَوْ فَقَدْ عَصَى» رواه مسلم.

1335. ఉఖబా బిన్ ఆమిర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) (తన సహచరులకు యుద్ధ తంత్రాల గురించి బోధిస్తూ) "విలు విద్య నేర్చుకొని ఆపై దాన్ని నిర్లక్ష్యం చేసిన వారితో మాకు సంబంధం లేదు (లేక) వాడు మాకు అవిధేయత చూపినట్లే" అని హెచ్చరించారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఆనాడు విలువిద్యకు ఎంతో ప్రాముఖ్యత ఉండేది. దాన్ని దృష్టిలో పెట్టుకొని దైవప్రవక్త

(సల్లం) ఈ మాట అన్నారు. ప్రతి ఒక్కరూ అలాంటి యుద్ధ విద్యల్ని నేర్చుకోవాలని ఈ హదీసు పురికొల్పుతుంది. అలాగే దాన్ని నేర్చుకున్న తర్వాత అభ్యాసం చేయకుండా దాన్ని నిర్లక్ష్యం చేసేవారికి ఇందులో హెచ్చరిక కూడా ఉంది. నేడు విలువిద్య స్థానాన్ని ఇతర యుద్ధ విధానాలు ఆక్రమించాయి. వాటి విషయంలో కూడా ఈ హెచ్చరిక వర్తిస్తుంది. కనుక దైవధర్మ ఔన్నత్యం కోసం, ముస్లింల రక్షణకోసం ఒకసారి ఒక విద్య నేర్చుకొని ఆ తర్వాత దాన్ని ఉద్దేశ్య పూర్వకంగా మర్చిపోవటం చాలా పెద్ద పాపం. దానివల్ల ఒక ముఖ్య ఇస్లామీయ విధి నిర్వహణలో నిర్లక్ష్యం వహించినట్లవుతుంది.

١٣٣٦ ـ وعنهُ، رضيَ اللهُ عَنْهُ قالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ، يقولُ: «إنَّ الله يُدخِلُ بِالسَّهمِ الوَاحِدِ ثَلاثَةَ نَفَرٍ الجَنَّةَ: صَانِعَهُ يَحتَسِبُ فِي صَنْعَتِهِ الخَيرَ، وَالرَّامِيَ بِهِ، وَمُنْبِلَهُ. وارمُوا وارْكَبُوا، وَأَنْ تَرمُوا أَحَبُّ إِلَيَّ مِنْ أَنْ تَركَبُوا. وَمَنْ تَرَكَ الرَّميَ بَعْدَ ما عُلِّمَهُ رَغبَةً عنه، فَإِنَّها نِعمَةٌ تَرَكَهَا» أَوْ قال: «كَفَرَهَا». رواهُ أبو داود.

1336. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ ఉఖబా బిన్ ఆమిర్ (రజి) గారే తెలియజేశారు: దేవుడు ఒక బాణం మూలంగా ముగ్గుర్ని స్వర్గానికి పంపుతాడు. (1) పుణ్యఫలాపేక్షతో బాణం తయారు చేసినవాడిని. (2) ఆ బాణాన్ని (దైవ విరోధుల మీదకు) వదిలేవాడిని. (3) అంబులపొది నుంచి దాన్ని తీసి అతనికి అందించేవాడిని.

మీరు విలువిద్యను, స్వారీ చేయటాన్ని నేర్చుకోండి. మీరు స్వారీ చేయటం కన్నా విలువిద్య నేర్చుకోవటమే నాకు అత్యంత ఇష్టం. విలువిద్య నేర్చుకున్న తర్వాత అయిష్టం కొద్దీ దాన్ని వదిలేసిన వ్యక్తి తనకు అందివచ్చిన వరాన్ని వదలుకున్నట్లే (లేక) దానిపట్ల కృతఘ్నతకు పాల్పడినట్లే. *(అబూదావూద్)*

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దైవవిరోధుల్ని మార్కొనటానికి సంసిద్ధత ఇంకా దాని ప్రాముఖ్యత గురించి ఈ హదీసులో వివరించటం జరిగింది. దానికోసం విలువిద్యను ఉదాహరణగా పేర్కొనటం జరిగింది. ఈ

రోజుల్లో విలువిద్య స్థానే అత్యాధునికమైన యుద్ధపరికరాలు వచ్చాయి. కనుక వాటిని తయారు చేసేవారికి, వాటి ద్వారా శత్రువుల్ని మార్కొనేవారికి, యుద్ధంలో ధర్మయోధులకు సహాయపడే వారందరికి తగినంత పుణ్యం లభిస్తుంది.

١٣٣٧ ـ وعَن سَلَمَةَ بنِ الأكوَعِ، رَضِيَ اللهُ عَنهُ قالَ: مَرَّ النَّبيُّ ﷺ، على نَفَرٍ يَنتَضِلُونَ، فقَالَ: «ارْمُوا بَنِي إسْماعيلَ فإنَّ أبَاكم كانَ رامِياً» رواه البخاري.

1337. హజ్రత్ సలమా బిన్ అక్వా (రజి) కథనం: కొంతమంది ఒకచోట విలువిద్య పందెం వేసుకొని బాణాలు వదులుతుండగా దైవప్రవక్త (సల్లం) అటుగా వెళ్తూ, "ఇస్మాయీల్ సంతతి వారలారా! (వింటిని ఎక్కుపెట్టి) బాణాలు వదలండి. నిస్సందేహంగా మీ తాత ఇస్మాయీల్ (గొప్ప) విలుకాడు" అంటూ వారిని ఉత్తేజ పరచారు.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఆ కాలంలో అరబ్బుల్ని ఇస్మాయీల్ సంతతివారని కూడా పిలిచేవారు. ఇబ్రాహీమ్ కుమారుడైన ఇస్మాయీల్ ద్వారా వ్యాపించిన సంతానమే అరబ్బులంతా కూడాను. అందుకే వారిని ఇస్మాయీల్ సంతతివారని పేరు పడింది. అంతిమ దైవప్రవక్త ముహమ్మద్(సల్లం) కూడా ఆయన వంశం వారే. ఆ విధంగా చూస్తే ఇబ్రాహీమ్ (అలైహి) మన ప్రవక్త (సల్లం)కు కూడా 'తాత' అవుతారన్నమాట!

١٣٣٨ ـ وَعَنْ عَمْرِو بنِ عَبَسَةَ، رَضِيَ اللهُ عَنهُ قالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ رَمَى بِسَهمٍ في سَبيلِ اللهِ فَهُوَ لَـهُ عِـدْلُ مُحـرَّرةٍ». رواهُ أبـو داود، والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

1338. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని అమ్ర్ బిన్ అబసా (రజి) తెలియజేశారు: దైవ మార్గంలో ఒక బాణం వదిలిన వ్యక్తికి, ఒక బానిసకు స్వేచ్ఛ ప్రసాదించినంత పుణ్యం లభిస్తుంది.

*(అబూదావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె అబూదావూద్‌లోని బానిస విమోచన ప్రకరణం - సుననె తిర్మిజీలోని జిహాద్ మహిమోన్నతుల ప్రకరణం)*

1339. హజ్రత్ అబూ యహ్యా ఖురైమ్ బిన్ ఫాతిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా దైవ మార్గంలో ఏమైనా ఖర్చుపెడితే అతని కొరకు (అతని కర్మల జాబితాలో) ఏడొందల రెట్లు పుణ్యం వ్రాయబడు తుంది. (తిర్మిజీ-హసన్)

١٣٣٩ ـ وعَنْ أَبي يحيى خُرَيْم بن فَاتِكٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ أَنْفَقَ نَفَقَةً في سَبِيلِ اللهِ كُتِبَ لَهُ سَبْعُمِائَةِ ضِعْفٍ» رواهُ الترمذي وقالَ: حديثٌ حَسَنٌ.

*(సుననె తిర్మిజీలోని జిహాద్ మహిమోన్నతుల ప్రకరణం)*

1340. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా దైవమార్గంలో ఒకరోజు ఉపవాసముంటే దానికి బదులుగా దేవుడు అతన్ని నరకాగ్ని నుండి డెబ్భై సంవత్సరాల (ప్రయాణమంత) దూరం ఉంచుతాడు. (బుఖారీ-ముస్లిం)

١٣٤٠ ـ وعَنْ أَبي سَعيدٍ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «مَا مِنْ عَبْدٍ يَصُومُ يَوْماً في سَبيلِ اللهِ إلَّا بَاعَدَ اللهُ بذلكَ اليَوْمِ وَجْهَهُ عَنِ النَّارِ سَبْعِينَ خَرِيفاً» متفقٌ عليهِ.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు ఉపవాస అధ్యాయంలో కూడా వచ్చింది. ఇందులో ఇంకా దీనికి ముందు ప్రస్తావించబడిన హదీసుల్లో కూడా దైవమార్గంలో ఖర్చుచేయటం, ఇతర ఎలాంటి కష్టాన్నయినా సహించటం వల్ల లభించే పుణ్యం గురించి వివరించటం జరిగింది. మొత్తానికి జిహాద్ మార్గంలో చేసిన ఏ పనీ వృథాగా పోదనీ, ప్రతి పనికి పూర్తి ప్రతిఫలం లభిస్తుందన్న విషయాన్ని తెలియజెప్పటమే ఈ హదీసుల ఉద్దేశ్యం.

1341. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఎవరయినా "దైవమార్గంలో ఒక రోజు ఉపవాస ముంటే అతనికీ - నరకాగ్నికి మధ్య దేవుడు భూమ్యాకాశమంత (వెడ

١٣٤١ ـ وعَنْ أَبي أُمَامَةَ، رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ، قالَ: «مَنْ صَامَ يَوْماً في سَبِيلِ اللهِ جَعَلَ اللهُ بَيْنَهُ وَبَيْنَ النَّارِ خَنْدَقاً كَمَا بَيْنَ السَّماءِ والأَرْضِ» رواهُ الترمذي وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

ల్పయిన) కందకం (అడ్డం) ఉండేలా చేస్తాడు. (తిర్మిజీ-హసన్, సహీహ్)

(సునసె తిర్మిజీలోని జిహాద్ మహిమోన్నతుల ప్రకరణం)

١٣٤٢ - وعَنْ أبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ ماتَ وَلَمْ يَغزُ، وَلَمْ يُحَدِّثْ نَفْسَهُ بِغَزْوٍ، ماتَ عَلى شُعْبَةٍ مِنَ النِّفَاقِ» رواهُ مسلمٌ.

1342 హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: జిహాద్ చేయకుండా, కనీసం జిహాద్ చేయాలన్న ఆలోచన కూడా లేకుండా మరణించిన వ్యక్తి ఓ కపట లక్షణంతో మరణించిన వాడవుతాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

జిహాద్‌లో పాల్గొనే అవకాశం లభించకపోవటం వేరే విషయం. కాని ఒకవేళ ధర్మ విరోధులతో పోరాడాల్సి వచ్చినప్పుడు దైవమార్గంలో పోరాడాలన్న తలంపు కూడా లేకపోవటం కపటుల లక్షణం. దైవప్రవక్త (సల్లం) కాలంలో కపట విశ్వాసులు ప్రాణభయంతో ఎల్లప్పుడూ జిహాద్‌కు దూరంగా ఉండేవారు. ఇమామ్ ఖుర్తుబీ (రహ్మాలై) ఈ హదీసు వెలుగులో ఒక సూత్రాన్ని ప్రతిపాదించారు. అదేమిటంటే మనిషికి ఏదయినా సత్కార్యం చేసే వీలు లేకపోయినప్పుడు కనీసం వీలు చిక్కినప్పుడయినా దాన్ని తప్పకుండా నెరవేరుస్తానన్న కృత నిశ్చయంతో ఉండాలి. ఆ కృత నిశ్చయానికి గాను అతనికి ఆ పని చేసినంత పుణ్యం లభిస్తుంది. దీనికి భిన్నంగా సత్కార్యాలు చేయకపోవటం, కనీసం సత్కార్యాలు చేయాలన్న ఉద్దేశ్యం కూడా లేకపోవటం కపటుల లక్షణం. ముఖ్యంగా జిహాద్ గురించి మనసులో ఏమాత్రం ఆసక్తి లేకపోతే అలాంటి మనిషి కపట విశ్వాసిగా పరిగణించబడతాడు.

١٣٤٣ - وعَنْ جابرٍ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: كنَّا مَعَ النَّبِيِّ ﷺ في غَزَاةٍ فقالَ: «إنَّ بِالمَدِينَةِ لَرِجَالاً ما سِرتُمْ مَسِيراً وَلا قَطَعتُمْ

1343. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: ఒకానొక ధర్మయుద్ధంలో మేము దైవ ప్రవక్త (సల్లం) వెంట ఉన్నాం. అప్పుడాయన మాతో ఇలా అన్నారు: మదీనా నగరంలో కొంతమంది ఉన్నారు (వారు మన వెంట యుద్ధానికి రాలేదు కాని) మీరు ఎంత దూరమయితే ప్రయాణించారో, ఎన్ని

وَادياً إلَّا كانُوا مَعَكُمْ، حَبَسَهُمُ المَرَضُ». وفي روايةٍ: «حَبَسَهُمُ العُذْرُ». وفي روايةٍ: «إلَّا شَرَكُوكُمْ في الأَجْرِ» رواهُ البخاري من روايةِ أنَسٍ، ورَواهُ مُسلمٌ من روايةِ جابرٍ واللفظ له.

లోయల గుండానయితే నడిచి వెళ్ళారో (దానికి లభించే పుణ్యంలో) వారు కూడా మీతోపాటు (భాగస్వాములుగా) ఉన్నారు. వ్యాధి మూలంగా వారు (మన వెంట యుద్ధానికి) రాలేక పోయారు.

వేరొక ఉల్లేఖనంలో "అనివార్య కారణాలు వారిని ఆపి ఉంచాయి" అని ఉంది.

ఇంకొక ఉల్లేఖనంలో "వారు పుణ్యంలో మీతో పాలుపంచుకున్నారు" అని ఉంది.

ఇమామ్ బుఖారీ ఈ హదీసును అనస్ (రజి) ఆధారంగా సేకరించారు. ఇమామ్ ముస్లిం దీనిని జాబిర్ (రజి) ఆధారంగా సేకరించారు. హదీసు వాక్యాలు ముస్లింవి.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు చిత్తశుద్ధి (ఇఖ్లాస్) అధ్యాయంలో కూడా వచ్చింది. దీనిద్వారా తెలిసేదేమంటే జిహాద్‌లో పాల్గొనలేకపోయినవారు దానికి సంబంధించి సంకల్ప శుద్ధితో ఉంటే చాలు, తమ ధనప్రాణాలతో దైవమార్గంలో పోరాడిన వారవుతారు. తమ చిత్తశుద్ధి మూలంగా వారు దైవం దృష్టిలో ధర్మయోధుల పుణ్యంలో భాగస్వాములౌతారు.

١٣٤٤ ـ وعنْ أبي مُوسى، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ أَعْرَابِيًّا أَتَى النَّبِيَّ ﷺ، فَقَالَ: يا رسولَ اللهِ! الرَّجُلُ يُقَاتِلُ لِلْمَغْنَمِ، وَالرَّجُلُ يُقَاتِلُ لِيُذْكَرَ، وَالرَّجُلُ يُقَاتِلُ لِيُرَى مَكانُهُ؟ وفي روايةٍ: يُقَاتِلُ

1344. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం ఒక పల్లెవాసి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ఇలా అడిగాడు: "దైవప్రవక్తా! ఒక వ్యక్తి యుద్ధంలో లభించే ధనరాశుల కోసం యుద్ధం చేస్తాడు. మరో వ్యక్తి పేరు ప్రఖ్యాతుల

شَجَاعَةً، وَيُقَاتِلُ حَمِيَّةً. وفي روايةٍ: وَيُقَاتِلُ غَضَباً، فَمَنْ فِي سَبِيلِ اللهِ؟ فَقَالَ رسولُ اللهِ ﷺ: «مَنْ قَاتَلَ لِتَكُونَ كَلِمَةُ اللهِ هِيَ العُلْيَا، فَهُوَ فِي سَبِيلِ اللهِ» متفقٌ عليهِ.

కోసం యుద్ధం చేస్తాడు. ఇంకో వ్యక్తి తన గొప్పదనం చాటుకోవటానికి యుద్ధం చేస్తాడు. (వేరొక ఉల్లేఖనం ప్రకారం) ఒకతను తన ధైర్యసాహసాలు ప్రదర్శించటం కోసం యుద్ధం చేస్తున్నాడు. మరొకతను జాత్యహంకారంతో యుద్ధం చేస్తున్నాడు. (ఇంకొక ఉల్లేఖనం ప్రకారం) ఒకతను (తన సొంత విషయమై) కోపోద్రేకాలతో యుద్ధం చేస్తున్నాడు. వీరందరిలో దైవమార్గంలో పోరాడుతున్నదెవరు?"

దానికి సమాధానమిస్తూ దైవప్రవక్త (సల్లం) "ఎవరయితే దైవ వచన ఔన్నత్యం కోసం పోరాడుతున్నారో వాస్తవానికి వారే దైవమార్గంలో పోరాడు తున్నవారు" అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ప్రాపంచిక ఉద్దేశ్యాల కోసం యుద్ధం చేసేవారు ధర్మయోధులు కారనీ, దైవధర్మ ఔన్నత్యం కోసం, దైవప్రసన్నతను బడయటం కోసం యుద్ధం చేసేవారే నిజమైన ధర్మయోధులని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

١٣٤٥ ـ وعنْ عبدِ اللهِ بنِ عَمرِو بنِ العاصِ، رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: قالَ رسُولُ اللهِ ﷺ: «مَا مِنْ غَازِيَةٍ، أَوْ سَرِيَّةٍ تَغْزُو، فَتَغْنَمُ وَتَسْلَمُ، إلَّا كانُوا قَدْ تَعَجَّلُوا ثُلُثَي أُجُورِهِم، وَمَا مِنْ غَازِيَةٍ أَوْ سَرِيَّةٍ تُخْفِقُ وَتُصَابُ إلَّا تَمَّ أُجُورُهُمْ». رواهُ مسلمٌ.

1345. అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఏదయినా సైనిక సమూహంగాని లేక సైనిక పటాలంగాని జిహాద్ చేసి (దైవమార్గంలో పోరాడి) విజయప్రాప్తితో సహా నిక్షేపంగా తిరిగొస్తే అలాంటి

యోధులు ప్రపంచంలోనే మూడింట రెండొంతుల పుణ్యాన్ని పొందినట్లే. అదే ఏదయినా సైనిక సమూహంగాని లేక సైనిక పటాలంగాని దైవమార్గంలో యుద్ధంచేసి యుద్ధప్రాప్తిని పొంద కుండా అమరగతి నొందితే లేక క్షతగాత్రులైతే అలాంటి వారికి పూర్తి పుణ్యం లభిస్తుంది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

దైవమార్గంలో యుద్ధం చేయటానికి వెళ్ళి విజయ ప్రాప్తితో సహా నిక్షేపంగా ఇండ్లకు తిరిగొచ్చే ధర్మయోధులకు, విజయప్రాప్తిని పొందకుండా యుద్ధంలో అమరగతినొందే లేదా క్షతగాత్రులయ్యే యోధులకన్నా తక్కువ పుణ్యం లభిస్తుంది. బహుశా అందుకేనేమో దైవప్రవక్త సహచరులు కొంతమంది "మాలో కొంతమంది ఇహలోకంలో తమ సత్కర్మలకు ఎలాంటి ప్రతిఫలం పొందకుండానే దేవుని సన్నిధికి వెళ్ళిపోయారు. మరికొందరి కాయలు పండినవి. ఇప్పుడు వారు వాటిని ఏరుకుంటున్నారు" అని తరచూ అంటుండేవారు.

١٣٤٦ ـ وعنْ أَبي أُمَامَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَجُلاً قالَ: يا رسولَ الله! ائْذَنْ لِي فِي السِّيَاحَةِ فَقالَ النَّبيُّ ﷺ: «إنَّ سِيَاحَةَ أُمَّتِي الجِهادُ في سَبيلِ الله، عَزَّ وجلَّ» رواهُ أَبو داود بإسنادٍ جيِّدٍ.

1346. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! నేను (ప్రాపంచిక సుఖసంతోషాలన్నిటినీ వదలి) దూరంగా ఎక్కడి కయినా వెళ్ళి పోవాలనుకుంటున్నాను. అందుకుగాను నాకు అనుమతిని ప్రసాదించండి" అని అడిగాడు. దైవప్రవక్త (సల్లం) అతనికి అనుమతి నివ్వటానికి నిరాకరిస్తూ, "నా అనుచర సమాజంలోని వారు ఆ విధంగా (ప్రాపంచిక సుఖాలకు) దూరంగా వెళ్ళదలచు

కుంటే దైవమార్గంలో యుద్ధానికి వెళ్ళాలి" అని అన్నారు. (అబూదావూద్ దీనిని మంచి ఆధారాలతో సేకరించారు.)

*(అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'సియాహత్' అనే పదం ఉపయోగించబడింది. సియాహత్ అంటే భూమ్మీద తిరగటం, పర్యటించటం, ఎక్కడికయినా ప్రయాణించటం అని అర్థం. ఈ హదీసులో పృచ్ఛకుడు దైవప్రవక్త (సల్లం)ను తనకు సియాహత్ చేసేందుకు అనుమతినివ్వమని కోరాడు. అయితే అతని ఉద్దేశ్యం భూమ్మీద పర్యటించటం కాదు. ప్రాపంచిక సుఖాలకు, సాంఘిక జీవనానికి, జనవాసాలకు దూరంగా ఏ కొండల్లోనో, అడవుల్లోనో బ్రతుకుదామన్నదే అతని ఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యంతోనే అతను దైవప్రవక్త (సల్లం)ను దానికోసం అనుమతి ఇవ్వమని అడిగాడు. కాని దైవప్రవక్త (సల్లం) ఆ విషయంలో అనుమతినివ్వటానికి నిరాకరించారు. మనిషి ప్రాపంచిక సుఖాలకు దూరంగా ఉండాలని నిశ్చయించుకుంటే జిహాద్‌లో పాల్గొనాలని చెప్పారు. జిహాద్‌లో అనుక్షణం అతన్ని చావు వెంటాడుతూ ఉంటుంది. ఆ సమయంలో అతను ప్రాపంచిక సుఖాలన్నీ మరచిపోతాడు. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే ఇక్కడ సియాహత్ అంటే జిహాద్‌లో పాల్గొనటమని అర్థం. అందుకే ఇమామ్ అబూదావూద్‌గారు ఈ హదీసుని జిహాద్ ప్రకరణంలో పొందుపరచారు. ఈ హదీసు ఆధారాల్లోని ఖాసిమ్ అనే ఉల్లేఖకుని విశ్వసనీయతపై చాలామంది హదీసువేత్తలు విభిన్న అభిప్రాయాలు వ్యక్తపరిచారు.

1347. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: జిహాద్ నుంచి తిరిగి రావటం కూడా జిహాద్ చేయటంతో సమానమే. (అబూదావూద్ దీనిని మంచి ఆధారాలతో సేకరించారు.)

١٣٤٧ ـ وعَنْ عبدِ اللهِ بنِ عَمْرِو بنِ العاص رَضيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبيِّ ﷺ قَالَ: «قَفْلَةٌ كغَزْوَةٍ». رواهُ أبو داود بإسنادٍ جيدٍ. «القَفْلَةُ»: الرُّجُوعُ، والمراد: الرُّجُوعُ مِنَ الغزوِ بَعْدَ فَرَاغِهِ؛ ومعناه: أنه يُثابُ في رُجُوعِهِ بعدَ فَرَاغِهِ مِنَ الغَزْوِ.

జిహాద్ ముగిసిన తర్వాత ఇంటికి తిరిగి వెళ్ళినప్పుడు కూడా యోధునికి పుణ్యం లభిస్తుందని ఈ హదీసు భావం.

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

యోధుడు జిహాద్ నుండి తిరిగొచ్చిన తర్వాత కూడా ఎన్నో రకాల విధులు నిర్వర్తిస్తూ ఉంటాడు. భార్యాపిల్లల హక్కుల్ని నెరవేరుస్తాడు. వీటన్నిటితోపాటు తిరిగి జిహాద్‌లో పాల్గొనే అవకాశం కోసం ఎదురు చూస్తూ, దానికోసం సర్వసన్నద్ధుడై ఉంటాడు. ఆ విధంగా యోధుడు ఇంట్లో ఉన్నప్పటికీ సంకల్పం రీత్యా అతను యుద్ధమైదానంలోనే ఉంటాడు. కనుక అతను జిహాద్ నుండి ఇంటికి తిరిగొచ్చినప్పుడు కూడా అతనికి జిహాద్ చేసినంత పుణ్యం లభిస్తుంది.

١٣٤٨ ـ وعَنِ السَّائِبِ بنِ يزيدَ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: لمَّا قدِمَ النَّبيُّ ﷺ، مِنْ غَـزوَةِ تَبـوكَ تَلَقَّـاهُ النَّـاسُ، فَتلَقَّيْتُـهُ مـعَ الصِّبيانِ على ثَنِيَّةِ الوَدَاعِ. رواه أبو داودَ بـإسنـادٍ صَحيـحٍ بهـذا اللفـظ، ورَوَاهُ البخاريُّ قالَ: ذَهَبْنَا نَتَلَقَّى رسولَ اللهِ ﷺ، مَعَ الصِّبْيَانِ إلى ثَنِيَّةِ الوَدَاعِ.

1348. హజ్రత్ సాయిబ్ బిన్ యజీద్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తబూక్ యుద్ధం నుండి తిరిగొచ్చినప్పుడు ప్రజలు ఆయన్ని కలుసుకోవటానికి వెళ్ళారు. అప్పుడు నేను కూడా పిల్లలతోపాటు వెళ్ళి దైవప్రవక్త (సల్లం)ను సనీయతుల్ వదా ప్రాంతంలో కలుసుకున్నాను.

అబూదావూద్ ఈ హదీసును ఇవే వాక్యాలతో దృఢమైన ఆధారాలతో సేకరించారు. ఇమామ్ బుఖారీ దీనిని ఈ విధంగా నకలు చేశారు: "మేము దైవప్రవక్త (సల్లం)ను కలుసుకోవటానికి పిల్లలతోపాటు సనీయతుల్ వదా ప్రాంతానికి బయలుదేరాం" అని సాయిబ్ (రజి)గారు వివరించారు

*(సహీహ్ బుఖారీలోని 'ఖైసర్, కిస్రా చక్రవర్తులకు దైవప్రవక్త తరఫు నుండి తొలి లేఖ" ప్రకరణం- సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

యుద్ధం నుండి లేక సుదూర ప్రయాణాల నుంచి తిరిగొచ్చే యోధుల్ని, నాయకుల్ని కలుసుకోవటానికి వెళ్ళటం, వారిని స్వాగతించటం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అయితే ఈ స్వాగతంలో ఎలాంటి ఆడంబరంగాని, దుబారా ఖర్చుగాని

ఉండకూడదు. ఈ రోజుల్లో పెద్దవాళ్ళను ఎవరినయినా స్వాగతించాలంటే దానిగురించి ముందుగా ప్రజల్లో బాగా ప్రచారం చేస్తారు. నగరాలను రకరకాలుగా అలంకరించి, దీపాలతో తీర్చిదిద్దుతారు. వారు వచ్చే సమయంలో బాణాసంచా కాల్చటం, గాల్లో ఫైరింగ్ చేయటం లాంటివి ఎన్నో దుబారా ఖర్చుతో కూడిన పనులు చేస్తుంటారు. అలాంటి స్వాగత వేడుకల పేరుతో ప్రజాధనాన్ని నిర్దాక్షిణ్యంగా నీళ్ళలా ఖర్చుపెడతారు. షరీఅత్ ఇలాంటి దుబారా ఖర్చుతో కూడుకున్న వేడుకల్ని అనుమతించదు. దేశ ప్రయోజనాల దృష్ట్యా కూడా ఇలాంటి వేడుకలు ప్రయోజనకరమైనవి కావు. అలాంటప్పుడు ప్రజాధనాన్ని అనవసరమైన చోట్ల వృధా ఖర్చుపెట్టటం కన్నా దేశానికి, ప్రజలకు ఉపయోగకరమైన చోట్ల ఖర్చు పెట్టాలి.

١٣٤٩ ـ وَعَنْ أبي أُمَامَةَ، رَضِيَ اللهُ عَنْهُ عَن النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ لم يَغْزُ، أَوْ يُجَهِّزْ غَازِياً، أَوْ يَخْلُفْ غَازِياً في أَهْلِهِ بِخَيْرٍ، أَصَابَهُ اللهُ بِقَارِعَةٍ قَبْلَ يَوْمِ القِيَامَةِ». رواهُ أبو داودَ بإسنادٍ صحيحٍ.

1349. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవమార్గంలో యుద్ధం చేయకుండా లేదా యుద్ధం చేసేవారికి యుద్ధసామగ్రి నందించి వారిని సమాయత్తపరచకుండా లేదా కనీసం యోధుడు యుద్ధానికి వెళ్ళిన తర్వాత అతని ఇంటివారి బాగోగుల్ని పట్టించుకోకుండా ఉండేవారిని దేవుడు ప్రళయానికి ముందు ఏదో ఒక పెద్ద అపదకు గురిచేస్తాడు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో సేకరించారు.)

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

జిహాద్‌లో పాల్గొనకపోవటం, ధర్మయోధులకు యుద్ధసామగ్రి సరఫరా చేసి వారికి సహాయమందించకపోవటం లేదా కనీసం వారి కుటుంబ వ్యవహారాలను కూడా పట్టించుకోకపోవటం ఎంత పెద్ద నేరాలంటే అలాంటి నేరస్తుల్ని దేవుడు ప్రపంచంలోనే శిక్షిస్తాడు. కనుక ముహమ్మదీయ అనుచర సమాజం ఈ గురుతర బాధ్యతను గుర్తెరగాలి. జిహాద్ విధి పట్ల, దాని అవసరాల పట్ల ఏమాత్రం నిర్లక్ష్యం వహించకుండా జాగరూకులై ఉండాలి. లేకపోతే

పరలోకంలో భయంకరమైన నరకశిక్ష ఎలాగూ ఉంది. దాంతోపాటు ప్రపంచంలో కూడా విపరీతమైన కష్టాలకు గురికావలసి వస్తుంది.

١٣٥٠ ـ وعَنْ أنسٍ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «جَاهِدُوا المُشرِكِينَ بِأَمْوَالِكُمْ وَأَنْفُسِكم وَأَلْسِنَتِكُم» رواهُ أبو داود بإسنادٍ صحيحٍ.

1350. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు మీ ధనప్రాణాలను ధారబోసి, ఇంకా మీ మాటల సాయంతో బహుదైవారాధకులతో జిహాద్ చేయండి. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో సేకరించారు.)

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో జిహాద్ మూడు రకాలుగా చేయవచ్చని చెప్పబడింది. ధన సాయంతో, ప్రాణసాయంతో, మాటల సాయంతో - ప్రాణాలు ధారబోసి జిహాద్ చేయవలసి వస్తే అప్పుడు ప్రాణాలకు తెగించి పోరాడాలి. దైవమార్గంలో ధనం అవసరమైతే అప్పుడు తమ ధనాన్ని దైవమార్గంలో ఖర్చుపెట్టాలి. ఇదీ జిహాదే అవుతుంది. ఆఖరికి ఉపద్రవభరిత కాలంలో సత్యాన్ని చాటిచెప్పటం కూడా జిహాద్‌గానే పరిగణించబడుతుంది. దైవమార్గంలో ఎప్పుడు ఏ అవసరం ఏర్పడుతుందో దానికోసం తమ సర్వశక్తులూ ఒడ్డి పోరాడటమే జిహాద్.

١٣٥١ ـ وعَنْ أبي عَمْرٍو ـ ويقالُ: أبو حَكِيمٍ ـ النُّعْمَانِ بنِ مُقَرِّنٍ رَضِيَ اللهُ عَنْهُ قالَ: شَهِدْتُ رَسُولَ اللهِ ﷺ، إذا لَمْ يُقَاتِلْ مِنْ أَوَّلِ النَّهارِ أَخَّرَ القِتالَ حَتَّى تَزُولَ الشَّمْسُ وَتَهُبَّ الرِّيَاحُ، ويَنزِلَ النَّصْرُ. رواه أبو داود، والترمذي، وقالَ: حديثٌ حَسَنٌ صحيحٌ.

1351. హజ్రత్ అబూ అమ్ర్ కొంత మంది అభిప్రాయం ప్రకారం అబూ హకీమ్ నూమాన్ బిన్ ముఖర్రిన్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) వెంట (అనేక యుద్ధాల్లో) పాల్గొన్నాను. (యుద్ధాల్లో ఆయన ఆనవాయితీ ఏమిటంటే) పగలు తొలి వేళప్పుడు యుద్ధం మొదలుపెట్టలేకపోతే ఆ తర్వాత ఆయన యుద్ధాన్ని వాయిదా వేసేవారు. సూర్యుడు నెత్తి నుండి క్రిందికి వాలి, గాలులు వీస్తూ, (దైవ)

సహాయం అవతరించే వరకు ఆయన అలాగే వేచి ఉండేవారు.

(అబూదావూద్, తిర్మిజీ-హసన్, సహీహ్)

(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని యుద్ధాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో యుద్ధం ఆరంభించటానికి రెండు వేళలు సూచించబడ్డాయి. యుద్ధం మొదలుపెట్టాలనుకుంటే ప్రొద్దున్నే మొదలుపెట్టాలి. లేదా సూర్యుడు నెత్తి నుండి వాలి కాస్త చల్లబడిన తర్వాత మొదలెట్టాలి. సాధారణంగా ప్రొద్దున పూట విశ్వాసులు హుషారుగానూ అవిశ్వాసులు నిద్రమత్తులోనూ ఉంటారు. అంచేత ఆ సమయం విశ్వాసులకు అనుకూలంగా ఉంటుంది. పోతే సూర్యుడు నెత్తి నుండి వాలిన తర్వాత ఎండ తీవ్రత అంత ఎక్కువగా ఉండదు. ఆ సమయంలో బయట తిరగటం, పనిచేయటం సులభంగా ఉంటుంది. అదీగాక ఆ సమయంలో దైవసహాయం కూడా అవతరిస్తుంటుంది. అంచేత ఆ రెండు వేళలు యుద్ధం చేయటానికి అత్యంత అనుకూలమైనవి.

١٣٥٢ ـ وعنْ أبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عنهُ قالَ: قالَ رَسولُ اللهِ ﷺ: «لَا تَتَمَنَّوْا لِقَاءَ العَدُوِّ، وَٱسْأَلُوا اللهَ العَافِيَةَ، فإذا لَقِيتُمُوهُم، فَاصبِرُوا» متفقٌ عليه.

1352. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : శత్రువుతో పోరాడాల్సిన పరిస్థితి ఆసన్నమవ్వాలని కోరుకోకండి. నిత్యం క్షేమాన్ని కోరుకుంటూ ఉండండి. ఒకవేళ శత్రువులు ఎదురుపడితే మాత్రం స్థయిర్యాన్ని ప్రదర్శించండి. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)

١٣٥٣ ـ وعَنْهُ وعَنْ جابِرٍ، رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ النبيَّ ﷺ، قالَ: «الحَرْبُ خَدْعَةٌ» متفقٌ عليه.

1353. హజ్రత్ అబూహురైరా మరియు జాబిర్ (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: యుద్ధం ఒక ఎత్తుగడ (యుద్ధమంటే మోసం, ఎత్తుగడలే).(బుఖారీ, ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జిహాద్ ప్రకరణాలు)

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'ఖద్అతున్' అనే పదం ఉపయోగించబడింది. 'ఖద్అతున్' అంటే మన లక్ష్యాల విషయంలో శత్రువుని సందిగ్ధతకు లోనుచేసి అతణ్ణి ఏమార్చేందుకు వేసే ఎత్తుగడ అని అర్థం. ఇస్లాంలో ఇలా చేయటం సమ్మతమే. కొన్నిసార్లు యుద్ధంలో ఎత్తుగడలు వేయనిదే శత్రువుని ఓడించటం కష్టమైపోతుంది. అదీగాక ఇస్లాం సర్వత్రా వ్యాపించి లోకంలో శాంతిసుఖాలు వెల్లివిరియాలంటే దైవవిరోధుల్ని ఒడించటం కూడా అవసరమే. వీటన్నిటి దృష్ట్యా యుద్ధంలో మోసాలు, ఎత్తుగడలు సమ్మతించబడ్డాయి. అయితే శత్రువులతో కుదిరిన ఒప్పందాలను ఉల్లంఘిస్తూ ఎత్తుగడలు వేయటం, రక్షణ ఇచ్చిన తర్వాత మోసపుచ్చి హతమార్చటం లాంటి చేష్టలు మాత్రం నిషిద్ధం. ఇస్లాం ధర్మం వాటిని ఎన్నటికీ సమ్మతించదు.



## 235వ అధ్యాయం

## ٢٣٥ ـ بَابُ بيَانِ جَمَاعَةٍ مِنَ الشُّهَدَاءِ فِي ثَوَابِ الآخِرَةِ وَيُغَسَّلُونَ وَيُصَلَّى عَلَيْهِمْ بِخِلاَفِ الْقَتِيلِ فِي حَرْبِ الْكُفَّارِ

**పరలోకంలో లభించే పుణ్యం రీత్యా అమరగతులుగా పేర్కొనబడేవారి భౌతిక కాయాలకు, గుస్ల్ (స్నానం) చేయించి వారి జనాజా నమాజు కూడా చేయటం జరుగుతుంది. వీరికి భిన్నంగా అవిశ్వాసులతో యుద్ధం చేస్తూ అమరగతి నొందినవారి భౌతిక కాయాలకు స్నానం చేయించనవసరం లేదు. జనాజా నమాజు కూడా చేయనవసరం లేదు.**

١٣٥٤ ـ عنْ أبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «الشُّهَدَاءُ خَمسَةٌ: المطْعُونُ والمَبْطُونُ، وَالغَرِيقُ، وَصاحِبُ الهَدْمِ، وَالشَّهِيدُ في سَبيلِ اللهِ» متفقٌ عليهِ.

1354. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: (పరలోకంలో పొందే పుణ్యం రీత్యా) అమరగతులు (షహీదులు)గా భావింపబడేవారు ఐదుగురు. 1) ప్లేగు వ్యాధితో చనిపోయినవాడు. 2) ఉదరవ్యాధితో చనిపోయిన వాడు. 3) (నీటిలో) మునిగి చనిపోయేవాడు. 4) బరువు క్రింద నలిగి చనిపోయినవాడు. 5) దైవమార్గంలో పోరాడుతూ ప్రాణాలు కోల్పోయినవాడు. (బుఖారీ-ముస్లిం)

### ముఖ్యాంశాలు

అమరగతుణ్ణి అరబీ భాషలో 'షహీద్' అని అంటారు. షహీద్ అనే పదానికి ధాతువు 'షహాదత్' (సాక్ష్యం) అయినా కావచ్చు లేదా 'షుహూద్' (హాజరవటం) అయినా కావచ్చు.

సాక్ష్యం అనే అర్థంలో తీసుకుంటే దైవమార్గంలో అమరగతినొందేవానికి స్వర్గం లభిస్తుందని స్వయంగా దేవుడు మరియు దైవప్రవక్తలే సాక్ష్యం చెప్పారు. కనుక అతన్ని 'షహీద్' అని అనటం జరిగింది. ఒకవేళ 'హాజరుకావటం' అనే అర్థంలో తీసుకుంటే దైవమార్గంలో అమరగతినొందేవాని వద్దకు కారుణ్యదూతలు హాజరవుతారనీ లేదా తనే స్వయంగా యుద్ధభూమికి హాజరై దైవసన్నిధిలో ప్రాణార్పణం చేస్తాడు కనుక అతణ్ణి 'షహీద్' అని పిలవటం జరుగుతుందని అర్థం చేసుకోవాలి.

ప్లేగువ్యాధితో చనిపోయినవారు, ఉదరవ్యాధితో చనిపోయినవారు, నీళ్లలో మునిగి చనిపోయినవారు, బరువు క్రింద పడి నలిగి చనిపోయినవారు- ఈ నాలుగు రకాలవారు వాస్తవానికి అమరగతులు (షహీదులు) కాకపోయినా దేవుడు ప్రత్యేక కరుణాకటాక్షాలతో వారిని అమరగతుల స్థాయికి చేర్చి వారికి కూడా అంతటి పుణ్యాన్ని ప్రసాదిస్తాడు. ఇతర హదీసుల ద్వారా అమరగతుల జాబితాలోకి వచ్చేవారు మరికొందరున్నారని తెలుస్తున్నది. వివిధ హదీసుల్లో ఈ అమరగతుల రకాల సంఖ్య వేర్వేరుగా ఉండటం వల్ల పైకి ఈ హదీసులు పరస్పర విరుద్ధంగా ఉన్నట్లు కన్పిస్తాయి. వాస్తవానికి వాటి మధ్య ఎలాంటి వైరుధ్యం లేదు. ముందుగా దైవప్రవక్త (సల్లం) కు వహీ ద్వారా ఐదు రకాల అమరగతుల గురించి తెలుపబడింది. వాటిని ఆయన తన సహచరులకు బోధించారు. ఆ తర్వాత దేవుడు ఆ జాబితాలో మరికొందరిని చేర్చాడు. దైవప్రవక్త (సల్లం) వాటిని కూడా తన సహచరులకు వివరించారు. ఈ అమరగతుల్లో దైవమార్గంలో పోరాడుతూ వధింపబడినవాడు సిసలైన అమరగతుడు (షహీద్) కనుక అతనికి ఇతరుల మీద స్పష్టమైన ఆధిక్యత ఉంటుంది.

١٣٥٥ ـ وعنـهُ قـالَ: قـالَ رسـولُ اللهِ ﷺ: «مـا تَعُـدُّونَ الشُّهَـدَاءَ فِيكُم؟» قالُوا: يا رَسُولَ اللهِ! مَنْ قُتِلَ في سَبِيلِ اللهِ، فَهُوَ شهيدٌ. قال: «إنَّ شُهَدَاءَ أُمَّتي إذاً لَقَلِيلٌ!» قالُوا: فَمَنْ يا رَسُولَ اللهِ؟ قالَ: «مَنْ قُتِلَ في سَبيلِ اللهِ فَهُوَ شَهيدٌ، وَمَنْ مَاتَ في سَبيلِ اللهِ فَهُوَ شَهيدٌ، وَمَنْ مَاتَ في الطَّاعُونِ فَهُوَ شَهيدٌ، وَمَنْ مَاتَ في البَطْنِ فَهُوَ شَهيدٌ، وَالغَرِيقُ شَهيدٌ» رواهُ مُسْلِمٌ.

1355. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఓ రోజు దైవప్రవక్త (సల్లం) తన సహచరుల్ని ఉద్దేశించి, "మీరు మీలో ఎవరెవరిని అమరగతులుగా పరిగణిస్తున్నారు" అని అడిగారు. "దైవప్రవక్తా! (మా అభిప్రాయంలో) దైవమార్గంలో పోరాడుతూ వధింపబడినవాడే అమరగతుడు" అని బదులిచ్చారు సహచరులు. అది విని దైవప్రవక్త (సల్లం) "ఆ విధంగా చూస్తే నా అనుచర సమాజంలో అమరగతులు చాలా తక్కువ మంది ఉంటారు" అని అన్నారు. అందుకు సహచరులు,

"దైవప్రవక్తా! మరయితే అమరగతులు ఎవర్ని అంటారు?" అని అడిగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా వివరించారు:

"దైవమార్గంలో పోరాడుతూ వధింపబడినవారు అమరగతులు. దైవ మార్గంలో సహజమరణం పొందిన వారూ అమరగతులే. ప్లేగువ్యాధితో చనిపోయినవారు కూడా అమరగతులే. అలాగే ఉదరవ్యాధితో చనిపోయిన వారు, నీళ్ళలో మునిగి ప్రాణాలు కోల్పోయినవారూ అమరగతులే."

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవమార్గంలో సహజ మరణం పొందినవారంటే యుద్ధభూమిలో కత్తిపోట్లకో లేక ఖడ్గపు వేట్లకో లేక తుపాకీ గుండ్ల దెబ్బకో చనిపోకుండా వేరితర కారణాలతో చనిపోవటం అని అర్థం. ఉదా: జిహాద్‌కు వెళ్తూ మార్గమధ్యంలో గుర్రం లేక వేరితర వాహనంపై నుంచి క్రిందపడి ప్రాణాలు కోల్పోవటం లేక గుండెపోటు మొదలగు వ్యాధుల వల్ల మరణించటం.

1356. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తన ధనాన్ని కాపాడుకునే ప్రయత్నంలో ఇతరుల చేత వధించబడిన వాడు అమరగతునిగా పరిగణించబడతాడు. (బుఖారీ- ముస్లిం)

١٣٥٦ ـ وعنْ عبدِ اللهِ بنِ عَمْرِو بنِ العاصِ، رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ قُتِلَ دُونَ مالِهِ، فَهُوَ شَهِيدٌ» متفقٌ عليهِ.

*(సహీహ్ బుఖారీలోని దౌర్జన్యాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

١٣٥٧ - وعَنْ أبي الأَعْوَرِ سَعِيدِ بنِ زَيْدِ بنِ عمرِو بنِ نُفَيلٍ، أَحَدِ العَشَرَةِ المَشْهُودِ لهُمْ بالجَنَّةِ، رَضِيَ اللهُ عَنْهُمْ، قالَ: سَمِعْتُ رسُولَ اللهِ ﷺ، يقولُ: «مَنْ قُتِلَ دُونَ مالِهِ فَهُوَ شَهيدٌ، وَمَنْ قُتِلَ دُونَ دَمِهِ فَهُوَ شَهيدٌ، وَمَنْ قُتِلَ دُونَ دِينِهِ فَهُوَ شَهيدٌ، وَمَنْ قُتِلَ دُونَ أَهْلِهِ فَهُوَ شَهيدٌ». رواهُ أبو داوُدَ، والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

1357. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబుల్ ఆవర్ సయీద్ బిన్ జైద్ బిన్ అమ్ర్ బిన్ నుఫైల్ తెలియజేశారు: తమకు స్వర్గం లభిస్తుందని ఇహ లోకంలోనే శుభవార్త పొందిన పది మందిలో ఈయన కూడా ఒకరు:

"తన ధనాన్ని కాపాడుకునే ప్రయత్నంలో ఇతరులచేత వధింపబడిన వాడు అమరగతుడౌతాడు. ఆత్మరక్షణ కోసం పోరాడుతూ వధింప బడినవాడూ అమరగతు డౌతాడు. తన ధర్మాన్ని కాపాడుకునే ప్రయత్నంలో వధింప బడినవాడు కూడా అమర గతుడౌతాడు. తన ఇంటివారిని రక్షించే ప్రయత్నంలో వధింపబడినవాడూ అమర గతునిగా పరిగణించబడ తాడు." (అబూ దావూద్, తిర్మిజీ- హసన్; సహీహ్)

(సుననె అబూదావూద్‌లోని సున్నహ్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని రక్తపరిహారాల అధ్యాయం)

## ముఖ్యాంశాలు

ఇహలోకంలోనే స్వర్గసుఖాల శుభవార్తను పొందిన పదిమంది దైవప్రవక్త సహచరుల పేర్లు ఇవి: 1) అబూబక్ర్ సిద్దీఖ్ 2) ఉమర్ బిన్ ఖత్తాబ్ 3) ఉస్మాన్ బిన్ అప్ఫాన్ 4) అలీ బిన్ అబూతాలిబ్ 5) తల్హా బిన్ ఉబైదుల్లాహ్ 6) జుబైర్ బిన్ అవ్వామ్ 7) అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ 8) సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ 9) అబూ ఉబైదా బిన్ జర్రాహ్ 10) ఈ హదీసు ఉల్లేఖకులైన సయీద్ బిన్ జైద్ (రజి). దైవప్రవక్త (సల్లం) మరికొంత మందికి కూడా స్వర్గశుభవార్తను తెలియజేశారు. అయితే ఈ పదిమందినే 'అషరయె ముబష్షరహ్' (స్వర్గశుభవార్త పొందిన పదిమంది)గా ఎందుకు చెబుతారంటే వీరందరికీ ఒకే సందర్భంలో ఒకే హదీసులోనే దైవప్రవక్త (సల్లం) స్వర్గశుభవార్త వినిపించారు (సుననె తిర్మిజీ).

١٣٥٨ ـ وعن أبي هُريرةَ، رَضِيَ اللهُ عَنهُ، قالَ: جَاءَ رَجُلٌ إلى رسولِ اللهِ ﷺ، فَقَالَ: يا رسولَ اللهِ أَرَأَيتَ إنْ جَاءَ رَجُلٌ يُرِيدُ أَخذَ مَالي؟ قالَ: «فَلا تُعطِهِ مَالَكَ» قال: أَرَأَيتَ إنْ قَاتَلَني؟ قال: «قَاتِلْهُ» قالَ: أَرَأَيتَ إنْ قَتَلَني؟ قالَ: «فَأَنتَ شَهِيدٌ» قالَ: أَرَأَيتَ إنْ قَتَلْتُهُ؟ قال: «هُوَ في النَّارِ» رواهُ مسلمٌ.

1358. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి "దైవప్రవక్తా! ఎవరయినా బలవంతంగా నా సొమ్ము తీసుకోవటానికి వస్తే ఏం చెయ్యాలి?" అని అడిగాడు. "నీ సొమ్ము అతనికి ఇవ్వకు" అని బదులిచ్చారు దైవప్రవక్త (సల్లం). "ఒకవేళ అతను నాతో తలపడితేనో?" అని అడిగాడా వ్యక్తి. "నువ్వు కూడా అతనితో తలపడు" చెప్పారాయన. "ఆ పోరులో అతను నన్ను హతమారుస్తే?" అడిగాడా వ్యక్తి. "నువ్వు అమర గతునిగా పరిగణించ బడతావు" చెప్పారాయన. "ఒకవేళ నేనే అతన్ని హత మారిస్తే?" మళ్ళీ అడిగాడా వ్యక్తి. అందుకాయన సమాధానమిస్తూ "(నీకేం ఫర్వాలేదు) అతనే నరకానికి వెళ్తాడు" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఆత్మరక్షణ కోసం, తమ ధనాన్ని రక్షించుకోవటం కోసం దోపిడీ దొంగలతో పోరాడి తప్పని పరిస్థితుల్లో వారిని హతమార్చితే అందులో తప్పులేదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఆ విధంగా ఆత్మరక్షణ కోసం ఇతరుల్ని చంపినవారు నేరస్థులుగా కూడా పరిగణించబడరు. వారికి ఎలాంటి పాపం ఉండబోదు. పైగా హతులే నరకానికి వెళ్తారు. ఒకవేళ ఆత్మరక్షణ పోరాటంలో తనే మృత్యువాత పడితే అతను అమరగతుని (షహీద్)గా పరిగణించబడతాడు. అయితే ఇలాంటివారు సిసలైన అమరగతులు కారు. దేవుడు పరలోకంలో వీరికి ప్రత్యేక అనుగ్రహంతో అమరగతుల స్థాయిని ప్రసాదిస్తాడు. అంతే! కనుక సాధారణ మృతులకు చేసినట్లుగానే వీరికి కూడా శవస్నానం చేయించి జనాజా నమాజు చేయాల్సిందే. వీరికి భిన్నంగా యుద్ధభూమిలో అవిశ్వాసులతో పోరాడుతూ వధింపబడిన అమరవీరులకు మాత్రం శవస్నానంగాని, జనాజా నమాజ్‌గాని చేయాల్సిన అవసరంలేదు.

236వ అధ్యాయం

# ٢٣٦ - باب فضل العتق

# బానిస విమోచన విశిష్టత

قال الله تعالى: ﴿فَلَا اقْتَحَمَ الْعَقَبَةَ ۝ وَمَا أَدْرَاكَ مَا الْعَقَبَةُ ۝ فَكُّ رَقَبَةٍ﴾ [البلد: ١١ - ١٣].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : కాని అతడు కష్టతరమైన కనుమ దాటిపోవటానికి ఇష్టపడలేదు. కష్టతరమైన ఆ కనుమ అంటే ఏమిటో మీకు తెలుసా? మెడల్ని విడిపించటం. *(అల్ బలద్: 11-13)*

## ముఖ్యాంశాలు

పై సూక్తిలో మెడల్ని విడిపించటమంటే బానిసలకు విముక్తి నొసగటం, వారిని బానిసత్వపు సంకెళ్ళ నుంచి విడిపించటం అని అర్థం. దీన్ని కష్టతరమైన కనుమ దాటిపోవటమని ఎందుకు చెప్పబడిందంటే, ఇది ఎంతో కష్టంతో కూడుకున్న పని. దేవునిపై సంపూర్ణ విశ్వాసం, ఆయన పట్ల అమితమైన భక్తిప్రపత్తులు గలవారే బానిసల్ని విడిపించటం కోసం డబ్బు ఖర్చుపెట్టగల్గుతారు.

పూర్వకాలంలో బానిస వ్యవస్థ అమల్లో ఉండేది. ఇస్లాం ఈ అన్యాయపూరిత వ్యవస్థను నేరుగా రూపుమాపకపోయినా దీని సమూల నిర్మూలన కోసం పరోక్షంగా ఎన్నో వ్యూహాత్మకమైన చర్యలు చేపట్టింది. ఇస్లాం దీన్ని నేరుగా నిర్మూలించక పోవటానికి కారణాలు కూడా లేకపోలేదు. ఆనాడు ఇది ఓ ఆర్థిక అవసరంగా పరిగణించబడేది. అదీగాక ఆ కాలంలో యుద్ధఖైదీల మార్పిడి, పట్టుబడ్డ ఖైదీల కోసం చాలినన్ని జైళ్ళు ఉండేవి కావు. అందుకే ఆ ఖైదీలను యోధులకు పంచిపెట్టటం జరిగేది. వారు ఆ యోధుల దగ్గర బానిసలుగా ఉండేవారు. అదే సమయంలో ఇస్లాం ధర్మం యజమానులకు బానిసల పట్ల ఎలా మెలగాలో కూడా బోధించింది. వారిపట్ల అమానుషంగా ప్రవర్తించటం, వారి మీద తలకుమించిన భారం మోపటం, వారిని అవమానించటం లాంటి పాశవిక చర్యల్ని తీవ్రంగా ఖండించింది. వారిపట్ల ఉత్తమంగా మెలగాలని తాకీదు చేసింది. దానికితోడు ఎన్నో మార్గాల ద్వారా బానిసలకు స్వేచ్ఛ లభించేలా చేసి అసలు బానిస వ్యవస్థనే పూర్తిగా నిరుత్సాహపరిచింది.

١٣٥٩ - وعَنْ أبي هُريرةَ، رَضِيَ اللهُ عنهُ قَالَ: قَالَ لي رَسولُ اللهِ ﷺ: «مَنْ أَعْتَقَ رَقَبَةً مُسْلِمَةً أَعْتَقَ اللهُ بِكُلِّ عُضْوٍ مِنْهُ عُضْواً مِنْهُ مِنَ النَّارِ حتى فَرْجَهُ بِفَرْجِهِ» متفقٌ عليه.

1359. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తనకు ఈ విధంగా ఉపదేశించారు: ఎవరయినా ఒక బానిస ముస్లింను బానిసత్వ బంధనాల నుండి విడిపిస్తే

అల్లాహ్ అతని ప్రతి అవయవానికి బదులుగా ఇతని అవయవాలను నరకం నుండి కాపాడుతాడు. ఆఖరికి అతని మర్మాంగానికి బదులుగా ఇతని మర్మాంగాన్ని నరకం నుండి రక్షిస్తాడు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని పరిహారాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బానిస విమోచన ప్రకరణం)

## ముఖ్యాంశాలు

బానిసల విమోచనం కోసం ఇస్లాం ధర్మం తీసుకున్న చర్యలకు ఈ హదీసు ఒక మచ్చుతునక మాత్రమే. దైవప్రవక్త (సల్లం) కాలంలో ఇలాంటి బోధనలు ముస్లింలపై ఎంతగా ప్రభావం చూపాయంటే ఆయన సహచరులు బానిసల్ని విడిపించటంలో తమవంతు బాధ్యతను పూర్తిగా నిర్వర్తించారు. అబూబక్ర్ (రజి) ఎంతోమంది బానిసల్ని వారి యజమానులకు ధనం చెల్లించి మరీ విడిపించారు. అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) ముప్పై వేల మంది బానిసల్ని విడిపించారు. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) వెయ్యి కంటే ఎక్కువ మంది బానిసలకు స్వేచ్ఛ నిచ్చారు. కొంతమంది సహచరులైతే ఒక్కరోజులోనే ఎనిమిదివేల మంది బానిసలకు విముక్తిని కల్పించేవారని తెలుస్తోంది. (ఇబ్నె అల్లాన్, నుజ్హతుల్ ముత్తఖీన్)

1360. హజ్రత్ అబూ జర్ర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను: "కర్మల్లో శ్రేష్ఠమైనది ఏదీ?" అని. అందుకాయన, "అల్లాహ్‌ను విశ్వసించటం, దైవమార్గంలో పోరాడటం" అని చెప్పారు. నేను మళ్ళీ, "ఎలాంటి మెడలను (బానిసల్ని) విడిపించటం ఉత్తమం" అని అడిగాను. అందుకాయన "తమ యజమానుల దృష్టిలో అత్యంత శ్రేష్ఠులు, ఖరీదైన వారిని" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

١٣٦٠ - وَعَنْ أَبِي ذَرٍّ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ يَا رَسُولَ اللهِ! أَيُّ الأَعْمَالِ أَفْضَلُ؟ قَالَ: «الإِيمَانُ باللهِ، وَالجِهَادُ في سَبِيلِ اللهِ» قَالَ: قُلْتُ: أَيُّ الرِّقَابِ أَفْضَلُ قَالَ: «أَنْفَسُها عِنْدَ أَهْلِهَا، وَأَكْثَرُها ثَمَناً» مُتَّفَقٌ عليهِ.

(సహీహ్ బుఖారీలోని బానిస విమోచన ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

యజమాని దృష్టిలో ఉత్తముడు, ఉత్కృష్టుడైన బానిసకు ఎక్కువ ఖరీదు ఉండటం సహజమే. అందుకని అలాంటి బానిసల్ని కొని వారికి స్వేచ్ఛ నొసగటం ఒకింత కష్టమైన పనే. దానికారణంగానే ఇతర బానిసల కన్నా అలాంటి ఉత్తములైన బానిసల్ని కొని విడిపిస్తే దానివల్ల ఎక్కువ పుణ్యం లభిస్తుంది. దీనిద్వారా మనం ఎంత ఎక్కువ ఖరీదైన వస్తువు ఖర్చుపెడితే అంత ఎక్కువ పుణ్యం లభిస్తుందని సూత్రప్రాయంగా చెప్పవచ్చు. దీనిగురించి దివ్యఖుర్‌ఆన్ ఇలా అంటోంది:

"మీరు అత్యంత ప్రీతికరమైన వస్తువుల్ని (దైవమార్గంలో) ఖర్చుపెట్టనంతవరకు మీరు పుణ్యస్థాయిని పొందలేరు." (ఆలి ఇమ్రాన్: 92)

ప్రస్తుత కాలంలో బానిస వ్యవస్థ పూర్తిగా అంతమయి పోయింది. దీని నిర్మూలనలో ఇస్లాం ధర్మం పోషించిన పాత్ర ఎనలేనిది. బానిసలే కాకుండా సమాజంలో రుణభారం క్రింద నలిగిపోతున్నవారు, శ్రేయోభావంతో ఇతరుల బాధ్యతల్ని తమనెత్తిమీద వేసుకున్నవారు, ఖైదీలు ఇలా చాలామంది ఉంటారు. వీరికి కూడా ఆర్థిక సహాయం చేయటం, వారి బాధ్యతల భారాన్ని దించటానికి సహాయపడటం కూడా ఎంతో గొప్ప పుణ్యకార్యంగా పరిగణించ బడుతుంది.



## 237వ అధ్యాయం

## ٢٣٧ ـ بَابُ فَضْلِ الإِحْسَانِ إِلَى المَمْلُوكِ

## బానిసల పట్ల సద్వ్యవహారం

قَالَ الله تَعَالَى: ﴿ وَاعْبُدُوا اللَّهَ وَلَا تُشْرِكُوا بِهِ شَيْئًا وَبِالْوَالِدَيْنِ إِحْسَانًا وَبِذِي الْقُرْبَى وَالْيَتَامَى وَالْمَسَاكِينِ وَالْجَارِ ذِي الْقُرْبَى وَالْجَارِ الْجُنُبِ وَالصَّاحِبِ بِالْجَنْبِ وَابْنِ السَّبِيلِ وَمَا مَلَكَتْ أَيْمَانُكُمْ﴾ [النساء: ٣٦].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఎవరినీ ఆయనకు భాగస్వాములు చేయవద్దు. తల్లిదండ్రుల యెడల సద్భావంతో మెలగండి. బంధువులూ, అనాథులూ నిరుపేదల పట్ల మంచిగా వ్యవహరించండి. పొరుగున ఉన్న బంధువులు, అపరిచితులయిన పొరుగువారు, ప్రక్కనున్న మిత్రులు, బాటసారులు, మీ అధీనంలో ఉన్న దాసదాసీజనం పట్ల ఉదార బుద్ధితో వ్యవహరించండి." *(నిసా: 36)*

١٣٦١ ـ وَعَنِ المَعْرُورِ بنِ سُوَيْدٍ قَالَ: رَأَيْتُ أَبَا ذَرٍّ، رَضِيَ اللهُ عَنْهُ، وعليهِ حُلَّةٌ، وَعَلى غُلامِهِ مِثْلُهَا، فَسَأَلْتُهُ عَنْ ذلكَ، فَذَكَرَ أَنَّهُ سَابَّ رَجُلاً عَلى عَهْدِ رَسُولِ اللهِ ﷺ، فَعَيَّرَهُ بِأُمِّهِ، فَقَالَ النَّبِيُّ ﷺ: «إِنَّكَ امْرُؤٌ فِيكَ جَاهِلِيَّةٌ هُمْ

1361. హజ్రత్ మారూర్ బిన్ సువైద్ (రజి) ఇలా తెలియజేశారు: నేనొకసారి అబూ జర్ర్ (రజి)గార్ని చూశాను. ఆ సమయంలో ఆయన, ఆయన బానిస ఇద్దరూ ఒకేరకమైన దుస్తులు ధరించి ఉన్నారు. నేను (మీ బానిసకు కూడా అలాంటి బట్టలే ఎందుకు తొడిగించారని) అడిగాను. అందుకాయన సమాధానమిస్తూ ఈ విధంగా వివరించారు.

"దైవప్రవక్త (సల్లం) కాలంలో నేనో (బానిస) వ్యక్తిని తిట్టాను. అతని తల్లిని గురించి ప్రస్తావించి ఎత్తిపొడిచాను. (ఎలాగో ఈ విషయం దైవప్రవక్త

إخوانكم، وخولكم جعلهم الله تحت أيديكم، فمن كان أخوه تحت يده؛ فليطعمه مما يأكل، وليلبسه مما يلبس، ولا تكلفوهم ما يغلبهم، فإن كلفتموهم فأعينوهم». متفق عليه.

(సల్లం)కు తెలిసింది) అప్పుడాయన (నన్ను మందలిస్తూ) ఇలా అన్నారు:

"అబూ జర్ర్! నీలో ఇంకా ఆ అజ్ఞానం పోలేదయ్యా. (అసలు మీరు బానిసల్ని గురించి ఏమనుకుంటున్నారు?) వారు మీ సోదరుల్లాంటి వారు. దేవుడు వారిని మీ అధీనంలో ఉంచాడు. వారు మీకు సేవ చేస్తున్నారు. కనుక తమ అధీనంలో ఉండే సోదరులకు తాము తినేటటు వంటి తిండే పెట్టాలి. తాము తొడిగేటటువంటి బట్టలే వారికీ తొడిగించాలి. మీరు మోయలేని భారాన్ని వారిపై మోపకండి. ఒకవేళ (అవసరం వల్ల) మోపినా మీరు కూడా వారికి సహాయపడండి."

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని బానిస విమోచన ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రమాణాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తమ అధీనంలో ఉండే బానిసల పట్ల ఉత్తమంగా వ్యవహరించాలని ఈ హదీసు తాకీదు చేస్తోంది. అయితే ఆ ఉత్తమ వ్యవహారం ఎలా ఉండాలి? దానికి ప్రమాణం ఏమిటి? ఈ విషయం కూడా ఇందులో వివరించబడింది. తాము తినే మంచి ఆహారమే తమ బానిసలకూ తినిపించాలి. తాము తొడిగే దుస్తుల్లాంటి దుస్తులే వారికి కూడా ఇవ్వాలి. వారిని తమ పర్యవేక్షణలో ఉన్న సోదరులుగా భావించాలి. మొత్తానికి వారి జీవిత ప్రమాణం కూడా తమ జీవిత ప్రమాణానికి తగ్గట్టుగా ఉండేందుకు సహాయపడాలి. బానిసలు ఇస్లాం స్వీకరించిన వారయితే ధర్మం రీత్యా వారు తమ సోదరులవుతారు. లేదా కనీసం మానవత రీత్యానన్నా వారిని తమ సోదరులుగానే భావించాలి. వారూ మనుషులేననీ, తమకులాగే వారికి కూడా అవసరాలుంటాయనే విషయాన్ని మర్చిపోరాదు. అగత్యపరుల పట్ల ఎల్లప్పుడూ సానుభూతిని ప్రదర్శించాలని ఇస్లాం ధర్మం నొక్కివక్కాణిస్తోంది. దీన్ని ఆధారంగా చేసుకొని మన ఇండ్లల్లో

పనిచేసే నౌకర్లు లేదా మన దగ్గర పనిచేసే కూలీల, ఉద్యోగుల పట్ల కూడా ఉత్తమంగా వ్యవహరించటం, వారి పట్ల సానుభూతిని ప్రదర్శించటం అవసరమని చెప్పవచ్చు. అలాంటి వారి నుండి కూడా వారి శక్తికి మించిన పని తీసుకోకూడదు. వారిని తమ స్వప్రయోజనాల కోసం వాడుకోవటానికి ప్రయత్నించరాదు. వారు బానిసలు కాకపోవచ్చు. కాని వారు మరొకరికి తలొగ్గి పనిచేస్తున్నారంటే దానికి ఎన్నో కారణాలు ఉండవచ్చు. అలాంటివారిపట్ల కరకుగా, అసభ్యకరంగా ప్రవర్తించటం ఎంత మాత్రం సమంజసం కాదు.

ఈ ఉపదేశాల ద్వారా బోధపడేదేమిటంటే ఇస్లాం ధర్మం సర్వమానవ సమానత్వాన్ని కోరుతోంది. మానవుల మధ్య వర్ణ, వర్గ, ఉచ్చనీచ, నిమ్నోన్నతా భావాలను రూపుమాపి వారి మధ్య సామాజిక న్యాయ సంస్థాపనకు, సమానత్వ సౌధ నిర్మాణానికి అది ఏనాడో పునాదిరాళ్ళు వేసింది. ఈనాడు మానవుల మధ్య సంబంధాలు మెరుగుపడటంలో ఇస్లాం పోషించిన పాత్ర అద్వితీయమైనది. వర్గ వైషమ్యాలను రూపుమాపటం కోసం ఇస్లాం ధర్మం శాంతియుతమైన, మౌనవిప్లవాన్ని అనుసరించింది. అది కార్మికుల్ని కూడగట్టి, దళితుల పార్టీలు స్థాపించి పెట్టుబడిదారీ వర్గం మీద, సంపన్నుల మీద విజృంభించి అమాయకుల రక్తపాతాన్ని సృష్టించమని చెప్పదు. ఇలాంటి హింసాత్మక విధానాల వల్ల సమాజంలోని వివిధ వర్గాల మధ్య విద్వేషం, వైషమ్యాలు పెచ్చరిల్లుతాయి. రాజ్యంలో శాంతిభద్రతలు క్షీణించి ప్రజలు అశాంతి అలజడుల వాతావరణంలో జీవితం గడపాల్సివస్తుంది. దీనికి భిన్నంగా ఇస్లాం ధర్మం బానిసలు - యజమానుల మధ్య , కూలీలు - కాంట్రాక్టర్ల మధ్య సోదర, సమానత్వ భావాలను పెంపొందింపజేసింది. సమాజంలోని వర్గాలవారందరూ నిమ్నోన్నతాభావాల్ని విడనాడి పరస్పరం ప్రేమాభిమానాలతో, ఆప్యాయతానురాగాలతో జీవితం గడపాలని నొక్కి వక్కాణించింది. అదీగాక ఇస్లాంలో ఒక వ్యక్తి శీలనిర్మాణం కులం ప్రాతిపదిక మీదనో లేక ఆస్తి అంతస్తుల ప్రాతిపదిక మీదనో జరగదు. మీలో ఎవరయితే ఎక్కువగా దైవానికి భయపడతారో వారే అందరికన్నా శ్రేష్ఠులు అని ప్రకటిస్తోంది దివ్యఖుర్ఆన్. అలాంటి దైవభక్తిపరులు ధనికులయినా కావచ్చు నిరుపేదలయినా కావచ్చు.

1362. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరి దగ్గరికయినా అతని సేవకుడు అన్నం (వండి) తెస్తే (అతన్ని కూడా తమ వెంట కూర్చోబెట్టుకొని తినిపించాలి) ఒకవేళ తమవెంట కూర్చోబెట్టుకోవ టానికి వీలుకాకపోతే అతనికి ఒకటి

١٣٦٢ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إذا أَتَى أَحَدَكم خَادِمُهُ بِطَعَامِهِ، فَإنْ لم يُجلِسْهُ مَعَهُ، فَلْيُنَاوِلْهُ لُقْمَةً أَوْ لُقْمَتَيْنِ أَوْ أُكلَةً أَوْ أُكلَتَيْنِ؛ فَإنَّهُ وَلِيَ عِلاجَهُ» رواه البخاري.
«الأُكْلَةُ» بضم الهمزة: هِيَ اللُّقمَةُ.

రెండు ముద్దలయినా పెట్టాలి. అతను (వంటవార్పు) బాధ భరించి నందుకు గాను అలా చేయటం (ధర్మం).

*(బుఖారీ)*

## ముఖ్యాంశాలు

కేవలం అన్నం విషయంలోనే కాదు, ఇతర తినుబండారాలు, నిత్యావసర వస్తువుల విషయంలోనూ ఇలాగే ఉదారబుద్ధితో వ్యవహరించాలి. ఇంట్లో పనిచేసే నౌకర్లు, పనివాళ్ళతో కలిసి భోంచేస్తే చాలా మంచిది. ఒకవేళ పరిస్థితి దానికి అనుకూలంగా లేకపోతే తమ ఆహారంలోనుంచే వారికి కూడా కొంత పెట్టాలి లేదా వారికోసం మరేదయినా ఏర్పాటు చేయాలి.



**238వ అధ్యాయం**

## ٢٣٨ - بَابُ فَضْلِ الْمَمْلُوكِ الَّذِي يُؤَدِّي

## దేవుని హక్కుతోపాటు తన యజమాని హక్కుల్ని కూడా పాటించే బానిస

١٣٦٣ - عَنِ ابنِ عُمَرَ، رَضِيَ اللهُ عَنْهُما، أَنَّ رسُولَ اللهِ ﷺ قالَ: «إِنَّ العَبْدَ إذا نَصَحَ لِسَيِّدِهِ، وَأَحْسَنَ عِبَادَةَ اللهِ، فَلَهُ أَجْرُهُ مَرَّتَيْنِ» مُتَّفَقٌ عليهِ.

1363. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: బానిస గనక ఒకవైపు తన యజమాని బాగోగుల్ని పట్టించుకుంటూ మరోవైపు దైవాన్ని అత్యుత్తమ రీతిలో ఆరాధిస్తే అతనికి రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని బానిస విమోచన ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రమాణాల ప్రకరణం)

١٣٦٤ - وَعَنْ أَبي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لِلْعَبْدِ المَمْلُوكِ المُصْلِحِ أَجْرَانِ» وَالَّذِي نَفسُ أَبي هُرَيرَةَ بِيَدِهِ لَوْلَا الجِهَادُ في سَبِيلِ اللهِ، وَالحَجُّ، وَبِرُّ أُمِّي، لأَحْبَبْتُ أَنْ أَمُوتَ وَأَنَا مَمْلوكٌ. مُتَّفَقٌ عليهِ.

1364. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒకవైపు యజమాని శ్రేయాన్ని కోరుకుంటూ మరో వైపు దైవాన్ని ఆరాధించే బానిసకు రెట్టింపు పుణ్యం లభిస్తుంది.

ఆ తర్వాత అబూహురైరా (రజి) ఇలా అన్నారు: ఎవరి చేతుల్లోనయితే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెప్తున్నాను. దైవమార్గంలో జిహాద్ చేసే, హజ్‌యాత్ర చేసే, ఇంకా నా తల్లిని పోషించుకొనే బాధ్యతలే గనక నా

మీద లేకపోతే నేను కూడా ఒక బానిసగా మరణించటానికి ఇష్టపడే వాణ్ణి. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని బానిస విమోచన ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రమాణాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

నాగరిక జీవనానికి అలవాటుపడ్డ ఆధునికులు బానిసత్వ జీవితాన్ని ఊహించుకోవటానికయినా ఇష్టపడరు. అలాంటి బానిస వ్యవస్థను ఇస్లాం ధర్మం ఎలా తల్లక్రిందులు చేసిందో చూడండి. ఒక స్వేచ్ఛాజీవి తనకు తానుగా బానిస జీవితాన్ని అనుభవించటానికి ఉవ్విళ్లూరుతున్నాడంటే అప్పటికి ఇస్లాం దాని రూపురేఖల్ని ఎంతగా మార్చివేసిందో ఊహించటం కష్టం కాదు. ఒకప్పుడు బానిసత్వ వ్యవస్థలో తన యజమానుల చేత దారుణమైన శిక్షలు అనుభవించి మక్కాపురవీధుల్లో మలమలమాడే ఇసుకమీద నగ్నంగా ఈడ్వబడి చిత్రహింసలు సహించిన నీగ్రో జాతివారైన బిలాల్ (రజి)ని అనతికాలంలోనే అదే పవిత్ర మక్కానగరంలో ప్రతిష్ఠాలయమైన కాబా గృహ పైకప్పు మీద నించొని నమాజు గురించి ప్రకటించే హోదాను కల్పించి జాత్యహంకారంతో విర్రవీగుతున్న మక్కా సర్దారులను సైతం ముక్కున వేలేసుకునేలా చేసింది ఇస్లాం. అలాంటి ఇస్లాం ధర్మం బానిసత్వ వ్యవస్థని కాపాడుకుంటూ వస్తోందని విమర్శించటం తగునండీ?!

١٣٦٥ - وَعَنْ أَبِي مُوسَى الأَشْعَرِيِّ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «المَمْلُوكُ الَّذِي يُحْسِنُ عِبَادَةَ رَبِّهِ، وَيُؤَدِّي إِلَى سَيِّدِهِ الذي عليهِ مِنَ الحَقِّ، وَالنَّصِيحَةِ، وَالطَّاعَةِ، لَهُ أَجْرَانِ» رواهُ البخاريُّ.

1365. హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక బానిస తన ప్రభువును (అంటే దేవుణ్ణి) అత్యుత్తమంగా ఆరాధిస్తూ (మరోవైపు) తనమీద తన యజమానికున్న హక్కుని నెరవేరుస్తూ, అతని బాగుని కోరుతూ అతనికి విధేయత చూపినట్లయితే- అలాంటి బానిసకు రెట్టింపు పుణ్యం లభిస్తుంది. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని బానిస విమోచన ప్రకరణం)

١٣٦٦ - وَعَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «ثَلاثَةٌ لَهُمْ أَجْرَانِ: رَجُلٌ

1366. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా

مِنْ أَهْلِ الكِتَابِ آمَنَ بِنَبِيِّهِ، وَآمَنَ بِمُحَمَّدٍ، وَالعَبْدُ المَمْلُوكُ إذا أَدَّى حَقَّ الله، وَحَقَّ مَوَالِيهِ، وَرَجُلٌ كانَتْ لَهُ أَمَةٌ فَأَدَّبَها فَأَحْسَنَ تَأدِيبَهَا، وَعَلَّمَها فَأَحْسَنَ تَعْلِيمَهَا، ثُمَّ أَعْتَقَهَا فَتَزَوَّجَهَا، فَلَهُ أَجْرَانِ» مُتَّفَقٌ عليهِ.

ప్రవచించారు: ముగ్గురికి రెట్టింపు పుణ్యం లభిస్తుంది. ఒకరు: తమ ప్రవక్తను విశ్వసించటంతోపాటు ముహమ్మద్ (సల్లం)ను కూడా విశ్వసించిన గ్రంథవహులకు చెందిన వ్యక్తి. రెండవ వ్యక్తి; దేవుని హక్కుతో పాటు తన యజమాని హక్కుని కూడా నిర్వర్తించే పరాధీనుడైన బానిస. మూడో వ్యక్తి: తన దగ్గరున్న ఒక బానిసరాలికి ఉత్తమ సంస్కారాన్ని, శిక్షణ, మంచి విద్యా బుద్ధులు నేర్పి, ఆ తర్వాత ఆమెకు స్వేచ్ఛనొసగి ఆమెను వివాహం చేసుకున్నవాడు. ఇలాంటివారికి రెండింతల పుణ్యం లభిస్తుంది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విద్యాప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) గ్రంథవహులంటే యూదులు, క్రైస్తవులని భావం. వారు గనక ఇస్లాం స్వీకరిస్తే వారికి రెండింతల పుణ్యం లభిస్తుందని ఈ హదీసులో చెప్పబడింది. 2) అదే విధంగా శ్రేయోభిలాషి అయిన బానిస కూడా రెట్టింపు పుణ్యానికి అర్హుడౌతాడు. ఎందుకంటే అతను తన యజమానికి విధేయత చూపుతాడు. అందులో ఎదురయ్యే ఇబ్బందుల్ని ఓర్చుకుంటాడు. మరోవైపు దేవుని ఆరాధనా హక్కుని కూడా ఉత్తమరీతిలో నెరవేరుస్తాడు. అయితే ఇక్కడ మనం తెలుసుకోవాల్సిన విషయం ఒకటుంది. బానిస ప్రతి విషయంలోనూ తన యజమానికి విధేయత చూపనవసరం లేదు. యజమాని గనక దైవాభీష్టానికి వ్యతిరేకమైన ఆజ్ఞలు ఇస్తే అలాంటి సందర్భాల్లో తమ యజమానులకు ఎదురుతిరగటాన్ని బానిసలు తమ విధిగా భావించాలని ఇస్లాం ధర్మం ప్రబోధించింది. 3) పోతే రెట్టింపు పుణ్యం పొందగలిగే మూడో వ్యక్తి- తన దగ్గర ఒకే ఒక బానిసరాలుండి ఆమెకు ఉన్నత విద్యాబుద్ధులు గరిపి తర్వాత ఆమెకు బానిసత్వం నుండి స్వేచ్ఛనొసగి తనే ఆమెను పెళ్ళాడినవాడు. ఇది ఆషామాషీ వ్యవహారం కాదు. ఒక బానిసరాలికి స్వేచ్ఛనొసగిన తర్వాత ఆమెను వివాహమాడాలంటే ముందుగా ఆమెకు మహర్ ధనం ఇవ్వవలసి ఉంటుంది. అంతేకాదు, ఒక స్వేచ్ఛాపరురాలైన భార్యకు ఎలాంటి హక్కులుంటాయో ఆమెకు కూడా అలాంటి హక్కులు ఉంటాయి. ఆమె మాజీ యజమాని, ప్రస్తుతం భర్తయినవాడు ఆ హక్కులన్నిటినీ నెరవేర్చవలసి ఉంటుంది.

## 239వ అధ్యాయం

## ٢٣٩ - بَابُ فَضْلِ العِبَادَةِ فِي الْهَرْجِ وَهُوَ الاخْتِلَاطُ وَالْفِتَنُ وَنَحْوُهَا

## ఉపద్రవ కాలంలో దైవారాధన చేయటం

١٣٦٧ - عَنْ مَعقِلِ بنِ يَسَارٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «العِبَادَةُ فِي الهَرْجِ كَهِجْرَةٍ إِلَيَّ». رواهُ مُسْلِمٌ.

1367. హజ్రత్ మాఖిల్ బిన్ యసార్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కల్లోలాలు, ఉపద్రవాల కాలంలో దైవారాధన చేయటం నా దగ్గరకు వలస రావటంతో సమానం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఉపద్రవాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మక్కా అవిశ్వాసుల ఆగడాలు, వేధింపులు తారాస్థాయికి చేరుకున్నప్పుడు మహాప్రవక్త (సల్లం) మక్కా నుండి మదీనాకు వెళ్ళవలసి వచ్చింది. దాన్నే 'హిజ్రత్' అన్నారు. దైవప్రవక్త మదీనాకు వలస వెళ్ళిన తర్వాత ఇతర ముస్లింలు కూడా వీలైతే తప్పకుండా ఆయన వద్దకు, అంటే మదీనాకు వలస వెళ్ళాలన్న ఆదేశం అవతరించింది. ఆ కాలంలో మదీనాకు వలస వెళ్ళటమంటే సామాన్య విషయం కాదు. అవిశ్వాసుల కళ్ళుగప్పి, ప్రాణాలకు తెగించి వారితో పోరాడి వెళ్ళవలసి వచ్చేది. ఒక సుప్రసిద్ధ సహచరుడయితే తాను సంపాయించిన లక్షల ఆస్తిని అవిశ్వాసులకు పరిహారంగా ఇచ్చి మదీనాకు ప్రస్థానం చేశారు. దీనిద్వారా ఆ రోజుల్లో మదీనా ప్రస్థానం ఎంత పుణ్యప్రదమైన విషయంగా భావించబడేదో అర్థమవుతుంది.

పై హదీసులో సర్వత్రా కల్లోలాలు వ్యాపించి ధర్మాన్ని ఆచరించటమే కష్టమైపోయే ఉపద్రవభరిత యుగంలో ఆరాధన చేయటం తన వద్దకు వలస రావటంతో సమానమని, దానికీ హిజ్రత్ చేసినంత పుణ్యం లభిస్తుందని దైవప్రవక్త (స) ప్రకటించారు. దైవారాధన అంటే కేవలం నమాజులు, వ్రతాలు పాటించటమే కాదు. దేవునికి విధేయత చూపటం, దైవాజ్ఞల్ని పాటించటం, మంచిని గురించి ప్రజలకు బోధించటం, చెడుల నుండి వారిని వారించటం- ఇవన్నీ ఆరాధన క్రిందికే వస్తాయి. కల్లోల భరితమైన సమయంలో ఈ విధమైన దైవారాధన చేయటం కత్తిమీద సాము వంటిదే. అయినప్పటికీ పరిస్థితుల్ని మనో నిబ్బరంతో, ఆత్మ విశ్వాసంతో ఎదుర్కొంటూ సా[illegible]న చేసినవారికి, ఆరాధన నెరవేర్చినవారికి తప్పకుండా హిజ్రత్ చేసినంత పుణ్యం ల[illegible]

## 240వ అధ్యాయం

٢٤٠ - بَابُ فَضْلِ السَّمَاحَةِ فِي الْبَيْعِ وَالشِّرَاءِ وَالأَخْذِ وَالْعَطَاءِ وَحُسْنِ الْقَضَاءِ وَالتَّقَاضِي وَإِرْجَاحِ الْمِكْيَالِ وَالْمِيزَانِ، وَالنَّهْيِ عَنِ التَّطْفِيفِ، وَفَضْلِ إِنْظَارِ الْمُوسِرِ الْمُعْسِرَ، وَالْوَضْعِ عَنْهُ

**కొనుగోలు అమ్మకాల్లో ఇచ్చిపుచ్చుకోవటాల్లో మృదువుగా వ్యవహరించాలి, ఇతరుల హక్కుల్ని తీర్చినప్పుడు లేదా వారి నుండి ఏదయినా ఆశించినప్పుడు ఉత్తమంగా ప్రవర్తించాలి. తూచి లేదా కొలిచి ఇచ్చేటప్పుడు కాస్తంత మొగ్గుతోనే ఇవ్వాలి, తక్కువగా తూచి లేదా కొలిచి ఇవ్వకూడదు. తాము సంపన్నుల మయినప్పుడు ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్న వ్యక్తి అప్పు విషయంలో సడలింపుల వైఖరిని అవలంబించాలి, వీలైతే అప్పుని మాఫీ చేయాలి**

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَمَا تَفْعَلُوا مِنْ خَيْرٍ فَإِنَّ اللَّهَ بِهِۦ عَلِيمٌ ﴿٢١٥﴾ ﴾ [البقرة: ٢١٥] وقَالَ تَعَالَى ﴿ وَيَٰقَوْمِ أَوْفُوا ٱلْمِكْيَالَ وَٱلْمِيزَانَ بِٱلْقِسْطِ ۖ وَلَا تَبْخَسُوا ٱلنَّاسَ أَشْيَآءَهُمْ ﴾ [هود: ٨٥] وقَالَ تَعَالَى: ﴿ وَيْلٌ لِّلْمُطَفِّفِينَ ﴿١﴾ ٱلَّذِينَ إِذَا ٱكْتَالُوا عَلَى ٱلنَّاسِ يَسْتَوْفُونَ ﴿٢﴾ وَإِذَا كَالُوهُمْ أَو وَّزَنُوهُمْ يُخْسِرُونَ ﴿٣﴾ أَلَا يَظُنُّ أُولَٰٓئِكَ أَنَّهُم مَّبْعُوثُونَ ﴿٤﴾ لِيَوْمٍ عَظِيمٍ ﴿٥﴾ يَوْمَ يَقُومُ ٱلنَّاسُ لِرَبِّ ٱلْعَٰلَمِينَ ﴾ [المطففين: ١ - ٦].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మీరు ఏ మేలు చేసినా దాన్ని అల్లాహ్ తెలుసు కుంటాడు." *(బఖర: 215)*

"నా జాతి ప్రజలారా! కచ్చితంగా న్యాయంగా, పూర్తిగా కొలవండి, తూయండి. ప్రజలకు వారి వస్తువులను తక్కువచేసి ఇవ్వకండి." *(హూద్: 85)*

"తూనికలలో, కొలతలలో తగ్గించి ఇచ్చేవారికి వినాశం ఉన్నది. వారు ప్రజల నుండి తీసుకునే టప్పుడు పూర్తిగా తీసుకుంటారు. వారికి కొలిచి గాని తూచిగాని ఇచ్చేటప్పుడు మాత్రం తగ్గించి ఇస్తారు. ఒక మహాదినం నాడు వారు బ్రతికించి తీసుకురాబడనున్నారని వారికి తెలియదా? ఆ రోజున ప్రజలందరూ సకల లోకాల ప్రభువు సమక్షంలో నిలబడతారు." *(ముతప్ఫిఫీన్: 1-6)*

1368. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ఆయన్ని (తన దగ్గర తీసుకున్న అప్పు) తిరిగిచ్చేయమని అడిగాడు. అడగటం కూడా చాలా కరకుగా అడిగాడు. అది చూసి ఆయన సహచరులు (ఉండబట్టలేక) అతన్ని చితకబాద బోయారు. కాని ఆయన వారిని వారిస్తూ, "అతడ్ని అడగనివ్వండి. తనకు సొమ్ము రావలసిన వాడికి అడిగే హక్కుంది" అని అన్నారు.

తర్వాత తన సహచరుల్ని "ఇతనికి, ఇతను మాకిచ్చిన వయసు పశువు ఇచ్చేయండి" అని ఆదేశించారు. దానికి సహచరులు, "అలాంటిది మన దగ్గర లేదు దైవప్రవక్తా! అంతకంటే పెద్దదయితే ఉంది" అని అన్నారు. "సరే, అదే ఇవ్వండతనికి. ఉత్తమంగా అప్పు తీర్చేవారే మీలో ఉత్తములన్న సంగతిని గుర్తుపెట్టుకోండి" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

١٣٦٨ - وَعَنْ أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَجُلاً أَتى النَّبِيَّ ﷺ يَتَقَاضاهُ فَأَغْلَظَ لَهُ، فَهَمَّ بِهِ أَصْحَابُهُ، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «دَعُوهُ فَإِنَّ لِصَاحِبِ الحَقِّ مَقالًا» ثُمَّ قَالَ: «أَعْطُوهُ سِنًّا مِثْلَ سِنِّهِ» قالوا: يا رسولَ اللهِ! لا نَجِدُ إلَّا أَمْثَلَ مِنْ سِنِّهِ، قال: «أَعْطُوهُ فَإِنَّ خَيْرَكُمْ أَحْسَنُكُمْ قَضَاءً». مُتَّفَقٌ عَلَيهِ.

*(సహీహ్ బుఖారీలోని వకాలా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) దైవప్రవక్త (సల్లం)కు అప్పిచ్చిన వ్యక్తి జైద్ బిన్ షోబా కినానీ (రజి) అని కొంత మంది అంటారు. ఆయన స్వయానా దైవప్రవక్త సహచరులు. కాని అసలు విషయం ఏమిటంటే అప్పటికింకా ఆయన ఇస్లాం స్వీకరించలేదు. అందుకే దైవప్రవక్త గౌరవమర్యాదల్ని లెక్కచేయక అప్పు విషయంలో ఆయన పట్ల కరకుగా వ్యవహరించారు. ఆ సందర్భంగా ఆయన సహచరులు

జైద్ మీద చేయి చేసుకోబోతే ఆయన వారిని వారించారు. "రుణదాత రుణగ్రహీతను తన అప్పు తిరిగిచ్చేయమని అడిగినప్పుడు మంచితనంగా అడగాలి. ఇదే ఉత్తమ పద్ధతి. ఒకవేళ అతను దబాయించి అడిగినా అందులో ఆక్షేపించాల్సిన విషయం ఏమీ లేదు. ఎందుకంటే రుణదాతకు అప్పు గురించి అడిగే హక్కుంది కనుక" అని దైవప్రవక్త సహచరులకు బోధించారు. అయితే తనకు హక్కుంది కదా అని రుణదాత షరీఅత్ ఆదేశాలను తుంగలో తొక్కి రుణగ్రహీత మీద వీరంగం కూడా చేయకూడదు.

2) రుణగ్రహీత అప్పుతీర్చేటప్పుడు తన ఇష్టంతో తీసుకున్న అప్పు కంటే ఎక్కువ ఇవ్వదలచుకుంటే అందులో తప్పులేదు. పైగా తీసుకున్న అప్పును వీలైనంత ఉత్తమరీతిలో తీర్చటం మంచిపద్ధతి కూడా. అలాగాకుండా ఒకవేళ రుణదాత అప్పుకన్నా ఎక్కువ ఇవ్వమని ఒత్తిడి తెస్తే ఆ అదనపు సొమ్ము 'వడ్డీ'గా భావింపబడుతుంది. వడ్డీ ఇవ్వటం, తీసుకోవటం రెండూ అధర్మ కార్యాలే.

١٣٦٩ - وَعَنْ جَابِرٍ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «رَحِمَ اللهُ رَجُلاً سَمْحاً إذا بَاعَ، وَإذا اشْتَرَى، وَإذا اقْتَضَى» رواهُ البخاريُّ.

1369. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కొనుగోలు చేసేటప్పుడు, అమ్మేటప్పుడు, అప్పు తిరిగిచ్చేయమని అడిగినప్పుడు మృదువుగా వ్యవహరించే వ్యక్తిని దేవుడు కరుణించుగాక! (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొనుగోలు చేసినప్పుడు మృదువుగా వ్యవహరించటమంటే అమ్మేవారికి నష్టమొచ్చే విధంగా బేరమాడకూడదని భావం. అదే విధంగా అమ్మేవారు కూడా కొనుగోలుదారుల మీద తలకుమించిన భారం వేసి, ధరలు ఎక్కువగా చెప్పి వారిని ఇబ్బంది పెట్టకూడదు. ఏదయినా వస్తువు వారు వాపసు చేయదలిస్తే తీసుకోవాలి. పై హదీసుని మనం మరో విధంగా కూడా అర్థం చేసుకోవచ్చు. అదేమిటంటే- వస్తువుని కొనేటప్పుడు అమ్మకం దారునికి దాని ఖరీదు పూర్తిగా ఇచ్చేయాలి. అమ్మేటప్పుడు కొనుగొలుదారులకు వారి వస్తువులు ఎలాంటి తగ్గింపు చేయకుండా ఇవ్వాలి.

పోతే మూడో విషయం- ఇతరుల నుండి తమకు ఏదయినా రావలసి ఉంటే దాన్ని అడగటంలో కాఠిన్యతను ప్రదర్శించేబదులు మృదువుగా అడగాలి. ఎదుటి వ్యక్తి పరువు మర్యాదలకు విఘాతం కలిగేలా వ్యవహరించకూడదు. ఆ వ్యక్తి పేదవాడయితే అతనికి తగినంత గడువునివ్వాలి. అసలు రుణమే మాఫీ చేస్తే అది ఇంకా మంచిది. (బఖర: 280)

١٣٧٠ ـ وَعَنْ أَبي قَتَادَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ سَرَّهُ أَنْ يُنَجِّيَهُ اللهُ مِنْ كُرَبِ يَوْمِ القِيَامَةِ، فَلْيُنَفِّسْ عَنْ مُعْسِرٍ أَوْ يَضَعْ عَنْهُ». رواهُ مسلمٌ.

1370. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ ఖతాదా (రజి) తెలియ జేశారు: ప్రళయం దినాన కలిగే తీవ్రమైన వ్యాకులత నుండి దేవుడు తనను కాపాడాలని కోరుకునే వ్యక్తి ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నవానికి (అప్పు తీర్చే విషయంలో) తగినంత వ్యవధి నివ్వాలి లేదా అసలు మొత్తం రుణాన్నే మాఫీ చేసేయాలి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

١٣٧١ ـ وَعَنْ أَبي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ، قالَ: «كَانَ رَجُلٌ يُدَايِنُ النَّاسَ، وَكَانَ يَقُولُ لِفَتَاهُ: إذا أَتَيْتَ مُعسِراً فتجاوزْ عَنْهُ، لَعَلَّ اللهَ أَنْ يَتَجَاوَزَ عَنَّا، فَلَقِيَ اللهَ فَتَجَاوَزَ عَنْهُ» مُتَّفَقٌ عَلَيهِ.

1371. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచించారు: ఒక వ్యక్తి ప్రజలకు రుణాలిచ్చేవాడు. అతను తన నౌకరుకి, "నువ్వు అప్పు వసూలు చేసుకోవటానికి ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్న వ్యక్తి దగ్గరికి వెళ్ళినప్పుడు వీలైనంతవరకు అతన్ని ఉపేక్షించు. అలాచేస్తే బహుశా దేవుడు కూడా మనల్ని (మన పాపాల విషయంలో) ఉపేక్షించవచ్చు" అని చెప్పేవాడు. ఆ వ్యక్తి దేవుణ్ణి కలుసుకున్నప్పుడు (అంటే మరణించినప్పుడు) దేవుడు నిజంగానే (అతని పాపాలను) ఉపేక్షించాడు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'ఉపేక్షించు' అన్న మాటలోనే, అప్పు తీర్చమని ఉత్తమరీతిలో అడగటం, మరింత గడువు ఇవ్వటం, అప్పుని పూర్తిగా మాఫీ చేసేయటం అనే అర్థాలు కూడా ఇమిడి ఉన్నాయి. ఈ మూడు గుణాలూ విశ్వాసుల్లో పెంపొందాలని ఇస్లామీయ షరీఅత్ కోరుతోంది. అంతేకాదు, అలాంటి సుగుణ సంపన్నుల్ని వేన్నోళ్లా పొగుడుతోంది. ఈ సంఘటన పూర్వకాలంలో ఎవరిదై ఉంటుందోగాని, వారి ఆదర్శాన్ని మాత్రం దైవప్రవక్త మెచ్చుకున్నారు. కేవలం మెచ్చుకోవటమే కాదు ఆ ఆదర్శాన్ని తన అనుచరులు కూడా ఆచరణలో పెట్టాలని ప్రబోధించారు. కనుక నిరుపేదల పట్ల సడలింపుల వైఖరిని అవలంబించేవారిని దేవుడు కూడా మెచ్చుకుంటాడన్న విషయంలో ఏమాత్రం సందేహం లేదు.

١٣٧٢ - وَعَنْ أَبِي مَسْعُودٍ الْبَدْرِيِّ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «حُوسِبَ رَجُلٌ مِمَّنْ كَانَ قَبْلَكُمْ، فَلَمْ يُوجَدْ لَهُ مِنَ الْخَيْرِ شَيْءٌ، إِلَّا أَنَّهُ كَانَ يُخَالِطُ النَّاسَ، وَكَانَ مُوسِراً، وَكَانَ يَأْمُرُ غِلْمَانَهُ أَنْ يَتَجَاوَزُوا عَنِ الْمُعْسِرِ. قَالَ اللهُ عَزَّ وَجَلَّ: نَحْنُ أَحَقُّ بِذلِكَ مِنْهُ، تَجَاوَزُوا عَنْهُ» رواهُ مسلمٌ.

1372. హజ్రత్ అబూ మస్ఊద్ బద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీకు పూర్వం (జాతుల్లోని) ఒక వ్యక్తి (మరణించాడు. తర్వాత అతని) కర్మల లెక్క తీసుకోవటం జరిగింది. అతని (కర్మల చిట్టాలో) సత్కర్మ ఒక్కటీ కనిపించలేదు. అయితే అతను (జీవితంలో) ఒక మంచి పనిమాత్రం చేశాడు. అదేమిటంటే- అతను ప్రజలతో లావాదేవీల వ్యవహారం జరిపేవాడు. ఆర్థికంగా మంచి స్థితిలో ఉన్న అతను, (లావాదేవీల విషయాల్లో) నిరుపేదల పట్ల ఉపేక్షాభావంతో వ్యవహరించండి' అని తన క్రింద పనిచేసే బానిసలకు తాకీదు చేసేవాడు. (అందుకని అతని మరణానంతరం కర్మల విచారణ జరిపినప్పుడు, దేవుడు "మేము ఇతని కంటే ఎక్కువ

ఉపేక్షాభావంతో వ్యవహరించగలం. మీరు కూడా ఇతణ్ణి (అంటే ఇతని పాపాలను) ఉపేక్షించండి" అని (తన దూతలను) ఆదేశించాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వాస్తవానికి ప్రళయం సంభవించేంతవరకు ఎవరి కర్మల విచారణా తెమలదు. మరి దైవప్రవక్త (సల్లం) ఈ సంఘటన వివరించారంటే భవిష్యత్తులో ప్రళయం తర్వాత, పరలోకంలో జరగబోయేదాని గురించి దేవుని వాణి ద్వారా తెలుసుకొని ఆయన తన సహచరులకు చెప్పినదేకాని ఆ వ్యక్తి విచారణ నిజంగా జరగలేదు. అయితే పరలోకంలో ఆ వ్యక్తి పట్ల అలాంటి వ్యవహారమే జరగబోతుందన్న విషయం మాత్రం వాస్తవం. మొత్తానికి ఈ హదీసు ద్వారా బోధపడేదేమిటంటే ఇతరుల పట్ల మన్నింపుల, సడలింపుల వైఖరిని అవలంబిస్తే దేవుడు కూడా వారిపట్ల అలాగే వ్యవహరిస్తాడు.

١٣٧٣ ـ وَعَنْ حُذَيْفَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: «أُتِيَ اللهُ تَعَالى، بِعَبْدٍ مِنْ عِبَادِهِ آتَاهُ اللهُ مَالًا، فَقَالَ لَهُ: مَاذَا عَمِلْتَ فِي الدُّنْيَا؟ قَالَ: ـ وَلَا يَكْتُمُونَ اللهَ حَدِيثاً ـ قَالَ: يَا رَبِّ! آتَيْتَنِي مالَكَ، فَكُنْتُ أُبَايِعُ النَّاسَ، وَكَانَ مِنْ خُلُقِي الجَوَازُ، فَكُنْتُ أَتَيَسَّرُ عَلى المُوسِرِ، وَأُنْظِرُ المُعْسِرَ. فَقَالَ تَعَالى: أَنَا أَحَقُّ بِذا

1373. హజ్రత్ హుజైఫా (రజి)కథనం: దేవుని దాసుల్లోని ఒకతన్ని దైవ సన్నిధిలో హాజరుపరచటం జరిగింది. (ప్రపంచ జీవితంలో) దేవుడు అతనికి సిరిసంపదలు ఒసగాడు. "నువ్వు ప్రపంచంలో ఏం చేశావు" అని దేవుడు అతన్ని అడిగాడు. మానవులు దేవుని ముందు ఏ విషయాన్నీ దాచలేరు. కనుక అతను "ప్రభూ! నువ్వు నాకు నీ సంపదనిచ్చావు. నేను ప్రజలతో లావాదేవీల వ్యవహారాలు నడిపేవాణ్ణి. (ప్రజలు నా దగ్గర తీసుకున్న అప్పుల్ని) ఉపేక్షించటం నాకలవాటు. నేను స్తోమత గలవారికి సౌలభ్యాన్ని కలుగజేసేవాణ్ణి. (వారు నాసిరకం

مِنْكَ تَجَاوَزُوا عَنْ عَبْدِي» فَقَالَ عُقْبَةُ بنُ عَامِرٍ، وَأَبو مَسْعُودٍ الأنصاريُّ، رَضِيَ اللهُ عَنْهُمَا: هكَذَا سَمِعنَاهُ مِنْ فِي رَسولِ اللهِ ﷺ. رواهُ مسلمٌ.

వస్తువులు ఇచ్చినా తీసుకునేవాణ్ణి) నిరుపేదలకయితే (కావలసినంత) గడువు ఇచ్చేవాణ్ణి" అని చెప్పాడు. అందుకు దేవుడు, "నేను నీకంటే ఎక్కువగా ఉపేక్షించేవాణ్ణి" అని చెప్పి "ఈ నా దాసుని (పాపాలను) ఉపేక్షించండి" అని తన దూతల్ని ఆదేశించాడు.

ఉఖ్‌బా బిన్ ఆమిర్ మరియు అబూ మస్‌వూద్ (రజి)లు "మేము కూడా దైవ ప్రవక్త నోట ఈ మాట ఇలాగే విన్నాం" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

١٣٧٤ - وَعَنْ أَبي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ أَنْظَرَ مُعْسِراً، أَوْ وَضَعَ لَهُ، أَظَلَّهُ اللهُ يَوْمَ القِيَامَةِ تَحْتَ ظِلِّ عَرْشِهِ يَوْمَ لا ظِلَّ إِلَّا ظِلُّهُ». رواهُ الترمذيُّ وقَالَ: حديثٌ حسنٌ صحيحٌ.

1374. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నవారికి తగినంత వ్యవధి నిచ్చేవారిని లేక అసలు రుణాన్ని మాఫీ చేసేసేవారిని ప్రళయదినాన దేవుడు తన సింహాసనం నీడలో చోటిస్తాడు. ఆ రోజు ఆయన నీడ తప్ప మరే నీడా ఉండదు సుమా!

(తిర్మిజీ-హసన్, సహీహ్)

*(సుననె తిర్మిజీలోని లావాదేవీల అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ప్రళయానంతరం ఆది నుండి అంతం వరకు మానవులందరూ హష్ర్ మైదానంలో సమీకరించబడి ఉన్నప్పుడు సూర్యుడు వారికి అతి దగ్గరగా వస్తాడు. దాని వేడికి మానవులు

చెమటలో మునిగిపోయి ఉంటారు. తీవ్రమైన ఆందోళనతో ఉక్కిరిబిక్కిరి అయిపోతుంటారు. ఆ సమయంలో దైవ సింహాసనం నీడ దొరికినవారు మహా అదృష్టవంతులు. అలాంటి అదృష్టవంతుల్లో నిరుపేదలకు ఋణాలిచ్చి వారిపట్ల మృదువుగా వ్యవహరించేవారు కూడా ఉంటారు. వారు నిరుపేదలకు ఋణాలిచ్చి వారికి తగినంత గడువు ఇస్తారు లేదా ఆ రుణాన్ని మాఫీ చేస్తారు. ఈ హదీసు చూచాయగా ధనవంతుల్ని దానధర్మాల వైపుకు ప్రేరేపిస్తోంది.

ఈ రోజుల్లో ప్రజలు ధనవంతులకయితే ఋణాలిస్తారు గాని నిరుపేదలకు ఎవరూ రుణాలివ్వరు. పేదవారికి అప్పులిస్తే తమ సొమ్ము తిరిగి రాదేమోనని భయపడతారు. ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నవారి అప్పుల్ని మాఫీ చేసే నైతిక విధిని మనం పూర్తిగా విస్మరించాం. ఇవ్వగలిగే స్తోమత ఉండికూడా అవసరాల్లో ఉన్న నిరుపేదలకు అప్పు ఇవ్వకుండా ఉండటం ఎంతో అవాంఛనీయమైన విషయం. దీనికి భిన్నంగా అలాంటి వారికి రుణాలిచ్చి వారికి తగినంత వ్యవధినివ్వటం, అప్పులో ఎంతో కొంత వీలైతే పూర్తిగా మాఫీ చేయటం ఎంతో మంచి పద్ధతి. అందుకుగాను పరలోకంలో గొప్ప ప్రతిఫలం లభిస్తుంది.

١٣٧٥ ـ وَعَنْ جابِرٍ ، رَضِيَ اللهُ عَنْهُ ، أَنَّ النَّبِيَّ ﷺ ، اشْتَرَى مِنْهُ بَعِيراً فَوَزَنَ لَهُ ، فَأَرْجَحَ . مُتفقٌ عليه .

1375. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన దగ్గర ఒక ఒంటె కొన్నారు. అందుకాయన తనకు ఆ ఒంటె ఖరీదు బాగా మొగ్గినట్లు తూచి ఇచ్చారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని లావాదేవీల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త హయాంలో, ఆ తర్వాత చాలా కాలం వరకు దిర్హమ్, దీనార్ల ద్వారానే లావాదేవీలు జరిగేవి. దీనారు బంగారు నాణెంగానూ, దిర్హమ్ వెండి నాణెంగానూ ఉండేది. ఆ కాలంలో ఒంటె దీనారు, దిర్హమ్‌లలోనే వెలకట్టబడేది. అందుకే దైవప్రవక్త-స- ఒంటె వెలను తూచి ఇచ్చారు. నిర్ణీత బరువుకన్నా కాస్త అధికంగానే ఇచ్చారు.

١٣٧٦ ـ وَعَنْ أَبِي صَفْوَانَ سُوَيْدِ بنِ قَيْسٍ ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ : جَلَبْتُ أَنَا وَمَخْرَمَةُ الْعَبْدِيُّ بَزًّا مِنْ هَجَرَ ، فَجَاءَنَا

1376. హజ్రత్ అబూ సఫ్వాన్ సువైద్ బిన్ ఖైస్ (రజి) కథనం: నేను మరియు మఖ్రమా అబ్దీ ఇద్దరం 'హజర్' అనే ప్రాంతం నుంచి కొంత గుడ్డ (అమ్మటం

النَّبِيُّ ﷺ، فَسَاوَمَنَا بِسَرَاوِيلَ، وَعِنْدِي وَزَّانٌ يَزِنُ بِالأَجْرِ، فَقَالَ النَّبِيُّ ﷺ لِلْوَزَّانِ: «زِنْ وَأَرْجِحْ» رواهُ أَبو داود، والترمذيُّ وقَالَ: حديثٌ حسنٌ صحيحٌ.

కోసం) తెచ్చాం. అప్పుడు దైవప్రవక్త (సల్లం) మా దగ్గరకొచ్చి ఒక షరాయి కోసం బేరమాడారు. నా దగ్గర ఒక తూకందారు ఉండేవాడు. అతను ఇవ్వవలసిన వస్తువులు తూకంవేసి ఇచ్చేవాడు. దైవప్రవక్త (సల్లం) అతన్ని ఉద్దేశించి, "తూయి, బాగా మొగ్గినట్టు తూయి" అని అన్నారు. (అబూదావూద్, తిర్మిజీ- హసన్, సహీహ్)

(సుననె అబూదావూద్‌లోని లావాదేవీల ప్రకరణం - సుననె తిర్మిజీలోని లావాదేవీల ప్రకరణం)

### ముఖ్యాంశాలు

కొనుగోలుదారుడు వస్తువుధరకన్నా ఎక్కువ ఇవ్వటానికి ప్రయత్నించాలి. అలాగే అమ్మకందారుడు కొనుగోలుదారుకి ఇవ్వవలసిన వస్తువులకన్నా కొంచెం అధికంగానే ఇవ్వాలి. ఇది ఉత్తమ పద్ధతి. దీనివల్ల సమాజంలో శాంతి, సుహృద్భావ వాతావరణం నెలకొంటుంది. దీనికి భిన్నంగా ఒండొకరి హక్కులకు గండి కొట్టటానికి ప్రయత్నిస్తే పరస్పర విద్వేష వైషమ్యాలు పెరిగి అశాంతి అల్లకల్లోలమైన వాతావరణం ఏర్పడుతుంది. అది సమాజ మనుగడకే గొడ్డలిపెట్టు అవుతుంది.



# ١٢ - كِتَابُ الْعِلْم

# 12. విజ్ఞాన ప్రకరణం

**241వ అధ్యాయం**

## ٢٤١- باب فضل العلم

## విజ్ఞానం ఘనత

قَالَ اللهُ تَعَالَى: ﴿وَقُل رَّبِّ زِدْنِي عِلْمًا﴾ [طه: ١١٤] وقَالَ تَعَالَى: ﴿هَلْ يَسْتَوِي الَّذِينَ يَعْلَمُونَ وَالَّذِينَ لَا يَعْلَمُونَ﴾ [الزمر: ٩] وَقَالَ تَعَالَى: ﴿يَرْفَعِ اللهُ الَّذِينَ ءَامَنُوا مِنكُمْ وَالَّذِينَ أُوتُوا الْعِلْمَ دَرَجَٰتٍ﴾ [المجادلة: ١١] وَقَالَ تَعَالَى: ﴿إِنَّمَا يَخْشَى اللَّهَ مِنْ عِبَادِهِ الْعُلَمَٰٓؤُا﴾ [فاطر: ٢٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

ప్రవక్తా! ఇలా అనండి: "ప్రభూ! నాకు మరింత జ్ఞానమొసగు." *(తాహా: 114)*

తెలిసినవారూ, తెలియనివారూ ఇరువురూ సమానులు కాగలరా? *(జుమర్: 9)*

మీలో విశ్వసించినవారికి, జ్ఞానం ప్రసాదించ బడిన వారికి అల్లాహ్ ఉన్నత స్థానాలు ప్రసాదిస్తాడు. *(ముజాదలహ్: 11)*

అల్లాహ్ దాసులలో జ్ఞానులు మాత్రమే ఆయనకు భయపడతారు. *(ఫాతిర్: 28)*

### ముఖ్యాంశాలు

1) విజ్ఞానం ఎంతో గొప్పది. పరాత్పరుడైన దేవుడే దానికి మూలం. అందరికీ జ్ఞానాన్ని ప్రసాదించేవాడు ఆయనే. కనుక జ్ఞానప్రాప్తికోసం ఆయన్నే ప్రార్థించాలి. అగోచరాల జ్ఞానం ఆయనకు తప్ప మరెవరికీ లేదు. అందుకే దైవప్రవక్తలు సైతం జ్ఞానం ప్రసాదించమని ఆయన్నే వేడుకుంటారు.

2) జ్ఞానులూ- అజ్ఞానులూ, పండితులూ- పామరులు ఎన్నటికీ సమానులు కాలేరు.

3) విశ్వాసులకు, జ్ఞానవంతులకు ఇహపరాల్లోనూ గొప్ప హోదా, అంతస్తులు లభిస్తాయి.

4) కేవలం పుస్తకాలు ఔపోసన పట్టినంతమాత్రాన మనుషులు పండితులు కారు. దైవభీతిపరులే సిసలైన పండితులు. విద్యకొద్దీ వినయమన్నట్టుగా జ్ఞానం పెరిగినకొలది మనిషిలో భక్తివిశ్వాసాలు పెంపొందాలి.

1377. హజ్రత్ ముఆవియా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుడు ఎవరి కయినా మేలు చేయదలచుకుంటే వారికి ధర్మావగాహనా శక్తిని ప్రసాది స్తాడు. (బుఖారీ-ముస్లిం)

١٣٧٧ ـ وَعَنْ مُعَاوِيَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ يُرِدِ اللهُ بِهِ خَيْراً يُفَقِّهْهُ فِي الدِّينِ». مُتَّفَقٌ عَلَيهِ.

(సహీహ్ బుఖారీలోని విద్యాప్రకరణం - సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

1378. హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఇద్దరి మీద తప్ప మరెవరి మీద కూడా ఈర్ష్య పడటం ధర్మసమ్మతం కాదు. దేవుడు ధనం ప్రసాదించి, దాన్ని ధర్మమార్గంలో ఖర్చుపెట్టే సద్బుద్ధిని అనుగ్రహించిన వ్యక్తి మీద; దేవుడు వివేచనా జ్ఞానాన్ని ప్రసాదిస్తే దానిమూలంగా (ప్రజల వ్యవహారాల్లో) సరైన నిర్ణయాలు తీసుకుంటూ, ఆ వివేచనాజ్ఞానాన్ని ఇతరులకు కూడా బోధించే వ్యక్తి మీద. (బుఖారీ- ముస్లిం)

١٣٧٨ ـ وَعَـنِ ابْـنِ مَسْعُـودٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا حَسَدَ إلَّا فِي اثْنَتَيْنِ: رَجُلٌ آتَاهُ اللهُ مَالاً فَسَلَّطَهُ عَلَى هَلَكَتِهِ فِي الحَقِّ. ورَجُلٌ آتَاهُ اللهُ الحِكْمَةَ فَهُوَ يَقْضِي بِهَا، وَيُعَلِّمُهَا» مُتَّفَقٌ عَلَيهِ. والمرادُ بالحَسَدِ الغِبْطَةُ، وَهُوَ أَنْ يَتَمَنَّى مِثْلَهُ.

ఇక్కడ 'ఈర్ష్య' అంటే అసూయ కాదు. ఈర్ష్య అంటే ఇతరుల దగ్గర ఉన్న వస్తువులు తమకు కూడా ప్రాప్తించాలని కోరుకోవటం. (ఇతరుల వస్తువులు నాశనమై అవి తమకు లభించాలని కోరుకోవటం అసూయ అవుతుంది.)

(సహీహ్ బుఖారీలోని విద్యాప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) ఇమామ్ నవవీ (రహ్మలై) చెప్పినట్లు పై హదీసులో ఈర్ష్య అంటే నిజంగా ఈర్ష్య అని కాదు. ఇక్కడ అది 'గిబ్తా' అనే అర్థంలో ఉపయోగించబడింది. అరబీ భాషలో గిబ్తా అంటే ఇతరులు మంచి స్థితిలో ఉండటం చూసి తమకు కూడా అలాంటి స్థితి కల్పించమని దైవాన్ని కోరుకోవటం. ఈ విధంగా కోరుకోవటంలో తప్పులేదు. కనుక ఇతరుల ఆస్తుల మీద ఈర్ష్య (గిబ్తా) చెందటం ధర్మసమ్మతంగానే పరిగణించబడుతుంది. అలాగాకుండా ఇతరుల ఆస్తులు నాశనమయిపోయి అవి తమకు లభించాలని కోరుకోవటం, ఇతరులు సుఖపడుతుంటే చూసి ఉడికిపోవటం అసూయ అనిపించుకుంటుంది. అసూయ చెందటం మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ ధర్మసమ్మతం కాదు.

2) ఇక్కడ వివేచనా జ్ఞానం అంటే ఖుర్ఆన్ హదీసుల జ్ఞానం అని అర్థం. ఈ జ్ఞానం ద్వారానే ప్రజల వ్యవహారాల్లో సరైన తీర్పులు ఇవ్వగలం.

١٣٧٩ - وَعَنْ أَبِي مُوسَى، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «مَثَلُ مَا بَعَثَنِي اللهُ بِهِ مِنَ الْهُدَى والْعِلْمِ كَمَثَلِ غَيْثٍ أَصَابَ أَرْضاً؛ فَكَانَتْ مِنْهَا طَائِفَةٌ طَيِّبَةٌ قَبِلَتِ الماءَ فَأَنْبَتَتِ الْكَلأَ، وَالْعُشْبَ الْكَثِيرَ، وَكَانَ مِنْهَا أَجَادِبُ أَمسَكتِ المَاءَ، فَنَفَعَ اللهُ بِهَا النَّاسَ؛ فَشَرِبُوا مِنْهَا وَسَقَوْا وَزَرَعُوا، وَأَصَابَ طَائِفَةً مِنْهَا أُخْرَى إِنَّمَا هِيَ قِيعَانٌ، لَا تُمْسِكُ مَاءً، وَلا تُنْبِتُ كَلأً، فَذلكَ مَثَلُ مَنْ فَقُهَ فِي دِينِ اللهِ، وَنَفَعَهُ مَا بَعَثَنِي اللهُ بِهِ، فَعَلِمَ وَعَلَّمَ، وَمَثَلُ مَنْ لَمْ يَرْفَعْ بِذٰلِكَ رَأْساً، وَلَمْ يَقْبَلْ هُدَى اللهِ الَّذِي أُرْسِلْتُ بِهِ» مُتفقٌ عليهِ.

1379. హజ్రత్ అబూ మూసా (రజి) గారు చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ నాకిచ్చి పంపిన మార్గదర్శకత్వం మరియు జ్ఞానాలు నేలపై కురిసే వర్షం లాంటివి. ఆ నేలలోని కొంతభాగం సారవంతమైనది. అది (వర్షపు) నీటిని పీల్చుకొని పచ్చిక, చెట్లు చేమలను మొలకెత్తించింది. ఆ నెలలోని మరికొంతభాగం గట్టినేల. అది (నీటిని పీల్చుకోలేకపోయినా) నిల్వచేసి మాత్రం ఉంచుతుంది. ఆ నీటితో అల్లాహ్ ప్రజలకు ప్రయోజనం చేకూర్చుతాడు. వారు ఆ నీటిని తాము స్వయంగా త్రాగటమేకాకుండా (తమ పశువులకు కూడా) త్రాపిస్తారు. ఇంకా పంటపొలాల కోసం కూడా వినియోగిస్తారు. మరోవైపు ఆ వర్షమే మెట్ట పల్లాలు లేని చదునైన నేలపై కూడా

కురిసింది. కాని ఆ నేల వర్షపు నీటిని నిలిపి ఉంచటంగాని, పచ్చికను మొలకెత్తించటంగాని చేయజాలదు. ఈ (తొలిరెండు) ఉదాహరణలు దైవ ధర్మాన్ని అర్థం చేసుకున్న వ్యక్తికి వర్తిస్తాయి. దేవుడు నాకిచ్చి పంపిన జ్ఞానం, సన్మార్గాలతో అతనికి ప్రయో జనం చేకూర్చాడు. అతను (స్వయంగా ధర్మ) జ్ఞానాన్ని ఆర్జించి (ఇతరుల క్కూడా) దాన్ని బోధించాడు. ఇక (మూడవ) ఉదాహరణ దేవుడు నాకిచ్చి పంపిన (ధర్మం)వైపు తలెత్తి అయినా చూడకుండా, దేవుడు నాకిచ్చి పంపిన సన్మార్గాన్ని తృణీకరించిన వాడికి వర్తిస్తుంది. (బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు "సున్నత్ పరిరక్షణ" అనే అధ్యాయంలో కూడా వచ్చింది. విద్య యొక్క ఘనతావిశిష్ఠతలను వివరించటానికి దీనిని ఈ అధ్యాయం క్రింద కూడా పొందు పరచటం జరిగింది. విద్యావిషయికంగా మనుషుల్లో మూడురకాల వారుంటారని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. మొదటిరకం వారు ఖుర్ఆన్ హదీసుల జ్ఞానాన్ని ఆర్జిస్తారు. దానికను గుణంగా ఆచరిస్తారు. ఆ జ్ఞానాన్ని ఇతరులకు బోధిస్తారు. అంతేకాదు, ఆ జ్ఞానపు లోతుల్లోకి వెళ్ళి పరిశీలించి, పరిశోధించి ఖుర్ఆన్, హదీసులకు అనుగుణమైన ధర్మసూత్రాలను రూపొం దిస్తారు. ఆ విధంగా ధర్మాన్ని సర్వవ్యాప్తం చేస్తారు. వీరు అందరికంటే ఉత్తములుగా పరిగణించ బడతారు.

రెండవ రకం వారు ఖుర్ఆన్ హదీసుల జ్ఞానాన్ని ఆర్జిస్తారు. తమ జ్ఞానం ద్వారా ఇతరు లకు కూడా ప్రయోజనం చేకూరుస్తారు. అయితే విషయ లోతుల్లోకి వెళ్ళి ధర్మసూత్రాలను క్రోడీకరించేటంతటి వాళ్ళు కారువీరు. అందుకే వీరు మొదటిరకం వారి కన్నా తక్కువ శ్రేణివారుగా పరిగణించబడతారు. ఏమయినప్పటికీ ఈ రెండు వర్గాలవారు మాత్రం- హదీసులో చెప్ప బడినట్లు- దేవుని దృష్టిలో ప్రయోజకులే.

ఇకపోతే మూడోరకం వారు ఎవరంటే- వారు ఖుర్ఆన్ హదీసుల జ్ఞానం పట్ల వైముఖ్య

ధోరణిని అవలంబిస్తారు. తాము స్వయంగా వాటిని నేర్చుకోరు. అందువల్ల ఇతరులకు కూడా ప్రయోజనం కలిగించలేరు. వీరు అందరికన్నా అధమశ్రేణికి చెందినవారు.

1380. హజ్రత్ సహ్లా బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) అలీ (రజి)కి హితోపదేశం చేస్తూ ఇలా అన్నారు: దైవసాక్షి! దేవుడు నీ మూలంగా ఏ ఒక్క వ్యక్తికి సన్మార్గాన్ని చూపించినా అది నీ పాలిట ఎరుపు ఒంటెల కన్నా ఎంతో విలువైనది. (బుఖారీ-ముస్లిం)

١٣٨٠ - وَعَنْ سَهْلِ بنِ سَعْدٍ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ، قَالَ لِعَلِيٍّ، رَضِيَ اللهُ عَنْهُ: «فَوَاللهِ لأَنْ يَهْدِيَ اللهُ بِكَ رَجُلاً وَاحِداً خَيْرٌ لَكَ مِن حُمْرِ النَّعَمِ» مُتَّفَقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరులు మహిమోన్నతుల ప్రకరణం)

### ముఖ్యాంశాలు

ఆ రోజుల్లో అరబ్బు దేశంలో ఎరుపు రంగు ఒంటెల్ని అత్యంత విలువైన సంపదగా భావించటం జరిగేది. అరబ్బుల దృష్టిలో వాటికంటే విలువైన సంపద మరొకటి ఉండేది కాదు. అందుకని వారు ఏదైనా విలువైన, శ్రేష్ఠమైన వస్తువుని గురించి చెప్పేటప్పుడు "అది ఎరుపు రంగు ఒంటెలకన్నా విలువైనది" అని చెప్పేవారు. మొత్తానికి ఈ హదీసులో ప్రజల్ని దైవం వైపునకు, దైవధర్మం వైపునకు పిలవటం ఎంత గొప్ప సత్కార్యమో, అందుకు ఎంతటి విలువైన, శ్రేష్ఠమైన ప్రతిఫలం లభిస్తుందో వివరించబడింది. అయితే మనిషి తనకు సన్మార్గం తెలిసినప్పుడే ఇతరులకు అది చూపగలుగుతాడు. కనుక ముందుగా అతను స్వయంగా ఖుర్ఆన్ హదీసుల జ్ఞానాన్ని నేర్చుకోవటం అవసరం. లేకపోతే సరైన విధంగా ప్రజలకు ధర్మబోధ చేయటం సాధ్యం కాదు.

1381. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీరు నా తరఫు నుండి (దైవాజ్ఞల్ని) ప్రజలకు చేరవేయండి. అది ఒక్క సూక్తి అయినాసరే; ఇంకా బనీ ఇస్రాయీల్ వారి నుండి సేకరించిన విషయాలు కూడా మీరు ప్రచారం

١٣٨١ - وَعَنْ عبدِ اللهِ بنِ عمرو بن العاصِ، رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «بَلِّغُوا عَنِّي وَلَوْ آيَةً، وَحَدِّثُوا عَنْ بَنِي إِسْرَائِيلَ وَلا حَرَجَ، وَمَنْ كَذَبَ عَلَيَّ مُتَعَمِّداً فَلْيَتَبَوَّأْ مَقْعَدَهُ مِنَ النَّارِ» رواه البخاريُّ.

చేయవచ్చు. అందులో తప్పులేదు. అయితే ఎవరయినా ఉద్దేశ్యపూర్వకంగా నా తరఫు నుండి అబద్ధాలు చెబితే అతను తన నివాసాన్ని నరకంలో ఏర్పరచుకుంటాడు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని అహాదీసుల్ అంబియా ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) ఖుర్ఆన్ హదీసుల జ్ఞానాన్ని ఆర్జించి దాన్ని ప్రజల మధ్య ప్రచారం చేయమని ఈ హదీసు ప్రబోధిస్తోంది. కనుక మన దగ్గర ధర్మజ్ఞానం తక్కువున్నా, ఎక్కువున్నా దాన్ని ఇతరులకు కూడా బోధించాలి. మనకు తెలిసినంతవరకు ప్రజలకు దైవాజ్ఞల్ని గురించి బోధించాలి. "ధర్మబోధన, ప్రచార కార్యం పండితులే చేయగలరు. మాలాంటి సామాన్యులు ఆ పని చేయలేరు" అని ఎన్నడూ అనుకోరాదు. ప్రతి వ్యక్తీ తనకు తెలిసిన విషయాలు ప్రచారం చేయాలి. ఈ విషయమై రేపు ప్రళయ దినాన దేవునికి జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. కనుక తమకు ఒక్క దైవాజ్ఞ గురించి తెలిసినా దాన్ని ఇతరులకు బోధించటం తమ బాధ్యతగా గుర్తించాలి.

2) బనీ ఇస్రాయీల్ వారి నుండి సేకరించిన విషయాలంటే దైవప్రవక్త (సల్లం) వారి గురించి చెప్పిన కథలు, సంఘటనలని భావం. అవన్నీ ప్రామాణిక హదీసుల్లో పొందుపరచబడి ఉన్నాయి. అంతేగాని, బనీ ఇస్రాయీల్‌వారు చెప్పే అసత్య, అర్ధసత్య విషయాలన్నిటినీ గుడ్డిగా ప్రచారం చేసేయటం కాదు. చాలా మంది అలాగే భావిస్తున్నారు. కాని ఆ భావన సరైనది కాదు.

3) దైవప్రవక్త మీద అబద్ధాలు అపాదించేవారి గురించి తీవ్రమైన హెచ్చరికలొచ్చాయి. కనుక దైవప్రవక్త హదీసుల్ని వివరించేముందు వాటిని అన్ని విధాలా పరిశీలించి, పరిశోధించి, వడబోసి అది దైవప్రవక్త హదీసేనని ప్రామాణికంగా నిర్ధారించుకున్న తర్వాతే దాన్ని ఇతరులకు బోధించాలి. ఒక హదీసు ఆధారాలు సరైనవి కావనీ, దానిని ఉటంకించిన వ్యక్తుల్లో కొందరు నిందితులు, అబద్ధాలకోరులున్నారని తెలిసికూడా అలాంటి హదీసును ప్రచారం చేయటం చాలా పెద్ద నేరం. అలాంటి బలహీన హదీసుల్లో కూడా వివిధ కోవలకు చెందిన హదీసులుంటాయి. హదీసుల్ని ఉటంకించిన వ్యక్తుల జీవిత చరిత్రల్ని కాచివడబోసి, హదీసు నియమ నిబంధనల జ్ఞానాన్ని ఔపోశనం పట్టిన వారికి మాత్రమే ఆ హదీసుల బలహీనతలు తెలుస్తాయి. అలాంటి పండితులు చాలా తక్కువ మంది ఉంటారు. కనుక సామాన్య ఉలమాలు (పండితులు) ఒక హదీసులో కొంచెం బలహీనత ఉన్నా దాన్ని ప్రచారం చేయకుండా ఉండటంలోనే శ్రేయం ఉంది. చాలా మంది విద్వాంసులు స్వల్ప బలహీనతల్ని కల్గివున్న హదీసుల్ని

ఆచరించవచ్చుననే అంటారు. కానీ సామాన్య ప్రజలు ఆ బలహీనతల్ని గుర్తించలేరు. కనుక సామాన్యులు అసలు 'జయీఫ్' (బలహీన) హదీసుల జోలికి పోకుండా ఉండటమే మంచిది.

ప్రస్తుత కాలంలో షేఖ్ నాసిరుద్దీన్ అల్‌బానీ (రహ్మలై) గారు ఈ రంగంలో ఎనలేని సేవలు చేశారు. ఆయన నాలుగు సునన్ (అబూదావూద్, తిర్మిజీ, నసాయి, ఇబ్నెమాజా) గ్రంథాల్లో వున్న బలహీనమైన హదీసులన్నిటినీ వేరు చేసి పూర్తిగా ప్రామాణికమైన హదీసుల్ని ప్రత్యేక గ్రంథాలుగా క్రోడీకరించారు. దాంతో సామాన్య పండితులకు కూడా బలహీనమైన హదీసుల్ని గుర్తించటం సులభమై పోయింది. ఈ బృహత్తర పరిశోధనా కార్యంలో ఆయన వల్ల కూడా తప్పులు దొర్లి ఉండవచ్చు. ఏదేని సహీహ్ హదీసుని జయీఫ్‌గా, జయీఫ్ హదీసుని సహీహ్‌గా పేర్కొని ఉండవచ్చు. కాని అలాంటివి చాలా చాలా అరుదు. ఇక్కడ మేము చెప్ప దలచుకున్నదేమిటంటే, షేఖ్ అల్‌బానీలాగా హదీసుల లోపాలను గుర్తించగలిగేవాడు, హదీసుల మీద 'గట్టి నిఘా' ఉంచేవాడు మాత్రమే ఈ పని చేయగలడు. ప్రజల్లో బహుళ ప్రచారంలో ఉన్న నాలుగు సునన్ గ్రంథాల్లోని బలహీనమైన హదీసుల్ని వేరుపరచి ప్రామాణికమైన హదీసులన్నిటినీ క్రోడీకరించి సామాన్య ప్రజానీకానికి ఆయన మహోపకారం చేశారు. సామాన్య పండితులు ఆయన గ్రంథాలమూలంగా వీలైనంత ఎక్కువగా ప్రయోజనం పొందగలరు. అలాగాకుండా అల్‌బానీగారి అభిప్రాయం అంతిమ నిర్ణయం కానవసరం లేదంటూ ఆయనచేసిన సేవల్ని ఉపేక్షించటం భావ్యం కాదు. నిస్సందేహంగా ఆయన కూడా మానవ మాత్రులే. ఆయన అభిప్రాయాలు కొన్ని తప్పు కావచ్చు. ఆయన నిర్ణయాలు అంతిమ నిర్ణయాలు కాకపోవచ్చు. అలా అని చెప్పి ఆయన శ్రమను నిరుపయోగకరంగా లెక్కగట్టటం మాత్రం సమంజసం కాదు. ఇలాంటి పనికిమాలిన అనుమానాలతోటే చాలామంది "బుఖారీ -ముస్లిం హదీసులు అన్నిటికంటే ప్రామాణికమైనవి" అనే విషయాన్ని కూడా త్రోసిపుచ్చారు. మరి వీరి అభిప్రాయం కూడా సరైనదేనని భావించాలా? కాదు, ముమ్మాటికీ కాదు. అలాంటప్పుడు "అల్‌బానీ గారి పరిశోధనలు మాకవసరం లేదు" అని అనటం అర్థం లేనిమాట. హదీసు వేత్తలు హదీసుల్ని క్రోడీకరించి ముస్లిం సమాజానికి మహోపకారం చేశారు. అలాగే వారు ప్రతిపాదించిన సూత్రాలకు, నిబంధనలకు అనుగుణంగా వారి గ్రంథాలను కూడా పరిశీలించటం, పరిశోధించటం వాటిలో ఉన్న సహీహ్, జయీఫ్ హదీసుల్ని వేరుపరచటం కూడా హదీసువేత్తల కార్యంలో అంతర్భాగమే. ప్రస్తుత కాలంలో దేవుడు ఆ మహాభాగ్యాన్ని షేఖ్ నాసిరుద్దీన్ అల్‌బానీ గారికి ప్రసాదించాడు.

అది వేరే విషయం. అసలు హదీసులో చెప్పబడిందేమిటంటే- ఒక విషయం దైవప్రవక్త చెప్పారా లేదా అన్న మీమాంస ఏర్పడినప్పుడు అసలు ఆ విషయాన్ని ప్రజలకు బోధించకుండా ఉండటమే మంచిది. అలాగే జయీఫ్ హదీసుల్ని కూడా ప్రచారం చేయకూడదు. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే ఈ విషయంలో ఇంతటి తీవ్రమైన హెచ్చరికలు వచ్చినప్పటికీ చాలా మంది ఉలమాలు హదీసుల ప్రచారం విషయంలో చాలా నిర్లక్ష్యం వహిస్తున్నారు. తమ మాటల్లో చేవ తీసుకురావటానికని, శ్రోతల్ని రంజింప చేయటానికని వారు బలహీన హదీసుల్ని కాదు, కల్పితమైన హదీసులు కూడా వినిపిస్తుంటారు. దేవుడు అలాంటి ఉలమాలకు సద్బుద్ధిని ప్రసాదించుగాక! మరోవైపు కొంతమంది పండితులున్నారు.

వారు తమ ఫికహ్ శాస్త్రాలను బలపరచు కోవటం కోసం ప్రామాణికమైన హదీసుల్ని ఏదో ఒకరకంగా నిరుపయోగకరమైనవిగా చేసి తమ శాస్త్రాలకు అనుగుణంగా ఉన్న బలహీనమైన హదీసుల్ని బలపరచటానికి, వారి ప్రామాణికతను రుజువుచేయటానికి ప్రయత్నిస్తుంటారు.

١٣٨٢ - وَعَنْ أَبِي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ، قَالَ: «وَمَنْ سَلَكَ طَرِيقاً يَلْتَمِسُ فِيهِ عِلْماً، سَهَّلَ اللهُ لَهُ بِهِ طَرِيقاً إِلَى الجَنَّةِ» رواهُ مسلمٌ.

1382. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: (ధర్మ) జ్ఞానాన్ని ఆర్జించటం కోసం ఎవరయినా ఒక దారిన పడితే దేవుడు ఆ దారి గుండా అతని కోసం స్వర్గమార్గాన్ని సుగమం చేస్తాడు. (ముస్లిం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు "ముస్లింల అవసరాలను తీర్చటం" అనే అధ్యాయంలో ఇంకా వివరంగా వచ్చింది. ఇక్కడ జ్ఞానార్జన ప్రాముఖ్యతను వివరించటానికి అందులో కొంతభాగాన్ని పొందుపరచటం జరిగింది. జ్ఞానమంటే ఖుర్ఆన్ హదీసుల ద్వారా బోధపడే సరైన జ్ఞానం అని భావం.

١٣٨٣ - وَعَنْهُ، أَيضاً، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ، قال: «مَنْ دَعَا إلى هُدًى كَانَ لَهُ مِنَ الأَجْرِ مِثْلُ أُجُورِ مَنْ تَبِعَهُ لا يَنْقُصُ ذٰلِكَ مِنْ أُجُورِهِمْ شَيْئاً» رواهُ مسلمٌ.

1383. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: సన్మార్గం వైపుకు పిలిచిన వ్యక్తికి అతని పిలుపునందుకొని (సన్మార్గాన్ని) ఆచరించిన వారందరికీ లభించినంత పుణ్యం లభిస్తుంది. దానివల్ల వారి పుణ్యంలోనూ ఎలాంటి తగ్గింపు జరగదు. (ముస్లిం)

١٣٨٤ - وَعَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذَا مَاتَ ابْنُ آدَمَ انْقَطَعَ

1384. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన ఇంకొక కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఆదం పుత్రుడు (మనిషి)

عَمَلُهُ إِلَّا مِنْ ثَلاثٍ: صَدَقَةٍ جَارِيَةٍ، أَوْ عِلْمٍ يُنْتَفَعُ بِهِ، أَوْ وَلَدٍ صَالِحٍ يَدْعُو لَهُ» رواهُ مسلمٌ.

చనిపోగానే అతని కర్మల పరంపర అంతటితో ఆగిపోతుంది. అయితే మూడు కర్మల పుణ్యం మాత్రం అతనికి (ఆ తర్వాత కూడా) లభిస్తూనే ఉంటుంది. ఆ మూడు ఇవి: (1) శాశ్వతంగా ఉండిపోయే దానం (సదఖయె జారియా), (2) తన తదనంతరం ప్రజలకు ఉపయోగపడే విద్య (3) తన శ్రేయస్సు కోసం ప్రార్థించే సదాచార సంపన్నులయిన సంతానం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని వసియ్యత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కర్మల పరంపర ఆగిపోతుందంటే దానికి లభించే పుణ్యపరంపర ఆగిపోతుందని అర్థం. అయితే మూడు రకాల కర్మల వల్ల మాత్రం మనిషికి తను చనిపోయిన తర్వాత కూడా పుణ్యం లభిస్తూనే ఉంటుంది. వాటిలో మొదటిది శాశ్వతంగా ఉండిపోయే దానం. ఉదా: మస్జిదులు, ధార్మిక పాఠశాలలు, వైద్యశాలలు, ధర్మసత్రాలు మొదలగునవి. వీటిని తమ సొంత ఖర్చుతో నిర్మించేవారికి వారి మరణానంతరం కూడా పుణ్యఫలం లభిస్తూనే ఉంటుంది. రెండోది, ప్రయోజనకరమైన విద్య. అంటే ఇతరులకు చదువు చెప్పటం, పుస్తకాల రాసి విద్యను వ్యాపింపజేయటం మొదలగు పనులన్నమాట. ప్రజలు ఆ పుస్తకాల ద్వారా, వారి జ్ఞానం ద్వారా ప్రయోజనం పొందుతున్నంతకాలం వారికి పుణ్యం లభిస్తూనే ఉంటుంది. పోతే మూడోది మరియు చివరి కర్మ, సదాచార సంపన్నులయిన సంతానం ప్రార్థనలు. సదాచార సంపన్నులయిన సంతానం తమ పెద్దల కోసం ప్రార్థన (దుఆ) చేస్తే దాంతో వారికి పుణ్యంతోపాటు పరలోకంలో ఎంతో ప్రయోజనం కూడా కలుగుతుంది. కనుక పిల్లలకు మంచి విద్యాశిక్షణలు గరపటం చాలా అవసరం.

١٣٨٥ - وَعَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ، يَقُولُ: «الدُّنْيَا مَلْعُونَةٌ،

1385. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హ్రజత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: ప్రపంచం పాపిష్టిది, ప్రపంచంలో ఉన్నదంతా పాపిష్టిదే. దైవ

مَلْعُونٌ مَا فِيهَا، إِلَّا ذِكْرَ اللهِ تَعَالَى، وَمَا وَالاهُ، وَعَالِماً، أَوْ مُتَعَلِّماً» رواهُ الترمذيُّ وَقَالَ: حديثٌ حسنٌ. قولهُ «وَمَا وَالاهُ» أي: طَاعَةُ اللهِ.

ధ్యానం, దానికి సంబంధించినవి, ఇంకా ధర్మజ్ఞాని, జ్ఞానార్థి తప్ప! (తిర్మిజీ-హసన్)

మూలంలోని పదం 'వమా వాలాహు' అంటే దైవవిధేయత (దేవునికి విధేయత చూపుతూ ఆయన సామీప్యం కోసం చేసే పనులని భావం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'ఐహిక అనాసక్తత' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. ఇక్కడ ప్రపంచం, ప్రపంచంలోని వస్తువులు పాపిష్టివి అంటే నిజంగా అవి పాపిష్టివి అని కాదు. మనిషిని దేవుని నుండి ఏమార్చే వస్తువులని దాని అసలు భావం. ఆ విధంగా చూస్తే మనిషిని దైవారాధనలో లీనమవకుండా పరధ్యానంలో ఉంచే వస్తువులన్నీ కూడా పాపిష్టివిగానే పరిగణించబడతాయి. ఈ హదీసుని ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఔచిత్యమేమిటంటే, ప్రపంచంలో ఏ వస్తువు దేవుని ధ్యానం నుండి ఏమారుస్తుందో, ఏ విషయం దేవుని అప్రసన్నతకు కారణమవుతుందో తెలుసుకోవాలంటే ముందు జ్ఞానం అవసరం. జ్ఞానాన్ని బోధించేవారు, జ్ఞానాన్ని ఆర్జించేవారు మాత్రమే ఆ విషవలయంలో చిక్కుకోకుండా సురక్షితంగా ఉండగలుగుతారు. ఈ హదీసు జ్ఞానసముపార్జనా ప్రాముఖ్యతను వివరిస్తుంది. కనుక దీనిని ఇక్కడ పొందుపరచటం జరిగింది.

١٣٨٦ ـ وَعَنْ أنسٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ خَرَجَ فِي طَلَبِ العِلمِ، فَهو فِي سَبِيلِ اللهِ حتى يَرجِعَ» رواهُ التِّرمِذيُّ وَقَالَ: حديثٌ حَسَنٌ.

1386. హజ్రత్ అనస్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: జ్ఞానార్జనా ధ్యేయంతో బయలుదేరిన వ్యక్తి తిరిగొచ్చేవరకు దైవమార్గంలో ఉన్నట్లుగానే పరిగణించబడతాడు. (తిర్మిజీ-హసన్)

(సునసె తిర్మిజీలోని విద్యా అధ్యాయం)

## ముఖ్యాంశాలు

ఇందులో విద్యార్జన కోసం ప్రయాణం చేయటం దైవమార్గంలో జిహాద్ చేయటంతో సమానమని చెప్పబడింది. కాని ఈ హదీసు ఆధారాల రీత్యా బలహీనమైనదని షేఖ్ అల్‌బానీ గారంటున్నారు. ఆయన దీనిని 'తఖ్‌రీజ్ ఫిక్‌హుస్సీరత్' అనే గ్రంథంలో పేర్కొన్నారు. (అల్‌బానీ గారిచేత పరిశోధిత రియాజుస్సాలిహీన్ గ్రంథం చూడండి)

١٣٨٧ ـ وَعَنْ أَبِي سَعِيدٍ الخُدْرِيِّ، رَضِيَ اللهُ عَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قَالَ: «لَنْ يَشْبَعَ مُؤْمِنٌ مِنْ خَيْرٍ حَتَّى يَكُونَ مُنْتَهَاهُ الجَنَّةَ» رواهُ الترمذيُّ وَقَالَ: حديثٌ حَسَنٌ.

1387. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: విశ్వాసి తన అంతిమ స్థానమైన స్వర్గం లోకి ప్రవేశించేవరకు మంచి పనులు చేయటంలో అతని ఆత్రం చల్లారదు.
(తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని విద్యాప్రకరణం)

## ముఖ్యాంశాలు

విశ్వాసి మంచిపనులు చేయటంలో ఎల్లప్పుడూ ఎంతో ఆతురతని కనబరుస్తాడు. వాటిని చేయటంలో ఎన్నటికీ విసుగు చెందడు. మరణం వరకూ అదే స్థితిలో ఉండి మరణానంతరం స్వర్గంలోకి ప్రవేశిస్తాడు. ఈ హదీసును విద్యకు సంబంధించిన అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఔచిత్యం ఏమిటి? అని మీకు సందేహం రావచ్చు. మంచి పనులన్నిటిలోకెల్లా అత్యుత్తమమైనది ధర్మజ్ఞానాన్ని ఆర్జించటం. ఈ ధర్మజ్ఞానం సహాయంతోనే కదా మనిషి మంచీచెడుల మధ్య భేదాన్ని గుర్తించగలిగేది. అందుకే ఈ హదీసుని ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించారు.

١٣٨٨ ـ وَعَنْ أَبِي أُمَامَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «فَضْلُ الْعَالِمِ عَلَى الْعَابِدِ كَفَضْلِي عَلَى أَدْنَاكُمْ» ثُمَّ قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ اللهَ وَمَلَائِكَتَهُ وَأَهْلَ السَّمٰوَاتِ وَالأَرْضِ حَتَّى النَّمْلَةَ فِي جُحْرِهَا وَحَتَّى الحُوتَ لَيُصَلُّونَ عَلَى مُعَلِّمِي النَّاسِ الخَيْرَ» رواهُ الترمذي وَقَالَ: حَدِيثٌ حَسَنٌ.

1388. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో అందరి కన్నా అల్పునిమీద నాకెంత విశిష్టత ఉందో- ఒక జ్ఞానికి మరో ఆరాధకుడి మీద అంత విశిష్టత ఉంటుంది.

ఆ తర్వాత ఆయన ఇలా అన్నారు: ప్రజలకు మంచిని బోధించే వారి మీద దేవుడు కారుణ్యాన్ని కురిపిస్తాడు. ఇంకా దైవదూతలు, భూమ్యాకాశాల్లో ఉన్నవారు, ఆఖరికి చీమలు

తాముండే రంధ్రంలో నుండి, చేపలు (నీళ్ళలో నుండి) వారి మీద దైవ కారుణ్యం వర్షించాలని ప్రార్థిస్తూ ఉంటారు. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని విద్య అధ్యాయం)

## ముఖ్యాంశాలు

ఇక్కడ జ్ఞాని అంటే దేవుని విధుల్ని, ప్రవక్త సున్నత్ (సంప్రదాయా)లను నిర్వర్తిస్తూ మరోవైపు ధర్మజ్ఞానాన్ని ఆర్జించి ప్రజలకు మంచిపనుల గురించి బోధించేవాడని అర్థం. 'ఆరాధకుడు' అంటే తన సమయంలోని అధికభాగాన్ని దైవారాధన కోసం వెచ్చించేవాడని అర్థం. ఇతను ఎన్ని సున్నత్, నఫిల్ నమాజులు చేసినా దాని ప్రయోజనం తనవరకే పరిమితమై ఉంటుంది. దీనికి భిన్నంగా జ్ఞానులు చేసే ధర్మబోధ వల్ల ఇతరులకు కూడా ఎంతో ప్రయోజనం చేకూరుతుంది. అందుకే ఒక జ్ఞానికి సామాన్య ఆరాధకుడి కంటే ఎక్కువ విశిష్ఠత ఉంటుందని హదీసులో చెప్పబడింది.

హదీసు మూలంలో 'యుసల్లూన' అనే పదం వచ్చింది. సలాత్ అనేది దానికి మూలపదం. దేవుడు జ్ఞానులమీద సలాత్ పంపిస్తాడంటే వారిమీద కారుణ్యవర్షం కురిపిస్తాడని అర్థం. అదే దైవదూతలు జ్ఞానుల మీద సలాత్ పంపిస్తారంటే వారి మన్నింపు కోసం ప్రార్థిస్తారని భావం. ఇతర సృష్టిరాశులు సలాత్ పంపించటమంటే వారి శ్రేయస్సు కోసం ప్రార్థిస్తారని భావం. మొత్తానికి ధర్మజ్ఞానాన్ని ప్రజలకు బోధించే గురువుల మీద దేవుడు తన కారుణ్య వర్షాన్ని కురిపిస్తాడు. దైవదూతలు వారి మన్నింపు కోసం ప్రార్థిస్తారు. సృష్టిలోని మిగతా జీవరాశులన్నీ కూడా వారి శ్రేయస్సు కోసం దేవుణ్ణి ప్రార్థిస్తాయన్నమాట!

١٣٨٩ ـ وَعَنْ أَبِي الدَّرْدَاءِ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ سَلَكَ طَرِيقاً يَبْتَغِي فِيهِ عِلْماً سَهَّلَ اللهُ لَهُ طَرِيقاً إِلَى الجَنَّةِ، وَإِنَّ المَلَائِكَةَ

1389. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ దర్దా (రజి) తెలియజేశారు: (ధర్మ) జ్ఞానాన్ని వెతుక్కుంటూ బయలుదేరే వారి కోసం దేవుడు వారు నడిచే మార్గం గుండా స్వర్గమార్గాన్ని సుగమం చేస్తాడు. విద్యార్థి చేసే పనుల పట్ల ప్రసన్నులై దైవదూతలు అతని గౌరవార్థం తమ రెక్కలు ముడుచు

لَتَضَعُ أَجْنِحَتَهَا لِطَالِبِ العِلْمِ رِضًا بِمَا يَصْنَعُ، وَإِنَّ العَالِمَ لَيَسْتَغْفِرُ لَهُ مَنْ فِي السَّمٰوَاتِ وَمَنْ فِي الأَرْضِ حَتَّى الحِيتَانُ فِي المَاءِ، وَفَضْلُ العَالِمِ عَلَى العَابِدِ كَفَضْلِ القَمَرِ عَلَى سَائِرِ الكَوَاكِبِ، وَإِنَّ العُلَمَاءَ وَرَثَةُ الأَنْبِيَاءِ، وَإِنَّ الأَنْبِيَاءَ لَمْ يُوَرِّثُوا دِينَاراً وَلا دِرْهَماً وَإِنَّمَا وَرَّثُوا العِلْمَ. فَمَنْ أَخَذَهُ أَخَذَ بِحَظٍّ وَافِرٍ» رَوَاهُ أَبو داودَ والتِّرمذيُّ.

కుంటారు. భూమ్యాకాశాలలో ఉన్న వారు, ఆఖరికి నీళ్ళలో ఉండే చేపలు కూడా జ్ఞానుల మన్నింపు కోసం ప్రార్థిస్తూ ఉంటాయి. చంద్రునికి ఇతర నక్షత్రాల మీద ఎంత విశిష్ఠత ఉందో జ్ఞానులకు ఆరాధకుల మీద అంత విశిష్ఠత ఉంది. జ్ఞానులు దైవప్రవక్తల వారసులు. దైవప్రవక్తలు తమ వారసుల కోసం దిర్హంలు, దీనార్లు (మొదలగు ధనసంపదలు) వదలి వెళ్ళరు. వారు కేవలం జ్ఞానం మాత్రమే వదలి వెళ్తారు. కనుక ఎవరయితే ఆ జ్ఞానాన్ని నేర్చుకుంటారో వారు ఓ గొప్ప భాగ్యాన్ని పొందినట్లే.

(అబూదావూద్, తిర్మిజీ)

(సుననె అబూదావూద్‌లోని విద్యాప్రకరణం - సుననె తిర్మిజీలోని విద్య అధ్యాయం)

١٣٩٠ ـ وَعَنِ ابْنِ مَسْعُودٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «نَضَّرَ اللهُ امْرَءاً سَمِعَ مِنَّا شَيْئاً، فَبَلَّغَهُ كَمَا سَمِعَهُ، فَرُبَّ مُبَلَّغٍ أَوْعَى مِنْ سَامِعٍ». رواهُ الترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ صحيحٌ.

1390. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) తెలియజేశారు: "మా నుండి ఏదయినా విషయం విని దాన్ని యథాతథంగా ఇతరులకు చేరవేసిన వ్యక్తిని దేవుడు చల్లగా చూడుగాక! మా సందేశం చేరుకున్న వ్యక్తుల్లో కొందరు మా నుండి విషయాన్ని విన్నవారికంటే ఎక్కువ గుర్తుంచుకునేవారయి ఉండవచ్చు." (తిర్మిజీ-హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని విద్య అధ్యాయం)

**ముఖ్యాంశాలు:**

ఈ హదీసు విద్యార్జన, ధర్మప్రచార కార్యాల ప్రాముఖ్యతను వెల్లడిస్తోంది.

١٣٩١ ـ وَعَنْ أبي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ سُئِلَ عَنْ عِلْمٍ فَكَتَمَهُ، أُلْجِمَ يَوْمَ القِيَامَةِ بِلِجَامٍ مِنْ نَارٍ» رَوَاهُ أَبو داود والترمذيُّ وَقَالَ: حديثٌ حَسَنٌ.

1391. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా తనను ధర్మసందేహం గురించి అడిగితే (తనకు తెలిసికూడా) ఆ విషయాన్ని చెప్పకుండా దాచిపెట్టిన వ్యక్తి (నోటి)కి ప్రళయదినాన నిప్పుకళ్ళెం బిగిస్తారు.

*(అబూదావూద్, తిర్మిజీ-హసన్)*

*(సుననె అబూదావూద్‌లోని విద్యా ప్రకరణం - సుననె తిర్మిజీలోని విద్య అధ్యాయం)*

١٣٩٢ ـ وعنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ تَعَلَّمَ عِلْماً مِمَّا يُبْتَغَى بِهِ وَجْهُ اللهِ عَزَّ وَجَلَّ لا يَتَعَلَّمُهُ إلَّا لِيُصِيبَ بِهِ عَرَضاً مِنَ الدُّنْيَا لَمْ يَجِدْ عَرْفَ الجَنَّةِ يَوْمَ القِيَامَةِ» يَعْني: رِيحَهَا. رواهُ أَبو داودَ بإسنادٍ صَحيحٍ.

1392. హజ్రత్ అబూహురైరా (రజి)గారి మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవప్రసన్నత కోసం నేర్చుకునే విద్యని ఎవడైనా కేవలం ప్రాపంచిక ప్రయోజనాల కోసం నేర్చుకుంటే - అలాంటి వ్యక్తి ప్రళయదినాన స్వర్గసువాసన కూడా పొందలేడు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు)

*(సుననె అబూదావూద్‌లోని విద్యాప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ధర్మజ్ఞానాన్ని కేవలం దైవప్రసన్నత కోసం ఆర్జించాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. ఒకవేళ ప్రాపంచిక ప్రయోజనాల కోసం ధర్మజ్ఞానాన్ని ఆర్జిస్తే అది మహానేరంగా పరిగణించ బడుతుంది. అలాంటివారు పరలోకంలో స్వర్గ సువాసన కూడా పొందలేరు. అయితే ఆశించకుండానే ఏమైనా ప్రతిఫలం దొరికితే అది వేరే విషయం. దాన్ని పుచ్చుకోవడంలో ఎలాంటి పాపం లేదు.

١٣٩٣ - وَعَنْ عبدِ اللهِ بنِ عَمْرِو بنِ العاص رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يَقولُ: «إنَّ اللهَ لا يَقْبِضُ العِلْمَ انْتِزَاعاً يَنْتَزِعُهُ مِنَ النَّاسِ، وَلكِنْ يَقْبِضُ العِلْمَ بِقَبْضِ العُلَمَاءِ حَتَّى إذا لَمْ يُبْقِ عالماً، اتَّخَذَ النَّاسُ رُؤُوساً جُهَّالاً، فَسُئِلُوا فَأَفْتَوْا بِغَيْرِ عِلْمٍ، فَضَلُّوا وَأَضَلُّوا»

1393. దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తెలియజేశారు: దేవుడు జ్ఞానాన్ని ప్రజల హృదయాల నుండి లాక్కొని పైకిలేపుకోడు. అలాగాకుండా ఆయన ముందుగా జ్ఞానుల మరణం ద్వారా జ్ఞానాన్ని పైకి లేపుకుంటాడు. ఆ విధంగా ఒక్క జ్ఞానిని కూడా మిగలకుండా చేస్తాడు. ఆ తర్వాత ప్రజలు చదువులేని వారిని తమ గురువులుగా (నాయకులుగా) చేసుకుంటారు. వారిని ఏదయినా అడిగితే వారు తమ అజ్ఞానంతోనే తీర్పులు ఇస్తారు. ఫలితంగా తాము భ్రష్టులవుతారు. ఇతరుల్ని కూడా భ్రష్టు పట్టిస్తారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని విద్యా ప్రకరణాలు)

## ముఖ్యాంశాలు

ప్రళయానికి ముందు పొడసూపే ఆనవాళ్ళలో ఇది ఒకటి. ఆ కాలంలో పండితుల సంఖ్య గణనీయంగా తగ్గిపోతుంది. నిజమైన ధర్మజ్ఞానం కలవాళ్ళు లేకుండా పోతారు. అలాంటి పరిస్థితుల్లో అజ్ఞానులే తమంతటతాముగా నాయకులు, ఇమాములై కూర్చుంటారు. వారికి ఖుర్‌ఆన్ హదీసుల జ్ఞానం లేశమైనా ఉండదు. అయినప్పటికీ వారు ముఫ్తీలుగా, ముజ్తహిద్‌లుగా చెలామణి అవుతారు. తమ తీర్పుల ద్వారా, స్వయం కల్పిత తీర్మానాల ద్వారా తాము మార్గభ్రష్టులవుతారు. ఇతరుల్ని కూడా భ్రష్టత్వానికి గురిచేస్తారు. అందుకని భావితరాల కోసం వీలైనంత ఎక్కువమంది ధర్మజ్ఞానుల్ని తయారు చేయాలనీ, అదే సమయంలో అజ్ఞానుల్ని ధర్మనాయకులుగా నియమించకుండా జాగ్రత్తపడాలని ఈ హదీసు తాకీదు చేస్తోంది.

# ١٣ـ كِتَابُ حَمْدِ اللهِ تَعَالَى وَشُكْرِهِ

# దైవస్తోత్రం- దైవం పట్ల కృతజ్ఞతల ప్రకరణం

**242వ అధ్యాయం**

## ٢٤٢- بـاب فضـل الحمـد والشكر

## స్తోత్రం - కృతజ్ఞతల వైశిష్ట్యం

قال الله تعالى: ﴿فَاذْكُرُونِي أَذْكُرْكُمْ وَاشْكُرُوا لِي وَلَا تَكْفُرُونِ﴾[البقرة: ١٥٢] قال الله تعالى: ﴿لَئِن شَكَرْتُمْ لَأَزِيدَنَّكُمْ﴾ [إبراهيم: ٧] وَقَالَ تَعَالَى: ﴿وَقُلِ الْحَمْدُ لِلَّهِ﴾ [الإسراء: ١١١] وقَالَ تَعَالَى: ﴿وَءَاخِرُ دَعْوَاهُمْ أَنِ الْحَمْدُ لِلَّهِ رَبِّ الْعَالَمِينَ﴾ [يونس: ١٠].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మీరు నన్ను జ్ఞాపకం పెట్టుకోండి. నేను మిమ్మల్ని జ్ఞాపకం పెట్టుకుంటాను. నాకు కృతజ్ఞతలు తెలుపండి. చేసిన మేలును మరువకండి." *(అల్ బఖర: 152)*

"మీరు గనక కృతజ్ఞులయితే నేను మిమ్మల్ని ఇంకా ఎక్కువగా అనుగ్రహిస్తాను." *(ఇబ్రాహీమ్-7)*

"చెప్పండి, స్తోత్రం దేవునికే చెల్లుతుంది." *(బనీ ఇస్రాయీల్: 111)*

"విశ్వాసుల ప్రతి మాటకు ముగింపు ఇలా ఉంటుంది: స్తోత్రమంతా సకల లోకాల ప్రభువైన అల్లాహ్‌కు మాత్రమే." *(యూనుస్: 10)*

### ముఖ్యాంశాలు

దేవుణ్ణి జ్ఞాపకం పెట్టుకోవటమంటే ఆయనకు విధేయత చూపటం, సంతోష సమయాల్లో, విచార ఘడియల్లో, సర్వకాల సర్వావస్థల్లోనూ ఆయన్నే ఆరాధించటం, ఆయన ముందు తప్ప ఇతరుల ముందు చెయ్యి చాపకుండా ఉండటం. అలా చేసేవారిని దేవుడు కూడా జ్ఞాపకముంచుకుంటాడు. అంటే వారు మంచి స్థితిలో ఉంటే వారి స్థితిని మరింత సుఖమయం చేస్తాడు. తన కరుణాకటాక్షాలతో వారిని చల్లగా ఉంచుతాడు. ఒకవేళ వారు కష్టాల్లో

ఉంటే ఆ కష్టాల నుండి వారిని గట్టెక్కిస్తాడు. తమకు లభిస్తున్నవన్నీ దేవుడు ప్రసాదించినవేనని మనసారా అంగీకరించటాన్ని కృతజ్ఞత అంటారు. ఈ కృతజ్ఞత రెండు విధాలుగా ఉండవచ్చు. నోటితో దేవుణ్ణి స్తుతిస్తే అది నోటి పరమైన కృతజ్ఞత అవుతుంది. దైవాజ్ఞల్ని అమలు పరుస్తే అది ఆచరణాత్మకమైన కృతజ్ఞత అవుతుంది. పై రెండు విధాలుగానూ దేవునికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. లేకపోతే అది దైవం పట్ల కృతఘ్నుత అవుతుంది. కృతఘ్నుత చాలా పెద్ద పాపం.

١٣٩٤ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ أُتِيَ لَيْلَةَ أُسْرِيَ بِهِ بِقَدَحَيْنِ مِنْ خَمْرٍ وَلَبَنٍ، فَنَظَرَ إِلَيْهِمَا فَأَخَذَ اللَّبَنَ، فَقَالَ جبريلُ ﷺ: «الحَمْدُ للهِ الَّذي هَدَاكَ لِلفِطْرَةِ لَوْ أَخَذْتَ الخَمْرَ غَوَتْ أُمَّتُكَ» رواهُ مسلم.

1394. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)కు మేరాజ్ యానం చేయించబడినరోజు ఆయన ముందు రెండు పాత్రలు ఉంచ బడ్డాయి. వాటిలో ఒకటి మద్యంది-రెండోది పాలది. దైవప్రవక్త (సల్లం) వాటివైపు (పరీక్షగా) చూసి పాలపాత్ర ఎత్తుకున్నారు. అప్పుడు జిబ్రయీల్ (అలైహి) "మిమ్మల్ని సహజత్వం వైపు ప్రేరేపించిన దేవుడే స్తోత్రానికి అర్హుడు. మీరు మద్యం పాత్ర ఎత్తుకున్న ట్లయితే మీ అనుచర సమాజం భ్రష్టత్వానికి గురయ్యేది" అని అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఇస్లాం సహజమైన ధర్మం. సహజత్వాన్ని ప్రేమించే, నిష్కల్మషత్వంతో ఆలోచించే వారెవరూ ఈ ధర్మాన్ని తృణీకరించలేరు. 2) దేవుడు తమకు మంచి పనులు చేసే సద్బుద్ధినీ, సౌభాగ్యాన్ని ప్రసాదిస్తే అందుకుగాను దేవునికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. 3) మద్యపానం ఎన్నో చెడులకు దారితీస్తుంది. అందుకే దాన్ని 'ఉమ్ముల్ ఖబాయిస్' (చెడుల తల్లి) అని అంటారు. 4) సంఘటనల్ని మంచి శకునాలుగా భావించటంలో తప్పులేదు.

١٣٩٥ ـ وعَنْهُ عَنْ رسولِ اللهِ ﷺ قالَ: «كُلُّ أَمْرٍ ذِي بَالٍ لا يُبْدَأُ فِيهِ بـ:

1395. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: దైవాన్ని

الحَمْدُ للهِ فَهُوَ أَقْطَعُ» حديثٌ حَسَنٌ، رواهُ أَبو داود وغيرُهُ.

స్తుతించకుండా ప్రారంభించబడిన ప్రతి ముఖ్యమైన పనీ అసంపూర్ణంగానే మిగిలి పోతుంది.

ఈ హదీసు హసన్ కోవకు చెందినది. దీనిని అబూదావూద్ తదితరులు వెలికి తీశారు.

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం - సుననె ఇబ్నెమాజాలోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వేరొక ఉల్లేఖనంలో 'బిస్మిల్లాహ్'తో ప్రారంభించబడని ముఖ్యమైన పని అశుభంగా మిగిలిపోతుందని చెప్పబడింది. షేఖ్ అల్‌బానీ గారు ఈ రెండు హదీసులనూ అస్పష్టమైనవిగా, ఆధారాల రీత్యా బలహీనమైనవిగా ఖరారు చేశారు. అయితే ముర్సల్‌గా (అంటే తాబయీన్లు నేరుగా దైవప్రవక్త నుంచి చేసిన కథనం ప్రకారం) ఆ విధంగా దైవస్తోత్రం చేయటం సరైనదేనని ఆయన అభిప్రాయపడ్డారు. ఏమయినప్పటికీ ప్రతి పనికీ ముందు దైవనామాన్ని ప్రస్తావించు కోవటం లేదా దైవాన్ని ప్రస్తుతించుకోవటం అభిలషణీయమన్న విషయంలో మాత్రం ఎలాంటి సందేహం లేదు.

١٣٩٦ ـ وَعَنْ أَبِي مُوسى الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِذا مَاتَ وَلَدُ العَبْدِ قَالَ اللهُ تَعَالى لِمَلائِكَتِهِ: قَبَضْتُمْ وَلَدَ عَبْدِي؟ فَيَقُولُونَ: نَعَمْ، فَيَقُولُ: قَبَضْتُمْ ثَمَرَةَ فُؤَادِهِ؟ فَيَقُولُونَ: نَعَمْ، فَيَقُولُ: فَمَاذَا قَالَ عَبْدِي؟ فَيَقُولُونَ: حَمِدَكَ وَاسْتَرْجَعَ، فَيَقُولُ اللهُ

1396. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దాసుని సంతానం మరణించినప్పుడు దేవుడు తన దూతల్ని, "మీరు నా దాసుని బిడ్డ ప్రాణాలు తీశారా?" అని అడుగుతాడు. దూతలు 'అవున'ంటారు. దేవుడు మళ్ళీ "అతని హృదయ ఫలాన్ని కోశారా?" అని అడుగుతాడు. దైవ దూతలు 'ఔన'ంటారు. "మరి దానికి నా దాసుడు ఏమన్నాడు?" అని అడుగుతాడు దేవుడు. దానికి దూతలు

تَعَالى: ابْنُوا لِعَبْدِي بَيْتاً في الجَنَّةِ، وَسَمُّوهُ بَيْتَ الحَمْدِ» رواهُ الترمذي وقالَ: حديثٌ حسنٌ.

సమాధానమిస్తూ, "అతను నిన్ను స్తుతించాడు. ఆ తర్వాత 'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్' (మేము అల్లాహ్ వారము. మేమంతా ఆయన వైపుకు మరలిపోవలసిన వారము) అని అన్నాడు" అని చెబుతారు. అప్పుడు దేవుడు, "అయితే నా దాసుని కోసం స్వర్గంలో ఒక ఇల్లు నిర్మించండి. దానికి 'బైతుల్ హమ్ద్' (స్తోత్ర గృహం) అని పేరుపెట్టండి" అని దూతల్ని ఆజ్ఞాపిస్తాడు. *(తిర్మిజీ- హసన్)*

*(సుననె తిర్మిజీలోని జనాయెజ్ ప్రకరణం)*

١٣٩٧ - وعنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ اللهَ لَيَرْضى عَنِ العَبْدِ يَأْكُلُ الأَكْلَةَ فَيَحْمَدُهُ عَلَيْهَا، وَيَشْرَبُ الشَّرْبَةَ، فَيَحْمَدُهُ عَلَيْهَا» رواهُ مسلم.

1397. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఏదయినా తిన్నప్పుడు దైవానికి కృతజ్ఞతలు తెలుపుకునే వాడు, ఏదయినా పానీయం తాగినప్పుడు దైవానికి కృతజ్ఞతలు తెలుపుకునే దాసుని పట్ల దేవుడు ప్రసన్నుడౌతాడు. *(ముస్లిం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'సత్కార్య మార్గాలు అనేకం' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. మనం తీసుకునే అన్నపానీయాలు అవి ఎక్కువైనా, తక్కువైనా వాటిని సేవించినందుకు దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది.

# ١٤ـ كِتَابُ الصَّلوٰةِ عَلٰى رَسُوْلِ اللهِ ﷺ

# 14. దైవప్రవక్త (సల్లం) కోసం దరూద్ పఠన ప్రకరణం

**243వ అధ్యాయం**

## ٢٤٣- باب فضل الصلاة على رسول الله ﷺ

## దైవప్రవక్త (సల్లం) కోసం దరూద్ పఠించటం - దాని విశిష్టత

قالَ اللهُ تَعالى: ﴿إِنَّ ٱللَّهَ وَمَلَٰٓئِكَتَهُۥ يُصَلُّونَ عَلَى ٱلنَّبِيِّۚ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ صَلُّواْ عَلَيۡهِ وَسَلِّمُواْ تَسۡلِيمًا﴾ [الأحزاب: ٥٦].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"అల్లాహ్, ఆయన దూతలు దైవప్రవక్తపై 'దరూద్'ను పంపుతారు. విశ్వాసులారా! మీరు కూడా ఆయనకై దరూద్, సలామ్‌లు పంపండి."

*(అల్ అహ్‌జాబ్: 56)*

### ముఖ్యాంశాలు

'దరూద్'ను అరబీలో 'సలాత్' అంటారు. దేవుడు దరూద్ పంపటమంటే కారుణ్య వర్షం కురిపించటమనీ, దూతలు దరూద్ పంపటమంటే మన్నింపు కోసం ప్రార్థించటమనీ, విశ్వాసులు దరూద్ పంపటమంటే శ్రేయస్సు కోసం దుఆ చేయటమనీ ఇంతకుముందే చెప్పుకున్నాం. పైన పేర్కొనబడిన ఆయతులో దేవుడు ముస్లింలను దైవప్రవక్తకై దరూద్, సలామ్‌లు రెండూ పంపమని ఆదేశిస్తున్నాడు. దీని వివరాలు మున్ముందు 1406వ హదీసులో రాబోతున్నాయి.

١٣٩٨ ـ وعنْ عَبْدِ اللهِ بنِ عَمرِو بنِ العاصِ، رَضيَ اللهُ عَنْهُما أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يقولُ: «مَنْ صَلَّى عَلَيَّ صَلاةً، صَلَّى اللهُ عَلَيْهِ بِهَا عَشْرًا» مسلم

1398. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నారు: నా కోసం, ఒకసారి దరూద్ పఠించిన వ్యక్తి మీద దేవుడు పది కారుణ్యాలు కురిపిస్తాడు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దరూద్ పఠించటమంటే "అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్....." అనే దుఆను చివరి వరకూ పఠించటమని అర్థం. ఈ దుఆలో దైవప్రవక్త (సల్లం) మీద దేవుని కారుణ్య వర్షం కురవాలనీ, ఆయన అంతస్తులు పెరగాలనీ ప్రార్థించటం జరుగుతుంది. ఇలా ప్రార్థిస్తే ఎంతో పుణ్యం లభిస్తుంది. పై హదీసు కూడా ఈ విషయాన్ని తేటతెల్లం చేస్తోంది.

١٣٩٩ ـ وعَن ابن مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «أَوْلَى النَّاسِ بِي يَوْمَ القِيَامَةِ أَكْثَرُهُمْ عَلَيَّ صَلاةً» رواه الترمذي وقالَ: حديثٌ حسنٌ.

1399. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నాకోసం అందరికంటే ఎక్కువగా దరూద్ పఠించినవాడు ప్రళయదినాన నాకు అత్యంత చేరువలో ఉంటాడు.

(తిర్మిజీ-హసన్)

(తిర్మిజీలోని సలాత్ అధ్యాయం)

## ముఖ్యాంశాలు

అందరికన్నా చేరువలో ఉంటాడంటే దైవప్రవక్త (సల్లం) సిఫారసుకు అందరికన్నా ఎక్కువ హక్కుదారుడౌతాడని భావం. ఈ హదీసు కూడా దైవప్రవక్త (సల్లం) మీద అతి ఎక్కువగా దరూద్ పఠిస్తూ ఉండాలని ప్రబోధిస్తోంది.

١٤٠٠ ـ وعَن أَوس بن أَوْس رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ مِنْ أَفْضَلِ أَيَّامِكُمْ يَوْمَ الجُمُعَةِ، فَأَكْثِرُوا عَلَيَّ مِنَ الصَّلاةِ فِيهِ، فَإِنَّ صَلاتَكُمْ مَعْرُوضَةٌ عَلَيَّ» فقالوا: يا رَسُولَ اللهِ! وَكَيْفَ تُعْرَضُ صَلاتُنَا عَلَيْكَ وَقَدْ أَرَمْتَ؟! ـ قَالَ: يقولُ: بَلِيتَ ـ قالَ: «إِنَّ اللهَ حَرَّمَ عَلَى الأَرْضِ أَجْسَادَ الأَنْبِيَاءِ». رواهُ أبو داود بإسنادٍ صَحيحٍ.

1400. హజ్రత్ ఔస్ బిన్ ఔస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) (తన సహచరులకు ప్రబోధిస్తూ), "మీరోజుల్లో జుమా రోజు (శుక్రవారం) అత్యంత శ్రేష్ఠమైనది. కనుక ఆ రోజు నా కోసం ఎక్కువగా దరూద్ పఠించండి. మీరు పఠించే దరూద్ నాకు చేరవేయబడు తుంది" అని అన్నారు. అది విని సహచరులు, "దైవప్రవక్తా! మేము పఠించే దరూద్ మీకు ఎలా చేరవేయ బడుతుంది. అప్పటికి మీరు మట్టిలో

కలిసిపోయి ఉంటారు కదా?" అని అడిగారు. అందుకాయన, "దేవుడు, దైవప్రవక్తల శరీరాలను మట్టి కోసం నిషేధించాడు" అని చెప్పారు. (అబూదావూద్ ఈ హదీసును దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)

*(అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మట్టికోసం నిషేధించటమంటే మట్టి వాటిని తినకుండా చేయటమని అర్థం. అంటే మట్టి దైవప్రవక్తల శరీరాలను తినకుండా ఉంచుతుందని భావం. అందువల్ల ప్రవక్తల భౌతిక కాయాలు మట్టిలో కృశించిపోకుండా ఉంటాయి. మనం దైవప్రవక్త (సల్లం)కోసం పఠించే దరూద్, దైవదూతల ద్వారా ఆయనకు చేరవేయబడుతుంది. ఇతర హదీసుల ద్వారా కూడా ఈ విషయం బోధపడుతోంది.

ఇంకో విషయం ఏమిటంటే ఆ సమయంలో ఆయన ఆత్మను శరీరంలోకి ప్రవేశింప జేయటం జరుగుతుంది. దాంతో ఆయన, తనకు సలాం చేసిన వారికి ప్రతిసలాం కూడా చేయగల్గుతారు. (హదీసువేత్తల దృష్టిలో ఆత్మను శరీరంలోకి తిరిగి ప్రవేశింపజేయటమనే హదీసు 'హసన్' కోవకు చెందినది. అంటే ఆమోద యోగ్యమైనదేనన్నమాట) ఈ హదీసు మొదట్లోని కొంతభాగం 'జుమానాటి విశిష్టత' అనే అధ్యాయంలో ప్రస్తావనకు వచ్చింది.

١٤٠١ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «رَغِمَ أَنْفُ رَجُلٍ ذُكِرْتُ عِنْدَهُ فَلَمْ يُصَلِّ عَلَيَّ» رواه الترمذي وقالَ: حديثٌ حسنٌ.

1401. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: తన ముందు నా పేరు ప్రస్తావించబడినప్పటికీ నా కోసం దరూద్ పఠించని వ్యక్తి ముక్కుకి మన్ను తగులుగాక! (తిర్మిజీ-హసన్)

*(సుననె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముక్కుకి మన్ను తగలటమంటే, అవమానం, పరాభవం పాలుగావటమని అర్థం. దైవప్రవక్త శుభనామం విన్నప్పుడు దరూద్ పఠించే బదులు బొటనవేళ్ళకు ముద్దుపెట్టుకొని

కళ్ళకద్దుకునేవారు ఈ హదీసు నుండి గుణపాఠం నేర్చుకోవాలి. దైవప్రవక్త శుభనామం విన్నప్పుడు దరూద్ పఠించమనే ఆదేశం ఉందిగాని బొటనవేళ్ళకు ముద్దుపెట్టుకోమని ఎక్కడా లేదు. పోతే దైవప్రవక్త పేరు విన్నప్పుడు దరూద్ పఠించటం తప్పనిసరా లేక కేవలం అభిలషణీయమా? అన్న విషయంలో స్వల్పమైన భేదాభిప్రాయం ఉంది. కొంతమంది పండితులు తప్పనిసరి (వాజిబ్) అని అంటే మరికొందరు అభిలషణీయం (ముస్తహబ్) అని అంటున్నారు.

١٤٠٢ - وعَنهُ رَضِيَ اللهُ عَنهُ قَالَ: قَالَ رَسُولُ الله ﷺ: «لا تَجْعَلُوا قَبْرِي عِيداً، وَصَلُّوا عَلَيَّ، فَإِنَّ صَلاتَكُمْ تَبْلُغُنِي حَيْثُ كُنْتُمْ» رواهُ أبو داود بإسنادٍ صحيحٍ.

1402. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు నా సమాధిని తిరునాళ్ళుగా చేసుకోకండి. నా కోసం దరూద్ పఠించండి. మీరెక్కడున్నా మీరు పఠించే దరూద్ నాకు చేరుతుంది. (అబూదావూద్ ఈ హదీసుని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని మనాసిక్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"నా సమాధిని తిరునాళ్ళుగా చేసుకోకండి" అంటే తిరునాళ్ళలోలాగా నా సమాధి దగ్గర గుమిగూడి ఉత్సవాలు జరపకండి అని భావం. దురదృష్టవశాత్తు ధర్మంలో కొత్తపోకడలు లేవనెత్తే ఒకవర్గం ఈ విధంగా సమాధుల దగ్గర ఉత్సవాలు, వేడుకలు జరపటాన్ని చాలా మంచిపనిగా భావిస్తోంది. కాని దైవప్రవక్త (సల్లం) అంతటివారే తన సమాధి దగ్గర ఉత్సవాలు, వేడుకలు జరుపరాదని వారిస్తున్నారు. మరి అలాంటప్పుడు సామాన్య వలీల, పుణ్యాత్ముల సమాధుల దగ్గర తిరునాళ్ళు, జాతరలు, ఉత్సవాలు, వేడుకలు నిర్వహించటం ధర్మసమ్మతం ఎట్లా అవుతుంది? కొంతమంది ఈ హదీసు భావాన్ని వక్రీకరించి చెప్పటానికి ప్రయత్నిస్తున్నారు. "నా సమాధిని తిరునాళ్ళుగా చేసుకోకండి" అంటే "తిరునాళ్ళకులాగా ఏడాదికోసారి రాకండి. అడపాదడపా, తరచూ వస్తూ ఉండండి"అని అర్థం తీస్తున్నారు. ఎంత తేడా! వాస్తవానికి దాని అర్థం అది కాదు. ఆ తర్వాతి వాక్యాలు పరిశీలిస్తే అసలు భావం ఏమిటో సులభంగా బోధపడుతుంది. తర్వాత దైవప్రవక్త ఏమంటున్నారో చూడండి- మీరెక్కడున్నా మీ దరూద్ నాకు చేరుకుంటుంది- అంటే మీరు పనిగట్టుకొని నా దగ్గరికి రానవసరం లేదనే కదా అర్థం. దైవప్రవక్త (సల్లం) సమాధి దగ్గరకు అసలు వెళ్ళనేకూడదు అని మా అభిప్రాయం ఎంతమాత్రం కాదు. ప్రవక్త సమాధిని సందర్శించాలన్న అభిలాష ప్రతి ముస్లింకూ ఉంటుంది. అలా

సందర్శించటం ముస్తహబ్ (అభిలషణీయమన్న) విషయంలోనూ ఎలాంటి సందేహం లేదు. అయితే దైవప్రవక్త సమాధి సందర్శనం కోసం, లేదా అక్కడకెళ్ళి దరూద్ పఠించటం కోసం పనిగట్టుకొని వెళ్ళాల్సిన అవసరం లేదు. దానికి బదులు మస్జిదె నబవీని దర్శించుకునే ఉద్దేశ్యంతో మదీనా నగరానికి బయలుదేరి అలాగే ప్రవక్త సమాధిని కూడా చూసి వద్దాం అని అనుకోవాలి.

١٤٠٣ ـ وعنهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَا مِنْ أَحَدٍ يُسَلِّمُ عَلَيَّ إِلَّا رَدَّ اللهُ عَلَيَّ رُوحِي حَتَّى أَرُدَّ عَلَيْهِ السَّلامَ» رواهُ أبو داود بإسنادٍ صحيحٍ.

1403. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరైనా నాకు సలాం చేస్తే (ఆ సమయంలో) దేవుడు తప్పకుండా నా ఆత్మను నా వద్దకు త్రిప్పిపంపిస్తాడు. దాంతో నేనతనికి ప్రతిసలాం చేయ గలుగుతాను. (అబూదావూద్ ఈ హదీసుని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు)

(సుననె అబూదావూద్‌లోని మనాసిక్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దీనిద్వారా దైవప్రవక్త (సల్లం) సమాధిలో బ్రతికే ఉన్నారనీ, తనకు సలాం చేసేవారికి ఆయన ప్రతిసలాం చేస్తూ ఉంటారని బోధపడుతోంది. అయితే ఆ జీవితం సమాధి జీవితం కనుక దాని వాస్తవాలు మనకు తెలియవు. దైవప్రవక్తలు సమాధుల్లో బ్రతికే ఉంటారన్న విషయం నిజమే అయినప్పటికీ- వారి జీవితం కూడా మన ప్రపంచ జీవితం లాగే ఉంటుందనీ పైగా అది ఇంకా పరిపూర్ణంగా ఉంటుందని వాదించటం సమంజసం కాదు. ఈ వాదన నిరాధారమైనది. పైగా ఖుర్‌ఆన్ హదీసుల వివరాలకు విరుద్ధమైనది. ఒకవేళ దైవప్రవక్త (సల్లం) ప్రపంచంలోలాగా బ్రతికే ఉంటే ఆత్మను త్రిప్పిపంపాల్సిన అవసరం ఏముంటుంది? ఆత్మ అవసరం లేకుండానే ప్రతిసలాం చేయగలిగేవారు కదా! అయితే ఈ సందర్భంగా మనకో సందేహం రావచ్చు. ప్రపంచంలో కోట్లాది ముస్లింలున్నారు. వాళ్ళలో ఎవరో ఒకరు అనుక్షణం దరూద్ పఠిస్తూనే ఉంటారు. అలా అయితే మాటిమాటికీ ఆత్మను త్రిప్పిపంపించటం ఎలా సాధ్యమవుతుంది? దీనికి సమాధానం ఒక్కటే. ఈ అనుమానం దేవునిమీద అవిశ్వాసానికి తార్కాణం. దేవుడు తన ఆత్మను త్రిప్పి పంపిస్తాడని స్వయంగా దైవప్రవక్త (సల్లం) చెప్పిన తర్వాత మన పని దాని వాస్తవికతను విశ్వసించటం వరకే. అది ఎలా జరుగుతుంది? దానిస్థితి

ఎలా ఉంటుంది? అనే విషయాలు మనకు అనవసరం. దేవుడు అన్నీ చేయగల సమర్థుడన్న విషయాన్ని మనం ఎల్లప్పుడూ గుర్తుపెట్టుకోవాలి. మనం విశ్వసించే అగోచర విషయాల్లో దీన్ని కూడా ఒకటిగా భావించాలి. వాటి వాస్తవిక పరిస్థితి గురించి దేవునికి తప్ప మరెవరికీ తెలియదు. మొత్తానికి ఈ హదీసులో వీలైనంత ఎక్కువగా దైవప్రవక్త (సల్లం) కోసం దరూద్‌లు పఠిస్తూ, ఆయనకు సలాములు చేస్తూ ఉండాలని ప్రబోధించబడింది. అలా చేస్తే దైవప్రవక్త (సల్లం) కూడా ప్రతిసలాం చేస్తారు. ఆయనచేత ప్రతిసలాం చేయించుకోవటం నిజంగా మహాభాగ్యం.

١٤٠٤ - وعن عَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «الْبَخِيلُ مَنْ ذُكِرْتُ عِنْدَهُ، فَلَمْ يُصَلِّ عَلَيَّ». رواهُ الترمذي وقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

1404. హజ్రత్ అలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తన ముందు నా ప్రస్తావన వచ్చినప్పటికీ నాపై దరూద్ పఠించనివాడు పిసినిగొట్టు.

*(తిర్మిజీ-హసన్, సహీహ్)*

*(సునసె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అసలు పిసినారితనమంటే ఏమిటీ? ఒకరికి చెందవలసిన హక్కు ఇవ్వకపోవటం. అదే పిసినారితనం. దైవప్రవక్త (సల్లం) ముస్లింల ఇహపరాల సాఫల్యం కోసం, వారి సౌభాగ్యం కోసం ఎంతగానో కృషిచేశారు. అలాంటి మహనీయునికి ఏమీ ఇవ్వలేకపోయినప్పటికీ కనీసం ఆయన శుభనామం విన్నప్పుడు ఆయన కోసం దరూద్ పఠించటమయినా చేయాలి. ముఖ్యంగా తీరికవేళల్లో, ఎలాంటి ఒత్తిడులూ లేనప్పుడు దరూద్ పఠిస్తూ ఉండాలి. అదేమీ ఖర్చుతో కూడుకున్న పనికూడా కాదు. అయినప్పటికీ ఏ ముస్లిం అయినా ప్రవక్త శుభనామం వినికూడా ఆయన కోసం దరూద్ పఠించటం లేదంటే అతన్ని పరమ పీనాసిగా భావించాలి. చెప్పొచ్చేదేమిటంటే దైవప్రవక్త (సల్లం) శుభనామం విన్నప్పుడు దరూద్ పఠించాలి. లేదా కనీసం 'సల్లల్లాహు అలైహి వ సల్లం' అని అయినా అనాలి. ఈ సంక్షిప్త వాక్యంలో దరూద్, సలాంలు రెండూ ఉన్నాయి.

١٤٠٥ - وَعَنْ فَضَالَةَ بنِ عُبَيْدٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعَ رَسُولُ اللهِ ﷺ رَجُلًا يَدْعُو فِي صَلَاتِهِ لَمْ يُمَجِّدِ اللهَ تَعَالَى،

1405. హజ్రత్ ఫజాలా బిన్ ఉబైద్ (రజి) కథనం: ఒక వ్యక్తి నమాజు చేసి దుఆ చేయటానికి ఉపక్రమించాడు. అయితే (దానికి ముందు) అతను దైవస్తోత్రం చేయలేదు. దైవప్రవక్త (సల్లం) కోసం దరూద్ కూడా

పఠించలేదు. అది చూసి దైవప్రవక్త (సల్లం) 'ఇతను తొందరపడ్డాడు' అని అన్నారు. ఆ తర్వాత అతన్ని దగ్గరికి పిలిచి అతన్నో లేక మరో వ్యక్తినో ఉద్దే శ్యించి, "మీలో ఎవరయినా నమాజ్ చేసి (ఆ తర్వాత దుఆ చేయాలను కుంటే) ముందు దైవస్తోత్రంతో ప్రారం భించాలి. తర్వాత దైవప్రవక్తపై దరూద్ పఠించాలి. ఆ తర్వాత తమకిష్ట మొచ్చింది ప్రార్థించుకోవాలి" అని ఉపదేశించారు.

(అబూదావూద్, తిర్మిజీ-సహీహ్)

وَلَـمْ يُصَـلِّ عَلَـى النَّبِـيِّ ﷺ، فقـالَ رسولُ اللهِ ﷺ: «عَجِلَ هذا» ثُمَّ دَعَاهُ فقالَ لَهُ - أَوْ لِغَيْـرِهِ -: «إِذا صَلَّـى أَحَـدُكُـمْ فَلْيَبْـدَأْ بِتَحْمِيدِ رَبِّهِ سُبْحَانَهُ، وَالثَّنَاءِ عَلَيْهِ، ثُمَّ يُصَلِّي عَلَى النَّبِيِّ ﷺ، ثُمَّ يَدْعُو بَعْدُ بِمَا شَاءَ». رواهُ أَبـو داوُدَ والتـرمـذي وقـال: حـديـثٌ حسن صحيحٌ.

(సునన్ అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం - సునన్ తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దుఆ అంటే నమాజ్ తర్వాత చేసే దుఆ అయినా లేక సలాంకు ముందు తషహ్హుద్, దరూద్‌ల తర్వాత చేసే దుఆలోనయినా సరే (మొదటి అభిప్రాయమే సముచితంగా కనిపిస్తోంది) ముందుగా దైవాన్ని స్తుతించి, దరూద్ పఠించి ఆ తర్వాతే ప్రార్థన (దుఆ) చేయాలి.

1406. హజ్రత్ అబూ ముహమ్మద్ కాబ్ బిన్ ఉజ్రా (రజి) కథనం: ఓ రోజు దైవప్రవక్త (సల్లం) మా దగ్గరికి వచ్చారు. అప్పుడు మేమాయన్ని "దైవప్రవక్తా! మీపై సలాం పంపే విధానమయితే తెలుసు. కాని మీపై దరూద్ ఎలా పంపాలి?" అని అడిగాం. అందు కాయన ఈ విధంగా పఠించమని చెప్పారు:

"అల్లాహుమ్మ! సల్లి అలా ముహమ్మద్

١٤٠٦ - وعَنْ أَبي محمدٍ كَعْبِ بنِ عُجْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: خَرجَ عَلَيْنَا النَّبِيُّ ﷺ فَقُلْنَا: يَا رَسولَ اللهِ! قَدْ عَلِمْنَا كَيْفَ نُسَلِّمُ عَلَيْكَ، فَكَيْفَ نُصَلِّي عَلَيْكَ؟

قَالَ: «قُولُوا اللَّهُمَّ! صَلِّ عَلَى مُحَمَّدٍ، وَعَلَى آلِ مُحَمَّدٍ، كَمَا صَلَّيْتَ عَلَى آلِ إِبْرَاهِيمَ، إِنَّكَ حَمِيدٌ مَجِيدٌ. اللَّهُمَّ! بَارِكْ عَلَى مُحَمَّدٍ، وَعَلَى آلِ مُحَمَّدٍ، كَمَا بَارَكْتَ عَلَى آلِ إِبْرَاهِيمَ، إِنَّكَ حَمِيدٌ مَجِيدٌ» متفقٌ عليهِ.

వ అలా ఆలి ముహమ్మద్ కమాసల్లైత అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మద్ వ అలా ఆలి ముహమ్మద్ కమా బారక్త అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్." (అల్లాహ్! ఇబ్రాహీమ్ పరివారాన్ని కరుణించినట్లుగానే ముహమ్మద్‌ను, ఆయన పరివారాన్ని కూడా కరుణించు. నిస్సందేహంగా నీవు స్వయంగా స్తుతి పాత్రుడవు. ఎంతో ఘనత కలవాడవు. నీవు ఇబ్రాహీమ్ పరివారంపై శుభాలు కురిపించినట్లు గానే ముహమ్మద్‌పై, ఆయన పరివారంపై కూడా శుభాలను కురిపించు. నిస్సందేహంగా నీవు స్వయంగా స్తుతి పాత్రుడవు, ఎంతో ఘనత కలవాడవు.)

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) సహచరులు తమకు సలాం పంపే విధానం తెలుసని చెప్పారు. అత్తహియ్యాత్‌లో "అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు" అన్న పలుకులే అవి. దైవప్రవక్త (సల్లం) ఆదేశం మేరకు సహచరులు నమాజుల్లో ఈ విధంగా పఠిస్తూ ఉండేవారు. కొంతకాలం తర్వాత "దైవప్రవక్తకై దరూద్, సలామ్‌లు పంపండి" అనే ఖుర్ఆన్ సూక్తి అవతరించింది. అప్పుడు సహచరులు తమకు సలాం ఎలా పఠించాలో తెలుసు కాని, దరూద్ ఎలా పఠించాలి? అని సందేహంలో పడిపోయారు. ఈ విషయమే దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించారు. అప్పుడాయన ఈ హదీసు ద్వారా ఆ విషయాన్ని స్పష్టీకరించారు. ఆ విధంగా ఖుర్ఆన్ ఆదేశం మేరకు నమాజులో దరూద్; సలామ్‌లు రెండూ సంపూర్ణమయ్యాయి. అంటే ఒక ముస్లిం ప్రతి నమాజులో దరూద్, సలామ్‌లు రెండూ పఠిస్తాడన్నమాట!

ధర్మంలో కొత్త పుంతలు తొక్కే ప్రభృతులు కొందరు దరూద్, సలామ్‌ల కోసం 'అస్సలాతు

వస్సలాము అలైక యా రసూలల్లాహ్' అనే కొత్త మాటను కల్పించుకున్నారు. వారిని అలా ఎందుకు చదువుతారని అడిగితే 'దరూదే ఇబ్రాహీమ్'లో కేవలం దరూద్ మాత్రమే ఉంది. మేము కల్పించుకున్న వాక్యంలోనయితే దరూద్, సలామ్‌లు రెండూ ఉన్నాయి. చూడండి!' అని అంటారు. పైగా వారు ఆ వాక్యపఠనం కోసం ప్రత్యేక సమయాన్ని కూడా నిర్ణయించు కున్నారు. అజాన్‌కు ముందు ఈ వాక్యం పఠించాలని చెబుతారు. అసలు విషయం ఏమిటంటే దైవప్రవక్త (సల్లం) ప్రవచించిన పలుకులు, వచనాలు వీరికి సంతృప్తికరంగా లేవు. వీరికి ఆయన విధానం పట్ల అభిమానం కూడా లేదు. అందుకే తమ తరఫు నుండి ధర్మంలో కొత్తకొత్త విషయాలను సృష్టించుకుంటున్నారు. కాని వాస్తవానికి ఇహపరాల సాఫల్యం, శ్రేయో శుభాలు దైవప్రవక్త విధానాన్ని అనుసరించటంలోనే ఉన్నాయి.

١٤٠٧ ـ وعَنْ أَبي مَسْعُودٍ البَدْرِيِّ، رَضِيَ اللهُ عَنْهُ، قَالَ: أَتَانا رَسُولُ اللهِ ﷺ وَنَحْنُ في مَجْلِسِ سعدِ بنِ عُبَادَةَ رَضِيَ اللهُ عَنْهُ، فقالَ لَهُ بَشِيرُ بنُ سَعْدٍ: أَمَرَنا اللهُ أَنْ نُصَلِّيَ عَلَيْكَ يَا رسولَ اللهِ ﷺ، فَكَيْفَ نُصَلِّي عَلَيْكَ؟ فَسَكَتَ رَسُولُ اللهِ ﷺ، حَتَّى تَمَنَّيْنَا أَنَّه لَمْ يَسْأَلْهُ ثُمَّ قَالَ رسولُ اللهِ ﷺ: «قولُوا: اللَّهمَّ صَلِّ عَلى مُحَمَّدٍ، وَعَلى آلِ مُحَمَّدٍ، كَمَا صَلَّيْتَ

1407. హజ్రత్ అబూమస్‌వూద్ బద్రీ (రజి) కథనం: ఓ రోజు దైవప్రవక్త (సల్లం) మా దగ్గరికి వచ్చారు. ఆ సమయంలో మేము సాద్ బిన్ ఉబాదా (రజి) సమావేశంలో కూర్చొని ఉన్నాం. అప్పుడు బషీర్ బిన్ సాద్ (రజి) ఆయన్ని ఉద్దేశ్యించి 'దైవప్రవక్తా! దేవుడు మమ్మల్ని మీపై దరూద్ పంపమని ఆదేశిస్తున్నాడు. అయితే మేము ఏమని మీపై దరూద్ పంపాలి?' అని అడిగారు.

ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) మౌనం వహించారు. ఆయన మౌనం చూసి మాకు ఈ మనిషి ఆయన్ని ఈ విషయం అడిగి ఉండకపోతే బాగుండుననిపించింది. కాసేపు మౌనం తర్వాత దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా పఠించమని బోధించారు: "అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మద్, వ అలా ఆలి ముహమ్మద్ కమా సల్లైత

عَلَى إِبْرَاهِيمَ، وَبَارِكْ عَلَى مُحَمَّدٍ، وَعَلَى آلِ مُحَمَّدٍ، كَمَا بَارَكْتَ عَلَى إِبْرَاهِيمَ، إِنَّكَ حَمِيدٌ مَجِيدٌ؛ وَالسَّلَامُ كَمَا قَدْ عَلِمْتُمْ» رواهُ مسلمٌ.

అలా ఇబ్రాహీమ, వ బారిక్ అలా ముహమ్మద్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త అలా ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మ్మజీద్." (అల్లాహ్! నీవు ఇబ్రాహీమ్‌ను కరుణించినట్లుగానే ముహమ్మద్‌ను, ఆయన పరివారాన్ని కూడా కరుణించు. నీవు ఇబ్రాహీమ్‌పై శుభాలు కురిపించినట్లు గానే ముహమ్మద్‌పై ఆయన పరివారంపై కూడా శుభాలను కురిపించు. నిస్సందేహంగా నీవు స్వయంగా స్తుతిపాత్రుడవు, ఎంతో ఘనత కలవాడవు.)

ఆ తర్వాత ఆయన, 'పోతే, సలామ్ పద్ధతి మీకు తెలిసిందే' అని అన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం)పై సలాం పంపే పద్ధతి సహచరులు అంతకుముందు నుంచి పఠిస్తూ వస్తుందేనని ఈ హదీసులో కూడా వివరించారు. ఆ పద్ధతి స్వయంగా ఆయన నేర్పినదే. అత్తహియ్యాత్‌లోని "అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు" అన్న పలుకులే అవి. పరివారం (ఆల్) అంటే దైవప్రవక్త సతీమణులు, బనూ హాషిమ్, బనూ అబ్దుల్ ముత్తలిబ్ తెగవారిలో ఆయన్ని విశ్వసించిన బంధువులు అని భావం. అయితే మరికొంతమంది పండితులు దైవప్రవక్త విధానాన్ని అనుసరించేవారందరూ ఆయన పరివారం క్రిందికే వస్తారని తలపోస్తున్నారు.

ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే తమకు ఏదయినా విషయం తెలియకపోతే పండితుల్ని అడిగి తెలుసుకోవాలి. అంతేగాని స్వయంగానే ధర్మంలో వినూత్న పోకడలు సృష్టించరాదు. ఇంకోవిషయం - పండితులంటే మిడిమిడి జ్ఞానంతో ఇతరుల అభిప్రాయాలను వల్లిస్తూ తమస్వంతంగా ఆలోచించి తీర్పులిచ్చే వారు కాదు. ఖుర్ఆన్ హదీసుల వెలుగులో తీర్పులిచ్చేవారే పండితులు. కనుక వారినే సంప్రదించాలి.

١٤٠٨ ـ وَعَنْ أَبِي حُمَيْدٍ السَّاعِدِيِّ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالُوا يَا رَسولَ الله! كَيْفَ نُصَلِّي عَلَيْكَ؟ قَالَ: «قولُوا: اللَّهُمَّ! صَلِّ عَلى مُحَمَّدٍ، وَعَلى أَزْوَاجِهِ وَذُرِّيَّتِهِ، كَمَا صَلَّيْتَ على إبْرَاهِيمَ، وَبَارِكْ عَلَى مُحَمَّدٍ وَعَلى أَزْوَاجِهِ وَذُرِّيَّتِهِ، كَمَا بَارَكْتَ عَلى إبْرَاهِيمَ، إنَّكَ حَمِيدٌ مَجِيدٌ» متفقٌ عليهِ.

1408. హజ్రత్ అబూ హుమైద్ అస్సాయిదీ (రజి) కథనం ప్రకారం (తామొకసారి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ) "దైవప్రవక్తా! మేము మీపై దరూద్ ఎలా పఠించాలి?" అని అడిగారు. అందుకాయన ఈ విధంగా పఠించమని చెప్పారు: "అల్లాహుమ్మ! సల్లి అలా ముహమ్మద్ వ అలా అజ్వాజిహీ వజుర్రియ్యతిహీ కమాసల్లైత అలా ఇబ్రాహీమ వ బారిక్ అలా ముహమ్మద్ వ అలా అజ్వాజిహీ, వ జుర్రియ్యతిహీ కమా బారక్త అలా ఇబ్రాహీమ ఇన్నక హమీదుంమ్ మ్మజీద్." (అల్లాహ్! ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీమ్‌ను కరుణించావో అదే విధంగా ముహమ్మద్‌ను, ఆయన సతీమణులను, ఆయన సంతానాన్ని కూడా కరుణించు. అలాగే ఏ విధంగా నయితే నీవు ఇబ్రాహీమ్‌పై శుభాలు కురిపించావో అదే విధంగా ముహమ్మద్‌పై, ఆయన సతీమణులపై, ఆయన సంతానంపై కూడా శుభాలను కురిపించు. నిస్సందేహంగా నీవు గౌరవనీయుడవు. స్వయంగానే స్తుతి పాత్రుడవు.) (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అహాదీసుల్ అంబియా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మూలంలో 'అజ్వాజ్' అనే పదం వచ్చింది. అజ్వాజ్ అనేది 'జౌజ్'కు బహువచనం. జౌజ్ అంటే అసలు జత అని అర్థం. స్త్రీ పురుషునికి జత అవుతుంది. పురుషుడు స్త్రీకి జత అవుతాడు. అందుకే అరబీలో ఈ పదం స్త్రీ పురుషులిద్దరి కోసం వాడబడుతుంది. మొత్తానికి ఇక్కడ అజ్వాజ్ అంటే దైవప్రవక్త సతీమణులని భావం. వీరు మొత్తం పదకొండుమంది. వారిలో ఇద్దరు భార్యలు ఆయన బ్రతికుండగానే చనిపోయారు. ఇక మిగతా తొమ్మిది మంది భార్యలూ దైవప్రవక్త (సల్లం) చనిపోయిన తరువాత కూడా బ్రతికే ఉన్నారు. ఇస్లాం ధర్మం ప్రకారం ఒక పురుషుడు ఏకకాలంలో నలుగురి కంటే ఎక్కువమంది స్త్రీలను వివాహమాడటం ధర్మసమ్మతం కాదు. అయితే ఈ విషయంలో దైవప్రవక్త (సల్లం)కు మినహాయింపు ఉంది. అదేమిటంటే దేవుడు ఆయనకు ఏకకాలంలో పదకొండుమంది స్త్రీలను వివాహ మాడేందుకు అనుమతినిచ్చాడు. ఆ అనుమతిలో కూడా ఎన్నో విజ్ఞతా వివేచనాలు ఇమిడి ఉన్నాయి. అలాంటి ఎన్నో కారణాలను ఇస్లామీయ విద్వాంసులు వివరించారు. (ఫత్హుల్ బారీ, నికాహ్ ప్రకరణం చూడండి)

దైవప్రవక్త సతీమణులు ఆయన పరివారం (ఆల్) క్రిందికి రారని కొంతమంది వాదిస్తారు. వారి వాదనను కూడా ఈ హదీసు ఖండిస్తోంది. ఈ హదీసే కాదు, ఖుర్ఆన్ ద్వారా కూడా భార్యలు తమ భర్తల పరివారం క్రిందికే వస్తారని తెలుస్తోంది. ఇకపోతే దైవప్రవక్త కొడుకులు, కూతుళ్ళు, వాళ్ళ సంతానం అందరూ కూడా ఆయన పరివారం క్రిందికే వస్తారు. అయితే ఆయన మరణానంతరం ఆయన సంతానంలో హజ్రత్ ఫాతిమా మరియు ఆమె సంతానం తప్ప మరెవరూ మిగిలి ఉండలేదు.



# ١٥ ـ كِتَابُ الأَذْكَار

# 15. దైవ ధ్యాన ప్రకరణం

**244వ అధ్యాయం**

## ٢٤٤ ـ بَابُ فَضْلِ الذِّكْرِ وَالْحَثِّ عَلَيْهِ

## దైవస్మరణం విశిష్టత - ప్రోత్సాహం

قَالَ اللهُ تَعَالَى: ﴿وَلَذِكْرُ ٱللَّهِ أَكْبَرُ﴾ [العنكبوت: ٤٥] وقالَ تَعَالَى: ﴿فَٱذْكُرُونِىٓ أَذْكُرْكُمْ﴾ [البقرة: ١٥٢] وقالَ تَعَالَى: ﴿وَٱذْكُر رَّبَّكَ فِى نَفْسِكَ تَضَرُّعًا وَخِيفَةً وَدُونَ ٱلْجَهْرِ مِنَ ٱلْقَوْلِ بِٱلْغُدُوِّ وَٱلْآصَالِ وَلَا تَكُن مِّنَ ٱلْغَٰفِلِينَ﴾ [الأعراف: ٢٠٥] وقالَ تَعَالَى: ﴿وَٱذْكُرُوا۟ ٱللَّهَ كَثِيرًا لَّعَلَّكُمْ تُفْلِحُونَ﴾ [الجمعة: ١٠]، وقالَ تَعَالَى: ﴿إِنَّ ٱلْمُسْلِمِينَ وَٱلْمُسْلِمَٰتِ﴾ إلى قوله تعالى: ﴿وَٱلذَّٰكِرِينَ ٱللَّهَ كَثِيرًا وَٱلذَّٰكِرَٰتِ أَعَدَّ ٱللَّهُ لَهُم مَّغْفِرَةً وَأَجْرًا عَظِيمًا﴾ [الأحزاب: ٣٥]. وقالَ تَعَالَى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱذْكُرُوا۟ ٱللَّهَ ذِكْرًا كَثِيرًا ﴿٤١﴾ وَسَبِّحُوهُ بُكْرَةً وَأَصِيلًا﴾ [الأحزاب: ٤١، ٤٢] والآيات في الباب كثيرة معلومة.

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"అల్లాహ్ సంస్మరణ అన్నిటికంటే గొప్పది." *(అన్‌కబూత్: 45)*

"మీరు నన్ను జ్ఞాపకం చేసుకోండి. నేను మిమ్మల్ని జ్ఞాపకం చేసుకుంటాను." *(బఖర: 152)*

"నీ ప్రభువును ఉదయమూ సాయంత్రమూ స్మరించు, లోలోపల వినయంతోనూ భయపడుతూనూ, మెల్లగా నోటితో కూడా. నిర్లక్ష్యం చేసే వారిలో నీవు చేరకు." *(ఆరాఫ్: 205)*

"అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తూ ఉండండి, బహుశా మీకు సాఫల్య భాగ్యం కలుగవచ్చు." *(జుముఅహ్: 10)*

"నిశ్చయంగా ముస్లిములూ, విశ్వాసులూ...... అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించేవారూ అయిన స్త్రీపురుషుల నిమిత్తం అల్లాహ్ క్షమాభిక్షను, గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు." *(అహ్‌జాబ్: 35)*

"విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి. ఉదయం, సాయంత్రం ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండండి." *(అహ్‌జాబ్: 41-42)*

ఈ అధ్యాయానికి సంబంధించిన సుప్రసిద్ధ సూక్తులు ఇంకా చాలా ఉన్నాయి.

## ముఖ్యాంశాలు

పై సూక్తుల్లో దేవుణ్ణి స్మరిస్తూ ఉండాలని ఆదేశించబడింది. ఈ సంస్మరణ వివిధ రకాలుగా ఉండవచ్చు. దేవుడు మనిషికి విధించిన ఆచరణల్ని పాటించటం, ఆయన సామీప్యానికి చేర్చే పనుల్ని నిర్వహించటం కూడా ఒక విధంగా దైవనామస్మరణే. అలాగే దేవుణ్ణి స్తుతించటం, ఆయన పవిత్రతను కొనియాడటం నోటిపరమైన స్మరణ అయితే విశ్వవ్యవస్థలోని వైచిత్రాల మీద, నిదర్శనాల మీద యోచన చేసి దేవుని అస్తిత్వాన్ని గుర్తించటం, ఆయన పట్ల విశ్వాసాన్ని, నమ్మకాన్ని పెంపొందించుకోవటం మనసుకు సంబంధించిన స్మరణ అవుతుంది. అలాగే ఇంకో రకమైన జిక్ర్ (స్మరణ) కూడా ఉంటుంది. అది అవయవాల ద్వారా వ్యక్తమవుతుంది. ఉదా: మనిషి ఎల్లప్పుడూ దైవిధేయతకు కట్టుబడి ఉండటం, నమాజ్ ఉపవాసాలు పాటించటం, హజ్ చేయటం, జకాత్ సదఖా దానాలు చేయటం మొదలగునవి. మొత్తానికి దైవసంస్మరణ అంటే మనిషి తన నోటిద్వారా, మనస్సు ద్వారా, అవయవాల ద్వారా దేవుణ్ణి ప్రస్తుతిస్తూ ఆయన పట్ల తనకున్న విశ్వాసాన్ని వ్యక్తపరుస్తూ ఉండటం. అలా చేసేవారి మీద దేవుడు తన కారుణ్య వర్షాన్ని కురిపిస్తాడు. వారు గనక కష్టాల్లో ఉంటే ఆ కష్టాల నుండి వారిని గట్టెక్కిస్తాడు. వారి పాపాలను ఉపేక్షిస్తాడు.

١٤٠٩ - وعَنْ أَبِي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «كَلِمَتَانِ خَفِيفَتَانِ عَلَى اللِّسَانِ ثَقِيلَتَانِ فِي المِيزَانِ، حَبِيبَتَانِ إِلَى الرَّحْمٰنِ: سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ، سُبْحَانَ اللهِ العَظِيمِ» متفقٌ عليهِ.

1409. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రెండు వచనాలున్నాయి. అవి పలకటానికి చాలా తేలికగా ఉంటాయి. కాని త్రాసులో మాత్రం చాలా బరువుని తూస్తాయి. ఇంకా అవి కరుణామయునికి చాలా ప్రియమైనవి. అవే 'సుబ్హానల్లాహి వబిహమ్దిహీ సుబ్హానల్లాహిల్ అజీమ్' (దేవుడు తన స్తోత్రాలతోపాటు పరమ పవిత్రుడు. మహోన్నతుడైన అల్లాహ్ పరమ పవిత్రుడు.) (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కర్మలకు బరువు ఉంటుందని చెప్పటానికి ఈ హదీసు ప్రబల నిదర్శనం. ప్రళయ దినాన మానవుని కర్మలు త్రాసులో తూయబడతాయి. బహుశా ఆ రోజు దేవుడు కర్మలకు ఒక ఆకారం ప్రసాదించవచ్చు లేదా కొంతమంది చెప్పినట్లు కర్మలు వ్రాయబడివున్న పత్రాలనే తూయటం జరుగుతుంది. ఒక నిరాకార వస్తువుకి దేవుడు ఆకారాన్ని ప్రసాదించటం అసాధ్యమేమీ కాదు. ఏమయినప్పటికీ ఈ హదీసులో పేర్కొనబడిన రెండు వచనాలు పఠించటానికి తేలికగా ఉన్నా ప్రళయదినాన అవి ఎంతో బరువుని తూస్తాయి. కనుక ప్రతి ముస్లిం వీటిని అత్యధికంగా పఠిస్తూ ఉండాలి.

١٤١٠ - وعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قال: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لأَنْ أَقُولَ: سُبْحَانَ اللهِ، وَالحَمْدُ للهِ، وَلا إِلٰهَ إِلَّا اللهُ، وَاللهُ أَكْبَرُ؛ أَحَبُّ إِلَيَّ مِمَّا طَلَعَتْ عَلَيْهِ الشَّمْسُ» رواه مسلم.

1410. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "సుబ్‌హానల్లాహి వల్‌హమ్దులిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్" అని పలకటం నాకు సూర్యుడు ఉదయించే (ప్రపంచం లోని) వస్తువులన్నిటికంటే ప్రియ మైనది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన వాక్యాల్లో దేవుని స్తోత్రం, ఆయన పవిత్రత, ఔన్నత్యాలు కీర్తించ బడ్డాయి. కనుక ఈ వాక్యాలు ప్రపంచంలోని సిరిసంపదలన్నిటి కంటే ఎంతో గొప్పవి. అదీగాక ఈ వాక్యాలు 'బాఖియాతుస్సాలిహాత్' (శాశ్వతంగా మిగిలిఉండే సత్కర్మల) క్రిందికి వస్తాయి. వాటిని పఠించేవారికి ఎంతో పుణ్యం లభిస్తుంది. దీనికి భిన్నంగా ప్రపంచంలోని సిరిసంపదలన్నీ ఏదో ఒక నాడు నశించిపోయేవే. కనుక మనిషి ఎల్లప్పుడూ మిగిలి ఉండేవాటినే ప్రేమించాలి. నశించిపోయేవాటి కోసం ప్రాకులాడరాదు.

١٤١١ - وعنهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ قَالَ لا إِلٰهَ إِلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، لَهُ المُلْكُ وَلَهُ الحَمْدُ، وَهُوَ

1411. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: రోజుకి వందసార్లు 'లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీక

عَلى كُلِّ شَيْءٍ قَدِيرٌ، فِي يَوْمٍ مِائَةَ مَرَّةٍ كَانَتْ لَهُ عَدْلَ عَشْرِ رِقَابٍ وَكُتِبَتْ لَهُ مِائَةُ حَسَنَةٍ، وَمُحِيَتْ عَنْهُ مِائَةُ سَيِّئَةٍ، وَكَانَتْ لَهُ حِرْزاً مِنَ الشَّيْطَانِ يَوْمَهُ ذٰلِكَ حَتَّى يُمْسِيَ، وَلَم يَأْتِ أَحَدٌ بِأَفْضَلَ مِمَّا جَاءَ بِهِ إِلَّا رَجُلٌ عَمِلَ أَكْثَرَ مِنْه» وقال: «من قالَ سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ، فِي يَوْمٍ مِائَةَ مَرَّةٍ، حُطَّتْ خَطَايَاهُ، وَإِنْ كَانَتْ مِثْلَ زَبَدِ البَحْرِ» متفقٌ عليه.

లహూ, లహుల్ ముల్కు వలహుల్ హమ్దు, వహువ అలా కుల్లి షైయిన్ ఖదీర్' (అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు ఎవ్వడూ లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు సహవర్తులు ఎవరూలేరు. విశ్వసామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే శోభి స్తుంది. ఆయన ప్రతి వస్తువుపై అధికారం కలవాడు) అని పలికేవారికి పదిమంది బానిసల్ని విడిపించినంత పుణ్యం లభిస్తుంది. అతని కోసం (అతని కర్మల ఖాతాలో) వంద పుణ్యాలు లిఖించబడతాయి. వంద పాపాలు తుడిచిపెట్టబడతాయి. ఆ రోజు సాయంత్రం వరకు ఈ పలుకులు అతన్ని షైతానుల నుండి రక్షిస్తాయి. ప్రళయ దినాన (దేవుని సన్నిధికి) వచ్చేవారిలో అతనికన్నా గొప్ప విశిష్ఠత మరెవరికీ ఉండదు. అయితే అతని కన్నా ఎక్కువగా ఆ వాక్యాలు పఠించినవారు ఇంకా విశిష్ఠతను కలిగి ఉండవచ్చు.

వేరొక హదీసులో ఆయన (సల్లం) ఇలా అన్నారు: రోజుకి వందసార్లు 'సుబ్హానల్లాహి వబిహమ్దిహీ' అని పఠించేవారి పాపాలు సముద్రపు నురుగుకు సమానంగా ఉన్నాసరే అవన్నీ సమసిపోతాయి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇక్కడ పాపాలంటే చిన్నచిన్న పాపాలని భావం. ఘోరపాపాలు తౌబా (పశ్చాత్తాపం)తోనే క్షమించబడతాయి. ఈ విషయం ఇంతకు ముందు కూడా చాలాసార్లు వివరించబడింది.

١٤١٢ ـ وعَنْ أَبِي أَيوبَ الأَنصَارِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قال: «مَنْ قَالَ لا إِلٰـهَ إِلَّا اللهُ وَحْـدَهُ لا شَـرِيكَ لَـهُ، لَـهُ المُلْكُ، وَلَهُ الحَمْدُ، وَهُوَ عَلَى كُلِّ شَيْءٍ قَدِيرٌ، عَشْرَ مَرَّاتٍ: كَانَ كَمَنْ أَعْتَقَ أَرْبَعَةَ أَنْفُسٍ مِنْ وَلَدِ إِسْمَاعِيلَ» متفقٌ عليه.

1412. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవడయితే పదిసార్లు 'లా ఇలాహ ఇల్లల్లాహ్ వహ్దహూ లా షరీకలహూ, లహుల్ ముల్కు, వలహుల్ హమ్దు వహువ అలాకుల్లి షైయిన్ ఖదీర్' అని అంటాడో అతను ఇస్మాయీల్ (అలైహి) సంతతికి చెందిన నలుగురు బానిసల్ని విడిపించిన వాడుగా పరిగణించబడతాడు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇస్మాయీల్ సంతతి అనేది ఇక్కడ ఉపమానం కోసం ఉపయోగించబడింది. అంటే ఎంతో విలువైన బానిసల్ని అని భావం.

١٤١٣ ـ وعَنْ أَبِي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ لِي رَسُولُ اللهِ ﷺ: «أَلا أُخْبِرُكَ بِأَحَبِّ الكَلَامِ إِلَى اللهِ؟ إِنَّ أَحَبَّ الكَلَامِ إِلَـى اللهِ: سُبْحَـانَ اللهِ وَبِحَمْـدِهِ» رواه مسلم.

1413. హజ్రత్ అబూజర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాతో (మాట్లాడుతూ) ఇలా అన్నారు: 'దేవునికి అత్యంత ప్రియమైన పలుకు ఏదో నీకు తెల్పనా?' దేవునికి అత్యంత ప్రియమైన పలుకు 'సుబ్హానల్లాహి వబిహమ్దిహీ.'

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

١٤١٤ - وعَنْ أَبي مالكٍ الأشْعَرِيِّ رَضيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «الطُّهُورُ شَطْرُ الإيمَانِ، وَالحَمْدُ للهِ تَمْلأُ المِيزَانَ، وَسُبْحَانَ اللهِ، وَالحَمْدُ للهِ تَمْلآنِ - أَوْ تَمْلأُ - مَا بَيْنَ السَّمٰوَاتِ وَالأَرْضِ» رواهُ مسلم.

1414. హజ్రత్ అబూ మాలిక్ అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "పరిశుభ్రత సగం విశ్వాసం (ఈమాన్). అల్ హమ్దులిల్లాహ్ (అనే పలుకు) త్రాసుని నింపేస్తుంది. సుబ్‌హానల్లాహ్, అల్‌హమ్దులిల్లాహ్ అనే పలుకులు త్రాసుని నింపేస్తాయి లేక భూమి ఆకాశాల మధ్య ఉన్న స్థలాన్ని నింపేస్తాయి." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం ఈ హదీసులో విశ్వాసం అంటే నమాజు అని భావం. దివ్యఖుర్‌ఆన్‌లో కూడా ఒకచోట నమాజుని విశ్వాసం అని చెప్పటం జరిగింది. ఉదా: 'దేవుడు మీ విశ్వాసాలను వ్యర్థం చేయడు' (బఖర:143). నమాజ్‌ను విశ్వాసమనుకుంటే పరిశుభ్రతను లేక వుజూను మనం సగం విశ్వాసంగా తలచవచ్చు. నమాజ్ నెరవేరాలంటే వుజూ అవసరం. వుజూ లేనిదే నమాజ్ నెరవేరదు. మరికొంతమంది పండితులు ఇక్కడ (ఈమాన్) విశ్వాసమంటే సాధారణంగా మనం చెప్పుకునే షరీఅత్‌పరమైన ఈమాన్ అని అంటున్నారు. అంటే దేవుణ్ణి, దైవప్రవక్తను మనస్ఫూర్తిగా నమ్మటం. విశ్వాసాన్ని సాధారణ అర్థంలో తీసుకుంటే 'పరిశుభ్రత సగం విశ్వాసం' అన్న వాక్యానికి అర్థమేంటి? అనే ప్రశ్న తలెత్తవచ్చు. దానికి సమాధానం ఏమిటంటే పరిశుభ్రత విశ్వాసానికి గల ముఖ్య ఆధారాల్లో చాలా ముఖ్యమైన ఆధారమన్న మాట. ఉదాహరణకు దైవప్రవక్త (సల్లం) 'హజ్ అంటే అరఫాయే' అని అన్నారు. దానిభావం అరఫాత్ మైదానంలో ఆగటం హజ్ ముఖ్య విధుల్లో అతిముఖ్య విధి అని. మొత్తానికి ఈ హదీసు పరిశుభ్రత ఆవశ్యకతను, దాని ప్రాముఖ్యతను నొక్కి చెబుతోంది.

రెండో విషయం- హదీసులో పేర్కొనబడిన ధ్యాన వచనాలకు ఎంతో విశిష్టత ఉంది. ఈ వచనాలకే గనక ఒక ఆకారాన్ని కల్పిస్తే అవి దేవుని త్రాసునీ, భూమ్యాకాశాల మధ్య స్థలాన్ని కూడా నింపేస్తాయి. ఇవి దేవుని అసామాన్య దాతృత్వానికి, విస్తారమైన కారుణ్యానికి ప్రబల నిదర్శనాలు.

١٤١٥ - وعَنْ سَعْدِ بنِ أَبي وَقَّاصٍ رَضيَ اللهُ عَنْهُ قَالَ: جَاءَ أَعْرَابِيٌّ إلى رَسُولِ اللهِ ﷺ فقَالَ: عَلِّمْنِي كَلاماً أَقُولُهُ.

1415. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం: ఒక పల్లెవాసి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "నేను తరచూ

قَالَ: «قُلْ: لا إِلٰهَ إِلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، اللهُ أَكْبَرُ كَبِيراً، وَالحَمْدُ للهِ كَثِيراً، وَسُبْحَانَ اللهِ رَبِّ العَالَمِينَ، وَلا حَوْلَ وَلا قُوَّةَ إِلَّا بِاللهِ العَزِيزِ الحَكِيمِ» قَالَ: فَهٰؤُلاءِ لِرَبِّي، فَمَا لِي؟ قَالَ: «قُلِ: اللَّهُمَّ! اغْفِرْ لِي، وَارْحَمْنِي، وَاهْدِنِي، وَارْزُقْنِي» رواهُ مسلم.

పలుకుతూ ఉండటానికి అనువైన పలుకులు నేర్పించండి నాకు" అని అన్నాడు. అందుకు దైవప్రవక్త (సల్లం) అతనికి ఈ విధంగా పలకమని ఉపదేశించారు-

"అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు సరిసమానులు ఎవరూ లేరు. అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, మహోన్న తుడు. అత్యధిక స్తోత్రం ఆయనకే శోభిస్తుంది. అల్లాహ్ పరిశుద్ధుడు. ఆయన సర్వలోకాల ప్రభువు. పాపాల నుండి కాపాడుకునే భాగ్యం, సత్కా ర్యాలు చేసే సామర్థ్యం దేవుని నుండే లభిస్తుంది. ఆయన సర్వాధికుడు, వివేచనాపరుడు."

ఇది విని ఆ పల్లెవాసి "ఇవన్నీ నా ప్రభువుకి సంబంధించినవి కదా! మరి నా కోసం ఏంటి?" అని అడిగాడు. అందుకాయన అతనికి ఈ విధంగా పలుకుతూ ఉండమని ఉపదేశించారు:

"అల్లాహ్! నన్ను క్షమించు. నన్ను కరుణించు, నాకు సన్మార్గం చూపు. నీ అనుగ్రహాన్ని ప్రసాదించు."

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

١٤١٦ ـ وعَنْ ثَوبَانَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ إِذَا انْصَرَفَ مِنْ صَلاتِهِ اسْتَغْفَرَ ثَلاثاً، وقال: «اللَّهُمَّ! أَنْتَ السَّلامُ وَمِنْكَ السَّلامُ، تَبَارَكْتَ يَا ذا الجَلالِ وَالإِكْرَامِ» قِيلَ لِلأَوْزَاعِيِّ، وَهُوَ أَحَدُ رُواة الحديث: كَيْفَ الاسْتِغْفَارُ؟ قال: تقول: أَسْتَغْفِرُ اللهَ، أَسْتَغْفِرُ اللهَ. رواهُ مسلمٌ.

1416. హజ్రత్ సౌబాన్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నమాజ్ ముగించుకున్న తర్వాత మూడుసార్లు క్షమాపణలు వేడుకునేవారు. ఆ తర్వాత ఈ దుఆ చేసేవారు: "అల్లాహుమ్మ అన్‌తస్సలాము వ మిన్‌క స్సలాము. తబారక్త యా జల్‌జలాలి వల్‌ఇక్రామ్"

ఈ హదీసుని ఉల్లేఖించినవారిలో ఒకరైన ఇమామ్ అవ్‌జాయీ గారిని ఎవరో అడిగారు: "దైవప్రవక్త క్షమాపణలు ఎలా వేడుకునేవారు?" అని. అందుకు అవ్‌జాయీగారు సమాధానమిస్తూ, "అస్తగ్‌ఫిరుల్లాహ్, అస్తగ్‌ఫిరుల్లాహ్" అని పలికేవారని చెప్పారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

١٤١٧ ـ وعَنِ المُغِيرَةِ بنِ شُعْبَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ، كَانَ إِذَا فَرَغَ مِنَ الصَّلاةِ وَسَلَّمَ قال: «لا إِلٰهَ إِلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، لَهُ المُلْكُ وَلَهُ الحَمْدُ، وَهُوَ عَلى كُلِّ شَيْءٍ قَدِيرٌ. اللَّهُمَّ! لا مَانِعَ لِمَا أَعْطَيْتَ، وَلا مُعْطِيَ لِمَا مَنَعْتَ، وَلا يَنْفَعُ ذَا الجَدِّ مِنْكَ الجَدُّ» متفقٌ عليه.

1417. హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నమాజ్ ముగించిన తర్వాత ఇలా అనేవారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు భాగస్వాములు ఎవరూ లేరు. విశ్వసామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే శోభిస్తుంది. ఆయన ప్రతి వస్తువుపై అధికారం కలవాడు. అల్లాహ్! నీవిచ్చే దాన్ని అడ్డుకునే వాడెవడూ లేడు. నీవు అడ్డుకున్న దాన్ని ఇచ్చే వాడెవడూ లేడు.

ఇంకా హోదాదారుణ్ణి నీ పట్టు నుండి కాపాడటానికి అతని హోదా ఎందుకూ పనికిరాదు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)

١٤١٨ - وعَنْ عبدِ اللهِ بن الزُّبَيْرِ رَضِيَ اللهُ تَعَالَى عنهُمَا أَنَّهُ كَانَ يَقُولُ دُبُرَ كُلِّ صَلاةٍ، حِينَ يُسَلِّمُ: «لا إِلٰهَ إِلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، لَهُ المُلْكُ وَلَهُ الحَمْدُ، وَهُوَ عَلى كُلِّ شَيْءٍ قَدِيرٌ. لا حَوْلَ وَلا قُوَّةَ إِلَّا بِاللهِ، لا إِلٰهَ إِلَّا اللهُ، وَلا نَعْبُدُ إِلَّا إِيَّاهُ، لَهُ النِّعْمَةُ، وَلَهُ الفَضْلُ وَلَهُ الثَّنَاءُ الحَسَنُ. لا إِلٰهَ إِلَّا اللهُ مُخْلِصِينَ لَهُ الدِّينَ وَلَوْ كَرِهَ الكَافِرُونَ». قَالَ ابنُ الزُّبَيْرِ: وَكَانَ رَسُولُ اللهِ ﷺ يُهَلِّلُ بِهِنَّ دُبُرَ كُلِّ صَلاةٍ مَكْتُوبَةٍ. رواه مسلم.

1418. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి) ప్రతి నమాజు చివర్లో సలాం చేసిన తర్వాత ఇలా పలికేవారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు భాగస్వాములు ఎవరూ లేరు. విశ్వసామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే చెల్లుతుంది. ఆయనకు ప్రతి వస్తువుపై అధికారం ఉంది. పాపాల నుండి కాపాడుకోవాలన్నా, మంచి పనులు చేయాలన్నా దైవసాయంతోనే సాధ్యమవుతుంది. అలాంటి అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. మేము ఆయన్నే ఆరాధిస్తాం. అనుగ్రహాలూ, వరాలన్నీ ఆయన ప్రసాదించినవే. మంచి స్తోత్రం ఆయనకే శోభిస్తుంది. అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. అవిశ్వాసులకు ఎంత అయిష్టకరంగా ఉన్నా సరే మేము మా విధేయతను ఆయన కోసమే ప్రత్యేకించుకున్నాం.

ఇబ్నె జుబైర్ ఇలా అంటున్నారు: దైవప్రవక్త (సల్లం) ప్రతి ఫర్జ్ నమాజ్ తర్వాత ఈ వచనాలతో దేవుని

ఏకత్వాన్ని, ఆయన ఔన్నత్యాన్ని చాటేవారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలో ప్రార్థనా స్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

నమాజ్ తర్వాత వెంటనే పైన హదీసులో పేర్కొన్న విధంగా దైవాన్ని స్తుతించటం ప్రవక్త సంప్రదాయం. దీనికి భిన్నంగా నమాజ్ అయిన వెంటనే కేవలం కలిమయె తయ్యిబా పఠించటం లేదా సామూహికంగా సలాత్, సలామ్‌లు పఠించటం ధర్మంలో ఓ కొత్త పోకడ మాత్రమే. ఇలా చేసేవారికి ఎలాంటి పుణ్యం లభించదు. ముస్లిం అయినవ్యక్తి దైవప్రవక్త విధానాన్ని అనుసరించాలి. ఇతరత్రా విధానాలు పాటించటం అతనికి శోభాయమానం కాదు.

1419. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ముహాజిర్ వర్గానికి చెందిన నిరుపేదలు దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ఇలా విన్నవించుకున్నారు: "దైవప్రవక్తా! ఉన్నత స్థానాలు, శాశ్వత వరాలు ధనవంతులకే లభిస్తాయి. మరి చూడబోతే వాళ్ళు కూడా మాలాగే నమాజులు చేస్తారు. మాలాగే ఉప వాసాలు పాటిస్తారు. అయితే సిరి సంపదల విషయంలో వారు మాకన్నా గొప్పవారు. అందుకే హజ్, ఉమ్రా యాత్రలు చేయగలుగుతున్నారు. జిహాద్‌లో పాల్గొంటున్నారు. దాన ధర్మాలు చేస్తున్నారు. (ఆ పనులు మేము చేయలేం.)"

వారి మాటలు విని దైవప్రవక్త (సల్లం) "నేను మీకో విషయం తెల్పనా? దాన్ని గనక పాటిస్తే మీరు, మిమ్మల్ని మించి పోయిన వారిని చేరుకుంటారు. మీ

١٤١٩ ـ وعَنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْـهُ أَنَّ فُقَـرَاءَ المُهَـاجِـرِيـنَ أَتَـوا رَسُولَ اللهِ ﷺ فَقَالُوا: ذَهَبَ أَهْلُ الدُّثُورِ بِـالـدَّرَجَـاتِ العُلَـى، وَالنَّعِيـمِ المُقِيـمِ: يُصَلُّـونَ كَمَـا نُصَلِّـي، وَيَصُـومُـونَ كَمَـا نَصُومُ، وَلَهُمْ فَضْلٌ مِنْ أَمْوَالٍ: يَحُجُّونَ، وَيَعْتَمِرُونَ، وَيُجَاهِدُونَ، وَيَتَصَدَّقُونَ. فَقالَ: «أَلا أُعَلِّمُكُمْ شَيْئاً تُدْرِكُونَ بِهِ مَنْ سَبَقَكُـمْ، وَتَسْبِقُـونَ بِـهِ مَـنْ بَعْـدَكُـمْ، وَلا يَكُونُ أَحَدٌ أَفْضَلَ مِنْكُمْ إلَّا مَنْ صَنَعَ مِثْلَ مَا صَنَعْتُمْ؟» قالوا: بَلَى يا رسولَ اللهِ!

قَالَ: «تُسَبِّحُونَ، وَتَحْمَدُونَ، وَتُكَبِّرُونَ، خَلْفَ كُلِّ صَلاةٍ ثَلاثاً وَثَلاثِينَ» قَالَ أَبو صَالِح الرَّاوِي عَنْ أَبِي هُرَيْرَةَ، لَمَّا سُئِلَ عَنْ كَيْفِيَّةِ ذِكْرِهِنَّ، قال: يقولُ: سُبْحَانَ اللهِ، وَالحَمْدُ للهِ، وَاللهُ أَكْبَرُ، حَتَّى يَكُونَ مِنْهُنَّ كُلِّهِنَّ ثَلاثاً وَثَلاثِينَ. متفقٌ عليه.

وزادَ مُسْلِمٌ في روايتِهِ: فَرَجَعَ فُقَرَاءُ المُهَاجِرِينَ إلى رَسُولِ اللهِ ﷺ، فَقَالُوا: سَمِعَ إِخْوَانُنَا أَهْلُ الأَمْوَالِ بِمَا فَعَلْنَا، فَفَعَلُوا مِثْلَهُ؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «ذٰلِكَ فَضْلُ اللهِ يُؤْتِيهِ مَنْ يَشَاءُ». «الدُّثُورُ»: جَمْعُ دَثْرٍ، بفتحِ الدّالِ وإسكانِ الثاءِ المثلثةِ، وهو المَالُ الكثيرُ.

తర్వాతివారికంటే ముందుకెళ్ళి పోతారు. అప్పుడు మిమ్మల్ని అనుసరిం చేవారు తప్ప మీకంటే గొప్పవారెవరూ ఉండరు" అని అన్నారు. "తప్పకుండా తెలియజేయండి దైవప్రవక్తా!" అని అన్నారు సహచరులు. దానికి దైవప్రవక్త (సల్లం) "మీరు ప్రతి నమాజ్ తర్వాత ముప్ఫైమూడు సార్లు దేవుని పవిత్ర తను కొనియాడండి, ఆయన్ని స్తుతిం చండి. ఆయన గొప్పదనాన్ని చాటండి" అని అన్నారు.

ఈ హదీసుని అబూహురైరా నుండి ఉల్లేఖించిన అబూసాలిహ్ ఇలా అంటున్నారు: వాటిని ఎలా పఠించా లని అడగ్గా అందుకాయన "సుబ్హా నల్లాహ్, అల్‌హమ్దులిల్లాహ్, అల్లాహు అక్బర్ అని అనాలి. ఈ విధంగా ప్రతి వచనం ముప్ఫైమూడుసార్లు అయ్యే వరకు పఠించాలి" అని చెప్పారు.
(బుఖారీ-ముస్లిం)

ఇమామ్ ముస్లిం తను వెలికితీసిన ఒక హదీసులో ఈ విషయం అదనంగా ప్రస్తావించారు: (కొంతకాలం తర్వాత) ముహాజిర్ నిరుపేదలు మళ్ళీ దైవ ప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి "మేము ఆచరిస్తున్న పద్ధతి గురించి ధనిక సోదరులు కూడా విన్నారు. దాంతో వారు కూడా దీన్ని ఆచరించటం

మొదలుపెట్టారు" అని విన్నవించుకున్నారు. ఆ మాట విని ఆయన 'అది దైవానుగ్రహం. దేవుడు తానుకోరిన వారికి దాన్ని ప్రసాదిస్తాడు' అని చెప్పారు.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు కూడా "సత్కార్యాల మార్గాలు అనేకం" అనే అధ్యాయంలో వచ్చింది. ఇందులో అబూసాలిహ్ వివరించిన తీరును బట్టి మూడు వచనాలనూ కలిపి చదవాలని తెలుస్తోంది. అయితే ఇతర పండితులు మాత్రం వాటిని వేర్వేరుగా పఠించటమే సమంజసమని అన్నారు. ఎలా చదివినా వాటి ఉద్దేశ్యం నెరవేరుతుంది. అలాగే పై వచనాల్లో ప్రతిదాన్నీ 33 సార్లు పఠించాలా లేక మూడు కలిపి ముప్పైమూడుసార్లు పఠించాలా? పై హదీసు ద్వారా మాత్రం ఈ విషయం స్పష్టంగా బోధపడటం లేదు. మున్ముందు రాబోయే హదీసుల ద్వారా ప్రతి వచనాన్నీ 33సార్లు పఠించాలని తెలుస్తోంది. ఆ విధంగా మొత్తం 99సార్లు అవుతాయి. ఈ క్రింది హదీసు కాస్తంత వివరంగా ఉంది. గమనించండి.

١٤٢٠ - وعَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قَالَ: «مَنْ سَبَّحَ اللهَ فِي دُبُرِ كُلِّ صلاةٍ ثلاثاً وَثَلاثِينَ، وَحَمِدَ اللهَ ثَلاثاً وَثَلاثِينَ، وَكَبَّرَ اللهَ ثَلاثاً وَثَلاثِينَ، وقالَ تَمَامَ المِائَةِ: لا إِلـهَ إِلَّا اللهُ وَحْدَهُ لَا شَرِيكَ لَهُ، لَهُ المُلْكُ وَلَهُ الحَمْدُ، وَهُوَ عَلَى كُلِّ شَيْءٍ قَدِيرٌ، غُفِرَتْ خَطَايَاهُ وَإِن كَانَتْ مِثْلَ زَبَدِ البَحْرِ» رواه مسلم.

1420. అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే ప్రతి నమాజ్ తర్వాత 33సార్లు 'సుబ్‌హానల్లాహ్' అనీ, 33సార్లు అల్‌హమ్దులిల్లాహ్ అనీ, 33 సార్లు అల్లాహు అక్బర్ అని అంటారో ఆ తర్వాత వంద సంఖ్యను పూర్తి చేస్తూ 'లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీకలహూ లహుల్ ముల్కు వలహుల్ హమ్దు వహువ అలాకుల్లి షైయిన్ ఖదీర్" అని అంటారో వారి

తప్పులన్నీ మన్నించబడతాయి. అవి సముద్రపు నురుగుకు సమానంగా ఉన్నాసరే. (ముస్లిం)

(సహీహ్‌లోని జిక్ర్, దుఆల ప్రకరణం)

1421. హజ్రత్ కాబ్ బిన్ ఉజ్రా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నమాజ్ తర్వాత పఠించబడే కొన్ని వచనాలు ఎలాంటి వంటే వాటిని పఠించేవాడు లేక వాటిని పాటించేవాడు ఎన్నటికీ నిష్ఫలుడు కాడు. అవేమిటంటే ప్రతి ఫర్జ్ నమాజ్ తర్వాత 33సార్లు సుబ్‌హానల్లాహ్ అనీ, 33సార్లు అల్‌హమ్దులిల్లాహ్ అనీ, 34 సార్లు అల్లాహు అక్బర్ అని పలకటం. (ముస్లిం)

١٤٢١ ـ وعنْ كَعْبِ بنِ عُجْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قَالَ: «مُعَقِّبَاتٌ لا يَخِيبُ قَائِلُهُنَّ ـ أَوْ فَاعِلُهُنَّ ـ دُبُرَ كُلِّ صَلاةٍ مَكْتُوبَةٍ: ثَلاثاً وَثَلاثِينَ تَسْبِيحَةً، وَثَلاثاً وَثَلاثِينَ تَحْمِيدَةً، وَأَرْبَعاً وَثَلاثِينَ تَكْبِيرَةً» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని ప్రార్థనాస్థలాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'ముఅఖ్ఖిబాత్' అనే పదం వచ్చింది. అంటే ప్రతి నమాజ్ తర్వాత పఠించబడే, దేవుని స్తోత్రానికీ, ఆయన పవిత్రతకూ సంబంధించిన పలుకులని భావం. ఈ హదీసులో 'అల్లాహు అక్బర్' అనే వచనాన్ని 34 సార్లు పఠించాలని చెప్పబడింది.

1422. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నమాజుల తర్వాత ఈ వచనాలతో (దేవుణ్ణి) శరణు వేడేవారు. "దేవా! నేను పిరికితనం, పిసినారితనం నుంచి నీ శరణు వేడుతున్నాను. నికృష్టమైన వృద్ధాప్యానికి చేరుకోవటం నుండి నీ శరణు కోరుతున్నాను. ప్రాపంచిక

١٤٢٢ ـ وعنْ سعدِ بنِ أبي وقاص رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ كَانَ يَتَعَوَّذُ دُبُرَ الصَّلَوَاتِ بِهَؤُلاءِ الكَلِمَاتِ: «اللَّهُمَّ! إِنِّي أَعُوذُ بِكَ مِنَ الجُبْنِ وَالبُخْلِ، وَأَعُوذُ بِكَ مِنْ أَنْ أُرَدَّ إِلَى أَرْذَلِ العُمُرِ، وَأَعُوذُ بِكَ مِنْ فِتْنَةِ الدُّنْيَا، وَأَعُوذُ بِكَ مِنْ فِتْنَةِ القَبْرِ» رواه البخاري.

ఉపద్రవాల నుండి నీ శరణు వేడుతున్నాను. సమాధి యాతనల నుండి నీ శరణు వేడుతున్నాను." (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో పలు విషయాల నుండి శరణు వేడటం జరిగింది. కొంతమంది పండితులు ప్రతి ఫర్జ్ నమాజ్ తర్వాత సుబ్‌హానల్లాహ్, అల్‌హమ్దు లిల్లాహ్, అల్లాహు అక్బర్ అనే వచనాలతోపాటు పైన పేర్కొనబడిన శరణువేడుకోలు కూడా చేసుకోవాలని అభిప్రాయ పడ్డారు. దీనికి భిన్నంగా మరికొంతమంది పండితులు తస్బీహ్ వచనాలు నమాజ్ ముగిసిన తర్వాత పఠించాలనీ, పై శరణు వేడుకోలును నమాజు చివర్లో సలాంకు ముందు చదవాలని అభిప్రాయ పడ్డారు. దైవప్రవక్త (సల్లం) ఇలాగే చేసేవారు. (నుజ్‌హతుల్ ముత్తఖీన్)

1423. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన చేయి పట్టుకొని, "ముఆజ్! దేవుడు సాక్షి! నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అని అన్నారు. తర్వాత ఆయనే ఇలా అన్నారు: "ముఆజ్! నేను నీకో విషయం బోధిస్తున్నాను. ప్రతి నమాజ్ తర్వాత 'అల్లాహ్! నిన్ను స్మరించటంలో, నీకు కృతజ్ఞతలు తెలుపుకోవటంలో, నిన్ను అత్యుత్తమ రీతిలో ఆరాధించటంలో నీవు నాకు సహాయపడు' అని ప్రార్థించే అలవాటుని మానుకోకు."(అబూదావూద్ ఈ హదీసుని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు)

١٤٢٣ ـ وعنْ معاذٍ رضيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ أَخَذَ بِيَدِهِ وقالَ: «يَا مُعَاذُ! واللهِ إنِّي لأُحِبُّكَ» فقالَ: «أُوصِيكَ يَا مُعَاذُ لا تَدَعَنَّ في دُبُرِ كُلِّ صَلاةٍ تَقُولُ: اللَّهُمَّ! أَعِنِّي عَلى ذِكْرِكَ، وَشُكْرِكَ، وَحُسْنِ عِبَادَتِكَ» رواهُ أبو داود بإسنادٍ صحيحٍ.

(సుననె అబూదావూద్‌లోని విత్ర్ ప్రకరణం)

1424. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)

١٤٢٤ ـ عَنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إذا تَشَهَّدَ

أَحَدُكُمْ فَلْيَسْتَعِذْ باللهِ من أَرْبعٍ؛ يقولُ: اللَّهُمَّ! إنِّي أَعُوذُ بِكَ مِنْ عَذابِ جَهَنَّمَ، وَمِنْ عَذَابِ الْقَبْرِ، وَمِنْ فِتْنَةِ الْمَحْيَا وَالْمَمَاتِ، وَمِنْ شَرِّ فِتْنَةِ الْمَسِيحِ الدَّجَّالِ». رواه مسلم.

ఇలా ప్రబోధించారు: మీలో ఎవరైనా తషహ్హుద్ పఠించిన తర్వాత నాలుగు విషయాల నుండి శరణు వేడుకోవాలి. ఇలా అనాలి: దేవా! నరకశిక్ష నుండి, సమాధి యాతన నుండి, జీవన్మరణాల పరీక్షల నుండి, మసీహుద్దజ్జాల్ ఉప ద్రవం నుండి నీ శరణు వేడుతున్నాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి జీవితంలో అతన్ని శారీరకంగాగానీ, ధార్మికంగాగానీ నష్టపరిచే కష్టాలన్నీ ప్రాపంచిక ఉపద్రవాలే. అలాగే మరణ సమయంలో కలిగే బాధల్ని జీవన్మరణాల పరీక్షలుగా భావించాలి. మసీహ్ అంటే ఒంటికన్ను కలవాడని ఇక్కడ భావం. ప్రళయానికి ముందు ఒక దజ్జాల్ (ఉపద్రవాగ్రేసరుడు) అవతరిస్తాడు. అతనికి ఒకే కన్ను ఉంటుంది. అందుకని అతన్ని 'మసీహ్' అని అంటారు. అతను తాను దేవుణ్ణని చెప్పుకుంటాడు. ప్రజల్ని పరీక్షించటం కోసం దేవుడు ఇతనిచేత కొన్ని అద్భుతాలను కూడా చేయిస్తాడు. దాంతో చాలా మంది అతని ఉపద్రవాల్లో చిక్కుకుంటారు. అయితే సజ్జనులు మాత్రం దేవుని సహాయంతో అతన్ని గుర్తించి అతని వలలో చిక్కుకోకుండా బయటపడతారు. ఏమయినప్పటికీ అదో మహా ఉపద్రవం. దాన్నుండి శరణువేడుకోవటం అన్ని విధాలా ఉత్తమం.

١٤٢٥ - وعنْ عَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ إذا قَامَ إلى الصَّلاةِ يكونُ مِنْ آخِرِ ما يقولُ بينَ التَّشَهُّدِ وَالتَّسْلِيمِ: «اللَّهُمَّ! اغفِرْ لي مَا قَدَّمتُ وَمَا أَخَّرْتُ، وَمَا أَسْرَرْتُ وَمَا أَعْلَنْتُ، وما أَسْرَفْتُ، وما أنتَ أَعْلَمُ بِهِ مِنِّي، أَنْتَ الْمُقَدِّمُ، وَأَنْتَ الْمُؤَخِّرُ، لا إلهَ إلَّا أَنْتَ» رواه مسلم.

1425. హజ్రత్ అలీ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నమాజ్ కోసం సిద్ధ మయిన తర్వాత తషహ్హుద్ మరియు సలాం మధ్యన చివర్లో ఈ వచనాలు పఠించేవారు. "దేవా! నా పూర్వపు పాపాలను, జరగబోయే పాపాలను క్షమించు. రహస్యంగా, బహిరంగంగా చేసిన పాపాలను క్షమించు. ఇంకా నా మితిమీరిన తనాన్ని కూడా క్షమించు. మరి కొన్ని పాపాలుండవచ్చు. వాటి

గురించి నాకంటే నీకే బాగా తెలుసు. నీవు వాటిని కూడా క్షమించు. ముందుకు నడిపించేవాడివి, వెనక్కి నెట్టేవాడివి నీవే. నీవు తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

١٤٢٦ ـ وعَنْ عائشَةَ رَضِيَ الله عَنْهَا قَالَتْ: كَانَ النَّبيُّ ﷺ يُكثِرُ أَنْ يقولَ في رُكُوعِهِ وَسُجُودِهِ: «سُبْحَانَكَ اللَّهُمَّ رَبَّنَا وَبِحَمْدِك، اللَّهُمَّ اغْفِرْ لي» متفقٌ عليه.

1426. హ్రజత్ ఆయిషా (రజి అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) తన రుకూల్లో, సజ్దాల్లో "అల్లాహ్! నీవు పరమపవిత్రుడవు. మా ప్రభూ! పొగడ్త లన్నీ నీకే శోభిస్తాయి. అల్లాహ్! నన్ను క్షమించు" అని అత్యధికంగా అనే వారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

١٤٢٧ ـ وعَنها أَنَّ رَسُولَ اللهِ ﷺ كَانَ يَقُولُ في رُكُوعِهِ وَسُجودِهِ: «سُبُّوحٌ قُدُّوسٌ رَبُّ الملائِكَةِ وَالرُّوحِ» رواه مسلم.

1427. హ్రజత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన మరొక కథనం: దైవప్రవక్త (సల్లం) రుకూ సజ్దాల్లో ఇలా అనేవారు: (నా రుకూలు మరియు నా సజ్దాలు) ఎంతో పరిశుద్ధుడు, అత్యంత పునీ తుడు, దైవదూతల మరియు జిబ్ర యీల్‌ల ప్రభువుకే అంకితం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

١٤٢٨ ـ وَعَنِ ابنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنهُما أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «فَأَمَّا الرُّكوعُ فَعَظِّموا فيهِ الرَّبَّ، وَأَمَّا السُّجُودُ فَاجْتَهِدُوا في الدُّعاءِ، فَقَمِنٌ أَنْ يُسْتَجابَ لَكُم» رواه مسلم.

1428. హ్రజత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: రుకూ విషయం- రుకూలో మీరు ప్రభువు ఔన్నత్యాన్ని కీర్తించండి. పోతే సజ్దాలో- ఆ స్థితిలో

మీరు బాగా శ్రమపడి (దేవుణ్ణి) ప్రార్థించండి. అలా చేస్తే మీ ప్రార్థనలు ఆమోదించబడటానికి ఎక్కువ అవకాశముంది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)

١٤٢٩ ـ وعن أَبي هريرةَ رضِيَ اللهُ عَنْـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ قَـالَ: «أَقْـرَبُ مَا يَكونُ العَبْدُ مِن رَبِّـهِ وَهُوَ سَاجِدٌ؛ فَأَكثِرُوا الدُّعَاءَ» رواهُ مسلم.

1429. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దాసుడు తన ప్రభువుకి అత్యంత సన్నిహితంగా ఉండే స్థితి సజ్దా స్థితి. కనుక మీరు ఆ స్థితిలో అతి ఎక్కువగా ప్రార్థనలు చేయండి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

సజ్దా స్థితిలో ప్రార్థన (దుఆ) అంగీకరించబడటానికి ఎక్కువ అవకాశాలున్నట్లు పై హదీసుల ద్వారా బోధపడుతోంది. నఫిల్ నమాజుల్లో దీన్ని అమలు చేస్తూ ఉండాలి.

١٤٣٠ ـ وعنـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ كَانَ يَقُولُ في سُجُودِه: «اللَّهُمَّ اغفِرْ لي ذَنْبي كُلَّهُ: دِقَّهُ وَجِلَّهُ، وأَوَّله وَآخِرَهُ، وَعَلانِيَتَهُ وَسِرَّهُ» رواهُ مسلم.

1430. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన మరొక కథనం: దైవప్రవక్త (సల్లం) సజ్దా స్థితిలో ఈ విధంగా ప్రార్థించేవారు: "దేవా! నా పాపాలన్నిటినీ- చిన్నవీ, పెద్దవీ, ముందటివీ, వెనుకటివీ, రహస్యమైనవీ, బహిర్గతమైనవీ- అన్నిటినీ క్షమించు." (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

దేవుడు అంతిమ ప్రవక్తగారి ముందటి వెనుకటి పాపాలన్నిటినీ క్షమించేశాడు. అయినప్పటికీ ఆయన దేవుని ఔన్నత్యం, ఆయన మహోజ్వలత్వం దృష్ట్యా తన వల్ల జరిగే చిన్నచిన్న పొరపాట్లకు కూడా దేవుణ్ణి క్షమాపణలు వేడుకునేవారు. చూడండి! ఆయన అంత

పునీతులయి ఉండి కూడా దేవుని శిక్ష గురించి భయపడి పోయేవారు. కాని మనం పీకలదాకా పాపాల్లో కూరుకుపోయి ఉండి కూడా దేవుని శిక్ష గురించి ఏమాత్రం భయపడటం లేదు. ఎంత ఘోరం!

1431. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: ఒక రోజు రాత్రి దైవప్రవక్త (సల్లం) (పక్కమీద) కనిపించలేదు. నేనాయన్ని వెతుక్కుంటూ బయలు దేరాను. చూస్తే ఒకచోట ఆయన (నమాజు చేస్తూ) రుకూలో (లేక) సజ్దాలో "అల్లాహ్! నీవు నీ స్తోత్ర సమేతంగా పరిశుద్ధుడివి. నీవు తప్ప వేరొక ఆరాధ్యుడులేడు" అని అంటున్నారు.

వేరొక హదీసులో ఇలా ఉంది: (చీకట్లో నేనాయన్ని వెతుకుతున్నప్పుడు) నా చేతికి ఆయన అరికాళ్ళు తగిలాయి. అప్పుడాయన సజ్దాలో ఉన్నారు. ఆయన పాదాలు (నేలకు) నిటారుగా ఆనించి ఉన్నాయి. అప్పుడాయన ఇలా ప్రార్థిస్తున్నారు: దేవా! నేను నీ అప్రసన్నత నుండి నీ ప్రసన్నత శరణు వేడుకుంటున్నాను. నీ శిక్ష నుండి నీ మన్నింపుని శరణు కోరుతున్నాను. నీ ఆగ్రహం నుండి నిన్నే శరణు వేడుతున్నాను. నేను నీ స్తోత్రాన్ని లెక్కించటానికి అనర్హుణ్ణి. నిన్ను నీవు ఎలా స్తుతించుకున్నావో అలాగే వర్ధిల్లుతున్నావు.

(ముస్లిం)

١٤٣١ ـ وعَنْ عَائِشَةَ رضيَ اللهُ عَنْهَا قَـالَـتْ: افتَقَـدْتُ النَّبِـيَّ ﷺ ذَاتَ لَيْلَـةٍ، فَتَحَسَّسْتُ، فَإذَا هُوَ رَاكِعٌ ـ أَوْ سَاجِدٌ ـ يَقولُ: «سُبْحَانَكَ وَبِحَمْدِكَ، لا إلهَ إلَّا أَنْتَ» وفي روايةٍ: فَوَقَعَتْ يَدِي عَلى بَطْنِ قَـدَمَيْـهِ، وَهُـوَ فـي المَسْجِـدِ، وَهمـا مَنْصُوبَتَانِ، وَهُوَ يَقُولُ: «اللَّهُمَّ إنِّي أَعُوذُ بِرِضَاكَ مِنْ سَخَطِكَ، وبِمُعَافاتِكَ مِنْ عُقوبَتِكَ، وَأَعُوذُ بِكَ مِنْكَ، لا أُحْصِي ثَنَاءً عَلَيْكَ أَنْتَ كَمَا أَثْنيْتَ على نَفْسِكَ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)

1432. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం: మేము దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉండగా ఆయన మమ్మల్ని "మీలో ఒకరు రోజుకి వేయి పుణ్యాలు సంపాదించలేడా?" అని అడిగారు. ఆ మాటకు అక్కడ కూర్చున్న వారిలో ఒకడు, "రోజుకి వెయ్యి పుణ్యాలు ఎవడైనా ఎలా ఆర్జిస్తాడు?" అన్నాడు. అందుకు దైవప్రవక్త (సల్లం), "అతను వందసార్లు దేవుని పవిత్రతను కొనియాడాలి (అంటే సుబ్‌హానల్లాహ్ అని పలకాలి) అలా చేస్తే (అతని కర్మల ఖాతాలో) వెయ్యి పుణ్యాలు లిఖించబడతాయి లేదా వెయ్యి తప్పులు మన్నించబడతాయి" అని చెప్పారు. (ముస్లిం)

ఇమామ్ హుమైదీ ఇలా అంటున్నారు: ముస్లింగారి మూలంలో ఇలాగే "అవ్ యుహత్తు" అని ఉంది. అయితే ఇమామ్ బర్ఖానీ ఇలా అంటున్నారు: ఈ హదీసుని ముస్లిం మూసా అనే ఆయన్నుంచి ఉల్లేఖించారు. కాని అదే సమయంలో ఈ హదీసుని మూసా నుండి షూబా, అబూ అవానా, యహ్‌యా ఖత్తాన్ ప్రభృతులు కూడా ఉల్లేఖించారు. అయితే వారి ఉల్లేఖనంలో 'వ యుహత్తు' అని ఉంది.

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

١٤٣٢ ـ وعنْ سعدِ بنِ أبي وقاص رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كُنَّا عِنْدَ رَسُولِ اللهِ ﷺ فَقالَ: «أيعجزُ أَحَدُكمْ أَنْ يَكْسِبَ في كلِّ يَوْمٍ أَلفَ حَسَنَةٍ!» فَسأَلَهُ سَائِلٌ مِنْ جُلَسَائِهِ: كَيفَ يَكْسِبُ أَلفَ حَسَنَةٍ؟ قَالَ: «يُسَبِّحُ مِائَةَ تَسْبِيحَةٍ، فَيُكْتَبُ لَهُ أَلْفُ حَسَنَةٍ، أَوْ يُحَطُّ عَنْهُ أَلفُ خَطِيئَةٍ» رواه مسلم. قالَ الحُمَيدِيُّ: كذا هُوَ في كِتَابِ مسلِمٍ: «أَوْ يُحَطُّ» قَالَ البَرْقَانِيُّ: ورواه شُعْبَةُ، وأبو عَوَانَة، وَيَحيى القَطَّانُ، عَنْ مُوسى الذي رواه مسلم مِنْ جِهَتِهِ فقالُوا: «وَيحطُّ» بِغَيْرِ أَلِفٍ.

## ముఖ్యాంశాలు

వందసార్లు సుబ్‌హానల్లాహ్ అని పలికితే వెయ్యి పుణ్యాలు లభిస్తాయంటే అది ఒక సత్కార్యానికి పదిరెట్ల పుణ్యం లభిస్తుందన్న సూత్రం ఆధారంగా జరుగుతుంది. ఈ హదీసు మూలంలో స్వల్ప భేదాభిప్రాయముంది. కొంతమంది ఉల్లేఖకులు 'వయుహత్తు' అని ఉల్లేఖిస్తే మరికొందరు 'అవ్‌యుహత్తు' అని ఉల్లేఖించారు. 'వయుహత్తు' అంటే వెయ్యి పుణ్యాలు లిఖించబడతాయి మరియు వెయ్యి తప్పులు మన్నించబడతాయి అని భావం. అదే 'అవ్ యుహత్తు' అని అంటే 'వెయ్యి పుణ్యాలు లిఖించబడతాయి లేదా వెయ్యి పాపాలు మన్నించబడతాయి' అనే అర్థం వస్తుంది.

١٤٣٣ - وعَنْ أَبي ذَرٍّ رضِيَ اللهُ عَنْهُ أنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «يُصْبِحُ عَلى كُلِّ سُلامَى مِنْ أَحَدِكُمْ صَدَقَةٌ: فَكُلُّ تَسْبِيحَةٍ صَدَقَةٌ، وَكُلُّ تَحْمِيدَةٍ صَدَقَةٌ، وكُلُّ تَهْلِيلَةٍ صَدَقَةٌ، وَكُلُّ تَكْبِيرَةٍ صَدَقَةٌ، وَأَمْرٌ بِالمَعْرُوفِ صَدَقَةٌ، وَنَهْيٌ عَنِ المُنْكَرِ صَدَقَةٌ. وَيُجْزِىءُ مِنْ ذٰلِكَ رَكْعَتَانِ يَرْكَعُهُمَا مِنَ الضُّحَى» رواه مسلم.

1433. హజ్రత్ అబూ జర్ర్ (రజి)గారు చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలోని ప్రతి ఒక్కరిపై (శరీరంలోని ప్రతి కీలుపై) ఉదయంపూట ఒక సదఖా చేయటం తప్పనిసరి. అలాంటప్పుడు ప్రతి తస్బీహ్ (సుబ్‌హానల్లాహ్ అనటం కూడా) ఒక సత్కార్యమే. ప్రతి తహ్మీద్ (అల్‌హమ్దులిల్లాహ్ అనడమూ) ఒక సత్కార్యమే. ప్రతి తహ్‌లీల్ (లా ఇలాహ ఇల్లల్లాహ్ అనడం కూడా) ఒక సత్కార్యమే. ప్రతి తక్బీర్ (అల్లాహు అక్బర్ అనడమూ) ఒక సత్కార్యమే. మంచిని గురించి ఆజ్ఞాపించటం సత్కార్యం. అలాగే చెడు నుండి వారించడమూ సత్కార్యమే. అయితే సూర్యోదయం అయిన తర్వాత మనిషి చేసే రెండు రకాతుల (చాష్త్) నమాజు వీటన్నిటికీ ప్రత్యామ్నాయం కాగలదు.
(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'సత్కార్యమార్గాలు అనేకం' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. ఇందులో సూర్యోదయం తర్వాత చాష్త్ వేళ చేయబడే రెండు రకాతుల నమాజు యొక్క విశిష్ఠత వివరించబడింది. ఆ నమాజు చేస్తే శరీరంలో 360 కీళ్లు సురక్షితంగా, ఆరోగ్యంగా ఉంచినందుకు దేవునికి కృతజ్ఞతలు తెలుపుకోవటంతో సమానంగా భావింపబడుతుంది. అదే విధంగా దైవాన్ని స్తుతించటం, దేవుని పవిత్రతను కొనియాడటం, లా ఇలాహ ఇల్లల్లాహ్ అని అనటం, మంచిని గురించి ఆదేశించి చెడులను నిర్మూలించటం కూడా శరీరావయవాల తరపున దానధర్మాలుగా పరిగణించబడతాయి.

١٤٣٤ - وَعَنْ أُمِّ الْمُؤْمِنِينَ جُوَيْرِيَةَ بنتِ الحَارِثِ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ النَّبِيَّ ﷺ خَرَجَ مِنْ عِنْدِهَا بُكْرَةً حِينَ صَلَّى الصُّبْحَ وَهِيَ فِي مَسْجِدِهَا، ثُمَّ رَجَعَ بَعْدَ أَنْ أَضْحى وَهِيَ جَالِسَةٌ فقالَ: «مَا زِلْتِ عَلى الحَالِ الَّتِي فَارَقْتُكِ عَلَيْهَا؟» قَالَتْ: نَعَمْ، فَقَالَ النَّبِيُّ ﷺ: «لَقَدْ قُلْتُ بَعْدَكِ أَرْبَعَ

1434. విశ్వాసుల మాతృమూర్తి జువైరియా బిన్తె హారిస్ (రజి.అన్హా) కథనం ప్రకారం ఒకరోజు పొద్దున్నే దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ నమాజ్ చేసుకొన్న తర్వాత బయటికి వెళ్ళినప్పుడు ఆమె తాను నమాజ్ చేసినచోటే కూర్చొని (దైవధ్యానంలో) నిమగ్నులై ఉన్నారు. బాగా పొద్దెక్కిన తర్వాత ఆయన తిరిగొచ్చారు. అప్పటికీ ఆమె అక్కడే కూర్చొని ఉండటం చూసి, "నేను బయటికి వెళ్ళినప్పటి నుంచి నువ్వు ఇక్కడే కూర్చొని ఉన్నావా?" అని అడిగారు. అందుకు ఆమె 'అవును' అని సమాధానమిచ్చారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: నేను నీ దగ్గరి నుండి వెళ్ళిన తర్వాత నాలుగు వచనాలు - ఒక్కొక్కటి మూడుసార్లు చొప్పున పఠించాను. వాటిని గనక, నువ్వు ఈ రోజు పొద్దున్నుంచి పలుకుతూ కూర్చున్న పలుకులతో సరితూచితే అవే ఎక్కువ బరువుని తూస్తాయి. ఆ వచనాలు ఇవి:

كَلِمَاتٍ ثَلَاثَ مَرَّاتٍ، لَوْ وُزِنَتْ بِمَا قُلْتِ مُنْذُ الْيَوْمِ لَوَزَنَتْهُنَّ: سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ عَدَدَ خَلْقِهِ، وَرِضَاءَ نَفْسِهِ، وَزِنَةَ عَرْشِهِ، وَمِدَادَ كَلِمَاتِهِ» رواه مسلم. وفي روايةٍ لَهُ: «سُبْحَانَ اللهِ عَدَدَ خَلْقِهِ، سُبْحَانَ اللهِ رِضَاءَ نَفْسِهِ، سُبْحَانَ اللهِ زِنَةَ عَرْشِهِ، سُبْحَانَ اللهِ مِدَادَ كَلِمَاتِهِ». وفي روايةِ الترمذي: «أَلَا أُعَلِّمُكِ كَلِمَاتٍ تَقُولِينَهَا؟ سُبْحَانَ اللهِ عَدَدَ خَلْقِهِ، سُبْحَانَ اللهِ عَدَدَ خَلْقِهِ، سُبْحَانَ اللهِ

'సుబ్‌హానల్లాహి వబిహమ్దిహీ అదద ఖల్‌ఖిహీ వ రిజాఅ నఫ్‌సిహీ వ జినత అర్షిహీ వ మిదాద కలిమాతిహీ' (దేవుని సృష్టితాల సంఖ్యకు సమానంగా, దైవాభీష్టానికి అనుగుణంగా, దేవుని సింహాసనం బరువుకు సమానంగా, దేవుని వచనా లను లిఖించటానికి ఎంత సిరా అయితే పడుతుందో లేదా ఆయన వచనాలు ఎంత ఎక్కువగా ఉన్నాయో అంత ఎక్కువగా మేము ఆయన పవిత్రతను కొనియాడుతున్నాం. ఆయన్ని స్తుతిస్తున్నాం.) (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: (దేవుని సృష్టితాల సంఖ్యకు సమానంగా, దైవాభీష్టానికి తగినంతగా, దేవుని సింహాసనం బరువుకు సమానంగా, దేవుని వచనాలు ఎంత ఎక్కువగా ఉన్నాయో లేదా వాటిని లిఖించటానికి ఎంత సిరా పడుతుందో అంతగా నేను దేవుని పవిత్రతను కొనియాడుతున్నాను.

తిర్మిజీలోని ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: "నేను నీకు పలకటానికి అనుకూలమైన పలుకులు నేర్పనా? (ఇలా అంటూ ఉండు:) దేవుని సృష్టితాలకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. దేవుని

عَدَدَ خَلْقِهِ، سُبْحَانَ اللهِ رِضَى نَفْسِهِ، سُبْحَانَ اللهِ رِضَى نَفْسِهِ، سُبْحَانَ اللهِ رِضَى نَفْسِهِ، سُبْحَانَ اللهِ زِنَةَ عَرْشِهِ، سُبْحَانَ اللهِ زِنَةَ عَرْشِهِ، سُبْحَانَ اللهِ زِنَةَ عَرْشِهِ، سُبْحَانَ اللهِ مِدَادَ كَلِمَاتِهِ، سُبْحَانَ اللهِ مِدَادَ كَلِمَاتِهِ، سُبْحَانَ اللهِ مِدَادَ كَلِمَاتِهِ».

సృష్టితాలకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. దేవుని సృష్టితాల సంఖ్యకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడు తున్నాను. దైవాభీష్టానికి అనుగుణంగా ఆయన పవిత్రతను కొనియాడు తున్నాను. దైవాభీష్టానికి అనుగుణంగా ఆయన పవిత్రతను కొనియాడు తున్నాను. దైవాభీష్టానికి అనుగుణంగా ఆయన పవిత్రతను కొనియాడు తున్నాను. దేవుని సింహాసనం బరువుకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. దేవుని సింహాసనం బరువుకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. దేవుని సింహాసనం బరువుకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడు తున్నాను. దేవుని వచనాలను లిఖించటానికి ఎంత సిరా పడుతుందో అంతగా నేను ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. దేవుని వచనాలను లిఖించటానికి ఎంత సిరా పడుతుందో అంతగా నేను ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. దేవుని వచనాలను లిఖించటానికి ఎంత సిరా పడుతుందో అంతగా నేను ఆయన పవిత్రతను కొనియాడు తున్నాను."

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

١٤٣٥ ـ وعَنْ أَبِي مُوسَى الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عنهُ عن النَّبيِّ ﷺ قَالَ: «مَثَلُ الَّذِي يَذْكُرُ رَبَّهُ وَالَّذِي لَا يَذْكُرُهُ، مَثَلُ الحَيِّ وَالمَيِّتِ» رواهُ البخاري. ورواه مسلم فقالَ: «مَثَلُ البَيْتِ الَّذِي يُذْكَرُ اللهُ فِيهِ، والبَيْتِ الَّذِي لَا يُذْكَرُ اللهُ فِيهِ، مَثَلُ الحَيِّ وَالمَيِّتِ».

1435. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుణ్ణి స్మరించేవాడు బ్రతికున్నవ్యక్తి లాంటి వాడు. దేవుణ్ణి స్మరించనివాడు చనిపోయిన వ్యక్తిలాంటివాడు.

*(బుఖారీ)*

ముస్లిం ఈ హదీసుని ఈ విధంగా ఉల్లేఖించారు: దేవుణ్ణి స్మరించే ఇల్లు జీవించివున్న దానితో సమానం. దేవుణ్ణి స్మరించని ఇల్లు చచ్చిపోయిన దానితో సమానం.

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

దేవుణ్ణి స్మరించకపోవటం మృత్యువుతో సమానం. మరణించిన వ్యక్తి ఏ పనీ చేయలేడు. అలాగే దైవస్మరణను వదలిపెట్టిన వ్యక్తి దేవుణ్ణి సంతోషపెట్టే, తనకు ప్రయోజనకరమైన పని ఏదీ చేయలేడు.

١٤٣٦ ـ وعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «يَقُولُ اللهُ تَعالَى: أنا عِنْدَ ظَنِّ عَبدي بي، وَأَنا مَعَهُ إذا ذَكَرَني، فَإِنْ ذَكَرَني في نَفْسِهِ، ذَكَرْتُهُ في نَفْسي، وَإِنْ ذَكَرَني فِي مَلَأٍ، ذَكَرْتُهُ في مَلَأٍ خَيْرٍ مِنْهُمْ» متفقٌ عليهِ.

1436. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దేవుడు ఇలా అంటాడని దైవప్రవక్త (సల్లం) తెలియజేశారు: నేను నా దాసుని ఆలోచన దగ్గర ఉంటాను. అతను నన్ను గుర్తుచేసు కున్నప్పుడు నేనతని వెంటే ఉంటాను. అతను నన్ను తన మనసులో గుర్తు చేసుకుంటే నేనతన్ని నా మనసులో గుర్తుచేసుకుంటాను. అతను గనక ఏదయినా సమావేశంలో నన్ను

గుర్తుచేసుకుంటే నేను కూడా అతన్ని వారికంటే శ్రేష్ఠమైన సమావేశంలో గుర్తు చేసుకుంటాను. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తౌహీద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి తన ప్రభువు విషయంలో సదభిప్రాయం (సదనుమానం) కలిగి ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. సదభిప్రాయంటే దేవుడు దాసుల పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడనీ, వారి పాపాలను మన్నిస్తాడనీ, కష్టాల్లో వున్న వారిని తమ కష్టాల నుండి గట్టెక్కిస్తాడన్న దృఢనమ్మకాన్ని కలిగివుండటం, అలాంటి నమ్మకంతోపాటు దేవుణ్ణి ప్రసన్నం చేసుకునేందుకు అనువైన మంచిపనులు కూడా చేస్తూ, ఆయన వారించిన విషయాల జోలికి పోకుండా ఉండటం. ఉదాహరణకు ఒక రైతు పొలం దున్ని విత్తనాలు నాటుతాడు. నీరు సరఫరా చేసి దాన్ని కనిపెట్టుకొని ఉంటాడు. ఆ తర్వాతే ఫలసాయాన్ని ఆశిస్తాడు. అలాగే ఒక వ్యక్తి పండితుడు కావాలన్నా డాక్టర్ లేక ఇంజనీరు కావాలన్నా ముందు తనకు ఇష్టమున్న రంగానికి సంబంధించిన పుస్తకాలను చదివి, వాటిలో ఉన్న జ్ఞానాన్ని ఆర్జించవలసి ఉంటుంది. ఆ తర్వాతే అతను డాక్టరు లేక ఇంజనీరు అవగలడని ఆశించగలుగుతాం. దేవుని పట్ల సదనుమానం కలిగి ఉండే విషయం కూడా అంతే. మనిషి దృఢంగా దేవుణ్ణి నమ్మి, సదాచరణకు ఉపక్రమించ నంతవరకు దేవునిపట్ల సదభిప్రాయాన్ని కలిగి ఉంటాడనటంలో అర్థం లేదు. ఒక బానిస తన యజమానికి సేవ చేయకుండా పారిపోయి, అతనికి తీరని నష్టం కలుగజేసి తీరా తన యజమాని ఎంతో దయామయుడనీ, తనను ఏమీ అనడని సదభిప్రాయంతో ఉంటే ఆ బానిసను ఎవరైనా ఏమంటారు? అవివేకి అంటారు. దేవుడు అమిత దయామయుడు, అత్యంత కరుణామయుడు అన్నదాంట్లో ఏమాత్రం సందేహం లేదు. అయితే అది ఎవరి విషయంలో? తన దాసుల విషయంలో మాత్రమే. షైతాన్ దాసుల విషయంలో మాత్రం కాదు. షైతాన్ మరియు అతని దాసుల్ని నరకంలో నింపుతాను అంటున్నాడు దేవుడు. (సూరె సాద్ : 85వ సూక్తి)

١٤٣٧ ـ وعَنْـــهُ قــــالَ: قَـــالَ رَسُولُ اللهِ ﷺ: «سَبَقَ المُفَرِّدُونَ» قالوا: وَمَـا المُفَـرِّدُونَ يَـا رَسُـولَ اللهِ؟ قَـالَ: «الـذَّاكِـرُونَ اللهَ كَثِيـراً والـذَّاكِـرَاتُ» رواه

1437. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకసారి, 'ముఫర్రిదూన్‌లు మించిపోయారు' అని అన్నారు. ఆ మాట విని సహచరులు, 'ముఫర్రిదూన్‌లు అంటే ఎవరు దైవప్రవక్తా?'

مسلم. روي: «المُفَرِّدُونَ» بتشديد الراءِ وتخفيفها، وَالمَشْهُورُ الَّذي قَالَهُ الجمْهُورُ: التَّشْديدُ.

అని అడిగారు. అందుకు ఆయన సమాధానమిస్తూ, "దేవుణ్ణి అత్యధికంగా స్మరించే స్త్రీ పురుషులు' అని చెప్పారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసులో ముఖ్యంగా రెండు విషయాలు బోధించబడ్డాయి. ఒకటి; దేవుణ్ణి అత్యధికంగా స్మరించటం అత్యంత విశిష్టమైన పుణ్యకార్యం. దేవుణ్ణి అత్యధికంగా స్మరించేవారు ప్రళయదినాన పుణ్యం రీత్యా అందరికంటే ముందుంటారు. రెండోది; దేవుణ్ణి స్మరించేవారు, దైవానికి విధేయత చూపేవారు- వారు స్త్రీలయినా, పురుషులయనా ఇద్దరికీ సమానమైన పుణ్యం లభిస్తుంది. దైవస్మరణకు, దైవవిధేయతకు లభించే పుణ్యంలో లింగపరమైన ఎలాంటి వివక్షత చూపబడదు.

١٤٣٨ ـ وعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يقولُ: «أَفْضَلُ الذِّكْرِ: لا إِلهَ إِلَّا اللهُ». رواه الترمذي وقَالَ: حديثٌ حسنٌ.

1438. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ జాబిర్ (రజి) తెలియజేశారు: అన్నిటి కంటే శ్రేష్ఠమైన దైవస్మరణ 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అని పలకటం. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

హదీసులో పేర్కొనబడిన వచనం ఏకేశ్వరోపాసనా సిద్ధాంతానికి పునాది లాంటిది. అందుకే దీన్ని అత్యంత శ్రేష్ఠమైన దైవస్మరణగా పేర్కొనటం జరిగింది. పోతే కొంతమంది పండితులు ఈ ఒక్క వచనాన్ని మాత్రమే శ్రేష్ఠమైన దైవస్మరణగా పేర్కొంటే అందులో 'ముహమ్మద్ రసూలుల్లాహ్' అనే వచనం కూడా ఉందనీ 'లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మద్ రసూలుల్లాహ్' అనే మొత్తం వచనం 'శ్రేష్ఠమైన దైవస్మరణ' అవుతుందని అభిప్రాయపడ్డారు.

١٤٣٩ ـ وعَنْ عبدِ اللهِ بنِ بُسْرٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَجُلاً قَالَ: يَا رَسُولَ اللهِ! إِنَّ شَرَائِعَ الإِسْلامِ قَدْ كَثُرَتْ عَلَيَّ، فَأَخبِرْني بِشَيءٍ أَتَشَبَّثُ بِهِ قَالَ: «لَا يَزالُ

1439. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ బుస్ర్ (రజి) కథనం: (దైవప్రవక్త సన్నిధిలో) ఒక వ్యక్తి, "దైవప్రవక్తా! ఇస్లాం ఆదేశాలు నాకు చాలా ఎక్కువగా కనిపిస్తాయి. కనుక నేను స్థిరంగా

لِسَانُكَ رَطْباً مِنْ ذِكْرِ الله». رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

ఆచరించదగిన ఆచరణ ఒకటి నాకు తెలపండి" అని కోరాడు. అందుకాయన 'నీ నోరు ఎల్లప్పుడూ దైవస్మరణలో లీనమై ఉండేలా చూసుకో' అని ఉపదేశించారు. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మూలంలో 'షరాయివు' అనే పదం వచ్చింది. అది షరీఅతున్ అనే పదానికి బహు వచనం. దేవుడు నిర్ణయించిన ఆదేశాలు అని దాని భావం. దైవాదేశాల్లో కొన్ని విధులు (ఫర్జ్‌లు), మరికొన్ని ముస్తహబ్‌లు, ఇంకొన్ని నఫిళ్లు (స్వచ్ఛంద సత్కార్యాలు) ఉన్నాయి. విధుల్ని ఎట్టి పరిస్థితుల్లోనయినా నిర్వర్తించాల్సిందే. అందులో ఎలాంటి మినహాయింపూ ఉండదు. అలాగే దేవుని ప్రసన్నతను బడయటానికి, దైవసామీప్యాన్ని చూరగొనటానికి ముస్తహబ్‌లు, నఫిళ్లు కూడా పాటిస్తూ ఉండటం మంచిది. కాని సామాన్యప్రజలకు వీటిని గురించి చెబితే వారు 'ఇన్ని ఆదేశాలు పాటించాలా?'అని బెదిరిపోవచ్చు. సాధారణంగా వారు ఫర్జ్ మరియు సున్నత్‌లతో సరిపుచ్చుకోవాలనుకుంటారు. ఈ హదీసులో పేర్కొనబడిన వ్యక్తి ఆ బాపతే. అందుకే దైవప్రవక్త (సల్లం) అతనికి నిత్యం నోటిని దైవస్మరణలో లీనం చేసుకోమనీ, అంటే నిత్యం దైవాన్ని స్మరిస్తూ ఉండమని బోధించారు. నఫిల్ ఆరాధనల్ని చూసి బెదిరిపోనవసరం లేదు. నిత్యం దైవస్మరణలో నిమగ్నమై ఉంటే సరిపోతుంది అని చెప్పటమే ఆయన ఉద్దేశ్యం.

١٤٤٠ ـ وعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ قَالَ: سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ غُرِسَتْ لَهُ نَخْلَةٌ فِي الجَنَّةِ». رواه الترمذي وقالَ: حديثٌ حسنٌ.

1440. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే 'సుబ్‌హానల్లాహి వబిహమ్దిహీ' అని అంటారో వారి కోసం స్వర్గంలో ఒక ఖర్జూరపు చెట్టు నాటడం జరుగుతుంది.

*(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని స్వర్గం ఎంత విశాలమైనదంటే దాన్ని మనం మాటల్లో వర్ణించలేం. కనుక దేవుణ్ణి స్తుతించటం, ఆయన పవిత్రతను కొనియాడటం మూలంగా స్వర్గంలో చెట్టు నాటబడటం

అసాధ్యమేమీ కాదు. కనుక నిజంగా అలా జరుగుతుందని చెప్పటంలో ఎలాంటి సంశయం అక్కర్లేదు. అయితే కొంతమంది పండితులు ఇక్కడ దీని భావం పుణ్యప్రాప్తి అనీ, అది కూడా చాలా ఎక్కువ పుణ్యం లభిస్తుందని చెబుతారు.

١٤٤١ ـ وعن ابن مَسْعُودٍ رضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَقِيتُ إِبْرَاهِيمَ ﷺ لَيْلَةَ أُسْرِيَ بي فقالَ: يَا مُحَمَّدُ! أَقرِىء أُمَّتَكَ مِنِّي السَّلَامَ، وَأَخبِرْهُم أَنَّ الجَنَّةَ طَيِّبَةُ التُّرْبَةِ، عَذْبَةُ الماءِ؛ وَأَنَّهَا قِيعانٌ وَأَنَّ غِرَاسَها: سُبْحَانَ اللهِ، والحَمْدُ للهِ، ولا إلهَ إلَّا اللهُ، وَاللهُ أَكْبَرُ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

1441. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: నాకు మేరాజ్ యాత్ర చేయించబడిన రాత్రి నేను ఇబ్రాహీమ్ (అలైహి)ని కలిశాను. అప్పుడాయన నాతో ఇలా అన్నారు: ముహమ్మద్ (సల్లం)! మీ అనుచర సమాజానికి నా తరఫున సలాం చెప్పండి. ఇంకా వారికి ఇలా తెలపండి: స్వర్గంలోని మట్టి శుద్ధమైనది. అక్కడి నీళ్ళు తీయగా ఉంటాయి. అదో చదును మైదానం. "సుబ్హానల్లాహి వల్హమ్దు లిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహ్" అని అంటే అక్కడ ఒక చెట్టుని నాటుకున్నట్లే. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

దేవుణ్ణి స్తుతించటం, ఆయన పవిత్రతను కొనియాడటం మూలంగా చదును మైదానంగా ఉండే స్వర్గం చెట్లతో, మొక్కలతో సస్యశ్యామలమైపోతుంది. ఎవరు ఎంత ఎక్కువగా దైవాన్ని స్మరిస్తారో వారికి లభించే స్వర్గం అంతే ఎక్కువగా చెట్లతో నిండుగా సస్యశ్యామలంగా ఉంటుంది.

١٤٤٢ ـ وعَنْ أَبِي الدَّرْدَاءِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «أَلَا أُنَبِّئُكم بِخَيْرِ أَعْمَالِكُم، وَأَزْكَاهَا عِنْدَ مَلِيكِكم، وَأَرْفَعِها في دَرَجَاتِكم، وَخَيْرٍ لَكُمْ مِنْ

1442. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకసారి (తన సహచరులకు ప్రబోధిస్తూ ఇలా అన్నారు:) "మీ ఆచరణల్లో ఒకదాని గురించి నేను మీకు తెలుపనా? అది మీ ఆచరణలన్నిటి

إنفاقِ الذَّهَبِ وَالفضَّةِ وَخَيْرٍ لَكُمْ مِنْ أَنْ تَلْقَوْا عَدُوَّكُم، فَتَضْرِبُوا أَعْنَاقَهُم، وَيَضرِبوا أَعْنَاقَكُم؟» قَالُوا: بَلَى، قَالَ: «ذِكْرُ اللهِ تَعَالى». رواهُ التِّرمذيُّ، قَالَ الحاكمُ أبو عبدِ اللهِ: إسناده صحيح.

కంటే శ్రేష్ఠమైనది. మీ యజమాని దృష్టిలో అత్యంత పవిత్రమైనది. అన్నింటికంటే ఎక్కువగా మీ అంతస్తుల్ని పెంచుతుంది. మీరు (దైవం కోసం) వెండి బంగారాలు ఖర్చుపెట్టటం కన్నా శ్రేష్ఠమైనది. మీరు శత్రువులతో తలపడి మీరు వారి మెడలు నరకటం వారు మీ మెడలు నరకటం కన్నా ఎంతో గొప్పది.”

అందుకు సహచరులు ‘తప్పకుండా తెలియజేయండి’ అన్నారు. దానికాయన ‘ఆ ఆచరణ దేవుణ్ణి స్మరించటం’ అని అన్నారు. (తిర్మిజీ - హాకిమ్. అబూ అబ్దుల్లాహ్ దీని ఆధారాలు దృఢమైనవని అన్నారు)

*(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా దైవస్మరణ విశిష్టతను వెల్లడిస్తోంది. ఏ మంచిపనికయినా ఆధారం దైవస్మరణే. సత్కార్యాలను చిత్తశుద్ధితో, ఆపేక్షతో చేసినప్పుడే అవి ఆమోదించబడతాయి. దైవాన్ని స్మరించకుండా, దైవాభీష్టాన్ని లెక్కలోకి తీసుకోకుండా చేసే ఎంత పెద్ద పుణ్యకార్యమైనా వ్యర్థమయిపోతుంది. అందుకే ఈ హదీసులో దైవస్మరణను అన్నిటికంటే గొప్ప ఆచరణగా పేర్కొనటం జరిగింది.

١٤٤٣ ـ وعن سَعْدِ بنِ أبي وقاصٍ رضِيَ اللهُ عَنْهُ أَنَّهُ دَخَلَ مَعَ رسولِ اللهِ ﷺ عَلى امْرَأَةٍ وَبَيْنَ يَدَيْهَا نَوًى ـ أَوْ حَصىً ـ تُسَبِّحُ بِهِ فَقالَ: «أُخبِرُكِ بِمَا أَيْسَرُ عَلَيْكِ مِنْ هٰذا ـ أَوْ أَفضَلُ» فَقالَ: «سُبْحَانَ اللهِ

1443. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం ప్రకారం ఒకసారి ఆయన దైవప్రవక్త (సల్లం)తోపాటు ఓ మహిళ ఇంటికి వెళ్ళారు. ఆ సమయంలో ఆమె ముందు టెంకాయలు (లేక) కంకరాళ్ళు పడివున్నాయి. వాటితో

عَدَدَ مَا خَلَقَ فِي السَّماءِ، وسُبْحَانَ اللهِ عَدَدَ مَا خَلَقَ فِي الأرْضِ، وسُبْحَانَ اللهِ عَدَدَ مَا بَيْنَ ذٰلِكَ، وسُبْحَانَ اللهِ عَدَدَ مَا هُوَ خَالِقٌ. واللهُ أَكْبَرُ مِثْلَ ذٰلِكَ، وَالحَمْدُ للهِ مِثْلَ ذلك، وَلَا إِلٰهَ إِلَّا اللهُ مِثْلَ ذٰلِكَ، وَلَاحَوْلَ وَلَاقُوَّةَ إِلَّا باللهِ مِثْلَ ذٰلِكَ». رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

ఆమె లెక్కపెట్టుకుంటూ "సుబ్హా నల్లాహ్...... సుబ్హానల్లాహ్" అని అంటోంది. అది చూసి దైవప్రవక్త (సల్లం) ఆమెతో, దీనికంటే సులువైన (లేక) దీనికంటే శ్రేష్ఠమైన వచనాలు తెల్పనా? (నువ్వు ఈ విధంగా పఠించు:) "దేవుడు ఆకాశాల్లో సృష్టించిన వస్తువులకు సమానంగా నేను దేవుని పవిత్రతను కొనియాడుతున్నాను. ఆయన భూమిలో సృష్టించిన వస్తువులకు సమానంగా నేను దేవుని పవిత్రతను కొనియాడుతున్నాను. ఇంకా భూమ్యాకాశాల మధ్యనున్న దేవుని సృష్టితాలకు సమానంగా నేను ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. ఆయన పుట్టించబోయే వస్తువులకు సమానంగా ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను." అలాగే అల్లాహు అక్బర్, అల్హమ్దులిల్లాహ్, లా ఇలాహ ఇల్లల్లాహ్, లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్ అనే వచనాలను కూడా (పఠించాలి). *(తిర్మిజీ-హసన్)*

*(సునవె తిర్మిజీలోని దావాత్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

షేఖ్ అల్బానీ (రహ్మలై) 'అజ్జయిఫా' అనే గ్రంథంలో ఈ హదీసుని బలహీనమైనదిగా పేర్కొన్నారు. ఇమామ్ తిర్మిజీ దీనిని 'హసన్' కోవకు చెందినదని పేర్కొనగా ఇమామ్ ఇబ్నె హిబ్బాన్ 'సహీహ్'గా పరిగణించారు. అయితే ఇక్కడ షేఖ్ అల్బానీ (రహ్మలై) ఇచ్చిన వివరాలు కాస్త గమనార్హమైనవి. ఆయన అభిప్రాయం ప్రకారం ఈ మొత్తం హదీసు జయీఫ్కాదు.

ఇందులోని 'టెంకాయలు, కంకర్రాళ్ళు' అనే పదాలు తీసేస్తే అప్పుడది 'సహీహ్' హదీసే అవుతుంది అని అంటారాయన. ఈ హదీసుని ఇమామ్ ముస్లిం తన 'సహీహ్' గ్రంథంలో జువైరియా (రజి.అన్హా) ఆధారంగా వెలికితీశారు. (మరిన్ని వివరాలకు షేఖ్ అల్బానీగారిచే పరిశోధిత రియాజుస్సాలిహీన్ గ్రంథం చూడండి)

١٤٤٤ ـ وعَنْ أبي مُوسى رضِيَ الله عَنْهُ قَالَ: قَالَ لِي رَسُولُ اللهِ ﷺ: «ألا أَدُلُّكَ عَلى كَنْزٍ مِنْ كُنُوزِ الجَنَّةِ؟» فقلتُ: بَلى يا رسولَ اللهِ! قَالَ: «لا حَوْلَ وَلَا قُوَّةَ إلَّا باللهِ» متفقٌ عليه.

1444. హజ్రత్ అబూమూసా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాతో "నేను నీకు స్వర్గనిధుల్లోని ఒక నిధి గురించి తెలుపనా?" అని అన్నారు. నేను "తప్పకుండా తెలపండి దైవప్రవక్తా!" అని అన్నాను. అందుకాయన 'లాహౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్' (అనే పలుకే ఆ నిధి) అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'లాహౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్' అనే వచనాన్ని స్వర్గనిధిగా పేర్కొనటం జరిగింది. అంటే అది స్వర్గంలోని అత్యంత అమూల్యమైన సంపద అన్నమాట. ఈ వచనాన్ని పఠించేటప్పుడు మనిషి తన నిస్సహాయతను వెలిబుచ్చుతాడు, సకల శక్తి సామర్థ్యాలు దేవుని నుండే వస్తాయని ప్రకటిస్తాడు. ఈ విషయాన్ని దేవుడు అమితంగా ఇష్టపడతాడు. అందుకే ఆ వచనపఠనానికి అంతటి ప్రాముఖ్యత ఉంది. పోతే ఆ వచనం భావం ఏమిటంటే- మనిషి తనకు తానుగా ఏదీ చేయలేడు. ఏదైనా మంచిపని చేయాలన్నా లేక ఎదయినా చెడు పని నుండి కాపాడుకోవాలన్నా కేవలం దేవుని సంకల్పం, ఆయన కల్పించే అవకాశాలతోటే సాధించగలుగుతాడు.

**245వ అధ్యాయం**

## ٢٤٥ ـ بَابُ ذِكْرِ اللهِ تَعَالَى قَائِماً وَقَاعِداً وَمُضْطَجِعاً وَمُحْدِثاً وَجُنُباً وَحَائِضاً، إلاَّ الْقُرْآنَ فَلاَ يَحِلُّ لِجُنُبٍ وَلاَ حَائِضٍ

## నించొని, కూర్చొని, పడుకొని, వుజూలేని స్థితిలోనయినా, లైంగిక అశుద్ధావస్థలోనయినా, బహిష్టు స్థితిలోనయినా దైవస్మరణ చేయవచ్చు. అయితే లైంగిక అశుద్ధులు, బహిష్టు స్త్రీలు ఖుర్ఆన్ పఠించకూడదు

قَالَ الله تَعَالَى: ﴿ إِنَّ فِي خَلْقِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَٱخْتِلَٰفِ ٱلَّيْلِ وَٱلنَّهَارِ لَءَايَٰتٍ لِّأُو۟لِى ٱلْأَلْبَٰبِ ﴿١٩٠﴾ ٱلَّذِينَ يَذْكُرُونَ ٱللَّهَ قِيَٰمًا وَقُعُودًا وَعَلَىٰ جُنُوبِهِمْ﴾ [آل عمران: ١٩٠، ١٩١].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: భూమీ ఆకాశాల సృష్టిలో, రేయింబవళ్ళు ఒకదాని తర్వాత ఒకటి రావడంలో, నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా అన్నివేళలా అల్లాహ్‌ను స్మరించే వారున్నూ, భూమీ ఆకాశాల నిర్మాణం గురించి చింతన చేసేవారున్నూ అయిన వివేక వంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి. *(ఆలి ఇమ్రాన్: 190-191)*

### ముఖ్యాంశాలు

మనిషికి మూడే మూడు స్థితులుంటాయి. అతను నించొని ఉంటాడు. (నడుస్తున్నప్పుడు కూడా మనిషి నించొనే ఉంటాడు) లేదా కూర్చొని ఉంటాడు. అదీ లేదంటే పడుకొని ఉంటాడు. దేవుణ్ణి తెలుసుకున్న జ్ఞానోదయులు ఈ మూడు స్థితుల్లోనూ అంటే సర్వకాల, సర్వావస్థల్లోనూ ఆయన్ని స్మరిస్తూ ఉంటారు.

١٤٤٥ ـ وعَنْ عائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ رَسُولُ اللهِ ﷺ يَذكُرُ اللهَ تَعَالى عَلى كُلِّ أَحيَانِهِ. رواه مسلم.

1445. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) అన్ని వేళలా దైవాన్ని స్మరిస్తూ ఉండేవారు. (ముస్లిం)
*(సహీహ్ ముస్లింలోని హియజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

లైంగిక అశుద్ధావస్థలో, బహిష్టు స్థితిలో ఖుర్ఆన్ పఠించటం ధర్మసమ్మతమేనని

చెప్పేవారు ఈ హదీసుని నిదర్శనంగా చూపుతారు. వీరిలో ఇమామ్ బుఖారీ లాంటివారు కూడా ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) కొన్ని సందర్భాల్లో శుద్ధావస్థలో ఉంటారు. మరికొన్ని సందర్భాల్లో అశుద్ధావస్థలో (అది వుజూలేని స్థితి అయినా లేక లైంగిక అశుద్ధావస్థలోనయినా) ఉంటారు. ప్రవక్త (సల్లం) ఎల్లప్పుడూ దేవుణ్ణి స్మరించేవారంటే పై రెండు స్థితులూ అందులోకి వచ్చేస్తాయి. ఇంకో విషయం ఏమిటంటే దైవస్మరణ (జిక్రుల్లాహ్) అన్నప్పుడు 'ఖుర్ఆన్ పఠనం' కూడా అందులోకి వచ్చేస్తుంది. అందుకే షేఖ్ అల్‌బానీగారు ఇమామ్ నవవీ (రహ్మలై)గారి ఈ అధ్యాయపు శీర్షికను (అంటే అందులోని 'లైంగిక అశుద్ధులు, బహిష్టు స్త్రీలు ఖుర్ఆన్ పఠించకూడదు' అనే విషయాన్ని) విమర్శించారు. ఈ విధమైన మినహాయింపుకు హదీసుల్లో ప్రామాణికమైన ఆధారాలేవీ లేవనీ, ఈ మినహాయింపు సదరు అధ్యాయంలోని ఆయిషా (రజిఅన్హా) హదీసుకు విరుద్ధంగా ఉందని అభిప్రాయపడ్డారు (అల్‌బానీ గారిచే పరిశోధిత రియాజుస్సాలిహీన్ గ్రంథం చూడండి). ఈ అభిప్రాయాన్ని కలిగివున్న వారి దృష్టిలో లైంగిక లేక బహిష్టు అశుద్ధావస్థలో ఖుర్ఆన్ పఠించకూడదనే హదీసులు ఆధారాల రీత్యా బలహీనమైనవి లేదా వ్యాఖ్యానించ దగ్గవి. కనుక అలాంటి హదీసుల ద్వారా ఆ విషయం బోధపడదు.

ఇతర పండితులు అలాంటి హదీసులు ఆధారాల రీత్యా బలహీనమైనప్పటికీ తమ ఆచరణకు వాటిని ఆధారాలుగానే భావిస్తున్నారు. అదీగాక ఆ హదీసులు వారి దృష్టిలో మరీ బలహీనమైనవి కూడా కావు. ఇంకొందరు పండితులయితే వాటిని హసన్ కోవకు చెందిన హదీసులుగా భావిస్తున్నారు. ఏమైనప్పటికీ ఆధారాల రీత్యా మొదటి అభిప్రాయమే దృఢంగా ఉంది. అయితే ఖుర్ఆన్ గ్రంథ గౌరవోన్నతుల దృష్ట్యా రెండవ అభిప్రాయం కూడా సరైనదేనని చెప్పాల్సి వస్తుంది. వీటి మధ్య సమరసమైన మార్గం కూడా ఉంది. అదేమిటంటే అనివార్య పరిస్థితుల్లో మొదటి అభిప్రాయానికి అనుగుణంగా నడచుకోవాలి. అంటే గత్యంతరం లేకపోతేనే తప్ప అశుద్ధావస్థలో ఖుర్ఆన్ పఠించకూడదు. పోతే సాధారణ పరిస్థితుల్లో రెండవ అభిప్రాయానికి అనుగుణంగా పరిశుద్ధంగా ఉన్నప్పుడే ఖుర్ఆన్ పఠించాలి. వాస్తవం అల్లాహ్‌కే బాగా తెలుసు.

1446. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరైనా తన భార్య దగ్గరికి (సంభోగం నిమిత్తం) వెళ్ళినప్పుడు "అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను. అల్లాహ్! మమ్మల్ని షైతాన్ నుంచి రక్షించు. (ఈ సంభోగం మూలంగా) నీవు మాకు ప్రసాదించే సంతానాన్ని కూడా షైతాన్ నుంచి

١٤٤٦ - وعن ابن عبَّاس رضيَ اللهُ عَنْهما عن النَّبيِّ ﷺ قالَ: «لو أَنَّ أَحَدَكُمْ إذا أَتَى أَهْلَهُ قَالَ: بِسْمِ الله، اللَّهُمَّ! جَنِّبْنَا الشَّيطَانَ، وَجَنِّبِ الشَّيطانَ ما رزَقْتَنَا فَقُضِيَ بَيْنَهُمَا وَلَدٌ لم يَضُرَّهُ» متفقٌ عليه.

రక్షించు" అని వేడుకుంటే, వారికి కలగబోయే సంతానానికి షైతాన్ ఎలాంటి నష్టం చేయజాలడు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సృష్టిప్రారంభ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భార్యతో సంభోగించినప్పుడు పైన పేర్కొనబడిన విధంగా ప్రార్థించుకోవాలి. అలా చేస్తే తామూ మరియు తమకు పుట్టబోయే సంతానం షైతాన్ కుయుక్తుల నుండి సురక్షితంగా ఉంటారు.



## 246వ అధ్యాయం

## ٢٤٦ ـ بَابُ مَا يَقُولُهُ عِنْدَ نَوْمِهِ وَاسْتِيقَاظِهِ

## నిద్రపోయేటప్పుడు, నిద్ర మేల్కొన్నప్పుడు పఠించే దుఆ

١٤٤٧ ـ عن حُذَيْفَةَ، وأَبي ذَرٍّ رضيَ اللهُ عَنْهُمَا قالا: كانَ رسولُ اللهِ ﷺ إذا أَوَى إلى فِرَاشِهِ قال: «باسمِكَ اللَّهُمَّ أَحْيَا وَأَمُوتُ» وَإذا اسْتَيْقَظَ قالَ: «الحَمْدُ للهِ الذي أَحْيَانَا بعدَ مَا أَمَاتَنَا وَإلَيْهِ النُّشورُ» رواه البخاري.

1447. హజ్రత్ హుజైఫా మరియు అబూజర్ (రజి)ల కథనం: దైవప్రవక్త (సల్లం) (నిద్రపోవటానికి) పడకమీద వాలినప్పుడు ఇలా వేడుకునేవారు: "అల్లాహ్! నీ పేరుతోనే మరణిస్తున్నాను. తిరిగి నీ పేరుతోనే బ్రతుకుతాను."

నిద్ర మేల్కొన్న తర్వాత ఇలా ప్రార్థించేవారు: "మమ్మల్ని మరణింప జేసిన తర్వాత తిరిగి బ్రతికించిన దేవునికే స్తోత్రం శోభిస్తుంది. మనమంతా ఆయన వైపుకే వెళ్ళవలసి ఉంది."

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఉదయం సాయంత్రం ఇలాంటి ప్రార్థనలు చేసుకుంటూ ఉంటే దేవుణ్ణి జ్ఞాపకం పెట్టుకోవటానికి చాలా అనుకూలంగా ఉంటుంది.

## 247వ అధ్యాయం

## ٢٤٧ - باب فضل حِلَقِ الذِّكْرِ وَالنَّدْبِ إِلَى مُلازَمَتِهَا وَالنَّهْيِ عَنْ مُفَارَقَتِهَا لِغَيْرِ عُذْرٍ

## దైవస్మరణ సమావేశాలు ఎంతో పుణ్యప్రదమైనవి. అలాంటి సమావేశాలకు హాజరవుతూ ఉండటం అభిలషణీయం, అకారణంగా వాటిని వదలిపెట్టడం అవాంఛనీయం

قَالَ الله تَعَالَى: ﴿وَاصْبِرْ نَفْسَكَ مَعَ الَّذِينَ يَدْعُونَ رَبَّهُم بِالْغَدَوٰةِ وَالْعَشِيِّ يُرِيدُونَ وَجْهَهُۥ وَلَا تَعْدُ عَيْنَاكَ عَنْهُمْ﴾ [الكهف: ٢٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "తమ ప్రభువు ప్రసన్నతను అర్థిస్తూ ఉదయం, సాయంత్రం ఆయనను వేడుకుంటూ ఉండే వారి సాహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్తి పరచుకో. వారి నుండి నీ దృష్టిని ఏమాత్రం మరల్చకు." *(కహఫ్:28)*

### ముఖ్యాంశాలు

ప్రభువు ప్రసన్నతను ఆశించేవారిని నిర్లక్ష్యం చేసి ప్రభువు ధ్యానం విషయంలో ఏమరుపాటుకు లోనయినవారి వైపు దృష్టి మళ్ళించకు, వారు ఎంత స్థితిపరులైనా సరే; అని పై దైవసూక్తికి భావం.

١٤٤٨ - وعنْ أَبي هُرَيْرَةَ رضيَ الله عَنْهُ قَالَ: قَالَ رَسُولُ الله ﷺ: «إنَّ لِلّهِ تَعَالى مَلائِكَةً يَطُوفُونَ في الطُّرُقِ يَلْتَمِسُونَ أَهْلَ الذِّكْرِ، فَإِذا وَجَدُوا قَوْماً يَذْكُرُونَ اللهَ عَزَّ وَجَلَّ، تَنَادَوْا: هَلُمُّوا إِلَى حَاجَتِكُمْ فَيَحُفُّونَهم بِأَجْنِحَتِهِم إلى السَّمَاءِ الدُّنْيَا، فَيَسْأَلُهم رَبُّهُم - وَهُوَ أَعْلَمُ -: ما يقولُ عِبَادِي؟ قَالَ: يقولون: يُسَبِّحُونَكَ وَيُكَبِّرُونَكَ، وَيحْمَدُونَكَ، وَيُمَجِّدُونَكَ،

1448. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కొంతమంది దైవదూతలు దైవస్మరణ చేసేవారిని వెతుక్కుంటూ దారుల్లో తిరుగుతూ ఉంటారు. ఎక్కడయినా ఎవరయినా దేవుణ్ణి స్మరిస్తూ వారికి కనిపిస్తే వారు తోటి దూతల్ని పిలుస్తూ, "ఇలా రండి. మీరు వెతుకుతున్న వారు ఇక్కడు న్నారు" అని అంటారు. అంతేకాదు, మొదటి ఆకాశం వరకు వారిని తమ

فيقولُ: هل رَأَوْني؟ فيقولون: لا وَاللهِ! ما رَأَوْكَ فَيَقُولُ: كيْفَ لو رَأَوْني؟! قالَ: يَقُولُونَ لو رَأَوْكَ كانُوا أَشَدَّ لكَ عِبَادَةً، وَأَشَدَّ لكَ تَمْجِيداً، وَأَكْثَرَ لكَ تَسْبِيحاً. فَيَقُولُ: فماذا يَسْأَلُونَ؟ قالَ: يَقُولونَ: يسألُونَكَ الجَنَّةَ. قالَ: يقولُ: وَهل رَأَوْهَا؟ قالَ: يَقُولُونَ: لا وَاللهِ يَا ربِّ مَا رَأَوْهَا. قالَ: يقُولُ: فَكَيْفَ لو

రెక్కలతో కప్పివేస్తారు. (ఆ తర్వాత వారు అక్కణ్ణుంచి దేవుని వద్దకు వెళ్ళి నప్పుడు) దేవుడు వారిని 'నా దాసులు ఏమంటున్నారు?' అని అడుగుతాడు. వాస్తవానికి వారేమంటున్నారో దేవునికి బాగా తెలుసు. దానికి సమాధానంగా దైవదూతలు, 'వారు నీ పవిత్రతను కొని యాడుతున్నారు. నీ గొప్పదనాన్ని చాటుతున్నారు. నిన్ను స్తుతిస్తున్నారు. నీ ఔన్నత్యాన్ని పొగుడుతున్నారు" అని చెబుతారు. "వారు నన్ను చూశారా?" అని అడుగుతాడు దేవుడు. దానికి దూతలు, "దైవం సాక్షి! వారు నిన్ను చూడలేదు" అని చెబుతారు. ఒకవేళ వారు నన్ను చూస్తే అప్పుడెలా ఉంటుంది వారి పరిస్థితి? అని అడుగు తాడు దేవుడు. 'వారు గనక నిన్ను చూస్తే మరింత ఎక్కువగా నిన్ను ఆరాధిస్తారు. నీ ఔన్నత్యాన్ని పొగుడు తారు. నీ పరిశుద్ధతను కొనియాడు తారు' అంటారు దూతలు. దేవుడు (మళ్ళీ) 'వారికి ఏం కావాలట?' అని అడుగుతాడు. 'నువ్వు వారికి స్వర్గం ప్రసాదించాలట' అని చెబుతారు దూతలు. 'వారు స్వర్గాన్ని చూశారా?' అని అడిగితే 'దైవం సాక్షి! వారు చూడ లేదు' అని చెబుతారు దూతలు. అప్పుడు దేవుడు మళ్ళీ అడుగుతాడు, 'వారు గనక స్వర్గాన్ని చూస్తే అప్పుడెలా

رَأَوْهَا؟! قالَ: يقُولُونَ لو أنَّهم رَأَوْهَا كَانُوا أَشَدَّ عَلَيْهَا حِرْصاً، وَأَشَدَّ لَهَا طَلَباً، وَأَعْظَم فِيها رَغْبَةً. قَالَ: فَمِمَّ يَتَعَوَّذُونَ؟ قالَ: يَتَعَوَّذُونَ مِنَ النَّارِ؛ قالَ: فَيَقُولُ: وَهَلْ رَأَوْهَا؟ قالَ: يقولونَ: لا وَاللهِ! مَا رَأَوْهَا. فَيَقُولُ: كَيْفَ لو رَأَوْهَا! قالَ: يَقُولُون: لو رأَوْهَا كانَوا أَشَدَّ منها فِرَاراً، وَأَشَدَّ لها مَخَافَةً. قَالَ فيقُولُ: فَأُشْهِدُكم أَنِّي قد غَفَرْتُ لهم، قَالَ: يقُولُ مَلَكٌ مِنَ المَلائِكَةِ: فِيهِم فُلانٌ لَيْسَ مِنهم، إنَّمَا جَاءَ لِحَاجَةٍ، قالَ: هُمُ الجُلَسَاءُ لا يَشْقَى بِهِم

ఉంటుంది. వారి పరిస్థితి?' అని. "(దేవా!) ఒకవేళ వీరు గనక స్వర్గాన్ని చూస్తే, దాన్ని పొందాలనే ఆశ, కోరిక శ్రద్ధాసక్తులు వీరిలో మరింత పెరిగి పోతాయి' అని చెబుతారు దూతలు. "సరే, వారు దేని నుంచి శరణు వేడు కుంటున్నారు?" అని అడుగుతాడు. "వారు నరకాగ్ని నుండి శరణు వేడు కుంటున్నారు" అని చెబుతారు దూతలు. 'అసలు వారు ఆ నరకాన్ని చూశారా?' అని అడుగుతాడు దేవుడు మళ్ళీ. 'లేదు, దైవం సాక్షి! వారు దాన్ని చూడలేదు' అని చెబుతారు దూతలు. 'ఒకవేళ చూస్తే అప్పుడెలా ఉంటుంది?' అని అడిగితే, దూతలు 'వారు గనక దాన్ని చూస్తే దాని నుండి ఇంకా పారిపోతారు. దానికి ఇంకా భయపడతారు' అని చెబుతారు. అప్పుడు దేవుడు, 'నేను వారిని క్షమి స్తున్నాను. ఇందుకు మిమ్మల్ని సాక్షు లుగా నిలబెడుతున్నాను' అంటాడు. దానికి దూతల్లో ఒకడు సందేహ పడుతూ, "(దేవా!) వారిలో ఒకతను ఏదో పనిమీద వచ్చి (కూర్చున్నాడు). నిజానికి అతను (ముందు నుంచి) వారితో పాటు లేడు" అని చెబుతాడు. ఆ మాట విని దేవుడు ఇలా ప్రకటి స్తాడు: దేవుణ్ణి స్మరిస్తూ కూర్చున్నవారు ఎలాంటివారంటే వారివెంట కూర్చునే

جَلِيسُهم» متفقٌ عليه. وفي روايةٍ لمسلم عَنْ أَبي هُريرةَ رَضيَ اللهُ عَنْهُ، عَن النبيِّ ﷺ قالَ: «إنَّ لِلهِ مَلائكةً سَيَّارةً فُضُلاً يَتَتَبَّعُونَ مَجَالِسَ الذِّكرِ، فَإذا وجَدُوا مَجلِساً فِيهِ ذِكرٌ، قَعَدُوا مَعَهُم، وَحَفَّ بَعْضُهُمْ بَعْضاً بِأَجْنِحَتِهِم حَتَّى يَمْلَؤُوا ما بَيْنَهُمْ وبَيْنَ السَّمَاءِ الدُّنْيَا، فَإذا تَفَرَّقُوا عَرَجُوا وَصَعِدوا إلى السَّمَاءِ، فَيَسْألُهُمُ اللهُ عَزَّ وَجَلَّ ـ وَهُوَ أَعْلَمُ ـ: مِنْ أَيْنَ جِئْتُمْ؟ فَيَقُولُونَ: جِئْنَا مِنْ عِنْدِ عِبادٍ لَكَ في

వారు కూడా (ఆ శుభాలను) పొంద కుండా ఉండరు. (బుఖారీ-ముస్లిం)

ముస్లిం గ్రంథంలో హజ్రత్ అబూ హురైరా (రజి) గారిచే ఉల్లేఖించబడిన వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: రక్షణ కోసం నియమించబడిన దైవ దూతలు కాకుండా మరికొందరు దూతలు ఉన్నారు. వారు దైవస్మరణ సదస్సుల కోసం తిరుగుతూ ఉంటారు. ఎక్కడయినా (జనులు) దైవస్మరణలో నిమగ్నమై ఉన్న సమావేశం కనిపిస్తే వీరు కూడా వారితోపాటు కూర్చుం టారు. ఒకరి రెక్కల్ని మరొకరితో కలుపుకొని (మొత్తం సమావేశాన్ని) చుట్టూర కప్పుకుంటారు. ఆ విధంగా మొదటి ఆకాశం వరకు మధ్యలోవున్న స్థలం వారితోనే నిండిపోతుంది. ప్రజలు అక్కణ్ణుంచి శెలవు తీసుకున్న తర్వాత దూతలు ఆకాశం వైపు ఎక్కిపోతారు. అప్పుడు దేవుడు వారిని అడుగుతాడు: 'మీరు ఎక్కణ్ణుంచి వస్తున్నారు?' అని. వాస్తవానికి వారు ఎక్కణ్ణుంచి వస్తున్నారో ఆయనకు బాగా తెలుసు. ఆ ప్రశ్నకు దూతలు 'మేము భువిలో వున్న నీ దాసుల దగ్గర్నుండి వస్తున్నాం. వారు నీ పవిత్రతను కొనియాడు తున్నారు. నీ గొప్పదనాన్ని చాటు తున్నారు. నీ ఏకత్వాన్ని కీర్తిస్తున్నారు.

الأرض: يُسبِّحُونَكَ، وَيُكَبِّرُونَكَ، وَيُهَلِّلُونَكَ، وَيَحْمَدُونَكَ، وَيَسْأَلُونَكَ. قالَ: وَمَاذا يَسْأَلُوني؟ قَالُوا: يَسْأَلُونَكَ جَنَّتَكَ. قالَ: وَهَلْ رَأَوْا جَنَّتي؟ قالوا: لا، أيْ رَبِّ! قالَ: فَكَيْفَ لَوْ رَأَوْا جَنَّتي؟! قالُوا: وَيَسْتَجِيرُونَكَ. قال: وَمِمَّ يَسْتَجِيرُوني؟ قالوا: مِنْ نَارِكَ يَا رَبِّ!

నిన్ను స్తుతిస్తున్నారు. నిన్ను అర్థిస్తు న్నారు' అని చెబుతారు. 'వారు నన్ను ఏం అర్థిస్తున్నారు?' అని అడుగుతాడు దేవుడు. 'వారు నిన్ను నీ దగ్గరున్న స్వర్గం ఇవ్వమని అడుగు తున్నారు' అని చెబుతారు దూతలు. 'వారు నా స్వర్గం చూశారా?' అని దేవుడు ప్రశ్ని స్తాడు. 'లేదు, ప్రభూ! వారు చూడలేదు' అని దూతలు జవాబు చెబుతారు. 'ఒక వేళ వారు దాన్ని చూస్తే ఏమను కుంటారు?' అని అడుగుతాడు దేవుడు.

(తర్వాత) దూతలు, 'వారు నీ శరణు వేడుతున్నారు' అని చెబుతారు. దానికి దేవుడు 'దేన్నుండి నా శరణు వేడు తున్నారు' అని అడుగుతాడు. దానికి దూతలు సమాధానమిస్తూ, 'నీ అగ్ని నుండి' అని చెబుతారు. 'వారు నా అగ్నిని చూశారా?' అని అడుగు తాడు దేవుడు. 'లేదు, చూడలేదు' అని జవాబు చెబుతారు దూతలు. దేవుడు మళ్ళీ, 'ఒకవేళ వారు నా అగ్నిని చూస్తే ఏమనుకుంటారు?' అని అడుగు తాడు.

(తర్వాత) దూతలు, 'వారు నీ మన్నిం పుని కోరుతున్నారు' అని అంటారు. అప్పుడు దేవుడు ఇలా ప్రకటిస్తాడు: "నేను వారిని మన్నించాను. వారు అడిగినది ఇచ్చేశాను. వారు దేన్నుండి

قَالَ: وَهَلْ رَأَوْا نَارِي؟ قالوا: لا ، قال: فَكَيْفَ لَوْ رَأَوْا نَارِي؟! قَالُوا: وَيَسْتَغْفِرُونَكَ، فيقولُ: قَدْ غَفَرْتُ لَهُمْ، وَأَعْطَيْتُهُمْ ما سَأَلُوا، وَأَجَرْتُهُمْ مِمَّا اسْتَجَارُوا. قَالَ: فَيَقُولُونَ: ربِّ فيهِمْ فُلانٌ عَبْدٌ خَطَّاءٌ إِنَّمَا مَرَّ، فَجَلَسَ مَعَهُمْ، فيقولُ: ولَهُ غَفَرْتُ، هُمُ القَوْمُ لا يَشْقَى بِهِمْ جَلِيسُهُمْ».

శరణు కోరుకుంటున్నారో ఆ శరణు ఇచ్చేశాను.''

అది విని దూతలు, 'ప్రభూ! వారిలో ఒక పాపాత్ముడు కూడా ఉన్నాడు. నిజానికి అతను అట్నుంచి వెళ్తూవెళ్తూ అక్కడ కూర్చున్నవాడే గాని (అతను ముందు నుంచి వారివెంట లేడు) అని చెబుతారు. దానికి దేవుడు, 'నేను అతన్ని కూడా క్షమించాను. అక్కడ కూర్చున్నవారు ఎలాంటి వారంటే వారి వెంట కూర్చున్నవారు కూడా (ఆ శుభాలు) పొందకుండా ఉండరు' అని అంటాడు.

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవస్మరణ జరిగే సదస్సులు, సమావేశాలు ఎంతో పుణ్యప్రదమైనవని ఈ హదీసులో చెప్పబడింది. అయితే అసలు ఆ సదస్సులు, సమావేశాల రూపురేఖలు ఎలా ఉంటాయి? అనే ప్రశ్న ఈ సందర్భంగా తలెత్తవచ్చు. అవి హదీసుల్లో వివరించబడని, ప్రజలు తమంత తాము ఓ ప్రత్యేక పంథాలో జరుపుకునే సమావేశాలు మాత్రం కావని చెప్పటంలో ఎలాంటి సందేహం అక్కర్లేదు. ఉదాహరణకు కొందరు 'అల్లాహు హువ' అనో, లేక 'హువ హఖ్ఖున్' అనో పఠిస్తూ కూర్చుంటారు. హదీసుల్లో ఇలా చేయాలని ఎక్కడా లేదు. మరికొందరు దీపాలు ఆర్పేసి పూనకం వచ్చినవారిలాగా ఏదో ఒక వచనం పఠిస్తూ ఊగిపోతూ ఉంటారు. దైవప్రవక్త (సల్లం) జీవితంలోగాని ఆ తర్వాత ఆయన సహచరుల విధానంలోగాని వీటికి ఎలాంటి ఆధారాలూ కన్పించవు. నిజమైన దైవస్మరణ సమావేశాలు ఏవంటే- వాటిలో స్వయం కల్పిత విధానాలుండవు. ఎవరో కొందరు తయారు చేసుకున్న వచనాలు పఠించబడవు. పైగా 'సుబ్హానల్లాహ్, అల్హమ్దులిల్లాహ్, లా ఇలాహ ఇల్లల్లాహ్, వల్లాహు అక్బర్' అనే వాక్యాలను సాధారణ రీతిలో పఠించాలి. ఉదా: నమాజ్ తర్వాత వెంటనే సుబ్హానల్లాహ్, అల్హమ్దులిల్లాహ్, అల్లాహు అక్బర్ అని పఠించటం, జుమానాడు మస్జిద్లో ఉన్నవారు దేవుణ్ణి స్మరిస్తూ ఖుర్ఆన్ పారాయణం చేస్తూ ఉండాలి. లేదా ధర్మ బోధనల్లో, ధార్మిక చర్చల్లో నిమగ్నులై ఉండాలి.

١٤٤٩ ـ وعنهُ وعَنْ أَبي سعيدٍ رَضيَ اللهُ عَنْهُما قالا: قَالَ رَسُولُ الله ﷺ: «لا يَقْعُدُ قَوْمٌ يَذْكُرُونَ اللهَ إلَّا حَفَّتْهُمُ المَلائِكَةُ، وَغَشِيَتْهُمُ الرَّحْمَةُ وَنَزَلَتْ عَلَيْهِمُ السَّكِينَةُ؛ وَذَكَرَهُمُ اللهُ فِيمنْ عِنْدَهُ» رواه مسلم.

1449. హజ్రత్ అబూసయీద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరైనా దేవుణ్ణి స్మరిస్తూ కూర్చుంటే దైవదూతలు వారిని చుట్టుముడుతారు. వారిమీద కారుణ్యం కమ్ముకుంటుంది. శాంతి (అనగా విశేషమైన దైవసహాయం) అవతరిస్తుంది. దేవుడు తన దగ్గరున్న వారి సమక్షంలో వీరిని జ్ఞాపకం చేసు కుంటాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

١٤٥٠ ـ وعن أَبي واقِدٍ الحارثِ بْنِ عَوْفٍ رَضيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ بَيْنَما هُوَ جَالِسٌ في المَسْجِدِ، وَالنَّاسُ مَعَهُ، إِذْ أَقْبَلَ ثَلاثَةُ نَفَرٍ، فَأَقْبَلَ اثْنانِ إلى رَسولِ الله ﷺ وَذَهَبَ وَاحِدٌ، فَوَقَفَا على رسولِ الله ﷺ. فَأَمَّا أَحَدُهُما فرأى فُرجَةً في الحَلْقَةِ، فَجَلَسَ فيها وأَمَّا الآخَرُ، فَجَلَسَ خَلْفَهُم، وَأَمَّا الثالثُ فَأدبَرَ ذاهباً. فَلَمَّا فَرَغَ رسُول اللهِ ﷺ قال: «أَلا أُخبِرُكم عَنِ النَّفَرِ الثَّلاثَةِ: أَمَّا أَحَدُهم، فَأوى إِلى اللهِ، فَآوَاهُ اللهُ، وأمَّا الآخرُ فَاسْتَحْيَا فاستحيا اللهُ مِنْهُ، وأمَّا الآخرُ، فَأَعْرَضَ، فَأَعْرَضَ اللهُ عَنْهُ» متفقٌ عليه.

1450. హజ్రత్ అబూ వాఖిద్ హారిస్ బిన్ ఔఫ్ (రజి) కథనం: ఒక రోజు దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో కూర్చొని ఉన్నారు. ఆ సమయంలో ఆయన దగ్గర జనం కూడా ఉన్నారు. అంతలో ముగ్గురు వ్యక్తులు అక్కడికి వచ్చారు. వారిలో ఇద్దరు దైవప్రవక్త (సల్లం) వైపు వచ్చారు. మిగిలిన ఒకడు తిరిగి వెళ్ళి పోయాడు. ఆ ఇద్దరు దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి నించున్నారు. వారిలో ఒకడికి ఆ సమావేశంలో ఖాళీ కనిపిస్తే అక్కడ కూర్చున్నాడు. రెండో వ్యక్తి అందరి కన్నా వెనుక కూర్చున్నాడు. మూడో వ్యక్తి తిరిగి వెళ్ళిపోయాడు. సమావేశం ముగిసిన తర్వాత దైవప్రవక్త (సల్లం) తన సహచరుల్ని ఉద్దేశ్యించి, "ఈ ముగ్గురి గురించి చెప్పమంటారా? వీరిలో ఒకడు దేవుని శరణుకోసం

వెతికాడు. దేవుడు అతనికి శరణు ఇచ్చాడు. రెండోవాడు బిడియపడ్డాడు, దానికి దేవుడు కూడా బిడియంగానే వ్యవహరించాడు. మూడోవాడు వైముఖ్య ధోరణికి పాల్పడ్డాడు. దాంతో దేవుడు కూడా విముఖత వహించాడు" అని వివరించారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

దైవధ్యాన సమావేశాల్లో పాల్గొనటం వల్ల కలిగే శుభం ఈ హదీసుల్లో చెప్పబడింది. జనులను ఇబ్బంది పెట్టకుండా సర్దుబాటు చేసు కోవటంలోని శుభం కూడా వివరించబడింది. అకారణంగా ఇలాంటి ధార్మిక సమావేశాల పట్ల విముఖత చూపేవారి చర్య ఖండించబడింది.

١٤٥١ - وعن أبي سعيد الخُدْرِيِّ رضيَ اللهُ عَنْهُ قالَ: خرَجَ مُعاوِيَة رضيَ اللهُ عنهُ عَلَى حَلْقَةٍ في المَسْجِدِ، فقال: ما أَجْلَسَكُمْ؟ قالُوا: جَلَسْنَا نَذْكُرُ الله. قَالَ آللهِ ما أَجْلَسَكُم إلّا ذاكَ؟ قالوا: ما أَجْلَسَنَا إلّا ذاكَ، قال: أَمَا إنِّي لم أَسْتَحْلِفكُمْ تُهْمَةً لَكُم، ومَا كانَ أحَدٌ بمَنْزِلَتِي مِنْ رسُولِ

1451. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం: (ఒకరోజు) ముఆవియా (రజి) మస్జిద్‌కు వెళ్ళారు. అక్కడ కొంత మంది సమావేశమై ఉండటం చూసి, "ఏంటి విశేషం, ఇలా సమావేశమయ్యారు?" అని అడిగారు. "దైవస్మరణ కోసం సమావేశమయ్యాం" అని చెప్పారు వాళ్ళు. "దైవంసాక్షిగా చెప్పండి. మీరు సమావేశమయింది అందు కోసమేనా?" అని అడిగారాయన. అందుకు వారు "(ఔను). దాని కోసమే మేము సమావేశమయింది" అని చెప్పారు. అప్పుడు ముఆవియా ఇలా అన్నారు: నేను మీ చేత ఒట్టు వేయించానంటే, అది మీరు అబద్ధం చెబుతున్నారన్న అనుమానంతో కాదు. దైవప్రవక్త (సల్లం)కు

الله ﷺ أقلّ عَنْهُ حَدِيثاً مِنِّي: إنَّ رَسُولَ الله ﷺ خَرَجَ عَلى حَلْقَةٍ مِن أصحابه: فقال: «ما أجْلَسَكُمْ؟» قالوا: جَلَسْنا نَذكُرُ الله، وَنحْمَدُهُ عَلَى ما هَدَانَا لِلإسْلام؛ وَمَنَّ بِهِ عَلَيْنا. قالَ: «آلله ما أجْلَسَكُمْ إلّا ذاكَ» قالوا: والله! ما أجْلَسَنَا إلّا ذاك. قالَ: «أمَا إنّي لَمْ أَسْتَحْلِفكُمْ تُهْمَةً لَكُمْ، ولكنّهُ أتاني جبريلُ فَأخبَرَني أنَّ الله يُبَاهِي بِكُمُ المَلائِكَةَ». رواه مسلم.

నాకంటే ఎక్కువ సన్నిహితంగా ఉండి, నాకన్నా తక్కువ హదీసులు వివరించిన వారు ఎవరూ లేరు. (వినండి) ఒకసారి దైవప్రవక్త (సల్లం కూడా) తన సహచరులు కొంతమంది ఇలాగే సమావేశమై ఉంటే వారిదగ్గరకు వచ్చి, "ఏంటి విశేషం, ఇలా సమావేశమయ్యారు?" అని అడిగారు. దానికి సహచరులు, "దేవుణ్ణి స్మరించటానికి, ఆయన మాకు ఇస్లాం మార్గం చూపి మాకు మహోపకారం చేసినందుకు మేమాయన్ని స్తుతిస్తున్నాం" అని సమాధానమిచ్చారు. దైవప్రవక్త (సల్లం) "దైవం సాక్షిగా చెప్పండి. అందు కోసమేనా మీరు సమావేశమయింది?" అని మళ్ళీ అడిగారు. దానికివారు "దైవం సాక్షి! అందుకోసమే సమావేశమయ్యాం" అని చెప్పారు.

అప్పుడాయన ఇలా అన్నారు: నేను మీ చేత ఒట్టు వేయించుకున్నానంటే, మీరు అబద్ధం చెబుతున్నారన్న అనుమానంతో కాదు, జిబ్రయీల్ వచ్చి నాతో చెప్పారు. దేవుడు మీ గురించి తన దూతలముందు గొప్పగా చెప్పుకుంటున్నాడట. (అందుకే అసలు మీరు ఏం చేస్తున్నారో తెలుసుకుందామని అడిగాను.) (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## 248వ అధ్యాయం

# ٢٤٨ - بَابُ الذِّكْرِ عِنْدَ الصَّبَاحِ وَالْمَسَاءِ

## ఉదయం, సాయంత్రం దైవస్మరణ

قالَ اللهُ تعالى: ﴿وَٱذْكُر رَّبَّكَ فِي نَفْسِكَ تَضَرُّعًا وَخِيفَةً وَدُونَ ٱلْجَهْرِ مِنَ ٱلْقَوْلِ بِٱلْغُدُوِّ وَٱلْآصَالِ وَلَا تَكُن مِّنَ ٱلْغَٰفِلِينَ﴾ [الأعراف: ٢٠٥] قال أهلُ اللُّغةِ: «الآصالُ»: جَمْعُ أصِيلٍ، وَهُوَ مَا بَيْنَ الْعَصْرِ وَالمَغْرِبِ. وَقال تعالى: ﴿وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ قَبْلَ طُلُوعِ ٱلشَّمْسِ وَقَبْلَ غُرُوبِهَا﴾ [طه: ١٣٠] وقال تعالى: ﴿وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ بِٱلْعَشِيِّ وَٱلْإِبْكَٰرِ﴾ [غافر: ٥٥] قال أهلُ اللُّغَةِ: «الْعَشِيُّ»: مَا بَيْنَ زَوَالِ الشَّمسِ وغُرُوبِهَا. وقال تعالى: ﴿فِي بُيُوتٍ أَذِنَ ٱللَّهُ أَن تُرْفَعَ وَيُذْكَرَ فِيهَا ٱسْمُهُۥ يُسَبِّحُ لَهُۥ فِيهَا بِٱلْغُدُوِّ وَٱلْآصَالِ ﴿٣٦﴾ رِجَالٌ لَّا تُلْهِيهِمْ تِجَٰرَةٌ وَلَا بَيْعٌ عَن ذِكْرِ ٱللَّهِ﴾ الآية [النور: ٣٦، ٣٧]. وقال تعالى: ﴿إِنَّا سَخَّرْنَا ٱلْجِبَالَ مَعَهُۥ يُسَبِّحْنَ بِٱلْعَشِيِّ وَٱلْإِشْرَاقِ﴾ [ص: ١٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ప్రవక్తా! నీ ప్రభువును ఉదయమూ, సాయంత్రమూ స్మరించు, లోలోపల వినయంతోనూ భయపడుతూనూ, మెల్లగా నోటితో కూడా. నిర్లక్ష్యం చేసే వారిలో నీవు చేరకు."

*(ఆరాఫ్: 205)*

భాషావేత్తల అభిప్రాయం ప్రకారం 'ఆసాల్' అనేది అసీల్‌కు బహువచనం. అస్ర్ మరియు మగ్రిబ్ (నమాజుల) మధ్యకాలం అని దాని భావం.

మరోచోట దేవుడు ఇలా అంటున్నాడు:

"నీ ప్రభువు స్తోత్రంతోపాటు, ఆయన పవిత్రతను కొనియాడు, సూర్యుడు ఉదయించే ముందు, అస్తమించే ముందు." *(తాహా: 130)*

"ఉదయం, సాయంత్రం నీ ప్రభువుని స్తుతిస్తూ ఉండు. ఆయన పరిశుద్ధతను కొనియాడు."

*(అల్ మూమిన్:55)*

భాషావేత్తల అభిప్రాయం ప్రకారం 'అషియ్యి' అంటే సూర్యుడు నెత్తి నుంచి వాలినప్పటి నుండి సూర్యాస్తమయం వరకు మధ్యకాలం అని అర్థం.

ఇంకొక చోట దేవుడు ఇలా సెలవిచ్చాడు:

(దేవుని వెలుగు వైపునకు పోయేమార్గం పొందినవారు) ఏ గృహాలను మహోన్నతం చేయటానికీ, ఏ గృహాలలో తన నామాన్ని స్మరించటానికీ అల్లాహ్ అనుమతించాడో ఆ

గృహాలలో ఉంటారు. వ్యాపారంగానీ, క్రయ విక్రయాలు గానీ, అల్లాహ్ సంస్మరణ విష యంలో ఎవరినైతే అశ్రద్ధ వహించేలా చేయవో అలాంటివారు ఉదయం, సాయంత్రం ఆయన స్తోత్రం చేస్తారు. *(నూర్: 36)*

"మేము పర్వతాలను అతనికి (దావూద్‌కు) లొంగిపోయేలా చేశాము. ఉదయం, సాయంత్రం అవి అతనితో పాటు కీర్తన చేసేవి." *(సాద్: 18)*

## ముఖ్యాంశాలు

పై సూక్తులన్నీ ఉదయం, సాయంత్రం దేవుణ్ణి స్తుతిస్తూ ఉండాలని ప్రోత్సహిస్తున్నాయి.

١٤٥٢ ـ وعنْ أَبي هريرةَ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَنْ قالَ حِينَ يُصْبِحُ وحينَ يُمسي: سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ مِائَةَ مَرَّةٍ، لَم يَأْتِ أَحَدٌ يَوْمَ القِيَامَةِ بِأفضَلَ مِمَّا جَاءَ به، إلَّا أَحَدٌ قال مِثْلَ مَا قالَ أوْ زَادَ» رواهُ مسلم.

1452. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే ఉదయం మరియు సాయంత్రం వందసార్లు 'సుబ్‌హానల్లాహి వ బిహమ్దిహీ' అని పఠిస్తారో, ప్రళయదినాన (దేవుని సన్నిధికి) వచ్చేవారిలో వారి కంటే గొప్పవారు మరెవరూ ఉండరు. వారిలాగా లేక అంతకంటే ఎక్కువ సార్లు పఠించినవారు తప్ప. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

١٤٥٣ ـ وعنهُ قالَ: جاءَ رجُلٌ إلى النَّبيِّ ﷺ فقالَ: يارسُولَ اللهِ! مَالَقِيتُ مِنْ عَقْرَبٍ لَدَغَتني البَارِحَةَ! قال: «أمَا لَو قُلتَ

1453. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన మరొక కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి "దైవప్రవక్తా! నిన్న రాత్రి నాకు తేలు కుట్టటంతో ఎంత నొప్పియిందను కున్నారూ?" అన్నాడు. ఆ మాట విని ఆయన, 'నువ్వు సాయంత్రంపూట

حِينَ أَمْسَيْتَ: أَعُوذُ بِكَلِمَاتِ اللهِ التَّامَّاتِ مِنْ شَرِّ مَا خَلَقَ لم تَضُرَّكَ». رواه مسلم.

'అవూజు బికలిమాతిల్లాహిత్తామ్మాతి మిన్ షర్రి మా ఖలఖ్' అని పఠించి వుంటే నీకు తేలు కుట్టేది కాదు' అన్నారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

కలిమాత్ అంటే దైవవాక్కు, దేవుని నిర్ణయాలు అని అర్థం. తామ్మాత్ అంటే ఎలాంటి లోపాలూ, దోషాలూ లేనివని భావం. స్థూలంగా హదీసులో పేర్కొనబడిన వచనానికి 'సృష్టిరాశుల కీడు నుండి నేను తిరుగులేని దేవుని నిర్ణయాల శరణు వేడుతున్నాను' అని భావం. బాధ కలిగించే జంతువుల నుండి, మానవుల నుండి రక్షణ పొందటానికి ఇది ఎంతో శ్రేష్ఠమైన ప్రార్థన.

١٤٥٤ - وعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ، أَنَّهُ كان يقولُ إذَا أَصْبَحَ: «اللَّهُمَّ بِكَ أَصْبَحْنَا، وَبِكَ أَمْسَيْنَا، وَبِكَ نَحْيَا، وَبِكَ نَمُوتُ، وَإِلَيْكَ النُّشُورُ» وإذَا أَمْسَى قال: «اللَّهُمَّ بِكَ أَمْسَيْنَا، وَبِكَ نَحْيَا، وَبِكَ نَمُوتُ، وَإِلَيْكَ النُّشُورُ». رواه أبو داود، والترمذي وقال: حديث حسن.

1454. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తెల్లవార్లు (నిద్ర లేచినప్పుడు) "దేవా! నీ కృపతోనే మేము తెల్లవార్చాము. నీ కృపతోనే సాయంత్రం వరకూ ఉంటాం. నీ శక్తి వల్లనే మేము బ్రతికివున్నాం. నీ శక్తితోనే మరణిస్తాం. తిరిగి లేపబడిన తర్వాత మేమంతా నీ వద్దకే మరలి రావలసి ఉంది" అని ప్రార్థించేవారు. సాయంత్ర మయినప్పుడు ఈ విధంగా ప్రార్థించే వారు: "ఓ అల్లాహ్! నీ కృపతోనే మేము సాయంత్రం వరకూ ఉన్నాం. నీ శక్తితోనే జీవించి ఉన్నాం. తిరిగి నీ శక్తితోనే మరణిస్తాం. తిరిగి లేపబడిన తరువాత మేమంతా నీ వద్దకే మరలి రావలసి ఉన్నది." (అబూదావూద్, తిర్మిజీ, హసన్)

(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

1455. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం ఒకసారి అబూబక్ర్ (రజి) (దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ), "దైవప్రవక్తా! నేను ఉదయం, సాయంత్రం చేసుకోవటానికి నాకో ప్రార్థన ఉపదేశించండి" అని అడిగారు. అందుకాయన, "ఈ విధంగా ప్రార్థించండి. ఉదయం, సాయంత్రం, ఇంకా నిద్రపోవటానికి పడక మీదకు చేరుకున్నప్పుడు కూడా మీరు ఈ ప్రార్థన చేయవచ్చు" అని అన్నారు.

"ఓ అల్లాహ్! భూమ్యాకాశాల నిర్మాతా! గోచరాగోచరాల జ్ఞానీ! సర్వసృష్టికి యజమాని అయిన ప్రభువా! నీవు తప్ప వేరొక ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. నేను నా మనసులో జనించే కీడు నుండి, షైతాన్ కీడు నుండి, అతను ప్రేరేపించే షిర్క్ నుండి నీ శరణు వేడుకుంటున్నాను."
(అబూదావూద్, తిర్మిజీ, హసన్, సహీహ్)

١٤٥٥ ـ وعنهُ أنَّ أبابكرٍ الصِّدِّيقَ، رضيَ اللهُ عنهُ قال: يارَسُولَ اللهِ! مُرْني بكَلِماتٍ أقُولُهُنَّ إذا أصْبَحْتُ وإذا أمْسَيْتُ، قال: «قُلْ: اللَّهُمَّ فَاطِرَ السَّمٰواتِ وَالأرضِ عَالِمَ الغَيْبِ وَالشَّهَادَةِ، رَبَّ كُلِّ شَيءٍ وَمَلِيكَهُ. أشْهَدُ أن لَا إلٰهَ إلَّا أنتَ، أعُوذُ بِكَ مِنْ شَرِّ نَفسِي وَشَرِّ الشَّيْطَانِ وَشِرْكِهِ» قال: «قُلْها إذا أصْبَحْتَ، وَإذا أمْسَيْتَ، وإذا أخذْتَ مَضْجعَكَ» رواه أبو داود والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

1456. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) సాయంత్రం పూట ఈ విధంగా ప్రార్థించేవారు: మేము సాయంత్రం వరకూ (బ్రతికి) ఉన్నాం. ఇప్పుడు కూడా సామ్రాజ్యాధి

١٤٥٦ ـ وعَنِ ابْنِ مَسْعُودٍ رضي اللهُ عنهُ قالَ: كانَ نَبيُّ اللهِ ﷺ إذا أمْسَى قال: «أمْسَيْنَا وأمْسَى المُلْكُ للهِ، والحَمْدُ للهِ، لَا إلٰهَ إلّا اللهُ وَحْدَهُ لَا شَرِيكَ لَهُ» قَالَ

الـراوي: أُرَاهُ قـال فيهـنَّ: «لـهُ المُلـكُ وَلَـه الحَمْدُ وَهُوَ عَلَى كُلِّ شَيءٍ قَديرٌ، رَبِّ أَسْأَلُكَ خَيْرَ مَا في هذهِ اللَّيلةِ، وَخَيْرَ مَا بَعْدَهَا، وأعُوذُ بِكَ مِنْ شَرِّ مَا في هذهِ اللَّيْلَةِ وَشَرِّ ما بَعْدَهَا، رَبِّ أعُوذُ بكَ مِنَ الكَسَلِ، وسُوءِ الكِبَرِ، ربِّ أعوذُ بِكَ مِنْ عَذَابٍ في النَّار، وَعَـذَابٍ فـي القَبـرِ» وَإذَا أَصْبَـحَ قـال ذلـك أيضـاً: «أَصْبَحْنَـا وَأَصْبَحَ المُلْكُ للهِ» رواه مسلم.

కారం దేవునిదే. స్తోత్రాలన్నీ అల్లాహ్‌కే శోభిస్తాయి. అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యదేవుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు సహవర్తులు ఎవరూ లేరు.

(హదీసు ఉల్లేఖకులు ఇలా అంటున్నారు:) తర్వాతి వచనాలను కూడా పై వచనాలతో కలిపి చదవమని దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞాపించినట్టు గుర్తు. "సామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే చెల్లుతుంది. ఆయన అన్నిటిపై అధికారం కలవాడు. ప్రభూ! నేను నిన్ను ఈ రాత్రిలో వున్న మేలును, దీని తర్వాత వచ్చే మేలును అర్థిస్తున్నాను. ఇందులోని కీడు నుండి, దీని తర్వాత వచ్చేదాని కీడు నుండి నీ శరణు వేడుతున్నాను. ప్రభూ! సోమరితనం నుండి, వృద్ధాప్య బాధల నుండి నీ శరణు వేడుతున్నాను. ఇంకా నరకాగ్నిలో ఉండే శిక్ష నుండి, సమాధిలో ఉండే శిక్ష నుండి నీ శరణు వేడుతున్నాను."

సాయంత్రం పూట కూడా ఆయన ఇలాగే ప్రార్థించేవారు. (అయితే ఉదయపు ప్రార్థనలో 'అమ్‌సైనా' అనే చోట) 'అస్‌బహ్‌నా వ అస్‌బహల్ ముల్కు లిల్లాహ్' (మేము తెల్లవార్చాం. ఇప్పటికీ సామ్రాజ్యాధికారం అల్లాహ్‌దే) అని పఠించేవారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ వచనాలను ఉదయం, సాయంత్రం, పడుకునేటప్పుడు, తిరిగి నిద్రలేచేటప్పుడు పఠిస్తూ ఉండటం అభిలషణీయం. దానివల్ల అల్లాహ్ మాత్రమే ప్రభువు, ఆరాధ్య దేవుడన్న సంగతి నిత్యం గుర్తుంటుంది. అంతేగాకుండా దేవుని నుండి శ్రేయోశుభాలనూ, ఇహపరాల్లో తమకు నష్టం కలిగించే వాటి నుండి ఆయన శరణునూ వేడుకున్నట్లవుతుంది. ఒక మనిషికి నిత్యం వాటి అవసరం ఉంటుంది.

١٤٥٧ ـ وعنْ عبدِ اللهِ بنِ خُبَيْبٍ ـ بضَمِّ الْخَاءِ الْمُعْجَمَةِ ـ رضيَ اللهُ عَنْهُ قالَ: قالَ لي رَسُولُ اللهِ ﷺ: «اقرَأْ: قُلْ هُوَ اللهُ أَحَدٌ، والْمُعَوِّذَتَيْنِ حِينَ تُمْسِي وَحِينَ تُصْبِحُ، ثَلَاثَ مَرَّاتٍ تَكْفِيكَ مِنْ كُلِّ شَيْءٍ» رواهُ أبو داود والترمذي وقال: حديثٌ حسن صحيح.

1457. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఖుబైబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాకు "ఉదయం, సాయంత్రం మూడేసిసార్లు 'ఖుల్ హువల్లాహు అహద్, ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్, ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్' సూరాలు పఠించు. ప్రతి వస్తువు కీడు నుండి కాపాడుకోవటానికి వాటిని పఠిస్తే చాలు" అని ఉపదేశించారు. (అబూదావూద్, తిర్మిజీ-హసన్, సహీహ్)

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఈ మూడు సూరాలనూ పూర్తిగా పఠించాలని భావం. ప్రతి సూరాను మూడేసి సార్లు పఠించాలి. వీటిని పఠిస్తే ఇతర దుఆలు పఠించకపోయినా ఫర్వాలేదు. వీటి పఠనం మూలంగా దేవుడు మానవుల్ని బాధాకరమైన జంతువుల బారి నుండి రక్షిస్తాడు. దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట పడకమీద వాలిన తర్వాత ఈ సూరాలు పఠించుకొని చేతుల మీద ఊది, ఆ చేతులతో వీలైనంత వరకు మొత్తం శరీరాన్ని స్పృశించుకునేవారని ఇతర హదీసుల ద్వారా బోధపడుతోంది.

١٤٥٨ ـ وعنْ عُثْمَانَ بْنِ عَفَّانَ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «مَا مِنْ عَبْدٍ يَقُولُ فِي صَبَاحِ كُلِّ يَوْمٍ وَمَسَاءِ كُلِّ لَيْلَةٍ: بِسْمِ اللهِ الَّذِي لَا يَضُرُّ مَعَ اسْمِهِ

1458. హజ్రత్ ఉస్మాన్ బిన్ అప్ఫాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ప్రతి రోజూ ఉదయంపూట, ప్రతి రాత్రికి ముందు సాయంత్రం పూట మూడు

شَيءٌ فِي الأرضِ وَلا فِي السماءِ وَهُوَ السَّمِيعُ الْعَلِيمُ، ثَلاثَ مَرَّاتٍ، إلَّا لَمْ يَضُرَّهُ شَيءٌ» رواه أبو داود والتِّرمذي وقال: حديث حسن صحيح.

సార్లు 'బిస్మిల్లాహిల్లజీ లా యజుర్రు మఅ ఇస్మిహీ షైవున్ ఫిల్ అర్జి వలా ఫిస్సమాయి వహువస్సమీవుల్ అలీమ్' అని పఠించేవారికి ఏ వస్తువూ నష్టం కలిగించజాలదు. (అబూదావూద్, తిర్మిజీ- హసన్, సహీహ్)

(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

హదీసులో పేర్కొనబడిన ప్రార్థనా వచనాలకు భావం ఇది: 'నేను ప్రతి వస్తువు కీడు నుండి దైవనామ శరణు వేడుతున్నాను. ఆయనకు ప్రతి వస్తువు గురించీ తెలుసు. ప్రతి ఒక్కరి విన్నపాలను ఆలకించేవాడూ ఆయనే. తాను స్వయంగా నష్టం కలిగించదలిస్తే తప్ప ఆయన రక్షణలో ఉన్నవారికి ఎవరూ నష్టం కలిగించలేరు. కనుక అన్నిరకాల కీడుల నుండి - అవి మనుషులు, జంతువుల నుండి కలిగేవయినా లేక జిన్నులు షైతానుల నుండి కలిగేవయినా- వాటన్నిటి నుండి ఆ మహిమాన్వితుని పేరు తీసుకునే శరణు వేడటం జరుగుతుంది.

ఈ అధ్యాయంలో ప్రస్తావించబడిన ప్రార్థనల్ని ప్రతి ముస్లిం ఉదయం సాయంత్రం అనవాయితీగా పఠిస్తూ ఉండాలి. మనుషులు తమకు తాముగా కల్పించుకునే ప్రార్థనలు, దైవస్మరణరీతుల కన్నా ఇవి ఎంతో మెరుగయినవి, శుభవంతమైనవి, మోక్షదాయకమైనవి.



**249వ అధ్యాయం**

## ٢٤٩ ـ بَابُ مَا يَقُولُهُ عِنْدَ النَّوْمِ

## నిద్రపోయేటప్పుడు చేసే ప్రార్థనలు

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّ فِي خَلْقِ السَّمَوَاتِ وَالْأَرْضِ وَاخْتِلَافِ اللَّيْلِ وَالنَّهَارِ لَآيَاتٍ لِأُولِي الْأَلْبَابِ ۝ الَّذِينَ يَذْكُرُونَ اللَّهَ قِيَامًا وَقُعُودًا وَعَلَى جُنُوبِهِمْ وَيَتَفَكَّرُونَ فِي خَلْقِ السَّمَوَاتِ وَالْأَرْضِ﴾ [آل عمران: ١٩٠، ١٩١].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు: భూమీ ఆకాశాల సృష్టిలో, రేయింబవళ్ళు ఒకదాని తర్వాత ఒకటి రావడంలో, నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా అన్నివేళలా అల్లాహ్‌ను స్మరించేవారున్నూ, భూమీ ఆకాశాల నిర్మాణం గురించి చింతన చేసేవారున్నూ అయిన వివేకవంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి. *(ఆలి ఇమ్రాన్: 190-191)*

١٤٥٩ ـ وعن حُذيفةَ وأبي ذرٍّ رضي اللهُ عَنهما أنَّ رسُولَ اللهِ ﷺ كانَ إذَا أوَى إلى فِرَاشِهِ قالَ: «باسْمِكَ اللَّهُمَّ أحْيَا وَأمُوتُ» رواه البخاري.

1459. హజ్రత్ హుజైఫా మరియు అబూ జర్ (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) పడకపై (నిద్రపోవటానికి) మేను వాల్చినప్పుడు, "దేవా! నీ పేరుతోనే నేను బతుకు తున్నాను, మరణిస్తున్నాను" అని అనేవారు. *(బుఖారీ)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'నిద్రపోయేటప్పుడు ఏమనాలి?' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. ప్రతి మనిషి రాత్రిపూట నిద్రపోయి ఉదయాన్నే నిద్రలేస్తుంటాడు. నిజానికి నిద్రపోవటం ఒకరకంగా మరణం లాంటిది. మేల్కొనటం జీవితం లాంటిది. జీవితం, మరణం- ఈ రెండూ దేవుని అధీనంలోనే ఉన్నాయి. ఈ హదీసులో ఆ భావాన్నే బలపరచటం జరిగింది. మనిషి ప్రతి రాత్రీ ఈ దుఆను నెమరువేసుకుంటూ ఉంటే అతనికి తన జీవితం దేవుడు ప్రసాదించినదనీ, ఆయన ఇష్టాయిష్టాల మీదే తను జీవిస్తున్నాడనీ, ఆయన ఎప్పుడు తలచుకుంటే అప్పుడు తన జీవిత దీపం ఆరిపోతుందనీ, కనుక దేవుడు అరువిచ్చిన జీవితాన్ని ఆయన అభీష్టానికి అనుగుణంగా గడపాలనీ, ఆయన పట్ల అవిధేయతకు పాల్పడకూడదనే విషయాలు ఎల్లప్పుడూ గుర్తుంటాయి.

1460. హజ్రత్ అలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తనకూ మరియు ఫాతిమా (రజిఅన్హా) కు ఇలా ఉపదేశించారు: మీరు మీ పడకలపై మేను వాల్చినప్పుడు '33 సార్లు అల్లాహుఅక్బర్' అనీ, '33సార్లు సుబ్హానల్లాహ్' అనీ, '33సార్లు అల్ హమ్దులిల్లాహ్' అనీ అనాలి.
మరొక ఉల్లేఖనంలో సుబ్హానల్లాహ్ 34 సార్లు చెప్పాలి అని ఉంది. ఇంకొక ఉల్లేఖనంలో 'అల్లాహు అక్బర్ ముప్పై నాలుగు సార్లు చెప్పాలి' అని ఉంది.
(బుఖారీ-ముస్లిం)

١٤٦٠ - وعَنْ عليٍّ رضيَ اللهُ عَنْهُ أنَّ رَسُولَ اللهِ ﷺ قالَ له وَلِفاطمةَ، رَضِيَ اللهُ عنهما: «إذَا أوَيْتُمَا إلَى فِراشِكُمَا - أَوْ: إذَا أخَذْتُمَا مَضَاجِعَكُمَا - فَكَبِّرَا ثَلاثاً وَثَلاثِينَ، وَسَبِّحَا ثَلاثاً وَثَلاثِين، وَاحْمَدَا ثَلاثاً وثَلاثِين» وفي روايةٍ: التَّسْبِيحُ أربعاً وَثَلاثِين. وفي رِوايةٍ: التَّكبيرُ أرْبَعاً وَثَلاثِينَ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని నఫఖాత్, దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

పైన పేర్కొనబడిన వచనాలు మూడింటినీ కలిపి వందసార్లు పఠించాలని విభిన్న హదీసుల సారాంశం బోధపరుస్తోంది. ఒక్కొక్క వచనాన్ని ముప్పైమూడు సార్లు పఠించి చివరగా మూడవ వచనాన్ని ముప్పై నాలుగుసార్లు పఠించాలి. మూడింటికీ సంబంధించి ముప్పైనాలుగు సార్లు పఠించాలనే ఆదేశముంది కనుక సుబ్హానల్లాహ్, అల్హమ్దు లిల్లాహ్, అల్లాహు అక్బర్ వీటిలో దేన్నయినా ముప్పై నాలుగుసార్లు పఠించవచ్చు. గ్రంథకర్త ఇమామ్ నవవీ రెండు ఉల్లేఖనాల్ని ఇక్కడ పొందుపరచారు. పోతే నసాయి గ్రంథంలో అల్హమ్దులిల్లాహ్ ముప్పై నాలుగుసార్లు పఠించాలని ఉంది. ఈ విధంగా 34 సార్లు అనేమాట మూడింటికీ వర్తిస్తుంది. వాటిలో దేన్నయినా ముప్పైనాలుగు సార్లు పఠించవచ్చు. ఈ తస్బీహ్ వచనాలను ఈ సంఖ్య ప్రకారమే ప్రతి ఫర్జ్ నమాజు తర్వాత కూడా పఠించాలని హదీసుల్లో ఆదేశించబడింది.

1461. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు లేనప్పుడు మీ పడకల మీద ఏమొచ్చి చేరిందో

١٤٦١ - وعن أبي هُريرةَ، رَضِيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «إذا أوَى أحَدُكم إلَى فِرَاشِهِ، فَلْيَنْفُضْ فِراشَهُ بداخِلَةِ إزَارِهِ فإنَّهُ لَا يَدْرِي مَا خَلَفَهُ عَلَيْهِ،

ثُمَّ يَقُولُ: بِاسْمِكَ رَبِّي وَضَعْتُ جَنْبِي، وَبِكَ أَرْفَعُهُ؛ إِنْ أَمْسَكْتَ نَفْسِي فَارْحَمْهَا، وَإِنْ أَرْسَلْتَهَا، فَاحْفَظْهَا بِمَا تَحْفَظُ بِهِ عِبَادَكَ الصَّالِحِينَ» متفقٌ عليه.

మీకు తెలియదు. కనుక మీలో ఎవరయినా (నిద్రపోవటానికి) పడక మీద మేను వాల్చినప్పుడు ముందుగా తన లుంగీ లోపలి భాగంతో సహా పడకను దులుపుకోవాలి. ఆ తర్వాత ఈ విధంగా ప్రార్థించాలి:
"ప్రభూ! నేను నీ పేరుతోనే (పడక మీద) మేను వాల్చాను. తిరిగి నీ పేరుతోనే దాన్ని లేపుతాను. (ఈ నిద్రలో గనక) నీవు నా ఆత్మను ఆపుకుంటే దాన్ని కరుణించు. ఒకవేళ విడిచిపెట్టి నట్లయితే నీవు దాన్ని నీ పుణ్యదాసుల్ని ఎలా కాపాడుతావో అలా కాపాడు."

*(బుఖారీ, ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో ఒక ముఖ్య విషయం బోధించబడింది, అదేమిటంటే, మనం లేనప్పుడు హానికరమైన పురుగులేవయినా మన పడకల మీద దుప్పట్లలో దాక్కొని ఉండవచ్చు. కనుక దుప్పట్లను దులుపుకోకుండా పడుకోవటం వల్ల హానికరమైన పురుగులు మనల్ని కుట్టే ప్రమాదముంటుంది. కనుక మనం నిద్రపోదలచుకున్నప్పుడు ముందుగా మంచాన్ని, దుప్పట్లను ఒకటికి రెండుసార్లు దులుపుకోవాలి. తర్వాత పైన పేర్కొనబడిన దుఆ కూడా పఠించాలి. దాంతో మనిషి దేవుని రక్షణ పరిధిలోకి వచ్చేస్తాడు.

١٤٦٢ - وعَن عائشة، رضيَ اللهُ عَنْها، أنَّ رسولَ اللهِ ﷺ، كان إذا أخذَ مَضْجَعَهُ نَفَثَ في يَدَيْهِ، وَقَرأَ بالْمُعَوِّذاتِ وَمَسَحَ بِهِمَا جَسَدَهُ. متفقٌ عليه. وفي

1462. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) (నిద్ర పోవటానికి) పడకమీదకు వెళ్ళినప్పుడు అరచేతుల్లో ఊదుకునేవారు. ముఅవ్వజాత్‌లు పఠించి అరచేతులతో శరీరాన్ని స్పృశించుకునేవారు. (బుఖారీ-ముస్లిం)

బుఖారీ-ముస్లింలలోని వేరొక ఉల్లేఖ

رواية لَهما: أَنَّ النَّبيَّ ﷺ، كَانَ إذَا أَوى إلى فِرَاشِهِ كُلَّ لَيْلَةٍ جَمَعَ كَفَّيْهِ، ثُمَّ نَفَثَ فيهما فَقَرَأَ فِيهِمَا: قُلْ هُوَ اللهُ أَحَدٌ، وقُلْ أَعُوذُ بِرَبِّ الفَلَقِ، وَقُلْ أَعُوذُ بِرَبِّ النَّاسِ، ثُمَّ مَسَحَ بِهِما ما استطاعَ مِن جَسَدِهِ، يَبْدَأُ بِهِمَا عَلَى رَأْسِهِ وَوَجْهِهِ، وَمَا أقبلَ مِنْ جَسَدِهِ، يَفْعَلُ ذلكَ ثَلاثَ مَرَّاتٍ. متفقٌ عَليهِ. قالَ أهلُ اللُّغَةِ: «النَّفْثُ»: نَفْخٌ لَطِيفٌ بِلَا رِيقٍ.

నంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) ప్రతిరోజూ రాత్రి (నిద్రపోవటానికి) పడకమీదకు చేరుకున్నప్పుడు అర చేతులు కలిపి అందులో ఊదే వారు. తర్వాత అరచేతుల్లోనే ఖుల్ హువల్లాహు అహద్ సూరా, ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్ సూరా, ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్ సూరాలు పఠించి వాటితో వీలైనంతవరకు శరీరాన్ని స్పృశించుకునేవారు. ముందు తల, ముఖం, శరీర ఉదరభాగం నుండి స్పృశించటం మొదలుపెట్టేవారు. ఈ విధంగా మూడుసార్లు చేసేవారు.

(బుఖారీ-ముస్లిం)

భాషావేత్తల అభిప్రాయం ప్రకారం 'నఫ్సున్' అంటే ఉమ్మిరాకుండా మెల్లిగా ఊదటం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

హదీసులో పేర్కొనబడిన మూడు సూరాలను 'ముఅవ్వజాత్' అని పిలుస్తారు. వీటి ద్వారా దేవుని శరణువేడుకోవటం జరుగుతుంది. పోతే ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్ మరియు ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్ రెండు సూరాలను కలిపి ముఅవ్వజతైన్ అని అంటారు. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే నిద్రపోయేటప్పుడు ఈ మూడు సూరాలనూ పఠించి నిద్రపోవాలి. అలా చేస్తే ఒకవైపు దైవప్రవక్త సంప్రదాయాన్ని ఆచరించినట్లవుతుంది. మరోవైపు దేవుని శరణు కూడా లభిస్తుంది.

١٤٦٣ - وَعَنِ البَرَاءِ بنِ عَازِبٍ، رَضِيَ اللهُ عَنهُمَا قَالَ: قَالَ لِي رَسولُ اللهِ ﷺ: «إذَا أَتَيتَ مَضْجَعَكَ فَتَوَضَّأ

1463. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాకు ఇలా ఉపదేశించారు: (నిద్రపోవటానికి) పడకమీదికి వెళ్ళాలనుకున్నప్పుడు

وضوءَكَ لِلصَّلاةِ، ثُمَّ اضطجِعْ عَلى شِقِّكَ الأَيمَنِ، وَقلِ: اللّٰهُمَّ أسْلَمْتُ نَفسِي إليكَ، وَفوَّضتُ أمْرِي إليْكَ، وَألجأْتُ ظَهرِي إليْكَ، رَغبةً ورهْبةً إليكَ، لا مَلجَأ ولا مَنجى مِنْكَ إلّا إليْكَ، آمنتُ بِكِتابِكَ الذي أنزلْتَ، وَبِنَبِيِّكَ الذي أرسَلْتَ، فإنْ مِتَّ مِتَّ على الفِطرةِ، واجْعَلْهُنَّ آخِرَ ما تَقولُ» مُتَّفقٌ عليهِ.

నమాజుకు మాదిరిగా వుజూ చేసుకో. తర్వాత (పడకమీద) కుడి ప్రక్కకు తిరిగి పడుకొని ఈ విధంగా వేడుకో: "ఓ అల్లాహ్! నేను నా స్వయాన్ని నీకు సమర్పించుకున్నాను. నా ముఖాన్ని నీ వైపుకు తిప్పుకున్నాను. నా వ్యవహారాన్ని నీకు అప్పగించాను. నీ కారుణ్యాన్ని కోరుకుంటూ, నీ ఆగ్రహానికి భయపడుతూ నా వీపును నీ వైపుకు ఆనించాను. నీవు ఆశ్రయమిస్తే తప్ప మరెక్కడా ఆశ్రయం లేదు. నీవు రక్షణ కల్పిస్తే తప్ప రక్షణ పొందటానికి మరో చోటు లేదు. నీవు అవతరింపజేసిన గ్రంథాన్ని నేను విశ్వసించాను. నీవు పంపిన ప్రవక్తను నమ్మాను."
నీవు ఈ వచనాలు పఠించి నిద్రపోయినప్పుడు రాత్రికి రాత్రే నీకు మరణం సంభవించినట్లయితే నీవు సహజత్వం (ఇస్లాం ధర్మం)పై మరణించినట్లుగా పరిగణించబడతావు. (ఇంకో విషయం గుర్తుంచుకో) 'ఈ వచనాలు నీ ఆఖరి వచనాలు కావాలి (ఆ తర్వాత ప్రాపంచికమైన మాటలేవీ మాట్లాడకూడదు).'
(బుఖారీ-ముస్లిం)

**ముఖ్యాంశాలు**

ఈ హదీసు ఇంతకు ముందు (మొదటి సంపుటిలోని) 'నమ్మకం, దేవుని మీద భారం మోపటం' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. నిద్రపోయేటప్పుడు వుజూ చేసుకొని పడుకోవాలనీ, పైన పేర్కొనబడిన దుఆ పఠించిన తర్వాత ఇతర ప్రాపంచికమైన మాటలేవీ మాట్లాడరాదని ఈ హదీసు మనకు బోధిస్తోంది.

١٤٦٤ - وَعَنْ أَنَسٍ، رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ كَانَ إذا أَوَى إلى فِرَاشِهِ قَالَ: «الحَمْدُ للهِ الَّذي أَطْعَمَنَا وسَقَانَا؛ وكفَانَا وآوانَا، فَكَمْ مِمَّنْ لاكافِيَ لَهُ وَلامُؤْوِيَ» رواهُ مسلمٌ.

1464. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) పడక మీదకెళ్ళినప్పుడు ఇలా అనేవారు: అల్లాహ్ మాకు తినిపించాడు, త్రాపించాడు, తమకు తోడు-నీడ లేనివారు (ఈ ప్రపంచంలో) చాలామంది ఉన్నారు. మాకు మాత్రం దేవుడే తోడునీడగా నిలిచాడు. అందుకు మేమాయన్ని స్తుతిస్తున్నాం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

١٤٦٥ - وَعَنْ حُذَيْفَةَ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ رَسُولَ اللهِ ﷺ، كَانَ إذا أَرَادَ أَنْ يَرْقُدَ، وَضَعَ يَدَهُ اليُمنَى تَحتَ خَدِّهِ، ثُمَّ يَقُولُ: «اللَّهمَّ قِني عَذَابَكَ يَوْمَ تَبْعَثُ عِبَادَكَ» رَوَاهُ التِّرمِذيُّ وقَالَ: حَديثٌ حَسَنٌ. وَرَوَاهُ أبو داوُدَ مِنْ رِوَايَةِ حَفْصَةَ، رَضِيَ اللهُ عَنْها؛ وَفِيهِ أَنَّهُ كَانَ يَقُولُهُ ثَلاثَ مَرَّاتٍ.

1465. హజ్రత్ హుజైఫా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నిద్ర పోదలచుకున్నప్పుడు కుడిచేతిని (కుడి) చెంప క్రింద పెట్టుకొని ఇలా వేడుకునేవారు: "ఓ అల్లాహ్! నీవు నీ దాసుల్ని తిరిగి (బతికించి) లేపేరోజున నన్ను నీ శిక్ష నుండి కాపాడు." తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు.

అబూదావూద్ ఈ హదీసుని హఫ్సా (రజి.అన్హా) ఆధారంగా వెలికి తీశారు. అందులో 'దైవప్రవక్త (సల్లం), పై విధంగా వేడుకునేవారు' అని ఉంది.

*(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు - సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మనిషి దైవశిక్ష పట్ల నిర్భయుడై పోకూడదనీ, నిత్యం దాన్నుండి శరణుకోరుతూ ఉండాలనీ, పైగా దేవుని ప్రసన్నత కోసం మంచిపనులు చేస్తూ ఉండాలనీ, అప్పుడే ప్రళయం నాడు దైవశిక్ష నుండి సురక్షితంగా ఉండటానికి వీలవుతుందని ఈ హదీసు పరోక్షంగా హెచ్చరిస్తోంది.

# ١٦ - كِتَابُ الدَّعَوَاتِ

# 16. ప్రార్థనల ప్రకరణం

**250వ అధ్యాయం**

## ٢٥٠- باب فضـــل الدعـــاء

## ప్రార్థన విశిష్టత

قَالَ اللهُ تَعَالَى: ﴿وَقَالَ رَبُّكُمُ ادْعُونِي أَسْتَجِبْ لَكُمْ﴾ [غـافـر: ٦٠]. وَقَالَ تَعَالَى: ﴿ادْعُوا رَبَّكُمْ تَضَرُّعًا وَخُفْيَةً إِنَّهُ لَا يُحِبُّ الْمُعْتَدِينَ﴾ [الأعراف: ٥٥]. وَقَالَ تَعَالَى: ﴿وَإِذَا سَأَلَكَ عِبَادِي عَنِّي فَإِنِّي قَرِيبٌ أُجِيبُ دَعْوَةَ الدَّاعِ إِذَا دَعَانِ﴾ الآيــــة [البقرة: ١٨٦]. وَقَالَ تَعَالَى: ﴿أَمَّن يُجِيبُ الْمُضْطَرَّ إِذَا دَعَاهُ وَيَكْشِفُ السُّوءَ﴾ الآية [النمل: ٦٢].

దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

"నీ ప్రభువు ఇలా అంటున్నాడు: నన్ను ప్రార్థించండి, నేను మీ ప్రార్థనలను అంగీకరిస్తాను." *(మోమిన్: 60)*

"మీ ప్రభువును వేడుకోండి, విలపిస్తూనూ, గోప్యంగానూ, నిశ్చయంగా ఆయన మితిమీరి మెలిగేవారిని ప్రేమించడు." *(ఆరాఫ్: 55)*

"నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే, నేను వారికి అత్యంత సమీపంలోనే ఉన్నాననీ, పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపుని వింటాను, సమాధానం పలుకుతాను అనీ, (ఓ ప్రవక్తా!) నీవు వారికి తెలుపు." *(బఖర: 186)*

"కలత చెందినవాడు మొరపెట్టు కున్నప్పుడు అతని మొరను ఆలకించి అతని బాధను తొలగించేవాడు ఎవడు?" *(నమ్ల్: 62)*

### ముఖ్యాంశాలు

ప్రార్థన (దుఆ) కూడా ఒక రకమైన ఆరాధనే. పైగా ఆరాధనకు ప్రాణం, సారం ప్రార్థనే. కనుక ఆ ప్రార్థన కూడా అల్లాహ్‌కే అంకితం కావాలి. అంటే అల్లాహ్‌ను మాత్రమే ప్రార్థించాలి.

పైన పేర్కొనబడిన ఖుర్‌ఆన్ సూక్తుల్లో ఈ విషయమే నొక్కి వక్కాణించబడింది. ప్రార్థనల్ని అంగీకరించేవాడు దేవుడు ఒక్కడేననీ, మనం ఆయన్ని మాత్రమే ప్రార్థించాలనీ, వేరితరుల్ని ప్రార్థిస్తే వారిని ఆరాధించినట్లవుతుందనీ, అది షిర్క్ (బహు దైవారాధన)కు దారితీస్తుందని పైసూక్తులు ప్రబోధిస్తున్నాయి. మరో విషయం ఏమిటంటే బాధితుల మొరలను ఆలకించలేని, వారి మాటలను సయితం వినలేని విగ్రహాలు, చనిపోయిన పుణ్యాత్ములు వారికి ఏం సహాయం చేస్తారు? అందుకని ఆరాధనలో అంతర్భాగమైన 'దుఆ' (ప్రార్థన) ను కూడా అల్లాహ్‌కే అంకితం చేసుకోవాలి.

١٤٦٦ ـ وَعَنِ النُّعْمانِ بْنِ بَشِيرٍ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ، قَالَ: «الدُّعَاءُ هُوَ العِبَادَةُ». رَوَاهُ أَبو دَاودَ، والترمذيُّ، وَقَالَ: حديثٌ حَسَنٌ صَحيحٌ.

1466. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: 'దుఆ (ప్రార్థన) కూడా ఆరాధనే.' (అబూదావూద్, తిర్మిజీ- తిర్మిజీ దీనిని హసన్, సహీహ్ కోవకు చెందినదిగా పేర్కొన్నారు.)

(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

అసలు 'ప్రార్థన' అంటే ఏమిటి? తమ బలహీనతను, నిస్సహాయతను వ్యక్తపరచటమే కదా! ఆరాధన అన్నా కూడా అదే భావం వస్తుంది. దేవుని శక్తిసామర్థ్యాల ముందు తమ బలహీనతను, నిస్సహాయతను వెలిబుచ్చటం తమల్ని తాము అల్పులుగా, అధములుగా భావించుకోవటం ఆరాధనకు ప్రాణం. అందుకే ప్రార్థన కూడా ఆరాధనేనని చెప్పబడింది. ఆరాధన దేవుని హక్కు. ఆయన్ని తప్ప ఇతరుల్ని ఆరాధించకూడదు. అలాగే ప్రార్థన కూడా దేవుని హక్కే. కనుక ఆయన్ని తప్ప ఇతరుల్ని ప్రార్థించరాదు.

١٤٦٧ ـ وَعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ رَسُولُ اللهِ ﷺ، يَسْتَحِبُّ الجَوامِعَ مِنَ الدُّعَاءِ، وَيَدَعُ مَا سِوَى ذلكَ. رَوَاهُ أَبو دَاودَ بإِسْنادٍ جَيِّدٍ.

1467. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) సమగ్రమైన ప్రార్థనల్ని యిష్టపడేవారు. అవి మినహా ఇతర ప్రార్థనల్ని వదలి పెట్టేవారు. (అబూదావూద్ ఈ హదీసుని మంచి ఆధారాలతో వెలికితీశారు)

(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

సమగ్రమైన ప్రార్థనలంటే పదాలు తక్కువగా ఉండి, చాలా ఎక్కువ భావాన్ని కలిగివున్న ప్రార్థనలు (దుఆలు) అని అర్థం. సమగ్రమైన పదాలతో ప్రార్థన చేయటానికి ఉత్తమ పద్ధతి ఏమిటంటే స్వయంకల్పిత ప్రార్థనలు చేయకుండా మస్నూన్ ప్రార్థనలు చేయాలి. ఎందుకంటే అవి చాలా భావగర్భితంగా ఉంటాయి. అదీగాక అవి దైవప్రవక్త (సల్లం)గారి నోటి నుండి జాలువారినవి కనుక వాటిలో అసాధారణమైన ప్రభావశక్తి, శ్రేయోశుభాలు ఇమిడి ఉంటాయి.

١٤٦٨ ـ وَعَنْ أَنَسٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ أَكْثَرُ دُعَاءِ النَّبِيِّ ﷺ: «اللَّهُمَّ آتِنَا فِي الدُّنْيَا حَسَنَةً، وَفِي الآخِرَةِ حَسَنَةً؛ وَقِنَا عَذَابَ النَّارِ» مُتَّفَقٌ عَلَيهِ. زاد مُسلِمٌ في رِوَايتِهِ قَالَ: وكَانَ أَنَسٌ إذا أرَادَ أَنْ يَدعُوَ بِدَعْوَةٍ دَعَا بِهَا، فإِذَا أَرَادَ أَن يَدعوَ بِدُعَاءٍ دَعَا بِهَا فِيهِ.

1468. హజ్రత్ అనస్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఎక్కువగా ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండేవారు: "ఓ అల్లాహ్! ఇహలోకంలో మాకు మంచిని ప్రసాదించు, పరలోకంలో కూడా మంచిని ప్రసాదించు. ఇంకా మమ్మల్ని నరకాగ్ని నుండి రక్షించు." *(బుఖారీ-ముస్లిం)*

ముస్లిం ఉల్లేఖనంలో అదనంగా ఇలా ఉంది: హజ్రత్ అనస్ (రజి) ఎప్పుడైనా దుఆ చేస్తే పై వచనాలతోనే దుఆ చేసేవారు. ఏదయినా (ప్రత్యేకమైన) దుఆ చేస్తే, అందులో కూడా ఈ వాక్యాలను కలుపుకునేవారు.

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'మంచిని ప్రసాదించు' అంటే మంచిపనులు చేసే భాగ్యాన్ని ప్రసాదించు అని భావం. విశ్వాసులు ప్రపంచంలో కేవలం ప్రాపంచిక సిరిసంపదల్ని మాత్రమే కాకుండా మంచిపనులు చేసుకునే సౌభాగ్యం ప్రాప్తించాలని కూడా దేవుణ్ణి ప్రార్థించాలి. తమకు ఏది ఒసగబడినా అది తమకు శుభకరం కావాలని కోరుకోవాలి. పోతే పరలోకంలో మంచిని ప్రసాదించటమంటే ప్రపంచంలో చేసిన పుణ్యకార్యాలకు మంచి ప్రతిఫలంగా స్వర్గాన్ని ప్రసాదించమని భావం. ఎంతో సమగ్రమైన ప్రార్థన ఇది. హజ్ ఉమ్రా యాత్రల్లో కాబా గృహ ప్రదక్షిణాలు చేసినప్పుడు

రుక్నెయమానీ, హజ్రె అస్వద్‌ల మధ్య ఈ ప్రార్థన చేయటం మస్నూన్ (దైవప్రవక్త విధానం). కొందరు ఆ సమయంలో ఈ ప్రార్థన చేయకుండా ఏవో స్వయంకల్పిత వచనాలు పఠిస్తూ ఉంటారు. ఈ పద్ధతి సరైనది కాదు. దైవప్రవక్త (సల్లం) వాటి మధ్య 'రబ్బనా ఆతినా ఫిద్దున్‌యా హసనతన్...' అని మాత్రమే పఠించేవారని హదీసుల ద్వారా బోధపడుతోంది. కనుక దాన్ని వదలిపెట్టి స్వయం కల్పిత ప్రార్థనా వచనాలు వల్లించటం సరైన పద్ధతి కాదు. అయితే తమ అవసరాలు తీర్చమని తమకు వచ్చిన భాషలోనే దేవుణ్ణి వేడుకోవచ్చు. ముఖ్యంగా 'ముల్తజిమ్'ని అంటిపెట్టుకొని విలపించి మరీ ప్రార్థనలు చేయాలి.

١٤٦٩ - وَعَـنِ ابـنِ مَسْعُـودٍ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ، كَانَ يَقُولُ: «اللَّهُـمَّ إِنِّي أَسْأَلُكَ الهُـدَى، وَالتُّقَى، وَالعَفَافَ، والغِنَى» رَواهُ مُسْلِمٌ.

1469. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా వేడుకునేవారు: దేవా! నేను నిన్ను సన్మార్గాన్ని, భయభక్తుల్ని, సౌశీల్యాన్ని, నిరపేక్షాభావాన్ని ప్రసాదించమని అర్థిస్తున్నాను. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'సన్మార్గం' అంటే మంచివైపునకు దర్శకత్వం అని అర్థం. మనిషికి ఎల్లప్పుడూ దీని అవసరముంటుంది. సన్మార్గమనే మాటలో మంచిని బలపరచటం, దానిపై స్థిరంగా నిలబడటం అనే అర్థాలు కూడా ఇమిడి ఉన్నాయి. దేవుని ఆజ్ఞల్ని పాటిస్తూ ఆయన వారించిన విషయాలకు దూరంగా ఉండటం 'తఖ్వా' (భయభక్తులు) క్రిందికి వస్తాయి. మనిషికి భయభక్తులు ఎంత అవసరమో వివరించనవసరం లేదు. సౌశీల్యతలో రెండు భావాలు ఇమిడి ఉన్నాయి. పాపాలకు దూరంగా ఉండటం, ప్రజల ముందు ముష్టెత్తకుండా గౌరవంగా బతకటం. ఈ రెండూ సౌశీల్యత క్రిందికే వస్తాయి. ఇకపోతే నిరపేక్షాభావమంటే ప్రజల నుండి ఏమీ ఆశించకుండా ఒక్క దేవుని మీదే అన్ని ఆశలూ పెట్టుకొని ఉండటం. ఈ ప్రార్థనలో కూడా ఎంతో సమగ్రత ఉంది.

١٤٧٠ - وَعَـنْ طـارِقِ بـنِ أَشْيَـمَ، رَضِيَ اللهُ عَنْهُ قالَ: كانَ الرَّجُلُ إذا أَسْلَمَ عَلَّمَهُ النَّبِيُّ ﷺ الصَّلاةَ، ثُمَّ أَمَرَهُ أَنْ يَدعُوَ بِهٰـؤُلاءِ الكَلِمَـاتِ: «اللَّهُـمَّ اغفِـرْ لـي،

1470. హజ్రత్ తారిఖ్ బిన్ అష్‌యమ్ (రజి) కథనం: ఏ మనిషి అయినా ఇస్లాం స్వీకరిస్తే దైవప్రవక్త (సల్లం) (ముందుగా) అతనికి నమాజ్ నేర్పించేవారు. ఆ తర్వాత ఈ వచనాలతో (దైవాన్ని) ప్రార్థించమని ఆదేశించేవారు. "ఓ అల్లాహ్! నన్ను క్షమించు, నన్ను

وَارْحَمْني، وَاهْدِني، وَعَافِني، وَارْزُقْني» رواهُ مسلمٌ. وفي رِوايةٍ لَهُ عَنْ طارقٍ أنَّهُ سَمِعَ النَّبيَّ ﷺ، وَأَتاهُ رَجُلٌ، فَقَالَ: يا رَسُولَ اللهِ! كَيفَ أقُولُ حِينَ أسْألُ رَبِّي؟ قَالَ: «قُلِ: اللَّهُمَّ اغْفِرْ لي، وَارْحَمْني، وَعَافِني، وَارْزُقني، فَإِنَّ هٰؤُلاءِ تَجْمَعُ لَكَ دُنْيَاكَ وَآخِرَتَكَ».

కరుణించు, నాకు సన్మార్గం చూపు, నన్ను క్షేమంగా ఉంచు, నాకు ఉపాధి నొసగు.” (ముస్లిం)

ముస్లింలోనే వేరొక ఉల్లేఖనం ప్రకారం తారిఖ్ (రజి) తాను దైవప్రవక్త (సల్లం) నుండి విన్న విషయాన్ని ఇలా వివరించారు: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, “దైవప్రవక్తా! నేను నా ప్రభువును అర్థించినప్పుడు ఏమని పలకాలి?” అని అడిగాడు. అందు కాయన ఇలా అన్నారు: “ఈ విధంగా ప్రార్థించు, ఓ అల్లాహ్! నన్ను క్షమించు, నా మీద దయజూపు, నన్ను క్షేమంగా ఉంచు. నాకు ఉపాధినొసగు.”

ఈ ప్రార్థనా వచనాలు నీ ఇహలోక జీవితానికి, పరలోక జీవితానికి రెండింటికీ వర్తిస్తాయి. (వీటిలో రెండురకాల ఉద్దేశాలూ ఇమిడి వున్నాయని భావం.)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

١٤٧١ ـ وَعَنْ عَبْدِ اللهِ بنِ عمرو بنِ العاصِ، رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «اللَّهُمَّ مُصَرِّفَ القُلُوبِ صَرِّفْ قُلُوبَنَا عَلى طَاعَتِكَ» رَوَاهُ مُسْلِمٌ.

1471. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్(రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించారు: దేవా! హృదయాలను మరలించే స్వామీ! మా హృదయాలను నీ విధేయత వైపు మరల్చు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఖదర్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఇది చాలా ముఖ్యమైన ప్రార్థన. ఇందులో మంచితనం కోసం, ధర్మంపై నిలకడతనం

కోసం ప్రార్థించటం జరుగుతుంది. మనిషి హృదయం ఎల్లప్పుడూ సమస్యల వలయంలో, సంఘటనల సుడిగుండంలో చిక్కుకొని ఉంటుంది. అందులోని అలల తాకిడికి అది ఎప్పుడు ఏ వైపుకు మళ్ళుతుందో తెలియదు. దేవుని కృప, ఆయన సహాయం తోడు లేకపోతే మనిషి హృదయం ఏ సందర్భంలోనయినా వక్రతకు గురై భష్టత్వకూపంలో పడిపోవచ్చు. అందుకే హృదయాలు వక్రతకు లోనవకుండా కాపాడమనీ, వాటిని కేవలం తనవైపునకు మాత్రమే మళ్లించి ఉంచమనీ ఈ హదీసులో దేవుణ్ణి ప్రార్థించటం జరిగింది.

١٤٧٢ - وَعَنْ أبي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبيِّ ﷺ قَالَ: «تَعَوَّذُوا باللهِ مِنْ جَهْدِ الْبَلاءِ، وَدَرَكِ الشَّقَاءِ، وَسُوءِ الْقَضَاءِ، وَشَمَاتَةِ الأَعْدَاءِ» مُتَّفَقٌ عَلَيهِ.
وفي رِوَايةٍ: قَالَ سُفْيَانُ: أَشُكُّ أَنِّي زِدْتُ وَاحِدَةً مِنها.

1472. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: పరిశ్రమ వల్ల కలిగే కష్టం నుండి, దౌర్భాగ్యం సోకటం నుండి, చెడు నిర్ణయాల నుంచి, శత్రువుల నవ్వులాటల నుంచి మీరు దేవుని శరణు వేడుకోండి.

(బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనం ప్రకారం (ఈ హదీసు ఉల్లేఖకుల్లో ఒకరైన) సుఫ్యాన్ తాను వీటిలో ఏదో ఒక విషయం తన తరఫు నుండి అదనంగా చెప్పానేమోనని అనుమానంగా ఉందని చెప్పారు.

*(సహీహ్ బుఖారీలోని ఖదర్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో నాలుగు విషయాల బారి నుండి శరణు వేడుకోవటం జరిగింది. మొదటగా 'జహ్దుల్ బలా' నుండి శరణుకోరటం జరిగింది. మనిషి ఓర్చుకోలేని, తొలగించుకోనూలేని అత్యంత బాధాకరమైన కష్టాన్ని 'జహ్దుల్ బలా' అని అంటారు. కొందరు సిరిసంపదలు తక్కువగా ఉండటాన్ని, తమ మీద ఆధారపడి బతికేవారు చాలా ఎక్కువమంది ఉండటాన్ని జహ్దుల్ బలా అన్నారు. కాని హాఫిజ్ ఇబ్నె హజర్ (రహ్మలై) దీని గురించి వ్యాఖ్యానిస్తూ, 'జహ్దుల్ బలా'లో అది ఒక రకమే కాని, పూర్తిగా అదే 'జహ్దుల్ బలా' కాదని అన్నారు. రెండోది, దౌర్భాగ్యం అంటుకోవటం నుండి శరణుకోరటం. ఇది సౌభాగ్యానికి వ్యతిరేకమైనది. మూడోది, చెడు నిర్ణయాల నుండి. దేవుని నిర్ణయాల్లో ఏ నిర్ణయమూ చెడ్డది

కాదు. కాకపోతే వాటిలో కొన్నిటివల్ల మనుషులకు నష్టం కలగవచ్చు. మరికొన్నిటివల్ల లాభమూ కలగవచ్చు. ఆ విధంగా మానవుల దృష్టితో చూస్తే దేవుని నిర్ణయాల్లో మంచీచెడులు రెండూ ఉంటాయి. కనుక దేవుని నిర్ణయాల్లో తమకు నష్టం కలిగించే వాటి నుండి శరణువేడుకుంటూ ఉండాలి. చివరగా 'షమాతత్' నుండి శరణు వేడుకోమని ఆదేశమయింది. శత్రువు సంతోషించటాన్ని 'షమాతత్' అంటారు. సాధారణంగా మనుషులు కష్టాల్లో చిక్కుకున్నప్పుడు వారి శత్రువులు వారిని చూసి నవ్వుతారు. సంతోషం ప్రదర్శిస్తారు. అలాంటి కష్టాల నుండి కూడా దేవుని శరణువేడుకుంటూ ఉండాలని దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు.

ఈ హదీసులో ఉల్లేఖకుడు సుఫ్యాన్ సొంతమాట ఒకటి ఉంది. అది హదీసులో భాగం కాదు. అయితే ముసలితనంలో ఆయన ఆ మాట ఏదో మర్చిపోయారు. అయితే ఇతర ఉల్లేఖనాల ద్వారా ఆ అదనపు మాట 'శత్రువుల నవ్వులాట' అని తెలిసిపోయింది. (ఇబ్నెఅల్లాన్)

హదీసు ఉల్లేఖకుల నిజాయితీకి ఈ సంఘటన ఓ మచ్చుతునక. హదీసులో తమ తరపు నుండి అదనంగా ఓ ప్రార్థన వచనాన్ని చేర్చినా ఆ విషయాన్ని కూడా వారు ఎలంటి దాపరికాలూ లేకుండా వివరించారు. కొంతమంది 'శత్రువుల నవ్వులాట' అనేది విశ్వసనీయమైన ఉల్లేఖకుడు అదనంగా చెప్పింది కనుక అది ఆమోదయోగ్యమని అన్నారు. కాని నిజానికి వారు పొరబడ్డారు. ఒక హదీసు ఉల్లేఖకుల్లో విశ్వసనీయమైన వ్యక్తి ఒకడు ఇతరులెవరూ చెప్పని మాట హదీసులో అంతర్భాగంగా చెప్పాడనుకోండి. అది అమోదయోగ్యమే. కాని ఈ హదీసులోని సమస్య వేరు. ఇందులో ఉల్లేఖకుడు స్వయంగా చెబుతున్నారు ఆ అదనపు మాట తాను కల్పించినదని. కనుక అదనపు మాట హదీసుగా చెల్లదు. దీన్ని 'ఇద్రాజ్' అని అంటారు. అదనపు మాటను 'ముద్రజ్' అంటారు.

١٤٧٣ ـ وَعنــــهُ قَـــالَ: كَـــانَ رَسُولُ اللهِ ﷺ، يقُولُ: «اللَّهمَّ أَصْلِحْ لي دِيني الَّذي هُوَ عِصْمَةُ أَمْرِي، وَأَصْلِحْ لي دُنْيَايَ التي فِيهَا مَعَاشِي، وَأَصْلِحْ لي آخِرَتي الَّتي فِيهَا مَعَادِي، وَاجْعَلِ الحَيَاةَ زِيادَةً لي في كُلِّ خَيْرٍ، وَاجْعَلِ المَوْتَ رَاحَةً لي مِنْ كُلِّ شَرٍّ» رَوَاهُ مسْلِمٌ.

1473. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండే వారు: ఓ అల్లాహ్! నా జీవన వ్యవహారాల్ని పరిరక్షించేది ధర్మమే కనుక నా ధర్మాన్ని చక్కదిద్దు. నేను జీవితం గడపవలసింది ప్రపంచంలోనే కనుక నా ప్రాపంచిక జీవితాన్ని సంస్కరించు. మరణానంతరం నా శాశ్వత స్థానం పరలోకమే కనుక నా పరలోక జీవితాన్ని చక్కదిద్దు. నా జీవితంలో అన్ని రకాల మేళ్ళు పెరిగిపోయేలా చెయ్యి.

అన్నిరకాల చెడుల నుండి (రక్షణ పొందటానికి వీలుగా) మరణాన్ని నా కొరకు సుఖవంతం చెయ్యి. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ ప్రార్థన కూడా చాలా సమగ్రంగా, భావగర్భితంగా ఉంది. ఇందులో ధర్మం, ప్రపంచం, పరలోకం ఈ మూడింటిలోనూ తమ జీవితాన్ని చక్కదిద్దమని ప్రార్థించటం జరిగింది.

1474. హజ్రత్ అలీ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాకు ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండమని ఉపదేశించారు: "ఓ అల్లాహ్! నాకు సన్మార్గం చూపు. నన్ను తిన్నగా (సవ్యంగా) ఉంచు."

వేరొక ఉల్లేఖనంలో "దేవా! నేను నీ నుండి సన్మార్గం, నిలకడతనం, మధ్యే మార్గం కోరుకుంటున్నాను" అని ఉంది. (ముస్లిం)

١٤٧٤ ـ وَعَنْ عليٍّ، رَضيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ لي رَسولُ اللهِ ﷺ: «قُل: اللَّهُمَّ اهْدِني، وَسدِّدْني». وَفي رِوَايةٍ: «اللَّهُمَّ إنِّي أَسْأَلُكَ الْهُدَى، وَالسَّدَادَ» رَوَاهُ مسلمٌ.

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

హదీసు మూలంలో 'సిదాద్' అనే పదం వచ్చింది. సిదాద్ అంటే సవ్యమైనది అని అర్థం. ప్రతి ఆచరణా సవ్యమైన రీతిలో, దైవప్రవక్త విధానానికి అనుగుణంగా నెరవేర్చే సద్బుద్ధిని ప్రసాదించమని ఇక్కడ దానిభావం. కొందరు హదీసు భాష్యకారులు ఈ పదానికి నిలకడతనం, మధ్యేమార్గం అనే అర్థాలు ఉన్నాయని చెప్పారు. భావం రీత్యా రెండు అర్థాలూ సరైనవే.

1475. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా వేడుకునేవారు: "ఓ అల్లాహ్! (మంచి పనులు) చేయలేకపోవటం నుంచి, శక్తి ఉండి కూడా సోమరితనానికి లోనవటం నుంచి, పిరికితనం, పిసినారి

١٤٧٥ ـ وَعَنْ أَنَسٍ، رَضيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ يَقُولُ: «اللَّهُمَّ إنِّي أَعُوذُ بكَ مِنَ الْعَجْزِ وَالكَسَلِ وَالجُبْنِ وَالهَرَمِ، وَالبُخْلِ، وَأَعوذُ بكَ مِنْ عَذَابِ الْقَبْرِ، وَأَعـوذُ بِـكَ مِـنْ فِتْنَـةِ المَحْيَـا

وَالمَمَاتِ». وَفي رِوَايةٍ: «وَضَلَعِ الدَّيْنِ وَغَلَبَةِ الرِّجَالِ» رَوَاهُ مُسْلِمٌ.

తనం నుంచి, నికృష్టమైన వృద్ధాప్యం నుంచి నీ శరణు కోరుతున్నాను. ఇంకా సమాధి శిక్ష నుండి, జీవన్మరణాల ఉపద్రవం నుంచి నీ శరణు కోరుతున్నాను.

వేరొక ఉల్లేఖనంలో 'రుణభారం, ఇతరులు నాపై దౌర్జన్యం చేయటం నుంచి (నీ శరణు కోరుతున్నాను)' అని ఉంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

١٤٧٦ ـ وَعَن أبي بكرٍ الصِّدِّيقِ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّهُ قَالَ لِرَسولِ اللهِ ﷺ: عَلِّمْنِي دُعَاءً أَدعُو بِهِ في صَلاتي، قَالَ: «قُلِ: اللَّهمَّ! إنِّي ظَلَمْتُ نَفْسِي ظُلْماً كَثِيراً، وَلاَ يَغْفِرِ الذُّنوبَ إلَّا أَنْتَ، فَاغْفِرْ لي مَغْفِرَةً مِنْ عِنْدِكَ، وَارحَمْني، إنَّكَ أَنْتَ الْغَفُورُ الرَّحِيمُ» متَّفَقٌ عليهِ. وَفي رِوَايةٍ: «وَفي بَيْتي» وَرُوِيَ: «ظُلْماً كَثِيراً» وَرُوِيَ «كَبيراً» بالثاءِ المثلثة وبالباءِ الموحدة، فَيَنْبَغِي أن يُجْمَعَ بَيْنَهُمَا، فَيُقَالُ: كَثيراً كَبيراً.

1476. హజ్రత్ అబూ బక్ర్ సిద్దీఖ్ (రజి) కథనం ప్రకారం తానొకసారి దైవప్రవక్త (సల్లం)ను అడిగారు, "నమాజులో చేసుకోవటానికి నాకొక ప్రార్థన నేర్పించండి" అని. అందుకాయన ఈ విధంగా ప్రార్థించమని ఉపదేశించారు.

"అల్లాహ్! నేను నా ఆత్మకు చాలా అన్యాయం చేసుకున్నాను. నీవు తప్ప పాపాలను క్షమించేవారు మరెవరూ లేరు. నీవు నీ ప్రత్యేక అనుగ్రహంతో నన్ను క్షమించు. నా మీద దయజూపు, నిశ్చయంగా నీవు క్షమించేవాడవు, కరుణామయుడవు."

(బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో "ఈ ప్రార్థన నేను ఇంట్లో చేసుకుంటాను" అని ఉంది. అందులోనే 'జుల్మన్ కసీరన్'కు బదులు జుల్మన్ కబీరన్ అని ఉంది.

(అందుకని ఇమామ్ నవవీ (రహ్మలై) ఏమంటున్నారంటే) ఆ రెండింటినీ కలుపుకొని "జలమ్‌తు నఫ్‌సీ జుల్మన్ కసీరన్ కబీరన్" అని పఠించటం ఉత్తమం.

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ ప్రార్థనా వచనాలను నమాజులో దరూదె షరీఫ్ తర్వాత సలాం చేయకముందు పఠించాలి. ఇతర వేళల్లో కూడా దీన్ని పఠించవచ్చు.

١٤٧٧ - وَعَنْ أَبِي مُوسَى، رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ، أَنَّهُ كَانَ يَدْعُو بِهٰذَا الدُّعَاءِ: «اللَّهُمَّ اغْفِرِ لِي خَطِيئَتِي وَجَهْلِي، وَإِسْرَافِي فِي أَمْرِي، وَمَا أَنْتَ أَعْلَمُ بِهِ مِنِّي، اللَّهُمَّ اغْفِرِ لِي جِدِّي وَهَزْلِي، وَخَطَئِي وَعَمْدِي، وَكُلُّ ذٰلِكَ عِنْدِي، اللَّهُمَّ اغْفِرْ لِي مَا قَدَّمْتُ وَمَا أَخَّرْتُ، وَمَا أَسْرَرْتُ وَمَا أَعْلَنْتُ، وَمَا أَنْتَ أَعْلَمُ بِهِ مِنِّي، أَنْتَ الْمُقَدِّمُ، وَأَنْتَ الْمُؤَخِّرُ، وَأَنْتَ عَلَى كُلِّ شَيْءٍ قَدِيرٌ» مُتَّفَقٌ عَلَيهِ.

1477. హజ్రత్ అబూమూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ (క్రింది) ప్రార్థనా వచనాలతో దేవుణ్ణి ప్రార్థించేవారు: "ఓ అల్లాహ్! నా తప్పునీ, నా మూర్ఖత్వాన్ని, నా వ్యవహారంలో నేను మితిమీరిపోవటాన్ని, నా కంటే నీకు బాగా తెలిసిన నా తప్పుల్నీ క్షమించు. ఓ అల్లాహ్! నేను ఉద్దేశ్య పూర్వకంగా చేసినా, ఉబుసుపోక చేసినా, తెలిసి చేసినా తెలియకచేసినా- అవన్నీ నేను చేసిన తప్పులే. వాటన్నిటినీ క్షమించు. దేవా! నేను ఇంతకు ముందు చేసిన పాపాలను, చేయబోయే పాపాలను, రహస్యంగా చేసిన పాపాలను, బహిరంగంగా చేసిన పాపాలను, ఇంకా నాకంటే నీకే ఎక్కువ తెలిసిన పాపాలను కూడా క్షమించు. ముందుకు నడిపించేవాడవు, వెనక్కి

నెట్టేవాడవు నీవే. నీవు ప్రతి వస్తువుపై అధికారం కలిగివున్నావు.''
(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) ద్వారా జరిగిన, జరగపోయే పాపాలన్నిటినీ దేవుడు మన్నించాడు. అయినప్పటికీ ఆయన దేవుణ్ణి ఎంతగా క్షమాపణలు వేడుకునేవారో చూడండి. ఇందులో మనకు గొప్ప గుణపాఠం ఉంది. మనం మన వల్ల జరిగే పాపాలపై పశ్చాత్తాపం చెంది, వాటికి క్షమాపణలు వేడుకునే విషయంలో ఏ మాత్రం ఏమరుపాటుకు లోనుకాకూడదు. ఈ ప్రార్థనా వచనాలను అత్యంత అణకువభావంతో (అన్ని రకాల పాపాలను క్షమించమని) పలకటం జరిగింది.

١٤٧٨ ـ وَعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنْهَا، أَنَّ النَّبِيَّ ﷺ، كَانَ يَقُولُ فِي دُعَائِهِ: «اللَّهُمَّ إِنِّي أَعُوذُ بِكَ مِنْ شَرِّ مَا عَمِلْتُ وَمِنْ شَرِّ مَا لَمْ أَعْمَلْ» رَوَاهُ مُسْلِمٌ.

1478. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన ప్రార్థనలో ఇలా అనేవారు: "ఓ అల్లాహ్! నేను ఇంతకు ముందు చేసిన పనుల కీడు నుండి, ఇంతవరకు చేయని పనుల కీడు నుండి నీ శరణు కోరుతున్నాను.'' (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ ప్రార్థనలో ఓ పెద్ద భావ సముద్రమే ఇమిడి ఉంది. మనిషి కొన్ని సందర్భాల్లో మంచిపనులు చేస్తాడు. కాని వాటిలో ప్రదర్శనాబుద్ధిగాని, అహంకారంగాని ఉంటే అది ఇతర మంచిపనులను కూడా నాశనం చేసేస్తుంది. అందుకని అలాంటివాటి నుంచి శరణు వేడుకుంటూ ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది.

١٤٧٩ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: كَانَ مِنْ دُعَاءِ رَسُولِ اللهِ ﷺ:

1479. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ప్రార్థనల్లో ఇది కూడా ఒకటి: "ఓ అల్లాహ్! నీవు అనుగ్రహించిన వరాలు తరిగిపోవటం

«اللَّهُمَّ إنِّي أَعُوذُ بِكَ مِنْ زَوَالِ نِعْمَتِكَ، وَتَحَوُّلِ عَافِيَتِكَ، وَفُجَاءَةِ نِقْمَتِكَ؛ وَجَمِيعِ سَخَطِكَ» رَوَاهُ مُسْلِمٌ.

నుండి, నీవు ప్రసాదించిన క్షేమం మారిపోవటం నుంచి, హఠాత్తుగా నీవు నిలదీసి నిగ్గుతేల్చటం నుంచి, ఇంకా ఏ విధంగానయినా నీకు ఆగ్రహం రావటం నుండి నేను నీ శరణు వేడు తున్నాను. " (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని రిఖాఖ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ ప్రార్థన కూడా అత్యంత సమగ్రంగా ఉంది. దేవుడు ప్రతి మనిషికీ ఎన్నో వరాలు అనుగ్రహించాడు. ఆ వరాలు తొలగిపోయినప్పుడే అతనికి వాటి విలువ తెలుస్తుంది. కళ్ళు, చెవులు, ఆరోగ్యం, సిరిసంపదలు ఇలా ఎన్నో అమూల్యమైన వరాలు దేవుడు ప్రసాదించాడు. ఆయన ప్రసాదించిన వరాలేవీ కోల్పోకూడదని ఈ ప్రార్థనలో కోరుకోవటం జరిగింది. ఆ తర్వాత క్షేమం మారిపోవటం నుండి శరణు కోరటం జరిగింది. అసలు క్షేమం అంటే వ్యాధులకు, కష్టాలకు, దుఃఖవిచారాలకు లోనవకుండా ఉండటం. అలాగాకుండా మనిషి నిరంతరం వ్యాధులకు, కష్టాలకు గురవుతుంటే దాన్నే 'క్షేమం మారిపోవటం' అంటారు. అలాంటి బాధాకరమైన విషయాలన్నిటి నుండి శరణు కోరుకుంటూ ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది.

١٤٨٠ ـ وَعَنْ زَيْدِ بنِ أَرْقَمَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ، يَقُولُ: «اللَّهُمَّ إنِّي أَعُوذُ بِكَ مِنَ العَجْزِ وَالكَسَلِ، وَالبُخْلِ وَالهَرَمِ، وَعَذَابِ القَبْرِ، اللَّهُمَّ آتِ نَفْسِي تَقْوَاهَا، وَزَكِّهَا أَنْتَ خَيْرُ مَنْ زَكَّاهَا، أَنْتَ وَلِيُّهَا وَمَوْلاهَا، اللَّهُمَّ إنِّي أَعُوذُ بِكَ مِنْ عِلْمٍ لا يَنْفَعُ، وَمِنْ قَلْبٍ لا يَخْشَعُ، وَمِنْ نَفْسٍ لا تَشْبَعُ، وَمِنْ دَعْوَةٍ لا يُسْتَجَابُ لَهَا» رَوَاهُ مُسْلِمٌ.

1480. హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! దీనావస్థ నుంచి, సోమరితనం నుంచి, పిసినారితనం నుంచి, నికృష్టమైన వృద్ధాప్యం నుంచి, సమాధి యాతన నుంచి నేను నీ శరణు వేడుతున్నాను. దేవా! నా మనసుకు భయభక్తులు అనుగ్రహించు. దాన్ని పరిశుద్ధపరచు. నీవు మనసుని అందరికంటే బాగా శుద్ధి చేస్తావు. దాని కార్యసాధకుడివి, దాని సంరక్షకుడివి నీవే. దేవా! నిష్ప్రయోజన కరమైన విద్య నుండి నీ శరణు వేడు

తున్నాను. భయపడని హృదయం నుండి, తృప్తి చెందని మనసు నుండి, ఆమోదించబడని ప్రార్థన నుండి నీ శరణు వేడుతున్నాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

١٤٨١ - وَعَنِ ابنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا، أنَّ رَسُولَ اللهِ ﷺ، كَانَ يَقُولُ: «اللَّهُمَّ لَكَ أَسْلَمْتُ، وَبِكَ آمَنْتُ، وَعَلَيْكَ تَوَكَّلْتُ، وَإِلَيْكَ أَنَبْتُ، وَبِكَ خَاصَمْتُ، وَإِلَيْكَ حَاكَمْتُ. فاغفِرْ لي مَا قَدَّمْتُ، وَما أَخَّرْتُ، وَمَا أَسْرَرْتُ وَمَا أَعلَنْتُ، أَنْتَ المُقَدِّمُ، وَأَنْتَ المُؤَخِّرُ، لا إِلٰهَ إلَّا أَنْتَ». زَادَ بَعْضُ الرُّوَاةِ: «وَلا حَولَ وَلا قوَّةَ إلَّا باللهِ» متَّفقٌ عليهِ.

1481. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! నేను నా స్వయాన్ని నీకు సమర్పించుకున్నాను. నిన్ను విశ్వసించాను. నిన్నే నమ్ముకున్నాను. నీ వైపుకే మరలాను. నీ (సహాయం) తోనే నేను (నీ శత్రువులతో) పోరాడాను. తీర్పు కోసం నేను నీ సన్నిధికే వచ్చాను. (దేవా!) నేను ఇంతకు ముందు చేసిన పాపాలనూ, తర్వాత చేసిన పాపాలనూ మన్నించు. రహస్యంగా చేసిన పాపాలనూ, బహిరంగంగా చేసిన పాపాలను కూడా మన్నించు. ముందుకు నడిపించేవాడవు, వెనక్కి నెట్టేవాడవు నీవే. నీవు తప్ప మరొక ఆరాధ్యదేవుడు ఎవరూ లేరు.

కొందరు ఉల్లేఖకులు ఈ వాక్యం అదనంగా ఉల్లేఖించారు: "మంచి పనులు చేసే శక్తి, చెడుల నుండి కాపాడుకునే సామర్థ్యం అల్లాహ్ తరఫు నుండే లభిస్తుంది." (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పూర్తిగా అల్లాహ్ వైపుకు మరలిపోయి ప్రతి వ్యవహారంలోనూ ఆయన ప్రసన్నతను, ఆయన ఆదేశాలను దృష్టిలో పెట్టుకొని ప్రవర్తిస్తూ ఉండాలనీ, ఒకరితో స్నేహం పెంచుకోవాలన్నా లేదా శత్రుత్వం పెట్టుకోవాలన్నా దానికి దైవాభీష్టమే ప్రాతిపదిక కావాలని ఇందులో ప్రకటించబడింది. అల్లాహ్ ప్రతి ఒక్క ముస్లింకు హదీసులో పేర్కొనబడిన ప్రార్థన చేసే, అందులోని ప్రకటనను అనుసరించి ఆచరణ చేసే సద్బుద్ధిని ప్రసాదించు గాక!

١٤٨٢ - وَعَنْ عَائِشَةَ، رَضِيَ اللهُ عَنْهَا، أَنَّ النَّبِيَّ ﷺ، كَانَ يَدعو بهؤُلاءِ الكَلِمَاتِ: «اللَّهمَّ إنِّي أَعوذُ بِكَ مِن فِتْنَةِ النَّارِ، وعَذَابِ النَّارِ، وَمِن شَرِّ الغِنى وَالفَقْرِ». رَوَاهُ أَبو داودَ، والترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ صحيحٌ، وهذا لفظ أَبي داودَ.

1482. హజ్రత్ ఆయిషా (రజి అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) ఈ ప్రార్థనా వచనాలతో దేవుణ్ణి ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! అగ్ని మూలంగా ఏర్పడే ఉపద్రవం నుండి, అగ్ని యాతన కీడు నుండి, కలిమి లేముల కీడు నుండి నేను నీ శరణు వేడుతున్నాను. (అబూ దావూద్, తిర్మిజీ. తిర్మిజీ దీనిని హసన్ మరియు సహీహ్ కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు. వాక్యాలు అబూదావూద్‌వి)

*(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

కలిమి వల్ల కలిగే కీడు ఏమిటంటే మనిషిలో సిరిసంపదల పట్ల విపరీతమైన వ్యామోహం పెరిగిపోతుంది. వాటిని సంపాయించే ధ్యాసలో అతను ధర్మాధర్మాలను కూడా లెక్కచేయడు. అంతేకాదు, ఆ సిరిసంపదల మూలంగా అతనిలో గర్వం, అహంకారం, ఖారూనీ తత్వాలు కూడా పెరగవచ్చు. ఇవన్నీ మనిషి పరలోక జీవితానికి గొడ్డలిపెట్టు వంటివి. పోతే లేమివల్ల కలిగే కీడు ఏమిటంటే పేదరికం వల్ల కొన్ని సందర్భాల్లో మనిషి దేవుని కరుణాకటాక్షాల పట్ల నిరాశకు లోనవుతాడు. లేదా దైవప్రసన్నతను, విధివ్రాతను తూలనాడుతాడు, నీతి నిజాయితీలను ఉల్లంఘిస్తాడు.

١٤٨٣ - وَعَن زِيادِ بْنِ عِلاَقَةَ عن عَمِّه، وهو قُطبَةُ بنُ مالِكٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ

1483. హజ్రత్ జియాద్ బిన్ ఇలాఖా తన బాబాయి ఖుత్‌బా బిన్ మాలిక్ (రజి) నుండి చేసిన కథనం ప్రకారం

النَّبِيُّ ﷺ، يَقولُ: «اللَّهمَّ! إنِّي أَعوذُ بكَ مِن مُنكَراتِ الأخلاقِ، وَالأعمَالِ، وَالأهْوَاءِ» رَوَاهُ الترمذيُّ وَقَالَ: حَديثٌ حَسَنٌ.

దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించే వారు: ఓ అల్లాహ్! నేను చెడు నడత నుండి, చెడు కర్మల నుండి, చెడు వాంఛల నుంచి నీ శరణు వేడు తున్నాను. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని దావాత్ ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ఈ ప్రార్థనలో చెడు నడత నుంచి, చెడు కర్మల నుంచి శరణు కోరుతూ పరోక్షంగా మంచినడత కోసం, సదాచరణ కోసం ప్రార్థించటం జరిగింది.

١٤٨٤ ـ وَعَن شَكَلِ بنِ حُمَيْدٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ: يا رَسولَ اللهِ! عَلِّمْني دُعَاءً. قَالَ: «قُل: اللَّهُمَّ إنِّي أَعوذُ بكَ مِنْ شَرِّ سَمعِي، وَمِن شَرِّ بَصَرِي، وَمِن شَرِّ لِسَانِي، وَمِن شَرِّ قَلبِي، وَمِن شَرِّ مَنِيِّي» رَوَاهُ أَبو داودَ، والترمذيُّ وقال: حديثٌ حَسَنٌ.

1484. హజ్రత్ షకల్ బిన్ హుమైద్ (రజి) కథనం: ఒకసారి నేను దైవప్రవక్త (సల్లం) ను అడిగాను, "దైవప్రవక్తా! నాకో ప్రార్థన నేర్పించండి" అని. అందు కాయన ఈ విధంగా ప్రార్థించమని ఉపదేశించారు: "ఓ అల్లాహ్! నేను నా చెవుల కీడు నుండి, నా కళ్ళ కీడు నుండి, నా నాలుక కీడు నుండి, నా హృదయం కీడు నుండి, నా మర్మావయవం కీడు నుండి నీ శరణు వేడుతున్నాను." (అబూదావూద్, తిర్మిజీ-హసన్)

(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

**ముఖ్యాంశాలు**

అబద్ధపు మాటలు, అపనిందలు, చాడీలు, సంగీతం లాంటి నిషిద్ధ విషయాలు వినటం, లేక ధర్మవిషయాలు వినకపోవటం చెవుల కీడు. లోకుల లోపాల వైపు కన్నెత్తి చూడటం, పరస్త్రీల మీద దృష్టి కేంద్రీకరించటం లేదా విశ్వంలో వ్యాపించివున్న దైవమహిమల్ని కానకుండా ఉండటం దృష్టికీడు. మనసులో దేవుని ప్రేమకు కాకుండా ఇతరుల ప్రేమకు చోటివ్వటం హృదయ కీడు. లైంగిక కోర్కెలు తీర్చుకున్న తర్వాత మర్మాంగం నుండి స్ఖలించే చిక్కటి

జిగట పదార్థాన్ని 'మనీ' అంటారు. ఇక్కడ ఆ పదం 'మర్మాంగం' అనే అర్థంలో వాడబడింది. మర్మాంగాన్ని అక్రమంగా ఉపయోగిస్తే అది మర్మాంగ కీడు అవుతుంది. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే చెవులు, కళ్లు, నాలుక, హృదయం, మర్మాంగం మొదలగు అవయవాలను అక్రమంగా ఉపయోగిస్తే, దేవుని దృష్టిలో అది నేరంగా పరిగణించబడుతుంది. అలాంటి నేరస్థులు దేవుని సన్నిధిలో నిలదీయబడతారు. అందుకని వాటిని దైవాభీష్టానికి అనుకూలమైన పనుల్లో ఉపయోగించి వాటిని పరిరక్షించాలి.

١٤٨٥ ـ وَعَن أَنَسٍ، رَضِيَ اللهُ عَنهُ، أَنَّ النَّبِيَّ ﷺ، كَانَ يَقُولُ: «اللَّهمَّ إِنِّي أَعُوذُ بِكَ مِنَ الْبَرَصِ، وَالجُنُونِ، وَالجُذَامِ، وَسَيِّىءِ الأَسْقَامِ» رَوَاهُ أَبو داود بإسنادٍ صحيحٍ.

1485. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! తెల్లమచ్చల రోగం నుండి, పిచ్చితనం నుండి, కుష్ఠ వ్యాధి నుండి, ఇతర హీనమైన రోగాల నుండి నేను నీ శరణు వేడుతున్నాను. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)

## ముఖ్యాంశాలు

హదీసులో పేర్కొనబడిన మూడు వ్యాధులు చాలా భయంకరమైనవి. అవేగాకుండా పక్షవాతం, మూతి వంకరపోవటం, మధుమేహం, క్యాన్సర్, అంధత్వం మొదలగు హీనమైన రోగాల నుండి కూడా ఇందులో శరణు వేడటం జరిగింది. దేవుడు మనల్ని ఇలాంటి వ్యాధుల నుండి రక్షించుగాక!

١٤٨٦ ـ وَعَن أَبِي هُرَيرَةَ، رَضِيَ اللهُ عَنهُ قَالَ: كَانَ رَسولُ اللهِ ﷺ، يَقولُ: «اللَّهُمَّ! إِنِّي أَعُوذُ بِكَ مِنَ الجُوعِ، فإنَّهُ بِئْسَ الضَّجيعُ، وَأَعُوذُ بِكَ من الخِيَانَةِ، فإنَّها بِئْسَتِ البِطانَةُ». رَواهُ أبو داودَ بإسنادٍ صحيحٍ.

1486. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! నేను ఆకలి బాధ నుండి నీ శరణు కోరుతున్నాను. అది చాలా చెడ్డ సావాసి. ఓ అల్లాహ్! ఇంకా నేను నమ్మకద్రోహం నుండి నీ శరణు వేడుతున్నాను. ఎందుకంటే అదో ఘోరమైన మానసిక దౌర్బల్యం. (అబూదావూద్)

(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం)

١٤٨٧ ـ وَعَن عليٍّ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ مُكَاتَباً جاءَهُ، فقَالَ: إني عجزتُ عَن كِتَابَتي. فَأَعِنِّي. قَالَ: ألا أُعَلِّمُكَ كَلِماتٍ عَلَّمَنِيهِنَّ رَسُولُ اللهِ ﷺ، لَو كانَ عَلَيْكَ مِثْلُ جَبَلٍ دَيْناً أَدَّاهُ اللهُ عَنْكَ؟ قُلِ: «اللَّهمَّ اكفِني بِحَلالِكَ عَن حَرَامِكَ، وَأَغْنِني بِفَضْلِكَ عَمَّن سِوَاكَ». رواهُ الترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ.

1487. హజ్రత్ అలీ (రజి) కథనం ప్రకారం లిఖితపూర్వకంగా విడుదల ఒప్పందం (ముకాతబత్) చేసుకున్న బానిస వ్యక్తి ఒకడు తన దగ్గరకు వచ్చి ఒప్పందం ప్రకారం తాను యజమానికి డబ్బు చెల్లించలేకపోతున్నాననీ (అందుకని తనకు సహాయం చేయ మని) కోరాడు. అందుకు అలీ (రజి) అతనితో, "(అప్పుల బాధ తొలగిపోవ టానికి) దైవప్రవక్త నాకు నేర్పిన ప్రార్థనా వచనాలను నీకు కూడా నేర్ప మంటావా? నీ మీద కొండంత అప్పు ఉన్నాసరే దేవుడు నీ తరపు నుండి దాన్ని తీర్చేస్తాడు. నువ్వు ఈ విధంగా ప్రార్థించు" అని అన్నారు:

"ఓ అల్లాహ్! నేను అక్రమార్జనకు పాల్పడకుండా ఉండేందుకు నీవు ప్రసాదించే పరిశుద్ధ సంపాదనతోనే నా అవసరాలన్నీ తీర్చు. నీ కరుణా కటాక్షాలతో నన్ను నీ విషయంలో తప్ప ఇతర అన్ని విషయాల్లోనూ నిరపేక్షా పరునిగా ఉండేలా చెయ్యి."

*(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయం)*

**ముఖ్యాంశాలు**

బానిస తాను ఇంత డబ్బు కట్టి స్వేచ్ఛాపరుణ్ణి అయిపోతానని తన యజమానితో ఒప్పందం చేసుకుంటాడు. దీన్ని 'ముకాతబత్ ఒప్పందం' అంటారు. ఈ విధమైన బానిసను ముకాతబ్ బానిస అని పిలుస్తారు. నిర్ణీత మొత్తం యజమానికి చెల్లించగానే ఆ బానిస స్వేచ్ఛ పొందుతాడు. తిర్మిజీ గ్రంథంలో దైవప్రవక్త (సల్లం) ప్రస్తావించిన కొండ పేరు కూడా ఉంది.

దానిపేరు 'సుబైర్'. చెప్పొచ్చేదేమిటంటే రుణాన్ని చెల్లించటం కోసం, ప్రజల నుండి నిరపేక్షతతో ఉండటం కోసం ఈ ప్రార్థన చేసుకుంటూ ఉండటం ఉత్తమం.

١٤٨٨ ـ وَعَنْ عِمْرَانَ بن الحُصَيْن، رَضِيَ اللهُ عَنْهما، أَنَّ النَّبِيَّ ﷺ، عَلَّم أَبَاهُ حُصَيْناً كَلِمَتَيْنِ يَدْعُو بهما: «اللَّهُمَّ أَلْهِمْني رُشْدِي، وَأَعِذْني من شَرِّ نفسي». رَوَاهُ الترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ.

1488. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఆయన తండ్రిగారైన హుసైన్‌కు రెండు ప్రార్థనా వచనాలు నేర్పించారు. వాటితో ఆయన ప్రార్థిస్తూ ఉండేవారు. ఆ రెండు వచనాలు ఇవి: ఓ అల్లాహ్! నా మనసులో సద్బుద్ధిని పుట్టించు. నాకు నా మనసు కీడు నుండి శరణు ఇవ్వు. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

సద్బుద్ధి పుట్టించటమంటే మంచిపనులు చేసే సద్బుద్ధిని ప్రసాదించటం, ప్రతి సందర్భంలోనూ సరైన మార్గాన్ని సూచించటమని అర్థం. మనసు కీడు నుండి రక్షించటమంటే ఇహపరాల వినాశనానికి దారితీసే మనోవాంఛల నుండి కాపాడటమని భావం.

١٤٨٩ ـ وَعَنْ أَبِي الفَضْلِ العبَّاسِ بن عَبْدِ المُطَّلِب، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ: يَارَسُولَ اللهِ! عَلِّمْني شَيْئاً أَسْأَلُهُ اللهَ تَعَالى، قَال: «سَلُوا اللهَ العَافِيَةَ» فَمَكَثْتُ أَيَّاماً، ثُمَّ جِئْتُ فَقُلْتُ: يا رَسولَ اللهِ! عَلِّمْني شَيْئاً أَسْأَلُهُ اللهَ تَعَالى، قَالَ لي: «يَا عَبَّاسُ! يَا عَمَّ رَسولِ اللهِ! سَلُوا اللهَ العَافِيَةَ في الدُّنْيَا وَالآخِرَة». رَوَاهُ الترمذيُّ وقَالَ: حديثٌ حَسَنٌ صَحِيحٌ.

1489. అబుల్ ఫజ్ల్ అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను: "దేవుణ్ణి ప్రార్థించటానికి ఏమైనా (ప్రార్థనా వచనాలు) నేర్పించండి!" అని. అందుకాయన "దేవుణ్ణి క్షేమం ప్రసాదించమని అడగండి" అని ఉపదేశించారు. కొన్ని రోజుల తర్వాత నేను మళ్ళీ ఆయన దగ్గరికెళ్ళి "దైవ ప్రవక్తా! దేవుణ్ణి ప్రార్థించటానికి నాకు ఏమైనా నేర్పించండి" అని అడిగాను. అందుకాయన "దైవప్రవక్త బాబాయి అయిన ఓ అబ్బాస్! దేవుణ్ణి ఇహ

పరాల్లో క్షేమాన్ని ప్రసాదించమని అడగండి" అని ఉపదేశించారు.

(తిర్మిజీ-హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

ఆఫియత్ (క్షేమం)కు సంబంధించిన ప్రార్థనలో ఇహపరాల్లో ప్రశాంతంగా ఉండాలన్న కోరిక కూడా ఇమిడి ఉంది. ఈ విధంగా ఈ ప్రార్థన కూడా చాలా సమగ్రమైనది.

1490. హజ్రత్ షహర్ బిన్ హౌషబ్ కథనం: నేను ఉమ్మె సలమా (రజి అన్హా) ను అడిగాను: "ఓ విశ్వాసుల మాతృమూర్తీ! దైవప్రవక్త (సల్లం) మీ దగ్గర ఉన్నప్పుడు ఎక్కువగా ఏమని ప్రార్థించేవారు?" అని. అందుకామె దైవప్రవక్త (సల్లం) ఎక్కువగా ఈ ప్రార్థన చేసేవారని చెప్పారు:
"హృదయాలను మరల్చేవాడా! నా హృదయాన్ని నీ ధర్మంపై స్థిరంగా ఉంచు." (తిర్మిజీ-హసన్)

١٤٩٠ ـ وَعَنْ شَهْرِ بْنِ حَوشَبٍ قَالَ: قُلْتُ لأُمِّ سَلَمَةَ، رَضِيَ اللهُ عَنْهَا: يَا أُمَّ المؤمِنِينَ! مَا كَانَ أَكْثَرُ دُعَاءِ رَسُولِ اللهِ ﷺ، إذا كَانَ عِنْدَكِ؟ قَالَت: كَانَ أَكْثَرُ دُعَائِهِ: «يَا مُقَلِّبَ القُلُوبِ ثَبِّتْ قَلْبِي عَلَى دِينِكَ» رَوَاهُ الترمذيُّ، وقَالَ حَدِيثٌ حَسَنٌ.

(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

గొప్ప పట్టుదల ఉన్నవారే ధర్మంపై స్థిరంగా నిలబడ గల్గుతారు. అది కూడా దైవసహాయం తోడుంటేనే సాధ్యమవుతుంది. జీవితంలో ఎన్నో ఒడుదొడుకులు ఎదురౌతుంటాయి. అలాంటి సందర్భాల్లో మనిషి ఏ నిమిషం లోనయినా ధర్మం విషయంలో అలసత్వానికి, ఏమరుపాటుకు, భ్రష్టత్వానికి లోనుకావచ్చు. అలాంటి వారికోసం ఈ దుఆ చేయటం చాలా అవసరం. చాలా ఎక్కువగా ఈ ప్రార్థన చేయాలి. ఒకసారి కాదు, వీలైనంతవరకు ఎల్లప్పుడూ దీన్ని పఠిస్తూనే ఉండాలి.

1491. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దావూద్ ప్రవక్త ప్రార్థనల్లో ఇది కూడా ఒకటి:

١٤٩١ ـ وَعَـنْ أَبِـي الـدَّرْدَاءِ، رَضِيَ اللهُ عَنْهُ قال: قَالَ رَسُولُ اللهِ ﷺ: «كَانَ مِن دُعَاءِ دَاوُدَ ﷺ: اللَّهُمَّ إنِّي

أَسْأَلُكَ حُبَّكَ، وَحُبَّ مَن يُحِبُّكَ، وَالعَمَلَ الذي يُبَلِّغُني حُبَّكَ، اللَّهُمَّ اجعَل حُبَّكَ أَحَبَّ إليَّ مِن نَفْسي، وَأَهْلي، وَمِنَ الماءِ البارِدِ» رَوَاهُ الترمذيُّ وَقَالَ: حديثٌ حَسَنٌ.

"ఓ అల్లాహ్! నేను నీ నుండి నీ ప్రేమను, నిన్ను ప్రేమించేవారి ప్రేమను, నన్ను నీ ప్రేమదాకా చేర్చే కర్మను ప్రసాదించమని అడుగుతున్నాను. ఓ అల్లాహ్! నీ ప్రేమను నా కొరకు నా ప్రాణం కన్నా, నా ఆలుబిడ్డల కన్నా, చల్లని నీటికన్నా ప్రియమైనదిగా చెయ్యి." (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

ఈ ప్రార్థనలో దేవుని ప్రేమతోపాటు దేవుని ప్రియదాసుల ప్రేమను, సత్కార్యాల ప్రేమను కూడా అర్థించటం జరిగింది. ఎందుకంటే మనిషికి వీటి మూలంగా కూడా దైవప్రేమ, ఆయన సాన్నిహిత్యం లభిస్తాయి.

١٤٩٢ ـ وَعَنْ أَنَسٍ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَلِظُّوا بِيَاذا الجَلالِ وَالإِكْرَامِ». رواه الترمذي وَرَوَاهُ النَّسَائِيُّ مِن رِوَايَةِ رَبِيعَةَ بْنِ عَامِرٍ الصَّحَابِيِّ، قَالَ الحَاكِمُ: حَدِيثٌ صَحِيحُ الإِسْنَادِ.
«أَلِظُّوا» بكسر اللاّم وتشديد الظاءِ المعجمة مَعْنَاهُ: الزَمُوا هٰذِهِ الدَّعْوَةَ وَأَكْثِرُوا مِنْهَا.

1492. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: 'యా జల్ జలాలి వల్ ఇక్రామ్' అనే మాటను విరివిగా ఉపయోగించండి. (తిర్మిజీ, నసాయీ దీనిని రబీఅ బిన్ ఆమిర్ సహాబీ ఆధారంగా వెలికితీశారు. ఇమామ్ హాకిమ్ ఈ హదీసు ఆధారాలను దృఢమైనవిగా పేర్కొన్నారు.)

'అలిజ్జూ' అంటే "(యా జల్ జలాలి వల్ ఇక్రామ్ అన్న) పిలుపును (మీ ప్రార్థనల్లో) తప్పకుండా పఠించండి. దీన్ని చాలా ఎక్కువగా ఉపయోగించండి" అని అర్థం.

(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

తమ ప్రార్థనల్లో దేవుణ్ణి మాటిమాటికీ 'యాజల్ జలాలి వల్ ఇక్రామ్' అని సంబోధిస్తూ ఉండాలని ఈ హదీసు భావం. ఎందుకంటే ఇందులో దైవస్తోత్రం, ఆయన పరిపూర్ణ గుణవిశేషాలు కీర్తించబడ్డాయి.

١٤٩٣ - وَعَن أبي أُمَامَةَ، رَضِيَ اللهُ عَنهُ قَالَ: دَعَا رَسُولُ اللهِ ﷺ، بِدُعَاءٍ كَثِيرٍ، لَم نَحفَظ مِنهُ شَيئاً؛ قُلنا يا رَسُولَ اللهِ! دَعوتَ بِدُعاءٍ كَثِيرٍ لم نَحفَظ مِنهُ شَيئاً: فَقَالَ: «ألا أدُلُّكُم عَلى ما يَجمَعُ ذٰلك كُلَّهُ؟ تَقُولُ: اللَّهُمَّ إنِّي أسألُكَ مِن خَيرِ ما سَألَكَ مِنهُ نَبِيُّكَ مُحَمَّدٌ ﷺ؛ وأعُوذُ بِكَ مِن شَرِّ ما استَعَاذَ مِنهُ نَبِيُّكَ مُحَمَّدٌ ﷺ، وَأنتَ المُستَعَانُ، وَعَلَيكَ البَلاغُ؛ وَلا حَولَ وَلا قُوَّةَ إلَّا بِاللهِ» رواهُ الترمذيُّ وَقَالَ: حَديثٌ حَسنٌ.

1493. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఎన్నో ప్రార్థనలు చేశారు. మేము వాటిలో ఒక్కటి కూడా గుర్తుంచుకోలేదు. ఓసారి మేము (ఆయన దగ్గరికెళ్ళి) "దైవ ప్రవక్తా! మీరు ఎన్నో ప్రార్థనలు చేశారు. కాని మేము వాటిలో ఒక్కటి కూడా గుర్తుంచుకోలేకపోయాం" అని విన్నవించుకున్నాం. అది విని ఆయన "వాటన్నిటినీ సమీకరించుకున్న ప్రార్థన మీకు తెలుపనా? మీరు ఇలా అనండి" అని ఉపదేశించారు:

"ఓ అల్లాహ్! నేను నీ నుండి నీ ప్రవక్త ముహమ్మద్ (సల్లం)అర్థించిన మేళ్ళను అర్థిస్తున్నాను. నీ ప్రవక్త ముహమ్మద్ (సల్లం) వేటి కీడు నుండి నీ శరణు వేడుకున్నారో వాటి కీడు నుండి నేను నీ శరణు వేడుకుంటున్నాను. సహాయం కోసం అర్థించబడేది నీవే. బాధితుని దగ్గరికి చేరేవాడివి నీవే. మంచి పనులు చేసే శక్తి, చెడుల నుండి కాపాడుకోవటానికి కావలసిన సామర్థ్యం అల్లాహ్ నుండే లభిస్తుంది."

*(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఎక్కువ ప్రార్థనా వచనాలను కంఠస్థం చేసుకోలేనివారు ఈ ప్రార్థనను కంఠస్థం చేసుకోవాలి. అలాంటివారికి ఈ ప్రార్థన చాలా సమగ్రమైనది.

١٤٩٤ - وَعَــن ابْــنِ مَسْعُــودٍ، رَضِــيَ اللهُ عَنْــهُ قَــالَ: كَـانَ مِـن دُعَـاءِ رَسُــولِ اللهِ ﷺ: «اللَّهُــمَّ إنِّـي أَسْـأَلُـكَ مُوجِبَاتِ رَحْمَتِكَ، وَعَزائمَ مَغفِرَتِكَ، وَالسَّلامَةَ مِن كُلِّ إثمٍ، وَالغَنِيمَةَ مِن كُلِّ بِرٍ، وَالفوزَ بِالجَنَّةِ، وَالنَّجَاةَ مِنَ النَّارِ». رواهُ الحاكِم أبو عبدِ اللهِ، وقالَ: حديثٌ صحيحٌ على شرط مسلِمٍ.

1494. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ప్రార్థనల్లో ఇది కూడా ఒకటి: "ఓ అల్లాహ్! నేను నీ నుండి నీ ప్రేమను, నా కొరకు అనివార్యం చేసే విషయాలను, మాకు నీ క్షమాభిక్ష దొరికేలా చేసే ఆచరణల్ని, అన్నిరకాల పాపాల నుండి సురక్షితంగా ఉండటాన్ని, ప్రతి సత్కార్యంలో భాగాన్ని, స్వర్గాన్ని సాధించటంలో విజయాన్ని, నరకాగ్ని నుండి విముక్తిని కోరుకుంటున్నాను." (ఈ హదీసును ఇమామ్ హాకిమ్ అబూ అబ్దుల్లాహ్ ఉల్లేఖించారు. ఆయన దీన్ని ముస్లిం షరతులకు అనుగుణంగా ప్రామాణికమైనదని పేర్కొన్నారు.)

*(హాకిమ్ గారి ముస్తద్రక్ గ్రంథం మొదటి సంపుటి-525)*

## ముఖ్యాంశాలు

షేఖ్ అల్బానీ ఈ హదీసుని బలహీనమైనదిగా పేర్కొన్నారు. వివరాల కోసం అల్బానీ గారిచేత పరిశోధించబడిన రియాజుస్సాలిహీన్ గ్రంథం, జయీఫ్ జామే సగీర్ గ్రంథాలు చూడండి. అయితే కేవలం ఒక ప్రార్థనగా దీని ద్వారా దేవుణ్ణి వేడుకోవచ్చు. ఎందుకంటే ఇందులో దేవుని కరుణను, క్షమాభిక్షను ప్రసాదించిపెట్టే ఆచరణల్ని అవలంబించే సద్బుద్ధి కోసం, స్వర్గసాధనలో విజయం కోసం , నరకం నుండి రక్షణ కోసం ప్రార్థించటం జరిగింది. దేవుడు ఆమోదించుగాక!

**251వ అధ్యాయం**

## ٢٥١ ـ بَابُ فَضْلِ الدُّعَاءِ بِظَهْرِ الْغَيْبِ

## పరోక్ష ప్రార్థన విశిష్టత

قالَ اللهُ تعالى: ﴿وَالَّذِينَ جَاءُو مِنۢ بَعْدِهِمْ يَقُولُونَ رَبَّنَا اغْفِرْ لَنَا وَلِإِخْوَانِنَا الَّذِينَ سَبَقُونَا بِالْإِيمَانِ﴾ [الحشر: ١٠].

وقالَ تعالى: ﴿وَاسْتَغْفِرْ لِذَنبِكَ وَلِلْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ﴾ [محمد: ١٩]. وقالَ تعالى إخباراً عَنْ إبْرَاهِيمَ ﷺ: ﴿رَبَّنَا اغْفِرْ لِي وَلِوَالِدَيَّ وَلِلْمُؤْمِنِينَ يَوْمَ يَقُومُ الْحِسَابُ﴾ [إبراهيم: ٤١].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

వారి తర్వాత వచ్చినవారు ఇలా అంటారు: "ఓ ప్రభూ! మమ్మల్నీ, మాకు పూర్వం విశ్వసించిన మా సోదరులందరినీ క్షమించు." *(హష్ర్:10)*

"నీ పొరపాట్లకు, విశ్వాసులైన స్త్రీపురుషుల పొరపాట్లకు క్షమాభిక్ష వేడుకో." *(ముహమ్మద్: 19)*

దేవుడు (దివ్య ఖుర్‌ఆన్‌లో) ఇబ్రాహీమ్ ప్రవక్త ఈ విధంగా ప్రార్థించారని అంటున్నాడు:

"మా ప్రభూ! నన్నూ, నా తల్లిదండ్రులనూ, విశ్వసించే వారందరినీ లెక్క ఖరారు అయ్యే రోజున క్షమించు." *(ఇబ్రాహీమ్: 41)*

### ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన సూక్తులన్నిటిలోనూ ఇతరుల కోసం వారి గైర్హాజరులో ప్రార్థించటం జరిగింది. దీని ద్వారా ఈ రకమైన పరోక్ష ప్రార్థనకు ఎంతటి విశిష్టత ఉందో అర్థమవుతుంది.

١٤٩٥ ـ وَعَنْ أَبِي الدَّرْدَاءِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَا مِنْ عَبْدٍ مُسْلِمٍ يَدْعُو لأَخِيهِ بِظَهْرِ الْغَيْبِ إلا قَالَ الْمَلَكُ وَلَكَ بِمِثْلٍ» رواه مسلم.

1495. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ దర్దా (రజి) తెలియజేశారు: ఏ ముస్లిం దాసుడైనా తన సోదరుని పరోక్షంలో అతని కోసం ప్రార్థిస్తే దైవ దూత (ఒకడు) 'నీక్కూడా అలాగే జరుగుగాక!' అని దీవిస్తూ ఉంటాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక ముస్లిం తోటి ముస్లిం కోసం అతని పరోక్షంలో ప్రార్థించటం వల్ల స్వయంగా తనకు కూడా ప్రయోజనం కలుగుతుంది. అతను ఇతరుల కోసం ప్రార్థించగానే దైవదూతలు అతని గురించి దేవునికి సిఫారసు చేస్తారు. తను ఇతరుల కోసం కోరుకుంటున్నది తనకు కూడా ప్రాప్తం కావాలని దీవిస్తారు.

١٤٩٦ - وَعَنْهُ أَنَّ رَسُولَ اللهِ كانَ يَقُولُ: «دَعْوَةُ المَرءِ المُسْلِمِ لأخِيهِ بِظَهْرِ الغَيْبِ مُسْتَجَابَةٌ، عِنْدَ رَأْسِهِ مَلَكٌ مُوَكَّلٌ كُلَّمَا دَعَا لأَخِيهِ بِخَيْرٍ قَالَ المَلَكُ المُوَكَّلُ بِهِ: آمِينَ، وَلَكَ بِمِثْلٍ» رواه مسلم.

1496. అబూ దర్దా (రజి)గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ముస్లిం వ్యక్తి తన సోదరుని గైర్హాజరులో అతనికోసం ప్రార్థిస్తే ఆ ప్రార్థన అంగీకరించబడుతుంది. అతని తల దగ్గర ఒక దూత నియమించబడి ఉన్నాడు. ఆ వ్యక్తి తన సోదరుని శ్రేయస్సు కోసం ప్రార్థించినప్పుడల్లా ఆ నియమిత దూత "ఆమీన్, నీక్కూడా అలాగే జరుగుతుంది" అని దీవిస్తుంటాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

252వ అధ్యాయం

# ٢٥٢ ـ بَابٌ فِي مَسَائِلَ مِنَ الدُّعَاءِ

## ప్రార్థనకు సంబంధించి కొన్ని ముఖ్య విషయాలు

١٤٩٧ ـ عَنْ أُسَامَةَ بْنِ زَيْدٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ صُنِعَ إِلَيْهِ مَعْرُوفٌ، فَقَالَ لِفَاعِلِهِ: جَزَاكَ اللهُ خَيْراً، فَقَدْ أَبْلَغَ فِي الثَّنَاءِ». رواه الترمذي وقَالَ: حَدِيثٌ حَسَنٌ صَحِيحٌ.

1497. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: తమపట్ల సద్వ్యవహారం చేసిన వారి కోసం 'జజాకల్లాహు ఖైరా' (దేవుడు నీకు మంచి ప్రతిఫలం ఇవ్వుగాక!) అని ప్రార్థిస్తే, వారిని బాగా పొగిడినట్లే.

*(తిర్మిజీ, హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని బిర్ర్, సిలా అధ్యాయాలు)*

### ముఖ్యాంశాలు

ఉపకారానికి బదులుగా ఉపకారం చేయలేకపోతే కనీసం, 'జజాకల్లాహు ఖైరా' అని అయినా అనాలి. దీని భావం ఏమిటంటే, 'నువ్వు నాకు చేసిన ఉపకారానికి నేను ప్రతిఫలం ఇవ్వలేను. దేవుడే నీకు మంచి ప్రతిఫలం ఇవ్వాలి' అని. దేవుడు ఎవరికయినా మంచి ప్రతిఫలం ఇస్తే ఇక వారికి కావాల్సింది ఏముంది? అందుకే దైవప్రవక్త (సల్లం) అన్నారు- ఈ వేడుకోలు వచనాలు పలికితే చాలు తమకు ఉపకారం చేసిన వారిని చాలా గొప్పగా పొగిడినట్లవుతుంది అని.

١٤٩٨ ـ وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَدعُوا عَلَى أَنْفُسِكُم؛ وَلا تَدْعُوا عَلَى أَولادِكُم، وَلا تَدعُوا عَلى أَمْوَالِكُم، لا تُوَافِقُوا مِنَ اللهِ سَاعَةً يُسأَلُ فِيهَا عَطَاءٌ، فَيَسْتَجِيبَ لَكُم» رواه مسلم.

1498. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మిమ్మల్ని మీరు శపించుకోకండి. మీ పిల్లల్ని శపించకండి. మీ సిరిసంపదలకు శాపనార్థాలు పెట్టకండి. ఎందుకంటే అర్థింపులు అంగీకరించబడటానికి దేవుడు నిర్ణయించిన వేళలో మీరు అలా ప్రార్థించటం

తటస్థిస్తే (దానివల్ల మీకు నష్టం కలగవచ్చు) (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జుహ్ద్, రఖాయిఖ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దేవుడు ప్రతి ఒక్కరి వేడుకోలును ఆలకించి దాన్ని ఆమోదిస్తూ ఉంటాడు. ఈ పరంపర నిత్యం కొనసాగుతూనే ఉంటుంది. అయితే కొన్నికొన్ని వేళల్ని ఆయన ప్రత్యేకించి పెట్టాడు. ఆయావేళల్లో ఆయన దాసుల ప్రార్థనల్ని చాలా ఎక్కువగా ఆమోదిస్తాడు. అందుకని మనిషి ఏ సమయంలోనయినా తననుగాని, తన పిల్లల్నిగాని తన వృత్తినిగాని శపించుకోకూడదు. ఎందుకంటే ప్రార్థనలు అంగీకరించబడే వేళలో ఆ విధంగా శపించుకోవటం జరిగితే ఆ తర్వాత బాధపడాల్సి వస్తుంది.

1499. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి సాష్టాంగ ప్రణామ (సజ్దా) స్థితిలో తన ప్రభువుకు అత్యంత ఎక్కువగా దగ్గర వుతాడు. కనుక (ఆ స్థితిలో) ఎక్కువగా ప్రార్థనలు చేయండి. (ముస్లిం)

١٤٩٩ ـ وعَن أبي هُريرةَ رضيَ اللهُ عنهُ أنَّ رَسولَ اللهِ ﷺ قَالَ: «أَقْرَبُ مَا يَكُونُ العَبْدُ مِن رَبِّهِ وَهُوَ سَاجِدٌ، فَأَكْثِرُوا الدُّعَاءَ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

నఫిల్ నమాజుల్లోని సజ్దాల్లో లేక నమాజ్ బయట ఇతర సజ్దాల్లో ఈ విధంగా ప్రార్థనలు చేయాలని పండితులు అభిప్రాయపడ్డారు.

1500. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరూ 'నేను నా ప్రభువుని ప్రార్థించాను. కాని నా ప్రార్థన అంగీకరించబడలేదు' అంటూ ప్రార్థన స్వీకరణ విషయంలో తొందరపడని

١٥٠٠ ـ وَعَنهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «يُسْتَجَابُ لأَحَدِكُم مَا لَم يَعْجَل: يَقُولُ: قَد دَعَوتُ رَبِّي، فَلَم يُسْتَجَبْ لِي»

متفق عليه. وَفي روايةٍ لمُسْلِم: «لا يَزَالُ يُسْتَجَابُ لِلعَبْدِ مَا لَم يَدْعُ بإثمٍ، أَوْ قَطيعَةِ رَحِمٍ، مَا لَمْ يَسْتَعْجِلْ» قيلَ: يَارَسُولَ اللهِ! مَا الاسْتِعْجَالُ؟ قَالَ: «يقُولُ: قَدْ دَعَوْتُ، وَقَدْ دَعَوْتُ، فَلَمْ أَرَ يَسْتَجِيبُ لِي، فَيَسْتَحْسِرُ عِنْدَ ذلكَ، وَيَدَعُ الدُّعَاءَ».

పక్షంలోనే వారి ప్రార్థన అంగీకరించబడుతుంది. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "దాసుడు పాపకార్యం కోసం లేక బంధువిచ్ఛిత్తి కోసం ప్రార్థించనంత వరకూ అతని ప్రార్థన అంగీకరించబడుతుంది. అయితే అతను ఆ విషయంలో తొందర పడకూడదు."

ఆ మాట విని ఎవరో అడిగారు: "దైవ ప్రవక్తా! తొందరపడటమంటే ఏమిటి?" అని. అందుకాయన ఇలా చెప్పారు: 'దాసుడు నేను ప్రార్థన చేశాను. (ఎన్నోసార్లు) ప్రార్థన చేశాను. కాని నా ప్రార్థన ఏదీ అంగీకరించబడినట్లు కనిపించ లేదు' అంటాడు. ఆ తర్వాత అతను విసిగివేసారి ప్రార్థన చేయటమే మానేస్తాడు. (తొందరపడటమంటే అదే!)."

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మనిషి ఎల్లప్పుడూ దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉండాలి. "నేను చాలా కాలం నుంచి ప్రార్థిస్తున్నాను. కాని ఫలితం ఏమీ కనిపించటం లేదు" అని అనుకోకూడదు. దేవుని కారుణ్యం పట్ల ఎన్నటికీ నిరాశ చెందకూడదు. ఒకవేళ ప్రార్థన స్వీకరణలో కొంత జాప్యం జరిగితే అది తమ మంచికే జరిగిందనుకోవాలి. దాని వాస్తవాలు తమకు తెలియకపోయినా దేవునికి తెలిసివుంటాయి. అందుకని ప్రార్థన అంగీకరించబడినా లేకపోయినా తాము మాత్రం ప్రార్థనను వదలిపెట్టకూడదు. ఎట్టి పరిస్థితుల్లోనయినా అందులో మనిషికి ప్రయోజనమే ఉంటుంది.

١٥٠١ - وَعَنْ أَبِي أُمَامَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قِيلَ لِرَسُولِ اللهِ ﷺ: أَيُّ الدُّعَاءِ أَسْمَعُ؟ قَالَ: «جَوْفَ اللَّيْلِ الآخِرِ، وَدُبُرَ الصَّلَوَاتِ المَكْتُوبَاتِ» رواه الترمذي وقالَ: حديثٌ حسنٌ.

1501. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)ను "ఏ ప్రార్థన అతి ఎక్కువగా అంగీకరించ బడుతుంది?" అని అడగటం జరిగింది. అందుకాయన సమాధాన మిస్తూ, "రాత్రి చివరిజాములో, ఫర్జ్ నమాజుల తర్వాత (చేయబడే) ప్రార్థన (ఎక్కువగా అంగీకరించబడుతుంది)" అని చెప్పారు. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయం)

## ముఖ్యాంశాలు

"జౌఫుల్లైలిల్ ఆఖరి" అంటే రాత్రి చివరి జాము అని అర్థం. జౌఫ్ అనే పదాన్ని గనక మధ్య అనే అర్థంలో తీసుకుంటే అప్పుడు దాని అర్థం 'రాత్రి చివరి అర్ధభాగం మధ్యలో' అని వస్తుంది. ఈ రెండు వేళలూ ఒకే సమయాన్ని సూచిస్తాయి. దాన్నే ఇతర హదీసుల్లో రాత్రిలో చివరి మూడోవంతు భాగంగా పేర్కొనటం జరిగింది. ఆ సమయంలో దేవుడు మొదటి ఆకాశం పైకి వస్తాడు.

ప్రార్థనలు అంగీకరించబడే రెండో సమయం ఫర్జ్ నమాజుల తర్వాతి సమయం. కొంత మంది పండితులు అది నమాజులోని చివరి తషహ్హుద్‌లో దరూద్ తర్వాత సలామ్‌కు ముందు ఉండే సమయం అని అభిప్రాయపడ్డారు. అత్యధిక మంది పండితులు మాత్రం అది సలామ్ చేసి నమాజ్ ముగించిన తర్వాతి సమయం అని అభిప్రాయపడ్డారు. హదీసుని పరిశీలిస్తే ఈ భావమే సరైనదని తెలుస్తోంది. ఆ సమయంలో ప్రతి ఒక్కరూ తమతమ అవసరాలు తీరాలని ప్రార్థన చేసుకోవాలి. అయితే ఈ హదీసుని ఆధారంగా చేసుకొని ఈ రోజుల్లో చాలా చోట్ల జరుగుతున్నట్లు ఫర్జ్ నమాజుల అనంతరం సామూహిక ప్రార్థన చేయటం అభిలషణీయ మని వాదించటం సమంజసం కాదు. ఎందుకంటే ఏ ప్రామాణిక హదీసులోనూ దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చేసినట్లు దాఖలాలు లేవు. అందుకని ఫర్జ్ నమాజుల తర్వాత ఈ విధంగా సామూహిక ప్రార్థనా కార్యాన్ని నిర్వహిస్తూ ఉండటం సమ్మతం కాదు.

١٥٠٢ - وَعَنْ عُبَادَةَ بْنِ الصَّامِتِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَا عَلَى الأَرْضِ مُسْلِمٌ يَدْعُو اللهَ تَعَالى

1502. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: భూమి మీద ఉండే ఏ ముస్లిం అయినా దేవుణ్ణి ఏదైనా ఇవ్వమని

بِدَعْوَةٍ إِلَّا آتَاهُ اللهُ إِيَّاهَا، أَوْ صَرَفَ عَنْهُ مِنَ السُّوءِ مِثْلَهَا مَا لَمْ يَدْعُ بِإِثْمٍ، أَوْ قَطِيعَةِ رَحِمٍ» فَقَالَ رَجُلٌ مِنَ القَوْمِ: إِذاً نُكْثِرُ قَالَ: «اللهُ أَكْثَرُ». رواه الترمذي وقَالَ: حَدِيثٌ حَسَنٌ صَحِيحٌ.

ورَوَاهُ الحَاكِم مِنْ رِوَايَةِ أَبِي سَعِيدٍ، وَزَادَ فِيهِ: «أَوْ يَدَّخِرَ لَهُ مِنَ الأَجْرِ مِثْلَهَا».

ప్రార్థిస్తే దేవుడు అతనికి తప్పకుండా ఇస్తాడు. లేదా దానికి సమానమైన చెడును (బాధను) దేన్నయినా అతని నుండి దూరం చేస్తాడు. అయితే అతను పాపకార్యం కోసమో, బంధు విచ్ఛిత్తి కోసమో ప్రార్థించేవాడయి ఉండ కూడదు.

ఆ మాట విని అక్కడున్నవారిలో ఒకడు, "అలాగయితే ఇక నుంచి మేము చాలా ఎక్కువగా ప్రార్థిస్తూ ఉంటాం" అని అన్నాడు. అందు కాయన "దేవుడు కూడా చాలా ఎక్కు వగా ప్రసాదిస్తాడు. చాలా ఎక్కువగా (ప్రార్థనలు) అంగీకరిస్తాడు" అని బదులిచ్చారు. (తిర్మిజీ-హసన్, సహీహ్)

ఇమామ్ హాకిమ్ ఈ హదీసుని అబూ సయీద్ (రజి) ఆధారంగా వెలికి తీశారు. అందులో ఈ వాక్యం అదనంగా ఉంది: "లేదా అతని కోసం (పరలోకంలో) దానికి సమానమైన పుణ్యం నిధిగా ఉంచబడుతుంది."

*(సుననె తిర్మిజీలోని దావాత్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

1) ఏ విధంగా చూసినా ప్రార్థన వల్ల లాభమేగాని నష్టం లేదు. ముస్లిం వ్యక్తి అడిగిన వస్తువుని దేవుడు అతనికి తప్పకుండా ఇస్తాడు. ఒకవేళ దైవాభీష్టం ప్రకారం ఆ ప్రార్థన అంగీకరించబడకూడదని ఉన్నట్లయితే దానికి బదులుగా భవిష్యత్తులో రాబోయే ఒక ఆపద తొలగిపోతుంది. లేదా దేవుడు పరలోకంలో దానికి సమానంగా పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు.

2) మనిషి దేవుణ్ణి ప్రార్థించే విషయంలో మొహమాట పడకూడదు. బాగా ప్రార్థించాలి. మాటిమాటికీ ప్రార్థిస్తూ ఉండాలి. ఎందుకంటే దేవుణ్ణి ఎంత ప్రార్థించినా ఆయన ఖజానాలో ఏ లోటూ రాదు.

١٥٠٣ - وعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُما أَنَّ رَسُولَ اللهِ ﷺ كَانَ يَقُولُ عِنْدَ الكَرْبِ: «لا إِلٰهَ إِلَّا الله العَظِيمُ الحَلِيمُ، لا إِلٰهَ إِلَّا اللهُ رَبُّ العَرْشِ العَظِيمُ، لا إِلٰهَ إِلَّا اللهُ رَبُّ السَّمٰوَاتِ، وَرَبُّ الأَرْضِ، وربُّ العَرْشِ الكريمِ» متفقٌ عليهِ.

1503. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఆపద సమయంలో ఈ విధంగా ప్రార్థించేవారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడు. ఆయన మహోన్నతుడు, గొప్ప ఉదాత్తుడు, అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. ఆయన మహోన్నత సింహాసనానికి ప్రభువు. అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. ఆయన ఆకాశాలకు ప్రభువు. భూమికీ ప్రభువు. ఇంకా గొప్ప సింహాసనానికి కూడా ప్రభువు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కష్టాలు, ఆపదల సమయాల్లో దేవుణ్ణి స్మరించటం, ఆయన ఏకత్వాన్ని , ఔన్నత్యాన్ని గుర్తుచేసుకోవటం, భౌతిక సాధన సంపత్తిని సమకూర్చుకున్న తర్వాత కేవలం ఆ ఒకే ఒక్కని మీద మొక్కవోని విశ్వాసాన్ని, పట్టుసడలని నమ్మకాన్ని ప్రదర్శించటం మూలంగా మనిషికి ఎంతో ధైర్యం వస్తుంది. అందుకని దైవప్రవక్త (సల్లం) కూడా అలాంటి పరిస్థితుల్లో దేవుని వైపుకు మరలేవారు. ఎందుకంటే సర్వాధికారాలూ ఆ ఒక్క దేవుని చేతుల్లోనే ఉన్నాయి. ఆయన తప్ప ఇతరుల దగ్గర ఏ అధికారమూ లేదు.

**253వ అధ్యాయం**

## ٢٥٣ ـ بَابُ كَرَامَاتِ الأَوْلِيَاءِ وَفَضْلِهِمْ

## వలీల (దేవుని ప్రియదాసుల) మహిమలు, వారి గొప్పదనం

قَالَ اللهُ تَعَالَى: ﴿أَلَآ إِنَّ أَوْلِيَآءَ ٱللَّهِ لَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿٦٢﴾ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَكَانُوا۟ يَتَّقُونَ ﴿٦٣﴾ لَهُمُ ٱلْبُشْرَىٰ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَفِى ٱلْـَٔاخِرَةِ ۚ لَا تَبْدِيلَ لِكَلِمَـٰتِ ٱللَّهِ ۚ ذَٰلِكَ هُوَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ﴾ [يونس: ٦٢ـ ٦٤].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు:

"విను, అల్లాహ్‌కు స్నేహితులైన వారికీ, ఆయనను విశ్వసించి భయభక్తుల వైఖరిని అవలంబించినవారికీ ఏ విధమైన భయంగానీ, విషాదంగానీ కలిగే అవకాశం లేదు. ఇహపర జీవితాలు రెండింటిలో కూడా వారికి శుభవార్తలే శుభవార్తలు. అల్లాహ్ మాటలు మారవు. ఇదే ఘన విజయం." *(యూనుస్: 62-64)*

وقَالَ تَعَالَى: ﴿وَهُزِّىٓ إِلَيْكِ بِجِذْعِ ٱلنَّخْلَةِ تُسَـٰقِطْ عَلَيْكِ رُطَبًا جَنِيًّا ﴿٢٥﴾ فَكُلِى وَٱشْرَبِى﴾ [مريم: ٢٥، ٢٦] وقال تعالى: ﴿كُلَّمَا دَخَلَ عَلَيْهَا زَكَرِيَّا ٱلْمِحْرَابَ وَجَدَ عِندَهَا رِزْقًا ۖ قَالَ يَـٰمَرْيَمُ أَنَّىٰ لَكِ هَـٰذَا ۖ قَالَتْ هُوَ مِنْ عِندِ ٱللَّهِ ۖ إِنَّ ٱللَّهَ يَرْزُقُ مَن يَشَآءُ بِغَيْرِ حِسَابٍ﴾ [آل عمران: ٣٧]. وقَالَ تَعَالَى: ﴿وَإِذِ ٱعْتَزَلْتُمُوهُمْ وَمَا يَعْبُدُونَ إِلَّا ٱللَّهَ فَأْوُۥٓا۟ إِلَى ٱلْكَهْفِ يَنشُرْ لَكُمْ رَبُّكُم مِّن رَّحْمَتِهِۦ وَيُهَيِّئْ لَكُم مِّنْ أَمْرِكُم مِّرْفَقًا ﴿١٦﴾ ۞ وَتَرَى ٱلشَّمْسَ إِذَا طَلَعَت تَّزَٰوَرُ عَن كَهْفِهِمْ ذَاتَ ٱلْيَمِينِ وَإِذَا غَرَبَت تَّقْرِضُهُمْ ذَاتَ ٱلشِّمَالِ﴾ [الكهف: ١٦، ١٧].

"(ఓ మర్యమ్!) నీవు ఈ చెట్టు మొదలు కొంచెం ఊపు. నీపై స్వచ్ఛమైన తాజా ఖర్జూరపు పండ్లు రాల్తాయి. నీవు తిను, త్రాగు." *(మర్యమ్: 25-26)*

"జకరియ్యా మర్యమ్ గదికి పోయినప్పుడల్లా ఆమె వద్ద ఆయన ఏవో కొన్ని భోజన పదార్థములను చూసేవాడు. ఆమెను ఇలా అడిగేవాడు: "మర్యమ్! ఇవి నీ వద్దకు ఎక్కడి నుండి వచ్చాయి?" ఆమె ఇలా జవాబు చెప్పేది: "అల్లాహ్ నుండి వచ్చాయి. అల్లాహ్ తాను కోరిన వారికి లెక్కలేనంత ఉపాధిని ప్రసాదిస్తాడు." *(ఆలి ఇమ్రాన్: 37)*

"మీరు వారితోనూ, అల్లాహ్‌ను కాదని వారు ఆరాధించే దేవుళ్ళతోనూ సంబంధాలను త్రెంచుకున్నారు. కనుక ఇక పదండి, ఫలానా గుహలో ప్రవేశించి ఆశ్రయం పొందండి. మీ ప్రభువు మీపై తన కారుణ్యఛాయను విస్తరింపజేస్తాడు. మీ కార్యసిద్ధికై సకల సామగ్రిని సమకూరుస్తాడు.

వారిని నీవు గుహలో చూసినప్పుడు, సూర్యుడు ఉదయించేటప్పుడు వారి గుహను తాకకుండా కుడి ప్రక్కగా పైకి పోయినట్లునూ, అస్తమించే టప్పుడు వారికి దూరంగా ఎడమ ప్రక్కగా దిగిపోయినట్లునూ నీకు గోచరిస్తుంది."

*(కహఫ్:16,17)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన మొదటి సూక్తిలో దేవుని ప్రియదాసుల సుగుణాలు పొందుపరచ బడ్డాయి. విశ్వాసం, భయభక్తులు గలవారు దేవుని ప్రియదాసులవుతారు. వీరు దైవసన్నిధికి హాజరయినప్పుడు వీరిలో దుఃఖం, భయాందోళనల తాలూకు ఆనవాళ్ళు మచ్చుకైనా కానరావు. ఎందుకంటే ఆ సమయంలో వారి వెంట విశ్వాసం, భయభక్తుల సామగ్రి ఉంటుంది. అదే ప్రళయదినాన మానవుల విముక్తికి దోహదపడుతుంది. రెండో సూక్తిలో దేవుని ప్రియదాసుల వల్ల ఉనికిలోకి వచ్చిన కొన్ని మహిమలు పేర్కొనబడ్డాయి. ఈ రకమైన మహిమల్ని 'కరామాత్' అని అంటారు. అసలు కరామత్ అంటే ప్రకృతి సూత్రాలకు విరుద్ధంగా జరిగేది అని అర్థం. కొన్ని సందర్భాల్లో కొన్ని విషయాలు సాధారణమైన కారణాలు లేకుండానే జరుగుతాయి. ఉదాహరణకు అగ్నికి కాల్చే గుణముంది. అలాంటిది అది కాల్చకుండా ఉండటం. అలాగే ఎండిన చెట్లకూ, కాలం కాని కాలంలో పండ్లు రావు. అయినా ఆ సందర్భాల్లో పండ్లు రావటం-ఇవన్నీ ప్రకృతి సూత్రాలకు విరుద్ధంగా జరిగేవన్నమాట. వలీల, పుణ్యాత్ముల మూలంగా ఇలాంటివి ఉనికిలోకి వస్తే వాటిని 'కరామాత్' అని అంటారు. ఇవి మానవుని అధీనంలోని విషయాలు కావు. దేవుని ప్రియదాసులు ఎప్పుడంటే అప్పుడు వీటిని చేసి చూపించలేరు. వాస్తవానికి ఈ అధికారమంతా దేవుని చేతుల్లోనే ఉంది. ఆయన తాను తలచినప్పుడు తన దాసుల్లో ఎవరిచేత నయినా వీటిని ఉనికిలోనికి రప్పిస్తాడు.

దైవప్రవక్తల అద్భుతాలు (మోజిజాత్‌ల) లాగే ఈ కరామత్‌లు కూడా నిజంగా జరుగుతాయి. అయితే చాలా మంది అనుకుంటున్నట్లు ఒక వ్యక్తి వలీ లేక దైవప్రియుడు అని చెప్పటానికి అది ప్రామాణికత మాత్రం కాదు. దైవం పట్ల భయభక్తులతో పరిపూర్ణ విశ్వాసం కలిగివున్న వాడెవడయినా వలీ కావచ్చు. అందుకు అతను మహిమల్ని సృష్టించాల్సిన అవసరం లేదు. కరామత్ అనేది ఒక వేరే విశిష్టత. దేవుడు తలచుకుంటే ఒక వలీకి ఆ విశిష్టతను కూడా ప్రసాదించ గలడనుకోండి. కాని మహిమల్ని సృష్టించినవాడే వలీ అవుతాడన్న నియమం ఏమీ లేదు. ఇప్పుడు ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు చూడండి.

1504. హజ్రత్ అబూ ముహమ్మద్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) కథనం: అరుగువాసులు (అస్హాబె సుప్ఫా) చాలా పేదవారు.

١٥٠٤ - وَعَنْ أَبِي مُحَمَّدٍ عَبْدِ الرَّحْمٰنِ بْنِ أَبِي بَكْرٍ الصِّدِّيقِ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ أَصْحَابَ الصُّفَّةِ كَانُوا أُنَاساً

فُقَرَاءَ وأنَّ النَّبِيَّ ﷺ قَالَ مَرَّةً: «مَنْ كَانَ عِنْدَهُ طَعَامُ اثْنَيْنِ، فَلْيَذْهَبْ بِثَالِثٍ، وَمَنْ كَانَ عِنْدَهُ طَعَامُ أَرْبَعَةٍ، فَلْيَذْهَبْ بِخَامِسٍ بِسَادِسٍ» أَوْ كَمَا قَالَ، وأَنَّ أَبَا بَكْرٍ رَضِيَ اللهُ عَنْهُ جَاءَ بِثَلاثَةٍ، وَانْطَلَقَ النَّبِيُّ ﷺ بِعَشَرَةٍ، وَأَنَّ أَبَا بَكْرٍ تَعَشَّى عِنْدَ النَّبِيِّ ﷺ، ثُمَّ لَبِثَ حَتَّى صَلَّى العِشَاءَ ثُمَّ رَجَعَ، فَجَاءَ بَعْدَ مَا مَضَى مِنَ اللَّيْلِ مَا شَاءَ اللهُ. قَالَتْ لَهُ امْرَأَتُهُ: مَا حَبَسَكَ عَنْ أَضْيَافِكَ؟ قَالَ: أَوَ مَا عَشَّيْتِهِمْ؟ قَالَتْ: أَبَوْا حَتَّى تَجِيءَ وَقَدْ عَرَضُوا عَلَيْهِم قَالَ: فَذَهَبْتُ أَنَا، فَاخْتَبَأْتُ، فَقَالَ: يَا غُنْثَرُ! فَجدَّعَ وَسَبَّ، وَقَالَ: كُلُوا لَا هَنِيئاً، وَاللهِ! لَا أَطْعَمُهُ أَبَداً، قَالَ: وَايْمُ اللهِ! مَا كُنَّا نَأْخذُ مِنْ لُقْمَةٍ إِلَّا رَبَا مِنْ أَسْفَلِهَا أَكْثَرُ مِنْهَا حَتَّى شَبِعُوا، وَصَارَتْ أَكْثَرَ مِمَّا كَانَتْ قَبْلَ ذٰلِكَ،

ఒకసారి దైవప్రవక్త (సల్లం) "ఎవరి దగ్గ రయినా ఇద్దరికి సరిపోయే అన్నం ఉంటే వారు మూడో వ్యక్తిగా (అరుగు వాసుల్లో) ఎవరినయినా తీసుకెళ్ళాలి. ఎవరి దగ్గరయినా నలుగురి అన్నం ఉంటే వారు ఐదో, ఆరో వ్యక్తిగా ఎవరి నయినా తీసుకెళ్ళాలి" అని ప్రకటిం చారు. దైవప్రవక్త (సల్లం) ఇలాంటి మాటే అన్నట్టు గుర్తుంది. ఆ ప్రకటన తర్వాత అబూబకర్ (రజి) ముగ్గురిని ఇంటికి పిలుచుకొని వెళ్ళారు. దైవ ప్రవక్త (సల్లం) పదిమందిని పిలుచు కొని వెళ్ళారు.

(ఆ రోజు) అబూబక్ర్ (రజి) రాత్రి భోజనం దైవప్రవక్త (సల్లం) ఇంట్లో తిన్నారు. భోజనానంతరం కాసేపు అక్కడే ఉండి ఇషా నమాజు చేసుకొని ఇంటికి బయలుదేరారు. ఆయన ఇంటికి చేరుకునేటప్పటికి కొంత రాత్రి దేవుడు తలచినంత గడచిపోయింది. ఆయన రాగానే ఆయన భార్య ఆయన్ని "అతిథుల్ని ఇంట్లో వదలిపెట్టి ఎక్కడికెళ్ళారూ?" అని అడిగింది. అందుకాయన "నువ్వు వారికి భోజనం పెట్టలేదా ఏమిటి?" అని ఎదురు ప్రశ్నించారు. అందుకామె సంగతిని వివరిస్తూ, "(అది కాదండీ) మీరు వచ్చేదాకా వారు అన్నం తినమని కూర్చున్నారు. ఇంటివారు వారికి

فَنَظَرَ إِلَيْهَا أَبُو بَكْرٍ فَقَالَ لِامْرَأَتِهِ: يَا أُخْتَ بَنِي فِرَاسٍ! مَا هٰذَا؟ قَالَتْ: لَا وَقُرَّةِ عَيْنِي لَهِيَ الآنَ أَكْثَرُ مِنْهَا قَبْلَ ذٰلِكَ بِثَلَاثِ مَرَّاتٍ! فَأَكَلَ مِنْهَا أَبُو بَكْرٍ وَقَالَ: إِنَّمَا كَانَ ذٰلِكَ مِنَ الشَّيْطَانِ، يَعْنِي يَمِينَهُ. ثُمَّ أَكَلَ مِنْهَا لُقْمَةً، ثُمَّ حَمَلَهَا إِلَى النَّبِيِّ ﷺ فَأَصْبَحَتْ عِنْدَهُ. وَكَانَ بَيْنَنَا وَبَيْنَ قَوْمٍ عَهْدٌ، فَمَضَى الأَجَلُ، فَتَفَرَّقْنَا اثْنِي عَشَرَ رَجُلًا، مَعَ كُلِّ رَجُلٍ أُنَاسٌ، اللهُ أَعْلَمُ كَمْ مَعَ كُلِّ رَجُلٍ، فَأَكَلُوا مِنْهَا أَجْمَعُونَ. وَفِي رِوَايَةٍ: فَحَلَفَ أَبُو بَكْرٍ لَا يَطْعَمُهُ، فَحَلَفَتِ الْمَرْأَةُ لَا تَطْعَمُهُ، فَحَلَفَ الضَّيْفُ أَوِ الأَضْيَافُ أَنْ

ఎప్పుడో అన్నం వడించారు" అని చెప్పింది. (కొన్ని ఉల్లేఖనాల్లో ఇంటి వారికి బదులు 'మేము వడ్డించాం' అని ఉంది.) (ఆయన గారు నా మీద విరుచుకు పడతారేమోనని భయంతో) నేను తొందరగా వెళ్ళి దాక్కున్నాను. అప్పుడాయన నన్ను "ఒరేయ్! మూర్ఖుడా! ఎక్కడున్నావ్‌రా?" అని కేకలు పెట్టి పిలిచి తిట్టారు. శాప నార్థాలు పెట్టారు. ఆ తర్వాత (అతిథు లతో) "మీరు తినండి. ఇది మీకు ఆహ్లాదకరం కాకూడదుగాక!" (ఈ మాట ఆయన ఇంటివారు బతిమాలి నప్పటికీ అతిథులు అన్నం తిననం దుకు కోపంలో అని ఉంటారు. కొంత మంది ఆయన ఈ మాట తన ఇంటి వారినే అన్నట్టు అభిప్రాయపడ్డారు.) "దైవం తోడు! నేను ఇది తినలేను" అని అన్నారు.

హదీసు ఉల్లేఖకులు అబ్దుర్రహ్మాన్ ఇలా అంటున్నారు: "దైవం సాక్షి! (ఆ రోజు మేము అన్నం తినేటప్పుడు) పై నుంచి ముద్ద లేపుతుంటే క్రింద నుంచి ఎన్నో రెట్లు అన్నం అందులో చేరుతూ పోయింది. అతిథులందరూ కడుపు నిండా తిన్నారు. ఆ తర్వాత చూస్తే అన్నం పూర్వంకన్నా చాలా ఎక్కువ మోతాదులో ఉంది. అబూబక్ర్ (రజి) అన్నమున్న పాత్ర వైపు చూసి భార్యను,

لَا يَطْعَمَه، أَوْ يَطعَمُوه حَتَّى يَطعَمَه، فَقَالَ أَبُو بَكرٍ: هذِهِ مِنَ الشَّيْطَانِ! فَدَعَا بِالطَّعَامِ، فَأَكَلَ وَأَكَلُوا، فَجَعَلُوا لَا يَرْفَعُونَ لُقْمَةً إِلَّا رَبَتْ مِنْ أَسْفَلِهَا أَكْثَرُ مِنهَا، فَقَالَ: يَا أُخْتَ بَنِي فِرَاسٍ! مَا هٰذَا؟ فَقَالَتْ: وَقُرَّةِ عَيْنِي إِنَّهَا الآنَ لأَكْثَرُ مِنهَا قَبْلَ أَنْ نَأكُلَ، فَأَكَلُوا، وَبَعَثَ بِهَا إِلى النَّبِيِّ ﷺ فَذَكَرَ أَنَّه أَكَلَ مِنهَا. وفي رِوَايَةٍ: إِنَّ أَبَا بَكرٍ قَالَ لِعَبْدِ الرَّحْمٰنِ: دُونَكَ أَضْيَافَكَ، فَإِنِّي مُنْطَلِقٌ إِلى النَّبِيِّ ﷺ، فَافْرُغْ مِنْ قِرَاهُم قَبْلَ أَنْ أَجِيءَ، فَانطَلَقَ عَبْدُ الرَّحْمٰنِ، فَأَتَاهم بِمَا عِنْدَه، فَقَالَ: اطْعَمُوا؛ فَقَالُوا: أَيْنَ رَبُّ مَنْزِلِنَا؟ قَالَ: اطْعَمُوا.

"బనీ ఫిరాస్ సోదరీ! ఏమిటీ ఈ వింత?" అని అడిగారు. అందుకామె "నా కంటి చలువ సాక్షి! (ఇది దైవేతరుల మీద ఒట్టు వేయటం నిషిద్ధం చేయబడక ముందు జరిగిన సంఘటన) ఈ అన్నం పూర్వం కన్నా మూడు రెట్లు పెరిగిపోయింది" అన్నారు. అప్పుడు అబూబక్ర్ (రజి) ఆ అన్నంలో కొంత తిని, తాను అంతకుముందు షైతాన్ (దుష్టప్రేరేపణ) వల్ల ఒట్టు వేశానని చెప్పారు. ఆ తర్వాత అందులో నుంచి ఒక ముద్ద తిని మిగిలింది దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకొని వెళ్ళారు. ఆ అన్నం ఉదయం వరకూ ఆయన దగ్గరే ఉండింది.

(ఆ కాలంలో) మాకు ఇతరులు కొందరితో ఒప్పందం కుదిరి ఉంది. అప్పటికి దాని గడువు ముగిసి పోయింది. మేం పన్నెండు మందిమి (కాపలా పని మీద) వివిధ చోట్లకు వెళ్ళి ఉన్నాం. మాలో ప్రతి ఒక్కని వెంట కొందరు అనుచరులు ఉన్నారు. ఒక్కొక్కని వెంట ఎంతమంది ఉన్నారో దేవునికే బాగా తెలుసు. (దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకువెళ్ళిన) ఆ అన్నాన్ని వాళ్ళందరూ తిన్నారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: అబూబక్ర్ (రజి) తాను అన్నం తిననని ఒట్టేసుకున్నారు. ఆయన భార్య కూడా

قَالُوا: مَا نَحْنُ بِآكِلِينَ حَتَّى يَجِيءَ رَبُّ مَنْزِلِنَا، قَالَ: اقْبَلُوا عَنَّا قِرَاكُم، فَإِنَّهُ إِنْ جَاءَ وَلَمْ تَطْعَمُوا، لَنَلْقَيَنَّ مِنْهُ فَأَبَوْا، فَعَرَفْتُ أَنَّهُ يَجِدُ عَلَيَّ، فَلَمَّا جَاءَ تَنَحَّيْتُ عَنْهُ، فَقَالَ: مَا صَنَعْتُمْ؟ فَأَخْبَرُوهُ، فَقَالَ: يَا عَبْدَ

అన్నం తిననని ఒట్టేసుకుంది. అతిథి లేక అతిథులు కూడా అబూబక్ర్ (రజి) తిననంతవరకు తామూ తినమని ఒట్టేసుకున్నారు. (ఆ తర్వాత) అబూబక్ర్ తాను షైతాన్ మూలంగా ఒట్టేసుకున్నానని చెప్పి అన్నం తెప్పించుకొని తిన్నారు. ఆయన అతిథులు కూడా తిన్నారు. పై నుంచి ముద్ద లేపుతుంటే ఆ అన్నం క్రింద నుంచి ఎన్నో రెట్లు పెరిగిపోతూ ఉండింది. అప్పుడాయన తన భార్యను ఉద్దేశ్యించి, "ఓ బనీ ఫిరాస్ సోదరీ! ఏమిటీ వింత?" అని అడిగారు. అందుకు ఆమె (కూడా ఆశ్చర్యపోతూ) "నా కంటిచలువ సాక్షి! ఈ అన్నం మేము తినకముందు ఎంతుందో ఇప్పుడు దాని కంటే చాలా ఎక్కువగా ఉంది" అన్నారు. అప్పుడు వాళ్ళింటి వారంతా ఆ అన్నం తిన్నారు. ఆ తర్వాత దాన్ని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి పంపించారు. ఉల్లేఖకుడు చెప్పినట్లు దైవప్రవక్త (సల్లం) కూడా ఆ అన్నం తిన్నారు.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: అబూబక్ర్ (రజి) (తన కుమారుడయిన) అబ్దుర్రహ్మాన్‌కు 'నువ్వు మన అతిథుల్ని కనిపెట్టుకొని ఉండు. నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్తున్నాను. నేను తిరిగొచ్చేటప్పటికి అతిథి సత్కారాలన్నీ పూర్తయిపోయి ఉండాలి" అని

الرَّحمٰنِ! فَسَكَتُّ، ثُمَّ قَالَ: يَا عَبْدَ الرَّحمٰنِ! فَسَكَتُّ، فَقَالَ: يَا غُنْثَرُ أَقْسَمْتُ عَلَيْكَ إِنْ كُنْتَ تَسْمَعُ صَوتِي لَمَا جِئْتَ! فَخَرَجْتُ، فَقُلْتُ: سَلْ أَضْيَافَكَ، فَقَالُوا: صَدَقَ، أَتَانَا بِهِ. فَقَالَ: إِنَّمَا انْتَظَرْتُمُونِي وَاللهِ! لَا أَطْعَمُهُ اللَّيْلَةَ، فَقَالَ الآخَرُونَ: وَاللهِ! لَا نَطْعَمُهُ حَتَّى تَطْعَمَهُ، فَقَالَ: وَيْلَكُمْ مَا لَكُمْ

ఆదేశించి వెళ్ళిపోయారు. అబ్దుర్రహ్మాన్ (లోపలికి) వెళ్ళి (తమ దగ్గరవున్న ఆహార పదార్థాలు) తీసుకొనివచ్చి అతిథుల ముందు ఉంచి "తినండి" అని అన్నారు. అందుకు అతిథులు "మన ఇంటాయన ఏరి? ఎక్కడు న్నారు?" అని అడిగారు. అందుకు అబ్దుర్రహ్మాన్ మాట్లాడుతూ, "(ఆయన్ని వదిలేయండి) మీరు మా తరపు నుండి ఆతిథ్యం స్వీకరించండి. ఎందు కంటే, ఒకవేళ మీరు అన్నం తినక ముందే ఆయన (అబూబక్ర్) ఇంటికి వచ్చేసినట్లయితే మాకు తిట్లు పడతాయి (కనుక దయచేసి మీరు మొదలుపెట్టండి)" అని బతిమాలారు. కాని వారు మాత్రం తినడానికి అంగీక రించలేదు.

(ఆ తర్వాత అబ్దుర్రహ్మాన్ ఇలా చెబుతున్నారు:) అప్పుడు నేను ఆయన ఎలాగైనా నన్ను కోపగించుకుంటారని అనుకున్నాను. అందుకని ఆయన ఇంటికి రాగానే నేను (భయపడి) ఓ మూలకెళ్ళి దాక్కున్నాను. ఆయన వచ్చీ రాగానే, "ఏం చేస్తున్నారు? భోజనం అయిందా?" అని అడిగారు. వారు ఆయనకు విషయం చెప్పేశారు. ఆయన (కోపంతో) "ఒరేయ్ అబ్దు ర్రహ్మాన్!" అని కేకవేశారు. నేను నిశ్శబ్దంగా ఉండిపోయాను. ఆయన

لَا تَقْبَلُونَ عَنَّا قِرَاكُم؟ هَاتِ طَعَامَكَ، فَجَاءَ بِهِ، فَوَضَعَ يَدَه، فَقَالَ: بِسْمِ اللهِ. الأولى مِنَ الشَّيطَانِ، فَأَكَلَ وَأَكَلُوا. متفقٌ عليه.

قوله: «غُنْثَر» بِغينٍ معجمةٍ مضمومةٍ، ثُم نونٍ ساكنةٍ، ثم ثاءٍ مثلثةٍ وهو: الغَبِيُّ الجَاهِلُ، وقوله: «فجدَّعَ» أي: شَتَمَه، وَالجَدع: القَطع. قوله: «يَجِدُ علي» هو بكسر الجيمِ أيْ: يَغْضَبُ.

మళ్ళీ "ఒరేయ్ అబ్దుర్రహ్మాన్!" అని కేకవేశారు. అప్పటికీ నేను జవాబు ఇవ్వ లేదు. (మూడోసారి) ఆయన "ఒరేయ్ చవట! వినిపించట్లేదట్రా, త్వరగా బయటికి రా. లేకపోతే ఒట్టే" అని అన్నారు. నేను బయటికి వచ్చి "(నాన్నా! మేము మాత్రం ఏ లోటూ చేయలేదు) కావాలంటే అతిథుల్ని అడిగి చూడండి" అని అన్నాను. అంతలో అతిథులు కల్పించుకొని, "అబ్దుర్రహ్మాన్ చెబుతుంది నిజమే. ఇతను మా దగ్గరికి అన్నం తీసుకు వచ్చాడు" అని చెప్పారు. "అంటే మీరు నా కోసం ఎదురు చూస్తున్నా రన్నమాట. దైవం సాక్షి! ఈ రోజు రాత్రి నేను అన్నం తినను" అని అన్నారు అబూబక్ర్ (రజి). ఆ మాటకు ఇత రులు కూడా "దైవం సాక్షి! మీరు తిన నంతవరకూ మేము కూడా తినము" అని ఒట్టేసుకున్నారు. అందుకు అబూ బక్ర్ (రజి), "ఏంటండి, మా ఆతిథ్యం స్వీకరించమంటే అలా చేస్తారేమిటి? సరే, నా కోసం కూడా అన్నం తీసుకురా (నాయనా)" అని ఆదేశించారు. అబ్దు ర్రహ్మాన్ అన్నం తీసుకురాగానే ఆయన అందులో చేయి ఉంచి "ఇందాక (నేను కోపంలో ఒట్టేసుకున్న స్థితి) షైతాన్ మూలంగా వచ్చింది" అని చెప్పి అన్నం తిన్నారు. ఆయనతోపాటు

ఇతరులు కూడా ఆ అన్నం తిన్నారు.
(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని నమాజు వ్యవధుల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

రియాజుస్సాలిహీన్ గ్రంథ ప్రతుల్లో, "ఫతఫర్రఖ్‌నా ఇస్‌నై అషర రజులన్" అని ఉంది. కాని సహీహ్ ముస్లిం గ్రంథంలో 'ఫఫర్రఖ్‌నా' అని ఉంది. దీని అర్థం మేము పన్నెండుమందిని వేర్వేరు కూటములుగా విభజించాము అని. సహీహ్ బుఖారీ గ్రంథంలో, "ఫఅర్రఫ్‌నా" అని ఉంది. పర్యవేక్షకుణ్ణి నియమించటం అని దీని అర్థం. ముస్లిం గ్రంథ వ్యాఖ్యానంలో ఇమామ్ నవవీ (రహ్మలై) గారు ఈ రెండు పదాలూ సరైనవేనని పేర్కొన్నారు. సైన్యాధ్యక్షుడు, కమాండరు కాక సైన్యపర్యవేక్షణ కోసం, మంచిచెడ్డలు తెలుసుకోవటం కోసం నియమితుడైన ప్రత్యేక అధికారిని 'అరీఫ్' అంటారు. మొత్తానికి దీని భావం ఏమిటంటే ఆ కాలంలో పన్నెండు మందిని అరీఫ్‌లుగా నియమించటం జరిగింది. వారిలో ప్రతి ఒక్కరి వెంట వారి సహాయార్థం కొంతమంది అనుచరులు కూడా ఉండేవారు.

1) హదీసులో వివరించబడిన విధంగా ధార్మిక పాఠశాలల్లో ధార్మిక విద్య నభ్యసించే విద్యార్థుల్ని ప్రజలు తమ ఇండ్లకు పిలుచుకొనివెళ్ళి వారికి అన్నం తినిపించటం చేయవచ్చు. ఇంతకు ముందు కొన్నికొన్ని ప్రాంతాల్లో కొందరు ఈ విధానాన్ని పాటించేవారు. బహుశా ఇప్పటికీ ఎక్కడైనా ఈ విధానం అమల్లో ఉండవచ్చు.

2) పిల్లలకు సంస్కారం నేర్పే ఉద్దేశ్యంతో తండ్రి వారిని మందలించవచ్చు. వారిని తిట్టడం, శాపనార్థాలు పెట్టడంలోనూ తప్పులేదు.

3) ధర్మసమ్మతమైన ఆహార పదార్థాలకు సంబంధించి వాటిని తినమని ఒట్టేసుకోవడంలో తప్పులేదు.

4) ఒకవేళ అంతకంటే మంచి పద్ధతి ఉందనుకుంటే ఒట్టుని భంగం చేసుకొని ఆ పద్ధతిని అవలంబించాలి. అయితే అలాంటి సందర్భంలో ఆ ఒట్టుకి పరిహారం చెల్లించవలసి ఉంటుంది.

5) ఇందులో 'కరామత్' నిజమని నిరూపించబడింది. కొద్దిపాటి అన్నంలోనే దేవుడు ఎంత శుభాన్ని అనుగ్రహిం[illegible]ంటే అబూబక్ర్ ఇంటివారు, ఆయన అతిథులు, దైవప్రవక్త (సల్లం), పన్నెండు [illegible]ంది అరీఫ్‌లు తమ అనుచరుల సమేతంగా అందరూ ఆ అన్నం తిన్నారు. (ఫత్‌హుల్ బారీ, కితాబుల్ మనాఖిబ్)

1505. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీకు పూర్వపు సమాజాల్లో మగతలో దేవుని విషయాలు తెలుసుకునేవారు కొందరుండే వారు. ఒకవేళ నా అనుచర సమాజంలో అలాంటివారు ఎవరైనా ఉంటే ఆయన ఉమర్(రజి). *(బుఖారీ)*

ముస్లిం ఈ హదీసును ఆయిషా (రజి. అన్హా) ఆధారంగా వెలికితీశారు. ఆ రెండు హదీసుల్లోనూ ఇబ్నె వహబ్, ముహద్దసూన్ అంటే ముల్హమూన్ అని అర్థమని పేర్కొన్నారని ఉంది.

١٥٠٥ - وَعَنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قال: قال رَسُولُ اللهِ ﷺ: «لَقَدْ كَانَ فِيمَا قَبْلَكُم مِنَ الأُمَمِ نَاسٌ مُحَدَّثونَ فَإِن يَكُ في أُمَّتي أَحَدٌ، فَإِنَّهُ عُمَرُ» رواه البخاري. ورواه مسلم من رواية عائشة، وفي روايتِهما: قال ابنُ وَهْبٍ: «مُحَدَّثُونَ» أي: مُلْهَمُونَ.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని తరఫు నుండి మనసులో విషయాలు నాటబడేవారిని "ముల్హమూన్" అని అంటారు. ఉదాహరణకు ఒకవేళ శత్రువుల బెడద ఉందనుకుంటే మూసాను నదిలో వదిలేయమని మూసా తల్లికి దేవుని తరఫు నుండి మనసులో ఒక ఆలోచన వచ్చింది. అలాగే మర్యమ్ (అలైహా)కు కూడా మనసులో దేవుని తరఫు నుండి విషయాలు నాటబడుతూ ఉండేవి. ఇవన్నీ కూడా కరామత్‌కు సంబంధించిన వివిధ రూపాలే. పోతే ఈ హదీసు ముఖ్యంగా ఉమర్ (రజి) ఔన్నత్యాన్ని వివరిస్తోంది.

1506. హజ్రత్ జాబిర్ బిన్ సమురా (రజి) కథనం: కూఫావాళ్ళు సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ గురించి ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)కు ఫిర్యాదు చేశారు. దాంతో ఉమర్ (రజి) సాద్‌ను (గవర్నరు) పదవి నుంచి తొలగించి అమ్మార్ (రజి)ని వారికి గవర్నరుగా నియమించారు. కూఫావాళ్ళు సాద్

١٥٠٦ - وَعَنْ جابِرِ بْنِ سَمُرَةَ، رَضيَ اللهُ عَنْهُمَا قَالَ: شَكَا أَهْلُ الكُوفةِ سَعْداً، يَعْني: ابْنَ أَبِي وَقَّاصٍ، رَضيَ اللهُ عَنْهُ، إلى عُمَرَ بْنِ الخَطَّاب، رضيَ اللهُ عَنْهُ، فَعزَله وَاسْتَعْمَلَ عَلَيْهِمْ عَمَّاراً، فَشَكَوْا حَتَّى ذَكَرُوا

أَنَّهُ لَا يُحْسِنُ يُصَلِّي، فَأَرْسَلَ إِلَيْهِ، فَقَالَ: يَا أَبَا إِسْحَقَ! إِنَّ هٰؤُلَاءِ يَزْعُمُوْنَ أَنَّكَ لَا تُحْسِنُ تُصَلِّي، فَقَالَ: أَمَّا أَنَا وَاللهِ! فَإِنِّي كُنْتُ أُصَلِّي بِهِمْ صَلَاةَ رَسُولِ اللهِ ﷺ، لَا أَخْرِمُ عَنْهَا أُصَلِّي صَلَاةَ العِشَاءِ فَأَرْكُدُ فِي الأُوْلَيَيْنِ وَأُخِفُّ فِي الأُخْرَيَيْن، قَالَ: ذٰلِكَ الظَّنُّ بِكَ يَا أَبَا إِسْحَاقَ! وَأَرْسَلَ مَعَهُ رَجُلًا۔ أَوْ رِجَالًا۔

(రజి) గురించి ఎంతగా ఫిర్యాదు చేశారంటే కనీసం ఆయన నమాజు కూడా సరిగా చేయించరని చెప్పారు. అప్పుడు ఉమర్ (రజి) ఆయన్ని పిలిపించి "అబూ ఇస్హాఖ్! (ఇది సాద్ మారుపేరు.) వీళ్ళు నువ్వు నమాజ్ సరిగ్గా చేయించటం లేదని అంటున్నారేమిటి?" అని అడిగారు. అందుకు సాద్ ఇలా బదులు చెప్పారు: "నేనా.... దైవం సాక్షి! నేను మాత్రం వీరికి దైవ ప్రవక్త (సల్లం) చేయించిన విధంగా నమాజ్ చేయించేవాణ్ణి. అందులో నేను ఎలాంటి లోపం రానిచ్చేవాణ్ణి కాదు. నేను మగ్రిబ్, ఇషా నమాజులు చేయిస్తాను. మొదటి రకాతుల్లో చాలా సేపు నిలబడతాను. ఆ తర్వాతి రకాతుల్లో తక్కువసేపు నిలబడతాను." ఆయన సమాధానం విని ఉమర్(రజి), "అబూ ఇస్హాఖ్! మీా గురించి నేననుకున్నదీ అదే!" అని అన్నారు.

ఆ తర్వాత ఉమర్ (రజి) సాద్ (రజి)పై వచ్చిన ఆరోపణల గురించి విచారించటానికి ఆయనవెంట ఒక వ్యక్తిని (లేక) కొంతమందిని కూఫా పంపించారు. వారు కూఫాలోని అన్ని మస్జిదులు తిరిగి ఆయన గురించి ప్రజలను విచారించారు. అందరూ ఆయన మంచి తనాన్ని కొనియాడారు. అయితే వారు

إلى الكُوفَةِ يَسْأَلُ عَنْهُ أَهْلَ الكُوفَةِ، فَلَمْ يَدَعْ مَسْجِداً إلَّا سَأَلَ عَنْهُ، وَيُثْنُونَ مَعْرُوفاً، حَتَّى دَخَلَ مَسْجِداً لِبَنِي عَبْسٍ، فَقَامَ رَجُلٌ مِنْهُمْ، يُقَالُ لَهُ أُسَامَةُ بْنُ قَتَادَةَ، يُكَنَّى أَبَا سَعْدَةَ، فَقَالَ: أَمَا إِذْ نَشَدْتَنَا فَإِنَّ سَعْداً كَانَ لَا يَسِيرُ بِالسَّرِيَّةِ وَلَا يَقْسِمُ بِالسَّوِيَّةِ، وَلَا يَعْدِلُ فِي القَضِيَّةِ، قَالَ سَعْدٌ: أَمَا وَاللهِ! لأَدْعُوَنَّ بِثَلَاثٍ: اللَّهُمَّ إِنْ كَانَ عَبْدُكَ هذا كَاذِباً، قَامَ رِيَاءً، وَسُمْعَةً، فَأَطِلْ عُمُرَهُ، وَأَطِلْ فَقْرَهُ، وَعَرِّضْهُ لِلفِتَنِ. وَكَانَ بَعْدَ ذلِكَ إذا سُئِلَ يَقُولُ: شَيْخٌ كَبِيرٌ مَفْتُونٌ، أَصَابَتْنِي دَعْوَةُ سَعْدٍ. قَالَ عَبْدُ المَلِكِ بْنُ عُمَيْرٍ الرَّاوِي عَنْ جَابِرِ بْنِ سَمُرَةَ: فَأَنَا رَأَيْتُهُ بَعْدُ قَدْ سَقَطَ حَاجِبَاهُ عَلَى عَيْنَيْهِ مِنَ الكِبَرِ، وَإِنَّهُ لَيَتَعَرَّضُ لِلجَوَارِي فِي الطُّرُقِ فَيَغْمِزُهُنَّ. متفقٌ عليه.

బనూ అబస్‌కు చెందిన మస్జిద్‌కు వెళ్ళి విచారించినప్పుడు అక్కడి నమాజీల్లో ఉసామా బిన్ ఖతాదా అనబడే వాడొకడు (అతని మారుపేరు అబూ సాద) లేచి, "మీరు అడిగారు కనుక చెబుతున్నాను. సాద్ సైనిక దళాలతో కలిసి యుద్ధానికి పోరు. (యుద్ధ సొత్తును) సమానంగా పంచరు. వ్యవహారాలు విచారించినప్పుడు న్యాయంగా తీర్పివ్వరు" అని అన్నాడు.

అది విని సాద్(రజి) "అలాగయితే నేను కూడా ఇతనికి మూడు శాపాలు పెడ్తాను (ఇతను సత్యవంతుడయితే ఆ శాపాలకు గురికాకుండా ఉంటాడు)" అని చెప్పి, "ఓ అల్లాహ్! ఈ నీ దాసుడు అబద్ధం చెబుతున్నట్లయితే, పేరు ప్రతిష్ఠల కోసం, ప్రజల ముందు తన గొప్పదనాన్ని చాటుకోవటం కోసం నా మీద నిందలు మోపటానికి నిలబడినట్లయితే ఇతనికి దీర్ఘాయుషును ప్రసాదించు. దీర్ఘకాల దారిద్ర్యానికి లోనుచేయి, ఇంకా ఇతన్ని పరీక్షలకు గురిచెయ్యి" అని ప్రార్థించారు. (చివరికి ఆయన శపించినట్లుగానే జరిగింది). ఆ తర్వాత ఎవరైనా అతన్ని అతని పరిస్థితి గురించి అడిగితే, "నేను చాలా ముసలోణ్ణయిపోయాను, పరీక్షలకు గుర్రై ఉన్నాను. నాకు సాద్ శాపం తగిలింది" అని అనేవాడు.

జాబిర్ బిన్ సమురా (రజి) నుండి ఈ హదీసును ఉల్లేఖించిన అబ్దుల్ మలిక్ బిన్ ఉమైర్ ఇలా అంటున్నారు: ఆ తర్వాతి రోజుల్లో నేనతన్ని చూశాను. వృద్ధాప్యం వల్ల అతని కనురెప్పలు వ్రేలాడిపోయి కళ్ళమీద పడ్డాయి. అతను దారులవెంట వచ్చేపోయే అమ్మాయిలను అల్లరిపెడ్తూ వారికి సైగలు చేసేవాడు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మొదటి విషయం, ఈ హదీసులో సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ ఘనత వివరించబడింది. ఆయన చేసే ప్రార్థనలు అంగీకరించబడేవి. రెండోది, ఎవరి గురించయినా విచారణ జరపదలచినప్పుడు సజ్జనుల్ని, సంస్కరణా భావం కలవారిని అడగాలి. ఉదాహరణకు ఈ హదీసులో కూఫాలోని మస్జిదులకు వెళ్ళి నమాజీలను విచారించటం జరిగింది. మూడోది, సముచితమని భావించినప్పుడు ప్రభుత్వాధికారులను మార్చటంలో తప్పులేదు. ఉదాహరణకు ఈ హదీసులో సాద్ (రజి)ని పదవి నుంచి తొలగించటం జరిగింది. నిజానికి ఆయన మీద వచ్చిన ఆరోపణలన్నీ అబద్ధమైనవి. అయినప్పటికీ ఉమర్ (రజి) పరిస్థితుల స్వరూపం దృష్ట్యా ఆయన్ని పదవీచ్యుతుణ్ణి చేసి కూఫావారికి మరో కొత్త గవర్నరును నియమించటమే సముచితమని భావించారు. నాల్గోది, ఇందులో 'కరామత్' అనేది సత్యమని నిరూపించబడింది. ఎలాగంటే సాద్ (రజి) గారు పెట్టిన మూడు శాపాలూ ఆమోదించబడ్డాయి.

١٥٠٧ - وَعَنْ عُرْوَةَ بنِ الزُّبَيْرِ أَنَّ سَعِيدَ بْنَ زَيْدِ بْنِ عَمْرِو بْنِ نُفَيْلٍ، رَضِيَ اللهُ عَنْهُ خَاصَمَتْهُ أَرْوَى بِنْتُ أَوسٍ إلى مَرْوَانَ بنِ الحَكَمِ. وَادَّعَتْ أَنَّهُ أَخَذَ شَيْئاً مِنْ أَرْضِهَا، فَقَالَ سَعِيدٌ: أَنَا كُنْتُ آخُذُ مِنْ

1507. హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్(రజి) కథనం: సయీద్ బిన్ జైద్ బిన్ అమ్ర్ బిన్ నుఫైల్ (రజి)తో అర్వా బిన్తె ఔస్ (అనే స్త్రీ) వాదులాడి ఆ వివాదాన్ని మర్వాన్ బిన్ హకమ్ (మదీనా గవర్నరు) దృష్టికి తీసుకెళ్ళింది. సయీద్ తన భూమిలోని కొంతభాగాన్ని ఆక్రమించారని ఫిర్యాదు చేసింది.

أَرْضِهَا شَيْئاً بَعْدَ الَّذِي سَمِعْتُ مِنْ رَسُولِ اللهِ ﷺ؟! قَالَ: مَاذَا سَمِعْتَ مِنْ رَسُولِ اللهِ ﷺ؟ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ أَخَذَ شِبْراً مِنَ الأَرْضِ ظُلْماً، طُوِّقَهُ إِلى سَبْعِ أَرَضِينَ» فَقَالَ لَهُ مَرْوَانُ: لَا أَسْأَلُكَ بَيِّنَةً بَعْدَ هذا، فَقَالَ سَعِيدٌ: اللَّهُمَّ! إِنْ كَانَتْ كَاذِبَةً، فَأَعْمِ بَصَرَهَا، وَاقْتُلْهَا فِي أَرْضِهَا، قَالَ: فَمَا مَاتَتْ حَتَّى ذَهَبَ بَصَرُهَا، وَبَيْنَمَا هِيَ تَمْشِي فِي أَرْضِهَا إِذْ وَقَعَتْ فِي حُفْرَةٍ فَمَاتَتْ. متفقٌ عليه. وفي روايةٍ لمسلمٍ عَنْ مُحَمَّدِ بْنِ زَيْدِ بْنِ عَبْدِ اللهِ بْنِ عُمَرَ بِمَعْنَاهُ وَأَنَّهُ رَآهَا عَمْيَاءَ تَلْتَمِسُ الجُدُرَ تَقُولُ: أَصَابَتْنِي دَعْوَةُ سَعِيدٍ، وَأَنَّهَا مَرَّتْ عَلَى بِئْرٍ فِي الدَّارِ الَّتِي خَاصَمَتْهُ فِيهَا، فَوَقَعَتْ فِيهَا، فَكَانَتْ قَبْرَهَا.

దానికి సయీద్ (నిర్ఘాంతపోయి) "దైవ ప్రవక్త (సల్లం) నోట (హెచ్చరిక) విన్న నేను ఈవిడ భూమిని ఆక్రమించ గలనా?" అని అన్నారు. అప్పుడు మర్వాన్ (రజి) అడిగారు: "దైవప్రవక్త (సల్లం) నోట మీరు ఏం (హెచ్చరిక) విన్నారు?" అని. అందుకాయన దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా చెబు తుండగా తాను విన్నానని చెప్పారు: "ఎవరయితే అక్రమంగా జానెడు భూమిని ఆక్రమించుకుంటాడో, ప్రళయదినాన ఏడు భూముల హారాన్ని వారి మెడలో (గుదిబండగా) వేయటం జరుగుతుంది."

అది విని మర్వాన్ "ఇక మిమ్మల్ని నేను ఏ ఆధారం అడగను" అని అన్నారు. అప్పుడు సయీద్ (రజి) ఆమెను ఈ విధంగా శపించారు: "ఓ అల్లాహ్! ఈ స్త్రీ గనక అబద్ధం చెబుతున్నట్లయితే నీవు ఈమె చూపుని పోగొట్టు. ఈమెను ఈవిడ భూమిలోనే చావుకి గురిచేయి."

ఉర్వా (రజి) ఇలా అంటున్నారు: ఆ స్త్రీ మరణానికి ముందు ఆమె చూపు పోయింది. ఒకసారి ఆమె తన స్థలంలో నడుస్తుండగా ఒక గోతిలో పడి చచ్చి పోయింది. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలో ఇదే అర్థాన్నిచ్చే వేరొక హదీసు ఉంది. అది ముహమ్మద్ బిన్

జైద్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ నుండి ఉల్లేఖించబడింది. అందులో ఇలా ఉంది: ఒకసారి ఆ స్త్రీ అంధురాలై గోడలు వెతుక్కుంటూ నడుస్తుండగా ముహమ్మద్ బిన్ జైద్ చూశారు. అప్పుడామె తనకు సయీద్ శాపం తగిలిందని చెప్పుకుంటూ పోసాగింది. ఒకసారి ఆమె ఒకప్పుడు తాను గొడవపడ్డ స్థలంలోనే బావి దగ్గర్నుండి వెళ్తూ అందులో పడి మరణించింది. ఆ భూభాగమే ఆమెకు సమాధి అయింది.

*(సహీహ్ బుఖారీలోని సృష్టిఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ముసాఖాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సయీద్ బిన్ జుబైర్ (రజి) చాలా గొప్ప సహాబీ. ఇహలోకంలోనే స్వర్గశుభవార్త విన్న పదిమంది దైవప్రవక్త సహచరుల్లో ఈయన కూడా ఒకరు. మర్వాన్ బిన్ హకమ్ హసన్, హుసైన్‌లలాగా చిన్న సహచరుల కోవకు చెందినవారు. ఈయన ముఆవియా (రజి) ఖిలాఫత్ కాలంలో మదీనా నగరానికి గవర్నరుగా ఉండేవారు. హదీసులో వివరించబడిన సంఘటన ఆ కాలంలో జరిగినదే. యజీద్ కుమారుడు ముఆవియా బిన్ యజీద్ తర్వాత ఈయన కొన్ని నెలలపాటు ముస్లింల ఖలీఫాగా కూడా ఉన్నారు. ఈ హదీసులో సయీద్ బిన్ జైద్ ఘనత వివరించబడింది. ఆయన చేసే ప్రార్థనలు అంగీకరించబడేవి. ఇది ఆయన 'కరామత్'కు నిదర్శనం.

2) బాధితుని శాపం కొన్ని సందర్భాల్లో వెంటనే ఆమోదించబడుతుంది. అందుకని పుణ్యపురుషుల శాపాలకు గురికాకుండా ఉండాలంటే వారిని బాధించకుండా జాగ్రత్తపడాలి.

١٥٠٨ ـ وَعَنْ جَابِرِ بْنِ عَبْدِ الله رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: لَمَّا حَضَرَتْ أُحُدٌ دَعَانِي أَبِي مِنَ اللَّيْلِ فَقَالَ: مَا أُرَانِي إلَّا مَقْتُولًا فِي أَوَّلِ مَنْ يُقْتَلُ مِنْ أَصْحَابِ النَّبِيِّ ﷺ، وَإِنِّي لا أَتْرُكُ بَعْدِي أَعَزَّ عَلَيَّ

1508. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం: ఉహుద్ యుద్ధం సంభవించినప్పుడు మా నాన్న (అబ్దుల్లాహ్) రాత్రివేళ నన్ను పిలిచి "(బాబూ) రేపు యుద్ధంలో మొట్టమొదట హతులయ్యే దైవప్రవక్త సహచరుల్లో నేను

مِنْكَ غَيْرَ نَفْسِ رَسُولِ اللهِ ﷺ، وَإِنَّ عَلَيَّ دَيْناً فَاقْضِ، وَاسْتَوْصِ بِأَخَوَاتِكَ خَيْراً فَأَصْبَحْنَا، فَكَانَ أَوَّلَ قَتِيلٍ؛ وَدَفَنْتُ مَعَهُ آخَرَ فِي قَبْرِهِ، ثُمَّ لَمْ تَطِبْ نَفْسِي أَنْ أَتْرُكَهُ مَعَ آخَرَ. فَاسْتَخْرَجْتُهُ بَعْدَ سِتَّةِ أَشْهُرٍ، فَإِذَا هُوَ كَيَوْمَ وَضَعْتُهُ غَيْرَ أُذُنِهِ، فَجَعَلْتُهُ فِي قَبْرٍ عَلَى حِدَةٍ. رواه البخاري.

కూడా ఉంటానని నాకనిపిస్తోంది. ఇప్పుడు నేను వదలి వెళుతున్నవారిలో దైవప్రవక్త (సల్లం) తర్వాత నాకు నీకంటే ప్రియమైనవారు మరెవరూ లేరు. నాకు కొంత అప్పు ఉంది. నువ్వు దాన్ని మర్చిపోకుండా తీర్చు. నీ అక్కా చెల్లెళ్ళపట్ల మేలైన రీతిలో మెలగు" అని చెప్పారు.

తెల్లవారిన తర్వాత చూస్తే అందరికన్నా ముందు మా నాన్నే హతులై ఉన్నారు. నేనాయనతోపాటు వేరొకతన్ని కూడా ఉంచి ఖననం చేశాను. అయితే మా నాన్నను వేరొకతనితో పాటు సమాధిలో అలాగే ఉంచేయటం నా మనసుకు నచ్చలేదు. అందుకని ఆరునెలల తర్వాత నేనాయన్ని (సమాధి నుండి) బయటికి తీశాను. అప్పుడు ఆయన చెవులు తప్ప మిగిలిన శరీరం మొత్తం మొదటిరోజు మేము ఎలా ఉంచామో అలాగే ఉంది. నేను ఆయన్ని (ఆయన భౌతికకాయాన్ని) వేరొక సమాధిలో ఉంచి ఖననం చేశాను. *(బుఖారి)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మొదటిది, ఇందులో సహాబీలకు దైవప్రవక్త (సల్లం) పట్ల ఉండిన అపారప్రేమాభిమానాలు, ఆంతరంగిక అనుబంధం వివరించబడ్డాయి. ఆ అనుబంధం వారి దృష్టిలో ప్రపంచంలోని అన్ని వస్తువులకంటే, ఆఖరికి తమ ధనప్రాణాలు, తమ సంతానం కంటే కూడా చాలా గొప్పది. రెండోది, వారు నిత్యం షహాదత్ (వీరమరణం) కోసం ఉవ్విళ్ళూరుతూ ఉండేవారు. మూడోది, తాను అమరగతి నొందబోతున్నానన్న సంగతి జాబిర్ (రజి)కు ముందుగానే

అర్థమయిపోయింది. నాల్గోది, ఆరు నెలల తర్వాత కూడా ఆయన భౌతిక కాయంలో ఎలాంటి మార్పూ రాలేదు. ఇది ఆయన కరామతు. ఐదోది, ఈ హదీసు ద్వారా అవసరమైనప్పుడు సమాధిలో నుండి శవాన్ని బయటికి తీయటం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. అయితే శవాన్ని సమాధి చేసి ఎక్కువకాలం జరగకుండా ఉండి, శవం అప్పటిదాకా సురక్షితంగా ఉంటుందన్న నమ్మకం ఉన్నప్పుడే సమాధిని త్రవ్వాలి.

١٥٠٩ - وَعَن أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَجُلَيْنِ مِنْ أَصْحَابِ النَّبِيِّ ﷺ خَرَجَا مِنْ عِنْدِ النَّبِيِّ ﷺ فِي لَيْلَةٍ مُظْلِمَةٍ وَمَعَهُمَا مِثْلُ المِصْبَاحَيْنِ بَيْنَ أَيْدِيهِمَا، فَلَمَّا افتَرَقَا، صَارَ مَعَ كُلِّ وَاحِدٍ منهما وَاحِدٌ حَتى أَتَى أَهْلَهُ. رواه البخاري مِنْ طُرُقٍ؛ وَفِي بَعْضِها أَنَّ الرَّجُلَيْنِ أُسَيْدُ بنُ حُضَيرٍ؛ وَعَبَّادُ بنُ بِشرٍ رَضِيَ اللهُ عَنْهُمَا.

1509. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త సహచరుల్లో ఇద్దరు బాగా చీకటిగా వున్న ఒక రాత్రి దైవప్రవక్త (సల్లం) దగ్గరి నుంచి (తమ ఇండ్లకు) బయలుదేరారు. వారు బయలుదేరినప్పుడు వారి ముందు దీపంలాంటి ఒక వస్తువు కూడా బయలుదేరింది. అది వారివెంట నడుస్తూ ఉంది. ఆ తర్వాత (తమ దారులు వేరవగానే) వారిద్దరూ విడిపోయారు. అప్పుడు వారిద్దరి వెంట చేరో దీపం బయలుదేరింది. (వాటి వెలుతురులోనే) వారిద్దరూ ఇంటికి చేరుకున్నారు.

బుఖారీ ఈ హదీసును ఎన్నో ఆధారాల ద్వారా సేకరించారు. వాటిలో కొన్ని ఉల్లేఖనాల ప్రకారం ఆ ఇద్దరు మనుషులు 'ఉసైద్ బిన్ హుజైర్' మరియు 'అబ్బాద్ బిన్ బిష్ర్' అని తెలుస్తోంది.

*(సహీహ్ బుఖారీలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దీపం లాంటి వస్తువంటే ఏమిటి? వారి చేతికర్రలు దీపం లాగా వెలుగుతూ ఉన్నాయనీ, దాని వెలుతురులో వారు దారిలోని ఎత్తుపల్లాలు చూసుకొని నడిచేవారని కొంతమంది అంటున్నారు. మరికొంతమంది అది ప్రవక్తృత్వపు జ్యోతి అని చెబుతున్నారు. ఏమైనప్పటికీ అది ఆ ఇద్దరు సహచరుల కరామత్. దైవప్రవక్త (సల్లం) గారి మహిమ (మోజిజా).

١٥١٠ - وَعَنْ أَبِي هُرَيْرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: بَعَثَ رَسُولُ اللهِ ﷺ عشَرَةَ رَهْطٍ عَيْناً سَرِيَّة، وَأَمَّرَ عَلَيْهِم عَاصِمَ بنَ ثَابِتٍ الأَنصَارِيَّ، رَضِيَ اللهُ عَنْهُ، فَانطَلَقُوا حَتَّى إذا كَانُوا بِالهَدَأَةِ، بَيْنَ عُسْفَانَ وَمَكَّةَ؛ ذُكِرُوا لِحَيٍّ مِنْ هُذَيْلٍ يُقَالُ لَهُمْ: بَنُو

1510. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) పది మందితోకూడిన ఒక సైనిక పటాలాన్ని గూఢచర్యం చేయటం కోసం పంపించారు. ఆసిమ్ బిన్ సాబిత్ అన్సారీ (రజి)ని వారికి నాయకునిగా నియమించారు. వారు బయలుదేరి ఉస్ఫాన్, మక్కాల మధ్యనున్న 'హద్అ' ప్రాంతానికి చేరుకునేసరికి బనూ లిహ్యాన్ అనబడే హుజైల్‌కు చెందిన ఒక తెగవారికి ఈ సైనికపటాలం గురించి సమాచారం అందింది. వెంటనే వారు దాదాపు వందమంది విలుకాండ్రతో ఆ సైనిక పటాలాన్ని ఎదుర్కోవటానికి బయలుదేరారు. వారి అడుగుల గుర్తుల వెంట నడుస్తూ వారి సమీపానికి చేరుకున్నారు. ఆసిమ్ మరియు ఆయన అనుచరులు వారి రాకను పసిగట్టి ఒకచోట దాక్కున్నారు. (ఈ విషయం తెలుసుకున్న) బనూ లిహ్యాన్ అనుచరులు వారిని చుట్టుముట్టి "క్రిందికి దిగి వచ్చి మాకు లొంగిపోండి. మేము మీతో ఒప్పందం చేసుకుంటాం. మీలో ఎవరినీ హతమార్చమని మీకు మాటిస్తున్నాం" అని అన్నారు. అందుకు ఆసిమ్ (రజి) "ప్రజలారా! నేను మాత్రం అవిశ్వాసుల ప్రమాణాన్ని నమ్మి లొంగిపోను. ఓ అల్లాహ్! నీవు మా గురించి నీ ప్రవక్తకు తెలియపరచు" అని అన్నారు. ఆయన

لِحْيَانَ، فَنَفَرُوا لهم بِقَرِيبٍ مِنْ مِائَةِ رَجُلٍ رَامٍ، فَاقْتَصُّوا آثَارَهُمْ، فَلَمَّا أَحَسَّ بِهِمْ عَاصِمٌ وَأَصْحَابُهُ، لَجَؤُوا إِلى مَوْضِعٍ، فَأَحَاطَ بِهِمُ القَوْمُ، فَقَالُوا انزِلوا، فَأَعطُوا بِأَيْدِيكُم وَلَكُمُ العَهْدُ وَالمِيثَاقُ أَنْ لَا نَقْتُلَ مِنكم أَحداً فَقَالَ عَاصِمُ بنُ ثَابِتٍ: أَيُّهَا القومُ! أَمَّا أَنَا، فَلَا أَنْزِلُ عَلى ذِمَّةِ كَافِرٍ، اللَّهُمَّ أخبِرْ عَنَّا نَبِيَّكَ ﷺ، فَرَمَوْهُمْ بِالنَّبْلِ فَقَتَلُوا عَاصِماً، وَنَزَلَ إِلَيْهِمْ ثَلاثَةُ نَفَرٍ عَلَى العَهدِ والمِيثَاقِ، مِنْهُمْ خُبَيْبٌ، وَزَيْدُ بْنُ الدَّثِنةِ وَرَجُلٌ آخَرُ. فَلَمَّا اسْتَمْكَنُوا مِنْهُمْ أَطْلَقُوا أَوْتَارَ قِسِيِّهِمْ، فَرَبَطُوهُمْ بها. قَالَ الرَّجُلُ الثَّالِثُ: هذا أَوَّلُ الغَدْرِ والله! لَا أَصْحَبُكُمْ إِنَّ لي بِهؤُلاءِ أُسْوَةً، يُرِيدُ القَتْلَى، فَجَرُّوهُ وعَالَجُوهُ، فَأَبَى أَنْ يَصْحَبَهُمْ، فَقَتَلُوهُ، وَانْطَلَقُوا بِخُبَيْبٍ،

ఆ మాట అనగానే శత్రువులు ఆయన మీద బాణాల వర్షం కురిపించి ఆయన్ని హతమార్చారు.

ముగ్గురు మాత్రం వారి మాట మీద వారి ప్రమాణాన్ని నమ్మి లొంగి పోయారు. వారిలో ఒకరు ఖుబైబ్. రెండో ఆయన జైద్ బిన్ దసినా. వీరితో పాటు మూడో వ్యక్తి ఇంకొకరు ఉన్నారు. శత్రువులు వారిని పట్టుకొని వారి వింటి నారులను విప్పదీసి వాటితోనే వారిని కట్టేశారు. మూడో వ్యక్తి అది చూసి, "ఇది మీరు చేస్తున్న మొదటి వాగ్దాన భంగం. దైవం సాక్షి! నేను మీవెంట రాను. ఈ మరణించిన వారే నాకు ఆదర్శప్రాయులుగా కనిపిస్తున్నారు" అని అన్నాడు. శత్రువులు ఆయన్ని లాగి ఈడ్చుకెళ్ళటానికి ప్రయత్నించారు. కాని ఆయన మాత్రం వారివెంట వెళ్ళటానికి నిరాకరించారు. దాంతో శత్రువులు ఆయన్ని కూడా హతమార్చారు. మిగిలిన ఖుబైబ్ మరియు జైద్ బిన్ దసినాను తమ వెంట తీసుకొని వెళ్ళారు. ఆ తర్వాత బద్ర్ యుద్ధానంతరం వారిద్దరినీ మక్కాలో అమ్మేశారు. ఖుబైబ్‌ను హారిస్ బిన్ ఆమిర్ బిన్ నౌఫల్ బిన్ అబ్దె మనాఫ్ కుమారులు కొనుక్కున్నారు. ఆయన బద్ర్ యుద్ధం నాడు హారిస్‌ను హతమార్చి ఉన్నారు. ఖుబైబ్ కొంతకాలంపాటు వారి దగ్గర

وَزَيْدِ بنِ الدَّثِنَةِ، حَتى بَاعُوهُما بمكةَ بَعْدَ وَقْعةِ بَدْرٍ؛ فَابتَاعَ بَنُو الحَارِثِ بن عامرِ بن نوفلِ بن عبدِ مَنافٍ خُبَيْباً وكانَ خُبَيْبٌ هُوَ قَتَلَ الحارثَ يَوْمَ بَدْرٍ، فَلَبِثَ خُبَيْبٌ عِنْدَهُم أَسيراً حَتى أَجْمَعُوا عَلى قَتْلِهِ، فَاسْتَعَارَ مِنْ بَعْضِ بَنَاتِ الحارِثِ مُوسَى يَسْتَحِدُّ بها فَأَعَارَتْهُ، فَدَرَجَ بُنَيٌّ لَهَا وَهِيَ غَافِلَةٌ حَتى أَتَاهُ، فَوَجَدَتْهُ مُجْلِسَهُ عَلى فَخذِهِ وَالمُوسَى بِيَدِهِ، فَفَزِعَتْ فَزْعةً عَرَفَهَا خُبَيْبٌ، فقَالَ: أَتَخْشَيْنَ أَن أَقْتُلَهُ مَا كُنْتُ لأَفْعَلَ ذٰلكَ! قَالَتْ: وَاللهِ! مَا رَأَيْتُ أَسِيراً خَيْراً مِنْ خُبَيْبٍ، فواللهِ! لَقَدْ وَجَدْتُهُ يَوماً يَأْكُلُ قِطفاً مِنْ عِنَبٍ فِي يَدِهِ وإِنَّهُ لَمُوثَقٌ بِالحَدِيدِ وَمَا بِمَكَّةَ مِنْ ثَمَرَةٍ، وَكَانَتْ تَقُولُ:

ఖైదీగా ఉన్నారు. ఆ తర్వాత వారు ఆయన్ని హతమార్చాలని నిర్ణయించుకున్నారు.

(వారి దగ్గర ఖైదీగా ఉన్నప్పుడు) ఒకరోజు ఆయన హారిస్ కుమార్తెల్లో ఒకామెను నాభి క్రింది వెంట్రుకలు గొరుక్కోవటం కోసం మంగలికత్తి ఇవ్వమని అడిగారు. ఆమె అది ఇచ్చింది. అంతలో ఆమె పిల్లవాడొకడు ఖుబైబ్ దగ్గరికి వెళ్ళాడు. అది ఆమె చూసుకో లేదు. ఖుబైబ్ ఆ పిల్లవాడ్ని తనతొడ మీద కూర్చోబెట్టుకున్నారు. ఆయన చేతిలో కత్తి ఉంది. ఆ దృశ్యం చూడగానే ఆ స్త్రీ ఆందోళన పడ సాగింది. ఆమె ఆందోళనను గమనించి ఖుబైబ్, "ఏమిటీ? నేను ఈ అబ్బాయిని చంపుతానని భయపడుతున్నావా? నేను అలాంటివాణ్ణి కాదు సుమా!" అన్నారు.

ఆ అమ్మాయి ఇలా అంది: "దైవం సాక్షి! ఖుబైబ్ కన్నా మంచి ఖైదీని నేనెన్నడూ చూడలేదు. దైవం సాక్షి! ఒకరోజు ఆయన, చేతిలో ద్రాక్ష పండ్ల గెల పట్టుకొని తినడం చూశాను. ఆ సమయంలో ఆయన సంకెళ్ళతో బంధించబడి ఉన్నారు. ఆ రోజుల్లో అసలు మక్కాలో పండ్లేలేవు. అందుకే ఆమె తరచూ ఇలా అంటూ ఉండేది: అది ఖుబైబ్‌కు దేవుడిచ్చిన ఆహారమని నా అభిప్రాయం.

إِنَّهُ لَرِزْقٌ رَزَقَهُ اللهُ خُبَيباً، فَلَمَّا خَرَجُوا بِهِ مِنَ الحَرَمِ لِيَقْتُلُوهُ في الحِلِّ، قَالَ لَهُم خُبَيْبٌ: دَعُونِي أُصَلِّ رَكْعَتَيْنِ، فَتَرَكُوهُ، فَرَكَعَ رَكْعَتَيْنِ، فَقَالَ: واللهِ! لَوْلا أَنْ تَحْسَبُوا أَنَّ مَا بِي جَزَعٌ لَزِدتُ، اللَّهُمَّ أَحْصِهِمْ عَدَداً، واقْتُلْهُمْ بِدَداً، ولا تُبْقِ مِنْهُم أحَداً، وقال:

فَلَسْتُ أُبَالِي حِينَ أُقْتَلُ مُسْلِمًا
عَلَى أَيِّ جَنْبٍ كَانَ لِلهِ مَصْرَعِي

وَذَلِكَ فِي ذَاتِ الإِلَهِ وَإِنْ يَشَأْ
يُبَارِكْ عَلَى أَوْصَالِ شِلْوٍ مُمَزَّعِ

శత్రువులు ఆయన్ని హరమ్ పరిధుల నుండి బయటికి తెచ్చి హిల్ల్ (సమ్మత) ప్రదేశంలో హతమార్చేందుకు తీసుకెళ్ళి నప్పుడు (మార్గమధ్యంలో) ఆయన "నన్ను కాస్త వదలండి. నేను రెండు రకాతుల నమాజ్ చేసుకుంటాను" అని అడిగారు. వారు ఆయన్ని వదలి పెట్టారు. ఆయన రెండు రకాతుల నమాజు చేసుకొని వారిని ఉద్దేశ్యించి, "దైవంసాక్షి! చావుభయంతో నేను నమాజు చేస్తున్నానని మీరు తల పోయరనుకుంటే నేను ఇంకా ఎక్కువ నమాజ్ చేసేవాణ్ణి" అన్నారు. ఆ తర్వాత దేవుణ్ణి ఇలా ప్రార్థించారు: ఓ అల్లాహ్! వీరు ఎంత మంది ఉన్నారో లెక్కపెట్టుకో. వీళ్ళను ముక్కలు ముక్కలుగా చేసి చంపు. వీరిలో ఎవరినీ మిగిల్చి ఉంచకు. (ఆ తర్వాత ఒక కవిత చదివారు. దాని భావం ఇది:) "నేను ముస్లిం అయిన స్థితిలో చంప బడుతున్నప్పుడు దైవం కోసం ఏ వైపు నుండి మరణం సంభవించినా నాకు భయం లేదు. నాకు ఈ మరణం దేవుని మార్గంలో వస్తోంది. ఆయన తలచుకుంటే తెగిపోయిన నా శరీర అవయవాలలో శుభం ప్రసాదిస్తాడు."

బంధించి హతమార్చబడే ప్రతి ఒక్క ముస్లిం కోసం ఆయన నమాజు చేసే ఆచారానికి శ్రీకారం చుట్టారు. ఆయన అమరగతి నొందిననాడే దైవప్రవక్త

وَكَانَ خُبَيْبٌ هُوَ سَنَّ لِكُلِّ مُسْلِمٍ قُتِلَ صَبْراً الصَّلاَةَ، وَأَخْبَرَ - يعني النَّبِيَّ ﷺ - أَصْحَابَهُ يَوْمَ أُصِيبُوا خَبَرَهُمْ، وَبَعَثَ نَاسٌ مِنْ قُرَيْشٍ إلى عاصِمِ بْنِ ثَابِتٍ حِينَ حُدِّثُوا أَنَّهُ قُتِلَ أَنْ يُؤْتَوا بِشَيْءٍ مِنْهُ يُعْرَفُ، وكَانَ قَتَلَ رَجُلاً مِنْ عُظَمَائِهِمْ، فَبَعَثَ اللهُ لِعَاصِمٍ مِثْلَ الظُّلَّةِ مِنَ الدَّبْرِ، فَحَمَتْهُ مِنْ رُسُلِهِمْ، فَلَمْ يَقْدِرُوا أَنْ يَقْطَعُوا مِنْهُ شَيْئاً، رواه البخاري. قَوْلُهُ: الهَدْأَةُ: مَوْضِعٌ، وَالظُّلَّةُ: السَّحَابُ. وَالدَّبْرُ: النَّحْلُ. وَقَوْلُهُ: «اقْتُلْهُمْ بِدَداً» بِكَسرِ الباءِ وفتحِها، فمن كسر، قال: هو جمع بِدَّةٍ بكسرِ الباءِ، وهي النصيب، ومعناه: اقْتُلْهُمْ حِصَصاً مُنْقَسِمَةً لِكُلِّ وَاحِدٍ مِنْهُمْ نَصِيبٌ، وَمَنْ فَتَحَ، قَالَ: مَعْنَاهُ: مُتَفَرِّقِينَ

(సల్లం) తన సహచరులకు ఈ వార్త తెలిపారు. ఇక ఆసిమ్ హతమార్చబడ్డారని చెప్పగానే ఆయన ఖురైషు సర్దారుల్లో ఒకాయన్ని చంపి ఉన్నందున ఆయన్ని గుర్తు పట్టేందుకు వీలుగా ఆయన శరీరంలోని ఏదైనా ఒక భాగాన్ని తీసుకురమ్మని ఖురైషులు కొంతమందిని పంపించారు. అటు ఆసిమ్ శవాన్ని రక్షించటం కోసం దేవుడు భిడ్లు (లేక తేనెటీగల) దండును పంపాడు. అవి మబ్బుల రూపంలో వచ్చి ఆయన్ని ఖురైషు మనుషుల నుంచి కాపాడాయి. వాటి మూలంగా ఆయన శరీరంలోని ఏ భాగాన్ని వారు కోయలేకపోయారు. (బుఖారీ)

హద్అ అనేది ఒక ప్రాంతం పేరు. జుల్లహ్ అంటే మబ్బు. దబ్రున్ అంటే తేనెటీగ. బిదదా అనేపదం బదదా అని కూడా పఠించబడింది. బదదా అని చదివేవారు దీన్ని బిద్దతున్ అనే పదానికి బహువచనంగా భావిస్తారు. అప్పుడు దీనికి భాగాలు అని అర్థం వస్తుంది. అంటే, "దేవా! వీరిని ఖండఖండాలుగా చేసి చంపు. ప్రతి ఒక్కరూ ముక్కలు కావాలి" అని ఆ వాక్యానికి భావం. అయితే బిదాదన్ అని చదివేవారి ప్రకారం దాని భావం, "వారిని ఒకరి తర్వాత మరొకర్ని వేర్వేరుచేసి చంపు"

فِي القَتْلِ وَاحداً بَعْدَ وَاحِدٍ مِنَ التَّبْدِيدِ.
وفي الباب أحاديثُ كثيرةٌ صَحِيحَةٌ سَبقت في مَوَاضِعِها مِنْ هٰذَا الكِتَابِ، منها حديثُ الغُلاَمِ الذي كَانَ يَأْتِي الرَّاهِبَ والسَّاحِرَ، وَمِنْهَا حديثُ جُرَيْجٍ، وحديثُ أَصْحَابِ الغَارِ الذِينَ أطْبَقَتْ عَلَيْهِمُ الصَّخْرَةُ، وحديثُ الرَّجُلِ الذي سَمِعَ صَوتاً في السَّحَابِ يقولُ: اسْقِ حَدِيقَةَ فُلانٍ، وَغَيْرُ ذٰلِكَ والدَّلَائِلُ في البابِ كثيرَةٌ مَشْهُورَةٌ، وباللهِ التَّوفِيقُ.

అని. అలాంటప్పుడు దానికి తబ్‌దీద్ మూల పదం అవుతుంది.

(కరామత్ నిజమని రుజువు చేసే) ఈ అధ్యాయానికి సంబంధించిన ప్రామాణిక హదీసులెన్నో ఈ గ్రంథంలో ఇంతకు ముందు అనేకచోట్ల , అనేక అధ్యాయాల్లో వచ్చాయి. వాటిలో క్రైస్తవ మత గురువు దగ్గరికి, ఇంద్రజాలికుడి దగ్గరికీ వెళ్తుండే బాలుని కథ (సహనం అధ్యాయం), జురైజ్ కథ ( చిత్తశుద్ధి అధ్యాయం), బండరాయి మూలంగా గుహ ద్వారం మూసుకుపోయిన వారి కథ (చిత్తశుద్ధి అధ్యాయం), మబ్బుల్లో నుంచి ఫలానా వాని తోట మీద వర్షం కురిపించు అనే మాటలు విన్న వాని కథ, ఇవేగాక ఇలాంటి ఇతర కథలు, సంఘటనలన్నీ కూడా అలాంటివే. ఈ అధ్యాయానికి సంబంధించిన సుప్రసిద్ధ ఆధారాలు ఎన్నో ఉన్నాయి. అవకాశం కల్పించేవాడు దేవుడే.

*(సహీహ్ బుఖారీలోని మగాజీ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'రహ్‌తున్' అంటే ఒక సమూహం అని అర్థం. కొందరి అభిప్రాయం ప్రకారం హదీసులో పేర్కొనబడిన సమూహంలో ఆరుగురు ఉన్నారు. వారిపేర్లు ఆసిమ్ బిన్ సాబిత్, మర్‌సద్ బిన్ అబూ మర్‌సద్; ఖుబైబ్ బిన్ అదీ, జైద్ బిన్ దసినా, అబ్దుల్లాహ్ బిన్ తారిఖ్, ఖాలిద్ బిన్ బుకైర్. మరికొంతమంది ఆ సమూహంలో పదిమంది ఉన్నారని అభిప్రాయపడ్డారు. వాస్తవం దేవునికే బాగా తెలుసు.

ఈ సంఘటనలో వారివల్ల అనేక కరామత్‌లు జరిగాయి. మొదటిది, వారు ప్రార్థించినట్టుగానే వారు వీరమరణం పొందిన రోజే దేవుడు వహీ ద్వారా తన ప్రవక్తకు ఆ విషయం తెలియజేశాడు. రెండోది, ఖుబైబ్ (రజి) జైల్లో ఉన్నప్పుడు దేవుడు ఆయనకు ఆ కాలంలో లభించని పండ్లు ప్రసాదించాడు. మూడోది, ఆసిమ్‌ను రక్షించటం కోసం దేవుడు తేనెటీగల

లేక భిడ్డాల దండును పంపాడు. నాల్గోది, వారు తమను హతమార్చిన దుర్మార్గుల్ని శపించారు. దాంతో ఆ దుర్మార్గులు వారు శపించినట్లుగానే దుష్పరిణామాలకు గురయ్యారు.

ఈ హదీసు ద్వారా బోధపడే మరికొన్ని అంశాలు ఇవి: 1) శత్రువు గనక కఠినంగా ప్రవర్తిస్తున్నట్లయితే అతను రక్షణ ఇస్తానని మాటిచ్చినా దాన్ని ససేమిరా ఒప్పుకోకూడదు. దానివల్ల తమ ప్రాణాలు పోయినాసరే; అయితే ఒకవేళ అతను మృదువుగా ప్రవర్తిస్తాడన్న ఆశ ఉంటే మాత్రం అతన్ని రక్షణ కోరి ప్రాణాలను కాపాడుకోవటం అవసరం. 2) బహుదైవారాధకులు పెట్టిన శిక్షలకు దైవప్రవక్త సహచరులు ప్రదర్శించిన సహనస్థయిర్యాలు ఈ హదీసులో వివరించబడ్డాయి. 3) అత్యంత కఠిన కాలంలో కూడా వారు తమ మంచితనాన్ని నిరూపించుకున్నారు. తనకు ప్రాణ శత్రువైన వాని కుమారుడు చేతికి చిక్కినా కూడా అతన్ని ఏమీ అనలేదు. పైగా అతని మీద వాత్సల్యం కురిపించారు. 4) శత్రువుల చేతుల్లో వీరమరణం పొందే ముందు వారి నుంచి అనుమతి తీసుకొని రెండు రకాతులు నమాజ్ చేసుకోవాలి. ఎందుకంటే ఖుబైబ్ (రజి) ఆ విధంగా చేయగా దైవప్రవక్త (సల్లం) ఆయన్ని ఏమీ అనలేదు. పైగా ఆ విధానాన్ని ఇతర ముస్లింల కోసం కూడా నిర్ణయించారు. 5) బహుదైవారాధకుల్ని, దుర్మార్గులైన శత్రువుల్ని శపించవచ్చు. 6) దైవప్రవక్త (సల్లం) కాలంలోని బహుదైవారాధకులు కూడా నిషిద్ధ మాసాలను, నిషిద్ధ ప్రాంతాన్ని (హరమ్‌ను) గౌరవించేవారు. (ఫత్‌హుల్ బారీ)

١٥١١ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُما قَالَ: مَا سَمِعْتُ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُ يَقُولُ لِشَيْءٍ قَطُّ: إِنِّي لَأَظُنُّهُ كَذَا إِلَّا كَانَ كَمَا يَظُنُّ. رَوَاهُ الْبُخَارِيُّ.

1511. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: ఉమర్(రజి) ఏదయినా విషయం గురించి "నా అభిప్రాయం ఇది" అని చెబితే ఆ విషయం ఆయన అన్నట్లుగానే జరిగేది. నేను ఆయన నోట ఈ విధంగా ఎన్నిసార్లు విన్నానో అన్నిసార్లూ అలాగే జరిగింది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని మనాఖిబుల్ అన్సార్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇందులో ఉమర్(రజి)గారి మహిమోన్నతులు వివరించబడ్డాయి. దేవుడు ఆయనకు గొప్ప తెలివితేటల్ని, అసామాన్య మేధాసంపత్తిని ప్రసాదించాడు. అందుకే దైవప్రవక్త (సల్లం) తరచూ అంటుండేవారు, "నా అనుచర సమాజంలో దివ్య విషయాలు తెలుసుకునేవాడు ఎవడైనా ఉన్నాడంటే ఆయన ఉమరే" అని.

# ١٧ـ كِتَابُ الأُمُوْرِ الْمَنْهِيِّ عَنْهَا

# 18. వారింపబడిన విషయాల ప్రకరణం

**254వ అధ్యాయం**

## ٢٥٤ ـ بَابُ تَحْرِيمِ الْغِيبَةِ وَالأَمْرِ بِحِفْظِ اللِّسَانِ

## పరోక్ష నింద నిషిద్ధం, నాలుకను అదుపులో ఉంచుకోవాలనే ఆజ్ఞ గురించి

قَالَ اللهُ تَعَالَى: ﴿وَلَا يَغْتَب بَّعْضُكُم بَعْضًا أَيُحِبُّ أَحَدُكُمْ أَن يَأْكُلَ لَحْمَ أَخِيهِ مَيْتًا فَكَرِهْتُمُوهُ وَاتَّقُوا اللَّهَ إِنَّ اللَّهَ تَوَّابٌ رَّحِيمٌ﴾ [الحجرات: ١٢]. وقَالَ تَعالَى: ﴿وَلَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهِ عِلْمٌ إِنَّ السَّمْعَ وَالْبَصَرَ وَالْفُؤَادَ كُلُّ أُولَٰئِكَ كَانَ عَنْهُ مَسْئُولًا﴾ [الإسراء: ٣٦]. وقَالَ تعالَى: ﴿مَّا يَلْفِظُ مِن قَوْلٍ إِلَّا لَدَيْهِ رَقِيبٌ عَتِيدٌ﴾ [ق: ١٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు:

"మీలో ఎవరూ ఎవరినీ పరోక్షంగా నిందించ రాదు. మీలో ఎవరైనా మీ మృతసోదరుని మాంసం తినటానికి ఇష్టపడతారా? చూడండి, మీరే స్వయంగా దీనిని అసహ్యించుకుంటారు. అల్లాహ్‌కు భయపడండి, అల్లాహ్ అత్యధికంగా పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు, కరుణించే వాడూను." *(హుజురాత్: 12)*

"మీకు తెలియని విషయం వెంటపడకండి. నిశ్చయంగా కళ్ళూ, చెవులూ, మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగు తుంది." *(ఇస్రా: 36)*

"అతని నోటి నుండి వెడలే ప్రతి మాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పర్యవేక్షకుడు సిద్ధంగా ఉంటాడు." *(ఖాఫ్: 18)*

اِعْلَمْ أَنَّهُ يَنْبَغِي لِكُلِّ مُكَلَّفٍ أَنْ يَحْفَظَ لِسَانَهُ عَنْ جَمِيعِ الكَلَامِ إِلَّا كَلَاماً ظَهَرَتْ فِيهِ المَصْلَحَةُ، وَمَتَى اسْتَوَى الكَلَامُ وَتَرْكُهُ فِي المَصْلَحَةِ، فَالسُّنَّةُ الإِمْسَاكُ عَنْهُ، لأَنَّهُ قَدْ يَنْجَرُّ الكَلَامُ المُبَاحُ إِلَى حَرَامٍ أَوْ مَكْرُوهٍ؛ وَذٰلِكَ كَثِيرٌ فِي العَادَةِ، وَالسَّلَامَةُ لَا يَعْدِلُهَا شَيْءٌ.

ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా అంటున్నారు: ఆచరణ చేయుటం విధి అయిన ప్రతివాడూ మాట్లాడటం అవసరం అని తేటతెల్లమయిన

విషయంలో తప్ప మిగతా విషయాలన్నిటిలోనూ నోటిని కాపాడుకోవాలి. ఒకవేళ మాట్లాడటం, మౌనం వహించటం రెండూ సమానమైనప్పుడు మౌనంగా ఉండటమే సున్నత్. ఎందుకంటే కొన్ని సందర్భాల్లో ధర్మ సమ్మతమైన మాటలు కూడా నిషిద్ధ లేక నివారిత విషయాలకు దారి తీస్తాయి. సాధారణంగా ఇలా ఎక్కువగా జరుగుతూ ఉంటుంది. అందుకని వాటినుండి సురక్షితంగా ఉండటానికి సమానమైన మార్గంలేదు.

١٥١٢ ـ وعَنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيَقُلْ خَيْراً، أَوْ لِيَصْمُتْ» متفقٌ عليه. وهٰذَا الحَدِيثُ صَرِيحٌ فِي أَنَّهُ يَنْبَغِي أَنْ لَا يَتَكَلَّمَ إِلَّا إِذَا كَانَ الكَلامُ خَيْراً، وَهُوَ الَّذي ظَهَرَتْ مَصْلَحَتُهُ، وَمَتَى شَكَّ فِي ظُهُورِ المَصْلَحَةِ؛ فَلَا يَتَكَلَّمُ.

1512. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "దేవుణ్ణి, అంతిమ దినాన్ని విశ్వసించే వ్యక్తి పలికితే మంచిమాట పలకాలి లేదా మౌనంగా ఉండాలి."

(బుఖారీ-ముస్లిం)

మంచితనంతో కూడుకున్న మాటలు మాట్లాడటం మాత్రమే సమంజసం అన్న విషయాన్ని ఈ హదీసు వివరిస్తోంది. మంచితనం తేటతెల్లమయిన మాటలంటే అవే. ఒకవేళ ఆ మాటలు మంచివో కావో అన్న సందేహం ఏర్పడితే అలాంటప్పుడు అసలు మాట్లాడకుండా ఉండటమే మంచిది.

(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఐఖ్లా ప్రకరణం)

١٥١٣ ـ وعَنْ أَبِي مُوسَى رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ يَا رَسُولَ اللهِ! أَيُّ المُسْلِمِينَ أَفْضَلُ؟ قَالَ: «مَنْ سَلِمَ المُسْلِمُونَ مِنْ لِسَانِهِ وَيَدِهِ» متفقٌ عليه.

1513. హజ్రత్ అబూ మూసా (రజి) గారి కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను "ముస్లింలలో శ్రేష్ఠులు ఎవరు?" అని అడిగాను. అందుకాయన సమాధాన

మిస్తూ, "తమ నాలుక వల్ల, తమ చేతుల వల్ల ఇతర ముస్లింలకు హాని కలగకుండా ఉంటే అలాంటివారే శ్రేష్ఠులు" అని చెప్పారు.
(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని తఫాజులుల్ ఇస్లాం ప్రకరణం)

١٥١٤ ـ وعَنْ سَهْلِ بْنِ سَعْدٍ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ يضْمَنْ لي مَا بَيْنَ لَحْيَيْهِ وَمَا بَيْنَ رِجْلَيْهِ أَضْمَنْ لَهُ الجَنَّةَ» متفقٌ عليه.

1514. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే తమ రెండు దవడల మధ్యనున్న దాని గురించి, రెండు కాళ్ళ మధ్యనున్న దాని గురించి నాకు పూచీ వహిస్తారో నేను వారికోసం స్వర్గం గురించి పూచీ వహిస్తాను. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం - ముస్లింలో ఈ హదీసు కనిపించలేదు.)

## ముఖ్యాంశాలు

రెండు దవడల మధ్య నుండేది నాలుక, రెండు కాళ్ళ మధ్య ఉండేది మర్మాంగం. ఈ రెండింటినీ కాపాడుకునేవారికి ఈ హదీసులో స్వర్గశుభవార్త వినిపించబడింది. కాపాడుకోవట మంటే వాటిని కేవలం ధర్మసమ్మతమైన చోట్ల మాత్రమే ఉపయోగించాలి. అధర్మ విషయాల నుంచి వాటిని రక్షించుకోవాలి.

١٥١٥ ـ وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ النَّبِيَّ ﷺ يَقُولُ: «إِنَّ العَبْدَ لَيَتَكَلَّمُ بِالكَلِمَةِ مَا يَتَبَيَّنُ فِيهَا يَزِلُّ بِهَا إِلى النَّارِ أَبْعَدَ مِمَّا بَيْنَ المَشْرِقِ وَالمَغْرِبِ» متفقٌ عليهِ. ومعنى: «يَتَبَيَّنُ» يَتَفَكَّرُ أَنَّهَا خَيْرٌ أَمْ لَا.

1515. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు: దాసుడు అనాలోచితంగా ఒక మాట అంటాడు. అది మంచా లేక చెడా అనేది ఆలోచించడు. కాని దాని మూలంగానే అతను తూర్పు పడమ

రల మధ్య దూరం కన్నా ఎక్కువ దూరం నరకం వైపు పడిపోతాడు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జుహ్ద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మాటల్లో సమతౌల్యాన్ని పాటించకపోవటం వల్ల కలిగే నష్టాలను ఈ హదీసులో వివరించటం జరిగింది. అందుకని మాట్లాడే ప్రతి మాటకు ముందు ఆచితూచి మాట్లాడటం చాలా అవసరం.

1516. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దాసుడు పరధ్యానంలో ఉండి దేవునికి నచ్చే మాట మాట్లాడేస్తాడు. దాని మూలంగా దేవుడు అతని అంతస్తులెన్నో పెంచుతాడు. అలాగే దాసుడు పరధ్యానంలో ఉండి దేవునికి కోపం తెప్పించే మాట మాట్లాడేస్తాడు. దాని మూలంగా అతను నరకంలోకి పడిపోతాడు.

(బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం)

١٥١٦ - وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ الْعَبْدَ لَيَتَكَلَّمُ بِالْكَلِمَةِ مِنْ رِضْوَانِ اللهِ تَعَالَى مَا يُلْقِي لَهَا بَالًا يَرْفَعُهُ اللهُ بِهَا دَرَجَاتٍ، وَإِنَّ الْعَبْدَ لَيَتَكَلَّمُ بِالْكَلِمَةِ مِنْ سَخَطِ اللهِ تَعَالَى لَا يُلْقِي لَهَا بَالًا يَهْوِي بِهَا فِي جَهَنَّمَ» رواه البخاري.

1517. హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ బిలాల్ బిన్ హారిస్ ముజనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి దేవుణ్ణి సంతోషపెట్టే మాట అంటాడు. ఆ మాట ఎంతవరకు వెళ్తుందో అతను ఊహించనయినా ఊహించడు. దాని మూలంగా దేవుడు అతని కోసం

١٥١٧ - وَعَنْ أَبِي عَبْدِ الرَّحْمٰنِ بِلَالِ بْنِ الْحَارِثِ الْمُزَنِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ الرَّجُلَ لَيَتَكَلَّمُ بِالْكَلِمَةِ مِنْ رِضْوَانِ اللهِ تَعَالَى مَا كَانَ يَظُنُّ أَنْ

تَبْلُغَ مَا بَلَغَتْ يَكْتُبُ اللهُ لَهُ بِهَا رِضْوَانَهُ إِلَى يَوْمِ يَلْقَاهُ، وَإِنَّ الرَّجُلَ لَيَتَكَلَّمُ بِالكَلِمَةِ مِنْ سَخَطِ اللهِ مَا كَانَ يَظُنُّ أَنْ تَبْلُغَ مَا بَلَغَتْ يَكْتُبُ اللهُ لَهُ بِهَا سَخَطَهُ إِلَى يَوْمِ يَلْقَاهُ». رواهُ مالكٌ في «المُوَطَّأ» والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

ప్రళయ దినం వరకూ తన ప్రసన్నతను రాసిపెడ్తాడు. (మరికొన్ని సందర్భాల్లో) మనిషి దేవునికి కోపం తెప్పించే మాట అనేస్తాడు. ఆ మాట ఎంతవరకు వెళ్తుందో అతను ఊహించనయినా ఊహించడు. దానిమూలంగా దేవుడు అతను తనను కలుసుకునే దినం వరకూ అతని పట్ల తన అప్రసన్నతను రాసిపెడ్తాడు. (మాలిక్ దీనిని ముఅత్తాలో పేర్కొన్నారు. తిర్మిజీ దీనిని హసన్, సహీహ్ కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు.)

*(ముఅత్తా ఇమామ్ మాలిక్‌లోని జామే ప్రకరణం - సునసె తిర్మిజీలోని జుహ్ద్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

సాధారణంగా మన అనుభవంలోకి వస్తుండే ఒక వాస్తవాన్ని ఈ హదీసులో వివరించటం జరిగింది. ఒక్కోసారి మనిషి మంచి మాట అంటాడు. ఆ మాట విని ఎవరైనా సంతోషపడవచ్చు లేక ఎవరిలోనయినా పరివర్తన రావచ్చు లేక ఎవరైనా అక్రమాలకు, అవిధేయతకు పాల్పడబోయి ఆగిపోవచ్చు. అలాంటి మంచి మాటకు దేవుని సన్నిధిలో గొప్ప పుణ్యఫలం లభిస్తుంది. అలాగే మరికొన్ని సందర్భాల్లో మనిషి చెడు మాట మాట్లాడతాడు. ఆ మాట ఎంత వినాశాన్ని సృష్టిస్తుందో తను ఊహించి ఉండడు. కాని ఆ మాట ఎవరి మనసునయినా నొప్పించవచ్చు. లేక దానిమూలంగా భ్రష్టత్వం, అక్రమాలు, అవిధేయతలు లాంటి పాపాలు జరగవచ్చు. కనుక అలాంటి మాట మాట్లాడిన వ్యక్తి మీద దేవుడు కోప్పడతాడు. చెప్పొచ్చేదేమిటంటే, నోటిని కాపాడుకోవటం, దానిని సద్వినియోగం చేసుకోవటం చాలా అవసరం. లేకపోతే అది మనిషిని వినాశకూపంలోకి నెట్టివేస్తుంది.

١٥١٨ - وَعَنْ سُفْيَانَ بْنِ عَبْدِ اللهِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ يَا رَسُولَ اللهِ! حَدِّثْنِي بِأَمْرٍ أَعْتَصِمُ بِهِ قَالَ: «قُلْ رَبِّيَ اللهُ، ثُمَّ اسْتَقِمْ» قُلْتُ: يَا رَسُولَ اللهِ! مَا أَخْوَفُ

1518. హజ్రత్ సుఫ్యాన్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను: "దైవప్రవక్తా! నాకేదయినా విషయం నేర్పించండి. నేను దాని మీద గట్టిగా నిలబడతాను" అని. అందుకాయన "నా ప్రభువు

مَا تَخَافُ عَلَيَّ؟ فَأَخَذَ بِلِسَانِ نَفْسِهِ، ثُمَّ قَالَ: «هذا» رواه الترمذي وَقالَ: حديثٌ حسنٌ صحيحٌ.

అల్లాహ్ అని చెప్పి దాని మీద స్థిరంగా ఉండు" అని ఉపదేశించారు. నేను మళ్ళీ అడిగాను, "దైవప్రవక్తా! నా గురించి మీరు ఏ విషయంలో భయ పడుతున్నారు" అని. అందుకాయన తన నాలుక పట్టుకొని, "దీని విష యంలో" అని అన్నారు.

(తిర్మిజీ-హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని జుహ్ద్ ప్రకరణం)

షేఖ్ అల్‌బానీ గారు ఈ హదీసుని బలహీనమైనదిగా పేర్కొన్నారు. వివరాలకు 'అజ్జయిఫా' గ్రంథం 908, 920వ పుటలు, రెండవ సంపుటిలోని 221, 309వ పుటలు చూడండి.

## ముఖ్యాంశాలు

దేవుణ్ణి, ఆయన పోషకత్వాన్ని విశ్వసించటం సత్కర్మలన్నిటికీ పునాది లాంటిది. ఆ విశ్వాసం లేకపోతే దేవుని దృష్టిలో కర్మలకు ఎలాంటి విలువ ఉండదు. ఆ విశ్వాసం మీద స్థిరంగా నిలబడటమంటే సదా ఆయన ప్రసన్నతను, అప్రసన్నతను దృష్టిలో పెట్టుకొని మసలుకోవాలి. ఆయన ప్రసన్నత కోసం ఆయన ఆజ్ఞల్ని పాటించాలి. ఆయన అప్రసన్నుడు కాకుండా ఉండాలంటే ఆయన వారించిన విషయాల జోలికిపోకుండా ఉండాలి. నోటి అజాగ్రత్త వల్ల మనిషి దైవాగ్రహానికి పాత్రుడౌతాడు. అందుకే నోటిని కాపాడుకోమని తాకీదు చేయబడింది.

١٥١٩ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تُكْثِرُوا الكَلَامَ بِغَيْرِ ذِكْرِ اللهِ، فَإِنَّ كَثْرَةَ الكَلَامِ بِغَيْرِ ذِكْرِ اللهِ تَعَالَى قَسْوَةٌ لِلْقَلْبِ! وَإِنَّ أَبْعَدَ النَّاسِ مِنَ اللهِ القَلْبُ القَاسِي» رواه الترمذي.

1519. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: దైవస్మరణ లేకుండా ఇతర మాటలు ఎక్కువగా మాట్లాడకండి. ఎందుకంటే దైవస్మరణ లేకుండా ఇతర మాటలు ఎక్కువగా మాట్లాడితే హృదయాలు మొద్దుబారి పోతాయి. దేవునికి ప్రజలందరిలోకెల్లా దూరంగా ఉండేవాడు హృదయం మొద్దుబారిపోయినవాడు. (తిర్మిజీ)

(సుననె తిర్మిజీలోని జుహ్ద్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

హృదయాలు మొద్దుబారి పోవటమంటే పరిస్థితుల నుండి, సంఘటనల నుండి గుణపాఠం నేర్చుకోకపోవటం, హితబోధకు ప్రభావితం కాలేకపోవటం అని అర్థం. దైవస్మరణను వదలిపెట్టి పిచ్చాపాటి కబుర్లలో పడిపోతే మానవుల హృదయాలు మొద్దుబారిపోతాయి. అది ఘోర దౌర్భాగ్యానికి ఆనవాలు. అందుకని మనిషి వీలైనంత ఎక్కువగా దైవాన్ని స్మరిస్తూ ఉండాలి.

١٥٢٠ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ وَقَاهُ اللهُ شَرَّ مَا بَيْنَ لَحْيَيْهِ وَشَرَّ مَا بَيْنَ رِجْلَيْهِ دَخَلَ الجَنَّةَ» رَوَاه التِّرمِذي وقال: حَدِيثٌ حَسَنٌ.

1520. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవుడు ఏ మనిషినయినా అతని రెండు దవడల మధ్య నుండే (నాలుక) కీడు నుండి, రెండు కాళ్ళమధ్య నుండే (మర్మాంగం) కీడు నుండి కాపాడు కున్నాడంటే అతను స్వర్గానికి వెళ్తాడు.

*(తిర్మిజీ-హసన్)*

*(సునను తిర్మిజీలోని జుహ్ద్ అధ్యాయం)*

١٥٢١ ـ وَعَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ يَا رَسولَ اللهِ! مَا النَّجَاةُ؟ قَالَ: «أَمْسِكْ عَلَيْكَ لِسَانَكَ، وَلْيَسَعْكَ بَيْتُكَ، وَابْكِ عَلى خَطِيئَتِكَ» رواه الترمذي وقَالَ: حديثٌ حسنٌ.

1521. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను, "దైవప్రవక్తా! ముక్తికి మార్గం ఏది?" అని. అందు కాయన "నీ నాలుకను అదుపులో పెట్టుకో. నీ ఇల్లు నిన్ను తనలో ఇమిడ్చుకోవాలి (అంటే నీ తీరిక సమయం నీ ఇంట్లో గడవాలి.) నీ పొరపాట్లను తలచుకొని రోదించు" అని ఉపదేశించారు. *(తిర్మిజీ-హసన్)*

*(సునను తిర్మిజీలోని జుహ్ద్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ప్రజలతో అతి ఎక్కువగా కలిసి తిరగటం, వారితో ముచ్చట్లాడుకుంటూ కూర్చోవటం లాంటి పనుల వల్ల మనిషి యొక్క ధర్మానికి ఎన్నో ప్రమాదాలు పొంచి ఉంటాయి. అందుకని

పనికిమాలిన సావాసాల్లో కాలయాపన చేసేకంటే తమ ఇంట్లోనే దైవవిధేయతను పాటిస్తూ, తీరిక సమయాన్ని దేవుని స్మరణలో, ఆయన ధ్యానంలో గడుపుతూ వీలైతే ఖుర్‌ఆన్ పారాయణం చేస్తూ ఉండటం ఎంతో ఉత్తమం. అదే విధంగా ఒంటరిగా ఉన్నప్పుడు తమ తప్పుల్ని, పొరపాట్లను తలచుకొని ఏడ్వటాన్ని కూడా దేవుడు ఇష్టపడతాడు. ఈ హదీసులో నోటిని కాపాడుకోవటంతోపాటు ఆ రెండు విషయాలను గురించి కూడా తాకీదు చేయ్యటం జరిగింది.

١٥٢٢ - وَعَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِذَا أَصْبَحَ ابْنُ آدَمَ، فَإِنَّ الأَعْضَاءَ كُلَّهَا تُكَفِّرُ اللِّسَانَ، تَقُولُ: اتَّقِ اللهَ فِينَا، فَإِنَّمَا نَحْنُ بِكَ: فَإِنِ اسْتَقَمْتَ اسْتَقَمْنا وَإِنِ اعْوَجَجْتَ اعْوَجَجْنَا» رواه الترمذي. معنى «تُكَفِّرُ اللِّسَانَ»: أَيْ تَذِلُّ وَتَخْضَعُ لَهُ.

1522. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: తెల్లవారు జామున మనిషి శరీరంలోని అవయవాలన్నీ నాలుకను అత్యంత దీనంగా బతిమాలుతాయి. "నువ్వు మా విషయంలో అల్లాహ్‌కు భయపడి మసలుకో. ఎందుకంటే మా వ్యవహారం నీతో ముడిపడి ఉంది. నువ్వు సవ్యంగా ఉంటే మేము కూడా సవ్యంగా ఉండగల్గుతాం. నువ్వు వక్రతకు లోనైతే మేము కూడా వక్రతకు లోనైపోతాము." *(తిర్మిజీ)*

'తుకప్ఫిరుల్లిసాన' అంటే అత్యంత అణకువతో, దీనంగా నాలుకను బతిమాలటం.

*(సుననె తిర్మిజీలోని జుహ్ద్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

నోటిని ఆచితూచి ఉపయోగించటం ఎంత అవసరమో ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. నోటితో ఏమాత్రం అసమంజసంగా మాట్లాడినా మొత్తం శరీరం దాని శిక్షను అనుభవించాల్సి వస్తుంది. గొడవలు, పోట్లాటలు జరిగినప్పుడు శరీరం దెబ్బలు భరిస్తుంది. కొన్నికొన్ని సందర్భాల్లోనయితే శరీరం శాశ్వతంగా కన్నుమూయవలసి వస్తుంది. వక్రతకు లోనవటమంటే అదే. నాలుక వక్రతకు లోనయితే దాని ప్రభావం మొత్తం శరీరం మీద పడుతుంది. అదే విధంగా నాలుక సవ్యంగా ఉండటమంటే పరీక్షలకు, ఉపద్రవాలకు గురికాకుండా ఉండటం అని అర్థం.

వేరొక హదీసులో మానవ శరీర సవ్యత, అపసవ్యతలకు కారణభూతం హృదయమని చెప్పటం జరిగింది. మరి ఈ హదీసు ద్వారానేమో ఆ కారణభూతం నాలుక అని తెలుస్తోంది.

ఈ రెండు హదీసుల మధ్య ఎలాంటి వైరుధ్యం లేదు. ఎందుకంటే నాలుక హృదయానికి ప్రతినిధిగా, పరిచయకర్తగా వ్యవహరిస్తుంది. నాలుక, హృదయం - ఈ రెండూ కలిసే మనిషి రూపొందుతాడు. ఈ రెంటి సమ్మేళనమే మానవత్వం. ఒక అరబ్బు తత్త్వవేత్త ఈ విషయాన్ని చాలా చక్కగా వివరించాడు: 'లిసానుల్ ఫతా నిస్ఫున్ వ నిస్ఫున్ ఫుఆదుహూ' మనిషిలోని సగం నాలుకయితే మిగతా సగం అతని హృదయం!

١٥٢٣ ـ وَعَنْ مُعَاذٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ: يَا رَسُولَ اللهِ! أَخْبِرني بِعَمَلٍ يُدْخِلُني الجَنَّةَ، وَيُبَاعِدُني مِنَ النَّارِ؟ قَالَ: «لَقَدْ سَأَلْتَ عَنْ عَظِيمٍ، وَإِنَّهُ لَيَسِيرٌ عَلى مَن يَسَّرَهُ اللهُ تَعَالى عَلَيْهِ: تَعْبُدُ اللهَ لَا تُشْرِكُ بِهِ شَيْئاً، وَتُقِيمُ الصَّلَاةَ، وَتُؤْتِي الزَّكَاةَ، وَتَصُومُ رَمَضَانَ، وَتَحُجُّ الْبَيْتَ» ثُمَّ قَالَ: «أَلَا أَدُلُّكَ عَلى أَبْوَابِ الخَيْرِ؟ الصَّوْمُ جُنَّةٌ، والصَّدَقَةُ تُطْفِيءُ الخَطِيئَةَ كَمَا يُطْفِيءُ المَاءُ النَّارَ، وَصَلَاةُ الرَّجُلِ مِنْ جَوْفِ اللَّيْلِ» ثُمَّ تَلا: ﴿ تَتَجَافَىٰ جُنُوبُهُمْ عَنِ ٱلْمَضَاجِعِ ﴾ حَتَّى بَلَغَ ﴿ يَعْمَلُونَ ﴾ [السجدة: ١٦-١٧]. ثُمَّ قَالَ: «أَلَا

1523. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను. "దైవప్రవక్తా! నన్ను నరకం నుండి దూరం చేసి స్వర్గానికి తీసుకువెళ్ళే కర్మను గురించి నాకు బోధించండి" అని. అందుకాయన ఇలా ఉపదేశించారు: నీవు చాలా పెద్ద విషయమే అడిగావు. అయితే అల్లాహ్ ఎవరికొరకు అయితే దాన్ని సులభంగా చేస్తాడో (అంటే దానిని ఆచరించే శక్తినీ, సద్బుద్ధిని ప్రసాదిస్తాడో) అతనికి అది ఎంతో సులభం. నువ్వు అల్లాహ్‌ను ఆరాధించు. ఆయనకు భాగస్వాములుగా ఎవరినీ నిలబెట్టకు. నమాజును స్థాపించు. జకాత్ చెల్లించు. రమజాన్ (మాసపు) ఉపవాసాలు పాటించు. (స్తోమత ఉంటే) దైవగృహ యాత్ర (హజ్)చేయి.

తర్వాత ఆయనే ఇలా అన్నారు: "నేను నీకు మేలు యొక్క ద్వారాల గురించి తెలుపనా? ఉపవాసం డాలు వంటిది. నీళ్లు మంటను ఆర్పేసినట్లు సదఖా (అనగా దానం) పాపాన్ని ఆర్పేస్తుంది (అంటే దాని ప్రభావాన్ని తొలగిస్తుంది). మనిషి రాత్రి చివరి భాగం (మధ్యలో)

أُخْبِرُكَ بِرَأْسِ الأمْرِ، وَعَمُودِهِ، وَذِرْوَةِ سَنَامِهِ» قُلْتُ: بَلَى يَا رَسُولَ اللهِ! قَالَ: «رَأْسُ الأَمْرِ الإِسْلَامُ، وَعَمُودُهُ الصَّلَاةُ، وَذِرْوَةُ سَنَامِهِ الجِهَادُ» ثُمَّ قَالَ: «أَلا أُخْبِرُكَ بِمِلَاكِ ذٰلِكَ كُلِّهِ؟» قُلْتُ: بَلَى يَا رَسُولَ اللهِ! فَأَخَذَ بِلِسَانِهِ فَقَالَ: «كُفَّ عَلَيْكَ هٰذَا» قُلْتُ: يَا رَسُولَ اللهِ! وَإِنَّا لَمُؤَاخَذُونَ بِمَا نَتَكَلَّمُ بِهِ؟ فَقَالَ: ثَكِلَتْكَ أُمُّكَ! وَهَلْ يَكُبُّ النَّاسَ فِي النَّارِ عَلَى وُجُوهِهِمْ إِلَّا حَصَائِدُ أَلْسِنَتِهِمْ؟» رواه الترمذي وقال: حَدِيثٌ حَسَنٌ صَحِيحٌ، وقد سبق شرحه.

నమాజు చేయటం." తర్వాత ఆయన ఈ వాక్యం: "వారి వీపులు పడకలకు ఎడంగా ఉంటాయి..... యామలూన్" వరకు (సజ్దా: 16-17) పఠించారు. తర్వాత ఆయన నన్ను "ధర్మం యొక్క తల, దాని స్తంభం, దాని మూపురం ఎత్తు గురించి తెలుపనా?" అని అడిగారు. "తప్పకుండా తెలుపండి దైవప్రవక్తా!" అన్నాను నేను. అప్పుడాయన "ధర్మం యొక్క తల-ఇస్లాం. దాని స్తంభం నమాజు. దాని మూపురపు ఎత్తు జిహాదు" అని చెప్పారు. తర్వాత ఆయన "ఇవన్నీ దేని మీద ఆధారపడి ఉన్నాయో ఆ వస్తువు గురించి నీకు తెలుపనా?" అని అడిగారు. "తప్పకుండా తెలుపండి, దైవప్రవక్తా!" అన్నాను నేను. అప్పుడాయన తన నాలుక పట్టుకొని "దీన్ని అదుపులో పెట్టుకో" అన్నారు. అందుకు నేను "దైవప్రవక్తా! మనం నోటితో మాట్లాడే దాని గురించి కూడా నిలదీయబడ తామా?" అని అడిగాను. అందుకాయన "నీవు నీ తల్లికి దుర్లభం అగుగాక! (ఇదొక అరబీ జాతీయం. ఇది తిట్టుకాదు) నరకవాసులను కోత కోసిన వారి నాలుకల పాలాతే నరకంలో వారిని బోర్లాపడవేస్తాయి" అన్నారు. (తిర్మిజీ- ఇది హసన్, సహీహ్ కోవకు చెందిన హదీసుగా ఇమామ్

తిర్మిజీ పేర్కొన్నారు. దీని వివరణ ఇంతకు ముందు గడిచింది.)

*(సుననె తిర్మిజీలోని విశ్వాసాల అధ్యాయాలు)*

ఇమామ్ నవవీ (రహ్మలై) ఈ హదీసు ఇంతకు ముందు అధ్యాయాల్లో వచ్చినట్లు సూచించారు. కాని ఆ విషయం సరైనది కాదు. ఈ హదీసు ఇంతకు ముందు ఎక్కడా రాలేదు.

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఇస్లాం ధర్మ ప్రాథమిక అంశాలతోపాటు నోటివల్ల కలిగే ప్రమాదాలను కూడా సూచించటం జరిగింది. నోటిని కాపాడుకోకపోతే కర్మలన్నీ వృథా అయిపోయే అవకాశముంది. దానిమూలంగా మనిషి స్వర్గానికి పోయే బదులు నరకాగ్నికి ఆహుతి అయిపోతాడు. దేవుడు మనల్నందరినీ రక్షించుగాక!

1524. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) (ఒకసారి తన సహచరుల్ని) "మీకు పరోక్ష నింద అంటే ఏమిటో తెలుసా?" అని అడిగారు. అందుకు సహచరులు "దేవునికి, దైవప్రవక్తకే బాగా తెలుసు" అని విన్నవించుకున్నారు. అప్పుడు దైవప్రపక్త (సల్లం) ఆ విషయాన్ని వివరిస్తూ, "మీ సోదరుని గురించి అతను వింటే అసహ్యించుకునే విధంగా మాట్లాడుకోవటం" అని చెప్పారు. అది విని ఒకతను సందేహ పడుతూ "నేను చెప్పే బలహీనతలు అతనిలో నిజంగా ఉంటేనో" అని అడిగాడు. దానికి సమాధానమిస్తూ, దైవప్రవక్త (సల్లం) "ఒకవేళ నువ్వు చెప్పేవి అతనిలో ఉంటే నువ్వతన్ని పరోక్షంగా నిందించినవాడివవుతావు.

١٥٢٤- وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ قَـالَ: «أَتَـدْرُونَ مَا الْغِيبَةُ؟» قَالُوا: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ. قَـالَ: «ذِكْـرُكَ أَخَـاكَ بِمَـا يَكْـرَهُ» قِيـلَ: أَفَرَأَيْتَ إِنْ كَانَ فِي أَخِي مَا أَقُولُ؟ قَالَ: «إِنْ كَانَ فِيهِ مَا تَقُولُ، فَقَدِ اغْتَبْتَهُ، وَإِنْ لَمْ يَكُنْ فِيهِ مَا تَقُولُ فَقَدْ بَهَتَّهُ» رواه مسلم.

ఒకవేళ నువ్వు చెప్పే విషయాలు అతనిలో లేకపోతే నువ్వతని మీద అభాండాలు వేస్తున్నావన్నమాట"అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో పరోక్షనింద, అభాండం- రెండిటి భావాన్ని, వాటి మధ్య ఉన్న భేదాన్ని, వాటి చెడుగులను వివరించటం జరిగింది. నిశ్చయంగా ఇవి కూడా నోటి ద్వారా కలిగే ఆపదలే. దేవుడు మనల్నందరినీ వాటి నుంచి రక్షించుగాక!

١٥٢٥ ـ وَعَنْ أَبِي بَكْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ فِي خُطْبَتِهِ يَوْمَ النَّحْرِ بِمِنى فِي حَجَّةِ الوَدَاعِ: «إِنَّ دِماءَكم، وَأَمْوَالَكم، وَأَعْرَاضَكُمْ، حَرَامٌ عَلَيْكُم كَحُرْمَةِ يَومِكُم هذا، في شهرِكُمْ هٰذَا، فِي بَلَدِكُمْ هٰذَا، أَلا هَلْ بَلَّغْتُ» متفقٌ عليهِ.

1525. హజ్రత్ అబూ బక్రా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) అంతిమ హజ్‌యాత్ర సందర్భంగా మినా (ప్రాంతం)లో ఖుర్బానీ దినపు ఉపన్యాసంలో ఇలా ప్రబోధించారు: "(ప్రజలారా!)ఈ నెలలో, ఈ నగరంలో, ఈ రోజు ఎంత గౌరవప్రదమైనదో అదే విధంగా మీ ధనమాన ప్రాణాలు పరస్పరం మీ కొరకు అంతే గౌరవప్రదమైనవి. వినండి! నేను దేవుని ఆదేశాలను మీకు అందజేశాను కదా!" (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని విద్యాప్రకరణం - సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఏ విధంగానయితే జుల్‌హిజ్జా మాసపు పదో తేదీ (అంటే అజ్‌హా పండుగ రోజు), జుల్‌హిజ్జా మాసం, మక్కా నగరం గౌరవప్రదమైనవో అదే విధంగా ఒక ముస్లిం కొరకు సాటి ముస్లిం ధనమానప్రాణాలు గౌరవప్రదమైనవి. అంటే ఏ ముస్లిమూ తోటి ముస్లింను అన్యాయంగా హత్య చేయకూడదు. అతని ధనాన్ని దోచుకోకూడదు. అతన్ని అవమానపరచకూడదు. పరోక్ష నింద కూడా ఒకవిధంగా దౌర్జన్యం క్రిందికే వస్తుంది. ఎందుకంటే దానిమూలంగా ఒక ముస్లిం పరువుప్రతిష్ఠలకు భంగం వాటిల్లుతుంది.

1526. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: (ఒకరోజు) నేను దైవప్రవక్త (సల్లం) ముందు (ఆయనగారి మరో భార్య సఫియ్యా మీద కోపంతో) 'సఫియ్యా 'ఇలా' ఉన్నా మీకు ఆవిడే నచ్చుతుందిలేండి' అన్నాను. (సఫియ్యా పొట్టిగా ఉంటుందని చెప్పటం ఆమె ఉద్దేశ్యమని కొంత మంది ఉల్లేఖకులు పేర్కొన్నారు)

ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) (ఆమెను మందలిస్తూ) ("ఆయిషా!) నువ్వు ఎంత (దిగజారిన) మాట మాట్లాడావంటే ఆ మాటను గనక సముద్రంలో కలిపేస్తే అది సముద్రపు నీటి రుచినే మార్చేస్తుంది" అన్నారు.

ఆయిషా (రజి.అన్హా) ఇలా అంటున్నారు: (మరో సందర్భంగా) నేను దైవప్రవక్త (సల్లం) ముందు ఒక వ్యక్తిని వెక్కిరించాను. అప్పుడాయన నాతో ఇలా అన్నారు: ఏ మనిషినయినా వెక్కిరిస్తే నాకు ఇంత ధనం ఇస్తామన్నా సరే ఇతరుల్ని వెక్కిరించటాన్ని నేను ఇష్టపడను. (అబూదావూద్, తిర్మిజీ-హసన్ సహీహ్)

'మజజత్హు' అంటే తన దుర్వాసన, చెడుల మూలంగా నీటి రుచి, వాసన మారిపోయే విధంగా అందులో కలిసి పోవటం అని అర్థం. పరోక్ష నిందను

١٥٢٦ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قُلْتُ لِلنَّبِيِّ ﷺ: حَسْبُكَ مِنْ صَفِيَّةَ كَذَا وَكَذَا. قَالَ بَعْضُ الرُّوَاةِ: تَعْنِي قَصِيرَةً، فَقَالَ: «لَقَدْ قُلْتِ كَلِمَةً لَوْ مُزِجَتْ بِمَاءِ الْبَحْرِ لَمَزَجَتْهُ!» قَالَتْ: وَحَكَيْتُ لَهُ إِنْسَاناً فَقَالَ: «مَا أُحِبُّ أَنِّي حَكَيْتُ إِنْسَاناً وَإِنَّ لِي كَذَا وَكَذَا» رَوَاهُ أَبُو داود، والترمذي وَقَالَ: حديثٌ حسنٌ صحيحٌ.

ومعنى: «مَزَجَتْهُ» خَالطتهُ مُخَالَطَةً يَتَغَيَّرُ بِهَا طَعْمُهُ، أَوْ رِيحُهُ لِشِدَّةِ نَتَنِهَا وَقُبْحِها، وَهٰذا مِنْ أَبْلَغِ الزَّوَاجِرِ عَنِ الغِيبَةِ، قَالَ اللهُ تَعَالَى: ﴿وَمَا يَنطِقُ عَنِ الْهَوَىٰ ۝ إِنْ هُوَ إِلَّا وَحْيٌ يُوحَىٰ﴾

వారించే విషయమై ఇది అత్యంత ప్రభావవంతమైన అలంకారము. అల్లాహ్ సెలవిచ్చాడు: "(మా ప్రవక్త) తన మనోవాంఛలను అనుసరించి చెప్పటం లేదు. అతనేం చెప్పినా అది అతనిపై అవతరింపజేయబడిన వహీ అయి ఉంటుంది."

(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని సిఫతుల్ ఖియామహ్ అధ్యాయం)

### ముఖ్యాంశాలు

అరబీలో "ముహాకాత్" అనే పదం వాడతారు. ఇతరుల పరోక్షంలో చాలా ఎక్కువగా వారి లోపాలను ఎంచటం, వారి శారీరక లోపాలను ఎత్తిచూపటానికి ఈ పదం వాడతారు. ఉదా: అతను కుంటివాడనీ, ఇతను గూనివాడని వెక్కిరించి మరీ చెప్పటం. ఇలాంటి వెక్కిరింతలు కూడా పరోక్ష నింద క్రిందికే వస్తాయి. అందుకే హఫ్సా (రజి.అన్హా) పొట్టిగా ఉంటారని ఆయిషా (రజి.అన్హా) అన్నప్పుడు దైవప్రవక్త ఆమెను మందలిస్తూ ఆమె మాటను సముద్రాన్ని కలుషితం చేసే చెడు పదార్థంతో పోల్చి చెప్పారు. ఇంత గొప్ప పోలిక చెప్పటం సామాన్య విషయం కాదు. అందుకే గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) 'వమా యన్తిఖు...." అనే సూక్తిని ప్రస్తావించి ఈ పోలిక కూడా దైవప్రవక్త (సల్లం) కు దివ్యావిష్కృతి (వహీ) ద్వారా బోధపడిందేనని సూచించారు.

మొత్తానికి ఈ హదీసు ద్వారా చెప్పదలచుకున్న దేమిటంటే, ఇతరుల గురించి వారికి బాధకలిగే విధంగా మాట్లాడటం, లేక వారి శారీరక లోపాలను వెక్కిరిస్తూ వారిని అవమాన పరచటం మొదలగునవన్నీ ఘోరపాపాలు. ప్రతి ముస్లిం వాటికి దూరంగా ఉండాలి.

١٥٢٧ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَمَّا عُرِجَ بِي مَرَرْتُ بِقَوْمٍ لَهُمْ أَظْفَارٌ مِنْ نُحَاسٍ يَخْمِشُونَ وجُوهَهُمْ وَصُدُورَهُمْ، فَقُلْتُ:

1527. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచించారు: నాకు మేరాజ్ (యాత్ర) చేయించబడినప్పుడు నేను కొంత మంది సమీపం నుంచి వెళ్ళటం తటస్థించింది. వారికి ఇత్తడి గోళ్ళున్నాయి. వాటితో వారు తమ ముఖాలను,

مَنْ هٰؤُلاءِ يَا جِبْرِيلُ؟ قَالَ: هٰؤُلاءِ الَّذِينَ يَـأْكُلُـونَ لحُـومَ النَّـاسِ، وَيَقَعُـونَ فـي أَعْرَاضِهِمْ!» رواهُ أبو داود.

రొమ్ములను గీక్కుంటున్నారు. అది చూసి నేను (ఆశ్చర్యంతో) "జిబ్రయీల్! ఎవరు వీరు?" అని అడిగాను. అందుకు జిబ్రయీల్ సమాధానమిస్తూ, "వీరా, వీరు (ప్రపంచంలో) ప్రజల మాంసం తినేవారు (అంటే వారిని పరోక్షంగా నిందించేవారు) వారి మాన మర్యాదలను కాలరాసేవారు" అని చెప్పారు. (అబూదావూద్)

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో పరోక్ష నిందను చూచాయగా ప్రజల మాంసం తినటమని చెప్పటం జరిగింది. మానమర్యాదల్ని కాలరాయటమంటే ప్రజల ముందు ఇతరుల చెడులు ప్రస్తావించి వారి పరువుప్రతిష్ఠలకు భంగం కలుగజేయటం. ఇలాంటి తప్పుడు పనులన్నీ నిషేధించబడ్డాయి. పై హదీసులో పరోక్ష నిందకు నిర్ణయించబడిన శిక్షను చూస్తే ఆ తప్పు ఎంతటి ఘోరమైనదో బోధపడుతుంది.

١٥٢٨ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «كُلُّ المُسْلِمِ عَلَى المُسْلِمِ حَرَامٌ: دَمُهُ وعِرْضُه وَمَالُهُ» رواهُ مسلم.

1528. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రతి ముస్లింకు తోటి ముస్లిం ధనమాన ప్రాణాలు నిషిద్ధమైనవి. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాంలో ధనమాన ప్రాణాల పరిరక్షణ గురించి నొక్కి చెప్పబడిందని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. కనుక తోటి ముస్లిం మానమర్యాదలతో ఆడుకోవటం, అతని ధనాన్ని దోచుకోవటం లేక అతన్ని అన్యాయంగా హతమార్చటం ఏ ముస్లింకూ ధర్మసమ్మతం కాదు. ఈ హదీసును పరోక్ష నిందకు సంబంధించిన అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఆంతర్యం ఏమిటంటే పరోక్ష నింద వల్ల కూడా మనిషి మానమర్యాదలకు భంగం వాటిల్లుతుంది. అలా చేయటం నిషిద్ధం. అందుకే ఈ హదీసును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటం జరిగింది.

## 255వ అధ్యాయం

## ٢٥٥ - بَابُ تَحْرِيم سَمَاعِ الْغِيبَةِ وَأَمْرِ مَنْ سَمعَ غِيبَةً محرَّمَةً بِردِّهَا، وَالإِنْكَارِ عَلَى قَائِلِهَا فَإِنْ عَجَزَ، أَوْ لَمْ يقبَلْ مِنهُ، فَارَقَ ذٰلِكَ الْمَجْلِسَ إِنْ أَمْكَنَهُ

## పరోక్ష నింద వినటం నిషిద్ధం, నిషిద్ధమైన పరోక్ష నింద వింటే వెంటనే దాన్ని ఖండించాలి, నిందించేవాణ్ణి వారించాలి, తాను ఆ పని చేయలేకపోయినప్పుడు లేక తన మాటను ఎవరూ వినకపోయినప్పుడు వీలైతే ఆ సమావేశం నుండి వేరయిపోవాలి

قَالَ اللهُ تَعَالى: ﴿ وَإِذَا سَمِعُوا اللَّغْوَ أَعْرَضُوا عَنْهُ ﴾ [القصص: ٥٥]. وقَالَ تَعَالى: ﴿ وَالَّذِينَ هُمْ عَنِ اللَّغْوِ مُعْرِضُونَ ﴾ [المؤمنون: ٣]. وقال تعالى: ﴿ إِنَّ السَّمْعَ وَالْبَصَرَ وَالْفُؤَادَ كُلُّ أُولَٰئِكَ كَانَ عَنْهُ مَسْئُولًا ﴾ [الإسراء: ٣٦] وقَالَ تَعَالى: ﴿ وَإِذَا رَأَيْتَ الَّذِينَ يَخُوضُونَ فِي آيَاتِنَا فَأَعْرِضْ عَنْهُمْ حَتَّىٰ يَخُوضُوا فِي حَدِيثٍ غَيْرِهِ وَإِمَّا يُنسِيَنَّكَ الشَّيْطَانُ فَلَا تَقْعُدْ بَعْدَ الذِّكْرَىٰ مَعَ الْقَوْمِ الظَّالِمِينَ ﴾ [الأنعام: ٦٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"వారు ఎప్పుడైనా అసహ్యకరమైన మాటను వింటే అక్కణ్ణుంచి దూరంగా జరిగిపోతారు." *(ఖసస్ : 55)*

"విశ్వాసులు వ్యర్థ విషయాల జోలికిపోరు." *(మూమినూన్ : 3)*

"నిశ్చయంగా కళ్ళూ, చెవులూ, మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగుతుంది." *(ఇస్రా: 36)*

"ప్రవక్తా! ప్రజలు గనక మా ఆయతులలో తప్పులెన్నటాన్ని నీవు గమనిస్తే వారి మధ్య నుండి తొలగిపో, వారు ఈ ప్రస్తావనను వదలి పెట్టి మరో విషయాన్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టేవరకు. ఒకవేళ నిన్ను షైతాను ఎప్పుడైనా ఏమరుపాటుకు గురిచేస్తే నీవు ఈ పొరపాటును గ్రహించిన తర్వాత మళ్ళీ అటువంటి దుర్మార్గుల వద్ద కూర్చోవద్దు." *(అన్ఆమ్: 68)*

## ముఖ్యాంశాలు

అబద్ధం, మోసం, లజ్జా రాహిత్యం, వ్యర్థ విషయాలవంటి వాటికి దూరంగా ఉండటం విశ్వాసుల లక్షణమనీ, వాటికి దూరంగా ఉండమని విశ్వాసుల్ని ఆదేశించటం జరిగిందని పైన పేర్కొనబడిన సూక్తులు తెలుపుతున్నాయి. దీనిద్వారా పరోక్ష నిందను వినటం కూడా నిషిద్ధమేనని తెలుస్తోంది. ఎందుకంటే అది కూడా వ్యర్థ విషయాల క్రిందికే వస్తుంది. అదే విధంగా దేవుని, దైవప్రవక్త ఆదేశాలను అపహాస్యం చేసే- ఆ అపహాస్యం నోటిద్వారా కానివ్వండి లేక చేతల ద్వారా కానివ్వండి- అలాంటి సమావేశాలను బహిష్కరించటం కూడా చాలా అవసరం. దైవాదేశాలను అపహాస్యం ఛేయటమంటే వాటికి విరుద్ధమైన పనులు చేయటమని అర్థం. అది కూడా ఒక విధంగా దైవాదేశాలను అపహాస్యం చేయటం క్రిందికే వస్తుంది. ఉదా: ఈ రోజుల్లో జరిగే నిశ్చితార్థం, పెళ్ళిపేరంటాలు, సున్తీ, పుట్టినరోజు వేడుకలన్నీ ఆ కోవకు చెందినవే. వాటిలో లజ్జారాహిత్యం, పరదా పాటించకపోవటం, ఛాయాచిత్రాలు తీయటం, డాన్సులు, పాటలు, స్త్రీ పురుషులు విచ్చలవిడిగా కలుస్తూ ఉండటం, అందమైన అమ్మాయిలు అతిథుల్ని స్వాగతించటం, వారిమీద పూలుజల్లటం లాంటి చెడు పనులు ఎన్నో జరుగుతూ ఉంటాయి. దురదృష్టవశాత్తు ముస్లింల రాజీధోరణి మూలంగా ఆ రుగ్మతలు మరింతగా పెరిగిపోతున్నాయి. మనిషి ఇలాంటి వేడుకల్లో జరిగే చెడు పనుల్ని ఆపలేకపోతే వాటికి హాజరు కావటం కూడా పెద్ద పాపం కనుక కనీసం వాటిని బహిష్కరించనయినా బహిష్కరించాలి.

١٥٢٩ ـ وَعنْ أَبي الدَّرْدَاءِ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ رَدَّ عَنْ عِرْضِ أَخِيهِ، رَدَّ اللهُ عَنْ وَجْهِهِ النَّارَ يَوْمَ القِيَامَةِ» رواه الترمذي وقَالَ: حديثٌ حسنٌ.

1529. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరైనా తమ సోదరుని మానమర్యాదల మీద జరిగే దాడుల్ని ఖండిస్తే ప్రళయదినాన దేవుడు వారి మొహాలను అగ్ని నుండి రక్షిస్తాడు. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని బిర్ర్, సిలా అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఏదైనా సమావేశంలో ఒకతని లోపాలు ఎత్తిచూపి అతన్ని పరాభవించే ప్రయత్నం జరుగుతున్నప్పుడు వెంటనే ఆ మాటల్ని ఖండించాలి. ఆ మనిషి మీద మోపుతున్న నిందలు నిజమైనవి కావనీ, అతను మంచివాడని వారికి తెలియజెప్పాలి. మానమర్యాదల మీద జరిగే దాడుల్ని ఖండించటమంటే అదే.

١٥٣٠ - وَعَنْ عِتْبَانَ بْنِ مَالِكٍ رَضِيَ اللهُ عَنْهُ فِي حَدِيثِهِ الطَّوِيلِ الْمَشْهُورِ الَّذِي تَقَدَّمَ فِي بَابِ الرَّجَاءِ قَالَ: قَامَ النَّبِيُّ ﷺ يُصَلِّي فَقَالَ: «أَيْنَ مَالِكُ بْنُ الدُّخْشُمِ؟» فَقَالَ رَجُلٌ: ذٰلِكَ مُنَافِقٌ لَا يُحِبُّ اللهَ وَلَا رَسُولَهُ، فَقَالَ النَّبِيُّ ﷺ: «لَا تَقُلْ ذٰلِكَ أَلَا تَرَاهُ قَدْ قَالَ: لَا إِلٰهَ إِلَّا اللهُ يُرِيدُ بِذلكَ وَجْهَ اللهِ! وإِنَّ اللهَ قَدْ حَرَّمَ عَلَى النَّارِ مَنْ قَالَ: لا إلهَ إلَّا اللهُ يَبْتَغِي بِذٰلِكَ وَجْهَ اللهِ» متفقٌ عليهِ.

و«عِتبانُ» بكسر العين على المشهور، وحُكِيَ ضمُّها، وبعدها تاءٌ مثناةٌ مِنْ فوق، ثمَّ باءٌ موحدةٌ. و«الدُّخْشُم» بضم الدال، وإسكان الخاءِ وضمِّ الشين المعجمتين.

1530. ఇత్‌బాన్ బిన్ మాలిక్ (రజి), ఇంతకు ముందు 'రజా' అధ్యాయంలో పేర్కొనబడిన తన సుప్రసిద్ధ, సుదీర్ఘ హదీసులో చేసిన కథనం ప్రకారం (ఒకసారి) దైవప్రవక్త (సల్లం) నమాజు చేయించటానికి నిలబడి "మాలిక్ బిన్ దుఖ్షుమ్ ఏడి?" అని అడిగారు. దానికి అక్కడున్నవారిలో ఒకతను "అతను కపటి, దేవునిపట్ల, దైవప్రవక్త పట్ల అతనికి అభిమానం లేదు" అన్నాడు.

ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) అతన్ని (మందలిస్తూ) "అంత మాటనకు. అతను దైవప్రసన్నత కోసం 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అని అనటం నీవు చూడలేదా? (ఒక విషయం గుర్తుంచుకో!) ఎవరయితే దైవప్రసన్నత కోసం లా ఇలాహ ఇల్లల్లాహ్ అని అంటారో దేవుడు వారిపై నరకాగ్నిని నిషిద్ధం చేసేస్తాడు" అని అన్నారు.

(బుఖారీ-ముస్లిం)

'ఇత్‌బాన్' అన్న పేరు సుప్రసిద్ధం. అయితే ఉత్‌బాన్ అని కూడా ఒక ఉల్లేఖనం ఉంది.

*(సహీహ్ బుఖారీలోని సలాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వివరాల కోసం 'రజా' అధ్యాయంలో 417వ హదీసు చూడండి. విశ్వాసిపై నరకం

నిషిద్ధం చేయబడిందంటే విశ్వాసి శాశ్వతంగా నరకంలో ఉండడని భావం. ఎందుకంటే విశ్వాసి గనక ఘోరపాపానికి పాల్పడి దేవుడు అతనికి క్షమాభిక్ష పెట్టని పక్షంలో ఆయన తలచినంతకాలం విశ్వాసి కూడా నరకంలో శిక్ష అనుభవించాల్సిందే. ఆ తర్వాత అతన్ని స్వర్గానికి పంపటం జరుగుతుంది. ముస్లింను పరోక్షంగా నిందించటం నిషిద్ధమన్న సంగతి ఈ హదీసు ద్వారా కూడా బోధపడుతోంది.

١٥٣١ - وَعَنْ كَعْبِ بْنِ مَالِكٍ رَضِيَ اللهُ عَنْهُ فِي حَدِيثِهِ الطَّوِيلِ فِي قِصَّةِ تَوْبَتِهِ وقد سَبَقَ فِي باب التَّوْبَة. قَالَ: قَالَ النَّبِيُّ ﷺ وَهُوَ جَالِسٌ فِي الْقَوْمِ بِتَبُوكَ: «مَا فَعَلَ كَعْبُ بنُ مَالِكٍ؟» فَقَالَ رَجُلٌ مِنْ بَنِي سَلِمَةَ: يَا رَسُولَ اللهِ! حَبَسَهُ بُرْدَاهُ، والنَّظَرُ فِي عِطْفَيْهِ. فَقَالَ لَهُ مُعاذُ بْنُ جَبَلٍ رَضِيَ اللهُ عَنْهُ: بِئْسَ مَا قُلْتَ، واللهِ يَارَسُولَ اللهِ! مَا عَلِمْنَا عَلَيْهِ إِلَّا خَيْراً، فَسَكَتَ رَسُولُ اللهِ ﷺ. متفقٌ عليه.

«عِطْفَاهُ»: جانِبَاهُ، وهو إشارةٌ إلى إعجابِهِ بنفسِهِ.

1531. ఇంతకుముందు పశ్చాత్తాపానికి సంబంధించిన అధ్యాయంలో కాబ్ బిన్ మాలిక్ (రజి) గారు తన పశ్చాత్తాప సంఘటనకు సంబంధించిన సుదీర్ఘ హదీసులో చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) తబూక్ ప్రాంతంలో ప్రజల మధ్య కూర్చొని ఉన్నప్పుడు 'కాబ్ బిన్ మాలిక్ రాలేదా?' అని అడిగారు.

దానికి బనూ సలిమాకు చెందిన ఒకతను బదులిస్తూ, "దైవప్రవక్తా! అతన్ని అతని రెండు దుప్పట్లు, వాటి కొనల్ని చూసుకొని మురిసిపోవడాలు (యుద్ధానికి) రాకుండా చేశాయి" అని అన్నాడు. అది విని ముఆజ్ బిన్ జబల్ (అతని మాటల్ని ఖండిస్తూ) "అబద్ధం, దైవం సాక్షి! దైవప్రవక్తా! మాకు ఆయనలో మంచితనమే తెలుసు" అని చెప్పారు. ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) మౌనం వహించారు.

(బుఖారీ-ముస్లిం)

'ఇత్ఫాహు' అంటే రెండు కొనలు అని అర్థం. ఇది ఆయన ఆత్మస్తుతికి సూచన.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు పశ్చాత్తాపం అధ్యాయంలో పూర్తి వివరాలతో వచ్చింది. దీనిని మళ్ళీ ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఔచిత్యం ఏమిటంటే దైవప్రవక్త (సల్లం) ముందు ఒక వ్యక్తి కాబ్ బిన్ మాలిక్ (రజి) గురించి తన దురనుమానాన్ని వెలిబుచ్చుతూ, "అతన్ని అతని మంచి వస్త్రధారణ, గర్వాహంకారాలు యుద్ధానికి రాకుండా చేశాయి" అని అన్నప్పుడు ముఆజ్ (రజి) వెంటనే దాన్ని ఖండించారు. ఒకరిగురించి ఇలాంటి దురనుమానాలు పెట్టుకోవటం మంచిది కాదని చెప్పారు. ఈ సంభాషణ అంతా వింటున్న దైవప్రవక్త (సల్లం) మౌనం వహించారు. ముఆజ్ (రజి) ఖండన సరైనదేనని చెప్పటానికి ఆయన మౌనమే ప్రబల నిదర్శనం. దీనిద్వారా బోధపడిందేమిటంటే ఏదైనా సమావేశంలో ఈ విధంగా ఎవరి గురించయినా చాడీలు చెప్పుకుంటుంటే, వారి మానమర్యాదల మీద దాడి చేయబోతుంటే వారి మాటల్ని ఖండించి ఆయా సోదరుల మానమర్యాదలను కాపాడటం అక్కడున్న ప్రతి ఒక్కరి బాధ్యత.



**256వ అధ్యాయం**

## ٢٥٦ - بَابُ بَيَانِ مَا يُبَاحُ مِنَ الْغِيبَةِ

## పరోక్ష నింద కొన్ని పరిస్థితుల్లో సమ్మతమే

اِعْلَمْ أَنَّ الغِيبَةَ تُبَاحُ لِغَرَضٍ صَحِيحٍ شَرْعِيٍّ لَا يُمْكِنُ الْوُصُولُ إِلَيْهِ إِلَّا بِهَا، وهُوَ سِتَّةُ أَسْبَابٍ:

గత్యంతరం లేనప్పుడు సరైన, షరీఅత్ పరమైన ఉద్దేశ్యం కోసం ఒకరి పరోక్షంలో వారి చెడుని ఎత్తి చూపటంలో తప్పు లేదని తెలుసుకోండి. ఆరు కారణాల మూలంగా ఆ విధంగా చేయవచ్చు.

الأَوَّلُ: التَّظَلُّمُ، فَيَجوزُ لِلْمَظْلُومِ أَنْ يَتَظَلَّمَ إلى السُّلْطَانِ وَالقَاضِي وَغَيْرِهِمَا مِمَّنْ لَهُ وِلَايَةٌ، أَوْ قُدْرَةٌ على إنْصَافِهِ مِنْ ظَالِمِهِ، فَيَقُولُ: ظَلَمَنِي فُلانٌ بكَذا.

1) దౌర్జన్యం జరగటం. అలాంటప్పుడు దౌర్జన్యానికి గురైనవాడు రాజు దగ్గరికి కాని, న్యాయమూర్తి దగ్గరికిగాని లేక అధికారం ఉన్నవారి దగ్గరికి లేక దౌర్జన్యం చేసినవాణ్ణి శిక్షించి తనకు న్యాయం చేయగల శక్తివున్నవాడి దగ్గరికిగాని వెళ్ళి, 'ఫలానా అతను నా మీద ఈ విధంగా దౌర్జన్యం చేశాడు' అని ఫిర్యాదు చేయవచ్చు.

الثَّاني: الاسْتِعَانَةُ عَلى تَغْيِيرِ المُنْكَرِ، وَرَدِّ العاصي إلى الصَّوَابِ، فيقول لِمَنْ يَرْجُو قُدْرَتَهُ على إزالةِ المُنْكَرِ: فُلانٌ يَعْمَلُ كَذَا، فازْجُرْهُ عنهُ ونحو ذٰلِكَ، وَيكُونُ مَقْصُودُهُ التَّوَصُّلَ إِلَى إِزَالَةِ المُنْكَرِ، فَإِنْ لَمْ يَقْصِدْ ذٰلِكَ كانَ حَرَاماً. الثَّالِثُ: الاسْتِفْتَاءُ، فَيَقُولُ لِلْمُفْتي: ظَلَمني أبي، أوْ أخي، أوْ زَوْجي، أَوْ فُلانٌ بِكَذا، فَهَلْ لَهُ ذٰلِكَ؟

2) షరీఅత్‌కు విరుద్ధంగా జరిగే పనుల్ని నిరోధించటం కోసం, చెడు పనులు చేస్తున్న వారిని సరైన దారిలో పెట్టడం కోసం సహాయం అర్థించటం. దాని కోసం షరీఅత్‌కు విరుద్ధమైన చర్యల్ని అరికట్టే శక్తి ఉందని తనకు నమ్మకమున్న వ్యక్తిని సంప్రతించి అతనితో, "ఫలానా అతను ఈ తప్పు చేస్తున్నాడు. మీరతన్ని మందలించండి" అనిగాని

وَمَا طَرِيقِي فِي الخلاص مِنْهُ، وَتَحْصِيل حَقِّي، وَدَفْعِ الظُّلْمِ؟ ونحو ذٰلِكَ، فَهٰذَا جَائِزٌ لِلْحَاجَةِ، ولٰكِنَّ الأَحْوَطَ والأفضل أَنْ يَقُولَ: مَا تَقُولُ فِي رَجُلٍ أَوْ شَخْصٍ، أَوْ زَوْجٍ، كَانَ مِنْ أَمْرِهِ كَذَا؟ فَإِنَّهُ يَحصُلُ بِهِ الغَرَضُ مِنْ غَيْرِ تَعْيِينٍ وَمَعَ ذٰلِكَ، فالتَّعْيِينُ جَائِزٌ كَمَا سَنَذْكُرُهُ فِي حَدِيثِ هِنْدٍ

లేక ఇలాంటి మాటే ఏదయినా చెప్పవచ్చు. అయితే దాని ఉద్దేశ్యం కేవలం ఆ చెడుని నిరోధించడం మాత్రమే అయి ఉండాలి. ఆ ఉద్దేశ్యం లేకపోతే ఆ విధంగా ఇతరుల ముందు ఒకరి చెడుని ప్రస్తావించటం నిషిద్ధం (హరామ్) అయిపోతుంది.

3) ఫత్వా అడగటం. ఒక వ్యక్తిని తన అన్నో లేక తండ్రో లేక భర్తో ఇబ్బంది పెడ్తున్నారనుకోండి. అప్పుడామె ముఫ్తీ దగ్గరికి వెళ్ళి వారికి తన మీద జులుం చేసే హక్కు ఉందా? వారి జులుం నుంచి తన్ను తాను కాపాడుకోవాలంటే, తన హక్కుల్ని పొందాలంటే, ఆ జులుంని ఎదుర్కోవాలంటే ఏం చేయాలి? అనిగానీ, లేక ఇలాంటిదే మరేదయినా మాటగాని అనవచ్చు. అవసర పరిస్థితుల్లో ఇలా అడగటంలో తప్పులేదు. కాని దీనికంటే సురక్షిత మైన, ఉత్తమమైన మార్గం ఏమిటంటే అదే విషయాన్ని ఈ విధంగా అడగాలి: "ఒక మనిషి లేక వ్యక్తి లేక భర్త ఈ విధంగా ప్రవర్తిస్తున్నాడు. అతని గురించి మీరేమంటారు?" ఈ విధంగా పేరు తీసుకోకుండా, ప్రత్యేకంగా ఎవరినీ నిర్ణయించకుండా చెప్పినా తమ ఉద్దేశ్యం నెరవేరుతుంది. అయినప్పటికీ సంబంధిత వ్యక్తిని నిర్ణయిస్తూ (అతని పేరు తీసుకొని) అయినా చెప్పవచ్చు. ఈ విషయాన్ని

إنْ شَاءَ اللهُ تَعَالى. الرَّابعُ: تَحْذِيرُ الْمُسْلِمِينَ مِنَ الشَّرِّ وَنَصِيحَتُهُمْ، وذلكَ مِنْ وُجُوهٍ: منها جَرْحُ المَجْرُوحِينَ مِنَ الرُّوَاةِ والشُّهُودِ، وَذلكَ جَائِزٌ بإجْمَاعِ المُسْلِمِينَ، بَلْ واجِبٌ لِلْحَاجَةِ. ومِنْهَا المُشَاوَرَةُ فِي مُصَاهَرَةِ إنْسانٍ، أَوْ مُشَارَكَتِهِ، أَوْ إيدَاعِهِ، أَوْ مُعَامَلتِهِ، أَوْ غيْرِ ذٰلِكَ، أَوْ مُجَاوَرَتِهِ، وَيَجِبُ عَلَى المُشَاوَرِ أَنْ لَا يُخْفِيَ حَالَهُ، بَلْ يَذْكُرُ المساوِىءَ

సమర్థిస్తూ మేము (మున్ముందు) హింద్‌గారి హదీసును పేర్కొంటాం.

4) ముస్లింలను చెడుల గురించి హెచ్చరించటం, వారి బాగును కోరటం. దీనికి అనేక మార్గాలున్నాయి. ఉదా: హదీసు ఆధార పరంపరలోని అవిశ్వసనీయ ఉల్లేఖకుల (సంఘటన వాస్తవాలను తెలుసుకోవటం కోసం) సాక్షుల లోపాలను ఎత్తిచూపటం (మొదలగునవి) ముస్లింల ఏకాభిప్రాయం కోసం ఇలా చేయటం ధర్మ సమ్మతమే. పైగా అవసర పరిస్థితిలో ఇలా చేయటం తప్పనిసరి అవుతుంది. ఇంకొక రకం (శ్రేయోభిలాష) ఏమిటంటే ఒకరితో పెళ్ళి వ్యవహారం చేసే విషయమై లేక వ్యాపారంలో భాగస్వామ్యం వహించే విషయమై లేక అతనివద్ద అప్పగింత ఉంచే విషయమై లేక అతని పొరుగున ఉండే విషయమై లేక మరేదయినా విష యమై పరస్పరం సలహాసంప్రతింపులు చేసుకోవటం. అలాంటప్పుడు ఎవరైనా తమల్ని సలహా అడిగితే ఎలాంటి దాపరికాలూ లేకుండా వారి శ్రేయాన్ని కాంక్షిస్తూ సంబంధిత వ్యక్తిలో ఉన్న లోపాలన్నీ వివరించాలి. (దాని వల్ల కలిగే ప్రయోజనం ఏమిటంటే, మనుషులు చెడ్డ వారితో సంబంధాలు పెట్టుకోకుండా, ద్రోహుల దగ్గర తమ అప్పగింతలు ఉంచకుండా, వ్యాపారంలో వారికి భాగస్వాములు

التي فيه بِنِيَّةِ النَّصِيحَةِ. ومنها إذا رأى مُتَفَقِّهاً يَتَرَدَّدُ إلى مُبْتَدِع، أَوْ فاسِقٍ يأْخُذُ عنهُ العِلْمَ، وخَافَ أَنْ يَتَضَرَّرَ المُتَفَقِّهُ بذلكَ، فَعَلَيْهِ نَصِيحَتُهُ بِبَيانِ حَالِهِ، بِشَرْطِ أَنْ يَقْصِدَ النَّصِيحَةَ، وهذا مِمَّا يُغْلَطُ فيه. وقد يَحْمِلُ المُتَكَلِّمَ بذلِكَ الحَسَدُ، ويُلَبِّسُ الشَّيْطَانُ عليهِ ذلِكَ، وَيُخَيِّلُ إِلَيْهِ أَنَّهُ

కాకుండా, వారి పొరుగున ఉండ కుండా జాగ్రత్తపడతారు.)

అదే విధంగా ఒక విద్యార్థి షరీఅత్ జ్ఞానం ఆర్జించటం కోసం ధర్మంలో కొత్తపోకడలు సృష్టించేవాడి (బిద్అతీ) దగ్గరికో లేక ఏ పాపాత్ముని దగ్గరికో వెళ్తున్నాడనుకోండి. అతని మూలంగా ఆ విద్యార్థికి నష్టం కలిగే ప్రమాద ముంటే అది చూసేవారు ఆ విద్యార్థికి అతని గురించి తెలియజెప్పి అతని శ్రేయస్సుని కాంక్షించాలి. దాని ఉద్దేశం కేవలం శ్రేయోభిలాష మాత్రమే అయి ఉండాలి. ఈ వ్యవహారం ఎలాంటి దంటే సాధారణంగా ఇందులో పొరపాటు జరుగుతూ ఉంటుంది. కొన్నికొన్ని సార్లు మనిషి ఇతరుల మీద అసూయ కొద్దీ వారి చెడులు వివ రిస్తాడు. షైతాన్ ఆ వ్యవహారాన్ని తారుమారు చేసి అతని మెదడులో తాను పరులబాగు కోసమే ఈ పని చేస్తున్నానన్న తలంపును పుట్టిస్తాడు. (వాస్తవానికి అది శ్రేయోభిలాష కాదు. అసూయతో చెబుతున్న మాటలు). అందుకని మనిషి ఈ విషయంలో జాగరూకతతో మసలుకోవాలి.

అలాగే ఒక అధికారి ఉన్నాడనుకోండి. అతను తన అసమర్థత వల్లనో లేక తన దుర్నడత వల్లనో లేక అశ్రద్ధ వల్లనో లేక మరేదయినా కారణం వల్లనో తన అధికార బాధ్యతల్ని సరిగా నిర్వర్తిం

نصيحةٌ فَلْيُتَفَطَّنْ لذلكَ. ومنها أن يكونَ لَهُ ولَايَةٌ لَا يقومُ بِهَا عَلى وَجْهِها: إمَّا بأنْ لَا يكونَ صالحاً لها، وإمَّا بأَنْ يكونَ فاسِقاً، أَوْ مُغفَّلاً، ونحوَ ذلكَ فَيَجِبُ ذِكْرُ ذلكَ لِمَنْ لَهُ عليهِ ولايَةٌ عامَّةٌ لِيُزِيلَهُ، وَيُوَلِّيَ مَنْ يَصْلُحُ، أَوْ يَعْلَمَ ذلكَ منه لِيُعَامِلَهُ بمُقْتضَى حالِهِ، ولا يَغْتَرَّ بِهِ، وَأَنْ يَسْعَى في أَنْ يَحُثَّهُ عَلَى الاسْتِقَامَةِ أَوْ يَسْتَبْدِلَ بِهِ. **الخَامِسُ**: أَنْ يَكُونَ مُجَاهِراً بِفِسْقِهِ أَوْ بِدْعَتِهِ كالمُجَاهِرِ بشُرْبِ الخمرِ، ومُصَادَرَةِ النَّاس، وأَخْذِ المَكْسِ؛ وجِبَايَةِ الأَمْوَالِ ظُلْماً، وتَوَلِّي الأُمُورِ الباطِلَةِ، فيجوزُ ذِكْرُهُ بِمَا يُجَاهِرُ بِهِ؛ وَيَحْرُمُ ذِكْرُهُ

చటం లేదనుకోండి. అలాంటప్పుడు అతనిమీద విచక్షణాధికారం ఉన్న పై అధికారికి దాని గురించి ఫిర్యాదు చేయటం అవసరం. అలా చేయటం వల్ల పై అధికారి ఆ (అసమర్థ) అధికారిని తొలగించి అతని స్థానంలో సమర్థుడైన అధికారిని నియమిస్తాడు. లేదా అతన్ని తొలగించకపోయినా అతని గురించిన వాస్తవాలు కొన్ని తన దృష్టికి వచ్చినట్లవుతుంది. దాంతో అతను ఆ వ్యక్తితో వ్యవహారం చేయ వలసివచ్చినప్పుడు అతని పరిస్థితిని బట్టి వ్యవహరిస్తాడు. అతని చేతిలో మోసపోకుండా జాగ్రత్తపడతాడు. లేదా తాను అతన్ని సరైన మార్గాన్ని అవలం బించమని పురికొల్పాలి. దానివల్ల కూడా లాభం లేదనుకుంటే అతన్ని తొలగించేయాలి.

5) ఎవడైనా బహిరంగంగా పాప కార్యాలకు, ధర్మంలో కొత్తపోకడలకు పాల్పడుతున్నాడనుకోండి. ఉదా: బహిరంగంగా మద్యం సేవించటం, ప్రజల సొమ్ము కొల్లగొట్టడం, మామూళ్లు వసూలు చేయటం, అన్యా యంగా పన్నులు వసూలుచేయటం, ధర్మవిరుద్ధమైన పనులకు సహాయ సహకారాలు అందించటం (మొదలగునవి). ఈ విధంగా ఎవరు బహిరం గంగా చెడు పనులు చేసినా వాటిని (రూపుమాపాలన్న ఉద్దేశ్యంతో) ప్రజల

بغيره مِنَ العُيوبِ، إلّا أَنْ يكونَ لجَوازِهِ سَبَبٌ آخرُ مِمّا ذكَرْناهُ. السّادِسُ: التَّعْرِيفُ، فإذا كَانَ الإنْسَانُ مَعْروفاً بلَقَبٍ؛ كالأَعْمَشِ والأَعْرَجِ والأَصَمِّ، والأَعْمَى، والأَحْوَلِ، وَغَيْرِهِمْ جَازَ تَعْرِيفُهُمْ بذلِكَ؛ وَيحْرُم إطْلاَقُه على جهَةِ التَّنَقُّصِ؛ ولو أَمكنَ تَعريفُهُ بغَيْرِ ذلِكَ كَانَ أولى.

فهذه سِتَّةُ أَسبابٍ ذكَرَهَا العلماءُ وأكثرُها مُجْمَعٌ عليهِ؛ ودَلاَئلُها مِنَ الأحاديثِ الصَّحيحَةِ مشهورةٌ. فمن ذلك:

ముందు వివరించటం ధర్మసమ్మతమే. అవి తప్ప అతని ఇతర (ఆంతరంగిక) లోపాలను బయటపెట్టడం నిషిద్ధం. అయితే ఇంతకు ముందు మేము వివరించిన కారణాల్లో ఏదైనా కారణం చేత అలాచేయటం ధర్మసమ్మత మయితే అప్పుడు బయటపెట్టవచ్చు.

6) ప్రసిద్ధి చెందిన పేరుతో ఎవరయినా వ్యక్తులు కుంటివాడు, చెవిటివాడు, గుడ్డివాడు, మెల్లకన్నువాడు లాంటి మారు పేర్లతో ప్రసిద్ధి చెందారనుకోండి. అలాంటివారిని ఆ సుప్రసిద్ధ పేరుతో లేక మారుపేరుతో పిలవటం ధర్మ సమ్మతమే. కాని వారిని పరాభవించే లేక అవమానపరిచే ఉద్దేశ్యంతో అలాంటి పదాలు ఉపయోగించటం మాత్రం నిషిద్ధం. ఒకవేళ పైన పేర్కొన బడిన సుప్రసిద్ధ మారుపేర్లకు బదులు మరేదయనా పరిచయ నామముంటే దాన్ని ఉపయోగించటం ఉత్తమం.

ఈ ఆరు కారణాలూ పండితులు వివరించినవి (వీటి మూలంగా పరుల లోపాలను ఎత్తిచూపటం ధర్మసమ్మత మవుతుంది). వీటిలో చాలా వాటి మీద పండితులందరూ ఏకాభి ప్రాయంతో ఉన్నారు. వీటి ఆధారాలు ప్రామాణికమైన హదీసుల్లో సుప్రసిద్ధ మైనవి. వాటిలో కొన్ని హదీసులు ఈ క్రిందపేర్కొనబడ్డాయి.

1532. హ[జత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి రావటానికి అనుమతి కోరాడు. అందుకాయన, "అతన్ని అనుమతించండి. అతను తన వంశంలో చెడ్డ మనిషి" అని అన్నారు.
(బుఖారీ-ముస్లిం)

١٥٣٢ ـ عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ رَجُلاً اسْتَأْذَنَ عَلى النَّبِيِّ ﷺ فَقَالَ: «ائذَنُوا لَهُ، بِئسَ أَخُو العَشِيرَةِ؟» متفقٌ عليهِ. احْتَجَّ بِهِ البخاري في جَوازِ غِيبةِ أهلِ الفسادِ وأهلِ الرِّيَبِ.

ఇమామ్ బుఖారీ ఈ హదీసు ద్వారా (ప్రజల జాగ్రత్త కోసం) కల్లోలం సృష్టించే వారిని, సందేహాస్పద వ్యక్తుల్ని పరోక్షంగా నిందించటం ధర్మసమ్మతమేనని వాదించారు.

(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇమామ్ బుఖారీ వాదనలోని ఆంతర్యం ఏమిటో అర్థం అవుతూనే ఉంది. అలాచేస్తే ప్రజలు అలాంటివారి బాహ్యరూపాన్ని చూసి మోసపోకుండా ఉంటారు. ఒక వ్యక్తి నడవడిక మంచిది కాదనుకోండి. అతని దుర్నడత గురించి ప్రజలకు తెలియజెప్పకపోతే ఎంతోమంది అతని మాయాజాలంలో చిక్కుకునే ప్రమాదముంటుంది. దానివల్ల వారి ఇహలోక జీవితం, ధర్మం రెండింటికీ నష్టం కలగవచ్చు. అలాంటి వ్యక్తి తాలూకు చెడుల్ని ప్రజల ముందు బయటపెట్టడం ధర్మసమ్మతమే.

1533. హ[జత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: ఫలానా మరియు ఫలానా వ్యక్తులిద్దరికీ మన ధర్మం గురించి అసలు ఏమీ తెలియదని నా అభిప్రాయం. (బుఖారీ)

١٥٣٣ ـ وَعَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَا أَظُنُّ فُلاناً وفُلاناً يَعرِفَانِ مِنْ دِينِنا شَيئاً» رواه البخاريُّ. قالَ اللَّيثُ بْنُ سَعْدٍ أَحدُ رُواةِ هٰذَا الحَدِيثِ: هٰذَانِ الرَّجُلاَنِ كَانَا مِنَ المُنَافِقِينَ.

ఆ ఇద్దరు వ్యక్తులు కపటులని ఈ హదీసు ఉల్లేఖకుల్లో ఒకరైన లైస్ బిన్ సాద్ తెలిపారు.

(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

కపట విశ్వాసులు కూడా కల్లోలాన్ని సృష్టించేవారి, సందేహాస్పద వ్యక్తుల్లాంటి నడవడికనే కలిగి ఉంటారు. కనుక వారి నిజస్వరూపం గురించి ప్రజలకు తెలియజేయటం ధర్మసమ్మతం మాత్రమే కాదు, అవసరం కూడా. అప్పుడే ప్రజలు వారితో జాగ్రత్తగా ఉంటూ తమ ఇహలోక జీవితాన్ని, ధర్మాన్ని పాడుచేసుకోకుండా ఉంటారు.

١٥٣٤ - وَعَنْ فَاطِمَةَ بِنْتِ قَيْسٍ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: أَتَيْتُ النَّبِيَّ ﷺ، فقلتُ: إنَّ أبا الجَهْمِ وَمُعَاوِيَةَ خَطباني؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَمَّا مُعَاوِيَةُ، فَصُعْلُوكٌ لا مَالَ لَهُ، وأَمَّا أَبو الجَهْمِ، فَلَا يَضَعُ العَصَا عَنْ عَاتِقِهِ» متفقٌ عليه. وفي روايةٍ لمسلم: «وأَمَّا أَبُو الجَهْمِ فَضَرَّابٌ لِلنِّسَاءِ» وَهُوَ تفسير لرواية: «لَا يَضَعُ العَصَا عَنْ عَاتِقِهِ» وقيل: معناه: كثيرُ الأسفارِ.

1534. ఫాతిమా బిన్తె ఖైస్ (రజి.అన్హా) కథనం: నేనొకసారి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి, "(దైవప్రవక్తా!) అబూ జహమ్, ముఆవియా ఇద్దరూ నాకు వివాహ సందేశం పంపారు. (నేను ఏం చేయను?)" అని అడిగాను. అందు కాయన, "ముఆవియా కటిక దరిద్రుడు. అతని దగ్గర ధనం లేదు. పోతే అబూజహమ్, అతను భుజంపైకి ఎత్తిన కర్ర కిందికి దించనే దించడు." అని అభిప్రాయపడ్డారు.

(బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని ఉల్లేఖనంలో "కాని అబూ జహమ్ స్త్రీలను చితకబాదుతూ ఉంటాడు" అని ఉంది. ఇది పైన పేర్కొన్న ఉల్లేఖనంలోని "అబూ జహమ్ భుజంపైకి ఎత్తిన కర్ర కిందికి దించడు" అనే వాక్యానికి తాత్పర్యం. అయితే కొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం దాని భావం "అతి ఎక్కువగా ప్రయాణాలు చేసేవారు" అని.

(సహీహ్ ముస్లింలోని తలాఖ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దీని ద్వారా తెలిసేదేమంటే వివాహ బంధం ద్వారా పరస్పరం కలుసుకోబోయే ఇద్దరు వ్యక్తులకు - ఒకరి మంచి చెడ్డల్ని గురించి ఇంకొకళ్ళకు చెప్పటం, వారిలోనున్న లోపాలను వివరించటం ధర్మసమ్మతమే. అయితే దాని ఉద్దేశ్యం కేవలం శ్రేయోభిలాష మాత్రమే అయి ఉండాలి. అలాంటప్పుడు అది నిషిద్ధమైన పరోక్షనింద క్రిందికి రాదు.

١٥٣٥ ـ وعن زَيْدِ بنِ أَرْقَمَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: خَرَجْنَا مَعَ رسولِ اللهِ ﷺ في سَفَرٍ أَصَابَ النَّاسَ فِيهِ شِدَّةٌ: فَقَالَ عبدُ اللهِ بنُ أُبَيٍّ: لَا تُنْفِقُوا على مَنْ عِنْدَ رَسُولِ اللهِ حَتَّى يَنْفَضُّوا وقال: لَئِنْ رَجَعْنَا إلى المَدِينَةِ لَيُخْرِجَنَّ الأعَزُّ مِنْها الأذَلَّ، فَأَتَيْتُ رسولَ اللهِ ﷺ، فَأَخْبَرْتُهُ بذلِكَ، فَأَرسلَ إلى عبدِ اللهِ بن أُبَيٍّ، فَاجْتَهَدَ يَمِينَهُ: مَا فَعَلَ، فقالوا: كَذَبَ زيدٌ رسولَ اللهِ ﷺ، فَوَقَعَ في نَفْسِي مِمَّا قالوه شِدَّةٌ حتى أَنْزَلَ اللهُ تَعَالَى تَصْدِيقِي: ﴿إِذَا جَآءَكَ ٱلْمُنَٰفِقُونَ﴾ ثُمَّ دَعَاهُم النَّبِيُّ ﷺ، لِيَسْتَغْفِرَ لهم فَلَوَّوْا رُؤُوسَهُمْ. متفقٌ عليه.

1535. జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం: ఒకానొక ప్రయాణంలో మేము దైవ ప్రవక్త (సల్లం) వెంట వెళ్ళాం. ఆ ప్రయాణంలో ప్రజలకు పెద్ద ఇబ్బంది ఎదురయింది. అప్పుడు అబ్దుల్లాహ్ బిన్ ఉబై (తన అనుచరులను) ఇలా (ప్రేరేపించటం) మొదలుపెట్టాడు: "దైవప్రవక్త సహచరుల కోసం మీరు ధనం ఖర్చుపెట్టకండి. అప్పుడు వాళ్ళం తటవాళ్ళే ఆయన్ని విడిచి వెళ్లి పోతారు." ఆ తర్వాత ఇలా అన్నాడు: "ఒకవేళ మనం తిరిగి మదీనా చేరు కుంటే మనలో అందరికన్నా గౌరవనీయుడు అందరికన్నా హీనుణ్ణి వెళ్ళగొడ్తాడు."

నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఈ విషయం ఆయనకు తెలియ జేశాను. ఆయన అబ్దుల్లాహ్ బిన్ ఉబైను పిలిచి విచారించారు. అందుకు అతను తాను అసలు ఆ మాట అనలేదని ఒట్టు మీద ఒట్టేసి చెప్పాడు. దాంతో ప్రజలు "జైద్ దైవప్రవక్త (సల్లం)తో అబద్ధం చెప్పాడని" నన్ను తలా ఓ మాట అన్నారు. ప్రజలు ఆ

మాట అనటంతో నా మనసుకు చాలా బాధ కలిగింది. చివరికి నేను చెప్పిన మాటను ధృవపరుస్తూ దేవుడే "ఇజా జాఅకల్ మునాఫిఖూన్' అనే సూరాను అవతరింపజేశాడు. (అందులో కపటి అబ్దుల్లాహ్ అన్న మాటలు వివరించ బడ్డాయి) ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) వారి (అనగా ఆ కపటుల) మన్నింపు కోసం ప్రార్థించే నిమిత్తం వారిని పిలి చారు. కాని వారు (మన్నింపు ప్రార్థన కోసం) రాకుండా తలలు తిప్పు కున్నారు.

*(సహీహ్ బుఖారీలోని తఫ్సీర్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సిఫాతుల్ మునాఫిఖీన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అబ్దుల్లాహ్ బిన్ ఉబై మదీనా నగరంలో కపటులకు సర్దారుగా ఉండేవాడు. హదీసులో పేర్కొనబడినట్లు బనుల్ ముస్తలిఖ్ యుద్ధం కోసం చేసిన ప్రయాణంలో అతను దైవప్రవక్త సహచరుల గురించి, స్వయానా దైవప్రవక్త (సల్లం) గురించి చాలా అనుచితంగా మాట్లాడాడు. వారు అలా మాట్లాడుకుంటుండగా జైద్ బిన్ అర్ఖమ్ (రజి) విని దైవప్రవక్త (సల్లం)కు ఆ విషయం తెలియజేశారు. దీనిద్వారా తెలిసేదేమంటే కపటుల పన్నాగాలను, కుటిల యత్నాలను బట్టబయలు చేయటం పరోక్ష నింద క్రిందికి రాదు. పైగా ఇస్లాం మరియు ముస్లింల ప్రయోజనాల దృష్ట్యా వాటి గురించి ప్రజలకు తెలియజేయటం చాలా అవసరం కూడా.

1536. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: అబూ సుఫ్యాన్ గారి భార్య అయిన హింద్ దైవప్రవక్త (సల్లం) ముందు ఇలా విన్నవించుకుంది: "అబూ సుఫ్యాన్ చాలా పిసినారి మనిషి. అయనకు తెలియకుండా నేను ఆయన ధనంలోనుంచి తీసుకో

١٥٣٦ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَتْ هِنْدُ امْرَأَةُ أَبِي سُفْيَانَ لِلنَّبِيِّ ﷺ: إِنَّ أَبَا سُفْيَانَ رَجُلٌ شَحِيحٌ وَلَيْسَ يُعْطِينِي مَا يَكْفِينِي وولَدِي إِلَّا مَا أَخَذْتُ مِنه، وَهُوَ لَا يَعْلَمُ؟ قَالَ: «خُذِي مَا يَكْفِيكِ وَوَلَدَكِ بِالْمَعْرُوفِ» متفقٌ عليه.

వటమే తప్ప ఆయన నాకూ, నా పిల్లల ఖర్చులకు సరిపోయేంత డబ్బు కూడా ఇవ్వరు." దానికి బదులిస్తూ దైవప్రవక్త (సల్లం) "నువ్వు చట్టప్రకారం నీకూ, నీ పిల్లలకు సరిపోయేటంత ధనం తీసేసుకో" అని చెప్పారు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నఫఖాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అఖ్జియా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హింద్, ఈవిడ ముఆవియా (రజి)గారి తల్లిగారు. మక్కా విజయం సందర్భంగా ఈమె తన భర్త అబూ సుఫ్యాన్‌తో పాటు ఇస్లాం స్వీకరించారు. ఈ హదీసు ద్వారా బోధపడే ఒక ముఖ్యవిషయం ఏమిటంటే షరీఅత్ ఆజ్ఞ గురించి తెలుసుకునే ఉద్దేశ్యంతో భార్యాభర్తలు ఒకరి లోపాలను గురించి మరొకరు ముఫ్తీ ముందు వివరించవచ్చు. రెండోది, భర్త గనక చట్టప్రకారం ఇంటి ఖర్చులకు ఇవ్వవలసిన మొత్తం భార్యకు ఇవ్వకపోతే అతని ధనంలో నుంచి అతనికి తెలియకుండా చట్టప్రకారం ఇంటి ఖర్చులకు సరిపడ ధనం తీసుకునే అనుమతి ఆమెకు ఉంది. అయితే ఆమె ఇంటి ముఖ్యావసరాలు తీర్చుకోవటం కోసం ధనం తీసుకోవాలి గాని దుబారాగా ఖర్చుపెట్టి భర్తను దివాళా కోరుగా మార్చేయాలన్న ఉద్దేశ్యంతో తీసుకోరాదు.



257వ అధ్యాయం

# ٢٥٧ ـ بَابُ تَحْرِيمِ النَّمِيمَةِ وَهِيَ نَقْلُ الْكَلَامِ بَيْنَ النَّاسِ عَلَى جِهَةِ الإِفْسَادِ

# చాడీలు చెప్పటం నిషిద్ధం, చాడీ అంటే సంబంధాలను చెడగొట్టే ఉద్దేశ్యంతో ఒకరి మాటలు ఇంకొకరికి చెప్పటం

قَالَ اللهُ تَعَالَى ﴿هَمَّازٍ مَّشَّآءِۭ بِنَمِيمٍ﴾ [القلم: ١١]. وقَالَ تَعَالَى: ﴿مَّا يَلْفِظُ مِن قَوْلٍ إِلَّا لَدَيْهِ رَقِيبٌ عَتِيدٌ﴾ [ق: ١٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ఇతరుల్ని ఎత్తిపొడుస్తూ, చాడీలు చెబుతూ తిరుగుతుండేవాడికి ఏ మాత్రం లొంగకు."

*(అల్ ఖలమ్: 11)*

"మనిషి నోటి నుండి వెడలే ప్రతి మాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు." *(ఖాఫ్: 18)*

١٥٣٧ ـ وَعَنْ حُذَيْفَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا يَدْخُلُ الجَنَّةَ نَمَّامٌ» متفقٌ عليه.

1537. హజ్రత్ హుజైఫా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "చాడీలు చెప్పేవాడు స్వర్గంలోకి వెళ్ళలేడు."

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చాడీ అనే పదానికి అర్థమేమిటో ఇమామ్ నవవీ (రహ్మలై) శీర్షికలోనే వివరించారు. చాడీలు చెప్పటం ముమ్మాటికీ నిషిద్ధం. ఈ విషయం తెలిసి కూడా ఎవడైనా దాన్ని ధర్మసమ్మతంగా భావించి చాడీలు చెబుతూ ప్రజల మధ్య సంబంధాలను చెడగొట్టటానికి పాల్పడితే అలాంటివారు ఎన్నటికీ స్వర్గానికి వెళ్ళలేరు. ఒకవేళ తాము దాన్ని హరామ్‌గా భావిస్తున్నప్పటికీ మానవ సహజమైన దౌర్బల్యం మూలంగా తమ వల్ల అలాంటి తప్పు జరిగి పోతుంటే అది వేరే విషయం. అలాంటివారు దేవుడు తమల్ని మొదట్లో క్షమించకపోతే ఆ పాపానికి నరకంలో కొంతకాలం శిక్ష అనుభవించి ఆ తర్వాత స్వర్గానికి వెళ్తారు. సూత్రప్రాయంగా

ఒక విషయం గుర్తుపెట్టుకోవాలి. దేవుని క్షమాభిక్ష లభిస్తేనే తప్ప ఇలాంటి పాపాత్ములు మొదటి దశలోనే స్వర్గానికి వెళ్ళలేరు.

١٥٣٨ ـ وَعَنِ ابنِ عَبّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ: مَرَّ بِقَبْرَيْنِ فقال: «إنَّهما يُعَذَّبانِ وما يُعَذَّبانِ في كَبِيرٍ! بَلَى إِنَّهُ كَبِيرٌ: أَمَّا أَحَدُهُمَا، فَكَانَ يَمْشِي بِالنَّمِيمَةِ، وَأَمَّا الآخَرُ فَكَانَ لَا يَسْتَتِرُ مِنْ بَولِهِ». متفقٌ عليه، وهذا لفظ إحدى روايات البخاري. قالَ العُلَمَاءُ: مَعْنَى: «وَمَا يُعَذَّبَانِ في كَبِيرٍ» أَيْ: كَبِيرٍ في زَعْمِهِما وقيلَ: كَبِيرٌ تَرْكُهُ عَلَيْهِما.

1538. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) రెండు సమాధుల దగ్గర్నుంచి వెళ్తూ ఇలా అన్నారు: "ఈ రెండు సమాధుల్లో ఉన్నవారికి శిక్షపడుతోంది. వీరికి ఈ శిక్ష ఏదో పెద్ద విషయం మూలంగా పడుతుంది కాదు! (ఆ తర్వాత ఆయనే అన్నారు) ఎందుకు కాదు, అది పెద్ద విషయమే. వీరిలో ఒకడు చాడీలు చెప్తూ తిరుగుతుండేవాడు. మరొకతను మూత్రం పోసినప్పుడు ఒంటిమీద దాని తాలూకు తుంపరలు పడకుండా జాగ్రత్తపడేవాడు కాదు."

(బుఖారీ-ముస్లిం)

"వీరికి ఈ శిక్ష ఏదో పెద్ద విషయం మూలంగా పడటం లేదు" అనే వాక్యాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ పండితులు "దీని అర్థం వారి దృష్టిలో ఆ విషయం పెద్దది కాదు. కాని షరీఅత్ దృష్టిలో అది చాలా పెద్ద విషయం" అని అన్నారు. మరికొంతమంది దాని భావం "ఆ అలవాటును వదిలేయటం వారికి కష్టమైన పని కాదు (వారు తలచుకుంటే ఆ పని మానగలిగే వారు)" అని చెప్పారు.

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శుచీ శుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) 'లా యస్తతిరు మిన్ బౌలిహీ' అనే వాక్యానికి ఇంకొక అర్థం కూడా ఉంది. అదేమిటంటే ఆ వ్యక్తి మూత్రం పోసేటప్పుడు ప్రజలెవరికీ కనపడని చోటుకెళ్ళి మూత్ర విసర్జన చేయడు. నిస్సిగ్గుగా అందరూ చూస్తుండగానే మూత్ర విసర్జన చేయటానికి కూర్చుంటాడు. ఈ లజ్జారాహిత్యం కూడా పాపమే. మొత్తానికి ఈ హదీసు ద్వారా బోధపడేదేమంటే చాడీలు చెప్పటం, మూత్రపు తుంపరల విషయంలో అజాగ్రత్త వహించటం లేక మూత్రవిసర్జన సమయంలో పరదా పాటించకపోవటం- ఇవన్నీ ఘోరమైన పాపాలు, ఇలాంటి పాపాలకు పాల్పడేవారు పట్టుబడతారు.

2) కొంతమంది సమాధి యాతనను నమ్మరు. ఈ హదీసు ద్వారా సమాధి యాతన నిజమని రుజువు అవుతోంది.

١٥٣٩ - وَعَن ابنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْـهُ أَنَّ النَّبِـيَّ ﷺ قَـالَ: «ألا أُنَبِّئُكُـمْ مَا العَضْهُ؟ هِيَ النَّمِيمَةُ، القَالَةُ بَيْنَ النَّاسِ» رواه مسلم.

«العَضْـهُ»: بفَتْحِ العينِ المُهْمَلَةِ، وإسْكَانِ الضَّادِ المُعْجَمَةِ، وبالهاءِ على وزنِ الـوجـهِ، ورُوِي: «العِضَـةُ» بكَسْرِ العَيْنِ وفَتْحِ الضَّادِ المُعْجَمَةِ عَلى وَزْنِ العِدَةِ، وهِيَ: الكَذِبُ والبُهْتَانُ، وعَلى الرِّوايةِ الأولى: العَضْهُ مصدرٌ، يقال: عَضَهَهُ عَضهاً؛ أي: رماهُ بالعَضهِ.

1539. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: 'అజ్హు' అంటే ఏమిటో నేను మీకు తెలుపనా? అజ్హు అంటే చాడీలు చెప్పటం, ప్రజల్లో ఒకరి గురించి మరొకరికి చెప్పటం. (ముస్లిం)

అజ్హు-వజ్హు అన్న విధంగా పలకాలి. అయితే దీన్ని 'ఇజతు' అని పలకాలని వేరొక కథనం కూడా ఉంది. దీనికి అబద్ధం, అపనింద అనే అర్థాలున్నాయి.

*(సహీహ్ ముస్లింలోని బిర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చాడీలు చెప్పటం, అబద్ధం పలకటం, అపనిందలు మోపటం మొదలగునవన్నీ ఘోరమైన పాపాలని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఎందుకంటే వీటి మూలంగా సమాజంలో కల్లోలం వ్యాపిస్తుంది. ప్రజాసంబంధాలు చెడిపోతాయి. మనుషుల మధ్య అంతరాల అగాధాలు పెరిగిపోతాయి. ఒక ముస్లిం వ్యక్తి నడవడిక ఇలాంటి లోపాలు లేకుండా పవిత్రంగా ఉండాలి.

258వ అధ్యాయం

# ٢٥٨ ـ بَابُ النَّهْيِ عَنْ نَقْلِ الْحَدِيثِ وَكَلَامِ النَّاسِ إِلَى وُلَاةِ الأُمُورِ إِذَا لَمْ تَدْعُ حَاجَةٌ كَخَوْفِ مَفْسَدَةٍ وَنَحْوِهَا

## ప్రజల సంభాషణలు, వారి మాటలు అనవసరంగా అధికారులకు చేరవేయరాదు. ఒకవేళ కల్లోలం వ్యాపించే లేక నష్టం జరిగే సూచనలుంటే అప్పుడు ధర్మసమ్మతమే

قَالَ الله تَعَالى: ﴿ وَلَا تَعَاوَنُوا عَلَى الْإِثْمِ وَالْعُدْوَانِ ﴾ [المائدة: ٢]. وفي الباب الأحاديثُ السابقةُ في البابِ قبلَهُ.

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "పాపకార్యాలలో, అత్యాచారాలలో ఎవరితోనూ సహకరించకండి." (మాఇద: 2)

ఇంతకు ముందు అధ్యాయంలో వచ్చిన హదీసులు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తాయి. (అదనంగా మరో హదీసును పరిశీలించండి)

١٥٤٠ ـ وعن ابنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا يُبَلِّغْني أَحَدٌ من أَصْحَابي عَنْ أَحَدٍ شَيْئاً، فَإِنِّي أُحِبُّ أَنْ أَخْرُجَ إِلَيْكُم وأَنَا سَلِيمُ الصَّدْرِ» رواهُ أبو داودَ والترمذيّ.

1540. హ్రజత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: నా సహచరుల్లో ఎవరూ కూడా ఎవరి గురించీ నాతో ఏ మాటా చెప్పరాదు. ఎందుకంటే నేను మీ దగ్గరికి వచ్చినప్పుడు (మీలో ప్రతి ఒక్కరి విషయంలో) నా హృదయం స్వచ్ఛంగా ఉండాలని నేను కోరు కుంటాను. *(అబూదావూద్-తిర్మిజీ)*

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం - సుననె తిర్మిజీలోని మనాఖిబ్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

'మాట' అంటే దైవప్రవక్త (సల్లం)కు నచ్చని మాట లేక సంబంధిత దాసుని వ్యక్తిత్వానికి నష్టం కలిగించే మాట అని భావం. ఇందులో తోటివారి వ్యక్తిగత విషయాలను మరుగున ఉంచాలని తాకీదు చేయబడింది. ప్రజల మాటలు అనవసరంగా అధికారులకు చేరవేయటాన్ని వారించటం జరిగింది. ఇమామ్ నవవీ (రహ్మాలై) పెట్టిన శీర్షిక ద్వారా కూడా ఈ విషయాలు బోధపడుతున్నాయి.



## 259వ అధ్యాయం

## ٢٥٩ ـ بَابُ ذَمِّ ذِي الْوَجْهَيْنِ

## రెండు నాల్కల ధోరణికి పాల్పడే వ్యక్తి చెడులు

قَالَ اللهُ تَعَالى: ﴿ يَسْتَخْفُونَ مِنَ النَّاسِ وَلَا يَسْتَخْفُونَ مِنَ اللَّهِ وَهُوَ مَعَهُمْ إِذْ يُبَيِّتُونَ مَا لَا يَرْضَىٰ مِنَ الْقَوْلِ وَكَانَ اللَّهُ بِمَا يَعْمَلُونَ مُحِيطًا﴾ [النساء: ١٠٨]

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు:

"వారు తమ దుష్కర్మలను మానవులకు తెలియకుండా దాచగలరు. కాని అల్లాహ్‌కు తెలియకుండా దాచలేరు. రాత్రులందు వారు ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా రహస్య సమాలోచనలు జరిపే సమయంలో కూడా ఆయన వారితో ఉంటాడు. వారి సకల చర్యలను అల్లాహ్ పరివేష్టించి ఉన్నాడు." *(నిసా: 108)*

١٥٤١ ـ وعن أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «تَجِدُونَ النَّاسَ مَعادِنَ: خِيارُهُمْ في الجاهِلِيَّةِ خِيارُهُمْ في الإِسْلامِ إذا فَقُهُوا، وَتَجِدُونَ خِيارَ النَّاسِ في هذا الشَّأْنِ أَشَدَّهُمْ لَهُ كَرَاهِيَةً، وَتَجِدُونَ شَرَّ النَّاسِ ذَا الْوَجْهَيْنِ، الَّذي يَأْتي هؤُلاءِ بِوَجْهٍ، وَهؤُلاءِ بِوَجْهٍ» متفقٌ عليه.

1541. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రజలు మీకు ఖనిజ నిక్షేపాల్లా కనిపిస్తారు. అజ్ఞాన కాలంలో మంచివారుగా ఉన్నవారు (ధర్మాన్ని) అర్థం చేసుకుంటే ఇస్లాం స్వీకరించిన తర్వాత కూడా వారు మంచి వారుగా ఉంటారు. ఈ అధికార వ్యవహారాన్ని అందరికన్నా ఎక్కువగా అసహ్యించుకునేవారే (దాన్ని నిర్వహించటంలో) అత్యంత సమర్థవంతులు అయి ఉండటం మీరు గమనిస్తారు. అలాగే ప్రజల్లో రెండు ముఖాలవారు అత్యంత నీచులయినట్లు మీరు గమనిస్తారు. వారు కొందరి దగ్గరికి ఒక

ముఖంతో, మరికొందరి దగ్గరికి ఇంకో ముఖంతో వెళ్తారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అవాయిలు కితాబిల్ మనాఖిబ్ - సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఖనిజ నిక్షేపాల్లా ఉంటారంటే వారికి తమకంటూ ఓ ప్రత్యేక వంశమూలం ఉంటుందని భావం. దాన్ని గర్వకారణంగా తలపోస్తారు. ఆ విధంగా పరువు ప్రతిష్ఠలు, ప్రాపంచిక హోదా అంతస్తులు కలిగివున్న వంశాలవారు ఇస్లాం స్వీకరిస్తే వారు ఆ తర్వాత కూడా తమ ప్రత్యేక గౌరవౌన్నత్యాలతోనే జీవిస్తారు. ఎందుకంటే ఇస్లాం స్వయంగా ఎంతో గౌరవప్రదమైన, ప్రతిష్ఠాత్మకమైన జీవన ధర్మం. అందువల్ల ఇస్లాం స్వీకరించటం మూలంగా వారి హోదా అంతస్తుల్లో ఎలాంటి లోటూరాదు. అయితే దానికోసం వారు ధర్మం పట్ల సరైన అవగాహన కలిగివుండి, ధర్మాచరణను తమ ముఖ్య చిహ్నంగా చేసుకోవాలి.

2) పదవీ హోదాలను కాంక్షించనివారు, పైగా వాటి బాధ్యతలను తలచుకొని భయంతో వణికిపోయేవారి చేతులకు గనక అధికారం లభిస్తే వారు ప్రజలకు ఎంతో మేలు చేస్తారు. ఎందుకంటే ఇలాంటి వారు ఆ పదవీ బాధ్యతల్ని పూర్తి నిజాయితీగా నెరవేరుస్తారు. వారు తమ స్వార్థం గురించి ఆలోచించకుండా దేశం, జాతి ప్రయోజనాలకు ప్రాధాన్యత నిస్తారు. దేవుడు నిర్ణయించిన హద్దుల్ని అతిక్రమించకుండా తాము స్వయంగా వాటిని నెలకొల్పేందుకు కృషి సలుపుతారు.

3) ప్రజల్లో కొందరు ఒక వర్గం వారి దగ్గరికెళ్ళి తాము వారి శ్రేయోభిలాషులమేననీ, వారి మిత్రులమేనని, వారి ప్రత్యర్థి వర్గానికి తామూ శత్రువులమని చెబుతారు. కాని ఆ తర్వాత ప్రత్యర్థి వర్గం దగ్గరికి వెళ్ళినప్పుడు వారితో కూడా అలాంటి మాటలే మాట్లాడతారు. ఇలాంటి వారినే హదీసులో రెండు ముఖాలవారు అని చెప్పటం జరిగింది. వీరు పరమ నీచులు. వీరికి భిన్నంగా ప్రతి వర్గం వారి దగ్గరికి వెళ్ళి శాయశక్తులా వారిని సంస్కరించటానికి ప్రయత్నించేవారు ఉత్తములు.

1542. హజ్రత్ ముహమ్మద్ బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం కొంతమంది ఆయన తాతగారిని అడిగారు, "మేము అధికారుల దగ్గరికి వెళ్ళినప్పుడు మేము బయట మాట్లాడుకునే మాటలకు వ్యతిరేకమైన మాటలు

١٥٤٢ ـ وعَنْ محمدِ بنِ زَيْدٍ أَنَّ نَاساً قَالُوا لِجَدِّهِ عبدِ اللهِ بنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا: إِنَّا نَدْخُلُ على سَلاطِينِنا فنقولُ

لهُمْ بِخِلافِ ما نَتَكَلَّمُ إذَا خَرَجْنَا مِنْ عِنْدِهِمْ قَالَ: كُنَّا نَعُدُّ هذا نِفاقاً عَلى عَهْدِ رسولِ اللهِ ﷺ. رواه البخاري.

వారితో మాట్లాడతాము. ఇది ధర్మ సమ్మతమేనా?" అని. దానికాయన సమాధానమిస్తూ "దైవప్రవక్త (సల్లం) కాలంలో మేము దీన్ని కాపట్యంగా పరిగణించేవాళ్ళం" అని చెప్పారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అహ్కామ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అధికారుల ముందు ఉన్నప్పుడు వారిని పొగడటం వారి గైర్హాజరులో వారిని తిట్టుకోవటం, వారికి శాపనార్థాలు పెట్టటం కపటపనిగా పరిగణించబడుతుంది. ఎందుకంటే మనసులో ఉన్నది నోటి ద్వారా వెలువడటం లేదు. నోటిద్వారా వెలువడుతున్నది మనసులో లేదు. ఒక నిజమైన ముస్లిం లక్షణమేమిటంటే, తన రాజు గనక మంచివాడు, భక్తిపరుడు, న్యాయశీలుడయితే అవసరమయితే ముఖస్తుతికి పాల్పడకుండా అతని ముందే అతన్ని పొగుడుతాడు. అంతేకాదు, అతని గైర్హాజరులో కూడా అతన్ని మంచి మాటలతో గుర్తుచేసుకుంటాడు. ఒకవేళ అతను చెడ్డవాడయితే అతని ముఖం మీదే ఆ విషయం చెప్పి దైవ అవిధేయతకు పాల్పడటం వల్ల కలిగే దుష్పరిణామం గురించి హెచ్చరిస్తాడు. అతని పరోక్షంలో కూడా అలాగే ప్రవర్తిస్తాడు. శ్రేయోభిలాషుల పద్ధతి ఇదే. దీని గురించే ముస్లింలకు తాకీదు చేయబడింది. దీనికి భిన్నంగా మొదటి ప్రవర్తన గోముఖ వ్యాఘ్రాల ప్రవర్తన. దాన్ని ఇంతకుముందు హదీసులో తీవ్రంగా గర్హించటం జరిగింది.



## 260వ అధ్యాయం

# ٢٦٠ ـ بَابُ تَحْرِيمِ الْكَذِبِ

# అబద్ధం చెప్పటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿وَلَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهِۦ عِلْمٌ﴾ [الإسراء: ٣٦]. وقالَ تَعَالَى: ﴿مَّا يَلْفِظُ مِن قَوْلٍ إِلَّا لَدَيْهِ رَقِيبٌ عَتِيدٌ﴾ [ق: ١٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"నీకు తెలియని విషయాల వెంటపడకు." *(ఇస్రా:36)*

"మనిషి నోటి నుండి వెడలే ప్రతిమాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు." *(ఖాఫ్:18)*

١٥٤٣ ـ وعن ابنِ مسعودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ الصِّدْقَ يَهْدِي إِلَى الْبِرِّ وَإِنَّ الْبِرَّ يَهْدِي إِلى الجَنَّةِ، وَإِنَّ الرَّجُلَ لَيَصْدُقُ حَتَّى يُكْتَبَ عِنْدَ اللهِ صِدِّيقاً، وَإِنَّ الْكَذِبَ يَهْدِي إِلى الفُجُورِ، وَإِنَّ الفُجُورَ يَهْدِي إِلَى النَّارِ، وَإِن الرَّجلَ لَيَكْذِبُ حَتَّى يُكْتَبَ عِنْدَ اللهِ كَذَّاباً» متفقٌ عليه.

1543. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నిజాయితి సత్కార్యం వైపుకు తీసుకెళ్తుంది. సత్కార్యం స్వర్గానికి గొనిపోతుంది. మనిషి నిజం చెబుతూ చెబుతూ చివరికి దేవుని దగ్గర నిజాయితీ పరుడుగా నమోదు చేయబడతాడు. అబద్ధం అవిధేయత వైపుకు తీసు కెళ్తుంది. అవిధేయత నరకానికి గొని పోతుంది. మనిషి అబద్ధం చెబుతూ చెబుతూ చివరికి దేవుని దగ్గర 'అబద్ధాలకోరు'గా రాసుకోబడతాడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

1) మనిషి ఏ ప్రవర్తనను అలవర్చుకుంటే అదే అతని ప్రత్యేక లక్షణంగా గుర్తింపు

పొందుతుంది. దాంతోనే అతను ప్రసిద్ధి చెందుతాడు. అందుకే మనిషి ఎల్లప్పుడూ మంచిమాటలు, మంచి ప్రవర్తనను మాత్రమే అలవర్చుకోవాలి. దానివల్ల ప్రజలు ఎలాగూ తనను వేన్నోళ్లా పొగుడుతారు. అంతేకాకుండా దేవుని దగ్గర కూడా తనకు మంచి స్థానం లభిస్తుంది.

2) నిజం విముక్తికి, అబద్ధం వినాశానికి దారితీస్తుంది.

١٥٤٤ ـ وعَنْ عبدِ اللهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ قال: «أَرْبَعٌ مَنْ كُنَّ فِيهِ، كَانَ مُنَافِقاً خَالِصاً، وَمَنْ كَانَتْ فِيهِ خَصْلَةٌ مِنْهُنَّ، كَانَتْ فِيهِ خَصْلَةٌ مِنْ نِفاقٍ حَتَّى يَدَعَهَا: إذا اؤْتُمِنَ خَانَ، وَإذا حَدَّثَ كَذَبَ، وَإذَا عاهَدَ غَدَرَ، وَإذَا خَاصَمَ فَجَرَ» متفقٌ عليه. وقد سبق بيانه معَ حديثِ أبي هُرَيْرَةَ بنحوهِ في «باب الوفاءِ بالعهد».

1544. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నాలుగు లక్షణాలున్న వ్యక్తి ఒట్టి కపటిగా పరిగణించబడతాడు. ఒకవేళ వాటిలో ఏ ఒక్క లక్షణం అతనిలో ఉన్నా దాన్ని వదలిపెట్టనంతవరకూ అతనిలో ఒక కపట లక్షణం ఉన్నట్లుగా భావింపబడుతుంది. (ఆ నాలుగు లక్షణాలు ఇవి:) 1) అతనికి ఏదైనా అప్పగిస్తే అందులో అతను ద్రోహానికి పాల్పడతాడు. 2) మాట్లాడితే అబద్ధం చెబుతాడు. 3) వాగ్దానం చేసి ఆ తర్వాత మోసం చేస్తాడు. 4) ఎవరితోనైనా పోట్లాడితే, నోరు పారేసుకుంటాడు. *(బుఖారీ-ముస్లిం)*

ఇంతకు ముందు 'వాగ్దాన పాలన' అనే అధ్యాయంలో ఇలాంటిదే అయిన అబూహురైరా హదీసుతోపాటు దీనిని వివరించటం జరిగింది.

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మరిన్ని వివరాల కోసం వాగ్దానపాలన అనే అధ్యాయం క్రింద ప్రస్తావించబడిన 689, 690 హదీసులు చూడండి. ఈ రోజుల్లో విశ్వాసపరమైన కపటులెవరూ లేరు గాని నేటి

ముస్లింలలో కటప ప్రవర్తన సాధారణమైపోయింది. కనుక ముస్లింలలోని అత్యధిక మందిలో ఈ కపట అలవాట్లు ఉన్నాయని చెప్పవచ్చు. దేవుడు మనల్నందరినీ వాటి నుంచి రక్షించుగాక!

١٥٤٥ - وعن ابن عباس رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ تَحَلَّمَ بِحُلْمٍ لَمْ يَرَهُ، كُلِّفَ أَنْ يَعْقِدَ بَيْنَ شَعِيرَتَينِ وَلَنْ يَفْعَلَ، وَمَنِ اسْتَمَعَ إِلى حَدِيثِ قَوْمٍ وَهُمْ لَهُ كارِهُونَ، صُبَّ في أُذُنَيْهِ الآنُكُ يَوْمَ القِيامَةِ، وَمَنْ صَوَّرَ صُورَةً عُذِّبَ، وَكُلِّفَ أَنْ يَنْفُخَ فِيها الرُّوحَ وَلَيْسَ بِنَافِخٍ» رواه البخاري. «تحلَّم» أي: قَالَ إِنَّهُ حَلَمَ في نَوْمِهِ وَرَأى كَذَا وَكَذَا؛ وهو كاذبٌ. و«الآنك» بالمدِّ وضمِّ النونِ وتخفيفِ الكاف: وهو الرَّصَاصُ المذابُ.

1545. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే తాను చూడని కల గురించి చూశానని అబద్ధం చెప్పాడో అతన్ని (ప్రళయ దినాన) రెండు బార్లీ గింజల మధ్య ముడివేయమని ఆజ్ఞాపించటం జరుగుతుంది. కాని అతను ఎన్నటికీ ఆ పని చేయలేడు. ఎవడయితే ఇతరుల ఇష్టం లేకుండా వారి మాటల్ని శ్రద్ధగా వినటానికి ప్రయత్నిస్తాడో ప్రళయదినాన అతని చెవిలో కరిగించిన సీసం పోయబడుతుంది. ఎవడయితే (ప్రాణుల) చిత్రాలను నిర్మిస్తాడో అతణ్ణి శిక్షించి వాటిలో ప్రాణం పోయమని ఒత్తిడి చేయటం జరుగుతుంది. కాని అతను వాటిలో ప్రాణం పోయలేడు. (బుఖారీ)

'తహల్లమ' అంటే తాను కలలో ఈ విధంగా చూశానని అబద్ధం చెప్పటం. 'ఆనుకు' అంటే కరిగించబడిన సీసము.

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) చెడ్డ కలని 'హుల్మ్' అని అంటారు. ఇక్కడ ఈ పదం కేవలం 'కల' అనే అర్థంలో వాడబడింది. కల గురించి లేనిపోని విషయాలు కల్పించి చెప్పటం చాలా గర్హనీయమైన విషయం. పేరు ప్రఖ్యాతుల కోసం ప్రాకులాడేవారిలో, తమ పరిశుద్ధతను ప్రచారం

చేసుకోవాలనుకునే వారిలో ఈ రోగం చాలా ఎక్కువగా ఉంటుంది. కొన్ని సంవత్సరాల క్రితం మనదేశంలో ఒక పెద్ద వక్త తాను ప్రజానాయకునిగా చెలామణి అవ్వాలన్న దురుద్దేశ్యంతో తనకు ఎవేవో చిత్రవిచిత్రమైన, గొప్పవారికి వచ్చే కలలు వస్తున్నాయని ప్రజల్లో ప్రచారం చేశాడు. కాని నిజానికి అవన్నీ అతను కల్పించుకున్న మాటలే. అందుకే చాలా తక్కువ కాలంలోనే అతని బండారం బయటపడింది. ఎవరూ కూడా అతన్ని నమ్మలేదు.

2) ప్రజల రహస్యాలను తెలుసుకోవటానికి ప్రయత్నించటాన్ని, వారి తప్పుల్ని దేవులాడటాన్ని ఈ హదీసులో వారించటం జరిగింది.

3) చిత్రాలు రూపొందించటం చాలా గర్హనీయమైన విషయం. చేత్తో చేసే చిత్రాలయినా, లేక కెమేరాతో తీసిన చిత్రాలయినా ఏవయినా ఒకటే. ఈ రెండిట్లో ఏ మాత్రం తేడా లేదు. అవన్నీ చిత్రనిర్మాణం క్రిందికే వస్తాయి. ఆఖరికి చలన చిత్రాలు తీసేవారికి కూడా ఇదే శిక్షపడుతుంది. విచిత్రమేమిటంటే చాలామంది చలన చిత్రాలను అసలు చిత్రాలుగానే భావించరు.

١٥٤٦ ـ وعن ابن عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «أَفْرَى الفِرَى أَنْ يُرِيَ الرَّجُلُ عَيْنَيْهِ مَا لَمْ تَرَيَا». رواهُ البخاري. ومعناه: يقولُ: رأيتُ، فيما لم يَرَهُ.

1546. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అన్నింటికంటే పెద్ద అబద్ధమేమిటంటే మనిషి తన కళ్ళకు, అవి చూడని వాటిని చూపించటం. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో కూడా అబద్ధం చెప్పటాన్ని గర్హించటం జరిగింది. కల గురించయినా లేక మేల్కొని ఉన్నప్పుడు జరిగే సంఘటనల గురించయినా తాము చూడని విషయాన్ని చూశామని చెప్పటం మహా అబద్ధం.

١٥٤٧ ـ وعن سَمُرَةَ بنِ جُنْدُبٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ مِمَّا يُكْثِرُ أَنْ يَقُولَ لأَصْحَابِهِ: «هَلْ رَأَى أَحَدٌ

1547. హజ్రత్ సమురా బిన్ జుందుబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తరచూ అడుగుతుండే విషయాల్లో ఒకటేమిటంటే ఆయన తన సహచరుల్ని "మీలో ఎవరయినా ఏదయినా కల చూశారా?" అని అడుగుతారు.

مِنكُمْ مِنْ رُؤْيَا؟» فَيَقُصُّ عَلَيْهِ مَنْ شَاءَ اللهُ أَنْ يَقُصَّ، وَإِنَّهُ قَالَ لنا ذاتَ غَدَاةٍ: «إِنَّهُ أَتَانِيَ اللَّيْلَةَ آتِيَانِ، وإِنَّهُمَا قَالا لِي: انْطَلِقْ، وَإِنِّي انْطَلَقْتُ مَعَهُمَا، وَإِنَّا أَتَيْنَا عَلى رَجُلٍ مُضْطَجِعٍ، وإِذا آخَرُ قَائِمٌ عَلَيْهِ بِصَخْرَةٍ، وَإِذَا هُوَ يَهْوِي بِالصَّخْرَةِ لِرَأْسِهِ، فَيَثْلَغُ رَأْسَهُ، فَيَتَدَهْدَهُ الحَجَرُ هَا هُنَا،

అప్పుడు ఎవరయినా (తాము కలలో చూసింది) దేవుడు తలచినట్లు వివరిస్తారు.

ఒకరోజు ఉదయం స్వయంగా దైవ ప్రవక్త ఈ విధంగా వివరించారు: రాత్రి (కలలో) నా దగ్గరికి వచ్చేవారు (దూతలు) ఇద్దరు వచ్చి "పదండి" అన్నారు. నేను వారివెంట నడిచాను. అలా నడుస్తూ మేము ఒకతని సమీపం నుంచి వెళ్ళాం. అతను పడుకొని ఉన్నాడు. అతని దగ్గరే ఇంకో వ్యక్తి ఒక పెద్ద బండరాయి తీసుకొని అతన్ని కొట్టటానికి నించున్నాడు. అతను ఆ రాయితో పడుకున్న వ్యక్తి తల నుజ్జునుజ్జయ్యేలా కొడ్తున్నాడు. ఒక దెబ్బ కొట్టగానే ఆ రాయి దొర్లు కుంటూ కాస్తంత దూరంలో పోయి పడుతోంది. అతను ఆ రాయివెంటే నడిచివెళ్ళి దాన్ని మళ్ళీ పట్టుకొస్తు న్నాడు. అతను తిరిగొచ్చేలోగా ఇతని తల తిరిగి యధారూపంలోకి వచ్చే స్తోంది. అతను తిరిగొచ్చి ఇందాక చేసిన పనే మళ్ళీ చేస్తున్నాడు.

(దైవప్రవక్త (సల్లం) ఇలా అంటు న్నారు:) నేను ఆ ఇద్దరు వ్యక్తుల్ని అడిగాను, "సుబ్‌హానల్లాహ్! ఏమిటి దంతా?" అని. దానికి వారు (సమా ధానం చెప్పకుండా) "పదండి పదండి"

فَيَتْبَعُ الحَجَرَ فَيَأْخُذُهُ، فَلاَ يَرجعُ إِلَيْهِ حَتَّى يَصِحَّ رَأْسُه كَمَا كَانَ، ثُمَّ يَعُودُ عَلَيْهِ، فَيَفْعَلُ بِهِ مِثْلَ مَا فَعَلَ المَرَّةَ الأُولَى» قال: «قلتُ لهما: سُبْحَانَ اللهِ! مَا هٰذَانِ؟ قالا لي: انطَلِقِ انطَلِقْ، فانطَلَقْنَا، فَأَتَيْنَا عَلَى رَجُلٍ مُسْتَلْقٍ لِقَفَاه وَإِذا آخَرُ قائمٌ عَلَيْهِ بِكَلُّوبٍ مِنْ حَدِيدٍ، وإذا هُوَ يَأْتِي أَحَدَ شِقَّيْ وَجْهِهِ فَيُشَرْشِرُ شِدْقَهُ إلى قَفَاهُ، وَمَنْخِرَهُ إلى قَفَاهُ، وَعَيْنَهُ إلى قَفَاهُ، ثُمَّ يَتَحَوَّلُ إلى الجَانِبِ الآخَرِ فَيَفْعَلُ بِهِ مِثْلَ ما فعَلَ بالجانب الأول فَمَا يَفْرُغُ من ذٰلك الجَانِبِ حَتَّى يَصِحَّ ذلكَ الجانِبُ كما كَانَ، ثُمَّ يَعُودُ عليْهِ، فَيَفْعَلُ مِثْلَ مَا فعَل في المَرَّةِ الأُولى» قال: «قلتُ: سُبْحَانَ اللهِ!

అన్నారు. మేమక్కణ్ణుంచి బయలు దేరాం. దారిలో మాకు ఒకతను కనిపించాడు. అతను వెల్లకిలా పడుకొని ఉన్నాడు. అతని దగ్గరే ఇంకొకతను ఇనుముతో చేయబడిన జంబూర్ చేత బుచ్చుకొని అతనిమీద నించున్నాడు. పడుకొని వున్నవాని ముఖానికి ఒక వైపుకి వెళ్ళి అతని దవడని మెడ వెనుక భాగం వరకూ చీరేస్తున్నాడు. అలాగే అతని ముక్కు రంధ్రాన్ని, కంటిని కూడా మెడ వెనుక భాగం వరకూ చీరేస్తున్నాడు. ఆ తర్వాత మరో ప్రక్కకెళ్ళి తొలి ప్రక్క చేసిందే అటు ప్రక్క కూడా చేస్తున్నాడు. రెండోపక్క అతను ఆ పని ముగించేలోగానే మొదటి పక్క యధాతథంగా మారిపోతుంది. ఆ తర్వాత అతను తొలిపక్కకు వచ్చి మళ్ళీ అదే పని చేస్తున్నాడు.

నేనది చూసి, "సుబ్హానల్లాహ్! ఎవరు వీరిద్దరు?" అని అడిగాను. దానికి వారు (సమాధానం చెప్పకుండా) "పదండి, పదండి" అన్నారు. మేమింకా ముందుకు వెళ్ళాం. అక్కడ మాకు రొట్టెల పొయ్యి లాంటి ఓ పెద్ద గొయ్యి కనిపించింది. (ఉల్లేఖకులు ఇలా అంటున్నారు:) దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పినట్లు గుర్తు: ఆ గొయ్యిలో నుంచి పెద్దగా అరుపులు కేకలు వినిపించాయి. మేము ఆ గొయ్యిలోకి

مَا هذانِ؟ قال: قالا لي: انطَلِقِ انطَلِقْ، فَانطَلَقْنَا، فَأَتَيْنا عَلَى مِثْلِ التَّنُّورِ» فَأَحْسِبُ أَنَّه قال: «فإذا فيه لَغَطٌ، وَأَصْوَاتٌ، فاطَّلَعْنا فيه فَإِذَا فيهِ رجالٌ وَنِساءٌ عُرَاةٌ، وإذا هُمْ يَأْتِيهِمْ لَهَبٌ مِنْ أَسْفَلَ مِنهُمْ، فإذا أَتَاهُمْ ذلكَ اللَّهَبُ ضَوْضَوْا. قلتُ: ما هؤلاء؟ قالا لي: انْطَلِقِ انْطَلِقْ، فَانطَلَقْنَا فَأَتَيْنَا عَلَى نَهرٍ» حَسِبْتُ أَنَّهُ كَانَ يَقُولُ: «أَحْمَرُ مِثْلُ الدَّمِ، وَإذا في النَّهْرِ رَجُلٌ سَابِحٌ يَسْبَحُ، وَإذا عَلَى شَطِّ النَّهْرِ رَجُلٌ قَدْ جَمَعَ عِنْدَهُ حِجارةً كَثِيرَةً، وإذا ذلكَ السَّابِحُ يَسْبَحُ ما يَسْبَحُ، ثُمَّ يَأْتِي ذلكَ الذي قَدْ جَمَعَ عِنْدَهُ الحِجَارَةَ، فَيَفْغَرُ لَهُ فَاهُ، فَيُلْقِمُهُ حَجَراً، فَيَنْطَلِقُ فَيَسْبَحُ، ثُمَّ يَرْجِعُ إِلَيهِ، كُلَّمَا رَجَعَ إِلَيْهِ، فَغَرَ لَهُ فَاهُ، فَأَلْقَمَهُ

తొంగిచూశాము. అందులో నగ్నంగా ఉన్న స్త్రీలు, పురుషులు కనిపించారు. దాని అడుగు నుంచి ఒక అగ్నిజ్వాల పైకి లేస్తుంది. అది వారిని తాకగానే వారు ఒక్కసారిగా అరిచి గోలచేస్తున్నారు. నేను వారిని అడిగాను, "ఎవరు వీళ్లు?" అని. కాని వారు (అందుకు సమాధానం చెప్పకుండా) 'పదండి, పదండి' అన్నారు. మేము ఇంకా ముందుకు పోయాం. ఆ విధంగా పోతూపోతూ ఒక కాలువ దగ్గరికి చేరుకున్నాం. (ఉల్లేఖకుడు ఇలా అన్నాడు:) దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చెప్పినట్లు గుర్తు: ఆ కాలువ (లోని నీరు) రక్తంలా ఎర్రగా ఉంది. అందులో ఒకతను ఈదుతున్నాడు. ఆ కాలువ గట్టు దగ్గరే మరొకతను ఎన్నో రాళ్లు పోగేసుకొని కూర్చుని ఉన్నాడు. ఆ ఈతగాడు ఈదినంతసేపు ఈది ఆ తర్వాత రాళ్లు పోగేసుకొని కూర్చున్న వ్యక్తి దగ్గరికి వెళ్ళి అతనిముందు నోరు తెరుస్తున్నాడు. ఆ వ్యక్తి ఇతని నోట్లోకి రాతిముద్ద విసరేస్తున్నాడు. అతను వెనక్కివెళ్ళి కాసేపు కాలువలో ఈది మళ్ళీ తిరిగొస్తున్నాడు. అతను తిరిగొచ్చినప్పుడల్లా ఆ వ్యక్తి ముందుకెళ్ళి నోరు తెరుస్తున్నాడు. ఆ వ్యక్తి అతని నోట్లోకి రాతిముద్ద విసిరేస్తున్నాడు. నేను వారిని 'ఎవరు వీరిద్దరూ?' అని అడిగాను.

حَجَراً. قلت لهما: ما هذان؟ قالا لي: انْطَلِقِ انْطَلِقْ، فَانْطَلَقْنَا، فَأَتَيْنَا عَلى رَجُلٍ كَرِيهِ المَرْآةِ، أوْ كَأكْرَهِ ما أنتَ راءٍ رجلاً مَرْأى، فَإذا هو عِنْدَهُ نَارٌ يَحُشُّها وَيَسْعَى حَوْلَهَا. قلتُ لهما: ما هذا؟ قالا لي: انطَلِقِ انطَلِقْ، فَانْطَلَقْنَا فَأَتَيْنا على رَوْضةٍ مُعْتَمَّةٍ فِيهَا مِنْ كلِّ نَوْرِ الرَّبِيعِ، وإذا بَيْنَ ظَهْرَيِ الرَّوْضَةِ رَجُلٌ طويلٌ لا أكادُ أرى رَأْسَهُ طُولاً في السَّماءِ، وإذا حَوْلَ الرَّجُلِ مِنْ أكثرِ وِلدانٍ رَأَيْتُهُمْ قطُّ، قُلتُ: ما هذا؟ وما هؤلاءِ؟ قالا لي: انْطَلِقْ انْطَلِقْ، فَانْطَلَقْنا، فَأتَيْنا إلى دَوْحَةٍ عَظِيمَةٍ لَمْ أرَ دَوْحَةً قطُّ أعظمَ منها، ولا أحْسَنَ! قالا لي: ارْقَ فيها، فَارْتَقَيْنا فيها إلى مدينةٍ مَبْنِيَّةٍ بِلَبِنِ ذَهَبٍ ولَبِنِ فضةٍ، فأتَيْنا بابَ المَدِينَةِ فَاسْتَفْتَحْنا، فَفُتِحَ لَنا، فَدَخَلْناها، فَتَلَقَّانا رجالٌ شَطْرٌ مِن خَلْقِهِمْ كأحْسَنِ ما أنت

కాని వారు నాకు (జవాబు చెప్పకుండా) 'పదండి, పదండి' అన్నారు. మేమక్క ణ్ణుంచి బయలుదేరి నడుస్తూ నడుస్తూ మరొకతని దగ్గర్నుంచి వెళ్ళాం. అతను చాలా వికృతంగా ఉన్నాడు. (లేక ఆయన) అతను మీరు ఇప్పటివరకు చూసినవారందరి కన్నా కురూపి (అని అన్నారు). అతని దగ్గర అగ్ని ఉంది. దాన్ని అతను రాజేసి దాని చుట్టూ పరుగెత్తుతున్నాడు. అది చూసి నేను 'ఎవరితను?' అని అడిగాను. కాని వారు (నా ప్రశ్నకు జవాబు ఇవ్వకుండా) "పదండి, పదండి" అన్నారు.

మేము అక్కణ్ణుంచి ఇంకా ముందుకు వెళ్ళాం. ఆ విధంగా వెళ్తూవెళ్తూ ఒక తోట దగ్గరికి చేరుకున్నాం. ఆ తోటలో ఎన్నో చెట్లున్నాయి. (అది వసంత కాలమైనట్లు) ఆ చెట్లకు అన్ని రకాల పూలు పూసివున్నాయి. ఆ తోట మధ్య లో ఒక పొడవాటి మనిషి ఉన్నాడు. అతని తల ఆకాశమంత ఎత్తులో ఉన్నట్లుంది. అందుకని నేను దాన్ని చూడలేకపోయాను. అతని చుట్టూ ఎంతోమంది పిల్లలున్నారు. అలాంటి పిల్లల్ని నేనెన్నడూ చూడలేదు. నేను "ఎవరితను? ఈ పిల్లలెవరు?" అని అడిగాను. వారు మళ్ళీ, "పదండి, పదండి" అన్నారు. మేమక్కణ్ణుంచి బయలుదేరి ఒక పెద్ద చెట్టు దగ్గరికి

راءٍ! وشطرٌ منهم كأقبح ما أنتَ راءٍ! قالا لهمُ: اذهبوا فقعوا في ذلك النهر، وإذا هو نهرٌ معترضٌ يجري كأنَّ ماءَهُ المحضُ في البياض، فذهبوا فوقعوا فيه. ثمَّ رجعوا إلينا قد ذهب ذلك السوءُ عنهم، فصاروا في أحسن صورةٍ. قال: قالا لي: هذه جنةُ عدنٍ، وهذاك منزلُك، فسما بصري صُعُداً، فإذا قصرٌ مثلُ الرَّبابةِ البيضاءِ. قالا لي: هذاك منزلك؟ قلتُ لهما: بارَكَ الله فيكما، فذراني فأدخلَه. قالا: أما الآن فلا، وأنتَ داخلهُ. قلتُ لهما: فإنِّي رأيتُ منذُ الليلةِ عجباً؟ فما هذا الذي رأيتُ؟ قالا لي: أمَا إنَّا سنُخبرُك: أمَّا الرجلُ الأوّلُ الذي أتيتَ عليه يُثلغُ رأسُهُ بالحجرِ، فإنَّهُ

చేరుకున్నాం. దానికంటే పెద్దచెట్టు, దానికంటే మంచి చెట్టు నేనెన్నడూ చూడలేదు. వాళ్ళిద్దరూ నన్ను ఆ చెట్టు ఎక్కమని చెప్పారు. మేము దానిపైకి ఎక్కగానే అక్కడ మాకు బంగారం వెండి ఇటుకలతో నిర్మించబడిన ఒక పట్టణం కనిపించింది. మేము ఆ నగరద్వారం దగ్గరికి వెళ్ళి ద్వారం తెరువమని అడిగాం. (కాసేపటికి) ద్వారం తెరుచుకోబడింది. మేము లోపలికి వెళ్ళాం. అక్కడ మాకు ఎంతోమంది మనుషులు కనిపించారు. వారి అర్ధ శరీరం మీరింతవరకు చూసినవారందరికంటే అందంగా ఉంది. మిగతా అర్థ శరీరం మీరింత వరకు చూసినవారందరి కంటే వికృతంగా ఉంది. నా వెంటవున్న వాళ్ళిరువురు వారిని "పోండి, పోయి ఆ కాలువలో దూకండి" అని ఆదేశించారు. అక్కడ ఒక కాలువ అడ్డంగా ప్రవహిస్తూ ఉంది. ఆ కాలువలోని నీళ్లు పాలవంటి తెలుపురంగులో ఉన్నాయి. వారు వెళ్ళి ఆ కాలువలో దూకారు. తర్వాత మా దగ్గరికి తిరిగొచ్చేసరికి అందవికారంగా ఉన్న వారి అర్థ శరీరాలు మాయమై వారందరూ గొప్ప అందగాళ్ళుగా మారిపోయారు. వాళ్ళిద్దరు నాకు ఇలా చెప్పారు: ఇది శాశ్వత స్వర్గం. అదిగో

(ఆ కనిపిస్తున్నదే) మీ స్థానం. నేను (వారు చూపిస్తున్న వైపు) పైకి చూశాను. అక్కడ తెల్లని మబ్బులాంటి ఒక భవనం కనిపించింది. నావెంట ఉన్న వాళ్ళిద్దరూ "ఇదే మీ స్థానం" అని అన్నారు. నేను వారితో "దేవుడు మీకు శుభం చేయుగాక! నన్ను వదలండి. నేను లోపలికి వెళ్తాను" అని అన్నాను. అందుకు వారు "ఇప్పుడు కాదు, కాని ఎప్పటికైనా మీరే అందులోకి ప్రవేశిస్తారు. (ఇతరులెవరికీ ఆ అర్హతలేదు)" అని చెప్పారు. అప్పుడు నేను వారిని "రాత్రి నేను చాలా విచిత్రమైన విషయాలు చూశాను. నేను చూసినవన్నీ ఏమిటి?" అని అడిగాను. అప్పుడు వారు "చెప్తాం చెప్తాం. మొట్టమొదట మీరు ఒకతని సమీపం నుంచి వచ్చారు. అతని తల రాయితో మోద బడుతుంది. అతను ఖుర్‌ఆన్‌ను తీసుకొని కూడా ఆ తర్వాత దాన్ని వదలిపెట్టినవాడు (అంటే ఖుర్‌ఆన్‌ను కంఠస్థం చేసుకొని మర్చిపోవటం లేక ఖుర్‌ఆన్ జ్ఞానాన్ని నేర్చుకొని దాన్ని ఆచరించకపోవటం) ఇంకా అతను ఫర్జ్ నమాజుల్ని ఎగ్గొట్టి నిద్రపోయేవాడు. ఆ తర్వాత మీరు మరొకతని సమీపం నుంచి వచ్చారు. అతని దవడను, ముక్కు రంధ్రాన్ని, కంటిని మెడవెనుక భాగం వరకూ చీరేయబడుతూ ఉంది.

الرَّجُلُ يأخُذُ القُرْآنَ فَيَرْفُضه، وينامُ عن الصَّلاةِ المكتُوبَةِ. وأمَّا الرَّجُلُ الذي أتَيتَ عَلَيْهِ يُشَرْشَرُ شِدْقُهُ إلى قَفَاهُ، ومَنْخِرُه إلى قَفاهُ، وَعَيْنُه إلى قفاهُ، فإنه الرَّجُلُ يَغْدُو مِنْ بَيْتِه فَيَكذِبُ الكَذْبَةَ تَبْلُغُ الآفاقَ. وأمَّا الرِّجَالُ والنِّساءُ العُرَاةُ الذين هُمْ في مِثلِ بناءِ التَّنُّورِ، فإنَّهم الزُّنَاةُ والزَّواني. وأما الرجُلُ الَّذي أتَيْتَ عَلَيْهِ يَسْبَحُ في النَّهْرِ، وَيُلْقَمُ الحِجَارَةَ، فإِنَّهُ آكِلُ الرِّبَا، وَأمَّا الرَّجُلُ الكريهُ المرآةِ الذي عندَ النَّارِ يَحُشُّها ويسْعَى حَوْلَهَا، فَإنَّهُ مَالِكٌ خازِنُ جَهَنَّمَ، وأما الرَّجُلُ الطَّوِيلُ الَّذي في الرَّوْضَةِ، فإنه إبراهِيمُ، وأَما الوِلدانُ الذينَ حَوْلَه، فكلُّ مَوْلودٍ مَاتَ على الفِطْرَةِ» وفي روايةِ البَرْقَانِيِّ: «وُلِدَ على الفِطرَةِ» فقال بعض المسلمينَ: يَا رسولَ اللهِ! وأولادُ المشركينَ؟ فقال رسولُ اللهِ ﷺ: «وأولادُ المشركِينَ، وأما القومُ الذينَ كَانُوا شَطْرٌ منهم حَسَنٌ، وشَطْرٌ منهمْ قَبِيحٌ، فإنهمْ قَوْمٌ خَلَطُوا عَمَلاً صَالِحاً وآخَرَ سَيِّئاً، تَجَاوَزَ

اللهُ عَنهُم» رواه البخاري. وفي رواية له: «رَأَيْتُ اللَّيْلَةَ رَجُلَين أَتَيَانِي فَأخرَجاني إلى أرْضٍ مُقدَّسةٍ» ثُمَّ ذكره وَقال: «فانطلقنا إلى نَقبٍ مثل التَّنُّورِ، أعْلاهُ ضَيِّقٌ وأسْفَلُهُ وَاسعٌ، يَتَوَقَّدُ تَحتَهُ نَاراً، فإذا ارْتَفَعَت ارْتَفَعُوا حَتَّى كادُوا أنْ يَخرُجوا، وإذا خَمَدَتْ فيها، رَجَعوا فيها، وفيها رجالٌ ونساءٌ عراةٌ»، وفيها: «حتى أتَينَا على نَهرٍ من دَمٍ -ولم يشُكَّ- فيه رجُلٌ قائمٌ على وسَط النَّهرِ، وعلى شَطِّ النَّهرِ رَجُلٌ، وبيْنَ يَدَيهِ حِجارةٌ، فأقبَلَ الرَّجُلُ الذي في النَّهرِ، فإذا

ఇతను ఎవరంటే-ఇతను ఉదయం తన ఇంటి నుంచి బయలుదేరి అబద్ధాలు చెబుతూ (తిరుగుతూ) ఉంటాడు. అతను చెప్పే అబద్ధాలు (లోకం) నలుదిక్కులా వ్యాపిస్తాయి.

పోతే పొయ్యిలాంటి గొయ్యిలో నగ్నంగా ఉన్న స్త్రీ పురుషులు (ప్రపంచంలో) వ్యభిచారం చేసినవారు. ఆ తర్వాత మీరు ఇంకొకతన్ని చూశారు. అతను కాలువలో ఈదుతూ ఉంటే అతని నోట్లో రాతిముద్ద విసిరేయబడుతూ ఉంది. అతను వడ్డీలు తినేవాడు. తర్వాత అగ్నిని రగిలించి దానిచుట్టూ పరుగెత్తుతూ ఉన్న కురూపి ఎవరంటే, అతను నరక ద్వారపాలకుడైన మాలిక్. ఆ తర్వాత తోటలో కనిపించిన పొడవాటి మనిషి ఇబ్రాహీమ్ (అలైహి). ఆయన చుట్టూ ఉన్న పిల్లలు సహజత్వం (అంటే నిజ ధర్మం)పై మరణించిన వారు. బర్‌ఖానీ లోని ఒక ఉల్లేఖనంలో 'ఆ పిల్లలు సహజత్వంపై పుట్టిన వారు' అని ఉంది.

ఈ మాట అన్నప్పుడు ముస్లింలలో ఒకతను (సందేహపడుతూ) "దైవ ప్రవక్తా! (వారిలో) బహుదైవారాధకుల పిల్లలు కూడా ఉన్నారా?" అని అడిగాడు. అందుకాయన "అవును, బహుదైవారాధకుల పిల్లలు కూడా" అని అన్నారు.

أَرَادَ أَنْ يَخْرُجَ، رَمَى الرَّجُلُ بِحَجَرٍ فِي فِيهِ، فَرَدَّهُ حَيْثُ كَانَ، فَجَعَلَ كُلَّمَا جَاءَ لِيَخْرُجَ جَعَلَ يَرْمِي فِي فِيهِ بِحَجَرٍ فَيَرْجِعُ كَمَا كَانَ». وَفِيهَا: «فَصَعِدَا بِيَ الشَّجَرَةَ، فَأَدْخَلانِي دَاراً لَمْ أَرَ قَطُّ أَحْسَنَ مِنْهَا، فِيهَا رِجَالٌ شُيُوخٌ وَشَبَابٌ». وَفِيهَا: «الَّذِي رَأَيْتَهُ يُشَقُّ شِدْقُهُ فَكَذَّابٌ، يُحدِّثُ بِالْكَذْبَةِ فَتُحْمَلُ عَنْهُ حَتَّى تَبْلُغَ الآفَاقَ، فَيُصْنَعُ بِهِ مَا رَأَيْتَ إِلَى يَوْمِ القِيَامَةِ» وَفِيهَا: «الَّذِي رَأَيْتَهُ يُشْدَخُ رَأْسُهُ فَرَجُلٌ عَلَّمَهُ اللهُ القُرْآنَ فنامَ عَنْهُ بِاللَّيْلِ، وَلَمْ يَعْمَلْ فيه بِالنَّهَارِ، فَيُفْعَلُ بِهِ إِلى يَوْمِ القِيَامَةِ، وَالدَّارُ الأُولَى الَّتِي دَخَلْتَ دَارُ عَامَّةِ المُؤْمِنِينَ، وَأَمَّا هذه الدَّارُ فَدَارُ الشُّهَدَاءِ، وَأَنَا جِبْرِيلُ، وَهذا مِيكَائِيلُ، فَارْفَعْ رَأْسَكَ، فَرَفَعْتُ رَأْسِي، فَإِذا فَوْقِي مِثْلُ

ఆ తర్వాత అర్ధశరీరం అందంగానూ, మిగతా అర్ధశరీరం అంద వికారంగానూ ఉన్న వారెవరంటే, వారు రెండురకాల ఆచరణ చేసినవారు. అంటే వారు చేసిన కొన్ని కర్మలు మంచివి, మరికొన్ని చెడ్డవి. అయితే దేవుడు వారిని మన్నిం చేశాడు. (బుఖారీ)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నేను రాత్రి (కలలో) చూశాను. నా దగ్గరికి ఇద్దరు మనుషులు వచ్చి నన్ను పవిత్రభూమి వైపు తీసుకొని వెళ్ళారు. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) (పైన చెప్పిన) సంఘటన అంతా వివరించారు. (అందులో ఇలా ఉంది) మేము నడుస్తూ నడుస్తూ ఒక గొయ్యి దగ్గరికి చేరుకున్నాం. అది రొట్టెల పొయ్యిలాగుంది. దాని పైభాగం ఇరుకుగానూ అడుగుభాగం విశాలం గానూ ఉంది. దాని అడుగుభాగంలో అగ్ని మండుతూ ఉంది. ఆ మంటలు పైకి లేవగానే (ఆ గొయ్యిలో ఉన్నవారు కూడా) పైకి వస్తున్నారు. కొద్దిట్లో బయ టికి వచ్చేస్తారన్నంతలోనే మంటలు ఆరిపోయి మళ్ళీ క్రిందికి వెళ్ళిపోతు న్నారు. ఆ గొయ్యిలో నగ్నంగా ఉన్న పురుషులు, స్త్రీలు ఉన్నారు.

ఈ ఉల్లేఖనంలో ఇలా కూడా ఉంది: మేము ఒక రక్తపు కాలువ దగ్గరికి చేరుకున్నాం. (మొదటి ఉల్లేఖనంలో లాగా) ఇందులో ఉల్లేఖకుడు

السَّحاب، قالا: ذاكَ مَنزِلُكَ، قلتُ: دَعاني أَدْخلْ مَنزِلي، قالا: إِنَّهُ بَقِي لَكَ عُمُرٌ لَمْ تَستكمِلْهُ، فَلَوِ اسْتَكْمَلْتَهُ، أَتيتَ مَنْزِلكَ» رواه البخاري. قوله: «يثْلَغ رَأْسَهُ» هو بالثاءِ المثلثة والغينِ المعجمة، أي: يَشدَخُهُ وَيَشُقُّهُ. قوله: «يَتَدَهْدَه» أي: يتدحرجُ. و«الكَلُّوبُ» بفتح الكاف، وضم اللام المشدّدة، وهو معروف. قوله: «فَيُشَرْشِرُ» أي: يُقَطِّعُ. قوله: «ضَوْضَوْا» وهو بضادين معجمتين، أي: صاحوا. قوله: «فَيَفْغَرُ» هو بالفاءِ والغين المعجمةِ، أي: يفتحُ. قوله: «المرآة» هو بفتح الميمِ، أي المَنْظَرِ. قوله: «يَحُشُّها» هو بفتح الياءِ وضم الحاءِ المهملة والشين المعجمة، أيْ: يوقِدُها. قوله: «روْضَةٍ

సందేహం వెలిబుచ్చలేదు. దాని ప్రకారం ఒకతను కాలువ మధ్యలో నించొని ఉన్నాడు. కాలువ ఒడ్డున మరొకతను ఉన్నాడు. అతని ముందు రాళ్ళున్నాయి. కాలువలో ఉన్న వ్యక్తి ముందుకొచ్చి బయటికి వెళ్ళాలని ప్రయత్నించినప్పుడు ఒడ్డున ఉన్న మనిషి అతని నోట్లో రాయి విసిరి అతన్ని మళ్ళీ వెనక్కి తరుముతున్నాడు. (ఒడ్డు మీద కూర్చున్నవాడు మాటి మాటికీ అదే పని చేస్తున్నాడు.) కాలువలో ఉన్న మనిషి బయటికి రావాలని ప్రయత్నించినప్పుడల్లా అతని నోట్లో రాయికొట్టి అతన్ని వెనక్కి తరుముతున్నాడు.

ఆ ఉల్లేఖనంలో ఈ విషయం కూడా ఉంది: ఆ ఇద్దరు వ్యక్తులు నన్ను తీసుకొని ఒక చెట్టెక్కారు. అక్కడ వారు నన్ను ఒక ఇంట్లోకి తీసుకెళ్ళారు. దానికంటే అందమైన ఇల్లు నేనెన్నడూ చూడలేదు. ఆ ఇంట్లో కొందరు మగవారు ఉన్నారు. వారిలో ముసలి వారు, యువకులు ఇరువురూ ఉన్నారు. ఆ ఉల్లేఖనంలో ఈ విషయం కూడా ఉంది: దవడలు చీరేయబడుతూ ఉండగా నేను చూసిన వ్యక్తి పెద్ద అబద్ధాలరాయుడు. అతని నోటి నుంచి అబద్ధాలే వచ్చేవి. అతని నోటి నుంచి వినబడిన ఆ అబద్ధాలు (లోకం) నలువైపులా వ్యాపిం

چేవి. కనుక ప్రళయం వరకూ ఇతని పట్ల ఇదే వ్యవహారం జరుగుతూ ఉంటుంది.

అందులో ఈ విషయం కూడా ఉంది: తల మోదబడుతూ మీకు కనిపించిన వ్యక్తి ఎవరంటే దేవుడు అతనికి ఖుర్ఆన్ జ్ఞానాన్ని ప్రసాదిస్తే అతను దాన్ని వదలిపెట్టి రాత్రిపూట నిద్రపోయే వాడు. పగలు కూడా దాన్ని ఆచరించే వాడు కాదు. ఇతనిపట్ల కూడా ప్రళయం వరకూ ఇదే వ్యవ హారం కొనసాగుతూ ఉంటుంది. తొలిసారి మీరు లోపలికి వెళ్ళిన ఇల్లు సాధారణ విశ్వాసులది. కాని ఇది అమరగతుల ఇల్లు. నేను జిబ్రయీల్‌ని. ఈయన మీకాయీల్. మీరు కాస్త తల పైకెత్తండి."

నేను తలపైకెత్తి చూశాను నాపైన మబ్బులాంటిది ఏదో కనిపించింది. దాన్ని చూపిస్తూ వారు "ఇది మీ స్థానం" అని అన్నారు. అప్పుడు నేను "నన్ను నా స్థానంలోకి వెళ్ళనివ్వండి" అన్నాను. అందుకువారు "మీ ఆయుష్షు ఇంకా కొంత మిగిలుంది. అది ఇంకా పూర్తికాలేదు. దాన్ని పూర్తి చేసిన తర్వాత మీరు మీ స్థానంలోకి వెళ్తారు" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం)*

«مُعْتَمَّةٌ» هو بضم الميم وإسكانِ العين وفتح التاءِ وَتَشْديدِ الميم، أي: وافيةِ النَّبَاتِ طَويلَتِهِ. قَوْلُهُ: «دَوْحَةٌ» وَهِيَ بفتح الدال، وإسكان الواو وبالحاءِ المهملة: وَهِيَ الشَّجَرَةُ الْكَبِيرَةُ. قولُهُ: «المَحْضُ» هو بفتح الميم وإسكانِ الحاءِ المهملة وبالضَّاد المعجمة: وهُوَ اللَّبَنُ. قولُهُ: «فَسَمَا بَصَرِي» أي: ارْتَفَعَ. و«صُعُدًا»: بضم الصاد والعين، أيْ مُرْتَفِعاً. «وَالرَّبَابَةُ». بفتح الراءِ وبالباءِ الموحدة مُكررةً، وهِيَ السَّحَابَة.

## ముఖ్యాంశాలు

ఇందులో దైవప్రవక్త (సల్లం)కు స్వప్నావస్థలో, వివిధ పాపాలకు విధించబడే శిక్షలు చూపించబడ్డాయనే విషయం వివరించబడింది. ఉదా: ఖుర్‌ఆన్‌ను కంఠస్తం చేసి మర్చిపోవటం, దాన్ని ఆచరించకపోవటం. అదే విధంగా ఖుర్‌ఆన్ జ్ఞానం నేర్చుకొని అనాచరణకు, దురాచరణకు పాల్పడుతూ ఉండటం, సోమరితనంతో ఫర్జ్ నమాజుల్ని ఎగ్గొట్టటం, అబద్ధం చెప్పటం, వ్యభిచారం చేయటం, వడ్డీలు తినటం మొదలగు పాపాలకు ఘోరమైన శిక్షలు విధించబడతాయని హెచ్చరించటం జరిగింది. వాటి కొన్ని నమూనాలు పై హదీసులో వివరించబడ్డాయి. అంతేకాదు, ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) స్థానాన్నీ, ఆ తర్వాత అమరవీరుల స్థానాలను కూడా స్పష్టం చేయటం జరిగింది. ఇందులో బోధించబడిన ఇంకో విషయం ఏమిటంటే దేవుడు తన దాసుల్ని శిక్షించటం కోసం నరకాన్నీ, అనుగ్రహించటం కోసం స్వర్గాన్నీ తయారుచేసి ఉంచాడు. వాటిలో అనేక శిక్షల్ని, అనుగ్రహాలను తన అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం)కు దర్శనం చేయించాడు.



## 261వ అధ్యాయం

## ٢٦١ - بَابُ بَيَانِ مَا يَجُوزُ مِنَ الْكَذِبِ

## అబద్ధంలోని ధర్మసమ్మతమైన రకాలు

اِعْلَمْ أَنَّ الْكَذِبَ، وَإِنْ كَانَ أَصْلُهُ مُحَرَّماً، فَيَجُوزُ فِي بَعْضِ الأَحْوَالِ بِشُرُوطٍ قد أَوْضَحْتُهَا فِي كِتَاب: «الأَذْكَار»، وَمُخْتَصَرُ ذلك: أَنَّ الكلامَ وسيلةٌ إلى المقاصِدِ، فَكُلُّ مَقْصُودٍ مَحْمُودٍ يُمْكِنُ تَحْصيلُهُ بِغَيْرِ الْكَذِبِ يَحْرُمُ الْكَذِبُ فيه، وَإِنْ لَمْ يُمكِنْ تَحْصِيلُهُ إِلاَّ بالكَذِبِ، جاز الْكَذِبُ. ثُمَّ إِنْ كَانَ تَحْصِيلُ ذلك المقْصُودِ مُبَاحاً كَانَ الْكَذِبُ مُباحاً، وَإِنْ

ఒక విషయం తెలుసుకోండి. వాస్తవానికి అబద్ధం పలకటం నిషిద్ధమే. కాని కొన్ని సందర్భాల్లో కొన్ని షరతులకు లోబడి అబద్ధం చెప్పవచ్చు. వాటిని నేను ఇంతకు ముందు కితాబుల్ అజ్కార్ (ధ్యాన ప్రకరణం)లో వివరించాను. వాటి సారాంశం ఇది: ఉద్దేశ్యాలు నెరవేరటానికి సంభాషణ ఒక సాధనం. కనుక ఒక అభిలషణీయమైన ఉద్దేశ్యం నెరవేరటానికి అబద్ధం చెప్పవలసిన అవసరం లేనప్పుడు అబద్ధం చెప్పటం నిషిద్ధం. ఒకవేళ అబద్ధం చెప్పనిదే ఆ మంచి ఉద్దేశ్యం నెరవేరటం సాధ్యంకాకపోతే అప్పుడు అబద్ధం చెప్పవచ్చు. ఇంకో విషయమేమిటంటే ఆ ఉద్దేశ్యాన్ని సాధించటం ధర్మసమ్మతమైతే (దానికోసం) అబద్ధం చెప్పటం కూడా ధర్మసమ్మతమవుతుంది. ఒకవేళ ఉద్దేశ్యాన్ని సాధించటం తప్పనిసరి అయినప్పుడు అబద్ధం చెప్పటం కూడా తప్పనిసరి అవుతుంది. (ఉదాహరణకు) ఒక దుర్మార్గుడు ఒక ముస్లింని చంపటానికో లేక అతని

كَانَ وَاجِباً، كان الكذبُ واجباً. فإذا اختفَى مُسْلِمٌ مِن ظالِمٍ يريدُ قَتْلَه، أَوْ أَخذَ مالِه، وَأَخفَى مَالَه، وَسُئِلَ إنسانٌ عنه، وَجَبَ الْكَذِبُ بإخفائِه، وكَذَا لو كانَ عِنْدَهُ وَدِيعَةٌ، وَأَرَادَ ظَالِمٌ أَخْذَهَا، وَجَبَ الْكَذِبُ بإخفائها. والأَحْوطُ في هذا كلِّه أَنْ يُوَرِّيَ، ومعْنَى التَّوْرِيَةِ: أَنْ يَقْصِدَ بِعِبَارَتِهِ مَقْصُوداً صَحِيحاً لَيْسَ هُوَ كَاذِباً بالنِّسْبةِ إِلَيْهِ، وإِنْ كَانَ كَاذِباً في ظَاهِرِ اللَّفْظِ، وَبالنِّسْبَةِ إِلى ما يَفْهَمُهُ المخَاطَبُ، وَلَوْ تَرَكَ التَّوْرِيَةَ وأَطْلَقَ عِبَارَةَ الكَذِبِ، فَلَيْسَ بِحَرَامٍ في هذا الحَالِ. وَاسْتَدَلَّ الْعُلَمَاءُ لِجَوازِ الكَذِبِ في هذا الحَالِ بِحَدِيثِ: (أُمِّ كُلْثُومِ الآتِيْ)

దగ్గరున్న ధనం తీసుకోవటానికో ప్రయత్నిస్తున్నాడనుకోండి. (అతనికి భయపడి) ఆ ముస్లిం దాక్కున్నాడు. డబ్బును కూడా దాచాడు. అలాంటప్పుడు ఎవరినైనా ఆ ముస్లిం లేక అతని ధనం జాడ తెలుపమని అడిగితే ఆ విషయాన్ని రహస్యంగా ఉంచటం కోసం ఆ వ్యక్తి అబద్ధం చెప్పటం అవసరం (వాజిబ్). అలాగే ఒకవేళ అతని దగ్గర ఏదయినా అప్పగింత (అమానతు) ఉందనుకోండి. ఏ దుర్మార్గుడయినా దాన్ని తీసుకోవాలనుకుంటున్నాడు. అలాంటప్పుడు ఆ అప్పగింత గురించి అతనికి తెలియకుండా ఉండటం కోసం తప్పనిసరిగా అబద్ధం చెప్పాలి. అయితే ఇలాంటి వ్యవహారాలన్నిటిలోనూ 'తౌరియా' చేయటం నిందారహిత పద్ధతి. తౌరియా అంటే ద్వంద్వార్థాలు పలికే మాటలు మాట్లాడాలి. ఆ మాటలకు పై భావం ఒకటుంటే లోపల మరొక భావముంటుంది. తౌరియా చేసే వ్యక్తి తాను చెప్పేమాటల్లో, ఎదుటి వ్యక్తి అర్థం చేసుకునే దాన్నిబట్టి అబద్ధం చెబుతున్నట్లుగా అనిపిస్తాడు కాని వాస్తవానికి ఆ మాటల ద్వారా తన ఉద్దేశ్యం, తాను తలచుకున్నదాన్ని బట్టిచూస్తే అది అబద్ధం అయి ఉండదు. ఒకవేళ ఎవరయినా

తౌరియా చేయకుండా పచ్చి అబద్ధం చెప్పినా పై సందర్భాల్లో అలా చేయటం నిషిద్ధం కాదు. ఇలాంటి సందర్భాల్లో అబద్ధం చెప్పవచ్చుననే విషయానికి పండితులు ఉమ్మె కుల్సూమ్ హదీసును నిదర్శనంగా భావిస్తున్నారు. ఆ హదీసు ముందు రాబోతోంది.

1548. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉమ్మె కుల్సూమ్ (రజి.అన్హా) తెలియ జేశారు: ప్రజల మధ్య సత్సంబంధాలు ఏర్పరచే ఉద్దేశ్యంతో ఇతరులకు మంచిమాటలు చేరవేసేవాడు, మంచి మాటలు పలికేవాడు అబద్ధాలకోరు కాడు. (బుఖారీ-ముస్లిం)

ఒక ఉల్లేఖనంలో ముస్లిం అదనంగా ఇలా వివరించారు: హజ్రత్ ఉమ్మె కుల్సూమ్ (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) మూడు సందర్భాల్లో తప్ప మరే సందర్భం లోనూ ప్రజలకు సంభాషణలో (అబద్ధం చెప్పటానికి) అనుమతినిచ్చి నట్లు తాను వినలేదు. ఆ మూడు సందర్భాలు అంటే: "యుద్ధం, ప్రజల మధ్య సత్సంబంధాలు ఏర్పరచటం, భర్త భార్యతో మాట్లాడటం లేక భార్య భర్తతో మాట్లాడటం" అని ఆమె అభిప్రాయం.

١٥٤٨ ـ عن أُمِّ كُلْثُوم رَضِيَ اللهُ عَنْهَا أنها سمِعَتْ رسولَ اللهِ ﷺ يَقُولُ: «لَيْسَ الكَذَّابُ الَّذي يُصلِحُ بَيْنَ النَّاسِ، فَيَنْمي خَيْراً أَو يقولُ خَيْراً» متفقٌ عليه.

زاد مسلم في رواية: قَالَتْ أُمُّ كُلْثُوم: وَلَمْ أَسْمَعْهُ يُرَخِّصُ في شَيءٍ مِمَّا يَقُولُ النَّاسُ إلَّا في ثلاثٍ؛ تَعْني: الحَرْبَ، وَالإِصْلاَحَ بَيْنَ النَّاسِ، وَحَدِيثَ الرَّجُلِ امْرَأَتَهُ، وحَدِيثَ المَرْأَةِ زَوْجَها.

## ముఖ్యాంశాలు

అనుమతినివ్వటమంటే అబద్ధం చెప్పేందుకు అనుమతినివ్వటమని అర్థం. 'యన్‌మీ ఖైరన్' అంటే మంచిచాడీలు చెప్పటం. ఒకరి మంచి మాటలు మరొకరికి చేరవేయటం. ఇద్దరు విరోధుల్ని కలపటం కోసం, వారి మధ్యనున్న విద్వేషాన్ని, వైషమ్యాన్ని దూరం చేయటం కోసం తమ తరపునుంచి కొన్ని మంచి అబద్ధాలు కల్పించుకొని వారికి చెప్పటం మూలంగా వారి మధ్యనున్న విద్వేషాలు, వైషమ్యాలు మంచులా కరిగిపోయి వారి అంతరాల అగాధాలు పూడుకొని విడదీయరాని ఆత్మీయబంధంగా మారిపోయిందనుకోండి. ఆ పని చేసినవారు దేవుని దృష్టిలో అబద్ధాలకోరులుగా, చాడీలు చెప్పేవారిగా పరిగణించబడరు. అదే విధంగా యుద్ధసమయంలో కూడా అవసరం ఏర్పడినప్పుడు, జరగని సంఘటన గురించి జరిగిందని అబద్ధం చెప్పవచ్చు. లేకపోతే ముస్లింలకు ఘోరనష్టం జరుగుతుంది. మూడో సందర్భం భార్యాభర్తల సంభాషణకు సంబంధించినది. వైవాహిక సంబంధాన్ని కొనసాగించటం కోసం లేక దాని సుఖమయం కోసం కొన్నికొన్ని సందర్భాల్లో భార్య భర్తతో, భర్త భార్యతో కొన్ని విషయాలు దాచవలసి వస్తుంది. సామాజిక జీవనంలో ఇలాంటి ఎన్నో మలుపులు ఎదురౌతుంటాయి. ఇలాంటి ప్రత్యేక పరిస్థితుల్లో చూచాయగా అబద్ధం చెప్పటం ధర్మసమ్మతమే. కాని దీన్ని ఆసరాగా చేసుకొని భార్యాభర్తలు, పొద్దస్తమానం అబద్ధం చెప్పుకోవచ్చని దీనిభావం ఎంతమాత్రం కాదు. అబద్ధం ముమ్మాటికీ అబద్ధమే. అది ఘోరపాతకం. అందుకని సామాజిక జీవనం కూడా నిజం మీదనే ఆధారపడి ఉండాలి. వారిరువురి నీతినడవడికలు పరస్పరం అద్దంలా పరిశుభ్రంగా, పరిశుద్ధంగా ఉండాలి. అందులోనే సామాజిక జీవన సౌఖ్యం, ఆనందం ఇమిడి ఉంది. కొన్నికొన్ని సందర్భాల్లో ఈ విధానం వికటించి నిజాన్ని దాచటం, అబద్ధం చెప్పటం మూలంగా మనుషుల మధ్య అంతరాల అగాధాలు మరింత పెరిగిపోయే ప్రమాదముంటుంది. కనుక అవసరమైన పరిస్థితుల్లోనే అబద్ధం సత్ఫలితాలను ఇవ్వగలదు.

ఇస్లాం ధర్మం సమాజంలో ఎదురయ్యే ఇబ్బందుల్ని ముందుగానే పసిగట్టి వారికి ఈ అనుమతిని ప్రసాదించింది. ఇస్లాంధర్మ సహజత్వానికి ఇది ప్రబల తార్కాణం కనుక ఈ సౌకర్యాన్ని అనుమతి మేరకు ఉపయోగించుకోవటంలోనే మేలు ఉంది. అవనసరంగా ఉపయోగిస్తే దానివల్ల నష్టమే జరుగుతుంది. ఇహలోక నష్టం, పరలోక నష్టం కూడా.

## 262వ అధ్యాయం

## ٢٦٢ ـ بَابُ الحث عَلَى التَّثَبُّتِ فِيمَا يَقُولُهُ وَيَحْكِيهِ

## మనిషి తాను చెప్పేదాన్ని, ఒకరి నుంచి విని వివరించే దాన్ని పరిశోధించుకొని చెప్పమని తాకీదు చేయటం

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَلَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهِۦ عِلْمٌ ﴾ [الإسراء: ٣٦]. وقالَ تَعَالى: ﴿ مَّا يَلْفِظُ مِن قَوْلٍ إِلَّا لَدَيْهِ رَقِيبٌ عَتِيدٌ ﴾ [ق: ١٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "నీకు తెలియని విషయాల వెంటపడకు." *(ఇస్రా: 36)*

"మనిషి నోటి నుండి వెడలే ప్రతి మాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు." *(ఖాఫ్: 18)*

١٥٤٩ ـ وعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النبيَّ ﷺ قَالَ: «كفى بالمَرءِ كَذِباً أَنْ يُحَدِّثَ بِكُلِّ مَا سَمِعَ» رواه مسلم.

1549. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: విన్న ప్రతి మాటనూ (నిజానిజాలు తెలుసుకోకుండా) వివరించటం చాలు, ఒక మనిషి అబద్ధాలకోరు అని చెప్పటానికి! *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పీఠిక)*

### ముఖ్యాంశాలు

విన్న ప్రతి మాటనూ నిజానిజాలు తెలుసుకోకుండా ఇతరులకు చెప్పేయటం లేక దాన్ని నిజమని తలపోయటం తగదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఎందుకంటే ఒకవేళ ఆ మాట గనక అబద్ధమయితే దాన్ని తన నోటి ద్వారా చెప్పినందుకు తాను కూడా అబద్ధాలకోరుగా పరిగణించబడే అవకాశముంది. అందుకని ముందుగా నిజానిజాలు విచారించుకొని మాట్లాడాలి.

١٥٥٠ ـ وعَنْ سَمُرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «من حَدَّثَ عنِّي

1550. హజ్రత్ సమురా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా

بحديثٍ يَرَى أنَّهُ كَذِبٌ فهوَ أحَدُ الكاذِبَيْن» رواه مسلم.

ప్రవచించారు: తాను అబద్ధం చెబుతున్నానని తెలిసి కూడా ఎవరయినా ఒక విషయం గురించి అది నేను అన్నమాట అని చెబితే అతనూ ఓ అబద్ధాలకోరుగానే పరిగణించబడతాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పీఠిక)

## ముఖ్యాంశాలు

కొన్ని ఉల్లేఖనాల్లో 'కాజిబైన్' అనే పదం ఉంది. దాని ప్రకారం హదీసు భావం 'ఇద్దరు అబద్ధాలకోరుల్లో ఇతనూ ఒకడుగా పరిగణించడతాడు' అని అవుతుంది. ఇద్దరు అబద్ధాలకోరులంటే ఒకడు, దైవప్రవక్త (సల్లం) గురించి అబద్ధాలు కల్పించేవాడు, రెండోవాడు వాటిని ఇతరుల వరకూ చేరవేసేవాడు. అబద్ధపు హదీసుల్ని ఏమాత్రం తటపటాయించకుండా వివరించే పండితుల్ని, బోధకుల్ని ఇందులో తీవ్రంగా హెచ్చరించటం జరిగింది.

١٥٥١ ـ وعَنْ أسْماء رضي اللهُ عَنْهَا أنَّ امْرَأةً قالَتْ: يَا رَسُولَ اللهِ! إنَّ لي ضَرَّةً فهل عَلَيَّ جُنَاحٌ إنْ تَشَبَّعْتُ مِن زوجي غيْرَ الذي يُعطِيني؟ فقال النَّبيُّ ﷺ: «المُتَشَبِّعُ

1551. హజ్రత్ అస్మా (రజి.అన్హా) కథనం: ఒక స్త్రీ (దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి) "దైవప్రవక్తా! నాకు ఒక సవతి ఉంది. నా భర్త నాకు ఏమీ ఇవ్వకపోయినా ఆయన నాకు చాలా ఇస్తున్నాడని నేనామెతో చెబితే అది తప్పవుతుందా?" అని అడిగింది. అందుకు దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ, "ఒక వస్తువు తనకు ఇవ్వకపోయినా ఇచ్చినట్లు బూటకాన్ని ప్రదర్శించేవాడు, ఒక జత అబద్ధపు బట్టలు తొడుక్కున్నవాడితో సమానం" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

'ముతషబ్బి' అంటే తనకు తృప్తిగా లేకపోయినా పైకి తృప్తిని వ్యక్తపరిచేవాడు. ఇక్కడ దీని భావం ఏమిటంటే

بِمَا لَمْ يُعْطَ كَلَابِسِ ثَوْبَيْ زُورٍ» متفقٌ عليه.
الْمُتَشَبِّعُ هُوَ الذي يُظْهِرُ الشِّبَعَ وَلَيْسَ بِشَبْعَانَ، ومعناه هُنا: أَنَّهُ يُظهِرُ أنه حَصَلَ له فَضِيلَةٌ وَلَيْسَتْ حَاصِلَةً. و«لابِسُ ثَوْبَيْ زورٍ» أَي: ذِي زُورٍ، وهو الذي يُزَوِّرُ على النَّاس بِأَن يَتَزَيَّى بِزِيِّ أَهْلِ الزُّهْدِ أَو العِلم أَو الثَرْوَة؛ لِيَغْتَرَّ بِهِ النَّاسُ وَلَيْسَ هُوَ بِتِلْكَ الصِّفَةِ. وَقِيلَ غَيْرُ ذلك واللهُ أعلم.

తనకు (విద్యావిషయాల్లో లేక సిరిసంపదల రీత్యా) ప్రత్యేక స్థానముందనే ధోరణిని ప్రదర్శించటం. వాస్తవానికి అతనికి ఆ స్థానం ఉండదు. 'సౌబై జూరిన్'కు వాస్తవిక రూపం 'సౌబై జూ జూరిన్.' అంటే ప్రజల్ని తన వలలో వేసుకునే ఉద్దేశ్యంతో వారి ముందు తనలో లేని రూపాన్ని ప్రదర్శించేవాడు. అతను ప్రజల్ని మోసం చేసేందుకు ఐహిక అనాసక్తపరుల, విద్యావంతుల, ధనవంతుల వేషం వేస్తాడు. వాస్తవానికి అతనిలో ఆ మంచిగుణాలు ఉండవు. కొందరు దీనికి మరికొన్ని అర్థాలు కూడా చెప్పారు. వాస్తవం అల్లాహ్‌కు తెలుసు.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ, అలంకరణల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొంతమంది తమకు అసలు ప్రపంచం పట్ల ఆసక్తే లేనట్లు గొప్ప ఆరాధనాపరులుగా చెలామణి అయ్యేందుకు ప్రయత్నిస్తుంటారు. మరికొందరు గొప్ప పండితుల వేషం వేసుకొని ప్రజలచేత తమ పాండిత్యాన్ని ఒప్పింపజూస్తుంటారు. ఇంకొందరు ప్రజలు తమల్ని చూసి ధనవంతులనుకోవాలని ఎల్లప్పుడూ మంచి ఖరీదైన దుస్తులు ధరిస్తుంటారు. ఒకవేళ మోసం కోసం ఇలా చేస్తున్నట్లయితే అది ఘోరమైన పాపంగా పరిగణించబడుతుంది. మనిషి తన వాస్తవిక పరిస్థితి ఏమిటో దాన్నే పైకి వ్యక్తపరచాలి. అంతకుమించి తన్నుతాను గొప్పవానిగా ప్రదర్శించటానికి పూనుకోరాదు.

అదే విధంగా సవతులు కూడా ఒకర్నొకరు మోసపుచ్చుకునే ఉద్దేశ్యంతో తమ గురించి లేనిపోని విషయాలు చెప్పుకోరాదు. కేవలం సవతుల మనసుల్ని మండించటానికి, వారిలో అసూయ జ్వాలల్ని రగిలించటానికి భర్తకు తమ మీద ప్రత్యేక చనువు, ప్రేమానురాగాలున్నట్లు, ఆయన తమ మీద కానుకల వర్షం కురిపిస్తున్నట్లు చెప్పుకోరాదు. ముఖ్యంగా అలా జరగనప్పుడు. ఒకవేళ అలా జరుగుతున్నా, అది భర్త చేస్తున్న తప్పు కనుక దాన్ని కప్పి ఉంచటానికి ప్రయత్నించాలిగాని ఆ విషయం సవతులతో చెప్పి వారి హృదయాలను గాయపర్చరాదు.

**263వ అధ్యాయం**

## ٢٦٣ ـ باب بيانِ غِلَظِ تَحْرِيمِ شَهَادَةِ الزُّورِ

## అబద్ధపు సాక్ష్యం తీవ్రంగా నిషేధించబడింది

قَالَ اللهُ تَعَالى: ﴿وَٱجْتَنِبُوا۟ قَوْلَ ٱلزُّورِ ﴿٣٠﴾﴾ [الحج: ٣٠]. وقالَ تَعالى: ﴿وَلَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهِۦ عِلْمٌ﴾ [الإسراء: ٣٦] وقَالَ تَعَالى: ﴿مَّا يَلْفِظُ مِن قَوْلٍ إِلَّا لَدَيْهِ رَقِيبٌ عَتِيدٌ﴾ [ق: ١٨]. وقَالَ تَعَالى: ﴿إِنَّ رَبَّكَ لَبِٱلْمِرْصَادِ﴾ [الفجر: ١٤]. وقَالَ تَعَالى: ﴿وَٱلَّذِينَ لَا يَشْهَدُونَ ٱلزُّورَ﴾ [الفرقان: ٧٢].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మీరు అబద్ధపు మాటలు పలక్కండి." *(అల్‌హజ్: 30)*

"మీకు తెలియని విషయం వెంట పడకండి." (బనీ ఇస్రాయీల్:36)

"మనిషి నోటి నుండి వెడలే ప్రతి మాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు." *(ఖాఫ్: 18)*

"నీ ప్రభువు మాటేసి ఉన్నాడు." *(ఫజ్ర్:14)*

"(విశ్వాసులు) అబద్ధపు సాక్ష్యాలు ఇవ్వరు." *(ఫుర్ఖాన్:72)*

١٥٥٢ ـ وعنْ أبي بَكْرَةَ رَضيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسُولُ اللهِ ﷺ: «أَلَا أُنَبِّئُكُم بأَكْبَرِ الكَبَائِرِ؟» قُلْنَا: بَلى يَا رَسُولَ اللهِ! قَالَ: «الإِشْرَاكُ باللهِ، وعُقُوقُ الوَالِدَيْنِ». وكَانَ مُتَّكِئاً فَجَلَسَ فقال: «أَلا وقَوْلُ الزُّورِ!» فما زَالَ يُكَرِّرُهَا حتى قلنا: لَيْتَهُ سَكَتَ. متفقٌ عليه.

1552. హజ్రత్ అబూ బక్రా (రజి) ప్రకారం దైవప్రవక్త (సల్లం) "ఘోరాతి ఘోరపాపాలేవో నేను మీకు తెల్పనా?" అని అడిగారు. అందుకు సహచరులు, "తప్పకుండా తెలుపండి దైవప్రవక్తా!" అని విన్నవించుకున్నారు. అప్పుడాయన "(ఘోరాతి ఘోరపాపాలు) అల్లాహ్‌కు సహవర్తుల్ని నిలబెట్టటం, తల్లిదండ్రులకు అవిధేయత చూపటం" అని చెప్పారు. ఆ తర్వాత ఆనుకొని కూర్చున్న వారల్లా సర్దుకొని కూర్చుంటూ "ఆఁ అబద్ధపు మాట,

అబద్ధపు సాక్ష్యం కూడా...." అని అన్నారు. ఆ మాట ఆయన అదేపనిగా అనసాగారు. అప్పుడు మాకు ఇక ఈయనగారు ఈ మాట చాలిస్తే బాగుండుననిపించింది.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని షహాదాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అబద్ధపు సాక్ష్యం చెప్పటం ఎంత పెద్ద పాపమో ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. కాని దురదృష్టవశాత్తు సోకాల్డ్ ముస్లింలు ఇతర ఘోరపాపాల్లాగా ఈ ఘోరపాపానికి కూడా పాల్పడటం సర్వసాధారణమయి పోయింది. దేవుడు మనల్ని రక్షించుగాక!



## 264వ అధ్యాయం

## ٢٦٤ ـ بَابُ تَحْرِيمِ لَعْنِ إِنْسَانٍ بِعَيْنِهِ أَوْ دَابَّةٍ

## నిర్ణీత వ్యక్తిని లేక జంతువుని శపించటం నిషిద్ధం

١٥٥٣ ـ عَنْ أَبِي زَيْدٍ ثَابِتِ بنِ الضَّحَّاكِ الأنصاريِّ رَضِيَ اللهُ عَنْهُ، وهو من أَهْلِ بَيْعَةِ الرِّضْوانِ قال: قَالَ رسُولُ اللهِ ﷺ: «مَن حَلَفَ عَلى يَمينٍ بِملَّةٍ غَيْرِ الإِسْلَامِ كَاذِباً مُتَعَمِّداً، فَهُوَ كَمَا قَالَ، وَمَنْ قَتَلَ نَفْسَهُ بِشَيءٍ، عُذِّبَ بِهِ يَوْمَ القِيَامَةِ، وَلَيْسَ عَلى رَجُلٍ نَذْرٌ فِيما لَا يَمْلِكُهُ، وَلَعْنُ المُؤْمِنِ كَقَتْلِهِ» متفقٌ عليه.

1553. హజ్రత్ అబూజైద్ సాబిత్ బిన్ జహ్హాక్ అన్సారీ (రజి)- ఈయన బైతె రిజ్వాన్‌లో పాల్గొన్నవారిలో ఒకరు- చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా ఉద్దేశ్యపూర్వకంగా ఇస్లాం గాక వేరొక ధర్మంపై అబద్ధపు ప్రమాణం చేస్తే అతను అలాగే అయిపోతాడు. ఎవరయినా ఒక వస్తువుతో ఆత్మహత్య చేసుకుంటే ప్రళయదినాన వారిని అదే వస్తువుతో శిక్షించటం జరుగుతుంది. మనిషి తన శక్తికి మించిన మొక్కుబడులు చెల్లించ నవసరం లేదు. విశ్వాసిని శపించటం అతన్ని హత్యచేయటంతో సమానం.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

వేరితర ధర్మంపై ప్రమాణం చేయటాన్ని మనం ఈ విధంగా ఉదాహరించవచ్చు. ఒకతను ఒకవేళ తాను ఫలానా పనిచేస్తే యూదుడిగానో లేక క్రైస్తవుడిగానో మారిపోతాను అని అనుకున్నాడనుకోండి. మనసులో కూడా అతనికి, యూద మతమో లేక క్రైస్తవ మతమో స్వీకరించాలన్న దృఢనిశ్చయం ఉంది. అలాంటప్పుడు అతను వెంటనే అవిశ్వాసి (యూదుడో లేక క్రైస్తవుడో) అయిపోతాడు. ఎందుకంటే అవిశ్వాసాన్ని అంగీకరించాలన్న దృఢనిశ్చయం ఉండటం కూడా అవిశ్వాసం క్రిందికే వస్తుంది.

ఒకవేళ అతను ఆ విధంగా ప్రమాణం చేసినా మనసులో మాత్రం అతను ఆ ఇతర ధర్మాన్ని తృణీకరిస్తున్నాడు, ఇస్లాంను వదలిపెట్టి వేరితర ధర్మాన్ని స్వీకరించకూడదని అతను గట్టిగా నిశ్చయించుకున్నాడనుకోండి, అప్పుడైనా ఆ విధంగా ప్రమాణం చేయటం అవాంఛనీయం, అవిధేయత కాకుండా ఉండదు. కనుక అందుకు తప్పనిసరిగా క్షమాపణలు వేడుకోవాలి. ఒక విశ్వాసిని శపించటం అతన్ని హత్య చేయటంతో సమానమని హదీసులోని చివరి వాక్యం ద్వారా బోధపడుతోంది. కనుక ఏ విశ్వాసినీ శపించటం ధర్మసమ్మతం కాదు.

١٥٥٤ ـ وعنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ، قَالَ: «لَا يَنْبَغِي لِصِدِّيقٍ أَنْ يَكُونَ لَعَّانًا» رواه مسلم.

1554. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: సత్యం చెప్పే వాడు శాపనార్థాలు పెట్టేవాడు కారాదు. అది ఏ సత్యవంతుడికీ శోభించదు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

శపించటం, ఎత్తిపొడవటం, తిట్టడం, తూలనాడటం పరిపక్వ విశ్వాసానికి, పరిపూర్ణ నిజాయితీకి విరుద్ధమైన విషయం.

١٥٥٥ ـ وعنْ أَبي الدَّرْدَاءِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا يَكُونُ اللَّعَّانُونَ شُفَعَاءَ، وَلَا شُهَدَاءَ يَوْمَ القِيَامَةِ» رواه مسلم.

1555. హజ్రత్ అబూ దర్దా(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: (చీటికి మాటికీ) శాప నార్థాలు పెట్టేవారు ప్రళయదినాన సిఫారసుదారులు, సాక్షులు కాలేరు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చీటికి మాటికి శాపనార్థాలు పెట్టే అలవాటు మనిషిని పాపాత్మునిగా మార్చివేస్తుంది. దేవుని సన్నిధిలో అలాంటివారికి ఎలాంటి విలువా ఉండదు.

١٥٥٦ ـ وعنْ سَمُرَةَ بْنِ جُنْدُبٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ:

1556. హజ్రత్ సమురా బిన్ జుందుబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దేవుని

«لَا تَـلاعَنُـوا بلَعْنَـةِ الله، وَلَا بِغَضَبِـهِ، وَلَا بِـالنَّـارِ» رواه أبـو داود، والتـرمـذيّ وقالا: حديثٌ حَسَنٌ صَحيحٌ.

శాపం తగలాలని, ఆయన ఆగ్రహం విరుచుకుపడాలని, అగ్నితో శిక్షించ బడాలని ఎవరినీ శాపనార్థాలు పెట్టకండి. (అబూదావూద్, తిర్మిజీ, హసన్, సహీహ్)

(సునన్ అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం - సునన్ తిర్మిజీలోని బిర్ర్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

'నీవు దైవశాపానికి గురవుగాక! నీ మీద దైవాగ్రహం విరుచుకుపడుగాక! నీవు అగ్నిలో కాలుగాక!' అనే మాటలతో ఎవరికీ శాపనార్థాలు పెట్టరాదని పై హదీసు భావం.

١٥٥٧ ـ وعن ابنِ مسعودٍ رَضِيَ اللهُ عَنْـهُ قَـالَ: قَـالَ رَسُـولُ اللهِ ﷺ: «لَيْـسَ المُـؤْمِـنُ بِـالطَّعَّـانِ، وَلَا اللَّعَّـانِ، وَلَا الفَاحِشِ، وَلَا البَذِيِّ» رواه الترمذي وقَالَ: حديثٌ حسنٌ.

1557. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: విశ్వాసి అయిన వాడు ఎత్తిపొడిచేవాడు, శాపనార్థాలు పెట్టేవాడు, బూతు మాటలు మాట్లాడే వాడు, దురుసుగా మాట్లాడేవాడు కాలేడు. (తిర్మిజీ-హసన్)

(సునన్ తిర్మిజీలోని బిర్ర్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఒక పరిపూర్ణ విశ్వాసి సుగుణాలు వివరించబడ్డాయి. ఎత్తిపొడిచే వాడంటే కులగోత్రాల, హోదా అంతస్తుల ఉచ్ఛనీచాలను ప్రస్తావించి లేక చాడీలు చెప్పి లేక కరకుమాటలతో తూలనాడి ఇతరుల్ని కించపరిచేవాడని అర్థం. కొంతమందికి నోరు తెరిస్తే తిట్లే వస్తాయి, వారు ఎల్లప్పుడూ ఎవరికో ఒకరికి శాపనార్థాలు పెడుతూనే ఉంటారు. ఇలాంటి వారిని అరబీలో 'ల- ఆన్' అని అంటారు. 'ఫాహిష్' అంటే మాటల ద్వారా, చేతల ద్వారా అశ్లీలానికి ఒడిగట్టేవాడు. 'బజీ' అంటే నోటి దురుసుతనం కలవాడు. మూర్ఖుణ్ణి, వ్యర్థ ప్రేలాపనలు చేసేవారిని కూడా బజీ అనే అంటారు.

١٥٥٨ ـ وعنْ أَبِي الدَّرْدَاءِ رَضِيَ اللهُ عنهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إنَّ العَبْدَ إذا

1558. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దాసుడు

لَعَنَ شَيْئاً، صَعِدَتِ اللَّعْنَةُ إِلَى السَّمَاءِ، فَتُغْلَقُ أَبْوَابُ السَّمَاءِ دُونَها، ثُمَّ تَهبطُ إلى الأرْضِ، فَتُغْلَقُ أبوابُها دُونها، ثُمَّ تَأْخُذُ يَميناً وَشِمَالاً، فإذا لَمْ تَجِدْ مَسَاغاً رَجَعَتْ إلى الذي لُعِنَ، فإنْ كَانَ أَهْلاً لِذٰلِكَ، وَإلَّا رَجَعَتْ إِلَى قائِلِها» رواه أبو داود.

ఎవరినయినా శపించినప్పుడు ఆ శాపం ఆకాశానికి ఎక్కుతుంది. కాని దాన్ని రానీయకుండా ఆకాశ ద్వారాలు మూయబడతాయి. దాంతో అది తిరిగి భూమి మీదకు దిగివస్తుంది. కాని భూమి ద్వారాలు కూడా అది రాకుండా మూయబడతాయి. తర్వాత కుడి ఎడమల వైపు వెళ్ళటానికి ప్రయత్ని స్తుంది. చివరికి ఎటూవెళ్ళలేక శపించ బడినవాని దగ్గరికి వెళుతుంది. అతను గనక ఆ శాపానికి అర్హుడైతే (అది అతనికి తగులుతుంది) లేదా తిరిగి శపించినవాని దగ్గరికే అది వెళ్లి పోతుంది. (అబూదావూద్)

(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా ఊరకే ఇతరుల్ని శపించరాదని బోధపడుతోంది. అంటే ఇతరులకు దైవకారుణ్యం లభించరాదనీ, వారు దైవాగ్రహానికి, దైవశిక్షకు గురికావాలని దుర్విన్నపాలు చేయటమన్నమాట! ఆ విధంగా శపించటం మూలంగా ఒక్కోసారి శపించిన మనిషే ఆ శాపానికి గురికావచ్చు. అంచేత వీలైనంతవరకు ఇతరులకు శాపనార్థాలు పెట్టకుండా ఉండటమే మంచిది.

١٥٥٩ ـ وعنْ عِمْرَانَ بْنِ الحُصَيْنِ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: بَيْنَمَا رَسُولُ اللهِ ﷺ في بَعْضِ أَسْفَارِهِ، وَامرَأَةٌ مِنَ الأنصارِ عَلى نَاقَةٍ، فَضَجِرَتْ، فَلَعَنَتْهَا، فَسَمِعَ ذٰلِكَ رَسُولُ اللهِ ﷺ فَقَالَ: «خُذُوا مَا عَلَيْها

1559. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) గారి ఒకానొక ప్రయాణంలో జరిగిన సంఘటన ఇది. ఒక అన్సారీ మహిళ ఒంటె మీద ప్రయాణిస్తూ (ఒంటెతో) విసుగెత్తి పోయి దానికి శాపనార్థాలు పెట్టింది. దైవప్రవక్త (సల్లం) అది విని, "దాని

وَدَعُوها؛ فَإِنَّها مَلْعُونَةٌ» قَالَ عِمرَانُ: فَكَأَنِّي أَرَاهَا الآنَ تَمْشِي فِي النَّاسِ مَا يَعرِضُ لَهَا أَحَدٌ. رواه مسلم.

మీదున్న సామాను క్రిందికి దించి దాన్ని వదిలేయండి. ఎందుకంటే అది శాపానికి గురయింది" అని అన్నారు.

ఇమ్రాన్ (రజి) ఇలా అంటున్నారు: (అప్పట్నుంచి) ఆ ఒంటె జనాల మధ్య నుంచి వెళుతున్నా దాన్ని ఎవరూ ఏమీ అనేవారుకాదు. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్లముందు మెదులుతూ ఉంది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

విసుగు పుట్టిందని మనుషులకు కాదు గదా, జంతువులకు శాపనార్థాలు పెట్టడం కూడా ధర్మసమ్మతం కాదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

١٥٦٠ - وعن أبي بَرْزَةَ نَضلَةَ بْنِ عُبَيْدٍ الأسلَمِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: بَينَمَا جَارِيَةٌ عَلَى نَاقَةٍ عَلَيها بَعضُ مَتَاعِ القَوْمِ، إِذْ بَصُرَتْ بِالنَّبِيِّ ﷺ، وَتَضَايَقَ بِهِمُ الجَبَلُ، فقالتْ: حَلْ، اللَّهُمَّ العَنْهَا. فقَالَ النَّبِيُّ ﷺ: «لا تُصَاحِبْنَا نَاقَةٌ عَلَيها لَعْنَةٌ» رواه مسلم.

1560. హజ్రత్ అబూ బర్జా నజ్‌లా బిన్ ఉబైద్ అస్లమీ (రజి) కథనం: ఒకసారి ఒకమ్మాయి ఒంటె మీద ప్రయాణిస్తూ ఉంది. దానిమీద ప్రజలసామాను కూడా కొంత ఉంది. అంతలో ఆమెకు ఒక్కసారిగా దైవప్రవక్త (సల్లం) కంట పడ్డారు. అదే సమయంలో పర్వత (కనుమ) కూడా ఇరుకయిపోయింది. అప్పుడామె ఒంటెను (ఉరికిస్తూ), "హల్..... దేవుడా! ఈ ఒంటె నాశనం కాను!" అని అన్నది. అది విని దైవ ప్రవక్త (సల్లం) 'ఆ ఒంటె మా వెంట ఉండకూడదు. అది శాపానికి గుర యింది' అని అన్నారు. (ముస్లిం)

'హల్' అనేది ఒంటె (త్వరత్వరగా

నడవటం కోసం) దాన్ని గద్దిస్తూ అనేమాట.

ఇక్కడ ఒక విషయం గమనార్హం. సాధారణంగా ఈ హదీసు భావం విషయంలో సందిగ్ధానికి లోనవటం జరుగుతుంది. వాస్తవానికి ఇందులో సందిగ్ధ విషయమేమీ లేదు. ఆ ఒంటె తమ వెంట ఉండరాదని మాత్రమే వారించటం జరిగింది. అంతేగాని దాన్ని అమ్మటం, జిబహ్ చేయటం, దాని మీద ప్రయాణించటం (మొదలగు పనులు) మాత్రం వారించబడలేదు. పైగా ఈ పనులు, ఇవిగాక ఇతర వ్యవహారాలన్నీ ధర్మసమ్మతమే. వీటిలో ఏదీ వారించబడలేదు. కేవలం ఆ ఒంటె దైవప్రవక్త (సల్లం) వెంట ఉండ కూడదని మాత్రమే చెప్పబడింది. ఎందుకంటే (మొదట) ఒంటెకు సంబంధించిన వ్యవహారాలన్నీ ధర్మ సమ్మతమైనవిగా ఉండేవి. వాటిలో కొన్ని వారించబడ్డాయి. పోతే మిగిలిన వ్యవహారాలన్ని యధాతథంగా ధర్మ సమ్మతంగానే ఉంటాయి. వాస్తవం దేవునికే బాగా తెలుసు.

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

قوله: «حَلْ»: بفتح الحاءِ المُهْمَلَةِ، وَإسكانِ اللاَّم، وَهِيَ كَلِمَةٌ لِزَجْر الإبل.

واعلَمْ أنَّ هذا الحديثَ قَدْ يُسْتَشْكَل مَعْنَاهُ، وَلَا إشْكَالَ فيه، بَلِ المُرَادُ النَّهيُ أَنْ تُصَاحِبَهُمْ تِلكَ النَّاقَةُ، وَلَيسَ فيه نَهيٌ عَن بَيْعِهَا وَذَبْحِهَا وَرُكُوبِهَا في غَيْرِ صُحْبَةِ النَّبيِّ ﷺ، بَلْ كُلُّ ذٰلِكَ وَمَا سِوَاهُ مِنَ التَّصَرُّفاتِ جائِزٌ لا مَنْعَ مِنْهُ، إلَّا مِنْ مُصَاحَبَتِهِ ﷺ بِهَا، لأنَّ هذِهِ التَّصَرُّفاتِ كُلَّهَا كَانَتْ جَائِزَةً فَمُنِعَ بَعْضٌ مِنْهَا، فَبَقِيَ البَاقِي عَلى مَا كَانَ. واللهُ أعْلَمُ.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కొందరిని సందిగ్ధానికి లోనుచేసింది. అజ్ఞానకాలంలో ప్రజలు విగ్రహాలపేరిట కొన్ని జంతువుల్ని వదలివేసేవారు. వాటిని 'సాయిబాలు' అని పిలిచేవారు.

అలాంటి జంతువుల్ని ప్రయాణానికిగాని సరుకు రవాణాకుగాని ఉపయోగించేవారుకారు. అలాగే ఈ హదీసులో పేర్కొనబడిన ఒంటెను కూడా సాయిబాలాగే వదిలేయటం జరిగిందనీ, దాని మీద ఎవరూ ప్రయాణంగానీ, సరుకు రవాణాగాని చేసేవారు కారని వారు భావిస్తున్నారు. వాస్తవానికి ఈ హదీసులో సందిగ్ధ విషయమేమీ లేదు. కేవలం అది శాపానికి లోనైన కారణంగా ప్రయాణంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉండరాదని మాత్రమే చెప్పబడింది. ఆ ఒక్కటి తప్ప ఆ ఒంటెను ఇతర అన్ని విధాలుగానూ ఉపయోగించటం జరిగేది.

దీనిద్వారా ఇంకో విషయం కూడా బోధపడుతోంది. అదేమిటంటే ధర్మంలో కొత్తపోకడలు లేవనెత్తేవారు, పాపాలకు ఒడిగట్టేవారు శపించదగినవారు. కనుక వారితో సావాసం చేయటం, వారి వెంట కూర్చోవటం చేయరాదు. శాపగ్రస్తమైన జంతువు వెంట ఉండటం ధర్మసమ్మతం కానప్పుడు శాపగ్రస్త పనులు చేసేవారితో సావాసం చేయటం ధర్మసమ్మతం ఎలా అవుతుంది?!



**265వ అధ్యాయం**

# ٢٦٥ - بَابُ جَوَازِ لَعْنِ بَعْضِ أَصْحَابِ الْمَعَاصِي غَيْرِ الْمُعَيَّنِينَ

# నిర్ణీత వ్యక్తి పేరు తీసుకోకుండా అవిధేయతకు పాల్పడేవారినందర్నీ శపించవచ్చు

قَالَ اللهُ تَعَالَى: ﴿أَلَا لَعْنَةُ ٱللَّهِ عَلَى ٱلظَّٰلِمِينَ﴾ [هود: ١٨]. وقَالَ تَعَالَى: ﴿فَأَذَّنَ مُؤَذِّنٌۢ بَيْنَهُمْ أَن لَّعْنَةُ ٱللَّهِ عَلَى ٱلظَّٰلِمِينَ﴾ [الأعراف: ٤٤].

وَثَبَتَ فِي الصَّحِيحِ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَعَنَ اللهُ الْوَاصِلَةَ وَالْمُسْتَوْصِلَةَ» وَأَنَّهُ قَالَ: «لَعَنَ اللهُ آكِلَ الرِّبَا» وَأَنَّهُ لَعَنَ الْمُصَوِّرِينَ؛ وَأَنَّهُ قَالَ: «لَعَنَ اللهُ مَنْ غَيَّرَ مَنَارَ الأَرْضِ» أَيْ: حُدُودَهَا؛ وَأَنَّهُ قَالَ: «لَعَنَ اللهُ السَّارِقَ يَسرِقُ الْبَيْضَةَ» وَأَنَّهُ قَالَ: «لَعَنَ اللهُ مَنْ لَعَنَ وَالِدَيْهِ» وَ«لَعَنَ اللهُ مَنْ ذَبَحَ لِغَيْرِ اللهِ»

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "విను! దుర్మార్గులపై దేవుని శాపం పడుతుంది." *(హూద్:18)*

అప్పుడు ప్రకటించేవాడొకడు వారి మధ్య ఇలా ప్రకటిస్తాడు: "ప్రజలను అల్లాహ్ మార్గం నుంచి నిరోధించేవారూ, దానిని వక్రీకరించగోరేవారూ, పరలోకాన్ని తిరస్కరించేవారూ అయిన దుర్మార్గులపై అల్లాహ్ శాపం అవతరించుగాక!" *(ఆరాఫ్:44)*

దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారని సహీహ్ హదీసుల్లో ఉంది: "సవరం పెట్టే స్త్రీని, పెట్టించుకునే స్త్రీని దేవుడు శపించుగాక!" "వడ్డీ తినే వాణ్ణి దేవుడు శపించుగాక!" దైవప్రవక్త (సల్లం) చిత్రాలను రూపొందించేవారిని కూడా శపించారు. ఇంకా ఆయన ఇలా అనేవారు: "భూమి సరిహద్దుల్ని మార్చివేసేవాణ్ణి దేవుడు శపించుగాక!" 'గ్రుడ్డును దొంగిలించే దొంగని దేవుడు శపించుగాక!' 'తన తల్లిదండ్రులకు శాపనార్థాలు పెట్టేవాణ్ణి దేవుడు శపించుగాక!' 'దైవేతరుల కోసం జంతువుల్ని జిబహ్ చేసేవాణ్ణి దేవుడు శపించుగాక!' ' ఈ మదీనా నగరంలో బిద్అత్‌ను సృష్టించే లేక బిద్అత్‌లను సృష్టించేవారికి శరణు నిచ్చేవాడి మీద దేవుని, దైవదూతల, ఇంకా ప్రజలందరి శాపం పడుగాక!' "అల్లాహ్! రీల్,

وأنَّهُ قَالَ: «مَنْ أَحْدَثَ فِيهَا حَدَثاً، أو آوى مُحْدِثاً، فَعَلَيْهِ لَعْنَةُ اللهِ والملائكةِ وَالنَّاسِ أَجْمَعِينَ» وأنَّهُ قَالَ: «اللَّهُمَّ الْعَنْ رِعْلاً، وَذَكْوَانَ وَعُصَيَّةَ؛ عَصَوُا اللهَ وَرَسُولَهُ» وَهٰذِهِ ثَلاثُ قَبَائِلَ مِنَ العَرَبِ وأنَّهُ قَالَ: «لَعَنَ اللهُ اليَهُودَ اتَّخَذُوا قُبُورَ أَنْبِيَائِهِم مَسَاجِدَ». وَأَنَّهُ لَعَنَ الْمُتَشَبِّهِينَ مِنَ الرِّجَالِ بِالنِّسَاءِ، والمُتَشَبِّهَاتِ مِنَ النِّسَاءِ بِالرِّجَالِ». وَجَمِيعُ هـذِهِ الألفَاظِ في الصحِيحِ، بَعْضُهَا في صحِيحَي البخاري ومسلم، وَبَعْضُهَا في أَحدِهِمَا، وَإِنَّمَا قَصَدْتُ الاختِصَارَ بالإشارَةِ إليهَا، وَسَأَذْكُرُ مُعظَمَهَا في أبوابها مِنْ هذا الكِتَابِ، إن شاءَ الله تعالى.

జక్‌వాన్, ఉసయ్యా తెగలను శపించు. వీరు దేవునికీ, ఆయన ప్రవక్తకు అవిధేయత చూపారు." ఇవి మూడూ అరబ్బు తెగలు. దైవ ప్రవక్త (సల్లం) ఇంకా ఇలా అన్నారు: "దేవుడు యూదుల్ని శపించుగాక! వారు తమ ప్రవక్తల సమాధుల్ని ఆరాధనాలయాలుగా మార్చు కున్నారు." ఇంకా దైవప్రవక్త (సల్లం) స్త్రీలను అనుకరించే పురుషుల్ని, పురుషుల్ని అనుక రించే స్త్రీలను కూడా శపించారు.

(పైన పేర్కొనబడిన) ఈ వాక్యాలన్నీ సహీహ్ హదీసుల్లోనివే. వాటిలో కొన్ని సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లిం రెండిట్లోనూ ఉన్నాయి. మరి కొన్ని ఆ రెండిట్లో ఏదో ఒకదానిలో ఉంటాయి. వాటిని సూచించటంలో నేను సంక్షిప్త పద్ధతిని అవలంబించాను. అయితే వాటిలోని చాలా హదీసుల్ని నేను ఈ గ్రంథంలోని విభిన్న అధ్యాయాల్లో ప్రస్తావిస్తాను. ఇన్షా అల్లాహ్!

## ముఖ్యాంశాలు

ఇమామ్ నవవీ (రహ్మాలై) పేర్కొన్న హదీసులు మరియు ఖుర్‌ఆన్ సూక్తుల ద్వారా బోధపడేదేమిటంటే, దుర్మార్గులపై, అబద్ధాలకోరులపై, బంధువిచ్ఛిత్తికి పాల్పడే మొదలగు వారిపై దేవుని శాపం పడాలని శపించవచ్చుగాని ఎవరో ఒకరి పేరు పెట్టి మరీ శాపనార్థాలు పెట్టడం ధర్మసమ్మతం కాదు. అతను పైకి దుర్మార్గుడిగా, అబద్ధాలకోరుగా, బంధువిచ్ఛిన్నకారిగా కనిపించినా సరే. ఎందుకంటే ఆ శపించబడేవాడు ఒకవేళ తన వల్ల జరిగిన పాపానికి పశ్చాత్తాపం చెంది క్షమాభిక్ష వేడుకుంటే అతను దేవుని దృష్టిలో పాపాత్ముడిగా పరిగణించబడడు. అలాంటప్పుడు అతన్ని శపించటం కూడా సమంజసం కాదు. అందుకని పాపాత్ముడైన ఏ ముస్లింనూ- అతను ఎంత పెద్ద పాపాత్ముడయినా, అలాగే అతను బ్రతికి ఉన్నా లేక మరణించినా సరే- శపించటం ధర్మసమ్మతం కాదు. ఎందుకంటే మరణానికి ముందు అతను స్వచ్ఛమైన తౌబా చేసుకొని ఉంటే దేవుడు అతన్ని క్షమించి ఉండవచ్చు కదా. అందుకని ప్రత్యేకంగా ఒకరి పేరు తీసుకొని శాపనార్థాలు పెట్టకుండా అబద్ధాలకోరుల మీద, దుర్మార్గుల మీద, ఫలనా వారి మీద దేవుని శాపం పడుగాక అని మాత్రమే అనాలి.

## 266వ అధ్యాయం

# ٢٦٦ - بَابُ تَحْرِيمِ سَبِّ الْمُسْلِمِ بِغَيْرِ حَقٍّ

## అన్యాయంగా ముస్లింని దూషించటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَٱلَّذِينَ يُؤْذُونَ ٱلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ بِغَيْرِ مَا ٱكْتَسَبُوا۟ فَقَدِ ٱحْتَمَلُوا۟ بُهْتَٰنًا وَإِثْمًا مُّبِينًا ﴾ [الأحزاب: ٥٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు, ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని తమ తలపై మోపుకున్నట్లే."

*(అల్ అహ్‌జాబ్: 58)*

١٥٦١ - وعَنِ ابنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «سِبَابُ الْمُسْلِمِ فُسوقٌ، وَقِتَالُهُ كُفْرٌ» متفقٌ عليه.

1561. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "ముస్లింని దూషించటం పాపం (దైవాజ్ఞను ఉల్లంఘించటం). అతన్ని హత్య చేయటం ధర్మతిరస్కారం (కుఫ్ర్).

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఒక విశ్వాసిని హత్య చేయటం పాపం రీత్యా, విశ్వాసి గౌరవోన్నతుల రీత్యా ధర్మాన్ని ధిక్కరించటంతో సమానం. అందుకే ఈ హదీసులో విశ్వాసి హత్యను కుఫ్ర్ (ధర్మతిరస్కారం)గా పేర్కొనటం జరిగింది. దీనిద్వారా ఆ పాపం ఎంత ఘోరమైనదో బోధపడుతోంది. కొంతమంది హదీసులోని పదం 'ఖితాల్'కు గొడవ పెట్టుకోవటం, పోట్లాట చేయటం అనే అర్థాలు తీసుకున్నారు. ఏదైనప్పటికీ ఈ హదీసులో ముస్లింని దూషించటం, లేక అతన్ని హత్యచేయటం లేక అతనితో పోట్లాడటం- మొదలగునవన్నీ వారించబడ్డాయి.

١٥٦٢ - وعَنْ أبي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يقولُ: «لَا يَرْمِي

1562. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ జర్ర్ (రజి) తెలియజేశారు:

رَجُلٌ رَجُلاً بِالفِسْقِ أَوِ الكُفْرِ، إِلَّا ارتَدَّتْ عَلَيْهِ، إِنْ لَمْ يَكُنْ صَاحِبُه كذلِكَ» رواهُ البخاريُّ.

ఎవరూ ఎవరినీ పాపాత్ముడనీ లేక ధర్మ తిరస్కారి (కాఫిర్) అని నిందించరాదు. ఎందుకంటే ఎదుటి వ్యక్తి అలాంటి వాడు కాని పక్షంలో ఆ నింద తన వైపుకే తిరిగి వస్తుంది. (బుఖారీ)

(సహీహ్ ముస్లింలోని అదబ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు భావమేమిటంటే ఎవడైనా ఒక ముస్లింని ఉద్దేశ్యించి అతను పాపాత్ముడనో లేక ధర్మ తిరస్కారి అనో అన్నాడనుకోండి. ఆ ముస్లిం అలాంటి వాడు కానిపక్షంలో దేవుని దృష్టిలో తనే పాపాత్ముడిగా లేక ధర్మతిరస్కారిగా పరిగణించబడతాడు. అందుకని ఇలాంటి నిందారోపణల జోలికిపోరాదు.

١٥٦٣ ـ وعنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «المُتَسَابَّانِ مَا قَالا فَعَلَى البَادِيٌ مِنْهُمَا حتَّى يَعْتَدِيَ المَظْلُومُ» رواه مسلم.

1563. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పరస్పరం తిట్టుకునే ఇద్దరు వ్యక్తులు ఒకరినొకరు ఏమేమి అనుకుంటారో దాని పాప మంతా మొదటగా తిట్లు మొదలు పెట్టినవాని మీదే పడుతుంది- పీడితుడు హద్దుమీరి ప్రవర్తించనంత వరకు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఒక ముస్లిం మరో ముస్లింని తిట్టి అనరాని మాటలన్నాడనుకోండి. దానికి సమాధానంగా రెండో వ్యక్తి కూడా అతన్ని తిట్టి అతనన్నట్టుగానే అన్నాడు. అంతకు మించి ఏమీ అనలేదు. అలాంటప్పుడు ఆ తిట్లపాపమంతా మొదటగా తిట్లు మొదలుపెట్టిన వానిమీదనే పడుతుంది. అయితే పీడితుడు (రెండో వ్యక్తి) గనక ప్రతీకారం చేయటంలో మితిమీరి ప్రవర్తిస్తే మాత్రం దాని ప్రకారం అతను కూడా పాపాత్ముడిగా పరిగణించబడతాడు. దీనిద్వారా బోధపడేదేమిటంటే బాధపెట్టినవారికి ప్రతీకారం చేయటం ధర్మసమ్మతమే కాని సాధారణంగా మనిషి ప్రతీకారం చేయటంలో హద్దుమీరిపోయి తానే దౌర్జన్యపరుడిగా మారతాడు. అందుకని ఉత్తమమైన పద్ధతి ఏమిటంటే మనిషి ప్రతీకారం చేసేబదులు వీలైనంతవరకు సహనం వహించి మన్నింపుల ధోరణిని అనుసరించాలి.

١٥٦٤ ـ وعنهُ قَالَ: أُتِيَ النَّبِيُّ ﷺ برجُلٍ قَدْ شَرِبَ قَالَ: «اضربُوهُ» قَالَ أَبو هُرَيْرَةَ: فَمِنَّا الضَّاربُ بِيدِهِ، والضَّاربُ بِنَعْلِهِ، والضَّاربُ بِثوبِهِ. فَلَمَّا انصرَفَ، قَالَ بعضُ القَومِ: أَخزاكَ اللهُ، قَالَ: «لَا تَقُولُوا هذا، لاتعِينُوا عليْهِ الشَّيطَانَ» رواهُ البخاريُّ.

1564. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవ ప్రవక్త (సల్లం) సన్నిధిలో ఒక తాగుబోతుని ప్రవేశపెట్టడం జరిగింది. ఆయన అతన్ని కొట్టమని ఆజ్ఞాపించారు.

(అబూహురైరా (రజి) ఇలా అంటున్నారు: దైవప్రవక్త ఆజ్ఞాపించగానే) మాలో కొందరు చేతులతో, కొందరు చెప్పులతో, కొందరు బట్టలతో అతన్ని చితకబాదారు. ఆ వ్యక్తి (దెబ్బలు తిని) తిరిగి వెళ్తుంటే ఎవరో, 'దేవుడు నిన్ను అవమానం పాలు చేయుగాక!' అని అతనికి శాపనార్థం పెట్టాడు. అది విని దైవప్రవక్త (సల్లం) "అలా అనకండి, ఇతనికి వ్యతిరేకంగా షైతాన్‌కు సహాయం చేయకండి" అని అన్నారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని హుదూద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) పాపాత్మునికి శాపనార్థాలు పెడితే షైతాన్‌కు సహాయం చేసినట్లవుతుంది. ఎలాగంటే ముస్లింలను దేవుని దృష్టిలో అవమానితులుగా చేయటమే షైతాన్ అసలు ఉద్దేశ్యం. అలాంటప్పుడు ఒక ముస్లిం మరో ముస్లింను శాపనార్థాలు పెట్టడమో లేక అతను పరాభవించబడాలనో శాపనార్థాలు పెట్టాడనుకోండి. అది షైతాన్ చేపట్టిన కార్యానికి సహాయం అందజేయటమే అవుతుంది. అందుకని పాపాత్ములకు శాపనార్థాలు పెట్టకూడదు. వారికి సద్బుద్ధి రావాలని కోరుకోవాలి.

2) ఈ హదీసు ద్వారా తాగుబోతును చితకబాదటం జరిగిందని తెలుస్తోంది. ఇది తాగుడుకు శిక్ష నిర్ణయించబడక ముందు జరిగిన సంఘటన. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) తాగుబోతుకు నలభై కొరడా దెబ్బల శిక్ష విధించారు. కనుక ఉత్తమ విధానం ఏమిటంటే

తాగుడుకు విధించబడే శిక్షను ఒక మందలింపు చర్యగా కాకుండా ఒక దైవశిక్షగా భావించాలి. అది నలభై కొరడా దెబ్బలు. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) కూడా తన హయాంలో తాగుబోతులకు ఈ శిక్షనే విధించేవారు. అయితే రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) గారి హయాంలో ప్రజల్లో తాగుడు వ్యసనం పెరిగిపోవటం మూలంగా ఆయన దైవప్రవక్త సహచరుల్ని సంప్రదించి నలభైకు బదులు ఎనభై కొరడా దెబ్బల శిక్ష విధించారు. పరిశోధకులయిన పండితులు దీని గురించి వ్యాఖ్యానిస్తూ అసలు శిక్ష నలభై కొరడా దెబ్బలేగాని మందలింపు దృష్టితో అందులో హెచ్చుతగ్గులు చేసే అధికారం సదరు ప్రజానాయకునికి, న్యాయమూర్తికి ఉంటుందని అన్నారు. హజ్రత్ ఉమర్ (రజి) తాగుడు శిక్షలో చేసిన మార్పు కూడా మందలింపు దృష్టితో చేసిన చర్యే. అంతేగాని దేవుడు నిర్ణయించిన హద్దులో హెచ్చుతగ్గులు చేసేహక్కు, అధికారం ఎవరికీ లేదు.

١٥٦٥ ـ وعَنْـهُ قَـالَ: سَمِعْـتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ قَذَفَ مَمْلُوكَهُ بِالزِّنى يُقَامُ عَلَيْهِ الحَدُّ يَوْمَ القِيَامَةِ، إِلَّا أَنْ يَكُونَ كما قالَ» متفقٌ عليه.

1565. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) గారే తెలియజేశారు: తన అధీనంలో ఉన్నవారిపై (దాసదాసీలపై) వ్యభిచార నింద మోపే వాడికి ప్రళయదినాన శిక్ష విధించబడుతుంది. అతని ఆరోపణలో నిజం ఉంటే మాత్రం శిక్షపడదు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని హుదూద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో యజమానులు తమ అధీనంలో ఉండేవారి మీద విపరీతమైన దౌర్జన్యాలు చేస్తారు. ప్రపంచంలో వారిని అడిగేవాడు, వారి దౌర్జన్యాలకు బలౌతున్న వారికి సహాయం చేసేవాడెవడూ ఉండడు. కాని ప్రళయదినాన దేవుడు నిష్పక్షపాతంగా న్యాయం చేస్తాడు. దుర్మార్గులైన యజమానుల అకృత్యాలకు బలవుతూ ఉండిన పీడిత వర్గానికి కూడా ఆ రోజున న్యాయం చేకూరుతుంది. అలాగే ప్రపంచంలో శిక్ష నుంచి తప్పించుకుంటున్న యజమానులు కూడా ఆ రోజు శిక్షననుభవిస్తారు. హదీసులో తమ అధీనంలో నున్నవారిపై వ్యభిచార నిందమోపేవారికి ప్రళయదినాన శిక్ష విధించబడుతుందని చెప్పటంలోని ఆంతర్యం అదే. అధికార గర్వంతో బానిసల మీద, తమ కింద పనిచేసేవారిమీద దుర్మార్గానికి ఒడిగట్టేవారిని ఈ హదీసు హెచ్చరిస్తోంది.

**267వ అధ్యాయం**

## ٢٦٧ - بَابُ تَحْرِيمِ سَبِّ الأَمْوَاتِ بِغَيْرِ حَقٍّ وَمَصْلَحَةٍ شَرْعِيَّةٍ

## చనిపోయినవారిని అన్యాయంగా, షరీఅత్ పరమైన అవసరమేదీ లేకుండా దూషించటం నిషిద్ధం

وَهُوَ التَّحْذِيرُ مِنَ الاقْتِداءِ بِهِ فِي بِدْعَتِهِ، وَفِسْقِهِ، وَنَحْوِ ذٰلِكَ؛ وَفِيْهِ الآيَةُ وَالأَحادِيثُ السَّابِقَةُ فِي البابِ قَبلَهُ.

షరీఅత్‌పరమైన అవసరమంటే బిద్అతీల బిద్అత్‌ను, పాపాత్ముని పాపాన్ని, మొదలగు వారి చెడు విషయాలను అనుసరించకుండా ఇతర ప్రజలను కాపాడటం. ఈ విషయానికి మునుపటి అధ్యాయంలోని ఖుర్ఆన్ సూక్తులు, హదీసులు కూడా వర్తిస్తాయి.

### ముఖ్యాంశాలు

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) చెప్పదలచుకున్నదేమిటంటే- మరణించిన వ్యక్తి గనక బిద్అత్‌లు సృష్టించినవాడు, దైవ అవిధేయతకు పాల్పడినవాడయితే అతని చేష్టల దుష్ప్రభావం నుంచి కాపాడటానికి ప్రజలకు అతని గురించి తెలియజెప్పాలి. ఇది మృతుని గురించి చెడుగా చెప్పుకోవటం, దూషించటం క్రిందికి రాదు. పైగా అతని వాస్తవిక రూపాన్ని బయటపెట్టటంలో షరీఅత్‌పరమైన మేలు ఇమిడి ఉంది కనుక ఇలా చేయటంలో తప్పులేదు.

١٥٦٦ ـ وعن عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَاتَسُبُّوا الأَمْوَاتَ؛ فَإِنَّهُمْ قَد أَفضَوا إلى ما قَدَّمُوا» رواه البخاري.

1566. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మరణించినవారు తాము చేసుకున్న కర్మలకు చేరుకున్నారు. అందుకని వారిని దూషించకండి. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పై హదీసు భావం ఏమిటంటే చనిపోయినవారు తాము చేసుకున్న కర్మలను బట్టి శిక్షకో లేక బహుమానానికో అర్హులైపోతారు. అలాంటి వారి గురించి మనం చెడుగా చెప్పుకోవాల్సిన అవసరం ఉండదు. కనుక చనిపోయిన వారిని ఎవరినీ తిట్టకూడదు. ముఖ్యంగా ఒకరి పేరు తీసుకొని తిట్టడం ఇంకా దిగజారిన విషయం. ఒకవేళ పైన పేర్కొనబడిన అధ్యాయపు శీర్షికలో, దాని ముఖ్యాంశాల్లో చెప్పబడినట్లు షరీఅత్‌పరంగా అలాంటి అవసరం ఏదైనా ఏర్పడితే అప్పుడు చెప్పవచ్చు.

## 268వ అధ్యాయం

## ٢٦٨ ـ بابُ النَّهي عَنِ الإيذاءِ

## ఇతరులను బాధ పెట్టరాదు

قَالَ اللهُ تَعالى: ﴿وَالَّذِينَ يُؤْذُونَ الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ بِغَيْرِ مَا اكْتَسَبُوا فَقَدِ احْتَمَلُوا بُهْتَانًا وَإِثْمًا مُّبِينًا﴾ [الأحزاب: ٥٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు, ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని తమ తలపై మోపుకున్నట్లే."

*(అహ్‌జాబ్:58)*

١٥٦٧ ـ وعنْ عبدِ اللهِ بنِ عَمرِو بنِ العَاصِ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «المُسْلِمُ مَنْ سَلِمَ المُسْلِمُونَ مِنْ لِسَانِهِ وَيَدِهِ، وَالمُهَاجِرُ مَنْ هَجَرَ مَا نَهَى اللهُ عَنْهُ» متفقٌ عليه.

1567. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్(రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవడి నోటి మూలంగా, చేతుల మూలంగా ఇతర ముస్లింలు బాధపడకుండా ఉంటారో అతనే (నిజమైన) ముస్లిం. అలాగే దేవుడు వదలిపెట్టమన్న వాటిని వదలిపెట్టేవాడే ముహాజిర్ (దైవమార్గంలో వలసపోయేవాడు. ముహాజిర్ అంటే వదలిపెట్టేవాడని నిఘంటువు అర్థం.)

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఈమాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పైకి చెప్పుకోవటానికి షహాదత్ కలిమా (సాక్ష్యవచనం) పలికి ఒకే దేవుణ్ణి, ముహమ్మద్ దైవప్రవక్త అన్న విషయాన్ని అంగీకరించిన వారందరూ ముస్లింలే. అయితే వాస్తవానికి ముస్లిం అంటే అతని నీతినడవడికలు తన వాక్కర్మల ద్వారా ఇతరులకు బాధకలిగించనంత గొప్పవిగా ఉండాలి. అదే విధంగా సాధారణంగా దైవం కోసం తన స్వదేశాన్ని, ఆత్మీయుల్ని, బంధు

మిత్రుల్ని వదలిపెట్టి ధర్మాన్ని సులభంగా ఆచరించటానికి అనువున్న ప్రదేశానికి తరలి వెళ్ళేవాణ్ణి 'ముహాజిర్' అని అంటారు. కాని వాస్తవానికి దైవాజ్ఞమేరకు పాపకార్యాలను వదలిపెట్టేవాడు కూడా ముహాజిర్‌గానే పరిగణించబడతాడు. ఎందుకంటే హిజ్రత్‌కు అసలు అర్థం 'వదలిపెట్టటమని'. అది స్వదేశాన్ని వదలిపెట్టటమయినా కావచ్చు, లేక పాపకార్యాలను వదలిపెట్టటమయినా కావచ్చు.

١٥٦٨ ـ وعنه قال: قال رَسُولُ الله ﷺ: «مَنْ أَحَبَّ أَنْ يُزَحْزَحَ عَنِ النَّارِ، وَيُدْخَلَ الجَنَّةَ، فَلْتَأْتِهِ مَنِيَّتُهُ وَهُوَ يُؤْمِنُ بِاللهِ وَاليَوْمِ الآخِرِ، وَلْيَأْتِ إِلَى النَّاسِ الذي يُحِبُّ أَنْ يُؤْتَى إِلَيْهِ» رواه مسلم. وَهُوَ بَعْضُ حَدِيثٍ طويلٍ سَبَقَ في بَابِ طَاعَةِ وُلَاةِ الأُمُورِ.

1568. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఎవరయితే నరకాగ్ని నుండి రక్షించబడి స్వర్గానికి పంపబడాలనుకుంటున్నాడో అతనికి తాను దేవుణ్ణి, అంతిమ దినాన్ని విశ్వసిస్తూ ఉన్న తరుణంలో మరణం సంభవించాలి. ఇంకా అతను తన పట్ల ఉత్తమ వ్యవహారం జరగాలని కోరుకుంటున్నట్లుగానే ప్రజల పట్ల కూడా ఉత్తమంగా వ్యవహరిస్తూ ఉండాలి. (ముస్లిం)

ఇది ఇంతకుముందు 'అధికారుల పట్ల విధేయత' అనే అధ్యాయం క్రింద వచ్చిన సుదీర్ఘ హదీసులోని ఒక భాగం.

*(సహీహ్ ముస్లింలోని ఇమారత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 6వ అధ్యాయంలోని 668వ హదీసు క్రింద ప్రస్తావనకు వచ్చింది. ఇందులో విశ్వాసం మీద నిలకడతనాన్ని, సదాచరణ విషయంలో శాశ్వతతత్వాన్ని అలవర్చుకోవాలని తాకీదు చేయబడింది. మనిషికి మరణం ఎప్పుడు సంభవిస్తుందో తెలీదు. అందుకని మనిషికి విశ్వాసస్థితిలో మరణం సంభవించాలంటే దానికోసం అతను ఎట్టి పరిస్థితుల్లోనూ విశ్వాసం కోరే విషయాలనూ, సదాచరణనూ నిర్లక్ష్యం చేయరాదు. దివ్యఖుర్‌ఆన్‌లో ఒకచోట, "మీరు ముస్లింలుగా ఉన్న స్థితిలోనే మరణించాలి" అని ఉంది (ఆలి ఇమ్రాన్:102). ఈ హదీసు సరిగ్గా ఆ భావానికే అద్దం పడుతోంది.

2) ఒక ముస్లిం, ప్రజలు తన పట్ల ఉత్తమంగా వ్యవహరించాలని కోరుకునేటట్లుగానే తాను కూడా ప్రతి ఒక్కరి పట్ల మంచిగా మెలగాలి.

**269వ అధ్యాయం**

# ٢٦٩ - بَابُ النَّهْيِ عَنِ التَّبَاغُضِ وَالتَّقَاطُعِ وَالتَّدَابُرِ

# పరస్పరం పగతో, సంబంధాలు త్రెంచుకొని ఎడమొహం పెడమొహంతో ఉండరాదు

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّمَا الْمُؤْمِنُونَ إِخْوَةٌ﴾ [الحجرات: ١٠]. وقالَ تعالى: ﴿أَذِلَّةٍ عَلَى الْمُؤْمِنِينَ أَعِزَّةٍ عَلَى الْكَافِرِينَ﴾ [المائدة: ٥٤]. وقالَ تعالى: ﴿مُحَمَّدٌ رَسُولُ اللَّهِ وَالَّذِينَ مَعَهُ أَشِدَّاءُ عَلَى الْكُفَّارِ رُحَمَاءُ بَيْنَهُمْ﴾ [الفتح: ٢٩].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వాసులు పరస్పరం అన్నదమ్ములు."

*(అల్‌హుజురాత్:10)*

"వారు విశ్వాసుల పట్ల మృదువుగానూ, అవిశ్వాసుల పట్ల కఠినంగానూ ప్రవర్తిస్తారు."

*(మాయిదా:54)*

"ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త. ఆయన వెంట ఉన్నవారు, అవిశ్వాసుల పట్ల కఠినులుగానూ, పరస్పరం కరుణామయులుగానూ ఉంటారు."

*(అల్‌ఫతహ్:29)*

١٥٦٩ - وعنْ أَنسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «لَا تَبَاغَضُوا، وَلَا تَحَاسَدُوا، وَلَا تَدَابَرُوا، وَلَا تَقَاطَعُوا، وَكُونُوا عِبَادَ اللهِ إخواناً، وَلَا يَحِلُّ لِمُسْلِمٍ أَنْ يَهْجُرَ أَخَاهُ فَوقَ ثَلَاثٍ» متفقٌ عليه.

1569. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: పరస్పరం పగ బట్టకండి. అసూయ చెందకండి. ఎడమొహం పెడమొహంతో ఉండకండి. సంబంధాలు త్రెంచుకోకండి. దైవ దాసులారా! పరస్పరం అన్నదమ్ములుగా ఉండండి. ఒక ముస్లిం తోటి (ముస్లిం) సోదరునితో మూడ్రోజులకు మించి మాట్లాడకుండా ఉండరాదు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం- సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పరస్పరం పగబట్టకండి అంటే హృదయాల్లో ప్రతీకార, విరోధ భావాలను పెంచే మాటలకు, పనులకు దూరంగా ఉండండి అని అర్థం. అసూయ చెందకండి అంటే ఒక ముస్లింకు ఏదయినా వరంగాని లేక హోదా అంతస్తులుగాని లభిస్తే అవి క్షీణించిపోవాలని కోరుకోకండి అని అర్థం. ఎడమొహం పెడమొహంతో ఉండకండి అంటే పరస్పరం ఎదురుపడినప్పుడు కనీసం సలాం అయినా చేసుకోకుండా మొహం తిప్పుకొని వెళ్లిపోకండి అని అర్థం. వీటివల్ల మనుషుల్లో అంతరాల అగాధాలు పెరిగిపోతాయి. సామాజిక జీవితం ఛిన్నాభిన్నమైపోతుంది. కనుక మనుషులు మూడ్రోజులకు మించి తెగత్రెంపులు చేసుకొని మాట్లాడకుండా ఉండటం ధర్మసమ్మతం కాదు.

١٥٧٠ ـ وعنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قالَ: «تُفْتَحُ أَبْوَابُ الجَنَّةِ يَوْمَ الاثْنَيْنِ وَيَوْمَ الخَمِيسِ، فَيُغْفَرُ لِكُلِّ عَبْدٍ لَا يُشْرِكُ باللهِ شَيْئاً، إلَّا رَجُلاً كَانَتْ بَيْنَهُ وَبَيْنَ أَخِيهِ شَحْنَاءُ فيقالُ: أَنْظِرُوا هٰذَيْنِ حَتَّى يَصْطَلِحَا! أَنْظِرُوا هٰذَيْنِ حَتَّى يَصْطَلِحَا!» رواه مسلم. وفي روايةٍ له: «تُعْرَضُ الأَعْمَالُ في كُلِّ يَوْمِ خَمِيسٍ وَاثْنَيْنِ» وَذَكَرَ نَحْوَهُ.

1570. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: సోమ, గురు వారాల్లో స్వర్గద్వారాలు తెరువబడ తాయి. ఆ రోజు అల్లాహ్‌తోపాటు సహవర్తుల్ని నిలబెట్టని ప్రతి ఒక్కరి పాపాలూ మన్నించబడతాయి. కాని తనకూ తన తోటి (ముస్లిం) సోదరునికి మధ్య శత్రుత్వమున్నవాని పాపాలు మాత్రం మన్నించబడవు. వారి గురించి "వీరిద్దరూ తమ సంబంధాలు మెరుగు పరచుకునేదాకా గడువు ఇవ్వండి! వీరిద్దరూ తమ సంబంధాలు మెరుగు పరచుకునేదాకా గడువు ఇవ్వండి" అని అనటం జరుగుతుంది. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "ప్రతి సోమ గురువారాల్లో కర్మలు ప్రవేశపెట్ట బడతాయి" అని ఉంది. ఆ తర్వాతి హదీసు అంతా యధాతథంగానే ఉంది.

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పరస్పరం శత్రుత్వం, విద్వేష వైషమ్యాలు కలిగి ఉండటం స్వర్గ అనర్హతకు కారణభూత మవుతుందని ఈ హదీసు హెచ్చరిస్తోంది.

## 270వ అధ్యాయం

## ٢٧٠ - بَابُ تَحْرِيمِ الْحَسَدِ وَهُوَ تَمَنِّيْ زَوَالِ النِّعْمَةِ عَنْ صَاحِبِهَا: سَوَاءٌ كَانَتْ نِعْمَةَ دِيْنٍ أَوْ دُنْيَا

## అసూయ చెందటం నిషిద్ధం, అసూయ అంటే ఇతరుల అనుగ్రహాలు తొలగిపోవాలని కోరుకోవటం- ఆ అనుగ్రహం ధార్మికమైనదైనా లేక ప్రాపంచికమైనదైనా సరే

قَالَ اللهُ تعالى: ﴿ أَمْ يَحْسُدُونَ النَّاسَ عَلَىٰ مَا ءَاتَـٰهُمُ ٱللَّهُ مِن فَضْلِهِۦ ﴾ [النساء: ٥٤].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా అంటున్నాడు:

“ఇతరులను చూసి వారు అసూయ పడటానికి కారణం అల్లాహ్ వారికి తన అనుగ్రహాన్ని ప్రసాదించాడనా?” (నిసా:54)

وَفِيهِ حَدِيثُ أَنَسٍ السَّابِقُ فِي البَابِ قَبْلَهُ.

గత అధ్యాయంలో ప్రస్తావించబడిన అనస్(రజి) హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది. (మరొక హదీసును కూడా పరిశీలించండి)

١٥٧١ - وعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «إِيَّاكُمْ وَالحَسَدَ؛ فَإِنَّ الحَسَدَ يَأْكُلُ الحَسَنَاتِ كَمَا تَأْكُلُ النَّارُ الحَطَبَ، أَوْ قَالَ: العُشْبَ» رواه أبو داود.

1571. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: అసూయకు దూరంగా ఉండండి. అగ్ని కట్టెల్ని కాల్చినట్లు అది సత్కర్మల్ని తినేస్తుంది. లేక ఆయన ‘ఎండుగడ్డిని కాల్చేసినట్టు’ అని అనుంటారు. (అబూదావూద్)

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇతరుల బాగును చూసి అసూయ చెందటం మహాపాతకం. అగ్ని కట్టెల్ని, ఎండు గడ్డిని కాల్చేసినట్టు అది చాలా వేగంగా సత్కార్యాలను భస్మీపటలం చేసేస్తుంది.

**271వ అధ్యాయం**

## ٢٧١ - بَابُ النَّهْيِ عَنِ التَّجَسُّسِ وَالتَّسَمُّعِ لِكَلَامِ مَنْ يَكْرَهُ اسْتِمَاعَهُ

## ఇతరుల తప్పు లెన్నటం, ఇతరులకు ఇష్టం లేకపోయినా వారి మాటల్ని వినటానికి ప్రయత్నించటం చేయరాదు

قَالَ اللهُ تَعَالَى: ﴿وَلَا تَجَسَّسُوا﴾ [الحجرات: ١٢] وقَالَ تَعَالَى: ﴿وَالَّذِينَ يُؤْذُونَ الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ بِغَيْرِ مَا اكْتَسَبُوا فَقَدِ احْتَمَلُوا بُهْتَانًا وَإِثْمًا مُبِينًا﴾ [الأحزاب: ٥٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మీరు ఇతరుల రహస్యాలను దేవులాడకండి."
*(హుజురాత్:12)*

"ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని తమ తలపై మోపుకున్నట్లే."
*(అహ్‌జాబ్:58)*

١٥٧٢ - وعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِيَّاكُمْ وَالظَّنَّ، فَإِنَّ الظَّنَّ أَكْذَبُ الحَدِيثِ، وَلَا تَحَسَّسُوا، وَلَا تَجَسَّسُوا وَلَا تَنَافَسُوا، وَلَا تَحَاسَدُوا، وَلَا تَبَاغَضُوا، وَلَا تَدَابَرُوا، وَكُونُوا عِبَادَ اللهِ إِخْوَاناً كَمَا أَمَرَكُم. المُسْلِمُ أَخُو المُسْلِمِ، لَا يَظْلِمُهُ،

1572. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: మీరు దురను మానాలకు దూరంగా ఉండండి. ఎందుకంటే విషయాల్లో అత్యంత అబద్ధమైన విషయం దురనుమానం. ఇతరుల తప్పుల్ని ఎన్నకండి. కూపీలు తీయకండి. ఇతరుల హక్కుల్ని కబళించే ప్రయత్నంలో ఒండొకరిని మించి పోవటానికి ప్రయత్నించకండి. పరస్పరం అసూయ చెందకండి. ద్వేషించుకోకండి. ఎడమొహం పెడ మొహంతో ఉండకండి. దైవదాసు

وَلَا يَخْذُلُهُ وَلَا يَحْقِرُهُ، التَّقْوَى هٰهُنَا، التَّقْوَى هٰهُنَا» وَيُشِيرُ إِلى صَدْرِه «بِحسْبِ امْرِىءٍ مِنَ الشَّرِّ أَنْ يَحْقِرَ أَخَاهُ المُسلِمَ، كُلُّ المُسلِمِ عَلى المُسْلِمِ حَرَامٌ: دَمُهُ، وَعِرْضُهُ، وَمَالُهُ، إِنَّ اللهَ لَا يَنْظُرُ إِلى أَجْسَادِكُم، وَلَا إِلَى صُوَرِكُمْ، وَلٰكِنْ يَنْظُرُ إِلى قُلُوبِكُم وأَعْمَالِكُمْ». وفي روايةٍ: «لَا تَحَاسَدُوا، وَلَا تَبَاغَضُوا، وَلَا تَجَسَّسُوا، وَلَا تَحَسَّسُوا وَلَا تَنَاجَشُوا وكُونُوا عِبَادَ اللهِ إِخْوَانًا». وفي روايةٍ: «لا تَقَاطَعُوا، وَلَاتَدَابَرُوا، وَلَا تَبَاغَضُوا وَلَا تَحَاسَدُوا، وَكُونُوا عِبَادَ اللهِ إِخْوَانًا». وفي روايةٍ: «لَاتَهَاجَرُوا وَلَا يَبِعْ بَعْضُكُم عَلى بَيعِ بَعْضٍ». رواه مسلم بكلِّ هذه الروايات، وروى البخاريُّ أكثَرَها.

లారా! దేవుడు ఆదేశించినట్టు మీరు పరస్పరం అన్నదమ్ముల్లా ఉండండి. ముస్లిం ముస్లింకు సోదరుడు. తను అతనిమీద దౌర్జన్యం చేయరాదు. అతన్ని నిస్సహాయునిగా వదలిపెట్ట రాదు. అతన్ని అల్పునిగా భావించ రాదు. తఖ్వా (దైవభీతి) అనేది ఇక్క డుంటుంది. తఖ్వా అనేది ఇక్కడుం టుంది. ఈ మాట ఆయన తన ఛాతీ వైపు సైగ చేస్తూ చెప్పారు.

ఒక మనిషి తన తోటి ముస్లిం సోదరుణ్ణి చులకనగా చూడటం చాలు అతను చెడ్డవాడని చెప్పటానికి. ఒక ముస్లిం కొరకు తోటి ముస్లిం ధనమాన ప్రాణాలు నిషిద్ధం. దేవుడు మీ శరీరాలను, మీ ముఖాలను చూడడు. ఆయన కేవలం మీ హృదయాల్ని, మీ ఆచరణల్ని మాత్రమే చూస్తాడు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: "ఒకరి మీద ఒకరు అసూయ చెంద కండి. పగ పెంచుకోకండి. కూపీలు తీయకండి. ఇతరుల తప్పుల్ని దేవు లాడకండి. ఇతరుల్ని మోసగించే ఉద్దే శ్యంతో బేరం మీద బేరం చెప్పకండి. దైవదాసులారా! పరస్పరం అన్న దమ్ముల్లా బతకండి.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: పర స్పరం పలకరింపులు మానుకోకండి.

ఒకరు బేరమాడుతున్నప్పుడు అతనికి వ్యతిరేకంగా బేరమాడకండి. ఈ ఉల్లేఖనాలన్నీ ఇమామ్ ముస్లిం వివరించినవి. వీటిలో ఎన్నో ఉల్లేఖనాల్ని ఇమామ్ బుఖారీ కూడా పేర్కొన్నారు.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో చేయబడిన బోధనల మొదటి ఉద్దేశ్యం, ముస్లింల మానమర్యాదలను రక్షించటం. అనవసరంగా దురనుమానాలకు లోనవటం, తప్పులెన్నటం ఒక ముస్లిం మానమర్యాదలకు విరుద్ధం. అందుకని వాటి నుంచి వారించటం జరిగింది. పోతే రెండో ఉద్దేశ్యం; ఇస్లామీయ సౌభ్రాతృత్వాన్ని రక్షించటం. అందుకే ముస్లిం మీద దౌర్జన్యం చేయటాన్ని, అతన్ని నిస్సహాయునిగా వదలిపెట్టటాన్ని, చులకనగా చూడటాన్ని, అతని మీద గర్వాన్ని ప్రదర్శించటాన్ని వారించటం జరిగింది. ఒక ముస్లిం ధనమాన ప్రాణాలను ఇతరముస్లిం కొరకు నిషేధించటం జరిగింది. ఇతరుల్ని మోసపుచ్చే ఉద్దేశ్యంతో వస్తువుల ధరల్ని ఎక్కువ పలికించటం వల్ల, ఒకరి బేరానికి వ్యతిరేకంగా బేరమాడటం వల్ల ప్రజల్లో పరస్పర విద్వేషవైషమ్యాలు రగులుకుంటాయి. అందుకని వాటి నుండి కూడా వారించటం జరిగింది.

١٥٧٣ - وَعَنْ مُعَاوِيَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِنَّكَ إِنِ اتَّبَعْتَ عَوْرَاتِ الْمُسْلِمِينَ أَفْسَدْتَهُمْ، أَوْ كِدْتَ أَنْ تُفْسِدَهُمْ» حديثٌ صحيحٌ. رواه أبو داودَ بإسنادٍ صحيحٍ.

1573. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ముఆవియా (రజి) తెలియజేశారు: నువ్వు గనక ముస్లింల లోపాలను ఎన్నటానికి ప్రయత్నిస్తే నువ్వే వారిని పాడుచేస్తావు. లేదా త్వరలోనే నువ్వు వారిని పాడు చేస్తావు. (ఇది సహీహ్ కోవకు చెందిన హదీసు. అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక వ్యక్తి ఇతరుల లోపాలను తెలుసుకోవటానికి ప్రయత్నిస్తే అది చూసి ఇతరులు

కూడా అదేపని మొదలెడతారు. దానివల్ల సమాజంలో ఎంతటి కల్లోలం వ్యాపిస్తుందో వివరించ నక్కర్లేదు. అందుకే షరీఅత్ ఇతరుల తప్పుల వెంట పడవద్దని చెబుతోంది.

١٥٧٤ ـ وعَنِ ابْنِ مسعودٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ أُتِيَ بِرَجُلٍ فَقِيلَ لَهُ: هٰذَا فُلانٌ تَقْطُرُ لِحْيَتُهُ خَمراً، فَقَالَ: إنَّا قَدْ نُهِينَا عَنِ التَّجَسُّسِ، وَلٰكِنْ إن يَظْهَرْ لَنَا شَيْءٌ، نَأْخُذْ بِهِ. حَدِيثٌ حَسَنٌ صَحِيحٌ. رواه أبو داودَ بإسنادٍ عَلى شَرْطِ البخاريِّ ومسلمٍ.

1574. హ్రజత్ అబూ మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం ఆయన దగ్గరికి ఒక మనిషిని తీసుకురావటం జరిగింది. అతని గడ్డం నుంచి మద్యం చుక్కలు పడుతున్నాయని కూడా ఆయనతో చెప్పటం జరిగింది. అప్పుడాయన ఇలా అన్నారు: ఇతరుల తప్పుల వెంట పడకుండా మమ్మల్ని వారించటం జరిగింది. ఒకవేళ ఏదయినా తప్పు మన ముందుకు వస్తే అప్పుడు మనం దానిమూలంగా వారిని పట్టుకోవచ్చు.

ఈ హదీసు హసన్ సహీహ్ కోవలకు చెందినది. దీనిని అబూదావూద్ బుఖారీ ముస్లింల నియమాలకు అను గుణంగా ఉన్న ఒక 'సనదు' ఆధారంగా వెలికితీశారు.

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఈ హదీసులో ఇస్లాం ఆదేశిస్తున్న ఒక పనిని దైవప్రవక్త సహచరులు ఆచరించిన తీరు వివరించబడింది. ఆయన సహచరులు ఇస్లామీయ విధి నిషేధాలను తు.చ. తప్పకుండా పాటించేవారు.

2) నిందితుల్ని కేవలం అనుమానం మీద శిక్షించటం, మందలించటం చేయకూడదు. శిక్ష విధించటం కోసం సరైన ఆధారాలు కావాలి.

## 272వ అధ్యాయం

## ٢٧٢ - بَابُ النَّهْيِ عَنْ سُوءِ الظَّنِّ بِالْمُسْلِمِينَ مِنْ غَيْرِ ضَرُورَةٍ

## అనవసరంగా ముస్లింల గురించి దురనుమానాలు పెట్టుకోరాదు

قَالَ اللهُ تَعَالَى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱجْتَنِبُوا۟ كَثِيرًا مِّنَ ٱلظَّنِّ إِنَّ بَعْضَ ٱلظَّنِّ إِثْمٌ ﴾ [الحجرات: ١٢].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వాసులారా! అతిగా అనుమానించటం మానివేయండి. కొన్ని అనుమానాలు పాపాలు అవుతాయి." *(హుజురాత్:12)*

١٥٧٥- وعنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِيَّاكُمْ وَالظَّنَّ؛ فَإِنَّ الظَّنَّ أَكْذَبُ الحَدِيثِ» متفقٌ عليه.

1575. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మాటల్లోకెల్లా అత్యంత అబద్ధమైన మాట దురనుమానం. కనుక దురనుమానాలకు దూరంగా ఉండండి.

(బుఖారీ-ముస్లిం)

### ముఖ్యాంశాలు

1) ఈ హదీసు గత అధ్యాయంలో కూడా వచ్చింది. ఇందులో కూడా దురనుమానాల గురించి హెచ్చరించటం జరిగింది. ముఖ్యంగా సజ్జనుల, సంస్కారవంతుల విషయంలో దురనుమానాలు పెట్టుకోరాదని తాకీదు చేయబడింది. ఎందుకంటే దురనుమానమనేది ఒక దారుణమైన అబద్ధం లాంటిది. షరీఅత్‌పరమైన ఆదేశాలు, శిక్షలు నమ్మకం మీదనే ఆధారపడతాయి, కేవలం ఊహలు, అనుమానాల మీద కాదు.

2) ఒక ముస్లింకు సంబంధించి స్పష్టమైన ఆధారమేదీ లేనప్పుడు సాధారణ పరిస్థితుల్లో అతని గురించి సదభిప్రాయంతోనే ఉండాలి.

**273వ అధ్యాయం**

# ٢٧٣ ـ بَابُ تَحْرِيمِ احْتِقَارِ الْمُسْلِمِينَ

## ముస్లింలను చులకనగా చూడటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا يَسْخَرْ قَوْمٌ مِّن قَوْمٍ عَسَىٰٓ أَن يَكُونُوا۟ خَيْرًا مِّنْهُمْ وَلَا نِسَآءٌ مِّن نِّسَآءٍ عَسَىٰٓ أَن يَكُنَّ خَيْرًا مِّنْهُنَّ ۖ وَلَا تَلْمِزُوٓا۟ أَنفُسَكُمْ وَلَا تَنَابَزُوا۟ بِٱلْأَلْقَٰبِ ۖ بِئْسَ ٱلِٱسْمُ ٱلْفُسُوقُ بَعْدَ ٱلْإِيمَٰنِ ۚ وَمَن لَّمْ يَتُبْ فَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ﴾ [الحجرات: ١١]. وقال تعالى: ﴿وَيْلٌ لِّكُلِّ هُمَزَةٍ لُّمَزَةٍ﴾ [الهمزة: ١].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వాసులారా! పురుషులు ఇతర పురుషులను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠులై ఉండవచ్చు. అలాగే స్త్రీలు ఇతర స్త్రీలను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠ రాండ్రయి ఉండవచ్చు. ఒకరినొకరు ఎత్తి పొడుచుకోకండి. ఒకరినొకరు చెడ్డ పేర్లతో పిలుచుకోకండి. విశ్వసించిన తర్వాత చెడ్డ తనంలో పేరు సంపాదించటం చాలా నీచమైన విషయం. ఈ వైఖరిని మానుకోనివారే దుర్మార్గులు." *(హుజురాత్: 11)*

"ప్రజలను దెప్పిపొడవటంలో, పరోక్షంగా వారి లోపాలను ఎంచటంలో ఆసక్తి కనబరిచేవాడు సర్వనాశనమయి పోతాడు."

*(అల్ హుమజహ్:1)*

١٥٧٦ ـ وعنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «بِحَسْبِ امْرِىءٍ مِنَ الشَّرِّ أَنْ يَحقِرَ أَخَاهُ الْمُسْلِمَ». رواه مسلم، وقد سبق قريباً بطوله.

1576. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తోటి ముస్లిం సోదరుణ్ణి చులకనగా చూడటం చాలు అతను చెడ్డవాడు అని చెప్పటానికి. (ముస్లిం- ఈ హదీసు సవివరంగా ఇంతకు కొద్దిముందే గడిచింది.)

١٥٧٧ ـ وعَن ابْنِ مسعُودٍ رَضِيَ اللهُ عَنْهُ عنِ النَّبِيِّ ﷺ قَالَ: «لَا يَدْخُلُ الجَنَّةَ

1577. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) కథనం ప్రకారం

مَنْ كَانَ فِي قَلْبِهِ مِثْقَالُ ذَرَّةٍ مِنْ كِبْرٍ» فَقَالَ رَجُلٌ: إنَّ الرَّجُلَ يُحِبُّ أَنْ يَكُونَ ثَوْبُهُ حَسَناً، وَنَعْلُهُ حَسَنَةً، فقال: «إنَّ الله جَمِيلٌ يُحِبُّ الجَمَالَ، الكِبْرُ بَطَرُ الحَقِّ، وَغَمْطُ النَّاسِ» رواه مسلم. وَمَعْنَى «بطر الحَقِّ»: دَفْعُه، وَ«غَمْطُهُم»: احْتِقَارُهُمْ، وَقَدْ سَبَقَ بَيَانُهُ بِأَوْضَحَ مِنْ هٰذَا فِي بابِ الكِبرِ.

దైవప్రవక్త (సల్లం) (తన సహచరులకు హితోపదేశం చేస్తూ) "మనిషి మనసులో లేశమాత్రం గర్వమున్నా అతను స్వర్గంలోకి ప్రవేశించలేడు" అని అన్నారు. అది విని ఒక వ్యక్తి (సందేహపడుతూ) "మనిషి తన బట్టలూ, చెప్పులు నీటుగా ఉండాలని కోరుకుంటాడు (మరి ఇది కూడా గర్వమేనా దైవప్రవక్తా!)" అని అడిగాడు. అందుకాయన బదులిస్తూ, "దేవుడు సుందర స్వరూపుడు. సౌందర్యాన్ని ఇష్టపడతాడు. (గర్వం అంటే అది కాదు). వాస్తవానికి గర్వమంటే సత్యాన్ని త్రోసిపుచ్చటం, ప్రజల్ని నీచులుగా భావించటం" అని చెప్పారు. (ముస్లిం)

బత్‌రుల్ హఖ్ అంటే సత్యాన్ని తృణీకరించటం, "గమ్‌తుహుమ్" అంటే ప్రజల్ని చులకనగా చూడటం అని అర్థం. ఈ హదీసు గురించి ఇంతకు ముందు 'గర్వం' అనే అధ్యాయంలో మరింత వివరంగా చర్చించటం జరిగింది.

*(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'గర్వాహంకారాలను ప్రదర్శించటం నిషిద్ధం' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. (మొదటి భాగంలోని 612వ హదీసు చూడండి) గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) 'బత్‌రుల్ హఖ్' అనేమాటకు 'దఫ్‌వుల్ హఖ్' అని తర్జుమా చేశారు. దాని అర్థం సత్యాన్ని దాటవేయటం, మాటకు ఎదురుచెప్పటం. దీనికి కూడా సత్యానికి దూరంగా ఉండటం, దాన్ని తృణీకరించటం అనే భావమే వస్తుంది. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే కేవలం

మంచి దుస్తులు ధరించినంత మాత్రాన అది గర్వం అయిపోదు. చాలామంది దాన్నే గర్వంగా భావిస్తున్నారు. నిజానికి గర్వమంటే ఏమిటో పై హదీసులో సూచించటం జరిగింది.

١٥٧٨ ـ وعن جُنْدُبِ بْنِ عَبدِ الله رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «قَالَ رَجُلٌ: وَاللهِ! لَا يَغْفِرُ اللهُ لِفُلَانٍ، فَقَالَ اللهُ عَزَّ وَجَلَّ: مَنْ ذَا الَّذِي يَتَأَلَّى عَلَيَّ أَنْ لَا أَغفِرَ لِفُلَانٍ! إِنِّي قَدْ غَفَرْتُ لَهُ، وَأَحْبَطْتُ عَمَلَكَ» رواه مسلم.

1578. హజ్రత్ జుందుబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఒకవ్యక్తి "అల్లాహ్ సాక్షి! అల్లాహ్ ఫలానా వ్యక్తిని క్షమించడు" అని అంటే, దానికి దేవుడు "నేను ఫలానా వ్యక్తిని క్షమించనని ప్రమాణం చేయటానికి నువ్వెవరివి? నేను అతన్ని క్షమించి నీ కర్మల్ని నాశనం చేస్తాను జాగ్రత్త!" అని అంటాడు.

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొంతమంది తమ ఆరాధనను, ధర్మపరాయణతను తలచుకొని మిడిసిపాటుకు లోనై ఇతరుల విషయంలో దురనుమానాలకు లోనవుతుంటారు. ఫలానా వారిని దేవుడు ఎన్నటికీ క్షమించడని ఎంతో నమ్మకంగా చెబుతారు. ఈ ధోరణి దేవుని ఔన్నత్యం పట్ల అగౌరవాన్ని, మితిమీరిన స్వీయ సదభిప్రాయాన్ని సూచిస్తుంది. దీనిని దేవుడు ఇష్టపడడు. ఆయన తలచుకుంటే ఆ ఆరాధకుని, దైవభీతిపరుని కర్మలన్నింటినీ వ్యర్థం చేసేసి అతన్ని నరకంలో పడేయగలడు. అతనికి భిన్నంగా అతను ఎవరిగురించి అయితే దేవుడు క్షమించడని ఒట్టేశాడో అతన్ని మన్నించి స్వర్గానికి పంపగలడు. కనుక మనిషి తన ఆరాధనను చూసుకొని మిడిసిపాటుకులోనై ఇతరుల్ని అల్పులుగా భావించరాదు.

## 274వ అధ్యాయం

## ٢٧٤ - بَابُ النَّهْيِ عَنْ إظْهَارِ الشَّمَاتَةِ بِالْمُسْلِمِ

## ముస్లింకు బాధ కలిగిందని సంబరపడిపోవటం తగదు

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّمَا الْمُؤْمِنُونَ إِخْوَةٌ﴾ [الحجرات: ١٠]. وقَالَ تَعَالَى: ﴿إِنَّ الَّذِينَ يُحِبُّونَ أَن تَشِيعَ الْفَاحِشَةُ فِي الَّذِينَ آمَنُوا لَهُمْ عَذَابٌ أَلِيمٌ فِي الدُّنْيَا وَالْآخِرَةِ﴾ [النور: ١٩].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "విశ్వాసులు పరస్పరం అన్నదమ్ములు." *(హుజురాత్:10)*

"విశ్వాసుల్లో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యథాభరిత మైన శిక్షకు అర్హులు." *(నూర్: 19)*

١٥٧٩ - وعَنْ وَاثِلَةَ بْنِ الأَسْقَعِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تُظْهِرِ الشَّمَاتَةَ لأَخِيكَ، فَيَرْحَمَهُ اللهُ وَيَبْتَلِيَكَ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

1579. హజ్రత్ వాసిలా బిన్ అస్ఖా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: నీ సోదరునికి బాధ కలిగిందని సంబరపడి పోకు. దేవుడు అతని మీద దయజూపి నిన్ను పరీక్షకు గురిచేయగలడు. *(తిర్మిజీ-హసన్)*

*(సుననె తిర్మిజీలోని సిఫతుల్ ఖియామా అధ్యాయాలు)*

### ముఖ్యాంశాలు

నిజమైన విశ్వాసి తోటి విశ్వాసి బాధల్లో ఉంటే అతని బాధను తన బాధగా భావిస్తాడు. అతను సంతోషంగా ఉన్నప్పుడు అతని సంతోషంలో పాలుపంచుకుంటాడు. అంతేగాని ఇతరులు బాధల్లో ఉండటం చూసి తను సంతోషంతో కేరింతలు కొట్టడు. అది విశ్వాసి నైతికతకే విరుద్ధం. ఈ వైఖరిని దేవుడు చాలా అసహ్యించుకుంటాడు. అంతేకాదు ఆయన తలచుకుంటే ఆ ఆనందరాయుణ్ణి ఇహలోకంలోనే ఏదో ఒక కష్టానికి గురిచేసి తగిన శాస్తి చేయగలడు.

وفي الباب حديثُ أبي هريرةَ السابقُ في باب التَّجَسُّسِ: «كُلُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ حَرَامٌ» الحديثَ.

ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా అంటున్నారు: ఇంతకుముందు 'గూఢచర్యం' అధ్యాయంలో వచ్చిన "ప్రతి ముస్లిం ఇతర ముస్లిం పాలిట నిషేధితుడు (గౌరవనీయుడు)" అన్న అబూహురైరా హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది.

## 275వ అధ్యాయం

# ٢٧٥ ـ بَابُ تَحْرِيمِ الطَّعْنِ فِي الأَنْسَابِ الثَّابِتَةِ فِي ظَاهِرِ الشَّرْعِ

# షరీఅత్ పరంగా రుజువైన వంశం గురించి దెప్పిపొడవటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَالَّذِينَ يُؤْذُونَ الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ بِغَيْرِ مَا اكْتَسَبُوا فَقَدِ احْتَمَلُوا بُهْتَانًا وَإِثْمًا مُبِينًا ﴾ [الأحزاب: ٥٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని తమ తలపై మోపుకున్నట్లే."

*(అహ్‌జాబ్: 58)*

١٥٨٠ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «اثْنَتَانِ فِي النَّاسِ هُمَا بِهِمْ كُفْرٌ: الطَّعْنُ فِي النَّسَبِ، وَالنِّيَاحَةُ عَلَى الْمَيِّتِ» رواه مسلم.

1580. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రజల్లో ఉండే రెండు విషయాలు అవిశ్వాసానికి (కుఫ్రుకు) దారితీస్తాయి. 1) వంశం గురించి దెప్పిపొడవటం 2) చని పోయిన వారి మీద ఏడ్చి పెడబొబ్బలు పెట్టటం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పై రెండూ ఎంత పెద్ద పాపాలంటే మనిషి గనక ఉద్దేశ్యపూర్వకంగా వాటిని ధర్మ సమ్మతంగా భావించి చేస్తే అతను అవిశ్వాసి (కాఫిర్) అయిపోతాడు. ఒకవేళ మానవ సహజమైన దౌర్బల్యం మూలంగా ఆ తప్పులు జరిగిపోయినా అది ఘోరాతిఘోరంగానే పరిగణించ బడుతుంది. వంశం గురించి దెప్పిపొడవటమంటే ఒకర్ని పరాభవించే, అవమానించే ఉద్దేశ్యంతో అతన్ని పట్టుకొని "మీ నాన్న ఆ పని చేస్తాడు, మీ అమ్మ ఇలాంటిది లేక నువ్వు సాలెవాడివి, కమ్మరివి, రజకుడివి, చెప్పులు కుట్టేవాడివి" అని దెప్పిపొడవటం, వృత్తిపరంగా ఏదయినా వంశాన్ని లేక వ్యక్తిని చులకనగా భావించటం కూడా వంశం గురించి దెప్పిపొడవటం క్రిందికే వస్తుంది.

276వ అధ్యాయం

# ٢٧٦ ـ بَابُ النَّهْيِ عَنِ الْغِشِّ وَالْخِدَاعِ

## నకిలీల తయారీ, మోసం చేయటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿وَالَّذِينَ يُؤْذُونَ الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ بِغَيْرِ مَا اكْتَسَبُوا فَقَدِ احْتَمَلُوا بُهْتَانًا وَإِثْمًا مُبِينًا﴾ [الأحزاب: ٥٨].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు, ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని తమ తలపై మోపుకున్నట్లే."

*(అల్ అహ్‌జాబ్: 58)*

١٥٨١ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ حَمَلَ عَلَيْنَا السِّلَاحَ فَلَيْسَ مِنَّا، وَمَنْ غَشَّنَا فَلَيْسَ مِنَّا» رواه مسلم. وفي رِوَايَةٍ لَهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ مَرَّ عَلَى صُبْرَةِ طَعَامٍ، فَأَدْخَلَ يَدَهُ فِيهَا، فَنَالَتْ أَصَابِعُهُ بَلَلًا، فَقَالَ: «مَا هٰذَا يَا صَاحِبَ الطَّعَامِ؟» قَالَ: أَصَابَتْهُ السَّمَاءُ يَا رَسُولَ اللهِ! قَالَ: «أَفَلَا جَعَلْتَهُ فَوْقَ الطَّعَامِ حَتَّى يَرَاهُ النَّاسُ! مَنْ غَشَّنَا فَلَيْسَ مِنَّا».

1581. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మా మీదకు ఆయుధం లేపేవాడు మా (ముస్లిం లలోని) వాడుకాదు. మమ్మల్ని మోసం చేసేవాడు మా(లోని) వాడుకాడు.

(ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) (ఒకసారి) ఓ ధాన్యపు కుప్ప దగ్గర్నుంచి వెళ్తూ అందులో చెయ్యి ఉంచి చూశారు. వేళ్లకు తడిగా అనిపించింది. అప్పుడాయన "ఓ ధాన్యం మనిషీ! ఏమిటిది?" అని అడిగారు. అందుకతను, "వర్షానికి తడిసిపోయినై దైవప్రవక్తా!" అన్నాడు. అది విని ఆయన "మరయితే దాన్ని ప్రజలకు కనపడేలా పైన ఎందుకుంచలేదూ? (విను)

మమ్మల్ని మోసం చేసేవాడు మాలోని వాడుకాడు” అని హెచ్చరించారు.

(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) ఆయుధాలు లేపటమంటే ముస్లిం సంఘానికి ఎదురు తిరగటం, వారి మీద తిరుగుబాటు చేయటం లేదా నిష్కారణంగా ముస్లిం మీద ఖడ్గం, తుపాకీ (రివాల్వర్) మొదలగు ఆయుధాలు సంధించి అతన్ని హత్యచేయటం అని అర్థం. దురదృష్టం కొద్దీ ఈ రోజుల్లో ఈ తరహా ఉగ్రవాదంతో సమాజం అట్టుడికిపోతోంది.

2) నకిలీలు తయారుచేయటం, మోసగించటం లాంటివి అనేక రకాలుగా జరుగుతాయి. వాటిలో ఒకటి ఆంతరంగికమైనది. ఉదా: అసత్యానికి సత్యం ముసుగు తొడిగించటం. రెండోది, భౌతికమైనది, బాహ్యపరమైనది. ఉదా: సరుకులో ఏదైనా లోపముంటే దాన్ని బహిర్గతం చేయకుండా అమ్మేయటం. తూకం ఎక్కువ రావాలన్న ఉద్దేశ్యంతో మంచి సరుకులో నాశిరకపు లేదా ఇతర వస్తువులేవయినా కలిపేయటం. ఇలాంటి ఉదాహరణలు మనం ఎన్నో పేర్కొనవచ్చు.

3) మా వాడు కాడు అంటే మా ముస్లింల విధానంపై లేడు. అతను అనుసరిస్తున్న ఈ వైఖరి విశ్వసనీయమైనది కాదు, విశ్వాసఘాతుకంతో కూడుకున్నది అని అర్థం. కనుక ప్రతి ముస్లిం అన్నిరకాల మోసపూరిత విధానాలకు దూరంగా ఉండాలన్నది ఈ హదీసు ఉద్దేశ్యం.

١٥٨٢ ـ وَعَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ، قَالَ: «لَا تَنَاجَشُوا» متفقٌ عليه.

1582. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: కొనుగోలు చేయాలన్న ఉద్దేశ్యం లేకపోయినా (వస్తువు ధర పెంచే నెపంతో) ఎక్కువ ధరకు బేరమాడకండి.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు కూడా వచ్చింది. ఒక మనిషి ఒక వస్తువును కొనుగోలు చేసే ఉద్దేశ్యం లేకపోయినా దాన్ని ఎక్కువ ధరకు బేరమాడతాడు. దానివల్ల అసలు కొనుగోలుదారుడు మోసపోతాడు. దాని వాస్తవ ధరకన్నా చాలా ఎక్కువ ధరకు దాన్ని కొనుగోలు చేయవలసి వస్తుంది. ఇదీ ఒక రకంగా మోసమే కనుక ముస్లింలు ఇందుకు దూరంగా ఉండాలి.

١٥٨٣ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ

1583. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)

عَنْهُمَا، أَنَّ النَّبِيَّ ﷺ نَهَى عَنِ النَّجْشِ. متفقٌ عليه.

'నజష్'ను (మోసపుచ్చే ఉద్దేశ్యంతో ధర ఎక్కువ పలికించటాన్ని) వారించారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)

١٥٨٤ - وَعَنْهُ قَالَ: ذَكَرَ رَجُلٌ لِرَسُولِ اللهِ ﷺ أَنَّهُ يُخْدَعُ فِي الْبُيُوعِ؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ بَايَعْتَ، فَقُلْ لَا خِلَابَةَ» متفقٌ عليه. «الخِلَابَة» بخاءٍ معجمةٍ مكسورة، وباءٍ موحدة: وهي الخديعةُ.

1584. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి)గారే చేసిన కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ తాను క్రయ విక్రయాల్లో ఎల్లప్పుడూ మోసపోతుంటానని చెప్పాడు. అందుకు దైవప్రవక్త (సల్లం) అతనికి "(ఇకముందు) నువ్వు లావాదేవీలు జరిపితే 'మోసం ఉండ కూడదు' అని చెప్పెయ్యి" అని ఉపదేశించారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పై హదీసులోని 'మోసం ఉండకూడదు' అనే వాక్యం వినియోగదారుని ఎంపిక హక్కుని సూచిస్తోంది. అంటే సరుకులో ఏదయినా మోసం ఉందని తెలిస్తే కొనుగోలు దారునికి ఆ సరుకును వాపసు చేసే హక్కుంటుంది. అమ్మకం దారులు కూడా కొనుగోలుదారులకు చెందిన ఆ హక్కును గౌరవించాలి.

١٥٨٥ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ خَبَّبَ زَوْجَةَ امْرِئٍ، أَوْ مَمْلُوكَهُ، فَلَيْسَ مِنَّا» رواه أبو داود. «خبب» بخاءٍ معجمة، ثُمَّ باءٍ موحدة مكررة: أَيْ: أَفْسَدَهُ وَخَدَعَهُ.

1585. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒకరి భార్యను లేక బానిసను మోసగించేవాడు మాలోని వాడు కాడు. (అబూదావూద్)

(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఒకరి భార్యను లేక బానిసను తన భర్తకు లేదా యజమానికి వ్యతిరేకంగా పురికొల్పటం, వారి మధ్య అపార్థాలు సృష్టించి వారికి ఒండొకరి మీద ద్వేషం కలిగేలా చేయటం చాలా పెద్దపాపం. విశ్వాసి అనేవాడు ప్రజల మధ్య సత్సంబంధాలు ఏర్పరచాలిగాని ఉన్న సంబంధాల్ని చెడగొట్టరాదు.

**277వ అధ్యాయం**

## ٢٧٧ ـ بَابُ تَحرِيمِ الْغَدْرِ

## వాగ్దాన ద్రోహం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَوْفُواْ بِٱلْعُقُودِ﴾ [المائدة: ١]. وَقَالَ تَعَالَى: ﴿وَأَوْفُواْ بِٱلْعَهْدِ إِنَّ ٱلْعَهْدَ كَانَ مَسْـُٔولًا﴾ [الإسراء: ٣٤].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వాసులారా! కట్టుబాట్లను పూర్తిగా పాటించండి." *(మాయిద: 1)*

"చేసిన వాగ్దానాన్ని నెరవేర్చండి. నిస్సందేహంగా వాగ్దానం విషయంలో మీరు సమాధానం చెప్పవలసి ఉంటుంది." *(ఇస్రా:34)*

### ముఖ్యాంశాలు

వాగ్దానాలు రెండు రకాలు. ఒకరకం వాగ్దానం మానవులు పరస్పరం చేసుకునేది. రెండవది, మానవులు తాము అల్లాహ్ ఏకత్వాన్ని ఆయన ప్రభుత్వాన్ని అంగీకరించి, ఆయన ఆజ్ఞల్ని, ఆదేశాల్ని పాటిస్తామని ఆయనతో చేసిన వాగ్దానం. ఈ రెండు రకాల వాగ్దానాలను బాధ్యతతో నెరవేర్చటం చాలా అవసరం. లేదంటే రేపు ప్రళయ దినాన దాని గురించి నిలదీయటం జరుగుతుంది.

١٥٨٦ ـ وعَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرِو بْنِ العَاصِ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «أَرْبَعٌ مَنْ كُنَّ فيه، كَانَ مُنَافِقاً خَالِصاً، وَمَنْ كَانَتْ فيه خَصْلَةٌ مِنْهُنَّ، كَانَ فِيهِ خَصْلَةٌ مِنَ النِّفَاقِ حَتَّى يَدَعَهَا: إِذَا اؤْتُمِنَ خَانَ، وَإِذَا حَدَّثَ كَذَبَ، وَإِذَا عَاهَدَ غَدَرَ، وَإِذَا خَاصَمَ فَجَرَ» متفقٌ عليه.

1586. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నాలుగు లక్షణాలున్న వ్యక్తి పచ్చి కపటిగా పరిగణించ బడతాడు. ఒకవేళ వాటిలో ఏ ఒక్క లక్షణం అతనిలో ఉన్నా దాన్ని వదలిపెట్టనంత వరకూ అతనిలో ఒక కపట లక్షణం ఉన్నట్లుగా భావింపబడుతుంది. (ఆ నాలుగు లక్షణాలు ఇవి:) 1) అతనికి ఏదైనా అప్పగిస్తే అందులో అతను ద్రోహానికి పాల్పడతాడు. 2) మాట్లాడితే

అబద్ధం చెబుతాడు. 3) వాగ్దానం చేసి ఆ తర్వాత మోసం చేస్తాడు. 4) ఎవరితో నయినా పోట్లాడితే నోరు పారేసు కుంటాడు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ-సహీహ్ ముస్లిం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 1544వ హదీసు క్రింద కూడా వచ్చింది. ఇందులో కపట విశ్వాసుల లక్షణాలు వివరించబడ్డాయి. నిజమైన విశ్వాసులు తమలో ఈ లక్షణాలు లేకుండా పవిత్రంగా ఉండాలి. మంచి నడవడికకు విశ్వాసంతో అవినాభావ సంబంధముంటుంది. విశ్వాసమున్నచోట ఉత్తమ నడవడిక కూడా తొణికిసలాడుతూ ఉంటుంది. అలాగే విశ్వాసం లేనిచోట నడవడిక కూడా కానరాదు.

١٥٨٧ - وَعَنِ ابْنِ مَسْعُودٍ، وَابْنِ عُمَرَ، وأَنَسٍ رَضِيَ اللهُ عَنْهُمْ قَالُوا: قَالَ النَّبِيُّ ﷺ: «لِكُلِّ غادِرٍ لِوَاءٌ يوْمَ القِيَامَةِ، يُقَالُ: هذِهِ غَدْرَةُ فُلانٍ» متفقٌ عليه.

1587. హజ్రత్ ఇబ్నెమస్వూద్, ఇబ్నె ఉమర్, అనస్ (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రళయదినాన వాగ్దాన ద్రోహం చేసిన వారిలో ప్రతి ఒక్కరికీ ఒక జెండా ఉంటుంది. "ఇతను ఫలానా వ్యక్తికి వాగ్దాన ద్రోహం చేసినందుకు ఇది గుర్తు" అని ప్రకటించటం జరుగుతుంది. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

గదర్ అంటే వాగ్దాన భంగం చేయటం, వాగ్దానాన్ని లెక్కచేయకపోవటం అని అర్థం. ప్రళయదినాన ఇలాంటి వాగ్దాన ద్రోహులందరికి అందరిముందు జెండాలు ఇవ్వబడతాయి. అది వారి వాగ్దాన ద్రోహానికి ఒక చిహ్నంగా ఉంటుంది.

١٥٨٨ - وَعَنْ أَبِي سَعِيدٍ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «لِكُلِّ

1588. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:

غَادِرٍ لِوَاء عِنْدَ اسْتِهِ يَوْمَ الْقِيَامَةِ يُرْفَعُ لَهُ بِقَدْرِ غَدْرِهِ، أَلَا وَلَا غَادِرَ أَعْظَمُ غَدْراً مِنْ أَمِيرِ عَامَّةٍ» رواه مسلم.

ప్రళయదినాన ప్రతి వాగ్దాన ద్రోహి పిరుదుల దగ్గర ఒక జెండా ఉంటుంది. అతని ద్రోహ తీవ్రతను బట్టి అది పైకెత్తబడి ఉంటుంది. వినండి! జన సామాన్య నాయకునికి చేసిన వాగ్దానంలో ద్రోహానికి ఒడిగట్టినవాడి కన్నా పెద్ద వాగ్దానద్రోహి మరొకడు లేడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

జనసామాన్యానికి నాయకుడంటే సమకాలీన ప్రభుత్వాధిపతి (ఖలీఫా, రాజు, పాలకుడు) లేక అతని ప్రతినిధి అని అర్థం. అతని వాగ్దానాన్ని భంగపరచటమంటే అతనికి విధేయత చూపుతామని చేసిన వాగ్దానాన్ని, ప్రమాణాన్ని భంగపరచి అతనికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటం. ఇస్లాం ధర్మం ప్రభుత్వాధికారుల్ని విమర్శించమనీ, ఖుర్ఆన్ హదీసుల వెలుగులో వారిని సంస్కరించమని తాకీదు అయితే చేస్తుంది. దానికోసం అది 'మంచిని ఆజ్ఞాపించు చెడుని నివారించు' అనే ప్రతిపాదన కూడా చేస్తుంది. కాని వారి పాప వైఖరిని, దౌర్జన్యాన్ని ఆసరాగా చేసుకొని వారికి చేసిన విధేయతా వాగ్దానాన్ని భంగపరిచి వారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటానికి మాత్రం ఇస్లాం ధర్మం అనుమతించదు. ఎందుకంటే దానిమూలంగా దేశంలో అరాచకం, అశాంతి అలజడులు చెలరేగుతాయి. ఫలితంగా పరిస్థితులు చక్కబడక పోగా మరింత విషమిస్తాయి. ఖలీఫాలకు, సుల్తానులకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటుల చరిత్రను పరిశీలించినా మనకు దీని ప్రయోజన ప్రాముఖ్యతలు బోధపడతాయి. చరిత్రలో ఇప్పటివరకు ఎన్ని తిరుగుబాట్లు జరిగాయో అన్నిట్లోనూ ముస్లిం సమాజానికి లేక ఇస్లాం ధర్మానికి విపరీతమైన నష్టమే తప్ప ఏ ప్రయోజనమూ కలగలేదు.

నేటి ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు మొదలగువాటిని ప్రజాస్వామ్యంలో భాగంగా , పైగా ప్రజాస్వామ్య వ్యవస్థకు ప్రాణంగా భావిస్తారు. కాని నిజానికి ఆ విధానం ప్రజాస్వామ్య వ్యవస్థకు కూడా ప్రయోజనదాయకం కాదు. దానివల్ల పరిపాలకుల వైఖరి మారుతుందన్న ఆశ లేదు, దేశానికి, జాతికి కూడా దాని మూలంగా ఎలాంటి ప్రయోజనం ఉండదు. కాని విధ్వంసం మూలంగా ప్రజల ఆస్తులకు, జాతి సంపదకు నష్టం కలుగుతుంది. కొన్నికొన్ని సందర్భాల్లో ప్రాణనష్టం కూడా జరుగుతుంది. కనుక ఈ రాజకీయ నిరసన ప్రదర్శనలు కూడా షరీఅత్ దృష్టిలో కాస్త చర్చించదగినవే. పరిపాలకులకు వ్యతిరేకంగా

ఈ విధమైన చర్యలకు పాల్పడటాన్ని ఈ హదీసులో తీవ్రంగా గర్హించటం జరిగింది. కనుక అధికారంలో ఉన్న పాలకుల సంస్కరణ కోసం 'మంచిని ఆజ్ఞాపించి, చెడుని నివారించు' అన్న విధిని నిర్వర్తించటం కోసం మనం వేరొక సముచితమైన మార్గాన్ని అవలంబించాలి. అందులో విమర్శ స్వార్థ ప్రయోజనాల కోసం కాకుండా సరైన శ్రేయోభిలాషతో, జాతి, దేశ ప్రయోజనాల దృష్టితో జరగాలి. అంతేగాని ఈ ధర్నాలు, రాజకీయ సమ్మెలు, రాస్తారోకోలు షరీఅత్ దృష్టిలోనూ తప్పే. వీటిమూలంగా నష్టమే తప్ప లాభం ఉండదని అనుభవాలు హెచ్చరిస్తున్నాయి.

2) అరబ్బుల్లో వాగ్దాన ద్రోహానికి పాల్పడేవారిని అపఖ్యాతికి, అవమానానికి గురిచేసేందుకు బజార్లలో వారిపేరు మీద జెండాలు నాటే రివాజు ఉండేది. ప్రజలు ఆ పాపాన్ని, దానికి పడే శిక్షను అర్థం చేసుకోవటానికి దేవుడు కూడా వారి రివాజు ప్రకారమే వారికి పరలోకంలో విధించబడనున్న శిక్ష గురించి వివరించాడు.

١٥٨٩ - وعنْ أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عنِ النَّبِيِّ ﷺ قَالَ: «قَالَ اللهُ تَعالى: ثَلاثَةٌ أَنَا خَصْمُهُمْ يَوْمَ القِيَامَةِ: رَجُلٌ أَعْطَى بِي ثُمَّ غَدَر، وَرَجُلٌ بَاعَ حُرًّا فَأَكَلَ ثَمَنَهُ، وَرَجُلٌ اسْتَأْجَرَ أَجِيراً، فَاسْتَوفى مِنْهُ، وَلَمْ يُعْطِهِ أَجْرَهُ» رواه البخاري.

1589. దేవుడు ఈ విధంగా అన్నాడంటూ దైవప్రవక్త (సల్లం) ప్రవచించారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు: ఒకడు నా పేరు మీద వాగ్దానం చేసి మోసం చేసినవాడు. మరొకడు, స్వేచ్ఛాపరుణ్ణి అమ్మి ఆ డబ్బు తిన్నవాడు. ఇంకొకడు, ఒక మనిషిని కూలికి పెట్టుకొని అతనితో బాగా పని చేయించుకుని కూలి ఇవ్వకుండా ఎగవేసినవాడు. ఈ ముగ్గురితో ప్రళయదినాన నేను స్వయంగా గొడవ పడతాను. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని లావాదేవీల ప్రకరణం)*

## 278వ అధ్యాయం

# ٢٧٨ ـ بَابُ النَّهْيِ عَنِ الْمَنِّ بِالْعَطِيَّةِ وَنَحْوِهَا

## కానుకలు వగైరా ఇచ్చి తర్వాత దెప్పి పొడవరాదు

قَالَ اللهُ تَعَالى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تُبْطِلُوا۟ صَدَقَٰتِكُم بِٱلْمَنِّ وَٱلْأَذَىٰ ﴾ [البقرة: ٢٦٤]. وقَالَ تَعَالى: ﴿ ٱلَّذِينَ يُنفِقُونَ أَمْوَٰلَهُمْ فِى سَبِيلِ ٱللَّهِ ثُمَّ لَا يُتْبِعُونَ مَآ أَنفَقُوا۟ مَنًّا وَلَآ أَذًى ﴾ [البقرة: ٢٦٢].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వసించిన ఓ ప్రజలారా! మీరు దెప్పిపొడిచి, గ్రహీత మనసును గాయపరచి మీ దాన ధర్మాలను వృధా చేసుకోకండి." *(బఖర: 264)*

"అల్లాహ్ మార్గంలో తమ ధనాన్ని వ్యయం చేసి, ఆ తర్వాత తమ దాతృత్వాన్ని మాటిమాటికీ చాటుతూ, గ్రహీతల మనస్సును గాయపరచని వారి..," *(బఖర: 262)*

١٥٩٠ ـ وعن أبي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ عن النَّبِيِّ ﷺ قَالَ: «ثَلاثَةٌ لَا يُكَلِّمُهُمُ اللهُ يَوْمَ القِيَامَةِ، وَلَا يَنْظُرُ إِلَيْهِمْ، وَلَا يُزَكِّيهِمْ وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ» قَالَ: فَقَرَأَهَا رَسُولُ اللهِ ﷺ ثَلَاثَ مَرَّاتٍ. قَالَ أَبُو ذَرٍّ: خَابُوا وَخَسِرُوا مَنْ هُمْ يا رَسولَ اللهِ؟ قال: «المُسْبِلُ، وَالمَنَّانُ، وَالمُنَفِّقُ سِلْعَتَهُ بِالحَلِفِ الكَاذِبِ» رواه مسلم. وفي روايةٍ له: «المُسْبِلُ إزارَهُ» يَعْني: المُسْبِلَ إزَارَهُ وَثَوْبَهُ أَسْفَلَ مِنَ الكَعْبَيْنِ لِلْخُيَلاءِ.

1590. హజ్రత్ అబూజర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ప్రళయదినాన దేవుడు ముగ్గురు వ్యక్తుల్ని పలకరించడు. వారిని (కారుణ్య దృష్టితో) చూడడు. అఖరికి వారిని పరిశుద్ధుల్ని కూడా చేయడు. పైగా వారి కోసం బాధాకరమైన శిక్ష కాచుకొని ఉంటుంది.

దైవప్రవక్త (సల్లం) ఈ మాటలే మూడు సార్లు అన్నారు. అది విని అబూజర్ (రజి) "అలాంటివారు ఓటమిని చవి చూస్తారు. నాశనమయిపోతారు. దైవప్రవక్తా! అసలు ఎవరు వారు?" అని అడిగారు. అందుకాయన బదులిస్తూ, "అంగవస్త్రాన్ని గిలకల

కన్నా క్రిందికి వ్రేలాడదీసేవాడు, ఉప
కారం చేసి దెప్పిపొడిచేవాడు, అబద్ధపు
ఒట్లతో తన సరుకును అమ్ముకునే
వాడు" అని చెప్పారు. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "తన
లుంగీని క్రిందికి వ్రేలాడదీసేవాడు"
అని ఉంది. అంటే తన షరాయి,
పైజామా లాంటి బట్టల్ని గర్వం కొద్దీ
క్రిందికి వ్రేలాడదీసేవాడు అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) దీనిద్వారా తెలిసేదేమంటే షరాయి, పైజామా, ప్యాంటు, లుంగీ తదితర బట్టల్ని కాలి గిలకల కన్నా క్రిందికి వ్రేలాడదీయటం నిషిద్ధం. ఈ ఆదేశం కేవలం పురుషులకు మాత్రమే పరిమితం. ఇందుకు విరుద్ధంగా స్త్రీలు కాలి గిలకలు, పైగా పాదాల వరకూ వస్త్రాన్ని కప్పి ఉంచటం అవసరం. 2) అబద్ధపు ఒట్టు వేయటం ముమ్మాటికీ నిషిద్ధమే. కాని కొనుగోలుదారుణ్ణి మోసగించి తన సరుకు అమ్ముకునే దురుద్దేశ్యంతో అబద్ధపు ఒట్టు వేయటం ఇంకా పెద్ద నేరం. ఎందుకంటే ఇందులో రెండు నేరాలు కలిసి ఉన్నాయి. ఒకటి అబద్ధపు ఒట్టు. రెండోది మోసం.

**279వ అధ్యాయం**

## ٢٧٩ ـ بَابُ النَّهْيِ عَنِ الإِفْتِخَارِ وَالْبَغْيِ

## గర్వ ప్రదర్శన, దౌర్జన్యం చేయరాదు

قَالَ اللهُ تَعَالى: ﴿فَلَا تُزَكُّوٓا۟ أَنفُسَكُمْ هُوَ أَعْلَمُ بِمَنِ ٱتَّقَىٰٓ﴾ [النجم: ٣٢]. وقَالَ تَعَالى: ﴿إِنَّمَا ٱلسَّبِيلُ عَلَى ٱلَّذِينَ يَظْلِمُونَ ٱلنَّاسَ وَيَبْغُونَ فِى ٱلْأَرْضِ بِغَيْرِ ٱلْحَقِّ ۚ أُو۟لَٰٓئِكَ لَهُمْ عَذَابٌ أَلِيمٌ﴾ [الشورى: ٤٢].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"మీరు మీ పవిత్రతను గురించి గొప్పలు చెప్పుకోకండి." (నజ్మ్:23)

"అసలు నిందార్హులు ఇతరులకు అన్యాయం చేసేవారే. భూమిపై అన్యాయంగా దౌర్జన్యాలు చేసేవారే. వారి కోసం వ్యథాభరితమైన శిక్ష కాచుకొని ఉంటుంది." (షూరా:42)

١٥٩١ ـ وعَنْ عِيَاضِ بْنِ حِمَارٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ اللهَ تَعَالى أَوْحَى إِلَيَّ أَنْ تَوَاضَعُوا حَتَّى لَا يَبْغِيَ أَحَدٌ عَلَى أَحَدٍ، وَلَا يَفْخَرَ أَحَدٌ عَلَى أَحَدٍ» رواه مسلم.

قَالَ: أَهلُ اللُّغَةِ: البَغْيِ: التَّعَدي وَالاسْتِطَالَةُ.

1591. హజ్రత్ ఇయాజ్ బిన్ హిమార్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీరు అణకువతో ఉండాలని దేవుడు నాకు వహీ ద్వారా ఆదేశించాడు. ఆ విధంగా చివరకు మీలో ఎవరూ ఎవరి మీదా దౌర్జన్యం చేయరాదు. ఒకరి మీద బడాయి చెప్పుకోరాదు. (ముస్లిం)

'బగ్‌యున్' అంటే దౌర్జన్యం, చేయి చేసుకోవటం అని భాషావేత్తలు అభిప్రాయపడ్డారు. (అది ఈ హదీసులో వారించబడింది)

*(సహీహ్ ముస్లింలోని జన్నత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దేవుడు ఎవరికయినా సిరిసంపదలు, ఆస్తీఅంతస్తులు, అందచందాలు లేక విద్యావిశిష్ఠతలు ప్రసాదించాడంటే అది వారి మీద దైవానుగ్రహం, దైవోపకారం. అందుకు

వారు దైవాజ్ఞకు అనుగుణంగా అణకువ భావాన్ని, వినమ్రతా వైఖరిని అవలంబించి దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఆయన ప్రసాదించిన ఆ వరాలతో ఇతరులకు ప్రయోజనం చేకూర్చాలి. అంతేగాని గర్వాన్ని ప్రదర్శించి దేవునిపట్ల కృతఘ్నతకు, ప్రజలమీద దౌర్జన్యానికి పాల్పడకూడదు.

١٥٩٢ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إذا قَالَ الرَّجُلُ: هَلَكَ النَّاسُ، فَهُوَ أَهْلَكُهُمْ» رواه مُسلم. الـرِّوَايَةُ المَشْهُورَةُ: «أَهْلَكُهُمْ» بَرَفعِ الكَافِ، ورُوِيَ بِنَصْبِهَا. وَهٰذَا النَّهْيُ لِمَنْ قَالَ ذلكَ عُجْباً بِنَفْسِه، وَتَصَاغُراً لِلنَّاسِ، وَارْتِفاعاً عَلَيْهِمْ، فَهٰذَا هُوَ الحَرَامُ وَأَمَّا مَنْ قَالَهُ لِمَا يَرى فِي النَّاسِ مِنْ نَقْصٍ فِي أَمْرِ دِينِهِم، وَقَالَهُ تَحَزُّناً عَلَيْهِمْ، وَعَلَى الدِّين، فَلا بَأْسَ بِهِ هٰكَذا فَسَّرَهُ العُلَمَاءُ وَفصَّلوه، وَمِمَّنْ قَالَهُ مِنَ الأئِمَّةِ الأعْلاَمِ: مَالِكُ بنُ أَنَسٍ وَالخَطَّابِيُّ وَالحُمَيْدِيُّ وآخرون، وقد أَوْضَحْتُهُ فِي كِتَابِ «الأذْكَارِ».

1592. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఏ మనిషి అయినా 'ప్రజలు నాశనమయ్యారు' అని అంటే అతను వారిలో అందరి కన్నా ఎక్కువగా నాశనమయిన వాడన్నమాట. (ముస్లిం)

ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా అంటు న్నారు: "అహ్లకుహుమ్" అనేది సుప్రసిద్ధ ఉల్లేఖనం. అయితే ఈ పదం 'అహ్లకహుమ్ ' అని కూడా ఉల్లేఖిం చబడింది. (మొదటి అభిప్రాయమే సరైనది, సముచితమైనది). తనను తాను మంచివానిగా భావించుకుంటూ మిగతావారిని అల్పులుగా తలపోసి, వారికంటే తాను గొప్పవాణ్ణని భావించే వాడు 'ప్రజలు నాశనమయిపోయారు' అని అనకూడదు. అలా అనటం నిషిద్ధం. కాని ఒక మనిషి ప్రజల్లో ధార్మిక చింతన క్షీణించిందని తనకు అనిపించినప్పుడు వారి గురించి చింతిస్తూ ధార్మిక పౌరుషంతో ఆ మాటలు అంటే మాత్రం అందులో తప్పులేదు. పండితులు ఈ హదీసును ఇలాగే వ్యాఖ్యానించారు. ఈ విధంగా

వ్యాఖ్యానించినవారిలో ఇమామ్ మాలిక్ బిన్ అనస్, ఇమామ్ ఖత్తాబీ, ఇమామ్ హుమైదీ మరియు ఇంకా ఇతర సుప్రసిద్ధ పండితులున్నారు. దీని గురించి నేను 'కితాబుల్ అజ్కార్'లో వివరించి ఉన్నాను.

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్, సిలా ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో కూడా తమల్ని తాము మంచివారుగా, ఇతరుల్ని చెడ్డవారుగా భావించటాన్ని గర్హించటం జరిగింది.



## 280వ అధ్యాయం

## ٢٨٠ - بَابُ تَحْرِيمِ الْهِجْرَانِ بَيْنَ الْمُسْلِمِينَ فَوْقَ ثَلَاثَةِ أَيَّامٍ إِلَّا لِبِدْعَةٍ فِي الْمَهْجُورِ، أَوْ تَظَاهُرٍ بِفِسْقٍ، أَوْ نَحْوِ ذَٰلِكَ

## ముస్లింలు పరస్పరం మూడురోజులకు మించి మాట్లాడుకోకుండా ఉండటం నిషిద్ధం. అయితే ధర్మంలో కొత్తపోకడలు సృష్టించేవారితో లేక బహిరంగంగా పాపాలు చేసేవారితో తెగత్రెంపులు చేసుకోవచ్చు

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّمَا الْمُؤْمِنُونَ إِخْوَةٌ فَأَصْلِحُوا بَيْنَ أَخَوَيْكُمْ﴾ [الحجرات: ١٠].
وقَالَ تَعَالَى: ﴿وَلَا تَعَاوَنُوا عَلَى الْإِثْمِ وَالْعُدْوَانِ﴾ [المائدة: ٢].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"విశ్వాసులు పరస్పరం అన్నదమ్ములు, కనుక మీ సోదరుల మధ్య సంబంధాలను సంస్కరించండి." (హుజురాత్:10)

"పాపకార్యాలలో, అత్యాచారాలలో ఎవరితోనూ సహకరించకండి." (మాయిద: 2)

### ముఖ్యాంశాలు

1) గొడవ పడటం, సంబంధాలు త్రెంచుకొని ఉండటం సౌభ్రాతృత్వ విధానానికి విరుద్ధం. అందుకే పరస్పరం గొడవపడ్డ ముస్లింల మధ్య సంధి కుదుర్చమని ముస్లింలను ఆదేశించటం జరిగింది. అప్పుడే విశ్వాసుల సౌభ్రాతృత్వం భాసిల్లుతుంది.

2) షరీఅత్ పరమైన కారణమేదీ లేకుండా మాట్లాడుకోకుండా ఎడమొహం, పెడమొహంతో ఉండటం పాపం, అన్యాయం. కనుక దాన్ని ప్రోత్సహించటం కూడా పాపమే. ఇస్లాం దాన్ని కూడా నివారించింది. పైగా ఇలాంటి సందర్భాల్లో వారి మధ్య సంధి కుదర్చటం తప్పనిసరి అని అంటుంది.

١٥٩٣ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تَقَاطَعُوا، ولا تَدَابَرُوا، وَلَا تَبَاغَضُوا،

1593. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు పరస్పరం సంబంధాలు త్రెంచుకోకండి. ఎడమొహం, పెడమొహంతో ఉండకండి. పరస్పరం

وَلَا تَحَاسَدُوا، وَكُونُوا عِبَادَ اللهِ إِخْوَانًا. وَلَا يَحِلُّ لِمُسْلِمٍ أَنْ يَهْجُرَ أَخَاهُ فَوقَ ثَلاثٍ» متفقٌ عليه.

ద్వేషించుకోకండి. అసూయ చెంద కండి. దైవదాసులారా! పరస్పరం అన్న దమ్ములుగా ఉండండి. ఒక ముస్లిం తోటి (ముస్లిం) సోదరునితో మూడు రోజులకు మించి మాట్లాడకుండా ఉండరాదు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'హిజ్రాన్' అంటే సంబంధాలు త్రెంచుకొని పరస్పరం మాట్లాడుకోకుండా ఉండటం. పై హదీసులో పేర్కొనబడిన పనులన్నీ సౌభ్రాతృత్వానికి విరుద్ధమైనవి కనుక వాటిని వారించటం జరిగింది. దీనికి భిన్నంగా ఇస్లామీయ సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పమని ముస్లింలకు ఆదేశించబడింది.

١٥٩٤ - وَعَنْ أَبِي أَيُّوبَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَحِلُّ لِمُسْلِمٍ أَنْ يَهْجُرَ أَخَاهُ فَوْقَ ثَلَاثِ لَيَالٍ: يَلْتَقِيَانِ، فَيُعرِضُ هذا وَيُعرِضُ هٰذَا، وَخَيْرُهُمَا الَّذِي يَبْدَأُ بِالسَّلامِ» متفقٌ عليه.

1594. హజ్రత్ అబూ అయ్యూబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఒక ముస్లిం తోటి (ముస్లిం) సోదరునితో మూడు రాత్రులకు మించి సంబంధాలు త్రెంచుకొని ఉండటం, పరస్పరం ఎదురుపడినప్పుడు ఎడమొహం పెడమొహంతో ఉండటం ధర్మసమ్మతం కాదు. వారిద్దరిలో ముందుగా సలాం చేసేవాడే ఉత్తముడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాం ఒక సహజ ధర్మం. అందుకే సహజ విషయాల్లో, వ్యవహారాల్లో అందులో అనుకూలం మేరకు సౌకర్యం ఉంచబడింది. ఇద్దరు ముస్లింల మధ్య ఏ కారణంగానయినా గొడవ జరిగితే సహజంగానే వారి మనసుల్లో తమ ప్రత్యర్థి పట్ల సంకుచితత్వం, అక్కసు మాలిన్యం చేరుకుంటుంది. దాని మూలంగా వారు పరస్పరం కలుసుకొని మాట్లాడుకోలేరు.

ఇస్లామీయ షరీఅతు ఈ సహజమైన సంకుచితత్వాన్ని అంగీకరించి మూడురోజుల వరకు ప్రత్యర్థులు మాట్లాడుకోకుండా ఉండటానికి అనుమతినిచ్చింది. అయితే ఎక్కువ రోజుల వరకు సంబంధాలు త్రెంచుకొని ఉంటే అది తీవ్ర విద్వేషానికి, శత్రుత్వానికి దారితీస్తుంది. దానిమూలంగా సమాజంలో మరింత అల్లకల్లోలం వ్యాపిస్తుంది. బంధువుల మధ్య అంతరాల అగాధాలు పెరిగిపోతాయి. స్నేహ సంబంధాలు పాడయిపోతాయి.

2) ముందుగా సలాం చేయటంలోని ప్రాముఖ్యతను వివరించి సంబంధాలను పునరుద్ధరించుకోవటానికి ఒక సులభమైన మార్గాన్ని సూచించడం జరిగింది. ఎందుకంటే సలాం చేయటం మూలంగా ప్రేమ పెరుగుతుంది. సంభాషణ మొదలవుతుంది.

١٥٩٥ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «تُعْرَضُ الأَعْمَالُ فِي كُلِّ اثْنَيْنِ وَخَمِيسٍ، فَيَغْفِرُ اللهُ لِكُلِّ امْرِىءٍ لَا يُشْرِكُ بِاللهِ شَيْئاً، إلَّا امْرءاً كَانَتْ بَيْنَهُ وَبَيْنَ أَخِيهِ شَحْنَاءُ، فَيَقُولُ: اتْرُكُوا هٰذَيْنِ حَتَّى يَصْطَلِحَا» رواه مسلم.

1595. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రతి సోమ, గురువారాల్లో కర్మలు ప్రవేశపెట్ట బడతాయి. ఆ రోజు అల్లాహ్‌కు ఎవరినీ సహవర్తులుగా నిలబెట్టని ప్రతి ఒక్కణ్ణీ అల్లాహ్ క్షమిస్తాడు. కాని తనకూ తన తోటి (ముస్లిం) సోదరునికి మధ్య శత్రుత్వమున్న వాణ్ణి మాత్రం క్షమించడు. అతడి గురించి ఇలా అనటం జరుగుతుంది: 'వీరిద్దరూ సంధి కుదుర్చుకునే దాకా గడువు ఇవ్వండి.'

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్, సిలా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

షరీఅత్ పరమైన కారణంలేని పరస్పర శత్రుత్వం దేవుని క్షమాభిక్ష లభించకుండా చేస్తుంది.

١٥٩٦ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إنَّ الشَّيْطَانَ قَدْ أَيِسَ أَنْ يَعْبُدَهُ المُصَلُّونَ فِي

1596. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ జాబిర్ (రజి) తెలియజేశారు: అరబ్బు ద్వీపంలోని నమాజీలు ఇక తనను

جَزِيرَةِ العَرَبِ، وَلكِنْ فِي التَّحْرِيشِ بَيْنَهم» رواه مسلم. «التَّحْرِيشُ»: الإِفْسَادُ وَتغيير قُلُوبِهم وَتَقَاطُعُهُم.

ఆరాధించరని షైతాన్ నిరాశ చెందాడు. అయితే వారిమధ్య గొడవలు సృష్టించటంలో మాత్రం అతను (విజయం సాధిస్తాడు సుమా!) (ముస్లిం)

'తహ్రీష్' అంటే గొడవలు సృష్టించటం, మనసుల్ని మార్చటం, సంబంధాలను త్రెంచటం.

(సహీహ్ ముస్లింలోని సిఫతుల్ ఖియామతి వల్ జన్నతి వన్నార్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) ముహమ్మద్ (సల్లం) నిజంగా దైవప్రవక్త (సల్లం) అని చెప్పటానికి ఈ హదీసు ప్రబల నిదర్శనం. ముస్లింలు పరస్పరం గొడవ పడి సంబంధాలు త్రెంచుకుంటారనీ, ఇదంతా షైతాన్ యొక్క కుచేష్టల మూలంగా, వాడి దుష్టప్రేరేపణల మూలంగానే జరుగుతుందని ఆయనెప్పుడో చెప్పారు. ఆ భవిష్యవాణి నిజమని రుజువయింది.

2) పై హదీసులో నమాజీలంటే ముస్లింలని భావం.

١٥٩٧ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا يَحِلُّ لِمُسْلِمٍ أَنْ يَهْجُرَ أَخَاهُ فَوْقَ ثَلاثٍ، فَمَنْ هَجَرَ فَوْقَ ثَلاثٍ، فَمَاتَ دَخَلَ النَّارَ». رَوَاهُ أَبو دَاود بإِسْنَادٍ عَلى شَرْطِ البُخَارِيِّ ومُسلم.

1597. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఏ ముస్లిం కూడా తోటి (ముస్లిం) సోదరుని మీద కోపంతో మూడు రోజులకు మించి అతనితో మాట్లాడకుండా ఉండరాదు. మూడురోజులకు మించి మాట్లాడకుండా ఉన్న స్థితిలో చనిపోతే అతను నరకానికి వెళ్తాడు. (అబూదావూద్ దీనిని బుఖారీ షరతులను అనుసరించి ఉన్న 'సనదు' ఆధారంగా వెలికి తీశారు)

(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

తాను చేసిన పాపానికి శిక్షగా అతను నరకానికి వెళ్తాడు. ఆ శిక్షననుభవించిన తర్వాత

అతన్ని నరకం నుండి బయటికి తీసి స్వర్గానికి పంపటం జరుగుతుంది. ఎందుకంటే శాశ్వతంగా నరకంలో ఉండేది కేవలం దైవతిరస్కారులు మాత్రమే. కనుక ముస్లిం అయినవాడు ఏం చేసినా అతను శిక్షగా కూడా నరకానికి వెళ్ళడని భావించటం తప్పు.

١٥٩٨ ـ وَعَنْ أَبي خِرَاشٍ حَدْرَدِ بْنِ أَبي حَدْرَدٍ الأَسْلَمِي، وَيُقَالُ السُّلَمِي الصَّحابي رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ النَّبِيَّ ﷺ يَقُولُ: «مَنْ هَجَرَ أَخَاهُ سَنَةً فَهُوَ كَسَفْكِ دَمِهِ». رواه أبو داود بإسناد صحيح.

1598. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అబూ ఖిరాష్ హద్రద్ బిన్ అబూ హద్రద్ అస్లమీ- కొందరి అభిప్రాయం ప్రకారం సులమీ సహాబీ (రజి) ఇలా తెలియజేశారు: తన సోదరునితో ఒక సంవత్సరం పాటు తెగత్రెంపులు చేసుకొని ఉంటే తను అతన్ని ఖూనీ చేసినట్లే లెక్క. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సంబంధాల తెగత్రెంపుల మూలంగా ఎదుటి ముస్లిం తీవ్రమైన మనోవ్యధకు గురవుతాడు. ఆ విధంగా ఒక ముస్లింని తీవ్రమనోవ్యధకు గురిచేయటం కూడా ఖూనీ చేయటంతో సమానమని ఈ హదీసులో చెప్పబడింది.

١٥٩٩ ـ وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَحِلُّ لِمُؤْمِنٍ أَنْ يَهْجُرَ مُؤْمِناً فَوْقَ ثَلَاثٍ، فَإِنْ مَرَّتْ بِهِ ثَلاثٌ، فَلْيَلْقَهُ، فَلْيُسَلِّمْ عَلَيْهِ، فَإِنْ رَدَّ عَلَيْهِ السَّلَامَ فَقَدِ اشْتَرَكَا فِي

1599. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక విశ్వాసి తోటి విశ్వాసితో మూడురోజులకు మించి సంబంధం లేకుండా ఉండ రాదు. ఒకవేళ అదే స్థితిలో మూడు రోజులు గడిచిపోతే ఆ తర్వాత అతన్ని కలుసుకొని అతనికి సలాం చేయాలి. అతను గనక ఆ సలాంకు ప్రతి సలాం చేస్తే ఇద్దరికీ పుణ్యం లభిస్తుంది.

الأَجْرِ، وَإِنْ لَمْ يَرُدَّ عَلَيْهِ، فَقَدْ بَاءَ بِالإِثْمِ، وَخَرَجَ الْمُسَلِّمُ مِنَ الهِجْرَةِ» رواه أبو داودَ بإسناد حسن. قال أبو داود: إذا كَانَتِ الهِجْرَةُ للهِ تَعَالى، فَلَيْسَ مِنْ هٰذَا في شَيْءٍ.

ఒకవేళ అతను (తన క్రోధాన్ని అలాగే కొనసాగిస్తూ) ప్రతి సలాం చేయకపోతే అతను పాపాత్ముడౌతాడు. సలాం చేసినవాడు మాత్రం తెగత్రెంపుల పాపం నుండి బతికిపోతాడు. **అబూ** దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో వెలికితీసిన తర్వాత, 'దేవుని కోసం సంబంధాలను తెగత్రెంపులు చేసుకుంటే మాత్రం అందులో తప్పులేదు' అని అన్నారు.

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) సంబంధాల తెగత్రెంపులనేవి కేవలం అల్లాహ్ కోసం మాత్రమే జరగాలి. ఉదాహరణకు ఒకతను ధర్మంలో కొత్తపోకడలు (బిద్అత్‌లు) సృష్టిస్తున్నాడు లేక బహిరంగంగా పాపాలకు పాల్పడుతున్నాడు. ఎంతచెప్పినా తన బిద్అత్‌లను, పాపవైఖరిని విడనాడటం లేదనుకోండి అలాంటి వ్యక్తితో కేవలం అల్లాహ్ కోసం మాట్లాడకుండా ఉండటం, అతనితో తెగత్రెంపులు చేసుకోవటం ధర్మసమ్మతమే. పైగా అభిలషణీయం కూడాను. ఎందుకంటే దానిద్వారా అతను గుణపాఠం నేర్చుకొని తన తప్పుల్ని సరిదిద్దుకోవచ్చు. అంతేగాని ప్రాపంచికపు పొరపొచ్చాల మూలంగా మూడు రోజులకు మించి సంబంధం లేకుండా ఉండటం ధర్మసమ్మతం కాదు.

2) మూడు రోజుల తర్వాత ముందుగా ప్రత్యర్థికి సలాం చెప్పినవాడు ఉత్తముడు. ఒకవేళ ఆ రెండో వ్యక్తి సలాంకు జవాబు చెప్పకుండా హృదయంలో ఉన్న శత్రుత్వాన్ని ఇంకా పెంచుకున్నాడనుకోండి, అప్పుడతను పాపాత్ముడౌతాడు. సలాం చేసిన వ్యక్తి మాత్రం ఆ పాపం నుండి బతికిపోతాడు.



**281 వ అధ్యాయం**

## ٢٨١ - بَابُ النَّهْيِ عَنْ تَنَاجِي اثْنَيْنِ دُونَ الثَّالِثِ بِغَيْرِ إِذْنِهِ إِلاَّ لِحَاجَةٍ، وَهُوَ أَنْ يَتَحَدَّثَا سِرًّا بِحَيْثُ لاَ يَسْمَعُهُمَا، وَفِي مَعْنَاهُ مَا إِذَا تَحَدَّثَ اثْنَانِ بِلِسَانٍ لاَ يَفْهَمُهُ

## మూడో వ్యక్తి అనుమతి లేకుండా ఇద్దరు వ్యక్తులు రహస్య విషయాలు మాట్లాడుకోరాదు. అయితే అవసర పరిస్థితుల్లో మాత్రం ఈ విధంగా మూడోవ్యక్తికి వినపడకుండా రహస్యాలు చెప్పుకోవచ్చు. ఇద్దరు వ్యక్తులు మూడోవ్యక్తికి అర్థంకాని భాషలో మాట్లాడుకోవటం కూడా ఈ భావంలోకి వస్తుంది

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّمَا النَّجْوَىٰ مِنَ الشَّيْطَانِ﴾ [المجادلة: ١٠].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "రహస్యమంతనాలు జరపటం షైతాన్ చేష్ట." *(ముజాదలహ్ : 10)*

### ముఖ్యాంశాలు

కొంతమంది కలిసి ఉన్నప్పుడుగాని ప్రయాణంలో ఉన్నప్పుడుగాని ఇతరులందరినీ వదలిపెట్టి కేవలం ఇద్దరే ఇద్దరు ఒక ప్రక్కకు వెళ్ళి గుసగుసలాడుకోవటం, రహస్యాలు చెప్పుకోవటాన్ని అరబీలో 'నజ్వా' అని అంటారు. ఇలా చేయరాదు. దీనివల్ల ఇతరుల మనసుకు బాధ కలగవచ్చు. వారిలో దురనుమానాలు రేకెత్తవచ్చు.

١٦٠٠ - وَعَن ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إذا كَانُوا ثَلاَثَةً، فَلاَ يَتَنَاجَى اثْنَانِ دُونَ الثَّالِثِ» متفقٌ عليه.

1600. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ముగ్గురు ఒకచోట ఉన్నప్పుడు మూడోవ్యక్తిని వదలిపెట్టి మిగతా ఇద్దరూ రహస్యాలు మాట్లాడుకోరాదు. *(బుఖారీ-ముస్లిం)*

ఈ హదీసుని అబూదావూద్ కూడా పేర్కొన్నారు. అందులో అబూ సాలిహ్ (ఉల్లేఖకుడు) అదనంగా ఇలా అన్న

ورواه أبو داود وزاد: قال أبو صالح: قلت لابن عمر: فأربعة؟ قال: لا يضرك. ورواه مالك في «الموطأ»: عَنْ عَبْدِ اللهِ بْنِ دِينَارٍ قَالَ: كُنْتُ أَنَا وَابْنُ عُمَرَ عِنْدَ دَارِ خَالِدِ بْنِ عُقْبَةَ الَّتِي فِي السُّوقِ، فَجَاءَ رَجُلٌ يُرِيدُ أَنْ يُنَاجِيَهُ، وَلَيْسَ مَعَ ابْنِ عُمَرَ أَحَدٌ غَيْرِي، فَدَعَا ابْنُ عُمَرَ رَجُلاً آخَرَ حَتَّى كُنَّا أَرْبَعَةً، فَقَالَ لِي وَلِلرَّجُلِ الثَّالِثِ الَّذِي دَعَا: اسْتَأْخِرَا شَيْئاً، فَإِنِّي سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «لَا يَتَنَاجَى اثْنَانِ دُونَ وَاحِدٍ».

ట్లుంది: నేను ఇబ్నె ఉమర్ (రజి)గారిని "మరి నలుగురు ఉంటేనో?" అని అడిగాను. అందుకాయన "అలా గయితే ఫర్వాలేదు" అని అన్నారు.

మాలిక్ దీనిని అబ్దుల్లాహ్ బిన్ దీనార్ నుండి గ్రహించి తన గ్రంథం 'ముఅత్తా'లో పేర్కొన్నారు. అందులో అబ్దుల్లాహ్ బిన్ దీనార్ ఇలా అంటు న్నారు: ఇబ్నె ఉమర్, నేను ఇద్దరం ఖాలిద్ బిన్ ఉఖ్బా ఇంటి దగ్గర ఉన్నాం. ఆయనిల్లు బజార్లో ఉంది. అంతలో ఒకతను వచ్చాడు. అతను ఇబ్నె ఉమర్తో ఏదో రహస్య విషయం మాట్లాడాలనుకుంటున్నాడు. ఇబ్నె ఉమర్ వెంట నేను తప్ప మరెవరూ లేరు. అప్పుడు ఇబ్నె ఉమర్ ఇంకో వ్యక్తిని పిలిచారు. అతనితో కలిపి మేం నలుగురం అయ్యాం. ఆ తర్వాత ఆయన నన్నూ, ఆ పిలవబడిన వ్యక్తినీ కాస్త వెనక్కి వెళ్ళమని చెప్పూ, "(ఏమీ అనుకోకండి) ఒకణ్ణి ఒంటరిగా వదిలేసి మిగతా ఇద్దరు రహస్యాలు మాట్లాడు కోరాదని దైవప్రవక్త (సల్లం) చెబు తుండగా నేను విన్నాను. (అందుకే ఇలా చేయవలసి వచ్చింది)" అని అన్నారు.

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కొన్ని సభా మర్యాదలు వివరించబడ్డాయి. ఇబ్నె ఉమర్ (రజి) తనతో

ఒంటరిగా మాట్లాడదలచుకున్న వ్యక్తి మాటలు వినటం కోసం తమ దగ్గరకు నాల్గో వ్యక్తిని పిలిచారు. ఆ తర్వాత తమ రహస్య విషయం ఆ మిగతా ఇద్దరికి వినపడకుండా ఉండటం కోసం వారిని కాస్త వెనక్కి వెళ్ళమన్నారు. దీనిద్వారా తెలిసేదేమంటే ఒకరికంటే ఎక్కువమంది సమక్షంలో ఇద్దరు వ్యక్తులు వేరుగా రహస్య విషయాలు మాట్లాడుకోవచ్చు. అయితే నలుగురు ఒకచోట ఉన్నప్పుడు ఒకడ్ని ఒంటరిగా వదిలేసి మిగతా ముగ్గురు రహస్యాలు మాట్లాడుకోవటం కూడా తగదు. ఇంకో విషయమేమిటంటే ధర్మ సమ్మతమైన విషయాలే రహస్యంగా మాట్లాడుకోవచ్చుగాని అధర్మ విషయాలు మాట్లాడుకోరాదు. ఆ సమయంలో మూడో వ్యక్తి ఉన్నా లేకపోయినా సరే. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది: "ఓ విశ్వాసులారా! మీరు గనక పరస్పరం రహస్య విషయాలు మాట్లాడుకుంటే, పాపమూ, దౌర్జన్యమూ దైవప్రవక్త (సల్లం) పట్ల అవిధేయతలకూ సంబంధించిన విషయాలు కాకుండా సత్యానికీ, దైవభీతికీ సంబంధించిన విషయాలు మాట్లాడుకోండి." (అల్ ముజాదలహ్)

١٦٠١ - وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إذا كُنْتُم ثَلَاثَةً، فَلَا يَتَنَاجَى اثْنَانِ دُونَ الآخَرِ حَتَّى تَخْتَلِطُوا بِالنَّاسِ؛ مِنْ أَجْلِ أَنَّ ذٰلِكَ يُحْزِنُهُ» متفقٌ عليه.

1601. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు ముగ్గురున్నప్పుడు మూడోవాడ్ని వదలిపెట్టి మిగతా ఇద్దరు రహస్య విషయాలు మాట్లాడుకోకండి. ఈ వైఖరివల్ల ఆ మూడో వ్యక్తికి బాధ కలగవచ్చు. అయితే మీరు మరికొందరితో కలిసిపోతే అప్పుడు ఫర్వాలేదు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఆ విధంగా రహస్య మంతనాలు జరుపుకోరాదని చెప్పటానికి కారణమేమిటో ఈ హదీసులో వివరించబడింది. ఆ వైఖరి వల్ల మూడోవ్యక్తికి బాధ కలుగుతుంది. ఒక విశ్వాసిని బాధపెట్టటం చాలా పెద్దపాపం. ఆ విధంగా చూస్తే ఇలాంటి రహస్య మంతనాలు దాదాపు నిషిద్ధ విషయాల క్రిందికి వస్తాయి. ఒకవేళ ఆ ముగ్గురు గనక మరికొందరితో కలిసిపోతే అప్పుడు ఆ ఇద్దరు తమకు ఇష్టమొచ్చినట్టు మాట్లాడుకోవచ్చు.

## 282 వ అధ్యాయం

## ٢٨٢ - بَابُ النَّهْيِ عَنْ تَعْذِيبِ الْعَبْدِ وَالدَّابَّةِ وَالْمَرْأَةِ وَالْوَلَدِ لِغَيْرِ سَبَبٍ شَرْعِيٍّ أَوْ زَائِدٍ عَلَى قَدْرِ الأَدَبِ

## షరీఅత్ పరమైన కారణం లేకుండా లేక సంస్కారం నేర్పటానికి మించి బానిసను, పశువును, భార్యను, పిల్లల్ని శిక్షించరాదు

قَالَ اللهُ تَعَالَى: ﴿وَبِٱلْوَٰلِدَيْنِ إِحْسَٰنًا وَبِذِى ٱلْقُرْبَىٰ وَٱلْيَتَٰمَىٰ وَٱلْمَسَٰكِينِ وَٱلْجَارِ ذِى ٱلْقُرْبَىٰ وَٱلْجَارِ ٱلْجُنُبِ وَٱلصَّاحِبِ بِٱلْجَنۢبِ وَٱبْنِ ٱلسَّبِيلِ وَمَا مَلَكَتْ أَيْمَٰنُكُمْ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ مَن كَانَ مُخْتَالًا فَخُورًا﴾ [النساء: ٣٦].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

“తల్లిదండ్రుల యెడల సద్భావంతో మెలగండి. బంధువులూ, అనాథలూ, నిరుపేదల పట్ల మంచిగా వ్యవహరించండి. పొరుగున ఉన్న బంధువులు, అపరిచితులయిన పొరుగువారు, ప్రక్కనున్న మిత్రులు, బాటసారులు, మీ ఆధీనంలో ఉన్న దాసదాసీజనం పట్ల ఉదార బుద్ధితో వ్యవహరించండి. గర్వాతిశయంతో కన్నూమిన్నూ కానని వారు, తమ గొప్పదనం గురించి విర్రవీగేవారు అంటే అల్లాహ్ ఇష్ట పడడు అని గట్టిగా నమ్మండి.” *(నిసా : 36)*

### ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన వారందరిపట్ల ఉత్తమంగా వ్యవహరించాలని ఈ ఆయతులో ఆదేశించటం జరిగింది. అంటే వారి పట్ల ఉత్తమ వ్యవహారానికి విరుద్ధమైన ధోరణి కనబరచ రాదన్నమాట. ఒకవేళ తమ ఆధీనంలోవున్న వారిని శిక్షించవలసి వస్తే లేక సంస్కారం నేర్పటం కోసం వారిని కొట్టవలసి వస్తే అవసరానికి మించి కొట్టకూడదు. ఎందుకంటే అది కూడా ఉత్తమ వ్యవహారానికి విరుద్ధమే.

١٦٠٢ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «عُذِّبَتِ امْرَأَةٌ فِي هِرَّةٍ سَجَنَتْهَا حَتَّى مَاتَتْ، فَدَخَلَتْ فِيهَا النَّارَ، لَا هِيَ أَطْعَمَتْهَا

1602. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక స్త్రీ ఓ పిల్లి మూలంగా శిక్షకు గురైంది. ఆమె ఆ పిల్లిని చనిపోయేవరకూ కట్టిపడేసింది.

وَسَقَتْهَا، إِذْ حَبَسَتْهَا، وَلَا هِيَ تَرَكَتْهَا تَأْكُلُ مِنْ خَشَاشِ الأَرْضِ» متفقٌ عليه. «خَشَاشُ الأَرْضِ» بفتحِ الخاءِ المعجمةِ، وبالشين المعجمة المكررة: وهي هَوَامُّهَا وَحَشَرَاتُهَا.

దానిమూలంగానే ఆమె నరకానికి వెళ్ళింది. ఆమె ఆ పిల్లిని కట్టిపడేసి దానికి అన్నపానీయాలు పెట్టలేదు. నేలమీది క్రిమికీటకాలు తినేందుకు కూడా దాన్ని స్వేచ్ఛగా వదిలేయలేదు. (బుఖారీ-ముస్లిం)

'ఖషాషుల్ అర్జ్' అంటే హాని కలిగించే పురుగులు, కీటకాలు అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని అంబియా ప్రకరణం చివర్లో - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1) జంతువుల పట్ల కూడా మృదువుగా, ఉత్తమంగా వ్యవహరించటం అవసరమనీ, వాటి పట్ల కఠినంగా వ్యవహరించటం నిషిద్ధమని ఈ హదీసు నొక్కి చెబుతోంది.

2) పశుపక్ష్యాదుల్ని పంజరాల్లో, బోనుల్లో బంధించి ఉంచటం ధర్మసమ్మతమేగాని వాటి ఆహారపానీయాలను, ఇతర అవసరాలను తప్పకుండా పట్టించుకోవాలి.

١٦٠٣ ـ وَعَنْهُ أَنَّهُ مَرَّ بِفِتْيَانٍ مِنْ قُرَيْشٍ قَدْ نَصَبُوا طَيْراً وَهُمْ يَرْمُونَهُ، وَقَدْ جَعَلُوا لِصَاحِبِ الطَّيْرِ كُلَّ خَاطِئَةٍ مِنْ نَبْلِهِمْ، فَلَمَّا رَأَوُا ابْنَ عُمَرَ تَفَرَّقُوا، فَقَالَ ابْنُ عُمَرَ: مَنْ فَعَلَ هذا؟ لَعَنَ اللهُ مَنْ فَعَلَ هٰذَا، إِنَّ رَسُولَ اللهِ ﷺ لَعَنَ مَنِ اتَّخَذَ شَيْئاً

1603. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి)గారే చేసిన వేరొక కథనం ప్రకారం ఒకసారి ఆయన తాను వెళ్ళేదారిలో కొంత మంది ఖురైష్ యువకులు ఒక పక్షిని గురిపెట్టి దానిపైకి బాణాలు వదులుతున్నారు. గురితప్పిన బాణాల్ని తను తీసుకోవచ్చని వారు ఆ పక్షి యజమానితో ఒప్పందం చేసుకున్నారు. అయితే ఇబ్నె ఉమర్ (రజి)ని చూడగానే వారు (దాన్ని అక్కడే వదలిపెట్టి) అటూఇటూ పరుగెత్తారు. అప్పుడు ఇబ్నె ఉమర్ ఆ పక్షిని చూసి "ఎవరు ఈ పని చేసింది?" అని అడిగారు. ఆ తర్వాత ఇలా

فِيهِ الرُّوحُ غَرَضاً. متفقٌ عليه.
«الْغَرَضُ»: بفتح الغين المعجمة، والراءِ وَهُوَ الهَدَفُ، وَالشَّيْءُ الَّذي يُرْمَى إلَيْهِ.

అన్నారు: "ఇలా చేసినవాణ్ణి దేవుడు శపించుగాక! జీవమున్న వాటిని గురి పెట్టేవాణ్ణి దైవప్రవక్త (సల్లం) శపించారు". (బుఖారీ-ముస్లిం)

'గర్జ్' అంటే "బాణం వదలిపెట్టటానికి చేసుకునే గురి" అని అర్థం.

(సహీహ్ బుఖారీలోని జబాయెహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జంతువేట ప్రకరణం)

## ముఖ్యాంశాలు

గురి నేర్చుకోవటం కోసం జీవాలను కట్టివేసి వాటిమీద బాణాలు ప్రయోగించటం మహాపాపం. అలా చేసేవారు శాపానికి గురౌతారు.

١٦٠٤ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ أَنْ تُصْبَرَ الْبَهَائِمُ. متفقٌ عليه. ومَعْنَاه: تُحْبَسَ للقَتْلِ.

1604. హజ్రత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) జంతువుల్ని కట్టి వేయటాన్ని వారించారు. (బుఖారీ-ముస్లిం)

అంటే చంపటానికి కట్టివేయటమని అర్థం.

(సహీహ్ బుఖారీలోని జబాయెహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జంతువేట ప్రకరణం)

## ముఖ్యాంశాలు

కట్టి లేక బంధించి చంపటమంటే జంతువుని ఒకచోట కదలకుండా కట్టివేసి అది చనిపోయేవరకూ దానిమీద బాణాలు, తూటాలు గురిపెట్టి వదలటమని భావం. ఇలా చేయటం మహాపాపం. జంతువుని చంపే సరైన పద్ధతి ఏమిటంటే దాన్ని అదుపులోకి తీసుకొని ఓ పదునైన కత్తితో తొందరగా దాని గొంతు కోసేయాలి. దానివల్ల దానికి ఎక్కువ బాధ కలగకుండా ఉంటుంది.

١٦٠٥ - وَعَنْ أَبِي عَلِيٍّ سُوَيْدِ بْنِ مُقَرِّنٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: لَقَدْ رَأَيْتُنِي سَابِعَ سَبْعَةٍ مِنْ بَنِي مُقَرِّنٍ مَا لَنَا خَادِمٌ إِلَّا وَاحِدَةٌ

1605. హజ్రత్ అబూ అలీ సువైద్ బిన్ ముఖర్రిన్ (రజి) కథనం: నాకు బాగా గుర్తుంది. నేను ముఖర్రిన్ గారి ఏడుగురు కుమారుల్లో ఏడోవాణ్ణి. మాకు ఒక బానిసరాలు తప్ప ఇతర

لَطَمَهَا أَصْغَرُنَا فَأَمَرَنَا رَسُولُ اللهِ ﷺ أَنْ نُعْتِقَهَا. رواه مسلم. وفي رِوَايةٍ: «سَابِعَ إِخوةٍ لي».

సేవకులు ఎవరూ ఉండేవారు కాదు. ఒకసారి మాలో అందరికన్నా చిన్న తమ్ముడు ఆమెను కొట్టాడు. అది తెలిసి దైవప్రవక్త (సల్లం) ఆమెను విడుదల చేయమని మమ్మల్ని ఆజ్ఞాపించారు. (ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో "నేను మా అన్నదమ్ముల్లో ఏడో వాణ్ణి" అని ఉంది.

(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

తమ అధీనంలో ఉండే బానిసల్ని, నౌకర్లను నిష్కారణంగా కొట్టడం, వారి మీద దౌర్జన్యం చేయటం పెద్దనేరం. ఒకవేళ ఆ నేరానికి పాల్పడినట్లయితే దానికి పరిహారంగా వారిని విడుదల అయినా చేయాలి లేదా మరే విధంగానయినా వారిని తమ పట్ల ప్రసన్నుల్ని చేసుకోవాలి. లేకపోతే ఆ విధంగా దౌర్జన్యం చేసేవాడు దేవుని దృష్టిలో నేరస్థుడిగా పరిగణించబడతాడు. పోతే హదీసులో పేర్కొనబడిన ఆ ఏడుగురు అన్నదమ్ములూ దైవప్రవక్త సహచరులు. మదీనాకు వలసవచ్చినవారు (ముహాజిర్లు).

١٦٠٦ ـ وَعَنْ أَبِي مَسْعُودٍ البَدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كُنْتُ أَضْرِبُ غُلاماً لي بالسَّوْطِ، فَسَمِعْتُ صَوْتاً مِنْ خَلفِي: «اعْلَمْ أَبَا مَسْعُودٍ» فَلَمْ أَفْهَمِ الصَّوْتَ مِنَ الغَضَبِ، فلَمَّا دَنَا مِنِّي إذا هُوَ رَسُولُ اللهِ ﷺ فَإِذَا هُوَ يَقُولُ: «اعلَمْ أَبَا مَسْعُودٍ أَنَّ الله أَقْدَرُ عَلَيْكَ مِنْكَ عَلى هَذَا الغُلامِ» فَقُلْتُ: لا أَضْرِبُ مَملوكاً بَعْدَهُ أَبداً. وفي روايةٍ: فَسَقَطَ السَّوْطُ مِنْ يَدِي

1606. హజ్రత్ అబూ మస్‌వూద్ బద్రీ (రజి) కథనం: నేను నా బానిసను కొరడాతో కొడుతున్నప్పుడు వెనుక నుంచి, "విను! అబూ మస్‌వూద్!" అన్న గొంతు వినిపించింది. కాని నేను ఆవేశంలో ఆ గొంతుని అర్థం చేసుకోలేకపోయాను. ఆ వ్యక్తి దగ్గరికి వచ్చిన తరువాత తెలిసింది- ఆయన దైవప్రవక్త (సల్లం) అని. ఆయన నన్ను (మందలిస్తూ), "అబూ మస్‌వూద్! నీకు ఈ బానిస మీదున్న అధికారం కన్నా దేవునికి నీమీదున్న అధికారం గొప్పది జాగ్రత్త!" అని అంటున్నారు. తక్షణమే

مِنْ هَيْبَتِهِ. وَفِي رِوَايَةٍ: فَقُلْتُ: يَا رَسُول اللهِ! هُوَ حُرٌّ لِوَجْهِ اللهِ تعالى، فَقَالَ: «أَمَا لَوْ لَمْ تَفْعَلْ، لَلَفَحَتْكَ النَّارُ، أَوْ لَمَسَّتْكَ النَّارُ» رواه مسلم بهذهِ الرِّوَايَاتِ.

నేను "ఇక నుంచి నేను ఏ బానిసనూ కొట్టను" అని ప్రతిజ్ఞ చేసుకున్నాను.

వేరొక ఉల్లేఖనంలో "దైవప్రవక్తను చూడగానే భయంతో నాచేతిలోని కొరడా జారి క్రిందపడింది" అని ఉంది.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: వెంటనే నేను "దైవప్రవక్తా! అల్లాహ్ ప్రసన్నత కోసం నేనీ బానిసకు స్వేచ్ఛనిస్తున్నాను" అని అన్నాను. అది విని ఆయన "నువ్వొకవేళ అతనికి స్వేచ్ఛ ఇవ్వకపోతే నరకాగ్ని నిన్ను తప్పకుండా చుట్టుకుంటుంది (లేక) అంటుకుంటుంది" అని హెచ్చరించారు. ఈ ఉల్లేఖనాలన్నీ ముస్లిం పేర్కొన్నవి.

*(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) తమ ఆధీనంలో ఉండే బానిసల్ని, నౌకర్లను నిష్కారణంగా దండించటం లేక తప్పుకు మించి శిక్షించటం చేయరాదని ఈ హదీసులో హెచ్చరించటం జరిగింది.

2) దైవం తరపు నుంచి దైవప్రవక్త (సల్లం)కు ప్రసాదించబడిన గాంభీర్యం గురించి కూడా ఈ హదీసులో కాస్త వివరించటం జరిగింది.

١٦٠٧ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «مَنْ ضَرَبَ غُلاماً له حَدًّا لَمْ يَأْتِهِ، أَو لَطَمَهُ، فَإِنَّ كَفَّارَتَهُ أن يُعْتِقَهُ» رواه مسلم.

1607. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరైనా తన బానిసను అతను చేయని నేరానికి శిక్షిస్తే లేక చెంపదెబ్బ కొడితే అతనికి స్వేచ్ఛ ఇచ్చేయటమే దానికి పరిహారం. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఖాజీ అయాజ్ ఇలా అంటున్నారు: అలాంటప్పుడు బానిసను విడుదల చేయటం వాజిబ్ (తప్పనిసరి) కాదనీ, కేవలం అభిలషణీయం మాత్రమేనన్న విషయంపై పండితుల మధ్య ఏకాభిప్రాయం ఉంది. అయితే ఆ విధంగా విడుదల చేయటం వల్ల లభించే పుణ్యం సాధారణ విడుదలకు లభించే పుణ్యానికి సమానం కాదుగాని అది యజమాని దౌర్జన్యానికి మాత్రం తప్పకుండా పరిహారం అవుతుంది.

١٦٠٨ - وعَنْ هِشَامِ بْنِ حَكِيمِ بْنِ حِزَامٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّهُ مَرَّ بِالشَّامِ عَلَى أُنَاسٍ مِنَ الأَنْبَاطِ، وَقَدْ أُقِيمُوا فِي الشَّمْسِ، وَصُبَّ على رُؤُوسِهِمُ الزَّيْتُ! فَقَالَ: مَا هٰذَا؟ قِيلَ: يُعَذَّبُونَ فِي الخَرَاجِ، وَفِي رِوَايَةٍ: حُبِسُوا فِي الجِزْيَةِ. فَقَالَ هِشَامٌ: أَشْهَدُ لَسَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِنَّ اللهَ يُعَذِّبُ الَّذِينَ يُعَذِّبُونَ النَّاسَ فِي الدُّنْيَا» فَدَخَلَ عَلَى الأَمِيرِ، فَحَدَّثَهُ، فَأَمَرَ بِهِم فَخُلُّوا. رواه مسلم. «الأَنْبَاطُ» الفَلَّاحُونَ مِنَ العَجَمِ.

1608. హజ్రత్ హిషామ్ బిన్ హకీమ్ బిన్ హిజామ్ (రజి) కథనం ప్రకారం ఒకసారి ఆయన సిరియా గుండా వెళు తుంటే ఒకచోట ఆయనకు కొందరు అరబ్బేతర రైతులు కనిపించారు. వారిని ఎండలో నిలబెట్టి వారి తలల మీద జైతూన్ నూనె పోయడం జరిగింది. అదిచూసి ఆయన “ఇక్కడ ఏం జరుగుతుంది?” అని అడిగారు. “వీరిని పన్ను చెల్లించ నందుకు శిక్షిం చటం జరుగుతోంది.” వేరొక ఉల్లే ఖనం ప్రకారం, “జిజ్యా చెల్లించనం దుకు వీరిని బంధించటం జరిగింది” అని ఎవరో ఆయనకు చెప్పారు. అది విని ఆయన, “ప్రపంచంలో మను షుల్ని శిక్షించే వారిని దేవుడు శిక్షిస్తాడని దైవప్రవక్త (సల్లం) చెబుతుండగా నేను విన్నాను. దీనికి నేను సాక్ష్యం చెబు తాను” అని అన్నారు. తర్వాత ఆయన వారి గవర్నరు దగ్గరికి వెళ్ళి అతనికి ఈ హదీసు తెలియజేశారు. ఫలితంగా గవర్నరు ఆదేశం మేరకు వారిని వదిలేయటం జరిగింది. (ముస్లిం)

'అన్‌బాత్' అంటే అరబ్బేతర రైతులు
అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఇస్లామీయ రాజ్యపరిధుల్లో ఉండే ముస్లిమేతరుల ఆధీన భూముల నుండి వచ్చే ఆదాయంలో నుండి వసూలు చేసే పన్నును 'ఖిరాజ్' అని అంటారు. ముస్లింల భూముల ఆదాయం నుండి వసూలు చేసే పన్నును 'ఉష్ర్' అని అంటారు.

అదే విధంగా ఇస్లామీయ రాజ్యంలో ఉండే జిమ్మీల (శరణార్థుల) ధన మానప్రాణాలను రక్షించినందుకుగాను వారినుండి వసూలు చేసే వార్షిక రుసుమును 'జిజ్‌యా' అని అంటారు. ముస్లింలు ప్రతి సంవత్సరం ఇస్లామీయ రాజ్యానికి జకాత్ చెల్లిస్తారు. అలాగే ముస్లిమేతరులు జిజ్‌యా చెల్లిస్తారు.

2) ఇక్కడ 'శిక్ష' అంటే దేవుడు నరకంలో నరకవాసులకు విధించే ఒక ప్రత్యేక రకమైన శిక్ష అన్నమాట. ప్రపంచంలో ఎవరైనా అలాంటి శిక్ష విధించటాన్ని దేవుడు ఇష్టపడడు. ఆ శిక్ష విధించేవారిని ప్రళయదినాన తాను ఆ శిక్షకు గురిచేస్తాడు. మండుటెండలో నిలబెట్టి తలమీద జైతూన్ నూనె పోయటం కూడా ఒక రకంగా నరకయాతనే. కనుకనే హిషామ్ (రజి) గవర్నరుకు దైవప్రవక్త హదీసు వినిపించి ఆ శిక్షను ఆపు చేయించారు.

3) మంచిని ఆదేశించి చెడుని నిర్మూలించే బాధ్యతను నిర్వర్తించటం ప్రతి ముస్లిం విధి.

4) దౌర్జన్యకారుల్ని వారు చేస్తున్న దౌర్జన్యాల గురించి హెచ్చరించాలి. దానివల్ల వారు దౌర్జన్యకాండను మానుకోవచ్చు.

١٦٠٩ - وَعَن ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: رَأَى رَسُولُ اللهِ ﷺ حِمَاراً مَوْسُومَ الوجْهِ، فَأَنْكَرَ ذٰلِكَ. فَقَالَ: وَاللهِ! لا أَسِمُهُ إلا أَقْصَى شَيْءٍ مِنَ الوجْهِ، وَأَمَرَ بِحِمَارِهِ، فَكُوِيَ فِي جَاعِرَتَيْهِ، فَهُوَ أَوَّلُ مَنْ كَوَى الجَاعِرَتَيْنِ. رواه مسلم.

«الجَاعِرَتَانِ» نَاحِيَتَا الوَرِكَيْنِ حَوْلَ الدُّبُرِ.

1609. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఒక గాడిద మొహం మీద (గుర్తుకోసం) వాతపెట్టబడి ఉండటం చూసి దైవప్రవక్త (సల్లం) ఆ విధంగా మొహం మీద వాతపెట్టటాన్ని చాలా అసహ్యించుకున్నారు.

ఆ తర్వాత ఇబ్నె అబ్బాస్ (రజి) (ఒక గాడిదను చూపిస్తూ), "దైవసాక్షి! నేను దీనికి వాతపెడతాను కాని దీని మొహానికి అత్యంత దూరంలో పెడతాను" అని అన్నారు. అప్పుడు ఆయన ఆదేశం

మేరకు ఆ గాడిద పిరుదుల కొనభాగం మీద వాతపెట్టటం జరిగింది. ఆ విధంగా (పశువులకు) పిరుదుల కొన భాగం మీద వాత పెట్టించిన మొదటి వ్యక్తి ఆయనే. (ముస్లిం)
'జాయిరతాన్' అంటే పిరుదుల అంచులు అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

గుర్తుగా లేక తేడా కన్పించటం కోసం పశువులకు వాతలు పెట్టాల్సి వచ్చినప్పుడు మొహాన్ని వదలిపెట్టి మరెక్కడయినా వాతలు పెట్టాలి.

١٦١٠ ـ وَعَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ مَرَّ عَلَيْهِ حِمَارٌ قد وُسِمَ في وَجْهِهِ، فَقَالَ: «لَعَنَ اللهُ الَّذي وَسَمَهُ» رواه مسلم. وفي رواية لمسلم أَيْضاً: نَهَى رَسُولُ اللهِ ﷺ عَنِ الضَّرْبِ في الوجهِ، وَعَنِ الوسْمِ في الوجهِ.

1610. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారే చేసిన వేరొక కథనం: దైవప్రవక్త (సల్లం)కు దారిలో మొహం మీద వాత పెట్టబడివున్న ఒక గాడిద కనిపించింది. దాన్నిచూసి ఆయన "దీనికి వాతపెట్టిన వాణ్ణి దేవుడు శపించుగాక!" అని అన్నారు. (ముస్లిం)
ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలోనే "దైవప్రవక్త (సల్లం) మొహం మీద కొట్టటాన్ని, వాత పెట్టటాన్ని వారించారు" అని ఉంది.

*(సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

శరీరంలో ముఖం అత్యంత సున్నితమైన భాగం. కనుక మనిషి లేక పశువు ముఖంపైనయినా సరే; కొట్టటం, వాతపెట్టటం లేక ముఖసౌకుమార్యం సహించలేని మరే పని అయినా చేయటం తగదు. అందుకే సంస్కారం నిమిత్తం భార్యని, పిల్లల్ని, నౌకర్లను కొట్టటానికి అనుమతినిచ్చినప్పటికీ మొహం మీద కొట్టకుండా జాగ్రత్తపడాలని తాకీదు చేయటం జరిగింది.

## 283 వ అధ్యాయం

## ٢٨٣ ـ بَابُ تَحْرِيمِ التَّعْذِيبِ بِالنَّارِ فِي كُلِّ حيَوَانٍ حَتَّى النَّمْلَةِ وَنَحْوِهَا

## ఏ జీవాన్నయినా చివరికి చీమలాంటి వాటినయినా అగ్నిలో కాల్చి శిక్షించరాదు

١٦١١ ـ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: بَعَثَنَا رَسُولُ اللهِ ﷺ فِي بَعْثٍ فَقَالَ: «إِنْ وَجَدْتُم فُلاناً وَفُلاناً» لِرَجُلَيْنِ مِنْ قُرَيش سَمَّاهُمَا «فَأَحْرِقُوهُمَا بِالنَّارِ» ثُمَّ قَالَ رَسُولُ اللهِ حِينَ أَرَدْنَا الخُرُوجَ: «إِنِّي كُنْتُ أَمَرْتُكُمْ أَنْ تُحْرِقُوا فُلاناً وَفُلاناً، وَإِنَّ النَّارَ لَا يُعَذِّبُ بِهَا إلا اللهُ، فَإِنْ وَجَدْتُمُوهُمَا فَاقْتُلُوهُمَا» رواه البخاري.

1611. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఓ సైనిక చర్య నిమిత్తం పంపుతూ, "మీకు గనక ఫలానా వారు (ఖురైష్‌కు చెందిన ఇద్దరు వ్యక్తుల పేర్లు చెప్పారు) కనబడితే వారిని అగ్నితో కాల్చే యండి" అని ఆదేశించారు. అయితే ఆ తర్వాత మేము బయలుదేరినప్పుడు ఆయన మళ్ళీ, "నేను మిమ్మల్ని ఫలానా ఫలానా వ్యక్తులు కనబడితే అగ్నితో కాల్చమని ఆదేశించాను. కాని కేవలం అల్లాహ్ మాత్రమే అగ్నితో శిక్షిం చగలడు. కనుక వారు గనక కనబడితే మీరు వారిని చంపండి చాలు" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

అగ్నిలో కాల్చే శిక్ష ఎవరికీ విధించరాదు. ఆఖరికి తమ శత్రువులకయినా సరే. దైవప్రవక్త (సల్లం) తన రెండవ ఆదేశంలో ఈ విషయాన్ని స్పష్టం చేశారు.

١٦١٢ ـ وَعَن ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كُنَّا مَعَ رَسُولِ اللهِ ﷺ فِي سَفَرٍ،

1612. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం: ఒకానొక ప్రయాణంలో మేము

فَانْطَلَقَ لِحَاجَتِهِ، فَرَأَيْنَا حُمَّرَةً مَعَهَا فَرْخَانِ، فَأَخَذْنَا فَرْخَيْهَا، فَجَاءَتِ الحُمَّرَةُ فَجَعَلَتْ تَعرِشُ فَجَاءَ النَّبِيُّ ﷺ فَقَالَ: «مَنْ فَجَعَ هذِهِ بِوَلَدِهَا! رُدُّوا وَلَدَهَا إِلَيْهَا» وَرَأَى قَرْيَةَ نَمْلٍ قَدْ حَرَّقْنَاهَا، فَقَالَ: «مَنْ حَرَّقَ هذِهِ؟» قُلْنَا: نَحْنُ. قَالَ: «إِنَّهُ لَا يَنْبَغِي أَنْ يُعَذِّبَ بِالنَّارِ إِلَّا رَبُّ النَّارِ». رواه أبو داود بإسناد صحيح. قوله: «قَرْيَةُ نَمْلٍ» مَعْنَاهُ: مَوْضِعُ النَّمْلِ مَعَ النَّمْلِ.

దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నప్పుడు జరిగిన సంఘటన. దైవప్రవక్త (సల్లం) కాలకృత్యాలు తీర్చుకోవటానికి వెళ్ళి ఉన్నారు. ఆ సమయంలో మాకు (పిచ్చుకలాంటి) ఒక ఎరుపురంగు పక్షి కనిపించింది. దానివెంట రెండు కూనలున్నాయి. మేము ఆ కూనల్ని పట్టుకున్నాం. అప్పుడు ఆ పక్షి వెంట పడి మా చుట్టూ తారట్లాడ సాగింది. అంతలో దైవప్రవక్త (సల్లం) వచ్చారు. ఆయన ఆ దృశ్యం చూసి, "ఈ పక్షిని దాని పిల్లల మూలంగా బాధపెట్టిం దెవరు? దాని పిల్లల్ని దానికి తిరిగిచ్చే యండి" అని అన్నారు.

ఆ తర్వాత ఆయన మేము కాల్చివేసిన ఒక చీమలపుట్టను చూసి "ఈ పుట్టను ఎవరు కాల్చారు?" అని అడిగారు. 'మేమే'నని చెప్పాం. అందుకాయన (మమ్మల్ని మందలిస్తూ)"అగ్నితో శిక్షిం చటం అగ్నిప్రభువుకే శోభిస్తుంది" అని అన్నారు. (అబూదావూద్ దీనిని దృఢ మైన ఆధారాలతో వెలికితీశారు)

"ఖర్‌యతు నమ్‌లిన్" అంటే చీమలు ఉన్న పుట్ట (చీమలు లేని పుట్టకాదు).

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1)పక్షికూనల్ని పట్టుకొని పక్షుల్ని హింసించటం, చీమ మొదలగు పురుగుల పుట్టలను

పురుగులతో సహాకాల్చి చంపటం వారించబడింది. అయితే ఖాళీ పుట్టల్ని మాత్రం కాల్చవచ్చు. అందులో తప్పులేదు.

2) ఒకడు ఇంకొకడ్ని అగ్నితో కాల్చి చంపితే దానికి ప్రతిగా అతనికి కూడా అగ్ని శిక్ష విధించటం ధర్మసమ్మతం కాదుగాని హతుని వారసులు గనక హంతకుణ్ణి కూడా అలాగే చంపాలని డిమాండ్ చేస్తే మాత్రం హత్యాశిక్ష క్రింద అలా చేయవచ్చు. లేకపోతే ఖడ్గంతో అతని తల నరికి అయినా ప్రతీకారం చేయవచ్చు.



**284 వ అధ్యాయం**

# ٢٨٤ ـ بَابُ تَحْرِيمِ مَطْلِ الْغَنِيِّ بِحَقٍّ طَلَبَهُ صَاحِبُهُ

## హక్కుదారుడు స్థితిమంతుణ్ణి తన హక్కు ఇవ్వమని అడిగినప్పుడు అతను హక్కుదారునికి హక్కు ఇవ్వకుండా వాయిదాలు వేయటం ధర్మసమ్మతం కాదు

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّ اللَّهَ يَأْمُرُكُمْ أَن تُؤَدُّوا الْأَمَانَاتِ إِلَىٰ أَهْلِهَا﴾ [النساء: ٥٨].

وقَالَ تَعَالَى: ﴿فَإِنْ أَمِنَ بَعْضُكُم بَعْضًا فَلْيُؤَدِّ الَّذِي اؤْتُمِنَ أَمَانَتَهُ﴾ [البقرة: ٢٨٣].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ముస్లిములారా! అమానతులను యోగ్యులైన వారికి అప్పగించండి అని అల్లాహ్ మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాడు." *(నిసా: 58)*

"మీలో ఎవరైనా మరొకర్ని నమ్మి అతనితో ఒక వ్యవహారం చేసినట్లయితే, ఆ వ్యక్తి తన వద్ద ఉన్న అమానతును తిరిగి ఇవ్వాలి." *(బఖర: 283)*

### ముఖ్యాంశాలు

అమానతులంటే హక్కులు. అవి దేవుని హక్కులయినా కావచ్చు, దాసుల హక్కు లయినా కావచ్చు. మొత్తానికి దీని భావం ఏమిటంటే, మీరు హక్కులన్నిటినీ- దేవుని హక్కుల్ని, దాసుల హక్కుల్ని- నెరవేర్చండి. ఎవరి హక్కునూ కాజేయకండి. ఒకరి హక్కుని కాజేయటం నీతినిజాయితీలకు విరుద్ధం. అలాగే ఎవరైనా తమ దగ్గర ఏమీ తాకట్టు పెట్టుకోకుండా ఎవరినీ సాక్షిగా ఉంచకుండా ఎదుటి వ్యక్తి మీద నమ్మకం కొద్దీ అతనితో బాకీ వ్యవహారం చేస్తే ఆ వ్యక్తి ఆ నమ్మకాన్ని నిజం చేస్తూ అతని అమానతును చెల్లించాలని రెండో సూక్తికి భావం. హక్కుదారునికి అతని హక్కు చెల్లించకుండా అనవసరంగా వాయిదాలు వేస్తూ పోవటం నిజాయితీకి విరుద్ధం కనుక అలా చేయటం నిషిద్ధం అనే విషయాన్ని ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ సూక్తుల ఆధారంగానే ప్రతిపాదించారు.

١٦١٣ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَطْلُ الْغَنِيِّ

1613. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: స్తోమత

ظُلْمٌ، وَإِذَا أُتبِعَ أَحَدُكُم عَلَى مَلِيءٍ فَلْيَتْبَعْ» متفقٌ عليه. مَعْنَى «أُتبِعَ» أُحِيلَ.

కలవాడు (అప్పు తీర్చటంలో) ఆలస్యం చేయటం అన్యాయం. మీలో ఎవరినైనా స్తోమత కలిగిన వ్యక్తికి అప్పజెపితే అతను ఆ వ్యక్తి వెంట పడి (తన రుణాన్ని వసూలు చేసుకోవాలి). (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని హవాలా ప్రకరణం మొదలు - సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఆలస్యం చేయటమంటే అప్పు తీర్చే స్తోమత ఉండికూడా రుణదాతకు అతని బాకీ తీర్చకుండా అనవసరంగా వాయిదాలు వేస్తూపోవటం. ఇలా చేయటం మహాపాపం.

2) గొడవను సద్దుమణచటం కోసం లేక మరేకారణం చేతనయినా రుణదాతను మరే ధనవంతునికయినా అప్పగించి అతన్నుండి తన బాకీ వసూలు చేసుకోమని చెబితే రుణదాత ఆ ప్రతిపాదనను ఒప్పుకోవాలి. మొత్తానికి ఈ హదీసులో వ్యవహారాలు ఉత్తమంగా ఉండాలని ప్రబోధించటం జరిగింది.



## 285 వ అధ్యాయం

## ٢٨٥ ـ بَابُ كَرَاهَةِ عَوْدِ الإِنْسَانِ فِي هِبَةٍ لَمْ يُسَلِّمْهَا إِلَى الْمَوْهُوبِ لَهُ وَفِي هِبَةٍ وَهَبَهَا لِوَلَدِهِ وَسَلَّمَهَا أَوْ لَمْ يُسَلِّمْهَا، وَكَرَاهَةِ شِرَائِهِ شَيْئاً تَصَدَّقَ بِهِ مِنَ الَّذِي تَصَدَّقَ عَلَيْهِ، أَوْ أَخْرَجَهُ عَنْ زَكَاةٍ، أَوْ كَفَّارَةٍ وَنَحْوِهَا، وَلاَ بَأْسَ بِشِرَائِهِ مِنْ شَخْصٍ آخَرَ قَدِ انْتَقَلَ إِلَيْهِ

**అప్పగించని కానుకను తిరిగి తీసుకోవటం, తమ సంతానానికి ఇచ్చిన కానుకను అది వారికి అప్పగించినా అప్పగించకపోయినా వాటిని తిరిగి తీసుకోవటం అవాంఛనీయం. తాను సదఖాగాగాని లేక జకాత్ లేక పరిహారం (కఫ్ఫారా)గా గాని ఇతరులకు ఇచ్చివేసిన వస్తువుల్ని తిరిగి వారినుండే కొనుక్కోవటం అవాంఛనీయం. ఒకవేళ ఆ వస్తువు వేరెవరి దగ్గరికయినా వెళ్ళిపోయిన తర్వాత దాన్ని వారి దగ్గరినుంచి కొనుక్కుంటే మాత్రం తప్పులేదు**

١٦١٤ ـ عَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «الَّذِي يَعُودُ فِي هِبَتِهِ كَالكَلْبِ يَرجِعُ فِي قَيْئِهِ» وَفِي رِوَايَةٍ:

1614. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తాను వేరొకరికి ఇచ్చిన కానుకను తిరిగి వాపసు తీసుకునేవాడు వాంతి చేసుకొని తిరిగి ఆ వాంతినే నాకే కుక్కతో సమానం. (బుఖారీ-ముస్లిం)

«مَثَلُ الَّذِي يَرْجِعُ فِي صَدَقَتِهِ، كَمَثَلِ الكَلْبِ يَقِيءُ، ثُمَّ يَعُودُ فِي قَيْئِهِ فَيَأْكُلُهُ» متفقٌ عليه. وفي روايةٍ: «العَائِدُ فِي هِبَتِهِ كالعَائِدِ فِي قَيْئِهِ».

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: వేరొకరికి ఇచ్చేసిన తర్వాత సదఖాను వాపసు తీసుకునేవాడి ఉపమానం ఎలా ఉంటుందంటే వాంతి చేసుకొని మళ్ళీ ఆ వాంతి దగ్గరికే వెళ్ళి దాన్ని నాకే కుక్కలాగుంటుంది.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఇతరులకు కానుక ఇచ్చి తిరిగి వాపసు తీసుకునేవాడు వాంతి చేసుకొని తిరిగి ఆ వాంతిలోకే మరలే వానితో సమానం.

*(సహీహ్ బుఖారీలోని హిబా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కానుకను వాపసు తీసుకునేవాణ్ణి కుక్కతో, అలాంటి కానుకను వాంతితో పోల్చటం జరిగింది. ఈ రెండూ మనుషులు విపరీతంగా అసహ్యించుకునేవే. అయితే ఈ పోలిక పరులకు ఇచ్చిన కానుకలకు మాత్రమే పరిమితమని పండితులు అభిప్రాయపడు తున్నారు. ఒకవేళ మనిషి తన సంతానానికో, మనవళ్ళకో లేక మునిమనవళ్ళకో ఏదయినా వస్తువు కానుకగా ఇచ్చి దాన్ని తిరిగి వాపసు తీసుకుంటే అది అంతటి తీవ్రమైన విషయం కాదనీ, అతను అలా తీసుకోవచ్చని పండితులు అంటున్నారు.

١٦١٥ ـ وَعَنْ عُمَرَ بْنِ الخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: حَمَلْتُ عَلَى فَرَسٍ فِي سَبِيلِ اللهِ، فَأَضَاعَهُ الَّذِي كَانَ عِنْدَهُ، فَأَرَدْتُ أَنْ أَشْتَرِيَهُ، وَظَنَنْتُ أَنَّهُ يَبِيعُهُ

1615. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం: దైవమార్గంలో పోరాటం నిమిత్తం నేను ఒక గుర్రం విరాళంగా ఇచ్చాను. ఆ గుర్రాన్ని తన దగ్గర ఉంచుకున్న వ్యక్తి దాన్ని పాడుచేశాడు. (అంటే అతను సరిగా దాని బాగోగులు పట్టించుకోలేదు). అందుకని నేనే ఆ గుర్రాన్ని అతని దగ్గర్నుంచి కొందామని నిర్ణయించుకున్నాను. నాకయితే అతను దాన్ని తక్కువ ధరకే అమ్మ

بِـرُخْـصٍ، فَسَـأَلْـتُ النَّبِـيَّ ﷺ فَقَـالَ: «لَا تَشْتَرِهِ وَلَا تَعُدْ فِي صَدَقَتِكَ وَإِنْ أَعْطَاكَهُ بِدِرْهَمٍ، فَإِنَّ الْعَائِدَ فِي صَدَقَتِهِ كَالْعَائِدِ فِي قَيْئِهِ» متفقٌ عليه. قوله: «حَمَلْتُ عَلَى فَرَسٍ فِي سَبِيلِ اللهِ» مَعْنَاهُ: تَصَدَّقْتُ بِهِ عَلَى بَعْضِ الْمُجَاهِدِينَ.

తాడని భావించాను. తర్వాత (దీని గురించి) దైవప్రవక్త (సల్లం) ను అడిగాను. అందుకాయన, "దాన్ని కొనవద్దు. అతను దాన్ని నీకు ఒక దిర్హమ్‌కు బదులుగా ఇచ్చినాసరే, నీ సదఖాను వాపసు తీసుకోమాకు. ఎందుకంటే సదఖా చేసి తిరిగి తీసుకునే వాడు వాంతి చేసుకొని ఆ తర్వాత దాన్ని నాకే వాడితో సమానం." అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

'హమల్‌తు' అంటే నేను దాన్ని ఒక యోధునికి సదఖా చేశాను అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం -సహీహ్ ముస్లింలోని హిబాత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

దానంగా ఇచ్చినవాటిని డబ్బులిచ్చి అయినా కొనరాదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.



**286 వ అధ్యాయం**

## ٢٨٦ - بَابُ تَأْكِيدِ تَحْرِيمِ مَالِ الْيَتِيمِ

## అనాధుల సొమ్ము నిషిద్ధమన్న దాని గురించి తాకీదు

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّ ٱلَّذِينَ يَأْكُلُونَ أَمْوَٰلَ ٱلْيَتَٰمَىٰ ظُلْمًا إِنَّمَا يَأْكُلُونَ فِى بُطُونِهِمْ نَارًا وَسَيَصْلَوْنَ سَعِيرًا﴾ [النساء: ١٠]. وقَالَ تَعَالَى: ﴿وَلَا تَقْرَبُوا۟ مَالَ ٱلْيَتِيمِ إِلَّا بِٱلَّتِى هِىَ أَحْسَنُ﴾ [الأنعام: ١٥٢]. وقَالَ تَعَالَى: ﴿وَيَسْـَٔلُونَكَ عَنِ ٱلْيَتَٰمَىٰ قُلْ إِصْلَاحٌ لَّهُمْ خَيْرٌ وَإِن تُخَالِطُوهُمْ فَإِخْوَٰنُكُمْ وَٱللَّهُ يَعْلَمُ ٱلْمُفْسِدَ مِنَ ٱلْمُصْلِحِ﴾ [البقرة: ٢٢٠].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "అనాథుల ఆస్తిని అన్యాయంగా తినేవారు వాస్తవానికి తమ పొట్టలను అగ్నితో నింపుకుంటారు. వారు తప్పకుండా మండే నరకాగ్నిలో త్రోయబడతారు." *(నిసా: 10)*

"అనాథుల ఆస్తి దరిదాపులకు పోకండి, ఉత్తమమైన రీతిలో తప్ప." *(అన్ఆమ్: 152)*

అనాథులతో వ్యవహరించే తీరుని గురించి వారు నిన్ను అడుగుతారు. నీవు వారికి ఇలా బోధించు: "ఏ విధంగా వ్యవహరిస్తే వారికి ఎక్కువ మేలు కలుగుతుందో, ఆ విధంగా వ్యవహరించటం ఉత్తమం. ఒకవేళ మీరూ వారూ కలిసి ఉంటూ, ఉభయుల ఖర్చులను ఉమ్మడిగా భరిస్తే, అందులో అభ్యంతరం లేదు. ఎటొచ్చీ వారు మీకు సోదరతుల్యులే కదా! కీడు చేసేవారెవరో మేలు చేసేవారెవరో అల్లాహ్‌కు బాగా తెలుసు." *(బఖర: 220)*

١٦١٦ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «اجْتَنِبُوا السَّبْعَ المُوبِقَاتِ!» قَالُوا: يَارَسُولَ اللهِ! وَمَا هُنَّ؟ قَالَ: «الشِّرْكُ بِاللهِ، وَالسِّحْرُ، وَقَتْلُ النَّفْسِ الَّتِي حَرَّمَ اللهُ إِلَّا بِالحَقِّ، وَأَكْلُ الرِّبَا، وَأَكْلُ مَالِ اليَتِيمِ، والتَّوَلِّي يَوْمَ

1616. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "ప్రాణాంతకమైన ఏడు విషయాలకు దూరంగా ఉండండి" అని బోధించారు. దానికి సహచరులు "దైవ ప్రవక్తా! ఏమిటవి?" అని అడిగారు. అందుకాయన ఇలా వివరించారు:

الزَّحْفِ، وقذفُ المُحْصَنَاتِ المُؤمِناتِ الغَافِلاتِ» متفقٌ عليه. «المُوبِقاتُ» المُهلِكَاتُ.

"అల్లాహ్‌కు సహవర్తుల్ని నిలబెట్టడం, చేతబడి చేయటం, దేవుడు నిషిద్ధం చేసిన ప్రాణిని అన్యాయంగా చంపటం, వడ్డీ తినటం, అనాధుని సొమ్ము తినేయటం, దైవతిరస్కారులతో యుద్ధం జరిగినప్పుడు వెన్ను చూపి పారిపోవటం, అమాయకులూ, సౌశీల్యవతులూ అయిన విశ్వాస స్త్రీల మీద అభాండాలు వేయటం."

(బుఖారీ-ముస్లిం)

'మూబిఖాత్' అంటే ప్రాణాంతకమైనవి అని భావం.

(సహీహ్ బుఖారీలోని వసాయా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పైవన్నీ ఘోరమైన పాపాలు. వాటిలో షిర్క్ అన్నిటికంటే పెద్ద పాపం. ఎందుకంటే షిర్క్ ఎన్నటికీ క్షమార్హం కాని నేరం. ముష్రిక్కు (షిర్క్‌కు పాల్పడిన వాడు) ఎల్లకాలం నరకంలోనే పడివుంటాడు. ఆ ఒక్కదాన్ని తప్ప మిగతా పాపాలను దేవుడు తలచుకుంటే మన్నించగలడు. ఒకవేళ దేవుడు మన్నించని పక్షంలో ఆ పాపాలకు గాను నరకంలో శిక్షననుభవించవలసి ఉంటుంది. ఆ తర్వాత అతను గనక విశ్వాసి అయినట్లయితే అతన్ని నరకం నుండి విడిపించి స్వర్గానికి పంపటం జరుగుతుంది.



## 287 వ అధ్యాయం

## ٢٨٧ - بابُ تَغليظِ تَحريمِ الرِّبا
## వడ్డీ కఠినంగా నిషేధించబడింది

قَالَ اللهُ تَعَالَى: ﴿ٱلَّذِينَ يَأْكُلُونَ ٱلرِّبَوٰا۟ لَا يَقُومُونَ إِلَّا كَمَا يَقُومُ ٱلَّذِى يَتَخَبَّطُهُ ٱلشَّيْطَٰنُ مِنَ ٱلْمَسِّ ۚ ذَٰلِكَ بِأَنَّهُمْ قَالُوٓا۟ إِنَّمَا ٱلْبَيْعُ مِثْلُ ٱلرِّبَوٰا۟ ۗ وَأَحَلَّ ٱللَّهُ ٱلْبَيْعَ وَحَرَّمَ ٱلرِّبَوٰا۟ ۚ فَمَن جَآءَهُۥ مَوْعِظَةٌ مِّن رَّبِّهِۦ فَٱنتَهَىٰ فَلَهُۥ مَا سَلَفَ وَأَمْرُهُۥٓ إِلَى ٱللَّهِ ۖ وَمَنْ عَادَ فَأُو۟لَٰٓئِكَ أَصْحَٰبُ ٱلنَّارِ ۖ هُمْ فِيهَا خَٰلِدُونَ ﴿٢٧٥﴾ يَمْحَقُ ٱللَّهُ ٱلرِّبَوٰا۟ وَيُرْبِى ٱلصَّدَقَٰتِ﴾ إلى قوله تعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱتَّقُوا۟ ٱللَّهَ وَذَرُوا۟ مَا بَقِىَ مِنَ ٱلرِّبَوٰٓا۟﴾ [البقرة: ٢٧٥_٢٧٨].

وَأَمَّا الأَحَادِيثُ فَكَثِيرَةٌ فِي الصَّحِيحِ مَشْهُورَةٌ، ، مِنها حَدِيثُ أَبِي هُرَيْرَةَ السَّابِقِ فِي الْبَابِ قَبْلَهُ.

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"వడ్డీ తినేవారి స్థితి షైతాను పట్టటం వల్ల ఉన్మాది అయిన వ్యక్తి స్థితి లాంటిది. ఈ స్థితికి వారు గురికావటానికి కారణం వారు "వ్యాపారం కూడా వడ్డీ లాంటిదేగా" అని అనటమే. వ్యాపారానికి అల్లాహ్ వ్యాపారాన్ని ధర్మసమ్మతం (హలాల్) చేశాడు. వడ్డీని నిషిద్ధం (హరామ్) చేశాడు. కనుక తన ప్రభువు చేసిన ఈ హితబోధ అందే వ్యక్తి ముస్ముందు వడ్డీ తినటం త్యజిస్తే, అతను పూర్వం తిన్నదేదో తిన్నాడు. అతని వ్యవహారం చివరకు అల్లాహ్ వద్దకే పోతుంది. ఈ ఆదేశం తర్వాత మళ్ళీ ఈ దుశ్చేష్టకు పాల్పడే వాడు నిశ్చయంగా నరకవాసి. అక్కడ అతడు శాశ్వతంగా ఉంటాడు. అల్లాహ్ వడ్డీని నశింప జేస్తాడు. దాన ధర్మాలను పెంచి అధికం చేస్తాడు. కృతఘ్నుడూ, దుష్టుడూ అయిన వ్యక్తిని అల్లాహ్ ప్రేమించడు. కాని విశ్వసించి మంచి పనులు చేసేవారికి, నమాజును స్థాపించే వారికి, జకాత్‌ను ఇచ్చేవారికి వారి ప్రభువువద్ద తగిన ప్రతిఫలం లభిస్తుంది. వారికి భయంకాని, శోకంకాని కలిగే అవకాశం లేదు."

"విశ్వసించిన ప్రజలారా! మీరు నిజంగా విశ్వాసులే అయితే, అల్లాహ్‌కు భయపడండి. ఇంకా మీకు ప్రజల నుండి రావలసిన వడ్డీని విడిచి పెట్టండి." *(అల్ బఖర: 275-278)*

పోతే దీనికి సంబంధించిన సుప్రసిద్ధమైన

హదీసులు 'సహీహ్'లో ఎన్నో ఉన్నాయి. వాటిలో ఇంతకు ముందు అధ్యాయంలో వచ్చిన అబూహురైరా (రజి) హదీసు కూడా ఉంది.

١٦١٧ - وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: «لَعَنَ رَسُولُ اللهِ ﷺ آكِلَ الرِّبَا وَمُوكِلَهُ» رواه مسلم. زاد الترمذي وغيره: «وَشَاهِدَيْهِ، وَكَاتِبَهُ».

1617. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం వడ్డీ తినేవారిని, తినిపించేవారిని దైవప్రవక్త (సల్లం) శపించారు (ముస్లిం).

తిర్మిజీ తదితరులు అదనంగా "వడ్డీ వ్యవహారానికి సాక్షులుగా ఉండే వారిద్దరినీ, ఆ వ్యవహారం రాసే వాణ్ణి కూడా శపించారు" అని పేర్కొన్నారు.

*(సహీహ్ ముస్లింలోని ముసాఖాత్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని లావాదేవీల అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

వడ్డీ తినేవారు, తినిపించేవారంటే వడ్డీలకు డబ్బు ఇచ్చిపుచ్చుకునేవారని భావం. ఈ హదీసు వడ్డీ వ్యవహారాన్ని కఠినంగా నిషేధిస్తోంది. ఇచ్చిపుచ్చుకునేవారిని మాత్రమే కాకుండా ఆ వ్యవహారానికి సాక్షులుగా ఉండేవారిని, దాన్ని రాసేవారిని కూడా అందులో శపించటం జరిగింది. మరి చూడబోతే సాక్షులకు, రాతగాళ్ళకు ఆ వ్యవహారంలో ఎలాంటి భాగస్వామ్యం ఉండదు. కాని ఒకింత సహాయం అందజేసినందుకు వారిని కూడా శాపగ్రస్తులుగా పేర్కొనటం జరిగింది. కనుక వడ్డీ వ్యవహారానికి ఏ మాత్రం సహాయసహకారాలు అందజేసినా అది కూడా దైవాగ్రహానికి, దేవుని శాపానికి కారణభూత మవుతుంది. అయితే వడ్డీని ఇంత కఠినంగా నిషేధించటానికి కారణం ఏమిటి? అంటే ఇస్లాం ధర్మం సానుభూతి, సౌభ్రాతృత్వం, త్యాగం, పరోపకార భావాల మీద ఆధారపడి ఉండే సమాజాన్ని నెలకొల్పగోరుతుంది. ఎవరికైనా ధనం అవసరమయితే సమాజంలోని ధనవంతులు దైవమార్గంలో, దేవుని ప్రసన్నత కోసం ఉచితంగా వారి ధనావసరాన్ని పూర్తి చేయాలి లేదా ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా వారికి ధనం అప్పుగా ఇవ్వాలి. ఇస్లాం స్థాపించగోరుతున్న సమాజం ఇలాంటి ఉన్నతమైన విలువల్ని కలిగి ఉంటుంది. కాని వడ్డీ వ్యవస్థ దీనికి భిన్నంగా స్వార్థం, దురాక్రమణ, దౌర్జన్యం మీద ఆధారపడి ఉంటుంది. ఈ వ్యవస్థలోని ధనవంతులెవరూ దైవప్రసన్నత కోసం ధన సహాయం చేయరు. వారు ఎప్పుడూ తమ స్వార్థం గురించే ఆలోచిస్తూ ఉంటారు. పేదవాని శరీరం నుండి చివరి

రక్తపు బొట్టును పిండుకున్నప్పటికీ వారి ధనాశ తీరదు. అందుకని ఇస్లాం ధర్మం అన్నిరకాల వడ్డీ వ్యవహారాలనూ నిషేధించింది. వ్యక్తిగత అవసరాల నిమిత్తం తీసుకున్న రుణం మీద లేక వ్యాపార ఉద్దేశ్యాల కోసం తీసుకున్న రుణం మీద దేనిమీదనయినా సరే; అది వడ్డీ పుచ్చుకోవటాన్ని సహించదుగాక సహించదు.

"ఆనాడు అరబ్బుల్లో వర్తక వ్యాపారాల కోసం అప్పు ఇచ్చి పుచ్చుకునే పద్ధతి ఉండేది కాదు. కేవలం కుటుంబ అవసరాల కోసమే ప్రజలు అప్పు తీసుకునేవారు. కనుక ఇస్లాం నిషేధించింది కుటుంబ అవసరాల నిమిత్తం రుణం ఇచ్చి దాని మీద తీసుకునే వడ్డీనేగాని వ్యాపార లావాదేవీల నిమిత్తం ఇచ్చేరుణం మీద తీసుకునే వడ్డీని కాదు, అసలు ఆ కాలంలో వ్యాపార లావాదేవీల నిమిత్తం వడ్డీలకు రుణమిచ్చే ఆచారమే లేదు" అని కొంతమంది అంటారు. కనుకనే వారు వ్యాపార సంబంధ రుణం మీద వడ్డీ తీసుకోవచ్చని చెబుతారు. దాన్ని 'వర్తక వడ్డీ' గా పేర్కొంటారు. వాళ్ళ అభిప్రాయంలో ఈ రకమైన వడ్డీ నిషిద్ధం కాదు, ఎందుకంటే ఇలాంటి రుణాలతో రుణగ్రహీతలు బాగా లాభాలు గడిస్తారు. అలాంటప్పుడు ఆ లాభంలో నుంచి సంవత్సరానికి ఒక నిర్ణీత భాగం రుణదాతకు ఇస్తే అది అధర్మం ఎలా అవుతుంది? నిజానికి అది ధనం అప్పుగా ఇచ్చినందుకు రుణదాతకు లభించవలసిన హక్కు అన్నది వారి వాదన- కాని ఈ వాదన సరైనది కాదు. దానికి అనేక కారణాలున్నాయి. ఒకటేమిటంటే అరబ్బుల్లో వ్యాపార నిమిత్తం రుణం ఇచ్చిపుచ్చుకునే ఆచారం ఉండేది కాదన్న వాదనలో నిజం లేదు. ఎందుకంటే అరబ్బులు వర్తకవ్యాపారాల కోసం కూడా రుణాలు తీసుకునేవారని చరిత్రలో అనేక దాఖలాలున్నాయి. మరో విషయం ఏమిటంటే వ్యాపారంలో పెట్టిన పెట్టుబడికి తప్పకుండా లాభమే వస్తుందని నమ్మకంగా చెప్పలేము. సాధారణంగా మనం చూస్తూ ఉంటాం. వ్యాపారంలో కొన్నికొన్ని సార్లు లక్షల, కోట్ల రూపాయల నష్టం వస్తుంది. కాని బ్యాంకులు, షావుకార్లు అవేవీ పట్టించుకోరు. ఎట్టి పరిస్థితుల్లోనయినా వారు ప్రతి సంవత్సరం నిర్ణీత మొత్తంలో తమ పెట్టుబడికి 'వడ్డీ'ని వసూలు చేసుకుంటారు. మరి ఇది దౌర్జన్యం కాదా? స్వార్థప్రియత్వం కాదా? పరుల సొమ్మును అన్యాయంగా దోచుకు తినటం కాదా?! సరే ఒకవేళ వ్యాపారంలో నష్టం లేకుండా లాభమే వచ్చిందనుకోండి. అప్పుడు కూడా ఈ వడ్డీ రుణాల మూలంగా బాధలు తప్పవు. వీటివల్ల వస్తువుల ధరలు పెరిగిపోతాయి. వ్యాపారులు తాము చెల్లించిన వడ్డీ మొత్తాన్ని ఉత్పత్తి వ్యయం క్రింద లెక్కగట్టి వస్తువుల ధరలు నిర్ణయిస్తారు. అప్పుడు ప్రజలు ఆ వస్తువుల్ని మనుపటి కంటే ఎక్కువ ధరలకు కొనవలసి వస్తుంది. అందుకని ఇస్లాం ధర్మం అన్నిరకాల వడ్డీ లావాదేవీలను నిషేధించి దౌర్జన్యం, దురాక్రమణ, ధరల పెరుగుదలకు కారణమయ్యే ఒకపెద్ద ద్వారాన్ని మూసివేసింది.

కాని శోచనీయమైన విషయం ఏమిటంటే పాశ్చాత్య దేశాల అంధానుకరణ మూలంగా నేడు ముస్లింలలో కూడా ఆర్థిక వ్యవస్థ మొత్తం వడ్డీ మీదనే ఆధారపడి ఉంది. దాన్నుండి

బయటపడటానికి పాశ్చాత్య కీలుబొమ్మలైన ముస్లిం దేశాధినేతల తరఫు నుండి ఎలాంటి ప్రయత్నాలూ జరగటం లేదు. అదే విధంగా ముస్లిం ప్రజానీకంలో కూడా ఈ వడ్డీ మహమ్మారి నుండి బయటపడాలన్న ఆసక్తి ఏమీ కనిపించటం లేదు. పైగా వారిలో చాలామంది బ్యాంకులు ఇచ్చే వడ్డీని తీసుకుని నిర్మొహమాటంగా తింటున్నారు. తామూ వడ్డీ ఖాతాదార్లుగా మారిపోతున్నారు.

వడ్డీ కోసం దివ్యఖుర్ఆన్ 'రిబా' అనే పదాన్ని ఉపయోగించింది. నిఘంటువులో దీనికి 'పెరుగుదల' అనే అర్థం వుంది. షరీఅత్ పరంగా ఒక లావాదేవీకి సంబంధించిన రెండు సజాతీయ వస్తువుల మధ్య వినిమయం జరిగేటప్పుడు ఏదో ఒకదానిలో ఉండే పెరుగుదలను లేక బాకీ తీర్చినప్పుడు అసలు వస్తువులో లేక నగదులో ఉండే పెరుగుదలను 'రిబా' అని అంటారు. ఇది రెండు రకాలుగా ఉంటుంది.

1) రిబల్‌ఫజ్ల్- అంటే రెండు సజాతీయ వస్తువుల వినిమయ సమయంలోనే ఒక దాని ప్రతిఫలం ఎక్కువగా తీసుకోవటం.

2) రిబన్నసీఆ- రెండు సజాతీయ వస్తువుల వినిమయం (బాకీ వ్యవహారంగా) జరిగిన నిర్ణీత కాలం తర్వాత ఏదో ఒకదాని ప్రతిఫలం ఎక్కువగా తీసుకోవటం.



288 వ అధ్యాయం

## ٢٨٨ ـ بَابُ تَحْرِيمِ الرِّيَاءِ

## ఇతరులకు చూపించటం కోసం సత్కార్యాలు చేయుటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالى: ﴿وَمَآ أُمِرُوٓا۟ إِلَّا لِيَعْبُدُوا۟ ٱللَّهَ مُخْلِصِينَ لَهُ ٱلدِّينَ حُنَفَآءَ﴾ [البينة: ٥]. وقَالَ تَعَالى: ﴿لَا تُبْطِلُوا۟ صَدَقَٰتِكُم بِٱلْمَنِّ وَٱلْأَذَىٰ كَٱلَّذِى يُنفِقُ مَالَهُۥ رِئَآءَ ٱلنَّاسِ﴾ [البقرة: ٢٦٤]. وقَالَ تَعَالى: ﴿يُرَآءُونَ ٱلنَّاسَ وَلَا يَذْكُرُونَ ٱللَّهَ إِلَّا قَلِيلًا﴾ [النساء: ١٤٢].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"తాము అల్లాహ్‌కు మాత్రమే దాస్యం చేయాలని, పూర్తి ఏకాగ్రతతో తమ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకించు కోవాలని వారికి ఆదేశించటం జరిగింది." (బయ్యినహ్ : 5)

"కేవలం పరుల మెప్పును పొందటానికే తన ధనం ఖర్చుచేసేవాని మాదిరిగా, అల్లాహ్‌నూ అంతిమ దినాన్నీ విశ్వసించని వాని మాదిరిగా మీరు దెప్పిపొడిచి గ్రహీత మనసును గాయపరచి మీ దానధర్మాలను వృథా చేసుకోకండి." *(అల్ బఖర: 264)*

"వారు (అంటే కపటులు) నమాజ్ కోసం లేస్తే, బద్ధకంగా, కేవలం ప్రజలకు చూపేందుకే లేస్తారు. అల్లాహ్‌ను చాలా తక్కువగా స్మరిస్తారు." *(నిసా: 142)*

١٦١٨ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «قَالَ اللهُ تَعَالى: أَنَا أَغْنى الشُّرَكَاءِ عَنِ الشِّرْكِ، مَنْ عَمِلَ عَمَلاً أَشْرَكَ فِيهِ مَعِي غَيْرِي، تَرَكْتُهُ وَشِرْكَهُ» رواه مسلم.

1618. దేవుడు ఇలా అన్నాడని దైవ ప్రవక్త (సల్లం) చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: "(ప్రజలు నాకు కట్టబెడుతున్న) భాగస్వాము లందరికంటే ఎక్కువగా నేను షిర్క్‌కు అతీతుణ్ణి. కనుక ఎవరైనా ఒక (మంచి) పని చేసి అందులో మరెవరినైనా నాకు భాగ

స్వామిగా నిలబెడితే నేను అతన్ని అతని షిర్క్‌తోపాటు వదిలేస్తాను." (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జుహ్‌ద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మంచిపనులు కేవలం దైవప్రసన్నత కోసమే ఆచరించబడతాయి. ఒకవేళ ఎవరైనా ప్రాపంచిక ప్రయోజనాల కోసం లేక ప్రజల దృష్టిలో తాము గొప్ప దైవభక్తి పరులమని అనిపించుకోవటం కోసం, పరుల మెప్పు పొందటం కోసం మంచిపనులు చేస్తే వాటి ఉద్దేశ్యాలలో దైవప్రసన్నతతోపాటు పరుల ప్రసన్నతకు కూడా భాగస్వామ్యం కల్పించినట్లవు తుంది. కనుక ఇదీ ఒకరకంగా స్వల్పమైన బహుదైవారాధనే. దేవుడు అలాంటి వారిని వారి షిర్క్‌తోపాటు వదిలేస్తాడంటే వారి సత్కర్మల్ని నిర్వీర్యం చేసి వారి పుణ్యాన్ని వృధా చేస్తాడని భావం. మొత్తానికి ఈ హదీసులో పరుల మెప్పుకోసం చేయబడే మంచి పనుల్ని షిర్క్ (బహుదైవారాధన)గా పేర్కొని అది ఎంతటి నీచమైన, ఛండాలమైన కార్యమో వివరించటం జరిగింది. అయితే ఇది షిర్కె అస్‌గర్ అంటే స్వల్పమైన బహుదైవారాధన మాత్రమే. ఈ పాపానికి పాల్పడే వ్యక్తికొరకు స్వర్గం నిషిద్ధం కాదు. అతను శిక్షననుభవించిన తర్వాత తిరిగి స్వర్గానికి వెళ్తాడు. ఇతనికి భిన్నంగా షిర్కె అక్బర్ (నిజమైన బహుదైవారాధన)కు పాల్పడిన వ్యక్తి మాత్రం చిరకాలం నరకంలోనే ఉంటాడు. స్వర్గం అతని కొరకు శాశ్వితంగా నిషేధించబడుతుంది.

١٦١٩ ـ وَعَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إنَّ أَوَّلَ النَّاسِ يُقْضَى يَوْمَ الْقِيَامَةِ عَلَيْهِ رَجُلٌ اسْتُشْهِدَ، فَأُتِيَ بِهِ، فَعَرَّفَهُ نِعْمَتَهُ، فَعَرَفَهَا، قَالَ: فَمَا عَمِلْتَ فِيهَا؟ قَالَ: قَاتَلْتُ فِيكَ حَتَّى اسْتُشْهِدْتُ، قَالَ كَذَبْتَ، وَلٰكِنَّكَ قَاتَلْتَ لِأَنْ يُقَالَ: جَرِيءٌ! فَقَدْ قِيلَ، ثُمَّ أُمِرَ بِهِ، فَسُحِبَ عَلَى وَجْهِهِ حَتَّى أُلْقِيَ فِي النَّارِ. وَرَجُلٌ تَعَلَّمَ الْعِلْمَ وَعَلَّمَهُ، وَقَرَأَ الْقُرْآنَ،

1619. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) గారే తెలియజేశారు: ప్రళయ దినాన అందరికంటే ముందు విచారించబడే మనిషి అమరవీరుడయి ఉంటాడు. అతన్ని (దైవసన్నిధిలో) హాజరుపర చటం జరుగుతుంది. దేవుడు అతనికి తన వరాలను గుర్తుచేస్తాడు. ఆ వ్యక్తి దేవుని వరాలను గుర్తుచేసుకుంటాడు. అప్పుడు దేవుడు అతన్ని, "నువ్వు ఆ వరాలతో ఏం చేశావ్?" అని అడుగు తాడు. అందుకతను, "నేను నీ మార్గం లో పోరాడుతూ చివరికి ప్రాణాలు

సయితం అర్పించాను"అని అంటాడు. "(లేదు) నువ్వు అబద్ధం చెబుతున్నావు. నిజానికి నువ్వు ప్రజల చేత 'వీరుడు' అని అనిపించుకోవాలన్న ఉద్దేశ్యంతోనే యుద్ధం చేశావు. (నువ్వు కోరుకున్నట్లు గానే ప్రపంచంలో) ప్రజలు నిన్ను వీరుడు అని పిలిచారు" అని అంటాడు దేవుడు. ఆ తర్వాత (దేవుని) ఆజ్ఞమేరకు అతన్ని బోర్లా ఈడ్చుకుంటూ తీసుకెళ్ళి నరకంలో పడవేయటం జరుగుతుంది.

ఆ తర్వాత రెండో వ్యక్తిని హాజరు పరచటం జరుగుతుంది. అతను (ప్రపంచంలో) (ధర్మ) జ్ఞానం నేర్చుకొని ఇతరులకు కూడా బోధించి ఉంటాడు. ఖుర్ఆన్ చదివి ఉంటాడు. దేవుడు అతనికి తన వరాలను గుర్తు చేస్తాడు. అతను వాటిని గుర్తుచేసుకుంటాడు. అప్పుడు దేవుడు, "మరి ఆ వరాలతో నువ్వు ఏం చేశావు?" అని అడుగుతాడు. దానికతను "నేను (ధర్మ) విద్య నేర్చుకున్నాను. ఇతరులకు కూడా నేర్పించాను. నీ ప్రసన్నత కోసం ఖుర్ఆన్ పఠించాను" అని చెబుతాడు. "నువ్వు అబద్ధం చెబుతున్నావు. ప్రజలు నిన్ను 'పండితుడు' అని పిలవాలని నువ్వు విద్య నేర్చుకున్నావు. ప్రజలు నిన్ను 'ఖుర్ఆన్ పారాయణకుడు' (ఖారీ) అని పిలవాలని ఖుర్ఆన్ పఠించావు. నువ్వు కోరుకున్నట్లుగానే

فَأُتِيَ بِهِ، فَعَرَّفَهُ نِعَمَهُ فَعَرَفَهَا، قَالَ: فَمَا عَمِلْتَ فِيهَا؟ قَالَ: تَعَلَّمْتُ الْعِلْمَ وَعَلَّمْتُهُ، وَقَرَأْتُ فِيكَ الْقُرْآنَ، قَالَ: كَذَبْتَ، وَلٰكِنَّكَ تَعَلَّمْتَ لِيُقَالَ: عَالِمٌ! وَقَرَأْتَ الْقُرْآنَ لِيُقَالَ: هو قَارِىءٌ! فَقَدْ قِيلَ، ثُمَّ أُمِرَ بِهِ، فَسُحِبَ عَلى وَجْهِهِ حَتَّى أُلْقِيَ في النَّارِ. وَرَجُلٌ وسَّعَ اللهُ عَلَيْهِ، وأعطاه مِن أَصْنَافِ المَالِ، فَأُتِيَ بِهِ فَعَرَّفَهُ نِعَمَهُ، فَعرَفَهَا. قَالَ: فَمَا عَمِلْتَ فِيهَا؟ قَالَ: ما تَرَكْتُ مِنْ سَبِيلٍ تُحِبُّ أَنْ يُنْفَقَ فِيهَا إلَّا أَنْفَقْتُ فِيهَا لَكَ. قَالَ: كَذَبْتَ، ولٰكِنَّكَ

فَعَلْتَ لِيُقَالَ: هو جَوَادٌ! فَقَدْ قيلَ، ثُمَّ أُمِرَ بِهِ فَسُحِبَ عَلى وَجْهِهِ ثُمَّ أُلْقِيَ في النَّارِ». رواه مسلمٌ. «جَرِيءٌ» بفتح الجيم وكسر الرَّاءِ وَبِالمَدِّ، أَيْ: شُجَاعٌ حَاذِقٌ.

(ప్రపంచంలో) నిన్ను పిలవటం జరిగింది. ఆ తర్వాత అతని గురించి ఆజ్ఞ వెలువడగానే అతన్ని బోర్లా ఈడ్చుకుంటూ తీసుకెళ్ళి నరకంలో పడవేయటం జరుగుతుంది.

ఆ తర్వాత మూడో వ్యక్తిని హాజరు పరచటం జరుగుతుంది. దేవుడు అతనికి కలిమిని, అన్నిరకాల సిరిసంపదల్ని ప్రసాదించి ఉంటాడు. దేవుడు అతనికి తన వరాలను గుర్తు చేస్తాడు. అతను వాటిని గుర్తుచేసుకుంటాడు. అప్పుడు దేవుడు, "మరి ఆ వరాలతో నువ్వు ఏం చేశావు?" అని అడుగుతాడు. దానికతను "నువ్వు ఇష్టపడే ఏ చోటునీ నేను ఖర్చుపెట్టకుండా వదలిపెట్టలేదు" అని అంటాడు. "నువ్వు అబద్ధం చెబుతున్నావు. ప్రజలు నిన్ను 'గొప్ప దానశీలి' అని అనాలని నువ్వు అలా చేశావు. ప్రపంచంలో నువ్వు కోరుకున్నట్లుగానే జరిగింది" అని అంటాడు దేవుడు. ఆ తర్వాత అతని గురించి ఆజ్ఞ వెలువడగానే అతన్ని బోర్లా ఈడ్చుకుంటూ తీసుకెళ్ళి నరకంలో పడవేయటం జరుగుతుంది. *(ముస్లిం)*

'జరీ' అంటే గొప్పవీరుడు, చురుకైనవాడు అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ఇమారహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా బోధపడే మొదటి విషయం, ప్రళయదినాన అందరికంటే ముందు ప్రజల మెప్పు కోసం సత్కర్మలు చేసినవారిని విచారించటం జరుగుతుంది. రెండో విషయం చిత్తశుద్ధి లేకపోతే ఎంత గొప్ప సత్కార్యమయినా అంగీకరించబడదు. పోతే ప్రదర్శనాబుద్ధితో చేసే మంచి పనులకు పుణ్యానికి బదులు శిక్ష విధించబడుతుంది. అలాంటి పాపాత్ములు స్వర్గానికి కాదు, నరకానికి వెళ్తారు.

١٦٢٠ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ نَاساً قَالُوا لَهُ: إِنَّا نَدْخُلُ عَلى سَلاطِينِنَا فَنَقُولُ لَهُمْ بِخِلافِ مَا نَتَكَلَّمُ إِذا خَرَجْنَا مِنْ عِنْدِهِمْ؟ قالَ ابْنُ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا: كُنَّا نَعُدُّ هذا نِفَاقاً عَلى عَهْدِ رَسُولِ اللهِ ﷺ. رواه البخاري.

1620. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం కొంతమంది తనతో మాట్లాడుతూ, "మేము అధికారుల దగ్గరికి వెళ్ళినప్పుడు బయటికి వచ్చిన తర్వాత మాట్లాడుకునే మాటలకు వ్యతిరేకమైన మాటలు వారితో మాట్లాడుతాము (ఇలా చేయవచ్చా?)" అని అడిగాము. అందుకు ఆయన సమాధానమిస్తూ, "దైవప్రవక్త (సల్లం) కాలంలో మేము దీన్ని కాపట్యంగా భావించేవాళ్ళం" అని చెప్పారు.

(బుఖారీ)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'రెండు నాలుకల ధోరణి' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. కాని అక్కడ ఈ హదీసు ఇబ్నె ఉమర్(రజి)గారి మనవడు ముహమ్మద్ బిన్ జైద్ బిన్ ఉమర్ నుండి ఉల్లేఖించబడింది. దాని ప్రకారం ఆయనగారి తాత ఇబ్నె ఉమర్ (రజి)ముందు కొందరు ఈ సందేహం వెలిబుచ్చగా దానికాయన ఈ విధంగా సమాధానమిచ్చారు. ఈ ఉల్లేఖనమే సరైనది. సహీహ్ బుఖారీలో కూడా ఈ హదీసు కొన్ని పదాల తేడాతో దాదాపు ఇలాగే ఉంది. ఏమైనప్పటికీ ఈ హదీసు ద్వారా అధికారుల్ని అతిగా పొగిడేయటం, ముఖస్తుతి చేయటం, వారి మెప్పు కోసం ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పటం కపట గుణాలనీ, మహానేరాలని మనకు బోధపడుతోంది. ఇలాంటి కపట చేష్టల వల్ల అధికారులకు ప్రజల గురించి సరైన సమాచారం తెలిసిరాదు. ఒకవేళ వారు నిజంగా పరిపాలకులకు, ప్రజలకు శ్రేయోభిలాషులయితే అధికారుల ముందు నిజమైన మాటలు మాట్లాడాలి. దాంతో పాలకులకు ప్రజల నిజస్థితి తెలుస్తుంది. వారు వంచనకు గురికాకుండా ఉంటారు.

١٦٢١ - وعن جُنْدُبِ بْنِ عَبْدِ اللهِ بْنِ سُفْيَانَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «مَنْ سَمَّعَ سَمَّعَ اللهُ بِهِ، وَمَنْ رَاىءَ راىءَ اللهُ بِهِ» متفق عليه. وَرَوَاهُ مُسْلِمٌ أَيضاً مِنْ رِوَايَةِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا. «سَمَّعَ» بتَشْديد الميم، وَمَعْنَاهُ: أَظْهَرَ عَمَلَهُ لِلنَّاسِ رِيَاءً «سَمَّعَ اللهُ بِهِ» أَيْ: فَضَحَهُ يَوْمَ الْقِيَامَةِ، وَمَعْنى: «مَنْ رَاءَى» أَيْ: مَنْ أَظْهَرَ لِلنَّاسِ الْعَمَلَ الصَّالِحَ لِيَعْظُمَ عِنْدَهُمْ «رَاءَى اللهُ بِهِ» أَيْ: أَظْهَرَ سَرِيرَتَهُ عَلى رُؤُوسِ الخَلائِقِ.

1621. హజ్రత్ జుందుబ్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ సుఫ్యాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రదర్శనా బుద్ధితో సదాచరణ చేసేవారిని దేవుడు ప్రళయదినాన పరాభవం పాల్జేస్తాడు. అలాగే ఎవరైనా ప్రజల దృష్టిలో గొప్పవాడు అని అనిపించుకోవాలన్న ఉద్దేశ్యంతో మంచి పనులు చేస్తే దేవుడు వారి రహస్య లోపాలను బహిర్గతం చేస్తాడు. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలో ఈ హదీసు ఇబ్నె అబ్బాస్ ఆధారంగా వెలికితీయబడింది.

'సమ్మఅ' అంటే ప్రదర్శనా బుద్ధితో ప్రజల ముందుకు వచ్చి సదాచరణ చేయటం. "సమ్మఅల్లాహు బిహీ" అంటే దేవుడు అతన్ని పరాభవం పాలుచేస్తాడని భావం. 'మన్ రఆ'అంటే ప్రజల్లో గొప్పవాడనిపించుకోవటం కోసం వారి ముందు మంచిపనులు చేయటం అని అర్థం. 'రఅల్లాహు బిహీ' అంటే అతని రహస్య లోపాలను ప్రజలముందు బహిర్గతం చేస్తాడని భావం.

(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జుహ్ద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ప్రదర్శనాబుద్ధి ప్రళయదినాన అవమానానికి, పరాభవానికి కారణభూతమవుతుంది.

١٦٢٢ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ تَعَلَّمَ عِلْماً مِمَّا يُبْتَغَى بِهِ وَجْهُ اللهِ عَزَّ وَجَلَّ لَا يَتَعَلَّمُهُ إِلَّا لِيُصِيبَ بِهِ عَرَضاً مِنَ الدُّنْيَا، لَمْ يَجِدْ عَرْفَ الْجَنَّةِ يَوْمَ الْقِيَامَةِ» يَعْنِي: رِيحَهَا. رواه أبو داود بإسنادٍ صحيحٍ. والأحاديث في الباب كثيرةٌ مشهورةٌ.

1622. హ్రజత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవప్రసన్నత కోసం ఆర్జించబడే విద్యను కేవలం ప్రాపంచిక సిరిసంపదల్ని సంపాదించు కోవటం కోసం నేర్చుకునేవాడు ప్రళయ దినాన స్వర్గ సువాసనకు కూడా నోచుకోడు. (అబూదావూద్, దీని ఆధారాలు దృఢమైనవి)
ఈ అధ్యాయంలో సుప్రసిద్ధమైన హదీసులు ఇంకా ఎన్నో ఉన్నాయి.

(సుననె అబూదావూద్‌లోని విద్యాప్రకరణం)

## ముఖ్యాంశాలు

ధర్మజ్ఞానాన్ని ఆర్జించటం చాలా గొప్ప పుణ్యకార్యం. కాని అది దైవప్రసన్నతా దృక్పథంతో ఆర్జించబడాలి. ఒకవేళ ఎవరైనా ప్రాపంచిక ప్రయోజనాల కోసం ఈ విద్యను నేర్చుకుంటే అది ఎంత పెద్ద పాపమంటే అలాంటి వారు స్వర్గ సువాసనకు కూడా నోచుకోరు. అంటే ప్రారంభంలో వారికి ఆ భాగ్యం ఉండదు. నరకంలో శిక్షననుభవించిన తర్వాత దేవుడు దయ తలచినప్పుడు వారు స్వర్గానికి వెళ్తారు.

## 289 వ అధ్యాయం

## ٢٨٩ - بَابُ مَا يَتَوَهَّمُ أَنَّهُ رِيَاءٌ وَلَيْسَ بِرِيَاءٍ

## కొన్ని విషయాలు ప్రదర్శనాబుద్ధితో చేస్తున్నట్లుంటాయి. వాస్తవానికి అవి ప్రదర్శనాబుద్ధి క్రిందికి రావు

١٦٢٣ - عَنْ أَبِي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قِيلَ لِرَسُولِ اللهِ ﷺ: أَرَأَيْتَ الرَّجُلَ يَعْمَلُ الْعَمَلَ مِنَ الخَيْرِ، وَيَحْمَدُهُ النَّاسُ عَلَيْهِ؟ قَالَ: «تِلْكَ عَاجِلُ بُشْرَى الْمُؤْمِنِ» رواه مسلم.

1623. హజ్రత్ అబూజర్ర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)ను అడగటం జరిగింది, "మనిషి ఒక మంచి పని చేస్తుంటే తోటి మనుషులు అతన్ని పొగుడుతున్నారు. దాని గురించి మీ అభిప్రాయమేంటి? (అది కూడా ప్రదర్శనా బుద్ధి క్రిందికే వస్తుందా?)" అని. అందుకాయన, "(లేదు), అది విశ్వాసికి లభించే ముందస్తు శుభవార్త" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మనిషి మనసులో ప్రదర్శనాబుద్ధి లేకపోయినా తాను చేస్తున్న మంచి పనుల్ని చూసి జనం పొగిడితే దానివల్ల ఎలాంటి ప్రమాదం లేదు. పైగా దాన్ని పరలోక జీవితంలో తనకు జరగబోయే సత్కారానికి ఇహలోకంలో ముందస్తుగా లభిస్తున్న శుభవార్తగా, జనుల నోట వెలువడుతున్న దైవిక సూచనగా భావించాలి. ప్రజల ప్రశంసలు, పొగడ్తల వల్ల చిత్తశుద్ధికి ఎలాంటి నష్టం ఉండదు. పైగా ఆ ఆచరణ దేవుని సన్నిధిలో సమ్మతించి ఆమోదించబడిందనటానికి జనుల పొగడ్తలే సాక్ష్యం మరియు నిదర్శమూను.

**290 వ అధ్యాయం**

## ٢٩٠ - باب تحريم النظر إلى المرأة الأجنبية والأمرد الحسن لغير حاجة شرعية

## షరీఅత్ పరమైన అవసరమేది లేకుండా పర స్త్రీ వైపు, వెంట్రుకలు లేకుండా అందంగా ఉన్న బాలుని వైపు చూడటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿قُل لِّلْمُؤْمِنِينَ يَغُضُّوا مِنْ أَبْصَارِهِمْ﴾ [النور: ٣٠]. وقَالَ تَعالى: ﴿إِنَّ السَّمْعَ وَالْبَصَرَ وَالْفُؤَادَ كُلُّ أُولَٰئِكَ كَانَ عَنْهُ مَسْئُولًا﴾ [الإسراء: ٣٦] وقَالَ تَعالى: ﴿يَعْلَمُ خَائِنَةَ الْأَعْيُنِ وَمَا تُخْفِي الصُّدُورُ﴾ [غافر: ١٩]. وقَالَ تَعالى: ﴿إِنَّ رَبَّكَ لَبِالْمِرْصَادِ﴾ [الفجر: ١٤].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ప్రవక్తా! విశ్వసించిన పురుషులకు తమ చూపులను కాపాడుకోండి అని చెప్పు." *(నూర్:30)*

"నిశ్చయంగా కళ్ళూ, చెవులూ, మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగుతుంది." *(ఇస్రా: 36)*

"అల్లాహ్, చూపుల చౌర్యాన్ని సయితం ఎరుగును. హృదయాలు దాచి ఉంచిన రహస్యాన్ని సయితం ఆయన ఎరుగును." *(అల్ మోమిన్: 19)*

"యదార్థమేమిటంటే మీ ప్రభువు మాటువేసి ఉన్నాడు." *(ఫజ్ర్:14)*

١٦٢٤ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قال: «كُتِبَ عَلَى ابْنِ آدَمَ نَصِيبُهُ مِنَ الزِّنَا مُدْرِكٌ ذلِكَ لَا مَحَالَةَ: الْعَيْنَانِ زِنَاهُمَا النَّظَرُ، والأُذُنَانِ زِنَاهُمَا

1624. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఆదం పుత్రుని నొసటి మీద ఎంతోకొంత వ్యభిచారం రాసి ఉంటుంది. అతను ఎలాగైనా దాన్ని పొంది తీరుతాడు. కళ్ళ వ్యభిచారం (పరస్త్రీని) చూడటం, చెవుల వ్యభిచారం (అశ్లీల మాటలు) వినటం, నాలుక వ్యభిచారం (అశ్లీల) మాటలు మాట్లాడటం, చేతి వ్యభిచారం (అధర్మ

الاستِمَاعُ، وَاللِّسَانُ زِنَاهُ الْكَلَامُ، وَالْيَدُ زِنَاهَا الْبَطْشُ، وَالرِّجْلُ زِنَاهَا الخُطَا، وَالْقَلْبُ يَهْوَى وَيَتَمَنَّى، وَيُصَدِّقُ ذلك الْفَرْجُ أَوْ يُكَذِّبُهُ». متفقٌ عليه. وهذا لَفظُ مسلمٍ، ورواية الْبُخَارِيِّ مُخْتَصَرَةٌ.

వస్తువుని) పట్టుకోవటం, కాళ్ళ వ్యభిచారం (చెడు పనికోసం) నడవటం. మనసు వాంఛిస్తుంది, కోరుకుంటుంది. మర్మాంగం దాని మాట వింటుంది లేదా తిరస్కరిస్తుంది. (బుఖారీ-ముస్లిం)

పై వాక్యాలు ముస్లింవి. బుఖారీలోని ఉల్లేఖనం సంక్షిప్తంగా ఉంది.

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఖదర్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

చూడటం, వినటం, పట్టుకోవటం, నడచివెళ్ళటం, వాస్తవానికి వ్యభిచార పనులు కావుగాని ఇవి వ్యభిచారానికి కారణభూతమయ్యే ప్రమాదం ఉండటం మూలంగా మనిషి వీటికి కూడా దూరంగా ఉండాలన్న ఉద్దేశ్యంతో అన్యాపదేశంగా వీటిని కూడా వ్యభిచార పనులుగా పేర్కొనటం జరిగింది. మనిషి గనక వీటి విషయంలో జాగ్రత్తగా ఉండకపోతే అతని మర్మాంగం మనోవాంఛలకు దాసోహమంటుంది. ఫలితంగా ఎప్పుడో ఒకప్పుడు అతను వ్యభిచార కూపంలో పడిపోవచ్చు. అదే మనిషి వీటి విషయంలో జాగ్రత్తగా ఉన్నాడనుకోండి. మర్మాంగం మనోవాంఛలకు లోనయ్యే ప్రసక్తే ఉండదు. ఫలితంగా అతను వ్యభిచారానికి దూరంగా ఉంటాడు. ఈ రోజుల్లో అదే జరుగుతోంది. అపరిచితులైన ఇద్దరు స్త్రీ పురుషులు ముందు ఒకర్నొకరు తీక్షణంగా చూసుకుంటారు. ఆ తర్వాత చిర్నవ్వులు, దరిమిలా కవ్వింపులు, సంభాషణలు, ఆపైన చెట్టాపట్టాలు - కనుక ఈ కారణాలన్నిటికీ దూరంగా ఉండటం చాలా అవసరం.

١٦٢٥ ـ وَعَنْ أَبي سَعِيدِ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إيَّاكُمْ وَالجُلُوسَ فِي الطُّرُقَاتِ!» قَالُوا: يَا رَسُولَ اللهِ! مَا لَنَا مِنْ مَجَالِسِنَا بُدٌّ:

1625. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "మీరు (జనం నడిచే) దారుల్లో కూర్చోకుండా జాగ్రత్త పడండి" అని ఆదేశించారు. అప్పుడు సహచరులు, "దైవప్రవక్తా! దారుల్లో కూర్చోవటం తప్ప మాకు వేరే దిక్కు లేదు. మేము అక్కడ కూర్చొని (చాలా ముఖ్యమైన మాటలు) మాట్లాడు

نَتَحَدَّثُ فِيهَا. فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «فَإِذَا أَبَيْتُمْ إِلَّا المَجْلِسَ، فَأَعْطُوا الطَّرِيقَ حَقَّهُ» قَالُوا: وَمَا حَقُّ الطَّرِيقِ يَا رَسُولَ اللهِ؟ قَالَ: «غَضُّ البَصَرِ، وكَفُّ الأذَى، وردُّ السَّلام، والأمْرُ بِالمَعْرُوفِ والنَّهيُ عَنِ المُنْكَرِ» متفقٌ عليه.

కుంటాము" అని విన్నవించుకోగా, "సరే, దారుల్లో కూర్చోవటం తప్పదనుకుంటే మరి మీరు దారి హక్కు నెరవేర్చండి" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). అది విని సహచరులు మళ్ళీ "ఈ దారి హక్కు ఏమిటి దైవప్రవక్తా!?" అని ప్రశ్నించగా, "చూపులు క్రిందికి వాల్చి ఉంచటం, బాధాకరమైన వస్తువులను దారి నుంచి తొలగించటం, సలాంకు జవాబు పలకటం, మంచిని గురించి ప్రబోధించి, చెడు నుంచి ఆపటం (ఇదే దారి హక్కు)" అని ఆయన బదులిచ్చారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అత్యాచారాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

సాధారణ రోడ్లు, కాలిబాటలు సంఘంలోని ప్రజల ఉమ్మడి ఆస్తులుగా పరిగణించబడతాయి. కనుక వాటిమీద సభలు, సమావేశాలు నిర్వహించటం సరికాదు. దానివల్ల అటుగా వెళ్ళేవారికి ఇబ్బంది కలుగుతుంది. ముఖ్యంగా పరపురుషుల ముందునుంచి వెళ్ళటానికి ఇష్టపడని పరదాధారులైన స్త్రీలు చాలా మనస్తాపానికి గురౌతారు. కనుక రోడ్లమీద మీటింగులు, సమావేశాలు నిర్వహించటం తగదు. ఒకవేళ ఇళ్ళు ఇరుకుగా ఉండటం మూలంగానో లేక మరే కారణం వల్లనో బయట కూర్చోవటం తప్పదనుకుంటే- అలాంటప్పుడు రోడ్డు మీద పాపాలకు పాల్పడకుండా జాగ్రత్తపడాలి. ఉదాహరణకు దారిన వచ్చేపోయే స్త్రీల వైపు చూడకూడదు. అలాగే తమ వల్ల ఇతరులకు మేలుజరిగేలా చూసుకోవాలి. అంటే ధర్మబోధనలు చేసిగాని, ధర్మప్రచారం చేసిగాని ప్రజల నీతినడవడికలను తీర్చిదిద్దాలి. వారి శ్రేయస్సు కోసం పాటుపడాలి. ఈ రోజుల్లో ప్రజలు వివాహాది వేడుకల సందర్భంగా దారులు మూసేసి ఎంతో మందికి ఇబ్బంది కలిగిస్తుంటారు. ఇది షరీఅత్‌పరంగా, నైతికంగా కూడా ఎంతో చెడ్డ విషయం. తమ సొంత పని కోసం వేలాది మంది మనసు నొప్పించటాన్ని ఏ షరీఅత్, ఏ నైతిక విధానం అనుమతిస్తుంది? అదీగాకుండా ఈ వేడుకలు దైవ అవిధేయతా కార్యాలతో, దుబారా ఖర్చుతో, ఇతర పైశాచిక చేష్టలతో నిండి ఉంటాయి. దేవుడు ముస్లింలకు సన్మార్గాన్ని, సద్బుద్ధిని ప్రసాదించుగాక!

١٦٢٦ ـ وَعَنْ أَبِي طَلْحَةَ زَيْدِ بْنِ سَهْلٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كُنَّا قُعُوداً بالأَفْنِيَةِ نَتَحَدَّثُ فيها فَجَاءَ رَسُولُ اللهِ ﷺ فَقَامَ علينَا فقَالَ: «مَا لَكُمْ وَلِمَجَالِسِ الصُّعُدَاتِ؟ اجْتَنِبُوا مَجَالِسَ الصُّعُدَاتِ» فَقُلْنَا: إنَّمَا قَعَدْنَا لِغَيْرِ ما بَأْس: قَعَدْنَا نَتَذَاكَرُ، وَنَتَحَدَّثُ. قَالَ: «إمَّا لا فَأَدُّوا حَقَّهَا: غَضُّ البَصَرِ، وَرَدُّ السَّلامِ، وحُسْنُ الكَلامِ» رواه مسلم. «الصُّعُداتُ» بضَمِّ الصَّادِ والعَيْنِ، أي: الطُّرقَاتُ.

1626. హజ్రత్ అబూ తల్హా జైద్ బిన్ సహ్ల్ (రజి) కథనం: మేము ఆరు బయట కూర్చొని మాట్లాడుకుంటుండగా దైవప్రవక్త (సల్లం) మా దగ్గరికి వచ్చి నిలబడ్డారు. తర్వాత "ఏమిటీ దారుల్లో కచేరీలు పెట్టారు? దారుల్లో ఈ విధంగా కచేరీలు పెట్టకుండా జాగ్రత్తపడండి సుమా!" అని ఉపదేశించారు. అందుకు సహచరులు, "మేమిక్కడ షరీఅత్‌పరంగా తప్పుకాని పని మీద కూర్చున్నాం. మేమిక్కడ కూర్చొని పునశ్చరణలు, సంభాషణలు జరుపుకుంటాం" అని విన్నవించుకున్నారు. దానికాయన, "సరే, అలా కూర్చోవటం తప్ప మీకు వేరే మార్గం లేదనుకుంటే దాని హక్కుని నెరవేర్చండి. చూపులు క్రిందికి వాల్చి ఉంచటం, సలాంకు జవాబు పలకటం, మంచి మాటలు మాట్లాడుకోవటం (ఇదే దారి హక్కు)" అని బోధించారు. (ముస్లిం)
'సువుదాత్' అంటే దారులు అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

١٦٢٧ ـ وَعَنْ جَرِيرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَأَلْتُ رَسُولَ اللهِ ﷺ عَنْ نَظَرِ الفَجْأَةِ فَقَالَ: «اصْرِفْ بَصَرَكَ» رواه مسلم.

1627. హజ్రత్ జరీర్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అకస్మాత్తుగా దృష్టి పడటం గురించి అడిగాను. అందుకాయన, "(వెంటనే) దృష్టి మరల్చుకో" అని చెప్పారు. (ముస్లిం)

*(సుననె అబూదావూద్‌లోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పరస్త్రీ మీద యాదృచ్ఛికంగా దృష్టి పడిపోతే వెంటనే దృష్టి మరల్చుకోవాలి. తదేకంగా చూస్తూ ఉండిపోకూడదు. ఎందుకంటే దానివల్ల మనసులో కోరిక పుడితే అది పాపంగా, కంటి వ్యభిచారంగా పరిగణించబడుతుంది. అదే విధంగా మొహం మీద వెంట్రుకలు లేకుండా అందంగా కనపడే అబ్బాయిల వంక చూడటం కూడా స్త్రీల వైపు చూడటం లాంటిదేనని మరికొందరు పండితులు అభిప్రాయపడ్డారు.

١٦٢٨ - وَعَنْ أُمِّ سَلَمَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كُنْتُ عِنْدَ رَسُولِ اللهِ ﷺ وَعِنْدَهُ مَيْمُونَةُ، فَأَقْبَلَ ابْنُ أُمِّ مَكْتُومٍ، وذلِكَ بَعْدَ أَنْ أُمِرْنَا بِالحِجَابِ فَقَالَ النَّبِيُّ ﷺ: «احْتَجِبَا مِنْهُ» فَقُلْنَا: يَا رَسُولَ اللهِ! أَلَيْسَ هُوَ أَعْمَى: لَا يُبْصِرُنَا، وَلَا يَعْرِفُنَا؟ فَقَالَ النَّبِيُّ ﷺ: «أَفَعَمْيَاوَانِ أَنْتُمَا أَلَسْتُمَا تُبْصِرَانِهِ!؟» رواه أبو داود والترمذي وقَالَ: حَدِيثٌ حَسَنٌ صَحِيحٌ.

1628. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర ఉన్నాను. ఆ సమయంలో ఆయన దగ్గర మైమూన (రజి. అన్హా) కూడా ఉన్నారు. అంతలో ఇబ్నె ఉమ్మె మక్తూమ్ అటుగా వచ్చారు. దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని 'పరదా లోకి వెళ్ళి పొండని' ఆదేశించారు. మేము సందేహపడుతూ, "దైవ ప్రవక్తా! ఆయన అంధులు కారా? ఆయన మమ్మల్ని చూడలేరు. గుర్తు పట్టనూ లేరు కదా!?" అని అడిగాం. అందు కాయన, "మీరు కూడా అంధులేనా? మీకు ఆయన కనపడటం లేదా?" అని అన్నారు. (అబూదావూద్, తిర్మిజీ-హసన్, సహీహ్)

*(సుననె అబూదావూద్లోని వస్త్రధారణ ప్రకరణం - సుననె తిర్మిజీలోని అదబ్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఆధారాల్లో ఉమ్మె సలమా (రజి.అన్హా) గారిచేత స్వేచ్ఛ నొసగబడిన బానిస నిబ్హాన్- గురించి పూర్తి వివరాలు తెలియటం లేదు (అని ప్రముఖ హదీసువేత్త అల్బానీగారు పేర్కొన్నారు). కనుక ఈ ఉల్లేఖనం ప్రామాణికమైనది కాదు. దీనికి విరుద్ధంగా దైవప్రవక్త (సల్లం) ఫాతిమా బిన్తె ఖైస్ను అబ్దుల్లాహ్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ ఇంట్లో 'ఇద్దత్'

గడపమని ఆదేశించారనీ, అక్కడయితే నీవు బట్టలు విడువటానికి కూడా ఇబ్బంది ఉండదని ఆయన చెప్పినట్లు ప్రామాణిక హదీసుల్లో ఉంది. కనుక అంధులతో పరదా చేయవలసిన అవసరం లేదు.

١٦٢٩ - وَعَنْ أَبِي سَعِيدٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَنْظُرُ الرَّجُلُ إِلَى عَوْرَةِ الرَّجُلِ. وَلَا الْمَرْأَةُ إِلَى عَوْرَةِ الْمَرْأَةِ، وَلَا يُفْضِي الرَّجُلُ إِلَى الرَّجُلِ فِي ثَوْبٍ وَاحِدٍ، وَلَا تُفْضِي الْمَرْأَةُ إِلَى الْمَرْأَةِ فِي الثَّوْبِ الْوَاحِدِ» رواه مسلم.

1629. హజ్రత్ అబూ సయీద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పురుషుడు ఇతర పురుషుని మర్మావయవాలను చూడరాదు. స్త్రీ ఇతర స్త్రీ మర్మావయవాలను చూడరాదు. పురుషుడు మరొక పురుషుని ప్రక్కన నగ్నంగా ఒకే దుప్పట్లో పడుకోరాదు. స్త్రీ ఇతర స్త్రీ ప్రక్కన నగ్నంగా ఒకే దుప్పట్లో పడుకోరాదు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని హియజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాం ధర్మం లజ్జావిహీనతను ఎంత కఠినంగా అరికట్టగోరుతుందో ఈ హదీసు ద్వారా విదితమవుతోంది. ఇస్లాం ఒక పురుషుడు మరో పురుషుని ప్రక్కన నగ్నంగా పడుకోవటాన్నే సహించనప్పుడు స్త్రీ పురుషుల్ని విచ్చలవిడిగా కలుసుకోనిచ్చే పాశ్చాత్య పోకడల్ని సహిస్తుందా? శోచనీయమైన విషయం ఏమిటంటే నేడు అదే నీతిమాలిన సంస్కృతిని టెలివిజన్ మొదలగు పరికరాల ద్వారా ముస్లిం దేశాల్లో కూడా ప్రచారం చేయటం జరుగుతోంది. పాశ్చాత్య తత్వం ఆవహించిన నేతలు కూడా ఆ నీతిమాలిన్యానికి, లజ్జారాహిత్యానికి 'సంస్కృతి' అనే ముద్దుపేరు పెట్టి ఆరాధిస్తున్నారు. దేవుడు ముస్లిం దేశాలను అలాంటి భ్రష్ట నేతల చెర నుండి విముక్తినొసగుగాక!



**291 వ అధ్యాయం**

# ٢٩١ - بَابُ تَحْرِيمِ الْخَلْوَةِ بِالأَجْنَبِيَّةِ

## ఏకాంతంలో పర స్త్రీ వెంట ఉండటం నిషిద్ధం

قال الله تعالى: ﴿وَإِذَا سَأَلْتُمُوهُنَّ مَتَاعًا فَسْئَلُوهُنَّ مِن وَرَآءِ حِجَابٍ﴾ [الأحزاب: ٥٣].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:
"మీరు ప్రవక్త భార్యలను ఏదైనా అడగవలసి ఉంటే తెరచాటున ఉండి అడగండి."
(అహ్‌జాబ్:53)

١٦٣٠ - وَعَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِيَّاكُمْ وَالدُّخُولَ عَلَى النِّسَاءِ!» فَقَالَ رَجُلٌ مِنَ الأَنْصَارِ: أَفَرَأَيْتَ الْحَمْوَ؟ قَالَ: «الْحَمْوُ الْمَوْتُ!» متفقٌ عليه. «الْحَمْوُ» قَرِيبُ الزَّوْجِ كَأَخِيهِ، وابْنِ أَخِيهِ، وَابْنِ عَمِّهِ.

1630. హజ్రత్ ఉఖ్‌బా బిన్ ఆమిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) "పర స్త్రీలు ఉండే ఇళ్ళల్లోకి ప్రవేశించకండి" అని ఉపదేశించారు. అది విని అన్సార్ వర్గానికి చెందిన ఒక వ్యక్తి, "దైవప్రవక్తా! మరి మరిది సంగతి ఏమిటి?" అని అడిగాడు. దాని కాయన,"మరిది చావు లాంటివాడు" అని బదులిచ్చారు.
(బుఖారీ-ముస్లిం)

'అల్ హమ్వు' అంటే భర్తకు దగ్గరి బంధువు. అతని సోదరుడు, అతని సోదర కుమారుడు, బాబాయి కుమారుడు మొదలగువారు.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసులో పరదాకు సంబంధించి ఒక ముఖ్యమైన విషయం వివరించబడింది. దానిని ముస్లింలలో అత్యధిక మంది నిర్లక్ష్యం చేస్తున్నారు. దగ్గరి బంధువులవటం చేత వారు ఇండ్లకు చాలా ఎక్కువగా వస్తూ పోతూ ఉంటారు. ఇంటి ఆడవాళ్ళతో ఏకాంతంలో ఉండే

అవకాశాలు ఎన్నో వస్తుంటాయి. కనుక ఇతరుల కన్నా ఇలాంటి దగ్గరి బంధువుల మూలంగా ఉపద్రవాలకు గురయ్యే ప్రమాదం చాలా ఎక్కువగా ఉంటుంది. అందుకే దగ్గరి బంధువుని మృత్యువుతో పోల్చటం జరిగింది. అంటే ధర్మపరంగా వారు మృత్యువుకు కారణభూతులవుతారన్నమాట! లేదా ఇస్లామీయ రాజ్యంలో వ్యభిచారానికి మరణశిక్ష ఉంటుంది కనుక ఆ స్త్రీ పురుషులు గనక పాపానికి పాల్పడితే దాని ఫలితం మరణమే అవుతుందని దాని భావం కావచ్చు. అదీకాకపోతే తన భార్యకు వేరొకరితో అక్రమ సంబంధమున్నట్లు భర్తకు అనుమానం వస్తే అతను పౌరుషం కొద్దీ ఆమెను హత్య చేయవచ్చు లేదా ఆమెకు విడాకులు ఇవ్వవచ్చు. విడాకుల వల్ల కూడా స్త్రీ జీవితం జీవచ్ఛవమై పోతుంది. లేదా మృత్యువుకు ఎలా భయపడతారో పరస్త్రీతో ఏకాంతంలో గడపటానికి కూడా అలాగే భయపడండి అని భావం కావచ్చు. ఏది ఏమయినప్పటికీ భర్త సోదరులతోనే పరదా చేయటం అవశ్యమైనప్పుడు భర్త స్నేహితులతో పరదా చేయటం ఇంకెంత అవశ్యమో వేరే చెప్పనక్కర్లేదు. నేడు ఈ విషయంలో కూడా నిర్లక్ష్యం చాలా ఎక్కువయిపోయింది. దానివల్ల ఎన్నో దుష్పరిణామాలు ఎదురౌతున్నాయి. వాటిని తరచూ వార్తాపత్రికల్లో చదువుతూనే ఉంటాం. అయినప్పటికీ ప్రజలు వీటి వెనకున్న కారణాలను గ్రహించరు. లజ్జారాహిత్యం ఓ మహమ్మారిలా వ్యాపిస్తూ పోతుండటం చాలా విచారకరం.

١٦٣١ - وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَخْلُوَنَّ أَحَدُكُمْ بِامْرَأَةٍ إِلَّا مَعَ ذِي مَحْرَمٍ» متفق عليه.

1631. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: మీలో ఎవరూ కూడా పరస్త్రీ వెంట ఏకాంతంలో ఉండరాదు- ఆమె వెంట ఆమె మహ్రమ్ పురుషుడు ఉంటే తప్ప.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

١٦٣٢ - وَعَنْ بُرَيْدَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «حُرْمَةُ نِسَاءِ الْمُجَاهِدِينَ عَلَى الْقَاعِدِينَ كَحُرْمَةِ أُمَّهَاتِهِمْ، مَا مِنْ رَجُلٍ مِنَ الْقَاعِدِينَ يَخْلُفُ رَجُلًا مِنَ الْمُجَاهِدِينَ فِي أَهْلِهِ، فَيَخُونُهُ فِيهِمْ إِلَّا وُقِفَ لَهُ يَوْمَ الْقِيَامَةِ، فَيَأْخُذُ مِنْ حَسَنَاتِهِ مَا شَاءَ

1632. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: యుద్ధానికి వెళ్ళినవారి స్త్రీల మానమర్యాదలు యుద్ధానికి వెళ్ళనివారి కొరకు తమ తల్లుల మాన మర్యాదల మాదిరిగా పవిత్రమైనవి. ఎవడైనా యుద్ధానికి వెళ్ళని వాడు యుద్ధానికి వెళ్ళినవాడి ఇంటికి పర్యవేక్షకునిగా ఉండి ద్రోహానికి పాల్పడితే

حَتَّى يَرْضَى» ثُمَّ الْتَفَتَ إِلَيْنَا رَسُولُ اللهِ ﷺ، فَقَالَ: «مَا ظَنُّكُمْ؟». رواه مسلم.

ప్రళయదినాన అతన్ని ఆ యోధుని ముందు నిలబెట్టడం జరుగుతుంది. అతను ఆ ద్రోహి చేసిన సత్కర్మల్లో తాను కోరుకున్నన్ని సత్కర్మలు తీసు కుంటాడు. ఆ విధంగా తీసుకొని చివరికి ప్రసన్నుడౌతాడు.

తర్వాత దైవప్రవక్త (సల్లం) మా వైపుతిరిగి, "మీరేమంటారు?" అని అడిగారు. (అంటే సహజంగానే మనిషి ఆశాపరుడై ఉండి దైవం నుంచి అనుమతి లభించిన తర్వాత అతను తనకు ద్రోహం చేసినవాడి దగ్గర ఒక్క సత్కర్మ అయినా వదులుతాడా?)

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఇమారహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ధర్మయోధులు యుద్ధానికి వెళ్ళిపోయిన తర్వాత వారి ఇంటిని పర్యవేక్షించటం వారి కుటుంబ సభ్యుల బాగోగుల్ని పట్టించుకోవటం చాలా గొప్ప కార్యం. అయితే ఆ పనిలో ద్రోహానికి గనక పాల్పడితే దాని పాపం కూడా చాలా తీవ్రంగా ఉంటుంది. ఎందుకంటే దాని మూలంగా ఇస్లాం ధర్మం ఎంతో ప్రాముఖ్యతనిచ్చే పరస్పర సహాయక వ్యవస్థకు విఘాతం వాటిల్లుతుంది.



**292 వ అధ్యాయం**

## ٢٩٢ - بَابُ تَحْرِيم تَشَبُّهِ الرِّجَالِ بِالنِّسَاءِ وَالنِّسَاءِ بِالرِّجَالِ فِي لِبَاسٍ وَحَرَكَةٍ وَغَيْرِ ذٰلِكَ

## వస్త్రధారణలో, హావభావాల ప్రదర్శనలో పురుషులు స్త్రీలను, స్త్రీలు పురుషుల్ని అనుకరించటం నిషిద్ధం

١٦٣٣ - عَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: لَعَنَ رَسُولُ اللهِ ﷺ الْمُخَنَّثِينَ مِنَ الرِّجَالِ، وَالْمُتَرَجِّلاتِ مِنَ النِّسَاءِ. وفي رواية: لَعَنَ رَسُولُ اللهِ ﷺ الْمُتَشَبِّهِينَ مِنَ الرِّجَالِ بِالنِّسَاءِ، وَالْمُتَشَبِّهَاتِ مِنَ النِّسَاءِ بِالرِّجَالِ. رواهُ البُخاري.

1633. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) స్త్రీల వేష ధారణను అవలంబించే పురుషులను, పురుషుల వేషధారణను అవలంబించే స్త్రీలను శపించారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: స్త్రీలను అనుకరించే పురుషుల్ని, పురుషుల్ని అనుకరించే స్త్రీలను దైవ ప్రవక్త (సల్లం) శపించారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

స్త్రీల వేషధారణను, వారి అలవాట్లను, అభిరుచుల్ని అనుకరించే పురుషులను 'ముఖన్నస్' అంటారు. అలాగే పురుషుల వేషధారణను, అలవాట్లను అనుకరించే స్త్రీలను 'ముతరజ్జిల్'గా వ్యవహరిస్తారు. దేవుడు ప్రకృతిపరంగా స్త్రీ పురుషులిరువురిలోనూ వేర్వేరు స్వభావాలను సృష్టించాడు. అలాంటప్పుడు స్త్రీ పురుషులు ఒండొకరి స్వభావాల్ని అనుకరించే ప్రయత్నం చేయరాదు. అలా చేయటం దైవాగ్రహానికి కారణం అవుతుంది. నేడు పాశ్చాత్య సంస్కృతి దుష్ప్రభావానికి లోనైన స్త్రీలు కొందరు దేవుడు తమలో పొందుపరచిన స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. దేవుడు కేవలం పురుషులకు మాత్రమే ప్రత్యేకించిన పనుల్ని కూడా చేయటానికి ప్రయత్నిస్తున్నారు. దేవుడు వారి మీద ఎటువంటి బరువు బాధ్యతలు ఉంచనప్పటికీ వారు స్వయంగా తమ మీద తలకు మించిన భారం మోపుకుంటున్నారు. ఈ విధంగా ఆధునికత

మోజులోపడిన స్త్రీలు పాశ్చాత్య సంస్కృతిని గుడ్డిగా అనుకరిస్తూ తమ ఆత్మలకు తామే అన్యాయం చేసుకుంటున్నారు.

١٦٣٤ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: لَعَنَ رَسُولُ اللهِ ﷺ الرَّجُلَ يَلْبَسُ لِبْسَةَ المَرْأَةِ، وَالمَرْأَةَ تَلْبَسُ لِبْسَةَ الرَّجُلِ. رواهُ أبو داوُدَ بإسناد صحيح.

1634. హ్రజత్ అబూ హురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) స్త్రీల దుస్తుల్లాంటి దుస్తుల్ని ధరించే పురుషుల్ని, పురుషుల దుస్తుల్లాంటి దుస్తుల్ని ధరించే స్త్రీలను శపించారు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

*(సుననె అబూదావూద్‌లోని లిబాస్ ప్రకరణం)*

١٦٣٥ ـ وَعَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «صِنْفَانِ مِنْ أَهْلِ النَّارِ لَمْ أَرَهُمَا: قَوْمٌ مَعَهُمْ سِيَاطٌ كَأَذْنَابِ الْبَقَرِ يَضْرِبُونَ بِهَا النَّاسَ، وَنِسَاءٌ كَاسِيَاتٌ عَارِيَاتٌ مُمِيلَاتٌ مَائِلَاتٌ، رُؤُوسُهُنَّ كَأَسْنِمَةِ الْبُخْتِ المَائِلَةِ لَا يَدْخُلْنَ الجَنَّةَ، وَلَا يَجِدْنَ رِيحَهَا، وإِنَّ رِيحَهَا لَيُوجَدُ مِنْ مَسِيرَةِ كَذَا وَكَذَا» رواهُ مسلم. معنى «كاسيات» أَيْ: مِنْ نِعْمَةِ اللهِ «عَارِيَاتٌ» مِنْ شُكْرِهَا. وَقِيلَ: مَعنَاهُ: تَسْتُرُ بَعْضَ بَدَنِهَا، وَتَكْشِفُ بَعْضَهُ إظْهَاراً لِجَمَالِها

1635. హ్రజత్ అబూహురైరా (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నరకవాసుల్లో రెండు రకాల వారుంటారు. వారిని నేను కూడా చూడలేదు. (అంటే వీరు రాబోవు కాలంలో పుడతారు). వారిలో ఒక రకం వారి దగ్గర ఆవుతోకల్లాంటి కొరడాలు ఉంటాయి. వారు వాటితో జనాన్ని కొడతారు. రెండవ రకం వారు స్త్రీలు. వీరు దుస్తులు ధరించినప్పటికీ నగ్నంగానే ఉంటారు. ప్రజల్ని ఆకర్షిస్తారు. ప్రజలచేత ఆకర్షించబడతారు. వారి తలలు బుఖ్తీ ఒంటెల యొక్క ఒంగిన మూపురాల మాదిరిగా ఉంటాయి. ఇలాంటి స్త్రీలు స్వర్గానికి వెళ్ళలేరు. అంతేకాదు, స్వర్గసువాసన అల్లంత

దూరం నుంచే గుభాళిస్తూ ఉంటుంది. అయినప్పటికీ వారికి దాని సువాసన కూడా రాదు. (ముస్లిం)

'కాసియాత్' అంటే దేవుడు అనుగ్రహించిన దుస్తులు ధరించి ఉంటారు. 'ఆరియాత్' అంటే ఆ అనుగ్రహానికి కృతజ్ఞతలు తెలుపుకోనివారు. కొంత మంది దృష్టిలో 'ఆరియాత్' అంటే తమ అందచందాలను ఇతరు లకు చూపెట్టే ఉద్దేశ్యంతో తమ శరీరంలోని కొంతభాగాన్ని దుస్తులతో కప్పి మిగతా భాగాన్ని నగ్నంగా ఉంచు కునేవారు. ఆరియాత్ అంటే తమ శరీరపు తళుకు బెళుకులు కానవచ్చే విధంగా పల్చటి దుస్తులు ధరించిన వారని మరి కొందరు అభిప్రాయపడ్డారు. 'మాయిలాత్' అంటే దైవవిధే యత పట్ల, తాము నెరవేర్చవలసిన విధుల పట్ల వైముఖ్యం చూపేవారనీ, 'ముమీలాత్' అంటే తాము చేసే చెడు పనులు ఇతరులకు కూడా నేర్పే స్త్రీలని కొందరు అభిప్రాయపడగా, మరి కొందరు మాయిలాత్ అంటే వయ్యారాలు పోతూ నడిచేవారనీ, ముమీలాత్ అంటే భుజాలు ఎగరేసుకుంటూ నడిచే వారని అభిప్రాయపడ్డారు. ఇంకొందరు మాయిలాత్ అంటే తమ శిరోజాలను బాగా అలంకరించుకొని ఆకర్షణీయంగా తయారయ్యేవారని (వ్యభిచారి

ونَحوِه، وَقِيلَ: تَلْبَسُ ثَوْباً رَقِيقاً يَصِفُ لَوْنَ بَدَنِها، وَمَعْنَى «مَائِلاتٌ» قِيلَ: عَنْ طَاعَةِ اللهِ تعالى وَمَا يَلْزَمُهُنَّ حِفْظُهُ، «مُمِيلاتٌ»: أَيْ: يُعَلِّمْنَ غَيْرَهُنَّ فِعْلَهُنَّ المَذْمُومَ، وَقِيلَ: مَائِلاتٌ يَمْشِينَ مُتَبَخْتِرَاتٍ، مُمِيلاتٍ لِأَكْتَافِهِنَّ، وَقِيلَ: مَائِلاتٌ يَمْتَشِطْنَ المِشْطَةَ المَيْلاءَ: وَهِيَ مِشْطَةُ البَغَايَا. و«مُمِيلاتٌ»: يُمَشِّطْنَ

غَيْرَهُنَّ تِلْكَ المِشْطَةَ. «رُؤُوسُهُنَّ كَأَسْنِمَةِ الْبُخْتِ» أَيْ: يُكَبِّرْنَهَا وَيُعَظِّمْنَهَا بِلَفِّ عِمَامَةٍ أَوْ عِصَابَةٍ أَوْ نَحْوِهِ.

ణులు ఈ విధంగా తయారవుతారు), ముమిలాత్ అంటే ఇతరుల శిరోజాలను కూడా ఆ విధంగా అలంకరించేవారు అని అభిప్రాయపడ్డారు. వారి తలలు బుఖ్తీ ఒంటెల మూపురాల మాదిరిగా ఉంటాయ్యంటే వారు తమ శిరోజాలను వోణీతోగాని లేక మరేదైనా బట్టతో గాని చుట్టుకోవటం మూలంగా వారి తలలు ఎత్తుగా ఉంటాయన్న మాట.

*(సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలపై దౌర్జన్యం చేసేవారిని ఈ హదీసులో తీవ్రంగా హెచ్చరించటం జరిగింది. నేరం చేసినందుకు శిక్షగా కొరడా దెబ్బలు కొట్టడం దౌర్జన్యం క్రిందికి రాదు. అన్యాయంగా ప్రజల్ని కొట్టడం మాత్రమే దౌర్జన్యం క్రిందికి వస్తుంది. ఇది మహాపాపం. నిస్సిగ్గుగా, పరదా నిబంధనల్ని ఏ మాత్రం లెఖ్ఖ చేయకుండా తమ అంద చందాలను, సౌందర్యాలంకరణలను జనుల ముందు ప్రదర్శిస్తూ తిరిగే స్త్రీలను కూడా ఈ హదీసు హెచ్చరిస్తోంది. చెడుపనులకు పాల్పడే స్త్రీలు మాత్రమే సాధారణంగా ఇటువంటి చేష్టలకు ఒడిగడుతుంటారు. ఈ విధంగా సౌందర్యాన్ని ప్రదర్శించి స్త్రీలు పురుషులను ఆకర్షించి ఉభయులూ చెడులో ఇరుక్కుపోవటానికి కారణమవుతుంటారు. తమ శిరోజాలను వివిధ రకాలుగా అలంకరించుకుంటారు. స్త్రీ తన శిరోజాలను అలంకరించుకోవటం, అందంగా ముస్తాబుకావటం తప్పు అని ఇస్లాం అనడం లేదు. అటువంటి అందచందాలను పర పురుషుల ముందు ప్రదర్శించటమే తప్పు అని అంటుంది ఇస్లాం. ఎందుకంటే సృష్టికర్త అయిన అల్లాహ్ స్త్రీ పురుషుల మధ్య ఒక ఆకర్షణను పొందు పరిచాడు. అయితే ఆ ఆకర్షణను ధర్మసమ్మతమైన రీతిలోనే వినియోగించాలని నియమం పెట్టాడు. ఇది దేవుడు మనిషికి పెట్టిన పరీక్ష. కనుక సృష్టికర్త నిర్ణయించిన హద్దులను మానవులు ఏ మాత్రం అతిక్రమించినా ఆ ఆకర్షణ ఒక్కసారిగా భగ్గుమని క్రమక్రమంగా అది వికృతరూపం దాల్చడానికి కూడా అవకాశం ఉంది. స్త్రీ అందచందాలు, ఆమె సౌందర్యపు తళుకు బెళుకులు అతి ఎక్కువగా ఈ ఉపద్రవానికి కారణమవుతాయన్న సత్యాన్ని ఎవరూ విస్మరించలేరు. అందువల్ల స్త్రీలు ఈ విషయంలో ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తూ ఉండాలని ఇస్లాం ప్రభోధిస్తోంది.

## 293 వ అధ్యాయం

## ٢٩٣ - بَابُ النَّهْيِ عَنِ التَّشَبُّهِ بِالشَّيْطَانِ وَالْكُفَّارِ

## షైతాన్‌ను, అవిశ్వాసుల్ని అనుకరించరాదు

١٦٣٦ - عَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تَأْكُلُوا بِالشِّمَالِ، فَإِنَّ الشَّيْطَانَ يَأْكُلُ وَيَشْرَبُ بِشِمَالِهِ» رواهُ مسلم.

1636. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఎడమ చేత్తో తినకండి. షైతాను ఎడమచేత్తో తింటాడు, త్రాగుతాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని అష్‌రిబా ప్రకరణం)

١٦٣٧ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَأْكُلَنَّ أَحَدُكُمْ بِشِمَالِهِ، وَلَا يَشْرَبَنَّ بِهَا. فَإِنَّ الشَّيْطَانَ يَأْكُلُ بِشِمَالِهِ وَيَشْرَبُ بِهَا» رواه مسلم

1637. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: షైతాన్ ఎడమ చేత్తో తింటాడు. దాంతోనే త్రాగుతాడు. కనుక మీలో ఎవరూ కూడా ఎడమ చేత్తో తినరాదు. దాంతో త్రాగనూరాదు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని అష్‌రిబా ప్రకరణం)

١٦٣٨ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ الْيَهُودَ، والنَّصَارَى لَا يَصْبِغُونَ، فَخَالِفُوهُمْ» متفقٌ عَلَيه.

1638. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: యూదులు, నస్రానీలు రంగు వేసుకోరు. మీరు వారికి వ్యతిరేకంగా చేయండి. (బుఖారీ-ముస్లిం)

అంటే, గడ్డం మరియు తలలోని తెల్ల వెంట్రుకలకు పసుపు లేక ఎరుపు

الْمُرَادُ: خِضَابُ شَعْرِ اللِّحْيَةِ وَالرَّأْسِ الأَبْيَضِ بِصُفْرَةٍ أَوْ حُمْرَةٍ، وَأَمَّا السَّوَادُ، فَمَنْهِيٌّ عَنْهُ كَمَا سَنَذْكُرُ فِي الْبَابِ بَعْدَهُ، إِنْ شَاءَ اللهُ تَعَالَى.

రంగు పూసుకోవటమని దీని భావం. అయితే వాటికి నలుపురంగు మాత్రం వేయరాదు.

దైవం తలిస్తే - ఈ విషయాన్ని మేము రాబోవు అధ్యాయంలో వివరిస్తాం.

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పండితులు ఈ హదీసులోని ఆదేశాన్ని ముస్తహబ్ (అభిలషణీయం)గా నిర్ధారించారు. కనుక గడ్డం లేక తలలోని తెల్లవెంట్రుకలకు రంగు వేసుకోవటం అవశ్యమేమీ కాదు గాని వేసుకుంటే మంచిది. ఏమయినప్పటికీ యూదుల, నస్రానీల వేషధారణను మాత్రం అనుసరించరాదు. అంచేత వెంట్రుకలకు రంగు వేసుకోకుంటే యూదుల్ని, నస్రానీలను అనుకరించినట్లవుతున్న పక్షంలో తప్పనిసరిగా వెంట్రుకలకు రంగు వేసుకోవాలి.



**294 వ అధ్యాయం**

## ٢٩٤ ـ بَابُ نَهْيِ الرَّجُلِ وَالْمَرْأَةِ عَنْ خِضَابِ شَعْرِهِمَا بِسَوَادٍ

## స్త్రీలయినా, పురుషులయినా తమ శిరోజాలకు నల్లరంగు వేసుకోరాదు

١٦٣٩ ـ عَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: أُتِيَ بِأَبِي قُحَافَةَ وَالِدِ أَبِي بَكْرٍ الصِّدِّيقِ رَضِيَ اللهُ عَنْهُمَا يَوْمَ فَتْحِ مَكَّةَ وَرَأْسُهُ وَلِحْيَتُهُ كَالثَّغَامَةِ بَيَاضاً، فَقَالَ رَسُولُ اللهِ: «غَيِّرُوا هٰذَا وَاجْتَنِبُوا السَّوَادَ» رواه مسلم.

1639. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: మక్కా విజయంనాడు అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) తండ్రిగారైన అబూ ఖుహాఫాను (దైవప్రవక్త-సల్లం-దగ్గరికి) తీసుకు వచ్చినప్పుడు ఆయనగారి తల, గడ్డం 'సుగామా' మాదిరిగా తెల్లగా ఉన్నాయి. అది చూసి దైవప్రవక్త (సల్లం) "వీటిని మార్చుకోండి, అయితే నలుపు జోలికి మాత్రం వెళ్ళకండి" అని ఉపదేశించారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

'అబూ ఖుహాఫా' అనేది అబూబక్ర్ (రజి) తండ్రిగారి మారుపేరు. ఈయన అసలు పేరు ఉస్మాన్ బిన్ ఆమిర్. ఈయన మక్కా విజయంనాడు ఇస్లాం స్వీకరించారు. 'సుగామా' అనేది కొండ ప్రాంతాల్లో మొలకెత్తే ఒక మొక్క పేరు. అది చాలా తెల్లగా ఉంటుంది. అబూ ఖుహాఫా గారి తల వెంట్రుకలు కూడా బాగా తెల్లగా ఉండటం చూసి దైవప్రవక్త (సల్లం) వాటికి రంగు పూసుకోమని పురమాయించారు. అయితే నల్లరంగు మాత్రం పూసుకోరాదని తాకీదు చేశారు. దీనిద్వారా తెలిసేదేమంటే గత్యంతరం లేదనుకుంటే తప్ప తలకుగాని లేక గడ్డానికిగాని నల్లరంగు పూసుకోరాదు.

**295 వ అధ్యాయం**

## ٢٩٥ - بَابُ النَّهْيِ عَنِ الْقَزَعِ وَهُوَ حَلْقُ بَعْضِ الرَّأْسِ دُونَ بَعْضٍ، وَإِبَاحَةِ حَلْقِهِ كُلِّهِ لِلرَّجُلِ دُونَ الْمَرْأَةِ

## 'ఖజా' చేయరాదు, ఖజా అంటే కొన్ని శిరోజాలను గొరిగించుకొని మిగతా వాటిని వదిలేయటం. పురుషుడు తల గొరిగించుకోవచ్చుగాని స్త్రీ మాత్రం గొరిగించుకోరాదు

١٦٤٠ - عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ عَنِ الْقَزَعِ. متفقٌ عليه.

1640. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఖజా (అనగా కొన్ని తల వెంట్రుకలు వదిలేసి మిగతా వాటిని గొరిగించు కోవటం) చేయటాన్ని వారించారు.

(బుఖారీ-ముస్లిం)

*(బుఖారీలోని లిబాస్ ప్రకరణం - ముస్లింలోని లిబాస్ ప్రకరణం)*

١٦٤١ - وَعَنْهُ قَالَ: رَأَى رَسُولُ اللهِ ﷺ صَبِيًّا قَدْ حُلِقَ بَعْضُ شَعْرِ رَأْسِهِ وَتُرِكَ بَعْضُهُ، فَنَهَاهُمْ عَنْ ذٰلِكَ وَقَالَ: «احْلِقُوهُ كُلَّهُ، أَوِ اتْرُكُوهُ كُلَّهُ». رواه أبو داود بإسنادٍ صحيحٍ عَلَى شَرْطِ الْبُخَارِي وَمُسْلِم.

1641. ఇబ్నె ఉమర్ (రజి) గారే చేసిన మరొక కథనం: దైవప్రవక్త (సల్లం) ఒక బాలుణ్ణి చూశారు. అతని తల వెంట్రుకల్లో కొన్నింటిని గొరిగించి మిగతా వాటిని గొరిగించకుండా వదిలే యటం జరిగింది. అది చూసి ఆయన అలా చేయవద్దని తాకీదు చేశారు. "గొరిగిస్తే పూర్తిగా గొరిగించండి. లేదంటే మొత్తం వదలిపెట్టండి" అని ఆయన పురమాయించారు. (అబూ దావూద్ ఈ హదీసును దృఢమైన ఆధా రాలతో, బుఖారీ-ముస్లిం షరతుల ననుసరించి వెలికితీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని తరజ్జుల్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

యూదులు, క్రైస్తవులలోని కొందరు బైరాగులు, సన్యాసులు, కొందరు ఆకతాయి దుర్మార్గులు కూడా ఈ విధంగా వెంట్రుకలు గొరిగించుకునేవారనీ, వారికి భిన్నంగా ఉండటం కోసమే దైవప్రవక్త (సల్లం) దీనిని వారించారనే మాట ప్రచారంలో ఉంది. కనుక ఆ విధంగా సగం తల గొరిగించుకోవటం ధర్మసమ్మతం కాదు. ఒకవేళ ఏదయినా వ్యాధి లేక మరే ఇతర కారణం చేతనయినా అలా చేస్తే అందులో తప్పులేదు. మొత్తానికి అర్థమయ్యేదేమిటంటే గొరిగించుకుంటే పూర్తి తల గొరిగించుకోవాలి లేదా పూర్తి తలను మామూలుగానే ఉంచుకోవాలి.

١٦٤٢ ـ وَعَنْ عَبْدِاللهِ بْنِ جَعْفَرٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ النَّبِيَّ ﷺ أَمْهَلَ آلَ جَعْفَرٍ رَضِيَ اللهُ عَنْهُ ثَلَاثاً، ثُمَّ أَتَاهُمْ فَقَالَ: «لَا تَبْكُوا عَلَى أَخِي بَعْدَ الْيَوْمِ». ثُمَّ قَالَ: «ادْعُوا لِي بَنِي أَخِي» فَجِيءَ بِنَا كَأَنَّا أَفْرُخٌ فَقَالَ: «ادْعُوا لِيَ الْحَلَّاقَ» فَأَمَرَهُ، فَحَلَقَ رُؤُوسَنَا. رواهُ أبو داود بإسنادٍ صحيحٍ على شَرْطِ الْبُخَارِيِّ وَمُسْلِمٍ.

1642. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జాఫర్ (రజి) కథనం: (మా నాన్న జాఫర్ (రజి) మరణించినప్పుడు) ఆయనింటివారు ఏడుస్తుంటే దైవప్రవక్త (సల్లం) మూడ్రోజుల వరకు వారిని ఏమీ అనకుండా వదిలేశారు. ఆ తర్వాత వారి దగ్గరకు వచ్చి, "ఈ రోజు తర్వాత నా తమ్ముడి మీద ఎవరూ ఏడ్వకూడదు" అని అన్నారు. తర్వాత "నా తమ్ముని కుమారుల్ని నా దగ్గరకు తీసుకురండి" అని ఆదేశించారు. మమ్మల్ని ఆయన దగ్గరికి తీసుకువెళ్ళటం జరిగింది. అప్పుడు మేము పసిపిల్లలం. ఆయన మంగలిని పిలవమని పురమాయించారు. ఆయన ఆదేశం మేరకు అతను మా తలలు గొరిగాడు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో బుఖారీ, ముస్లిం షరతులననుసరించి వెలికి తీశారు).

*(సుననె అబూదావూద్‌లోని తరజ్జుల్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

జాఫర్(రజి) దైవప్రవక్త (సల్లం) గారి బాబాయి కుమారుడు. ఈయన మౌతా యుద్ధంలో అమరగతులయ్యారు. ధర్మయుద్ధంలో అమరగతినొందటం ఎంతో గొప్ప పుణ్యకార్యం. దాని

వల్ల ఆ అమర వీరునికి దైవ సన్నిధిలో ఎంతో ఉన్నతమైన గౌరవ సత్కారాలు లభిస్తాయి. అయితే ఒక వ్యక్తి మరణం వల్ల అతని ఇంటివారికి బాధ కలగటం కూడా సహజమే. అందుకే దైవప్రవక్త(స) మరణించిన వ్యక్తి యొక్క ఇంటివారికి మూడు రోజులపాటు సంతాపం పాటిం చేందుకు అనుమతినిచ్చారు. ఇక్కడ మూడు రోజులవరకు సంతాపం అనుమతించబడిందంటే, ఆ మూడు రోజులపాటు ఏకబిగిన ఏడుస్తూ కూర్చోవటం, పెడబొబ్బలు పెట్టటం, గుండెలు బాదుకోవటం, బట్టలు చింపుకోవటం చేయవచ్చని భావంకాదు. ఇలా చేయటం ముమ్మాటికీ నిషిద్ధం. అసలు దీని భావం ఏమిటంటే మరణించిన వ్యక్తి తాలూకు బంధుమిత్రులకు మృతుని గురించి మాట్లాడినప్పుడు సహజంగానే కళ్లవెంబడి అశ్రుధారలు ప్రవహిస్తాయి. ఎంత బలవంతంగా ఆపుకున్నప్పటికీ లోపలి నుంచి దు:ఖం తన్నుకు వస్తుంది. ఇది చాలా సహజమైన విషయం. ఇలాంటి దు:ఖం మూడు రోజుల తర్వాత వ్యక్తమయినా షరీఅత్ దాన్ని తప్పుపట్టదు. దాన్ని నిషిద్ధ విషయం(హరామ్)గా పరిగణించదు. వాస్తవానికి మనిషి భావోద్రేకాలను అదుపులో పెట్టటానికే ఈ విధమైన షరతుపెట్టబడింది. చివరగా పేర్కొనదగిన ముఖ్య విషయం ఏమిటంటే తలగొరిగించుకోవటం, ముఖ్యంగా చిన్నపిల్లల తలలు గొరిగించటం ధర్మసమ్మతమేనన్న విషయాన్ని విశదీకరించటానికి ఈ హదీసును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటం జరిగింది.

١٦٤٣ - وَعَنْ عَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ أَنْ تَحْلِقَ الْمَرْأَةُ رَأْسَهَا. رواهُ النَّسائي.

1643. హజ్రత్ అలీ (రజి) కథనం: స్త్రీ తన తల గొరిగించుకోవటాన్ని దైవ ప్రవక్త (సల్లం) వారించారు. (నసాయి)

*(సుననె నసాయిలోని జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు తిర్మిజీ గ్రంథంలో కూడా ఉంది. షైఖ్ అల్‌బానీ (రహ్మాలై) గారు దీనిని బలహీనమైన (జయీఫ్) హదీసుగా పేర్కొన్నారు. వివరాల కోసం అల్ అహాదీసుజ్జయీఫా గ్రంథం రెండవ సంపుటి 124వ పుట చూడండి. ఏమయినప్పటికీ పురుష పోలికలకు దూరంగా ఉండటం కోసం స్త్రీ తన తల గొరిగించుకోరాదనే చెప్పాలి. అయితే ఏదయినా చికిత్స నిమిత్తం లేక మరేదయినా అత్యవసర పనికోసం స్త్రీ తల గొరిగించుకోవలసివస్తే దానికి అనుమతి ఉంది.

## 296 వ అధ్యాయం

# ٢٩٦ - بَابُ تَحْرِيمِ وَصْلِ الشَّعْرِ وَالْوَشْمِ وَالْوَشْرِ وَهُوَ تَحْدِيدُ الأَسْنَانِ

# సవరాలు పెట్టుకోవటం, పచ్చబొట్లు పొడిపించు కోవటం, పళ్ళు సన్నగా చేసుకోవటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالَى: ﴿إِن يَدْعُونَ مِن دُونِهِۦٓ إِلَّآ إِنَٰثًا وَإِن يَدْعُونَ إِلَّا شَيْطَٰنًا مَّرِيدًا ۝ لَّعَنَهُ ٱللَّهُ وَقَالَ لَأَتَّخِذَنَّ مِنْ عِبَادِكَ نَصِيبًا مَّفْرُوضًا ۝ وَلَأُضِلَّنَّهُمْ وَلَأُمَنِّيَنَّهُمْ وَلَءَامُرَنَّهُمْ فَلَيُبَتِّكُنَّ ءَاذَانَ ٱلْأَنْعَٰمِ وَلَءَامُرَنَّهُمْ فَلَيُغَيِّرُنَّ خَلْقَ ٱللَّهِ﴾ الآية [النساء: ١١٧-١١٩].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

వారు అల్లాహ్‌ను వదలి స్త్రీ దేవతలను ఆరాధ్యులుగా చేసుకుంటారు. అల్లాహ్ శాపానికి గురియైన తిరుగుబాటుదారు షైతాన్‌ను తమ ఆరాధ్యుడుగా చేసుకుంటారు. (వారు విధేయత చూపే ఆ షైతాను) అల్లాహ్‌తో ఇలా అన్నాడు: "నేను నీ దాసుల నుండి ఒక నిర్ణీతమైన భాగాన్ని నిశ్చయంగా తీసుకుంటాను. నేను వారిని మార్గం తప్పిస్తాను. వారిలో లేనిపోని ఆశలు కల్పిస్తాను, నేను వారిని ఆజ్ఞాపిస్తాను. వారు నా ఆజ్ఞానుసారం జంతువుల చెవులు చీలుస్తారు. నేను వారిని ఆదేశిస్తాను, వారు నా ఆదేశం ప్రకారం అల్లాహ్ సృష్టిలో మార్పులు చేస్తారు." *(అన్‌నిసా: 117-119)*

### వివరణ

మక్కానగర బహుదైవారాధకులు పూజించిన విగ్రహాలకు స్త్రీల పేర్లుండేవి. అంటే వారు స్త్రీ దేవీదేవతలను పూజించేవారన్నమాట. వారు దైవదూతలను అల్లాహ్ కుమార్తెలుగా భావించి వారిని పూజిస్తుండేవారు. వారు పూజించిన ఉజ్జా, అసాఫ్, నాయిలా మొదలగునవి కూడా స్త్రీ దేవతల పేర్లే.

పై ఆయతుల్లో విగ్రహారాధనను షైతాన్ ఆరాధనగా పేర్కొనటం జరిగింది. వీటన్నిటికీ ప్రధాన కారణం షైతాన్ ప్రేరణే గనక ఆ విధంగా చెప్పబడింది. తర్వాతి వాక్యాల్లో షైతాన్ దుష్ప్రేరేపణల మూలంగా ప్రజలు ఇంకా ఎలాంటి చెడుపోకడలకు పాల్పడతారో వివరించటం జరిగింది.

١٦٤٤ ـ وَعَنْ أَسْمَاءَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ امْرَأَةً سَأَلَتِ النَّبِيَّ ﷺ فَقَالَتْ: يَا رَسُولَ اللهِ! إِنَّ ابْنَتِي أَصَابَتْهَا الْحَصْبَةُ، فَتَمَرَّقَ شَعْرُها، وَإِنِّي زَوَّجْتُهَا، أَفَأَصِلُ فِيهِ؟ فَقَالَ: «لَعَنَ اللهُ الْوَاصِلَةَ وَالمَوْصُولَةَ» متفقٌ عليه. وفي روايةٍ: «الْوَاصِلَةَ، وَالمُسْتَوْصِلَةَ». قَوْلُهَا:

1644. హజ్రత్ అస్మా (రజి.అన్హా) కథనం: ఒక స్త్రీ దైవప్రవక్త (సల్లం) ను అడిగింది, "దైవప్రవక్తా! నా కూతురికి చర్మవ్యాధి సోకింది. దాని మూలంగా ఆమె (తల) వెంట్రుకలు రాలి పోయాయి. నేనామెకు పెళ్ళి చేశాను. మరి ఇప్పుడు నేను ఆమెకు సవరం పెట్టవచ్చా?" అని. అది విని ఆయన "సవరం పెట్టుకునేవారిని, ఆ సవరానికి ఎవరి వెంట్రుకలు వాడుతారో ఆ స్త్రీని దేవుడు శపించాడు" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)
వేరొక ఉల్లేఖనంలో "సవరం పెట్టుకునే వారిని, పెట్టించుకోవటానికి తాపత్రయపడే వారిని (దేవుడు శపించాడు)" అని ఉంది.

«فَتَمَرَّقَ» هو بالرَّاءِ، ومَعناه: انْتَشَرَ وَسَقَطَ. وَالْوَاصِلَةُ: الَّتِي تَصِلُ شَعْرَهَا، أو شَعْرَ غيرها بِشَعْرٍ آخرَ. «وَالمَوْصُولَةُ»: الَّتِي يُوصَلُ شَعْرُهَا. «وَالمُسْتَوْصِلَةُ»: الَّتِي تَسْأَلُ مَنْ يَفْعَلُ ذلكَ لَهَا. وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا نَحْوُهُ، متفقٌ عليهِ.

'తమర్రఖ' అంటే రాలిపోయాయి అని అర్థం. వాసిలహ్ అంటే తన వెంట్రుకలతో లేక ఇతరుల వెంట్రుకలతో సవరం చేసి మరో స్త్రీ తలకు పెట్టేది అని అర్థం. మౌసూలా అంటే సవరానికి ఉపయోగించబడిన శిరోజాల స్త్రీ. ముస్తౌసిలా అంటే సవరం పెట్టించుకోవటానికి తాపత్రయపడే స్త్రీ అని భావం. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) నుండి కూడా ఇలాంటి హదీస్లు ఒకటి నకలు చేయబడింది.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ముగ్గురు స్త్రీల గురించి చెప్పబడింది. సవరం పెట్టుకునే స్త్రీ , సవరం పెట్టుకోవాలని తాపత్రయపడే స్త్రీ, సవరం కోసం తన వెంట్రుకలు ఇచ్చే స్త్రీ. వీరు ముగ్గురూ దేవుని చేత శపించబడ్డారు. ఈ రోజుల్లో ఇలాంటి సవరాలు విగ్గుల రూపంలో వస్తున్నాయి. బ్యూటీ పార్లర్ల ద్వారా విగ్గులు ధరించటం, తదితర నీతిబాహ్యమైన పనులకు బాగా ప్రోత్సాహం లభిస్తోంది.

١٦٤٥ - وَعَنْ حُمَيْدِ بْنِ عَبْدِ الرَّحْمٰنِ أَنَّهُ سَمِعَ مُعَاوِيَةَ رَضِيَ اللهُ عَنْهُ عَامَ حَجَّ عَلَى المِنْبَرِ وَتَنَاوَلَ قُصَّةً مِنْ شَعْرٍ كَانَتْ فِي يَدِ حَرَسِيٍّ فَقَالَ: يَا أَهْلَ المَدِينَةِ! أَيْنَ عُلَمَاؤُكُمْ؟! سَمِعْتُ النَّبِيَّ ﷺ يَنْهَى عَنْ مِثْلِ هٰذِهِ. وَيَقُولُ: «إِنَّمَا هَلَكَتْ بَنُو إِسْرَائِيلَ حِينَ اتَّخَذَ هٰذِهِ نِسَاؤُهُمْ» متفقٌ عليه.

1645. హజ్రత్ హుమైద్ బిన్ అబ్దుర్రహ్మాన్ కథనం ప్రకారం తాను హజ్ చేసిన సంవత్సరం ముఆవియా (రజి) వేదికపై ఇలా చెబుతుండగా తను విన్నారు. ఆ సమయంలో ముఆవియా (రజి) కాపలాదారుని చేతిలో నుంచి వెంట్రుకల గుచ్ఛం తీసుకుని ఇలా అన్నారు: "ఓ మదీనా వాసులారా! (మిమ్మల్ని చెడుల నుంచి వారించే) మీ పండితులు ఏరి? దైవప్రవక్త (సల్లం) ఇలాంటి పనులు చేయవద్దని వారిస్తుండగా నేను విన్నాను. ఆయన ఇలా అనేవారు: "ఇస్రాయీల్ జాతి స్త్రీలు ఇలాంటి పనులు మొదలు పెట్టినప్పుడే ఆ జాతి నశించింది." *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం-సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్రత్ ముఆవియా (రజి) గారు తన పరిపాలనా కాలంలో స్త్రీలు పాల్పడుతున్న చెడు పోకడలను ఎత్తిచూపారు. ఆ చెడు పోకడలేవో ఇంతకుముందు హదీసుల్లో వివరించ బడ్డాయి. దీనిద్వారా బోధపడే విషయం ఏమిటంటే సమాజంలో చెడు వ్యాపిస్తున్నప్పుడు ఆ సమాజానికి అధికారులుగా వ్యవహరిస్తున్న వారు ఆ చెడుపోకడలను ఖండించాలి. జన

సామాన్యాన్ని వాటికి దూరంగా ఉంచేందుకు ప్రయత్నించాలి. అంతేకాదు, పండితులు, మేధావుల దృష్టిని అటువైపు మళ్ళింపజేసి ఆ చెడు పోకడలకు వ్యతిరేకంగా వారు గళం విప్పేలా చేయాలి. ఈ హదీసు ద్వారా బోధపడుతున్న రెండో విషయం ఏమిటంటే ప్రజల్లో చెడులు వ్యాపిస్తున్నప్పుడు వాటికి వ్యతిరేకంగా గళం విప్పకపోవటం దైవాగ్రహానికి, దైవశిక్షకు కారణభూతం కాగలదు. ఇక చివరగా మూడో విషయం ఏమిటంటే, ఈ హదీసు నేటి ముస్లింలను తీవ్రంగా హెచ్చరిస్తోంది. నేడు చాలామంది ముస్లిం స్త్రీలు పరదా నియమాలను బేఖాతరు చేస్తూ, బజారు స్త్రీల మాదిరిగా విపరీతంగా అలంకరణలు చేసుకొని, ఇండ్లనుంచి బయటికి వచ్చి నిర్లజ్జగా తమ అందచందాలను ప్రదర్శిస్తున్నారు. ఈ రుగ్మతలు నేడు చాలా ఎక్కువయిపోయాయి. ఇలా చేయటం సవరాలు పెట్టటం, పెట్టించుకోవటం కంటే మహాపాపం. ముస్లింలు ఈ సిగ్గుమాలిన పనులను చూస్తూ కూడా నిమ్మకు నీరెత్తినట్లు నోరు మెదపకుండా ఉంటున్నారు. ఉలమాలు సయితం తమ ఉపన్యాసాలలో ఈ విషయాలకు ప్రాముఖ్యత ఇవ్వటంలేదు. మన ఈ వైఖరి దైవశిక్షను ఆహ్వానిస్తున్నట్టుంది?! తస్మాత్ జాగ్రత్త!

١٦٤٦ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ لَعَنَ الْوَاصِلَةَ وَالْمُسْتَوْصِلَةَ، وَالْوَاشِمَةَ وَالْمُسْتَوْشِمَةَ. متفقٌ عليهِ.

1646. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: సవరాలు పెట్టుకునేవారిని, పెట్టించుకోవటానికి తాపత్రయపడే వారిని, పచ్చబొట్లు పొడిపించుకునే వారిని, పొడిపించుకోవటానికి తాపత్రయ పడేవారిని దైవప్రవక్త (సల్లం) శపించారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వాషిమా అంటే పచ్చబొట్టు పొడిచే స్త్రీ అని అర్థం. సూది లేక అలాంటిదే మరేదయినా వస్తువును శరీరంపై గుచ్చి రక్తం తీస్తారు. తర్వాత ఆ గాయంపై సుర్మా లేక నీలం రంగు పూస్తారు. దానివల్ల ఆ భాగం నల్లగానో లేక పచ్చగానో మారిపోతుంది. దీనినే 'వష్మ్' (పచ్చ పొడిపించుకోవటం) అంటారు. దైవప్రవక్త (స) కాలంలో అరబ్బు స్త్రీలు తమ అందచందాలను, సౌందర్యాన్ని పెంచుకునే నిమిత్తం ఇలాంటి పద్ధతులే అనుసరించేవారు. శిరోజాలు బాగా పొడవుగా కనిపించాలని ఇతరుల వెంట్రుకలతో తయారయిన సవరాలను తమ జడలలో దూర్చుకునేవారు. ఈ పోకడలన్నీ అల్లాహ్ సృష్టిలో మార్పు చేయటం క్రిందికి వస్తాయి. కాబట్టి ఇలాంటి పనులు చేసేవారు చేయించేవారు, అందరూ దైవాగ్రహానికి గురవుతారు.

ఈ రోజుల్లో కూడా చాలా మంది స్త్రీలు ఇటువంటివే కొన్ని ఫ్యాషన్‌లను అనుసరిస్తున్నారు. కనురెప్పల నుంచి వెంట్రుకలను పీకేసి, ఆ సందుల్లో రంగులు నింపటం తదితర

తదితర సౌందర్య సాధనాలెన్నింటినో ఉపయోగిస్తున్నారు. రానురాను ఫ్యాషన్‌లు మితిమీరి పోతున్నాయి. జనుల అభిరుచులు కూడా వెర్రితలలు వేస్తున్నాయి. కేవలం ఫ్యాషన్‌ల కోసమే వేలకు వేలు డబ్బు దుబారాగా ఖర్చు చేస్తున్నారు. ఇటువంటి అసహజ పోకడలన్నీ దైవాగ్రహానికి కారణభూతమవుతాయనటంలో సందేహం లేదు.

ముస్లిం స్త్రీలు ఇటువంటి అసహజ పోకడలన్నింటికీ దూరంగా ఉండాలి. ఈ ఫ్యాషన్ పోకడలు మన పరలోక జీవితాన్ని ఎలాగూ నాశనం చేస్తాయి. దానితోపాటు ఇహలోకంలో కూడా ఇవి మన ఆర్థిక వ్యవస్థను దారుణంగా దెబ్బతీస్తాయి. వీటివల్ల మన సామాజిక జీవితంలో అపసవ్యతలు చోటుచేసుకుంటాయి.

అలాగే గోళ్ళకు రంగుపూసుకునే ఫ్యాషన్ కూడా మన నాట అమల్లో ఉంది. గోళ్ళకు రంగుపూసుకోవటం వల్ల వుజూ నెరవేరదని చాలామంది పండితులు భావిస్తున్నారు. మరి ఈ ఫ్యాషన్ ఎంత నష్టదాయకమో ఆలోచించండి! ఈ ఫ్యాషన్ పోకడలన్నింటినీ మనం అవిశ్వాసుల్ని, పాశ్చాత్యులను గుడ్డిగా అనుసరిస్తూ చేస్తున్నవి. నిజానికి షరీఅత్ అనుమతించిన హద్దులో జీవితం గడపటంలోనే అందం ఉంది, ఆనందమూ ఉంది!

١٦٤٧ ـ وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: لَعَنَ اللهُ الْوَاشِمَاتِ وَالْمُسْتَوْشِمَاتِ وَالْمُتَنَمِّصَاتِ، وَالْمُتَفَلِّجَاتِ لِلْحُسْنِ، الْمُغَيِّرَاتِ خَلْقَ اللهِ! فَقَالَتْ لَهُ امْرَأَةٌ فِي ذٰلِكَ، فَقَالَ: وَمَا لِي لَا أَلْعَنُ مَنْ لَعَنَ رَسُولُ اللهِ ﷺ

1647. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి), "పచ్చబొట్లు పొడిపించుకునేవారిని పొడిపించుకోవటానికి తాపత్రయం పడేవారిని, కనురెప్పల వెంట్రుకలు తీయించుకునే స్త్రీలను, అందం కోసం దేవుడు సృష్టించిన స్థితిని మార్చుకుంటూ పళ్ళ మధ్య సందుచేసుకునే స్త్రీలను దేవుడు శపించాడు" అని అన్నారు.

అది విని ఒకామె ఈ విషయమై ఆయనతో వాదించింది. అందు కాయన, "దైవప్రవక్త (సల్లం) శపించిన వారిని నేను మాత్రం ఎందుకు శపించను? ఇలా చేయమని దైవగ్రంథం లోనే ఉంది కదా! దైవప్రవక్త ఆదేశించిన వాటిని తీసుకోండి. ఆయన వారించిన

وَهُوَ فِي كِتَابِ اللهِ؟! قَالَ اللهُ تَعَالَى: ﴿وَمَآ ءَاتَىٰكُمُ ٱلرَّسُولُ فَخُذُوهُ وَمَا نَهَىٰكُمْ عَنْهُ فَٱنتَهُوا۟﴾ [الحشر: ٧] متفقٌ عليه. «الْمُتَفَلِّجَةُ»: هِيَ الَّتِي تَبْرُدُ مِنْ أَسْنَانِهَا لِيَتَبَاعَدَ بَعْضُهَا مِنْ بَعْضٍ قَلِيلاً، وَتُحَسِّنُهَا وَهُوَ الْوَشْرُ، وَالنَّامِصَةُ: هِيَ الَّتِي تَأْخُذُ مِنْ شَعْرِ حَاجِبِ غَيْرِهَا، وَتُرَقِّقُهُ لِيَصِيرَ حَسَناً، وَالْمُتَنَمِّصَةُ: الَّتِي تَأْمُرُ مَنْ يَفْعَلُ بِهَا ذٰلِكَ.

వాటి జోలికి పోకండి అని దేవుడే అంటున్నాడు'' అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

“ముతఫల్లిజహ్'' అంటే పళ్ళు ఒకదాని కొకటి దూరంగా ఉండటం కోసం, అందంగా తయారవటం కోసం దంతాలకు ట్రీట్‌మెంట్ చేయించటం. వష్ర్ అంటే ఇదే (అందం కోసం పళ్ళను సన్నగా చేసుకోవటం). నామిసహ్ అంటే అందంగా తయారు చేయటం కోసం ఇతర స్త్రీల కనురెప్పల్ని పట్టుకొని వాటిని సన్నగా చేసే స్త్రీ. 'ముతనమ్మిసహ్' అంటే ఇతరులచేత ఆ పని చేయించుకునే స్త్రీ.

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సౌందర్యాన్ని పెంచుకునే ఉద్దేశ్యంతో దేవుడు సృష్టించిన శరీరాకృతుల్ని మార్చుకోవటం, వాటిలో హెచ్చుతగ్గులు చేసుకోవటం నిషిద్ధమని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఉదాహరణకు పచ్చబొట్లు పొడిపించుకోవటం, పళ్ళను సన్నగా చేసుకోవటం, పళ్ళ మధ్య సందు చేసుకోవటం, కనురెప్పల వెంట్రుకలు పీకేయటం మొదలగు పనులన్నీ ఈ కోవలోకే వస్తాయి. పోతే గోరింటాకు మూలంగా శరీరాకృతిలో ఎలాంటి మార్పు జరగదు. కనుక స్త్రీ గోరింటాకు పెట్టుకోవచ్చు. అయితే ఆ అలంకరణ పర పురుషుల ముందు బహిర్గతం కారాదు.

**297 వ అధ్యాయం**

## ٢٩٧ ـ بَابُ النَّهْيِ عَنْ نَتْفِ الشَّيْبِ مِنَ اللِّحْيَةِ وَالرَّأْسِ وَغَيْرِهِمَا، وَعَنْ نَتْفِ الأَمْرَدِ شَعْرَ لِحْيَتِهِ عِنْدَ أَوَّلِ طُلُوعِهِ

## గడ్డం, తల మొదలగు శరీరభాగాలలోని తెల్ల వెంట్రుకల్ని పీకేయరాదు. ప్రాజ్ఞుడైన యువకుడు గడ్డం మీద వచ్చే తొలి వెంట్రుకల్ని పీకేయరాదు

١٦٤٨ ـ عَنْ عَمْرِو بْنِ شُعَيْبٍ، عَنْ أَبِيهِ، عَنْ جَدِّهِ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لَا تَنْتِفُوا الشَّيْبَ؛ فَإِنَّهُ نُورُ الْمُسْلِمِ يَوْمَ الْقِيَامَةِ» حديث حسن، رَوَاهُ أَبُو دَاوُدَ، وَالتِّرْمِذِيُّ، وَالنَّسَائِيُّ بِأَسَانِيدَ حَسَنَةٍ. قَالَ التِّرْمِذِيُّ: هُوَ حَدِيثٌ حَسَنٌ.

1648. హ్రజత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి ఆయన తన తాతగారి నుండి చేసిన కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: తెల్లవెంట్రుకల్ని పీకివేయకండి. ఎందు కంటే ప్రళయదినాన అవి ముస్లింకు వెలుగునిస్తాయి.

(ఇది హసన్ కోవకు చెందిన హదీసు. అబూ దావూద్, తిర్మిజీ, నసాయీలు దీనిని ప్రామాణికమైన ఆధారాలతో వెలికి తీశారు. తిర్మిజీ దీనిని 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు).

*(సుననె అబూదావూద్‌లోని తరజ్జుల్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని అదబ్ అధ్యాయం - సుననె నసాయీలోని జీనత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

సాధారణంగా తెల్లవెంట్రుకలు వృద్ధాప్యానికి ఆనవాలు వంటివి. కనుక వాటిని పీకివేయ రాదు. వాటివల్ల హదీసులో పేర్కొనబడిన పరలోక ప్రయోజనంతోపాటు ప్రపంచంలో కూడా

ఎన్నో ప్రయోజనాలున్నాయి. తెల్లవెంట్రుకలు ముస్లిం వ్యక్తి గౌరవాన్ని, అతని హుందాతనాన్ని ఇనుమడింపజేస్తాయి.

١٦٤٩ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ عَمِلَ عَمَلاً لَيْسَ عَلَيْهِ أَمْرُنَا فَهُوَ رَدٌّ» رواهُ مسلم.

1649. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఎవరయినా మా ఆజ్ఞతో సంబంధంలేని పని చేస్తే ఆ పని త్రోసి పుచ్చదగినది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని అఖ్జియా ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మా ఆజ్ఞతో సంబంధం లేని పని అంటే షరీఅత్‌లో ఎలాంటి నిదర్శనం, ఆధారం లేని పని అని భావం. ధర్మంలో తలెత్తే కొత్తపోకడలు, షరీఅత్ విరుద్ధమైన పనులు త్రోసిపుచ్చదగినవని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఒక ముస్లిం పని ధర్మాన్ని అనుసరించటమేగాని ధర్మంలో కొత్తపుంతలు తొక్కటం కాదు.



**298 వ అధ్యాయం**

## ٢٩٨ - بَابُ كَرَاهِيَةِ الاِسْتِنْجَاءِ بِالْيَمِينِ وَمَسِّ الْفَرْجِ بِالْيَمِينِ مِنْ غَيْرِ عُذْرٍ

## కుడిచేత్తో మలమూత్ర శుద్ధి చేసుకోరాదు, అకారణంగా కుడిచేత్తో మర్మాంగాన్ని ముట్టుకోరాదు

١٦٥٠ - عَنْ أَبِي قَتَادَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِذَا بَالَ أَحَدُكُمْ، فَلَا يَأْخُذَنَّ ذَكَرَهُ بِيَمِينِهِ، وَلَا يَسْتَنْجِ بِيَمِينِهِ، وَلَا يَتَنَفَّسْ فِي الإِنَاءِ». متفق عليه. وفي البَابِ أَحَادِيثُ كَثِيرَةٌ صَحِيحَةٌ.

1650. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరయినా మూత్రం పోసేటప్పుడు తన మర్మాంగాన్ని కుడిచేత్తో పట్టుకోరాదు. కుడిచేత్తో మూత్రశుద్ధి కూడా చేసుకోరాదు. (ఇంకా పానీయం తాగేటప్పుడు) నీళ్ళపాత్రలో శ్వాస వదల రాదు.

*(బుఖారీ-ముస్లిం)*

ఈ అధ్యాయంలో ప్రామాణికమైన హదీసులు చాలా ఉన్నాయి.

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

తినటం త్రాగటం ఇంకా ఇతర మంచిపనుల కోసం కుడిచేతిని వాడమని ఆదేశించినట్లే కుడిచేతి గౌరవౌన్నత్యాల దృష్ట్యా మలమూత్ర శుద్ధి మొదలగు పనులకోసం ఎడమచేతిని వాడమని ఆదేశించటం జరిగింది. కాని కొందరు ముస్లింలు ఆంగ్లేయుల్ని అనుకరిస్తూ అన్నపానీయాల కోసం కూడా ఎడమ చేతినే ఉపయోగిస్తున్నారు. వారిలోని సహజత్వం వక్రీకరించిందని, దైవాజ్ఞల పట్ల వారి నిర్లక్ష్యం మితిమీరిపోతుందని చెప్పటానికి ఇంతకన్నా నిదర్శనం ఏం కావాలి?

**299వ అధ్యాయం**

# ٢٩٩ - بَابُ كَرَاهَةِ الْمَشْيِ فِي نَعْلٍ وَاحِدَةٍ، أَوْ خفٍّ وَاحِدٍ لِغَيْرِ عُذْرٍ، وَكَرَاهَةِ لُبْسِ النَّعْلِ وَالْخُفِّ قَائِماً لِغَيْرِ عُذْرٍ

# కారణమేదీ లేకుండా ఒకే బూటు లేక ఒకే మేజోడు తొడుక్కొని నడవటం, బూట్లు మరియు మేజోళ్లు నించొని తొడుక్కోవటం అవాంఛనీయం

١٦٥١ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَمْشِ أَحَدُكُمْ فِي نَعْلٍ وَاحِدَةٍ، لِيَنْعَلْهُمَا جَمِيعاً، أَوْ لِيَخْلَعْهُمَا جَمِيعاً». وفي رواية «أَوْ لِيُحْفِهِمَا جَمِيعاً» متفقٌ عَلَيْهِ.

1651. హ(జత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరూ కూడా ఒకే బూటుతో నడవరాదు. తొడుక్కుంటే రెండూ తొడుక్కోవాలి. వదిలితే రెండూ వదలాలి. (బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో "రెండు కాళ్లూ బూట్లు లేకుండా ఉంచాలి" అని ఉంది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒంటి కాలి చెప్పుతో నడవటం ఏ విధంగానూ సంస్కారం అనిపించుకోదు. ఆ విధంగా నడిచేవారిని చూసి జనం నవ్వుతారు. అదీగాక ఆ విధంగా నడవటమనేది మనిషి స్థాయికి, అతని హుందాతనానికి విరుద్ధమైన విషయం. ఇంకో విషయం ఏమిటంటే ఈ విధంగా నడవటం ఇబ్బందికరంగా కూడా ఉంటుంది. మనిషి ఒంటికాలికి చెప్పు తొడుక్కొని సరిగ్గా నడవలేడు. అందుకే తొడుక్కుంటే రెండు చెప్పులూ తొడుక్కొని నడవాలి. లేదా రెండు చెప్పులూ విడిచి నడవాలి. పోతే కాళ్ళకు చెప్పులు లేకుండా నడిచే విషయంలో షరీఅత్ పరమైన ఆంక్షలు ఏమీ లేకపోయినప్పటికీ సమాజం దృష్టిలో మాత్రం అది అవాంఛనీయం.

1652. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధి స్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) గారే తెలియ జేశారు: మీలో ఎవరి చెప్పు కొస అయినా తెగిపోతే వారు దాన్ని బాగు చేయించుకోనంతవరకూ రెండో చెప్పు తొడుక్కొని నడవరాదు. (ముస్లిం)

١٦٥٢ ـ وَعَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِذَا انْقَطَعَ شِسْعُ نَعْلِ أَحَدِكُمْ، فَلاَ يَمْشِ فِي الأُخْرَى حَتَّى يُصْلِحَهَا» رواهُ مسلم.

*(సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

1653. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) బూట్లు నించొని తొడుక్కోవటాన్ని వారించారు. (అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారంతో వెలికితీశారు.)

١٦٥٣ ـ وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ نَهَى أَنْ يَنْتَعِلَ الرَّجُلُ قَائِماً. رَوَاهُ أَبُو دَاوُدَ بِإِسْنَادٍ حَسَنٍ.

*(సుననె అబూదావూద్‌లోని లిబాస్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బూట్లు కూర్చొని తొడుక్కోవాలని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. కొంతమంది పండితులు పై హదీసులోని వారింపును 'తన్‌జీహ్'గా పేర్కొన్నారు. అంటే నించొని తొడుక్కోవటం ఏమంత తీవ్రమైన విషయం కాదుగాని కూర్చొని తొడుక్కోవటం మంచిదని దాని భావం. ఈ అధ్యాయంలో బూట్లు తొడుక్కునే సంస్కారాన్ని వివరించి ఇస్లామీయ ప్రబోధనలు జీవితపు అన్ని రంగాలనూ తమలో ఇమిడ్చుకొని ఉన్నాయనే విషయాన్ని స్పష్టం చేయటం జరిగింది.

300 వ అధ్యాయం

# ٣٠٠- بابُ النَّهْيِ عَنْ تَرْكِ النَّارِ فِي الْبَيْتِ عِنْدَ النَّوْمِ وَنَحْوِهِ سَوَاءٌ كَانَتْ فِي سِرَاجٍ أَوْ غَيْرِهِ

## నిద్రపోయే సమయంలో , ఇలాంటివే ఇతర సందర్భాల్లో ఇంట్లో ఉండే నిప్పుని - అది దీపమయినా లేక మరేదయినా- ఆర్పకుండా వదిలేయరాదు

١٦٥٤ - عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لَا تَتْرُكُوا النَّارَ فِي بُيُوتِكُمْ حِينَ تَنَامُونَ» متفقٌ عليه.

1654. హ॥జత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు నిద్రపోయేటప్పుడు మీ ఇండ్లలో మండుతున్న నిప్పుని ఆర్పకుండా వదిలేయకండి.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అష్రిబా ప్రకరణం)*

١٦٥٥ - وَعَنْ أَبِي مُوسَى الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: احْتَرَقَ بَيْتٌ بِالمَدِينَةِ عَلَى أَهْلِهِ مِنَ اللَّيْلِ، فَلَمَّا حُدِّثَ رَسُولُ اللهِ ﷺ بِشَأْنِهِمْ قَالَ: «إِنَّ هٰذِهِ النَّارَ عَدُوٌّ لَكُمْ، فَإِذَا نِمْتُمْ فَأَطْفِئُوهَا» مُتَّفَقٌ عَلَيْهِ.

1655. హ॥జత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం : ఒకసారి మదీనాలో ఒక ఇల్లు, ఆ ఇంటి సభ్యుల సమేతంగా కాలిపోయింది. జనం దాని గురించి దైవప్రవక్త (సల్లం)కు చెప్పారు. అది విని ఆయన "ఈ అగ్ని మీ శత్రువు. కనుక మీరు నిద్రపోయేటప్పుడు దాన్ని ఆర్పి నిద్రపోండి" అని చెప్పారు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అష్రిబా ప్రకరణం)*

١٦٥٦ ـ وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قَالَ: «غَطُّوا الإِنَاءَ، وَأَوْكِئُوا السِّقَاءَ، وَأَغْلِقُوا الْبَابَ، وَأَطْفِئُوا السِّرَاجَ، فَإِنَّ الشَّيْطَانَ لَا يَحُلُّ سِقَاءً، وَلَا يَفْتَحُ بَاباً، وَلَا يَكْشِفُ إِنَاءً. فَإِنْ لَمْ يَجِدْ أَحَدُكُمْ إِلَّا أَنْ يَعْرُضَ عَلَى إِنَائِهِ عُوداً، وَيَذْكُرَ اسْمَ اللهِ، فَلْيَفْعَلْ، فَإِنَّ الْفُوَيْسِقَةَ تُضْرِمُ عَلَى أَهْلِ الْبَيْتِ بَيْتَهُمْ» رواهُ مسلم.
«الْفُوَيْسِقَةُ»: الْفَأْرَةُ، وَ «تُضْرِمُ»: تُحْرِقُ.

1656. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: పాత్రల్ని మూసి ఉంచండి. కూజల మూతలు బిగించండి. తలుపులు మూసి ఉంచండి. దీపాలు ఆర్పేయండి. ఎందుకంటే షైతాను బిగించబడి ఉన్న కూజల్ని, మూయబడివున్న తలుపుల్ని, పాత్రల్ని తెరువలేడు. మీలో ఎవరికయినా మూయటానికి ఏమీ లభించకపోతే దానికి అడ్డంగా దేవుని పేరు తీసుకొని ఒక చెక్కముక్క అయినా ఉంచండి. ఎందుకంటే (కొన్ని సందర్భాల్లో) చిట్టెలుక కూడా ఇంటిని, ఇంటి వారి సమేతంగా కాల్చేయగలదు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని అష్రిబా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

రాత్రిపూట పడుకోబోయే ముందు దీపాలు, స్టవ్‌లు, హీటర్లు మొదలగు నిప్పుని రాజేసే వస్తువులన్నిటినీ ఆర్పి మరీ నిద్రపోవాలి. ఇటువంటి వస్తువులను గనక ఆర్పివేయకుండా నిద్రపోయినట్లయితే ప్రమాదాలు జరగటానికి చాలా ఎక్కువ అవకాశాలు ఉన్నాయి. అలాగే కుండలు, కూజాలు, గిన్నెలు మొదలగు పాత్రల్లో క్రిమి కీటకాలు దూరకుండా, మరేదయినా హానికర వస్తువు పడిపోకుండా వాటిపై ఎల్లప్పుడూ మూతలు వేసి ఉంచాలి. వస్తువులను ఎక్కడైనా పెట్టేటప్పుడు గాని, వాటిని ఉపయోగించేటప్పుడు గాని అల్లాహ్ పేరు స్మరించి మరీ పని చేయటం అన్ని విధాలా శ్రేయస్కరం.

**301 వ అధ్యాయం**

# ٣٠١ - بَابُ النَّهْيِ عَنِ التَّكَلُّفِ وَهُوَ فِعْلُ وَقَوْلُ مَا لا مَصْلَحَةَ فِيهِ بِمَشَقَّةٍ

## 'తకల్లుఫ్' చేయరాదు. తకల్లుఫ్ అంటే మాటల్లో, చేతల్లో అనవసరంగా ఇబ్బంది పడిపోవటం అని భావం

قَالَ اللهُ تَعَالَى: ﴿قُلْ مَا أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ وَمَا أَنَا مِنَ الْمُتَكَلِّفِينَ﴾ [ص: ٨٦].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: "ప్రవక్తా! వారితో ఇలా అను, "నేను ఈ ధర్మ ప్రచారానికి మీ నుండి ఎటువంటి ప్రతిఫలాన్నీ కోరను, నేను లేనిపోని వాటిని కల్పించేవాణ్ణి కాను." *(సాద్:86)*

١٦٥٧ - وَعَنْ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نُهِينَا عَنِ التَّكَلُّفِ. رَوَاهُ الْبُخَارِي.

1657. హజ్రత్ ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని అనవసరంగా ఇబ్బంది పడిపోవటాన్ని వారించారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఏతిసామ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

వేషభాషల్లో లేనిపోని డాబుని, బింకాన్ని ప్రదర్శించటం, అతిథి మర్యాదల కోసం అవసరానికి మించి డబ్బు ఖర్చుపెట్టటం, రకరకాల వంటకాలు తయారు చేయించటం మొదలగు పనులన్నీ కూడా తకల్లుఫ్ (అనవసరంగా ఇబ్బంది పడిపోవటం) క్రిందికే వస్తాయి. కనుక లేనిపోని ఆర్భాటం ప్రదర్శించటం, అనవసరంగా ఇబ్బందిపడిపోవటం తీవ్రంగా గర్హించదగినది. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే నేడు మన ముస్లింలు తకల్లుఫే తమ ఆనవాలు అయినట్లు విందుభోజనాల్లో దుబారాగా డబ్బు ఖర్చుపెడ్తున్నారు. దైవం అటువంటివారికి సద్బుద్ధిని ప్రసాదించుగాక!

١٦٥٨ - وَعَنْ مَسْرُوقٍ قَالَ: دَخَلْنَا عَلَى عَبْدِ اللهِ بْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ فَقَالَ: يَا أَيُّهَا النَّاسُ مَنْ عَلِمَ شَيْئاً فَلْيَقُلْ

1658. హజ్రత్ మస్రూఖ్ (తాబయీ) కథనం: మేము అబ్దుల్లాహ్ బిన్ మస్‌ఊద్ (రజి) దగ్గరికి వెళ్ళినప్పుడు

بِهِ، وَمَنْ لَمْ يَعْلَمْ، فَلْيَقُلْ: اللهُ أَعْلَمُ، فَإِنَّ مِنَ الْعِلْمِ أَنْ تَقُولَ لِمَا لَا تَعْلَمُ: اللهُ أَعْلَمُ. قَالَ اللهُ تَعَالَى لِنَبِيِّهِ ﷺ: ﴿قُلْ مَآ أَسْأَلُكُمْ عَلَيْهِ مِنْ أَجْرٍ وَمَآ أَنَا۠ مِنَ الْمُتَكَلِّفِينَ﴾ رواهُ البخاري.

ఆయన మాకు ఇలా ఉపదేశించారు: ప్రజలారా! ఎవరికయినా ఏదయినా విషయం తెలిస్తే వారు దాన్ని వివరించాలి. తెలియకపోతే 'అల్లాహు అలము' (వాస్తవం అల్లాహ్‌కే బాగా తెలుసు) అని అనాలి. ఎందుకంటే తెలియని విషయం గురించి 'అల్లాహు అలము' అని అనటమే విజ్ఞత. దేవుడు తన ప్రవక్తకు ఇలా పురమాయించాడు: "ప్రవక్తా! వారితో ఇలా అను, నేను ఈ ధర్మ ప్రచారానికి మీనుండి ఎటువంటి ప్రతిఫలాన్నీ కోరను, నేను అనవసరంగా ఇబ్బందిపడిపోయేవాణ్ణి కూడా కాను." *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తఫ్సీర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తమకు తెలియని విషయం గురించి ఊహలు అంచనాలతో మాట్లాడటం కూడా ఒక విధంగా అనవసరంగా ఇబ్బంది పడిపోవటమే కదా! అందుకని అవసరం లేని పక్షంలో అలాంటి ఊహాజనితమైన మాటలకు దూరంగా ఉండటం మంచిది. అలాగే పండితులు కూడా తమకు తెలియని విషయాల గురించి ప్రశ్నలు అడగటం జరిగినప్పుడు డొంక తిరుగుడు మాటలు చెప్పకుండా స్పష్టంగా తమకు తెలియదనే చెప్పాలి. తమకు తెలియదని చెప్పటం కూడా విజ్ఞతకు నిదర్శనమే. కనుక తమకు తెలియనిదే, తాము పరిశోధించనిదే దేని గురించీ ఫత్వాలు జారీ చేయకూడదు. స్వంత అభిప్రాయాలు వెలిబుచ్చకూడదు.

## 302 వ అధ్యాయం

## ٣٠٢ - بَابُ تَحْرِيمِ النِّيَاحَةِ عَلَى الْمَيِّتِ، وَلَطْمِ الْخَدِّ، وَشَقِّ الْجَيْبِ وَنَتْفِ الشَّعْرِ، وَحَلْقِهِ، وَالدُّعَاءِ بِالْوَيْلِ وَالثُّبُورِ

## మృతుని మీద రోదించటం, తల బాదుకోవటం, బట్టలు చించుకోవటం, జుత్తు పీక్కోవటం, తల గొరిగించుకోవటం, నాశనమైపోవాలని, ధ్వంసమైపోవాలని శాపనార్థాలు పెట్టటం నిషిద్ధం

١٦٥٩ - عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «المَيِّتُ يُعَذَّبُ فِي قَبْرِهِ بِمَا نِيحَ عَلَيْهِ». وَفِي رِوَايَةٍ: «مَا نِيحَ عَلَيْهِ» متفقٌ عَلَيْهِ.

1659. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మృతుని మీద ఏడ్చి పెడబొబ్బలు పెట్టినందుకు సమాధిలో అతన్ని శిక్షించటం జరుగుతుంది.

వేరొక ఉల్లేఖనంలో, "ఏడ్చి పెడ బొబ్బలు పెట్టినంత వరకూ (అతన్ని శిక్షించటం జరుగుతుంది)" అని ఉంది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మూలంలో 'నౌహా' అన్న పదం ఉంది. మృతుని దగ్గర కూర్చుని అతని సుగుణాలను పేర్కొంటూ అతని మరణం వల్ల తమకు కలగబోయే కష్టనష్టాలను ఏకరువు పెడ్తూ పెద్దగా అరుస్తూ రోదించటాన్ని తలబాదుకోవటాన్ని 'నౌహా' అంటారు. ఇలా చేయటం నిషిద్ధం. మృతుడే

స్వయంగా తను చనిపోక ముందు అలా చేయమని తన ఆప్తులకు ఆదేశించి ఉన్న పక్షంలో లేక తను జీవించి ఉన్నప్పుడు తను కూడా ఇతరుల మరణంపై ఆ రకంగా ఏడ్చి పెడబొబ్బలు పెట్టివున్న కారణంగా తన మరణంపై ఇతరులు సయితం తన విధానాన్ని అనుసరిస్తూ ఆ విధంగా ఏడ్చిపెడబొబ్బలు పెడ్తున్న పక్షంలో సమాధిలో అతనికి శిక్ష విధించబడుతుంది. అలా కాని పక్షంలో తన మరణంపై ఎవరు ఎంత ఏడ్చినా, ఎంతగా పెడబొబ్బలు పెట్టినా దానివల్ల సమాధి జీవితంలో తనకు కలిగే నష్టమేమీ లేదు. ఎందుకంటే ఒకరి పాపభారం మరొకరెవ్వరూ మోయకూడదన్నది ఖుర్‌ఆన్ సూత్రం. (బనీ ఇస్రాయీల్-15)

١٦٦٠ ـ وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَيْسَ مِنَّا مَنْ ضَرَبَ الخُدُودَ، وَشَقَّ الجُيُوبَ، وَدَعَا بِدَعْوَى الجَاهِلِيَّةِ» متفقٌ عليه.

1660. హజ్రత్ ఇబ్నె మస్‌ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: చెంపలు బాదుకున్నవాడు, బట్టలు చింపుకున్నవాడు, అజ్ఞానపు అరుపులు అరిచినవాడు మనవాడుకాడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

١٦٦١ ـ وَعَنْ أَبِي بُرْدَةَ قَالَ: وَجِعَ أَبُو مُوسَى، فَغُشِيَ عَلَيْهِ، وَرَأْسُهُ فِي حِجْرِ امْرَأَةٍ مِنْ أَهْلِهِ، فَأَقْبَلَتْ تَصِيحُ بِرَنَّةٍ فَلَمْ يَسْتَطِعْ أَنْ يَرُدَّ عَلَيْهَا شَيْئاً؛ فَلَمَّا أَفَاقَ، قَالَ: أَنَا بَرِيءٌ مِمَّنْ بَرِىءَ مِنْهُ رَسُولُ اللهِ ﷺ: إِنَّ رَسُولَ اللهِ ﷺ بَرِيءٌ مِنَ الصَّالِقَةِ، وَالحَالِقَةِ، وَالشَّاقَّةِ! متفقٌ عليه. «الصَّالِقَةُ»: الَّتِي تَرْفَعُ صَوْتَهَا بِالنِّيَاحَةِ والنَّدْبِ «والحَالِقَة»: الَّتِي تَحْلِقُ رَأْسَهَا عِنْدَ المُصِيبَةِ. «والشَّاقَّةُ»: الَّتِي تَشُقُّ ثَوْبَهَا.

1661. హజ్రత్ అబూ బుర్దా కథనం: (మా నాన్న) అబూ మూసా తీవ్రంగా వ్యాధికి గురయి స్పృహ తప్పిపోయారు. అప్పుడు ఆయన తల ఆయన భార్యల్లో ఒకామె ఒడిలో ఉంది. ఆమె పెద్దగా అరుస్తూ రోదించసాగింది. (స్పృహ లేకపోవటం మూలంగా) ఆయన ఆమెను వారించలేకపోయారు. తీరా స్పృహ వచ్చిన తరువాత ఆయన "దైవప్రవక్త (సల్లం) పరిత్యజించిన వాటిని నేనూ పరిత్యజిస్తున్నాను. బిగ్గరగా అరుస్తూ రోదించే, తల గొరిగించుకునే, ఉర ఉడుపుని

చింపుకునే స్త్రీలను ఆయన ఏవగించుకున్నారు" అని అన్నారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

١٦٦٢ - وَعَنِ الْمُغِيرَةِ بْنِ شُعْبَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ نِيحَ عَلَيْهِ، فَإِنَّهُ يُعَذَّبُ بِمَا نِيحَ عَلَيْهِ يَوْمَ الْقِيَامَةِ» متفقٌ عليه.

1662. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) తెలియజేశారు: ఏ మృతుని మీదయితే ఏడ్చి పెడబొబ్బలు పెట్టటం జరుగుతుందో ఆ మృతుడు దానిమూలంగా శిక్షకు గురౌతాడు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీ-సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తన మరణానంతరం తన మీద ఆ విధంగా ఏడ్వమని పురమాయించినవారికి, లేదా తన కుటుంబీకులకు ఆ విధంగా శిక్షణ నిచ్చినవారికే ఆ శిక్ష విధించబడుతుంది.

١٦٦٣ - وَعَنْ أُمِّ عَطِيَّةَ نُسَيْبَةَ - بِضَمِّ النُّونِ وَفَتْحِهَا - رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: أَخَذَ عَلَيْنَا رَسُولُ اللهِ ﷺ عِنْدَ الْبَيْعَةِ أَنْ لَا نَنُوحَ. متَّفقٌ عليه.

1663. హజ్రత్ ఉమ్మె అతియ్యా నుసైబా (రజి.అన్హా) కథనం: దైవ ప్రవక్త (సల్లం) మా నుంచి బైత్ తీసుకున్నప్పుడు మేము ఏడ్చిపెడబొబ్బలు పెట్టబోమని ఆయన మా చేత ప్రమాణం చేయించుకున్నారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

క్రొత్తగా ఇస్లాం స్వీకరించే వారి చేత దైవప్రవక్త (సల్లం) బైత్ (ప్రమాణం) తీసుకునేవారు. ఆ సందర్భంలో దైవప్రవక్త (సల్లం) మృతుల మీద రోదించకూడదని స్త్రీల చేత ప్రమాణం చేయించుకునేవారంటే అది ఎంత ఘోరమైన పాపమో అర్థమవుతోంది. సాధారణంగా స్త్రీలే

ఎక్కువగా ఈ వైపరీత్యానికి పాల్పడుతుంటారు. కనుక ఈ హదీసులో ప్రత్యేకించి స్త్రీల గురించే చెప్పటం జరిగింది. వాస్తవానికి స్త్రీలయినా పురుషులయినా అందరికీ ఇది నిషిద్ధమే.

١٦٦٤ ـ وَعَنِ النُّعْمَانِ بْنِ بَشِيرٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: أُغْمِيَ عَلَى عَبْدِ اللهِ بْنِ رَوَاحَةَ رَضِيَ اللهُ عَنْهُ. فَجَعَلَتْ أُخْتُهُ تَبْكِي، وَتَقُولُ: وَاجَبَلَاهُ، وَاكَذَا، وَاكَذَا: تُعَدِّدُ عَلَيْهِ. فَقَالَ حِينَ أَفَاقَ: مَا قُلْتِ شَيْئاً إِلَّا قِيلَ لِي: أَنْتَ كَذٰلِكَ؟! رَوَاهُ البُخَارِي.

1664. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) కథనం: అబ్దుల్లాహ్ బిన్ రవాహా (రజి) స్పృహ తప్పి పడిపోయినప్పుడు ఆయన సోదరి ఏడుస్తూ "అయ్యో! నా పర్వతమా, అయ్యో నా ఇదీ, అదీ" అంటూ ఆయన సుగుణాలు ఏకరువు పెట్టింది. తనకు స్పృహ వచ్చిన తరువాత ఆయన 'నువ్వన్న ప్రతి మాటకూ నన్ను నువ్వు నిజంగా అలాంటి వాడివేనా?' అని అడగటం జరిగింది అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని మగాజీ ప్రకరణం)*

١٦٦٥ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: اشْتَكَى سَعْدُ بْنُ عُبَادَةَ رَضِيَ اللهُ عَنْهُ شَكْوَى، فَأَتَاهُ رَسُولُ اللهِ ﷺ يَعُودُهُ مَعَ عَبْدِ الرَّحْمٰنِ بْنِ عَوْفٍ، وَسَعْدِ بْنِ أَبِي وَقَّاصٍ، وَعَبْدِ اللهِ بْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُمْ، فَلَمَّا دَخَلَ عَلَيْهِ، وَجَدَهُ فِي غَشْيَةٍ فَقَالَ: «أَقَضَى؟» قَالُوا: لَا يَا رَسُولَ اللهِ! فَبَكَى رَسُولُ اللهِ ﷺ. فَلَمَّا رَأَى الْقَوْمُ بُكَاءَ

1665. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: సాద్ బిన్ ఉబాదా (రజి) వ్యాధిగ్రస్తులయినప్పుడు ఆయన్ని పరామర్శించటానికి దైవప్రవక్త (సల్లం) అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్, సాద్ బిన్ అబూ వఖ్ఖాస్, అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి)లతో పాటు వెళ్ళారు. ఆయన వెళ్ళినప్పటికి సాద్ స్పృహలో లేరు. అది చూసి దైవప్రవక్త అక్కడున్న జనాన్ని "ఈయన చనిపోయారా?" అని అడిగారు. "లేదు, దైవప్రవక్తా!" అని చెప్పారు జనం. దైవప్రవక్త (సల్లం) అప్రయత్నంగానే విలపించారు. ఆయన్ని చూసి జనం కూడా విలపించారు. అప్పుడాయన అక్కడున్న వారిని

النَّبِيِّ ﷺ بَكَوْا، قَالَ: «أَلَا تَسْمَعُونَ؟ إِنَّ اللهَ لَا يُعَذِّبُ بِدَمْعِ الْعَيْنِ، وَلَا بِحُزْنِ الْقَلْبِ، وَلٰكِنْ يُعَذِّبُ بِهٰذَا» وَأَشَارَ إِلَى لِسَانِهِ «أَوْ يَرْحَمُ» متفقٌ عليه.

ఉద్దేశ్యించి, "వింటున్నారా? కంట తడిపెట్టటం మూలంగా, మనసులో బాధపడటం మూలంగా దేవుడు శిక్షించడు.

(నాలుక వైపు చూపిస్తూ) కాని దీని మూలంగా శిక్షిస్తాడు (లేదా కరుణిస్తాడు)" అని అన్నారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

1) దుఃఖం కలిగినప్పుడు కంటతడిపెట్టటం, మనసులో బాధపడటం తప్పుకాదు. ఎందుకంటే ఇవి మానవ సహజమైన విషయాలు. ఇలాంటి కష్ట సమయాల్లో నోటితో పెడబొబ్బలు పెట్టటం మాత్రం పాపం. కాని ఒకవేళ అదే నోటితో 'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్' అని పలికితే, విధిరాత తనకు ఆమోదయోగ్యమైనట్లు మాట్లాడితే దానికి పుణ్యం కూడా లభిస్తుంది.

2) వ్యాధిగ్రస్తుల్ని పరామర్శించటం అభిలషణీయం. అది ఒక ముస్లింకు మరో ముస్లిం మీద ఉండే హక్కు.

3) సందర్భాన్ని బట్టి ఇస్లామీయ ఆదేశాలు బోధిస్తూ ఉండటం అవసరం.

١٦٦٦ - وَعَنْ أَبِي مَالِكٍ الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «النَّائِحَةُ إِذَا لَمْ تَتُبْ قَبْلَ مَوْتِهَا تُقَامُ يَوْمَ الْقِيَامَةِ وَعَلَيْهَا سِرْبَالٌ مِنْ قَطِرَانٍ، وَدِرْعٌ مِنْ جَرَبٍ» رواه مسلم.

1666. హజ్రత్ అబూమాలిక్ అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పెడబొబ్బలు పెడ్తూ రోదించిన స్త్రీ మరణించే ముందు తౌబా చేసుకోకపోతే ప్రళయదినాన ఆమెను లేపటం జరిగినప్పుడు ఆమె (ఒంటి) మీద తారుచొక్కా, ముళ్ళకవచం ఉంటాయి.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పెడబొబ్బలు పెడ్తూ రోదించటం ఘోరమైన పాపమని ఈ హదీసు ద్వారా బోధపడు తోంది. దానికి పాల్పడినవారు తౌబా చేయకుండా చనిపోతే దేవుడు క్షమాభిక్ష పెట్టని పక్షంలో పరలోకంలో వారికి ఒక ప్రత్యేకమైన శిక్ష ఉంటుంది.

١٦٦٧ - وَعَنْ أَسِيدِ بْنِ أَبِي أَسِيدٍ التَّابِعِيِّ عَنِ امْرَأَةٍ مِنَ الْمُبَايِعَاتِ قَالَتْ: كَانَ فِيمَا أَخَذَ عَلَيْنَا رَسُولُ اللهِ ﷺ، فِي الْمَعْرُوفِ الَّذِي أَخَذَ عَلَيْنَا أَنْ لَا نَعْصِيَهُ فِيهِ: أَنْ لَا نَخْمِشَ وَجْهاً، وَلَا نَدْعُوَ وَيْلاً، وَلَا نَشُقَّ جَيْباً، وَأَنْ لَا نَنْشُرَ شَعْراً. رَوَاهُ أَبو دَاوُد بِإِسْنَادٍ حَسَنٍ.

1667. హజ్రత్ అసీద్ బిన్ అబూ అసీద్ తాబయీ దైవప్రవక్త (సల్లం)తో బైత్ చేసిన స్త్రీలలో ఒకామె నుండి చేసిన కథనం: ఏ మంచి పనులనయితే చేయాలని దైవప్రవక్త (సల్లం) మా చేత ప్రమాణం చేయించుకున్నారో వాటిలో, మేము అల్లాహ్ పట్ల అవిధేయతకు పాల్పడము అన్న మాట కూడా ఒకటి. అంటే మేము మొహం గిచ్చుకోము, నాశనం కావాలని శాప నార్థాలు పెట్టుకోము. ఉరఉడుపుని చింపుకోము, జుత్తు చిందరవొందరగా చేసుకోము అనే ప్రమాణం. (అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో వెలికి తీశారు).

*(సుననె అబూదావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

١٦٦٨ - وَعَنْ أَبِي مُوسَى رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَا مِنْ مَيِّتٍ يَمُوتُ، فَيَقُومُ بَاكِيهِمْ، فَيَقُولُ: وَاجَبَلَاهُ، وَاسَيِّدَاهُ، أَوَنَحْوَ ذٰلِكَ إِلَّا وُكِّلَ بِهِ مَلَكَانِ يَلْهَزَانِهِ: أَهٰكَذَا كُنْتَ؟!» رَوَاهُ التِّرْمِذِي وقَالَ: حَدِيثٌ حَسَنٌ.

1668. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి మరణించినప్పుడు అతని మీద ఏడ్చేవారు నించొని, "ఓరి నా కొండ, ఓ నాయకా" అనిగాని లేక అలాంటి మాటలేవయినా గాని పలికితే అతని శవం దగ్గర ఇద్దరు దైవదూతల్ని

«اللَّهْزُ» الدَّفْعُ بِجُمْعِ الْيَدِ فِي الصَّدْرِ.

నియమించటం జరుగుతుంది. వారు అతన్ని గుద్దుతూ "నువ్వు అలాంటి వాడివేనా?" అని అడుగుతుంటారు.

(తిర్మిజీ, హసన్)

'లహ్జ్' అంటే రొమ్ముమీద గుద్దటం.

(సుననె తిర్మిజీలోని జనాయెజ్ ప్రకరణం)

١٦٦٩ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «اثْنَتَانِ فِي النَّاسِ هُمَا بِهِمْ كُفْرٌ: الطَّعْنُ فِي النَّسَبِ، وَالنِّيَاحَةُ عَلَى المَيِّتِ» رواهُ مسلم.

1669. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రజల్లో రెండు పనులున్నాయి. అవి వారి పాలిట కుఫ్ర్ (దైవతిరస్కారం) వంటివి. వంశాన్ని దెప్పిపొడవటం, చనిపోయిన వారి మీద పెడబొబ్బలు పెడ్తూ ఏడ్వటం.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 1580వ హదీసు క్రింద కూడా వచ్చింది. ఇందులో పేర్కొనబడిన రెండు పనులు అజ్ఞానపు పనులు. ఇస్లాం వాటిని రూపుమాపింది. మళ్ళీ ఎవరైనా ఆ పనులకు పాల్పడితే అతను ధర్మతిరస్కారానికి పాల్పడుతున్నట్లే. దైవం మనల్ని రక్షించుగాక!



**303 వ అధ్యాయం**

## بَابُ النَّهْيِ عَنْ إِتْيَانِ الْكُهَّانِ وَالْمُنَجِّمِينَ وَالْعَرَّافِ، وَأَصْحَابِ الرَّمْلِ، وَالطَّوَارِقِ بِالْحَصَىٰ بالشَّعِيرِ وَنَحْوِ ذٰلِكَ

## సోదె చెప్పేవారి వద్దకు, జ్యోతిష్కుల వద్దకు.... పక్షుల్ని ఎగురవేసి శకునాలు చూసే వారి వద్దకు పోవటం పట్ల వారింపు

١٦٧٠ - عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: سَأَلَ رَسُولَ اللهِ ﷺ أُنَاسٌ عَنِ الْكُهَّانِ، فَقَالَ: «لَيْسُوا بِشَيْءٍ» فَقَالُوا: يَارَسُولَ اللهِ! إِنَّهُمْ يُحَدِّثُونَنَا أَحْيَاناً بِشَيْءٍ، فَيَكُونُ حَقًّا؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «تِلْكَ الْكَلِمَةُ مِنَ الْحَقِّ يَخْطَفُهَا الْجِنِّيُّ. فَيَقُرُّهَا فِي أُذُنِ وَلِيِّهِ، فَيَخْلِطُونَ مَعَهَا مِائَةَ كَذْبَةٍ» مُتَّفَقٌ عَلَيْهِ.

1670. హ(జత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: కొంతమంది దైవప్రవక్త (సల్లం)ను జోతిష్యుల దగ్గరికి వెళ్ళటం గురించి అడిగారు. అందు కాయన అదంతా భ్రమ అని చెప్పారు. వారు మళ్ళీ "కాని దైవప్రవక్తా! వారు చెప్పేది ఒక్కోసారి నిజంగా జరుగు తుంది?" అని సందేహపడ్డారు. అప్పు డాయన ఇలా వివరించారు: ఆ నిజమైన మాటను జిన్నులు (దైవ దూతల దగ్గర్నుంచి) ఎత్తుకెళ్ళిపోయి తమ స్నేహితుని చెవిలో వేస్తాయి. అతను దానికి వంద అబద్ధాలు కలిపి చెబుతాడు. (బుఖారీ-ముస్లిం)

وفي رِوَايَةٍ لِلْبُخَارِيِّ عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّهَا سَمِعَتْ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِنَّ الْمَلَائِكَةَ تَنْزِلُ فِي الْعَنَانِ - وهو السَّحَابُ - فَتَذْكُرُ الْأَمْرَ قُضِيَ فِي السَّمَاءِ، فَيَسْتَرِقُ الشَّيْطَانُ السَّمْعَ، فَيَسْمَعُهُ، فَيُوحِيهِ إِلَى الْكُهَّانِ، فَيَكْذِبُونَ مَعَهَا مِائَةَ كَذْبَةٍ مِنْ عِنْدِ أَنْفُسِهِمْ». قوله: «فَيَقُرُّهَا» هو بفتح الياءِ، وضم القاف والراءِ، أي: يُلْقِيهَا. «وَالْعَنَانُ» بفتح العين.

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో దైవ ప్రవక్త(సల్లం) ఈ విధంగా చెబు తుండగా తాను విన్నట్లు ఆయిషా (రజి.అన్హా) తెలియజేశారు: దైవ దూతలు(దైవాజ్ఞల్ని తీసుకొని) మేఘాల మీదికి దిగి ఆకాశంలో జరిగిన

నిర్ణయాల గురించి చెప్పుకుంటారు. షైతాన్ దొంగచాటుగా ఆ మాటలు విని జ్యోతిష్యులకు చేరవేస్తాడు. వారు వాటికి వంద అబద్ధాలు కల్పించి చెబుతారు.

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

జ్యోతిష్కులు తమ వద్ద భవిష్యత్తుకు సంబంధించిన జ్ఞానం ఉందని నమ్మబలుకుతుంటారు. అరబీలో ఇలాంటి వారిని 'కాహిన్' 'మునజ్జిమ్', 'అర్రాఫ్' అనే పేర్లతో పిలుస్తారు. వీరందరూ ఒకే కోవకు చెందినవాళ్లు. కాహిన్ అనేవాడు జిన్నుల నుంచి ఏదయినా విషయం తెలుసుకొని దాన్ని ప్రజల్లో ప్రచారం చేస్తాడు. అది నిజం కూడా కావచ్చు, అబద్ధం కూడా కావచ్చు. షైతాన్ లేక జిన్ను ఆ మాటను ఆకాశాల్లోకి వెళ్ళి విని వస్తాడన్న మాట. అయితే దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) ప్రభవనం తర్వాత జిన్నులకు, షైతానులకు ఆకాశంలోకి వెళ్ళి మాటలు వినేందుకు అవకాశం లేకుండా పోయింది. ప్రస్తుత పరిస్థితుల స్వరూప స్వభావాలను బట్టి ఊహలు, అంచనాల ఆధారంగా కూడా ఇటువంటి వారిలో కొంత మంది భవిష్యత్తు గురించి నిర్ణయాలు చేయటానికి సాహసిస్తుంటారు. వారి నిర్ణయాలు నిజం కావచ్చు లేదా అబద్ధాలుగా కూడా తేలవచ్చు. వర్తమాన పరిస్థితులను అధ్యయనం చేసి భవిష్యత్తు గురించి నిర్ణయాలు చేయటం తప్పు అని మేమనటంలేదు. పైగా వర్తమానాన్ని బాగా అధ్యయనం చేసి భవిష్యత్తు వైపు ఆచితూచి అడుగేయటం ప్రగతీ వికాసాలకు చిహ్నం. దీనికి భిన్నంగా తమ మాటలకు జ్యోతిష్యమనే పేరుపెట్టి తమకు భవిష్యత్తుకు సంబంధించిన విషయాలు తెలుసని డప్పు వాయించుకుంటూ తిరగటం మాత్రం ముమ్మాటికీ తప్పే! తన అనుయాయులు ఇటువంటి కల్లబొల్లి విషయాల వెంటపడి తమ విలువైన సమయాన్ని వృధా చేసుకోవటాన్ని ఇస్లాం ధర్మం ఎంత మాత్రం సహించదు.

1671. హజ్రత్ సఫియ్యా బిన్తె ఉబైద్ ఒకానొక దైవప్రవక్త (సల్లం) సతీమణి నుంచి చేసిన కథనం ప్రకారం ఆయన (స) ఈ విధంగా ప్రవచించారు: ఒక వ్యక్తి జోతిష్యుని దగ్గరికి వెళ్ళి అతన్ని ఏదయినా అడిగి అతను చెప్పేదాన్ని

١٦٧١ - وَعَنْ صَفِيَّةَ بِنْتِ عُبَيْدٍ، عَنْ بَعْضِ أَزْوَاجِ النَّبِيِّ ﷺ وَرَضِيَ اللهُ عَنْهَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ أَتَى عَرَّافاً فَسَأَلَهُ عَنْ شَيْءٍ، فَصَدَّقَهُ، لَمْ تُقْبَلْ لَهُ صَلَاةٌ

أَرْبَعِينَ يَوْماً» رَواهُ مُسْلِم.

నిజమని భావిస్తే నలభై రోజుల వరకు అతని నమాజ్ ఆమోదించబడదు.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

భవిష్యత్తులో జరగబోయే సంఘటనల గురించి తెలుసుకోవటానికి, జాతకం చెప్పించుకోవటానికి జ్యోతిష్యుల దగ్గరికి వెళ్ళటం, వారుచెప్పే మాటలు నిజమని నమ్మటం ఎంత పెద్ద పాపమో ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. దానివల్ల నలభై రోజుల నమాజులు వృథా అయిపోతాయని హెచ్చరించటం జరిగింది. కొందరు దొంగతనాలు జరిగినప్పుడు దొంగను కనుక్కోవటం, వివాహాదివేడుకల ముహూర్తాల నిర్ణయం కోసం, వ్యాపారలావాదేవీల అనుకూల ప్రతికూల పరిస్థితులు తెలుసుకోవటం కోసం జ్యోతిష్యుల దగ్గరికి వెళ్తారు. అలా వెళ్ళటం హరామ్ (నిషిద్ధం). అగోచర విషయాల జ్ఞానం దేవునికి తప్ప మరెవరికీ లేదన్న విషయం ప్రజలు తెలుసుకోవాలి.

١٦٧٢ ـ وعنْ قَبِيصَةَ بن المُخَارِق رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «الْعِيَافَةُ، وَالطِّيَرَةُ، والطَّرْقُ، مِنَ الجِبْتِ». رَوَاهُ أَبو دَاود بإسنادٍ حَسَنٍ، وَقَالَ: الطَّرْقُ، هُوَ الزَّجْرُ، أَيْ: زَجْرُ الطَّيْرِ، وَهُوَ أَنْ يَتَيَمَّنَ أَوْ يَتَشَاءَمَ بطَيَرَانِهِ، فَإِنْ طَارَ إِلَى جهَةِ الْيَمِينِ، تَيَمَّنَ، وَإِنْ طَارَ إِلى جهَةِ الْيَسَارِ تَشَاءَمَ. قَالَ أَبو داود: وَ«الْعِيَافَةُ»: الخَطُّ. قالَ الجَوْهَرِيُّ في «الصِّحَاح»: الجِبْتُ كَلِمَةٌ تَقَعُ عَلى الصَّنَمِ وَالكَاهِنِ وَالسَّاحِرِ وَنَحْوِ ذلكَ.

1672. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఖబీసా బిన్ ముఖారిఖ్ (రజి) తెలియజేశారు: ఇయాఫా, తియరా, తురుఖ్ (ఈ మూడూ) షైతాన్ పనులు.

అబూదావూద్ ఈ హదీసును ప్రామాణికమైన ఆధారాలతో వెలికితీసి ఇలా అన్నారు: తురుఖ్ అంటే పక్షిని ఎగిరించి అది కుడివైపు ఎగురుతుందో లేక ఎడమవైపు ఎగురుతుందోనని గమనించటం. కుడివైపు ఎగిరితే దాన్ని మంచి శకునంగా, ఎడమవైపు ఎగిరితే దుశ్శకునంగా భావించటం. ఇయాఫా అంటే గీతలు గీయటం. ఇమామ్ జౌహరీ గారు సిహాహ్ (అనే నిఘంటు

(గ్రంథం)లో జిబ్‌తున్ అనే పదం విగ్రహం, జోతిష్యుడు, ఇంద్రజాలికుడు ఇంకా ఇలాంటి ఇతర మనుషుల కొరకు కూడా ఉపయోగించబడు తుందని పేర్కొన్నారు.

*(సుననె అబూదావూద్‌లోని తిబ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఇయాఫా అంటే గీతలు గీయటమని పైన చెప్పటం జరిగింది. దీని పద్ధతి ఎలాగుంటుందంటే జోతిష్యుడు ఎవరైనా తన దగ్గరికి వచ్చి ఏదయినా అడిగితే అతను మెత్తటి నేల మీద లెక్కపెట్టకుండా తొందరతొందరగా గీతలు గీస్తూ పోతాడు. ఆ తర్వాత రెండు రెండు గీతల చొప్పున చెరిపేస్తాడు. ఆఖరికి రెండు గీతలు మిగిలితే పని పూర్తవుతుందని ఒక గీత మిగిలితే పనిపూర్తి కాదని చెబుతాడు. కొందరు దీనికి ఇంకా ఎన్నో రూపాలు చెబుతారు. ఏది ఏమయినప్పటికీ ఇది కూడా అజ్ఞానపు జోతిష్యంలో ఒకరకం. ఇతర జోతిష్య రకాలతోపాటు దీన్ని కూడా వారించటం జరిగింది. మనిషికి కలిగే లాభనష్టాల్లో, కష్టసుఖాల్లో జోతిష్య ప్రభావం ఏమాత్రం ఉండదు. ఇవన్నీ కొన్ని ఊహలు, అంచనాలు మాత్రమే. వాటిని పరిగణనలోకి తీసుకోవటం మూర్ఖత్వం. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే ముస్లింలలో విద్యాగంధం లేని అవివేకులు చాలా మంది ఈ రోజుల్లో కూడా ఇలాంటి పైశాచిక పోకడలకు పాల్పడుతున్నారు.

١٦٧٣ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنِ اقْتَبَسَ عِلْماً مِنَ النُّجومِ، اقْتَبَسَ شُعْبَةً مِنَ السِّحْرِ زَادَ مَا زَادَ» رَوَاهُ أَبو دَاود بإسنادٍ صحيحٍ.

1673. హ్రజత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నక్షత్ర విద్య నేర్చుకున్నవాడు చేతబడి విద్య నేర్చుకున్నట్లే. ఆ విధంగా అతను ఎంత నక్షత్ర విద్య నేర్చుకుంటే అంత చేతబడి విద్య నేర్చుకున్నట్లవుతుంది. (అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు)

*(సుననె అబూదావూద్‌లోని తిబ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో నక్షత్ర విద్యను చేతబడి విద్యలో భాగంగా పేర్కొనటం జరిగింది. ఇస్లాం

ప్రకారం చేతబడి విద్య నేర్చుకోవటం కుఫ్ర్ (దైవతిరస్కారపు) సరిహద్దులకు గొనిపోతుంది. దీనిద్వారా ఇస్లాం దృష్టిలో నక్షత్ర విద్య ఎంత ప్రమాదకరమైనదో, దానిని నేర్చుకోవటం ఎంత పెద్ద పాపమో అర్థమవుతోంది. నక్షత్ర లేక జోతిష్య శాస్త్ర ఆధారంగా గ్రహగమనాలను అనుసరించి భవిష్యత్తులో జరగబోయే సంఘటనలను గురించి చెప్పటం జరుగుతుంది. కాని ఖగోళశాస్త్ర ఆధారంగా సూర్యోదయం, సూర్యాస్తమయం, చంద్రోదయం మొదలగు విషయాల వేళలను నిర్ణయించటం జరుగుతుంది. కనుక జోతిష్య శాస్త్రం వేరు ఖగోళశాస్త్రం వేరు. ఖగోళశాస్త్రం అనుభవాల మీద, వాస్తవాల మీద ఆధారపడి ఉంటుంది. కనుక ఈ విద్య నేర్చుకోవటం ధర్మసమ్మతమే.

١٦٧٤ ـ وَعَنْ مُعَاوِيَةَ بْنِ الحَكَمِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ يَا رَسُولَ اللهِ! إِنِّي حَدِيثُ عَهْدٍ بِجاهِلِيَّةٍ، وَقَدْ جَاءَ اللهُ تَعَالى بالإِسْلامِ، وَإِنَّ مِنَّا رِجالًا يَأْتُونَ الكُهَّانَ؟ قَالَ: «فَلا تَأْتِهِمْ» قُلْتُ: وَمِنَّا رِجالٌ يَتَطَيَّرُونَ؟ قالَ: «ذَلِكَ شَيْءٌ يَجِدُونَهُ في صُدُورِهِمْ، فَلا يَصُدُّهُمْ» قُلْتُ: وَمِنَّا رِجالٌ يَخُطُّونَ؟ قَالَ: «كَانَ نَبيٌّ مِنَ الأَنْبِيَاءِ يَخُطُّ، فَمَنْ وَافَقَ خَطَّهُ، فَذَاكَ» رواه مسلم.

1674. హజ్రత్ ముఆవియా బిన్ హకమ్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగాను, "దైవప్రవక్తా! నేను నిన్నమొన్నటివరకూ అజ్ఞాన జీవితమే గడిపాను. ఇప్పుడే దేవుడు మా దగ్గరికి ఇస్లాం ధర్మం తీసుకు వచ్చాడు. (అజ్ఞాన కాలంలో) మాలో కొంతమంది జ్యోతిషుల్ని సంప్రదించే వారు. (అలా సంప్రతించటం ధర్మ సమ్మతమేనా)?" అని. అందుకాయన "నువ్వు జ్యోతిషుల దగ్గరికి వెళ్లకు" అని ఉపదేశించారు. "మరి మాలో కొందరు దుశ్శకునాలు కూడా చూస్తారు?" (సందేహపడుతూ) అడిగాను నేను. అందుకాయన "అవన్నీ మనసుకు నచ్చజెప్పుకునే మాటలే. నిజానికి అవేవీ ప్రజల పనుల్ని పాడు చేయవు" అని చెప్పారు. నేను మళ్లీ "మాలో కొందరు గీతలు కూడా గీస్తారు?" అని అడిగాను. దానికాయన "ప్రవక్తల్లో ఒకాయన గీతలు గీసేవారు. ఆయనలా గీతలు గీటయం సమం సజమే" అని చెప్పారు. (ముస్లిం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు హితబోధలో మధ్యేమార్గం అన్న అధ్యాయంలో కూడా వచ్చింది. ఇందులో పేర్కొనబడిన గీతలు గీసే పద్ధతి ఇంతకు ముందు వచ్చిన గీతలు గీసే పద్ధతి లాంటిది కాదు. ఇది ఒకానొక దైవ ప్రవక్తకు దేవుడు ప్రసాదించిన ఒక ప్రత్యేకమైన విద్య. దేవుడు అవతరింపజేసే వహీ ప్రకారం ఆయన గీతలు గీచి వాస్తవాలు తెలియజేసేవారు. అలా తెలియజేయటం సరైనదే, కాని ఇప్పుడు ఎవరి దగ్గరా దానికి సంబంధించిన జ్ఞానం లేదు. కనుక ఇప్పుడు దాన్ని ప్రయోగించటానికి కూడా వీలు లేకుండా పోయింది. ఆ విద్యకు సంబంధించిన విధివిధానాలు తెలియనిదే ఎవరూ దాన్ని ప్రయోగించలేరు. ఆ జ్ఞానం ఆ ప్రవక్తతోనే అంతరించి పోయింది. పోతే అసలు ఆ ప్రవక్త ఎవరు? అన్న విషయంలోనే భేదాభి ప్రాయముంది. కొందరు దానియాల్ ప్రవక్త అంటే, మరికొందరు ఇద్రీస్ ప్రవక్త అని అభిప్రాయపడుతున్నారు.

١٦٧٥ ـ وَعَنْ أَبِي مَسْعُودٍ الْبَدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ نَهَى عَنْ ثَمَنِ الْكَلْبِ، وَمَهْرِ الْبَغِيِّ، وَحُلْوَانِ الْكَاهِنِ. متفقٌ عليه.

1675. హజ్రత్ అబూ మస్ఊద్ బద్రీ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) కుక్క ధర నుంచి, వ్యభిచారం చేసే స్త్రీ సంపాదన నుంచి, జ్యోతిషుని మాధుర్యం నుంచి వారించారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ-సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కుక్క ధర నుంచి వారించబడిందంటే కుక్కను అమ్మటం, కొనటం నిషేధించబడిందని భావం. కుక్క నిలువెల్లా అశుద్ధ జంతువు కనుక అత్యధిక మంది పండితుల అభిప్రాయం ప్రకారం ఏ రకమైన కుక్కనయినా అమ్మటం కొనటం, దాని ద్వారా వచ్చే ధరను తీసుకోవటం నిషిద్ధం. వేటకుక్కలు, కాపాలాకాసే కుక్కలు మొదలగు అన్ని కుక్కల లావాదేవీలనూ వారు నిషిద్ధంగానే భావిస్తారు. కొందరు పండితులు మాత్రం ధర్మసమ్మతమైన కుక్కలు ఉదా: వేట కుక్కలు, కాపలా కాయటానికి ఉపయోగించే కుక్కలు, మొదలగువాటి లావాదేవీలు, వాటి ద్వారా వచ్చే సంపాదన ధర్మసమ్మతమేనని భావిస్తున్నారు. ఆధారాల దృష్ట్యా అత్యధికమంది పండితుల అభిప్రాయమే సరైనది. హదీసులో అసలు కుక్క ధరే ధర్మసమ్మతం కాదని చెప్పటం జరిగింది.

వ్యభిచారిణి పడుపువృత్తి ద్వారా సంపాదించే ధనమంతా అధర్మ సంపాదనగానే పరిగణించబడుతుంది. ఇది హరామ్ అనే విషయంలో పండితులందరూ ఏకీభవిస్తున్నారు. అలాగే మూర్ఖజనానికి జాతకం, జ్యోతిషం చెప్పి డబ్బు దండుకునే జ్యోతిషుల సంపాదన కూడా అధర్మ సంపాదనగానే పరిగణించబడుతుంది. వారి సంపాదన అధర్మం అయినప్పుడు ప్రజలు వారి సేవలకు డబ్బు ఇవ్వటం కూడా అధర్మమే అవుతుంది.

304 వ అధ్యాయం

## ٣٠٤ - بَابُ النَّهْيِ عَنِ التَّطَيُّرِ

## వేటినీ దుశ్శకునంగా భావించరాదు

فيه الأحاديثُ السَّابِقَةُ في الباب قَبْلَه.

ఇంతకుముందు అధ్యాయంలో వచ్చిన హదీసులు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తాయి. (మరిన్ని హదీసులు క్రింద పేర్కొనటం జరుగుతోంది.)

١٦٧٦ - وعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا عَدْوَى وَلَا طِيَـرَةَ وَيُعْجِبُنِي الْفَالُ» قَالُوا: وَمَا الْفَالُ؟ قَالَ: «كَلِمَةٌ طَيِّبَةٌ» متفقٌ عليه.

1676. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "అంటు, దుశ్శకునం అనేవి ఒట్టిమాటలే. అయితే శకునం అంటే నాకిష్టం."

అది విని అనుచరులు, "శకునం ఏమిటి?" అని అడిగారు. అందు కాయన, "మంచి మాట (వినటం, మంచి జరుగుతుందని ఆశించటం)" అని చెప్పారు.

*(సహీహ్ బుఖారీలోని తిబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

'అంటు' అంటే అంటు వ్యాధులన్న మాట. పై హదీసును మొట్టమొదటగా చదివేవారు తప్పకుండా కొంత ఆశ్చర్యానికి లోనవుతారు. ఎందుకంటే పై హదీసు అంటువ్యాధులనేవి అసలు ఉండవని అంటోంది. కాని మనం చూస్తున్నాం. ఈ రోజు కూడా ఎన్నో అంటువ్యాధులు మన చుట్టూ సమాజంలో ప్రబలి ఉన్నాయి. మరి ఈ హదీసు వాస్తవ విరుద్ధం కాదా! అని మనకు అనిపించవచ్చు. నిజానికి ఈ హదీసు భావం అది కాదు. ఎందుకంటే కొన్ని వ్యాధులు ఒకరి ద్వారా మరొకరికి సోకే అవకాశాలు ఉంటాయని తెలిపే సంఘటనలు, దృష్టాంతాలు హదీసుల్లో కూడా ఎన్నో ఉన్నాయి. (ఉదాహరణకు ఈ గ్రంథంలోనే 361వ అధ్యాయం క్రింది హదీసులు చూడండి).

ఈ హదీసు యొక్క అసలు ఉద్దేశం మనిషి విశ్వాసాన్ని, అతని నమ్మకాన్ని

క్రమబద్ధీకరించటం, మనిషికి దేవునిపై ఉండవలసిన అచంచల విశ్వాసం పట్టుసడలి అతని నమ్మకమంతా భౌతిక కారణాల మీద కేంద్రీకృతం కాకుండా చేయటం. ఒక వ్యక్తి ద్వారా మరో వ్యక్తికి అంటువ్యాధి సోకినప్పుడు దానికి పూర్తిగా మొదటి వ్యక్తే కారణమని అనుకోవటం సమంజసం కాదు. అలాగాకుండా ఏ విధంగా మొదటి వ్యక్తి దైవం తలచిన కారణంగా వ్యాధికి లోనయ్యాడో రెండో వ్యక్తి కూడా అలాగే దైవచిత్తం మూలంగానే వ్యాధికి గురయ్యాడని భావించటమే సరైనది. కావాలంటే చూడండి. ఒక్కోసారి అంటువ్యాధి రోగి చుట్టుప్రక్కల వాళ్ళెవరికీ సోకకుండా ఎక్కడో దూరాన ఉన్న వారికి సోకుతుంది. మరి ఈ విధంగా జరగటానికి బాహ్యాపరమైన కారణాలు మీరు ఎన్నయినా చెప్పుకోండి. అంతిమంగా ఆ కారణాలను సృష్టించినవాడు మాత్రం అల్లాహ్‌యే కదా! ఆ విశ్వాసం జారిపోకూడదన్నదే పై హదీసు ఉద్దేశం.

١٦٧٧ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا عَدْوَى وَلا طِيَرَةَ، وَإِنْ كَانَ الشُّؤْمُ فِي شَيْءٍ، فَفِي الدَّارِ، وَالمَرْأَةِ، وَالفَرَسِ» متفقٌ عليه.

1677. హజ్రత్ ఇబ్నె ఉమర్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అంటు, దుశ్శకునాలనేవి ఏమీ లేవు. అపశకున మనేది ఒకవేళ ఉంటే ఇంట్లో, స్త్రీలో, గుర్రంలో ఉండాలి. (బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తిబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వాస్తవానికి ఏ వస్తువూ అపశకునం కాదుగాని, తమలోని కొన్ని లక్షణాల మూలంగా కొన్ని వస్తువులు కొందరిపాలిట అపశకునంగా పరిణమించవచ్చు. ఉదా: ఇల్లు ఇరుకుగా ఉండటం, ఇరుగుపొరుగువారు మంచివారు కాకపోవటం మొదలగునవి. ఇలాంటి ఇంట్లో మనిషి ప్రశాంతంగా బ్రతకలేడు. ఒకవేళ భార్య గొడ్రాలో లేక దుర్భాషలాడేదో, నీతిచెడిందో అయినప్పుడు అలాంటి స్త్రీ భర్తపాలిట అపశకునంగా తయారవుతుంది. ఆమె వల్ల భర్తకు మనశ్శాంతికి బదులు బాధలు, కష్టాలు వస్తాయి. అలాగే గుర్రాన్ని దైవమార్గంలో జిహాద్ కోసం ఉపయోగించనప్పుడు లేక అది సరిగా పరుగెత్తలేకపోయినప్పుడు ఆ గుర్రం తన యజమానిపాలిట అపశకునంగా తయారవుతుంది.

١٦٧٨ ـ وَعَنْ بُرَيْدَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ كَانَ لا يَتَطَيَّرُ. رَوَاهُ أَبُو داود بِإِسْنَادٍ صَحِيحٍ.

1678. హజ్రత్ బురైదా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) దుశ్శకునాలు చూసే వారు కాదు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని తిబ్ ప్రకరణం)*

1679. హజ్రత్ ఉర్వా బిన్ ఆమిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) దగ్గర శకునం గురించిన ప్రస్తావన వచ్చింది. అప్పుడాయన ఇలా అన్నారు: శకునా లన్నిటిలో మంచి శకునం ఉత్తమ మైనది. అపశకునం చూసి ముస్లిం తన పని మానేయరాదు. మీలో ఎవరి కయినా తమకు నచ్చని విషయం ఎదురైతే ఈ విధంగా ప్రార్థించి (పని కొనసాగించాలి) “అల్లాహ్! మేలు చేసే వాడివి నీవే. కీడును తొలగించేవాడివి కూడా నీవే. చెడుల నుండి కాపాడు కోవాలన్నా మంచిపనులు చేయాలన్నా నీ శక్తితోనే సాధ్యమవుతుంది.”

(ఈ హదీసు ‘సహీహ్’ కోవకు చెంది నది. అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు.)

١٦٧٩ ـ وَعَنْ عُرْوَةَ بْنِ عَامِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: ذُكِرَتِ الطِّيَرَةُ عِنْدَ رَسُولِ اللهِ ﷺ فَقَالَ: «أَحْسَنُهَا الْفَأْلُ، وَلا تَرُدُّ مُسْلِماً فَإذا رَأى أَحَدُكُمْ مَا يَكْرَهُ، فَلْيَقُلِ: اللَّهُمَّ! لا يَأْتِي بِالحَسَنَاتِ إلَّا أَنْتَ، وَلَا يَدْفَعُ السَّيِّئَاتِ إلَّا أَنْتَ، وَلا حَوْلَ وَلا قُوَّةَ إلَّا بِكَ» حَدِيثٌ صَحِيحٌ رَوَاهُ أَبو دَاوُد بِإسنادٍ صَحِيحٍ.

*(సుననె అబూదావూద్‌లోని తిబ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ‘తియరహ్’ అనే పదానికి అసలు అర్థం మంచి లేక చెడు శకునాలు చూడటం. కాని ముస్లిం అయిన వ్యక్తి అన్నిటినీ మంచి శకునాలుగానే భావిస్తాడు. అతను ఏదయినా పని చేయాలని నిర్ణయించుకున్నప్పుడు అపశకునాలను పట్టించుకోడు. వాటి మూలంగా తన పనులు పాడుచేసుకోడు. పైగా మంచిజరిగినా చెడు జరిగినా దైవం తలచుకుంటేనే జరుగుతుందని నమ్ముతాడు. తనకు శుభం కలగాలని దైవాన్ని వేడుకుంటాడు.

2) సాధారణంగా ప్రజలు అపశకునంగా భావించే విషయాలు ఎదురయినప్పుడు లేక మనసులో దురాలోచనలు కలిగినప్పుడు పైన పేర్కొనబడిన దుఆ పఠించి పని కొనసాగించటం అభిలషణీయం.

## 305 వ అధ్యాయం

## ٣٠٥ ـ بَابُ تَحْرِيمِ تَصْوِيرِ الْحَيَوَانِ فِي بِسَاطٍ أَوْ حَجَرٍ أَوْ ثَوْبٍ أَوْ دِرْهَمٍ، أَوْ مِخَدَّةٍ، أَوْ دِينَارٍ، أَوْ وِسَادَةٍ وَغَيْرِ ذٰلِكَ، وَتَحْرِيمِ اتِّخَاذِ الصُّورَةِ فِي حَائِطٍ وَسِتْرٍ وَعِمَامَةٍ وَثَوْبٍ ونَحْوِهَا، وَالأَمْرِ بِإِتْلَافِ الصُّوَرِ

## పడకలు, రాళ్ళు, దుస్తులు, దిర్హమ్ దీనార్ల (నాణేలు) దిండ్లు మొదలగు వాటి మీద ప్రాణుల బొమ్మలు గీయరాదు. అదే విధంగా గోడలు, పైకప్పులు, పరదాలు, తలపాగాలు, బట్టలు మొదలగు వాటి మీద బొమ్మలు గీయటం నిషిద్ధం. అలాంటి బొమ్మల్ని చెరిపేయాలి

١٦٨٠ ـ عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ الَّذِينَ يَصْنَعُونَ هذهِ الصُّوَرَ يُعَذَّبُونَ يَوْمَ الْقِيَامَةِ، يُقَالُ لَهُمْ: أَحْيُوا مَا خَلَقْتُمْ» متفقٌ عليه.

1680. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఈ బొమ్మలు తయారు చేసేవారు ప్రళయదినాన శిక్షించబడతారు. మీరు సృష్టించిన వాటిలో ప్రాణం పోయండి అంటూ వారిని గద్దించటం జరుగుతుంది.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

చిత్రాలు గీయటం చాలా పెద్ద పాపమనీ, దానికి పరలోకంలో శిక్ష పడుతుందని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. కాని ప్రభుత్వం నిర్బంధం చేసిన ఫోటోలు ఉదా: గుర్తింపు కార్డులు,

పాస్‌పోర్టుల కోసం ఫోటోలు తీయటంలో తప్పులేదు. ఇది అనివార్య విషయం. ఇందులో మనిషి ఇష్టాయిష్టాల ప్రమేయం ఉండదు. కనుక ఇలాంటి అవసరాల కోసం ఫోటోలు తీయటం తీయించుకోవటం ధర్మసమ్మతమే. అయితే ఆ హద్దును దాటి ప్రవర్తించకూడదు.

١٦٨١ - وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَدِمَ رَسُولُ اللهِ ﷺ مِنْ سَفَرٍ وَقَدْ سَتَرْتُ سَهْوَةً لِي بِقِرَامٍ فِيهِ تَمَاثِيلُ فَلَمَّا رَآهُ رَسُولُ اللهِ ﷺ، تَلَوَّنَ وَجْهُهُ! وَقَالَ: «يَا عَائِشَةُ! أَشَدُّ النَّاسِ عَذَاباً عِنْدَ اللهِ يَوْمَ الْقِيَامَةِ الَّذِينَ يُضَاهُونَ بِخَلْقِ اللهِ!» قَالَتْ: فَقَطَعْنَاهُ، فَجَعَلْنَا مِنْهُ وِسَادَةً أَوْ وِسَادَتَيْنِ. متفقٌ عليه. «القِرَامُ» بكسرِ القافِ، هُوَ: السِّتْرُ. «وَالسَّهْوَةُ» بفتحِ السينِ المُهْمَلَةِ وَهِيَ: الصُّفَّةُ تَكُونُ بَيْنَ يَدَيِ الْبَيْتِ، وَقِيلَ: هِيَ الطَّاقُ النَّافِذُ فِي الحَائِطِ.

1681. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) ప్రయాణం నుంచి తిరిగొచ్చినప్పుడు నేను మా ఇంటి గుమ్మానికి ఒక తెర వ్రేలాడదీసి ఉంచాను. దాని మీద బొమ్మలు వేయబడి ఉన్నాయి. వాటిని చూడగానే దైవప్రవక్త (సల్లం) ముఖం రంగుమారిపోయింది. తర్వాత ఆయన నాతో, "ఆయిషా! దేవుని సృష్టిని పోలిన వాటిని సృష్టించేవారికి ప్రళయదినాన అందరికన్నా తీవ్రమైన శిక్ష విధించబడుతుంది" అని చెప్పారు.

ఆయిషా (రజి.అన్హా) ఇలా అంటున్నారు: అప్పుడు మేము ఆ తెరను చించి ఒకటి లేక రెండు దిండ్లు తయారు చేసుకున్నాం.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని లిబాస్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు 'షరీఅత్ ఆదేశాల పట్ల అపచారం జరిగితే ఆగ్రహం వ్యక్తం చేయాలి' అన్న అధ్యాయంలో కూడా వచ్చింది. బొమ్మలు గీయటం, వాటిని ఇంట్లో గోడలకు, గుమ్మాలకు వ్రేలాడదీయటం మహాపాపమని ఈ హదీసు ద్వారా కూడా బోధపడుతోంది. అయితే వాటిని చించి గౌరవపూర్వకం కాని వస్తువులుగా ఉపయోగించటం, నలుపబడే విధంగా ఉంచటం ధర్మసమ్మతమే. ఈ హదీసులో ఆయిషా (రజి.అన్హా) బొమ్మలున్న గుడ్డతో దిండ్లు తయారు చేసుకోవటాన్ని అందుకు నిదర్శనంగా తీసుకోవచ్చు.

١٦٨٢ - وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «كُلُّ مُصَوِّرٍ فِي النَّارِ يُجْعَلُ لَهُ بِكُلِّ صُورَةٍ صَوَّرَهَا نَفْسٌ فَيُعَذِّبُهُ فِي جَهَنَّمَ» قَالَ ابْنُ عَبَّاسٍ: فَإِنْ كُنْتَ لا بُدَّ فَاعِلاً، فَاصْنَعِ الشَّجَرَ وَمَا لا رُوحَ فِيهِ. متفقٌ عليه.

1682. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు: "ప్రతి చిత్రకారుడు నరకవాసియే. అతను గీసిన ప్రతి బొమ్మకు బదులు ఒక మనిషిని పుట్టించటం జరుగుతుంది. అతను నరకంలో ఆ చిత్రకారుణ్ణి శిక్షిస్తాడు."

ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా అంటున్నారు: "బొమ్మలు గీయటం తప్పదనుకుంటే నీవు చెట్లు, ప్రాణంలేని బొమ్మలు గీయి."

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని లావాదేవీల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చిత్రకారుడికి అతను గీసిన బొమ్మలను బట్టి శిక్ష విధించటం జరుగుతుంది. అతను ఎన్ని చిత్రాలు గీస్తే అంత ఎక్కువగా అతనికి శిక్షపడుతుంది. వివాహాది వేడుకలు, సభలు సమావేశాలు జరిగినప్పుడు వీడియోలు తీసేవారికి ఇందులో తీవ్రమయిన హెచ్చరిక ఉంది. వారు ఒకే సమయంలో వందల వేల, కొన్ని సందర్భాల్లో లక్షలాది మంది ఫోటోలు తీస్తారు. వారు ఈ వృత్తి నిషిద్ధమైనదని తెలిసి కూడా నిర్లక్ష్యంతో దీనికి పాల్పడుతుంటే వారిని తీవ్రంగా హెచ్చరించటం జరుగుతోంది. పరలోకంలో వారికి చాలా కఠినమైన శిక్ష ఉంటుంది. ఒకవేళ ఇస్లాం ఈ వృత్తిని అధర్మంగా పేర్కొన్నప్పటికీ వారు దీనిని ధర్మసమ్మతమైనదిగా భావిస్తున్నట్లయితే వారు ధర్మతిరస్కారులుగా పరిగణించబడతారు. అలాంటప్పుడు నరకమే వారి శాశ్వత నివాస స్థలం అవుతుంది. ఈ హెచ్చరిక చేత్తో బొమ్మలు గీసేవారు, శిల్పాలు చెక్కేవారికి మాత్రమే పరిమితమని అనుకుంటే పప్పులో కాలేసినట్లే. చిత్రం - అది చేత్తో గీసినదయినా, కెమెరా, వీడియోలతో తీసినదయినా అది చిత్రమే అవుతుంది. దాన్ని తయారు చేసినవాడు నరకాగ్నికి ఆహుతి అవుతాడు. అయితే చెట్లు, కాలువలు, కొండలు లాంటి ప్రాణం లేని ప్రకృతి దృశ్యాలను గీసుకోవటంలో తప్పులేదు.

1683. దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారు తెలియ జేశారు: ప్రపంచంలో చిత్రం గీసినవాణ్ణి ప్రళయదినాన అందులో ప్రాణం పోయమని వత్తిడి చేయటం జరుగు తుంది. కాని అతను అందులో ప్రాణం పోయలేడు. (బుఖారీ-ముస్లిం)

١٦٨٣ ـ وَعَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ صَوَّرَ صُورَةً فِي الدُّنْيَا، كُلِّفَ أَنْ يَنْفُخَ فِيهَا الرُّوحَ يَوْمَ الْقِيَامَةِ وَلَيْسَ بِنَافِخٍ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని 'లా తద్ఖులుల్ మలాయికతు బైతన్' అధ్యాయం)*

1684. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) తెలియజేశారు: ప్రళయదినాన అందరికంటే కఠినమైన శిక్ష అనుభవించేవారు చిత్రకారులయి ఉంటారు. (బుఖారీ-ముస్లిం)

١٦٨٤ ـ وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِنَّ أَشَدَّ النَّاسِ عَذَاباً يَوْمَ الْقِيَامَةِ الْمُصَوِّرُونَ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని లిబాస్ ప్రకరణం)*

1685. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: నేను సృష్టించినట్లు సృష్టించటానికి ప్రయత్నించేవారికంటే దుర్మార్గులు మరెవరుంటారు? వారికి (దమ్ముంటే), వారు ఒక అణువుని (లేక చీమను) సృష్టించాలి లేక ఒక(ధాన్యపు) గింజను సృష్టించాలి లేక ఒక బార్లీ (గింజ)ను సృష్టించాలి. (బుఖారీ-ముస్లిం)

١٦٨٥ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «قَالَ اللهُ تَعَالَى: وَمَنْ أَظْلَمُ مِمَّنْ ذَهَبَ يَخْلُقُ كَخَلْقِي! فَلْيَخْلُقُوا ذَرَّةً أَوْ لِيَخْلُقُوا حَبَّةً، أَوْ لِيَخْلُقُوا شَعِيرَةً» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని లిబాస్ ప్రకరణం)*

1686. హజ్రత్ అబూ తల్హా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "ఏ ఇంట్లో నయితే కుక్క లేక చిత్రాలుంటాయో ఆ ఇంట్లోకి దైవదూతలు ప్రవేశించరు." *(బుఖారీ-ముస్లిం)*

١٦٨٦ ـ وَعَنْ أَبي طَلْحَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا تَدْخُلُ المَلائِكَةُ بَيْتاً فِيهِ كَلْبٌ وَلا صُورَةٌ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని లిబాస్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ దైవదూతలు అంటే కారుణ్యదూతలు అని భావం. వారి రాకవల్ల ఇళ్ళల్లో శుభశ్రేయాలు కల్గుతాయి. ఇకపోతే పర్యవేక్షకులు, అంగరక్షకులైన దూతలు, వారు ఎల్లప్పుడూ మానవుణ్ణి వెన్నంటే ఉంటారు. మనిషిని వదలిపెట్టి ఎక్కడికీ వెళ్ళరు.

1687. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: (ఒకసారి) జిబ్రయీల్ దూత దైవప్రవక్త (సల్లం)కు వస్తానని వాగ్దానం చేసి ఆలస్యం చేశారు. దైవప్రవక్త (సల్లం) ఆయన కోసం (ఎదురు చూస్తూ) చాలా ఇబ్బంది పడ్డారు. ఆఖరికి తనే బయటికి వచ్చారు. అప్పుడాయనకు జిబ్రయీల్ కలిశారు. ఆలస్యం ఎందుకయిందని అడిగితే "కుక్కలు, చిత్రాలు ఉండే ఇండ్లల్లోకి మేము రాము" అని చెప్పారు జిబ్రయీల్ (అలైహి).

١٦٨٧ ـ وعنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: وَعَدَ رَسُولَ اللهِ ﷺ جِبْرِيلُ أَنْ يَأْتِيَهُ، فَرَاثَ عَلَيْهِ حَتَّى اشْتَدَّ عَلَى رَسُولِ اللهِ ﷺ، فَخَرَجَ فَلَقِيَهُ جِبْرِيلُ فَشَكَا إِلَيْهِ، فَقَالَ: «إِنَّا لا نَدْخُلُ بَيْتاً فِيهِ كَلْبٌ وَلا صُورَةٌ». رواه البخاري. «رَاثَ»: أَبْطَأَ، وهو بالثاءِ المثلثةِ.

*(సహీహ్ బుఖారీలోని లిబాస్ ప్రకరణం)*

1688. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: జిబ్రయీల్ దూత దైవప్రవక్త (సల్లం)కు ఫలానా సమయంలో వస్తానని వాగ్దానం చేశారు. ఆ సమయం వచ్చినా ఆయన రాలేదు.

١٦٨٨ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: وَاعَدَ رَسُولَ اللهِ ﷺ جِبْرِيلُ عَلَيْهِ السَّلامُ فِي سَاعَةٍ أَنْ يَأْتِيَهُ، فَجَاءَتْ تِلْكَ السَّاعَةُ وَلم يَأْتِهِ! قَالَتْ: وَكَانَ بِيَدِهِ عَصاً،

فَطَرَحَهَا مِنْ يَدِهِ وَهُوَ يَقُولُ: «مَا يُخْلِفُ اللهُ وَعْدَهُ وَلا رُسُلُهُ» ثُمَّ الْتَفَتَ، فَإِذَا جِرْوُ كَلْبٍ تَحْتَ سَرِيرِهِ. فَقَالَ: «مَتَى دَخَلَ هٰذا الْكَلْبُ؟» فَقُلْتُ: وَاللهِ! مَا دَرَيْتُ بِهِ، فَأَمَرَ بِهِ فَأُخْرِجَ، فَجَاءَهُ جِبْرِيلُ عَلَيْهِ السَّلامُ، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «وَعَدْتَنِي، فَجَلَسْتُ لَكَ وَلَمْ تَأْتِنِي» فَقَالَ مَنَعَنِي الْكَلْبُ الذي كَانَ فِي بَيْتِكَ، إِنَّا لا نَدْخُلُ بَيْتاً فِيهِ كَلْبٌ وَلا صُورَةٌ». رواه مسلم.

ఆయిషా (రజి.అన్హా) ఇలా అంటున్నారు: అప్పుడు దైవప్రవక్త (సల్లం) చేతిలో ఒక కర్ర ఉంది. ఆయన ఆ కర్రను విసరిపారేస్తూ, 'అల్లాహ్‌గాని ఆయన దూతలుగాని తమ వాగ్దానాన్ని భంగం చేయరు' అని అన్నారు. తర్వాత ఇంట్లో కలియజూస్తే తన మంచం క్రింద ఒక కుక్కపిల్ల కనిపించింది. ఆయన (ఆశ్చర్యంతో), "ఇదెప్పుడు లోపలికి జొరబడింది?" అని అడిగారు. "దైవసాక్షి! దీని గురించి నాకు తెలియదు" అని అన్నాను నేను. తర్వాత ఆయన ఆజ్ఞమేరకు ఆ కుక్క పిల్లను బయటికి గెంటేయటం జరిగింది. ఆ తర్వాత వెంటనే జిబ్రయీల్ (అలైహి) వచ్చేశారు. "మీరు వస్తానని నాకు వాగ్దానం చేశారు. నేను మీ కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. మీరు రాలేదు" అన్నారు దైవప్రవక్త (సల్లం). అందుకు జిబ్రయీల్ సమాధానమిస్తూ, "మీ ఇంట్లో ఉన్న కుక్క నన్ను రాకుండా చేసింది. కుక్కలు లేక చిత్రాలు ఉండే ఇళ్ళల్లోకి మేము రాము" అని చెప్పారు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని లిబాస్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసు ద్వారా ఇంతకుముందు వచ్చిన హదీసులోని సంఘటన వివరంగా తెలుస్తోంది. దైవప్రవక్త (సల్లం) ఇంట్లోకి ఒక కుక్క పిల్ల వచ్చి కూర్చుంది. అది ఇంటివాళ్ళెవరూ

చూడలేదు. దానివల్ల జిబ్రయీల్ దూత దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళలేకపోయారు. ఈ రోజుల్లో ఎంతోమంది ముస్లింలు పాశ్చాత్యుల్ని గుడ్డిగా అనుకరిస్తూ ఎంతో ఆసక్తితో ఇళ్ళల్లో కుక్కల్ని పెంచుతున్నారు. అలాగే చాలా ఇళ్ళల్లో చిత్రాలు కూడా ఉంటున్నాయి. కొందరు అలంకరణ కోసం షోకేసుల్లో వివిధ జంతువుల బొమ్మలు పెట్టుకుంటున్నారు. మరికొందరు తాము తమ భార్యాబిడ్డలతో తీయించుకున్న ఫోటోలను, మరికొందరు తమ తాతముత్తాతల ఫోటోలను, ఇంకొందరు "శుభప్రాప్తి" పేరిట మహాత్ముల, పుణ్యాత్ముల నగ్నచిత్రాలను గోడలకు తగిలించుకుంటున్నారు. నిజానికి చిత్రాలు గోడలకు తగిలించుకుంటే శుభం కాదు వచ్చేది, దరిద్రం పట్టుకుంటుంది.

1689. హజ్రత్ అబుల్ హయ్యాజ్ హయ్యాన్ బిన్ హుసైన్ (రజి) కథనం: అలీ బిన్ అబూ తాలిబ్ (రజి) నన్ను ఇలా పురమాయించారు: దైవప్రవక్త (సల్లం) నన్ను ఏ పని కోసం పంపించారో ఆ పనికోసం నేను నిన్ను పంపించవద్దా? (నువ్వెళ్ళి) ఒక్క చిత్రాన్నీ వదలిపెట్టకుండా అన్నిటినీ చెరిపివెయ్యి. ఎత్తుగా ఉన్న సమాధులన్నిటినీ సమానం చేసెయ్యి. (ముస్లిం)

١٦٨٩ - وَعَنْ أَبِي الْهَيَّاجِ حَيَّانَ بْنِ حُصَيْنٍ قَالَ: قَالَ لِي عَلِيُّ بْنُ أَبِي طَالِبٍ رَضِيَ اللهُ عَنْهُ: أَلا أَبْعَثُكَ عَلى مَا بَعَثَنِي عَلَيْهِ رَسُولُ اللهِ ﷺ؟ أَنْ لا تَدَعَ صُورَةً إِلَّا طَمَسْتَهَا، وَلا قَبْراً مُشْرِفاً إِلَّا سَوَّيْتَهُ. رَوَاهُ مُسْلِمٌ.

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చిత్రాలు, జానెడుకన్నా ఎత్తుగా ఉండే సమాధులు చెడు విషయాల క్రిందికి వస్తాయి. వాటిని నిరోధించటం, రూపుమాపటం ముస్లిం ప్రభుత్వాధినేతల బాధ్యత. అందుకే ఇస్లామీయ రాజ్యంలో చిత్రలేఖనానికి, సమాధుల్ని పటిష్టంగా నిర్మించటానికి, వాటిని ఒక జానెడుకంటే ఎత్తుగా నిర్మించటానికి అనుమతి ఉండదు.

సమానం చేయటమంటే నేలమట్టం చేయటమని కాదు అర్థం. షరీఅత్ ఆదేశం ప్రకారం ఒక జానెడు ఎత్తుకి సమానం చేయటమని దాని భావం.



## 306 వ అధ్యాయం

## ٣٠٦ - بَابُ تَحْرِيمِ اتِّخَاذِ الْكَلْبِ إلاَّ لِصَيْدٍ أَوْ مَاشِيَةٍ أَوْ زَرْعٍ

## వేటకోసం, పశువుల, పొలాల రక్షణ కోసం తప్ప ఇతర పనులకోసం కుక్కల్ని పెంచటం నిషిద్ధం

١٦٩٠ - عَن ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنِ اقْتَنَى كَلْباً إلا كَلْبَ صَيْدٍ أَوْ مَاشِيَةٍ فَإِنَّهُ يَنْقُصُ مِنْ أَجْرِهِ كُلَّ يَوْمٍ قِيرَاطَانِ» متفقٌ عليه. وفي رِوَايَةٍ: «قِيرَاطٌ».

1690. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) తెలియజేశారు: ఎవరయితే వేట లేక పశువుల రక్షణ కోసం తప్ప (ఇతర ఉద్దేశ్యంతో) కుక్కని పెంచుతారో వారి పుణ్యం ప్రతి రోజూ రెండు ఖీరాతులు తగ్గుతూ ఉంటుంది. (బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో 'ఒక ఖీరాతు తగ్గుతుంది' అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని జబాయెహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

١٦٩١ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ أَمْسَكَ كَلْباً، فَإِنَّهُ يَنْقُصُ كُلَّ يَوْمٍ مِنْ عَمَلِهِ قِيرَاطٌ إلَّا كَلْبَ حَرْثٍ أَوْ مَاشِيَةٍ» متفقٌ عليه. وفي رواية لمسلم: «مَنِ اقْتَنَى كَلْباً لَيْسَ بِكَلْبِ صَيْدٍ، وَلامَاشِيَةٍ، وَلا أَرْضٍ، فَإِنَّهُ يَنْقُصُ مِنْ أَجْرِهِ قِيرَاطَانِ كُلَّ يَوْمٍ».

1691. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే కుక్కను (పెంచే ఉద్దేశ్యంతో) కట్టేశారో వారి ఆచరణ (పుణ్యం) ప్రతిరోజూ ఒక ఖీరాతు తగ్గుతూ ఉంటుంది. అయితే పొలాల, పశువుల రక్షణ కోసం కట్టేస్తే ఆ నష్టం ఉండదు. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "ఎవరయినా వేట కోసం, పశువుల,

భూముల రక్షణ కోసం తప్ప (ఇతర ఉద్దేశ్యంతో) కుక్కను పెంచుతారో వారి పుణ్యం ప్రతిరోజూ రెండు ఖీరాతులు తగ్గుతూ ఉంటుంది" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని ముజారఆ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ముజారఆ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వేటకోసం, పశువుల, పొలాల, భూముల, ఇండ్ల కాపలా కోసం కుక్కలను పెంచుకో వచ్చు. అంతకుమించి ఇతర ఉద్దేశ్యాలతో కుక్కలను పెంచుకోవటానికి అనుమతిలేదు. ఎవరైనా వేరితర ఉద్దేశంతో కుక్కలను పెంచినట్లయితే వారి పుణ్యంలో నుంచి ప్రతి రోజూ ఒకటి లేక రెండు ఖీరాతుల (యూనిట్ల) పుణ్యం తగ్గుతూ ఉంటుంది.

హదీసులో 'ఒకటి లేక రెండు' అన్న సందేహాస్పద పదం ఎందుకు ప్రయోగించబడింది? అనే ప్రశ్న ఈ సందర్భంగా జనించటం సహజమే. దీని గురించి పండితులు ఏమని వివరిం చారంటే దైవప్రవక్త (సఅసం) మొదటగా ఒక ఖీరాతు తగ్గుతుందని చెప్పారు. ఆ తర్వాత దాన్ని పెంచి రెండు ఖీరాతులు తగ్గుతుందని వివరించారు. ఈ హెచ్చుతగ్గులు గ్రామం, పట్టణాన్ని బట్టి వర్తిస్తాయని మరికొంతమంది పండితులు అన్నారు. పట్టణవాసుల పుణ్యం రెండు ఖీరాతులు తగ్గుతుందనీ, పల్లెవాసుల పుణ్యం ఒక ఖీరాతు మాత్రమే తగ్గుతుందని, పట్నవాసులకన్నా పల్లెవాసులకు కుక్కలను పెంచుకోవాల్సిన అవసరం ఎక్కువగా ఉండటమే ఈ హెచ్చుతగ్గులకు కారణమని చెప్పారు. అంటే ఎవరి ఇండ్లల్లోనయితే అటువంటి కుక్కల మూలంగా అపరిశుభ్రత ఎక్కువగా ఉంటుందో అటువంటి వారి పుణ్యం రెండు ఖీరాతులూనూ, అపరిశుభ్రత తక్కువగా ఉండేవారి పుణ్యం ఒక ఖీరాతునూ తగ్గుతూ ఉంటుందన్న మాట.

అసలు ఇంతకీ 'ఖీరాతు' అంటే ఎంత? దీని గురించి కూడా పలు అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. హదీసుల్లో జనాజా నమాజు పుణ్యం గురించి చెప్పినప్పుడు కూడా ఈ పదం వాడబడింది. అక్కడ ఖీరాతు అంటే ఉహుద్ పర్వతమంత అని చెప్పబడింది. మరి ఈ ఖీరాతు పరిమాణం - పై హదీసులో పేర్కొనబడిన ఖీరాతు పరిమాణం రెండూ సమానమేనా? దీనికి కొంతమంది పండితులు 'అవును, ఆ రెండు పదాలూ ఒకే పరిమాణాన్ని సూచిస్తున్నాయి' అని సమాధానమిచ్చారు. కాగా మరి కొంతమంది పండితులు ఏమన్నారంటే - జనాజా నమాజు సందర్భంగా వచ్చిన ఖీరాతు ప్రస్తావన దైవానుగ్రహానికి సంబంధించినది. దానికి భిన్నంగా ఇక్కడ ఈ పదం శిక్షను, పర్యవసానాన్ని సూచించే సందర్భంలో ప్రయోగించబడింది. దైవానుగ్రహం ఇతర వస్తువులన్నింటి కంటే గొప్పది. కనుక రెండు చోట్లా ఒకే అర్థం తీసుకోవటం సమంజసం కాదు' అని చెప్పారు.

307 వ అధ్యాయం

## ٣٠٧ - بَابُ كَرَاهِيَةِ تَعْلِيقِ الْجَرَسِ فِي الْبَعِيرِ وَغَيْرِهِ مِنَ الدَّوَابِّ وَكَرَاهِيَةِ اسْتِصْحَابِ الْكَلْبِ وَالْجَرَسِ فِي السَّفَرِ

## ఒంటె తదితర జంతువుల మెడలకు గంటలు కట్టటం, ప్రయాణంలో కుక్కల్ని, గంటల్ని తోడు ఉంచుకోవటం అవాంఛనీయం

١٦٩٢ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَصْحَبُ الْمَلَائِكَةُ رُفْقَةً فِيهَا كَلْبٌ أَوْ جَرَسٌ» رواه مسلم.

1692. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కుక్కలు లేక గంటలతో ఉన్న ప్రయాణ బృందాల వెంట దైవదూతలు ఉండరు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు:**

వేట కుక్కలకు, ఇంకా పొలాల పశువుల రక్షణ కోసం ఉపయోగించే కుక్కలకు ఈ ఆజ్ఞ వర్తించదు. వీటిని తప్ప ఇతర కుక్కల్ని ప్రయాణంలో వెంట ఉంచుకోరాదు. పై హదీసులో కుక్కలంటే ఆ కుక్కలనే భావం. దైవదూతలంటే కారుణ్యం కురిపించే దూతలని భావం. పోతే మనిషి రక్షణ నిమిత్తం నియమించబడిన దైవదూతలు ఎల్లప్పుడూ అతని వెంటే ఉంటారు.

١٦٩٣ - وَعَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «الجَرَسُ مَزَامِيرُ الشَّيْطَانِ» رَوَاهُ مُسْلِمٌ.

1693. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: గంటలు (గజ్జెలు మొదలగు నవన్నీ) షైతాన్ బాజాబజంత్రీలు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'మజామీర్' అనేది 'మిజ్‌మార్'కు బహువచనం. సంగీత వాద్యానికి ఉపయోగించే వస్తువుని 'మిజ్‌మార్' అని అంటారు. డోలు, సన్నాయి, గిటారు, ఢమరుకం, మ్యూజిక్ ఇతర సంగీత వాయిద్యాలన్నీ మిజ్‌మార్ క్రిందికి వస్తాయి. ఇవన్నీ షైతాన్ వాద్యాలు. వీటి ద్వారా షైతాన్ మనుషుల్ని భ్రష్టుపట్టిస్తుంటాడు. ఈ రోజుల్లో ఈ షైతాన్ వాద్యాలు ఎంతగా మితిమీరి పోయాయంటే దానికి ఒక హద్దంటూ లేకపోయింది. అంతేకాదు, మనుషుల సహజత్వం కూడా ఎంతగా కలుషితమై పోయిందంటే వారు సంగీతాన్ని మనసులకు ఆహారంగా తలపోస్తున్నారు. అవును, షైతాన్‌కు దాసోహమన్న పైశాచిక ఆత్మలకు సంగీతమే ఆహారం అవుతుంది. ఎందుకంటే పెంటలో బతికేవాడికి ఆ పెంట ఎంత కమ్మగా మారిపోతుందంటే అది లేకుండా అతను బతకనయినా బతకలేడు.



## 308 వ అధ్యాయం

## ٣٠٨ - بَابُ كَرَاهَةِ رُكُوبِ الْجَلاَّلَةِ وَهِيَ الْبَعِيرُ أَوِ النَّاقَةُ الَّتِي تَأْكُلُ الْعَذِرَةَ، فَإِنْ أَكَلَتْ عَلَفاً طَاهِراً فَطَابَ لَحْمُهَا، زَالَتِ الْكَرَاهَةُ

## 'జల్లాలా' పశువు మీద స్వారీ చేయటం అవాంఛనీయం. అశుద్ధం తినే ఆడ లేక మగ ఒంటెను 'జల్లాలా' అని అంటారు. ఒకవేళ అది (పాతబుద్ధి మానేసి) పరిశుద్ధమైన గడ్డి తినటం మొదలెడితే, దాని మాంసం పరిశుద్ధమయిపోతే అప్పుడు అది అవాంఛనీయం కాదు

١٦٩٤ - عَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ عَنِ الجَلاَّلَةِ فِي الإِبِلِ أَنْ يُرْكَبَ عَلَيْهَا. رَوَاهُ أبو دَاودَ بإسنادٍ صَحيحٍ.

1694. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: అశుద్ధం తినే ఒంటెల మీద స్వారీ చేయటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు: (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

సాధారణంగా మాలిన్యం తింటూ ఉండే జంతువుల్ని 'జల్లాలా' అని అంటారు. ఈ జంతువులు మానవుల మలమూత్రాలు కూడా తింటాయి. ఈ మాలిన్యం వాటి మాంసంలో కలిసిపోయి వాటి నుండి దుర్వాసన వస్తూ ఉంటుంది. ఇలాంటి జంతువుల మీద స్వారీ చేయటమే అవాంఛనీయమైనప్పుడు వాటి మాంసం ఇంకా అసహ్యకరమైనదయి ఉంటుంది. చాలా వరకు మాలిన్యమే తిని బతికే జంతువుల్ని మాత్రమే 'జల్లాలా' అని అంటారన్న విషయం గమనార్హం. సాధారణంగా జంతువులు కాస్తోకూస్తో మాలిన్యం తింటూనే ఉంటాయి. కాని వాటి నిత్యాహారం అది కాదు. కనుక మాలిన్యం వాటి ఒంట్లో అవతరించే ప్రసక్తి లేదు. వీటిని తినకూడదని, వీటి మీద స్వారీ చేయకూడదని చెప్పట్లేదు. మొత్తానికి ఇస్లాం ధర్మం శుచీశుభ్రతల గురించి ఎంతగా నొక్కివక్కాణిస్తుందో, అశుద్ధం, మాలిన్యం నుంచి కాపాడుకోమని ఎంతగా తాకీదు చేస్తుందో ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

## 309 వ అధ్యాయం

## ٣٠٩ ـ بَابُ النَّهْيِ عَنِ الْبُصَاقِ فِي الْمَسْجِدِ وَالأَمْرِ بِإِزَالَتِهِ مِنْهُ إِذَا وُجِدَ فِيهِ، وَالأَمْرِ بِتَنْزِيهِ الْمَسْجِدِ عَنِ الأَقْذَارِ

**మస్జిద్‌లో ఉమ్మి వేయరాదు. ఎక్కడైనా ఉమ్మిపడి ఉంటే దాన్ని తొలగించాలి. మాలిన్యాల నుంచి మస్జిద్‌ను పరిశుభ్రంగా ఉంచాలి**

١٦٩٥ ـ عَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «الْبُصَاقُ فِي الْمَسْجِدِ خَطِيئَةٌ، وَكَفَّارَتُهَا دَفْنُهَا». متفقٌ عليه.

والْمُرَادُ بِدَفْنِهَا إِذَا كَانَ الْمَسْجِدُ تُرَاباً أَوْ رَمْلاً وَنَحْوَهُ، فَيُوَارِيهَا تَحْتَ تُرَابِهِ. قَالَ أَبُو المحاسنِ الرُّويَانِي مِنْ أَصْحَابِنَا فِي كِتَابِهِ «البحر» وقِيلَ: الْمُرَادُ بِدَفْنِهَا إِخْرَاجُهَا مِنَ الْمَسْجِدِ، أَمَّا إِذَا كَانَ الْمَسْجِدُ مُبَلَّطاً أَوْ مجَصَّصاً، فَدَلَكَهَا عَلَيْهِ بِمَدَاسِهِ أَوْ بِغَيْرِهِ كَمَا يَفْعَلُهُ كَثِيرٌ مِنَ الجهَّالِ، فَلَيْسَ ذلكَ بِدَفْنٍ، بَلْ زِيَادَةٌ فِي الخَطِيئَةِ وَتَكْثِيرٌ لِلقَذَرِ فِي الْمَسْجِدِ، وَعَلَى مَنْ فَعَلَ ذلكَ أَنْ يَمْسَحَهُ بَعْدَ ذٰلكَ بِثَوْبِهِ أَوْ بِيَدِهِ أَوْ غَيْرِهِ أَوْ يَغْسِلَهُ.

1695. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మస్జిద్‌లో ఉమ్మి వేయటం పాపం. దాని పరిహారం దానిని మట్టితో పూడ్చేయటం.

(బుఖారీ-ముస్లిం)

పూడ్చేయటమంటే మస్జిద్ పచ్చిగా ఉన్న పక్షంలో, అంటే అక్కడ మట్టి లేక ఇసుక మొదలగునవి ఉన్నప్పుడు ఆ ఉమ్మి మీద మట్టిపోసి కనపడనీయకుండా చేయాలి. మా వాళ్ళలో (అంటే షాఫయీలలో) అబుల్ ముహాసిన్ రూయానీ తన గ్రంథం 'అల్ బహ్ర్'లో ఈ విషయం పేర్కొన్నారు. పూడ్చేయటమంటే దాన్ని మస్జిద్ నుండి బయటికి తీసి పారేయటమని మరికొందరు అభిప్రాయపడ్డారు. కాని మస్జిద్ రాళ్ళతో గాని లేక సున్నంతోగాని నిర్మించబడినదైతే చాలా మంది మూర్ఖులు చేసినట్టు ఉమ్మిని చెప్పు మొదలగు వాటితో

రుద్దేయటం పూడ్చేయటం క్రిందికి రాదు. పైగా ఇది మరింత పాపం, మస్జిద్‌లో మాలిన్యాన్ని పెంచటం క్రిందికి వస్తుంది. ఆ విధంగా చెప్పుతో రుద్దేవారు దాని తర్వాత తప్పకుండా దాన్ని గుడ్డతోగాని, చేత్తోగాని లేక మరే వస్తువుతో నయినాగాని తుడిచేయాలి (లేదా ఆ స్థలాన్ని కడిగేయాలి).

*(సహీహ్ బుఖారీలోని సలాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

١٦٩٦ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ رَسُولَ اللهِ ﷺ رَأَى فِي جِدَارِ الْقِبْلَةِ مُخَاطاً، أَوْ بُزَاقاً، أَوْ نُخَامَةً، فَحَكَّهُ. متفقٌ عليه.

1696. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) మస్జిద్ ఖిబ్లా వైపు గోడ మీద చీముడు లేక ఉమ్మి లేక కళ్ళెము ఉండటం చూసి దాన్ని గీకి శుభ్రం చేశారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సలాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఆ మాలిన్యం ఏదో ఉల్లేఖకునికి ఇతమిత్థంగా తెలియలేదు. ఏమయినప్పటికీ అది గోడమీద పడి ఎండి పోయింది. దైవప్రవక్త (సల్లం) దాన్ని చూసి తనే స్వయంగా దాన్ని శుభ్రం చేశారు. ఆ విధంగా తన అనుచర సమాజానికి శుచిశుభ్రతల గురించి క్రియాత్మకంగా నొక్కి చెప్పారు.

١٦٩٧ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ هٰذِهِ المَسَاجِدَ لَا تَصْلُحُ لِشَيْءٍ مِنْ هٰذَا الْبَوْلِ وَلَا الْقَذَرِ، إِنَّمَا هِيَ لِذِكْرِ اللهِ تَعَالَى، وَقِرَاءَةِ الْقُرْآنِ» أَوْ كَمَا قَالَ رَسُولُ اللهِ ﷺ. رواه مسلم.

1697. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: "మస్జిదుల్లో ఈ విధంగా మల మూత్ర విసర్జన చేయటం, మాలిన్యం పోయటం తగదు. ఇవి దైవ స్మరణ కోసం, ఖుర్‌ఆన్ పారాయణం కోసం ఉద్దేశించబడినవి."

లేక దైవప్రవక్త (సల్లం) ఇలాంటి మాటే
ఏదో అని ఉంటారు. (ముస్లిం)
*(సహీహ్ ముస్లింలోని తహారత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఓ పల్లెటూరి బైతు మస్జిదె నబవీలో మూత్రం పోసినప్పుడు దైవప్రవక్త (సల్లం) అతనితో అన్నమాటలివి. ఆ సమయంలో ఆయన ఎంతో ఓర్పుతో, నేర్పుతో అతనికి అలా చేయకూడదని బోధించారు. మస్జిదులు నిర్మించబడేది దైవస్మరణ, ప్రార్థనలు, ఖుర్ఆన్ పారాయణం మొదలగు ఆరాధనల కోసమేగాని ప్రాపంచిక పనులకోసం కాదని వివరించారు.

2) ఈ హదీసు చివర్లో, "లేక దైవప్రవక్త (సల్లం) ఇలాంటి మాటే ఏదో అని ఉంటారు" అని ఉంది. కొన్ని సందర్భాల్లో ఉల్లేఖకులు హదీసులు చెప్పినప్పుడు దైవప్రవక్త (సల్లం) మాటల్ని యధాతథంగా చెప్పలేకపోవచ్చు. అలాంటి సందర్భాల్లో ఉల్లేఖకులు జాగ్రత్తకోసం ఇలాంటి వాక్యాలు ఉపయోగిస్తారు. దైవప్రవక్త (సల్లం) మీద అబద్ధం ఆపాదించటం మహాపాపం. కనుక ఆ విధంగా పలికి ఉల్లేఖకులు ఈ మహాపాపం నుంచి తమల్ని తాము కాపాడుకుంటారు.



## 310 వ అధ్యాయం

## ٣١٠ - بَابُ كَرَاهِيَةِ الْخُصُومَةِ فِي الْمَسْجِدِ وَرَفْعِ الصَّوْتِ فِيهِ وَنَشْدِ الضَّالَّةِ وَالْبَيْعِ وَالشِّرَاءِ وَالْإِجَارَةِ وَنَحْوِهَا مِنَ الْمُعَامَلَاتِ

## మస్జిద్‌లో పోట్లాడటం, బిగ్గరగా అరవటం, పోయిన వస్తువుల గురించి ప్రకటనలు చేయటం, కొనుగోలు, అమ్మకాలు, బాడుగలు, కూలీల వ్యవహారాలు చేయటం తగదు

١٦٩٨ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ سَمِعَ رَجُلاً يَنْشُدُ ضَالَّةً فِي الْمَسْجِدِ فَلْيَقُلْ: لَا رَدَّهَا اللهُ عَلَيْكَ؛ فَإِنَّ الْمَسَاجِدَ لَمْ تُبْنَ لِهَذَا» رَوَاهُ مُسْلِم.

1698. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు: ఒక వ్యక్తి మస్జిద్‌లో పోయిన వస్తువుల్ని గురించి ప్రకటన చేస్తుండగా విన్న వారు, "దేవుడు నీకు ఆ వస్తువు తిరిగి ఇవ్వ కుండుగాక!" అని అనాలి. ఎందు కంటే మస్జిద్‌లు ఆ పని కోసం నిర్మిం చబడ లేదు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

١٦٩٩ - وَعَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِذَا رَأَيْتُمْ مَنْ يَبِيعُ أَوْ يَبْتَاعُ فِي الْمَسْجِدِ، فَقُولُوا: لَا أَرْبَحَ اللهُ تِجَارَتَكَ؛ وَإِذَا رَأَيْتُمْ مَنْ يَنْشُدُ ضَالَّةً فَقُولُوا: لَا رَدَّهَا اللهُ عَلَيْكَ». رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

1699. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మస్జిద్‌లో అమ్ముతూ లేక కొంటూ ఉండగా ఎవరినయినా చూస్తే మీరు, "దేవుడు నీ వ్యాపారంలో వృద్ధిని ప్రసా దించకుండుగాక!" అని అనండి. అలాగే పోయిన వస్తువుల్ని గురించి

ప్రకటిస్తున్న వ్యక్తిని చూస్తే, "దేవుడు నీకు ఆ వస్తువు తిరిగి ఇవ్వకుండు గాక!" అని అనండి. (తిర్మిజీ దీనిని వెలికితీసి 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని వాణిజ్య అధ్యాయం)*

١٧٠٠ - وَعَنْ بُرَيْدَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَجُلاً نَشَدَ فِي الْمَسْجِدِ، فَقَالَ: مَنْ دَعَا إِلى الجَمَلِ الأَحْمَرِ؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «لا وَجَدْتَ؛ إِنَّما بُنِيَتِ المَسَاجِدُ لِمَا بُنِيَتْ لَهُ» رواه مسلم.

1700. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం ఒక వ్యక్తి మస్జిద్‌లో ప్రకటన చేస్తూ, "నాకు నా ఎర్ర ఒంటె జాడ తెలపగల వారెవరయినా ఉన్నారా?" అని అన్నాడు. ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) "అది నీకు దొరకకుండుగాక! నిశ్చయంగా మస్జిద్‌లు దేని కోసం నిర్మించబడ్డాయో దానికోసమే నిర్మించ బడ్డాయి" అని అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

١٧٠١ - وَعَنْ عَمْرِو بْنِ شُعَيْبٍ، عَنْ أَبِيهِ، عَنْ جَدِّهِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ نَهَى عَنِ الشِّرَاءِ وَالْبَيْعِ فِي الْمَسْجِدِ، وَأَنْ تُنْشَدَ فِيهِ ضَالَّةٌ، أَوْ يُنْشَدَ فِيهِ شِعْرٌ. رَوَاهُ أَبُو دَاوُدَ، والتِّرمِذِي وقال: حَدِيثٌ حَسَنٌ.

1701. హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి ఆయన తన తాత నుండి చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో కొనుగోలు, అమ్మకాలు జరుపటాన్ని, అక్కడ పోయిన వస్తువుల గురించి ప్రకటించటాన్ని, కవితలు చదువటాన్ని వారించారు. (అబూదావూద్, తిర్మిజీ-హసన్ హదీసు)

*(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని సలాత్ అధ్యాయాలు)*

**ముఖ్యాంశాలు**

1) మస్జిదుల్లో ఏ విధమైన గోల జరగకుండా పైన పేర్కొనబడిన పనులు చేసినప్పుడు పై హదీసుల్లోని వారింపు కేవలం అవాంఛనీయ దృష్టితో చేసిన వారింపు క్రిందికి వస్తుంది.

ఒకవేళ వాటి మూలంగా మస్జిదుల్లో గోల జరిగితే మాత్రం ఆ వారింపు నిషిద్ధం కోవలోకి వస్తుంది.

2) మస్జిదుల్లో ప్రేమ కవితలు లేక అలాంటివేవయినా అనుచిత గేయాలు చదవటం నిషిద్ధం. పోతే దేవుని ఏకత్వాన్ని ప్రబోధించే, దైవప్రవక్త (స) పట్ల విధేయతను ప్రోత్సహించే సంస్కారవంతమైన కవితలు చదవటంలో మాత్రం ఎలాంటి తప్పులేదు.

3) ముస్లింల సామూహిక సమస్యలు, విషయాల గురించి మస్జిదుల్లో చర్చించుకోవచ్చు. ఎందుకంటే ఈ చర్చలు ముస్లిం సమాజ సామూహిక ప్రయోజనం, సాఫల్యం కోసం ఉద్దేశించబడినవేగాని, ఏ ఒక్కరి స్వార్థంతోనో ముడిపడినవి కావు.

4) మస్జిదుల్లో ఖవ్వాలీ ప్రోగ్రాములు పెట్టటం నిషిద్ధం (కొంతమంది అవివేకులు ఖవ్వాలీ ప్రోగ్రాములను పుణ్యప్రదమైన కార్యాలుగా భావిస్తున్నారు. ఇది చాలా పెద్దపాపం).

ఎందుకంటే ఇందులో డోలు, సన్నాయి వంటి ఎన్నో సంగీత సాధనాలను ఉపయోగించటం జరుగుతుంది. రెండో విషయం ఏమిటంటే ఖవ్వాలీల్లో అతిశయోక్తి ఉంటుంది. ఇంకో విషయం ఏమిటంటే ఖావ్వాలీలు మనిషి యొక్క ఆచరణాసక్తిని నిద్రపుచ్చి అతణ్ణి ఆచరణకు దూరం చేస్తాయి. ఖవ్వాలీ ప్రోగ్రాముల్లో ఇంకా ఇటువంటి నష్టాలెన్నో ఉన్నాయి.

١٧٠٢ - وَعَنِ السَّائِبِ بْنِ يَزِيدَ الصَّحَابِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كُنْتُ فِي المَسْجِدِ فَحَصَبَنِي رَجُلٌ، فَنَظَرْتُ فَإِذَا عُمَرُ بْنُ الخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ فَقَالَ: اذْهَبْ فَأْتِنِي بِهٰذَيْنِ، فَجِئْتُهُ بِهِمَا، فَقَالَ: مِنْ أَيْنَ أَنْتُمَا؟ فَقَالا: مِنْ أَهْلِ الطَّائِفِ، فَقَالَ: لَوْ كُنْتُمَا مِنْ أَهْلِ البَلَدِ، لَأَوْجَعْتُكُمَا، تَرْفَعَانِ أَصْوَاتَكُمَا فِي مَسْجِدِ رَسُولِ اللهِ ﷺ! رَوَاهُ البُخَارِي.

1702. హజ్రత్ సాయిబ్ బిన్ యజీద్ సహాబీ (రజి) కథనం: నేను మస్జిద్‌లో ఉండగా ఎవరో నన్ను చిన్న రాయితో కొట్టారు. చూస్తే ఆ రాయి కొట్టింది ఉమర్ బిన్ ఖత్తాబ్(రజి). ఆయన నన్ను 'వెళ్ళి ఆ ఇద్దరిని నా దగ్గరికి పట్టుకొని రా' అని ఆదేశించారు. నేను వాళ్ళిద్దరిని ఆయన వద్దకు తీసుకు వెళ్ళాను. ఆయన వారిని "మీరు ఎక్కడి వారు?" అని అడిగారు. "తాయెఫ్ వాసులం" అని చెప్పారు వారు. అది విని ఆయన, "మీరు గనక ఈ నగరం వాళ్ళైనట్లయితే నేను మిమ్మల్ని తప్పకుండా శిక్షించి

ఉండే వాణ్ణి. మీరు దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో బిగ్గరగా మాట్లాడతారా?"అని గద్దించారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని సలాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) మస్జిద్‌లో బిగ్గరగా మాట్లాడటం మస్జిద్ గౌరవానికి విరుద్ధం. ఈ నేరానికి పాల్పడే వారికి శిక్షకూడా విధించవచ్చు. ఉమర్ (రజి) విధానం ద్వారా మనకు ఈ విషయం బోధపడుతోంది.

2) శక్తి ఉంటే పాపం చేస్తున్నవారిని తప్పకుండా ఆపాలి.



## 311 వ అధ్యాయం

## ٣١١ - بَابُ نَهْيِ مَنْ أَكَلَ ثُوماً أَوْ بَصَلاً أَوْ كُرَّاثاً أَوْ غَيْرَهُ مِمَّا لَهُ رَائِحَةٌ كَرِيهَةٌ عَنْ دُخُولِ الْمَسْجِدِ قَبْلَ زَوَالِ رَائِحَتِهِ إِلاَّ لِضَرُورَةٍ

## ఉల్లి, వెల్లుల్లి లేక మరేదయినా దుర్వాసన వచ్చే వస్తువు తింటే - దుర్వాసన పోయేవరకు మస్జిద్‌లోకి ప్రవేశించకూడదు, అత్యవసర పరిస్థితిలో ప్రవేశించవచ్చు

١٧٠٣ - عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «مَنْ أَكَلَ مِنْ هذهِ الشَّجرَةِ - يَعْنِي الثُّومَ - فَلا يَقْرَبَنَّ مَسْجِدَنَا» متفقٌ عليه. وفي روايةٍ لمسلم: «مَسَاجِدَنَا».

1703. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఈ చెట్టుఫలం - అంటే వెల్లుల్లి తిన్నవాడు మా మస్జిదు దరిదాపులకు కూడా రారాదు.

(బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "మా మస్జిదుల దరిదాపులకు కూడా రారాదు" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

١٧٠٤ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «مَنْ أَكَلَ مِنْ هٰذِهِ الشَّجَرَةِ، فَلا يَقْرَبَنَّا، وَلا يُصَلِّيَنَّ مَعَنَا» متفقٌ عليه.

1704. హజ్రత్ అనస్(రజి) కథనం ప్రకారం- దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "ఈ చెట్టు ఫలం తిన్న వాడు మా దరిదాపులకు కూడా రారాదు. మా వెంట నమాజ్ చేయ రాదు." (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం-సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

١٧٠٥ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «مَنْ أَكَلَ ثُوماً أَوْ بَصَلاً، فَلْيَعْتَزِلْنَا، أَوْ فَلْيَعْتَزِلْ مَسْجِدَنَا» متفقٌ عليه. وفي رواية لمُسْلِم: «مَنْ أَكَلَ الْبَصَلَ، وَالثُّومَ، وَالْكُرَّاثَ، فَلا يَقْرَبَنَّ مَسْجِدَنَا، فَإِنَّ الْمَلائِكَةَ تَتَأَذَّى مِمَّا يَتَأَذَّى مِنْهُ بَنُو آدَمَ».

1705. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం), “ఉల్లిగాని, వెల్లుల్లిగాని తిన్నవాడు మాకు దూరంగా ఉండాలి (లేక) మా మస్జిదులకు దూరంగా ఉండాలి” అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఉల్లి, వెల్లుల్లి తిన్నవారు మా మస్జిద్ దరిదాపులకు కూడా రారాదు. ఎందుకంటే మనుషులు వేటి మూలంగా ఇబ్బంది పడతారో దైవ దూతలు కూడా వాటి మూలంగా ఇబ్బంది పడతారు.

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఉల్లి, వెల్లుల్లి లాంటి దుర్వాసన కలిగిన వస్తువులు పచ్చిగా ఉన్నవాటిని నమాజ్‌కు ముందు మస్జిద్‌కు వెళ్ళేటప్పుడు తినరాదు. దానివల్ల తోటి నమాజీలకు, దైవదూతలకు ఇబ్బంది కలుగుతుంది. అయితే ఉల్లి, వెల్లుల్లి అసలు తిననేకూడదని దీని భావం ఎంతమాత్రం కాదు. దాదాపు ప్రతి కూరలోనూ వీటి అవసరం ఉంటుంది. ఉడికిన తర్వాత వాటి దుర్వాసన దూరమవుతుంది. అప్పుడు వాటిని తినవచ్చు.

١٧٠٦ - وَعَنْ عُمَرَ بْنِ الخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ خَطَبَ يَوْمَ الجُمُعَةِ فَقَالَ فِي خُطْبَتِهِ: ثُمَّ إِنَّكُمْ أَيُّهَا النَّاسُ تَأْكُلُونَ شَجَرَتَيْنِ مَا أُرَاهُمَا إِلَّا خَبِيثَتَيْنِ: الْبَصَلَ، وَالثُّومَ. لَقَدْ رَأَيْتُ رَسُولَ اللهِ ﷺ إِذا وَجَدَ

1706. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) శుక్రవారం నాడు ఖుత్బా ఇస్తూ ఇలా చెప్పారు: “తర్వాత ప్రజలారా! మీరు రెండు చెట్లు (అంటే వాటి ఫలాలు) తింటున్నారు. (పచ్చిగా ఉన్నప్పుడు) వాటిని తిన కూడదని నా అభిప్రాయం. అవి ఉల్లి, వెల్లుల్లి. నేను దైవప్రవక్త (సల్లం)ను చూశాను. ఆయన ఎవరి

ريحَهُمَا مِنَ الرَّجُلِ في المَسْجِدِ أَمَرَ بِهِ، فَأُخْرِجَ إلى البَقِيعِ، فَمَنْ أَكَلَهُمَا، فَلْيُمِتْهُمَا طَبْخاً. رواه مسلم.

దగ్గరి నుంచి అయినా వాటి వాసన వస్తే వారిని బయటికి పంపేయాలని ఆజ్ఞాపించే వారు. ఆయన ఆజ్ఞమేరకు వారిని బఖీ శ్మశానవాటిక వరకు గెంటే యటం జరిగేది. కనుక చెబుతున్నాను, వాటిని తినాలనుకునే వారు వాటిని వండి వాటి వాసనని పోగొట్టి తినండి.”

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

పచ్చిగా ఉన్న ఉల్లి, వెల్లుల్లి వంటివి తిని మస్జిద్‌కు వెళ్ళకూడదు. ఒకవేళ వాటిని వండిన తర్వాత తిని మస్జిద్‌కు వెళితే మాత్రం అందులో ఎలాంటి అభ్యంతరం ఉండదు. అదే విధంగా మస్జిద్‌కు వెళ్ళటానికి ఇంకా చాలా సమయం ఉంది అనుకున్నప్పుడు కూడా పచ్చిగా ఉన్న ఉల్లి, వెల్లుల్లిపాయలు తినవచ్చు. మొత్తానికి తెలిసేదేమిటంటే ఆరాధన కోసంగాని లేక అటువంటి మరేవయినా సామూహిక కార్యాల కోసంగాని వెళ్ళే ముందు పచ్చిగా ఉన్న ఉల్లి వెల్లుల్లి, అలాగే ధూమపానం వంటి పదార్థాలు సుతరామూ తీసుకోరాదు. ఎందుకంటే వాటి దుర్వాసన మూలంగా అక్కడ ఉండే జనానికి ఇబ్బంది కలుగుతుంది.

మస్జిదులను ఎటువంటి మాలిన్యం లేకుండా పరిశుభ్రంగా ఉంచాలి. దీన్నిబట్టి మస్జిదులోపలగాని లేక దానికి అతి సమీపంలోగాని దుర్వాసన లోనికి వచ్చే విధంగా మరుగుదొడ్లు నిర్మించటం ఎట్టి పరిస్థితుల్లోనూ ధర్మసమ్మతం కాదని చెప్పవచ్చు. ఒకవేళ ఎక్కడైనా ఈ విధంగా మరుగుదొడ్లు నిర్మించబడి ఉంటే వాటిని అక్కణ్ణుంచి దూరం చేయాలి. బలమైన కారణాలేవీ లేకుండా అటువంటి మరుగుదొడ్లను వాడుతున్న పక్షంలో మస్జిదు ధర్మకర్తలు, బాధ్యులయిన వ్యక్తులందరూ అల్లాహ్ దృష్టిలో నేరస్థులుగా పరిగణించ బడతారు.

## 312 వ అధ్యాయం

٣١٢ ـ بَابُ كَرَاهِيَةِ الاِحْتِبَاءِ يَوْمَ الْجُمُعَةِ وَالإِمَامُ يَخْطُبُ لأَنَّهُ يَجْلِبُ النَّوْمَ، فَيُفَوِّتُ اسْتِمَاعَ الْخُطْبَةِ وَيُخَافُ انْتِقَاضُ الْوُضُوءِ

**జుమానాడు ఖుత్బా జరుగుతున్నప్పుడు మోకాళ్లు పొట్టకు ఆన్చి కూర్చోవటం అవాంఛనీయం. దానివల్ల నిద్ర వస్తుంది. ఖుత్బా వినలేకపోవటమే గాక వుజూ కూడా భంగమయ్యే ఆస్కారముంది**

١٧٠٧ ـ عَنْ مُعَاذِ بْنِ أَنَسٍ الجُهَنِيِّ، رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ، نَهَى عَنِ الحِبْوَةِ يَوْمَ الجُمُعَةِ وَالإِمَامُ يَخْطُبُ. رواه أبو داود، والترمذي وَقَالا: حَدِيثٌ حَسَنٌ.

1707. హజ్రత్ ముఆజ్ బిన్ అనస్ జుహనీ (రజి) కథనం: జుమా నాడు ఇమామ్ ఖుత్బా (ప్రసంగం) ఇస్తున్నప్పుడు మోకాళ్ళు పొట్టకు ఆన్చి కూర్చోవటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. (అబూదావూద్, తిర్మిజీలు దీనిని వెలికితీసి ఇరువురూ దీనిని హసన్‌గా పేర్కొన్నారు).

*(సుననె అబూదావూద్‌లోని సలాత్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని సలాత్ అధ్యాయం)*

## 313 వ అధ్యాయం

## ٣١٣ - بَابُ نَهْيِ مَنْ دَخَلَ عَلَيْهِ عَشْرُ ذِي الْحِجَّةِ وَأَرَادَ أَنْ يُضَحِّيَ عَنْ أَخْذِ شَيْءٍ مِنْ شَعْرِهِ أَوْ أَظْفَارِهِ حَتَّى يُضَحِّيَ

## ఖుర్బానీ చేయదలచుకునేవారు జుల్‌హిజ్జా మాసపు నెలవంక చూసినప్పటి నుంచి ఖుర్బానీ చేసే వరకు తమ వెంట్రుకల్ని, గోళ్ళను కత్తిరించుకోరాదు

١٧٠٨ - عَنْ أُمِّ سَلَمَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ كَانَ لَهُ ذِبْحٌ يَذْبَحُهُ، فَإِذَا أُهِلَّ هِلَالُ ذِي الحِجَّة، فَلَا يَأْخُذَنَّ مِنْ شَعْرِه وَلَا مِنْ أَظْفَارِهِ شَيْئاً حَتى يُضَحِّيَ» رَوَاهُ مُسْلِم.

1708. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఖుర్బానీ కొరకు పశువు ఉండి ఖుర్బానీ చేయదలచుకునేవారు జుల్‌హిజ్జా మాసపు నెలవంక కనిపించినప్పటి నుంచి ఖుర్బానీ ఇచ్చేవరకు తమ వెంట్రుకల్ని, గోళ్ళను కొంచెమైనా కత్తిరించుకోరాదు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని అజాహీ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఖుర్బానీ చేయదలచుకునేవారు జుల్‌హిజ్జా నెలవంక చూసినప్పటినుంచి శిరోజాలు, చంకలోని, బొడ్డుక్రింద వెంట్రుకలు, గోళ్ళు కత్తిరించుకోకుండా ఉంటే వారి ఖుర్బానీ సున్నత్ ప్రకారం నెరవేరుతుంది. జుల్‌హిజ్జా 10వ తేదీన ఖుర్బానీ చేసిన తర్వాత క్షవరం చేయించుకోవాలి. అదే విధంగా ఖుర్బానీ చేయనివారు జుల్‌హిజ్జా 10వ తేదీన క్షవరం చేయించుకొని గోళ్లు కత్తిరించుకుంటే వారికి కూడా ఖుర్బానీ చేసినంత పుణ్యం లభిస్తుందని కొన్ని ఉల్లేఖనాల ద్వారా బోధపడుతోంది.

## 314 వ అధ్యాయం

## ٣١٤ ـ بَابُ النَّهْيِ عَنِ الْحَلِفِ بِمَخْلُوقٍ كَالنَّبِيِّ وَالْكَعْبَةِ وَالْمَلَائِكَةِ وَالسَّمَاءِ وَالآبَاءِ وَالْحَيَاةِ وَالرُّوحِ وَالرَّأْسِ، وَحَيَاةِ السُّلْطَانِ وَنِعْمَةِ السُّلْطَانِ، وَتُرْبَةِ فُلَانٍ وَالأَمَانَةِ وَهِيَ مِنْ أَشَدِّهَا نَهْياً

**సృష్టిరాశుల మీద ప్రమాణం చేయరాదు. అంటే ప్రవక్త, కాబా, దైవదూతలు, ఆకాశం, తాత ముత్తాతలు, జీవితం, ఆత్మ, తల, రాజు జీవితం, అతని అనుగ్రహం, ఫలానా వారి సమాధి మీద, వారి నిజాయితీ మీద ప్రమాణం చేయటమన్న మాట. అయితే ఒకరి నిజాయితీ మీద ప్రమాణం చేయటం మరింత తీవ్రమైన విషయం.**

١٧٠٩ ـ عَنِ ابْنِ عُمَرَ، رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ اللهَ تَعَالَى يَنْهَاكُمْ أَنْ تَحْلِفُوا بِآبَائِكُمْ، فَمَنْ كَانَ حَالِفاً، فَلْيَحْلِفْ بِاللهِ، أَوْ لِيَصْمُتْ» متفقٌ عليه. وفي رواية في الصحيح: «فَمَنْ كَانَ حَالِفاً، فَلا يَحْلِفْ إِلَّا بِاللهِ، أَوْ لِيَسْكُتْ».

1709 హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీరు మీ తాతముత్తాతల మీద ప్రమాణం చేయటాన్ని దేవుడు వారించాడు. కనుక మీలో ఎవరైనా ప్రమాణం చేయదలచుకుంటే అల్లాహ్ మీద ప్రమాణం చేయాలి. లేదా ఊరు కోవాలి. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ-సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణాలు)*

١٧١٠ ـ وَعَنْ عَبْدِ الرَّحْمٰنِ بنِ سَمُرَةَ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ:

1710. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా (రజి) కథనం ప్రకారం దైవ

«لا تَحْلِفُوا بالطَّوَاغِي، وَلا بِآبَائِكُمْ». رواه مسلم. «الطَّوَاغِي»: جَمْعُ طَاغِيَةٍ، وَهِيَ الأَصْنَامُ، وَمِنْهُ الحَدِيثُ: «هٰذِهِ طَاغِيَةُ دَوْسٍ» أَيْ: صَنَمُهُم وَمَعْبُودُهُم. وَرُوِيَ فِي غَيْرِ مُسْلِمٍ: «بِالطَّوَاغِيتِ» جَمْعُ طَاغُوتٍ، وَهُوَ الشَّيْطَانُ وَالصَّنَمُ.

ప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు విగ్రహాల మీద, మీ తాత ముత్తాతల మీద ప్రమాణం చేయకండి. *(ముస్లిం)*

'తవాగీ' అనేది 'తాగియహ్'కు బహు వచనం. విగ్రహం అని దాని అర్థం. ఉదాహరణకు ఒక హదీసులో, "ఇది దౌస్ తెగ వారి తాగియహ్" అని ఉంది. అంటే వారి ఆరాధ్య దేవుడు, విగ్రహం అని భావం. సహీహ్ ముస్లిం తప్ప ఇతర గ్రంథాల్లో 'తవాగీత్' అని ఉల్లేఖించ బడింది. ఇది 'తాగూత్'కు బహు వచనం. 'షైతాన్, విగ్రహాలు' అని దాని భావం.

*(సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణం)*

١٧١١ ـ وَعَنْ بُرَيْدَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ حَلَفَ بِالأَمَانَةِ، فَلَيْسَ مِنَّا». حَدِيثٌ صَحِيحٌ، رَوَاهُ أَبُو داوُدَ بإسنادٍ صَحِيحٍ.

1711. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నిజాయితీ మీద ప్రమాణం చేసినవాడు మా ముస్లింల పద్ధతిని అనుసరించట్లేదు. *(అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)*

*(సుననె అబూదావూద్‌లోని ఐమాన్, నుజూర్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

అల్లాహ్ పేరు, ఆయన గుణగణాలు తప్ప ఇతర ఏ విషయం మీదా ప్రమాణం చేయకూడదు. నిజాయితీ అనేది దేవుని ఆదేశాల్లో ఒక ఆదేశం లేక ఆయన నిర్ణయించిన నమాజ్, జకాత్, ఉపవాసం, హజ్ లాంటి ఒక విధి. కనుక "నేను నిజాయితీ మీద ప్రమాణం చేస్తున్నాను" అని అనకూడదు. అలా అంటే దేవుని విధుల్ని ఆయన గుణగణాలతో పోల్చినట్లవుతుంది. అది సరైన పద్ధతి కాదు. (ఔనుల్ మాబూద్)

۱۷۱۲ ـ وَعَنْـــهُ قَـــالَ: قَـــالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ حَلَفَ، فَقَالَ: إِنِّي بَرِيءٌ مِنَ الإِسْلَامِ، فَإِنْ كَانَ كَاذِباً، فَهُوَ كَمَا قَالَ، وَإِنْ كَـانَ صَـادِقـاً، فَلَـنْ يَـرْجِـعَ إِلـى الإِسْـلَامِ سَالِماً». رواه أبو داود.

1712. హజ్రత్ బురైదా (రజి)గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా తాను ఇస్లాంతో విసిగి పోయానని ప్రమాణం చేసినట్లయితే అతను చెబుతున్నది అబద్ధం అయిన పక్షంలో అతడు తాను చెప్పినట్లే అవుతాడు. ఒకవేళ తాను చెబుతున్నది నిజమయితే అప్పటికీ అతను ఇస్లాం వైపునకు క్షేమంగా తిరిగిరాలేడు.

(అబూదావూద్)

*(సుననె అబూదావూద్‌లోని ఐమాన్, నుజూర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక వ్యక్తి "నేను గనక ఫలానా పని చేసినట్లయితే ఇక నేను కాఫిర్ (ధర్మ తిరస్కారి)ని అయినట్లే లెక్క" అని అన్నాడనుకోండి. ఒకవేళ ఆ విధంగా అన్నప్పుడు అతను మనసులో తను ఆ పనికి ఒడిగడితే నిజంగా ధర్మతిరస్కార మార్గాన్ని ఎంచుకుంటానని అనుకున్న పక్షంలో వెంటనే అతను కాఫిర్ అయిపోతాడు. మరొకవేళ అతని ఉద్దేశం ధర్మంపై నిలకడగా ఉండటం, ఎట్టి పరిస్థితుల్లోనయినా ధర్మాన్ని త్యజించకుండా ఉండటం అయినట్లయితే అప్పుడు కూడా దానికోసం అతను ఎంచుకున్న మార్గం తప్పుగానే పరిగణించబడుతుంది. అందుకని అతను వెంటనే దైవం వైపు మరలి తన మన్నింపుకోసం, క్షమాభిక్ష కోసం వేడుకోవాలి. మరోమారు కలిమయె షహాదత్‌ను (విశ్వాస ధృవీకరణ వచనాన్ని) పఠించి తన విశ్వాసాన్ని పునరుద్ధరించుకుంటే ఇంకా మంచిది.

۱۷۱۳ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّهُ سَمِعَ رَجُلاً يَقُولُ: لَا وَالْكَعْبَةِ، قَالَ ابْنُ عُمَرَ: لَا تَحْلِفْ بِغَيْرِ اللهِ، فَإِنِّي سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ حَلَفَ بِغَيْرِ اللهِ، فَقَدْ كَفَرَ أَوْ أَشْرَكَ» رواه الترمذي وقَالَ: حَدِيثٌ

1713. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం ఒక వ్యక్తి 'కాబా గృహం సాక్షి!' అని ప్రమాణం చేస్తుండగా ఆయన విని అతనికి, "దైవేతరుల మీద ప్రమాణం చేయకు. దైవేతరుల మీద ప్రమాణం చేసేవాడు దైవ తిరస్కారానికి లేక బహుదైవారాధనకు

حَسَنٌ. وَفَسَّرَ بَعْضُ الْعُلَمَاءِ قَوْلَهُ: «كَفَرَ أَوْ أَشْرَكَ» عَلَى التَّغْلِيظِ، كَمَا رُوِيَ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «الرِّيَاءُ شِرْكٌ».

పాల్పడినట్లేనని దైవప్రవక్త (సల్లం) ప్రబోధిస్తుండగా నేను విన్నాను" అని ఉపదేశించారు.

తిర్మిజీ ఈ హదీసుని వెలికితీసి హసన్‌గా పేర్కొన్నారు. 'దైవ తిరస్కారానికి లేక బహుదైవారాధనకు పాల్పడినట్లే' అన్న మాటను విశ్లేషిస్తూ కొందరు పండితులు ఈ మాట "ప్రదర్శనాబుద్ధి షిర్కు లాంటిది" అన్న దైవప్రవక్త హదీసు లాగా తీవ్రమైన హెచ్చరిక నిమిత్తం చెప్పబడిందని అభిప్రాయపడ్డారు.

*(సునని తిర్మిజీలోని ఐమాన్ మరియు నుజూర్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) చెప్పినట్లు "ప్రదర్శనాబుద్ధి షిర్క్ లాంటిది" అన్న వాక్యం హదీసుల్లో ఎక్కడా లేదు. కాని దైవప్రవక్త (సల్లం) ప్రదర్శనా బుద్ధిని అసహ్యించుకున్న మాటలద్వారా చూస్తే ప్రదర్శనాబుద్ధి కూడా ఒక విధంగా బహుదైవారాధన క్రిందికే వస్తుందని బోధపడుతోంది. ఉదాహరణకు దైవప్రవక్త (సల్లం) "ఇతరులకు చూపించటం కోసం ఉపవాసం ఉన్నవాడు షిర్క్‌కు పాల్పడ్డాడు. ఇతరులకు చూపించటం కోసం నమాజ్ చేసినవాడు షిర్క్‌కు పాల్పడ్డాడు" అని బోధించారు.

మొత్తానికి పై హదీసులో చెప్పబడిందేమిటంటే దైవేతరుల మీద ప్రమాణం చేయటం చాలా ఘోరమైన విషయం. ఇమామ్ నవవీ (రహ్మాలై) లాంటి కొందరు ఈ విషయం తీవ్రమైన హెచ్చరిక మాత్రమేనని చెప్పినప్పటికీ- ఒకవేళ ప్రమాణం చేసేవాని మనసులో ఆ దైవేతర వస్తువుమీద గౌరవాభిమానముంటే, ఆ గౌరవాభిమానాల మూలంగానే అతను దాని మీద ప్రమాణం చేస్తున్నట్లయితే చాలా మంది పండితుల దృష్టిలో అతను తప్పకుండా దైవతిరస్కారి లేక బహుదైవారాధకుడిగా పరిగణించబడతాడు. కనుక దైవేతరుల మీద ప్రమాణం చేయరాదు. శోచనీయమైన విషయం ఏమిటంటే అజ్ఞానులైన ముస్లింలు చాలా మంది ఇలాంటి ప్రమాణాలు చేస్తుంటారు. నీ మీద ఒట్టు, నీ తల మీద ఒట్టు, అమ్మతోడు, నాన్నతోడు అని అంటుంటారు. ఇలా అనటం నిషిద్ధమని అందరూ తెలుసుకోవాలి.

**315 వ అధ్యాయం**

## ٣١٥ - بَابُ تَغْلِيظِ الْيَمِينِ الْكَاذِبَةِ عَمْداً

## ఉద్దేశ్యపూర్వకంగా అబద్ధపు ఒట్టేయటం కఠినంగా వారించబడింది

١٧١٤ - عَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «مَنْ حَلَفَ عَلَى مَالِ امْرِىءٍ مُسْلِمٍ بِغَيْرِ حَقِّهِ لَقِيَ اللهَ وَهُوَ عَلَيْهِ غَضْبَانُ» قَالَ: ثُمَّ قَرَأَ عَلَيْنَا رَسُولُ اللهِ ﷺ مِصْدَاقَهُ مِنْ كِتَابِ اللهِ عَزَّ وَجَلَّ: ﴿ إِنَّ الَّذِينَ يَشْتَرُونَ بِعَهْدِ اللَّهِ وَأَيْمَنِهِمْ ثَمَنًا قَلِيلًا ﴾ [آل عمران: ٧٧] إلى آخِرِ الآيَةِ مُتَّفَقٌ عَلَيْهِ.

1714. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అన్యాయంగా ఒకముస్లిం ధనాన్ని కాజేసే ఉద్దేశ్యంతో ప్రమాణం చేసేవాడు దేవుణ్ణి కలుసు కున్నప్పుడు ఆయన అతని మీద ఆగ్రహంతో ఉంటాడు.

తర్వాత దైవప్రవక్త (సల్లం) సర్వోన్న తుడైన అల్లాహ్ గ్రంథంలో నుంచి ఈ భావాన్ని బలపరచే సూక్తిని పఠించి విని పించారు: "ఎవరు అల్లాహ్‌కు చేసిన వాగ్దానాన్ని, తమ ప్రమాణాలను స్వల్ప మైన వెలకు విక్రయిస్తారో...." (అలి ఇమ్రాన్:77) (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ముసాఖాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణం)*

١٧١٥ - وَعَنْ أَبِي أُمَامَةَ إِيَاسِ بْنِ ثَعْلَبَةَ الحَارِثِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنِ اقْتَطَعَ حَقَّ امْرِىءٍ مُسْلِمٍ بِيَمِينِهِ، فَقَدْ أَوْجَبَ اللهُ لَهُ النَّارَ.

1715. హజ్రత్ అబూ ఉమామా ఇయాస్ బిన్ సాలబా హారిసీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "(అబద్ధపు) ప్రమాణం ద్వారా ఒక ముస్లిం హక్కుని కాజేసేవాడికి దేవుడు నరకాన్ని

وَحَرَّمَ عَلَيْهِ الْجَنَّةَ» فَقَالَ لَهُ رَجُلٌ: وإِنْ كَانَ شَيْئاً يَسِيراً يَا رَسُولَ اللهِ؟ قَالَ: «وَإِنْ كَانَ قَضِيباً مِنْ أَرَاكٍ» رَواهُ مُسْلِمٌ.

తప్పనిసరి చేసేస్తాడు. అతని కొరకు స్వర్గాన్ని నిషేధిస్తాడు."

అది విని ఒకతను, "అది మామూలు వస్తువయినా (ఆ శిక్ష పడుతుందా) దైవప్రవక్తా?" అని అడిగాడు. అందు కాయన, "అది 'పీలూ' చెట్టు కొమ్మ యినా సరే" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణం)*

١٧١٦ - وَعَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «الْكَبَائِرُ: الإِشْرَاكُ بِاللهِ، وَعُقُوقُ الْوَالِدَيْنِ، وَقَتْلُ النَّفْسِ، وَالْيَمِينُ الْغَمُوسُ» رواه البخاري. وفي رِوَايَةٍ: أَنَّ أَعْرَابِياً جَاءَ إِلى النَّبِيِّ ﷺ فَقَالَ: يَا رَسُولَ اللهِ! مَا الْكَبَائِرُ؟ قَالَ: «الإِشْرَاكُ بِاللهِ»

1716. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిం చారు: "ఘోరమైన పాపాలు ఇవి: అల్లాహ్‌కు ఇతరుల్ని సహవర్తులుగా నిలబెట్టడం, తల్లిదండ్రుల పట్ల అవిధే యతకు పాల్పడటం, (అన్యాయంగా) ప్రాణిని చంపటం, అబద్ధపు ప్రమాణం చేయటం." *(బుఖారీ)*

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఒక పల్లెటూరి వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! ఘోరపాపాలు ఏవి?" అని అడిగాడు. అందుకాయన సమాధానమిస్తూ, "అల్లాహ్‌కు ఇతరుల్ని సహవర్తులుగా నిలబెట్టడం" అని చెప్పారు. అతను "ఆ తర్వాత ఏది?" అని అడిగాడు. "అబద్ధపు ప్రమాణం" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం).

قَالَ: ثُمَّ ماذا؟ قَالَ: «الْيَمِينُ الْغَمُوسُ» قُلْتُ: وَمَا الْيَمِينُ الْغَمُوسُ؟ قَالَ: «الَّذِي يَقْتَطِعُ مَالَ امْرِئٍ مُسْلِمٍ!» يَعْنِي بِيَمِينٍ هُوَ فِيها كَاذِبٌ.

(ఉల్లేఖకుడు ఇలా అంటున్నారు): "అబద్ధపు ప్రమాణం అంటే ఏమిటి?" అని నేను అడిగాను. అందుకాయన "ఒక ముస్లిం ధనాన్ని కాజేసేది" అని చెప్పారు. అబద్ధపు ప్రమాణం చేసి (ధనం కాజేయటం) అని ఆయన భావం.

*(సహీహ్ బుఖారీలోని ఐమాన్ మరియు నుజూర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'గుమూస్' అంటే ముంచటం అని అర్థం. అబద్ధపు ప్రమాణం మనిషిని పాపంలో ముంచుతుంది. అందుకని దాన్ని "యమీనె గుమూస్" అని అంటారు. ఈ పాపానికి పరిహారం చెల్లించవలసిన అవసరం ఉందా లేదా? అన్న విషయంలో పండితుల మధ్య భేదాభిప్రాయా లున్నాయి. కొందరు పండితులు పరిహారం చెల్లించవలసిందేనంటే మరికొందరు అవసరం లేదంటున్నారు. యమీనె గుమూస్ అనేది పరుల సొమ్మును కాజేయటం కోసం చెప్పబడే ఒక అబద్ధం. కనుక దానికి పాల్పడేవారు తౌబా చేసుకొని దైవాన్ని క్షమాభిక్ష కోరి హక్కుదారునికి హక్కు చెల్లిస్తే సరిపోతుందని రెండో వర్గం అభిమతం. ఈ అభిమతమే సరైనది. ఎందుకంటే కేవలం పరిహారం చెల్లించినంత మాత్రాన ఆ పాపం తొలగిపోదు. తాము చేసిన దౌర్జన్యపు పాపాన్ని కూడా తొలగించుకోవటం అవసరం.



## 316 వ అధ్యాయం

## ٣١٦ - بَابُ نَدْبِ مَنْ حَلَفَ عَلَى يَمِينٍ، فَرَأَى غَيْرَهَا خيراً مِنهَا أَنْ يَفْعَلَ ذٰلِكَ الْمَحْلُوفَ عَلَيْهِ، ثُمَّ يُكَفِّرَ عنْ يَمِينِهِ

## ఒక విషయం గురించి ప్రమాణం చేసిన తర్వాత అంతకంటే మెరుగైన విషయం ముందుకు వచ్చినప్పుడు ప్రమాణ పరిహారం చెల్లించి మెరుగైన విషయాన్ని అవలంబించాలి

١٧١٧ - عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ سَمُرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ لِي رَسُولُ اللهِ ﷺ: «وَإذا حَلَفْتَ عَلَى يَمِينٍ، فَرَأَيْتَ غيْرَهَا خَيْراً مِنْهَا، فَائتِ الَّذي هُوَ خَيْرٌ، وَكَفِّرْ عَنْ يَمِينِكَ» متفقٌ عليه.

1717. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాకు ఈ విధంగా ఉపదేశించారు: "నువ్వు ఒక పని గురించి ప్రమాణం చేసిన తర్వాత ఆ ప్రమాణం పూర్తి చేయకుండా ఉండటమే ఉత్తమమని భావించి నట్లయితే నీకు ఉత్తమంగా తోచిన పనే చెయ్యి. ప్రమాణ భంగానికి పరిహారం చెల్లించు."

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణం)

١٧١٨ - وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «مَنْ حَلَفَ عَلَى يَمِينٍ، فَرَأَى غَيْرَها خَيْراً مِنْهَا، فَلْيُكَفِّرْ عَنْ يَمِينِهِ، وَلْيَفْعَلِ الَّذِي هُوَ خَيْرٌ» رواهُ مسلم.

1718. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒకతను ఒక పని గురించి ప్రమాణం చేసిన తర్వాత మరొక పని అంతకంటే మెరుగైనదని భావిస్తే, అతను ప్రమాణభంగానికి పరిహారం చెల్లించి మెరుగైన పనే చేయాలి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణం)

١٧١٩ - وَعَنْ أَبِي مُوسى رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنِّي وَاللهِ! إِنْ شَاءَ اللهُ لَا أَحْلِفُ عَلَى يَمِينٍ، ثُمَّ أَرَى خَيْراً مِنْهَا إِلَّا كَفَّرْتُ عَنْ يَمِينِي، وَأَتَيْتُ الَّذِي هُوَ خَيْرٌ» متفقٌ عليه.

1719. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దైవం సాక్షి! దైవం తలిస్తే నేను ఒక విషయం గురించి ప్రమాణం చేసిన తర్వాత అంతకంటే ఉత్తమమైన విషయం మరొకటి ఉందని తెలుసుకుంటే నేను తప్పకుండా ప్రమాణభంగానికి పరిహారం చెల్లించి ఆ ఉత్తమమైన విషయమే అవలంబిస్తాను.

(బుఖారీ-ముస్లిం)

١٧٢٠ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَأَنْ يَلَجَّ أَحَدُكُمْ فِي يَمِينِهِ فِي أَهْلِهِ آثَمُ لَهُ عِنْدَ اللهِ تَعَالَى مِنْ أَنْ يُعْطِيَ كَفَّارَتَهُ الَّتِي فَرَضَ اللهُ عَلَيْهِ» متفقٌ عليه. قولُهُ: «يَلَجَّ» بِفَتْحِ اللَّامِ، وَتَشْدِيدِ الجيمِ: أَيْ يَتَمَادَى فِيهَا، وَلَا يُكَفِّرُ، وقولُهُ: «آثَمُ» هو بالثاءِ المثلثة، أيْ: أَكْثَرُ إِثْماً.

1720. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరైనా తమ ఇంటివారి వ్యవహారంలో (వారి బాగోగుల్ని పట్టించుకోనని) చేసిన ప్రమాణం పట్ల మొండివైఖరి అవలంబించటం దేవుని దృష్టిలో ఆ ప్రమాణాన్ని భంగపరచి దేవుడు నిర్ణయించిన పాప పరిహారం చెల్లించటం కంటే ఘోరమైన పాపం. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ఐమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఒక వ్యక్తి తన ఇంటివారి బాగోగుల్ని పట్టించుకోనని ప్రమాణం చేశాడనుకుందాం. నిజానికి వారి బాగోగుల్ని పట్టించుకోవటంలోనే అతని శ్రేయం ఉంది. అలాంటప్పుడు అతను ప్రమాణం భంగం చేయకుండా మంకు పట్టు పట్టటం ఎక్కువ పాపం అవుతుంది. దానికంటే తక్కువ పాపం ఏమిటంటే- ప్రమాణం భంగం చేసి దానికి పరిహారం చెల్లించి ఆ తర్వాత యథాప్రకారం ఇంటివారి బాగోగులు పట్టించుకోవటం మొదలుపెట్టాలి. పైన పేర్కొనబడిన హదీసులన్నిటి సారాంశం ఏమిటంటే ప్రమాణం చేసిన తర్వాత తాము ఏ

పని చేయము అని ప్రమాణం చేసుకున్నారో ఆ పని చేయటంలో శ్రేయం ఉందని స్పష్ట మైనప్పుడు ప్రమాణం భంగంచేసి ఆ పని మొదలెట్టాలి. ఏ విషయం గురించి ప్రమాణం చేయబడుతుందో దాన్ని బట్టి ప్రమాణభంగం వివిధ రకాలుగా ఉంటుంది. ఉదా: ఒక వ్యక్తి తాను నమాజ్ చేయనని, ఉపవాసం పాటించనని ప్రమాణం చేసుకున్నాడనుకోండి. అలాంటి ప్రమాణాన్ని భంగపరచటం వాజిబ్ (తప్పనిసరి) అవుతుంది. ఏదైనా అభిలషణీయమైన పని చేయనని ప్రమాణం చేసుకుంటే అలాంటి ప్రమాణాన్ని భంగపరచటం అభిలషణీయమవు తుంది. అదే విధంగా ఏదైనా ధర్మసమ్మతమైన పని చేయనని ప్రమాణం చేసుకుంటే అలాంటి ప్రమాణాన్ని భంగం చేయటం కూడా ధర్మసమ్మతమవుతుంది.

2) ప్రమాణ భంగానికి పాల్పడిన పక్షంలో పరిహారం చెల్లించటం విధి. పరిహారం ఏమిటంటే పది మందికి మధ్యరకపు అన్నం తినిపించటం లేక వారికి దుస్తులు తొడిగించటం, లేక ఒక బానిసను విడుదల చేయించటం. దీని స్తోమత లేనివారు మూడురోజులు ఉపవాసం పాటించాలి. ముందు పరిహారం చెల్లించాలా లేక ప్రమాణం చేసిన పని చేయాలా? అన్న విషయంలో పండితుల మధ్య భేదాభిప్రాయముంది. అత్యధిక మంది పండితులు మొదటి అభిప్రాయాన్ని కలిగి ఉన్నారు. హదీసు వాక్యాలు కూడా ఈ విషయాన్నే సమర్థిస్తున్నాయి.

3) చేయనని ప్రమాణం చేసుకున్న పని చేయటమే మేలని స్పష్టమయిన తర్వాత కూడా మొండితనంతో ప్రమాణం భంగం చేయకుండా ఉండటం దేవుని దృష్టిలో పెద్దపాపం.

4) ఇలాంటి సందర్భాల్లో మొండితనంతో వ్యవహరించకుండా ఉత్తమమైన పని ఎన్నుకోవటం దైవప్రవక్త (సల్లం) విధానం.



## 317 వ అధ్యాయం

## ٣١٧ - بَابُ الْعَفْوِ عَنْ لَغْوِ الْيَمِينِ وَأَنَّهُ لاَ كَفَّارَةَ فِيهِ، وَهُوَ مَا يَجْرِي عَلَى اللِّسَانِ بِغَيْرِ قَصْدِ الْيَمِينِ كَقَوْلِهِ عَلَى الْعَادَةِ: لاَ وَاللهِ! وَبَلَى وَاللهِ! وَنَحْوِ ذٰلِكَ

## ప్రమాణం చేసే ఉద్దేశ్యం లేకుండా అలవాటు ప్రకారం నోటి నుండి 'దైవసాక్షి!' లాంటి పదాలు వెలువడటం 'పొరపాటు ప్రమాణం' క్రిందికి వస్తుంది. ఇది క్షమార్హమైనది. దీనికి పరిహారం చెల్లించవలసిన అవసరం లేదు

قَالَ اللهُ تَعَالَى: ﴿لَا يُؤَاخِذُكُمُ اللَّهُ بِاللَّغْوِ فِيٓ أَيْمَـٰنِكُمْ وَلَـٰكِن يُؤَاخِذُكُم بِمَا عَقَّدتُّمُ الْأَيْمَـٰنَ فَكَفَّـٰرَتُهُۥٓ إِطْعَامُ عَشَرَةِ مَسَـٰكِينَ مِنْ أَوْسَطِ مَا تُطْعِمُونَ أَهْلِيكُمْ أَوْ كِسْوَتُهُمْ أَوْ تَحْرِيرُ رَقَبَةٍ فَمَن لَّمْ يَجِدْ فَصِيَامُ ثَلَـٰثَةِ أَيَّامٍ ذَٰلِكَ كَفَّـٰرَةُ أَيْمَـٰنِكُمْ إِذَا حَلَفْتُمْ وَاحْفَظُوٓا أَيْمَـٰنَكُمْ﴾ [المائدة: ٨٩].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"మీరు చేసే అర్థంలేని ప్రమాణాలను గురించి అల్లాహ్ మమ్మల్ని పట్టుకోడు. కానీ మీరు బుద్ధిపూర్వకంగా చేసే ప్రమాణాలను గురించి ఆయన మిమ్మల్ని తప్పకుండా ప్రశ్నిస్తాడు. (అటువంటి ప్రమాణభంగానికి) పరిహారం ఏమిటంటే మీరు మీ ఆలుబిడ్డలకు తిని పించే మామూలు భోజనం పదిమంది పేద లకు పెట్టటం లేదా వారికి కట్టుబట్టలు ఇవ్వటం లేదా ఒక బానిసను స్వతంత్రునిగా చెయ్యటం. ఈ స్తోమత లేనివారు మూడు రోజులపాటు ఉపవాసం ఉండాలి. మీరు ప్రమాణం చేసి భంగపరిస్తే మీ ప్రమాణా లకు పరిహారం ఇది. మీరు మీ ప్రమాణా లను కాపాడుకోండి." *(అల్‌మాయిద: 89)*

### ముఖ్యాంశాలు

ఒక విషయం ఆ విధంగా జరగకపోయినప్పటికీ దాని గురించి తనకు తెలిసినది

చెబుతూ దాని మీద ప్రమాణం చేయటం లేదా ప్రమాణం చేసే ఉద్దేశ్యం లేకపోయినా అలవాటు ప్రకారం నోటి నుండి దైవంసాక్షి! అనే పదాలు వెలువడటాన్ని పొరపాటు వల్ల జరిగే ప్రమాణాలుగా భావించవచ్చు. ఈ ప్రమాణాలు అబద్ధాలుగా తేలినా వాటికి పరిహారం చెల్లించవలసిన అవసరం లేదు. పరలోకంలో కూడా వీటి గురించి ప్రశ్నించటం జరగదు. ప్రమాణాలను కాపాడుకోవటమంటే ప్రతి చిన్న విషయానికీ ప్రమాణం చేయకుండా ఉండటం, చేసిన ప్రమాణాలను పూర్తి చేయటం అని భావం.

١٧٢١ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: أُنزِلَتْ هٰذِهِ الآيَةُ: ﴿ لَا يُؤَاخِذُكُمُ اللَّهُ بِاللَّغْوِ فِي أَيْمَٰنِكُمْ ﴾ في قَوْلِ الرَّجُلِ: لا وَاللهِ! وَبَلَى واللهِ! رواه البخاري.

1721. హ్రజత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: "మీరు చేసే అర్థంలేని ప్రమాణాల విషయంలో అల్లాహ్ మిమ్మల్ని పట్టుకోడు" అనే దివ్యఖుర్ఆన్ సూక్తి (ప్రమాణ ఉద్దేశ్యం లేకుండా మాటి మాటికీ) "దైవంసాక్షి! ఎందుకు కాదు దైవం సాక్షి" అని అంటూ ఉండేవాని విషయంలో అవతరించింది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తఫ్సీర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఇంతకు ముందు అధ్యాయంలో, ఈ అధ్యాయంలో వచ్చిన సూక్తుల్ని గమనిస్తే మనకు మూడు రకాల ప్రమాణాలున్నట్లు తెలుస్తుంది. ఒకటి అబద్ధపు ప్రమాణం; దీని గురించి ఇంతకుముందు తెలుసుకున్నాం. రెండోది పొరపాటు వల్ల చేసే ప్రమాణం; దీనికి పాపంగాని, పరిహారంగాని లేదు. ఇకపోతే మూడోది యమీనె మున్అఖిదహ్. అంటే భవిష్యత్తులో ఏదో ఒక పని చేస్తాననో లేక చెయ్యను అనో మనస్ఫూర్తిగా ప్రమాణం చేయటం. ఈ ప్రమాణాన్ని భంగపరిస్తే పైన దివ్యఖుర్ఆన్ సూక్తిలో పేర్కొనబడినట్లు పరిహారం చెల్లించవలసి ఉంటుంది.

2) ప్రమాణ భంగానికి చెల్లించవలసిన పరిహారంలో పదిమంది నిరుపేదలకు మధ్యరకపు అన్నం తినిపించాలని ప్రస్తావించబడింది. కాని ఆ అన్నం పరిమాణం ఎంత ఉండాలి? అన్న విషయంలో మాత్రం ప్రామాణిక హదీసులు ఏవీ లేవు. కొందరు పండితులు ఉదయం మరియు రాత్రి భోజనమంత అని పేర్కొన్నారు. మరికొందరు- రమజాన్ నెలలో ఉపవాసం ఉండి భార్యతో సంభోగించేవాడు చెల్లించవలసిన పరిహారం ప్రస్తావన ఉన్న హదీసుని నిదర్శనంగా చేసుకొని ప్రమాణ భంగానికి కూడా ఒక్కో నిరుపేదకు ఒక 'ముద్'

ఆహారం ఇవ్వాలని నిర్ణయించారు. ఎందుకంటే ఆ హదీసులో దైవప్రవక్త (సల్లం) అరవైమంది నిరుపేదలకు పంచిపెట్టటం కోసం సదరు వ్యక్తికి పదిహేను 'సా'ల ఖర్జూరాలు ఇచ్చారు. ఒక 'సా' నాలుగు 'ముద్'లకు సమానమైన కొలమానం. ఈ విధంగా పదిమంది నిరుపేదలకు కూరతో నిమిత్తం లేకుండా పది ముద్‌ల (దాదాపు 6 1/4 కి.గ్రా.ల) ఆహారం ఇవ్వవలసి ఉంటుంది (ఇబ్నెకసీర్). అంటే ఆరు కిలోల పిండిగాని, బియ్యంగాని, ఖర్జూరపండ్లుగాని ఇవ్వాలి. ఒకవేళ చెలామణి ప్రకారం పదిమంది నిరుపేదలకు ఒకపూట మధ్యరకపు అన్నం తినిపించినా మా దృష్టిలో అది సరిపోతుంది. వాస్తవం అల్లాహ్‌కే బాగా తెలుసు.



318 వ అధ్యాయం

## ٣١٨ - بَابُ كَرَاهَةِ الْحَلِفِ فِي الْبَيْعِ وَإِنْ كَانَ صَادِقاً

## చెప్పేది నిజమయినప్పటికీ లావాదేవీల్లో ప్రమాణం చేయటం అవాంఛనీయం

١٧٢٢ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «الحَلِفُ مَنْفَقَةٌ لِلسِّلْعَةِ، مَمْحَقَةٌ لِلْكَسْبِ» متفقٌ عليه.

1722. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: "ప్రమాణం వల్ల సరుకు బాగా అమ్ముడు పోవచ్చు. కాని దానివల్ల శుభం అంతరిస్తుంది."

(బుఖారీ-ముస్లిం)

١٧٢٣ - وَعَنْ أَبِي قَتَادَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِيَّاكُمْ وَكَثْرَةَ الحَلِفِ فِي الْبَيْعِ، فَإِنَّهُ يُنْفِقُ ثُمَّ يَمْحَقُ» رواه مسلم.

1723. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ ఖతాదా (రజి) తెలియజేశారు: వర్తకం చేసేటప్పుడు ఎక్కువగా ప్రమాణాలు చేయకుండా జాగ్రత్త పడండి. ఎందుకంటే దానివల్ల సరుకయితే ఎక్కువగా అమ్ముడు పోతుంది కాని ఈ పోకడ శుభాన్ని అంతరింపజేస్తుంది.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)

## 319 వ అధ్యాయం

٣١٩ - بَابُ كَرَاهَةِ أَنْ يَسْأَلَ الإِنْسَانُ بِـوَجْـهِ اللهِ عَـزَّ وَجَـلَّ غيـرَ الْجَنَّـةِ، وَكَرَاهَةِ منعِ مَنْ سَأَلَ باللهِ تَعَالَى وَتَشَفَّعَ بِهِ

**అల్లాహ్‌ను స్వర్గంగాకుండా వేరితర వస్తువులు ప్రసాదించమని అర్థించటం అవాంఛనీయం, అలాగే ఎవరైనా అల్లాహ్ పేరు తీసుకొని యాచిస్తే లేక అల్లాహ్ పేరు తీసుకొని మరీ ఎవరి గురించి అయినా సిఫారసు చేస్తే వారికి ఇవ్వకుండా ఉండటం, వారి సిఫారసును ఆమోదించకపోవటం కూడా అవాంఛనీయమే.**

١٧٢٤ - عَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا يُسْأَلُ بِوَجْهِ اللهِ إِلَّا الجَنَّةُ» رواه أبو داود.

1724. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ పేరుని ఆధారంగా చేసుకొని స్వర్గాన్ని తప్ప మరే ఇతర వస్తువునీ యాచించటం తగదు. (అబూదావూద్)

*(సునన్ అబూదావూద్‌లోని జకాత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

గమనిక: ఈ హదీసుని ఆధారంగా చేసుకొని పై శీర్షిక సారాంశాన్ని నిరూపించటానికి ప్రయత్నించటం ఎన్నో విధాలుగా సమంజసం కాదని షేఖ్ అల్‌బానీ (రహ్మలై)గారు అభిప్రాయపడ్డారు.

1) ఆధారాల రీత్యా ఈ హదీసు బలహీనమైనది. 2) ఒకవేళ దీని ప్రామాణికతను ఒప్పుకున్నప్పటికీ దీని ఆధారంగా 'అల్లాహ్‌ను స్వర్గం తప్ప మరే వస్తువునూ అర్థించరాదు' అన్న విషయాన్ని నిరూపించటం మాత్రం సరికాదు. మహా అంటే దీని ద్వారా మనం అల్లాహ్‌ను శాశ్వతమైన స్వర్గాన్ని వదలిపెట్టి తాత్కాలికమైన ప్రాపంచిక ప్రయోజనాలను కోరుకోవటం సమంజసం కాదని మాత్రం చెప్పగలం. అంతేగాని, దీనికంటే సూక్ష్మమైన భావం ఏదీ ఇందులో లేదు. ఒక వ్యక్తి నేరుగా స్వర్గాన్ని కోరకుండా స్వర్గానికి గొనిపోయే సన్మార్గాన్ని,

రుజువర్తనను ప్రసాదించమని అల్లాహ్‌ను వేడుకున్నాడనుకోండి, దాన్ని మనం నిషిద్ధకార్యంగా తలపోయలేము కదా! 3) ఇంకో విషయం ఏమిటంటే గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై)గారు శీర్షికలో అలా చేయటం అవాంఛనీయం అని అన్నారు గాని నిషిద్ధం అని మాత్రం అనలేదు. ఇమామ్ నవవీగారు షాఫయీలను అనుసరిస్తారు. షాఫయీలు అవాంఛనీయం (కరాహత్) అన్న పదాన్ని 'నిషిద్ధం' (హరామ్, మమ్నూ) అన్న అర్థంలోగాకుండా కేవలం అయిష్టకరం అన్న అర్థంలో మాత్రమే తీసుకుంటారన్న విషయం కూడా ఈ సందర్భంగా గమనార్హం. (అల్‌బానీ గారి తాలీఖాతుల్ మిష్కాత్, మొదటి సంపుటి 605వ పేజి). మొత్తానికి బోధపడే దేమిటంటే అల్లాహ్‌ను ప్రాపంచిక ప్రయోజనాలు ప్రసాదించమని ప్రార్థించటం అయిష్టకరం. అయితే అసలు ప్రాపంచిక వస్తువుల కోసం ప్రార్థించరాదని మాత్రం ఎక్కడా లేదు.

١٧٢٥ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنِ اسْتَعَاذَ بِاللهِ، فَأَعِيذُوهُ، وَمَنْ سَأَلَ بِاللهِ، فَأَعْطُوهُ، وَمَنْ دَعَاكُمْ، فَأَجِيبُوهُ، وَمَنْ صَنَعَ إِلَيْكُمْ مَعْرُوفاً فَكَافِئُوهُ، فَإِنْ لَمْ تَجِدُوا مَا تُكَافِئُونَهُ، فَادْعُوا لَهُ حَتَّى تَرَوْا أَنَّكُمْ قَدْ كَافَأْتُمُوهُ» حَدِيثٌ صَحِيحٌ رواه أَبُو داود، والنسائي بأسانيدِ الصحيحين.

1725. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దేవుని పేరు తీసుకొని ఎవరైనా మిమ్మల్ని శరణు వేడితే వారికి శరణు ఇవ్వండి. దేవుని పేరు మీద ఏదైనా అడిగితే వారికి ఇచ్చేయండి. ఎవరైనా మిమ్మల్ని ఆహ్వానిస్తే ఆ ఆహ్వానాన్ని అంగీకరించండి. మీకు ఎవరైనా ఉపకారం చేస్తే మీరు దానికి ప్రత్యుపకారం చేయండి. ప్రత్యుపకారం చేసే స్తోమత గనక మీలో లేకపోతే వారి శ్రేయస్సు కోసం ప్రార్థించండి. మీకు వారి ఋణం తీర్చుకున్నామని నమ్మకం కలిగేంత వరకూ (ఆ విధంగా ప్రార్థిస్తూ ఉండండి.)

ఈ హదీసు సహీహ్ కోవకు చెందినది. అబూదావూద్ మరియు నసాయీలు దీనిని బుఖారీ-ముస్లింల ఆధారాలతో వెలికితీశారు.

*(సుననె అబూదావూద్‌లోని జకాత్ ప్రకరణం చివర్లో - సుననె నసాయిలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) దేవుని పేరు తీసుకొని అర్థించటంలో తప్పులేదు. 2) ఆ విధంగా దేవుని పేరు తీసుకొని అర్థించేవారిని ఒట్టి చేతులతో త్రిప్పిపంపకూడదు. దైవనామం గౌరవార్థం వారి అవసరాన్ని తీర్చాలి. అయితే ముష్టైత్తే వృత్తికి పాల్పడుతున్న వారికి ఇవ్వకుండా ఉండటం మంచిది. దానివల్ల ఇస్లామీయ రాజ్యంలో భిక్షాటనను నిరుత్సాహపరచినట్లవుతుంది. 3) ఉపకారానికి బదులుగా ఉపకారం చేయాలి. ఒకవేళ స్తోమత లేకపోతే ఉపకారి శ్రేయస్సు కోసం అత్యంత ఎక్కువగా ప్రార్థించాలి. ప్రార్థించటం కూడా రుణం తీర్చుకోవటానికి ఒక రూపం. 4) ఆహ్వానించబడిన చోట ధర్మవిరుద్ధకార్యాలు జరగకుంటే అలాంటి ఆహ్వానాన్ని తప్పకుండా స్వీకరించాలి.



## 320 వ అధ్యాయం

## ٣٢٠ - باب تحريم قوله شاهنشاه للسلطان وغيره لأن معناه ملك الملوك ولا يوصف بذلك غير الله سبحانه وتعالى

## రాజులు మొదలగువారిని చక్రవర్తులు అని అనరాదు. చక్రవర్తి అంటే రాజాధిరాజు అని అర్థం. దేవుణ్ణి తప్ప ఇతరుల్ని ఆ పేరుపెట్టి పిలవటం సమంజసం కాదు

١٧٢٦ - عَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ أَخْنَعَ اسْمٍ عِنْدَ اللهِ عَزَّ وَجَلَّ رَجُلٌ تَسَمَّى مَلِكَ الأَمْلاكِ» متفقٌ عليه. قال سُفْيَانُ بنُ عُيَيْنَةَ «مَلِكُ الأَمْلاكِ» مِثْلُ شَاهِنْشَاه.

1726. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "తన పేరు రాజాధిరాజు అని పెట్టుకున్నవాడి పేరు దేవుని దృష్టిలో అత్యంత నీచమైన పేరు." (బుఖారీ-ముస్లిం)

హజ్రత్ సుఫ్యాన్ బిన్ ఉయైనా ఇలా అంటున్నారు: మలికుల్ అమ్లాక్ మరియు షహింషాహ్ అనేవి రెండూ ఒకలాంటి పేర్లే.

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఆదాబ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దేవుడు వినయవిధేయతల్ని, అణకువ భావాన్ని అత్యంత ఎక్కువగా ప్రేమిస్తాడు. దీనికి భిన్నంగా గర్వాహంకారాలను, పొగరుమోతుతనాన్ని విపరీతంగా అసహ్యించుకుంటాడు. చక్రవర్తి, రాజాధిరాజు అని పిలిపించుకోవటంలో అహంకారం తొంగిచూస్తుంది. అదీగాక ఈ లక్షణం కేవలం అల్లాహ్‌కు మాత్రమే శోభిస్తుంది. కనుక ఇతరుల్ని ఆ పేర్లుపెట్టి పిలవటం ఏమాత్రం శోభించదు.

## 321 వ అధ్యాయం

# ٣٢١ ـ بَابُ النَّهْيِ عَنْ مُخَاطَبَةِ الْفَاسِقِ وَالْمُبْتَدِعِ وَنَحْوِهِمَا بِسَيِّدِي وَنَحْوِهِ

# పాపాత్ముణ్ణి, ధర్మంలో కొత్త పోకడలకు పాల్పడేవాణ్ణి, సర్దారు మొదలగు గౌరవపదాలతో సంబోధించరాదు

١٧٢٧ ـ عن بُرَيْدَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَقُولُوا لِلْمُنَافِقِ سَيِّدٌ، فَإِنَّهُ إِنْ يَكُ سَيِّداً، فَقَدْ أَسْخَطْتُمْ رَبَّكُمْ عَزَّ وَجَلَّ» رواه أبو داود بإسنادٍ صحيحٍ.

1727. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: కపటిని సర్దారు అని సంబోధించకండి. ఎందుకంటే అతను సర్దారు అయితే మీరు మీ ప్రభువుని మీ పట్ల అప్రసన్నుడ్ని చేసుకున్న వారవుతారు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

## 322 వ అధ్యాయం

## ٣٢٢ ـ بَابُ كَرَاهَةِ سَبِّ الْحُمَّى

## జ్వరాన్ని తూలనాడటం తగదు

١٧٢٨ ـ عَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ دَخَلَ عَلَى أُمِّ السَّائِبِ، أَوْ أُمِّ الْمُسَيَّبِ فَقَالَ: «مَا لَكِ يَا أُمَّ السَّائِبِ ـ أَوْ يَا أُمَّ الْمُسَيَّبِ ـ تُزَفْزِفِينَ؟» قَالَتْ: الْحُمَّى لا بَارَكَ اللهُ فِيهَا! فَقَالَ: «لا تَسُبِّي الْحُمَّى، فَإِنَّهَا تُذْهِبُ خَطَايَا بَنِي آدَمَ، كَمَا يُذْهِبُ الْكِيرُ خَبَثَ الْحَدِيدِ» رواه مسلم.
«تُزَفْزِفِينَ» أَيْ: تَتَحَرَّكِينَ حَرَكَةً سَرِيعَةً، وَمَعْنَاهُ: تَرْتَعِدُ، وَهُوَ بضمِّ التاءِ وبالزاي المكررة، والفاءِ المكررة، ورُوِي أيضاً بالراءِ المكررةِ والقافين.

1728. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఉమ్మె సాయిబ్ లేక ఉమ్మె ముసయ్యబ్ ఇంటికి వెళ్ళి, "ఉమ్మె సాయిబ్! (లేక ఉమ్మె ముసయ్యబ్!) ఏమయింది నీకు? వణుకుతున్నావేమిటి?" అని అడిగారు. అందుకామె, "జ్వరం ఉందండి. దేవుడు ఇందులో వృద్ధిని ప్రసాదించకుండా ఉండుగాక!" అని సమాధానమిచ్చింది. ఆమె సమాధానం విని ఆయన "జ్వరాన్ని తిట్టకు. ఎందుకంటే ఇది మనిషి వల్ల జరిగే (చిన్నపాటి) పాపాలను, బట్టీ ఇనుము తుప్పును దూరం చేసినట్లు దూరం చేస్తుంది" అని చెప్పారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని బిర్ర్, సిలా ప్రకరణం)*

## 323 వ అధ్యాయం

## ٣٢٣ ـ بَابُ النَّهْيِ عَنْ سَبِّ الرِّيحِ، وبيَانِ مَا يُقَالُ عِنْدَ هُبُوبِهَا

## గాలిని తిట్టరాదు, గాలి వీచేటప్పుడు దుఆ చేయటం

١٧٢٩ ـ عَنْ أَبي المُنْذِرِ أُبَيِّ بْنِ كَعْبٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَسُبُّوا الرِّيحَ، فَإذَا رَأَيْتُمْ مَا تَكْرَهُونَ، فَقُولُوا: اللَّهُمَّ إنَّا نَسْأَلُكَ مِنْ خَيْرِ هٰذِهِ الرِّيحِ وَخَيْرِ مَا فِيهَا وَخَيْرِ مَا أُمِرَتْ بِهِ، وَنَعُوذُ بِكَ مِنْ شَرِّ هٰذِهِ الرِّيحِ وَشَرِّ مَا فِيهَا وَشَرِّ مَا أُمِرَتْ بِهِ» رواه الترمذي وقَالَ: حَديثٌ حسنٌ صحيح.

1729. హజ్రత్ అబుల్ ముంజిర్ ఉబై బిన్ కాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: గాలిని తిట్టకండి. మీకు భరించశక్యం కానిది (తుఫాను) గనక కనిపిస్తే ఈ విధంగా ప్రార్థించండి: "ఓ అల్లాహ్! మేము నీ నుండి ఈ పెనుగాలుల ప్రయోజనాన్ని, వీటిలో ఉన్న ప్రయోజనాన్ని, ఏ ఉద్దేశ్యంతో ఈ గాలుల్ని పంపటం జరిగిందో దాని ప్రయోజనాన్ని కోరుకుంటున్నాము. ఈ పెనుగాలుల వల్ల నష్టం జరగటం నుండి, వీటిలో ఉన్న కీడు నుండి, ఏ ఉద్దేశ్యంతో ఈ గాలుల్ని పంపటం జరిగిందో దాని కీడు నుండి నీ శరణు వేడుతున్నాము."

(తిర్మిజీ-హసన్ సహీహ్)

(సుననె తిర్మిజీలోని ఫితన్ అధ్యాయాలు)

١٧٣٠ ـ وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ:

1730. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: గాలి దేవుని కారుణ్యం. అది కారుణ్యం తీసుకొని వస్తుంది. (అప్పుడప్పుడూ) శిక్ష

«الرِّيحُ مِنْ رَوْحِ اللهِ، تَأْتِي بِالرَّحْمَةِ، وَتَأْتِي بِالْعَذَابِ، فَإِذَا رَأَيْتُمُوهَا فَلا تَسُبُّوهَا، وَسَلُوا اللهَ خَيْرَهَا، واسْتَعِيذُوا بِاللهِ مِنْ شَرِّهَا» رواه أبو داود بإسنادٍ حسنٍ. قوله ﷺ: «مِنْ رَوْحِ اللهِ» هو بفتح الراءِ، أَيْ: رَحْمَتِهِ بِعِبَادِهِ.

తెస్తుంది. మీరు దాన్ని చూసినప్పుడు దాన్ని తిట్టకండి. దానిలోని మంచిని ప్రసాదించమని దేవుణ్ణి కోరండి. దాని కీడు నుండి శరణు వేడండి. (అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన అధారాలతో వెలికి తీశారు.)

*(సునసె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

١٧٣١ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ النَّبِيُّ ﷺ إِذَا عَصَفَتِ الرِّيحُ قَالَ: «اللَّهُمَّ إِنِّي أَسْأَلُكَ خَيْرَهَا، وَخَيْرَ مَا فِيهَا، وَخَيْرَ مَا أُرْسِلَتْ بِهِ، وَأَعُوذُ بِكَ مِنْ شَرِّهَا، وَشَرِّ مَا فِيهَا، وَشَرِّ مَا أُرْسِلَتْ بِهِ» رواه مسلم.

1731. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: పెనుగాలులు వీచినప్పుడు దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించేవారు: ఓ అల్లాహ్! నేను నీ నుండి వీటి ప్రయోజనాన్ని, వీటిలో ఉన్న ప్రయోజనాన్ని, ఏ ఉద్దేశ్యంతో వీటిని పంపటం జరిగిందో దాని ప్రయోజనాన్ని కోరుకుంటున్నాను. ఈ పెనుగాలుల వల్ల నష్టం జరగటం నుండి, వీటిలో ఉన్న కీడు నుండి, ఏ ఉద్దేశ్యంతో వీటిని పంపటం జరిగిందో దాని కీడు నుండి నీ శరణు వేడుతున్నాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సలాతుల్ ఇస్తిస్ఖా ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1) ఇతర దైవానుగ్రహాల మాదిరిగా గాలి కూడా ఒక దైవానుగ్రహమే. మానవుని ఆరోగ్యానికి, ఉపాధి వనరులకు అది చాలా అవసరం. అయితే దేవుడే గనక తలచుకుంటే ఆయన ఆ గాలిలో సాంద్రతను, వేగాన్ని పెంచి దాన్నే వినాశకారిగా కూడా మార్చగలడు. కనుక దైవసన్నిధిలో దానిలోని మంచిని కోరుకొని దాని చెడుల నుండి శరణు వేడుకోవాలి.

2) విశ్వాసి అయినవాడు తోటి మనుషుల్నే తిట్టడు. అలాంటప్పుడు నోరులేని జంతువుల్ని, ప్రకృతి వనరుల్ని తిట్టటం అతనికి అసలే శోభించదు.

**324 వ అధ్యాయం**

## ٣٢٤ ـ بَابُ كَرَاهَةِ سَبِّ الدِّيكِ

## కోడి పుంజుని తిట్టటం అవాంఛనీయం

١٧٣٢ ـ عَنْ زَيْدِ بْنِ خَالِدِ الْجُهَنِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تَسُبُّوا الدِّيكَ، فَإِنَّهُ يُوقِظُ لِلصَّلَاةِ» رواه أبو داودَ بإسنادٍ صحيحٍ.

1732. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ జుహనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: "కోడి పుంజుని తిట్టకండి. అది నమాజ్‌కు మేల్కొలుపుతుంది". *(అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)*

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ రోజుల్లో లౌడ్ స్పీకర్ల ద్వారా అజాన్ (నమాజ్ ప్రకటన) చెబుతున్నారు. అందుకని కోడికూత ప్రయోజనం మనకు బోధపడటం లేదు. ఈ లౌడ్‌స్పీకర్లు కనుగొనక ముందు ముఅజ్జిన్‌లు చేసే అజాన్ ప్రకటనలు మస్జిద్ చుట్టుప్రక్కల ఇండ్లకు మాత్రమే వినిపించేవి. అలాంటప్పుడు మస్జిద్‌కు దూరంగా ఉండే ప్రజల్ని ఈ కోడికూతలే తహజ్జుద్ కోసం, ఫజ్ర్ నమాజ్ కోసం మేల్కొలిపేవి. ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే సత్కార్యంలో ఏ విధంగా పాలుపంచుకున్నవారయినా సరే- అందరినీ గౌరవించాలి. తాము కూడా ప్రజల సత్కార్యాల్లో పాలుపంచుకొని దేవుని దగ్గర మంచి ప్రతిఫలం పొందటానికి కృషి చేయాలి.



## 325 వ అధ్యాయం

## ٣٢٥ ـ بَابُ النَّهْيِ عَنْ قَوْلِ الإِنْسَانِ: مُطِرْنَا بِنَوْءِ كَذَا

## ఫలానా నక్షత్రం మూలంగా మాకు వర్షం కురిసింది అని చెప్పరాదు

١٧٣٣ ـ عَنْ زَيْدِ بْنِ خَالِدٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: صَلَّى بِنَا رَسُولُ اللهِ ﷺ صَلاةَ الصُّبْحِ بِالحُدَيْبِيَةِ فِي إِثْرِ سَمَاءٍ كَانَتْ مِنَ اللَّيْلِ، فَلَمَّا انْصَرَفَ أَقْبَلَ عَلَى النَّاسِ، فَقَالَ: «هَلْ تَدْرُونَ مَاذَا قَالَ رَبُّكُمْ؟» قَالُوا: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ. قَالَ: «قَالَ: أَصْبَحَ مِنْ عِبَادِي مُؤْمِنٌ بِي، وَكَافِرٌ، فَأَمَّا مَنْ قَالَ مُطِرْنَا بِفَضْلِ اللهِ وَرَحْمَتِهِ، فَذَلِكَ مُؤْمِنٌ بِي كَافِرٌ بِالْكَوْكَبِ، وَأَمَّا مَنْ قَالَ: مُطِرْنَا بِنَوْءِ كَذَا وَكَذَا، فَذَلِكَ كَافِرٌ بِي مُؤْمِنٌ بِالْكَوْكَبِ» متفقٌ عليه. وَالسَّماءُ هُنَا: المَطَرُ.

1733. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మాకు హుదైబియా ప్రాంతంలో ఫజ్ర్ నమాజ్ చేయించారు. వర్షం కురిసిన రాత్రి తర్వాత జరిగిన సంఘటన ఇది. నమాజ్ ముగిసిన తర్వాత ఆయన ప్రజలవైపు తిరిగి, "మీ ప్రభువు, ఏమన్నాడో తెలుసా?" అని అడిగారు. దేవుడికి, దైవప్రవక్తకే బాగా తెలుసు అని చెప్పారు వారు. అప్పుడాయన దేవుడు ఇలా అన్నాడని వారికి చెప్పారు: తెల్లవారేటప్పటికి నా దాసుల్లో కొందరు నన్ను విశ్వసించారు, మరికొందరు తిరస్కరించారు. దైవానుగ్రహం వల్ల, ఆయన కారుణ్యం వల్ల మాకు వర్షం కురిసింది అని చెప్పినవారు నన్ను విశ్వసించారు, నక్షత్రాల (శక్తి)ను తిరస్కరించారు. దీనికి భిన్నంగా ఫలానా ఫలానా నక్షత్రం మూలంగా వర్షం కురిసిందని చెప్పినవారు నన్ను తిరస్కరించారు, నక్షత్రాలను విశ్వసించారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

విశ్వంలో జరిగే పనులు, సంఘటనలన్నిటికీ మూల కారకుడు దేవుడు ఒక్కడే. బాహ్యపరంగా వాటికి ఏవైనా కారణాలుండవచ్చు. కాని అంతిమంగా ఈ పనులన్నిటికీ కారకుడిగా దేవుణ్ణే భావించాలి. ఈ నమ్మకంతో కొన్ని కొన్ని సందర్భాల్లో పనులు ఫలానా కారణాల వల్ల జరిగాయని చెప్పటంలోనూ తప్పులేదు. కాని బహుదైవారాధకులు భావించి నట్లు కారణాలనే కర్తలుగా భావించరాదు.



## 326 వ అధ్యాయం

## ٣٢٦ ـ بَابُ تَحْرِيمِ قَوْلِهِ لِمُسْلِمٍ: يَا كَافِرُ

## ఒక ముస్లింని 'ఓయీ దైవతిరస్కారీ!' అని పిలవటం నిషిద్ధం

1734. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి తన (ముస్లిం) సోదరుణ్ణి, "ఓయీ దైవ తిరస్కారీ!" అని అంటే రెండు విషయాల్లో ఏదో ఒకటి అవుతుంది. ఆ వ్యక్తి నిజంగానే కాఫిర్ అయితేసరే; లేదా ఆ మాట తన వైపునకే తిరిగి వస్తుంది. (బుఖారీ-ముస్లిం)

١٧٣٤ ـ عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذَا قَالَ الرَّجُلُ لأَخِيهِ: يَا كَافِرُ! فَقَدْ بَاءَ بِهَا أَحَدُهُمَا، فَإِنْ كَانَ كَمَا قَالَ وَإِلَّا رَجَعَتْ عَلَيْهِ» مُتَّفَقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

1735. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ జర్ర్ (రజి) తెలియజేశారు: ఒక మనిషిని కాఫిర్ (దైవ తిరస్కారి) అనిగాని లేక 'అదువ్వుల్లాహి' (దైవవిరోధి) అనిగాని పిలిస్తే, అతను అలాంటివాడు కాని పక్షంలో ఆ మాట పిలిచినవాడి వైపునకే తిరిగి వస్తుంది. (బుఖారీ-ముస్లిం)

١٧٣٥ ـ وَعَنْ أَبِي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «مَنْ دَعَا رَجُلًا بِالْكُفْرِ، أَوْ قَالَ: عَدُوَّ اللهِ، وَلَيْسَ كَذَلِكَ إِلَّا حَارَ عَلَيْهِ» متفقٌ عليه. «حَارَ»: رَجَعَ.

(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

అనవసరంగా ఒక ముస్లింని దైవతిరస్కారి అనో లేక దైవవిరోధి అనో పిలవరాదని ఈ హదీసులో బోధించటం జరిగింది. అయితే తన్ను తాను ముస్లింగా చెప్పుకునే వాడెవడైనా ధర్మం లోని ప్రాథమిక విషయాల్లో దేన్నయినా తిరస్కరించినప్పుడు ఇతర ముస్లింలను అతని మార్గభ్రష్టత్వం నుండి కాపాడటం కోసం అతన్ని ప్రజలముందు ధర్మతిరస్కారి (కాఫిర్)గా పేర్కొనటం అవసరం. ఇది గర్హనీయం కాదు. పైగా ఇస్లామీయ విశ్వాసాల పరిరక్షణ కోసం ఇలా చేయటం చాలా అవసరం.

327 వ అధ్యాయం

# ٣٢٧ ـ بَابُ النَّهْيِ عَنِ الْفُحْشِ وَبَذَاءِ اللِّسَانِ

## అశ్లీలపు మాటలు పలుకరాదు, దుర్భాషలాడరాదు

١٧٣٦ ـ عَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَيْسَ الْمُؤْمِنُ بِالطَّعَّانِ، وَلا اللَّعَّانِ، وَلا الْفَاحِشِ، وَلا الْبَذِيِّ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

1736. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: విశ్వాసి దెప్పి పొడిచేవాడు, శాపనార్థాలు పెట్టేవాడు, అశ్లీలపు మాటలు మాట్లాడేవాడు, దుర్భాషలాడేవాడు కాడు.

*(తిర్మిజీ దీనిని వెలికితీసి హసన్ కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు.)*

*(సుననె తిర్మిజీలోని బిర్ర్, సిలా అధ్యాయాలు)*

١٧٣٧ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَا كَانَ الْفُحْشُ فِي شَيْءٍ إِلَّا شَانَهُ، وَمَا كَانَ الحَيَاءُ فِي شَيْءٍ إِلَّا زَانَهُ» رواه الترمذي وقال: حديثٌ حسن.

1737. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఏ వస్తువులోనయినా అశ్లీలం ఉంటే అది దాన్ని లోప భూయిష్టంగా మారుస్తుంది. ఏ వస్తువు లోనయినా వ్రీడ ఉంటే అది ఆ వస్తువును అందంగా మలుస్తుంది. *(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్ కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు.)*

*(సుననె తిర్మిజీలోని బిర్ర్, సిలా అధ్యాయాలు)*

## 328 వ అధ్యాయం

## ٣٢٨ - بَابُ كَرَاهَةِ التَّقْعِيرِ فِي الْكَلَامِ بِالتَّشَدُّقِ، وَتَكَلُّفِ الْفَصَاحَةِ، وَاسْتِعْمَالِ وَحْشِيِّ اللُّغَةِ وَدَقَائِقِ الْإِعْرَابِ فِي مُخَاطَبَةِ الْعَوَامِّ وَنَحْوِهِمْ

## అసహజంగా మాట్లాడటం.... ఒకరిని ఉద్దేశించి మాట్లాడేటప్పుడు వారికి అర్థంకాని పదాలు ప్రయోగించటం, ఒత్తులు, పొల్లులను గురించి చాదస్తంగా వ్యవహరించటం తగదు

١٧٣٨ - عَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «هَلَكَ الْمُتَنَطِّعُونَ» قَالَهَا ثَلاثاً. رَواهُ مُسْلِم. «الْمُتَنَطِّعُونَ»: الْمُبَالِغُونَ في الأُمُورِ.

1738. హ[జత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అతిశయోక్తులతో మరీ ఇబ్బందిపడుతూ మాట్లాడే వారు నాశనమవుతారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట మూడుసార్లు అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విద్యాప్రకరణం)*

### ముఖ్యాంశాలు

"ముతనత్తిఊన్" అంటే వెంట్రుక తోలు వలిచేవారు, అనవసరమైన వాదనలు చేసుకునేవారు, మేధకందని విషయాల్లో జోక్యం చేసుకునేవారు, అతిశయోక్తులు మాట్లాడే వారు, ఒయ్యారాలు పోతూ మాట్లాడేవారు, తమ సంభాషణా చాతుర్యాన్ని ప్రదర్శించేవారు అని అర్థం. ఈ హదీసు మనల్ని మాటల్లో చేతల్లో అతిశయానికి పాల్పడరాదనీ, వ్యవహారాలన్నిటిలోనూ సాదాసీదాగా ఉండాలని ప్రబోధిస్తోంది.

١٧٣٩ - وَعَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرِو بْنِ العَاصِ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ اللهَ يُبْغِضُ الْبَلِيغَ مِنَ الرِّجَالِ الَّذِي يَتَخَلَّلُ بِلِسَانِهِ كَمَا تَتَخَلَّلُ الْبَقَرَةُ».

1739. హ[జత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఆవు నెమరు వేసినట్లు తమ

رَوَاهُ أبو داودَ، والترمذي وقال: حديثٌ حسن.

నాలుకను మాటిమాటికీ తిప్పుతూ తమ వాక్చాతుర్యాన్ని ప్రదర్శించే వారిని అల్లాహ్ చాలా అసహ్యించుకుంటాడు.

(అబూదావూద్, తిర్మిజీ-హసన్)

(సునన్ అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం - సునన్ తిర్మిజీలోని అదబ్ అధ్యాయాలు)

١٧٤٠ ـ وَعَنْ جَابِرِ بْنِ عَبْدِ اللهِ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ مِنْ أَحَبِّكُمْ إِلَيَّ، وَأَقْرَبِكُمْ مِنِّي مَجْلِساً يَوْمَ الْقِيَامَةِ، أَحَاسِنَكُمْ أَخْلاقاً، وَإِنَّ أَبْغَضَكُمْ إِلَيَّ، وَأَبْعَدَكُمْ مِنِّي يَوْمَ الْقِيَامَةِ، الثَّرْثَارُونَ، وَالْمُتَشَدِّقُونَ، وَالْمُتَفَيْهِقُونَ» رواه الترمذي وقال: حديثٌ حسن، وقد سبق شرحُهُ في باب حُسْنِ الخُلقِ.

1740. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో నీతినడవడికల్లో అందరికంటే మంచివారు ప్రళయ దినాన నాకు అత్యంత ప్రియతములుగా, నాకు అత్యంత సమీపంలో కూర్చొని ఉంటారు. దీనికి భిన్నంగా వదరుబోతులు, పగలబడి మాట్లాడే వారు, లొడలొడా మాట్లాడే వారు ప్రళయదినాన నాకు అత్యంత అయిష్టులుగా, నాకు అందరికంటే దూరంలో ఉంటారు.

తిర్మిజీ దీనిని వెలికితీసి హసన్ కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు. ఇంతకుముందు ఉత్తమ నడవడిక అనే అధ్యాయంలో దీని వివరణ వచ్చింది.

(సునన్ తిర్మిజీలోని బిర్ర్, సిలా అధ్యాయాలు)

**329 వ అధ్యాయం**

## ٣٢٩ ـ بابُ كَرَاهَةِ قَوْلِهِ : خَبُثَتْ نَفْسِي

## నా మనసు మలినమయి పోయిందని చెప్పరాదు

١٧٤١ ـ عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لَا يَقُولَنَّ أَحَدُكُمْ خَبُثَتْ نَفْسِي، وَلٰكِنْ لِيَقُلْ: لَقِسَتْ نَفْسِي» متفقٌ عليه. قَالَ الْعُلَمَاءُ: مَعْنَى خَبُثَتْ غَثَتْ، وَهُوَ مَعْنَى «لَقِسَتْ» وَلٰكِنْ كَرِهَ لَفْظَ الْخُبْثِ.

1741. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: మీలో ఎవరూ కూడా నా మనసు మలినమయిందని చెప్పరాదు. దానికి బదులు నా మనసు బాగా లేదని చెప్పాలి.

(బుఖారీ-ముస్లిం).

పండితుల అభిప్రాయం ప్రకారం 'ఖబుసత్' అంటే చెడిపోయిందని అర్థం. 'లఖిసత్' అన్నా కూడా అదే అర్థం వస్తుంది. కాని ఖబుసత్ అనే పదం వాడటం దైవప్రవక్త (సల్లం)కు ఇష్టంలేదు.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని అదబ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు మాట్లాడే పద్ధతిని నేర్పిస్తున్నదనీ, మంచి పదం ఉన్నప్పుడు చెడు పదం వాడకూడదనే విషయాన్ని ప్రబోధిస్తోందనీ ఇమామ్ ఖత్తాబీ (రహ్మాలై) అభిప్రాయపడ్డారు (ఇబ్నె అల్లాన్).

330 వ అధ్యాయం

## ٣٣٠ ـ بَابُ كَرَاهَةِ تَسْمِيَةِ الْعِنَبِ كَرْماً

## ద్రాక్ష పండ్లను 'కర్మ్' అని అనరాదు

١٧٤٢ ـ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تُسَمُّوا الْعِنَبَ الْكَرْمَ، فَإِنَّ الْكَرْمَ الْمُسْلِمُ» متفقٌ عليه. وهذا لفظ مسلم. وفي رِوَايَةٍ: «فَإِنَّمَا الْكَرْمُ قَلْبُ الْمُؤْمِنِ». وفي رواية للبخاري ومسلم: «يَقُولُونَ الْكَرْمُ، إِنَّمَا الْكَرْمُ قَلْبُ الْمُؤْمِنِ».

1742. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ద్రాక్షపండ్లను 'కర్మ్' అని అనకండి, ఎందుకంటే కర్మ్ కేవలం ముస్లిం మాత్రమే అవగలడు. (బుఖారీ-ముస్లిం వాక్యాలు ముస్లింవి.)

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నిశ్చయంగా విశ్వాసి మనసు మాత్రమే కర్మ్ అవగలదు. బుఖారీ ముస్లింలోని ఇంకొక ఉల్లేఖనంలో ప్రజలు (ద్రాక్ష పండ్లను) కర్మ్ అని అంటుంటారు. కాని నిజానికి విశ్వాసి హృదయం మాత్రమే కర్మ్ (దయార్ద్రత గలది) అవగలదు.

*(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పదప్రయోగ ప్రకరణం)*

١٧٤٣ ـ وَعَنْ وَائِلِ بْنِ حُجْرٍ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لا تقُولُوا: الْكَرْمُ، وَلَكِنْ قُولُوا: الْعِنَبُ، وَالْحَبَلَةُ» رواه مسلم. «الْحَبَلَةُ» بفتح الحاءِ والباء، ويقال أيضاً بإسكان الباء.

1743. హజ్రత్ వాయిల్ బిన్ హుజ్ర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: (ద్రాక్షను) కర్మ్ అని అనకండి. ఇనబ్, హబ్లా అని అనండి. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పదప్రయోగ ప్రకరణం)*

**331 వ అధ్యాయం**

## ٣٣١ - بَابُ النَّهْيِ عَنْ وَصْفِ مَحَاسِنِ الْمَرْأَةِ لِرَجُلٍ لا يَحْتَاجُ إِلَى ذٰلِكَ لِغَرَضٍ شَرْعِيٍّ كَنِكَاحِهَا وَنَحْوِهِ

## వివాహం తదితర షరీఅత్ పరమైన అవసరం ఉంటే తప్ప స్త్రీ సుగుణాలను ఇతర పురుషుని ముందు వివరించరాదు

١٧٤٤ - عَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تُبَاشِرِ الْمَرْأَةُ الْمَرْأَةَ فَتَصِفَهَا لِزَوْجِهَا كَأَنَّهُ يَنْظُرُ إِلَيْهَا» متفقٌ عليه.

1744. హజ్రత్ ఇబ్నె మస్‌ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: ఏ స్త్రీ కూడా మరో స్త్రీతో శారీరక కలయిక చేయరాదు. ఎందుకంటే ఆ విధంగా కలయిక చేసిన స్త్రీ ఆమె అందచందాలను గురించి తన భర్తకు కళ్ళకు కట్టినట్లు చెప్పగలదు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

అరబీలో 'ముబాషరత్' అన్న పదం ఉపయోగించబడింది. ముబాషరత్ అంటే రెండు శరీరాల కలయిక. ఇతరుల శరీరం చూడటాన్ని కూడా కొన్ని సందర్భాల్లో చూచాయగా ముబాషరత్ అని చెప్పటం జరుగుతుంది. పై హదీసులో ముబాషరత్ అనే పదానికి రెండు అర్థాలూ ఉన్నాయి. అంటే ఇతరుల శరీరాన్ని చూడటం, శారీరక కలయిక జరపటం. ఉద్దేశపూర్వకంగా గనక చేస్తే ఈ రెండూ పాపాలుగా పరిగణించబడతాయి. ఎందుకంటే ఈ పనుల మూలంగా స్త్రీకి తోటి స్త్రీ యొక్క లోవిషయాలు తెలిసివస్తాయి. ఆమె ప్రయత్నంగానో అప్రయత్నంగానో ఆ విషయాలు తన భర్తకు చెప్పవచ్చు. దానివల్ల అతను ఏదయినా పాపానికి లోనుగావచ్చు. ఫలితంగా తన సంసారంలో తనే నిప్పులు పోసుకున్నట్లవుతుంది. ఈ ప్రమాదాలన్నిటి నుంచి సురక్షితంగా ఉండటానికి, ముందు జాగ్రత్త కోసం ఈ పనులను వారించటం జరిగింది.

## 332 వ అధ్యాయం

## ٣٣٢ - بَابُ كَرَاهَةِ قَوْلِ الإِنْسَانِ فِي الدُّعاءِ : اللَّهُمَّ اغْفِرْ لِي إِنْ شِئْتَ، بَلِ يَجْزِمُ بِالطَّلَبِ

## మనిషి 'ఓ అల్లాహ్! నీకు ఇష్టముంటే నన్ను క్షమించు' అని అనటం అవాంఛనీయం. అలాకాకుండా పూర్తి నమ్మకంతో దైవాన్ని ప్రార్థించాలి

١٧٤٥ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لا يَقُولَنَّ أَحَدُكُمْ: اللَّهُمَّ اغْفِرْ لي إنْ شِئْتَ اللَّهُمَّ ارْحَمْني إنْ شِئْتَ، لِيَعْزِم المَسْأَلَةَ، فَإِنَّهُ لا مُكْرِهَ لَـهُ». متفق عليه. وفي رِوَايـةٍ لمُسْلِمٍ: «وَلَكِنْ لِيَعْزِمْ، وَلْيُعْظِمِ الرَّغْبَةَ، فَإِنَّ اللهَ تَعَالى لا يَتَعَاظَمُهُ شَيْءٌ أَعْطَاهُ».

1745. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: మీలో ఎవరూ కూడా "ఓ అల్లాహ్! నీకు ఇష్టముంటే నన్ను క్షమించు, నీవు తలచుకుంటే నన్ను కరుణించు" అని అనరాదు. అలా కాకుండా నమ్మకంగా ప్రార్థించాలి. ఎందుకంటే ఆయన్ని బలవంత పెట్టే వాడెవడూ లేడు.

*(బుఖారీ-ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నమ్మకంగా ప్రార్థించాలి. బాగా ఆసక్తిని కనబరచాలి. ఎందుకంటే దేవుడు తాను అడిగేవారికి ఇచ్చే వస్తువు ఇవ్వటం ఆయన దృష్టిలో పెద్ద విషయం ఏమీ కాదు.

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుణ్ణి ప్రార్థించేటప్పుడు నిరాశతో, అపనమ్మకంతో ప్రార్థించకూడదు. దేవుడు తలచుకుంటేనే ఇవ్వాలనీ కోరుకోకూడదు. అలాగాకుండా తమకు ఎంతో అవసరమున్నట్లు, ప్రాధేయపడుతున్నట్లు ప్రార్థించాలి. 'ఇవ్వటం ఆయనకు పెద్ద విషయం కాదు' అంటే మనిషి కోరే అవసరాలు - అవి ధార్మికపరమైనవైనా లేక ప్రాపంచికమైనవైనా వాటిని తీర్చటం దేవునికి కష్టం కాదు అని భావం.

١٧٤٦ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذَا دَعَا أَحَدُكُمْ، فَلْيَعْزِمِ المَسْأَلَةَ، وَلا يَقُولَنَّ: اللَّهُمَّ إِنْ شِئْتَ، فَأَعْطِنِي، فَإِنَّهُ لا مُسْتَكْرِهَ لَهُ» متفقٌ عليه.

1746. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరైనా ప్రార్థించేటప్పుడు దృఢచిత్తంతో ప్రార్థించాలి. "అల్లాహ్! నువ్వు తలచుకుంటే ఇవ్వు" అని అనకూడదు. ఎందుకంటే ఆయన్ని ఎవరూ బలవంతం చేయలేరు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని దావాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మానవుడికి జీవితంలో అడుగడుగునా దేవుని అవసరం ఉంటుంది. కనుక మనిషి ఎట్టి పరిస్థితుల్లోనూ తాను దైవం పట్ల నిరపేక్షాపరుడైనట్లు, దైవం తన అవసరాలు తీర్చినా, తీర్చకపోయినా, తనకు కలిగే నష్టం ఏమీ లేదన్నట్లు వ్యవహరించరాదు.



**333 వ అధ్యాయం**

## ٣٣٣ - بَابُ كَرَاهَةِ قَوْلِ: مَا شَاءَ اللهُ وَشَاءَ فُلَانٌ

## దేవుడు తలచింది, ఫలానా అతను తలచింది అని అనటం అవాంఛనీయం

١٧٤٧ - عَنْ حُذَيْفَةَ بْنِ الْيَمَانِ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لا تَقُولوا: ما شاءَ اللهُ وشاءَ فلانٌ، ولكِنْ قُولُوا: ما شَاءَ اللهُ، ثُمَّ شَاءَ فُلانٌ» رواه أبو داود بإسنادٍ صحيحٍ.

1747. హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దేవుడు తలిస్తే, ఫలానా అతను తలిస్తే అని అనకండి. అలాగాకుండా దేవుడు తలిస్తే, ఆ తర్వాత ఫలానా అతను తలిస్తే అని అనండి. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని అదబ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మొదటి పద్ధతిని ఎందుకు వారించటం జరిగిందంటే అందులో దైవాభీష్టాన్ని, మానవాభీష్టాన్ని సమానంగా చేసి మాట్లాడటం జరుగుతోంది. ధర్మం రీత్యా ఆ విధంగా మాట్లాడటం తప్పు. దీనికి భిన్నంగా రెండో పద్ధతిలో ముందుగా దైవాభీష్టాన్ని పేర్కొని, ఆ తర్వాత ఆయన ఇష్టానికి లోబడే మానవుని ఇష్టం ఉందని చెప్పటం జరుగుతోంది. కనుక ఈ పద్ధతి సరైనదని పేర్కొనటం జరిగింది. అలాగే ఎవరైనా ఇతరులతో 'మాకు దేవుడూ, మీరూ తప్ప వేరే దిక్కులేదు' అని అన్నారనుకోండి. ఈ వాక్యంలో అల్లాహ్‌కు మనుషులకు ఒకే స్థానం ఇచ్చి మాట్లాడినట్లయింది. కనుక ఈ విధంగా మాట్లాడటం అధర్మంగా పరిగణించ బడుతుంది. దానికి బదులు "మాకు అల్లాహ్, ఆ తర్వాత మీరూ తప్ప వేరే దిక్కు లేదు" అని అనటంలో తప్పులేదు. ఎందుకంటే మొదటి వాక్యం నుంచి వస్తున్న షిర్క్ వాసన రెండో వాక్యం నుంచి రావటం లేదు.



**334 వ అధ్యాయం**

## ٣٣٤ ـ بَابُ كَرَاهَةِ الْحَدِيثِ بَعْدَ الْعِشَاءِ الآخِرَةِ

## ఇషా నమాజ్ తర్వాత మాట్లాడుకోవటం అవాంఛనీయం

والمرادُ بِهِ الحديثُ الذي يكونُ مُبَاحاً في غيرِ هذا الوقت، وفعلُه وتركُهُ سواءٌ، فَأَمَّا الْحَدِيثُ الْمُحَرَّمُ أو المكْرُوهُ في غَيْرِ هٰذا الوَقْتِ، فَهُوَ في هذا الوَقْتِ أَشَدُّ تَحْرِيماً وَكَرَاهَةً. وَأَمَّا الحَديثُ في الخَيْرِ كَمُذَاكَرَةِ الْعِلْمِ وحِكَايَاتِ الصَّالِحِينَ، وَمَكارِمِ الأَخْلاقِ، والحَدِيثُ مَعَ الضَّيْفِ، وَمَعَ طالِبِ حَاجَةٍ، وَنَحْوِ ذلكَ، فَلا كَرَاهَةَ فِيهِ، بل هُوَ مُسْتَحَبٌّ، وَكذا الحَدِيثُ لِعُذْرٍ وعارِضٍ لا كَرَاهَةَ فِيهِ، وقَدْ تَظَاهَرَت الأَحَادِيثُ الصَّحِيحَةُ على كُلِّ مَا ذَكَرْتُهُ.

ఇతర వేళల్లో మాట్లాడటానికి అనుమతి ఉన్నవాటిని చేసినా చేయకపోయినా ఫర్వాలేని మాటలు మాట్లాడరాదని దీని భావం. పోతే ఇతర వేళల్లో నిషిద్ధమైన లేక అవాంఛనీయమైన మాటలు ఈ వేళలో (అంటే ఇషా తర్వాత) మాట్లాడటం మరింత నిషిద్ధం, మరింత అవాంఛనీయం అవుతుంది. కాని మంచి మాటలు, ఉదా: విద్యా విషయాలు చర్చించుకోవటం, పుణ్య పురుషుల గాథలు చెప్పుకోవటం, ఉత్తమ నడవడికను ప్రస్తావించటం, అతిథితో లేక అవసరంలో ఉన్న మరో వ్యక్తితో నయినా మాట్లాడటం అవాంఛనీయం కాదు. పైగా ఇది అభిలషణీయం (ముస్తహబ్). అదే విధంగా ఏదైనా అవసరం లేక కారణం చేత మాట్లాడటం కూడా అవాంఛనీయం కాదు. నేను పేర్కొన్న విషయాలన్నిటికీ సహీహ్ హదీసుల్లో ఆధారాలున్నాయి. (ఇప్పుడు ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసుల్ని గమనించండి.)

١٧٤٨ ـ عَنْ أَبي بَرْزَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ كَانَ يَكْرَهُ النَّوْمَ قَبْلَ

1748. హజ్రత్ అబూ బర్జా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఇషా నమాజుకు ముందు పడుకోవటాన్ని,

ఇషా తర్వాత కబుర్లు చెప్పుకోవటాన్ని అసహ్యించుకునేవారు.

العِشَاءِ وَالحَدِيثَ بعْدَهَا. متفقٌ عليه.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని మవాఖీతుస్సలాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇషా నమాజుకు ముందు నిద్రపోరాదని చెప్పటంలోని మర్మం ఏమిటంటే దానివల్ల మనిషి నిద్రమైకం చేత ఇషా నమాజుకు ఎగనామం పెట్టే ప్రమాదముంది. అందుకే ఇషా నమాజుకు ముందు నిద్రపోరాదని బోధించబడింది. అదే విధంగా ఇషా తర్వాత కబుర్లు చెప్పుకోవటాన్ని ఎందుకు వారించటం జరిగిందంటే కబుర్లలో మునిగి రాత్రి ఆలస్యంగా నిద్రపోతే తహజ్జుద్, ఫజ్ర్ నమాజులకు మెలకువ రాదు. ఆ విధంగా అనవసరంగా పాపం మూటగట్టుకున్నట్లవుతుంది. అందుకని ఇషా తర్వాత త్వరగా నిద్రపోవాలని ఆదేశించబడింది. ఇషా నమాజ్ తర్వాత త్వరగా నిద్రపోవటం చాలా మంచి పద్ధతి. కేవలం మాట్లాడుకోవటమే కాదు ధార్మికంగా ప్రయోజనం లేని పనులేవయినా సరే ఇషా తర్వాత ఇక వాటికి ఫుల్‌స్టాప్ పెట్టేసి త్వరగా నిద్రపోవాలి. ఇషా తర్వాత గేమ్‌లు ఆడుకోవటం, పేకాట మొదలగు వాటిలో నిమగ్నమవటం ధర్మం రీత్యా నష్టదాయకమైన పనులు. ఈ రోజుల్లో టీవీ, రేడియోలు ప్రజల కాలాన్ని ఎలా హరించివేస్తున్నాయో, సమయ పాలనకు ఏ విధంగా అంతరాయం కలిగిస్తున్నాయో తెలియనివారు లేరు. ఇటువంటి వృధాపనుల వల్ల పరలోక జీవితం ఎలాగూ నష్టపోతుంది. దాంతోపాటు ప్రాపంచిక జీవితానికి కూడా తీరని నష్టం కలుగుతుంది. కనుక ప్రజలు ఇటువంటి వృధాపనులను మానుకోవటానికి ఈ రోజే కంకణం కట్టుకోవాలి.

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇషా తర్వాత విద్యావిషయక చర్చలు జరుపుకోవటానికి షరీఅత్‌లో అనుమతి ఉందని అంటున్నారు. అది కూడా ఎంతసేపటి వరకు అంటే దానివల్ల ఫజ్ర్ నమాజు మిస్ కాకూడదు. నిద్రపోయి మళ్ళీ ఫజ్ర్ నమాజుకు మేల్కొనగలమనే నమ్మకం ఉన్నప్పుడు మాత్రమే చర్చలు జరపాలి. లేకపోతే నిద్రపోవటం మంచిది.

1749. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తన జీవితపు చివరి కాలంలో (ఓ రోజు) ఇషా నమాజ్ చేయించారు. సలాం చేసి నమాజ్ ముగించిన తర్వాత ఆయన (సహచరుల్ని ఉద్దేశ్యించి) "ఈ రాత్రి ఏదో తెలుసా మీకు? ఈ రోజు భూమ్మీద బ్రతికున్నవారెవరూ ఈ శతాబ్దం

١٧٤٩ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ صلَّى العِشَاءَ في آخِرِ حَيَاتِهِ، فَلَمَّا سَلَّمَ، قَالَ: «أَرَأَيْتَكُمْ لَيْلَتَكُمْ هٰذِهِ؟ فَإِنَّ عَلَى رَأْسِ مِائَةِ سَنَةٍ لا يَبْقَى مِمَّنْ هُوَ عَلَى ظَهْرِ الأَرْضِ اليَوْمَ أَحَدٌ» متفقٌ عليه.

ముగిసిన తర్వాత మిగిలుండరు" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఇల్మ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫజాయిలుస్సహాబా ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

తాను ఇషా నమాజ్ చేయించిన ఆ రాత్రి నుంచి వందేళ్ళ తరువాత అప్పుడు బ్రతికున్నవారెవరూ మిగిలుండరని ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) భవిష్యవాణి చెప్పారు. నిజంగా ఆయన చెప్పినట్లుగానే జరిగింది. ఆయన సహచరులందరూ హి.శ. వందేళ్ళలోపే చనిపోయారు. అందరికంటే చివర్లో చనిపోయిన దైవప్రవక్త సహచరుడు అబుత్తుఫైల్ ఆమిర్ బిన్ వాయిలా (రజి). ఈయన హి.శ. 110వ సంవత్సరంలో మరణించారు. అంటే ఖచ్చితంగా దైవప్రవక్త (సల్లం) చెప్పిన వందేళ్ళకు అన్నమాట! ఈ హదీసు ద్వారా ఇషా నమాజ్ తర్వాత అవసరమైన మాటలు మాట్లాడుకోవచ్చని, విద్యావిషయాలు చర్చించుకోవచ్చని తెలుస్తోంది.

١٧٥٠ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُمُ انْتَظَرُوا النَّبِيَّ ﷺ، فَجَاءَهُمْ قريباً من شَطْرِ اللَّيْلِ فَصَلَّى بِهِم يعْني العِشَاءَ، قَالَ: ثُمَّ خَطَبَنَا فَقَالَ: «أَلا إِنَّ النَّاسَ قَدْ صَلَّوا، ثُمَّ رَقَدُوا، وَإِنَّكُمْ لَنْ تَزالُوا فِي صلاةٍ مَا انْتَظَرْتُمُ الصَّلاةَ» رواه البخاري.

1750. హజ్రత్ అనస్ (రజి) కథనం: (ఒకరోజు) దైవప్రవక్త సహచరులు ఆయన కోసం ఎదురు చూడసాగారు. దాదాపు అర్ధరాత్రి సమయంలో ఆయన వారిదగ్గరికి వచ్చి వారికి నమాజ్ అంటే ఇషా నమాజ్ చేయించారు. (అనస్ (రజి) ఇలా అంటున్నారు:) ఆ తర్వాత ఆయన మాకు ఉపన్యాసం ఇస్తూ, "వినండి! కొంతమంది నమాజ్ చేసుకొని పడుకున్నారు. కాని మీరు మాత్రం నిరీక్షిస్తూ ఉన్నంతసేపూ నమాజులోనే ఉన్నారు" అని చెప్పారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని మవాఖీతుస్సలాత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1) ఇషా నమాజును అర్ధరాత్రి వరకు ఆలస్యంగా చేయవచ్చు. 2) ఇషా నమాజు సామూహికంగా చేయటం కోసం మేల్కొని ఉండవచ్చు. 3) నమాజ్ కోసం నిరీక్షిస్తూ ఉన్నంతసేపూ నమాజులోనే ఉన్నట్లు భావించటం జరుగుతుంది. దానికనుగుణంగా పుణ్యం కూడా లభిస్తుంది.

## 335 వ అధ్యాయం

## ٣٣٥ - بَابُ تَحْرِيمِ امْتِنَاعِ الْمَرْأَةِ مِنْ فِرَاشِ زَوْجِهَا إِذَا دَعَاهَا وَلَمْ يَكُنْ لَهَا عُذْرٌ شَرْعِيٌّ

## భర్త తనను పడక మీదకు పిలిచినప్పుడు షరీఅత్ పరమైన కారణమేదీ లేకపోయినప్పటికీ పడకమీదకు వెళ్ళటానికి భార్య నిరాకరించటం నిషిద్ధం

١٧٥١ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذَا دَعَا الرَّجُلُ امْرَأَتَهُ إِلَى فِرَاشِهِ فَأَبَتْ، فَبَاتَ غَضْبَانَ عَلَيْهَا، لَعَنَتْهَا المَلائِكَةُ حَتَّى تُصْبِحَ» متفقٌ عليه. وفي رواية: حَتَّى «تَرْجِعَ».

1751. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మనిషి తన భార్యను పడకమీదకు పిలవగా ఆమె నిరాకరించినందుకు అతను ఆమె మీద అలిగిన స్థితిలో రాత్రిగడిపితే తెల్లవారే వరకూ దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు. (బుఖారీ-ముస్లిం) వేరొక ఉల్లేఖనంలో "ఆమె తిరిగి (భర్త దగ్గరకు) వెళ్ళనంతవరకూ (దైవ దూతలు శపిస్తూ ఉంటారు)" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని బదవుల్ ఖల్ఖ్ ప్రకరణం-సహీహ్ ముస్లింలోని నికాహ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పడక మీదకు పిలవటమంటే రాత్రిపూట తోడుగా పడుకోవటం కోసమో లేక సంభోగం కోసమో పిలవటమని భావం. పగలయినా, రాత్రయినా భర్త తన లైంగిక కోర్కెలు తీర్చుకోవటం కోసం పడకమీదకు పిలిస్తే భార్య నిరాకరించరాదు. షరీఅత్ పరమైన కారణ మేదయినా ఉంటే అది వేరే విషయం. ఉదా: రమజాన్ మాసంలో ఉపవాసం ఉన్నప్పుడు, వ్యాధికి లోనై ఉన్నప్పుడు, లేక రుతుస్రావానికి లోనై ఉన్నప్పుడు ఆమె నిజంగా భర్త ముచ్చట తీర్చలేదు. ఈ విధమైన షరీఅత్ పరమైన కారణమేదీ లేకుండా భర్త కోరికను నిరాకరిస్తే మాత్రం ఆమె దైవదూతల శాపానికి అర్హురాలవుతుంది. పురుషుని దృష్టి పరస్త్రీల మీద పడకూడదన్న ఉద్దేశ్యంతోనే భార్యకు ఇంతగా తాకీదు చేయటం జరిగింది. స్త్రీ గనక భర్త కోర్కెను తీర్చకపోతే అతను పెడదారులు తొక్కే ప్రమాదముంది.

**336 వ అధ్యాయం**

## ٣٣٦ - بَابُ تَحْرِيمِ صَوْمِ الْمَرْأَةِ تَطَوُّعاً وَزَوْجُهَا حَاضِرٌ إلاَّ بِإِذْنِهِ

## భర్త ఇంట్లో ఉన్నప్పుడు అతని అనుమతి లేకుండా స్త్రీ నఫిల్ ఉపవాసాలు పాటించటం నిషిద్ధం

١٧٥٢ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا يَحِلُّ لِلْمَرْأَةِ أَنْ تَصُومَ وَزَوْجُهَا شَاهِدٌ إِلَّا بِإِذْنِهِ، وَلَا تَأْذَنَ فِي بَيْتِهِ إِلَّا بِإِذْنِهِ» متفقٌ عليه.

1752. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: భర్త సమక్షంలో అతని అనుమతి లేకుండా స్త్రీ (నఫిల్) ఉపవాసాలు పాటించరాదు. అలాగే అతని అనుమతి లేకుండా అతని ఇంట్లోకి ఇతరుల్ని అనుమతించరాదు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పై హదీసులో ఉపవాసాలంటే నఫిల్ ఉపవాసాలని భావం. అలాగే నఫిల్ నమాజులు, ఖుర్ఆన్ పారాయణం మొదలగునవన్నీ కూడా ఈ హదీసు భావ పరిధి క్రిందికి వస్తాయి. వీటిని భర్త సమక్షంలో అతని అనుమతి లేనిదే పాటించరాదు. భర్తకు ఇష్టంలేని తన బంధువులను సయితం స్త్రీ ఇంట్లోకి అనుమతించరాదు.



**337 వ అధ్యాయం**

## ٣٣٧ - بَابُ تَحْرِيمِ رَفْعِ الْمَأْمُومِ رَأْسَهُ مِنَ الرُّكُوعِ أَوِ السُّجُودِ قَبْلَ الإِمَامِ

## రుకూలో లేక సజ్దాలో ముఖ్తదీ ఇమామ్ కంటే ముందు తల పైకెత్తటం నిషిద్ధం

١٧٥٣ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «أَمَا يَخْشَى أَحَدُكُمْ إِذَا رَفَعَ رَأْسَهُ قَبْلَ الإِمَامِ أَنْ يَجْعَلَ اللهُ رَأْسَهُ رَأْسَ حِمَارٍ! أَوْ يَجْعَلَ اللهُ صُورَتَهُ صُورَةَ حِمَارٍ» متفقٌ عليه.

1753. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఇమామ్ కంటే ముందు తల పైకెత్తే వాడికి దేవుడు తన తలను గాడిద తలగా మారుస్తాడని లేక తన రూపాన్ని గాడిద రూపంగా మారుస్తాడని భయం వేయదా? *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*



**338 వ అధ్యాయం**

## ٣٣٨ - بَابُ كَرَاهَةِ وَضْعِ الْيَدِ عَلَى الْخَاصِرَةِ فِي الصَّلَاةِ

## నమాజ్ చేసేటప్పుడు జబ్బల మీద చేతులు పెట్టటం అవాంఛనీయం

١٧٥٤ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نُهِيَ عَنِ الخَصْرِ فِي الصَّلاةِ. متفقٌ عليه.

1754. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) నమాజులో జబ్బలమీద చేతులు పెట్టుకోవటాన్ని వారించారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అమల్ ఫిస్సలాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

జబ్బలమీద చేతులు పెట్టుకోవటం అహంకారానికి నిదర్శనం. అందుకని నమాజులో జబ్బలమీద చేతులు పెట్టుకోరాదని వారించటం జరిగింది. నమాజులో వీలైనంత ఎక్కువగా అణకువ భావాన్ని ప్రదర్శించాలి. ఒకవేళ ప్రక్కల్లో నొప్పిగా ఉంటే అలాంటప్పుడు జబ్బలమీద చేతులు పెట్టుకోవటంలో తప్పులేదు.



## 339 వ అధ్యాయం

## ٣٣٩ - بَابُ كَرَاهَةِ الصَّلَاةِ بِحَضْرَةِ الطَّعَامِ وَنَفْسُهُ تَتُوقُ إِلَيْهِ أَوْ مَعَ مُدَافَعَةِ الأَخْبَثَيْنِ، وَهُمَا الْبَوْلُ وَالْغَائِطُ

## బాగా ఆకలిగా ఉండి అన్నం వడ్డించి ఉన్నప్పుడు, మలమూత్ర విసర్జనకు అత్యవసరంగా వెళ్ళవలసి ఉన్నప్పుడు నమాజ్ చేయటం అవాంఛనీయం

١٧٥٥ - عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «لَا صَلاةَ بِحَضْرَةِ طَعَامٍ، وَلَا هُوَ يُدَافِعُهُ الأَخْبَثَانِ» رواه مسلم.

1755. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఆయిషా (రజి) తెలియజేశారు: అన్నం వడ్డించి ఉన్నప్పుడు, మలమూత్ర విసర్జనకు అత్యవసరంగా వెళ్ళవలసి ఉన్నప్పుడు నమాజు లేదు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

నమాజ్ లేదంటే ఆ స్థితిలో మనిషి నమాజ్ చేయకూడదని భావం. అయితే ఈ ఆదేశం అన్నం వడ్డించబడి ఉండి బాగా ఆకలితో ఉన్న వారికే వర్తిస్తుంది. ఆ స్థితిలో అన్నం తినకుండా నమాజ్ చేయమంటే వారు పూర్తి ఏకాగ్రతతో ప్రశాంతంగా నమాజ్ చేయలేరు. అదే విధంగా మలమూత్ర విసర్జనకు అత్యవసరంగా వెళ్ళవలసి ఉన్నప్పుడు ముందు ఆ అవసరం తీర్చుకొని ఆ తర్వాత నమాజు చేయాలి.

## 340 వ అధ్యాయం

## ٣٤٠ - بَابُ النَّهْيِ عَنْ رَفْعِ الْبَصَرِ إِلَى السَّمَاءِ فِي الصَّلَاةِ

## నమాజ్‌లో దృష్టిపైకెత్తి ఆకాశంవైపు చూడరాదు

١٧٥٦ - عَنْ أَنَسِ بْنِ مَالِكٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَا بَالُ أَقْوَامٍ يَرْفَعُونَ أَبْصَارَهُمْ إِلَى السَّمَاءِ فِي صَلَاتِهِمْ!» فَاشْتَدَّ قَوْلُهُ فِي ذٰلِكَ حَتَّى قَالَ: «لَيَنْتَهُنَّ عَنْ ذٰلِكَ أَوْ لَتُخْطَفَنَّ أَبْصَارُهُمْ!» رواه البخاري.

1756. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "ఏమయింది వీరికి? వీరు నమాజులో దృష్టిపైకెత్తి, ఆకాశం వైపు చూస్తున్నారు." ఈ మాట ఆయన చాలా కఠినంగా అన్నారు. చివరికి ఆయన, "ప్రజలు ఇలా చేయటం మానుకోవాలి లేదంటే వారి కళ్ళు చెదిరి పోతాయి" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

నమాజ్ చేసేటప్పుడు ఆకాశం వైపు చూడటం ఏకాగ్రతకు, వినమ్రతకు విరుద్ధం. కనుక దానిని కఠినంగా వారించటం జరిగింది. నమాజు తప్ప ఇతర వేళల్లో ఉదా: దుఆ చేసేటప్పుడు, యోచన చేసేటప్పుడు ఆకాశం వైపు చూడటంలో తప్పు లేదు. పైగా కొందరు పండితుల అభిప్రాయం ప్రకారం ఇది అభిలషణీయం కూడా.



## 341 వ అధ్యాయం

## ٣٤١ - بَابُ كَرَاهَةِ الالْتِفَاتِ فِي الصَّلاَةِ لِغَيْرِ عُذْرٍ

## అకారణంగా నమాజ్‌లో దిక్కులు చూడటం అవాంఛనీయం

١٧٥٧ - عَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: سَأَلْتُ رَسُولَ اللهِ ﷺ عَنِ الالْتِفَاتِ فِي الصَّلاةِ فَقَالَ: «هُوَ اخْتِلاسٌ يَخْتَلِسُهُ الشَّيْطَانُ مِنْ صَلاةِ الْعَبْدِ» رَواهُ الْبُخاري.

1757. హ్రజత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: నేను దైవప్రవక్త (సల్లం) ను నమాజులో దిక్కులు చూడటం గురించి అడిగాను. దానికాయన సమాధానమిస్తూ, "అదొక దాడి. ఆ విధంగా దాడి చేసి షైతాన్ దాసుని నమాజులోని కొంతభాగాన్ని ఎత్తుకెళ్ళి పోతాడు" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దాడి చేయటం, ఎత్తుకెళ్ళటం అంటే మనిషి అప్రమత్తంగా లేనప్పుడు అతని వద్ద నుంచి ఏదయినా వస్తువు లాక్కెళ్ళటం అని అర్థం. మనిషి నమాజ్ సమయంలో ఏకాగ్రత లేకుండా దిక్కులు చూస్తున్నట్లయితే అతను నమాజ్‌లో నిర్లక్ష్యం వహిస్తున్నట్లు భావం. షైతాన్ కూడా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని అతని నమాజును ప్రభావరహితంగా మార్చివేయటానికి ప్రయత్నిస్తాడు.

١٧٥٨ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ لِي رَسُولُ اللهِ ﷺ: «إِيَّاكَ وَالالْتِفَاتَ فِي الصَّلاةِ؛ فَإِنَّ الالْتِفَاتَ فِي

1758. హ్రజత్ అనస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నాకు ఈ విధంగా ఉపదేశించారు: నమాజులో దిక్కులు చూడకుండా జాగ్రత్తపడు. ఎందుకంటే నమాజులో దిక్కులు చూడటం వినాశ కరం. ఒకవేళ తప్పదనుకుంటే నఫిల్

الصَّلاةِ هَلَكَةٌ، فَإِنْ كَانَ لا بُدَّ، فَفِي التَّطَوُّعِ لا فِي الْفَرِيضَةِ». رواه التِّرمذي وقال: حديثٌ حسنٌ صَحِيحٌ.

నమాజుల్లో చూడు. ఫర్జ్ నమాజుల్లో మాత్రం వద్దు. (తిర్మిజీ దీనిని వెలికితీసి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని సలాత్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుకు సంబంధించి తిర్మిజీగారి బూలాఖ్ ప్రతిలో కేవలం 'హదీసున్ హసనున్' అని మాత్రమే ఉందనీ, దాని పాదవ్యాఖ్యానంలో 'హసనున్ గరీబున్' అని ఉందని షేఖ్ అల్‌బానీ అభిప్రాయపడ్డారు. ఈ హదీసు ఆధారాల్లో బలహీనత ఉంది. అదీగాక దీని పరంపరలో ఒకచోట లింకు తెగింది. ఇది 'జయీఫ్' హదీసు. కనుక తిర్మిజీగారి రెండో మాటే సరైనదని ఆయన అన్నారు. (అల్‌బానీ పరిశోధిత రియాజుస్సాలిహీన్ గ్రంథం)

ఈ హదీసు ఆధారపరంగా ప్రామాణికం కానందున నఫిల్ నమాజుల్లో దిక్కులు చూసే అనుమతి కూడా ఉండదు. మరీ అవసరమనుకుంటే కేవలం ముఖం మాత్రం తిప్పి చూడవచ్చు. రొమ్ము మాత్రం ఖిబ్లాకు అభిముఖంగానే ఉండాలి. రొమ్ము గనుక తిరిగితే నమాజ్ భంగం అయిపోతుంది.



**342 వ అధ్యాయం**

## సమాధులకు అభిముఖంగా నమాజ్ చేయరాదు

١٧٥٩ - عَنْ أَبِي مَرْثَدٍ كَنَّازِ بْنِ الْحُصَيْنِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «لا تُصَلُّوا إلى الْقُبُورِ وَلا تَجْلِسُوا عَلَيْهَا» رواه مسلم.

1759. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ మర్సద్ కన్నాజ్ బిన్ హుసైన్ (రజి) తెలియజేశారు: సమాధులకు అభిముఖంగా నమాజ్ చేయకండి. వాటి మీద కూర్చోకండి. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

1) సమాధుల ముందు నిలబడి నమాజ్ చేయటాన్ని ఎందుకు వారించబడిందంటే దానివల్ల బహుదైవారాధకుల్ని అనుకరించినట్లవుతుంది. అదీగాక దైవేతరుల్ని ఆరాధించి నట్లవుతుంది. ఇది మనిషిని బహుదైవారాధన వైపుకు లాక్కెళుతుంది.

2) మానవుడు గౌరవప్రదమైన ప్రాణి. దేవుడు సాటి మానవుణ్ణి గౌరవించమని ఆదేశించాడు. సమాధి మీద కూర్చుంటే ఆ సమాధిలో ఉన్న వ్యక్తిని అగౌరవపరచినట్లవు తుంది. అందుకని పై రెండు పనులకు దూరంగా ఉండాలి.



343 వ అధ్యాయం

## ٣٤٣ ـ بَابُ تَحْرِيمِ الْمُرُورِ بَيْنَ يَدَيِ الْمُصَلِّي

## నమాజ్ చేస్తున్న వ్యక్తి ముందు నుంచి వెళ్ళటం నిషిద్ధం

١٧٦٠ ـ عَنْ أَبِي الْجُهَيْمِ عَبْدِ اللهِ بْنِ الْحَارِثِ بْنِ الصِّمَّةِ الأَنْصَارِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَوْ يَعْلَمُ الْمَارُّ بَيْنَ يَدَيِ الْمُصَلِّي مَاذا عَلَيْهِ لَكَانَ أَنْ يَقِفَ أَرْبَعِينَ خَيْراً لَهُ مِنْ أَنْ يَمُرَّ بَيْنَ يَدَيْهِ» قَالَ الرَّاوِي: لَا أَدْرِي قَالَ أَرْبَعِينَ يَوْماً، أَوْ أَرْبَعِينَ شَهْراً، أَوْ أَرْبَعِينَ سَنَةً، متفقٌ عليه.

1760. హజ్రత్ అబుల్ జుహైమ్ అబ్దుల్లాహ్ బిన్ హారిస్ బిన్ సిమ్మా అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నమాజీ ముందు నుండి వెళ్ళేవాడికి అది ఎంత ఘోరమైన పాపమో తెలిస్తే అతను ముందు నుంచి వెళ్ళటం కన్నా - నలభై వరకు - నిలబడి ఉండటం మేలని అనుకుంటాడు.

ఉల్లేఖకుడు ఇలా అంటున్నాడు: ఆయన నలభై రోజులు అన్నారో, నలభై నెలలు అన్నారో, నలభై యేళ్లు అన్నారో నాకు గుర్తు లేదు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని సలాత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

నమాజ్ చేసేవాని ముందు నుంచి వెళ్ళటం చాలా పెద్ద పాపమని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. కనుక నమాజ్ చేసేవారు కూడా తమ ముందు సుత్రాగాని, స్తంభం లాంటిదిగాని లేకుండా జనం నడిచే దారిలో నమాజ్ చేయకూడదు. దానివల్ల జనానికి ఇబ్బంది కలుగుతుంది. లేదా విషయం తెలియని వారెవరైనా వారి ముందు నుంచి వెళ్లిపోతూ ఉండవచ్చు. సుత్రా లేనప్పుడు నమాజీకు ఎంత ముందు నుంచి వెళ్ళవచ్చు అన్న ప్రశ్నకు మూడు మీటర్లు లేక మూడు పంక్తుల యెడం వదలి వెళ్ళవచ్చని అంచనావేయటం జరిగింది. అయితే జాగ్రత్త కోసం నాలుగైదు పంక్తుల ముందు నుంచి వెళ్ళటం మంచిది.

**344 వ అధ్యాయం**

## ٣٤٤ ـ بَابُ كَرَاهَةِ شُرُوعِ الْمَأْمُومِ فِي نَافِلَةٍ بَعْدَ شُرُوعِ الْمُؤَذِّنِ فِي إِقَامَةِ الصَّلاَةِ سَوَاءٌ كَانَتِ النَّافِلَةُ سُنَّةَ تِلْكَ الصَّلاَةِ أَوْ غَيْرَهَا

## ముఅజ్జిన్ ఇఖామత్ మొదలుపెట్టిన తర్వాత ముఖ్తదీలు నఫిల్ నమాజులు చేయటం అవాంఛనీయం. అది అప్పటి సున్నత్ నమాజ్ అయినా లేక మరే నఫిల్ నమాజ్ అయినాసరే

١٧٦١ ـ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إذا أُقِيمَتِ الصَّلاةُ، فَلا صَلاةَ إلَّا المَكْتُوبَةَ» رواه مسلم.

1761. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నమాజ్ కోసం ఇఖామత్ చెప్పబడిన తర్వాత ఫర్జ్ నమాజ్ తప్ప మరే నమాజూ లేదు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సలాతుల్ ముసాఫిరీన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఫర్జ్ నమాజ్ కోసం ఇఖామత్ చెప్పిన తర్వాత ఇతర సున్నత్, నఫిల్ నమాజులు చేయరాదు. ఒకవేళ ఎవరయినా ఆ సమయంలో నమాజ్ చేస్తున్నట్లయితే దాన్ని వదలి పెట్టి ఫర్జ్ నమాజులో చేరిపోవాలి. సామూహిక ఫర్జ్ నమాజు మొదలైన తర్వాత సున్నత్, నఫిల్ నమాజులు చేస్తూ ఉండటం ఈ హదీసుకు విరుద్ధం. సాధారణంగా హనఫీ మస్జిదుల్లో ఫజ్ర్ నమాజు సందర్భంగా సున్నత్ నమాజులు చేస్తూ ఉంటారు. హనఫీలు మొదటి రకాత్ కోల్పోయే ప్రమాదం లేకపోతే ఫర్జ్ నమాజ్ మొదలయిన తర్వాత కూడా సున్నత్ నమాజులు చేసుకోవచ్చని చెప్పి ఇందులో సౌకర్యం కల్పించుకున్నారు. మొదటగా ఈ అభిప్రాయమే హదీసుకు విరుద్ధం.

## 345 వ అధ్యాయం

## ٣٤٥ - بَابُ كَرَاهَةِ تَخْصِيصِ يَوْمِ الْجُمُعَةِ بِصِيَامٍ أَوْ لَيْلَتِهِ بِصَلاَةٍ مِنْ بَيْنِ اللَّيَالِي

## జుమా నాటి పగలుని ఉపవాసాల కోసం, రాత్రిని నమాజుల కోసం ప్రత్యేకించుకోవటం అవాంఛనీయం

١٧٦٢ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لَا تَخُصُّوا لَيْلَةَ الجُمُعَةِ بِقِيَامٍ مِنْ بَيْنِ اللَّيَالِي، وَلا تَخُصُّوا يَوْمَ الجُمُعَةِ بِصِيَامٍ مِنْ بَيْنِ الأَيَّامِ إِلَّا أَنْ يَكُونَ فِي صَوْمٍ يَصُومُهُ أَحَدُكُمْ» رواه مسلم.

1762. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు ఇతర రాత్రులకు భిన్నంగా జుమానాటి రాత్రిని (నఫిల్) నమాజుల కోసం ప్రత్యేకించుకోకండి. అలాగే ఇతర పగళ్ళకు భిన్నంగా జుమానాటి పగలును ఉపవాసం కోసం ప్రత్యేకించుకోకండి. ఒకవేళ మీలో ఎవరికయినా తన అనవాయితీ ప్రకారం ఆ రోజు ఉపవాసం ఉండవలసి వస్తే అది వేరే విషయం. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సియామ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఒక వ్యక్తి తన ఆనవాయితీ ప్రకారం రోజు విడిచిపెట్టి రోజు ఉపవాసముంటున్నప్పుడు మధ్యలో జుమా రోజు వస్తే లేక ఆషూరా లేక అరఫా దినాలు జుమా రోజు వస్తే లేక పున్నమి దినాల్లో జుమారోజు వస్తే లేక మొక్కుబడి ఉపవాసాలు పాటిస్తున్నప్పుడు మధ్యలో ఏదయినా రోజు జుమా రోజయితే- ఆ రోజు ఉపవాసం పాటించటంలో ఎలాంటి తప్పులేదు. అయితే ప్రత్యేకంగా జుమా రోజునే ఉపవాసం పాటిస్తూ ఉండటం మాత్రం అవాంఛనీయం.

١٧٦٣ - وَعَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ «لا يَصُومَنَّ أَحَدُكُمْ يَوْمَ الجُمُعَةِ إِلَّا يَوْماً قَبْلَهُ أَوْ بَعْدَهُ» متفق عليه.

1763. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) గారే తెలియజేశారు: మీలో ఎవరూ కూడా ప్రత్యేకించి శుక్రవారం రోజు ఉపవాసం పాటించరాదు. ఒకరోజు అటో ఇటో

కలుపుకొని పాటించాలి.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని సౌమ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సియామ్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

ఈ హదీసులో శుక్రవారం రోజు ఉపవాసం ఉండే పద్ధతి వివరించబడింది. శుక్రవారంతోపాటు గురు శనివారాల్లో ఏదో ఒకరోజుని కలుపుకొని రెండు రోజులు ఉపవాసం పాటించాలని చెప్పబడింది.

١٧٦٤ ـ وَعَنْ مُحَمَّدِ بْنِ عَبَّادٍ قَالَ: سَأَلْتُ جَابِراً رَضِيَ اللهُ عَنْهُ: أَنَهَى النَّبِيُّ ﷺ عَنْ صَوْمِ الْجُمُعَةِ؟ قَالَ: نَعَمْ. متفقٌ عليه.

1764. హజ్రత్ ముహమ్మద్ బిన్ అబ్బాద్ కథనం: నేను జాబిర్ గారిని “దైవప్రవక్త (సల్లం) శుక్రవారం రోజు ఉపవాసం ఉండవద్దని వారించారా?” అని అడిగాను. అందుకాయన ‘అవును ’ అని సమాధానమిచ్చారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని సౌమ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సియామ్ ప్రకరణం)

١٧٦٥ ـ وَعَنْ أُمِّ الْمُؤْمِنِينَ جُوَيْرِيَةَ بِنْتِ الحَارِثِ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ النَّبِيَّ ﷺ دَخَلَ عَلَيْهَا يَوْمَ الْجُمُعَةِ وَهِيَ صَائِمَةٌ، فَقَالَ: «أَصُمْتِ أَمْسِ؟» قَالَتْ: لا، قَالَ: «تُرِيدِينَ أَنْ تَصُومِي غَداً؟» قَالَتْ: لا، قَالَ: «فَأَفْطِرِي» رَوَاهُ الْبُخَارِي.

1765. విశ్వాసుల మాతృమూర్తి జువైరియా బిన్తె హారిస్ (రజి.అన్హా) కథనం ప్రకారం తను ఒక శుక్రవారం ఉపవాసం ఉన్నప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆమె వద్దకు వచ్చారు. అప్పుడాయన ఆమెను, “నిన్న నువ్వు ఉపవాసం ఉన్నావా?” అని అడిగారు. ఆమె లేదని చెప్పారు. ఆయన మళ్ళీ “మరి రేపయినా ఉపవాసం ఉండాలనుకుంటున్నావా?” అని అడిగారు. ఆమె లేదని చెప్పారు. అప్పుడాయన, “మరయితే ఉపవాసం విరమించుకో” అని చెప్పారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని సౌమ్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

కేవలం శుక్రవారం రోజు ఉపవాసం పాటించటం కన్నా పాటించకుండా ఉండటమే మేలని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

## 346 వ అధ్యాయం

# ٣٤٦ ـ بَابُ تَحْرِيمِ الْوِصَالِ فِي الصَّوْمِ وَهُوَ أَن يَصُومَ يَوْمَيْنِ أَوْ أَكْثَرَ، وَلاَ يَأْكُل وَلاَ يَشْرَبَ بَيْنَهُمَا

## విసాల్ ఉపవాసం పాటించటం నిషిద్ధం. విసాల్ ఉపవాసమంటే రెండు లేక అంతకంటే ఎక్కువ రోజులు నిర్విరామంగా ఏమీ తినకుండా త్రాగకుండా ఉపవాసం ఉండటం

١٧٦٦ ـ عَنْ أَبِي هُرَيْرَةَ وَعَائِشَةَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ النَّبِيَّ ﷺ نَهَى عَنِ الْوِصَالِ. متفقٌ عليه.

1766. హ్రజత్ అబూహురైరా మరియు ఆయిషా (రజి.అన్‌హా)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) విసాల్ ఉపవాసం పాటించవద్దని వారించారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సౌమ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సియామ్ ప్రకరణం)*

١٧٦٧ ـ وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ عَنِ الْوِصَالِ. قَالُوا: إِنَّكَ تُوَاصِلُ؟ قَالَ: «إِنِّي لَسْتُ مِثْلَكُمْ، إِنِّي أُطْعَمُ وَأُسْقَى» متفقٌ عليه، وهذا لَفظُ البُخاري.

1767. హ్రజత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) విసాల్ ఉపవాసాలు పాటించవద్దని వారించారు. అప్పుడు సహచరులు "మరి తమరు విసాల్ ఉపవాసాలు పాటిస్తారు కదా!" అని సందేహపడ్డారు. అందుకాయన, "నేను మీలాంటివాణ్ణి కాను. నాకు (దైవం తరఫు నుండి ) తినిపించటం త్రాపించటం జరుగుతుంది" అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సౌమ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సియామ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) కొన్ని ధార్మిక విషయాల్లో దైవప్రవక్త (సఅసం)కు కొన్ని ప్రత్యేక ఆదేశాలు ఇవ్వబడ్డాయి. వాటిని ఆయన తప్పనిసరిగా పాటించవలసి ఉండేది. అయితే ఆయన అనుచర సమాజం (ఉమ్మత్) కోసం మాత్రం అవి తప్పనిసరి (వాజిబ్) కావు. వీటిని 'ఆయనగారి ప్రత్యేకతలు'గా కూడా పేర్కొనటం జరుగుతుంది. దైవప్రవక్త (స)కు మాత్రమే పరిమితమైన ఇటువంటి ప్రత్యేకతలను ఇతరులు అనుసరించటానికి షరీఅత్‌లో అనుమతి లేదు. పైగా అలా చేయటం పాపంగా పరిగణించబడుతుంది. విసాల్ ఉపవాసాలు కూడా అటువంటి ప్రత్యేకతల్లోనివే. అసలు ఏమీ తినకుండా త్రాగకుండా నిరంతరంగా ప్రతిరోజూ ఉపవాసం పాటిస్తూ పోవటాన్ని విసాల్ అంటారు. అల్లాహ్ దైవప్రవక్త (సల్లం)కు ఓర్పు సహనాలకు సంబంధించి ప్రత్యేక శక్తిసామర్థ్యాలను ప్రసాదించాడు. వాటి మూలంగా ఆయన విసాల్ ఉపవాసాలు పాటించటానికి అనుమతి కలిగివుండేవారు. దీనికి భిన్నంగా సామాన్య మానవుల్లో వేరెవ్వరికీ అటువంటి శక్తిలేదు. కనుక ఇతరులు ఆ విధంగా నిరంతరాయ ఉపవాసాలు పాటించటానికి షరీఅత్ అనుమతించదు.

2) "నేను మీలాంటి వాణ్ణి కాను" అంటే అర్థం నాకు ఇవ్వబడిన ప్రత్యేకశక్తి మీకు ఇవ్వబడలేదు అని. అంతేగాని 'అసలు నేను మీలాంటి మానవుణ్ణే కాదు' అన్న అర్థం ఎంతమాత్రం కాదు. ఆ అర్థమే గనక తీసుకుంటే, ఆ భావం ఖుర్ఆన్‌లోని 'ఇన్నమా అన బషరుమ్ మిస్లుకుమ్' (నేనూ మీలాంటి మానవుణ్ణే) అన్న వాక్యానికి విరుద్ధం అవుతుంది.



## 347 వ అధ్యాయం

## ٣٤٧ - بَابُ تَحْرِيمِ الْجُلُوسِ عَلَى قَبْرٍ

## సమాధి మీద కూర్చోరాదు

١٧٦٨ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لأَنْ يَجْلِسَ أَحَدُكُمْ عَلَى جَمْرَةٍ، فَتُحْرِقَ ثِيَابَهُ، فَتَخْلُصَ إِلَى جِلْدِهِ خَيْرٌ لَهُ مِنْ أَنْ يَجْلِسَ عَلَى قَبْرٍ» رواه مسلم.

1768. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "మీలో ఎవరైనా నిప్పు మీద కూర్చుంటే దాని వల్ల అతని బట్టలు కాలిపోతాయి, ఆ నిప్పు ప్రభావం అతని చర్మం వరకు పోతుంది. కాని సమాధి మీద కూర్చోవటంతో పోల్చుకుంటే అదెంతో నయం." (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)

**348 వ అధ్యాయం**

## ٣٤٨ ـ بَابُ النَّهْيِ عَنْ تَجْصِيصِ الْقُبُورِ وَالْبِنَاءِ عَلَيْهَا

## సమాధుల్ని పక్కాగా కట్టి వాటిమీద (గుమ్మటాల మాదిరిగా) కట్టడాలు నిర్మించటం తగదు

١٧٦٩ ـ عَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ أَنْ يُجَصَّصَ الْقَبْرُ، وَأَنْ يُقْعَدَ عَلَيْهِ، وَأَنْ يُبْنَى عَلَيْهِ. رواه مسلم.

1769. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: సమాధిని పక్కాగా కట్టించటాన్ని, దాని మీద కూర్చోవటాన్ని, దాని మీద కట్టడం నిర్మించటాన్ని దైవప్రవక్త (స) వారించారు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

సమాధిని పక్కాగా నిర్మించటం ఒక వృథా ప్రయాస మాత్రమే. దానివల్ల మరణించిన వారికి ఎలాంటి ప్రయోజనం దక్కదు. అదీగాక సమాధిని ఆ విధంగా గౌరవించటం, ఆరాధించడం మనిషిని షిర్క్ వైపుకు గొనిపోతుంది. సమాధుల మీద గుంబద్‌లు, గోపురాలు నిర్మించటం కూడా అలాంటిదే. పోతే సమాధుల మీద కూర్చోవటం వాటిలో ఉండే మనుషుల గౌరవానికి విరుద్ధం. కనుక పై మూడు పనులు చేయరాదని ఈ హదీసులో బోధించటం జరిగింది.



**349 వ అధ్యాయం**

## ٣٤٩ ـ بَابُ تَغْلِيظِ تَحْرِيمِ إِبَاقِ الْعَبْدِ مِنْ سَيِّدِهِ

## బానిస తన యజమాని దగ్గరి నుంచి పారిపోవటం చాలా తీవ్రమైన విషయం

١٧٧٠ ـ عَنْ جَرِيرِ بْنِ عَبْدِ اللهِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَيُّمَا عَبْدٍ أَبَقَ، فَقَدْ بَرِئَتْ مِنْهُ الذِّمَّةُ». رواه مسلم.

1770. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తన యజమాని దగ్గరినుంచి పారిపోయిన బానిస, ఇస్లాం ప్రమాణ పరిధి నుండి వైదొలగినట్లే. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

١٧٧١ ـ وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ: «إِذَا أَبَقَ الْعَبْدُ، لَمْ تُقْبَلْ لَهُ صَلَاةٌ» رواه مسلم.
وفِي رِوَايَةٍ: «فَقَدْ كَفَرَ».

1771. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పారిపోయిన బానిస నమాజు ఆమోదించబడదు.

వేరొక ఉల్లేఖనంలో "అతను అవిశ్వాసానికి (కుఫ్రకు) పాల్పడినట్లే" అని ఉంది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)



## 350 వ అధ్యాయం

# ٣٥٠ ـ بَابُ تَحْرِيمِ الشَّفَاعَةِ فِي الْحُدُودِ

# దేవుడు నిర్ణయించిన శిక్షల విషయంలో సిఫారసు చేయటం నిషిద్ధం

قَالَ اللهُ تَعَالى : ﴿ ٱلزَّانِيَةُ وَٱلزَّانِي فَٱجْلِدُوا۟ كُلَّ وَٰحِدٍ مِّنْهُمَا مِا۟ئَةَ جَلْدَةٍ وَلَا تَأْخُذْكُم بِهِمَا رَأْفَةٌ فِى دِينِ ٱللَّهِ إِن كُنتُمْ تُؤْمِنُونَ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْءَاخِرِ ﴾ [النور: ٢].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్‌ ఇలా సెలవిచ్చాడు:

"వ్యభిచారిణి, వ్యభిచారి - ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరికీ నూరేసి కొరడా దెబ్బలు కొట్టండి. మీరు అల్లాహ్‌పై, అంతిమ దినంపై విశ్వాసం ఉన్నవారే అయితే, వారి మీద కనికరం చూపే తలంపు అల్లాహ్‌ ప్రసాదించిన ధర్మ (నిర్వహణ) విషయంలో మిమ్మల్ని అడ్డుకోరాదు."
*(అన్‌నూర్‌:2)*

### ముఖ్యాంశాలు

1) పై ఆయతులో పేర్కొనబడిన శిక్ష అవివాహిత స్త్రీ పురుషులకు ఉద్దేశించబడినది. ఎందుకంటే వివాహిత స్త్రీ పురుషులు వ్యభిచారం చేస్తే దానికి శిక్ష వేరుగా ఉంది. వారికి 'రజ్మ్‌' (శిలా) శిక్ష విధించబడుతుంది. వివాహిత వ్యభిచారులకు, అవివాహిత వ్యభిచారులకు విధించబడే శిక్షల్లో వ్యత్యాసం ఉందన్న విషయంపై దైవప్రవక్త సహచరులు, ముస్లిం సమాజ పండితులు, ధర్మవేత్తలందరి మధ్య ఏకాభిప్రాయం ఉంది.

2) శిక్షల్ని అమలు జరిపేటప్పుడు ఎటువంటి కనికరాన్ని ప్రదర్శించకూడదు. నేరం రుజువైన తర్వాత నేరగాళ్ళకు అల్లాహ్‌ విధించిన శిక్షను అమలు జరపటంలో కనికరం చూపటం విశ్వాస విరుద్ధమైన చర్యగా భావించబడుతుంది. నేరగాళ్ళపై కనికరం చూపటమే విశ్వాస విరుద్ధమైన చర్య అయినప్పుడు అసలు ఇస్లామీయ శిక్షల్నే పాశవిక శిక్షలుగా ఖరారు చేసేవారి హృదయాల్లో అల్లాహ్‌ పట్ల, ఆయన ధర్మం పట్ల విశ్వాసం (ఈమాన్‌) లేశ మయినా ఉంటుందా?! మొత్తానికి తెలిసేదేమిటంటే ఈమాన్‌ (విశ్వాసం) అనేది ధర్మంపై నిలకడను ప్రదర్శించాలని, ఇస్లామీయ విధుల నిర్వహణలో చాలా ఖచ్చితంగా ఉండాలని ప్రబోధిస్తోంది.

۱۷۷۲ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا، أَنَّ قُرَيْشاً أَهَمَّهُمْ شَأْنُ المَرْأَةِ المَخْزُومِيَّةِ الَّتِي سَرَقَتْ فَقَالُوا: مَنْ يُكَلِّمُ فِيهَا رَسُولَ اللهِ ﷺ؟ فَقَالُوا: وَمَنْ يَجْتَرِىءُ عَلَيْهِ إِلَّا أُسَامَةُ بْنُ زَيْدٍ، حِبُّ رَسُولِ اللهِ ﷺ، فَكَلَّمَهُ أُسَامَةُ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَتَشْفَعُ فِي حَدٍّ مِنْ حُدُودِ اللهِ تَعَالَى؟» ثُمَّ قَامَ فَاخْتَطَبَ، ثُمَّ قَالَ: «إِنَّمَا أَهْلَكَ الَّذِينَ قَبْلَكُمْ أَنَّهُمْ كَانُوا إِذَا سَرَقَ فِيهِمُ الشَّرِيفُ تَرَكُوهُ، وَإِذَا سَرَقَ فِيهِمُ الضَّعِيفُ، أَقَامُوا عَلَيْهِ الحَدَّ، وَايْمُ اللهِ لَوْ أَنَّ فَاطِمَةَ بِنْتَ مُحَمَّدٍ سَرَقَتْ

1772. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: ఓసారి మఖ్జూమ్ కుటుంబానికి చెందిన ఒక స్త్రీ దొంగతనం చేసింది. (ఆమెకు హస్తఖండన శిక్ష విధించబడుతుంది అనటంతో) ఖురైషులు ఆందోళన చెందారు.

అప్పుడు వారు పరస్పరం సంప్రతించుకొని, "ఈ విషయం గురించి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడగలవారెవరు?" అని అన్నారు. వారిలో కొందరు "ఉసామా బిన్ జైద్ తప్ప మరెవరూ ఈ విషయం గురించి దైవప్రవక్త(సల్లం)తో మాట్లాడలేరు, ఆయన దైవప్రవక్తకు ప్రియతములు" అని చెప్పారు. (చివరికి వారంతా ఉసామాను దైవప్రవక్త దగ్గర సిఫారసు చేయటం కోసం ఒప్పించారు.) అలాగే ఉసామా వెళ్ళి దైవప్రవక్త (సల్లం)తో ఈ విషయం గురించి మాట్లాడారు. అందుకు దైవప్రవక్త (సల్లం) ఉసామాను మందలిస్తూ, "ఏమిటీ నువ్వు దేవుడు నిర్ణయించిన శిక్షలలో ఒకదాని గురించి సిఫారసు చేయటానికి వచ్చావా?" అని అన్నారు.

ఆ తర్వాత లేచి ప్రజల ముందు ఉపన్యసిస్తూ, "మీకు పూర్వం గతించిన జాతులను ఈ విషయమే నాశనం చేసింది. వారు తమలో పలుకుబడి గల వ్యక్తి ఎవరైనా దొంగతనం చేస్తే అతడ్ని శిక్షించకుండా వదలిపెట్టేవారు. అదే బలహీనుడెవడైనా దొంగతనం

لَقَطَعْتُ يَدَهَا». متفقٌ عليه. وفي روايةٍ: فَتَلَوَّنَ وَجْهُ رسولِ اللهِ ﷺ فَقَالَ: «أَتَشْفَعُ فِي حَدٍّ مِنْ حُدودِ اللهِ!؟» قَالَ أُسَامَةُ: اسْتَغْفِرْ لِي يَا رَسُولَ اللهِ! قَالَ: ثُمَّ أَمَرَ المَرْأَةَ، فَقُطِعَتْ يَدُهَا.

చేస్తే అతడ్ని శిక్షించేవారు. దైవంసాక్షి! ముహమ్మద్ కూతురు ఫాతిమా అయినా సరే దొంగతనం చేస్తే నేనామె చేతిని కూడా నరికితీరుతాను" అని అన్నారు. (బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనం ప్రకారం (ఉసామా (రజి) దాని గురించి మాట్లాడగానే) ఆయన మొహం రంగు మారిపోయింది. "నువ్వు దేవుని శిక్షలలో ఒకదాని గురించి సిఫారసు చేస్తున్నావా?" అని ఆయన మందలించారు. దానికి ఉసామా (రజి) "దైవప్రవక్తా! నా క్షమా పణ కోసం ప్రార్థించండి" అని కోరారు. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞ మేరకు ఆ స్త్రీ చేతిని నరికి వేయటం జరిగింది.

*(సహీహ్ బుఖారీలోని అంబియా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని శిక్షల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1) ఇస్లామీయ చట్టం విధించే శిక్షలు విశ్వప్రభువైన అల్లాహ్ చేత నిర్ణయించబడినవి. కనుక ఒకరి సిఫారసు మీద వాటిని మాఫీ చేయటానికి, లేదా కనీసం వాటిలో హెచ్చుతగ్గులు చేయటానికి కూడా మానవుల్లో ఎవరికీ అధికారం లేదు. ఆఖరికి ఇస్లామీయ రాజ్యపాలకుడైన ఖలీఫాకు సైతం ఈ విషయంలో ఎటువంటి సిఫారసు అధికారం లేదు. 2) అలాగే శిక్షల అమలు విషయంలో పేద ధనిక, ఉచ్ఛ నీచ, కులీన-కులహీన, స్త్రీ పురుష అన్న భేదభావం మచ్చుకైనా ఉండరాదు. చట్టం దృష్టిలో అందరూ సమానులే. నేరం చేసినవాడు ఎంత గొప్పవాడైనా సరే శిక్షను అమలు జరిపే విషయంలో ఎటువంటి హెచ్చుతగ్గులు, క్షమాభిక్షలు ఉండవు. 3) గత సమాజాల సంఘటనలను తెలుసుకొని గుణపాఠం నేర్చుకోవాలి. వారి వినాశానికి కారణమైన విషయాలకు దూరంగా ఉండాలి. 4) ఈ హదీసు ద్వారా హజ్రత్ ఉసామా (రజి)గారి ఔన్నత్యం, దైవప్రవక్త (స)తో ఆయనకు గల సాన్నిహిత్యం బోధపడు తున్నాయి. అయితే అటువంటి ఔన్నత్యం, దైవప్రవక్త ఆస్థానంలో చనువు కూడా శిక్ష విషయంలో ఆయన చేసిన సిఫారసు అమోదించబడేలా చేయలేక పోయాయన్న విషయం గమనార్హం.

**351 వ అధ్యాయం**

# ٣٥١ - بَابُ النَّهْيِ عَنِ التَّغَوُّطِ فِي طَرِيقِ النَّاسِ وَظِلِّهِمْ وَمَوَارِدِ الْمَاءِ وَنَحْوِهَا

# ప్రజలు నడిచే దారుల్లో, నీడ ఉండే చోట, నీళ్ళు తీసుకుపోయే చోట్లలో, ఇతర ప్రాంతాలలో మలమూత్ర విసర్జన చేయరాదు

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَالَّذِينَ يُؤْذُونَ الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ بِغَيْرِ مَا اكْتَسَبُوا فَقَدِ احْتَمَلُوا بُهْتَانًا وَإِثْمًا مُّبِينًا ﴾ [الأحزاب: ٥٨].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ఏ తప్పూ చేయకపోయినా విశ్వాసులైన స్త్రీ పురుషులకు మనస్తాపం కలిగించేవారు, ఒక పెద్ద అభాండభారాన్ని, ఒక స్పష్టమైన పాప భారాన్ని, తమ తలపై మోపుకున్నట్లే." *(అహ్‌జాబ్:58)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన చోట్ల మలమూత్ర విసర్జన చేస్తే ఎవరికైనా బాధకలుగుతుంది. విశ్వాసులకు బాధ కలిగించటం మహాపాపం. అందుకని దానికి దూరంగా ఉండటం మంచిది. వేసవికాలంలో నీడకు ఎంత ప్రాముఖ్యముంటుందో, చలికాలంలో ఎండకు కూడా అంత ప్రాముఖ్యం ఉంటుంది. కనుక కాలాన్ని బట్టి కూడా ఈ చోట్లను దుర్వినియోగపరచటం పాపానికి కారణభూతమవుతుంది.

١٧٧٣ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «اتَّقُوا اللَّاعِنَيْنِ

1773. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) శాపానికి కారణమయ్యే రెండు విషయాలకు దూరంగా ఉండమని ప్రబోధించారు. అది విని సహచరులు, 'శాపానికి కారణమయ్యే ఆ రెండు విషయాలు

قَالُوا وَمَا اللاَّعِنَانِ ؟ قَالَ: «الَّذِي يَتَخَلَّى فِي طَرِيقِ النَّاسِ أَوْ فِي ظِلِّهِمْ» رواه مسلم.

ఏవి?' అని అడిగారు. అందుకాయన, 'ప్రజలు నడిచేదారిలో లేక వారు (కూర్చునే) నీడ చోట్లలో మలమూత్ర విసర్జన చేయటం' అని చెప్పారు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని తహారత్ ప్రకరణం)*



## 352 వ అధ్యాయం

## ٣٥٢ - بَابُ النَّهْيِ عَنِ الْبَوْلِ وَنَحْوِهِ فِي الْمَاءِ الرَّاكِدِ

## నిలిచి ఉన్న నీటిలో మూత్ర విసర్జన మొదలగు పనులు చేయరాదు

١٧٧٤ - عَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ: أَنَّ رَسُولَ اللهِ ﷺ نَهَى أَنْ يُبَالَ فِي الْمَاءِ الرَّاكِدِ. رواه مسلم.

1774. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) నిలిచి ఉన్న నీటిలో మూత్రం పోయటాన్ని వారించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని తహారత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

చెరువులు, కుంటలు, బావులు మొదలగువాటి నీరు నిలకడగా ఉంటుంది. నదులు, కాలువల మాదిరిగా ఈ నీటిలో ప్రవాహం ఉండదు. కనుక నిలకడగా ఉన్న నీటిలో మల మూత్ర విసర్జన చేయటం వల్ల ఆ నీరు కలుషితమయిపోవటమే గాకుండా చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో విపరీతమైన దుర్గంధం కూడా వ్యాపిస్తుంది. దానివల్ల పరిసర ప్రాంతాల ప్రజలు నానా ఇబ్బందులు పడతారు. ఇస్లాం ధర్మం ఇటువంటి చిన్నచిన్న విషయాలను సయితం ఇంత స్పష్టంగా, ఇంత గట్టిగా తాకీదు చేసి పేర్కొంటున్నదంటే దాని వెనుకగల ఉద్దేశాన్ని గ్రహించటం పెద్ద కష్టమేమీ కాదు. సామాజిక జీవనంలో వ్యక్తి చేసే ఓ చిన్న తప్పు కూడా ఆ సమాజంలో జీవిస్తున్న వారందరికీ ఎన్నో తిప్పలు తెచ్చి పెట్టవచ్చు. అందుకని సహజీవన ధర్మాల పరిరక్షణ కోసం ఇస్లాం ధర్మం అడుగడుగునా ఇటువంటి నీతి సూత్రాలెన్నింటినో ప్రబోధిస్తూ ఉంటుంది. ఇస్లాం ధర్మ సమగ్రతకు ఇది ఓ మచ్చుతునక మాత్రమే!

## 353 వ అధ్యాయం

## ٣٥٣ - بَابُ كَرَاهَةِ تَفْضِيلِ الْوَالِدِ بَعْضَ أَوْلَادِهِ عَلَى بَعْضٍ فِي الْهِبَةِ

## తండ్రి తన పిల్లలకు కానుకలు ఇవ్వటంలో ఒకరి మీద మరొకరికి ప్రాధాన్యత నివ్వటం అయిష్టకరం

١٧٧٥ - عَنِ النُّعْمَانِ بْنِ بَشِيرٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ أَبَاهُ أَتَى بِهِ رَسُولَ اللهِ ﷺ فَقَالَ: إِنِّي نَحَلْتُ ابْنِي هذا غُلاماً كَانَ لِي، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَكُلَّ وَلَدِكَ نَحَلْتَهُ مِثْلَ هذا؟» فَقَالَ: لا، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «فَأَرْجِعْهُ». وفي رِوَايَةٍ: فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَفَعَلْتَ هٰذا بِوَلَدِكَ كُلِّهِمْ؟» قَالَ: لا، قَالَ: «اتَّقُوا اللهَ وَاعْدِلُوا فِي أَوْلَادِكُمْ» فَرَجَعَ أَبِي، فَرَدَّ تِلْكَ الصَّدَقَةَ. وفي رِوَايَةٍ: فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «يَا بَشِيرُ! أَلَكَ وَلَدٌ سِوَى هذا؟» قَالَ: نَعَمْ، قَالَ: «أَكُلَّهُمْ وَهَبْتَ لَهُ مِثْلَ هٰذا؟» قَالَ: لا، قَالَ: «فَلا تُشْهِدْنِي إِذاً فَإِنِّي لا أَشْهَدُ عَلَى جَوْرٍ». وَفِي رِوَايَةٍ «لا تُشْهِدْنِي عَلَى جَوْرٍ». وفي روايةٍ:

1775. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) కథనం: మా నాన్నగారు నన్ను దైవ ప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకెళ్ళి, "నేను నా ఈ కుమారునికి నా బానిస నొకణ్ణి కానుకగా ఇస్తున్నాను" అని అన్నారు. అది విని దైవప్రవక్త (సల్లం), "నీవు నీ పిల్లలందరికీ ఇలాంటి కానుక ఇచ్చావా?" అని అడిగారు. "లేదు" అని అన్నారు మా నాన్న. అప్పుడు దైవప్రవక్త (సల్లం), "మరయితే నీవు ఈ కానుకను కూడా వాపసు తీసుకో" అని చెప్పారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవ ప్రవక్త (సల్లం) (మా నాన్నని) "నీవు నీ పిల్లలందరిపట్ల ఇలాగే వ్యవహరించావా?" అని అడిగారు. 'లేదు' అని చెప్పారు మా నాన్న. అందుకు దైవ ప్రవక్త (సల్లం) "దేవునికి భయపడండి. మీ పిల్లలందరి పట్ల సమానంగా ప్రవర్తించండి" అని ఆదేశించారు. ఆ తర్వాత మా నాన్నగారు తిరిగొచ్చి

«أَشْهِدْ عَلَى هذا غَيْرِي» ثُمَّ قَالَ: «أَيَسُرُّكَ أَنْ يَكُونُوا إِلَيْكَ فِي الْبِرِّ سَوَاءً؟» قَالَ: بَلَى، قَالَ: «فَلا إذاً» متفقٌ عليه.

నాకిచ్చిన కానుకను తిరిగి తీసుకున్నారు.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) (మా నాన్నని), "ఇంకా నీకెవరైనా పిల్లలు ఉన్నారా?" అని అడిగారు. 'అవును' అని చెప్పారు మా నాన్న. "వాళ్ళందరికీ నువ్వు ఇలాంటి కానుకలు ఇచ్చావా?" అని అడిగారు. 'లేదు' అని చెప్పారు మా నాన్న. అది విని దైవప్రవక్త (సల్లం), "మరయితే ఇందుకు నన్ను సాక్షిగా ఉంచకు. ఎందుకంటే నేను అన్యాయానికి సాక్షిగా ఉండను" అని అన్నారు.

మరొక ఉల్లేఖనంలో "నువ్వు నన్ను అన్యాయానికి సాక్షిగా నిలబెట్టకు" అని ఉంది.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నువ్వు నన్ను గాకుండా ఇంకెవరినైనా ఇందుకు సాక్షిగా పెట్టుకో. తర్వాత అడిగారు, "నీ పిల్లలందరూ నీ పట్ల మంచిగా ప్రవర్తించాలని నువ్వు కోరుకోవటం లేదా?" అని. అందుకు మా నాన్న, "ఎందుకు కోరుకోను?" అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "మరయితే ఈ పని చేయకు" అని ఉపదేశించారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని హిబా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని హిబాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా మనకు కొన్ని విషయాలు బోధపడుతున్నాయి.

1) ఏదైనా పనికి సంబంధించి సరైన జ్ఞానం లేకపోతే పండితులను, ధర్మవేత్తలను, నిపుణులను సంప్రతించాలి. 2) తల్లిదండ్రులు తమ పిల్లల పెంపకంలో వారి మధ్య న్యాయాన్ని, సమానత్వాన్ని పాటించాలి. ఒకరికి ఇంకొకరి మీద ప్రాధాన్యతను ఇవ్వరాదు. 3) ఈ హదీసు ఆధారంగా ఇస్లామీయ పండితులు ఏమంటారంటే ఏ వ్యక్తి అయినా తన జీవితంలో తన ఆస్తిపాస్తులను పిల్లలకు పంచిపెట్టదలిస్తే అతను కొడుకులు, కూతుళ్ళ మధ్య భేదభావం పాటించకుండా తను ఇవ్వదలచుకున్న ఆస్తిని అందరికీ సరిసమానంగా పంచాలి.



## 354 వ అధ్యాయం

## ٣٥٤ ـ بَابُ تَحْرِيمِ إِحْدَادِ الْمَرْأَةِ عَلَى مَيِّتٍ فَوْقَ ثَلَاثَةِ أَيَّامٍ إِلَّا عَلَى زَوْجِهَا أَرْبَعَةَ أَشْهُرٍ وَعَشَرَةَ أَيَّامٍ

## మృతుని గురించి మూడు రోజులకు మించి సంతాపం ప్రకటించరాదు. అయితే స్త్రీ తన భర్త మరణం మీద సంతాపం ప్రకటించవలసిన గడువు నాలుగు నెలల పదిరోజులు

١٧٧٦ ـ عَنْ زَيْنَبَ بِنْتِ أَبِي سَلَمَةَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَتْ: دَخَلْتُ عَلَى أُمِّ حَبِيبَةَ رَضِيَ اللهُ عَنْهَا زَوْجِ النَّبِيِّ ﷺ حِينَ تُوُفِّيَ أَبُوهَا أَبُو سُفْيَانَ بْنُ حَرْبٍ رَضِيَ اللهُ عَنْهُ، فَدَعَتْ بِطِيبٍ فِيهِ صُفْرَةُ خَلُوقٍ أَوْ غَيْرِهِ، فَدَهَنَتْ مِنْهُ جَارِيَةً، ثُمَّ مَسَّتْ بِعَارِضَيْهَا. ثُمَّ قَالَتْ: وَاللهِ! مَا لِي بِالطِّيبِ مِنْ حَاجَةٍ، غَيْرَ أَنِّي سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ عَلَى الْمِنْبَرِ: «لَا يَحِلُّ لِامْرَأَةٍ تُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ أَنْ تُحِدَّ عَلَى مَيِّتٍ فَوْقَ ثَلَاثِ لَيَالٍ، إِلَّا عَلَى زَوْجٍ أَرْبَعَةَ أَشْهُرٍ وَعَشْراً» قَالَتْ زَيْنَبُ: ثُمَّ دَخَلْتُ عَلَى

1776. హజ్రత్ జైనబ్ బిన్తె అబూ సలమా (రజి.అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) సతీమణి హజ్రత్ ఉమ్మె హబీబా (రజి. అన్హా)గారి తండ్రి అబూ సుఫ్యాన్ (రజి) చనిపోయినప్పుడు నేనామె దగ్గరికి వెళ్ళాను. అప్పుడామె ఒక సుగంధ ద్రవ్యం తెప్పించారు. అందులో పసుపు రంగు ఖలూకో లేక మరేదో సువాసన కలిపి ఉంది. ఆమె అందులో నుంచి కొంత సువాసన తీసి ఒక బానిసరాలికి పూశారు. ఆ తర్వాత ఆ చేతిని తన చెంపలకు రాసుకుంటూ, "దైవం సాక్షి! నాకు సువాసన అవసరం లేదు. అసలు విషయం ఏమిటంటే దైవాన్ని, పర లోకాన్ని విశ్వసించే ఏ స్త్రీ కూడా తన భర్త మరణం పట్ల తప్ప మరెవరి మృతి పట్ల కూడా మూడు రోజులకు మించి శోకాన్ని పాటించటం ధర్మ సమ్మతం కాదనీ, భర్త చనిపోతే మాత్రం నాలుగు

زَيْنَبَ بِنْتِ جَحْشٍ رَضِيَ اللهُ عَنْهَا حِينَ تُوُفِّيَ أَخُوهَا، فَدَعَتْ بِطِيبٍ فَمَسَّتْ مِنْهُ، ثُمَّ قَالَتْ: أَمَا وَاللهِ! مَا لِي بِالطِّيبِ مِنْ حَاجَةٍ، غَيْرَ أَنِّي سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ عَلَى المِنْبَرِ: «لا يَحِلُّ لامْرَأَةٍ تُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ أَنْ تُحِدَّ عَلَى مَيِّتٍ فَوْقَ ثَلاثٍ إلَّا عَلَى زَوْجٍ أَرْبَعَةَ أَشْهُرٍ وَعَشْراً». متفقٌ عليه.

నెలల పదిరోజులు (శోకం పాటిస్తూ) తప్పకుండా ఇద్దత్ (గడువు) పూర్తి చేయాలని దైవప్రవక్త (సల్లం) వేదిక మీద నించొని ఆదేశించారు. (అందుకే నేను సువాసన పూసుకున్నాను)" అని చెప్పారు.

ఆ తర్వాత నేను జైనబ్ బిన్తె జహష్ (రజి.అన్హా) సోదరుడు చనిపోయి నప్పుడు ఆమె ఇంటికి కూడా వెళ్ళాను. ఆమె కూడా అలాగే సుగంధద్రవ్యం తెప్పించి, కొస్త ఒంటికి పూసుకొని "దైవం సాక్షి! నాకు సువాసన పూసు కోవాల్సిన అవసరం లేదు సుమా! దైవప్రవక్త (సల్లం) వేదిక మీద నించొని, "దైవాన్ని, పరలోకాన్ని విశ్వసిస్తున్న ఏ స్త్రీ కూడా తన భర్త తప్ప ఇతరులు చనిపోతే మూడు రోజులకు మించి శోకం పాటించటం ధర్మసమ్మతం కాదని, భర్త చనిపోతే మాత్రం తప్ప కుండా నాలుగు నెలల పదిరోజులు ఇద్దత్ (గడువు) కాలం గడపవలసి ఉంటుంద"ని చెబుతుంటే విన్నాను అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం -సహీహ్ ముస్లింలోని తలాఖ్ ప్రకరణం)*

## 355 వ అధ్యాయం

## ٣٥٥ - بَابُ تَحْرِيمِ بَيْعِ الْحَاضِرِ لِلْبَادِي وَتَلَقِّي الرُّكْبَانِ وَالْبَيْعِ عَلَى بَيْعِ أَخِيهِ وَالْخِطْبَةِ عَلَى خِطْبَتِهِ إِلاَّ أَنْ يَأْذَنَ أَوْ يَرُدَّ

## పల్లెటూరివాని కోసం పట్నవాసి బేరం చేయటం, వర్తక బృందాలను కలుసుకోవటం, తన సోదరుడు బేరమాడిన చోట బేరమాడటం, తన సోదరుడు వివాహ సందేశం పంపినచోట- అతను అనుమతినిస్తే లేక అతను తన నిర్ణయాన్ని మానుకుంటే తప్ప- తాను వివాహ సందేశం పంపటం తగదు

١٧٧٧ - عَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ أَنْ يَبِيعَ حَاضِرٌ لِبَادٍ وَإِنْ كَانَ أَخَاهُ لأَبِيهِ وَأُمِّهِ. متفقٌ عليه.

1777. హ్జ్రత్ అనస్ (రజి) కథనం: పట్నవాసి పల్లెటూరి వానికోసం బేరం చేయటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. అతడు తన సొంత సోదరుడైనా సరే. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని బుయూ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మూలంలో 'హాజిర్', 'బాదీ' అనే రెండు పదాలు ఉపయోగించబడ్డాయి. హాజిర్ అంటే పట్నవాసి అనీ, బాదీ అంటే పల్లెవాసి అనీ భావం. పై హదీసులో పట్నవాసి-పల్లెవాసుల మధ్య వర్తక వ్యవహారాన్ని వారించటం జరిగింది. ఎందుకంటే సాధారణంగా పట్నవాసులైన దళారులు పల్లెరైతులకు ఎదురేగి 'మీ సొమ్ము మొత్తం మాకు అమ్మేయండి, మేము దాన్ని రిటైల్‌గా అమ్ముకుంటాం' అని చెప్పి అతి తక్కువ ధరకు వారి నుంచి సరుకు కొనేసి పట్నంలో ఎక్కువ ధరకు దాన్ని అమ్మి బాగా లాభాలు గడిస్తుంటారు. మార్కెట్టు సమాచారం తెలియని పల్లెవాసులు అమాయకంగా దళారుల చేతుల్లో మోసపోతుంటారు. దళారుల

ఈ దోపిడీని అరికట్టటమే పై హదీసు ఉద్దేశం. కొంతమంది పండితులు ఏమంటారంటే- పల్లెవాసుల వెంట ఎంతో విలువైన నిత్యావసర వస్తువులు ఉండి వారికి మార్కెట్టు ధరలు తెలిసి ఉండని పక్షంలో దళారులు వారి అజ్ఞానాన్ని సొమ్ము చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లయితే అది ముమ్మాటికీ నిషిద్ధమే. అలాగాకుండా పల్లెవాసుల బాగుకోరి వారిని దోపిడీ నుంచి కాపాడేందుకుగాను వారి వస్తువులను న్యాయమైన ధరలకు కొంటున్నట్లయితే అటువంటి వర్తకంపై షరీఅత్ రీత్యా కూడా ఎటువంటి అభ్యంతరాలు ఉండవు.

١٧٧٨ ـ وَعَنِ ابْنِ عُمَرَ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَتَلَقَّوُا السِّلَعَ حَتَّى يُهْبَطَ بِهَا إِلَى الأَسْوَاقِ» متفقٌ عليه.

1778. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: సరుకు మార్కెట్టులో దించబడనంతవరకు మీరు దానిని కలవకండి.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"మీరు దానిని కలవకండి" అంటే సరుకు తెచ్చేవారిని కలవకండి అని అర్థం. ఈ హదీసు భావం కూడా పై హదీసు భావం లాంటిదే. గ్రామాల నుంచి పట్టణాలకు సరుకులు తీసుకువచ్చే రైతులను దళారుల దోపిడీ విధానాల నుంచి కాపాడటమే ఈ హదీసుల ప్రధాన ఉద్దేశం. సాధారణంగా పల్లెవాసులకు మార్కెట్టు ధరలు సరిగ్గా తెలిసి వుండవు. కనుక వారు నేరుగా మార్కెట్టుకు వచ్చి మార్కెట్టు ధరలను తెలుసుకోనంతవరకూ అసలు దళారులు వారిని కలవనేకూడదని చెప్పటం జరిగింది. "పట్నవాసి పల్లెవాసి సరుకును అమ్మరాదు (లేక పల్లెవాసి కోసం బేరం చేయరాదు)" అన్న హదీసు గురించి వ్యాఖ్యానిస్తూ హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) "అంటే పట్నవాసి పల్లెవాసికి దళారీగా వ్యవహరించరాదు" అని చెప్పారు. ఎందుకంటే దళారులు ఆ వస్తువుల అసలు ధరలకు తమ కమీషన్‌ను కూడా జోడించి అతి ఎక్కువ ధరలకు వస్తువులను విక్రయించటానికి ప్రయత్నిస్తారు. ఈ విధానాల వల్ల వస్తువుల ధరలు మండిపోతాయి. నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతాయి. కనుక ఈ హదీసుల్లో పై రెండు రకాల దోపిడి విధానాలను అరికట్టడం జరిగింది. 1) మార్కెట్టు ధరలు తెలియని రైతుల దగ్గర్నుంచి సరుకును అతి తక్కువ ధరకు కొని అమాయక రైతులకు ద్రోహం చేయరాదు. 2) ఇబ్బడి ముబ్బడి కమీషన్‌ల కోసం వస్తువుల ధరలను పెంచరాదు. ఈ రెండు ఉద్దేశాలు లేకుండా ఎవరైనా తన పల్లెటూరి మిత్రుని సరుకును న్యాయమైన ధరకు అమ్మితే అందులో తప్పు లేదు. అలాగే పట్నవాసులు ఒకరింకొకరి వస్తువుల క్రయవిక్రయాల్లో సహాయపడినందుకు న్యాయమైన రీతిలో కమిషన్ తీసుకుంటే అందులో కూడా ఎటువంటి దోషం లేదు.

١٧٧٩ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَتَلَقَّوُا الرُّكْبَانَ، وَلا يَبِعْ حَاضِرٌ لِبَادٍ» فَقَالَ لَهُ طَاوُسٌ: «مَا لا يَبِعْ حَاضِرٌ لِبَادٍ»؟ قَالَ: لا يَكُونُ لَهُ سِمْسَاراً. متفقٌ عليه.

1779. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు వర్తక బృందాలను కలవటానికి వెళ్ళకండి. అలాగే ఏ పట్నవాసి కూడా పల్లెవాని తరపున బేరం చేయకూడదు.

(ఇబ్నె అబ్బాస్ (రజి) శిష్యులైన) తావుస్ ఆయన్ని, "పట్నవాసి పల్లెవాని తరపున బేరం చేయకూడదంటే ఏమిటి?" అని అడిగారు. అందుకాయన, "అంటే అతనికి దళారీగా వ్యవహరించ కూడదు" అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు భావం కూడా పై హదీసు భావమే. అంటే సాధారణంగా పల్లెవాసులకు మార్కెట్టు ధరలు తెలిసి ఉండవు. దీనిని సొమ్ము చేసుకొని కొందరు వారికి దళారీగా ఉంటామని చెప్పి బాగా డబ్బు గుంజుతారు. ఒకవేళ పల్లెవాసికి నష్టం కలిగించే ఉద్దేశ్యం లేకుండా అతనికి దళారీగా వ్యవహరిస్తే అందులో తప్పులేదు. ఈ రోజుల్లో దళారీ, కమీషన్ వ్యవహారాల్లో అనేక రకాలున్నాయి. వాటిలో కొన్ని ధర్మసమ్మతమైనవి. మరికొన్ని అధర్మమైనవి.

١٧٨٠ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ أَنْ يَبِيعَ حَاضِرٌ لِبَادٍ، وَلاتَنَاجَشُوا وَلا يَبِيعُ الرَّجُلُ عَلَى بَيْعِ أَخِيهِ، وَلا يَخْطُبُ عَلَى خِطْبَةِ أَخِيهِ، وَلا تَسْأَلِ الْمَرْأَةُ

1780. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ క్రింది పనులు చేయకూడదని చెప్పారు: పట్టణ వ్యక్తి గ్రామీణుని సరుకును తాను అమ్మించటం. కొనే ఉద్దేశ్యం లేకుండా (ఇతరుల్ని మోసగించటం కోసం) వస్తువు ధరను (పాటపాడి) పెంచేయటం. తన సోదరుడు బేరం చేస్తున్నప్పుడు అదే వస్తువు కోసం

طلاقَ أُخْتِهَا لِتَكْفَأَ مَا فِي إنَائِهَا. وفي رِوَايَةٍ قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ عَنِ التَّلَقِّي وَأَنْ يَبْتَاعَ المُهَاجِرُ لِلأَعْرَابِيِّ، وَأَنْ تَشْتَرِطَ المَرْأَةُ طَلاقَ أُخْتِهَا، وَأَنْ يَسْتَامَ الرَّجُلُ عَلَى سَوْمِ أَخِيهِ، وَنَهَى عَنِ النَّجْشِ وَالتَّصْرِيَةِ. متفقٌ عليه.

పోటాపోటీగా బేరం చేయటం. తన సోదరుడు వివాహ సందేశం పంపిన చోట అతనికి పోటీగా వివాహ సందేశం పంపటం. స్త్రీ తాను పెళ్ళి చేసుకో దలచిన పురుషునికి అతను తన మొదటి భార్యకు విడాకులివ్వాలని షరతు పెట్టటం.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) ఈ క్రింది పనులు చేయకూడదని చెప్పారు: వ్యాపార సరుకులు తెచ్చే బృందాలకు ఎదురేగి కలుసుకోవటం, పట్టణవాసి గ్రామీ ణుని కోసం సరుకు కొనటం. స్త్రీ (తాను పెళ్ళి చేసుకోవటం కోసం) తన (ముస్లిం) సోదరికి విడాకులు ఇవ్వమని షరతు విధించటం. మనిషి తన సోదరుడు బేరం చేస్తున్నప్పుడు అదే వస్తువు కోసం పోటాపోటీగా బేరం చేయటం. (మోసం చేసే ఉద్దేశ్యంతో) వస్తువు ధరను (పాటపాడి) పెంచటం, పశువును దాని పొదుగులో ఎన్నో పూటల పాలు ఆపి ఉంచి అమ్మటం.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మూలంలో 'లితక్ఫఅ మాఫీ ఇనాయిహా' అని ఉంది. ఇదో అరబీ జాతీయం. 'ఆమె పాత్రలో ఉన్నదాన్ని క్రిందపారబోయాలన్న ఉద్దేశంతో' అని దీని అసలు అర్థం. ఇక్కడ ఈ వాక్యానికి 'ఒక స్త్రీ తన తోటి స్త్రీకి అతని భర్తచేత విడాకులు ఇప్పించి, తను ఆ పురుషుణ్ణి వివాహమాడటం" లేక ఆ స్త్రీ తన సవతి అయిన పక్షంలో "భర్త దృష్టిని, అతని

షణ్ణి వివాహమాడటం" లేక ఆ స్త్రీ తన సవతి అయిన పక్షంలో "భర్త దృష్టిని, అతని సద్వ్యవహారాన్ని తనకు మాత్రమే పరిమితం చేసుకోవటం" మొదలగు అర్థాలు వస్తాయి. ఈ చెడు పోకడలకు పాల్పడరాదని దైవప్రవక్త (సల్లం) గట్టిగా తాకీదు చేశారు.

పశువుల పొదుగుల్లో పాలు ఆపి ఉంచి, ఆ పశువులు ఎక్కువ పాలిచ్చేవిగా నమ్మజూపి వాటిని విక్రయించటం కూడా నిషిద్ధంగానే పరిగణించబడుతుంది. సాధారణంగా ఇలా జరుగుతూ ఉంటుంది. ఇలా చేయటం ద్రోహం. వ్యాపారంలో అబద్ధం చెప్పటం, ద్రోహానికి పాల్పడటం నిషిద్ధం. దైవప్రవక్త (సఅసం) వ్యాపారంలోగాని, జీవితంలోని మరే రంగంలో నయినా గాని ఇటువంటి మోసపూరిత విధానాలను విపరీతంగా అసహ్యించుకునే వారు.

1781. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: ఒకరు బేరం చేస్తున్నప్పుడు అదే వస్తువు కోసం మరొకరు పోటాపోటీగా బేరం చేయ కూడదు. తన సోదరుడు వివాహ సందేశం పంపినచోట అతను అనుమతినిస్తేనే తప్ప వివాహ సందేశం పంపరాదు. (బుఖారీ-ముస్లిం, వాక్యాలు ముస్లింవి)

١٧٨١ ـ وَعَن ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا، أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لا يَبِعْ بَعْضُكُمْ عَلى بَيْعِ بَعْضٍ، وَلا يَخْطُبْ عَلى خِطْبَةِ أَخِيهِ إلَّا أَنْ يَأْذَنَ لَهُ» متفقٌ عليه وهٰذا لَفظ مسلم.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని బుయూ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక వ్యక్తి ఒక ఇంట్లో ఏ స్త్రీతోనయినా వివాహ సంబంధం కుదుర్చుకొని ఉండగా, మరొకరెవరూ ఆ స్త్రీకు లేక ఆమె ఇంటివారికి వివాహ సందేశం పంపరాదు. అలా పంపటం నిషిద్ధం. ఎవరైనా తెలిసి కూడా ఆ విధంగా సందేశం పంపించినట్లయితే అది పాపంగా పరిగణించబడుతుంది. ఒకవేళ మొదటి వ్యక్తి తన ఉద్దేశాన్ని విరమించుకున్నట్లయితే అప్పుడు ఆ స్త్రీకి వివాహ సందేశం పంపటంలో తప్పులేదు. అలాగే ఈ ఆజ్ఞ స్త్రీలకు కూడా వర్తిస్తుంది. అంటే ఎవరైనా పురుషునికి సంబంధించి ఒక స్త్రీ ఇంటివారు వివాహ సందేశం పంపి ఉన్నచోటుకి ఇతర ఏ స్త్రీ లేక ఆమె తాలూకు బంధువులు వివాహ సందేశం పంపరాదు.

1782. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: విశ్వాసి విశ్వాసికి సోదరుడు. కనుక తన

١٧٨٢ ـ وَعَـنْ عُقْبَـةَ بْـنِ عَـامِـرٍ رَضِـيَ اللهُ عَنْـهُ أَنَّ رَسُـولَ اللهِ ﷺ قَـالَ:

«الْمُؤْمِنُ أَخُو الْمُؤْمِنِ، فَلَا يَحِلُّ لِمُؤْمِنٍ أَنْ يَبْتَاعَ عَلَى بَيْعِ أَخِيهِ وَلَا يَخْطُبَ عَلَى خِطْبَةِ أَخِيهِ حَتَّى يَذَرَ» رواهُ مسلم.

సోదరుడు బేరం చేస్తున్నప్పుడు అదే వస్తువు కోసం తాను పోటాపోటీగా బేరం చేయరాదు. అలాగే అతను వివాహ సందేశం పంపినచోట- అతను తన నిర్ణయాన్ని వదులుకోనంతవరకూ తను వివాహసందేశం పంపరాదు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నికాహ్ ప్రకరణం)*



356 వ అధ్యాయం

# ٣٥٦ ـ بَابُ النَّهْيِ عَنْ إِضَاعَةِ الْمَالِ فِي غَيْرِ وُجُوهِهِ الَّتِي أَذِنَ الشَّرْعُ فِيهَا

## షరీఅత్ అనుమతించే పనుల మీద తప్ప ఇతర పనుల మీద ధనం ఖర్చుపెట్టరాదు

١٧٨٣ ـ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ اللهَ تَعَالَى يَرْضَى لَكُمْ ثَلَاثاً، وَيَكْرَه لَكُمْ ثَلَاثاً: فَيَرْضَى لَكُمْ أَنْ تَعْبُدوه، وَلَا تُشْرِكُوا بِهِ شَيْئاً، وَأَنْ تَعْتَصِموا بِحَبْلِ اللهِ جَمِيعاً وَلَا تَفَرَّقُوا، وَيَكْرَهُ لَكُمْ: قِيلَ وَقَالَ، وَكَثْرَةَ السُّؤَالِ، وَإِضَاعَةَ المَالِ» رواه مسلم، وتقدَّم شرحه.

1783. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచించారు: మీరు చేసే మూడు పనులవల్ల దేవునికి సంతోషం కలుగుతుంది. మూడు పనుల వల్ల అసహ్యం కలుగుతుంది. అల్లాహ్‌కు సంతోషం కలిగించే మీ పనులు; 1) మీరు ఆయనకు సహవర్తులుగా ఎవరినీ నిలబెట్టకుండా ఆయన్నే ఆరాధించటం. 2) మీరందరూ కలిసి దేవుని త్రాడును గట్టిగా పట్టుకోవటం. 3) పరస్పరం విడిపోకుండా ఉండటం. ఇకపోతే అల్లాహ్‌కు అసహ్యం కలిగించే మీ పనులు: 1) ఎలాంటి ప్రయోజనం లేని చర్చలు జరపటం. 2) అతిగా ప్రశ్నించటం. 3) ధనం వృథా చేయటం (ముస్లిం). దీని వివరణ ఇంతకు ముందు వచ్చింది.

١٧٨٤ ـ وَعَنْ وَرَّادٍ كَاتِبِ المُغِيرَةِ بْنِ شُعْبَةَ قَالَ: أَمْلَى عَلَيَّ المُغِيرَةُ فِي كِتَابٍ إِلَى مُعَاوِيَةَ رَضِيَ اللهُ عَنْهُ، أَنَّ النَّبِيَّ ﷺ كَانَ يَقُولُ فِي دُبُرِ كُلِّ صَلَاةٍ

1784. హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) లేఖకులైన వర్రాద్ కథనం: ముగీరా (రజి)గారు నా చేత ముఆవియా (రజి)కు రాయించిన లేఖలో ఈ

مَكْتُوبَةٍ: «لَا إِلَهَ إِلَّا اللهُ وَحْدَهُ لَا شَرِيكَ لَهُ، لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلَى كُلِّ شَيْءٍ قَدِيرٌ، اللَّهُمَّ لَا مَانِعَ لِمَا أَعْطَيْتَ، وَلَا مُعْطِيَ لِمَا مَنَعْتَ، وَلَا يَنْفَعُ ذَا الْجَدِّ مِنْكَ الْجَدُّ» وَكَتَبَ إِلَيْهِ أَنَّهُ كَانَ يَنْهَى عَنْ قِيلَ وَقَالَ، وَإِضَاعَةِ الْمَالِ، وَكَثْرَةِ السُّؤَالِ، وَكَانَ يَنْهَى عَنْ عُقُوقِ الأُمَّهَاتِ، وَوَأْدِ الْبَنَاتِ، وَمَنْعٍ وَهَاتِ. متفقٌ عَلَيْهِ وسبق شرحه.

విధంగా రాశారు. దైవప్రవక్త (సల్లం) ప్రతి ఫర్జ్ నమాజు తర్వాత ఈ విధంగా పఠించేవారు: అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడులేడు. ఆయనకు సహ వర్తులు ఎవరూ లేరు. విశ్వసామ్రాజ్యం ఆయనదే. స్తోత్రం ఆయనకే శోభి స్తుంది. ఆయన ప్రతి వస్తువు మీద అధికారం కలవాడు. ఓ అల్లాహ్! నీవు ప్రసాదించేదాన్ని అడ్డుకునేవాడెవడూ లేడు. నీవు అడ్డుకున్నదాన్ని ప్రసా దించేవాడెవడూ లేడు. ఏ గొప్పవాడి గొప్పదనమూ నీకు వ్యతిరేకంగా అతనికి ప్రయోజన దాయకం కాజాలదు.

ఇదిగాక ఆయన ఈ మాట కూడా రాశారు: దైవ ప్రవక్త (సల్లం) అనవసర మైన వాదోప వాదాలను, ధనం వృథా చేయటాన్ని, ఇంకా తల్లుల పట్ల అవిధేయత కనబరచటాన్ని, ఆడ పిల్లల్ని సజీవదహనం చేయటాన్ని, హక్కుదారునికి హక్కు చెల్లించక పోవ టాన్ని, వెంటపడి అడగటాన్ని వారిం చారు. *(బుఖారీ-ముస్లిం, దీని వివరణ ఇంతకుముందు వచ్చింది.)*

*(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అఖ్జియా ప్రకరణం)*

## 357 వ అధ్యాయం

## ٣٥٧ - بَابُ النَّهْي عَنِ الْإِشَارَةِ إِلَى مُسْلِمٍ بِسِلَاحٍ وَنَحْوِهِ سَوَاءٌ كَانَ جَادّاً أَوْ مَازِحاً، وَالنَّهْي عَنْ تَعَاطِي السَّيْفِ مَسْلُولاً

## ఉద్దేశ్యపూర్వకంగానైనా, పరాచికానికయినా ఒక ముస్లింకు ఆయుధం చూపించటం నిషిద్ధం. అదే విధంగా నగ్న ఖడ్గం చేబూనటం తగదు

١٧٨٥ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قَالَ: «لَا يُشِرْ أَحَدُكُمْ إِلَى أَخِيهِ بِالسِّلَاحِ، فَإِنَّهُ لَا يَدْرِي لَعَلَّ الشَّيْطَانَ يَنْزِعُ فِي يَدِهِ، فَيَقَعَ فِي حُفْرَةٍ مِنَ النَّارِ» مُتَّفَقٌ عَلَيْهِ. وفي رِوَايَةٍ لِمُسْلِمٍ قَالَ: قَالَ أَبُو الْقَاسِمِ ﷺ: «مَنْ أَشَارَ إِلَى أَخِيهِ بِحَدِيدَةٍ، فَإِنَّ الْمَلَائِكَةَ تَلْعَنُهُ حَتَّى يَنْزِعَ، وَإِنْ كَانَ أَخَاهُ لِأَبِيهِ وَأُمِّهِ». قَوْلُهُ ﷺ: «يَنْزِعُ» ضُبِطَ بِالْعَيْنِ الْمُهْمَلَةِ مَعَ كَسْرِ الزَّايِ، وبِالْغَيْنِ الْمُعْجَمَةِ مع فتحِها ومعناهما مُتَقَارِبٌ، وَمَعْنَاهُ بِالْمُهْمَلَةِ يَرْمِي، وبالْمُعْجَمَةِ أَيْضاً يَرْمِي وَيُفْسِدُ، وَأَصْلُ النَّزْغِ: الطَّعْنُ وَالْفَسَادُ.

1785. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీలో ఎవరూ కూడా తన సోదరునివైపు ఆయుధంతో సైగ చేయరాదు. ఎందుకంటే బహుశా షైతాన్ దాన్ని ప్రయోగింపజేస్తే అతను అగ్నిగుండంలో పడిపోయే ప్రమాద ముంది. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనం ప్రకారం అబుల్ ఖాసిమ్ (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయితే తమ సోదరుని వైపు పదునైన వస్తువుతో సైగ చేసి చూపించారో, దైవదూతలు వారిని శపిస్తూ ఉంటారు.

(సహీహ్ బుఖారీలోని ఫితన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని బిర్ర్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

అరబీలో 'సిలాహ్' అని ఉంది. యుద్ధాల్లో శత్రువును వధించటానికి, ఆత్మరక్షణ కోసం ఉపయోగించేవాటిని సిలాహ్‌గా వ్యవహరిస్తారు. ఉదా: కత్తులు, కటార్లు, తుపాకులు, పిస్తోళ్లు, ఫిరంగులు మొదలగునవి. హదీసులో 'హదీదహ్' అనే మరో పదం ప్రయోగించబడింది. అంటే 'పదునైనది' అని అర్థం. మొత్తానికి ఈ హదీసు భావం ఏమిటంటే ఇటువంటి ఆయుధాలను నిర్లక్ష్యంగా ఉపయోగించటం, ముస్లింలనుగాని లేక వేరితరుల్ని గాని అకారణంగా వాటితో బెదిరించటం నిషిద్ధం. ఆఖరికి పరాచికానికయినా వాటిని ఇతరుల మీదకు గురిపెట్టరాదు. దానివల్ల ఎప్పుడూ ప్రమాదం పొంచి ఉంటుంది. పొరబాటున అయినా ఆ ఆయుధాలకు పనిబడితే దానివల్ల ఎంతో నష్టం జరుగుతుంది. ప్రజలు ఇటువంటి విషయాల్లో చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి.

١٧٨٦ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَـالَ: نَهَـى رَسُـولُ اللهِ ﷺ أَنْ يُتَعَـاطَـى السَّيْـفُ مَسْلُـولاً. رَوَاهُ أَبُـو دَاوُد، والترمذي وقال: حديثٌ حَسَنٌ.

1786. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: నగ్న ఖడ్గాన్ని పట్టుకొని ఉండటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు.

(అబూదావూద్, తిర్మిజీ-హసన్)

(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని ఫితన్ అధ్యాయాలు)



## 358 వ అధ్యాయం

## ٣٥٨ - بَابُ كَرَاهَةِ الْخُرُوجِ مِنَ الْمَسْجِدِ بَعْدَ الأَذَانِ إلاَّ بِعُذْرٍ حَتَّى يُصَلِّيَ الْمَكْتُوبَةَ

## అజాన్ తర్వాత కారణమేదీ లేకుండా ఫర్జ్ నమాజ్ చేయకుండా మస్జిద్ నుండి బయటికి వెళ్ళిపోవటం అవాంఛనీయం

١٧٨٧ - عَنْ أَبِي الشَّعْثَاءِ قَالَ: كُنَّا قُعُوداً مَعَ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ في المَسْجِدِ، فَأَذَّنَ المؤَذِّنُ، فَقَامَ رَجُلٌ مِنَ المَسْجِدِ يَمْشِي، فَأَتْبَعَهُ أَبُو هُرَيْرَةَ بَصَرَهُ حَتَّى خَرَجَ مِنَ المَسْجِدِ، فَقَالَ أَبُو هُرَيْرَةَ: أَمَّا هٰذَا فَقَدْ عَصَى أَبَا القَاسِمِ، ﷺ. رواهُ مسلم.

1787. హజ్రత్ అబుష్షాసా కథనం: మేము అబూహురైరా (రజి) వెంట మస్జిద్‌లో కూర్చొని ఉన్నాం. ముఅజ్జిన్ అజాన్ ఇచ్చాడు. ఆ తర్వాత ఒక వ్యక్తి మస్జిద్‌లో నుండి లేచి బయటికి నడవ సాగాడు. అబూహురైరా అతన్నే చూస్తూ ఉన్నారు. అతను బయటికి వెళ్ళి పోగానే ఆయన "ఇతను అబుల్ ఖాసిమ్ (సల్లం)కు అవిధేయత చూపాడు" అని అన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)*

359 వ అధ్యాయం

# ٣٥٩ - بابُ كَرَاهَةِ رَدِّ الرَّيحَانِ لِغَيرِ عُذرٍ

## అకారణంగా సుగంధ ద్రవ్య కానుకను నిరాకరించటం అవాంఛనీయం

١٧٨٨ - عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ عُرِضَ عَلَيْهِ رَيْحَانٌ، فَلَا يَرُدَّهُ، فَإِنَّهُ خَفِيفُ المَحْمِلِ، طَيِّبُ الرِّيحِ» رواهُ مسلم.

1788. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: తమకు ఎవరయినా రైహాన్ (ఒక రకమైన సుగంధ ద్రవ్యం) కానుకగా ఇస్తే దాన్ని నిరాకరించకూడదు. అదో బరువు లేని పవిత్రమైన సువాసన గల వస్తువు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని అల్‌ఫాజ్ ప్రకరణం)*

١٧٨٩ - وَعَنْ أَنَسِ بْنِ مَالِكٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ كَانَ لا يَرُدُّ الطِّيبَ. رواهُ البُخاري.

1789. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) సుగంధ ద్రవ్య కానుకను నిరాకరించేవారు కారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని హిబా ప్రకరణం)*

## 360 వ అధ్యాయం

# ٣٦٠ - بَابُ كَرَاهَةِ الْمَدْحِ فِي الْوَجْهِ لِمَنْ خِيفَ عَلَيْهِ مَفْسَدَةٌ مِنْ إِعْجَابٍ وَنَحْوِهِ، وَجَوَازِهِ لِمَنْ أُمِنَ ذٰلِكَ فِي حَقِّهِ

# గర్వాహంకారాలకు లోనవుతాడేమోనన్న భయముంటే అతన్ని అతని సమక్షంలో పొగడరాదు, ఒకవేళ అలాంటి భయంలేని పక్షంలో అతని సమక్షంలో పొగిడినా తప్పులేదు

١٧٩٠ - عَنْ أَبِي مُوسَى الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعَ النَّبِيُّ ﷺ رَجُلاً يُثْنِي عَلَى رَجُلٍ وَيُطْرِيهِ فِي الْمِدْحَةِ، فَقَالَ: «أَهْلَكْتُمْ، أَوْ قَطَعْتُمْ ظَهْرَ الرَّجُلِ» متفقٌ عليهِ. «وَالإِطْرَاءُ»: الْمُبَالَغَةُ فِي الْمَدْحِ.

1790. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం: ఒక వ్యక్తి మరొక వ్యక్తిని మితిమీరి పొగడసాగాడు. దైవప్రవక్త (సల్లం) అది విని, "నువ్వు అతన్ని నాశనం చేశావు (లేక) నువ్వు అతని నడుం విరగ్గొట్టావు" అని మందలించారు. (బుఖారీ-ముస్లిం)

'ఇత్రా' అంటే పొగడ్తలో అతిశయిల్లటం అన్నమాట.

*(సహీహ్ బుఖారీలోని షహాదత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జుహ్ద్ ప్రకరణం)*

١٧٩١ - وَعَنْ أَبِي بَكْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَجُلاً ذُكِرَ عِنْدَ النَّبِيِّ ﷺ، فَأَثْنَى عَلَيْهِ رَجُلٌ خَيْراً، فَقَالَ النَّبِيُّ ﷺ: «وَيْحَكَ، قَطَعْتَ عُنُقَ صَاحِبِكَ» يَقُولُهُ

1791. హజ్రత్ అబూ బక్రా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) సమక్షంలో ఒక వ్యక్తి ప్రస్తావన వచ్చింది. అప్పుడు ఒకతను ఆ వ్యక్తిని పొగిడాడు. అది విని దైవప్రవక్త (సల్లం) "అయ్యో నీ

مِرَاراً «إِنْ كَانَ أَحَدُكُمْ مَادِحاً لَا مَحَالَةَ، فَلْيَقُلْ: أَحْسِبُ كَذَا وكَذَا إِنْ كَانَ يَرى أَنَّهُ كَذٰلِكَ وَحَسِيبُهُ اللهُ، وَلَا يُزَكَّى عَلَى اللهِ أَحَدٌ» متفقٌ عليه.

పాడుగాను! నీవు పొగడ్తలతో నీ మిత్రుని మెడ నరికేశావు" అన్నారు. ఆయన (సల్లం) ఈ మాట అనేకసార్లు అన్నారు. తర్వాత ఇలా ఉపదేశించారు: (చూడండి!) మీలో ఎవరికయినా మీ సోదరుణ్ణి పొగడటం అవసరం అనిపిస్తే ఈ విధంగా అనాలి: "నేనతన్ని గురించి ఆ విధంగా, ఈ విధంగా అనుకుంటున్నాను. తనూ ఒకవేళ అలాగే అను కుంటూ ఉన్నట్లయితే, అతని లెక్క తీసుకునే వాడైతే అల్లాహ్‌యే. అల్లాహ్ ముందు ఎవరూ తమను పవిత్రులుగా ప్రకటించుకోరాదు."

*(సహీహ్ బుఖారీలోని షహాదత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జుహ్‌ద్ ప్రకరణం)*

١٧٩٢ - وَعَنْ هَمَّامِ بْنِ الْحَارِثِ، عَنِ المِقْدَادِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَجُلاً جَعَلَ يَمْدَحُ عُثْمَانَ رَضِيَ اللهُ عَنْهُ، فَعَمَدَ المِقْدَادُ، فَجَثَا عَلَى رُكْبَتَيْهِ، فَجَعَلَ يَحْثُو فِي وَجْهِهِ الْحَصبَاءَ، فَقَالَ لَهُ عُثْمَانُ: مَا شَأْنُكَ؟ فَقَالَ: إِنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِذَا رَأَيْتُمُ المَدَّاحِينَ، فَاحْثُوا فِي وُجُوهِهِمُ التُّرَابَ» رَوَاهُ مسلم.

1792. హ్రజత్ హమ్మామ్ బిన్ హారిస్ మిఖ్‌దాద్ (రజి) నుండి చేసిన కథనం: ఒకతను ఉస్మాన్ (రజి) ముందు ముఖస్తుతి చేయసాగాడు. అది చూసి మిఖ్‌దాద్ (రజి) ఉద్దేశ్యపూర్వకంగా మోకాళ్ళ మీద కూర్చొని ముఖస్తుతి చేస్తున్నవాడి నోట్లో కంకర రాళ్ళు వేయసాగారు. అది చూసి ఉస్మాన్ (రజి) (ఆశ్చర్యపోయి) "ఏమిటీ మీరు చేస్తుంది?" అని అడిగారు. అందు కాయన సమాధానమిస్తూ, "మీరు ముఖస్తుతి చేసే వారిని చూస్తే వారి

మొహం మీద మన్నుపోయండి అని దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు" అని చెప్పారు (ముస్లిం).

(సహీహ్ ముస్లింలోని జుహ్ద్ ప్రకరణం)

فَهٰذِهِ الأَحَادِيثُ فِي النَّهْيِ، وَجَاءَ فِي الإِبَاحَةِ أَحَادِيثُ كَثِيرَةٌ صَحِيحَةٌ. قَالَ الْعُلَمَاءُ: وَطَرِيقُ الْجَمْعِ بَيْنَ الأَحَادِيثِ أَنْ يُقَالَ: إِنْ كَانَ الْمَمْدُوحُ عِنْدَهُ كَمَالُ إِيمَانٍ وَيَقِينٍ، وَرِيَاضَةُ نَفْسٍ، وَمَعْرِفَةٌ تَامَّةٌ بِحَيْثُ لا يَفْتَتِنُ، وَلا يَغْتَرُّ

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా అంటున్నారు: పై హదీసులన్నీ కూడా ముఖస్తుతి చేయకూడదని తాకీదు చేస్తున్నాయి. అయితే ముఖస్తుతి చేయవచ్చని చెప్పే ప్రామాణికమైన హదీసులు కూడా ఎన్నో ఉన్నాయి.

పండితుల అభిప్రాయం ప్రకారం ఈ రెండు రకాల హదీసులు సమరసం చెందే విధానం ఎలాగుంటుందటే- ముఖస్తుతి చేయబడే వ్యక్తి పరిపూర్ణ విశ్వాసం, నమ్మకం కలిగి ఉండి, హృదయ సాధన చేయగలవాడై, పరిపూర్ణ అవలోకనం కలిగి ఉండటం మూలంగా ముఖస్తుతి వల్ల పరీక్షకు లోనయ్యే లేక అతని మనసు మోసానికి గురయ్యే ప్రమాదం లేకుంటే- అసలు అతని మనసు సంతోషించేది కాకపోయినట్లయితే - అలాంటప్పుడు ముఖస్తుతి చేయటం హరామ్ (నిషిద్ధం) కాదు, మక్రూహ్ (అవాంఛనీయం) కూడా కాదు. ఒకవేళ పైన పేర్కొనబడిన వాటిల్లో ఏదయినా ఒకటి జరుగుతుందన్న భయముంటే అలాంట

بِذٰلِكَ، وَلَا تَلْعَبُ بِهِ نَفْسُهُ، فَلَيْسَ بِحَرَامٍ وَلَا مَكْرُوهٍ، وَإِنْ خِيفَ عَلَيْهِ شَيْءٌ مِنْ هٰذِهِ الأُمُورِ، كُرِهَ مَدْحُهُ فِي وَجْهِهِ كَرَاهَةً شَدِيدَةً، وَعَلَى هٰذَا التَّفْصِيلِ تُنَزَّلُ الأَحَادِيثُ المُخْتَلِفَةُ فِي ذٰلِكَ. وَمِمَّا جَاءَ فِي الإِبَاحَةِ قَوْلُهُ ﷺ لِأَبِي بَكْرٍ رَضِيَ اللهُ عَنْهُ: «أَرْجُو أَنْ تَكُونَ مِنْهُمْ» أَيْ: مِنَ الَّذِينَ يُدْعَوْنَ مِنْ جَمِيعِ أَبْوَابِ الْجَنَّةِ لِدُخُولِهَا، وفِي الحَدِيثِ الآخَرِ: «لَسْتَ مِنْهُمْ»، أَيْ: لَسْتَ مِنَ الَّذِينَ يُسْبِلُونَ أُزُرَهُمْ خُيَلَاءَ. وَقَالَ ﷺ لِعُمَرَ رَضِيَ اللهُ عَنْهُ: «مَا رَآكَ الشَّيْطَانُ سَالِكاً فَجّاً إِلَّا سَلَكَ فَجّاً غَيْرَ فَجِّكَ» وَالأَحَادِيثُ فِي الإِبَاحَةِ كَثِيرَةٌ، وَقَدْ ذَكَرْتُ جُمْلَةً مِنْ أَطْرَافِهَا فِي كِتَابِ: «الأَذْكَارِ».

ప్పుడు ముఖస్తుతి చేయక పోవడం మంచిది. వీటి గురించి వచ్చిన హదీసులపై ఈ వివరాల కనుగుణంగానే భాష్యం చెప్పటం జరిగింది. ముఖస్తుతి చేయవచ్చని చెప్పే హదీసుల్లో ఒకటి ఏమిటంటే అందులో దైవప్రవక్త (సల్లం) అబూబక్ర్ (రజి)తో, "మీరు కూడా వారిలోనివారేనని నా అభిప్రాయం" అని అన్నారు. అంటే స్వర్గంలోకి ప్రవేశించేటప్పుడు స్వర్గపు అన్ని ద్వారాల నుండి మీరు స్వాగతించబడతారని నేను భావిస్తున్నాను (అన్నది దైవప్రవక్త గారి ప్రవచన ఉద్దేశం).

వేరొక ఉల్లేఖనంలో దైవప్రవక్త (సల్లం) అబూబక్ర్ (రజి)తో, "మీరు అలాంటి వారు కారు" అని అన్నారు. అంటే అహంకారంతో తమ లుంగీని గిలకల క్రిందికి వ్రేలాడదీసేవారి లాంటి వారు కారని దాని అర్థం. (మరొక సందర్భంలో) దైవప్రవక్త (సల్లం) ఉమర్ (రజి)తో "మీరు ఒక దారిలో నడుస్తుండగా షైతాన్ చూస్తే వాడు ఆ దారిని వదలిపెట్టి మరోదారిన వెళ్ళిపోతాడు" అని అన్నారు.

ముఖస్తుతి చేయవచ్చని చెప్పే హదీసులు చాలా ఉన్నాయి. వాటిలో కొన్నింటిని నేను "కితాబుల్ అజ్కార్" లో పేర్కొన్నాను.

## 361వ అధ్యాయం

## ٣٦١ ـ بَابُ كَرَاهَةِ الْخُرُوجِ مِنْ بَلَدٍ وَقَعَ فِيهَا الْوَبَاءُ فِرَاراً مِنْهُ وَكَرَاهَةِ الْقُدُومِ عَلَيْهِ

## ఒక నగరంలో అంటువ్యాధి ప్రబలినప్పుడు అక్కణ్ణుంచి పారిపోవటం, బయటివారు ఆ నగరంలోకి ప్రవేశించటం అవాంఛనీయం

قَالَ تَعَالَى: ﴿ أَيْنَمَا تَكُونُوا يُدْرِككُّمُ الْمَوْتُ وَلَوْ كُنتُمْ فِي بُرُوجٍ مُّشَيَّدَةٍ ﴾ [النساء: ٧٨]. وقال تعالى: ﴿ وَلَا تُلْقُوا بِأَيْدِيكُمْ إِلَى التَّهْلُكَةِ ﴾ [البقرة: ١٩٥].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"మీరు ఎక్కడున్నా సరే మృత్యువు మీకు వచ్చి తీరుతుంది. ఎంతటి దృఢమైన భవనాలలో ఉన్నాసరే." (నిసా: 78)

"చేతులారా మిమ్మల్ని మీరు వినాశం పాలు చేసుకోకండి." (బఖర: 195)

### ముఖ్యాంశాలు

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) ఈ అధ్యాయం క్రింద రెండు ఖుర్ఆన్ ఆయతులను పేర్కొన్నారు. మొదటి ఆయతు ద్వారా ఆయన అంటువ్యాధి ప్రబలిన నగరం వదలి పారిపోవటం నిషిద్ధం అన్న విషయాన్ని నిరూపించదలిచారు. మనిషి పారిపోయి ఎక్కడికి వెళ్తాడు? తన అదృష్టంలో మృత్యువు రాసిపెట్టి ఉన్నట్లయితే అతను ఎక్కడ ఉన్నా మృత్యువు తప్పకుండా వచ్చి అతన్ని కబళిస్తుంది. పైగా అలా పారిపోవటం మూలంగా ఆ అంటువ్యాధికి కారణమయ్యే క్రిములు ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించే ప్రమాదముంటుంది. అందుకే దైవప్రవక్త (స) అంటువ్యాధి ప్రబలిన ప్రాంతాలను వదలి వెళ్ళరాదని తాకీదు చేశారు.

ఇకపోతే గ్రంథకర్త రెండవ ఆయతును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని మర్మం ఏమిటంటే ఏదయినా నగరంలో అంటువ్యాధి ప్రబలి ఉన్నప్పుడు బయటివారు అటువంటి నగరాల్లోకి ప్రవేశించి చేజేతులా తమ వినాశాన్ని కొనితెచ్చుకోరాదు. ఇమామ్ నవవీ (రహ్మలై) రెండవ ఆయతు ద్వారా ఈ విషయమే నిరూపించ దలిచారు.

1793. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: హజ్రత్ ఉమర్ (రజి) సిరియాకు బయలుదేరి వెళ్ళారు. ఆయన సర్గ్ ప్రాంతంలో ఉన్నప్పుడు సిరియా నగరాల అధిపతులు - అంటే అబూ ఉబైదా బిన్ జర్రాహ్, తన సహచరులతో వచ్చి ఆయన్ని కలుసుకొని, "సిరియాలో అంటువ్యాధి ప్రబలి ఉంద"ని ఆయనకు తెలియజేశారు. అప్పుడు ఉమర్(రజి) తన వద్దకు, తొలి ముహాజిర్లను పిలుచుకురమ్మని నన్ను పురమాయించారు. నేనెళ్ళి వారిని పిలుచుకువచ్చాను. ఆయన వారికి సిరియాలో అంటువ్యాధి వ్యాపించి ఉందన్న విషయం తెలియజేసి వారి సలహా కోరారు.

వారు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు. కొందరు మాట్లాడుతూ, "మీరు ఒక పని మీద బయలుదేరి వచ్చారు. ఆ పని పూర్తి కాకుండా తిరిగి వెళ్ళటం బాగుండదని మా అభిప్రాయం" అని అన్నారు. మరికొందరు "మీ వెంట మిగతా జనం దైవప్రవక్త సహచరులు తక్కువమంది ఉన్నారు. కనుక వారిని కూడా అంటువ్యాధి వ్యాపించిన ప్రాంతానికి తీసుకెళ్ళటం సరికాదు" అని అన్నారు. వారి అభిప్రాయాలు విన్న తర్వాత ఆయన వారితో, "ఇక మీరు వెళ్ళండి" అన్నారు.

١٧٩٣ - وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ عُمَرَ بْنَ الْخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ خَرَجَ إِلَى الشَّامِ حَتَّى إِذَا كَانَ بِسَرْغَ لَقِيَهُ أُمَرَاءُ الأَجْنَادِ - أَبُو عُبَيْدَةَ بْنُ الجَرَّاحِ وَأَصْحَابُهُ - فَأَخْبَرُوهُ أَنَّ الْوَبَاءَ قَدْ وَقَعَ بِالشَّامِ، قَالَ ابْنُ عَبَّاسٍ: فَقَالَ لِي عُمَرُ: ادْعُ لِي الْمُهَاجِرِينَ الأَوَّلِينَ، فَدَعَوْتُهُمْ، فَاسْتَشَارَهُمْ، وَأَخْبَرَهُمْ أَنَّ الْوَبَاءَ قَدْ وَقَعَ بِالشَّامِ، فَاخْتَلَفُوا، فَقَالَ بَعْضُهُمْ: خَرَجْتَ

لأَمْـرِ، وَلَا نَـرَى أَنْ تَـرْجِـعَ عَنْـهُ. وَقَـالَ بَعْضُهُـمْ: مَعَـكَ بَقِيَّـةُ النَّـاسِ وَأَصْحَـابُ رَسُوْلِ اللهِ ﷺ، وَلَا نَرَى أَنْ تُقْدِمَهُمْ عَلَى هٰذَا الْوَبَاءِ. فَقَالَ: ارْتَفِعُوا عَنِّي، ثُمَّ قَالَ: ادْعُ لِيَ الأَنْصَارَ، فَدَعَوْتُهُمْ، فَاسْتَشَارَهُمْ، فَسَلَكُـوا سَبِيـلَ المهـاجـرِيـنَ، وَاخْتَلَفُـوا كَاخْتِلَافِهِمْ، فَقَالَ: ارْتَفِعُوا عَنِّي، ثُمَّ قَالَ: ادْعُ لِيَ مَنْ كَانَ هَاهُنَا مِنْ مَشْيَخَةِ قُرَيْشٍ مِنْ مُهَاجِرَةِ الْفَتْحِ، فَدَعَوْتُهُمْ، فَلَمْ يَخْتَلِفْ عَلَيْهِ

ఆ తర్వాత అన్సారులను పిలవమని పురమాయించారు. నేను వారిని పిలుచుకొచ్చాను. ఆయన వారిని సలహా ఇవ్వమని అడిగారు. వారు కూడా ముహాజిర్ల విధానాన్నే అనుసరించారు. (అంటే వారిలాగే భేదాభిప్రాయం వ్యక్తం చేశారు.) వారి అభిప్రాయాలు విన్న తర్వాత ఆయన వారితో, "ఇక మీరు వెళ్ళండి" అన్నారు. ఆ తర్వాత ఆయన మక్కా విజయం సందర్భంగా (మదీనాకు) వలసవెళ్ళిన ఖురైషు పెద్దల్లో ఇక్కడున్నవారిని పిలవండి అన్నారు. నేను వారిని పిలుచుకొచ్చాను. వారిలో ఏ ఇద్దరూ భిన్నాభిప్రాయాలు వ్యక్తపరచలేదు. "ప్రజలను అంటువ్యాధి వ్యాపిస్తున్న ప్రాంతానికి తీసుకువెళ్ళటం మంచిది కాదు. అందుకని వారిని తీసుకొని తిరిగివెళ్ళిపోవటం మంచిదని మా అభిప్రాయం" అన్నారు వారంతా. అంతా విన్న తర్వాత ఉమర్ (రజి) ప్రజల ముందు "నేను రేపు ఉదయం (మదీనాకు) తిరిగి వెళ్తున్నాను. కనుక మీరు కూడా రేపుదయం బయలు దేరటానికి సిద్ధంగా ఉండండి" అని ప్రకటన చేయించారు.

అప్పుడు ఉబైదా బిన్ జర్రాహ్ (రజి) "దేవుడు రాసిపెట్టిన అదృష్టం నుంచి పారిపోతున్నారా!" అని అడిగారు.

مِنْهُمْ رَجُلَانِ، فَقَالُوا: نَرَى أَنْ تَرْجِعَ بِالنَّاسِ، وَلَا تُقْدِمَهُمْ عَلَى هٰذَا الْوَبَاءِ، فَنَادَى عُمَرُ رَضِيَ اللهُ عَنْهُ فِي النَّاسِ: إِنِّي مُصْبِحٌ عَلَى ظَهْرٍ. فَأَصْبِحُوا عَلَيْهِ، فَقَالَ أَبُو عُبَيْدَةَ بْنُ الْجَرَّاحِ رَضِيَ اللهُ عَنْهُ: أَفِرَاراً مِنْ قَدَرِ اللهِ؟ فَقَالَ عُمَرُ رَضِيَ اللهُ عَنْهُ: لَوْ غَيْرُكَ قَالَهَا يَا أَبَا عُبَيْدَةَ! ـ وَكَانَ عُمَرُ يَكْرَهُ خِلَافَهُ ـ نَعَمْ نَفِرُّ مِنْ قَدَرِ اللهِ إِلَى قَدَرِ اللهِ، أَرَأَيْتَ لَوْ كَانَ لَكَ إِبِلٌ، فَهَبَطَتْ وَادِياً لَهُ عُدْوَتَانِ، إِحْدَاهُمَا خَصْبَةٌ، وَالأُخْرَى جَدْبَةٌ، أَلَيْسَ إِنْ رَعَيْتَ الْخَصْبَةَ رَعَيْتَهَا بِقَدَرِ اللهِ، وَإِنْ رَعَيْتَ الْجَدْبَةَ رَعَيْتَهَا بِقَدَرِ اللهِ، قَالَ: فَجَاءَ عَبْدُ الرَّحْمٰنِ بْنُ عَوْفٍ رَضِيَ اللهُ عَنْهُ، وَكَانَ مُتَغَيِّباً فِي بَعْضِ حَاجَتِهِ، فَقَالَ: إِنَّ عِنْدِي مِنْ هٰذَا عِلْماً، سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِذَا سَمِعْتُمْ بِهِ بِأَرْضٍ، فَلَا تَقْدَمُوا عَلَيْهِ، وَإِذَا وَقَعَ بِأَرْضٍ وَأَنْتُمْ بِهَا، فَلَا تَخْرُجُوا فِرَاراً مِنْهُ» فَحَمِدَ اللهَ تَعَالَى عُمَرُ رَضِيَ اللهُ عَنْهُ وَانْصَرَفَ. مُتَّفَقٌ عَلَيْهِ. وَالْعُدْوَةُ: جَانِبُ الْوَادِي.

ఆ మాటకు ఉమర్ (రజి) ఇలా బదులు చెప్పారు: ఈ మాట మరొకరి నోట వెలువడి ఉంటే బాగుండు (ఎందు కంటే ఆయనతో విభేదించటం ఉమర్ (రజి)కు ఇష్టంలేదు) అవు నండి, మేము దేవుని అదృష్టం నుండి దేవుని అదృష్టం వైపుకే పారిపోతున్నాం. మీ దగ్గర కొన్ని ఒంటెలు ఉండి, మీరు వాటిని, ఒక వైపు పచ్చటి చెట్లు చేమలు, మరోవైపు బంజరు నేల ఉన్న లోయకు తోలుకెళ్ళా రనుకోండి. అప్పుడు మీరు మీ ఒంటెల్ని (బీడును వదలి) పచ్చిక ఉన్న ప్రదేశంలో మేపినా లేక (పచ్చికను వదలి) బీడులో మేపినా అది దేవుని నిర్ణీత అదృష్టం ప్రకారం మేపినట్లు కాదా?"

అంతలో అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ అక్కడికి చేరుకున్నారు. ఆయన ఏదో పని మీద వెళ్ళి తిరిగొచ్చారు. విషయం తెలుసుకొని ఆయన "నా దగ్గర ఈ సమస్యకు సంబంధించిన జ్ఞానం ఉంది. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక ప్రాంతంలో అంటు వ్యాధి ప్రబలి ఉందని మీరు వింటే అక్కడికి వెళ్ళకండి. ఒకవేళ మీరున్న ప్రాంతంలోనే అంటువ్యాధి ప్రబలితే దాన్నుంచి తప్పించుకోవాలన్న ఉద్దే శ్యంతో అక్కడి నుండి (వేరేచోటికి) వెళ్ళకండి" అని చెప్పారు.

ఈ హదీసు విని ఉమర్ (రజి) దైవానికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు. అక్కణ్ణుంచి (మదీనాకు) తిరుగు ప్రయాణమయ్యారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తిబ్ ప్రకరణం -సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మూలంలో 'అజ్నాద్' అనే పదం వచ్చింది, ఇక్కడ అజ్నాద్ అంటే సిరియా దేశపు ఐదు నగరాలు: పలస్తీనా, జోర్డాన్, డెమాస్కస్, హిమ్స్, ఖిన్సిరీన్ (ఇబ్నె అల్లాన్). పై హదీసులో హజ్రత్ ఉమర్ (రజి) మరియు ఆయన సహచరుల అభిప్రాయం దైవప్రవక్త (స)గారి ప్రవచనానికి అనుగుణంగా ఉంది. అందుకే హజ్రత్ ఉమర్ (రజి)గారు తన అభిప్రాయం దైవప్రవక్త హదీసుకు అనుగుణంగా ఉన్నట్లు రుజువైనందున ఆయన అల్లాహ్‌కు కృతజ్ఞతలర్పించారు. అంతకు ముందు అన్సార్ మరియు ముహాజిర్ సహాబీల్లోని ఒక వర్గం వెలిబుచ్చిన అభిప్రాయం కూడా షరీఅత్ యొక్క ఏదేని మూలం మీద ఆధారపడి ఉన్నప్పటికీ పరిస్థితుల స్వరూపం దృష్ట్యా ఆ నిర్ణయం సరికాదని తేలింది. వీరు దేవుని మీద మొక్కవోని విశ్వాసం, త్యాగభావం, నిస్వార్థం మొదలగు షరీఅతు మూలాలను దృష్టిలో పెట్టుకొని, ఒకసారి ఓ ధర్మకార్యం తలపెట్టిన తర్వాత నగరంలో అంటువ్యాధి ప్రబలి ఉందన్న భయంతో దైవకార్యాన్ని విరమించుకోరాదని అభిప్రాయపడ్డారు. దీనికి భిన్నంగా మరొక వర్గం ముందుజాగ్రత్త, చేజేతులా వినాశాన్ని కొనితెచ్చుకోకుండా ఉండటం లాంటి షరీఅతు ప్రబోధనల్ని దృష్టిలో పెట్టుకొని అంటువ్యాధి ప్రబలి ఉన్న నగరంలోకి ప్రవేశించకుండా ఉండటమే మేలని అనుకుంది. చివరికి ఉమర్ (రజి) మరియు ఆయన సహచరుల అభిప్రాయానికి దైవప్రవక్త (స) హదీసు కూడా బలం చేకూర్చింది.

1794. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: "ఏదయినా ప్రాంతంలో ప్లేగు వ్యాధి ఉందని తెలిస్తే మీరు అక్కడికి వెళ్ళకండి. మీరు ఏదయినా ప్రాంతంలో ఉన్నప్పుడు అక్కడ ప్లేగు వ్యాధి వ్యాపిస్తుంటే మీరు అక్కడి నుంచి (వేరేచోటుకి) వెళ్ళకండి." (బుఖారీ-ముస్లిం)

١٧٩٤ - وَعَنْ أُسَامَةَ بْنِ زَيْدٍ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِذَا سَمِعْتُمُ الطَّاعُونَ بِأَرْضٍ، فَلَا تَدْخُلُوهَا، وَإِذَا وَقَعَ بِأَرْضٍ، وَأَنْتُمْ فِيهَا، فَلَا تَخْرُجُوا مِنْهَا» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని తిబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలామ్ ప్రకరణం)*

## 362వ అధ్యాయం

## ٣٦٢ - بَابُ التَّغْلِيظِ فِي تَحْرِيمِ السِّحْرِ

## చేతబడి చేయటం, నేర్చుకోవటం కఠినంగా నిషేధించబడింది

قَالَ اللهُ تَعَالَى: ﴿وَمَا كَفَرَ سُلَيْمَٰنُ وَلَٰكِنَّ ٱلشَّيَٰطِينَ كَفَرُواْ يُعَلِّمُونَ ٱلنَّاسَ ٱلسِّحْرَ﴾ الآية [البقرة: ١٠٢].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"వాస్తవంగా సులైమాను ఎన్నడూ అవిశ్వాసానికి ఒడిగట్టలేదు. అసలు అవిశ్వాసానికి పాల్పడింది ప్రజలకు చేతబడిని బోధించే షైతానులే." (బఖర:102)

١٧٩٥ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «اجْتَنِبُوا السَّبْعَ المُوبِقَاتِ» قَالُوا: يَا رَسُولَ اللهِ! وَمَا هُنَّ؟ قَالَ: «الشِّرْكُ بِاللهِ، وَالسِّحْرُ، وَقَتْلُ النَّفْسِ الَّتِي حَرَّمَ اللهُ إِلَّا بِالْحَقِّ، وَأَكْلُ الرِّبَا، وَأَكْلُ مَالِ الْيَتِيمِ، وَالتَّوَلِّي يَوْمَ الزَّحْفِ، وَقَذْفُ الْمُحْصَنَاتِ الْمُؤْمِنَاتِ الْغَافِلَاتِ» متفقٌ عليه.

1795. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "ప్రాణాంతకమైన ఏడు విషయాలకు దూరంగా ఉండండి" అని బోధించారు. దానికి సహచరులు, "దైవ ప్రవక్తా! ఏమిటవి?" అని అడిగారు. అందుకాయన ఇలా వివరించారు: "దైవత్వంలో అల్లాహ్‌కు ఇతరుల భాగస్వామ్యం అంటగట్టటం, చేతబడి చేయటం, దేవుడు నిషిద్ధం చేసిన ప్రాణిని అన్యాయంగా చంపటం, వడ్డీ తినటం, అనాధుని సొమ్ము తినేయటం, దైవవిరోధులతో యుద్ధం జరిగినప్పుడు వెన్నుచూపి పారిపోవటం,

అమాయకులు, సౌశీల్యవతులు అయిన విశ్వాస స్త్రీల మీద అభాండాలు వేయటం.”

(బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు “తహ్రీము అమ్వాలిల్ యతీమి” అన్న అధ్యాయంలో కూడా వచ్చింది. పైన పేర్కొనబడిన పనులన్నీ నిషిద్ధమైన పనులు. వాటిలోనే చేతబడి నేర్చుకోవటం, నేర్పించటం కూడా ఉన్నాయి. వాటిని రుజువు చేయటానికే గ్రంథకర్త ఈ హదీసును ఇక్కడ ప్రస్తావించారు.



## 363వ అధ్యాయం

# ٣٦٣ - بَابُ النَّهْيِ عَنِ الْمُسَافَرَةِ بِالْمُصْحَفِ إِلَى بِلَادِ الْكُفَّارِ إِذَا خِيفَ وُقُوعُهُ بِأَيْدِي الْعَدُوِّ

# ఖుర్‌ఆన్ దైవతిరస్కారుల చేతుల్లోకి వెళ్ళిపోయే ప్రమాదముంటే వారి ప్రాంతాలకు ప్రయాణం చేసినప్పుడు దాన్ని వెంట తీసుకొని వెళ్ళరాదు

١٧٩٦ - عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: نَهَى رَسُولُ اللهِ ﷺ أَنْ يُسَافَرَ بِالْقُرْآنِ إِلَى أَرْضِ الْعَدُوِّ. متفقٌ عليه.

1796. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం ఖుర్‌ఆన్ వెంట పెట్టుకొని శత్రు ప్రాంతాలకు ప్రయాణం చేయటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. *(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఇమారత్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

శత్రువులు ఖుర్‌ఆన్ పట్ల అనుచితంగా, అమర్యాదకరంగా ప్రవర్తిస్తారన్న భయంతో ఇలా చెప్పటం జరిగింది. ఒకవేళ అటువంటి ప్రమాదాలేవీ లేనప్పుడు ఖుర్‌ఆన్‌ను వెంట తీసు కెళ్ళటంలో తప్పులేదు. ప్రస్తుత కాలంలో అవిశ్వాసుల దేశాల్లో సైతం లక్షలాది ముస్లింలు నివసిస్తున్నారు. అటువంటి ప్రదేశాలకు కేవలం ఖుర్‌ఆన్ మాత్రమే కాదు ఇస్లామీయ సాహిత్యం మొత్తం తీసుకు వెళ్ళాల్సిన అవసరం ఉంటుంది.

**364వ అధ్యాయం**

## ٣٦٤ ـ بَابُ تَحْرِيْم اسْتِعْمَالِ إِنَاءِ الذَّهَبِ وَإِنَاءِ الْفِضَّةِ فِي الأَكْلِ وَالشُّرْبِ وَالطَّهَارَةِ وَسَائِرِ وُجُوْهِ الإِسْتِعْمَالِ

## తినటం, త్రాగటం, శుభ్రం చేసుకోవటం లాంటి ఇతర ఉపయోగాల నిమిత్తం వెండి, బంగారు పాత్రలను ఉపయోగించరాదు

١٧٩٧ ـ عَنْ أُمِّ سَلَمَةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «الَّذِي يَشْرَبُ فِي آنِيَةِ الْفِضَّةِ إِنَّمَا يُجَرْجِرُ فِي بَطْنِهِ نَارَ جَهَنَّمَ» متفقٌ عَلَيْهِ. وفي رِوَايةٍ لِمُسْلِم: «إِنَّ الَّذِي يَأْكُلُ أَوْ يَشْرَبُ فِي آنِيةِ الْفِضَّةِ والذَّهَبِ».

1797. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: వెండి పాత్రలో త్రాగేవాడు తన కడుపులో నరకాగ్నిని నింపుకుంటున్నట్లే. (బుఖారీ-ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "బంగారం, వెండి పాత్రల్లో తినేవాడు, త్రాగేవాడు (నరకాగ్నితో కడుపు నింపుకున్నట్లే)" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని అష్రిబా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్, జీనత్ ప్రకరణం)*

١٧٩٨ ـ وعنْ حُذَيْفَةَ رَضِيَ اللهُ عَنْهُ قالَ: إنَّ النَّبيَّ ﷺ نَهَانَا عَنِ الحَرِيرِ، وَالدِّيبَاجِ، وَالشُّرْبِ فِي آنِيَةِ الذَّهَبِ

1798. హజ్రత్ హుజైఫా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని పల్చటి, ముతక పట్టువస్త్రాలు ఉపయోగించ వద్దని, బంగారం, వెండి పాత్రల్లో త్రాగ వద్దని గట్టిగా తాకీదు చేశారు. ఆయన

وَالْفِضَّةِ، وقال: «هُنَّ لَهُمْ فِي الدُّنْيَا وَهِيَ لَكُمْ فِي الآخِرَةِ» مُتَّفَقٌ عَلَيْهِ. وفي رواية في الصَّحِيحَيْنِ عَنْ حُذَيْفَةَ رَضِيَ اللهُ عَنْهُ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يقولُ: «لا تَلْبَسُوا الحَرِيرَ وَلا الدِّيبَاجَ، وَلَا تَشْرَبُوا فِي آنِيَةِ الذَّهَبِ وَالْفِضَّةِ وَلا تَأْكُلُوا فِي صِحَافِهَا».

ఇలా అన్నారు: ప్రపంచంలో ఇవి అవిశ్వాసులకు ఉద్దేశించబడినవి. పరలోకంలో అవి మనకు ప్రత్యేకించ బడతాయి. *(బుఖారీ-ముస్లిం)*

బుఖారీ, ముస్లింలోని వేరొక ఉల్లేఖ నంలో హుజైఫా (రజి) ఈ విధంగా వివరిస్తున్నారు: దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా నేను విన్నాను: ముతక, పల్చటి పట్టువస్త్రాలు ధరించ కండి. బంగారం, వెండి గ్లాసుల్లో త్రాగ కండి, వాటి కంచాల్లో తినకండి.

*(సహీహ్ బుఖారీలోని అష్రిబా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని లిబాస్ ప్రకరణం)*

١٧٩٩ - وَعَنْ أَنَسِ بنِ سِيرِينَ قالَ: كُنْتُ مَعَ أَنَسِ بنِ مالكٍ رَضِيَ اللهُ عَنْهُ عِنْدَ نَفَرٍ مِنَ المَجُوسِ، فَجِيءَ بِفَالُوذَجٍ على إنَاءٍ مِنْ فِضَّةٍ، فَلَمْ يَأْكُلْهُ، فَقِيلَ لَهُ حَوِّلْهُ، فَحَوَّلَهُ عَلى إنَاءٍ مِنْ خَلَنْجٍ، وَجِيءَ بِهِ فَأَكَلَهُ. رواه البيهقي بإسْنادٍ حَسَنٍ.

«الخَلَنْجُ»: الجَفْنَةُ.

1799. హజ్రత్ అనస్ బిన్ సీరీన్ కథనం: నేను అనస్ (రజి)తోపాటు కొందరు అగ్నిపూజారుల దగ్గర కూర్చొని ఉన్నాను. అప్పుడు ఒక వెండి పళ్ళెంలో ఫాలూదా (లేక ఒక రకమైన మిఠాయి) ఆయనకు సమర్పించబడింది. ఆయన అది తినలేదు. వారు ఆయన్ని దాన్ని వేరే పళ్ళెంలో వేసుకోమని చెప్పారు. ఆయన దాన్ని చెక్క పళ్ళెంలోకి మార్చిం చారు. ఆ తర్వాత అది ఆయనకు సమర్పించబడింది. అప్పుడు ఆయన దాన్ని తిన్నారు.

*(బైహఖీ దీనిని ప్రామాణికమైన ఆధారా లతో వెలికితీశారు).*

*(సుననె కుబ్రాలోని తహారత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) పై హదీసుల ద్వారా తెలిసిందేమిటంటే బంగారు వెండి పాత్రల్లో తినటం, త్రాగటం లేక వాటిని మరే విధంగానయినా ఉపయోగించటం నిషిద్ధం. ఎందుకంటే వాటిని ఉపయోగించటం గర్వానికి చిహ్నం. కనుక అలంకరణ, ముస్తాబు కోసం వాటిని ఉపయోగించటం కూడా సరికాదు. అయితే స్త్రీలు మాత్రం వీటితో తయారు చేయబడిన ఆభరణాలు ధరించవచ్చు. హదీసుల్లో ఈ మేరకు అనుమతి ఉంది. అయితే కొద్దిమంది పండితులు ఈ హదీసుల ఆధారాల్లో బలహీనత ఉందని చెప్పి స్త్రీలు సయితం బంగారు ఆభరణాలు ధరించటానికి అనుమతి లేదని అభిప్రాయపడ్డారు. షేఖ్ అల్‌బానీ గారు 'ఆదాబుజ్జుఫాఫ్' గ్రంథంలో ఈ అంశాన్ని సవివరంగా చర్చించారు. ఏమయినప్పటికీ ఇతర పండితులు వీరి ఈ అభిప్రాయంతో ఏకీభవించటం లేదు.

2) పురుషులు పట్టు వస్త్రాలు ధరించటానికి ఎంతమాత్రం అనుమతి లేదు. అలాగే స్త్రీల కోసం ప్రత్యేకంగా తయారు చేయబడే లేక కేవలం స్త్రీలు మాత్రమే ఉపయోగించే పట్టుని పోలిన వస్త్రాలు కూడా పురుషుల కొరకు నిషిద్ధమే. పురుషుల కొరకు పట్టువస్త్రాలు నిషేధించబడటానికి కారణం ఏమిటంటే పట్టువస్త్రాల్లోని సున్నితత్వం, నాజూకుతనం పురుష స్వభావానికి విరుద్ధం. అందువల్లనే పురుషుల కొరకు పట్టువస్త్రాలను నిషేధించటం జరిగింది. మొత్తానికి దీనిద్వారా ఇస్లాం యొక్క స్వభావం వెల్లడౌతోంది. తినటం, త్రాగటం, అలంకరణ, వస్త్రధారణ మొదలగు విషయాల్లో ఇస్లాం ధర్మం నిరాడంబరతను, సాత్వికతను ఇష్టపడుతుంది. దీనికి భిన్నంగా ఆడంబరాన్ని, గర్వాహంకారాలను అది తీవ్రంగా అసహ్యించుకుంటుంది.



## 365వ అధ్యాయం

## ٣٦٥ - بَابُ تَحْرِيمِ لُبْسِ الرَّجُلِ ثَوْباً مُزَعْفراً

## పురుషులు కాషాయ రంగు దుస్తులు ధరించటం నిషిద్ధం

١٨٠٠ - عَنْ أنسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: نَهَى النَّبِيُّ ﷺ أَنْ يَتَزَعْفَرَ الرَّجُلُ. متفقٌ عليه.

1800. హజ్రత్ అనస్ (రజి) కథనం: పురుషుడు కాషాయ రంగు దుస్తులు ధరించటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని లిబాస్ ప్రకరణాలు)

١٨٠١ - وعَنْ عَبدِ اللهِ بن عَمْرِو بن العاص رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: رَأَى النَّبِيُّ ﷺ عَلَيَّ ثَوْبَيْنِ مُعَصْفَرَيْنِ فقَالَ: «أُمُّكَ أَمَرَتْكَ بهذا؟» قلتُ: أَغْسِلُهُمَا؟ قال: «بَلْ أَحْرِقْهُمَا». وفي روايةٍ، فقالَ: «إنَّ هذا مِنْ ثِيَابِ الكُفَّارِ فَلا تَلْبَسْهَا» رواه مسلم.

1801. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం: నేను రెండు పసుపు పచ్చ దుస్తులు ధరించి ఉండగా దైవప్రవక్త (సల్లం) నన్ను చూసి, "ఈ దుస్తులు తొడుక్కోమని మీ అమ్మ చెప్పిందా?" అని అన్నారు. (దైవ ప్రవక్త(స) అయిష్టతను గ్రహించి) నేను, "వీటిని (రంగుపోయేలా) ఉతుక్కో మంటారా? (దైవప్రవక్తా!)" అని అడిగాను. అందుకాయన "కాదు, వాటిని కాల్చేయి" అన్నారు.
వేరొక ఉల్లేఖనం ప్రకారం ఆయన "ఇవి అవిశ్వాసుల దుస్తులు, వీటిని నువ్వు ధరించకు" అని అన్నారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని లిబాస్ ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ఉన్‌పుర్ రంగు పసుపుపచ్చగా కాషాయ రంగును పోలి ఉంటుంది. సాధారణంగా స్త్రీలే ఈ రంగు దుస్తులు ధరిస్తారు. అదీగాక అవిశ్వాసుల్లో కొందరు తమ మత చిహ్నంగా ఈ రంగు దుస్తులు ధరిస్తారు. పై రెండు వర్గాలను అనుసరించకుండా ఉండటానికి ఈ హదీసులో అలాంటి రంగు దుస్తులు ధరించకూడదని చెప్పటం జరిగింది.

**366వ అధ్యాయం**

# ٣٦٦ ـ بَابُ النَّهْيِ عَنْ صَمْتِ يَوْمٍ إِلَى اللَّيْلِ

## రోజల్లా మౌనవ్రతం పాటించటం నిషిద్ధం

١٨٠٢ ـ عَنْ عَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: حَفِظْتُ عَنْ رَسُولِ اللهِ ﷺ: «لا يُتْمَ بَعْدَ احْتِلامٍ، وَلا صُمَاتَ يَوْمٍ إِلَى اللَّيْلِ» رواه أبو داود بإسنادٍ حسن.

1802. హజ్రత్ అలీ (రజి) కథనం: "వయోజనులైన తర్వాత అనాధతనం ఉండదు. పగలు నుంచి రాత్రిదాకా మౌనవ్రతం పాటించే ఆచారానికి (షరీఅత్‌లో) ఎలాంటి విలువ లేదు" అనే విషయాలు నేను దైవప్రవక్త (సల్లం) నుంచి విని గుర్తుపెట్టుకున్నాను.

*(అబూదావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో వెలికితీశారు)*

قَالَ الخَطَّابِيُّ فِي تفسيرِ هذا الحديثِ: كَانَ مِنْ نُسُكِ الجَاهِلِيَّةِ الصُّمَاتُ، فَنُهُوا فِي الإِسْلَامِ عَنْ ذٰلِكَ، وَأُمِرُوا بِالذِّكْرِ وَالحَدِيثِ بِالخَيْرِ.

ఇమామ్ ఖత్తాబీ ఈ హదీసు గురించి వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నారు: అజ్ఞాన కాలం నాటి ఆరాధనల్లో మౌనవ్రతం కూడా ఉండేది. ఇస్లాం దీనిని నిషేధించి, "(మౌనంగా ఉండే బదులు) దేవుణ్ణి కీర్తించండి, మంచి మాటలు మాట్లాడండి" అని ఆదేశించింది.

*(సుననె అబూదావూద్‌లోని వసాయా ప్రకరణం)*

١٨٠٣ ـ وَعَنْ قَيْسِ بنِ أَبِي حَازِمٍ قَالَ: دَخَلَ أَبُو بَكْرٍ الصِّدِّيقُ رَضِيَ اللهُ عَنْهُ عَلَى امْرَأَةٍ مِنْ أَحْمَسَ يُقَالُ لَهَا: زَيْنَبُ، فَرَآهَا لا تَتَكَلَّمُ. فقالَ: مَا لَهَا لا تَتَكَلَّمُ؟

1803. హజ్రత్ ఖైస్ బిన్ అబూ హాజిమ్ (రజి) కథనం: అబూ బక్ర్ (రజి) జైనబ్ అనబడే ఒకానొక అహ్‌మస్ తెగ స్త్రీ దగ్గరికి వెళ్ళారు. చూస్తే ఆమె ఎవరితోనూ మాట్లాడటం లేదు. అది

فقالوا: حَجَّت مُصْمِتَةً، فقالَ لَهَا: تَكَلَّمِي فَإِنَّ هذا لا يَحِلُّ، هذا مِنْ عَمَلِ الجَاهِلِيَّةِ! فَتَكَلَّمَتْ. رواه البخاري.

గమనించి ఆయన "ఈవిడ మాట్లాడదు ఎందుకని?" అని జనాన్ని అడిగితే, "తను (ఎవరితోనూ) మాట్లాడనని మొక్కుకుంది" అని చెప్పారు జనం. అది విని ఆయన ఆ మహిళను ఉద్దేశించి "మాట్లాడు. మౌన వ్రతం ధర్మసమ్మతం కాదు. ఇది అజ్ఞాన కాలపు ఆచారం" అని చెప్పారు. అప్పట్నుంచి ఆమె (మౌనవ్రతాలు మాని) మాట్లాడటం మొదలెట్టింది. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని మనాఖిబుల్ అన్సార్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) అనాధలు బాల్యంలో మాత్రమే అనాధలుగా పరిగణించబడతారు. వయోజనులైన తర్వాత ఎవరినీ అనాధలుగా భావించటం జరగదు. ఇహ్తెలామ్ (నిద్రలో వీర్య స్ఖలనం జరగటం) వయోజన దశగా నిర్ణయించబడింది. అయితే దీనికి నిర్ణీత వయస్సు అనేది ఏదీ లేదు. వివిధ దేశాలకు చెందిన పిల్లలు విభిన్న వయసుల్లో ఇహ్తెలామ్ దశకు చేరుకుంటారు. అక్కడి వాతావరణ పరిస్థితులు దానికి కారణమవుతుంటాయి.

2) అజ్ఞానకాలంలో మౌనవ్రతాన్ని కూడా ఒక ఆరాధనగా, దైవసామీప్యానికి చేరుకునే ఒక మార్గంగా భావించేవారు. ఇటువంటి ఇబ్బందులతో కూడుకున్న ఆరాధనా పద్ధతులకు ఇస్లాంలో అనుమతి లేదు. అందుకని ఆరాధనా ఉద్దేశంతో మౌనంగా ఉండటాన్ని వారించటం జరిగింది. మౌనంగా ఉండటం కన్నా అల్లాహ్‌ను ధ్యానిస్తూ, ఆయన పవిత్రతను, గొప్పదనాన్ని కీర్తిస్తూ ఉండటం ఎంతో మేలని ఇస్లాం నొక్కివక్కాణిస్తోంది. అయితే అశ్లీలం మాట్లాడటం, అబద్ధాలు చెప్పటం, చాడీలు చెప్పుకోవటం కంటే మౌనంగా ఉండటమే శ్రేయస్కరమని మాత్రం చెబుతుంది.

## 367వ అధ్యాయం

# ٣٦٧ ـ بَابُ تَحْرِيمِ انْتِسَابِ الْإِنْسَانِ إِلَى غَيْرِ أَبِيهِ وَتَوَلِّيهِ غَيْرَ مَوَالِيهِ

# తన రక్త సంబంధాన్ని, తన బానిసత్వ సంబంధాన్ని వక్రీకరించుకోవటం నిషిద్ధం

١٨٠٤ ـ عَنْ سَعْدِ بنِ أَبي وَقَّاصٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «مَنِ ادَّعَى إِلَى غَيْرِ أَبِيهِ وَهُوَ يَعْلَمُ أَنَّهُ غَيْرُ أَبِيهِ، فَالجَنَّةُ عَلَيْهِ حَرَامٌ» متفقٌ عَلَيْهِ.

1804. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒక వ్యక్తి తన తండ్రి కాని వాణ్ణి - అతను తన తండ్రి కాడని తెలిసి ఉన్నప్పటికీ- తన కన్నతండ్రిగా సూచించుకుంటే అతనికి స్వర్గం నిషిద్ధం అవుతుంది.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఫరాయెజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

١٨٠٥ ـ وعن أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «لا تَرْغَبُوا عَنْ آبَائِكُمْ، فَمَنْ رَغِبَ عَنْ أَبِيهِ، فَهُوَ كُفْرٌ» متفقٌ عليه.

1805. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: కన్న తండ్రిని తండ్రిగా అంగీకరించకపోవటం కుఫ్ర్ (సత్యతిరస్కారం) అవుతుంది. కనుక మీరు మీ తాతముత్తాతలకు విముఖులయిపోకండి.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఫరాయెజ్ ప్రకరణం -సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై రెండు హదీసుల భావం ఒక్కటే. ఉద్దేశ్యపూర్వకంగా తన తండ్రి గురించి చెప్పకుండా వేరొకర్ని తన కన్నవారుగా చెప్పుకోవటం. ఇలా చేయటం అక్రమం అని తెలిసి కూడా ఎవడైనా ఈ దైవాజ్ఞను అబద్ధంగా కొట్టిపారేస్తే అతను కాఫిర్ (దైవతిరస్కారి) అవుతాడు. మరెవడైనా అలా చేయటం హరామ్ అని భావిస్తూనే ప్రాపంచికపరమైన లాభాల కోసమో, ఇతరుల సిరిసంపదల మీద ఆశతోనో అలా చెబుతున్నట్లయితే అప్పుడు కూడా అది ఘోరపాపం (గునాహె కబీరా) గానే భావించబడుతుంది. దీనికి ఒడిగట్టినవాడు తన పాపానికి నరకంలో శిక్ష అనుభవించిన తర్వాతగాని స్వర్గభాగ్యాలకు నోచుకోడు. రక్తసంబంధాల పరిరక్షణ నిమిత్తం ఇటువంటి అక్రమ పద్ధతులను ఘోరమైన పాపాలుగా పేర్కొనటం జరిగింది. రక్త సంబంధ హక్కులకు ఇస్లాంలో ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఆ సంబంధాలను గనక పరిరక్షించకపోతే హక్కుల అపహరణ మొదలవుతుంది.

١٨٠٦ ـ وَعَنْ يزيدَ بن شريكِ بن طارقٍ قالَ: رَأَيْتُ عَلِيّاً رَضِيَ اللهُ عَنْهُ عَلى المِنْبَرِ يَخْطُبُ، فَسَمِعْتُهُ يَقُولُ: لا وَاللهِ! مَا عِنْدَنَا مِنْ كِتَابٍ نَقْرَؤُهُ إلَّا كِتَابَ اللهِ، وَمَا فِي هذهِ الصَّحِيفَةِ، فَنَشَرَهَا فإذا فِيهَا أَسْنَانُ الإِبِلِ، وَأَشْيَاءُ مِنَ الجِرَاحَاتِ، وَفِيهَا: قالَ رَسولُ اللهِ ﷺ: «المَدِينَةُ حَرَمٌ مَا بَيْنَ عَيْرٍ إِلَى ثَوْرٍ، فَمَنْ أَحْدَثَ فِيهَا حَدَثاً، أَوْ آوَى مُحْدِثاً، فَعَلَيْهِ لَعْنَةُ اللهِ وَالمَلَائِكَةِ وَالنَّاسِ أَجْمَعِينَ، لا يَقْبَلُ اللهُ مِنْهُ يَوْمَ القِيَامَةِ صَرْفاً وَلا عَدْلاً، ذِمَّةُ المُسْلِمِينَ وَاحِدَةٌ، يَسْعَى بِهَا أَدْنَاهُمْ، فَمَنْ أَخْفَرَ مُسْلِماً، فَعَلَيْهِ لَعْنَةُ اللهِ

1806. హజ్రత్ యజీద్ బిన్ షరీక్ బిన్ తారిఖ్ (రజి) కథనం: హజ్రత్ అలీ (రజి) వేదికమీద నించొని ఉపన్యాసం ఇస్తూ ఇలా అంటుండగా నేను చూశాను: దైవం సాక్షి! ఈ గ్రంథం మరియు ఈ ప్రతిలో ఉన్న ఆదేశాలు తప్ప మా దగ్గర మరే పఠన గ్రంథమూ లేదు. ఆ మాట చెప్పి ఆయన ఆ ప్రతిని తెరిచి చూపించారు. అందులో (రక్తపరిహారానికి చెల్లించవలసిన) ఒంటెల వయస్సులు, గాయాలకు (చెల్లించవలసిన నష్టపరిహార) ఆదేశాలు కొన్ని రాయబడి ఉన్నాయి. అందులోనే దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారని ఉంది: మదీనా నగరం ఐర్ నుంచి సౌర్ వరకు పవిత్ర (నిషిద్ధ) ప్రాంతం. ఇక్కడ ఎవరైనా బిద్అత్‌లు సృష్టిస్తే లేక బిద్అత్‌లు

وَالمَلائِكَةِ وَالنَّاسِ أَجْمَعِينَ لَا يَقْبَلُ اللهُ مِنْهُ يَوْمَ الْقِيَامَةِ صَرْفاً وَلا عَدْلًا، وَمَنِ ادَّعَى إِلَى غَيْرِ أَبِيهِ، أَوِ انْتَمَى إِلى غَيْرِ مَوَالِيهِ، فَعَلَيْهِ لَعْنَةُ اللهِ وَالمَلائِكَةِ وَالنَّاسِ أَجْمَعِينَ، لا يَقْبَلُ اللهُ مِنْهُ يَوْمَ الْقِيَامَةِ صَرْفاً وَلا عَدْلًا». متفقٌ عليه. «ذِمَّةُ المُسْلِمِينَ» أَيْ: عَهْدُهُمْ وَأَمَانَتُهُمْ. وَ«أَخْفَرَهُ»: نَقَضَ عَهْدَهُ. وَ«الصَّرْفُ»: التَّوْبَةُ، وَقِيلَ الحِيْلَةُ. وَ«الْعَدْلُ»: الْفِدَاءُ.

సృష్టించేవాడికి ఆశ్రయం కల్పిస్తే అతనిమీద దేవుని శాపం, దైవదూతల మరియు ప్రజలందరి శాపం పడుతుంది. ప్రళయదినాన దేవుడు అతని ఏ ఫర్జ్ ఆరాధననూ, మరే నఫిల్ ఆరాధననూ అంగీకరించడు. ముస్లిం లందరి ప్రమాణం ఒక్కటే. వారిలోని అత్యంత అల్పుడు సైతం దానికోసం కృషిచేయగలడు. ఎవరైనా ఒక ముస్లిం ప్రమాణాన్ని భగ్నం చేస్తే అతని మీద దేవుని, దైవదూతల మరియు ప్రజ లందరి శాపం పడుతుంది. ప్రళయ దినాన దేవుడు ఏ ఫర్జ్ ఆరాధననూ, మరే నఫిల్ ఆరాధననూ అంగీక రించడు. ఎవరైనా తన కన్న తండ్రిని కాదని వేరొకణ్ణి తన తండ్రిగా తలచు కుంటే లేక తన యజమానిని కాదని వేరొకర్ని తన యజమానిగా సూచించు కుంటే అతని మీద దేవుని, దైవ దూతల మరియు ప్రజలందరి శాపం పడుతుంది. ప్రళయదినాన దేవుడు అతని ఏ ఫర్జ్ ఆరాధననూ, మరే నఫిల్ ఆరాధననూ ఆమోదించడు.

(బుఖారీ-ముస్లిం)

"జిమ్మతుల్ ముస్లిమీన్" అంటే ముస్లింల ప్రమాణం, ముస్లింలు ఎవరికైనా రక్షణ కల్పించటం అని అర్థం. అఖ్ ఫరహూ అంటే, "అతను

ఆ ప్రమా ణాన్ని భగ్నం చేస్తే" అని అర్థం. 'సర్ఫున్' అంటే పశ్చాత్తాపం, 'అద్లున్' అంటే పరిహారం అని భావం.

(సహీహ్ బుఖారీలోని ఫరాయెజ్ ప్రకరణం -సహీహ్ ముస్లింలోని ఇత్ఖ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పై హదీసు మూలంలో 'ఐర్' మరియు 'సౌర్' అనే రెండు పదాలు ఉపయోగించ బడ్డాయి. ఇవి మదీనా నగరంలోని రెండు కొండల పేర్లు. ఈ రెండు కొండల మధ్యగల ప్రాంతం 'హరమ్' (నిషిద్ధ) ప్రాంతంగా ఖరారు చేయబడింది. కనుక మక్కా హరమ్ ప్రాంతంలో మాదిరిగానే ఇక్కడ కూడా జంతువులను వేటాడటం, చెట్లు నరకటం ధర్మసమ్మతం కాదు. అలాగే అవిశ్వాసులు, ముష్రిక్కులు ఈ ప్రాంతంలో అడుగుపెట్టటానికి కూడా అనుమతి ఉండదు.

హదీసు మూలంలో 'సర్ఫున్', 'అద్లున్' అనే మరో రెండు పదాలు వాడబడ్డాయి. పండితులు ఈ పదాలకు ఎన్నో అర్థాలు చెప్పారు. వాటిలో అన్నిటికంటే బాగా ప్రచారం పొందిన అర్థాలనే మేము తర్జుమాలో తీసుకున్నాం. అవి: సర్ఫున్, అంటే విధిగా నిర్ణయించబడిన ఆరాధనలు. అద్లున్ అంటే నఫిల్ ఆరాధనలు. ఆ తర్వాత బాగా ప్రచారంలో ఉన్న అర్థాలు గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) హదీసు చివర్లో పేర్కొన్నవి. 'సర్ఫున్' అంటే పశ్చాత్తాపం, 'అద్లున్' అంటే పరిహారం. ప్రళయదినాన అలాంటి పాపాత్ముల పశ్చాత్తాపమూ ఆమోదించ బడదు. వారి నుండి ఎలాంటి పరిహారమూ స్వీకరించబడదన్న మాట!

దీని ద్వారా పై హదీసులో పేర్కొనబడిన మూడు కార్యాలూ ఎంతటి ఘోరమైన పాపాలో బోధపడుతోంది. దైవప్రవక్త (స) హజ్రత్ అలీగారికి ఏవో కొన్ని ప్రత్యేక ఆదేశాలిచ్చారనీ, ఆ ఆదేశాలు ఆయనకు తప్ప మరెవ్వరికీ ఇవ్వలేదని నేడు కొంతమంది చేస్తున్న ప్రచారంలో ఏమాత్రం సత్యం లేదన్న విషయం కూడా ఈ హదీసు ద్వారా మనకు బోధపడుతోంది. సూఫీ, షియా వర్గాల్లో మనకు ఇటువంటి వాదనలు వినపడ్తుంటాయి. ఇవన్నీ ప్రజలు కల్పించుకున్న మాటలే గాని వీటిలో రవ్వంత కూడా సత్యం లేదు. దైవప్రవక్త బోధనలు సార్వజనీనమై ఉంటాయి. తన ఆదేశాలను, బోధనలను కొందరికి మాత్రమే పరిమితం చేయటం దైవప్రవక్త ఔన్నత్యానికే విరుద్ధం.

١٨٠٧ ـ وَعَنْ أَبِي ذَرٍّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رسولَ الله ﷺ يَقُولُ: «لَيْسَ مِنْ

1807. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నట్లు హజ్రత్ అబూ జర్ (రజి) వివరించారు: ఉద్దేశ్యపూర్వకంగా తన తండ్రిని కాదని

رَجُلٍ ادَّعَى لِغَيْرِ أَبِيهِ وَهُوَ يَعْلَمُهُ إِلَّا كَفَرَ، وَمَنِ ادَّعَى مَا لَيْسَ لَهُ، فَلَيْسَ مِنَّا، وَلْيَتَبَوَّأْ مَقْعَدَهُ مِنَ النَّارِ، وَمَنْ دَعَا رَجُلًا بِالْكُفْرِ، أَوْ قَالَ: عَدُوَّ اللهِ، وَلَيْسَ كَذٰلِكَ إِلَّا حَارَ عَلَيْهِ» مُتَّفَقٌ عَلَيْهِ وَهٰذا لَفْظُ روايةِ مُسْلِمٍ.

వేరొకర్ని తన తండ్రిగా సూచించుకున్నవాడు కుఫ్రకు (సత్య తిరస్కారానికి) ఒడిగట్టినట్లే. తనది కాని వస్తువుని తనదని దావా వేసేవాడు మాలోని వాడుకాడు. అతను నరకంలో తన నివాసం ఏర్పాటు చేసుకోవాలి. ఎవరైనా మరో వ్యక్తిని దైవతిరస్కారి (కాఫిర్) అనో లేక 'ఓ దైవవిరోధి!' అనో పిలిస్తే ఎదుటి వ్యక్తి అలాంటివాడు కాని పక్షంలో ఆ నింద అతని మీదే పడుతుంది. *(బుఖారీ-ముస్లిం)*

ఈ వ్యాక్యాలు ముస్లింలోనివి.

*(సహీహ్ బుఖారీలోని మనాఖిబ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)*

**368వ అధ్యాయం**

# ٣٦٨ ـ بَابُ التَّحْذِيرِ مِنِ ارْتِكَابِ مَا نَهَى اللهُ عَزَّ وَجَلّ وَرَسُولُهُ ﷺ عَنْهُ

# దేవుడు, దైవ ప్రవక్త (సల్లం) వారించిన విషయాల జోలికి పోరాదని హెచ్చరిక

قَالَ اللهُ تَعَالَى: ﴿فَلْيَحْذَرِ الَّذِينَ يُخَالِفُونَ عَنْ أَمْرِهِۦٓ أَن تُصِيبَهُمْ فِتْنَةٌ أَوْ يُصِيبَهُمْ عَذَابٌ أَلِيمٌ ۝٦٣﴾ [النور: ٦٣]. وقال تَعَالَى: ﴿وَيُحَذِّرُكُمُ اللَّهُ نَفْسَهُۥ﴾ [آل عمران: ٣٠]. وقال تَعالى: ﴿إِنَّ بَطْشَ رَبِّكَ لَشَدِيدٌ ۝١٢﴾ [البروج: ١٢]. وقال تَعالى: ﴿وَكَذَٰلِكَ أَخْذُ رَبِّكَ إِذَآ أَخَذَ الْقُرَىٰ وَهِىَ ظَٰلِمَةٌ ۚ إِنَّ أَخْذَهُۥٓ أَلِيمٌ شَدِيدٌ ۝١٠٢﴾ [هود: ١٠٢].

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞను ఉల్లంఘించే వారు తాము ఏదైనా ఉపద్రవంలో చిక్కుకు పోతామేమో అనీ, తమపై బాధాకరమైన శిక్ష ఏదైనా అవతరిస్తుందేమో అని భయపడాలి." *(నూర్: 63)*

"అల్లాహ్ తనకు భయపడండి అని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాడు." *(ఆలి ఇమ్రాన్:30)*

"నిశ్చయంగా నీ ప్రభువు పట్టు బహు గట్టిది." *(బురూజ్: 12)*

"నీ ప్రభువు ఒక దుర్మార్గపు నగరాన్ని శిక్షిం చదలిస్తే ఆయన శిక్ష ఇలాగే ఉంటుంది. నిజంగానే ఆయన శిక్ష బహుకఠినమైనది, బహు బాధాకరమైనది." *(హూద్: 102)*

١٨٠٨ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «إِنَّ اللهَ تَعَالَى يَغَارُ، وَغَيْرَةُ اللهِ أَنْ يَأْتِيَ المَرْءُ مَا حَرَّمَ اللهُ عَلَيْهِ» متفقٌ عليه.

1808. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దేవునికి (కూడా) రోషం వస్తుంది. మనిషి దేవుడు నిషేధించిన కార్యాలకు

పాల్పడినప్పుడు ఆయనకు రోషం వస్తుంది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని తౌబా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవునికి రోషం రావటమంటే ఆగ్రహం రావటం అని భావం. చెడులు, అశ్లీల పనులు మొదలగు వాటిని దేవుడు నిషేధించాడు. దాసులు వాటికి పాల్పడితే ఆయనకు ఆగ్రహం వస్తుంది.



## 369వ అధ్యాయం

# ٣٦٩ - بَابُ مَا يَقُولُهُ وَيَفْعَلُهُ مَنِ ارْتَكَبَ مَنْهِيّاً عَنْهُ

# నిషిద్ధ విషయాలకు పాల్పడినవాడు పాప నిష్కృతి కోసం ఏం చేయాలి? ఏం పఠించాలి

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَإِمَّا يَنزَغَنَّكَ مِنَ ٱلشَّيْطَٰنِ نَزْغٌ فَٱسْتَعِذْ بِٱللَّهِ ﴾ [فصلت: ٣٦]. وَقَالَ تَعَالَى: ﴿ إِنَّ ٱلَّذِينَ ٱتَّقَوْا۟ إِذَا مَسَّهُمْ طَٰٓئِفٌ مِّنَ ٱلشَّيْطَٰنِ تَذَكَّرُوا۟ فَإِذَا هُم مُّبْصِرُونَ ﴾ [الأعراف: ٢٠١]. وقَالَ تَعَالَى: ﴿ وَٱلَّذِينَ إِذَا فَعَلُوا۟ فَٰحِشَةً أَوْ ظَلَمُوٓا۟ أَنفُسَهُمْ ذَكَرُوا۟ ٱللَّهَ فَٱسْتَغْفَرُوا۟ لِذُنُوبِهِمْ وَمَن يَغْفِرُ ٱلذُّنُوبَ إِلَّا ٱللَّهُ وَلَمْ يُصِرُّوا۟ عَلَىٰ مَا فَعَلُوا۟ وَهُمْ يَعْلَمُونَ ۝١٣٥ أُو۟لَٰٓئِكَ جَزَآؤُهُم مَّغْفِرَةٌ مِّن رَّبِّهِمْ وَجَنَّٰتٌ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا ۚ وَنِعْمَ أَجْرُ ٱلْعَٰمِلِينَ ﴾ [آل عمران: ١٣٥، ١٣٦]. وقَالَ تَعَالَى: ﴿ وَتُوبُوٓا۟ إِلَى ٱللَّهِ جَمِيعًا أَيُّهَ ٱلْمُؤْمِنُونَ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴾ [النور: ٣١].

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ఒకవేళ నీకు షైతాన్ నుండి ఏదయినా దుష్ప్రేరణ కలిగితే అప్పుడు అల్లాహ్ శరణు వేడుకో. ఆయన అన్నీ వినే వాడూ, అన్నీ ఎరిగినవాడూను."

*(హామీమ్ అస్సజ్‌దా లేక ఫుస్సిలత్: 36)*

"వాస్తవానికి భయభక్తులు కలవారి స్థితి ఇలా ఉంటుంది. ఎప్పుడైనా షైతాను ప్రభావం వల్ల వారికి ఏదైనా చెడు ఆలోచన తట్టిన ప్పటికీ, వారు తక్షణం అప్రమత్తులవుతారు. తరువాత వారు అవలంబించవలసిన సరైన మార్గం ఏమిటో వారికి స్పష్టంగా కనిపి స్తుంది." *(ఆరాఫ్: 201)*

"సజ్జనుల స్థితి ఎలా ఉంటుందంటే, ఎప్పుడైనా ఏదయినా అశ్లీల కార్యం వారివల్ల జరిగిపోతే లేదా ఏదైనా పాపం చేసి, వారు తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నట్లయితే, వెంటనే వారికి అల్లాహ్ జ్ఞాపకం వస్తాడు. అప్పుడు వారు ఆయనను తమ తప్పులు క్షమించు అని వేడుకుంటారు- ఎందుకంటే అల్లాహ్ తప్ప పాపాలను క్షమించగలిగేవాడు ఎవడున్నాడని- వారు తాము

చేసిన తప్పులను గురించి మొండివాదం చెయ్యరు. అలాంటి వారికి తమ ప్రభువు వద్ద లభించే ప్రతిఫలం ఏమిటంటే, ఆయన వారిని క్షమిస్తాడు. క్రింద సెలయేళ్లు ప్రవహించే ఉద్యానవనాలలోకి వారిని ప్రవేశింపజేస్తాడు. వారు అక్కడ శాశ్వతంగా ఉంటారు. మంచిపనులు చేసే వారికి ఎంత చక్కని ప్రతిఫలం!" *(ఆలి ఇమ్రాన్: 135,136)*

"విశ్వసించిన ప్రజలారా! మీరంతా కలిసి అల్లాహ్ వైపునకు మరలి క్షమాభిక్షను వేడుకోండి. మీకు సాఫల్యం కలగవచ్చు."

*(నూర్: 31)*

## ముఖ్యాంశాలు

మనిషన్న తర్వాత అతని వల్ల తప్పులు జరగకుండా ఉండవు. అది మానవ సహజం. అయితే తప్పు చేసిన తర్వాత మొండివాదనలు చేయడం, చేసిన తప్పుని ఉద్దేశ్యపూర్వకంగా మళ్ళీమళ్ళీ చేయటం మాత్రం సమంజసం కాదు. దేవుని మీద విశ్వాసం కలిగివున్న మనుషులు తమవల్ల తప్పు జరిగిపోతే వెంటనే అందుకు పశ్చాత్తాపం చెంది దైవసన్నిధిలో క్షమాభిక్ష వేడుకుంటారు.

١٨٠٩ - وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْه عَنِ النَّبِيِّ ﷺ قالَ: «مَنْ حَلَفَ فَقَالَ في حَلِفِهِ: بِاللَّاتِ وَالْعُزَّى، فَلْيَقُلْ: لا إِلٰهَ إِلَّا الله، وَمَنْ قَالَ لِصَاحِبِهِ: تَعَالَ أُقَامِرْكَ فَلْيَتَصَدَّقْ». متفقٌ عليه.

1809. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: 'లాత్, ఉజ్జా (దేవుళ్ళ) మీద ఒట్టు' అని ప్రమాణం చేసినవాడు వెంటనే 'లా ఇలాహ ఇల్లల్లాహ్' పఠించాలి. అలాగే తన మిత్రునితో, "జూదం ఆడుకుందాం... రా" అన్నవాడు దానధర్మాలు చేయాలి.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తఫ్సీర్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఐమాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

లాత్, ఉజ్జాలనేవి అరబ్బుల దేవతా విగ్రహాలు. వీటి మీదగాని మరే ఇతర విగ్రహం మీదగాని లేక దైవేతరుల్లో ఎవరిమీదనయినా గాని ప్రమాణం చేస్తే అది షిర్క్ (బహుదైవారాధన) అవుతుంది. ఒకవేళ ఎవరైనా ఆ విధంగా దేవేతరుల మీద ప్రమాణం చేస్తే వారు వెంటనే 'లా ఇలాహ ఇల్లల్లాహ్' కలిమా పఠించి సరిక్రొత్తగా విశ్వాసం స్వీకరించాలి. మరో విషయం ఏమిటంటే సత్కార్యాల వల్ల పాపకార్యాలు తొలగిపోతాయి. కనుక మనిషి తెలిసో తెలియకో పాపం చేస్తే దాని నిష్కృతి కోసం అతను దైవసన్నిధిలో పశ్చాత్తాప హృదయంతో క్షమాపణలు వేడుకొని స్తోమత మేరకు దానధర్మాలు చేయాలి.



# ١٨ - كِتَابُ الْمَنْثُوْرَاتِ وَالْمِلَحِ

# 18 పలు విషయాలకు సంబంధించిన హదీసులు

**370వ అధ్యాయం**

## ప్రళయ చిహ్నాల ప్రకరణం

١٨١٠ - عَنِ النَّوَّاسِ بنِ سَمْعَانَ رَضِيَ اللهُ عَنْه قالَ: ذَكَرَ رَسُولُ اللهِ ﷺ الدَّجَّالَ ذَاتَ غَدَاةٍ، فَخَفَّضَ فِيهِ، وَرَفَّعَ حَتَّى ظَنَنَّاه في طَائفةِ النَّخْلِ. فَلَمَّا رُحْنَا

1810. హజ్రత్ నవ్వాస్ బిన్ సమ్ఆన్ (రజి) కథనం: ఒక రోజు ఉదయం దైవప్రవక్త (సల్లం) దజ్జాల్ ఉపద్రవం ఎంత నీచంగా, ఎంత ప్రమాదకరంగా ఉంటుందో వివరించారు. అది విని మేము ఆ దజ్జాల్ అనేవాడు ఇక్కడే ఈ ఖర్జూర పొదల్లోనే ఉన్నాడేమో అనుకున్నాం.

ఆ తర్వాత మేము దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళినప్పుడు ఆయన మాలో ఉన్న ఆందోళనను గమనించి, “ఏమయింది మీకు?” అని అడిగారు. అందుకు మేము సమాధానమిస్తూ, “దైవప్రవక్తా! మీరు ప్రొద్దున దజ్జాల్ ఉపద్రవం ఎంత నీచంగా, మరెంత ప్రమాదకరంగా ఉంటుందో వివరించారు. అది విన్న తర్వాత మాకు ఆ దజ్జాల్ అనేవాడు ఇక్కడే, ఈ ఖర్జూర పొదల్లోనే ఉన్నాడేమోననిపించింది” అని అన్నాం. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పారు:

إِلَيْـهِ، عَـرَفَ ذلِـكَ فِينَـا، فقـالَ: «مَا شَأْنُكُمْ؟» قُلْنَا: يَارَسُولَ اللهِ! ذَكَرْتَ الدَّجَّالَ الْغَدَاةَ، فَخَفَّضْتَ فِيهِ وَرَفَّعْتَ، حَتَّى ظَنَنَّاه في طَائِفَةِ النَّخْلِ فقال: «غَيْرُ الدَّجَّالِ أَخْوَفُنِي عَلَيْكُمْ؛ إِنْ يَخْرُجْ وَأَنَا فِيكُمْ، فَأَنَا حَجِيجُه دونكُم؛ وَإِنْ يَخْرُجْ وَلَسْتُ فِيكُمْ، فَامْرُؤٌ حَجِيجُ نَفْسِهِ، وَاللهُ خَلِيفَتِي عَلى كُلِّ مُسْلِم. إِنَّه شَابٌّ قَطَطٌ عَيْنُهُ طَافِيَةٌ، كَأَنِّي أُشَبِّهُه بِعَبْدِ الْعُزَّى بن قَطَن، فَمَنْ أَدْرَكَهُ مِنْكُمْ، فَلْيَقْرَأْ عَلَيْهِ فَوَاتِحَ سُورَةِ الْكَهْفِ؛ إِنَّه خَارِجٌ خَلَّةً بَيْنَ الشَّامِ وَالْعِرَاقِ، فَعَـاثَ يَمِينـاً وَعَـاثَ شِمَـالاً، يَـاعِبَـادَ اللهِ!

"మీ విషయంలో దజ్జాల్ కన్నా ఇతర విషయాల గురించి నాకు ఎక్కువ భయం వేస్తోంది. దజ్జాల్ గనక నా సమక్షంలో బయటికి వస్తే మీ అవసరం లేకుండా నేనొక్కణ్ణే అతన్ని ప్రతిఘటించగలను. ఒకవేళ అతను నా మరణానంతరం బయటికి వస్తే అప్పుడు ప్రతి ఒక్కడూ తన్నుతాను కాపాడుకోవాలి. అప్పుడు ప్రతి ముస్లిం కొరకు దేవుడు నా స్థానంలో ఉంటాడు (అంటే ఆయనే వారిని పర్యవేక్షిస్తాడు). ఆ దజ్జాల్ యువకుడై ఉంటాడు. అతనికి ఉంగరాల జుట్టు ఉంటుంది. అతని ఒక కన్ను (ద్రాక్ష పండులాగా) పైకి ఉబికి ఉంటుంది. నేనతన్ని అబ్దుల్ ఉజ్జా బిన్ ఖతన్‌తో పోలుస్తున్నాను. మీలో ఎవరికైనా అతను ఎదురుపడితే మీరు అతని మీద కహఫ్ సూరా ప్రారంభ సూక్తులు పఠించండి. అతను సిరియా-ఇరాక్‌ల మధ్యనున్న మార్గంలో ప్రత్యక్షమవు తాడు. కుడివైపు, ఎడమవైపు కల్లోలం రేకెత్తిస్తాడు. ఓ దైవదాసులారా! (ఆ సమయంలో) మీరు (ధర్మం మీద) స్థిరంగా నిలబడండి."

"అతను ఎంతకాలం ఈ భూమ్మీద ఉంటాడు?" అని మేము అడిగాం. అందుకాయన, "నలభై రోజులుంటాడు. వాటిలో ఒక రోజు ఒక

فَاثْبُتُوا» قُلْنَا: يَارَسُولَ اللهِ! وَمَا لُبْثُهُ فِي الأَرضِ؟ قَالَ: «أَرْبَعُونَ يَوماً: يَوْمٌ كَسَنَةٍ، وَيَوْمٌ كَشَهرٍ، وَيَوْمٌ كَجُمُعَةٍ، وَسَائِرُ أَيَّامِهِ كَأَيَّامِكُمْ» قُلْنَا: يَا رَسُولَ اللهِ! فَذلِكَ الْيَوْمُ الَّذِي كَسَنَةٍ أَتَكْفِينَا فِيهِ صَلاةُ يَوْمٍ؟ قَالَ: «لا، اُقْدُرُوا لَهُ قَدْرَهُ» قُلْنَا: يَا رَسُولَ اللهِ! وَمَا إِسْرَاعُهُ فِي الأَرْضِ؟ قَالَ: «كَالْغَيْثِ اسْتَدْبَرَتْهُ الرِّيحُ، فَيَأْتِي عَلَى الْقَوْمِ، فَيَدْعُوهُم، فَيُؤْمِنُونَ بِهِ، وَيَسْتَجِيبُونَ لَهُ فَيَأْمُرُ السَّمَاءَ فَتُمْطِرُ، وَالأَرْضَ فَتُنْبِتُ، فَتَرُوحُ عَلَيْهِمْ سَارِحَتُهُمْ أَطْوَلَ مَا كَانَتْ ذُرًى، وَأَسْبَغَهُ ضُرُوعاً، وَأَمَدَّهُ خَوَاصِرَ، ثُمَّ يَأْتِي الْقَوْمَ فَيَدْعُوهُمْ، فَيَرُدُّونَ عَلَيْهِ قَوْلَهُ، فَيَنْصَرِفُ عَنْهُمْ، فَيُصْبِحُونَ مُمْحِلِينَ لَيْسَ بِأَيْدِيهِمْ شَيْءٌ مِنْ أَمْوَالِهِمْ، وَيَمُرُّ بِالْخَرِبَةِ فَيَقُولُ لَهَا: أَخْرِجِي كُنُوزَكِ، فَتَتْبَعُهُ كُنُوزُهَا كَيَعَاسِيبِ النَّحْلِ، ثُمَّ يَدْعُو رَجُلاً مُمْتَلِئاً شَبَاباً فَيَضْرِبُهُ بِالسَّيْفِ، فَيَقْطَعُهُ جِزْلَتَيْنِ رَمْيَةَ الْغَرَضِ، ثُمَّ يَدْعُوهُ، فَيُقْبِلُ، وَيَتَهَلَّلُ وَجْهُهُ يَضْحَكُ، فَبَيْنَمَا هُوَ كَذلِكَ إِذْ بَعَثَ اللهُ تَعَالَى الْمَسِيحَ ابْنَ مَرْيَمَ ﷺ، فَيَنْزِلُ عِنْدَ الْمَنَارَةِ الْبَيْضَاءِ شَرْقِيَّ دِمَشْقَ بَيْنَ مَهْرُودَتَيْنِ،

సంవత్సరమంత ఉంటుంది. మరో రోజు ఒక నెలంత ఉంటుంది. ఇంకో రోజు వారమంత ఉంటుంది. మిగతా రోజులు మాత్రం మన వారాల్లాగానే ఉంటాయి" అని చెప్పారు. మళ్ళీ మేము, "దైవప్రవక్తా! ఒకరోజే ఒక సంవత్సరమంత ఉంటుంది కదా! మరి ఆ రోజు మేము ఒక దినపు (ఐదు) నమాజులు చేసుకుంటే సరి పోతుందా?" అని అడిగాం. అందు కాయన 'లేదు. మీరు అంచనా ద్వారా (సంవత్సరం పొడుగునా) నమాజులు చేయాలి' అని చెప్పారు. "దైవప్రవక్తా! భూమి మీద ఆ ఉపద్రవ వేగం ఎలా ఉంటుంది?" అని మేము మళ్ళీ అడిగాం. అందుకాయన, "గాలి వానలా ఉంటుంది. అతను (దజ్జాల్) ప్రజల దగ్గరికెళ్ళి (తనను అనుసరించమని) పిలుపునిస్తాడు. ప్రజలు అతన్ని విశ్వసించి అతను చేయమన్న పనులు చేస్తారు. తర్వాత అతను ఆకాశాన్ని ఆదేశిస్తే అది వర్షం కురిపిస్తుంది. భూమిని ఆదేశిస్తే అది చెట్లు మొలిపిస్తుంది. ప్రజల దగ్గరుండే మేతమేసే జంతువులు (ఆ పచ్చిక మేసి) సాయంత్రం ఇండ్లకు తిరిగి వచ్చేటప్పటికి వాటి మూపురాలు మునుపటి కంటే ఎత్తుగా ఉంటాయి. వాటి పొదుగులు బాగా నిండుగా ఉంటాయి. మరింత విశాల

وَاضِعاً كَفَّيْهِ عَلَى أَجْنِحَةِ مَلَكَيْنِ، إِذَا طَأْطَأَ رَأْسَهُ قَطَرَ وَإِذَا رَفَعَهُ تَحَدَّرَ مِنْهُ جُمَانٌ كَاللُّؤْلُؤِ، فَلَا يَحِلُّ لِكَافِرٍ يَجِدُ رِيحَ نَفَسِهِ إِلَّا مَاتَ، وَنَفَسُهُ يَنْتَهِي إِلَى حَيْثُ يَنْتَهِي طَرْفُهُ، فَيَطْلُبُهُ حَتَّى يُدْرِكَهُ بِبَابِ لُدٍّ فَيَقْتُلُهُ، ثُمَّ يَأْتِي عِيسَى ﷺ قَوْماً قَدْ عَصَمَهُمُ اللهُ مِنْهُ، فَيَمْسَحُ

మవుతాయి. తర్వాత అతను మరొకళ్ళ దగ్గరికి వెళ్లి తనను విశ్వసించమని వారిని పిలుస్తాడు. కాని వారు అతన్ని విశ్వసించటానికి నిరాకరిస్తారు. అతను తిరిగి వెళ్ళిపోగానే వారికి కరువుకాటకా లొస్తాయి. వారి సంపద మొత్తం అయి పోతుంది. అతను ఏదయినా పాడు బడిన చోటు గుండా వెళ్తూ, "నీలో ఉన్న నిధుల్ని బయటికి తీయి" అంటే, తెనెటీగలు తమ రాణి ఈగ వెంట బడినట్లు భూగర్భ నిధులన్నీ అతని వెంటపడతాయి. తర్వాత అతను నిండు యవ్వనంలో ఉన్న మనిషిని పిలిచి అతనిమీద కత్తితో దాడిచేసి విలుకాడి గురిలాగా అతన్ని రెండు ముక్కలుగా నరికేస్తాడు. తర్వాత అతన్ని పిలవగానే అతను కాంతిలీను తున్న ముఖంతో నవ్వుతూ తిరిగొస్తాడు.

(దజ్జాల్ ఇలాంటి మాయపనులు చేస్తు న్నప్పుడే) దేవుడు మర్యమ్ కుమారు డైన మసీహ్‌ను భూమి మీదకు పంపిస్తాడు. ఆయన ఆకాశం నుండి డెమాస్కస్ తూరుపు దిక్కున తెల్లటి మినారు మీద దిగుతారు. పసుపు రంగు బట్టలు ధరించి ఇద్దరు దైవ దూతల రెక్కల మీద (అంటే భుజాల మీద) అరచేతులు ఉంచి దిగుతారు. ఆయన తల వంచగానే నీటి బిందు వులు రాలిపడతాయి. తల పైకెత్తి

عَنْ وُجوهِهِمْ، وَيُحَدِّثُهُم بِدَرَجاتِهِمْ في الجنَّةِ، فَبَيْنَما هُوَ كَذلكَ إذْ أَوْحَى اللهُ تَعَالى إلى عِيسَى ﷺ إنِّي قَدْ أَخْرَجْتُ عِباداً لي لا يَدان لأَحَدٍ بِقِتَالِهِمْ، فَحَرِّزْ عِبَادِي إِلَى الطُّور. وَيَبْعَثُ اللهُ يَأْجُوجَ ومَأْجُوجَ وَهُمْ مِنْ كُلِّ حَدَبٍ يَنْسِلُونَ، فَيَمُرُّ أَوائِلُهُمْ عَلى بُحَيْرَةِ طَبَرِيَّةَ فَيَشْرَبُونَ مَا فيهَا، وَيَمُرُّ آخِرُهُمْ فيقولُون: لَقَدْ كَانَ بِهٰذِهِ مَرَّةً ماءٌ، ويُحْصَرُ نَبِيُّ اللهِ عِيسَى ﷺ، وَأَصْحَابُهُ، حَتَّى يَكُونَ رَأْسُ الثَّوْرِ لأَحَدِهِمْ خَيْراً مِنْ مائَةِ دِينَارٍ لأَحَدِكُمُ الْيَوْمَ، فَيَرْغَبُ نَبِيُّ اللهِ عِيسَى ﷺ وَأَصْحَابُهُ، رَضِيَ اللهُ عَنْهُمْ، إلى اللهِ تَعَالى، فَيُرْسِلُ اللهُ تَعَالى عَلَيْهِمُ النَّغَفَ في رِقَابِهِمْ، فَيُصْبِحُونَ فَرْسَى كَمَوْتِ نَفْسٍ وَاحِدَةٍ ثُمَّ يَهْبِطُ نَبِيُّ اللهِ عِيسَى ﷺ، وَأَصْحَابُهُ رَضِيَ اللهُ عَنْهُمْ، إلى الأَرْضِ، فَلَا يَجِدُونَ في الأَرْضِ مَوْضِعَ شِبْرٍ إلَّا مَلأَهُ زَهَمُهُم وَنَتْنُهُمْ، فَيَرْغَبُ نَبِيُّ اللهِ عِيسَى ﷺ، وَأَصْحَابُهُ رَضِيَ اللهُ عَنْهُمْ إلى اللهِ تَعَالَى، فَيُرْسِلُ اللهُ تَعَالَى طَيْراً كَأَعْنَاقِ الْبُخْتِ، فَتَحْمِلُهُمْ، فَتَطْرَحُهُمْ حَيْثُ شَاءَ اللهُ، ثُمَّ يُرْسِلُ اللهُ عَزَّ وَجَلَّ مَطَراً لَا يَكُنُّ مِنْهُ بَيْتُ

నప్పుడు కూడా ముత్యాల్లాంటి వెండి బిందువులు రాలిపడతాయి. ఆయన శ్వాస సెగ తగిలిన ప్రతి కాఫిర్ చని పోతాడు. ఆయన శ్వాస తన చూపు మేరకు చేరుకుంటుంది. ఆయన దజ్జాల్ కోసం వెతుకుతారు. చివరికి లుద్ ద్వారం వద్ద అతన్ని పట్టుకొని చంపేస్తారు. ఆ తర్వాత ఈసా (అలైహి) దేవుడు దజ్జాల్ ఉపద్రవం నుంచి సురక్షితంగా ఉంచిన వారి దగ్గరికి వెళ్తారు. వారి ముఖాలను తన చేత్తో స్పృశిస్తారు. స్వర్గంలో వారికి లభించ బోయే అంతస్తుల గురించి శుభవార్త నందజేస్తారు. ఆ కాలంలోనే దేవుడు "నేను పుట్టించిన కొందరు దాసులతో పోరాడే శక్తి ఎవరికీ లేదు, కనుక నువ్వు నా ఈ దాసులను తూర్ కొండపైకి తీసుకెళ్ళి వారిని రక్షించు" అని వహీ ద్వారా ఆదేశిస్తాడు. అప్పుడు దేవుడు యాజూజ్ మాజూజ్‌లను పంపిస్తాడు. వారు ప్రతి ఎత్తయిన ప్రదేశం నుంచి క్రిందికి వేగంగా పరుగెత్తుకుంటూ వస్తారు. వారి మొదటి గుంపు తబ్‌రియా నది గుండా పోతుంది. పోతూపోతూ చుక్క మిగల్చకుండా అక్కడి నీళ్ళన్నీ నాకి వెళ్ళిపోతుంది. ఆ దారిగుండా చివరి గుంపు పోతూ ఇక్కడ ఇంతకు ముందెన్నడయినా నీళ్లు ఉండేవా? అంటుంది.

مَدَرٍ وَلَا وَبَرٍ، فَيَغْسِلُ الأَرْضَ حَتَّى يَتْرُكَهَا كَالزَّلَقَةِ، ثُمَّ يُقَالُ لِلأَرْضِ: أَنْبِتِي ثَمَرَتَكِ، وَرُدِّي بَرَكَتَكِ، فَيَوْمَئِذٍ تَأْكُلُ العِصَابَةُ مِنَ الرُّمَّانَةِ، وَيَسْتَظِلُّونَ بِقِحْفِهَا، وَيُبَارَكُ فِي الرِّسْلِ حَتَّى إِنَّ اللِّقْحَةَ مِنَ الإِبِلِ لَتَكْفِي الفِئَامَ مِنَ النَّاسِ، وَاللِّقْحَةَ مِنَ البَقَرِ لَتَكْفِي القَبِيلَةَ مِنَ النَّاسِ، وَاللِّقْحَةَ مِنَ الغَنَمِ لَتَكْفِي الفَخِذَ مِنَ النَّاسِ، فَبَيْنَمَا هُمْ كَذَلِكَ إِذْ بَعَثَ اللهُ تَعَالَى رِيحاً طَيِّبَةً، فَتَأْخُذُهُمْ تَحْتَ آبَاطِهِمْ، فَتَقْبِضُ رُوحَ كُلِّ مُؤْمِنٍ وَكُلِّ مُسْلِمٍ؛ وَيَبْقَى شِرَارُ النَّاسِ يَتَهَارَجُونَ فِيهَا تَهَارُجَ الحُمُرِ فَعَلَيْهِمْ تَقُومُ السَّاعَةُ» رواهُ مسلم. قوله: «خَلَّةً بَيْنَ الشَّامِ وَالعِرَاقِ»: أي: طَرِيقاً بَيْنَهُمَا. وَقَوْلُهُ: «عاثَ» بالعين المهملة والثاء المثلثة، وَالعَيْثُ: أَشَدُّ الفَسَادِ. وَ«الذُّرَى»: بِضَمِّ الذَّالِ المُعْجَمَةِ وَهُوَ أعالي الأَسْنِمَةِ. وَهُوَ جَمْعُ ذِرْوَةٍ بِضَمِّ الذَّالِ وَكَسْرِهَا وَ«اليَعَاسِيبُ»: ذُكُورُ النَّحْلِ. وَ«جِزْلَتَيْنِ» أي: قطعتين، وَ«الغَرَضُ»: الهَدَفُ الَّذِي يُرْمَى إِلَيْهِ بِالنُّشَّابِ، أَيْ: يَرْمِيهِ رَمْيَةً كَرَمْيِ النُّشَّابِ إِلَى الهَدَفِ وَ«المَهْرُودَةُ» بِالدَّالِ المُهْمَلَةِ والمُعْجَمَةِ، وَهِيَ: الثَّوْبُ المَصْبُوغُ.

(ఈ కాలంలో) దైవప్రవక్త ఈసా మరియు ఆయన సహచరులు ముట్టడించబడి ఉంటారు. వారి పరిస్థితి ఎంత దయనీయంగా తయారవుతుందంటే ఒక ఎద్దు తల, వారికి నేటి మన వంద దీనార్లకంటే విలువైనదిగా అనిపిస్తుంది. దైవప్రవక్త ఈసా (అలైహి) మరియు ఆయన సహచరులు (దేవుడు వారి పట్ల ప్రసన్నుడు అవుగాక) దేవుని వైపు మరలగానే దేవుడు యాజూజ్ మాజూజ్‌ల మెడల్లో ఒక పురుగు పుట్టిస్తాడు. దాంతో వారు హఠాత్తుగా ఒకే ప్రాణంలాగా మరణిస్తారు. ఆ తర్వాత దైవప్రవక్త ఈసా మరియు ఆయన సహచరులు నేలమీదికి దిగి వస్తారు. నేల మొత్తం ఒక జానెడు స్థలం కూడా ఖాళీ లేకుండా వారి (శవాల) మాలిన్యంతో దుర్గంధ భరితంగా ఉంటుంది. అప్పుడు దైవప్రవక్త ఈసా (అలైహి) మరియు ఆయన సహచరులు మళ్ళీ (ప్రార్థన కోసం) మరలుతారు. దేవుడు (వారి ప్రార్థన విని) బుఖ్తీ ఒంటె మెడల వంటి పెద్ద పెద్ద పక్షుల్ని పంపిస్తాడు. ఆ పక్షులు వారి శవాలను ఎత్తుకెళ్ళి అల్లాహ్ కోరిన చోట పారేస్తాయి. ఆ తర్వాత దేవుడు వర్షం కురిపిస్తాడు. ఆ వర్షం ప్రతి ఇల్లు, ప్రతి గుడారం మీద కురిసి నేల మొత్తాన్ని నున్నటి రాయిలాగా లేక

قَوْلُهُ: «لَا يَدَانِ» أيْ: لَا طَاقَةَ. وَ«النَّغَفُ»: دُودٌ. وَ«فَرْسَى»: جَمْعُ فَرِيسٍ، وَهُوَ الْقَتِيلُ وَ«الزَّلَقَةُ»: بفتح الزَّاي واللَّام وبالقاف، وَرُوِيَ «الزُّلْفَةُ» بضم الزَّاي وإسكان اللَّام وبالفاء، وهي المِرآة. وَ«العِصَابَةُ»: الجَمَاعَةُ.. وَ«الرِّسْلُ» بكسر الراء: اللَّبَنُ. وَ«اللِّقْحَةُ»: اللَّبُون، وَ«الفِئَامُ» بكسر الفاء وبعدها همزة ممدودة: الجَمَاعَةُ. وَ«الفَخِذُ» مِنَ النَّاسِ: دُونَ القَبِيلَةِ.

అద్దంలాగా శుభ్రం చేసేస్తుంది. తర్వాత భూమిని "నీ పండ్లను మొలకెత్తించు. నీ శుభాలను వ్యాపింపజేయి" అని పురమాయించటం జరుగుతుంది. అప్పుడు ఒక దానిమ్మ పండుని అనేక మంది తిని దాని తోలుతో నీడపట్టుకో గల్గుతారు. పాలలో ఎంత శుభం అవత రిస్తుందంటే పాలిచ్చే ఒక ఒంటె ఒక సంఘానికి సరిపోతుంది. ఒక ఆవు ఒక తెగకు సరిపోతుంది. ఒక మేక ఒక కుటుంబానికి సరిపోతుంది. అదే సమయంలో దేవుడు ఒక పవిత్రమైన గాలిని పంపిస్తాడు. అది ఆ ముస్లిం లను వారి చంకల క్రిందుగా తాకు తుంది. ఆ గాలే ప్రతి విశ్వాసి మరియు ప్రతి ముస్లిం ప్రాణం తీస్తుంది. (ఆ తర్వాత) కేవలం చెడ్డవారు మాత్రమే మిగిలిపోతారు. వారు భూమ్మీద గాడిదల్లాగా జనం అందరి ముందు స్త్రీలతో సంభోగిస్తుంటారు. వీరి మీదే ప్రళయం విరుచుకుపడుతుంది.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

١٨١١ - وَعَنْ رِبْعِيِّ بْنِ حِرَاشٍ قَالَ: انطَلَقْتُ مَعَ أَبِي مَسْعُودٍ الأَنْصَارِيِّ إِلَى حُذَيْفَةَ بْنِ الْيَمَانِ رَضِيَ اللهُ عَنْهُمْ فَقَالَ لَهُ أَبُو مسعودٍ، حَدِّثْنِي مَا سَمِعْتَ مِنْ رَسُولِ الله ﷺ، فِي الدَّجَّالِ قَالَ: «إِنَّ الدَّجَّالَ

1811. హజ్రత్ రిబయీ బిన్ హిరాష్ కథనం: నేను అబూ మస్‌వూద్ అన్సారీ (రజి) వెంట హుజైఫా బిన్ యమాన్ (రజి) దగ్గరికి వెళ్ళాను. అప్పుడు అబూ మస్‌వూద్ (రజి) ఆయన్ని, "మీరు దజ్జాల్ గురించి దైవప్రవక్త (సల్లం)

يَخرُجُ، وَإِنَّ مَعَهُ ماءً وَناراً، فَأَمَّا الَّذي يَرَاهُ النَّاسُ مَاءً فَنَارٌ تُحرِقُ، وَأَمَّا الَّذي يَرَاهُ النَّاسُ نَاراً، فَمَاءٌ بَارِدٌ عَذبٌ، فَمَنْ أَدرَكَهُ مِنكُمْ، فَلْيَقَعْ في الَّذي يَرَاهُ نَاراً، فَإِنَّهُ ماءٌ عَذبٌ طَيِّبٌ» فَقَالَ أَبو مَسْعُودٍ: وَأَنَا قَدْ سَمِعْتُهُ. متَّفَقٌ عَلَيْهِ.

నోట ఏం విన్నారో చెప్పండి" అని అడిగారు. అందుకాయన ఇలా చెప్పారు: నిశ్చయంగా దజ్జాల్ బయటికి వస్తాడు. అతని వెంట నీరు మరియు అగ్ని ఉంటాయి. ప్రజలు నీరు అని అనుకున్నది కాల్చేది అవుతుంది. వారు అగ్ని అని అనుకున్నది తియ్యటి చల్లని నీరు అవుతుంది. కనుక మీలో ఎవరికయినా దజ్జాల్ ఎదురైతే అతను తాను అగ్ని అనుకున్న దాంట్లో పడిపోవాలి. అది తియ్యటి మంచి నీరు అవుతుంది.

అది విని అబూ మస్ఊద్ (రజి), "దైవప్రవక్త (సల్లం) నోట నేను కూడా ఈ మాట విన్నాను" అని అన్నారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అంబియా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

١٨١٢ ـ وَعَنْ عَبْدِ اللهِ بنِ عَمْرو بنِ العـاصِ رَضِـيَ اللهُ عَنْهُمَـا قـالَ: قـالَ رَسُولُ اللهِ ﷺ: «يَخْرُجُ الدَّجَّالُ في أُمَّتي فَيَمْكُثُ أَرْبَعينَ، لا أَدْري أَرْبَعينَ يَوماً، أَوْ أَرْبَعِينَ شَهْراً، أَوْ أَرْبَعِينَ عاماً، فَيَبْعَثُ اللهُ تَعَالى عِيسَى ابْنَ مَرْيَمَ ﷺ، فَيَطْلُبُهُ فَيُهْلِكُهُ، ثُمَّ يَمْكُثُ النَّاسُ سَبْعَ سِنِينَ لَيسَ بَيْنَ اثْنَيْنِ عَـدَاوَةٌ، ثُـمَّ يُـرْسِـلُ اللهُ، عَـزَّ وَجَـلَّ، رِيحـاً

1812. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: నా అనుచర సమాజంలో దజ్జాల్ పుడ్తాడు. అతను నలభై వరకు ఉంటాడు. అవి నలభై రోజులో లేక నెలలో లేక సంవత్సరాలో తెలియదు. తర్వాత దేవుడు మర్యమ్ కుమారుడైన ఈసాను పంపుతాడు. ఆయన అతన్ని వెతికిపట్టుకొని చంపుతారు. ఆ తర్వాత ప్రజలు ఏడేండ్ల దాకా తమ మధ్య

بَارِدَةً مِنْ قِبَلِ الشَّام، فَلا يَبْقَى عَلَى وَجْهِ الأَرْضِ أَحَدٌ في قَلْبِهِ مِثْقَالُ ذَرَّةٍ مِنْ خَيْرٍ أَوْ إِيمَانٍ إِلَّا قَبَضَتْهُ، حَتَّى لَوْ أَنَّ أَحَدَكُمْ دَخَلَ فِي كَبِدِ جَبَلٍ، لَدَخَلَتْهُ عَلَيْهِ حَتَّى تَقْبِضَهُ، فَيَبْقَى

ఎలాంటి విరోధం లేకుండా బతుకు తారు. తర్వాత దేవుడు సిరియా వైపు నుంచి చల్లటిగాలిని పంపుతాడు. ఈ భూమ్మీద తమ హృదయంలో రవ్వంత మేలు లేక విశ్వాసం ఉన్న వారందరినీ ఆ గాలి చంపుతుంది. చివరికి ఎవరైనా కొండ గుహలో దాక్కున్నా, ఆ గాలి అక్కడికి కూడా వెళ్ళి అతని ప్రాణం తీస్తుంది. ఆ తర్వాత (ప్రపంచంలో) అత్యంత చెడ్డవారు మాత్రమే మిగిలుంటారు. వారి అరాచకత్వం పక్షుల చురుకు దనంలాగా, వారు సృష్టించే రక్తపాతం క్రూరమృగాల మాదిరిగా ఉంటుంది. వారు సత్కార్యాన్ని సత్కార్యంగా భావిం చరు. చెడుని చెడుగా భావించరు. షైతాన్ వారిదగ్గరికి మానవ రూపంలో వచ్చి, "మీరు నా మాట వినరా?" అని అంటాడు. అందుకు వారు "ఏమిటి నీ మాట?" అని అడుగుతారు. వాడు వారికి విగ్రహాలను ఆరాధించమని ఆదేశిస్తాడు. (దాన్ని వారు పాటిస్తారు) అయినప్పటికీ వారికి వారి ఆహారంలో సమృద్ధి లభిస్తుంది. వారి జీవితం సుఖసౌఖ్యాలతో గడుస్తుంది. తర్వాత శంఖం పూరించబడుతుంది. దాని శబ్దం విన్న ప్రతి ఒక్కడూ తన మెడను దానివైపుకు వంచి పైకిలేపుతాడు.

شِرَارُ النَّاسِ في خِفَّةِ الطَّيْرِ، وَأَحْلَامِ السِّبَاعِ لا يَعْرِفُونَ مَعْرُوفاً، وَلا يُنْكِرُونَ مُنْكَراً، فَيَتَمَثَّلُ لهُمُ الشَّيْطَانُ، فَيَقُولُ: أَلا تَسْتَجِيبُونَ؟ فَيَقُولُونَ: فَمَا تَأْمُرُنَا؟ فَيَأْمُرُهُمْ بِعِبَادَةِ الأَوْثَانِ، وَهُمْ في ذلك دَارٌّ رِزْقُهُمْ، حَسَنٌ عَيْشُهُمْ، ثُمَّ يُنْفَخُ في الصُّورِ، فَلا يَسْمَعُهُ أَحَدٌ إِلَّا أَصْغَى لِيتاً وَرَفَعَ لِيتاً، وَأَوَّلُ مَنْ يَسْمَعُهُ رَجُلٌ يَلُوطُ حَوْضَ إِبِلِه فَيُصْعَقُ وَيُصْعَقُ النَّاسُ، ثُمَّ يُنْفَخُ فِيهِ أُخْرَى فَإِذا هُمْ قِيَامٌ يَنْظُرُونَ، ثُمَّ يُقَالُ: يَا أَيُّهَا النَّاسُ! هَلُمَّ إِلى رَبِّكُمْ، وَقِفُوهُمْ إِنَّهُمْ مَسْؤُولُونَ، ثُمَّ يُقَالُ: أَخْرِجُوا بَعْثَ النَّارِ فَيُقَالُ: مِنْ كَمْ؟ فَيُقَالُ: مِنْ كُلِّ أَلْفٍ تِسْعَمِائَةٍ وَتِسْعَةً وَتِسْعِينَ؛ فذلكَ يَوْمَ يَجْعَلُ الْوِلْدَانَ شِيباً، وَذلكَ يَوْمَ يُكْشَفُ عَنْ سَاقٍ» رواه مسلم. «اللِّيتُ» صَفْحَةُ الْعُنُقِ، وَمَعْنَاهُ: يَضَعُ صَفْحَةَ عُنُقِهِ وَيَرْفَعُ صَفْحَتَهُ الأُخْرَى.

అందరికంటే ముందు దాని శబ్దం వినేవాడు తన ఒంటెల హౌజుకు మరమ్మత్తు చేస్తూ ఉంటాడు. అతను ఆ శబ్దం వినగానే స్పృహతప్పి పడిపోతాడు. అతని చుట్టు ప్రక్కల ఉన్నవారు కూడా స్పృహ తప్పి పడిపోతారు. ఆ తర్వాత దేవుడు వర్షాన్ని పంపిస్తాడు (లేక) కురిపిస్తాడు (అని చెప్పారు). ఆ వర్షం మంచులా ఉంటుంది. (అంటే చిమ్ముతున్న నీళ్ళలా ఉంటుందన్నమాట.) దాంతో మనుషుల శరీరాలు (మొక్కల్లాగా) మొలకెత్తుతాయి. తర్వాత మళ్ళీ శంఖం పూరించబడుతుంది. వారు లేచి నిలబడి చూస్తుంటారు. తర్వాత వారితో, "ప్రజలారా! మీ ప్రభువు వైపుకు పదండి" అని చెప్పటం జరుగుతుంది. "వారిని ఆపండి. వారిని నిలదీయాలి" (అని దైవదూతల్ని ఆజ్ఞాపించటం జరుగుతుంది). తర్వాత "వారిలోనుంచి నరకవాసుల్ని బయటికి తీయండి" అనటం జరుగుతుంది. "వారు ఎంతమంది ఉన్నారు?" అని అడిగితే "ప్రతి వెయ్యిమందిలో తొమ్మిది వందల తొంభై తొమ్మిది మంది" అని చెప్పటం జరుగుతుంది. అది పిల్లల్ని సయితం ముసలివారుగా చేసేరోజు. పిక్కలు తెరువబడేది ఆ రోజే. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

'పిక్కలు తెరువబడటం' అంటే ఏమిటి? కొంతమంది దీని గురించి వ్యాఖ్యానిస్తూ 'పిక్కలు తెరువబడటం' అంటే ప్రళయదినాన అత్యంత భయంకరమైన, భీతావహ పరిస్థితులు ఆసన్నమవటం అని చెప్పారు. అయితే ఒక ప్రామాణికమైన హదీసులో దీని వివరణ ఇలా వచ్చింది: ప్రళయదినాన విశ్వప్రభువైన అల్లాహ్ తన కాలి పిక్కను (తన ఔన్నత్యానికి తగిన విధంగా) బయటికి తీసి చూపిస్తాడు. దాన్ని చూడగానే విశ్వాసులైన పురుషులు, స్త్రీలందరూ కూడా ఆయన ముందు మోకరిల్లుతారు. అయితే ప్రపంచంలో ప్రజల మెప్పుకోసమో లేక పేరు ప్రతిష్ఠల కోసమో సజ్దాలు చేసేవారు మాత్రం సజ్దా చేయకుండా ఆగిపోతారు. వారు కూడా దైవం ముందు మోకరిల్లాలనే అనుకుంటారు. కాని వారి వెన్నుపూసలు కదలవు. వారి వీపు పలకలాగా మారిపోతుంది. దాని మూలంగా వారికి దైవం ముందు మోకరిల్లే వీలు లేకుండా పోతుంది. (సహీహ్ బుఖారీ, నూన్ సూరా వ్యాఖ్యానం.)

అసలు దేవుని పిక్క ఎలా ఉంటుంది? దాన్ని ఆయన ఎలా చూపిస్తాడు? అనే విషయాలను మనం అర్థం చేసుకోలేము. వాటిని వివరించలేము కూడా. అందుకని దేవుని కండ్లు, చెవులు, చేతులు మొదలగు వాటిని ఏ విధమైన వక్రభాష్యాలు చెప్పకుండా, ఎలాంటి పోలికలు కల్పించకుండా మనం ఏ విధంగా విశ్వసిస్తామో అదే విధంగా దీనిని కూడా విశ్వసించాలి. సలఫ్ మరియు హదీసు వేత్తల దృక్పథం కూడా ఇదే! (అహ్‌సనుల్ బయాన్ వ్యాఖ్యాన గ్రంథం నుంచి).

١٨١٣ ـ وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَيْسَ مِنْ بَلَدٍ إِلَّا سَيَطَؤُهُ الدَّجَّالُ، إِلَّا مَكَّةَ وَالمَدِينَةَ؛ وَلَيْسَ نَقْبٌ مِنْ أَنْقَابِهَا إِلَّا عَلَيْهِ المَلَائِكَةُ صَافِّينَ تَحْرُسُهُمَا، فَيَنْزِلُ بِالسَّبَخَةِ، فَتَرْجُفُ المَدِينَةُ ثَلَاثَ رَجَفَاتٍ، يُخْرِجُ اللهُ مِنْهَا كُلَّ كَافِرٍ وَمُنَافِقٍ» رواه مسلم.

1813. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దజ్జాల్ మక్కా మదీనాలు మినహా ఇతర నగరాలన్నిటినీ త్రొక్కుతాడు. అంటే వాటిలోకి ప్రవేశిస్తాడు. మక్కా మదీనాలకు వెళ్ళే కొండ దారులన్నిటి మీద దేవుడు తన దూతల్ని నియమిస్తాడు. వారు ఒకరి రెక్క మరొకరు పట్టుకొని వాటికి రక్షణ కల్పిస్తూ ఉంటారు. దజ్జాల్ (మదీనాకు దగ్గర్లో ఉన్న) ఉప్పు నేల మీద దిగగానే మదీనా నగరం మూడుసార్లు కంపిస్తుంది. దేవుడు మదీనాలో ఉండే

కాఫిర్లు, మునాఫిక్‌లందరినీ బయటికి తీస్తాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

١٨١٤ ـ وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «يَتْبَعُ الدَّجَّالَ مِنْ يَهُودِ أَصْبَهَانَ سَبْعُونَ أَلْفاً عَلَيْهِم الطَّيَالِسَةُ» رَوَاهُ مسلم.

1814. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అస్ఫహాన్‌కు చెందిన డెబ్బైవేల యూదులు దజ్జాల్ వెంటపడతారు. (అంటే అతన్ని అనుసరిస్తారు). వారి ఒంటిమీద పచ్చని దుప్పట్లు ఉంటాయి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

١٨١٥ ـ وعَنْ أُمِّ شَرِيكٍ رَضِيَ اللهُ عَنهَا أَنَّها سَمِعَتِ النَّبِيَّ ﷺ يَقُولُ: «لَيَنْفِرَنَّ النَّاسُ مِنَ الدَّجَّالِ في الجِبَالِ» رَوَاهُ مُسْلِمٌ.

1815. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉమ్మె షరీక్ (రజి.అన్హా) తెలియజేశారు: ప్రజలు దజ్జాల్‌కు భయపడి పారిపోయి కొండల్లో దాక్కుంటారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

١٨١٦ ـ وَعَن عِمْرَانَ بنِ حُصَيْنٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ صلى اللهُ عَلَيْهِ وآلِهِ وَسَلَّمَ يَقُولُ: «مَا بَيْنَ خَلْقِ آدمَ إِلَى قِيَامِ السَّاعَةِ أَمْرٌ أَكْبَرُ مِنَ الدَّجَّالِ» رواه مسلم.

1816. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) తెలియజేశారు: ఆదం పుట్టినప్పటి నుంచి ప్రళయం సంభవించేవరకు దజ్జాల్ కంటే భయంకరమైన విషయం మరొకటి లేదు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

١٨١٧ - وَعَنْ أَبِي سَعِيدٍ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «يَخْرُجُ الدَّجَّالُ فَيَتَوَجَّهُ قِبَلَهُ رَجُلٌ مِنَ المُؤْمِنِينَ فَيَتَلَقَّاهُ المَسَالِحُ: مَسَالِحُ الدَّجَّالِ، فَيَقُولُونَ له: إِلَى أَيْنَ تَعْمِدُ؟ فَيَقُول: أَعْمِدُ إِلَى هذا الَّذِي خَرَجَ، فيقولُونَ له: أَوَ مَا تُؤْمِنُ بِرَبِّنَا؟ فيقول: ما بِرَبِّنَا خَفَاءٌ! فيقولُونَ: اقْتُلُوه، فيقُولُ بَعْضُهُمْ لِبَعْضٍ: أَلَيسَ قَدْ نَهَاكُم رَبُّكُمْ أَنْ تَقْتُلُوا أَحَداً دونَه، فَيَنْطَلِقُونَ بِهِ إِلى الدَّجَّالِ، فَإذا رآه المُؤْمِنُ قَالَ: يَا أَيُّهَا النَّاسُ! إِنَّ هذا الدَّجَّالُ الَّذي ذَكَرَ رَسُولُ اللهِ ﷺ، فَيَأْمُرُ الدَّجَّالُ بِهِ فَيُشَبَّحُ؛ فَيَقولُ: خُذُوهُ وَشُجُّوهُ، فَيُوسَعُ ظَهْرُهُ وَبَطْنُهُ ضَرْباً، فيقولُ: أَوَمَا تُؤْمِنُ بي؟ فَيَقُولُ: أَنْتَ المَسِيحُ الكَذَّابُ! فَيُؤْمَرُ بِهِ، فَيُؤْشَرُ بِالمِنْشَارِ مِنْ مَفْرِقِهِ حَتَّى يُفَرَّقَ بَيْنَ رِجْلَيْهِ، ثُمَّ يَمْشِي الدَّجَّالُ بَيْنَ القِطْعَتَيْنِ، ثُمَّ يقولُ لَهُ: قُمْ، فَيَسْتَوِي قَائماً. ثُمَّ يقولُ لَهُ: أَتُؤْمِنُ بي؟

1817. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దజ్జాల్ వెడలినప్పుడు విశ్వాసుల్లో ఒకతను అతని దగ్గరికి వెళ్తాడు. అక్కడ అతనికి ఆయుధాలు ధరించివున్న దజ్జాల్ భటులు తారసపడతారు. "ఎక్కడికి?" అని అడుగుతారు వారు. "(కొత్తగా) వచ్చిన అతని దగ్గరికి" అని చెబుతాడు ఆ విశ్వాసి. అందుకు వారు "నీవు మా ప్రభువుని నమ్మవా?" అని అడుగుతారు. దానికతను "వేరొకర్ని ప్రభువుగా నమ్మటానికి నమ్మక పోవ టానికి మన ప్రభువు విషయంలో దాపరికాలు ఉంటే కదా!" అని సమాధానం చెబుతాడు. ఆ సమాధానం విని వారు (ఆగ్రహంతో) "అతన్ని చంపండి" అంటారు. తర్వాత తమలో తాము మాట్లాడుకుంటూ, "నా అనుమతి లేకుండా ఎవరినీ చంపవద్దని మన ప్రభువు మనల్ని ఆదేశించలేదా?" అని అనుకొని ఆ విశ్వాసిని దజ్జాల్ దగ్గరికి తీసుకు వెళ్తారు. విశ్వాసి దజ్జాల్‌ని చూడగానే, "ప్రజలారా! దైవప్రవక్త (సల్లం) చెప్పింది ఈ దజ్జాల్ గురించే" అని (ఎలుగెత్తి) చెబుతాడు. దజ్జాల్ అతన్ని బోర్లా పడేయమని ఆదేశిస్తాడు. తర్వాత అతన్ని పట్టుకొని తలను, మొహాన్ని బాదమని చెబుతాడు. అతని

فيقـولُ: مَـا ازْدَدْتُ فِيـكَ إلَّا بَصِيـرَةً. ثُـمَّ يَقُـولُ: يَا أَيُّهَا النَّـاسُ! إنَّـهُ لا يَفْعَـلُ بَعْـدِي بأَحَدٍ مِنَ النَّاس، فَيَأْخُذُهُ الدَّجَّالُ لِيَذْبَحَهُ، فَيَجْعَلُ اللهُ مَا بَيْنَ رَقَبَتِهِ إلى تَرْقُوَتِهِ نُحَاساً، فَلا يَسْتَطِيعُ إلَيْهِ سَبِيلاً، فَيَأْخُذُ بِيَدَيْهِ وَرِجْلَيْهِ فَيَقْذِفُ بِهِ، فَيَحْسَبُ النَّاسُ أنَّما قَذَفَهُ إلى النَّار، وَإنَّمَا أُلْقِيَ في الجَنَّةِ» فقالَ رَسُولُ اللهِ ﷺ: «هذا أَعْظَمُ النَّاسِ شَهَادَةً عِنْدَ رَبِّ العَـالَمِيـنَ» رواه مسلـم. وروى البخـاريُّ بَعْضَـهُ بمَعْنَـاهُ. «المَسَـالِـحُ»: هُـمُ الخُفَـرَاءُ وَالطَّلائِعُ.

ఆజ్ఞమేరకు ఆ విశ్వాసిని పొట్ట, వీపు సాగిపోయేలా చితకబాదటం జరుగుతుంది.

తర్వాత దజ్జాల్ "నువ్వు నన్ను నమ్ముతావా?" అని అడుగుతాడు. అందుకతను (నిరాకరిస్తూ), "నువ్వు మసీహ్‌వి, అబద్ధాగ్రేసరుడివి" అని అంటాడు. ఆ తర్వాత అతని తలను రంపంతో కోసి రెండు కాళ్ళూ వేరయ్యేలా అతన్ని రెండు ముక్కలుగా నరికేయమని ఆజ్ఞాపించటం జరుగుతుంది. దజ్జాల్ ఆ రెండు ముక్కల మధ్య తిరుగుతాడు. తర్వాత వాటిని ఉద్దేశ్యించి, "లే, లేచి నిలబడు" అని అంటాడు. వెంటనే ఆ విశ్వాసి లేచి నిలబడతాడు. దజ్జాల్ మళ్ళీ అతన్ని "నన్ను నమ్ముతావా? లేదా?" అని అడుగుతాడు. అందుకతను (నిరాకరిస్తూ) "నీ గురించి నా నమ్మకం ఇప్పుడు మరింత బలపడింది. ప్రజలారా! వీడు నా తర్వాత ఎవరి పట్లనూ ఈ విధంగా ప్రవర్తించలేడు" అని అంటాడు. అప్పుడు దజ్జాల్ అతన్ని పట్టుకొని కోసేయాలనుకుంటాడు. కాని దేవుడు అతని మెడ - రక్తనాళం మధ్య భాగాన్ని ఇత్తడిగా మారుస్తాడు. తర్వాత దజ్జాల్‌కు అతన్ని చంపటానికి మార్గమేదీ కనిపించదు. దాంతో దజ్జాల్ అతని కాళ్ళూ చేతులు పట్టుకొని

విసిరేస్తాడు. చూసిన జనం వాడు అతన్ని అగ్నిలో విసిరేశాడని అనుకుంటారు. కాని వాస్తవానికి (పరిణామ పరంగా) అతన్ని స్వర్గంలో విసరి వేయటం జరిగి ఉంటుంది.

ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: ఆ వ్యక్తి దేవుని దృష్టిలో అందరి కంటే గొప్ప వీరమరణం పొందినవాడుగా పరిగణించబడతాడు. (ముస్లిం, బుఖారీ (రహ్మాలై) ఈ అర్థాన్నిచ్చే ఉల్లేఖనాలు కొన్ని వివరించారు)

*(సహీహ్ బుఖారీలోని ఫితన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయానికి ముందు దజ్జాల్ ఉపద్రవ కాలంలో ఒక విశ్వాసి దజ్జాల్‌ను ఎదిరిస్తాడు. ధైర్యసాహసాలతో వాణ్ణి ఎదుర్కొంటాడు. దజ్జాల్ అతన్ని మెడ నరికి చంపాలనుకున్నప్పుడు అతని మెడలోని ఒక భాగాన్ని అల్లాహ్ ఇత్తడిదిగా మారుస్తాడు. దాని మూలంగా దజ్జాల్ అతన్ని చంపలేకపోతాడు.

చివర్లో దజ్జాల్ చూపించే అగ్నిని స్వర్గంగా పేర్కొనటం జరిగింది. పరిణామం రీత్యా అలా చెప్పబడి ఉంటుంది. అంటే ఆ అగ్ని పరీక్షకు అంతిమ ప్రతిఫలం స్వర్గం అవుతుంది. లేక స్వర్గం అంటే ఇక్కడ మనశ్శాంతి, మనోనిబ్బరం కావచ్చు. విశ్వాసికి తన విశ్వాస పరిపక్వత మూలంగా అగ్నిలో సైతం మనశ్శాంతి లభిస్తుంది. లేక ఇక్కడ స్వర్గం అంటే ఇబ్రాహీమ్ ప్రవక్త విషయంలో జరిగినట్లు దజ్జాల్ చూపే అగ్ని ఆ విశ్వాసి కొరకు నిజంగానే ఓ వందనవనంలా మారిపోవచ్చు.

1818. హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) కథనం: దజ్జాల్ గురించి దైవ ప్రవక్త (సల్లం)ను నేను అడిగినన్ని ప్రశ్నలు మరెవరూ అడిగి ఉండరు. ఆయన (నాకు ధైర్యం చెబుతూ), "వాడు నిన్నేమీ చేయలేడులే" అన్నారు. అందుకు నేను, "ప్రజలు

١٨١٨ - وَعَنِ الْمُغِيرَةِ بنِ شُعْبَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: مَا سَأَلَ أَحَدٌ رَسُولَ اللهِ ﷺ عَنِ الدَّجَّالِ أَكْثَرَ مِمَّا سَأَلْتُهُ؛ وَإِنَّهُ قَالَ لِي: «مَا يَضُرُّكَ؟» قلتُ: إِنَّهُمْ

يَقُولُونَ: إِنَّ مَعَهُ جَبَلَ خُبْزٍ وَنَهَرَ مَاءٍ! قَالَ: «هُوَ أَهْوَنُ عَلَى اللهِ مِنْ ذٰلِكَ» متفقٌ عليه.

చెబుతుంటే విన్నాను. వాడి దగ్గర పర్వతమంత ఎత్తు రొట్టెలూను, ఒక నీటి సెలయేరు ఉంటుందట" అని అన్నాను. అందుకాయన "విశ్వాసుల్ని కాపాడుకోవటం అల్లాహ్‌కు అంతకంటే చాలా తేలిక" అని చెప్పారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఫితన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోనూ ఫితన్ ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

పై హదీసుకు భావం ఏమిటంటే ప్రజల్ని మార్గభ్రష్టులు చేయుటానికి దజ్జాల్ దగ్గర కావలసిన వనరులయితే అన్నీ ఉంటాయి. కాని విశ్వసించినవారిని వాడి బారి నుండి కాపాడటం అల్లాహ్‌కు కష్టం కాదు.

١٨١٩ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَا مِنْ نَبِيٍّ إِلَّا وَقَدْ أَنْذَرَ أُمَّتَهُ الأَعْوَرَ الْكَذَّابَ، أَلَا إِنَّهُ أَعْوَرُ، وَإِنَّ رَبَّكُمْ عَزَّ وَجَلَّ لَيْسَ بِأَعْوَرَ، مَكْتُوبٌ بَيْنَ عَيْنَيْهِ كَ فَ رَ» متفقٌ عليه.

1819. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రతి దైవప్రవక్త తన అనుచర సమాజాన్ని ఒంటికన్నువాడు అబద్ధాల రాయుడు గురించి హెచ్చరించారు. జాగ్రత్త! ఆ దజ్జాల్ ఒంటికన్ను వాడై ఉంటాడు. మీ ప్రభువు ఒంటి కన్నువాడు కాదు. ఇంకో విషయం ఏమిటంటే దజ్జాల్ కళ్ళ మధ్య క-ఫ-ర (ఇతను అల్లాహ్‌ను తిరస్కరించాడు) అని రాసి ఉంటుంది.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఫితన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోనూ ఫితన్ ప్రకరణమే)

١٨٢٠ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَلَا أُحَدِّثُكُمْ

1820. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: దజ్జాల్ గురించి

حَدِيثاً عن الدَّجَالِ مَا حَدَّثَ بِهِ نَبِيٌّ قَوْمَهُ! إِنَّهُ أَعْوَرُ، وَإِنَّهُ يَجِيءُ مَعَهُ بِمِثَالِ الجَنَّةِ والنَّار، فالَّتِي يَقُولُ إِنَّهَا الجَنَّةُ هِيَ النَّارُ» متفقٌ عليه.

ఏ దైవప్రవక్తా తమ అనుచర సమాజాలకు చెప్పని ఒక విషయం నేను మీకు చెప్పనా? వాడు ఒంటికన్నువాడు. తన వెంట వాడు స్వర్గం నరకం లాంటి రెండు వస్తువులు తీసుకొని వస్తాడు. వాడు దేన్నయితే స్వర్గం అంటాడో అది నరకం అయి ఉంటుంది.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని దైవప్రవక్తల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

వాడు చూపించే తళుకు బెళుకులకు ప్రభావితుడై వాడికి తొత్తుగా మారినవాడు నరకాగ్నిలో పడవేయబడటానికి అర్హుడౌతాడని పై హదీసు భావం.

١٨٢١ - وَعَنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ ذَكَرَ الدَّجَّالَ بَيْنَ ظَهْرَانِي النَّاسِ فَقَالَ: «إِنَّ اللهَ لَيْسَ بِأَعْوَرَ، أَلا إِنَّ المَسِيحَ الدَّجَّالَ أَعْوَرُ العَيْنِ اليُمْنَى، كَأَنَّ عَيْنَهُ عِنَبَةٌ طَافِيَةٌ» متفقٌ عليه.

1821. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ప్రజల ముందు దజ్జాల్ గురించి వివరిస్తూ ఇలా అన్నారు: అల్లాహ్ ఒంటికన్ను వాడు కాదు. కాని జాగ్రత్త! మసీహ్ దజ్జాల్ ఒంటికన్నువాడు. వాడికి ఒక్క కుడికన్ను మాత్రమే ఉంటుంది. అది కూడా ఉబ్బిన నేరేడు పండులా ఉంటుంది. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఫితన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

### ముఖ్యాంశాలు

దజ్జాల్ మరియు వాడి ఉపద్రవాల గురించి ఏవయితే హదీసులు వివరించబడ్డాయో అవి ప్రామాణికత పరంగా, సాక్ష్యాధారాల పరంగా ఎంతో ఉన్నతమైనవి. అనగా సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లిం గ్రంథాలకు చెందినవన్న మాట. ఆ గ్రంథాల ప్రామాణికత మీద, వాటి నిర్ద్వంద్వత మీద పండితుల మధ్య ఏకాభిప్రాయం ఉంది. కనుక వాటి గురించి సందేహానికి

లోనవటం ఏ విధంగానూ సరికాదు. అదే విధంగా ఈసా అలైహిస్సలాం ఆకాశం నుండి దిగి వస్తారన్న విషయం కూడా హదీసుల ద్వారా రుజువవుతోంది. దాన్ని తిరస్కరించటానికి వీలులేదు. ప్రళయానికి సమీపంలో ఈ గొప్ప చిహ్నాలు తప్పకుండా ఉనికిలోకి వస్తాయి. వాటిని విశ్వసించటం విధి.

దజ్జాల్ యూదుడై ఉంటాడు. ఉపద్రవాలు రేపటంలో చెయ్యి తిరిగినవాడవడం చేత వాడికి దజ్జాల్ (ఉపద్రవాగ్రేసరుడు) అనే పేరు పడిపోతుంది. విశ్వాసుల్ని పరీక్షించటం కోసం అల్లాహ్ స్వయంగా వాడికి కొన్ని సృష్టినైజానికి విరుద్ధమైన శక్తులు ప్రసాదిస్తాడు. దాంతో వాడు తాను ఆరాధ్య దేవుణ్ణని ప్రకటించుకుంటాడు. యూదుల్లోని ఒక పెద్ద వర్గం వాణ్ణి అనుసరిస్తుంది. హదీసుల్లో వాడిని మసీహుద్దజ్జాల్ అని కూడా చెప్పబడింది. అయితే ఈసా ప్రవక్తకు కూడా మసీహ్ అనే పేరు ఉంది. వీరిద్దరిలో తేడా ఏమిటంటే ఈసా ప్రవక్త మసీహుల్ హుదా (సన్మార్గ మసీహ్) కాగా, వీడు మసీహుజ్జలాలహ్ (దుర్మార్గ మసీహ్). అసలు మసీహ్ అంటే ఏమిటి? వాడికి ఆ పేరు ఎందుకుంది? అనే విషయంలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. వాడి ఒక కన్ను తుడిచి వేయబడటం మూలంగా వాడిని మసీహ్ అంటారని కొందరు అంటారు. మరికొందరు వాడు మక్కా, మదీనాలు తప్ప ప్రపంచం మొత్తం తిరుగుతాడు కాబట్టి వాణ్ణి మసీహ్ అంటారని చెబుతారు. ఈసా ప్రవక్త పేరు కూడా మసీహే. తల్లి గర్భం నుంచి బయట పడినప్పుడు ఈసా ప్రవక్త శరీరానికి నూనె పూసివుంది, అందుకని ఆయన్ని మసీహ్ అంటారని చెప్పగా, ఆయన ఏ రోగి మీద చేయి తిప్పినా ఆ రోగి రోగం నయమయిపోయేది. కనుక ఆయన్ని మసీహ్ అని పిలవటం జరిగిందని ఇంకొందరు అభిప్రాయపడ్డారు. ఇలాంటి అభిప్రాయాలు అనేకం వ్యక్తమయ్యాయి. (ఫత్హుల్ బారీ, కితాబుస్సలాత్ బాబుద్దుఆయి ఖబ్లస్సలామి)

١٨٢٢ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَا تَقُومُ السَّاعَةُ حَتَّى يُقَاتِلَ الْمُسْلِمُونَ الْيَهُودَ حَتَّى يَخْتَبِيءَ الْيَهُودِيُّ مِنْ وَرَاءِ الْحَجَرِ وَالشَّجَرِ، فَيَقُولُ الْحَجَرُ، وَالشَّجَرُ

1822. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: యూదులతో ముస్లింల యుద్ధం జరగనంతవరకూ ప్రళయం రాదు. చివరికి (ఆ యుద్ధంలో) యూదులు రాళ్ళు లేక చెట్ల వెనుక కూడా దాక్కుంటారు. అప్పుడు ఆ రాళ్ళు మరియు చెట్లు, "ఓ ముస్లిం! నా వెనక ఒక యూదుడు దాక్కున్నాడు. రా.....వచ్చి ఇతన్ని

يَامُسْلِمُ! هٰذا يَهودِيٌّ خَلْفِي تَعَالَ فَاقْتُلْهُ، إِلَّا الْغَرْقَدَ فَإِنَّهُ مِنْ شَجَرِ الْيَهُودِ» متفقٌ عليه.

చంపెయ్యి" అని చెబుతాయి. కాని గర్‌ఖద్ చెట్టు మాత్రం చెప్పదు. ఎందుకంటే అది యూదుల చెట్టు. (బుఖారీ, ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

గర్‌ఖద్ అనేది ఒక రకమైన ముళ్ళచెట్టు. బైతుల్ ముఖద్దస్ ప్రాంతంలో ఇది విరివిగా కనిపిస్తుంది. అల్లాహ్ తాను కోరిన వస్తువులో మాట్లాడే శక్తిని పుట్టించగలడు. ముస్లింలకు ఈ భూమ్మీద ఆధిపత్యం ఇవ్వాలని తలచినప్పుడు ఆయన చెట్లూపుట్టలు, రాళ్ళు రప్పలను కూడా ముస్లింల సానుభూతిపరులుగా మార్చివేస్తాడు. అవి యూదులకు వ్యతిరేకంగా ముస్లింల తరపున మాట్లాడి వారికి సహాయం చేస్తాయి. అయితే ముస్లింలకు విజయం తెచ్చిపెట్టనున్న ఆ యుద్ధం ఎప్పుడు జరుగుతుందన్న విషయం గురించి ఏమీ చెప్పలేము. ఇవి అగోచర వార్తలు. వీటిని విశ్వసించటం అవసరం. ప్రస్తుత కాలంలో అలాంటి సూచనలేవీ లేవు. ముస్లింలు జనాభా పరంగా ఎక్కువమంది ఉన్నప్పటికీ మరొకరి ఆధిపత్యం క్రింద బతుకు తున్నారు. యూదులు అల్ప సంఖ్యలో ఉన్నప్పటికినీ విజయహస్తులై ఉన్నారు. కాని ఈ పరిస్థితి తాత్కాలికమైనది. యూదుల సంరక్షకులు అమెరికా మొదలగువారు ఏర్పరిచినది. వారు ఇస్లాం పట్ల శత్రుత్వంలో యూదులకు వెన్నుదన్నుగా, సహాయకారులుగా ఉంటున్నారు. సదరు ప్రామాణిక హదీసు ప్రకారం ప్రళయానికి పూర్వం ఈ పరిస్థితులు పూర్తిగా మారిపోతాయి. ముస్లింలు యూదుల మీద, వారి పాశ్చాత్య సంరక్షకుల మీద కూడా విజయం సాధించి తీరుతారు. 'ఇన్నల్లాహ అలాకుల్లి షైయిన్ ఖదీర్' (అల్లాహ్ ప్రతి వస్తువు మీద అధికారం కలవాడు).

١٨٢٣ - وعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «والَّذِي نَفْسِي بِيَدِهِ لَا تَذْهَبُ الدُّنْيَا حَتَّى يَمُرَّ الرَّجُلُ بِالْقَبْرِ، فَيَتَمَرَّغَ عَلَيْهِ، ويقولُ: يَا لَيْتَنِي مَكَانَ صَاحِبِ هَذَا الْقَبْرِ، وَلَيس بِهِ الدِّينُ، مَا بِهِ إِلَّا الْبَلَاءُ». متفقٌ عليه.

1823. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరి చేతిలోనయితే నా ప్రాణముందో ఆయన సాక్షి! మనిషి సమాధి దగ్గరి నుంచి వెళ్ళినప్పుడు, "అయ్యో! ఈ గోరీలో ఉన్నవాడి స్థానంలో నేనుంటే ఎంత బాగుండేది" అని విలవిల్లాడి పోనంత వరకూ ఈ ప్రపంచం అంతమవదు. అతను తన ధర్మం

కోసం కాదు, ప్రాపంచిక పరీక్షలకు భయపడి అలా అంటాడు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఫితన్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో అల్లకల్లోలం, కష్టాలు కడగండ్లు ఎంతగా పెరిగిపోతాయంటే వాటిని భరించలేక మనిషి చావటానికి సిద్ధపడతాడు. జీవితం కంటే మరణానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తాడు. సర్వత్రా వ్యాపించే ఈ కల్లోలం కూడా ప్రళయానికి ముందు సంభవిస్తుంది. తర్వాత ప్రపంచంలో కల్లోలం రేకెత్తించేవారు మాత్రమే మిగిలిపోతారు. ఇంతకు ముందు కొన్ని హదీసుల్లో చెప్పబడినట్లు అలాంటి నీచుల మీదే ప్రళయం విరుచుకుపడుతుంది.

١٨٢٤ ـ وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَا تَقُومُ السَّاعَةُ حَتَّى يَحْسِرَ الْفُرَاتُ عَنْ جَبَلٍ مِنْ ذَهَبٍ يُقْتَتَلُ عَلَيْهِ، فَيُقْتَلُ مِنْ كُلِّ مِائَةٍ تِسْعَةٌ وَتِسْعُونَ، فَيَقُولُ كُلُّ رَجُلٍ مِنْهُمْ: لَعَلِّي أَنْ أَكُونَ أَنَا أَنْجُو». وَفِي رِوَايَةٍ: «يُوشِكُ أَنْ يَحْسِرَ الْفُرَاتُ عَنْ كَنْزٍ مِنْ ذَهَبٍ، فَمَنْ حَضَرَهُ فَلَا يَأْخُذْ مِنْهُ شَيْئًا» متفقٌ عليه.

1824. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: పురాత్ నది ఎండిపోయి అందులో నుంచి బంగారపు పర్వతం బయటపడనంతవరకు ప్రళయం సంభవించదు. ఆ పర్వతం కోసం యుద్ధాలు జరుగుతాయి. ప్రతి వందమందిలో తొంబైతొమ్మిది మంది చంపబడతారు. వారిలోని ప్రతి ఒక్కడూ బహుశా తాను బతికిపోగల్గుతానేమో అనుకుంటాడు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: పురాత్ నది ఎండిపోయి, అందులో నుంచి బంగారు నిధులు బయటపడే కాలం దగ్గర్లోనే ఉంది. అప్పుడు బతికి వున్నవారు అందులోనుంచి ఏమీ తీసుకోరాదు సుమా!"

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని 'ఫితన్' ప్రకరణాలు)

## ముఖ్యాంశాలు

'యహ్సిరు' అంటే బయటపెట్టటం అని అర్థం. అనగా నీళ్లు ఎండిపోయినప్పుడు అల్లాహ్ బయటపెట్టాలని తలచుకున్న బంగారు నిధులు ఒక్కసారిగా బయల్పడతాయి. ప్రళయానికి ముందు ఇది కూడా తప్పకుండా జరుగుతుంది. ఈ సంఘటన సంభవించినప్పుడు ప్రాపంచిక దురాశలకు లోనుకాకుండా, బయటపడిన నిధుల్లో నుంచి ఏమీ తీసుకోకుండా ఉండేవారు మాత్రమే దైవశిక్షలకు గురికాకుండా సురక్షితంగా ఉంటారు.

١٨٢٥ ـ وَعَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «يَتْرُكُونَ الْمَدِينَةَ عَلَى خَيْرِ مَا كَانَتْ، لَا يَغْشَاهَا إِلَّا الْعَوَافِي - يُرِيدُ: عَوَافِيَ السِّبَاعِ وَالطَّيْرِ - وَآخِرُ مَنْ يُحْشَرُ رَاعِيَانِ مِنْ مُزَيْنَةَ يُرِيدَانِ الْمَدِينَةَ يَنْعِقَانِ بِغَنَمِهِمَا فَيَجِدَانِهَا وُحُوشاً، حَتَّى إِذَا بَلَغَا ثَنِيَّةَ الْوَدَاعِ خَرَّا عَلَى وُجُوهِهِمَا» متفقٌ عليه.

1825. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) గారే తెలియజేశారు: మదీనా నగరం మునుపటి కన్నా మంచి స్థితిలో ఉన్నప్పటికీ ప్రజలు దాన్ని వదలిపెట్టి (వేరేచోటికి) వెళ్ళిపోతారు. (అప్పుడు) అడవి మృగాలు, పక్షులు తప్ప ఎవరూ అటు (అనగా మదీనా) వైపు వెళ్ళరు. ఆఖరికి ముజైనా తెగకు చెందిన ఇద్దరు పశువులకాపరుల మీద ప్రళయం సంభవిస్తుంది. వారిద్దరు తమ మేకల మందలను తోలుకుంటూ మదీనాకు వెళ్తుంటారు. అక్కడికెళ్ళి చూస్తే వారికి మదీనా నగరం అడవి జంతువుల నివాస స్థలంగా మారిపోయి ఉన్నట్లు కనిపిస్తుంది. చివరికి వారు 'సనియ్యతుల్ వదా' చేరుకోగానే బోర్లాగా క్రింద పడిపోతారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని మదీనా ప్రాశస్త్య ప్రకరణం - సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఖిలాఫత్ వ్యవస్థ మదీనా నుంచి సిరియా మరియు ఇరాక్ దేశాలకు బదిలీ అయినప్పుడే

పైహదీసులో పేర్కొనబడిన భవిష్యద్వాణి నెరవేరిందని కొంతమంది అభిప్రాయపడ్డారు. ఎందుకంటే, ఆ కాలంలో మదీనా నగరం భౌతికంగా, ఆధ్యాత్మికంగా ఎంతో మంచి స్థితిలో ఉండేది. ఆ రోజుల్లో మదీనా నగరం పండితుల నిలయంగా, సిరిసంపదల నికేతనంగా అలరారింది. అయినప్పటికీ ఖిలాఫత్ మదీనా నుంచి సిరియా, ఇరాక్‌లకు బదిలీ కావటం హదీసులోని భవిష్యద్వాణినే సూచిస్తుందని వారంటారు. అయితే హదీసులో పేర్కొనబడిన పరిస్థితులు ఇంకా నెలకొనలేదు, కనుక ఆ భవిష్యద్వాణి ఇంకా నెరవేరలేదనీ, ప్రళయానికి దగ్గర్లో నెరవేరుతుందని మరికొంతమంది అభిప్రాయపడ్డారు. రెండో మాటే సరైనదనిపిస్తోంది.

١٨٢٦ ـ وعَنْ أَبي سَعيدٍ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قالَ: «يَكُونُ خَلِيفَةٌ مِنْ خُلَفَائِكُمْ فِي آخِرِ الزَّمَانِ يَحْثُو المَالَ وَلا يَعُدُّهُ» رواه مسلم.

1826. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఆఖరి కాలంలో మీ ఖలీఫాల్లో ఒకడు తన దోసిలి నిండా ప్రజలకు సొమ్ము ఇస్తాడు. దాన్ని లెక్క కూడా పెట్టడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక ఖలీఫా కాలంలో సిరిసంపదలు విరివిగా ఉంటాయని ఈ హదీసులో కూడా భవిష్యత్తు గురించి వక్కాణించటం జరిగింది. ఇది కూడా ప్రళయానికి ముందు జరుగుతుంది.

١٨٢٧ ـ وعَنْ أَبي مُوسَى الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قال: «لَيَأْتِيَنَّ عَلَى النَّاسِ زَمَانٌ يَطُوفُ الرَّجُلُ فِيهِ بِالصَّدَقَةِ مِنَ الذَّهَبِ، فَلا يَجِدُ أَحَداً يَأْخُذُهَا مِنْهُ، وَيُرَى الرَّجُلُ الوَاحِدُ يَتْبَعُهُ أَرْبَعُونَ امْرَأَةً يَلُذْنَ بِهِ مِنْ قِلَّةِ الرِّجالِ وَكَثْرَةِ النِّسَاءِ» رواه مسلم.

1827. హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రజలకు ఒక కాలం ఇలాంటిది కూడా వస్తుంది. అప్పుడు మనిషి బంగారం దానం చేసేందుకు (భిక్షగాళ్ళను) గాలిస్తాడు. కాని అతని దానం పుచ్చుకునేవాడు ఒక్కడు కూడా దొరకడు. అంతేకాదు, ఇలా కూడా జరుగుతుంది- ఒక్కో పురుషుని పర్యవేక్షణలో

నలభై నలభై మంది స్త్రీలు ఉంటారు. పురుషులు తక్కువగా, స్త్రీలు ఎక్కువగా ఉండటం మూలంగా అలా జరుగుతుంది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా ప్రాపంచిక సుఖసంతోషాలు, సిరిసంపదల విస్తృతితోపాటు స్త్రీల అధిక జనాభా గురించి కూడా జోస్యం చెప్పబడింది. స్త్రీల సంఖ్య పెరగటానికి కారణం యుద్ధాలు కావచ్చు. యుద్ధాల మూలంగా చాలామంది పురుషులు మృత్యువాతన పడతారు. లేక సహజంగానే పురుష జననాల రేటుకన్నా స్త్రీ జననాల రేటు అధికంగా ఉండి దానిమూలంగా స్త్రీల జనాభా పెరగవచ్చు.

1828. హ్రజత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒకతను మరొకతని దగ్గర స్థలం కొన్నాడు. స్థలం కొన్న అతనికి ఆ స్థలంలో ఒక కుండ దొరికింది. అందులో బంగారం ఉంది. అతను స్థలం అమ్మిన అతనితో, "నీ బంగారం నీవు తీసుకో, నేను కొన్నది కేవలం స్థలం మాత్రమే, బంగారం కాదు" అన్నాడు. అందుకు స్థలం యజమాని "నేను నీకు ఈ స్థలంతో సహా అందులోవున్న వస్తువులన్నీ అమ్మే శాను. (ఇక నాకు దాంతో ఎలాంటి సంబంధంలేదు. కనుక ఆ బంగారం నువ్వే ఉంచుకో" అన్నాడు స్థలం యజమాని.) తర్వాత వారిద్దరూ తీర్పు కోసం ఒకాయన దగ్గరికి వెళ్ళారు. ఆ మధ్యవర్తి వారిద్దరిని "మీకు పిల్లలు

١٨٢٨ ـ وعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ عَن النَّبِيِّ ﷺ قالَ: «اشْتَرَى رَجُلٌ مِنْ رَجُلٍ عَقَاراً، فَوَجَدَ الَّذي اشْتَرَى الْعَقَارَ فِي عَقَارِهِ جَرَّةً فيها ذَهَبٌ، فقالَ لَهُ الَّذي اشْتَرَى الْعَقَارَ: خُذْ ذَهَبَكَ، إِنَّمَا اشْتَرَيْتُ مِنْكَ الأرْضَ، وَلَمْ أَشْتَرِ الذَّهَبَ، وقالَ

الَّذي لَهُ الأرْضُ: إنَّمَا بِعْتُكَ الأرْضَ وَمَا فِيهَا، فَتَحَاكَمَا إلى رَجُلٍ، فقالَ الَّذي تَحَاكَمَا إلَيْهِ: أَلَكُمَا وَلَدٌ، قالَ أَحَدُهُمَا: لي غُلامٌ، وقالَ الآخرُ: لي جَارِيَةٌ، قالَ: أَنْكِحَا الغُلامَ الجَارِيَةَ وَأَنْفِقُوا عَلى أَنْفُسِهِمَا مِنْهُ وَتَصَدَّقَا» متفقٌ عليه.

ఉన్నారా?" అని అడిగాడు. వారిలో ఒకడు, "నాకు ఓ కొడుకు ఉన్నాడు" అని అన్నాడు. రెండోవతను తనకో కూతురు ఉందని చెప్పాడు. ఇద్దరి సమాధానాలు విన్న తర్వాత ఆ మూడోవ్యక్తి, "మీరు వారిద్దరికీ వివాహం చేసి ఈ బంగారం వారిద్దరి అవసరాలకు ఖర్చుపెట్టండి. (మిగిలింది) దానం చేయండి" అని తీర్పు చెప్పాడు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అంబియా ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అఖ్జియా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒకరి యాజమాన్యం క్రింద ఉండే ఆస్తిని 'అఖార్' అని అంటారు. అది ఇల్లు, తోట, ఖాళీస్థలం ఏదయినా కావచ్చు. ఈ సంఘటన గత సమాజాల్లో ఎవరిదో అయి ఉంటుంది. ఇందులో వారి ఐహిక అనాసక్తత, భక్తీ పరాయణతలు, సందేహాస్పద చెడులకు కూడా దూరంగా ఉండే స్వభావానికి సంబంధించి ఆదర్శనీయమైన ఉపమానం పేర్కొనబడింది. ఇకపోతే షరీఅత్ ద్వారా బోధపడేదేమిటంటే స్థలానికి సంబంధించిన లావాదేవీలు ఆ స్థలంలో ఉండే నిధులకు వర్తించవు. దాని వ్యవహారం వేరుగా ఉంటుంది. స్థలం మాజీ యజమాని గనక ఆ నిధి నాదే. నేను దాన్ని తీసుకోవటం మర్చిపోయాను అంటే ఆ నిధి అతనిదే అవుతుంది. స్థలం కొన్న మనిషికి దానిమీద హక్కు ఉండదు. స్థలం మాజీ యజమాని గనక నిధి సంగతి తనకు తెలియదని ప్రకటిస్తే అప్పుడు అది 'రికాజ్' క్రిందికి వస్తుంది. అందులోని ఐదోవంతు 'బైతుల్ మాల్'కు, మిగతాది స్థలం ప్రస్తుత యజమానికి చెందుతుంది. రికాజ్ అంటే భూమిలోపలి నుంచి బయల్పడిన నిధులు లేక వస్తువులు అని భావం.

١٨٢٩ - وعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يقُولُ: «كَانَتِ امْرَأتَانِ مَعَهُمَا ابْنَاهُمَا، جَاءَ الذِّئْبُ فَذَهَبَ بِابْنِ إحْدَاهُمَا، فَقَالَتْ لِصَاحِبَتِهَا: إنَّمَا ذَهَبَ

1829. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా వివరిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి)గారే తెలియజేశారు: ఇద్దరు స్త్రీలు ఉండేవారు. వారిద్దరికి ఇద్దరు పిల్లలు ఉన్నారు.

بابنك، وقالت الأخرى: إنّما ذهب بابنك، فتحاكما إلى داود ﷺ، فقضى به للكبرى، فخرجتا على سليمان بن داود ﷺ، فأخبرتاه. فقال: ائتوني بالسكين أشقه بينكما. فقالت الصغرى: لا تفعل، رحمك الله، هو ابنها. فقضى به للصغرى» متفق عليه.

ఒకసారి వారిద్దరి పిల్లలు వారివెంట ఉన్న సమయంలో తోడేలు వచ్చి వారిలో ఒకరి పిల్లవాణ్ణి ఎత్తుకు పోయింది. అప్పుడు వారిలో ఒకామె మరో ఆమెతో, "తోడేలు ఎత్తుకెళ్ళింది నీ కొడుకునే" అని అన్నది. "కాదు, అతను నీ పిల్లవాడు" అని అన్నది రెండో ఆమె. తీర్పు కోసం వాళ్ళిద్దరు దావూద్ ప్రవక్త దగ్గరికి వెళ్ళారు. ఆయన పెద్దామెకు అనుకూలంగా తీర్పు ఇచ్చారు. వారిద్దరు బయటికి వచ్చి తిరిగి దావూదు కుమారుడైన సులైమాన్ దగ్గరికి వెళ్ళి ఆయనకు తమ వాద ప్రతివాదాలు వినిపించారు. అంతా విన్న తర్వాత ఆయన ఒక కత్తి తీసుకురమ్మని ఆజ్ఞాపించారు. నేను ఈ పిల్లవాడిని రెండు ముక్కలు చేసి ఇద్దరికీ చెరో సగం ఇస్తాను అన్నారు. ఆ మాట వినగానే చిన్నామె, "వద్దండీ, అంతపని చేయకండి. దేవుడు మిమ్మల్ని చల్లగా ఉంచాలి (పిల్లవాణ్ణి ఆమెకే ఇచ్చేయండి.) ఇతను ఆవిడ బిడ్డే" అని అన్నది. అది విన్న తర్వాత ఆయన చిన్నామెకు అనుకూలంగా తీర్పు ఇచ్చారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఫరాయెజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అఖ్‌జియా ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

హజ్రత్ సులైమాన్ (అలైహిస్సలాం) తన అవగాహనా శక్తిని, మేధస్సును, తీర్పరితనాన్ని

ఉపయోగించి యుక్తితో వ్యవహారం లోతులకు చేరుకున్నారు. అది దేవుడు ఆయనకిచ్చిన ఒక వరం. అయితే ఆయన ఈ యుక్తిని సత్యశోధన కోసం ఉపయోగించారే కాని, నిజాన్ని కలగాపులగం చేయటం కోసం ఉపయోగించలేదు. ఇలాంటి యుక్తులు పన్నటం షరీఅత్‌లో ధర్మ సమ్మతమేనన్న విషయంలో భేదాభిప్రాయానికి తావులేదు. కాని ఇందుకు భిన్నంగా షరీఅత్‌ను ఉల్లంఘించే ఉద్దేశ్యంతో పన్నే కుయుక్తులు ధర్మసమ్మతం కావు. పైగా అలాచేయటం మహాపాపం. అది యూదుల విధానం. అల్లాహ్ మనల్ని వాటి నుంచి రక్షించుగాక!

١٨٣٠ ـ وعَـنْ مِـرْدَاسٍ الأَسْلَمِـيِّ رَضِـيَ اللهُ عَنْـهُ قَـالَ: قَـالَ النَّبِـيُّ ﷺ: «يَذْهَبُ الصَّالِحُونَ الأَوَّلُ فَالأَوَّلُ، وَتَبْقَى حُثَالَةٌ كَحُثَالَةِ الشَّعِيرِ أَوِ التَّمْرِ، لا يُبَالِيهِمُ اللهُ بَالَةً» رواه البخاري.

1830. హజ్రత్ మిర్‌దాస్ అస్లమీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మంచి మనుషులు ఒక్కొక్కరి చొప్పున వెళ్ళిపోతారు. చివరికి బార్లి లేక ఖర్జూర చెత్తలాంటి మనుషులు మాత్రమే మిగిలిపోతారు. అల్లాహ్ దృష్టిలో వారికి ఎలాంటి విలువా ఉండదు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని మగాజీ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయానికి పూర్వం మంచి మనుషులందరూ లేపుకోబడతారనీ, ఎందుకూ పనికిరాని వారు మాత్రమే మిగిలిపోతారని, అలాంటివారి మీదనే ప్రళయం సంభవిస్తుందని ఈ హదీసులో జోస్యం చెప్పబడింది.

١٨٣١ ـ وعَـنْ رِفَـاعَـةَ بـنِ رَافِـعٍ الزُّرَقِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: جَاءَ جِبْرِيلُ إِلَى النَّبِيِّ ﷺ قَالَ: «مَا تَعُدُّونَ أَهْلَ بَدْرٍ فِيكُمْ؟ قَالَ: «مِنْ أَفْضَلِ المُسْلِمِينَ» أَوْ كَلِمَةً نَحْوَهَا. قَالَ: «وَكَذٰلِكَ مَنْ شَهِدَ بَدْراً مِنَ المَلائِكَةِ» رواه البخاري.

1831. హజ్రత్ రిఫాఅ బిన్ రాఫే జురఖీ (రజి) కథనం: జిబ్రయీల్ దూత దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "బద్ర్ యోధులను మీరు ఏమనుకుంటున్నారు?" అని అడిగారు. "వారు ముస్లింలలో అందరికంటే శ్రేష్ఠులు" అని బదులిచ్చారు దైవప్రవక్త (సల్లం). (లేక అలాంటి మాటే ఏదో అని ఉంటారు.) అందుకు జిబ్రయీల్

దూత, 'అలాగే బద్ర్ యుద్ధంలో పాల్గొన్న దూతలు ఇతర దూతలకంటే శ్రేష్ఠులు' అని చెప్పారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని కితాబు ఫజాయిలి అస్హాబిన్నబియ్యి)

### ముఖ్యాంశాలు

బద్ర్ యుద్ధం హి.శ. రెండవ యేట జరిగింది. ఇది అవిశ్వాసులకు - ముస్లింలకు మధ్య జరిగిన మొట్టమొదటి యుద్ధం. అంతేకాదు, ఈ యుద్ధంలో సంఖ్యాపరంగానూ, ఆయుధపరంగానూ ముస్లింలు అవిశ్వాసులకంటే చాలా తక్కువ స్థితిలో ఉన్నారు. అల్లాహ్ విశ్వాసులకు సహాయం చేశాడు. వారి సహాయం కోసం దైవదూతలను అవతరింపజేశాడు. ముస్లింలతోపాటు వారు కూడా యుద్ధంలో పాల్గొన్నారు - కనుక ఈ యుద్ధానికి ఇస్లామీయ చరిత్రలో చాలా ప్రాముఖ్యత ఉంది.

1832. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: అల్లాహ్ ఏదయినా జాతి మీద శిక్షను అవతరింపజేస్తే ఆ శిక్ష ఆ జాతి వారందరి మీద పడుతుంది. తర్వాత (ప్రళయ దినాన) వారందరూ తమ తమ ఆచరణలకు అనుగుణంగా బ్రతికించబడతారు. (బుఖారీ-ముస్లిం)

١٨٣٢ - وعَن ابن عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «إذا أَنْزَلَ اللهُ تَعالى بِقَوْمٍ عَذاباً أَصابَ الْعَذابُ مَنْ كَانَ فِيهِمْ، ثُمَّ بُعِثُوا عَلى أَعْمَالِهِمْ» متفق عليه.

(సహీహ్ బుఖారీలోని కితాబుల్ ఫితన్ - సహీహ్ ముస్లింలోని కితాబుల్ జన్నహ్)

### ముఖ్యాంశాలు

ఏ జాతిలోనయినా చెడులు విపరీతంగా పెరిగిపోయి మంచివారు అతికొద్దిమంది మాత్రమే ఉన్నప్పుడు ఇలాంటి సార్వత్రిక శిక్షలు అవతరిస్తాయి. అప్పుడు మంచివారు- చెడ్డవారు అన్న తేడా లేకుండా అందరూ ఆ శిక్షకు గురౌతారు. తర్వాత ప్రళయదినాన మంచివారు తమ విశ్వాసం, దైవభీతి చలువతో పరలోక శిక్ష నుంచి బతికి బయటపడతారు. ఇకపోతే ఇతరులకు మాత్రం అక్కడి ఘోరశిక్ష కాచుకొని ఉంటుంది. అల్లాహ్ మనల్ని రక్షించుగాక!

1833. హజ్రత్ జాబిర్ (రజి) కథనం: ఒక ఖర్జూర చెట్టు కొమ్మ ఉండేది. దైవప్రవక్త (సల్లం) ఖుత్బా ఇచ్చేటప్పుడు

١٨٣٣ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ جِذْعٌ يَقُومُ إِلَيْهِ النَّبِيُّ ﷺ، يَعْنِي فِي الْخُطْبَةِ. فَلَما وُضِعَ الْمِنْبَرُ، سَمِعْنَا

لِلْجِذْعِ مِثْلَ صَوْتِ الْعِشَارِ حَتَّى نَزَلَ النَّبِيُّ ﷺ، فَوَضَعَ يَدَهُ عَلَيْهِ فَسَكَنَ. وفي روايةٍ: فَلَمَّا كَانَ يَوْمُ الجمُعَةِ قَعَدَ النَّبِيُّ ﷺ على المِنْبَرِ، فَصَاحَتِ النَّخْلَةُ الَّتِيكَانَ يَخْطُبُ عِنْدَهَا حَتَّى كَادَتْ أَنْ تَنْشَقَّ. وفي روايةٍ فَصَاحَتْ صِيَاحَ الصَّبِيِّ، فَنَزَلَ النَّبِيُّ ﷺ، حَتَّى أَخَذَهَا فَضَمَّهَا إِلَيْهِ، فَجَعَلَتْ تَئِنُّ أَنِينَ الصَّبِيِّ الَّذِي يُسَكَّتُ حَتَّى اسْتَقَرَّتْ، قالَ: «بَكَتْ عَلَى مَا كَانَتْ تَسْمَعُ مِنَ الذِّكْرِ» رَواه البخاريُّ.

దాని ఆధారంగా నిలబడి ప్రసంగించే వారు. తర్వాత ఆయన కొరకు ఒక (కొయ్య) వేదిక సిద్ధపరచబడింది. అప్పుడు ఆ చెట్టు కొమ్మ పదినెలల సూడి ఒంటె ఏడ్చినట్టు ఏడ్వటం మేము విన్నాము. ఆఖరికి దైవప్రవక్త (సల్లం) వేదిక మీద నుంచి క్రిందికి దిగి దానిమీద తన శుభహస్తం ఉంచి నప్పటికిగాని అది ఏడ్పు మానలేదు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: జుమా రోజు వచ్చింది. ఆ రోజు దైవ ప్రవక్త (సల్లం) ఖుత్బా ఇవ్వటానికి వేదికపైకి ఎక్కారు. అప్పుడు ఆయన అంతకు ముందు పట్టుకొని నిలబడి ఖుత్బా ఇస్తూ వచ్చిన ఖర్జూర చెట్టు కొమ్మ ఇంకాస్తయితే పగిలిపోతుం దేమో అన్నంత బిగ్గరగా రోదించ సాగింది.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఆ చెట్టు మొదలు చిన్నపిల్లవాడిలాగా అరచి గీ పెడ్తూ ఏడుస్తుంటే దైవప్రవక్త (సల్లం) వేదిక నుంచి క్రిందికి దిగి దాన్ని పట్టుకొని కౌగిలించుకున్నారు. అప్పుడు అది చిన్నపిల్లవాడిని ఏడ్పు మాన మంటే ఎలా వెక్కిళ్లు పెడతాడో అలా వెక్కిళ్లు పెట్టసాగింది. కాసేపటికి ఏడ్పు మానేసింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) (అక్కడున్న వారితో) "ఇంతకు ముందు ఇది నా హితబోధ వినేది.

(ఇప్పుడు ఆ అవకాశం వెళ్ళిపోయినందుకు) ఏడుస్తోంది" అని చెప్పారు. (బుఖారీ)

(సహీహ్ బుఖరీ కితాబుల్ మనాఖిబ్)

**ముఖ్యాంశాలు**

ఈ హదీసు ద్వారా బోధపడే విషయం ఏమిటంటే, ప్రతి వస్తువులోనూ దేవుడు ఓ ప్రత్యేక గ్రహణశక్తిని పొందుపరచాడు. దాని స్వరూప స్వభావాలు మనకు తెలియవు. చెట్టు మొదలు హితబోధ వినడం కోసం వెక్కివెక్కి ఏడ్వటం దైవప్రవక్త (సల్లం) మహిమ.

١٨٣٤ ـ وعَنْ أَبي ثَعْلَبَةَ الخُشَنيِّ جُرْثُوم بنِ نَاشِرٍ رَضيَ اللهُ عَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قالَ: «إنَّ اللهَ تَعَالى فَرَضَ فَرائِضَ فَلا تُضَيِّعُوهَا، وَحَدَّ حُدُوداً فَلا تَعْتَدُوهَا، وَحَرَّمَ أَشْيَاءَ فَلا تَنْتَهِكُوهَا، وَسَكَتَ عَنْ أَشْيَاءَ رَحْمَةً لَكُمْ غَيْرَ نِسْيَانٍ فَلا تَبْحَثُوا عَنها» حديثٌ حسنٌ، رواه الدَّارَقُطنِي وغَيْرُهُ.

1834. హజ్రత్ అబూ సాలబా ఖుషనీ జుర్సూమ్ బిన్ నాషిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ కొన్నిటిని విధులుగా చేశాడు. వాటిని వృథా చేయకండి. మరికొన్ని హద్దులు నిర్ణయించాడు. వాటిని ఉల్లంఘించకండి. ఇంకొన్నిటిని నిషిద్ధం చేశాడు. మీరు వాటికి పాల్పడకండి. మీ మీద దయతలచి ఆయన కొన్ని విషయాలు వివరించలేదు. ఆయన వాటిని మర్చిపోయాడనుకొని మీరు వాటిని త్రవ్వి తీయటానికి ప్రయత్నించకండి. (ఈ హదీసు హసన్. దారె ఖుత్నీ మొదలగువారు దీనిని వెలికితీశారు.)

(సుననె దారెఖుత్నీ, ఆఖిరు కితాబిస్సైది)

**ముఖ్యాంశాలు**

షేఖ్ అల్‌బానీ ఈ హదీసు పరంపరలో అంతరాయం ఉందని చెప్పారు. దీని గురించి ఆయన "గాయతుల్ మరామ్ ఫీ తఖ్రీజి అహాదీసిల్ హలాలి వల్ హరామ్" అనే పుస్తకంలో వివరంగా రాశారు. అయితే మరి కొంతమంది పండితులు ఇతర సాక్షి హదీసుల ఆధారంగా

దీనిని హసన్‌గా పేర్కొన్నారు. ఉదాహరణకు స్వయంగా గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై)గారే ఈ హదీసుని హసన్‌గా ఖరారు చేశారు. సాక్షి హదీసుల కోసం హాకిమ్ గారి ముస్తద్రక్ గ్రంథం నాల్గవ సంపుటి 115వ పుట, మజ్మవుజ్జవాయిద్ గ్రంథం 7వ సంపుటి 75వ పుట, తిర్మిజీలో లిబాస్ ప్రకరణంలోని మాజాఅ ఫీ లుబ్సిల్ ఫరా అధ్యాయం 1726వ హదీసు. ఇబ్నెమాజాలో అత్‌యిమా ప్రకరణంలోని అక్‌లుల్ జుబ్ని వ స్సమన్ అధ్యాయం 3367వ హదీసు, బైహఖీగారి సుననె కుబ్రాలో జహాయా ప్రకరణంలోని మాజాఅ ఫిజ్జబ్‌యి వస్సాలబ్ మరియు మాలమ్ యుజ్‌కరు తహ్‌రీముహూ వలాకాన ఫీ మానా మాజుకిర తహ్‌రీముహూ మిమ్మా యూకలు అవ్ యుష్‌రబు అధ్యాయాల్లో 9వ సంపుటి 537వ పుట. 10వ సంపుటి 21వ పుట. కొత్త ప్రచురణ.

ఇమామ్ సమ్‌ఆనీ ఇలా అంటున్నారు: ఈ హదీసుకు చాలా ప్రాముఖ్యత ఉంది. ఎందుచేతనంటే- ఇందులో అవసరమైన విషయాల గురించి వివరించబడింది. ఎవరైతే వాటికి అనుగుణంగా జీవితం గడుపుతారో వారు తప్పకుండా కృతకృత్యులౌతారు. ఎందుకంటే విధులను ఆచరించటం, నిషేధాలకు దూరంగా ఉండటం దేవుడు నిర్ణయించిన హద్దుల్ని గౌరవించటం, అల్లాహ్ వివరించని విషయాలను త్రవ్వకుండా ఉండటంలో ధర్మానికి సంబంధించిన ముఖ్య విషయాలన్నీ వచ్చేస్తాయి.

١٨٣٥ ـ وعَنْ عَبْدِ الله بنِ أَبي أَوْفى رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: غَزَوْنَا مَعَ رَسُولِ اللهِ ﷺ سَبْعَ غَزَوَاتٍ نَأكُلُ الجَرَادَ. وفي روايةٍ: نَأكُلُ مَعَهُ الجَرَادَ. متفقٌ عليه.

1835. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) కథనం: మేము దైవప్రవక్త (సల్లం) వెంట ఏడు యుద్ధాలు చేశాం. ఆ యుద్ధాల్లో మేము మిడతలు తినేవాళ్ళం. వేరొక ఉల్లేఖనంలో, "మేము దైవప్రవక్త (సల్లం) వెంట మిడతలు తినేవాళ్ళం" అని ఉంది.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జబాయెహ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సైద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మిడతలు ఎలాంటి ప్రాణులంటే అల్లాహ్ గనక తలచుకుంటే అవి ఒక్కసారిగా లక్షల సంఖ్యలో తుఫానులా వచ్చి పంట చేలను తిని నాశనం చేసేయగలవు. మిడతల్ని తినవచ్చు. వీటిని జిబహ్ చేయవలసిన అవసరం లేదు. చేప మరియు మిడత ఈ రెండిటిని చనిపోయిననూ తినవచ్చు.

١٨٣٦ ـ وَعَنْ أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «لا يُلْدَغُ المُؤْمِنُ مِنْ جُحْرٍ وَاحِدٍ مَرَّتَيْنِ» متفقٌ عليه.

1836. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: విశ్వాసి ఒకే

రంధ్రం గుండా రెండుసార్లు కాటు వేయించుకోడు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని అదబ్ ప్రకరణం -సహీహ్ ముస్లింలోని జుహ్ద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

విశ్వాసి తనకు ఒక చోట నష్టం కలిగితే అక్కడ మాటిమాటికీ మోసపోకుండా జాగ్రత్తగా ఉండాలని పై హదీసు భావం.

١٨٣٧ ـ وَعَنْـــهُ قَـــالَ: قَـــالَ رَسُولُ اللهِ ﷺ: «ثَلاَثَةٌ لَا يُكَلِّمُهُمُ اللهُ يَوْمَ القِيَامَةِ ولَا يَنْظُرُ إِلَيْهِمْ ولا يُزَكِّيهِمْ وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ: رَجُلٌ عَلَى فَضْلِ مَاءٍ بِالْفَلاَةِ يَمْنَعُهُ مِن ابْنِ السَّبِيلِ، وَرَجُلٌ بَايَعَ رَجُلاً سِلْعَةً بَعْدَ الْعَصْرِ، فَحَلَفَ بِاللهِ لأَخَذَهَا بِكَذَا وَكَذَا، فَصَدَّقَهُ وَهُوَ عَلَى غَيْرِ ذٰلِكَ، وَرَجُلٌ بَايَعَ إِمَاماً لَا يُبَايِعُهُ إِلَّا لِدُنْيَا، فَإِنْ أَعْطَاهُ مِنْهَا وَفَى، وَإِنْ لَمْ يُعْطِهِ مِنْهَا لَمْ يَفِ» متفقٌ عليه.

1837. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ముగ్గురున్నారు, ప్రళయదినాన అల్లాహ్ వారి వంక చూడడు. వారిని పరిశుద్ధపరచడు. పైగా వారి కొరకు బాధాకరమైన శిక్ష ఉంటుంది. ఒకడు, ఎక్కడో అడవుల్లో, తన అవసరానికి మించివున్న నీళ్ళను ఆక్రమించుకొని బాటసారులకు కూడా ఆ నీరు ఉపయోగించకుండా అడ్డుకునేవాడు. రెండోవాడు, అస్ర్ (నమాజ్) తర్వాత తన సామాను ఎవరికైనా అమ్ముతూ తనే ఆ సామాను ఇంతకు కొన్నానని ప్రమాణం చేసి మరీ చెప్పేవాడు. ఎదుటి వ్యక్తి అతను చెప్పేది నిజమే ననుకొని ఆ సామాను కొంటాడు. నిజానికి అతని వ్యవహారం అందుకు భిన్నంగా ఉంటుంది (అంటే అతను అబద్ధపు ప్రమాణం చేస్తాడు). మూడో వాడు, కేవలం ప్రాపంచిక సంపదల కోసం తనకాలపు ఖలీఫా చేతి మీద

బైత్ (ప్రమాణం) చేసి ఖలీఫా ప్రాపం చిక సంపదలేమయినా ఇస్తే ప్రమాణాన్ని నెరవేరుస్తూ, ఇవ్వకపోతే ప్రమాణం నెరవేర్చకుండా ఉండేవాడు.
(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని షహాదత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఈమాన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన మూడు పనులూ ఘోరపాపాలే. ఎందుకంటే వాటిలో మొదటి దాంట్లో ప్రజలమీద దౌర్జన్యం జరుగుతోంది. రెండవ దాంట్లో దేవుని పేరుమీద మోసం జరుగుతోంది. హరామ్ తిండికి పాల్పడినట్లవుతోంది. మూడవ దాంట్లో ఖలీఫాకు విధేయత చూపి దానికి ప్రతిఫలంగా అన్యాయంగా ప్రాపంచిక సంపదలు అనుభవించటం జరుగుతోంది. ఈ మూడు పనులూ అల్లాహ్‌కు చాలా అసహ్యకరమైనవి.

١٨٣٨ ـ وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «بَيْنَ النَّفْخَتَيْنِ أَرْبَعُونَ» قَالُوا: يَا أَبَا هُرَيْرَةَ! أَرْبَعُونَ يَوْماً؟ قَالَ: أَبَيْتُ، قَالُوا: أَرْبَعُونَ سَنَةً؟ قَالَ: أَبَيْتُ. قَالُوا: أَرْبَعُونَ شَهْراً، قَالَ أَبَيْتُ «وَيَبْلَى كُلُّ شَيْءٍ مِنَ الإِنْسَانِ إِلَّا عَجْبَ الذَّنَبِ، فِيهِ يُرَكَّبُ الْخَلْقُ، ثُمَّ يُنَزِّلُ اللهُ مِنَ السَّمَاءِ مَاءً، فَيَنْبُتُونَ كَمَا يَنْبُتُ الْبَقْلُ» مُتَّفَقٌ عَلَيْهِ.

1838. రెండు శంఖాల మధ్య నలభై అంత వ్యవధి ఉంటుందని దైవప్రవక్త (సల్లం) చెప్పినట్టు హజ్రత్ అబూ హురైరా (రజి) ప్రజలకు తెలియజేశారు. అది విని జనం, "అబూ హురైరా! నలభై రోజులా?" అని అడిగారు. "నాకు తెలియదు" అని బదులిచ్చారాయన. జనం మళ్ళీ, "నలభై సంవత్సరాలా?" అని అడిగారు. ఆయన "నాకు తెలియదు" అని చెప్పారు. "లేక నలభై నెలలా?" అని మళ్ళీ అడిగారు జనం. (మూడో సారి కూడా) ఆయన "నాకు తెలియదు" అనే సమాధాన మిచ్చారు. తర్వాత ఇలా చెప్పారు: మనిషి శరీరంలోని ప్రతి వస్తువు మట్టిలో కలిసిపోతుంది. ఒక్క వెన్నెముక తప్ప. ఆ

ఎముకతోనే మనిషిని సమీకరించి తిరిగి బ్రతికించటం జరుగుతుంది. తర్వాత అల్లాహ్ ఆకాశం నుంచి వర్షం కురిపిస్తాడు. దాంతో మనుషులు (భూమి నుంచి) కూరగాయలు మొలకెత్తినట్లు మొలకెత్తుతారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని తఫ్సీర్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) ప్రళయం సంభవించినప్పుడు ఇస్రాఫీల్ దూత శంఖం పూరిస్తారు. ఆ శబ్దానికి మానవులంతా స్పృహను కోల్పోతారు. ఇది మొదటి శంఖం. తర్వాత మళ్ళీ శంఖం పూరించబడుతుంది. అప్పుడు మానవులంతా బతికి సమాధుల నుంచి లేచి వస్తారు. ఇది రెండో శంఖం. వీటిని నఫ్ఖతుస్సయిఖ్ మరియు నఫ్ఖతుల్ బఅస్ అని అంటారు. ఈ రెండు శంఖాల మధ్య ఎన్ని రోజుల లేక ఎన్ని నెలల లేక ఎన్ని సంవత్సరాల వ్యవధి ఉంటుంది? అన్న విషయం గురించి ఈ హదీసు ఉల్లేఖకులు హజ్రత్ అబూహురైరా (రజి) గారిని అడగ్గా, ఆయన తనకు ఆ విషయం తెలీదని చెప్పారు. అయితే మరికొన్ని ఉల్లేఖనాల్లో మాత్రం వాటి మధ్య నలభై ఏళ్ల వ్యవధి ఉంటుందని స్పష్టంగా చెప్పబడింది.

2) దైవప్రవక్తలు తప్ప మిగతా మానవులందరి శరీరాలనూ మట్టి తినేస్తుంది. కాని ఒక వెన్నుముక మాత్రం మిగిలి ఉంటుంది. అయితే దాని మిగిలుండే స్వరూపం అల్లాహ్కు మాత్రమే తెలుసు. ఏమయినప్పటికీ ఆ ఎముకతో మానవశరీరం మళ్ళీ ఉనికిలోకి తీసుకురాబడుతుంది.

3) ప్రళయ దినాన ఆకాశం నుంచి వర్షం కురిసినప్పుడు మొక్కల్లాగా మానవ శరీరాలు కూడా మొలకెత్తుతాయి.

١٨٣٩ ـ وَعَنْهُ قَالَ: بَيْنَمَا النَّبِيُّ ﷺ فِي مَجْلِسٍ يُحَدِّثُ الْقَوْمَ، جَاءَهُ أَعْرَابِيٌّ فَقَالَ: مَتَى السَّاعَةُ؟ فَمَضَى رَسُولُ اللهِ ﷺ، يُحَدِّثُ، فَقَالَ بَعْضُ

1839. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఒకానొక సమావేశంలో కూర్చొని ప్రజలతో మాట్లాడుతుండగా పల్లెటూరి వ్యక్తి ఒకడు వచ్చి "ప్రళయం ఎప్పుడు వస్తుంది?" అని అడిగాడు. దైవప్రవక్త (సల్లం) (అతని

الْقَوْم: سَمِعَ مَا قَالَ، فَكَرِهَ مَا قَالَ، وقَالَ بَعْضُهُمْ: بَلْ لَمْ يَسْمَعْ، حَتَّى إِذَا قَضَى حَدِيثَهُ قَالَ: «أَيْنَ السَّائِلُ عَنِ السَّاعَةِ؟» قَالَ: هَا أَنَا يَا رَسُولَ اللهِ! قَالَ: «إِذَا ضُيِّعَتِ الأَمَانَةُ، فَانْتَظِرِ السَّاعَةَ» قَالَ: كَيْفَ إِضَاعَتُهَا؟ قَالَ: «إِذَا وُسِّدَ الأَمْرُ إِلَى غَيْرِ أَهْلِهِ فَانْتَظِرِ السَّاعَةَ» رَوَاهُ الْبُخَارِي.

మాటలు పట్టించుకోకుండా) మాట్లాడుతూ పోతున్నారు. అది చూసి జనంలో కొంతమంది దైవప్రవక్త (సల్లం) ఆ పల్లెటూరి వ్యక్తి అన్నమాట విని ఉంటారు. కాని మధ్యలో అలా అడగటాన్ని అసహ్యించుకొని ఉంటారు (అందుకే సమాధానం ఇవ్వలేదు) అన్నారు. మరికొంతమంది దైవప్రవక్త (సల్లం) అసలు అతని మాట విననే లేదని అభిప్రాయపడ్డారు.

ప్రజలతో మాట్లాడటం అయిపోయిన తర్వాత దైవప్రవక్త (సల్లం) "ప్రళయం గురించి అడిగిన అతనేడి?" అన్నారు. "ఇదిగో నేనే దైవప్రవక్తా!" అని (ముందుకు వచ్చాడతను.) "అమానతులు (అప్పగింతలు) వృథా చేయబడుతున్న వేళ ప్రళయం కోసం నిరీక్షించు" అని చెప్పారు. "అమానతులు ఎలా వృథా చేయబడతాయి?" అని అడిగాడతను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) (ఇంకా వివరంగా చెబుతూ), "ధార్మిక, ప్రాపంచిక వ్యవహారం అర్హత లేనివారికి అప్పగించబడినప్పుడు ప్రళయం కోసం నిరీక్షించు" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీ: కితాబుల్ ఇల్మ్)*

## ముఖ్యాంశాలు

ప్రళయ సమీపంలో సంభవించే ఒక ముఖ్యమైన సూచన ఈ హదీసులో వివరించబడింది. అదేమిటంటే ధర్మానికి, ప్రాపంచిక జీవనానికి సంబంధించిన అధికారిక వ్యవహారాలు

సత్పురుషులు, అర్హతగలవారికి బదులు అవినీతిపరులు, అయోగ్యుల చేతుల్లోకి వెళ్ళిపోతాయి. ప్రపంచ ఆధిపత్యం కూడా పాపాలు, నేరాలు చేయటంలో ఆరితేరినవారి కీర్తికిరీటంగా మారుతుంది. విద్యలేనివారు, ధనాశాపరులు, దైవం పట్ల భయభక్తులు లేనివారు ధర్మాసనాల మీద కూర్చొని న్యాయ సంబంధ తీర్పులు ఇవ్వటం మొదలుపెడతారు.

١٨٤٠ - وَعَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «يُصَلُّونَ لَكُمْ، فَإِنْ أَصَابُوا فَلَكُمْ، وَإِنْ أَخْطَؤُوا فَلَكُمْ وَعَلَيْهِمْ» رواهُ البخاريُّ.

1840. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీ అధికారులు మీకు నమాజ్ చేయిస్తారు. వారు సరిగ్గా నమాజ్ చేయిస్తే మీకూ పుణ్యం ప్రాప్తిస్తుంది. ఒకవేళ తప్పుగా చేయిస్తే మీకు మాత్రం పుణ్యం ప్రాప్తిస్తుంది. పాపం వారినెత్తి మీద పడుతుంది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీ అజాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా అనర్హులైన పాలకులకు సంబంధించి ముస్లిం జనసామాన్యానికి ఒక హితవు చెప్పటం జరిగింది. అదేమిటంటే నమాజులో వారు తప్పు చేసినా, అనగా సమయానికి నమాజ్ చేయించకపోయినా, సున్నత్ పట్ల వైముఖ్య ధోరణి ప్రదర్శించినా మీరు మాత్రం వేరు కుంపటి పెట్టుకోరాదు. అనగా వారి నుంచి వేరుపడి మస్జిద్ నిర్మించుకోరాదు. పైగా వారివెంటే ఉంటూ వారి సారథ్యంలోనే నమాజ్ చేస్తూ ఉండాలి. వారు గనక సున్నత్‌కు అనుగుణంగా నమాజ్ చేయిస్తే వారికి, మీకు - ఇరువురికీ పుణ్యం ప్రాప్తిస్తుంది. లేనిపక్షంలో మీకు ఎలాగూ పుణ్యం లభిస్తుంది. తప్పు చేసింది వారు కనుక ఆ పాపం వారి మీదే పడుతుంది.

١٨٤١ - وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ: ﴿كُنتُمْ خَيْرَ أُمَّةٍ أُخْرِجَتْ لِلنَّاسِ﴾ قَالَ: خَيْرُ النَّاسِ لِلنَّاسِ يَأْتُونَ بِهِمْ فِي السَّلَاسِلِ فِي أَعْنَاقِهِمْ حَتَّى يَدْخُلُوا فِي الإِسْلَامِ.

1841. "కుంతుమ్ ఖైర ఉమ్మతిన్ ఉఖ్‌రిజత్ లిన్నాసి" అన్న దైవసూక్తిని వ్యాఖ్యానిస్తూ హజ్రత్ అబూహురైరా (రజి) గారు ఇలా అన్నారు: ప్రజల్లో ప్రజల కొరకు అందరికంటే శ్రేష్ఠులు ఎవరంటే - వారు ప్రజల్ని వారి మెడల్లో

సంకెళ్లువేసి తీసుకువస్తారు. దాంతో
వారు ఇస్లాంలోకి ప్రవేశిస్తారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీ: తఫ్సీర్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై సూక్తికి హజ్రత్ అబూహురైరా (రజి) చెప్పిన భావం ఇది: దీని ప్రకారం పైసూక్తిలో ధర్మవిరోధులతో పోరాడే ముజాహిద్‌లు ముస్లిం సమాజంలో అందరికంటే శ్రేష్ఠులు. అవిశ్వాసుల్లో ఎవరైతే తమ చేతికి ఖైదీలుగా చిక్కుతారో వారు ముస్లింలుగా మారిపోతారు. ఈ విధంగా వారు అవిశ్వాసులకు సన్మార్గం లభించటంలో దోహదకారులు అవుతారన్నమాట. దాని మూలంగా వారు పుణ్యంలో ఇతరులకంటే ప్రత్యేకులుగా గుర్తించబడతారు. అయితే మరో అర్థంలో ఈ సూక్తి సార్వత్రికమైనది. అది అన్ని కాలాల ముస్లింలకూ వర్తిస్తుంది. అయితే వారు మంచిని ప్రబోధించు చెడుని నిరోధించు అన్న విధిని పాటించేవారై ఉండాలి.

١٨٤٢ ـ وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «عَجِبَ اللهُ عَزَّ وَجَلَّ مِنْ قَوْمٍ يَدْخُلُونَ الْجَنَّةَ فِي السَّلاسِلِ» رواهما البُخاري.
معناهُ: يُؤسَرُونَ وَيُقَيَّدُونَ، ثُمَّ يُسْلِمُونَ، فَيَدْخُلُونَ الْجَنَّةَ.

1842. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన ఇంకొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: సంకెళ్ళలో బంధించబడి స్వర్గంలో ప్రవేశించేవారిని చూసి అల్లాహ్ ఆశ్చర్యం వ్యక్తం చేస్తాడు. (బుఖారీ)

వారిని ఖైదీలుగా సంకెళ్ళలో బంధించటం జరుగుతుంది. తర్వాత వారు ఇస్లాం స్వీకరించి స్వర్గానికి చేరుకుంటారని దీని భావం.

*(సహీహ్ బుఖారీలోని కితాబుల్ జిహాద్)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు భావం కూడా ఇంతకుముందు హదీసులో అబూహురైరా (రజి) వ్యాఖ్యానం క్రింద వివరించబడిన భావమే. దీనిద్వారా బోధపడేది ఏమిటంటే అవిశ్వాసుల్ని ఖైదీలుగా పట్టుకున్న తర్వాత వారికి ఇస్లామీయ బోధనలు, వాటి ప్రాముఖ్యతా ప్రయోజనాల గురించి వివరించాలి, దాంతో వారు ఇస్లాం స్వీకరించి స్వర్గప్రవేశానికి అర్హులు అవుతారు. అప్పుడు ఈ ఇనుప సంకెళ్ళే వారిపాలిట స్వర్ణ కంఠాభరణాలు అవుతాయి.

١٨٤٣ ـ وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «أَحَبُّ الْبِلَادِ إِلَى اللهِ مَسَاجِدُهَا، وَأَبْغَضُ الْبِلَادِ إِلَى اللهِ أَسْوَاقُهَا» رَوَاهُ مُسلم.

1843. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: స్థలాలన్నిటిలో అల్లాహ్‌కు అతి ప్రియమైన స్థలాలు ప్రార్థనాస్థలాలు. అలాగే ప్రదేశాలన్నిటిలో అత్యంత అయిష్టకరమైన ప్రదేశాలు బజారులు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని మసాజిద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ప్రార్థనా స్థలాలు అన్నిటికంటే గొప్పవి అవటానికి కారణం ఏమిటో తెలుస్తూనే ఉంది. అక్కడ అల్లాహ్‌ను ఆరాధించటం జరుగుతుంది. ప్రజలు ఆయన్ని కీర్తిస్తుంటారు. దివ్యఖుర్ఆన్ పారాయణం చేస్తుంటారు. దీనికి భిన్నంగా అంగళ్లు దైవస్మరణను మరిపిస్తాయి. అంతేకాదు, అక్కడ దగా మోసాలు, అబద్ధం లాంటి చెడులు వ్యాపించి ఉంటాయి. కనుక అలాంటి ప్రదేశాలు అత్యంత అయిష్టకరమైనవి.

١٨٤٤ ـ وَعَنْ سَلْمَانَ الْفَارِسِيِّ رَضِيَ اللهُ عَنْهُ مِنْ قَوْلِهِ قَالَ: لَا تَكُونَنَّ إِنِ اسْتَطَعْتَ أَوَّلَ مَنْ يَدْخُلُ السُّوقَ، وَلَا آخِرَ مَنْ يَخْرُجُ مِنْهَا، فَإِنَّهَا مَعْرَكَةُ الشَّيْطَانِ، وَبِهَا يَنْصِبُ رَايَتَهُ. رواهُ مسلم هكذا.
وَرَوَاهُ الْبَرْقَانِيُّ فِي صحيحه عَنْ سَلْمَانَ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَكُنْ أَوَّلَ مَنْ يَدْخُلُ السُّوقَ، وَلَا آخِرَ مَنْ يَخْرُجُ مِنْهَا. فِيهَا بَاضَ الشَّيْطَانُ وَفَرَّخَ».

1844. హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి)గారి స్వీయ (మౌఖూఫ్) హితోక్తి (ఆయన ఇలా అన్నారు): వీలైతే నువ్వు అందరి కంటే ముందు అంగడికి వెళ్ళకుండా, అందరికంటే చివర్లో అక్కణ్ణుంచి బయటపడకుండా ఉండు. ఎందుకంటే అది షైతాన్ స్థావరం. షైతాన్ తన జెండా అక్కడే స్థాపిస్తాడు. (ముస్లిం)

ఇమామ్ బర్ఖానీ తన సహీహ్ గ్రంథంలో హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి) ఆధారంగా (ఆయన స్వీయ హితోక్తిగా కాకుండా ప్రవక్త హితోక్తిగా) పొందు

పరచారు. అందులో దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారని ఉంది: నువ్వు అంగడికి అందరికంటే ముందు వెళ్ళేవాడివి, అందరికంటే చివర్లో అక్కణ్ణుంచి బయటికి వచ్చేవాడివి కాకూడదు. ఎందుకంటే షైతాన్ గుడ్లు పెట్టేది, పిల్లల్ని పొదిగేది ఇలాంటి ప్రదేశాల్లోనే.

*(సహీహ్ ముస్లింలోని కితాబు ఫజాయిలిస్సహాబా)*

**ముఖ్యాంశాలు**

దీని ద్వారా బోధపడేదేమిటంటే బజారుల్లో అత్యధికంగా తిరగటం చాలా ప్రమాదకరమైన విషయం. అక్కడ పైశాచిక ప్రభావాలు చాలా ఎక్కువగా ఉంటాయి. కనుక మనిషి బజారుల్లో ఎంత ఎక్కువగా తిరుగుతాడో పైశాచిక దుష్టప్రభావాలకు అంతే ఎక్కువగా లోనవుతాడు.

١٨٤٥ - وَعَنْ عَاصِمٍ الأَحْوَلِ عَنْ عَبْدِ اللهِ بْنِ سَرْجِسَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قُلْتُ لِرَسُولِ اللهِ ﷺ: يَا رَسُولَ اللهِ! غَفَرَ اللهُ لَكَ، قَالَ: «وَلَكَ» قَالَ عَاصِمٌ: فَقُلْتُ لَهُ: أَسْتَغْفَرَ لَكَ رَسُولُ اللهِ ﷺ؟ قَالَ: نَعَمْ وَلَكَ، ثُمَّ تَلَا هٰذِهِ الآيَةَ: ﴿وَٱسْتَغْفِرْ لِذَنۢبِكَ وَلِلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ﴾ [محمد: ١٩]، رَواهُ مُسلم.

1845. హజ్రత్ ఆసిమ్ అహ్వల్ కథనం ప్రకారం అబ్దుల్లాహ్ బిన్ సర్జిస్ (రజి) తనకు ఈ విధంగా తెలియజేశారు: నేను దైవప్రవక్త (సల్లం)తో, "దైవప్రవక్తా! అల్లాహ్ మిమ్మల్ని క్షమించాలి" అని అన్నాను. అందుకాయన, "నిన్ను కూడా" అని అన్నారు.

ఆసిమ్ ఇలా తెలియజేస్తున్నారు: ఆ మాట విని నేను అబ్దుల్లాహ్ బిన్ సర్జిస్‌ను "దైవప్రవక్త (సల్లం) మీ క్షమాభిక్ష కోసం ప్రార్థన చేశారా?" అని అడిగాను. అందుకాయన, "అవును (ఆయన నిన్ను కూడా క్షమించుగాక (అని వేడుకున్నారు) తర్వాత ఆయన

"మీరు మీ కోసం, విశ్వాసులైన స్త్రీ పురుషు లందరి క్షమాభిక్ష కోసం వేడు కోండి" అన్న ఖుర్‌ఆన్ సూక్తి (ముహమ్మద్ సూరా 19వ సూక్తి) పఠించి విని పించారు" అని చెప్పారు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లిం కితాబుల్ ఫజాయెల్)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) అల్లాహ్‌చే క్షమించబడినవారు. అయినప్పటికీ ఆయన గౌరవౌన్నత్యాలను పెంచే ఉద్దేశ్యంతో ఆయన మన్నింపుకోసం ప్రార్థన చేయవచ్చు. ఇది కూడా ఆయన్ని గౌరవించటంలో అంతర్భాగమే.

١٨٤٦ ـ وَعَنْ أَبِي مَسْعُودٍ الأَنْصَارِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «إِنَّ مِمَّا أَدْرَكَ النَّاسُ مِنْ كَلَامِ النُّبُوَّةِ الأُولَى: إِذَا لَمْ تَسْتَحِ فَاصْنَعْ مَا شِئْتَ» رواهُ البُخَارِيُّ.

1846. హజ్రత్ అబూ మస్‌వూద్ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిం చారు: గత ప్రవక్తల నుంచి ప్రజలు నేర్చుకున్న పాఠాల్లో, "నువ్వు సిగ్గు విడిచినప్పుడు ఇష్టం వచ్చింది చేసుకో" అన్నమాట కూడా ఉంది. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని అంబియా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'ఇష్టం వచ్చింది చేసుకో' అంటే నిజంగానే సిగ్గు విడిచినవాడు ఏమైనా చేసుకోవచ్చు అని దీని అర్థం ఎంతమాత్రం కాదు. వాస్తవానికి ఈ హదీసు అన్యాపదేశంగా ఒక నిజాన్ని తెలుపుతోంది. అదేమిటంటే, ఎప్పుడయితే మనిషిలో సిగ్గు, లజ్జ అనే భావం అంతరించిపోతుందో అప్పుడు అతను ఏ పని చేయటానికయినా వెనుకాడడు, అత్యంత నీచమైన పనులకు కూడా ఒడిగడతాడు. అందుకే పాశ్చాత్యులు ఇస్లామీయ సమాజపు అందం, ప్రాణం అయినటువంటి వ్రీడా భావాన్ని ముస్లిం యువత హృదయాల్లో నుంచి తుడిచిపెట్టేసి, ప్రతి నీతిబాహ్యమైన చేష్టనూ వారు సంతోషంగా స్వీకరించేలా చేయటానికి ప్రయత్నిస్తున్నారు. దురదృష్టం కొద్దీ పాశ్చాత్యులు ఈ నీచమైన కుట్రలో సఫలమవుతున్నారు. ముస్లిం పరిసరాలు కూడా పాశ్చాత్య సమాజాల్లాగా లజ్జా విహీనంగా తయారవుతున్నాయి.

1847. హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ప్రళయదినాన అన్నిటికంటే ముందు ప్రజల మధ్య హత్యానేరాల సమస్యలు పరిష్కరించ బడతాయి. (బుఖారీ, ముస్లిం)

١٨٤٧ - وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ النَّبِيُّ ﷺ: «أَوَّلُ مَا يُقْضَى بَيْنَ النَّاسِ يَوْمَ الْقِيَامَةِ فِي الدِّمَاءِ» متفقٌ عَلَيْهِ.

(సహీహ్ బుఖారీలోని దియాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఖసామా ప్రకరణం)

## ముఖ్యాంశాలు

వేరొక హదీసులో ప్రళయదినాన అన్నిటికంటే ముందు నమాజు గురించి లెక్క తీసుకోవటం జరుగుతుందని చెప్పబడింది. ఈ రెండు హదీసుల మధ్య ఎలాంటి వైరుధ్యమూ లేదు. ఎందుకంటే దేవుని హక్కుల్లో అన్నిటికంటే ముందు నమాజు గురించి, మానవుల పరస్పర హక్కుల్లో అన్నిటికంటే ముందు హత్యల గురించి లెక్క తీసుకోవటం జరుగుతుంది. దీనిద్వారా మనిషి ప్రాణానికి ఎంత గౌరవం ఉందో బోధపడుతోంది.

1848. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దూతలు కాంతితో పుట్టించబడ్డారు. జిన్నాతులు అగ్ని సెగతో పుట్టించబడ్డారు. ఆదం మీకు వివరించబడిన దానితో పుట్టించబడ్డారు. (ముస్లిం)

١٨٤٨ - وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «خُلِقَتِ الْمَلَائِكَةُ مِنْ نُورٍ، وَخُلِقَ الْجَانُّ مِنْ مَارِجٍ مِنْ نَارٍ، وَخُلِقَ آدَمُ مِمَّا وُصِفَ لَكُمْ» رواهُ مسلم.

(సహీహ్ ముస్లింలోని జుహ్ద్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దైవదూతలు దేవుని కాంతితో పుట్టించబడిన సృష్టిరాశులు. వారి శరీరాలు ఎంత సూక్ష్మంగా ఉంటాయంటే అవి ఏ ఆకారాన్నయినా ధరించగలవు. జిన్నాతులు కూడా మానవుల కంటికి కనిపించని దేవుని ఓ సృష్టి. వాటికి కూడా అల్లాహ్ మానవుల్లో లేని కొన్ని అద్భుత శక్తులు ప్రసాదించాడు. షైతాన్ కూడా ఆ జిన్నాతుల కోవకు చెందినవాడే. మనిషి పుట్టుక మట్టితో జరిగింది. అనగా మానవులందరి తండ్రి అయిన ఆదం రూపాన్ని అల్లాహ్ మట్టితో రూపొందించాడు. తర్వాత అందులో తన తరఫు నుంచి ఆత్మను ఊదాడు.

١٨٤٩ ـ وَعَنْهَا رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ خُلُقُ نَبِيِّ اللهِ ﷺ الْقُرْآنَ. رواهُ مُسْلِم في جُمْلَةِ حَدِيثٍ طَوِيلٍ.

1849. హజ్రత్ అయిషా (రజి.అన్హా) గారే చెప్పిన మరొక మాట: దైవప్రవక్త (సల్లం)గారి నీతినడవడికలు స్వయానా దివ్యఖుర్ఆనే. (ముస్లిం ఒక సుదీర్ఘ హదీసు క్రింద ఈ విషయం వివరించారు.)

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అంటే దైవప్రవక్త (సల్లం) గారి జీవితం, ఆయన దైనందిన వ్యవహారాలన్నీ దివ్యఖుర్ఆన్ ఆదేశాలకు అనుగుణంగా ఉండేవి. ఆయన అస్తిత్వం ఖుర్ఆన్ బోధనలకు నిలువెత్తు నిదర్శనంగా ఉండేది. ఆయన దివ్యఖుర్ఆన్ సమ్మతించిన విషయాలకు కట్టుబడి ఉండేవారు. ఖుర్ఆన్ నిషేధించిన విషయాలకు దూరంగా ఉండేవారు. దివ్యఖుర్ఆన్ బోధించే నియమ నిబంధనలను పూర్తిగా దృష్టిలో పెట్టుకొని ఆయన మసలుకునేవారు.

١٨٥٠ ـ وَعَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ أَحَبَّ لِقَاءَ اللهِ أَحَبَّ اللهُ لِقَاءَهُ، وَمَنْ كَرِهَ لِقَاءَ اللهِ كَرِهَ اللهُ لِقَاءَهُ» فَقُلْتُ: يَا رَسُولَ اللهِ! أَكَرَاهِيَةُ الْمَوْتِ؟ فَكُلُّنَا نَكْرَهُ الْمَوْتَ! قَالَ: «لَيْسَ كَذٰلِكَ، وَلٰكِنَّ الْمُؤْمِنَ إِذَا بُشِّرَ بِرَحْمَةِ اللهِ وَرِضْوَانِهِ

1850. హజ్రత్ అయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఎవరయితే అల్లాహ్ను కలుసు కోవాలని కోరుకుంటాడో అల్లాహ్ అతన్ని కలుసు కోవాలని కోరుకుంటాడు. ఎవడైతే అల్లాహ్ను కలుసుకోవటాన్ని ఇష్ట పడడో అల్లాహ్ అతన్ని కలుసుకోవ టాన్ని ఇష్టపడడు.

(హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) చెబుతున్నారు): ఆ మాట విని నేను, "దైవప్రవక్తా! ఇష్టపడకపోవటమంటే మరణాన్ని ఇష్టపడకపోవటమా? అలాగయితే మాలో అందరూ మరణాన్ని అసహ్యించుకునేవాళ్ళే" అని అన్నాను. అందుకాయన ఇలా

وَجَنَّتِهِ أَحَبَّ لِقَاءَ اللهِ، فَأَحَبَّ اللهُ لِقَاءَهُ. وَإِنَّ الْكَافِرَ إِذَا بُشِّرَ بِعَذَابِ اللهِ وَسَخَطِهِ، كَرِهَ لِقَاءَ اللهِ، وَكَرِهَ اللهُ لِقَاءَهُ» رواه مسلم.

చెప్పారు: "దానర్థం అదికాదు. (మరణ సమయంలో) విశ్వాసికి దేవుని కారుణ్యం, ఆయన ప్రసన్నత మరియు స్వర్గ శుభవార్తలు అందజేసినప్పుడు అతను అల్లాహ్‌ను కలుసుకోవటానికి ఉవ్విళ్లూరతాడు. అల్లాహ్ కూడా అతన్ని కలుసుకోవటానికి ఇష్టపడ్తాడు. దీనికి భిన్నంగా అవిశ్వాసికి (మరణ సమయంలో) దైవశిక్ష, దైవ అప్రసన్నతల 'శుభవార్తలు' అంద జేసినప్పుడు అతను అల్లాహ్‌ను కలుసుకోవటానికి అయిష్టపడతాడు. అల్లాహ్ కూడా అతన్ని కలుసు కోవటాన్ని అసహ్యించు కుంటాడు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మరణ సమయంలో విశ్వాసికి స్వర్గశుభవార్త ఇవ్వబడుతుంది. అవిశ్వాసికి దైవశిక్ష పడుతుందని హెచ్చరికలు అందుతాయి. ఆ సమయంలో విశ్వాసికి అల్లాహ్‌ను కలవాలని విపరీతమైన కోరిక కలుగుతుంది. అవిశ్వాసికి మరణం తర్వాత శాశ్వత వినాశనం కనిపిస్తుంది. కనుక అతని హృదయంలో పశ్చాత్తాపం మొదలవుతుంది. తనకు అసలు మరణమే రాకుండా ఉంటే బాగుండేదని అతను వాపోతాడు.

١٨٥١ - وَعَنْ أُمِّ الْمُؤْمِنِينَ صَفِيَّةَ بِنْتِ حُيَيٍّ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ النَّبِيُّ ﷺ مُعْتَكِفاً، فَأَتَيْتُهُ أَزُورُهُ لَيْلاً، فَحَدَّثْتُهُ ثُمَّ قُمْتُ لِأَنْقَلِبَ، فَقَامَ مَعِي

1851. విశ్వాసుల మాతృమూర్తి సఫియా బిన్తె హుయ్యి (రజి.అన్హా) కథనం: (ఒకసారి) దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో ఏతెకాఫ్ పాటిస్తున్నప్పుడు నేను ఒకరోజు రాత్రి ఆయన్ని కలవటానికి వెళ్ళాను. కాసేపు ఆయనతో మాట్లాడిన తర్వాత వెళ్ళిపోదామని లేచి నించున్నాను. నన్ను ఇంటిదాకా

لِيَقْلِبَنِي، فَمَرَّ رَجُلَانِ مِنَ الأَنْصَارِ رَضِيَ اللهُ عَنْهُمَا، فَلَمَّا رَأَيَا النَّبِيَّ ﷺ أَسْرَعَا. فَقَالَ ﷺ: «عَلَى رِسْلِكُمَا إِنَّهَا صَفِيَّةُ بِنْتُ حُيَيٍّ» فَقَالَا: سُبْحَانَ اللهِ يَا رَسُولَ اللهِ! فَقَالَ: «إِنَّ الشَّيْطَانَ يَجْرِي مِنِ ابْنِ آدَمَ مَجْرَى الدَّمِ. وَإِنِّي خَشِيتُ أَنْ يَقْذِفَ فِي قُلُوبِكُمَا شَرًّا ـ أَوْ قَالَ: شَيْئًا ـ» متفقٌ عليه.

వదలిపెట్టి రావటానికి ఆయన కూడా లేచారు. అంతలో ఇద్దరు అన్సార్ వ్యక్తులు అటుగా వచ్చారు. వారు దైవ ప్రవక్త (సల్లం)ను చూసి త్వరత్వరగా వెళ్ళిపోసాగారు. దైవప్రవక్త (సల్లం) వారితో,"కాస్త ఆగండి, ఈమె (నా భార్య) సఫియా బిన్తె హుయ్యి" అని చెప్పారు. దానికి వారిద్దరూ (ఆశ్చర్య పోతూ) "సుబ్హానల్లాహ్! దైవప్రవక్తా! (మేము మిమ్మల్ని అనుమానించ గలమా?)" అని అన్నారు. అందుకు దైవప్రవక్త(సల్లం) "మనిషి శరీరంలో రక్తం ఎలా ప్రవహిస్తూ ఉంటుందో షైతాన్ అలా తిరుగుతుంటాడు. వాడు మీ మనస్సుల్లో లేనిపోని అనుమాన మేదైనా కలిగిస్తాడేమోనని భయ పడ్డాను" అన్నారు. లేక "అలాంటి అనుమానాలు కలిగించకూడదని అలా అన్నాను" అని అనివుంటారు.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని ఏతెకాఫ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) వ్యక్తిత్వం గురించి కొంచెమైనా దురనుమానం కలిగివుండటం విశ్వాసానికే ముప్పు. కనుక దైవప్రవక్త (సల్లం) ముందుజాగ్రత్తగా ఆ ఇద్దరు సహచరుల్ని ఆపి, వారిలో షైతాన్ ఎలాంటి దురనుమానాలూ రేకెత్తించకుండా తన వెంటనున్నది తనభార్య సఫియా (రజి)యేనని చెప్పారు. దీని ద్వారా బోధపడేదేమిటంటే ఎక్కడైనా అనవసరంగా దురనుమానాలు రేకెత్తే ప్రమాదముంటే వెంటనే అక్కడి పరిస్థితులను గురించి ప్రజలకు వివరించాలి. ముఖ్యంగా పండితులు (ఉలమాలు) ఇలాంటి దురనుమానాలకు తావిచ్చే ప్రదేశా లకు, పరిస్థితులకు దూరంగా ఉండాలి. లేకపోతే ప్రజల్లో వారి గురించి దురనుమానాలు

చెలరేగవచ్చు. అలాగే ప్రజలు కూడా అనవసరంగా ఎవరి గురించీ దురనుమానాలు పెట్టుకోరాదు. ఎందుకంటే ఇలాంటి దురనుమానాలను హదీసులో అతిపెద్ద అబద్ధంగా పేర్కొనటం జరిగింది.

١٨٥٢ - وَعَنْ أَبِي الفَضْلِ العَبَّاسِ بْنِ عَبْدِالمُطَّلِبِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: شَهِدْتُ مَعَ رَسُولِ اللهِ ﷺ يَوْمَ حُنَيْنٍ فَلَزِمْتُ أَنَا وَأَبُو سُفْيَانَ بْنُ الحارِثِ بْنِ عَبْدِالمُطَّلِبِ رَسُولَ اللهِ ﷺ، فَلَمْ نُفَارِقْهُ وَرَسُولُ اللهِ ﷺ عَلَى بَغْلَةٍ لَهُ بَيْضَاءَ، فَلَمَّا الْتَقَى المُسْلِمُونَ وَالمُشْرِكُونَ وَلَّى المُسْلِمُونَ مُدْبِرِينَ، فَطَفِقَ رَسُولُ اللهِ ﷺ، يَرْكُضُ بَغْلَتَهُ قِبَلَ الْكُفَّارِ، وَأَنَا آخِذٌ بِلِجَامِ بَغْلَةِ رَسُولِ اللهِ ﷺ، أَكُفُّهَا إِرَادَةَ أَنْ لَا تُسْرِعَ، وَأَبُو سُفْيَانَ آخِذٌ بِرِكَابِ رَسُولِ اللهِ ﷺ، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «أَيْ عَبَّاسُ نَادِ أَصْحَابَ السَّمُرَةِ» قَالَ العَبَّاسُ، وَكَانَ رَجُلاً صَيِّتاً: فَقُلْتُ بِأَعْلَى صَوْتِي: أَيْنَ

1852. హజ్రత్ అబుల్ ఫజ్ల్ అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ (రజి) కథనం: హునైన్ యుద్ధం జరిగిన రోజున నేను దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాను. అబూసుఫ్యాన్ బిన్ హారిస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ మరియు నేను ఇద్దరం దైవప్రవక్త (సల్లం) వెంటే ఉన్నాం. ఆయన్ని విడిచిపెట్టి ఎక్కడికీ వెళ్ళ లేదు. దైవప్రవక్త (సల్లం) తన తెల్లటి కంచరగాడిదపై ఎక్కి కూర్చున్నారు. ముస్లింలు మరియు బహు దైవారాధ కులు పరస్పరం తలపడినప్పుడు (మొదట) ముస్లింలు వెన్నుచూపి వెళ్ళారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) స్వయంగా అవిశ్వాసుల వైపు వెళ్ళటా నికి తన కంచరగాడిదను కాలితో ఇదిలించసాగారు. నేను దైవప్రవక్త (సల్లం) ఎక్కివున్న గాడిద కళ్ళెం పట్టు కొని అది వేగంగా వెళ్ళకుండా ఆప టానికి ప్రయత్నిస్తున్నాను. అబూ సుఫ్యాన్ దైవప్రవక్త రికాబు పట్టుకొని ఉన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) నన్ను పిలిచి, "అబ్బాస్! చెట్టు క్రింద రిజ్వాన్ ప్రమాణంలో పాల్గొన్న వారిని కేక వేయండి" అన్నారు.

أَصْحَابُ السَّمُرَةِ، فَوَاللهِ! لَكَأَنَّ عَطْفَتَهُمْ حِينَ سَمِعُوا صَوْتِي عَطْفَةُ الْبَقَرِ عَلَى أَوْلَادِهَا، فَقَالُوا: يَا لَبَّيْكَ يَا لَبَّيْكَ، فَاقْتَتَلُوا هُمْ وَالْكُفَّارُ، وَالدَّعْوَةُ فِي الأَنْصَارِ يَقُولُونَ: يَا مَعْشَرَ الأَنْصَارِ! يَا مَعْشَرَ الأَنْصَارِ! ثُمَّ قُصِرَتِ الدَّعْوَةُ عَلَى بَنِي الْحَارِثِ بْنِ الْخَزْرَجِ، فَنَظَرَ رَسُولُ اللهِ ﷺ وَهُوَ عَلَى بَغْلَتِهِ

అబ్బాస్ (రజి) గొంతు పెద్దగా ఉంటుంది. ఆయన ఇలా చెబుతున్నారు: నేను నా బిగ్గర కంఠంతో, "చెట్టు క్రింద (ప్రమాణం చేసిన)వారు ఎక్కడున్నారు?" అని అరిచాను. అల్లాహ్ సాక్షి! వారు నా గొంతు వినగానే ఆవు తన దూడల అరుపు విని వాటివైపు చూసినట్టు అత్యంత వేగంగా నావైపు దృష్టి సారించి, "ఇక్కడున్నాం, సెలవీయండి" అని అన్నారు. తర్వాత వారికి-అవిశ్వాసులకు మధ్య ఘోరంగా యుద్ధం జరిగింది. అప్పుడు అన్సార్లలో, "ఓ అన్సారుల్లారా! ఓ అన్సారుల్లారా!" అనే నినాదాలు (మిన్నుముట్టాయి.) తర్వాత ఆ అరుపులు కేవలం బనూ హారిస్ బిన్ ఖజ్రజ్ వరకే పరిమితమయ్యాయి.

అప్పటి వరకూ కంచెర గాడిదపైనే కూర్చొని వున్న ఆయన (స), కదన రంగంవైపు తదేకంగా తిలకించారు. ఆయన (స)కు ఆ సమయంలో తదేకంగా తిలకించటం తప్ప వేరొక ధ్యాస లేదన్నట్టు ఉంది. 'యుద్ధం తీవ్రరూపం దాల్చే తరుణం ఇదే' అని ఆయన (స) అన్నారు. తరువాత దైవ ప్రవక్త (స) కొన్ని కంకరరాళ్లను పట్టుకుని అవిశ్వాసుల ముఖాలపై విసిరేస్తూ, "ముహమ్మద్ (స) ప్రభువు సాక్షిగా! వారు (అంటే అవిశ్వాసులు) ఓడిపోయారు" అని అన్నారు. ఆ

كَالْمُتَطَاوِلِ عَلَيْهَا إِلَى قِتَالِهِمْ فَقَالَ: «هٰذَا حِينَ حَمِيَ الْوَطِيسُ» ثُمَّ أَخَذَ رَسُولُ اللهِ ﷺ حَصَيَاتٍ، فَرَمَى بِهِنَّ وُجُوهَ الْكُفَّارِ، ثُمَّ قَالَ: «انْهَزَمُوا وَرَبِّ مُحَمَّدٍ»، فَذَهَبْتُ أَنْظُرُ فَإِذَا الْقِتَالُ عَلَى هَيْئَتِهِ فِيمَا أَرَى، فَوَاللهِ! مَا هُوَ إِلَّا أَنْ رَمَاهُمْ بِحَصَيَاتِهِ، فَمَا زِلْتُ أَرَى حَدَّهُمْ كَلِيلاً، وَأَمْرَهُمْ مُدْبِراً. رواه مسلم.

«الْوَطِيسُ» التَّنُّورُ. وَمَعْنَاهُ: اشْتَدَّتِ الْحَرْبُ. وَقَوْلُهُ: «حَدَّهُمْ» هُوَ بِالْحَاءِ الْمُهْمَلَةِ، أَي: بَأْسَهُمْ.

దృశ్యాన్ని నేను కూడా శ్రద్ధగా చూడ సాగాను. యుద్ధం బాగా ఊపందు కుంది. దైవసాక్షి! ఆయన (స) కంకర రాళ్లను రువ్విన క్షణం నుంచీ వారి శక్తి క్షీణించసాగింది. వారు వెన్ను చూపి పారిపోయేదాకా వచ్చారు. (ముస్లిం)

'వతీసు' అంటే పొయ్యి అని అసలు అర్థం. 'హమియల్ వతీసు' అంటే యుద్ధం తీవ్ర రూపం దాల్చింది అని భావం. 'హద్దహుమ్' అంటే వారి శక్తి, యుద్ధ సామర్థ్యాలు.

*(సహీహ్ ముస్లింలోని మగాజీ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఇందులో దైవప్రవక్త (సల్లం) గారి నిరుపమాన ధైర్య సాహసాలు నిరూపించబడ్డాయి. ఆయన సహచరుల్లో చాలామంది శత్రువులతో పోరాడలేక ఛిన్నాభిన్నమై పోయినప్పుడు ఆయన స్వయంగా ఒంటరిగా శత్రుసైన్యాల వైపు ముందుకు సాగారు. ఆ సమయంలో ఆయనలో కించిత్తు భయాందోళనలైనా కనిపించలేదు. చివరికి దైవప్రవక్త (సల్లం) గారి గుండె ధైర్యమే ఆయన సహచరుల్ని యుద్ధరంగంలోకి తిరిగొచ్చేలా చేసింది.

2) అనుచరులు కూడా యుద్ధరంగం వదిలి చాలా దూరం వెళ్ళలేదు. ఊహించని రీతిలో ముస్లింల మీద అవిశ్వాసులు హఠాత్తుగా బాణాల వర్షం కురిపించటంతో తాత్కాలికంగా వారు ఛిన్నాభిన్నమైపోయారు. పిదప అబ్బాస్ (రజి) పిలుపు విని వెంటనే తిరిగొచ్చేశారు. ఒకవేళ వారు యుద్ధమైదానాన్ని వదలి దూరంగా పారిపోయి ఉంటే అబ్బాస్ (రజి) గారి ఒక్క పిలుపుకే హాజరుపలక గలిగేవారే కాదు.

3) ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం)గారి ఒక మహిమ కూడా నిరూపించబడింది. ఆయన కొన్ని కంకర్రాళ్లు అవిశ్వాసుల మీద విసరటమే వారి ఓటమికి కారణమయింది.

4) ఈ హదీసులో ముస్లింలకు బోధించ బడిందేమిటంటే- యుద్ధరంగంలో విశ్వాస పరిపక్వత, దైవసహాయాలే అసలు శక్తి. ఇవి తప్ప మిగతా వనరుల విస్తృతి, సంఖ్యాబలం అన్నీ కూడా ద్వితీయ శ్రేణిలోకి వస్తాయి. కనుక వీటినే నమ్ముకొని కూర్చోరాదు. లేకపోతే అత్యధిక సంఖ్యాబలం ఉన్నప్పటికీ ఓటమిని చవిచూడవలసి వస్తుంది. హునైన్ యుద్ధం ప్రారంభంలో అలాగే జరిగింది. కనుక అసలు నమ్మకం అల్లాహ్ మీద, ఆయన చేసే ప్రత్యేక సహాయం మీద ఉండాలి.

١٨٥٣ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَيُّهَا النَّاسُ إِنَّ اللهَ لَا يَقْبَلُ إِلَّا طَيِّبًا، وَإِنَّ اللهَ أَمَرَ الْمُؤْمِنِينَ بِمَا أَمَرَ بِهِ الْمُرْسَلِينَ، فَقَالَ تَعَالَى: ﴿ يَٰٓأَيُّهَا ٱلرُّسُلُ كُلُواْ مِنَ ٱلطَّيِّبَٰتِ وَٱعْمَلُواْ صَٰلِحًا ﴾ وَقَالَ تَعَالَى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ كُلُواْ مِن طَيِّبَٰتِ مَا رَزَقْنَٰكُمْ ﴾ ثُمَّ ذَكَرَ الرَّجُلَ يُطِيلُ السَّفَرَ أَشْعَثَ أَغْبَرَ يَمُدُّ يَدَيْهِ إِلَى السَّمَاءِ: يَا رَبِّ يَا رَبِّ، وَمَطْعَمُهُ حَرَامٌ، وَمَشْرَبُهُ حَرَامٌ، وَمَلْبَسُهُ حَرَامٌ، وَغُذِيَ بِالْحَرَامِ، فَأَنَّى يُسْتَجَابُ لِذٰلِكَ!؟» رواه مسلم.

1853. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)ఇలా ప్రబోధించారు: ప్రజలారా! అల్లాహ్ పవిత్రుడు. ఆయన పవిత్ర వస్తువులను మాత్రమే స్వీకరిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రవక్తలకు ఏదయితే ఆదేశం చాడో విశ్వాసులకు కూడా అదే ఆదేశిం చాడు. ఆయన ఇలా సెలవిచ్చాడు: "ప్రవక్తలారా! పవిత్రమైన (అంటే ధర్మసమ్మతమైన) వస్తువులు తినండి. సదాచరణ చేయండి." మరోచోట ఆయన ఇలా సెలవిచ్చాడు: "విశ్వసిం చిన ఓ ప్రజలారా! మేము మీకు ప్రసాదించిన పవిత్రమైన వస్తువుల్లో నుంచి తినండి."

తర్వాత దైవప్రవక్త (సల్లం) మనిషి గురించి చెబుతూ ఇలా అన్నారు: అతను ఎంతో దూరం నుంచి ప్రయాణం చేసి వస్తాడు. అతని దేహం మాసిపోయి ఉంటుంది. దుమ్ముధూళి పేరుకుపోయి ఉంటుంది. అతను ఆకాశం వైపు చేతులెత్తి, "ఓ ప్రభూ! ఓ ప్రభూ!" అని ప్రార్థిస్తాడు. మరి చూడ బోతే అతని తిండి అధర్మమైనదై ఉంటుంది. అతను త్రాగేది అధర్మ మైనదై ఉంటుంది. అతను తొడు క్కున్న బట్టలు అధర్మమైనవై ఉంటాయి. అతను హరామ్ తిండి తిని

బ్రతుకుతున్నప్పుడు అతని ప్రార్థన ఎలా స్వీకరించబడుతుంది?"

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ప్రార్థన స్వీకరించబడటానికి ధర్మసమ్మతమైన ఉపాధి చాలా అవసరం. అదే విధంగా ధర్మసమ్మతమైన మార్గాల గుండా ఆర్జించిన ధనం నుంచి చేసిన దానధర్మాలను మాత్రమే అల్లాహ్ స్వీకరిస్తాడు. అంతేకాదు, ప్రతి మంచిపని చేసేముందు ధర్మసమ్మతమైన ఉపాధిని దృష్టిలో పెట్టుకోవటం అవసరం. లేకపోతే ఆ సదాచరణ కూడా వృథా అయిపోతుంది.

١٨٥٤ ـ وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «ثَلَاثَةٌ لَا يُكَلِّمُهُمُ اللهُ يَوْمَ الْقِيَامَةِ، وَلَا يُزَكِّيهِمْ، وَلَا يَنْظُرُ إِلَيْهِمْ، وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ: شَيْخٌ زَانٍ، وَمَلِكٌ كَذَّابٌ، وَعَائِلٌ مُسْتَكْبِرٌ» رواهُ مسلم.

«الْعَائِلُ»: الْفَقِيرُ.

1854. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ముగ్గురు వ్యక్తులున్నారు. ప్రళయ దినాన అల్లాహ్ వారిని పలకరించడు. వారిని (పాపాల నుంచి) పరిశుద్ధం చేయడు. ఆఖరికి వారివైపు (కారుణ్య దృష్టితో) కూడా చూడడు. పైగా వారికోసం అత్యంత బాధాకరమైన శిక్ష కాచుకొని ఉంటుంది. ఆ ముగ్గురిలో ఒకడు: ముసలి వ్యభిచారి; రెండో వాడు: అబద్ధాలు చెప్పే రాజు; మూడో వాడు: గర్విష్టి అయిన నిరుపేద.

(ముస్లిం)

'ఆయిలున్' అంటే నిరుపేద అని అర్థం.

(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ఒక పాపం నుంచి సులభంగా బయటపడే అవకాశాలు ఉన్నప్పటికీ ఎవడైనా ఆ పాపం నుంచి బయట పడలేకపోతున్నాడంటే అతను ఘోరాతిఘోర పాపాత్ముడై ఉండాలి!

1855. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: సైహాన్, జైహాన్, ఫురాత్, నైలు ఇవన్నీ స్వర్గ కాలువల్లోనివే. (ముస్లిం)

١٨٥٥ - وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «سَيْحَانُ وَجَيْحَانُ وَالْفُرَاتُ وَالنِّيلُ كُلٌّ مِنْ أَنْهَارِ الْجَنَّةِ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని స్వర్గ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

కొందరి దృష్టిలో పై హదీసుకు భావం ఏమిటంటే-స్వర్గంలోని కాలువల మాదిరిగా ఈ నాలుగు నదులు కూడా ఎంతో శుభవంతమైనవి. అవి సస్యశ్యామలమైన పరిసరాలను అందిస్తున్నాయి. వాటి పరిసరాల్లోనే ఇస్లాం ధర్మం వ్యాపించింది. మరి కొందరి దృష్టిలో అది పోలిక కాదు. పై హదీసులో వాస్తవమే వివరించబడింది. అయితే ఆ వాస్తవమంతా మనకు బోధపడక పోవచ్చు. సైహాన్, జైహాన్ నదులు కురాసాన్ ప్రాంతంలో ఉన్నాయి. ఫురాత్ నది సిరియాకు-అరబ్బు ద్వీపానికి మధ్య సరిహద్దుగా ఉన్నది. ఇకపోతే నైలునది ఈజిప్ట్ దేశంలో ఉన్నది.

1856. హజ్రత్ అబూహురైరా (రజి)గారే చేసిన వేరొక కథనం: దైవప్రవక్త (సల్లం) నా చెయ్యి పట్టుకొని ఇలా చెప్పారు: అల్లాహ్ భూమిని శనివారం రోజు పుట్టించాడు. అందులో పర్వతాలు ఆదివారం నాడు పుట్టించాడు. వృక్షాలు సోమవారం నాడు పుట్టించాడు. అయిష్టకరమైన వస్తువులు మంగళ వారం రోజు పుట్టించాడు. కాంతిని బుధవారం రోజు పుట్టించాడు. అందులో జంతువులను గురువారం రోజు పుట్టించాడు. ఈ వస్తువులన్నీ పుట్టించిన తర్వాత చివర్లో శుక్రవారం రోజు అస్ర్ తర్వాత ఆదం (అలైహిస్సలామ్)ను పుట్టించాడు. అది అస్ర్‌కు-

١٨٥٦ - وَعَنْهُ قَالَ: أَخَذَ رَسُولُ اللهِ ﷺ بِيَدِي فَقَالَ: «خَلَقَ اللهُ التُّرْبَةَ يَوْمَ السَّبْتِ وَخَلَقَ فِيهَا الْجِبَالَ يَوْمَ الأَحَد، وَخَلَقَ الشَّجَرَ يَوْمَ الاثْنَيْنِ، وَخَلَقَ الْمَكْرُوهَ يَوْمَ الثُّلاثَاءِ، وَخَلَقَ النُّورَ يَوْمَ الأَرْبعَاءِ، وَبَثَّ فِيهَا الدَّوَابَّ يَوْمَ الْخَمِيسِ، وَخَلَقَ آدَمَ ﷺ بَعْدَ الْعَصْرِ مِنْ يَوْمِ الْجُمُعَةِ فِي آخِرِ الْخَلْقِ فِي آخِرِ سَاعَةٍ مِنَ النَّهَارِ فِيمَا بَيْنَ الْعَصْرِ إِلَى اللَّيْلِ» رواهُ مسلم.

రాత్రికి మధ్య పగటి చివరి ఘడియ.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రళయ వర్ణన, స్వర్గనరకాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

రోజు అంటే ఏమిటి? అది ఎంత సుదీర్ఘంగా ఉంటుంది? ఈ విషయాల యొక్క వాస్తవికత కేవలం అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. మన ప్రపంచపు రోజులోనయితే 24 గంటలు, (ఒక పగలు ఒక రేయి) ఉంటాయి. ఆకాశలోకపు రోజు ఎంతైనా దీనికి భిన్నంగానే ఉంటుంది.

١٨٥٧ ـ وَعَنْ أَبِي سُلَيْمَانَ خَالِدِ بْنِ الْوَلِيدِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: لَقَدِ انْقَطَعَتْ فِي يَدِي يَوْمَ مُؤْتَةَ تِسْعَةُ أَسْيَافٍ، فَمَا بَقِيَ فِي يَدِي إِلَّا صَفِيحَةٌ يَمَانِيَةٌ رواهُ البُخاري.

1857. హజ్రత్ అబూ సులైమాన్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) కథనం: మౌతా యుద్ధం నాడు నా చేతిలో తొమ్మిది ఖడ్గాలు విరిగిపోయాయి. కేవలం ఓ చిన్న యమనీ ఖడ్గం మాత్రమే నా చేతిలో మిగిలింది.

(బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని మగాజీ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

'మౌతా' అనేది సిరియా సమీపంలోని ఓ ప్రాంతం పేరు. ఇక్కడ జరిగిన యుద్ధాన్ని మౌతా యుద్ధంగా పేర్కొంటారు. ఈ హదీసులో దైవప్రవక్త సహచరులైన హజ్రత్ ఖాలిద్(రజి)గారి ధైర్యసాహసాల ప్రస్తావన ఉంది. దీనిద్వారా ఆయన గొప్పదనం కూడా నిరూపితమవుతోంది.

١٨٥٨ ـ وَعَنْ عَمْرِو بْنِ الْعَاصِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ سَمِعَ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِذَا حَكَمَ الْحَاكِمُ، فَاجْتَهَدَ، ثُمَّ أَصَابَ، فَلَهُ أَجْرَانِ، وإِنْ حَكَمَ وَاجْتَهَدَ، فَأَخْطَأَ فَلَهُ أَجْرٌ». متفقٌ عَلَيْهِ.

1858. దైవప్రవక్త (సల్లం) ఇలా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తెలియజేశారు: పరిపాలకుడు బాగా కష్టపడి తీర్పు చేయగా అతని తీర్పు న్యాయంతో కూడుకొని ఉంటే అతనికి రెండింతల పుణ్యం లభిస్తుంది. ఒకవేళ అతను బాగా కష్టపడి తీర్పుచేయగా అతని

తీర్పులో పొరపాటు జరిగినప్పటికీ అతనికి ఒకింత పుణ్యం లభిస్తుంది.

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఏతెసామ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని అఖ్‌జియా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఏదేని వ్యవహారానికి సంబంధించి స్పష్టమైన షరీఅత్ ఆజ్ఞలు లేనప్పుడు వాటిని పోలిన ఇతర ఆజ్ఞల్ని దృష్టిలో పెట్టుకొని ఆ వ్యవహారపు ధర్మాధర్మాలను బేరీజు వేయటాన్ని 'ఇజ్తిహాద్' అంటారు. ఖుర్‌ఆన్ హదీసుల గురించి సరైన జ్ఞానం, అవగాహన కలవాడు మాత్రమే ఇజ్తిహాద్ బాధ్యతను సరిగ్గా నిర్వర్తించగలడని ఆ నిర్వచనమే చెబుతోంది. దీని ద్వారా బోధపడు తున్న మరొక విషయం ఏమిటంటే ముస్లింల పరిపాలకుడు, న్యాయమూర్తి, అధికారి అవసరమైనప్పుడు ఇజ్తిహాద్ చేయగలగటానికి ఖుర్‌ఆన్ హదీసుల పండితుడై ఉంటే మంచిది. ఆ ఇజ్తిహాద్‌లో అతను చిత్తశుద్ధితో గనక నిర్ణయాలు తీసుకుంటే ఆ నిర్ణయం తప్పైనా, ఒప్పైనా అతనికి మాత్రం పుణ్యం లభిస్తుంది. సరైన నిర్ణయం తీసుకున్న పక్షంలో రెండింతల పుణ్యం లభిస్తుంది.

١٨٥٩ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «الْحُمَّى مِنْ فَيْحِ جَهَنَّمَ فَأَبْرِدُوهَا بِالمَاءِ» متفقٌ عليه.

1859. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: "జ్వరం నరక తాపం తీవ్రత వల్ల వస్తుంది. కనుక దాన్ని నీళ్ళతో చల్లబరచండి."

(బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హదీసులో సూచించిన చికిత్సా విధానం సరైనది. చాలా రకాల జ్వరాలకు డాక్టర్లు ఇదే చికిత్సను సూచిస్తారు. రోగి శరీరాన్ని నీళ్ళతో బాగా కడగమని లేక శరీరాన్ని తడిగుడ్డతో తుడవమని చెబుతారు.

١٨٦٠ ـ وَعَنْهَا رَضِيَ اللهُ عَنْهَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «مَنْ مَاتَ وَعَلَيْهِ صَوْمٌ،

1860. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:

صَامَ عَنْهُ وَلِيُّهُ» متفقٌ عليه. وَالْمُخْتَارُ جَوَازُ الصَّوْمِ عَمَّنْ مَاتَ وَعَلَيْهِ صَوْمٌ لِهٰذَا الْحَدِيثِ، وَالْمُرَادُ بِالْوَلِيِّ: الْقَرِيبُ وَارِثاً كَانَ أَوْ غَيْرَ وَارِثٍ.

చనిపోయిన వ్యక్తి (మొక్కుబడి చేసుకున్న) ఉపవాసాలు పాటించవలసి ఉంటే అతని తరపున అతని సమీప బంధువు ఆ ఉపవాసాలు పాటించాలి. (బుఖారీ-ముస్లిం)

ఈ హదీసు దృష్ట్యా చనిపోయిన వ్యక్తి ఉపవాసాలు పాటించవలసి ఉంటే అతని తరపున ఇతరులు పాటించ వచ్చున్నది ఆమోదయోగ్యమైన విషయం. వలీ అంటే ఇక్కడ సమీప బంధువు అని అర్థం. అతను వారసుడైనా, కాకపోయినా;

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఉపవాసాలంటే మొక్కుబడి ఉపవాసాలు మాత్రమేనని, రమజాన్ ఉపవాసాలు కావని షేఖ్ అల్‌బాని (రహ్మలై) చెప్పారు. అంటే అల్‌బానీగారు ఆయిషా (రజి. అన్‌హా) గారి హదీసులోని సార్వత్రిక ఆదేశాన్ని ఇబ్నె అబ్బాస్ గారి వేరొక హదీసుతో ప్రత్యేకిస్తున్నారన్న మాట! ఇబ్నె అబ్బాస్ (రజి)గారి హదీసులో మొక్కుబడి ఉపవాసాలు అని స్పష్టంగా ఉంది.

ఇలా చేయటానికి కారణమేమిటంటే శారీరక ఆరాధనల్లో ప్రాతినిధ్యం ధర్మసమ్మతం కాదు. బతికివున్నప్పుడు ఒకరి శారీరక ఆరాధనలు మరొకరు చేయటం ధర్మసమ్మతం కానట్లే మరణం తర్వాత కూడా అలా చేయటం ధర్మసమ్మతం కాదు. అయితే దేనిగురించయితే షరీఅత్‌లో స్పష్టమైన ఆదేశాలుంటాయో అంతవరకు మాత్రం అనుమతి ఉంటుంది. ఆ ఆదేశాలను కూడా షరీఅత్‌లో వివరించబడినంత వరకు మాత్రమే పరిమితంగా ఉంచాలి. ఉదా: ఉపవాసం అనేది శారీరక ఆరాధన. కనుక ఒకరి ఉపవాసాలు మరొకరు పాటించటానికి వీల్లేదు. అయితే మొక్కుబడికి సంబంధించిన ఉపవాసాల గురించి మాత్రం షరీఅత్‌లో స్పష్టమైన ఆదేశం ఉంది. మరణించిన వ్యక్తి మొక్కుబడి ఉపవాసాలు పాటించవలసి ఉంటే అతని తరపున అతని సమీప బంధువు పాటించవచ్చని చెప్పబడింది. అది తప్ప మరే శారీరక ఆరాధనకూ ఆ అనుమతి లేదు.

١٨٦١ - وَعَنْ عَوْفِ بْنِ مَالِكِ بْنِ الطُّفَيْلِ أَنَّ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا حُدِّثَتْ أَنَّ عَبْدَ اللهِ بْنَ الزُّبَيْرِ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ فِي بَيْعٍ أَوْ عَطَاءٍ أَعْطَتْهُ عَائِشَةُ رَضِيَ اللهُ تَعَالَى عَنْهَا: وَاللهِ! لَتَنْتَهِيَنَّ عَائِشَةُ، أَوْ لَأَحْجُرَنَّ عَلَيْهَا؛ قَالَتْ: أَهُوَ قَالَ هٰذَا؟ قَالُوا: نَعَمْ، قَالَتْ: هُوَ للهِ عَلَيَّ نَذْرٌ أَنْ لَا أُكَلِّمَ ابْنَ الزُّبَيْرِ أَبَدًا، فَاسْتَشْفَعَ ابْنُ الزُّبَيْرِ إِلَيْهَا حِينَ طَالَتِ الْهِجْرَةُ. فَقَالَتْ: لَا وَاللهِ! لَا أُشَفِّعُ فِيهِ

1861. హజ్రత్ ఔఫ్ బిన్ మాలిక్ బిన్ తుఫైల్ (రజి) కథనం: హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారు చేసే ఏదో వ్యాపారం గురించో లేక ఆవిడ ఇచ్చే ఏదో కానుక గురించో అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి)గారు "(నా పిన్నమ్మ) ఆయిషా ఈ విధంగా (చేతికొచ్చినట్టు) ఖర్చుచేయకుండా ఆగిపోవాలి. లేదా నేనైనా ఆమెపై ఆంక్ష విధిస్తాను" అని అన్నారు. ఈ మాట ఆయిషా (రజి. అన్హా) వరకూ చేరింది. అది విని ఆవిడ, "అబ్దుల్లాహ్ నిజంగా ఆ మాట అన్నాడా?" అని అడిగారు. "ఔనండీ" అన్నారు (చుట్టుప్రక్కల)జనం. అప్పుడామె, "నేను అల్లాహ్ పేర మొక్కుబడి చేసుకుంటున్నారు. ఇక ఎన్నడూ నేను అబ్దుల్లాహ్ బిన్ జుబైర్‌తో మాట్లాడను" అని ఒట్టేసుకున్నారు. ఈ సంబంధ వియోగం సుదీర్ఘమవటంతో ఇబ్నె జుబైర్ (రజి) ఆయిషా (రజి.అన్హా) దగ్గర సిఫారసు చేయించారు. అందుకామె, "అల్లాహ్ సాక్షి! ఇబ్నె జుబైర్ గురించి నేనెన్నటికీ ఎవరి సిఫారసూ అమోదించను. అతనితో మాట్లాడి నా మొక్కుబడిని భంగంచేసే పాపానికి ఒడిగట్టలేను" అని అన్నారు.

ఈ వ్యవహారం ఇంకా సుదీర్ఘమయి పోతుండటం చూసి ఇబ్నె జుబైర్ (రజి) ఒకరోజు హజ్రత్ మిస్వర్ బిన్ మఖ్రమ

أَبَدًا، وَلَا أَتَحَنَّثُ إِلَى نَذْرِي فَلَمَّا طَالَ ذٰلِكَ
عَلَى ابْنِ الزُّبَيْرِ كَلَّمَ الْمِسْوَرَ بْنَ مَخْرَمَةَ،
وَعَبْدَ الرَّحْمٰنِ بْنَ الْأَسْوَدِ بْنِ عَبْدِ يَغُوثَ
وَقَالَ لَهُمَا: أَنْشُدُكُمَا اللّٰهَ لَمَّا أَدْخَلْتُمَانِي عَلَى
عَائِشَةَ رَضِيَ اللّٰهُ عَنْهَا، فَإِنَّهَا لَا يَحِلُّ لَهَا أَنْ
تَنْذِرَ قَطِيعَتِي، فَأَقْبَلَ بِهِ الْمِسْوَرُ، وَعَبْدُ
الرَّحْمٰنِ حَتَّى اسْتَأْذَنَا عَلَى عَائِشَةَ، فَقَالَا:
السَّلَامُ عَلَيْكِ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهُ، أَنَدْخُلُ؟
قَالَتْ عَائِشَةُ: ادْخُلُوا. قَالُوا: كُلُّنَا؟ قَالَتْ:
نَعَمِ ادْخُلُوا كُلُّكُمْ، وَلَا تَعْلَمُ أَنَّ مَعَهُمَا ابْنَ
الزُّبَيْرِ، فَلَمَّا دَخَلُوا، دَخَلَ ابْنُ الزُّبَيْرِ

మరియు అబ్దుర్రహ్మాన్ బిన్ అస్వద్ బిన్ అబ్దె యగూస్‌తో మాట్లాడారు. వారితో ఇలా అన్నారు: "నేను మీ ఇద్దరికి దేవుని ప్రమాణం ఇచ్చి మరీ చెబుతున్నాను. మీరిద్దరూ నన్ను (మా చిన్నమ్మ) ఆయిషా దగ్గరికి తీసు కెళ్ళండి. ఆమె నాతో సంబంధాలు తెగ త్రెంపులు చేసుకోవటం నాకు ధర్మ సమ్మతం కాదు" అన్నారు. మిస్వర్ మరియు అబ్దుర్రహ్మాన్ ఇద్దరూ ఇబ్నె జుబైర్‌ను తీసుకొని ఆయిషా (రజి. అన్హా) ఇంటికి వెళ్ళి లోనికి వచ్చేందుకు అనుమతి కోరుతూ, "అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి వ బరకాతుహూ, మేము లోనికి రావచ్చా?" అని అడిగారు. "వచ్చేయండి" అన్నారు ఆయిషా (రజి. అన్హా) అనుమతి ఇస్తూ. "మేమందరం రావచ్చా?" అని అడిగారు వారు. "ఆఁ అందరూ రావచ్చు" అన్నారు ఆయిషా (రజి.అన్హా). వారిద్దరితో పాటు అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ కూడా ఉన్నారని ఆమెకు తెలియదు. వారు ముగ్గురూ లోనికి వెళ్ళారు. అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ పరదాలోకి వెళ్ళి, తన (పిన్నమ్మ) ఆయిషాను చుట్టేసుకొని (తనతో మాట్లాడమని) ఆమెకు దేవుని మీద ప్రమాణాలు చేసి మరీ చెబుతూ

الْحِجَابَ، فَاعْتَنَقَ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا، وَطَفِقَ يُنَاشِدُهَا وَيَبْكِي، وَطَفِقَ الْمِسْوَرُ، وَعَبْدُ الرَّحْمٰنِ يُنَاشِدَانِهَا إِلَّا كَلَّمَتْهُ وَقَبِلَتْ مِنْهُ، وَيَقُولَانِ: إِنَّ النَّبِيَّ ﷺ نَهَى عَمَّا قَدْ عَلِمْتِ مِنَ الْهِجْرَةِ، وَلَا يَحِلُّ لِمُسْلِمٍ أَنْ يَهْجُرَ أَخَاهُ فَوْقَ ثَلَاثِ لَيَالٍ، فَلَمَّا أَكْثَرُوا عَلَى عَائِشَةَ مِنَ التَّذْكِرَةِ وَالتَّحْرِيجِ، طَفِقَتْ تُذَكِّرُهُمَا وَتَبْكِي، وَتَقُولُ: إِنِّي نَذَرْتُ وَالنَّذْرُ شَدِيدٌ، فَلَمْ يَزَالَا بِهَا حَتَّى كَلَّمَتِ ابْنَ الزُّبَيْرِ، وَأَعْتَقَتْ فِي نَذْرِهَا ذٰلِكَ أَرْبَعِينَ رَقَبَةً، وَكَانَتْ تَذْكُرُ نَذْرَهَا بَعْدَ ذٰلِكَ فَتَبْكِي حَتَّى تَبُلَّ دُمُوعُهَا خِمَارَهَا.

رواه البُخاري.

ఏడ్వసాగారు. (పరదా బయట) మిస్వర్ మరియు అబ్దుర్రహ్మాన్‌లు కూడా, ఇబ్నె జుబైర్‌తో మాట్లాడమని, ఆయన సంజాయిషీని ఆమోదించమని ఆమెకు దేవునిమీద ప్రమాణం చేసి మరీ చెప్పసాగారు. ఆమెతో ఇలా అన్నారు: దైవప్రవక్త (సల్లం) ఇటువంటి సంబంధ తెగత్రెంపుల్ని వారించారు. అది మీకూ తెలుసు. ఒక ముస్లిం తోటి ముస్లిం సోదరునితో మూడురాత్రుల కంటే ఎక్కువకాలం మాట్లాడకుండా సంబంధాలు తెగత్రెంపులు చేసుకొని ఉండటం ధర్మసమ్మతం కాదు.

వారు ఆ విధంగా ఆయిషా (రజి. అన్హా) ముందు హితోపదేశం, సంబంధ తెగత్రెంపులు పాపం అనే మాటలు పెంచినప్పుడు ఆమె కూడా హితోపదేశం మొదలుపెట్టారు, ఏడ్వ సాగారు: "ఇబ్నె జుబైర్‌తో మాట్లాడనని నేను మొక్కుబడి చేసుకున్నాను. మొక్కుబడి వ్యవహారం చాలా కఠినంగా ఉంటుంది" అని అన్నారు. కాని వారిద్దరు ఆమెను అదేపనిగా బతిమాలసాగారు. చివరికి ఆమె ఇబ్నె జుబైర్ (రజి)తో మాట్లాడారు. తన మొక్కుబడి భంగం చేసినందుకు ఆమె నలభై (బానిస) మెడలు విడిపించారు. ఆ తర్వాత ఆమె ఎప్పుడు తన మొక్కు

బడిని గుర్తు చేసుకున్నా విపరీతంగా ఏడ్చేవారు. కన్నీళ్లతో ఆమె వోణీ తడిసి పోయేది. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి) హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారి అక్క కొడుకు. ఆయిషా (రజి.అన్హా) ఆయనతో మాట్లాడనని ఒట్టేసుకున్నారు. తను చేస్తున్న ధర్మసమ్మతమైన పనుల్ని ఇబ్నె జుబైర్ ఆపుతానని హెచ్చరించటంతో ఆయనతో మాట్లాడకుండా ఉండటం తనకు ధర్మసమ్మతమే అవుతుందని భావించారామె. కాని ఆ తర్వాత ఇబ్నె జుబైర్ (రజి) తన తప్పు తెలుసుకొని తన పిన్నిని ఒప్పించటానికి ఇద్దరు సిఫారసుకర్తల్ని వెంటబెట్టుకొని ఆవిడ ఇంటికి వెళ్ళారు. చివరికి ఆయిషా (రజి.అన్హా) తన ఒట్టుని భంగపరచి, ఇబ్నె జుబైర్‌తో మాట్లాడటమే సమంజసమని భావించారు- (రజియల్లాహు అన్హుమ్).

2) ప్రమాణ భంగానికి చెల్లించే కఫ్ఫారాయే మొక్కుబడి భంగానికి కూడా చెల్లించాలి. అంటే ఒక బానిసను విముక్తి చేయటం లేక పదిమంది నిరుపేదలకు అన్నం పెట్టటం లేక వారికి బట్టలు ఏర్పాటు చేయటం. అంత శక్తి, స్తోమత లేనప్పుడు మూడురోజులు ఉపవాసం పాటించినా సరిపోతుంది. కాని ఆయిషా (రజి.అన్హా) మాత్రం ఒకటికి నలభైమంది బానిసల్ని విడుదల చేయించారు. (దైవం ఆమె పట్ల ప్రసన్నుడగుగాక)

١٨٦٢ - وَعَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ خَرَجَ إِلَى قَتْلَى أُحُدٍ، فَصَلَّى عَلَيْهِمْ بَعْدَ ثَمَانِ سِنِينَ كَالْمُوَدِّعِ لِلأَحْيَاءِ وَالأَمْوَاتِ، ثُمَّ طَلَعَ إِلَى الْمِنْبَرِ، فَقَالَ: «إِنِّي بَيْنَ أَيْدِيكُمْ فَرَطٌ وَأَنَا شَهِيدٌ عَلَيْكُمْ، وَإِنَّ مَوْعِدَكُمُ الْحَوْضُ، وَإِنِّي لأَنْظُرُ إِلَيْهِ مِنْ مَقَامِي هٰذَا، أَلا وَإِنِّي لَسْتُ أَخْشَى عَلَيْكُمْ أَنْ تُشْرِكُوا، وَلٰكِنْ أَخْشَى عَلَيْكُمُ الدُّنْيَا أَنْ تَنَافَسُوهَا» قَالَ: فَكَانَتْ آخِرَ نَظْرَةٍ نَظَرْتُهَا إِلَى

1862. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఉహుద్ యుద్ధంలో అమరవీరులైన వారి (సమాధుల) దగ్గరికి వెళ్ళారు. ఎనిమిది యేండ్ల తరువాత వారికోసం దుఆ చేశారు. చనిపోయినవారికి, బ్రతికున్నవారికి అందరికీ వీడ్కోలు చెబుతున్న విధంగా ఆయన ఈ దుఆ చేశారు. తర్వాత వేదికపైకెక్కి ఇలా ప్రబోధించారు: "నేను మీకు ముందుగా వెళ్తున్నవాణ్ణి. నేను మీకు సాక్షిగా ఉంటాను. మీకు వాగ్దానం

رَسُولِ اللهِ ﷺ. متفقٌ عليه. وفي رِوَايةٍ: «وَلٰكِنِّي أَخْشَى عَلَيْكُمُ الدُّنْيَا أَنْ تَنَافَسُوا فِيهَا، وَتَقْتَتِلُوا فَتَهْلِكُوا كَمَا هَلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ» قَالَ عُقْبَةُ: فَكَانَ آخِرَ مَا رَأَيْتُ رسُولَ اللهِ ﷺ عَلَى المِنْبَرِ. وَفي رِوَايةٍ قَالَ: «إِنِّي فَرَطٌ لَكُمْ وَأَنَا شَهِيدٌ عَلَيْكُمْ وَإِنِّي وَاللهِ! لَأَنْظُرُ إِلَى حَوْضِي الآنَ، وَإِنِّي أُعْطِيتُ مَفَاتِيحَ خَزَائِنِ الأَرْضِ، أَوْ مَفَاتِيحَ الأَرْضِ، وَإِنِّي وَاللهِ! مَا أَخَافُ عَلَيْكُمْ أَنْ تُشْرِكُوا بَعْدِي، وَلٰكِن أَخَافُ عَلَيْكُمْ أَنْ تَنَافَسُوا فِيهَا». وَالمُرَادُ بِالصَّلَاةِ عَلَى قَتْلَى أُحُدٍ: الدُّعَاءُ لَهُمْ، لَا الصَّلَاةُ المعْرُوفةُ.

చేయబడిన చోటు కౌసర్ సరస్సు. నేనిక్కడ నిలబడి కూడా దాన్ని చూడ గలుగుతున్నాను. నేను వెళ్ళిన తర్వాత మీరు మళ్ళీ బహు దైవారాధకులు అయిపోతారేమోనన్న భయం ఇప్పుడు నాకు ఏమాత్రం లేదు సుమా! అయితే మీరు ప్రాపంచిక వ్యామోహంలో చిక్కుకుపోతారని మాత్రం నాకు భయముంది."

హదీసు ఉల్లేఖకులు ఇలా అంటు న్నారు: నేను దైవప్రవక్త (సల్లం)ను చివరిసారిగా అక్కడే చూశాను (అంటే ఆ తర్వాత ఆయన త్వరలోనే ఇహ లోకం వీడి వెళ్ళిపోయారు).

(బుఖారీ-ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారని ఉంది: నేను మీ గురించి ప్రపంచం విషయంలో భయ పడుతున్నాను. మీరు దాని వ్యామో హంలో చిక్కుకుంటారేమోనని. (దాని మూలంగా) మీరు పరస్పరం యుద్ధాలు చేసుకొని మీకు పూర్వం నాశనమయిపోయిన వారిలాగే నాశన మయిపోతారు.

ఉఖ్బా (రజి) ఇలా అంటున్నారు: ఇది నేను దైవప్రవక్త (సల్లం)ను చూసిన చివరి సందర్భం. అప్పుడాయన వేదిక మీద (నించొని) ఉన్నారు.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నేను మీ ముందు నడిచేవాణ్ణి. నేను మీకు సాక్షిగా ఉంటాను. దైవం సాక్షి! నేనిప్పుడు కూడా నా సరస్సును చూస్తు న్నాను. భూలోకపు నిధులు (లేక) భూలోకపు తాళం చెవులు నాకు ఇవ్వ బడ్డాయి. మీరు నా తదనంతరం మళ్ళీ బహుదైవారాధన చేయటం మొదలెడతారేమోనని నేను భయ పడటం లేదు. అయితే మీరు ప్రాపంచిక వ్యామోహంలో దారుణంగా చిక్కుకుపోతారని మాత్రం భయ పడుతున్నాను.

'ఉహుద్ అమరవీరుల కోసం సలాత్' అంటే వారికోసం దుఆ చేయటం అని అర్థం. అంతేకాని సామాన్యంగా చేసే (జనాజా) నమాజు అని అర్థం కాదు.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని ఫజాయెల్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) 'సలాత్' అనే పదానికి 'ప్రార్థన' అనే అర్థం తీసుకున్నారు. ఇది సరైనది కాదు. ఇతర ఉల్లేఖనాల్లో 'సలాతున్ అలల్ మయ్యితి" అని స్పష్టంగా ఉంది. వాటి ద్వారా దైవప్రవక్త (సల్లం) చేసింది కేవలం ప్రార్థన కాదు, నమాజ్ చేశారని స్పష్టంగా బోధపడుతోంది.

2) చనిపోయిన, అమరగతులయిన వారి మన్నింపు కోసం, వారి స్థానాలు ఉన్నతం కావటం కోసం ఎల్లప్పుడూ దుఆ చేస్తూ ఉండాలి. అయితే ఆ చనిపోయినవారు విశ్వాసస్థితిలో చనిపోయినవారై ఉండాలి.

3) దైవప్రవక్త (సల్లం)కు ప్రపంచంలోనే మగత స్థితిలో పరలోకానికి సంబంధించిన వాస్తవాలెన్నో తెలుస్తూ ఉండేవి.

4) ఇందులో కౌసర్ సరస్సు ఉనికి కూడా నిరూపించబడింది.

5) దైవప్రవక్త (సల్లం) తన అనుచర సమాజానికి సారధి లాంటివారు. ఫర్త్ అంటే ఒక జట్టుకు, బృందానికి ముందు నడిచేవాడు. దైవప్రవక్త (సల్లం) పరలోక సమూహానికి సారధి అన్నమాట.

6) ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) తన అనుచరులను సంబోధిస్తూ, " మీరు బహుదైవారాధన మొదలెడతారేమోనని నేను భయపడటం లేదు" అని అన్నారు. ఈ మాట ఆయన తొలి కాలానికి చెందిన మనుషులను దృష్టిలో పెట్టుకొని చెప్పారు. లేకపోతే ఇతర హదీసుల్లో చివరికాలంలో ప్రజలు మళ్ళీ విగ్రహాలను పూజించటం మొదలుపెడతారని చెప్పబడింది. కనుక ఈ హదీసును ఆధారంగా చేసుకొని ముహమ్మదీయ అనుచర సమాజం వారు ఎన్నటికీ షిర్కు చేయరని నిర్ణయించటం సరైనది కాదు. లేదా సమాజం మొత్తం షిర్క్ ప్రవాహంలో కొట్టుకుపోదని దీని భావం కావచ్చు.

7) భూలోక నిధుల తాళం చెవులంటే అవిశ్వాసుల రాజ్యాల మీద విజయం సాధించిన తర్వాత ముస్లింలకు లభించిన విజయసొత్తుకు సంబంధించిన శుభవార్తలు. తర్వాతి కాలంలో అలాగే జరిగింది.

١٨٦٣ - وَعَنْ أَبِي زَيْدٍ عَمْرِو بْنِ أَخْطَبَ الأَنْصَارِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: صَلَّى بِنَا رَسُولُ اللهِ ﷺ الْفَجْرَ، وَصَعِدَ الْمِنْبَرَ، فَخَطَبَنَا حَتَّى حَضَرَتِ الظُّهْرُ، فَنَزَلَ فَصَلَّى، ثُمَّ صَعِدَ الْمِنْبَرَ حَتَّى حَضَرَتِ الْعَصْرُ، ثُمَّ نَزَلَ فَصَلَّى، ثُمَّ صَعِدَ الْمِنْبَرَ حَتَّى غَرَبَتِ الشَّمْسُ، فَأَخْبَرَنَا مَا كَانَ وَمَا هُوَ كَائِنٌ، فَأَعْلَمُنَا أَحْفَظُنَا. رَوَاهُ مُسْلِمٌ.

1863. హజ్రత్ అబూ జైద్ అమ్ర్ బిన్ అఖ్తబ్ అన్సారీ (రజి) కథనం: (ఒకరోజు) దైవప్రవక్త (సల్లం) మాకు ఫజ్ర్ నమాజు చేయించారు. తర్వాత వేదికపైకెక్కి మా ముందు ప్రసంగించటం మొదలుపెట్టారు. జుహ్ర్ నమాజు వేళ అయ్యేవరకూ ఆయన ప్రసంగం నడుస్తూనే ఉంది. అప్పుడాయన వేదిక దిగి (జుహ్ర్) నమాజు చేయించారు. తర్వాత మళ్ళీ వేదిక నలంకరించి అస్ర్ వేళ అయ్యేవరకూ ప్రసంగించారు. అప్పుడాయన క్రిందికి దిగి (అస్ర్) నమాజు చేయించి మళ్ళీ వేదికపైకెక్కారు. తర్వాత సూర్యుడు అస్తమించేదాకా (ఉపన్యసించారు). ఆ సందర్భంగా ఆయన మాకు గతంలో జరిగిన, భవిష్యత్తులో జరగబోయే సంఘటనల గురించి వివరించారు.

ఆయన మాటలు అతి ఎక్కువగా తెలిసినవాడే మాలో అందరికంటే బాగా తెలిసినవాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఫితన్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

భవిష్యత్తులో జరగబోయే సంఘటనలంటే ప్రళయానికి ముందు జరగబోయే ముఖ్య సంఘటనలన్నమాట. వీటినే "అలామాతె ఖియామత్" (ప్రళయ చిహ్నాలు) అంటారు.

١٨٦٤ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ النَّبِيُّ ﷺ: «مَنْ نَذَرَ أَنْ يُطِيعَ اللهَ فَلْيُطِعْهُ، وَمَنْ نَذَرَ أَنْ يَعْصِيَ اللهَ، فَلَا يَعْصِهِ» رَوَاهُ البُخَارِي.

1864. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఎవడయితే తాను అల్లాహ్‌కు విధేయత చూపుతానని మొక్కుబడి చేసుకుంటాడో అతను (ఆ మొక్కుబడిని నెరవేర్చాలి) అల్లాహ్‌కు విధేయత చూపాలి. మరెవడైతే తాను అల్లాహ్ పట్ల అవిధేయతకు పాల్పడ తానని మొక్కుబడి చేసుకుంటాడో అతను అల్లాహ్ పట్ల అవిధేయతకు పాల్పడరాదు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని విశ్వాసాల ప్రకరణం)

١٨٦٥ ـ وَعَنْ أُمِّ شَرِيكٍ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ رَسُولَ اللهِ ﷺ أَمَرَهَا بِقَتْلِ الأَوْزَاغِ، وَقَالَ: «كَانَ يَنْفُخُ عَلَى إِبْرَاهِيمَ» مُتَّفَقٌ عَلَيْهِ.

1865. దైవప్రవక్త (సల్లం) తనను బల్లులను చంపమని ఆదేశించారనీ, ఇవి హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్) విసరివేయబడిన మంటలను ఊదాయని ఆయన తనకు చెప్పారని హజ్రత్ ఉమ్మె షరీక్ (రజి.అన్హా) తెలియజేశారు. (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)

١٨٦٦ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ قَتَلَ وَزَغَةً فِي أَوَّلِ ضَرْبَةٍ، فَلَهُ كَذَا وَكَذَا حَسَنَةً، وَمَنْ قَتَلَهَا فِي الضَّرْبَةِ الثَّانِيَةِ، فَلَهُ كَذَا وَكَذَا حَسَنَةً دُونَ الأُولَى، وَإِنْ قَتَلَهَا فِي الضَّرْبَةِ الثَّالِثَةِ، فَلَهُ كَذَا وَكَذَا حَسَنَةً».

وفي رِوَايةٍ: «مَن قَتَلَ وَزَغاً في أَوَّلِ ضَرْبَةٍ، كُتِبَ لَهُ مائةُ حَسَنَةٍ، وَفي الثَّانِيَةِ دُونَ ذٰلِكَ، وَفي الثَّالِثَةِ دُونَ ذٰلِكَ». رواهُ مسلم. قَالَ أَهْلُ اللُّغَةِ: الْوَزَغُ: الْعِظَامُ مِنْ سَامِّ أَبْرَصَ.

1866. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఎవడైతే బల్లిని ఒకే ఒక దెబ్బతో చంపేస్తాడో అతనికి ఇన్ని పుణ్యాలు లభిస్తాయనీ, మరెవడయితే దాన్ని రెండు దెబ్బల్లో చంపుతాడో అతనికి మొదటి వ్యక్తి కన్నా తక్కువగా ఇన్ని పుణ్యాలు లభిస్తాయనీ, మరెవడయితే దాన్ని మూడవ దెబ్బతో చంపేస్తాడో అతనికి ఇన్ని పుణ్యాలు లభిస్తాయని దైవప్రవక్త (సల్లం) చెప్పారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: బల్లిని ఒకే ఒక దెబ్బలో చంపేసిన వ్యక్తి (కర్మల జాబితాలో) వంద పుణ్యాలు రాయబడతాయి. రెండు దెబ్బల్లో చంపేవాడి జాబితాలో వాటికంటే తక్కువ పుణ్యాలు, మూడు దెబ్బల్లో చంపేవారికి అంతకంటే తక్కువ పుణ్యాలు రాయబడతాయి. (ముస్లిం)

భాషావేత్తలు 'వజ్వున్' అనేది హానికర జంతువుల్లో ఒక పెద్ద జంతువని చెప్పారు. (సామ్ అబ్రస్ కూడా ఒక రకమైన హానికర జంతువే)

*(సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

١٨٦٧ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «قَالَ رَجُلٌ لَأَتَصَدَّقَنَّ بِصَدَقَةٍ، فَخَرَجَ بِصَدَقَتِه، فَوَضَعَهَا فِي يَدِ سَارِقٍ، فَأَصْبَحُوا

1867. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు: ఒకతను తానీరోజు రాత్రి దానం చేస్తానని నిశ్చయించుకొని ఇంటినుంచి బయలుదేరాడు. అయితే

يَتَحَدَّثُونَ: تُصُدِّقَ عَلَى سَارِقٍ! فَقَالَ: اللَّهُمَّ! لَكَ الْحَمْدُ لَأَتَصَدَّقَنَّ بِصَدَقَةٍ، فَخَرَجَ بِصَدَقَتِهِ، فَوَضَعَهَا فِي يَدِ زَانِيَةٍ، فَأَصْبَحُوا يَتَحَدَّثُونَ: تُصُدِّقَ اللَّيْلَةَ عَلَى زَانِيَةٍ! فَقَالَ: اللَّهُمَّ! لَكَ الْحَمْدُ عَلَى زَانِيَةٍ؟! لَأَتَصَدَّقَنَّ بِصَدَقَةٍ فَخَرَجَ بِصَدَقَتِهِ، فَوَضَعَهَا فِي يَدِ غَنِيٍّ، فَأَصْبَحُوا يَتَحَدَّثُونَ تُصُدِّقَ عَلَى غَنِيٍّ! فَقَالَ: اللَّهُمَّ! لَكَ الْحَمْدُ عَلَى سَارِقٍ، وَعَلَى زَانِيَةٍ، وَعَلَى غَنِيٍّ! فَأُتِيَ فَقِيلَ لَهُ: أَمَّا صَدَقَتُكَ عَلَى سَارِقٍ، فَلَعَلَّهُ أَنْ يَسْتَعِفَّ عَنْ سَرِقَتِهِ، وَأَمَّا الزَّانِيَةُ فَلَعَلَّهَا تَسْتَعِفُّ عَنْ زِنَاهَا، وَأَمَّا الْغَنِيُّ فَلَعَلَّهُ أَنْ يَعْتَبِرَ، فَيُنْفِقَ مِمَّا آتَاهُ اللهُ» رَوَاهُ الْبُخَارِيُّ بلفظِهِ، وَمُسْلِمٌ بِمَعْنَاهُ.

అతను (తెలియక) ఆ సొమ్ము ఒక దొంగకు ఇచ్చాడు. మరునాడు ఉదయం జనం రాత్రి ఒక వ్యక్తి ఒక దొంగకు దానం చేశాడని చెప్పుకో సాగారు. ఆ విషయం తెలుసుకొని అతను, "అల్లాహ్! నీకు కృతజ్ఞతలు" అన్నాడు. తర్వాత అతను తాను ఈ రోజు (రాత్రి) మళ్ళీ దానం చేస్తానని నిశ్చయించుకొని ఇంటి నుంచి బయలుదేరాడు. కాని (ఆ రోజు రాత్రి కూడా) అతను ఆ దానం ఒక వ్యభిచారిణి చేతికిచ్చాడు. మరునాడు ఉదయం జనంలో మళ్ళీ - రాత్రి ఒకతను వ్యభిచారిణికి దానం చేశాడని గుసగుసలు మొదలయ్యాయి. అది తెలుసుకొని ఆ వ్యక్తి, "అల్లాహ్! నీకు కృతజ్ఞతలు. నా దానం వ్యభిచారిణి చేతికి చిక్కింది. నేను ఈ రోజు రాత్రి మళ్ళీ దానం చేస్తాను" అని అనుకొని ఇంటినుంచి బయలుదేరాడు. అయితే (ఆ రోజు కూడా) అతను ఆ దానం ఒక ధనికుడి చేతిలో పెట్టాడు.

మర్నాడు ఉదయం జనం గతరాత్రి ఒక ధనికుడికి దానం ఇవ్వబడిందని మళ్ళీ గుసగుసలాడుకున్నారు. ఆ విషయం తెలుసుకొని అతను "అల్లాహ్ నీకు కృతజ్ఞతలు. (ఏమిటీ ఇలా జరిగింది!) నేను ఒకసారి దొంగకు, మరొకసారి వ్యభిచారిణికి దానం చేశాను. ఇప్పు

డేమో నా దానం ఒక ధనికుని చేతికం దింది" అని అనుకొని (నిద్ర పోయాడు). ఆ రాత్రి అతనికి కలలో ఒక వ్యక్తి కనిపించి ఇలా చెప్పాడు:

"(నీ దానం వృధా కాలేదు), నువ్వు దొంగకు చేసిన దానం వల్ల ఆ దొంగ దొంగతనం చేయటం మానేయవచ్చు. వ్యభిచారిణికి చేసిన దానంవల్ల ఆమె తౌబా చేసుకొని (మంచి మనిషిగా) మారవచ్చు. అలాగే ధనికుడికి లభించిన దానంవల్ల, ఆ ధనికుడు కూడా బుద్ధితెచ్చుకొని దేవుడు తనకు ప్రసాదించిన ధనంలో కొంతభాగం దైవ మార్గంలో ఖర్చుపెట్టవచ్చు."

బుఖారీలో ఈఉల్లేఖనం పై వాక్యాలతో ఉల్లేఖించబడింది. ముస్లింలో ఇలాంటి అర్థమే కలిగిన ఒక ఉల్లేఖనం ఉంది.

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

దానధర్మాలు చేసేవాడి ఉద్దేశ్యం, సంకల్పం బాగుంటే పొరపాటు వల్ల ఆ దానాలు అనర్హులకు లభించినప్పటికీ దైవసమక్షంలో అవి స్వీకృతికి నోచుకుంటాయి. దైవం తలిస్తే ఆ దానాలతోనే ఆ అనర్హుల్లో మంచిని పుట్టించగలడు. ఈ సంఘటన పూర్వపు సమాజాల్లో ఎవరిదైనా అయి ఉంటుంది.

1868. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన మరొక కథనం: ఒక విందు భోజనంలో మేము దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాం. ఒక (మేక) ముందరి కాళ్ళ మాంసం ఆయనకు సమర్పించ

١٨٦٨ ـ وَعَنْهُ قَالَ: كُنَّا مَعَ رَسُولِ اللهِ ﷺ فِي دَعْوَةٍ، فَرُفِعَ إِلَيْهِ الذِّرَاعُ، وَكَانَتْ تُعْجِبُهُ، فَنَهَسَ مِنْهَا نَهْسَةً وَقَالَ: «أَنَا سَيِّدُ النَّاسِ يَوْمَ الْقِيَامَةِ، هَلْ

تَـدْرُونَ مِـمَّ ذَاكَ؟ يَجْمَـعُ اللهُ الأَوَّلِيـنَ وَالآخِرِينَ فِي صَعِيدٍ وَاحِدٍ، فَيُبْصِرُهُمُ النَّاظِرُ، وَيُسْمِعُهُمُ الدَّاعِي، وَتَدْنُو مِنْهُمُ الشَّمْسُ، فَيَبْلُغُ النَّاسَ مِنَ الغَمِّ وَالْكَرْبِ مَـا لَا يُطِيقُـونَ وَلَا يَحْتَمِلُـونَ، فَيَقُـولُ النَّاسُ: أَلَا تَرَوْنَ إِلَى مَا أَنْتُمْ فِيهِ إِلَى مَا بَلَغَكُمْ، أَلَا تَنْظُرُونَ مَنْ يَشْفَعُ لَكُمْ إِلَى رَبِّكُمْ؟ فَيَقُولُ بَعْضُ النَّاسِ لِبَعْضٍ: أَبُوكُمْ آدَمُ، وَيَأْتُونَهُ فَيَقُولُونَ: يَاآدَمُ! أَنْتَ أَبُو الْبَشَرِ، خَلَقَكَ اللهُ بِيَدِهِ، وَنَفَخَ فِيكَ مِنْ

బడింది. ఆయనకు ముందరికాళ్ళ మాంసం అంటే ఎంతో ఇష్టం. అందులో నుంచి ఆయన తన పళ్ళతో కొద్దిగా కొరుక్కొని ఇలా చెప్పటం ప్రారంభించారు:

ప్రళయదినాన నేను మానవులందరికీ నాయకునిగా ఉంటాను. అలా ఎందుకు జరుగుతుందో మీకు తెలుసా? భూత భవిష్యత్ వర్తమాన కాలాల మానవులందర్నీ అల్లాహ్ ఒకే మైదానంలో సమీకరిస్తాడు. అక్కడ చూసేవాడు అందరినీ చూడగల్గు తాడు. పిలిచేవాని పిలుపుని అందరూ వినగల్గుతారు. సూర్యుడు వారికి అతి సమీపానికి వస్తాడు. దానివల్ల మాన వుల పరిస్థితి అత్యంత దుర్భరంగా, తీవ్రమైన ఆందోళనకరంగా తయారవు తుంది.

ఆ స్థితిలో వారు పరస్పరం మాట్లాడు కుంటూ, 'మనం ఎలాంటి ఆపదలో చిక్కుకున్నామో గమనించారా? మనల్ని గురించి మన ప్రభువు దగ్గర సిఫారసు చేసే వారెవరైనా దొరుకుతారేమో వెతు కుదాం పదండి' అంటారు. ఆ తర్వాత వారు పరస్పరం సంప్రదించుకొని ఆదం ప్రవక్తను అందుకు అర్హులుగా భావించి ఆయన దగ్గరికి వెళ్ళాలని నిశ్చయించుకుంటారు.

رُوحِهِ، وَأَمَرَ الْمَلَائِكَةَ، فَسَجَدُوا لَكَ وَأَسْكَنَكَ الْجَنَّةَ، أَلَا تَشْفَعُ لَنَا إِلَى رَبِّكَ؟ أَلَا تَرَى مَا نَحْنُ فِيهِ، وَمَا بَلَغَنَا؟ فَقَالَ: إِنَّ رَبِّي غَضِبَ غَضَباً لَمْ يَغْضَبْ قَبْلَهُ مِثْلَهُ، وَلَا يَغْضَبُ بَعْدَهُ مِثْلَهُ، وَإِنَّهُ نَهَانِي عَنِ الشَّجَرَةِ، فَعَصَيْتُ، نَفْسِي نَفْسِي نَفْسِي، اذْهَبُوا إِلَى غَيْرِي، اذْهَبُوا إِلَى نُوحٍ. فَيَأْتُونَ نُوحاً فَيَقُولُونَ: يَا نُوحُ! أَنْتَ أَوَّلُ الرُّسُلِ إِلَى أَهْلِ الْأَرْضِ، وَقَدْ سَمَّاكَ اللهُ عَبْداً شَكُوراً، أَلَا تَرَى إِلَى مَا نَحْنُ فِيهِ، أَلَا تَرَى إِلَى مَا بَلَغَنَا، أَلَا تَشْفَعُ لَنَا إِلَى رَبِّكَ؟ فَيَقُولُ: إِنَّ رَبِّي غَضِبَ الْيَوْمَ غَضَباً لَمْ يَغْضَبْ قَبْلَهُ مِثْلَهُ،

అందరూ ఆదం ప్రవక్త దగ్గరికి వెళ్ళి, "ఆదం! మీరు మానవులందరికీ తండ్రి. అల్లాహ్ మిమ్మల్ని తన స్వహస్తాలతో తయారుచేసి, మీ దేహంలో తన ఆత్మను ఊదాడు. అంతేగాక తన దూతలందర్నీ మీ ముందు మోకరిల్లమని ఆదేశించాడు. వారందరూ మీకు సజ్దా చేశారు. ఆయన మిమ్మల్ని స్వర్గంలో వసింప జేశాడు. అలాంటి మీరు మా గురించి మన ప్రభువుకు సిఫారసు చేయరా? మా పరిస్థితి చూడండి, మేమెలాంటి ఆపదలో చిక్కుకున్నామో" అని అంటారు.

దానికి ఆదం అలైహిస్సలామ్, "నిజం చెబుతున్నాను. ఈ రోజు నా ప్రభువు ఇది వరకు ఎన్నడూ లేనంత కోపంలో ఉన్నాడు. ఇకముందు కూడా ఇంత కోపంగా ఉండడు. ఆయన నన్ను ఒక ప్రత్యేక చెట్టు దగ్గరికి వెళ్ళకూడదని ఆజ్ఞాపించాడు. కాని నా వల్ల ఆజ్ఞో ల్లంఘన జరిగిపోయింది. నేనిప్పుడు స్వయంగా నా పరిస్థితి పట్ల ఆందోళన పడుతున్నాను. అందువల్ల మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. హజ్రత్ నూహ్ దగ్గరకు వెళ్ళండి" అని అంటారు.

అప్పుడు మానవులంతా హజ్రత్ నూహ్ దగ్గరకు వెళ్ళి, "నూహ్! ప్రపంచ

، وَلَنْ يَغْضَبَ بَعْدَهُ مِثْلَهُ، وَإِنَّهُ قَدْ كَانَتْ لِي دَعْوَةٌ دَعَوْتُ بِهَا عَلَى قَوْمِي، نَفْسِي نَفْسِي نَفْسِي، اذْهَبُوا إِلَى غَيْرِي، اذْهَبُوا إِلَى إِبْرَاهِيمَ. فَيَأْتُونَ إِبْرَاهِيمَ فَيَقُولُونَ: يَا إِبْرَاهِيمُ! أَنتَ نَبِيُّ اللهِ وَخَلِيلُهُ مِنْ أَهْلِ الأَرْضِ، اشْفَعْ لَنَا إِلَى رَبِّكَ، أَلَا تَرَى إِلَى مَا نَحْنُ فِيهِ؟ فَيَقُولُ لَهُمْ: إِنَّ رَبِّي قَدْ غَضِبَ الْيَوْمَ غَضَباً لَمْ يَغْضَبْ قَبْلَهُ مِثْلَهُ، وَلَنْ يَغْضَبَ بَعْدَهُ مِثْلَهُ، وَإِنِّي كُنْتُ كَذَبْتُ ثَلَاثَ كَذِبَاتٍ، نَفْسِي نَفْسِي نَفْسِي، اذْهَبُوا إِلَى غَيْرِي، اذْهَبُوا إِلَى مُوسَى فَيَأْتُونَ مُوسَى. فَيَقُولُونَ: يَامُوسَى! أَنْتَ رَسُولُ اللهِ، فَضَّلَكَ اللهُ بِرِسَالَتِهِ وَبِكَلَامِهِ عَلَى النَّاسِ، اشْفَعْ لَنَا إِلَى رَبِّكَ، أَلَاتَرَى إِلَى مَا نَحْنُ فِيهِ؟ فَيَقُولُ: إِنَّ رَبِّي قَدْ غَضِبَ الْيَوْمَ غَضَباً لَمْ يَغْضَبْ قَبْلَهُ مِثْلَهُ، وَلَنْ يَغْضَبَ بَعْدَهُ مِثْلَهُ، وَإِنِّي قَدْ قَتَلْتُ نَفْساً لَمْ أُومَرْ بِقَتْلِهَا، نَفْسِي

మానవుల దగ్గరికి పంపబడిన మొట్ట మొదటి దైవసందేశహరులు మీరు. దేవుడు మీకు కృతజ్ఞుడైన దాసుడని బిరుదు ఇచ్చాడు. మేమెలా ఆపదలో పడిపోయామో చూస్తున్నారు కదా మీరు? అందువల్ల మీరు (దయచేసి) దేవుని సన్నిధిలో మా గురించి కాస్త సిఫారసు చేయరూ?" అని అడుగు తారు.

దానికి హజ్రత్ నూహ్, "ఈ రోజు నా ప్రభువు ఇది వరకెన్నడూ లేనంత కోపంలో ఉన్నాడు. ఇకముందు కూడా ఇంత కోపంగా ఉండడు. నాకు ఒక దుఆ చేసుకునే హక్కు ఉండగా నేను దాన్ని నా జాతి ప్రజల్ని శపించటానికి ఉపయోగించాను. దానిమూలంగా నేను ఇప్పుడు స్వయంగా నా పరిస్థితి ఏమవుతుందోనని తల్లడిల్లుతున్నాను. అందుకని మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. ఇబ్రాహీమ్ ప్రవక్త దగ్గరకు వెళ్ళండి" అని సలహా ఇస్తారు.

జనం ఇబ్రాహీమ్ (అలైహి) దగ్గరకు వెళ్తారు. ఆయనతో, "ఇబ్రాహీమ్! మీరు దేవుని ప్రవక్త. ప్రపంచ మానవులందరిలో (ప్రత్యేకంగా) ఎన్నుకో బడ్డవారు. అల్లాహ్‌కు స్నేహితులు. కనుక మీరు దయచేసి మా గురించి అల్లాహ్‌కు సిఫారసు చేయండి. మా

نَفْسِي نَفْسِي، اذْهَبُوا إِلَى غَيْرِي، اذْهَبُوا إِلَى عِيسَى. فَيَأْتُونَ عِيسَى، فَيَقُولُونَ: يَا عِيسَى أَنْتَ رَسُولُ اللهِ وَكَلِمَتُهُ أَلْقَاهَا إِلَى مَرْيَمَ وَرُوحٌ مِنْهُ، وَكَلَّمْتَ النَّاسَ فِي الْمَهْدِ، اشْفَعْ لَنَا إِلَى رَبِّكَ، أَلَا تَرَى إِلَى مَا نَحْنُ فِيهِ؟ فَيَقُولُ عِيسَى: إِنَّ رَبِّي قَدْ غَضِبَ الْيَوْمَ غَضَباً لَمْ يَغْضَبْ قَبْلَهُ مِثْلَهُ، وَلَنْ يَغْضَبَ بَعْدَهُ

పరిస్థితి చూడండి. మేమెలా ఆపదలో చిక్కుకొని ఉన్నామో?" అని అంటారు.

అందుకు ఇబ్రాహీమ్ ప్రవక్త "ఈ రోజు నా ప్రభువు క్రితం ఎన్నడూ లేనంత కోపంగా ఉన్నాడు. ఇకముందు కూడా ఇంత కోపంగా ఉండడు. నేను మూడు సందర్భాలలో అబద్ధమాడాను. (అవి ధర్మావసరం నిమిత్తం చెప్పిన అబద్ధాలే గాని) వాటి మూలంగా నన్ను నిలదీయటం జరుగుతుందేమోనని నేను భయపడుతున్నాను. ఏమైనా నేనిప్పుడు స్వయంగా నా పరిస్థితి ఏమవుతుందోనని ఆందోళన పడు తున్నాను. అందుచేత మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. మూసా దగ్గరకు వెళ్ళండి" అని అంటారు.

అప్పుడు జనం మూసా ప్రవక్త దగ్గరికి వెళ్తారు. ఆయనతో, "మూసా! మీరు అల్లాహ్ సందేశహరులు. అల్లాహ్ మీతో ప్రత్యక్షంగా సంభాషించి, మిమ్మల్ని ప్రత్యేక ప్రవక్తగా నియమించాడు. పైగా మీకు మానవుల్లోకెల్లా అత్యధిక గౌరవోన్నతులను ప్రసాదించాడు. అందువల్ల మీరు (దయచేసి) మా గురించి అల్లాహ్ దగ్గర సిఫారసు చేయండి. మా పరిస్థితి చూడండి. మేమెలా ఆపదలో పడి సతమత మవుతున్నామో!" అని అంటారు.

مِثْلَهُ، وَلَمْ يَذْكُرْ ذَنْبًا، نَفْسِي نَفْسِي نَفْسِي، اذْهَبُوا إِلَى غَيْرِي، اذْهَبُوا إِلَى مُحَمَّدٍ ﷺ».
وفي رواية: «فَيَأْتُونِي فَيَقُولُونَ: يَا مُحَمَّدُ! أَنْتَ رَسُولُ اللهِ، وَخَاتَمُ الأَنْبِيَاءِ، وَقَدْ غَفَرَ اللهُ لَكَ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِكَ وَمَا تَأَخَّرَ، اشْفَعْ لَنَا إِلَى رَبِّكَ، أَلَا تَرَى إِلَى مَا نَحْنُ فِيهِ؟

అందుకు మూసా ఇలా సమాధాన మిస్తారు: "ఈ రోజు నా ప్రభువు ఇదివరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడై ఉన్నాడు, ఇకముందు కూడా ఎన్నడూ ఇంత ఉగ్రుడైపోడు. అల్లాహ్ తరఫు నుంచి నాకెలాంటి ఆజ్ఞ లేకపోయినా నావల్ల ఒక ప్రాణిహత్య జరిగింది. దాని కారణంగా నేను ఇప్పుడు స్వయంగా నా పరిస్థితి ఏమవుతుందోనని ఆందోళన పడుతున్నాను. అందువల్ల మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. ఈసా ప్రవక్త దగ్గరకు వెళ్ళండి.

జనం ఈసా అలైహిస్సలామ్ దగ్గరికి వెళ్తారు. ఆయనతో, "ఈసా! మీరు దైవప్రవక్త. దైవవచనం కూడా. దేవుడు దాన్ని మర్యమ్ వైపు వదిలాడు. మీరు దేవుని ఆత్మ కూడా. మీరు శైశవదశ లోనే జనంతో మాట్లాడారు. కనుక మీరు మా గురించి కాస్త దేవునికి సిఫారసు చేయండి. చూస్తున్నారు కదా మా పరిస్థితి, మేమెలా ఆపదలో పడి సతమతమవుతున్నామో?" అని అంటారు.

దానికి ఈసా అలైహిస్సలామ్, "ఈ రోజు నా ప్రభువు ఇదివరకెన్నడూ లేనంత ఆగ్రహోదగ్రుడై ఉన్నాడు. ఇకముందు కూడా ఇంత ఉగ్రుడైపోడు అని అంటారు. (హజ్రత్ ఈసా తానేదయినా

فَأَنْطَلِقُ، فَآتِي تَحْتَ الْعَرْشِ، فَأَقَعُ سَاجِداً لِرَبِّي، ثُمَّ يَفْتَحُ اللهُ عَلَيَّ مِنْ مَحَامِدِهِ، وَحُسْنِ الثَّنَاءِ عَلَيْهِ شَيْئاً لَمْ يَفْتَحْهُ عَلَى أَحَدٍ قَبْلِي ثُمَّ يُقَالُ: يَا مُحَمَّدُ ارْفَعْ رَأْسَكَ، سَلْ تُعْطَهْ، وَاشْفَعْ تُشَفَّعْ، فَأَرْفَعُ رَأْسِي، فَأَقُولُ: أُمَّتِي يَا رَبِّ! أُمَّتِي يَارَبِّ! فَيُقَالُ: يَا مُحَمَّدُ!

తప్పు చేసినట్లు ఇక్కడ ఎలాంటి ప్రస్తావన చేయరు.) ఇప్పుడు నా పరిస్థితి ఏమవుతుందోనని నేను భయ పడిపోతున్నాను. మీరు మరొకరి దగ్గరకు వెళ్ళండి. ముహమ్మద్ (సల్లం) దగ్గరికి వెళ్ళండి" అని చెబుతారు.

మరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: అప్పుడు జనం నా దగ్గరికి వస్తారు. నాతో ఇలా అంటారు: "ముహమ్మద్ (సల్లం)! మీరు అల్లాహ్ సందేశ హరులు. అంతిమ దైవప్రవక్త. అల్లాహ్ మీ వెనుకటి, ముందటి- తప్పులన్నీ క్షమించేశాడు. కనుక (దయచేసి) మీరు మా గురించి అల్లాహ్‌కు సిఫారసు చేయండి. చూస్తున్నారు కదా మా పరిస్థితి, మేమెలా ఆపదలో చిక్కు కొని సతమతమవుతున్నామో?"

అప్పుడు నేను దైవసింహాసనం దగ్గరకు చేరుకుంటాను. అక్కడ నా ప్రభువు ముందు సాష్టాంగపడతాను. దేవుడు తన స్తోత్రం కోసం కొన్ని విశేష వచ నాలు నా మనసులో నాటుతాడు. ఇలాంటి విశేష వచనాలు అదివర కెన్నడూ ఎవరికీ నేర్పి ఉండడు. ఆ తర్వాత అల్లాహ్ నన్ను సంబోధిస్తూ, "ముహ మ్మద్! తలపైకెత్తండి. మీరు అడగ దలచుకున్నదేమిటో అడగండి.

أَدْخِلْ مِنْ أُمَّتِكَ مَنْ لَا حِسَابَ عَلَيْهِمْ مِنَ الْبَابِ الأَيْمَنِ مِنْ أَبْوَابِ الْجَنَّةِ وَهُمْ شُرَكَاءُ النَّاسِ فِيمَا سِوَى ذٰلِكَ مِنَ الأَبْوَابِ» ثُمَّ قَالَ: «وَالَّذِي نَفْسِي بِيَدِهِ إِنَّ ما بَيْنَ المصراعَيْنِ مِنْ مَصَارِيعِ الْجَنَّةِ كَمَا بَيْنَ مَكَّةَ وَهَجَرَ، أَوْ كَمَا بَيْنَ مَكَّةَ وَبُصْرَى» متفقٌ عليه.

మీ కోరిక తీరుస్తాను. ఏదైనా సిఫారసు చెయ్యాలనుకుంటే చెయ్యండి, నేను మీ సిఫారసును ఆమోదిస్తాను" అని అంటాడు.

అప్పుడు నేను తలపైకెత్తి, "ప్రభూ! నా అనుచర సమాజం మీద దయజూపు. ప్రభూ! నా అనుచర సమాజం మీద దయజూపు. ప్రభూ! నా అనుచర సమాజం మీద దయజూపు" అని అంటాను. దానికి అల్లాహ్, "ముహమ్మద్! వెళ్ళండి. వెళ్ళి మీ అనుచర సమాజంలోని న్యాయ విచారణ పరిధి నుంచి మినహాయించ బడిన వారినందరినీ కుడివైపు ద్వారం గుండా స్వర్గంలోనికి తీసుకెళ్ళండి. వారు ఇతర ద్వారాల గుండా కూడా వెళ్ళవచ్చు" అని అంటాడు.

ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "నా ప్రాణం ఎవరి ఆధీనంలో ఉందో ఆ మహోన్నత శక్తి సాక్షి! మక్కా హజర్‌ల మధ్య లేక మక్కా-బస్రాల మధ్య ఎంత దూరం ఉంటుందో స్వర్గంలోని ఒక ద్వారం వెడల్పు అంత దూరం ఉంటుంది."

(బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) 'హజర్' అనేది బహ్రైన్‌లోని ఒక పట్టణం పేరు. బుస్రా, డెమాస్కస్‌లో దక్షిణ దిశలో ఉన్న ఒక బస్తీ. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే స్వర్గానికి ఉండే ద్వారం - ఒక చివర నుంచి మరొక చివరి వరకు వేలాది మైళ్ళ దూరమంత విశాలంగా ఉంటుంది. ఈ హదీసులో దైవప్రవక్త(సల్లం) గారి ఘనతా విశిష్ఠతలు వివరించబడ్డాయి. ప్రళయ దినాన గొప్పగొప్ప ప్రవక్తలకు కూడా దైవసమక్షంలో సిఫారసు చేయటానికి ధైర్యం చాలదు. అలాంటి పరిస్థితుల్లో ముహమ్మద్ (సల్లం) దైవాజ్ఞ మేరకు సిఫారసు చేస్తారు. మొదటగా మానవులను హష్ర్ మైదానపు కష్టాల నుంచి కాపాడటానికి కర్మల విచారణ ప్రారంభించమని సిఫారసు చేస్తారు. ఉల్లేఖనంలోని ఈ భాగం సదరు హదీసులో పేర్కొనబడలేదు. ఇతర హదీసుల్లో దీని ప్రస్తావన ఉంది. రెండో సిఫారసు తన అనుచర సమాజం కోసం చేస్తారు. ఈ సిఫారసు వివిధ దశల్లో సాగుతుంది. సదరు హదీసులో మొదటి దశ గురించి చెప్పబడింది. ఈ దశలో ఆయన సిఫారసు మేరకు అల్లాహ్ విచారణ ఉండనివారిని స్వర్గంలోకి తీసుకువెళ్ళటానికి అనుమతిని ప్రసాదిస్తాడు. ఆ తర్వాత పాపాత్ములైన విశ్వాసులు నరకంలో తమ పాపాలకు తగిన శిక్ష అనుభవించటం పూర్తయినప్పుడు ఆయనగారి రెండవ దశ సిఫారసు జరుగుతుంది. ఆయన సిఫారసుతో వారిని నరకం నుంచి తీసి స్వర్గంలోకి ప్రవేశింపజేయటం జరుగుతుంది.

2) ఇందులో దైవప్రవక్తలు తమ వల్ల జరిగిన కొన్ని పొరపాట్లను ప్రస్తావించి దైవ సమక్షంలో సిఫారసు చేయటానికి వెనుకాడతారని చెప్పబడింది. వారు ఆ విధంగా వెనుకాడ టానికి కారణమేమిటంటే- దైవప్రవక్తలు విశ్వాసం, దైవభీతి పరంగా అత్యున్నత స్థానంలో ఉంటారు. ఆ స్థాయిలో వారికి చిన్నచిన్న పొరపాట్లే పెద్దపెద్ద తప్పులుగా గోచరిస్తాయి. నిజానికి ఆ పనుల్లో పాపపు ఛాయలు కూడా ఉండవు. తెల్లని బట్ట మీద ఓ చిన్న మరక కూడా కొట్టొచ్చినట్లు కానవస్తూ ఉంటుంది. దైవప్రవక్తల పరిస్థితి కూడా అలాంటిదే. వారు తాము చేసిన చిన్న చిన్న పొరపాట్లను తలచుకొని దైవసమక్షంలో సిఫారసు చేయటానికి తమల్ని తాము అనర్హులుగా భావిస్తారు.

3) ముఖ్యంగా ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ మూడు సందర్భాల్లో అసత్యం పలికారని చెప్పబడింది. నిజానికి అవి అసత్యాలు కావు. మహా అయితే వాటిని వాస్తవ విరుద్ధ పలుకులని చెప్పవచ్చు. పైకి అవి అబద్ధాలుగా కనబడతాయి. కాని నిజానికి వాటిలో ఎలాంటి అబద్ధమూ ఉండదు. ఆయన చెప్పిన అబద్ధాలలో ఒకటి తాను అనారోగ్యంతో ఉన్నానని చెప్పటం. రెండోది: విగ్రహాల గురించి- "అవే ఈ పని చేశాయి, కావాలంటే వాటినే అడగండి" అని అనటం. మూడోది: భార్యను చెల్లిగా పరిచయం చేయటం. మొదటి మాటను ఏ విధంగానూ అబద్ధంగా లెక్క గట్టలేము. ఎందుకంటే ఆయన తాను అనారోగ్యంతో ఉన్నానని చెప్పారంటే నిజంగానే ఆయన ఆ సమయంలో అనారోగ్యంతో ఉండవచ్చు లేక జాతరకు రమ్మని తన జాతిప్రజలు ఇచ్చిన ఆహ్వానం తన మనసును బాధపెట్టి ఉండవచ్చు. రెండోది: పెద్ద విగ్రహం చిన్న విగ్రహాలను ధ్వంసం చేసిందని చెప్పటంలో ఆయన ఉద్దేశ్యం, వారిముందు విగ్రహాల అశక్తత, నిస్సహాయతను వ్యక్తం చేయటం, ఇంకా వారికి దేవుడు ఒక్కడేనన్న సత్యం బోధించటమేగాని

కావాలని అబద్ధం చెప్పటం కాదు. అలాగే గత్యంతరం లేని పరిస్థితుల్లో భార్యను చెల్లిగా చెప్పుకోవటం కూడా అబద్ధం కాదు. ఎందుకంటే ప్రతి ముస్లిం పురుషుడు తోటి ముస్లిం పురుషునికి సోదరుని లాంటివాడు. ముస్లిం స్త్రీ తోటి ముస్లిం పురుషునికి సోదరితో సమానం. పైకి ఈ సంఘటనలు వాస్తవ విరుద్ధంగా కనిపిస్తున్నాయి. కనుక వీటిని అబద్ధాలు అని చెప్పటం జరిగింది. నిజానికి వాస్తవ దృష్టితో చూస్తే అవి అబద్ధాలేకావు. 'తౌరియా'లో ఒక రూపం. అవసర పరిస్థితుల్లో తౌరియా చేయటం ధర్మసమ్మతమే. (మరిన్ని వివరాలకు చూడండి 'అహ్సనుల్ బయాన్" వ్యాఖ్యానం, అంబియా సూరా, 63వ సూక్తికి పాదసూచిక).

١٨٦٩ - وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: جَاءَ إِبْرَاهِيمُ ﷺ بِأُمِّ إِسْمَاعِيلَ وَبِابْنِهَا إِسْمَاعِيلَ وَهِيَ تُرْضِعُهُ حَتَّى وَضَعَهَا عِنْدَ الْبَيْتِ عِنْدَ دَوْحَةٍ فَوْقَ زَمْزَمَ فِي أَعْلَى الْمَسْجِدِ وَلَيْسَ بِمَكَّةَ يَوْمَئِذٍ أَحَدٌ وَلَيْسَ بِهَا مَاءٌ، فَوَضَعَهُمَا هُنَاكَ، وَوَضَعَ عِنْدَهُمَا جِرَاباً فِيهِ تَمْرٌ، وَسِقَاءً فِيهِ مَاءٌ، ثُمَّ قَفَّى إِبْرَاهِيمُ مُنْطَلِقاً، فَتَبِعَتْهُ أُمُّ إِسْمَاعِيلَ فَقَالَتْ: يَاإِبْرَاهِيمُ! أَيْنَ تَذْهَبُ وَتَتْرُكُنَا بِهٰذَا الْوَادِي الَّذِي لَيْسَ فِيهِ أَنِيسٌ وَلَا شَيْءٌ؟ فَقَالَتْ لَهُ ذٰلِكَ مِرَاراً، وَجَعَلَ لَا يَلْتَفِتُ إِلَيْهَا، قَالَتْ لَهُ: آللهُ أَمَرَكَ بِهٰذَا؟ قَالَ: نَعَمْ. قَالَتْ: إِذاً لَا يُضَيِّعُنَا، ثُمَّ رَجَعَتْ فَانْطَلَقَ إِبْرَاهِيمُ ﷺ، حَتَّى إِذَا كَانَ عِنْدَ الثَّنِيَّةِ حَيْثُ لَا يَرَوْنَهُ، اسْتَقْبَلَ بِوَجْهِهِ الْبَيْتَ، ثُمَّ دَعَا بِهٰؤُلَاءِ الدَّعَوَاتِ، فَرَفَعَ يَدَيْهِ فَقَالَ: ﴿رَبَّنَآ إِنِّيٓ أَسْكَنتُ مِن ذُرِّيَّتِي بِوَادٍ غَيْرِ ذِي زَرْعٍ﴾ حَتَّى بَلَغَ ﴿يَشْكُرُونَ﴾ وَجَعَلَتْ أُمُّ

1869. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ ఇస్మాయీల్ తల్లిని, ఆమె కుమారుడు ఇస్మాయీల్‌ను ఇద్దరిని తీసుకొచ్చి దైవగృహం సమీపాన మస్జిదె హరామ్ ఎగువ భాగంలో జమ్‌జమ్ (బావి) దగ్గర ఉన్న ఒక చెట్టు దగ్గర దింపారు. అప్పుడు ఇస్మాయీల్ ఇంకా పాలుతాగే పసిపిల్లవాడు. ఆ కాలంలో మక్కాలో మనుషులెవరూ నివసించేవారుకారు. అక్కడ నీళ్లు కూడా దొరికేవి కావు. ఆయన తల్లీకొడుకులిద్దరినీ అక్కడ వదలిపెట్టారు. వారిదగ్గర ఒక ఖర్జూర పండ్ల సంచి, ఒక నీళ్ల తిత్తి ఉంచి ఆయన తిరుగు ప్రయాణమవుతుండగా ఇస్మాయీల్ తల్లి ఆయన వెనకాలే వెళ్ళి, "ఇబ్రాహీమ్! ఈ లోయలో మమ్మల్ని అడిగి చూసేవాడెవ్వడూ లేడు. కనీసం అవసరానికి కావలసిన వస్తువులు కూడా లేవు. ఇలాంటి చోట మమ్మల్ని (ఒంటరిగా) వదలిపెట్టి మీరు ఎక్కడికి వెళ్తున్నారు?" అని అడిగారు. ఈ ప్రశ్న ఆమె

إِسْمَاعِيلَ تُرْضِعُ إِسْمَاعِيلَ، وَتَشْرَبُ مِنْ ذٰلِكَ الْمَاءِ ، حَتَّى إِذَا نَفِدَ مَا فِي السِّقَاءِ، عَطِشَتْ، وَعَطِشَ ابْنُهَا، وَجَعَلَتْ تَنْظُرُ إِلَيْهِ يَتَلَوَّى ـ أَوْ قَالَ: يَتَلَبَّطُ ـ فَانْطَلَقَتْ كَرَاهِيَةَ أَنْ تَنْظُرَ إِلَيْهِ، فَوَجَدَتِ الصَّفَا أَقْرَبَ جَبَلٍ فِي الْأَرْضِ يَلِيهَا، فَقَامَتْ عَلَيْهِ، ثُمَّ اسْتَقْبَلَتِ الْوَادِيَ تَنْظُرُ هَلْ تَرَى أَحَداً؟ فَلَمْ تَرَ أَحَدًا فَهَبَطَتْ مِنَ الصَّفَا حَتَّى إِذَا بَلَغَتِ الْوَادِيَ، رَفَعَتْ طَرَفَ دِرْعِهَا، ثُمَّ سَعَتْ سَعْيَ الْإِنْسَانِ الْمَجْهُودِ حَتَّى جَاوَزَتِ الْوَادِيَ، ثُمَّ أَتَتِ الْمَرْوَةَ، فَقَامَتْ عَلَيْهَا، فَنَظَرَتْ هَلْ تَرَى أَحَداً؟ فَلَمْ تَرَ أَحَداً، فَفَعَلَتْ ذٰلِكَ سَبْعَ

ఆయన్ని అనేకసార్లు అడిగారు. కాని ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ ఆమె వంక చూడనయినా చూడలేదు. చివరికి హాజిరా స్వయంగా, "దేవుడు మిమ్మల్ని ఇలా చేయమని ఆదేశించాడా?" అని అడిగారు. ఆ మాటకు ఆయన 'అవును' అని (ముక్తసరిగా) సమాధాన మిచ్చారు. అందుకామె "అలాగయితే, ఆయన మమ్మల్ని నష్టపరచడు" అని చెప్పి తిరిగి తన స్థానానికి వెళ్ళి పోయారు.

ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ తిరుగు ప్రయాణమయ్యారు. సనియ్యా అనే చోటికి చేరుకున్న తర్వాత ఆయన తల్లీ బిడ్డలకు కనిపించకుండా పోయారు. అక్కడ ఆయన దైవగృహం వైపు తిరిగి రెండు చేతులూ పైకెత్తి ఇలా ప్రార్థిం చటం ప్రారంభించారు: "ప్రభూ! తృణ కాష్ఠ జలరహితమైన లోయలో నా సంతానంలో కొందరిని తెచ్చి నీ పవిత్ర గృహం వద్ద నివసింపజేశాను..... బహుశా వారు కృతజ్ఞులవుతారేమో." (వరకు). *(ఇబ్రాహీమ్ సూరా: 37)*

(అటు) ఇస్మాయీల్ తల్లి ఇస్మాయీల్‌కు పాలు త్రాపిస్తూ, నీళ్ళతిత్తిలో ఉన్న నీళ్లు త్రాపిస్తూ (ఆ ఎడారిలోనే ఒంటరిగా) ఉంటోంది. చివరికి నీళ్ళ తిత్తిలోని నీరు కూడా అయిపోయింది. దాంతో ఆమె ఎలాగో దాహానికి తట్టు

مَرَّاتٍ. قَالَ ابْنُ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا: قَالَ النَّبِيُّ ﷺ: «فَذٰلِكَ سَعْيُ النَّاسِ بَيْنَهُمَا» فَلَمَّا أَشْرَفَتْ عَلَى الْمَرْوَةِ سَمِعَتْ صَوْتاً، فَقَالَتْ: صَهْ - تُرِيدُ نَفْسَهَا - ثُمَّ تَسَمَّعَتْ، فَسَمِعَتْ أَيْضاً فَقَالَتْ: قَدْ أَسْمَعْتَ إِنْ كَانَ عِنْدَكَ غَوَاثٌ، فَإِذَا هِيَ بِالْمَلَكِ عِنْدَ مَوْضِعِ زَمْزَمَ، فَبَحَثَ بِعَقِبِهِ - أَوْ قَالَ بِجَنَاحِهِ - حَتَّى ظَهَرَ الْمَاءُ، فَجَعَلَتْ تُحَوِّضُهُ وَتَقُولُ بِيَدِهَا هٰكَذَا، وَجَعَلَتْ تَغْرِفُ الْمَاءَ فِي سِقَائِهَا وَهُوَ يَفُورُ بَعْدَ مَا تَغْرِفُ، وَفِي رِوَايَةٍ بِقَدْرِ مَا تَغْرِفُ. قَالَ ابْنُ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا: قَالَ النَّبِيُّ ﷺ: «رَحِمَ اللهُ أُمَّ إِسْمَاعِيلَ لَوْ تَرَكَتْ زَمْزَمَ - أَوْ قَالَ: لَوْ لَمْ تَغْرِفْ مِنَ

కొని ఉండగల్గుతోంది. కాని పిల్లవాడు కూడా దప్పికతో విలవిల్లాడిపోసాగాడు. నేల మీద అటూఇటూ పొర్లసాగాడు. మాతృహృదయం పిల్లవాడి బాధను చూసి తట్టుకోలేకపోయింది. ఆమె నీళ్లు వెతకటం ప్రారంభించారు. ఆ సమయంలో సఫా కొండ తనకు అతి సమీపంలో ఉన్నట్లు కనిపించింది. ఆమె ఆ కొండపైకెక్కి నిలబడ్డారు. లోయ వైపు తిరిగి ఎక్కడైనా మనుషులు కానవస్తారేమోనని కలియ జూశారు. కాని ఎవరూ కనిపించక పోవటంతో సఫా కొండ నుంచి క్రిందికి దిగారు. నేలమీదికి దిగివచ్చిన తర్వాత చొక్కా కొన పైకెత్తి బాధకు గురైన మనిషి పరుగెత్తినట్లు పరుగెత్తారు. లోయను దాటి తిరిగి మర్వా కొండ పైకెక్కి నిలబడ్డారు. ఎవరైనా మనుషులు కనిపిస్తారేమోనని చుట్టూ కలియ జూశారు కాని ఎవరూ కాన రాలేదు.

ఆ కారణంగానే ప్రజలు (హాజిరాను అనుకరిస్తూ హజ్, ఉమ్రా సమయాల్లో) 'సయీ' చేస్తారు.

చివర్లో మర్వా కొండపైకి ఎక్కినప్పుడు ఆమెకు ఒక శబ్దం వినిపించింది. "ఏమిటి ఆ శబ్దం, మెదలకుండా ఉండు" అని అనుకున్నారు ఆమె మనసులో. (ఆ ప్రదేశంలో మనిషి

الْمَـاءِ، لَكَـانَـتْ زَمْـزَمُ عَيْنـاً مَعِينـاً» قَـالَ: فَشَـرِبَـتْ، وَأَرْضَعَـتْ وَلَـدَهَـا، فَقَـالَ لَهَـا الْمَلَكُ: لَا تَخَافُوا الضَّيْعَةَ فَإِنَّ هٰهُنَا بَيْتاً لِلّٰهِ يَبْنِيـهِ هٰـذَا الْغُـلَامُ وَأَبُـوهُ، وَإِنَّ اللهَ لَا يُضَيِّعُ أَهْلَـهُ، وَكَـانَ الْبَيْـتُ مُـرْتَفِعـاً مِـنَ الأَرْضِ كَالرَّابِيَةِ تَأْتِيهِ السُّيُولُ، فَتَأْخُذُ عَنْ يَمِينِهِ وَعَنْ شِمَالِهِ، فَكَانَتْ كَذٰلِكَ حَتَّى مَرَّتْ بِهِمْ رُفْقَةٌ مِنْ جُرْهُم، أَوْ أَهْلُ بَيْتٍ مِنْ جُرْهُم مُقْبِلِينَ مِنْ طَرِيقِ كَدَاءَ، فَنَزَلُوا فِي أَسْفَلِ مَكَّةَ، فَرَأَوْا طَائِراً عَائِفاً فَقَالُوا: إِنَّ هٰذَا الطَّائِرَ لَيَدُورُ عَلَى مَاءٍ لَعَهْدُنَا بِهٰذَا الْوَادِي وَمَا فِيهِ مَاءٌ، فَأَرْسَلُوا جَرِيًّا أَوْ جَرِيَّيْنِ، فَإِذَا هُمْ بِالْمَاءِ. فَرَجَعُوا، فَـأَخْبَـرُوهُـمْ، فَـأَقْبَلُـوا وَأُمُّ إِسْمَـاعِيـلَ عِنْـدَ الْمَاءِ، فَقَالُوا: أَتَأْذَنِينَ لَنَا أَنْ نَنْزِلَ عِنْدَكِ؟ قَالَتْ: نَعَمْ، وَلٰكِنْ لَا حَقَّ لَكُمْ فِي الْمَاءِ، قَـالُـوا: نَعَـمْ. قَـالَ ابْـنُ عَبَّـاسٍ: قَـالَ

మాట్లాడుతున్నట్లు శబ్దం వినపడటాన్ని ఆమె నమ్మలేకపోయారు). చెవులు రిక్కించి వింటే మళ్ళీ అవే మాటలు వినిపించాయి. అప్పుడామె, “నీ మాటలు నాకు వినిపించాయి. నీ దగ్గర మాకు పనికివచ్చే సామగ్రి ఏమైనా ఉంటే వెంటనే సహాయం కోసం ఇక్కడికి చేరుకో” అన్నారు. తర్వాత చూస్తే (నేడు)జమ్‌జమ్ (బావి) ఉన్నచోట ఒక దైవదూత కనిపించాడు. అతను తన కాలితో (లేక) తన రెక్కతో నీటి ఊట చిమ్మేదాకా నేలను త్రవ్వాడు. హాజిరా ఆ నీటికోసం హౌజ్ నిర్మించసాగారు. దోసలితో నీరు తీసు కొని తన దగ్గరున్న నీళ్ళతిత్తిలో పోసుకో సాగారు. ఆమె దోసిలితో ఎంత నీరైతే తీసుకుంటారో అంతే నీరు భూమిలో నుంచి ఉబికివచ్చేది. ఒక ఉల్లేఖనం ప్రకారం దోసిలి అంత నీరు భూమిలో నుంచి ఉబికివచ్చేది.

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: అల్లాహ్ ఇస్మాయీల్ తల్లిమీద దయచూపుగాక! ఆమె గనక జమ్‌జమ్ నీటిని అలాగే వదిలేసి ఉన్నట్లయితే (లేక) దోసిలితో నీళ్ళను సమీకరించి ఉండకపోతే జమ్‌జమ్ ఊటబావి భూలోకమంతటికీ నీరు అందించగలిగి ఉండేది.

النَّبِيُّ ﷺ: «فَأَلْفَى ذلكَ أُمَّ إِسمَاعِيلَ، وَهِيَ تُحِبُّ الأُنْسَ، فَنَزَلُوا، فَأَرْسَلوا إِلى أَهْلِيهِمْ فَنَزَلُوا مَعَهُم، حَتَّى إِذا كَانُوا بِهَا أَهْلَ أَبيَاتٍ، وَشَبَّ الغُلامُ وَتَعَلَّمَ العَرَبِيَّةَ مِنْهُمْ وَأَنفَسَهُم وَأَعجَبَهُمْ حِينَ شَبَّ، فَلَمَّا أَدرَكَ، زَوَّجُوهُ امرَأَةً منهُمْ، وَمَاتَتْ أُمُّ إِسْمَاعِيلَ، فَجَاءَ إِبراهِيمُ بَعْدَ ما تَزَوَّجَ إِسْمَاعِيلُ يُطالِعُ تَرِكَتَهُ فَلَمْ يَجِدْ إِسْمَاعِيلَ، فَسَأَلَ امرَأَتَهُ عَنْهُ فَقَالَتْ: خَرَجَ يَبْتَغِي لَنَا ـ وفي رِوَايَةٍ: يَصِيدُ لَنَا ـ ثُمَّ سَأَلَهَا عَنْ عَيْشِهِمْ وَهَيئَتِهِمْ فَقَالَتْ: نَحنُ بِشَرٍّ، نَحنُ في ضِيقٍ وَشِدَّةٍ، وَشَكَتْ إِلَيْهِ، قَالَ: فَإِذا جَاءَ زَوْجُكِ، اقرَئِي عَلَيْهِ السَّلامَ، وَقُولِي لَهُ يُغَيِّرْ عَتَبَةَ بَابِهِ، فَلَمَّا جَاءَ إِسمَاعِيلُ كَأَنَّهُ آنَسَ شَيْئاً فَقَالَ: هَلْ جَاءَكُمْ

ఉల్లేఖకులు తెలియజేస్తున్నారు: హాజిరా స్వయంగా ఆ నీరు త్రాగారు. తన పిల్లవాడికి కూడా త్రాగించారు. దైవదూత హాజిరాకు ధైర్యం చెబుతూ, "మీరు ప్రాణభయం పెట్టుకోకండి. ఎందుకంటే ఇక్కడ దైవగృహ స్థలం ఉంది. ఆ స్థలంలో ఈ పిల్లవాడు మరియు ఇతని తండ్రి ఇద్దరూ కలిసి దైవగృహాన్ని నిర్మిస్తారు. తన గృహానికి పర్యవేక్షకులుగా ఉండేవారిని అల్లాహ్ ఎన్నటికీ నాశనం చేయడు" అని అన్నాడు. ఆ కాలంలో దైవగృహం (చోటు) మట్టి దిబ్బలాగా ఎత్తుగా ఉండేది. అక్కడికి వరదలు వచ్చినా (ఆ ఎత్తయిన ప్రదేశాన్ని నష్టపరచకుండా) కుడి ఎడమల నుంచి వెళ్ళిపోయేవి. చాలా కాలం వరకు ఇదే పరిస్థితి కొనసాగింది. చివరికి జుర్హుమ్ బృందం లేక జుర్హుమ్ తెగకు చెందిన ఒక వంశం వారు 'కదా' మార్గం గుండా వెళ్తూ మక్కా దిగువ ప్రాంతంలో మజిలీ చేయటానికి దిగారు. అక్కడ ఆకాశంలో ఒక పక్షి వారికి చుట్టూ తిరుగాడుతున్నట్లు కనిపించింది. దాన్ని చూసి వారు "బహుశా ఆ పక్షి నీళ్ళకోసమే తిరుగాడుతుంటుంది. మనం ఎంతో కాలం నుంచి ఈ లోయ గుండా వెళ్ళి వస్తున్నాం. కాని ఇక్కడ నీళ్లు ఉన్నట్లు మనకు తెలియదే" అని అనుకొని

مِنْ أَحدٍ؟ قَالَتْ: نَعَمْ، جَاءَنَا شَيْخٌ كَذَا وكَذَا، فَسَألَنَا عَنكَ، فَأَخْبَرْتُهُ، فَسَألَني كَيْفَ عَيْشُنَا، فَأَخْبَرْتُهُ أَنَّا في جَهْدٍ وَشِدَّةٍ. قَالَ: فَهَلْ أَوْصَاكِ بِشَيْءٍ؟ قَالَتْ: نَعَمْ أَمَرَني أَنْ أَقْرَأَ عَلَيْكَ السَّلامَ وَيقُولُ: غَيِّرْ عَتَبَةَ بَابِكَ. قَالَ: ذَاكَ أَبي وَقَدْ أَمَرَني أَنْ أُفَارِقَكِ، الْحَقِي بِأَهْلِكِ. فَطَلَّقَهَا وَتَزَوَّجَ مِنْهُمْ أُخْرى، فَلَبِثَ عَنْهُمْ إِبْرَاهِيمُ ما شَاءَ اللهُ ثُمَّ أَتَاهُمْ بَعْدُ، فَلَمْ يَجِدْهُ، فَدَخَلَ عَلى امْرَأَتِهِ، فَسَأَلَ عَنْهُ. قَالَتْ: خَرَجَ يَبْتَغي لَنَا. قَالَ: كَيْفَ أَنْتُمْ؟ وَسَأَلَهَا عَنْ عَيْشِهِمْ وَهَيْئَتِهِم فقالَت: نَحْنُ بِخَيْرٍ وَسَعَةٍ وَأَثْنَتْ عَلَى اللهِ تَعَالى، فَقَالَ: مَا طَعَامُكُمْ؟ قَالَت: اللَّحْمُ. قَالَ: فَمَا شَرَابُكُمْ؟ قَالَتِ: المَاءُ. قَالَ: اللَّهُمَّ بَارِكْ لَهُمْ في اللَّحمِ وَالمَاءِ، قَالَ النَّبيُّ ﷺ: «وَلَمْ

ఆచూకీ తెలుసుకొని రమ్మని ఒకరినో లేక ఇద్దరినో పంపారు. వారు అక్కడికి వెళ్ళి నీళ్లు తాగారు. తిరిగొచ్చి తెగ వారికి వార్తనందజేశారు. వారంతా అక్కడికి వెళ్ళారు. అప్పుడు ఇస్మాయీల్ తల్లి నీళ్ళ దగ్గరే కూర్చొని ఉన్నారు. వారు ఆమెను, “మేము మీ దగ్గర మజిలీ చేయటానికి అనుమతించగలరా?” అని అడిగారు. అందుకామె, “సరేగాని నీళ్ళ యాజమాన్యంలో మీకు హక్కు ఉండబోదు” అన్నారు. అందుకు వారు “సరే” అన్నారు.

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పారు: ఈ విషయం ఇస్మాయీల్ తల్లి ఇష్టప్రకారమే జరిగింది. స్వయంగా ఆమె ఆప్యాయతానురాగాలను ఇష్టపడేవారు. వారు అక్కడ దిగారు. తమ ఇంటివారికి కబురు చేశారు. దాంతో వారు కూడా వచ్చి అక్కడే స్థిరపడ్డారు. ఆ విధంగా ఆ ప్రాంతంలో స్థిరపడిన ఇండ్లు అనేకమయ్యాయి. ఇటు ఇస్మాయీల్ (అలైహిస్సలామ్) కూడా యువకులయ్యారు. వారితో పాటు ఉంటూ అరబీ భాష కూడా నేర్చుకున్నారు. పెద్దయిన తర్వాత ఆయన వారిలో అందరికంటే ఎక్కువ నీటుగా, మనసైనవాడుగా ఉండేవారు. అప్పుడు వారు తమ తెగకు

يَكُنْ لَهُمْ يَوْمَئِذٍ حَبٌّ وَلَوْ كَانَ لَهُمْ دَعَا لَهُمْ فِيهِ» قَالَ: فَهُمَا لَا يَخْلُو عَلَيْهِمَا أَحَدٌ بِغَيْرِ مَكَّةَ إِلَّا لَمْ يُوافِقَاهُ. وفي روايةٍ فَجَاءَ فَقَالَ: أَيْنَ إِسْمَاعِيلُ؟ فَقَالَتِ امْرَأَتُهُ: ذَهَبَ يَصِيدُ، فَقَالَتِ امْرَأَتُهُ: أَلَا تَنْزِلُ، فَتَطْعَمَ وَتَشْرَبَ؟ قَالَ: وَمَا طَعَامُكُمْ وَمَا شَرَابُكُمْ؟ قَالَتْ: طَعَامُنَا اللَّحْمُ، وَشَرَابُنَا الْمَاءُ. قَالَ: اللَّهُمَّ! بَارِكْ لَهُمْ فِي طَعَامِهِمْ وَشَرَابِهِمْ - قَالَ: فَقَالَ أَبُو الْقَاسِمِ ﷺ: «بَرَكَةُ دَعْوَةِ إِبْرَاهِيمَ ﷺ» قَالَ: فَإِذَا جَاءَ زَوْجُكِ، فَاقْرَئِي عَلَيْهِ السَّلَامَ وَمُرِيهِ يُثَبِّتْ عَتَبَةَ بَابِهِ، فَلَمَّا جَاءَ إِسْمَاعِيلُ، قَالَ: هَلْ أَتَاكُمْ مِنْ أَحَدٍ؟ قَالَتْ: نَعَمْ، أَتَانَا شَيْخٌ حَسَنُ الْهَيْئَةِ، وَأَثْنَتْ عَلَيْهِ، فَسَأَلَنِي عَنْكَ فَأَخْبَرْتُهُ، فَسَأَلَنِي كَيْفَ عَيْشُنَا، فَأَخْبَرْتُهُ أَنَّا بِخَيْرٍ. قَالَ:

చెందిన ఒక స్త్రీని ఆయనకిచ్చి వివాహం చేశారు. ఇస్మాయీల్ తల్లి చని పోయింది. ఇస్మాయీల్ వివాహం తర్వాత ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్) తను విడిచిపెట్టిన వారిని (భార్యా బిడ్డల్ని) చూడటానికి వచ్చారు. ఆయన ఇస్మాయీల్‌ను కలవలేక పోయారు. ఇస్మాయీల్ ఎక్కడికి వెళ్ళాడని అతని భార్యను అడిగారు. ఆయన మా కోసం ఆహారం తీసుకురావటానికి, (ఒక ఉల్లేఖనం ప్రకారం) మా కోసం వేటకు వెళ్ళారని ఆమె చెప్పింది. తర్వాత ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ ఆమెను తమ సంసార జీవితం, బాగోగుల గురించి అడిగారు. అందు కామె, "మేము చాలా హీనస్థితిలో ఉన్నాం. చాలా ఇబ్బందుల్లో జీవితం గడుపుతున్నాం" అంటూ ఇస్మాయీల్ గురించి ఫిర్యాదు చేసింది. దానికి ఇబ్రాహీమ్ (సరే, అయితే) మీ ఆయన వచ్చిన తర్వాత ఆయనకు నా సలాం చెప్పు. మీ ఇంటి తలుపుల గుమ్మం మార్చమని కూడా చెప్పమ్మా' అని చెప్పి వెళ్ళిపోయారు.

ఇస్మాయీల్ ఇంటికి చేరుకున్నారు. తన ఇంటికి ఎవరో వచ్చి వెళ్ళినట్లు అనిపించింది ఆయనకు. మనింటికి ఎవరైనా వచ్చి వెళ్ళారా? అని భార్యను అడిగారు. అందుకామె, ఇలా చెప్పు కుంటూ పోయింది: "అవునండీ! ఒక

فَأَوْصَاكِ بِشَيْءٍ؟ قَالَتْ: نَعَمْ، يَقْرَأُ عَلَيْكَ السَّلَامَ، وَيَأْمُرُكَ أَنْ تُثَبِّتَ عَتَبَةَ بَابِكَ قَالَ: ذَاكَ أَبِي، وَأَنْتِ الْعَتَبَةُ أَمَرَنِي أَنْ أُمْسِكَكِ، ثُمَّ لَبِثَ عَنْهُمْ مَا شَاءَ اللهُ، ثُمَّ جَاءَ بَعْدَ ذٰلِكَ وَإِسْمَاعِيلُ يَبْرِي نَبْلاً لَهُ تَحْتَ دَوْحَةٍ قَرِيباً مِنْ زَمْزَمَ؛ فَلَمَّا رَآهُ، قَامَ إِلَيْهِ، فَصَنَعَ كَمَا يَصْنَعُ الْوَالِدُ بِالْوَلَدِ، وَالْوَلَدُ بِالْوَالِدِ قَالَ: يَا إِسْمَاعِيلُ! إِنَّ اللهَ أَمَرَنِي بِأَمْرٍ، قَالَ: فَاصْنَعْ مَا أَمَرَكَ رَبُّكَ. قَالَ: وَتُعِينُنِي؟ قَالَ: وَأُعِينُكَ، قَالَ: فَإِنَّ اللهَ أَمَرَنِي أَنْ أَبْنِيَ بَيْتاً هٰهُنَا، وَأَشَارَ إِلَى أَكَمَةٍ مُرْتَفِعَةٍ عَلَى مَا حَوْلَهَا. فَعِنْدَ ذٰلِكَ رَفَعَ الْقَوَاعِدَ مِنَ الْبَيْتِ، فَجَعَلَ إِسْمَاعِيلُ يَأْتِي بِالْحِجَارَةِ، وَإِبْرَاهِيمُ يَبْنِي حَتَّى إِذَا ارْتَفَعَ الْبِنَاءُ، جَاءَ بِهٰذَا

పెద్దాయన వచ్చాడు. ఆయన ఫలానా విధంగా ఉంటారు. ఆయన నొచ్చి మిమ్మల్ని గురించి అడిగితే (మీరు బయటికి వెళ్ళారని) చెప్పాను. తర్వాత ఆయన మన సంసారం ఎలా నడుస్తుందని అడిగారు. దానికి నేను మనం చాలా హీనస్థితిలో ఉన్నామనీ, ఇబ్బందులతో జీవితం గడుపుతున్నా మని చెప్పాను."

"మరి దానికి ఆయన ఏమని చెప్పి వెళ్ళారు?" అని అడిగారు ఇస్మాయీల్. "అవునండీ ఆయన మీకు సలాం చెప్పమని ఆదేశించారు. అంతేకాదు, మీకొక సందేశం ఇచ్చి వెళ్ళారు. మీ ఇంటి గుమ్మం మార్చాలట" అని చెప్పిందామె. అప్పుడు ఇస్మాయీల్ ఇలా తెలిపారు: "ఆ పెద్దాయన మా నాన్నగారే. ఆయన నన్ను నీ నుంచి వేరుపడమని ఆదేశించి వెళ్ళారు. ఇక నువ్వు మీ ఇంటికి వెళ్ళిపోవచ్చు." ఇస్మాయీల్ ఆమెకు విడాకులిచ్చేసి ఆ తెగకే చెందిన వేరొక స్త్రీని వివాహ మాడారు.

దేవుడు తలచినంతకాలం తర్వాత ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ మళ్ళీ వారి దగ్గరకు వచ్చారు. అప్పుడు కూడా ఇస్మాయీల్ ఇంట్లో లేరు. ఆయన భార్య దగ్గరకు వెళ్ళి ఆయన గురించి అడిగారు. ఆయన మా కోసం ఆహారం

الحَجَرِ فَوَضَعَهُ لَهُ فَقَامَ عَلَيْهِ، وَهُوَ يَبْنِي وَإِسْمَاعِيلُ يُنَاوِلُهُ الحِجَارَةَ وَهُمَا يَقُولانِ: رَبَّنَا تَقَبَّلْ مِنَّا إِنَّكَ أَنْتَ السَّمِيعُ الْعَلِيمُ. وفي روايةٍ: إِنَّ إِبْرَاهِيمَ خَرَجَ بِإِسْمَاعِيلَ وأُمِّ إسماعيلَ، مَعَهُمْ شَنَّةٌ فِيهَا مَاءٌ، فَجَعَلَتْ أُمُّ إِسْمَاعِيلَ تَشْرَبُ مِنَ الشَّنَّةِ، فَيَدِرُّ لَبَنُهَا عَلَى صَبِيِّهَا حَتَّى قَدِمَ مَكَّةَ، فَوَضَعَهَا تَحْتَ دَوْحَةٍ، ثُمَّ رَجَعَ إِبْرَاهِيمُ إِلَى أَهْلِهِ، فاتَّبَعَتْهُ أُمُّ إِسْمَاعِيلَ حَتَّى لَمَّا بَلَغُوا كَدَاءَ، نَادَتْهُ مِنْ وَرَائِهِ: يَا إِبْرَاهِيمُ! إِلَى مَنْ تَتْرُكُنَا؟ قَالَ: إِلَى اللهِ، قَالَتْ: رَضِيتُ بِاللهِ، فَرَجَعَتْ، وَجَعَلَتْ تَشْرَبُ مِنَ الشَّنَّةِ، وَيَدِرُّ لَبَنُهَا عَلَى صَبِيِّهَا حَتَّى لَمَّا فَنِيَ الماءُ قَالَتْ: لَوْ ذَهَبْتُ، فَنَظَرْتُ لَعَلِّي أُحِسُّ أَحَداً، قَالَ: فَذَهَبَتْ

తీసుకురావటానికి బయటికి వెళ్ళి ఉన్నారు అని చెప్పిందామె. ఇబ్రాహీమ్ ఆమెను "మీరు ఎలా ఉన్నారు?" అంటూ వారి సంసారం గురించి, వారి బాగోగుల గురించి అడిగారు. అందు కామె, "అల్లాహ్ దయవల్ల మేము బాగానే ఉన్నామండీ. ప్రభువు చలువతో మేము సుఖంగానే ఉన్నాం" అని చెప్పింది"మీరు ఏం తింటారు?" అని అడిగారు ఇబ్రాహీమ్. "మాంసం తింటాం" అని చెప్పిందామె. "ఏం తాగుతారు?" అని అడిగితే, 'నీళ్లు' అని చెప్పింది. "ఓ అల్లాహ్! వీళ్ళ కొరకు మాంసంలో, నీళ్ళలో వృద్ధిని ప్రసాదించు" అని ఇబ్రాహీమ్ ప్రార్థించారు.

దైవప్రవక్త (సల్లం) తెలియజేస్తున్నారు: ఆ కాలంలో వారి దగ్గర ధాన్యాలేవీ ఉండేవి కావు. ఒకవేళ ఉండి ఉంటే ఇబ్రాహీమ్ వాటిలో కూడా (శుభం ప్రాప్తించాలని) ప్రార్థించి ఉండేవారు. ఇబ్నె అబ్బాస్ (రజి) ఉవాచ: ఒక్క మక్కా నగరం తప్ప ఇతర ఏ ప్రాంతం లోనైనా ఎవడైనా కేవలం ఆ రెండు వస్తువులతోనే గడపదలిస్తే అవి అతనికి పడవు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఇబ్రాహీమ్ (రెండోసారి) వచ్చి, "ఇస్మాయీల్ ఏడి?" అని అడిగారు. ఇస్మాయీల్ భార్య, "ఆయన వేటకు

فَصَعِدَتِ الصَّفَا، فَنَظَرَتْ وَنَظَرَتْ هَلْ تُحِسُّ أَحَداً، فَلَمْ تُحِسَّ أَحَداً، فَلَمَّا بَلَغَتِ الْوَادِي، سَعَتْ، وَأَتَتِ الْمَرْوَةَ، وَفَعَلَتْ ذلكَ أَشْوَاطاً، ثُمَّ قَالَتْ: لَوْ ذَهَبْتُ فَنَظَرْتُ ما فَعَلَ الصَّبِيُّ، فَذَهَبَتْ وَنَظَرَتْ، فَإِذا هُوَ عَلَى حَالِهِ كَأَنَّهُ يَنْشَغُ لِلْمَوْتِ، فَلَمْ تُقِرَّهَا نَفْسُهَا. فَقَالَتْ: لَوْ ذَهَبْتُ، فَنَظَرْتُ لَعَلِّي أُحِسُّ أَحَداً، فَذَهَبَتْ فَصَعِدَتِ الصَّفَا، فَنَظَرَتْ وَنَظَرَتْ، فَلَمْ تُحِسَّ أَحَداً حَتَّى أَتَمَّتْ سَبْعاً، ثُمَّ قَالَتْ: لَوْ ذَهَبْتُ، فَنَظَرْتُ مَا فَعَلَ، فَإِذَا هِيَ بِصَوْتٍ، فَقَالَتْ: أَغِثْ إِنْ كانَ عِنْدَكَ خَيْرٌ، فَإِذَا جِبْرِيلُ ﷺ فَقَالَ بِعَقِبِهِ هٰكَذَا، وَغَمَزَ بِعَقِبِهِ عَلَى الأَرْضِ، فَانْبَثَقَ الْمَاءُ فَدَهِشَتْ أُمُّ إِسْمَاعِيلَ، فَجَعَلَتْ تَحْفِنُ - وذَكَرَ الحَدِيثَ بِطُولِهِ. رواه

వెళ్ళారు. మీరు అలాగే నిలబడ్డారేం? కూర్చొండి. ఏమైనా తిని వెళ్ళరుగాని" అని అన్నది. ఇబ్రాహీమ్ ఆమెను "మీరు ఏం తింటున్నారు? ఏం తాగుతున్నారు?" అని అడిగారు. "మాకిక్కడ తినడానికి మాంసం, త్రాగడానికి నీళ్లు దొరుకుతాయండీ" అని చెప్పిందామె. అప్పుడాయన "ఓ అల్లాహ్! వీళ్ళ అన్న పానీయాల్లో శుభాన్ని ప్రసాదించు" అని ప్రార్థించారు.

ఉల్లేఖకులు ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం అబుల్ ఖాసిమ్ (సల్లం) ఇలా తెలియజేశారు: (మక్కాలో ఈ రెండు వస్తువులు విస్తృతంగా లభించటానికి కారణం) ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్ దీవెనలే. ఇబ్రాహీమ్ ఆమెకు, "మీ ఆయనొస్తే ఆయనకు నా సలాం తెలియజేయి. ఆయనింటి ఈ గుమ్మాన్ని అలాగే ఉంచమని చెప్పు" అని హితోపదేశం చేసి వెళ్ళారు. ఇస్మాయీల్ వచ్చి, "మనింటికి ఎవరైనా వచ్చారా?" అని అడిగారు. అందుకామె ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్‌ను పొగుడుతూ ఇలా చెప్పింది: అవునండి, రూపవంతుడైన ఒక పెద్దాయన వచ్చారు. ఆయన నన్ను మీ గురించి అడిగితే (మీరు వేటకు వెళ్ళారని) చెప్పాను. ఆయన మన జీవితం ఎలా నడుస్తుందని అడిగారు. అందుకు నేను మనం చాలా మంచి

البخاري بهذه الروايات كلها. «الدَّوْحَةُ»: الشَّجَرَةُ الكَبِيرَةُ، قوله: «قَفَّى» أي: وَلَّى وَ«الجَرِيُّ»: الرسول. وَ«أَلفى» معناه: وَجَدَ. قَوْلُهُ: «يَنشغ» أَيْ: يَشْهق.

స్థితిలో ఉన్నామని చెప్పాను. "మరి ఆయన (చివర్లో) ఏమైనా ఉపదేశం చేసి వెళ్ళారా?" అని అడిగారు ఇస్మాయీల్. దానికి ఆయన భార్య, "అవునండీ! ఆయన మీకు సలాం చెప్పారు. అంతేకాదు మీ ఇంటి గుమ్మం మార్చవద్దని కూడా చెప్పి వెళ్ళారు" అని చెప్పింది. అప్పుడు ఇస్మాయీల్ ఇలా తెలియజేశారు: "ఆయన మా నాన్నగారు. గుమ్మం అంటే నువ్వు. నిన్ను నా దగ్గరే ఉంచుకోవాలని ఆయన నాకు హితోపదేశం చేసి వెళ్ళారు."

తర్వాత అల్లాహ్ తలచినంత కాలానికి ఇబ్రాహీమ్ మళ్ళీ (మక్కాకు) వచ్చారు. అప్పుడు ఇస్మాయీల్ జమ్‌జమ్ సమీపంలో ఒక చెట్టు క్రింద బాణం సరి చేసుకుంటున్నారు. ఇస్మాయీల్ ఆయన్ని చూడగానే లేచినిలబడ్డారు. ఆయన ముందుకు వెళ్ళారు. తర్వాత, ఒక తండ్రి తన సంతానం పట్ల చూపే వాత్సల్యం, సంతానం తండ్రి పట్ల కనబరచే గౌరవం- అక్కడ అవే జరిగాయి. తర్వాత ఇబ్రాహీమ్ తన కుమారునితో, "ఇస్మాయీల్! అల్లాహ్ నన్ను ఒక పని చేయుమని ఆదేశించాడు" అని అన్నారు. దానికి ఇస్మాయీల్, "మీ ప్రభువు మీకు ఆదేశించిన పనిని మీరు తప్పకుండా చేయండి" అని అన్నారు. "నువ్వు నాకు సహాయం

చేస్తావా?" అని ఇబ్రాహీమ్ అడిగారు. "నేను మీకు తప్పకుండా సహాయం చేస్తాను" అన్నారు ఇస్మాయీల్. అప్పుడు ఇబ్రాహీమ్ ఎత్తుగా ఉన్న ఒక ప్రదేశాన్ని చూపిస్తూ, "అల్లాహ్ నన్ను ఇక్కడ ఒక ఇల్లు నిర్మించమని ఆదేశించాడు" అన్నారు. అప్పుడే ఆ ప్రత్యేక గృహం యొక్క గోడల నిర్మాణం మొదలయ్యింది. ఇస్మాయీల్ రాళ్ళు ఎత్తుకొని తీసుకువచ్చే వారు. ఇబ్రాహీమ్ వాటితో గోడలు నిర్మించేవారు. గోడలు ఇంకా ఎత్తుగా నిర్మించవలసి వచ్చినప్పుడు (మఖామె ఇబ్రాహీమ్) రాయి తీసుకువచ్చి పెట్టారు. ఇబ్రాహీమ్ దాని మీద నించొని గోడలు నిర్మించసాగారు. ఇస్మాయీల్ ఆయనకు రాళ్లు అంద జేసేవారు. ఆ సమయంలో వారిద్దరి నోళ్ళలోనూ ఇదే ప్రార్థన నానుతూ ఉంది: "ఓ మా ప్రభూ! మా ఈ కృషిని ఆమోదించు. నిశ్చయంగా నీవు అన్నీ వినేవాడవు. సర్వం తెలిసినవాడవు."

వేరొక ఉల్లేఖనంలో (ఈ సంఘటన లోని మొదటి భాగం) ఈ విధంగా ఉంది: ఇబ్రాహీమ్ ఇస్మాయీల్‌ను, ఆయన తల్లిని వెంట తీసుకొని బయలుదేరారు. వారి దగ్గర ఒక నీళ్ళ తిత్తి ఉంది. ఇస్మాయీల్ తల్లి ఆ నీళ్లు త్రాగగానే ఆమె పాలిండ్లలో బాగా పాలు నిండేవి. ఆ విధంగా వారు

మక్కా చేరుకున్నారు. ఇబ్రాహీమ్ వారిని ఒక పెద్ద చెట్టు క్రింద కూర్చోబెట్టి ఇంటికి తిరిగి వెళ్ళసాగారు. ఇస్మాయీల్ తల్లి కూడా ఆయన వెంట నడిచిరాసాగింది. 'కదా' ప్రాంతానికి చేరుకున్న తర్వాత హాజిరా ఆయన్ని పిలిచి, "ఇబ్రాహీమ్! మమ్మల్ని ఎవరికి అప్పగించి వెళ్తున్నారు మీరు?" అని అడిగారు. "అల్లాహ్‌కు"- ముక్తసరిగా సమాధానమిచ్చారు ఇబ్రాహీమ్. ఆ మాట వినగానే ఇస్మాయీల్ తల్లి, "మీరు నన్ను అల్లాహ్‌కు అప్పగించటం నాకిష్టమే" అని చెప్పి తిరిగి వెళ్ళిపోయింది. నీళ్ళతిత్తిలోని నీళ్లు త్రాగుతూ గడపసాగింది. దాంతో పిల్లవాడి కోసం ఆమె పాలిండ్లలో పాలు తయారయ్యేవి. చివరికి ఆ నీరంతా అయిపోయింది. అప్పుడామె (మనసులో) "(అటు ఇటూ) వెళ్ళి ఎవరైనా మనుషులు కనిపిస్తారేమో చూస్తాను" అని అనుకుంది. అలా అనుకొని ఆమె సఫా కొండపైకెక్కి బాగా పరికించి చూసింది. కాని ఎవరూ కనిపించలేదు. (తర్వాత క్రిందికి దిగి) మళ్ళీ పరుగెత్తుకుంటూ వెళ్ళి మర్వా కొండపైకెక్కింది. ఈ విధంగా (రెండు కొండల మధ్య) అనేకసార్లు తిరిగింది. తర్వాత (మనసులో) "వెళ్ళి పిల్లవాడు ఎలా ఉన్నాడో చూసి వస్తాను" అని అనుకొని పిల్లవాడి దగ్గరికి వెళ్ళి చూస్తే

పిల్లవాడు అలాగే జీవితపు చివరి శ్వాసలు తీసుకుంటున్నాడు. అది చూసి ఆమె మనసు మరింత కకావికల మైంది. ఇంకోసారి వెళ్ళి చూస్తే ఎవరైనా కనిపిస్తారేమో అని అనుకుంది. తిరిగివెళ్ళి సఫా కొండపైకెక్కి బాగా కలియ జూసింది. కాని ఎవరూ కాన రాలేదు. ఆ విధంగా పూర్తిగా ఏడుసార్లు (సఫా - మర్వా కొండల మధ్య) తిరిగింది. తర్వాత పిల్లవాడు ఎలా ఉన్నాడో చూసి వద్దామని వెళ్ళింది. అక్కడికి వెళ్ళగానే ఆమెకు ఏవో మాటలు వినిపించాయి. అందుకామె, “నీలో మంచితనం ఉంటే మాకు సహాయపడు” అని అన్నారు. అంత లోనే అక్కడ జిబ్రయీల్ అలైహిస్స లామ్ ప్రత్యక్ష మయ్యారు. ఆయన తన కాలు నేలమీద కొట్టారు. దాంతో నేల నుంచి నీటి ఊట చిమ్మింది. అది చూసి ఇస్మాయీల్ తల్లి ఆశ్చర్య పోయింది. దోసిళ్లతో నీళ్లు సమీకరించు కొని నీళ్లతిత్తిలో పోసుకోసాగింది. (తర్వాత ఉల్లేఖకుడు హదీసు మొత్తం వివరంగా చెప్పారు. ఈ ఉల్లేఖనాలన్నీ కూడా ఇమామ్ బుఖారీ వివరించారు.)

‘దౌహ’ అంటే పెద్ద చెట్టు అని అర్థం. ‘ఖఫియ’ అంటే వెనక్కి తిరిగి వెళ్ళటం. ‘జరీ’ అంటే రాయబారి. ‘అల్ఫా’ అంటే పొందటం. ‘యన్షగు’ అంటే శ్వాస

కొట్టుమిట్టాడటం. జీవితపు అంతిమ దశలో జరిగినట్లు, (అయితే కొందరు దీనిని సొమ్మసిల్లిపోవటమని కూడా అనువదించారు.)

*(సహీహ్ బుఖారీలోని దైవప్రవక్తల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1) ఈ హదీసులో సఫా-మర్వా కొండల మధ్య పరుగెత్తటానికి గల చారిత్రక నేపథ్యం వివరించబడింది. అల్లాహ్ హాజిరా గారి జ్ఞాపకార్థం హజ్, ఉమ్రాల్లో ఈ 'సయీ' (పరుగెత్తటా)న్ని ప్రధానాంశంగా నిర్ణయించాడు. ఆ విషయమే ఈ హదీసులో వివరించబడింది. ఆమె కేవలం దైవప్రసన్నత కోసం తన భర్త ఆజ్ఞ మేరకు తన పసిపిల్లవాడితోపాటు తృణకాష్ఠ జలరహితమైన ప్రదేశంలో ఉండటానికి సిద్ధమయింది. దానికి అల్లాహ్ ఆమెకు గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదించాడు. ఆమె కోసం జమ్‌జమ్ ఊటను ఉబికించాడు. ఆ సమయంలో ఆ నీరే ఆమెకు జీవజలంగా పనికొచ్చింది. ఆ నీటి ద్వారా నేటికీ విశ్వజనావళి ప్రయోజనం పొందుతున్నది. అంతేకాదు, సఫా-మర్వాల మధ్య ప్రాణభయంతో పరుగెత్తిన ఆమె పరుగును అల్లాహ్ హజ్, ఉమ్రా యాత్రల్లో ఒక ప్రధానాంశంగా నిర్ణయించాడు. ప్రళయం వరకూ ఈ పరంపర కొనసాగుతూనే ఉంటుంది.

2) కాబా గృహం ఇబ్రాహీమ్, ఇస్మాయీల్‌ల చేత నిర్మించబడింది.

3) సర్వకాల సర్వావస్థల్లో అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఉండటం చాలా మంచి విషయం. దీనికి విరుద్ధమైన ఆచరణ అత్యంత గర్హనీయం.

١٨٧٠ - وَعَنْ سَعِيدِ بْنِ زَيْدٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «الْكَمْأَةُ مِنَ الْمَنِّ، وَمَاؤُهَا شِفَاءٌ لِلْعَيْنِ» متفقٌ عليه.

1870. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ సయీద్ బిన్ జైద్ (రజి) తెలిపారు: పుట్టగొడుగులు మన్న్ కోవకు చెందినవి. దాని రసం కళ్ళకు చికిత్సగా ఉపయోగపడుతుంది. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని వైద్య ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

# ١٩ - كِتَابُ الإِسْتِغْفَار

# 19. ఇస్తిగ్‌ఫార్ ప్రకరణం

**371 వ అధ్యాయం**

## ٣٧١ - بَابُ الإِسْتِغْفَارِ

## మన్నింపు వేడుకోలు

قَالَ اللهُ تَعَالَى: ﴿وَٱسْتَغْفِرْ لِذَنۢبِكَ وَلِلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ﴾ [محمد: ١٩]. وَقَالَ تَعَالَى: ﴿وَٱسْتَغْفِرِ ٱللَّهَ إِنَّ ٱللَّهَ كَانَ غَفُورًا رَّحِيمًا﴾ [النساء: ١٠٦]. وَقَالَ تَعَالَى: ﴿فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَٱسْتَغْفِرْهُ إِنَّهُۥ كَانَ تَوَّابًۢا﴾ [النصر: ٣]. وَقَالَ تَعَالَى: ﴿لِلَّذِينَ ٱتَّقَوْا۟ عِندَ رَبِّهِمْ جَنَّٰتٌ تَجْرِى﴾ إلى قوله عزَّ وجلَّ: ﴿وَٱلْمُسْتَغْفِرِينَ بِٱلْأَسْحَارِ﴾ [آل عمران: ١٥-١٧]. وقال تعالى: ﴿وَمَن يَعْمَلْ سُوٓءًا أَوْ يَظْلِمْ نَفْسَهُۥ ثُمَّ يَسْتَغْفِرِ ٱللَّهَ يَجِدِ ٱللَّهَ غَفُورًا رَّحِيمًا﴾ [النساء: ١١٠]. وقال تعالى: ﴿وَمَا كَانَ ٱللَّهُ لِيُعَذِّبَهُمْ وَأَنتَ

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ప్రవక్తా! నీ పొరపాట్లకు 'క్షమాభిక్ష పెట్టుము' అని వేడుకో, విశ్వాసులైన స్త్రీ పురుషుల పొరపాట్లకు కూడా." *(ముహమ్మద్:19)*

"క్షమాభిక్ష కొరకు అల్లాహ్‌ను ప్రార్థించు. ఆయన ఎక్కువగా క్షమించేవాడు, అధికంగా కరుణించేవాడూను." *(నిసా:106)*

"(ప్రవక్తా!) నీవు నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్ర నామాన్ని స్మరించు. ఇంకా ఆయన మన్నింపు వేడుకో. నిస్సందేహంగా ఆయన పశ్చాత్తాపాన్ని ఎంతగానో అంగీకరించేవాడు." *(నస్ర్ : 3)*

"భయభక్తులు కలవారికొరకు వారి ప్రభువు వద్ద ఉద్యానవనాలు ఉన్నాయి.... క్షమించు అని వారు రాత్రి చివరి గడియలలో అల్లాహ్‌ను వేడుకుంటారు. (వరకు)" *(ఆలి ఇమ్రాన్: 15-17)*

"చెడ్డపని చేసినవాడు లేదా తన ఆత్మకు అన్యాయం చేసుకున్నవాడు తరువాత క్షమాభిక్ష పెట్టు అని అల్లాహ్‌ను ప్రార్థిస్తే అతడు అల్లాహ్‌ను క్షమించేవాడుగా కరుణామయుడుగా తెలుసుకుంటాడు." *(నిసా : 110)*

فِيهِمْ وَمَا كَانَ اللَّهُ مُعَذِّبَهُمْ وَهُمْ يَسْتَغْفِرُونَ﴾ [الأنفال: ٣٣]. وقالَ تَعالى: ﴿وَالَّذِينَ إِذَا فَعَلُوا فَاحِشَةً أَوْ ظَلَمُوا أَنفُسَهُمْ ذَكَرُوا اللَّهَ فَاسْتَغْفَرُوا لِذُنُوبِهِمْ وَمَن يَغْفِرُ الذُّنُوبَ إِلَّا اللَّهُ وَلَمْ يُصِرُّوا عَلَىٰ مَا فَعَلُوا وَهُمْ يَعْلَمُونَ﴾ [آل عمران: ١٣٥] والآيات في الباب كثيرة مَعْلُومة.

"నీవు వారిమధ్య ఉన్నప్పుడు, అల్లాహ్ వారిపై అపదను అవతరింపజేయడు. ప్రజలు క్షమాభిక్ష కొరకు ప్రార్థిస్తూ ఉంటే, వారిని శిక్షించటం అనేది అల్లాహ్ సంప్రదాయం కాదు." *(అన్‌ఫాల్: 33)*

"..........ఎప్పుడైనా ఏదైనా అశ్లీలకార్యం వారివల్ల జరిగిపోతే లేదా ఏదైనా పాపం చేసి, వారు తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నట్లయితే, వెంటనే వారికి అల్లాహ్ జ్ఞాపకం వస్తాడు. అప్పుడు వారు ఆయనను 'మా తప్పులు క్షమించు' అని వేడుకుంటారు- ఎందుకంటే అల్లాహ్ తప్ప పాపాలను క్షమించగలిగే వాడెవడున్నాడని? వారు తాము చేసిన తప్పులను గురించి బుద్ధిపూర్వకంగా మొండివాదం చెయ్యరు."

*(ఆలి ఇమ్రాన్:135)*

ఈ అధ్యాయానికి సంబంధించిన సుప్రసిద్ధ హదీసులు చాలా ఉన్నాయి.

١٨٧١ - وَعَنِ الأَغَرِّ الْمُزَنِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّهُ لَيُغَانُ عَلَى قَلْبِي، وَإِنِّي لأَسْتَغْفِرُ اللهَ فِي الْيَوْمِ مِائَةَ مَرَّةٍ» رَوَاهُ مُسْلِم.

1871. హజ్రత్ అగర్ర్ ముజనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: (కొన్నికొన్ని సార్లు) నా హృదయం మీద కూడా ఒక తెర లాంటిది కమ్ముకుంటూ ఉంటుంది. అయితే నేను రోజుకి వందసార్లు అల్లాహ్‌ను క్షమాభిక్ష కోసం వేడుకుంటూ ఉంటాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జిక్ర్, దుఆల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

'గైన్' మరియు 'గైమ్' రెండూ ఒకే అర్థం కలిగిన పదాలు. మేఘాలు కమ్ముకోవటమని వాటికి అర్థం. పై హదీసుకు భావం ఏమిటంటే దైవప్రవక్త (సల్లం) అనునిత్యం అల్లాహ్ ధ్యానంలో

నిమగ్నులై ఉండేవారు. కాని అప్పుడప్పుడూ పనుల ఒత్తిడి వల్ల లేక మానవ సహజమైన బలహీనతల కారణంగా ఆయన మనసుమీద కూడా ఏమరుపాటు తెర కమ్ముకునేది. ఈ స్థితి చాలా కొద్ది సమయం, కొన్ని క్షణాలు మాత్రమే ఉన్నప్పటికీ దైవప్రవక్త(సల్లం) ఎంతో గొప్పస్థానంలో ఉన్నందున ఆ చిన్నపాటి అజాగ్రత్తే తనకు పెద్ద పొరపాటుగా అనిపించేది. అందువల్ల ఆయన దైవాన్ని క్షమాపణలు వేడుకునేవారు. ఈ హదీసులో ఆయనకు పెద్ద గుణపాఠం ఉంది. మనం లెక్కలేనన్ని తప్పులు, పాపాలు చేస్తుంటాం. అయినా కూడా మనం ఎన్నడూ అల్లాహ్ వైపు మరలి క్షమాభిక్ష కోసం ఆయన్ని వేడుకోము. మరోవైపు మన ప్రవక్త (సల్లం) క్షమించబడినవారు, అత్యంత పునీతులు. అయినా కూడా ఆయన ఎన్నోసార్లు దైవ సన్నిధిలో క్షమాభిక్ష కోసం వేడుకునేవారు. (సల్లల్లాహు అలైహి వసల్లం!)

١٨٧٢ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «واللهِ! إنِّي لأَسْتَغْفِرُ اللهَ وَأَتُوبُ إِلَيْهِ فِي الْيَوْمِ أَكْثَرَ مِنْ سَبْعِينَ مَرَّةً» رَوَاهُ البخاري.

1872. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు: దైవం సాక్షి! నేను రోజుకు డెబ్బై కంటే ఎక్కువసార్లు అల్లాహ్‌ను క్షమాపణకై వేడుకుంటాను. ఆయన సన్నిధిలో పశ్చాత్తాప పడతాను. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీ: కితాబుద్దావాత్)*

١٨٧٣ - وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «وَالَّذِي نَفْسِي بِيَدِهِ لَوْ لَمْ تُذْنِبُوا، لَذَهَبَ اللهُ تَعَالَى بِكُمْ، وَلَجَاءَ بِقَوْمٍ يُذْنِبُونَ فَيَسْتَغْفِرُونَ اللهَ تَعَالَى فَيَغْفِرُ لَهُمْ» رواه مسلم.

1873. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఎవరి చేతిలోనయితే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను: మీరు పాపాలు చేయకపోతే అల్లాహ్ మిమ్మల్ని తుదముట్టించి మరో సృష్టిని ఉనికిలోకి తీసుకువచ్చి ఉండేవాడు. వారు పాపాలు చేసి అల్లాహ్‌ను క్షమాపణకై వేడుకునేవారై ఉంటారు. అల్లాహ్ వారిని క్షమిస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని తౌబా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసుకు భావం అల్లాహ్ పాపప్రవృత్తిని ఇష్టపడతాడని కాదు, పైగా ఇందులో మన్నింపు ప్రార్థనల యొక్క ప్రాముఖ్యత బోధించబడింది. మనిషి అన్నాక అతని వల్ల తప్పులు ఎలాగూ జరుగుతాయి. తప్పుచేయని మానవుడు ఈ లోకంలో ఎవడూలేడు. కాని తప్పు చేసిన తర్వాత ఆ తప్పుని సమర్థించుకోకుండా పశ్చాత్తాపభావంతో అల్లాహ్‌ను క్షమాభిక్షకై వేడుకునేవారిని, ఆయన సన్నిధిలో విలపించేవారిని అల్లాహ్ అమితంగా ఇష్టపడతాడు.

١٨٧٤ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنهُمَا قَالَ: كُنَّا نَعُدُّ لِرَسُولِ اللهِ ﷺ فِي المَجْلِسِ الْوَاحِدِ مِائَةَ مَرَّةٍ: «رَبِّ اغْفِرْ لِي، وَتُبْ عَلَيَّ إِنَّكَ أَنتَ التَّوَّابُ الرَّحِيمُ» رواه أبو داود، والترمذي وقال: حديث صحيح.

1874. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఒకే ఒక సదనంలో వందసార్లు దైవాన్ని (ఈ విధంగా) క్షమాభిక్ష వేడుకోవటాన్ని మేము లెక్కపెట్టేవాళ్ళము: "అల్లాహ్! నన్ను క్షమించు. నన్ను మన్నించు. నిశ్చయంగా నీవు అమితంగా మన్నించేవాడవు. అత్యంత దయామయుడవు." (అబూదావూద్, తిర్మిజీ, ఇమామ్ తిర్మిజీ ఈ హదీసును 'సహీహ్'గా పేర్కొన్నారు.)

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని దుఆల అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

దుఆ చేసేటప్పుడు ప్రార్థించే విషయానికి అనుగుణంగా దేవుని గుణగణాలను ప్రస్తుతించటం మంచిదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

١٨٧٥ - وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ لَزِمَ الاسْتِغْفَارَ، جَعَلَ اللهُ لَهُ مِنْ كُلِّ ضِيقٍ مَخْرَجاً، وَمِنْ كُلِّ هَمٍّ فَرَجاً، وَرَزَقَهُ مِنْ حَيْثُ لا يَحْتَسِبُ» رَوَاهُ أبو داود.

1875. హజ్రత్ ఇబ్నె అబ్బాస్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఎవడైతే క్షమాభిక్ష వేడుకోవటాన్ని నిత్యకృత్యంగా చేసుకుంటాడో అల్లాహ్ అతన్ని అన్ని రకాల ఇరకాటాల నుంచి బయటపడే మార్గాలను సృష్టిస్తాడు. అన్ని రకాల దుఃఖాల

నుంచి విముక్తిని ప్రసాదిస్తాడు. అతను ఊహించని చోటు నుంచి అతనికి ఉపాధిని ప్రసాదిస్తాడు.

(అబూదావూద్)

(సుననె అబూదావూద్‌లోని నమాజు ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

ఆధారాల రీత్యా పై హదీసు బలహీనమైనది. వివరాల కోసం చూడండి: అల్ అహాదీ సుజ్జయీఫా, రెండో సంపుటి: 142వ పుట. 705వ హదీసు.

1876. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రబోధించారు: "నేను అల్లాహ్‌ను క్షమాభిక్ష పెట్టమని ప్రార్థిస్తున్నాను. ఆయన తప్ప మరొక ఆరాధ్యదేవుడు లేనేలేడు. ఆయన సజీవుడు, పర్యవేక్షకుడు. నేను ఆయన వైపే మరలుతున్నాను" అని ఎవరైతే అంటాడో అతని పాపాలన్నీ క్షమించబడతాయి. అతను జిహాద్ నుండి వెన్ను తిప్పి పారిపోయిన పాపానికి పాల్పడివున్నా సరే. (అబూదావూద్, తిర్మిజీ, హాకిమ్‌లు ఈ హదీసును వెలికితీశారు. ఈ హదీసు బుఖారీ-ముస్లింల నియమాలననుసరించి హాకిమ్ పేర్కొన్నారు.)

١٨٧٦ ـ وَعَنِ ابْنِ مَسْعودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ قَالَ: أَسْتَغْفِرُ اللهَ الَّذِي لَا إِلٰهَ إِلَّا هُوَ الحَيَّ القَيُّومَ وَأَتُوبُ إِلَيْهِ، غُفِرَتْ ذُنُوبُهُ وَإِنْ كَانَ قَدْ فَرَّ مِنَ الزَّحْفِ» رواه أبو داود والترمذي والحَاكِمُ، وَقَالَ: حَدِيثٌ صحيحٌ عَلَى شَرْطِ البُخَارِيِّ وَمُسْلِمٍ.

(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం - సుననె తిర్మిజీలోని నమాజ్ అధ్యాయాలు)

**ముఖ్యాంశాలు**

బుఖారీ-ముస్లింల నియమాలననుసరించి దృఢమైనదంటే ఆ హదీసును బుఖారీ-ముస్లింలలోని ఉల్లేఖకులు ఉటంకించి ఉండాలి. అంతేకాదు ఒక హదీసును ఉల్లేఖించినప్పుడు

బుఖారీ-ముస్లిం గ్రంథకర్తలు ఏ నియమాల నైతే దృష్టిలో పెట్టుకుంటారో ఆ హదీసు కూడా ఆ నియమాలకు అనుగుణంగా ఉల్లేఖించబడి ఉండాలి.

١٨٧٧ - وَعَن شَدَّادِ بْنِ أَوْسٍ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «سَيِّدُ الاسْتِغْفَارِ أَنْ يَقُولَ الْعَبْدُ: اللَّهُمَّ أَنْتَ رَبِّي، لَا إِلَهَ إِلَّا أَنْتَ خَلَقْتَنِي وَأَنَا عَبْدُكَ، وَأَنَا عَلَى عَهْدِكَ وَوَعْدِكَ مَا اسْتَطَعْتُ أَعُوذُ بِكَ مِنْ شَرِّ مَا صَنَعْتُ، أَبُوءُ لَكَ بِنِعْمَتِكَ عَلَيَّ، وَأَبُوءُ بِذَنْبِي؛ فَاغْفِرْ لِي، فَإِنَّهُ لا يَغْفِرُ الذُّنُوبَ إِلَّا أَنْتَ. مَنْ قَالَها مِنَ النَّهَارِ مُوقِناً بِهَا، فَمَاتَ مِنْ يَوْمِهِ قَبْلَ أَنْ يُمْسِيَ، فَهو مِنْ أَهْلِ الجَنَّةِ، وَمَنْ قَالَهَا مِنَ اللَّيْلِ وَهُوَ مُوقِنٌ بها فَمَاتَ قَبْلَ أَنْ يُصْبِحَ، فَهُوَ مِنْ أَهْلِ الجَنَّةِ» رواه البخاري.

«أَبُوءُ» بباءٍ مَضمومَةٍ ثُمَّ واوٍ وهمزةٍ ممدودةٍ، وَمَعْنَاهُ: أُقِرُّ وَأَعْتَرِفُ.

1877. హజ్రత్ షద్దాద్ బిన్ ఔస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఇలా వేడుకోవటం సయ్యిదుల్ ఇస్తిగ్ఫార్: "ఓ అల్లాహ్! నీవు నా ప్రభువువి. నీవు తప్ప ఆరాధ్య దేవుడు మరొకడు లేడు. నీవు నన్ను పుట్టించావు. నేను నీ దాసుణ్ణి. నీతో చేసిన ప్రమాణాన్ని, వాగ్దానాన్ని నా శక్తి మేరకు నెరవేర్చటానికి కృషి చేస్తున్నాను. నేను చేసుకున్న చెడు పనుల కీడు నుండి నీ శరణు కోరుతున్నాను. నీవు నాకు చేసిన ఉపకారాలను ఒప్పుకుంటున్నాను. నా పాపాలను అంగీకరిస్తున్నాను. నన్ను క్షమించు. నీవు తప్ప క్షమించేవాడు ఎవడూ లేడు."

ఎవడైనా పగటిపూట మనస్ఫూర్తిగా దీనిని పఠించి సాయంత్రానికల్లా అతను చనిపోతే అతను స్వర్గానికి వెళ్తాడు. మరెవడైనా రాత్రిపూట మనస్ఫూర్తిగా దీనిని పఠించి ఉదయం కాకముందే మరణిస్తే అతను స్వర్గానికి వెళ్తాడు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని హియజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో మన్నింపు వేడుకునే ముందు పాటించవలసిన కొన్ని నియమాలు వివరించబడ్డాయి. ఉదా: అల్లాహ్ అస్తిత్వం మీద, ఆయన గుణగణాల మీద పూర్తి విశ్వాసం,

నమ్మకం ఉండాలి. అల్లాహ్ చేసిన మేళ్ళను గుర్తుకు తెచ్చుకోవాలి. తాము చేసిన పాపాలను ఒప్పుకోవాలి. దైవసన్నిధిలో వినమ్రత, అణకువ భావాలను ప్రదర్శించాలి. పైన పేర్కొనబడిన దుఆలో ఈ విషయాలన్నీ ఉన్నాయి కాబట్టి దాన్ని 'సయ్యిదుల్ ఇస్తిగ్‌ఫార్ (మన్నింపు ప్రార్థనల నాయకుడు)' అన్నారు.

١٨٧٨ ـ وَعَنْ ثَوْبَانَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ إذا انْصَرَفَ مِنْ صَلاتِهِ، اسْتَغْفَرَ اللهَ ثَلاثاً وَقَالَ: «اللَّهُمَّ أَنْتَ السَّلامُ وَمِنْكَ السَّلامُ، تَبَارَكْتَ يا ذَا الجَلالِ والإكْرَامِ» قِيلَ لِلأوزاعِيِّ ـ وهُوَ أَحَدُ رُوَاتِهِ ـ: كَيْفَ الاسْتِغْفَارُ؟ قَالَ: يَقُولُ: أَسْتَغْفِرُ اللهَ، أَسْتَغْفِرُ اللهَ. رواه مسلم.

1878. హజ్రత్ సౌబాన్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) (సలాం తిప్పి) నమాజ్ ముగించగానే మూడుసార్లు క్షమాపణకై అల్లాహ్‌ను వేడుకునేవారు. తర్వాత ఈ విధంగా ప్రార్థించేవారు: "ఓ అల్లాహ్! నీవు శాంతమూర్తివి. శాంతి నీ తరఫు నుంచే లభిస్తుంది. ఔన్నత్యం, గొప్పదనాలు కలవాడా! నీవు గొప్ప శుభాలు కలవాడివి."

ఈ హదీసు ఉల్లేఖకుల్లో ఒకరైన అవ్‌జాయీ గారిని "దైవప్రవక్త (సల్లం) మన్నింపు ప్రార్థన ఎలా చేసేవారు?" అని అడగటం జరిగింది. అందు కాయన ఇలా చెప్పారు: దైవప్రవక్త (సల్లం) అస్తగ్‌ఫిరుల్లాహ్, అస్తగ్ ఫిరుల్లాహ్, అస్తగ్‌ఫిరుల్లాహ్ అని ప్రార్థించే వారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

١٨٧٩ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: كَانَ رَسُولُ اللهِ ﷺ يُكْثِرُ أَنْ يَقُولَ قَبْلَ مَوْتِهِ: «سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ أَسْتَغْفِرُ اللهَ، وَأَتُوبُ إِلَيْهِ» متفقٌ عليه.

1879. హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) కథనం: దైవప్రవక్త (సల్లం) తన మరణానికి ముందు ఈ పలుకులు అత్యధికంగా పలుకుతూ ఉండేవారు: "ఓ అల్లాహ్! నేను నీ పవిత్రతను కొనియాడుతున్నాను. నీ స్తోత్రంతో పాటు,

నేను నీ క్షమాపణలకై వేడుకుంటు న్నాను. నీ సన్నిధిలో పశ్చాత్తాప పడు తున్నాను.” (బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని నమాజు ప్రకరణం)

## ముఖ్యాంశాలు

నిజం చెప్పాలంటే అనునిత్యం క్షమాపణల కోసం దైవాన్ని వేడుకుంటూ ఉండాలి. అయితే జీవితపు చివరి దశలో దీని ప్రాముఖ్యత మరింత పెరిగిపోతుంది. దీన్ని ఆచరిస్తే దైవప్రవక్త (సల్లం) గారి సున్నత్‌ను కూడా ఆచరించినట్లవుతుంది.

١٨٨٠ - وَعَنْ أَنسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «قَالَ اللهُ تَعَالَى: يَا ابْنَ آدَمَ! إِنَّكَ مَا دَعَوْتَنِي وَرَجَوْتَنِي غَفَرْتُ لَكَ عَلَى مَا كَانَ مِنْكَ وَلَا أُبَالِي، يَا ابْنَ آدَمَ! لَوْ بَلَغَتْ ذُنُوبُكَ عَنَانَ السَّماءِ، ثُمَّ اسْتَغْفَرْتَنِي، غَفَرْتُ لَكَ وَلا أُبَالِي، يَا ابْنَ آدَمَ! إِنَّكَ لَوْ أَتَيْتَنِي بِقُرَابِ الأَرْضِ خَطَايَا، ثُمَّ لَقِيتَنِي لا تُشْرِكُ بِي شَيْئاً، لأَتَيْتُكَ بِقُرابِها مَغْفِرَةً» رواه الترمذي وَقَالَ: حَدِيثٌ حَسَنٌ. «عَنَانَ السَّمَاءِ» بِفَتْحِ العَيْنِ: قِيلَ: هُوَ السَّحَابُ، وَقِيلَ: هُوَ مَا عَنَّ لَكَ مِنْها، أيْ: ظَهَرَ، وَ«قُرَابُ الأَرْضِ» بِضَمِّ القافِ، وَرُوِيَ بِكَسْرِهَا، والضَّمُّ أَشْهَرُ، وهُوَ مَا يُقَارِبُ مَلأَها.

1880. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అనస్ (రజి) తెలిపారు: అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు: ఓ ఆదం పుత్రుడా! నీవు నన్ను ప్రార్థిస్తూ ఉన్నంతకాలం, నా మీద ఆశతో ఉన్నంతకాలం నీవు ఎట్టి పరిస్థితుల్లో ఉన్నా నాకు ఫర్వా లేదు. నేను నిన్ను క్షమిస్తూ ఉంటాను. ఓ ఆదం పుత్రుడా! నీ పాపాలు ఆకాశాన్ని అంటుకుంటున్నా ఫర్వాలేదు. నువ్వు క్షమాభిక్షకై నన్ను వేడుకుంటే నేను నిన్ను క్షమిస్తాను. ఓ ఆదం పుత్రుడా! నువ్వు నాతోపాటు మరెవరినీ సాటిగా నిలబెట్టని స్థితిలో భూమి నిండా పాపాలు తీసుకొని నా దగ్గరికి వస్తే నేను కూడా భూమి నిండా క్షమాపణలు తీసుకొని వచ్చి నిన్ను కలుస్తాను. (తిర్మిజీ-హసన్)

(సుననె తిర్మిజీలోని దుఆల అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో పాపాత్ములకు శుభవార్త ఉంది. కాని ఎలాంటి పాపాత్ములు? పాపం చేసి దాన్ని సమర్థించుకోని వారికి! నిజమైన మనస్సుతో పశ్చాత్తాపపడి అల్లాహ్‌ను క్షమించమని వేడుకునే వారికి!! పాపాలు ఎన్ని వున్నా నిరాశ చెందాల్సిన అవసరం లేదు. అల్లాహ్ కారుణ్యం ఎంతో విశాలమైనది. అయితే పాపం క్షమించబడటానికి ఒక నియమం ఉంది. ఆ పాపాన్ని అదే పనిగా చేస్తుండరాదు. దాన్ని సమర్థించుకోరాదు. ఒకవైపు మాటిమాటికి ఉద్దేశ్యపూర్వకంగా తప్పు చేస్తూనే మరోవైపు తౌబా చేసుకుంటూ, పశ్చాత్తాపపడుతూ ఉండటంలో అర్థం లేదు. మనిషి తను చేస్తున్న పాపం వదలిపెట్టకుండా, మాటిమాటికీ దానికి పాల్పడుతూ దాని గురించి అల్లాహ్‌ను, “అల్లాహ్! నన్ను క్షమించు....” అని వేడుకోవటం ఆశ్చర్యకరమైన విషయం. పైగా దీన్ని పరిహాసమని చెప్పుకోవాలి. కనుక ఈ అధ్యాయంలో పేర్కొనబడుతున్న హదీసులను చూసి కేవలం నోటితో ‘అస్తగ్ఫిరుల్లాహ్’ చదువుకుంటే పాపాలన్నీ క్షమించబడతాయని తలపోయటం ఒట్టి అమాయకత్వం. ఎందుకంటే, “అస్తగ్ఫిరుల్లాహ్’ అని నోటితో పఠించటం ‘తౌబా’ కాదు. అదొక విన్నపం, ప్రార్థన మాత్రమే. దాన్ని అల్లాహ్ తన శాసనానికి అనుగుణంగా అంగీకరించనూ వచ్చు. తిరస్కరించనూ వచ్చు. అసలు తౌబా అంటే మనిషి తను చేస్తున్న పాపాన్ని త్యజించాలి. తర్వాత దైవసన్నిధిలో దానిగురించి పశ్చాత్తాపపడాలి. భవిష్యత్తులో ఇంకెప్పుడూ ఆ పాపం చేయనని మనసులో గట్టిగా నిశ్చయించుకోవాలి. ఇలాంటి నిజమైన తౌబాను అల్లాహ్ తప్పకుండా అంగీకరిస్తాడు.

١٨٨١ - وَعَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «يَا مَعْشَرَ النِّسَاءِ! تَصَدَّقْنَ وَأَكْثِرْنَ مِنَ الاسْتِغْفَارِ؛ فَإِنِّي رَأَيْتُكُنَّ أَكْثَرَ أَهْلِ النَّارِ» قَالَتِ امْرَأَةٌ مِنْهُنَّ: مَا لَنَا أَكْثَرَ أَهْلِ النَّارِ؟ قَالَ: «تُكْثِرْنَ اللَّعْنَ، وَتَكْفُرْنَ الْعَشِيرَ مَا رَأَيْتُ مِنْ نَاقِصَاتِ عَقْلٍ وَدِينٍ أَغْلَبَ لِذِي لُبٍّ مِنْكُنَّ» قَالَتْ: مَا نُقْصَانُ

1881. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఓ మహిళల్లారా! మీరు దానధర్మాలు చేయండి. ఎక్కువగా మన్నింపు ప్రార్థనలు చేసుకుంటూ ఉండండి. ఎందుకంటే నరకవాసుల్లో మీరే ఎక్కువగా ఉండటం నేను చూశాను.

దానికి ఒక స్త్రీ సందేహపడుతూ, “నరకవాసుల్లో ఎక్కువగా మేమే ఎందుకుంటాం?” అని అడిగింది. అందుకు దైవప్రవక్త (సల్లం), “మీరు అతి ఎక్కువగా శాపనార్థాలు పెడుతూ

الْعَقْلِ والدِّينِ؟ قَالَ: «شَهَادَةُ امْرَأَتَيْنِ بِشَهَادَةِ رَجُلٍ، وَتَمْكُثُ الأَيَّامَ لا تُصَلِّي» رواه مسلم.

ఉంటారు. మీ భర్తల పట్ల కృతఘ్నతా వైఖరికి పాల్పడుతుంటారు. మేధ పరంగా, ధర్మపరంగా లోపం గలవారైనప్పటికీ తెలివిగలవారి మీద మీ స్త్రీల కంటే ఎక్కువగా ఆధిపత్యం సాధించే వారిని నేనెవర్నీ చూడలేదు'' అని అన్నారు. ''మేధపరంగా, ధర్మపరంగా ఏమిటి మాలో ఉన్నలోపం'' అని (మళ్ళీ) అడిగిందా మహిళ. అందుకు దైవప్రవక్త (సల్లం) ఇలా బదులిచ్చారు: మేధపరమైన లోపం ఏమిటంటే ఇద్దరు స్త్రీల సాక్ష్యం, ఒక పురుషుని సాక్ష్యానికి సమానం (ఇది మేధపరమైన లోపానికి తార్కాణం). తర్వాత (బహిష్టు, పురిటి రక్త స్రావం జరిగే) కాలంలో స్త్రీ నమాజు చేయులేదు. (అలాగే రమజాన్‌లో ఉపవాసం ఉండలేదు. ఇది ఆమె ధర్మ పరమైన వెలితికి తార్కాణం).

(ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని హియజ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో స్త్రీ జాతిలోని ఒక సహజలోపాన్ని, మేధాపరమైన న్యూనతను గురించి వివరించటం జరిగింది. అంటే స్త్రీ పురుషుని కంటే తక్కువ మేధాశక్తిని కలిగివుంటుందన్న మాట. ఈ న్యూనత దృష్ట్యానే షరీఅతు స్త్రీ సాక్ష్యాన్ని పురుషుని సాక్ష్యంలో సగభాగంగా నిర్ధారించింది. అలాగే శారీరకంగా కూడా స్త్రీ పురుషుని కంటే బలహీనమైనది, సున్నితమైనది. ఆమెలోని సున్నితత్వాన్ని దృష్టిలో పెట్టుకొని ఇస్లామీయ షరీఅతు ఆమె మీద ధన సంపాదనా బాధ్యతలు లేకుండా చేసింది. ఎందుకంటే దానికోసం ఇంటి నుంచి బయటికివెళ్ళి కృషి చేయవలసి ఉంటుంది. అది ఆమె శారీరక సున్నితత్వానికి, ఇతర షరీఅత్ లక్ష్యాలకు విరుద్ధం.

ఇస్లామీయ ప్రబోధనల గురించి బొత్తిగా తెలియని నేటి ఆధునిక విద్యావంతులైన మహిళలు ఈ రెండు వాస్తవాలనూ అంగీకరించటానికి సిద్ధంగా లేరు. నిజానికి ఆ రెండు వాస్తవాలను ఎవరూ త్రోసిపుచ్చలేరు. స్త్రీ పురుషుల సమానత్వానికి పట్టుగొమ్మగా భావించబడుతున్న పాశ్చాత్య దేశాల్లో వంద సంవత్సరాల పోరాటం తర్వాత కూడా ఇప్పటికీ స్త్రీ, పురుషుల యొక్క స్థాయికి చేరుకోలేకపోయింది. నేడు కూడా అక్కడ అతిముఖ్యమైన పదవుల మీద పురుషులే తిష్టవేసి ఉన్నారు. వారి ముఖ్య జాతీయ, అంతర్జాతీయ విధానాలన్నీ పురుషుల ద్వారానే రూపొందించ బడతాయి. ముఖ్య వ్యవహారాలన్నిటిలో పురుషులకు మాత్రమే ప్రమేయం ఉంటుంది. దీని ద్వారా తెలిసేదేమిటంటే స్త్రీలు అంగీకరించినా అంగీకరించకపోయినా వారు మేధాపరంగా, శారీరకంగా పురుషులకు సమానం కాలేరన్న మాట మాత్రం నిజం.



## 372వ అధ్యాయం

# ٣٧٢ ـ بَابُ مَا أَعَدَّ اللهُ تَعَالَى لِلْمُؤْمِنِينَ فِي الْجَنَّةِ

# అల్లాహ్ విశ్వాసుల కొరకు స్వర్గంలో తయారుచేసి ఉంచినవాటి గురించి....

قَالَ اللهُ تَعَالَى: ﴿إِنَّ الْمُتَّقِينَ فِي جَنَّٰتٍ وَعُيُونٍ ۝ ادْخُلُوهَا بِسَلَٰمٍ ءَامِنِينَ ۝ وَنَزَعْنَا مَا فِي صُدُورِهِم مِّنْ غِلٍّ إِخْوَٰنًا عَلَىٰ سُرُرٍ مُّتَقَٰبِلِينَ ۝ لَا يَمَسُّهُمْ فِيهَا نَصَبٌ وَمَا هُم مِّنْهَا بِمُخْرَجِينَ﴾ [الحجر: ٤٥ ـ ٤٨].

وَقَالَ تَعَالَى: ﴿يَٰعِبَادِ لَا خَوْفٌ عَلَيْكُمُ الْيَوْمَ وَلَا أَنتُمْ تَحْزَنُونَ ۝ الَّذِينَ ءَامَنُوا بِـَٔايَٰتِنَا وَكَانُوا مُسْلِمِينَ ۝ ادْخُلُوا الْجَنَّةَ أَنتُمْ وَأَزْوَٰجُكُمْ تُحْبَرُونَ ۝ يُطَافُ عَلَيْهِم بِصِحَافٍ مِّن ذَهَبٍ وَأَكْوَابٍ وَفِيهَا مَا تَشْتَهِيهِ الْأَنفُسُ وَتَلَذُّ الْأَعْيُنُ وَأَنتُمْ فِيهَا خَٰلِدُونَ ۝ وَتِلْكَ الْجَنَّةُ الَّتِي أُورِثْتُمُوهَا بِمَا كُنتُمْ تَعْمَلُونَ ۝ لَكُمْ فِيهَا فَٰكِهَةٌ كَثِيرَةٌ مِّنْهَا تَأْكُلُونَ﴾ [الزخرف: ٦٨ ـ ٧٣].

అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

భయభక్తులు కలవారు తోటలలో చెలమల మధ్య ఉంటారు. వారితో ఇలా అనబడుతుంది: "ప్రవేశించండి వాటిలోకి, శాంతితోనూ, నిర్భయంగానూ." వారి హృదయాలలో ఇంకా మిగిలివున్న మాలిన్యాన్ని, కాపట్యాన్నీ మేము తొలగిస్తాము. వారు పరస్పరం సోదరులై ఎదురెదురుగా పీఠాలపై కూర్చుంటారు. అక్కడ వారు ఎట్టి శ్రమకూ గురికారు. అక్కడి నుంచి వారు బహిష్కరింపనూ బడరు." *(హిజ్ర్: 45-48)*

"నా దాసులారా! ఈనాడు మీకు ఏ భయమూ లేదు, మీకు ఏ దుఃఖమూ కలుగదు. మీరూ, మీ భార్యలూ స్వర్గంలో ప్రవేశించండి, మిమ్మల్ని ఆనందింపజేయటం జరుగుతుంది." వారి మధ్య బంగారు పళ్ళాలూ, గిన్నెలూ త్రిప్పబడతాయి. మనస్సు ఇష్టపడే, కళ్ళకు ఇంపుగా ఉండే ప్రతి వస్తువూ అక్కడ ఉంటుంది. వారితో ఇలా అనబడుతుంది: "ఇక మీరు ఇక్కడ శాశ్వతంగా ఉంటారు. మీరు ప్రపంచంలో చేసిన కర్మల కారణంగా మీరు ఈ స్వర్గానికి వారసులయ్యారు. మీకు ఇక్కడ పండ్లు

ఫలాలూ పుష్కలంగా లభిస్తాయి. వాటిని మీరు తింటారు." *(జుఖ్రుఫ్: 68-73)*

وَقَالَ تَعَالَى: ﴿إِنَّ ٱلْمُتَّقِينَ فِي مَقَامٍ أَمِينٍ ۝٥١ فِي جَنَّٰتٍ وَعُيُونٍ ۝٥٢ يَلْبَسُونَ مِن سُندُسٍ وَإِسْتَبْرَقٍ مُّتَقَٰبِلِينَ ۝٥٣ كَذَٰلِكَ وَزَوَّجْنَٰهُم بِحُورٍ عِينٍ ۝٥٤ يَدْعُونَ فِيهَا بِكُلِّ فَٰكِهَةٍ ءَامِنِينَ ۝٥٥ لَا يَذُوقُونَ فِيهَا ٱلْمَوْتَ إِلَّا ٱلْمَوْتَةَ ٱلْأُولَىٰ ۖ وَوَقَىٰهُمْ عَذَابَ ٱلْجَحِيمِ ۝٥٦ فَضْلًا مِّن رَّبِّكَ ۚ ذَٰلِكَ هُوَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ﴾ [الدخان: ٥١ـ٥٧].

"దైవభీతి గలవారు శాంతిభద్రతలు గల ప్రదేశంలో ఉంటారు: ఉద్యాన వనాలలో సెలయేళ్లలో, సన్నని పట్టువస్త్రాలూ, జరీ పట్టు వస్త్రాలూ ధరించి, ఒకరికొకరు ఎదురుగా కూర్చుండి ఉంటారు. ఇలా ఉంటుంది వారి దర్పం. పసిమిరంగు మేనులూ, అందమైన విశాలమైన కళ్ళూ గల స్త్రీలను వారికి ఇచ్చి వివాహం చేస్తాము. అక్కడ వారు రుచికరమైన అన్నిరకాల పదార్థాలనూ నిస్సంకోచంగా అడుగుతారు. అక్కడవారు మరణాన్ని ఎన్నటికీ రుచి చూడరు. ప్రపంచంలో వచ్చిన మరణమే మరణం. అల్లాహ్ తన కృపతో వారిని నరకశిక్ష నుండి కాపాడుతాడు. ఇదే గొప్ప సాఫల్యం." *(దుఖాన్: 51-57)*

وَقَالَ تَعَالَى: ﴿إِنَّ ٱلْأَبْرَارَ لَفِى نَعِيمٍ ۝٢٢ عَلَى ٱلْأَرَآئِكِ يَنظُرُونَ ۝٢٣ تَعْرِفُ فِى وُجُوهِهِمْ نَضْرَةَ ٱلنَّعِيمِ ۝٢٤ يُسْقَوْنَ مِن رَّحِيقٍ مَّخْتُومٍ ۝٢٥ خِتَٰمُهُۥ مِسْكٌ ۚ وَفِى ذَٰلِكَ فَلْيَتَنَافَسِ ٱلْمُتَنَٰفِسُونَ ۝٢٦ وَمِزَاجُهُۥ مِن تَسْنِيمٍ ۝٢٧ عَيْنًا يَشْرَبُ بِهَا ٱلْمُقَرَّبُونَ﴾ [المطففين: ٢٢ـ ٢٨]. والآياتُ فِي البَابِ كَثِيرَةٌ مَعْلُومَةٌ.

"నిస్సందేహంగా సజ్జనులు సుఖ సంతోషాలలో తేలియాడుతూ ఉంటారు. ఉన్నత పీఠాలపై కూర్చుండి (స్వర్గదృశ్యాలను) తిలకిస్తూ ఉంటారు. వారి ముఖాలలో నీకు సుఖసంతోషాల కళాకాంతులు కనిపిస్తాయి. ముద్రవేయ బడిన, సుమధుర మధువు వారికి ఇవ్వబడు తుంది. దానిపై కస్తూరి ముద్ర వేయబడి ఉంటుంది. ఇతరుల్ని మించిపోవాలని కోరుకునేవారు దీన్ని పొందే విషయంలో మించిపోవటానికి కృషి చేయాలి. ఆ మధువులో తస్నీమ్ కలిసి ఉంటుంది. ఇదొక సెలయేరు, దీని జలముతోపాటు దైవసాన్నిధ్యం పొందిన వారు మధువు సేవిస్తారు."

*(ముతఫ్ఫిఫీన్ : 22-28)*

ఈ అధ్యాయంలో సుప్రసిద్ధమైన ఇలాంటి సూక్తులు ఇంకా ఎన్నో ఉన్నాయి.

١٨٨٢ - وَعَنْ جَابِرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «يَأْكُلُ أَهْلُ الجَنَّةِ فِيهَا، وَيَشْرَبُونَ، وَلا يَتَغَوَّطُونَ، وَلا يَمْتَخِطُونَ، وَلا يَبُولُونَ؛ وَلكِنْ طَعَامُهُمْ ذَلِكَ جُشَاءٌ كَرَشْحِ المِسْكِ، يُلْهَمُونَ التَّسْبِيحَ وَالتَّكْبِيرَ، كَمَا يُلْهَمُونَ النَّفَسَ». رواه مسلم.

1882. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గ వాసులు స్వర్గంలో తింటారు, త్రాగుతారు, కాని వారికి కాలకృత్యాలు తీర్చుకోవాల్సిన అవసరం ఉండదు. వారి ముక్కులో మలినాలు ఉండవు. వారికి మూత్ర విసర్జన చేసే అవసరం ఉండదు. వారు తిన్న తర్వాత వారికి ఒక త్రేన్పు వస్తుంది (ఆ త్రేన్పుతో తిన్నది మొత్తం అరిగి పోతుంది). కస్తూరి చెమటలాగా (అంటే త్రేన్పు కూడా సుగంధభరితంగా ఉంటుంది లేక వారి చెమట కస్తూరి వాసనలాగా సుగంధ భరితంగా ఉంటుంది). మనిషి దేహంలో శ్వాస ప్రక్రియ సృజించ బడినట్లు వారిలో తస్బీహ్, తక్బీర్ (ధ్యానం) సృజించబడు తుంది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని స్వర్గప్రకరణం)

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో భోజనం చేసిన తర్వాత ఒళ్లు బద్ధకమైపోతుంది. దానిమూలంగా పుల్లటి త్రేన్పులు వస్తాయి. కాని స్వర్గంలో అలా కాదు. అక్కడ ఆహారం తీసుకున్న తర్వాత వచ్చే త్రేన్పులు కస్తూరి సువాసన లాగా ఆహ్లాదభరితంగా ఉంటాయి. ఒక్క త్రేన్పుతోనే తిన్నదంతా అరిగిపోతుంది. మలమూత్ర విసర్జన అవసరం కూడా ఉండదు. అదే విధంగా శరీరంలో శ్వాస ఆడినట్లు వారి నోళ్ల నుంచి దైవస్తోత్రం వెలువడుతూ ఉంటుంది. శ్వాస తీసుకొని వదులుతూ ఉండే పనిలో మనిషికి ఎలాంటి ఇబ్బంది ఉండదు. అసలు శ్వాస పీల్చుకోవాలని ప్రత్యేకంగా సంకల్పించుకోవాల్సిన అవసరం కూడా ఉండదు. స్వర్గవాసుల నోటి నుంచి దైవస్తోత్రం అంత సహజంగా వెలువడుతుంది. స్వర్గవాసులు తీసుకునే ఆహారం ఎంతో తేలికగా ఉంటుంది. దానిమూలంగా అసహ్యాకరమైన మలమూత్ర విసర్జనలు ఉండవు. ఆ ఆహారం జీర్ణమయ్యేన తర్వాత సుగంధభరితమైన త్రేన్పులు వస్తాయి. శరీరం నుంచి కస్తూరి లాంటి చెమట వస్తుంది.

١٨٨٣ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «قَالَ اللهُ تَعَالَى: أَعْدَدْتُ لِعِبَادِيَ الصَّالِحِينَ مَا لَا عَيْنٌ رَأَتْ، وَلَا أُذُنٌ سَمِعَتْ وَلَا خَطَرَ عَلَى قَلْبِ بَشَرٍ، وَاقْرَؤُوا إِنْ شِئْتُمْ: ﴿ فَلَا تَعْلَمُ نَفْسٌ مَّآ أُخْفِيَ لَهُم مِّن قُرَّةِ أَعْيُنٍ جَزَآءًۢ بِمَا كَانُوا۟ يَعْمَلُونَ ﴾ [السجدة: ١٧]» متفقٌ عَلَيْهِ.

1883. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ ఇలా అంటున్నాడు: నేను సజ్జనులైన నా దాసుల కొరకు ఎలాంటి వస్తువును తయారుచేసి ఉంచానంటే, దాన్ని చూసిన కళ్ళు లేవు. దాని గురించి విన్న చెవులులేవు. కనీసం దాన్ని ఊహించిన మానవ హృదయం కూడా లేదు. కావాలంటే దివ్యఖుర్‌ఆన్‌లోని ఈ సూక్తి చదవండి: "వారి కర్మలకు ప్రతి ఫలంగా కళ్ళకు చలువ కలిగించే ఎటు వంటి సామగ్రి వారి కొరకు దాచిపెట్ట బడిందో ఆ సామగ్రిని గురించి ఏ ప్రాణికీ తెలియదు." (సజ్‌దహ్:17)

(బుఖారీ, ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

١٨٨٤ ـ وَعَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «أَوَّلُ زُمْرَةٍ يَدْخُلُونَ الْجَنَّةَ عَلَى صُورَةِ الْقَمَرِ لَيْلَةَ الْبَدْرِ، ثُمَّ الَّذِينَ يَلُونَهُمْ عَلَى أَشَدِّ كَوْكَبٍ دُرِّيٍّ فِي السَّمَاءِ إِضَاءَةً: لَا يَبُولُونَ، وَلَا يَتَغَوَّطُونَ، وَلَا يَتْفُلُونَ، وَلَا يَمْتَخِطُونَ، أَمْشَاطُهُمُ الذَّهَبُ، وَرَشْحُهُمُ الْمِسْكُ، وَمَجَامِرُهُمُ الأَلُوَّةُ ـ عُودُ الطِّيبِ ـ أَزْوَاجُهُمُ الْحُورُ الْعِينُ،

1884. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గం లోకి ప్రవేశించే మొట్టమొదటి సమూహంలోని ప్రజల ముఖాలు పున్నమి రాత్రి చంద్రునిలా ప్రకాశిస్తూ ఉంటాయి. వారి తర్వాత స్వర్గంలో ప్రవేశించేవారి ముఖాలు ఆకాశంలోని అత్యంత ప్రకాశవంతమైన నక్షత్రాల మాదిరిగా ప్రకాశిస్తూ ఉంటాయి. స్వర్గ వాసులు మలమూత్ర విసర్జన చేయరు. వారు ఉమ్మరు, ముక్కు

عَلَى خَلْقِ رَجُلٍ وَاحِدٍ عَلَى صُورَةِ أَبِيهِمْ آدَمَ سِتُّونَ ذِرَاعاً فِي السَّمَاءِ» متفقٌ عليه. وَفِي رِوَايَةٍ لِلْبُخَارِيِّ وَمُسْلِمٍ: «آنِيَتُهُمْ فِيهَا الذَّهَبُ، وَرَشْحُهُمُ المِسْكُ، وَلِكُلِّ وَاحِدٍ مِنْهُمْ زَوْجَتَانِ يُرَى مُخُّ سُوقِهِمَا مِنْ وَرَاءِ اللَّحْمِ مِنَ الْحُسْنِ، لَا اخْتِلَافَ بَيْنَهُمْ، وَلَا تَبَاغُضَ: قُلُوبُهُمْ قَلْبُ وَاحِدٍ، يُسَبِّحُونَ اللهَ بُكْرَةً وَعَشِيًّا». قَوْلُهُ: «عَلَى خَلْقِ رَجُلٍ وَاحِدٍ» رواهُ بَعْضُهُمْ بِفَتْحِ الخَاءِ وَإِسْكَانِ اللَّامِ، وَبَعْضُهُمْ بِضَمِّهِمَا، وَكِلَاهُمَا صَحِيحٌ.

కూడా చీదరు. వారి దువ్వెనలు బంగారంతో చేసినవై ఉంటాయి. వారి చెమట కస్తూరిలాగా సువాసనలు వెద జల్లుతూ ఉంటుంది. వారి ఉంగరాల్లో సుగంధ భరితమైన సాంబ్రాణి జ్వలిస్తూ ఉంటుంది. వారి భార్యలు విశాలమైన కన్నులు గల స్వర్గకన్యలై ఉంటారు. స్వర్గవాసులందరి రూపాలు వారి పితా మహుడైన ఆదం రూపంలా ఒకే విధంగా ఉంటాయి. వారు (ఆదం అలైహి లాగా) అరవై బారలు ఎత్తు ఉంటారు. (బుఖారీ-ముస్లిం)

బుఖారీ - ముస్లింలోని వేరొక ఉల్లే ఖనంలో ఇలా ఉంది: స్వర్గంలో వారు ఉపయోగించే పాత్రలు బంగారంతో తయారైనవై ఉంటాయి. వారి చెమట కస్తూరి (లాగా సువాసనలు) కలిగి వుంటుంది. వారిలో ప్రతి ఒక్కరికి ఇద్దరు భార్యలు ఉంటారు. (వారు ఎంత అందంగా ఉంటారంటే) విపరీత మైన అందం మూలంగా వారి పిక్కల మాంసంలో నుంచి లోపలి గుజ్జు కూడా కనపడుతూ ఉంటుంది. వారి మధ్య విభేదాలు గాని, క్రోధ విద్వేషాలు గాని ఉండవు. వారందరి మనసులూ ఒకే మనిషి మనసులా ఉంటాయి. ఉదయం సాయంత్రం వారు అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉంటారు.

"అలా ఖల్ఖి రజులిన్ వాహిదిన్" దీన్ని అలా ఖులుఖి రజులిన్ వాహిదిన్ అని

కూడా చదువవచ్చు. అంటే వారందరి నడవడిక ఒకే విధంగా ఉంటుంది అని భావం. వాక్యానికి పై రెండు భావాలూ సరైనవే.

(బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1) స్వర్గవాసులందరూ రూపంలో ఒకేలాగుంటారు. ఒకడు పొట్టిగా మరొకడు పొడగరిగా, ఒకరు అందంగా ఉంటే మరొకడు వికారంగా ఈ విధంగా ఉండరు. హదీసులో వచ్చిన 'ఖులుఖ్' అన్న పదాన్ని వ్యాఖ్యానిస్తూ కొందరు పండితులు స్వర్గవాసులందరూ మంచి నడవడిక కలవారై ఉంటారనీ, నైతికంగా ఎంతో ఉన్నతస్థానంలో ఉంటారనీ, వారిలో అవినీతిపరుడు ఒక్కడు కూడా ఉండడని చెప్పారు.

2) ప్రతి స్వర్గవాసికి ఇద్దరు భార్యలుంటారు. అయితే ఆ ఇద్దరు భార్యలు స్వర్గకన్యలై ఉంటారా లేక ప్రపంచంలోని స్త్రీలై ఉంటారా? అన్నది ప్రశ్న. అన్నింటికంటే నిజమైన మాట ఏమిటంటే ఒక్క అమరవీరునికి తప్ప మిగతా స్వర్గవాసులందరికి స్వర్గకన్యలతో సహా కేవలం ఇద్దరు భార్యలు మాత్రమే ఉంటారు. ఎందుకంటే ప్రతి స్వర్గవాసికి 72 మంది స్వర్గకర్యలు లభిస్తారన్న హదీసు ఆధారాల రీత్యా బలహీనమైనది. అయితే తిర్మిజీలోని ఒక ప్రామాణికమైన హదీసులో అమరవీరునికి మాత్రం 72 మంది స్వర్గకన్యలు లభిస్తారని చెప్పబడింది. (తిర్మిజీ గ్రంథం, జిహాద్ మహిమోన్నతుల అధ్యాయం). అయితే ఖుర్ఆన్‌లో "స్వర్గంలో వారికి వారు కోరినవన్నీ ఉంటాయి" అని చెప్పబడింది. కనుక ఇతర స్వర్గవాసులకు ఇద్దరు కంటే ఎక్కువమంది భార్యలు లభించటం కూడా అసంభవం ఏమీ కాదు.

3) 'హూర్' అనేది 'హౌరా' అన్న పదానికి బహువచనం. తెల్లనిది, ఎర్రనిది అని దాని అర్థం. ఈ పదం 'హైరాన్' అనే పదం నుంచి వచ్చిందని చెబుతారు. స్వర్గకన్యల అందాన్ని చూసిన చూపులు సంభ్రమాశ్చర్యంలో పడిపోతాయి. అందుకని వారిని 'హూర్' అని పిలుస్తారు. 'ఈన్' అనేది 'ఐనా' అన్న పదానికి బహువచనం. లేడికన్నుల్లాగా విశాలమైన నయనాలు కలదని భావం. ఒక హదీసులో స్వర్గకన్యల సౌందర్యం గురించి ఇలా వర్ణించబడింది: వారిలో ఏ స్త్రీ అయినా ప్రపంచంలోకి తొంగిచూస్తే భూమ్యాకాశాల మధ్యనున్న ప్రదేశమంతా వెలిగిపోతుంది. సుగంధపరిమళాలు గుభాళిస్తాయి. ఆమె తల మీద కప్పుకునే వోణీ ప్రపంచంలోని సిరిసంపదలన్నింటి కంటే ఖరీదైనదై ఉంటుంది. (సహీహ్ బుఖారీ, జిహాద్ ప్రకరణం)

١٨٨٥ - وَعَنِ الْمُغِيرَةِ بْنِ شُعْبَةَ رَضِيَ اللهُ عَنْهُ عَنْ رَسُولِ اللهِ ﷺ قَالَ: «سَأَلَ مُوسَى ﷺ رَبَّهُ: مَا أَدْنَى أَهْلِ الْجَنَّةِ مَنْزِلَةً؟ قَالَ: هُوَ رَجُلٌ يَجِيءُ بَعْدَ مَا أُدْخِلَ

1885. హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మూసా (సల్లల్లాహు అలైహి వసల్లం) తన ప్రభువును "స్వర్గవాసుల్లో అందరికంటే

أَهْلُ الْجَنَّةِ الْجَنَّةَ، فَيُقَالُ لَهُ: ادْخُلِ الْجَنَّةَ. فَيَقُولُ: أَيْ رَبِّ! كَيْفَ وَقَدْ نَزَلَ النَّاسُ مَنَازِلَهُمْ، وَأَخَذُوا أَخَذَاتِهِمْ؟ فَيُقَالُ لَهُ: أَتَرْضَى أَنْ يَكُونَ لَكَ مِثْلُ مُلْكِ مَلِكٍ مِنْ مُلُوكِ الدُّنْيَا؟ فَيَقُولُ: رَضِيتُ رَبِّ، فَيَقُولُ: لَكَ ذٰلِكَ وَمِثْلُهُ وَمِثْلُهُ وَمِثْلُهُ وَمِثْلُهُ، فَيَقُولُ فِي الخامسة: رضيتُ ربِّ فَيَقُولُ: هٰذَا لَكَ وَعَشَرَةُ أَمْثَالِهِ، وَلَكَ مَا اشْتَهَتْ نَفْسُكَ، وَلَذَّتْ عَيْنُكَ. فَيَقُولُ: رَضِيتُ رَبِّ، قَالَ: رَبِّ فَأَعْلَاهُمْ مَنْزِلَةً؟ قَالَ: أُولٰئِكَ الَّذِينَ أَرَدْتُ؛ غَرَسْتُ كَرَامَتَهُمْ بِيَدِي، وَخَتَمْتُ عَلَيْهَا، فَلَمْ تَرَ عَيْنٌ، وَلَمْ تَسْمَعْ أُذُنٌ، وَلَمْ يَخْطُرْ عَلَى قَلْبِ بَشَرٍ» رواهُ مُسْلم.

తక్కువ స్థాయివాడు ఎలా ఉంటాడు?" అని అడిగారు. అందుకు అల్లాహ్ ఇలా బదులిచ్చాడు: "ఈ వ్యక్తి స్వర్గ వాసు లందరూ స్వర్గంలోకి వెళ్ళిన తర్వాత వస్తాడు. అతనితో, "స్వర్గంలోకి వెళ్ళు" అని చెప్పటం జరుగుతుంది. అందు కతను, "ప్రభూ! ఇప్పుడు వెళ్ళి ఏం లాభం? ఇప్పటికే ప్రజలు తమ స్థానాల్లో నివాసముంటూ ఉంటారు. తమ భాగాలను ఆక్రమించుకొని ఉంటారు" అని అంటాడు. అప్పు డతన్ని "నీకు ప్రపంచ రాజుల్లోని ఒక రాజు యొక్క రాజ్యమంత రాజ్యం ఇక్కడ ఇవ్వబడితే అది నీకు ఇష్టమే కదా!" అని అడగటం జరుగుతుంది. అందుకతను, "ఇష్టమే ప్రభూ!" అని అంటాడు. దానికి అల్లాహ్ ఇలా అంటాడు: "నీకు ఆ రాజ్యం ఉంటుంది. ఇంకా అంత, ఇంకా అంత, ఇంకా అంత, ఇంకా అంత...." ఐదోసారి అతను, "ప్రభూ! నాకిష్టమే" అని అంటాడు. అల్లాహ్ అతనితో, "ఇదంతా నీ కోసమే. ఇంకా ఇలాంటి పదిరెట్లు అనుకో (ఇంతేకాదు) నీ మనసు కోరుకున్నది, నీకు ఆహ్లాద కరంగా కనిపించేవన్నీ (నీకోసం) ఉంటాయి" అని చెబుతాడు. అందు కతను, "ప్రభూ! నేను ప్రసన్నుణ్ణ య్యాను" అని అంటాడు.

ఇది విన్న తర్వాత మూసా ప్రవక్త, "స్వర్గ వాసుల్లో అందరికంటే గొప్పస్థానంలో

ఉండే మనిషి ఎలా ఉంటాడు?" అని అడిగారు. అందుకు అల్లాహ్ "వీరే నా ఉద్దేశితులు. వీరి గౌరవవృక్షాన్ని నేను నా చేతులతో నాటాను. ఆ తర్వాత (వారు తప్ప మరెవరూ దాన్ని చూడ కూడదని) దాన్ని సీలు చేసేశాను. దాన్ని ఏ కళ్లూ చూడలేదు. ఏ చెవులూ దాని గురించి వినలేదు. ఏ మనిషి హృదయం లోనూ దాని ఊహ కూడా రాలేదు" అని చెప్పాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

١٨٨٦ ـ وَعَنِ ابْنِ مَسْعُودٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنِّي لأَعْلَمُ آخِرَ أَهْلِ النَّارِ خُرُوجاً مِنْهَا، وَآخِرَ أَهْلِ الْجَنَّةِ دُخُولاً الْجَنَّةَ، رَجُلٌ يَخْرُجُ مِنَ النَّارِ حَبْواً؛ فَيَقُولُ اللهُ عَزَّ وَجَلَّ لَهُ: اذْهَبْ فَادْخُلِ الْجَنَّةَ، فَيَأْتِيهَا، فَيُخَيَّلُ إِلَيْهِ أَنَّهَا مَلأَى، فَيَرْجِعُ، فَيَقُولُ: يَا رَبِّ! وَجَدْتُهَا مَلأَى، فَيَقُولُ اللهُ عَزَّ وَجَلَّ لَهُ: اذْهَبْ فَادْخُلِ الْجَنَّةَ، فَيَأْتِيهَا، فَيُخَيَّلُ إِلَيْهِ أَنَّهَا مَلأَى، فَيَرْجِعُ. فَيَقُولُ: يَا رَبِّ! وَجَدْتُهَا مَلأَى، فَيَقُولُ اللهُ عَزَّ وَجَلَّ لَهُ: اذْهَبْ فَادْخُلِ الْجَنَّةَ. فَإِنَّ لَكَ مِثْلَ الدُّنْيَا وَعَشَرَةَ أَمْثَالِهَا، أَوْ: إِنَّ لَكَ مِثْلَ عَشَرَةِ أَمْثَالِ الدُّنْيَا، فَيَقُولُ: أَتَسْخَرُ بِي، أَوْ تَضْحَكُ بِي وَأَنْتَ الْمَلِكُ» قَالَ: فَلَقَدْ رَأَيْتُ رَسُولَ اللهِ ﷺ ضَحِكَ حَتَّى بَدَتْ نَوَاجِذُهُ فَكَانَ يَقُولُ: «ذٰلِكَ أَدْنَى أَهْلِ الْجَنَّةِ مَنْزِلَةً» مُتَّفَقٌ عَلَيْهِ.

1886. హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: నరకవాసుల్లో అందరికంటే చివర్లో నరకం నుంచి బయటపడే, స్వర్గంలోకి అందరికంటే చివర్లో ప్రవేశించేవాని గురించి నాకు బాగా తెలుసు. ఇతను పిరుదుల ఆధారంగా ఈడ్చుకుంటూ నరకం నుంచి బయటికి వస్తాడు. దేవుడు అతనితో, "వెళ్ళు, స్వర్గంలోకి వెళ్ళు" అని అంటాడు. అతను స్వర్గంలోకి వెళ్ళి చూస్తే అక్కడంతా నిండి ఉన్నట్లు అని పిస్తుంది అతనికి. దాంతో అతను వెనక్కి తిరిగొచ్చి, "ప్రభూ! అది పూర్తిగా నిండిపోయి ఉంది" అని అంటాడు. దానికి దేవుడు మళ్ళీ, "వెళ్ళు, స్వర్గం లోకి ప్రవేశించు" అని అంటాడు. అతను మళ్ళీ స్వర్గంలోకి వెళ్తాడు.

చూస్తే స్వర్గం పూర్తిగా నిండిపోయి (జనంతో) కిక్కిరిసి పోతున్నట్లు కనిపిస్తుంది. అతను వెనక్కి తిరిగొచ్చి స్వర్గం జనంతో నిండిపోయిందని చెబుతాడు. అప్పుడు అల్లాహ్ అతనితో, "వెళ్ళు, స్వర్గంలోకి ప్రవేశించు, నేను నీకు అక్కడ ప్రపంచమంత చోటు ఇచ్చాను. ప్రపంచమంతేమిటి, దానికి పదిరెట్లు ఎక్కువ విశాలమైన చోటే ఇచ్చాను" అని అంటాడు.

అందుకా వ్యక్తి, "ప్రభూ! తమరు (సర్వ లోకాల) చక్రవర్తి అయి ఉండి నాతో పరిహాసమాడుతున్నారా?" అని అంటాడు. ( ఆ విషయం నమ్మశక్యం కానట్టుగా).

హదీసు ఉల్లేఖకులు ఇలా తెలియజేస్తున్నారు: దైవప్రవక్త (సల్లం) ఈ విషయం చెబుతూ ఫక్కున నవ్వారు. అప్పుడు ఆయన దవడలు కూడా కనిపించాయి. తర్వాత, "ఆ వ్యక్తి స్వర్గవాసుల్లో అందరికంటే తక్కువ అంతస్తు కలవాడని" చెప్పారు.

*(బుఖారీ-ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) సాధారణంగా చిరునవ్వులు చిందిస్తూ ఉండేవారు. కాని ఒక అధమ స్థాయి స్వర్గవాసికి దైవం తరఫు నుంచి అపారమైన అనుగ్రహాలు లభించినప్పుడు అతను పడే ఆశ్చర్యాన్ని తలచుకొని ఆయన ఫక్కున నవ్వేశారు. స్వర్గవాసుల్లో అత్యంత అధమస్థాయి స్వర్గ వాసికే పదింతల ప్రపంచమంత చోటు లభించినప్పుడు అత్యున్నత స్థాయి స్వర్గవాసికి ఇంకెంత విశాలమైన చోటు, ఇంకెన్ని అద్భుతమైన అనుగ్రహాలు ప్రసాదించబడతాయో ఆలోచించండి.

١٨٨٧ ـ وَعَنْ أَبِي مُوسَى رَضِيَ اللهُ عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «إِنَّ لِلْمُؤْمِنِ فِي الْجَنَّةِ لَخَيْمَةً مِنْ لُؤْلُؤَةٍ وَاحِدَةٍ مُجَوَّفَةٍ طُولُهَا فِي السَّمَاءِ سِتُّونَ مِيلاً. لِلْمُؤْمِنِ فِيهَا أَهْلُونَ، يَطُوفُ عَلَيْهِمُ الْمُؤْمِنُ فَلاَ يَرَى بَعْضُهُمْ بَعْضاً». مُتَّفَقٌ عَلَيْهِ.
«المِيلُ»: سِتَّةُ آلافِ ذِرَاعٍ.

1887. హజ్రత్ అబూమూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గంలో విశ్వాసి కొరకు ఒక ముత్యకుటీరం ఉంటుంది. (ఆ కుటీరం మొత్తం ఒకే ఒక ముత్యంతో నిర్మించబడి ఉంటుంది). అది అరవైమైళ్ళు ఎత్తు ఉంటుంది. అందులో విశ్వాసి భార్యలు అనేక మంది ఉంటారు. విశ్వాసి వారివైపు తిరిగినప్పుడు వారిలో ఒకరు మరొకర్ని చూడలేరు. (బుఖారీ-ముస్లిం)

"మైలు' అంటే అరవై వేల గజాలు అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని సృష్టిఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్యాల ప్రకరణం)*

١٨٨٨ ـ وَعَنْ أَبِي سَعِيدٍ الْخُدرِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ فِي الْجَنَّةِ لَشَجَرَةً يَسِيرُ الرَّاكِبُ الْجَوَادَ الْمُضَمَّرَ السَّرِيعَ مِائَةَ سَنَةٍ مَا يَقْطَعُهَا» مُتَّفَقٌ عَلَيهِ.
وَرَوَيَاهُ فِي «الصَّحِيحَيْنِ» أَيْضاً مِنْ رِوَايَةِ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: «يَسِيرُ الرَّاكِبُ فِي ظِلِّهَا مِائَةَ سَنَةٍ مَا يَقْطَعُهَا».

1888. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గంలో ఒక వృక్షం ఉంది. దానిమీద బాగా తర్ఫీదునివ్వబడిన, అత్యంత వేగంగా పరిగెత్తే గుర్రం మీద రౌతు వందేళ్లు ప్రయాణించినా ఆ వృక్షానికి అంతం ఉండదు. (బుఖారీ-ముస్లిం)

బుఖారీ-ముస్లింలోనే అబూహురైరా గారి వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించినట్లు ఉంది: ఆ వృక్షం నీడలో ఒక రైతు వందేళ్ళు ప్రయాణించినా ఆ నీడ చివరి దాకా చేరుకోలేడు.

*(సహీహ్ బుఖారీలోని రిఖాఖ్ ప్రకరణం-సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హదీసులో "ముజమ్మర్" అనే పదం వచ్చింది. గుర్రాన్ని ముందు బాగా మేపి లావుగా చేస్తారు. ఆ తర్వాత దాని ఆహారాన్ని కొద్దికొద్దిగా తగ్గిస్తూ దాని బరువును తగ్గిస్తారు. ఇలాంటి గుర్రాన్నే 'ముజమ్మర్ గుర్రం" అని పిలుస్తారు. ఇది ఇతర గుర్రాలకంటే బలంగా ఉంటుంది. అత్యంత వేగంగా పరుగెత్తుతుంది. వృక్షపు నీడ అంటే బహుశా దాని కొమ్మలు కావచ్చు. ఎందుకంటే చెట్టునీడ పడటానికి స్వర్గంలో సూర్యరశ్మి ఉండదు.

١٨٨٩ ـ وَعَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ أَهْلَ الْجَنَّةِ لَيَتَرَاءَوْنَ أَهْلَ الْغُرَفِ مِنْ فَوْقِهِمْ كَمَا تَتَرَاءَوْنَ الْكَوْكَبَ الدُّرِّيَّ الْغَابِرَ فِي الأُفُقِ مِنَ الْمَشْرِقِ أَوِ الْمَغْرِبِ لِتَفَاضُلِ مَا بَيْنَهُمْ» قَالُوا: يَا رَسُولَ اللهِ! تِلْكَ مَنَازِلُ الأَنْبِيَاءِ لَا يَبْلُغُهَا غَيْرُهُمْ؟ قَالَ: «بَلَى وَالَّذِي نَفْسِي بِيَدِهِ رِجَالٌ آمَنُوا بِاللهِ وَصَدَّقُوا الْمُرْسَلِينَ». مُتَّفَقٌ عَلَيهِ.

1889. హజ్రత్ అబూసయీద్ (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం), "స్వర్గవాసులు తమ కంటే ఉన్నతస్థానంలో ఉండేవారిని, ఏ విధంగానైతే మీరు తూర్పు, పశ్చిమ దిగ్మండలాల్లో మెరిసే నక్షత్రాలను చూస్తారో, ఆ విధంగా చూస్తారు. వారి పరస్పర విశిష్ఠతల ఆధారంగా ఇలా జరుగుతుంది" అని చెప్పారు. ఆ మాట విని సహచరులు, "దైవప్రవక్తా! ఆ ఉన్నత స్థానాలు దైవప్రవక్తలవి అయి ఉంటాయా? అక్కడకు వారు తప్ప మరెవరూ చేరుకోలేరా?" అని అడిగారు. అందుకు దైవప్రవక్త (సల్లం) "ఎందుకు చేరుకోలేరు! ఎవరిచేతిలోనైతే నా ప్రాణం ఉందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. ఆ స్థానాలు అల్లాహ్‌ను విశ్వసించి, దైవప్రవక్తలను బలపరచిన వారివే అయివుంటాయి" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్వర్గవాసుల్లోని విశ్వాసం, దైవభీతి, ధర్మపరాయణతల ఆధారంగా వారి స్థానాల్లో కూడా హెచ్చుతగ్గులుంటాయి. చాలామంది విశ్వాసులు తమ విశ్వాసం, దైవభక్తి ఆధారంగా దైవప్రవక్తల స్థానానికి కూడా చేరుకుంటారు.

١٨٩٠ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «لَقَابُ قَوْسٍ فِي الْجَنَّةِ خَيْرٌ مِمَّا تَطْلُعُ عَلَيْهِ الشَّمْسُ أَوْ تَغْرُبُ» مُتَّفَقٌ عَلَيْهِ.

1890. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: స్వర్గంలో ఒక విల్లు పెట్టుకునేటంతటి చోటు సూర్యుడు ఉదయించే లేక అస్తమించే ప్రపంచం మొత్తానికంటే శ్రేష్ఠమైనది.

(బుఖారీ-ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం - సహీహ్ ముస్లింలోని వ్యాఖ్యానాల ప్రకరణం)

١٨٩١ - وَعَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ فِي الْجَنَّةِ سُوقاً يَأْتُونَهَا كُلَّ جُمُعَةٍ. فَتَهُبُّ رِيحُ الشَّمَالِ، فَتَحْثُو فِي وُجُوهِهِمْ وَثِيَابِهِمْ، فَيَزْدَادُونَ حُسْناً وَجَمَالاً، فَيَرْجِعُونَ إِلَى أَهْلِيهِمْ، وَقَد ازْدَادُوا حُسْناً وَجَمَالاً، فَيَقُول لَهُمْ أَهْلُوهُمْ: وَاللهِ! لَقَدِ ازْدَدتُمْ حُسْناً وَجَمَالاً فَيَقُولُونَ: وَأَنْتُمْ وَاللهِ! لَقَدِ ازْدَدْتُمْ بَعْدَنَا حُسْناً وَجَمَالاً» رَوَاهُ مُسْلِمٌ.

1891. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గంలో ఒక అంగడి ఉంటుంది. ప్రతివారం జుమారోజున ప్రజలు అక్కడికి వస్తారు. ఆ సమయంలో ఉత్తరం దిక్కునుంచి ఒక పవనం వీస్తుంది. అది వారి ముఖాల్లో, దుస్తుల్లో సువాసనలు వ్యాపింపజేస్తుంది. దాంతో వారి అందచందాలు మరింత పెరిగిపోతాయి. ద్విగుణీకృతమైన అందచందాలతో వారు తమ ఇంటివారి దగ్గరికి వెళ్ళినప్పుడు వారితో వారి ఇంటి వారు, "దైవం సాక్షి! మీరు మునుపటి కన్నా అందంగా తయా

రయ్యారు” అని అంటారు. దానికి వారు కూడా ఇంటివారితో, “దైవం సాక్షి! మేము బయటికి వెళ్ళిన తర్వాత మీ అందం కూడా ద్విగుణీకృతమయింది” అని అంటారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్య ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్వర్గంలోనూ అంగడి, మార్కెట్లు ఉంటాయి. అక్కడ వస్తువులు ఎలాంటి ఖరీదు లేకుండా లభిస్తాయి. ప్రజలు ప్రతివారం అక్కడికి వచ్చి తమకు కావలసిన వస్తువులు పట్టుకెళతారు. అక్కడ సూర్యరశ్మి ఉండదు. పగలు రేయి అన్నమాట కూడా ఉండదు. ప్రపంచంలో ఎండలో బయటికి వెళ్తే ముఖం వాడిపోతుంది. దేహం అందవిహీనమవుతుంది. కాని స్వర్గంలో మాత్రం స్త్రీ పురుషులెవరైనా బయటికి వెళ్ళి వస్తే వారి సౌందర్యం మరింత ప్రకాశితమవుతుంది. దాని మూలంగా వారి మధ్య ఆకర్షణ, ప్రేమానురాగాలు మరింత పెరిగిపోతాయి. వారిమీద ఎన్నటికీ వృద్ధాప్య ఛాయలు కూడా పడవు.

۱۸۹۲ - وَعَنْ سَهْلِ بْنِ سَعْدٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ أَهْلَ الْجَنَّةِ لَيَتَرَاءَوْنَ الْغُرَفَ فِي الْجَنَّةِ كَمَا تَتَرَاءَوْنَ الْكَوْكَبَ فِي السَّمَاءِ» متفقٌ عَلَيْهِ.

1892. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్(రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గవాసులు తమకంటే ఉన్నత అంతస్తులను, ఏ విధంగానైతే మీరు తూర్పు, పశ్చిమ దిగ్మండలాల్లో మెరిసే నక్షత్రాలను చూస్తారో ఆ విధంగా చూస్తారు. (బుఖారీ-ముస్లిం)

*(సహీహ్ బుఖారీ: కితాబుర్రిఖాఖ్; సహీహ్ ముస్లిం: కితాబుల్ జన్నహ్)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు కూడా వచ్చింది. 1889వ హదీసు చూడండి. అందులో ఉన్నత అంతస్తుల్లో ఉండే వారిని చూస్తూ ఉంటారన్న మాట ఉంది. ఇందులోనేమో ఉన్నత అంతస్తులను చూస్తూ ఉంటారన్న ప్రస్తావన ఉంది. ఈ రెండు హదీసుల్లోనూ ఎలాంటి వైరుధ్యం లేదు. అంతస్తుల్లో ఉన్నవారిని చూస్తే అంతస్తులను చూసినట్లే కదా!

1893. హజ్రత్ సహ్లా బిన్ సాద్ (రజి) గారే చేసిన మరొక కథనం: నేను దైవ ప్రవక్త (సల్లం) గారి ఒక సమావేశానికి హాజరయ్యాను. అందులో ఆయన స్వర్గం గురించి వివరించారు. చివర్లో మాట ముగిస్తూ ఆయన, "అందులో ఎలాంటి అనుగ్రహాలు ఉన్నాయంటే వాటిని ఏ కళ్లూ చూడలేదు. వాటి గురించి ఏ చెవులూ వినలేదు. ఏ మనిషి హృదయమూ వాటిగురించి ఊహించనయినా ఊహించలేదు" అన్నారు. తర్వాత దివ్యఖుర్ఆన్‌లోని "వారి వీపులు పడకలకు ఎడంగా ఉంటాయి" అన్న సూక్తిని "వారి కర్మ లకు ప్రతిఫలంగా, కళ్ళకు చలువ కలి గించే ఎటువంటి సామగ్రి వారికొరకు దాచిపెట్టబడిందో ఏ ప్రాణికీ తెలి యదు" వరకు పఠించారు. *(బుఖారీ)*

*(జామివుల్ ఉసూల్)*

١٨٩٣ ـ وَعَنْهُ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: شَهِدْتُ مِنَ النَّبِيِّ ﷺ مَجْلِساً وَصَفَ فِيهِ الْجَنَّةَ حَتَّى انْتَهَى، ثُمَّ قَالَ فِي آخِرِ حَدِيثِهِ: «فِيهَا مَا لَا عَيْنٌ رَأَتْ، وَلَا أُذُنٌ سَمِعَتْ، وَلَا خَطَرَ عَلَى قَلْبِ بَشَرٍ» ثُمَّ قَرَأَ ﴿ تَتَجَافَىٰ جُنُوبُهُمْ عَنِ الْمَضَاجِعِ ﴾ إِلَى قَوْلِهِ تَعَالَى: ﴿ فَلَا تَعْلَمُ نَفْسٌ مَّا أُخْفِيَ لَهُم مِّن قُرَّةِ أَعْيُنٍ ﴾. رواه البخاري.

జామివుల్ ఉసూల్ గ్రంథంలోని పాద వ్యాఖ్యానంలో ఇలావుంది: ఈ ఉల్లేఖనం సహ్లా బిన్ సాద్ ఆధారంగా బుఖారీలో మాకు దొరకలేదు. షేఖ్ అబ్దుల్ గనీ నాబిలిసీ దీన్ని 'జఖా యిరుల్ మవారీస్' గ్రంథంలో పేర్కొన్నారు. కేవలం ముస్లిం గ్రంథం ఆచూకీ తెలిపారు. నిజంగానే ముస్లింలోని స్వర్గభాగ్యాల ప్రకరణం ప్రారంభంలో ఈ హదీసు ఉంది.

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) స్వర్గం గురించి బోధించిన విషయాలు దివ్యఖుర్ఆన్‌లో కూడా సూచనప్రాయంగా వివరించబడ్డాయి. అందుకే హదీసులు దివ్యఖుర్ఆన్‌కు వ్యాఖ్యానం లాంటివనీ, అవి లేకుండా ఖుర్ఆన్‌ను అర్థం చేసుకోవటానికి వీలుకాదని చెబుతారు.

1894. హజ్రత్ అబూ సయీద్ మరియు అబూహురైరా (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)

١٨٩٤ ـ وَعَنْ أَبِي سَعِيدٍ وَأَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِذَا

دَخَلَ أَهْلُ الْجَنَّةِ الْجَنَّةَ يُنَادِي مُنَادٍ: إِنَّ لَكُمْ أَنْ تَحْيَوْا، فَلَا تَمُوتُوا أَبَداً، وَإِنَّ لَكُمْ أَنْ تَصِحُّوا، فَلَا تَسْقَمُوا أَبَداً، وَإِنَّ لَكُمْ أَنْ تَشِبُّوا فَلَا تَهْرَمُوا أَبَداً، وَإِنَّ لَكُمْ أَنْ تَنْعَمُوا، فَلَا تَبْأَسُوا أَبَداً» رواهُ مُسْلِم.

ఇలా ప్రబోధించారు: స్వర్గవాసులు స్వర్గంలోకి ప్రవేశించిన తర్వాత ఒక ప్రకటన కర్త ఇలా ప్రకటిస్తాడు: "మీకిక జీవితమే జీవితం. మృత్యువు ఇక ఎన్నటికీ మీ దరి చేరదు. ఇక నుంచి మీకు ఆరోగ్యమే ఆరోగ్యం, ఇక ముందెన్నడూ మీరు అనారోగ్యం పాలవరు. ఇక మీరు ఎన్నటికైనా యువకులుగానే ఉంటారు. ఎన్నటికీ ముసలివారుకారు. ఎన్నడూ సుఖం గానే ఉంటారు. ఎన్నటికీ దుఃఖానికి లోనుకారు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో మనిషి జీవిస్తున్నాడు. కాని అతని ఈ జీవితం ఎప్పుడు, ఏ క్షణాన అంతమయి పోతుందో తెలియదు. ప్రపంచంలో అందరికంటే ఎక్కువ ఆరోగ్యవంతుడు కూడా తనకు ఇక ఏ రోగం అంటుకోదని మీసం మెలేయలేడు. అలాగే యవ్వనం ఎప్పుడూ ఉండేది కాదు. చూస్తూ చూస్తూనే యువకుడు ముసలివాడైపోతాడు. అదే విధంగా సుఖ సంతోషాలను, ఆనందైశ్వర్యాలను మనం నిలిపి ఉంచుకోలేము. ఏ నిమిషాన సుఖసంతోషాలు ఎగిరిపోయి, బాధల 'సునామీ' తరుముకు వస్తుందో తెలియని అనిశ్చిత, అశాశ్వత, క్షణభంగుర బుద్బుధప్రాయం- ఈ లోకం! కాని దీనికి భిన్నంగా స్వర్గం సకల సుఖాలకు నిలయం. అనంత ఆనందానికి ఆయువు పట్టు. అక్కడ జీవితమేగాని మరణం ఉండదు. ఆరోగ్యమేగాని అనారోగ్యపు ఛాయలు కూడా ఉండవు. కరగని యవ్వనం, తరగని సంతోషం. ఇదే శాశ్వత స్వర్గభాగ్యం! దేవుడు తన ప్రియదాసులకు ప్రసాదించే గొప్పవరం!! అల్లాహ్ మనందరికి కూడా ఆ మహాభాగ్యాన్ని ప్రసాదించాలని కోరుకుందాం.

١٨٩٥ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ أَدْنَى مَقْعَدِ أَحَدِكُمْ مِنَ الْجَنَّةِ أَنْ يَقُولَ لَهُ: تَمَنَّ، فَيَتَمَنَّى وَيَتَمَنَّى، فَيَقُولُ لَهُ: هَلْ تَمَنَّيْتَ؟

1895. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో అత్యంత అథమ స్థాయి స్వర్గవాసి పరిస్థితి ఎలా ఉంటుందంటే - అల్లాహ్ అతన్ని ఏమైనా కోరుకోమని అంటాడు. అతను

فَيَقُولُ: نَعَمْ، فَيَقُولُ لَهُ: فَإِنَّ لَكَ مَا تَمَنَّيْتَ وَمِثْلَهُ مَعَهُ» رَواهُ مُسْلِمٌ.

కోరుకుంటాడు, ఇంకా కోరుకుంటాడు. అప్పుడు అల్లాహ్ అతన్ని, "కోరు కోవటం అయిపోయిందా?" అని అడుగుతాడు. అతను "అయిపో యింద"ంటాడు. అప్పుడు అల్లాహ్, "నీకు నీవు కోరుకున్నదీ లభిస్తుంది. ఇంకా అంత కూడా లభిస్తుంది" అని అంటాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

١٨٩٦ - وَعَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِنَّ اللهَ عَزَّ وَجَلَّ يَقُولُ لأَهْلِ الْجَنَّةِ: يَا أَهْلَ الْجَنَّةِ! فَيَقُولُونَ: لَبَّيْكَ رَبَّنَا وَسَعْدَيْكَ، وَالْخَيْرُ فِي يَدَيْكَ، فَيَقُولُ: هَلْ رَضِيتُمْ؟ فَيَقُولُونَ: وَمَا لَنَا لَا نَرْضَى يَا رَبَّنَا! وَقَدْ أَعْطَيْتَنَا مَا لَمْ تُعْطِ أَحَداً مِنْ خَلْقِكَ! فَيَقُولُ أَلَا أُعْطِيكُمْ أَفْضَلَ مِنْ ذٰلِكَ؟ فَيَقُولُونَ: وَأَيُّ شَيْءٍ أَفْضَلُ مِنْ ذٰلِكَ؟ فَيَقُولُ: أُحِلُّ عَلَيْكُمْ رِضْوَانِي، فَلَا أَسْخَطُ عَلَيْكُمْ بَعْدَهُ أَبَداً». مُتَّفَقٌ عَلَيْهِ.

1896. హజ్రత్ అబూసయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ స్వర్గవాసులను పిలుస్తాడు. స్వర్గ వాసులు, "సెలవీయండి ప్రభూ! మీరు మంచి కోసమే మమ్మల్ని పిలుస్తారు. సకల మేళ్ళు మీ చేతుల్లోనే ఉన్నాయి" అని అంటారు. "మీరు సంతోషంగానే ఉన్నారు కదా!" అని అడుగుతాడు దేవుడు. దానికి స్వర్గ వాసులు "ప్రభూ! నీవు మాకు సృష్టిలో మరెవరికీ ఇవ్వనన్ని అనుగ్రహాలు ఇచ్చావు. అలాంటప్పుడు సంతోషంగా ఎందుకుండము" అని అంటారు. దానికి అల్లాహ్, "నేను మీకు దాని కంటే శ్రేష్ఠమైన వస్తువు ఇవ్వనా?" అని అడుగుతాడు. అందుకు వారు, "దాని కంటే శ్రేష్ఠమైన వస్తువా!" అని ఆశ్చర్య పోతారు. అప్పుడు అల్లాహ్, "నేను మీ మీద నా ప్రసన్నతను అవతరింప

జేస్తున్నాను. ఇక ముందు నేను మీ పట్ల ఎన్నటికీ అప్రసన్నుణ్ణి కాను" అని అంటాడు. (బుఖారీ-ముస్లిం)

## ముఖ్యాంశాలు

అల్లాహ్ తన ప్రసన్నతను అవతరింపజేస్తున్నానని చెప్పటం స్వర్గ అనుగ్రహాలన్నింటికంటే గొప్పదన్నమాట.

1897. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం: మేము దైవప్రవక్త (సల్లం) దగ్గర ఉన్నప్పుడు ఆయన పున్నమి రాత్రి చంద్రుని వైపు చూస్తూ, "ఇప్పుడు మీరు ఈ చంద్రుణ్ణి ఎలా చూస్తున్నారో (రేపు స్వర్గంలో) మీ ప్రభువుని కూడా ఇలాగే స్పష్టంగా చూడగల్గుతారు. ఆయన్ని చూడటంలో మీకు ఎలాంటి ఇబ్బందీ కలుగదు" అని చెప్పారు. (బుఖారీ-ముస్లిం)

١٨٩٧ - وَعَنْ جَرِيرِ بْنِ عَبْدِ اللهِ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كُنَّا عِنْدَ رَسُولِ اللهِ ﷺ فَنَظَرَ إِلَى الْقَمَرِ لَيْلَةَ الْبَدْرِ، وَقَالَ: «إِنَّكُمْ سَتَرَوْنَ رَبَّكُمْ عِيَاناً كَمَا تَرَوْنَ هٰذَا الْقَمَرَ، لَا تُضَامُونَ فِي رُؤْيَتِهِ» مُتَّفَقٌ عَلَيْهِ.

*(సహీహ్ బుఖారీలోని నమాజు వ్యవధుల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఆకాశంలోని చంద్రుణ్ణి చూడటానికి గుమిగూడాల్సిన అవసరం ఉండదు. ఎట్టి ఇబ్బందులూ ఉండవు. సరిగ్గా అలాగే స్వర్గంలో స్వర్గవాసులందరూ ఒకేసారి తమ ప్రభువును దర్శించగల్గుతారు. ఆయన్ని దర్శిస్తున్నప్పుడు స్వర్గవాసుల మధ్య తోపులాటలు, తొక్కిసలాటలు జరుగవు. ఆకాశంలో చంద్రుణ్ణి చూసేటంత ప్రశాంతంగా అల్లాహ్‌ను చూస్తారు. అసలు ఈ దైవదర్శనం ఎలా ఉంటుంది? ఈ విషయాన్ని పోలికలతో, ఉపమానాలతో వివరించటానికి ఆస్కారం లేదు. ఎందుకంటే దేవుణ్ణి గురించి దివ్యఖుర్ఆన్ "లైస కమిస్‌లిహీ షైవున్" అంటే, ఆయన్ని పోలిన వస్తువేదీ లేదంటోంది. ఏమయినప్పటికీ ఈ దర్శనం ప్రాపంచికమైన కళ్ళతో మాత్రం జరగదు. ఎందుకంటే ఈ కళ్లు నశ్వరమైనవి. వీటిలో దైవాన్ని చూసేటంతటి శక్తి ఉండదు. అందుకే విద్వాంసులు - మేరాజ్‌లో దైవప్రవక్త (సల్లం) కూడా అల్లాహ్‌ను చూడలేదని వాదిస్తారు. దైవప్రవక్త సతీమణి హజ్రత్ ఆయిషాగారి ఒక ఉల్లేఖనం కూడా ఈ వాదనను బలపరుస్తోంది. అయితే స్వర్గవాసులకు స్వర్గంలో లభించే కళ్ళు అనశ్వరమైనవై ఉంటాయి,

వాటిలో అల్లాహ్‌ను చూడగలిగే శక్తి ఉంటుంది. కనుక వారు అక్కడ ప్రభువును దర్శించు కుంటారు.

1898. హజ్రత్ సుహైబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రబోధించారు: స్వర్గవాసులు స్వర్గంలోకి ప్రవేశించిన తర్వాత అల్లాహ్ వారిని, "నేను మీకు ఇంకా ఏమైనా ఇవ్వాలని కోరుకుంటున్నారా మీరు?" అని అడుగుతాడు. అందుకు వారు "నీవు మా ముఖాలను (సౌందర్యంతో) ప్రకాశింపజేయలేదా? మమ్మల్ని స్వర్గం లోకి తీసుకురాలేదా? నరకం నుంచి రక్షించలేదా? (ఇంకా ఏం కావాలి మాకు?)" అని అంటారు. వెంటనే అల్లాహ్ తెరను తొలగిస్తాడు (వారంతా ఆయన్ని దర్శించు కుంటారు). ఇక వారికి ఇవ్వబడిన వాటిలో దైవదర్శనం కంటే ప్రియమైనది ఏదీ ఉండదు.

(ముస్లిం)

١٨٩٨ ـ وَعَنْ صُهَيْبٍ رَضِيَ اللهُ عَنْهُ أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ: «إِذَا دَخَلَ أَهْلُ الْجَنَّةِ الْجَنَّةَ يَقُولُ اللهُ تَبَارَكَ وَتَعَالَى: تُرِيدُونَ شَيْئاً أَزِيدُكُمْ؟ فَيَقُولُونَ: أَلَمْ تُبَيِّضْ وُجُوهَنَا. أَلَمْ تُدْخِلْنَا الْجَنَّةَ وَتُنَجِّنَا مِنَ النَّارِ؟ فَيَكْشِفُ الْحِجَابَ، فَمَا أُعْطُوا شَيْئاً أَحَبَّ إِلَيْهِمْ مِنَ النَّظَرِ إِلَى رَبِّهِمْ» رواهُ مُسْلِمٌ.

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పరలోకంలో దైవదర్శనం జరుగుతుందన్న విషయాన్ని ఈ హదీసు కూడా సమర్థిస్తోంది. అయితే ఈ దర్శనభాగ్యం కేవలం స్వర్గంలోని విశ్వాసులకు మాత్రమే కలుగుతుంది. ఇది స్వర్గ అనుగ్రహాలన్నిటిలోకెల్లా అతిపెద్ద అనుగ్రహం. ఈ విషయం దివ్యఖుర్‌ఆన్ ద్వారా కూడా నిరూపితమవుతోంది. "ఆ రోజున కొందరి ముఖాలు కళకళలాడుతూ ఉంటాయి, తమ ప్రభువు వైపు చూస్తూ ఉంటాయి" (ఖియామా: 22,23 సూక్తులు). కనుక స్వర్గంలో విశ్వాసులు మాత్రమే దేవుణ్ణి దర్శిస్తారన్న విషయమై అహ్లెసున్నత్ వారందరి మధ్య ఏకాభిప్రాయమున్నది. దీనిగురించి ఎలాంటి భేదాభిప్రాయం లేదు. అయితే ఖవారిజ్, మూతజిలా, జహ్మియా, ముర్జియా

లాంటి భ్రష్టవర్గాలవారు మాత్రం దీన్ని అంగీకరించరు. తమ భ్రష్టత మూలంగా వీరు పరలోకంలో స్వర్గానికీ వెళ్ళలేరు. దేవుణ్ణీ చూడలేరు. "ఎంతమాత్రం కాదు, నిశ్చయంగా ఆ రోజున వారు తమ ప్రభువు దర్శనం లభించకుండా పోతారు." (ముతఫ్ఫిఫీన్:15). అహ్లెసున్నత్ వర్గం వారు మాత్రం తమ నమ్మకం ప్రకారం స్వర్గంలోకి ప్రవేశించి తమ ప్రభువు దర్శనా భాగ్యానికి అర్హులవుతారు.

ఇమామ్ నవవీ (రహ్మలై) పై హదీసుతో తన గ్రంథం రియాజుస్సాలిహీన్‌ని పూర్తిచేసి జీవితపు మేలైన సమాప్తాన్ని ఆశించారు. కనుక గ్రంథకర్త లాగే దీని అనువాదకుడు, వ్యాఖ్యాత, దీని ప్రచురణకర్తలు, ఇంకా ఈ సత్కార్యంలో తోడ్పడిన వారంతా మేలైన సమాప్తంతో స్వర్గంలోకి ప్రవేశించాలనీ వారందరికి దైవ దర్శన భాగ్యం లభించాలని ఆశిద్దాం.

قال الله تعالى: ﴿إِنَّ الَّذِينَ ءَامَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ يَهْدِيهِمْ رَبُّهُم بِإِيمَانِهِمْ تَجْرِي مِن تَحْتِهِمُ الْأَنْهَارُ فِي جَنَّاتِ النَّعِيمِ ۝ دَعْوَاهُمْ فِيهَا سُبْحَانَكَ اللَّهُمَّ وَتَحِيَّتُهُمْ فِيهَا سَلَامٌ وَءَاخِرُ دَعْوَاهُمْ أَنِ الْحَمْدُ لِلَّهِ رَبِّ الْعَالَمِينَ﴾ [يونس: ٩، ١٠].

**దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెల విచ్చాడు:**

**"విశ్వసించి మంచి పనులు చేస్తూ ఉండిన వారిని వారి ప్రభువు వారి విశ్వాసం కారణంగా సరియైన మార్గంలో నడుపుతాడు. భోగభాగ్యాలతో నిండివున్న స్వర్గవనాలలో వారి క్రింద కాలువలు ప్రవహిస్తాయి. అక్కడ వారు 'అల్లాహ్! నీవు పవిత్రుడవు' అని స్తుతిస్తారు, పరస్పరం శాంతికలుగుగాక అని దీవించుకుంటూ ఉంటారు. వారి ప్రతి మాటకు ముగింపు ఇలా ఉంటుంది: స్తోత్రమంతా సకలలోకాల ప్రభువైన అల్లాహ్‌కు మాత్రమే." *(యూనుస్: 9,10)***

## వివరణ

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) అన్నింటికంటే చివర్లో, తాను ఇంతకుముందు పేర్కొన్న హదీసును పోలిన దైవసూక్తిని పొందుపరచారు. ఆ సూక్తిలో సదాచరణ చేసే విశ్వాసులకు స్వర్గశుభవార్త ఇవ్వబడింది. మొత్తానికి ఈ సూక్తి ద్వారా కూడా ఆయన ఉత్తమ సమాప్తాన్ని సూచిస్తున్నారు. దానికొరకు ప్రార్థన చేస్తున్నారు. అల్లాహ్ మనందరి విషయంలోనూ ఈ ప్రార్థనను స్వీకరించుగాక! మనకు మేలైన సమాప్తాన్ని కలిగించుగాక!

الْحَمْدُ لِلّٰهِ الَّذِي هَدَانَا لِهٰذَا وَمَا كُنَّا لِنَهْتَدِيَ لَوْلَا أَنْ هَدَانَا اللّٰهُ اللَّهُمَّ صَلِّ عَلَى سَيِّدِنَا مُحَمَّدٍ وَعَلَى آلِ مُحَمَّدٍ، كَمَا صَلَّيْتَ عَلَى إِبْرَاهِيمَ وَعَلَى آلِ إِبْرَاهِيمَ، وَبَارِكْ عَلَى مُحَمَّدٍ، وَعَلَى آلِ مُحَمَّدٍ، كَمَا بَارَكْتَ عَلَى إِبْرَاهِيمَ وَعَلَى آلِ إِبْرَاهِيمَ، إِنَّكَ حَمِيدٌ مَجِيدٌ.

قَالَ مُؤَلِّفُهُ يحيى النَّوَوِيُّ غَفَرَ اللّٰهُ لَهُ: «فَرَغْتُ مِنْهُ يَوْمَ الاثْنَيْنِ رَابِعَ عَشَرَ رَمَضَانَ سَنَةَ سَبْعِينَ وَسِتِّمِائَةٍ بِدِمَشْقَ»

సకల స్తోత్రాలూ మాకు ఈ పని చేసే అవకాశాన్ని కల్పించిన అల్లాహ్‌కే చెందుతాయి. ఆయన మాకు ఈ అవకాశం కల్పించి ఉండకపోతే మేము ఈ పని చేయగలిగే వాళ్ళమే కాదు. ఓ అల్లాహ్! నీవు ఇబ్రాహీమ్‌పై, ఆయన పరివారంపై ఏ విధంగానైతే నీ కారుణ్యాన్ని కురిపించావో అదే విధంగా ముహమ్మద్‌పై, ఆయన పరివారంపై కూడా కారుణ్యాన్ని కురిపించు. నీవు ఇబ్రాహీమ్‌పై, ఆయన పరివారంపై ఏ విధంగానైతే శుభాలు కురిపించావో అదే విధంగా ముహమ్మద్‌పై, ఆయన పరివారంపై కూడా శుభాలు కురిపించు. నిశ్చయంగా నీవు స్తుతింపదగినవాడవు. మహా ఘనత కలవాడవు. దీని గ్రంథకర్త (ఇమామ్ నవవీ-రహ్మాలై- అల్లాహ్ ఆయన్ని క్షమించుగాక) ఇలా అన్నారు: నా ఈ గ్రంథ రచన హి.శ. 670, రమజాన్ మాసం 14వ తేదీ సోమవారం నాడు డెమాస్కస్‌లో పూర్తయింది.



తెలుగు అనువాదాన్ని పరిశీలించే పని క్రీ.శ. 1-10- 2006 (హిజ్రీ 1427 రమజాన్ 8వ తేదీ)న పూర్తయింది. ఇమామ్ నవవీ (రహ్మాలై) గారిచే విరచితమైన ఈ అపురూప కృతిని ప్రపంచంలోని పలుభాషలు మాట్లాడే ప్రజా బాహుళ్యంలోకి తీసుకుపోతున్న తీరును చూస్తుంటే అల్లాహ్ దీనికి ప్రసాదించిన 'స్వీకృతి' ఎంత గొప్పదో విదితమవుతోంది.

తెలుగు భాషలో దీన్ని ప్రచురించాలన్న 'ట్రూత్ పబ్లికేషన్స్' వారి ఆలోచన స్వాగతించదగినది. ఈ బృహత్ప్రథకానికి కార్యరూపం ఇవ్వటంలో కొండంత అండగా నిలిచిన మౌలానా అబ్దుల్ హాదీ మదనీ (బ్రిటన్), జనాబ్ ముహమ్మద్ సైఫుద్దీన్ (ట్రూత్ పబ్లికేషన్స్ ఛైర్మన్) గార్ల కృషికి కారుణ్య ప్రభువు ఆమోదముద్ర వేయుగాక!

**1-10-2006**
**(హిజ్రీ 1427 రమజాన్ 8)**

– అజీజుర్రహ్మాన్

